శ్రీ గోపీనాథము వేంకట కవీంద్ర ప్రణీత

# గోపీనాథ రామాయణము

## మొదటి సంపుటము

(బాల, అయోధ్య, అరణ్య కాండలు)

బ్రహ్మశ్రీ చెదలువాడ సుందరరామశాస్త్రులవారిచే పరిష్కృతం



శ్రీ గోపీనాథము వేంకట కవీంద్ర ప్రణీత

# గోపీనాథ రామాయణము

## మొదటి సంపుటము

(బాల, అయోధ్యా, అరణ్య కాండలు)

బ్రహ్మశ్రీ చెదలువాడ సుందరరామశాస్త్రులవారిచే పరిష్కృతం



# ప్రకాశక విజ్ఞప్తి

ఒక జాతి సంస్కృతికి దర్పణం ఆ జాతిసాహిత్యం. భిన్నత్వంలో ఏకత్వం భాసించే భారతీయసంస్కృతికి పలు భారతీయ భాషా సాహిత్యాలు భాష్యం చెప్పాయి. ఆ పలు భాషలలో తెలుగు భాష ఒక విశిష్టమైన స్థానాన్ని కలిగిఉంది.

అపారమైన చరిత్ర, సంస్కృతి కలిగిన తెలుగుజాతి ఆయా కాలాలలో వెలువడిన సాహిత్యాన్నంతా పరిరక్షించుకొంటూ తన సంస్కృతిని సుసంపన్నం చేసుకొంటూ వస్తున్నది. ఈ సంస్కృతి భాండాగారాన్ని ఒకతరం నుంచి మరోతరానికి అందించడానికి అంకిత భావంతో కొందరు వ్యక్తులు, కొన్ని సంస్థలు చేస్తున్న కృషి అనుస్యూతంగా సాగుతూ వస్తున్నది. అందుకే ఆ పెన్నిధిని మరింత పరిపుష్టంచేసి ఆగామి యుగాలకు అందించడం అవుతున్నది.

ఈ సంకల్పంతో శిల్పితమైన తెలుగు విశ్వ విద్యాలయం తెలుగు వారి చరిత్ర, సంస్కృతి సర్వతోముఖ వికాసానికి చేసే కృషిలో ఉత్తమ సాహిత్యాన్ని అందించడం అన్నది ఒక భాగం. ఆ ఆశయంతో ప్రకటితమైనది ప్రకృత గ్రంథం.

"మా నిషాద! ప్రతిష్ఠాం త్వమగమ శ్శాశ్వతీ స్సమాః,
య త్క్రౌంచ మిధునా దేక మవధీః కామమోహితమ్."

శోకంలో నుంచి అప్రయత్నంగా వెలువడిన ఈ శ్లోకం భారతీయ సాహిత్య లోకంలో ఆదికావ్యమైన రామాయణం ఆవిర్భావానికి అంకురార్పణ గావించింది. వాక్య విశారదుడైన ఆదికవి వాల్మీకి సంస్కృతభాషలో రచించిన రామాయణం క్రమేణ దేశ భాష లన్నింటిలోకి అనూదితమై వివిధ సాహితీరూపాలలో అలరారింది. విశ్వ సాహితిలోని రామాయణ కథా సంవాది రచనలన్నింటికీ వాల్మీకి రచనమే మొదటి సంచి అని విజ్ఞుల విశ్వాసం.

ఆర్షధర్మబద్ధమైన భారతీయసంస్కృతికి ప్రతిబింబంగా నిలిచిన రామాయణం మన సమాజంలోని కట్టుబాట్లకు, సత్సంప్రదాయాలకు, జనజీవనసరళికి, ఆదర్శ కుటుంబానికి, ఆధ్యాత్మిక సంస్కృతికి, ఒక సువ్యవస్థకు, ఒక సుస్థిర రాజ్యపాలనకు సంకేతంగా సంభావిత మవుతున్నది గురు శిష్యుల సత్సంబంధానికి, తండ్రీ కొడుకుల ధర్మవత్స లతకు, అన్నదమ్ముల అనుబంధానికి, ఆలుమగల అనురాగానికి, స్నేహితుల సఖ్యతకు,

యజమానుడు అనుయాయుల భక్తి విశ్వాసాలకు, పాలక పాలితుల మధ్య నుండే సద్భావన, సదవగాహనలకు రామాయణంలోని ప్రతిపాత్ర ఏదో ఒక ప్రతీక. అందుకే రామాయణ కథాంశం అన్ని కాలాలలోను, అన్ని యుగాలలోను నిత్య నూతనమై నిలిచింది. పరమ పవిత్రమైన రామకథ ఎన్ని విధాలుగా కీర్తించినా, ఎన్నెన్ని రకాలుగా రచించినా తనివి తీరదనే భావన భారతీయులలో జీర్ణించుకొనిపోయింది

రామాయణం సంస్కృతభాషలో ఆదికావ్యమైనప్పటికీ తెలుగులో మాత్రం రామాయణం కంటే భారతమే ముందు వెలువడింది. అయినా రామాయణాన్ని తెలుగు కవులు నాటినుంచి నేటిదాకా పలువిధాలుగా ప్రవచిస్తూనే ఉన్నారు, ప్రపంచీకరిస్తూనే ఉన్నారు. పద్యం, గద్యం, ద్విపద, నాటకం వంటి బహు ప్రక్రియలలో తెలుగులో వెలువడిన రామాయణాలలో భాస్కర రామాయణం, రంగనాథ రామాయణం, మొల్ల రామాయణం, అయ్యలరాజు రామభద్రుని రామాభ్యుదయం, తిక్కన నిర్వచనోత్తర రామాయణం, కంకంటి పాపరాజు ఉత్తర రామాయణం, గోపీనాథ రామాయణం, వాసు దాసుల శ్రీమద్రామాయణం, జనమంచి వారి, విశ్వనాథ వారి శ్రీమద్రామాయణ కల్పవృక్షం వంటివి ప్రముఖంగా ఎన్నదగినవి.

తెలుగు రామాయణాలలో ఈనాడు గోపీనాథ రామాయణం దాదాపుగా అలభ్యమనే చెప్పాలి. 1923 లో వావిళ్ళవారు ప్రకటించిన తరువాత ఇది మళ్ళీ వెలుగుచూసినట్టులేదు. అందుకే రామాయణాన్ని నిత్య పారాయణం చేసే తెలుగు పాఠక లోకానికి ఈ గోపీనాథ రామాయణాన్ని అందించాలనే సంకల్పంతో దీనిని పునర్ముద్రించాం. మూలమైన వాల్మీకి రామాయణాన్ని అనుసరించి రాయబడడం గోపీనాథ రామాయణం ప్రత్యేకత. అందువల్ల సంస్కృత రామాయణంలోని కావ్య ఔచిత్యాన్ని తెలుగులో ఆవిష్కరింపజేసే ఈ గోపీనాథ రామాయణం సహృదయుల మన్ననలకు పాత్రమై, మా యత్నం సాఫల్యమొందగలదని భావిస్తున్నాం.

# పీఠిక.

శ్లో. నమ స్తస్మై కస్మై చన భవతు నిష్కించనజన
స్వయంరక్షాదీక్షాసమధికసమింధానయశసే,
సురాధీశస్యై వ్రతక్షణకుపితశాపాయుధవధూ
దృషత్త్వాదుజ్ఞాతప్రశమపదాంభోజరజసే.

ఈశ్వరసృష్టమగునీసంసారచక్రమునందుఁ బరివర్తమానులగుసకలచేతనులకు ధర్మార్థకామమోక్షము లనునాలుగుపురుషార్థములు నత్యంతాదరణీయములు. మహాభారతమునందు—

"ధర్మం చార్థం చ కామం చ యథావ ద్వదతాంవర !
విభజ్య కాలే కాలజ్ఞ స్సర్వా న్సేవేత పండితః
మోక్షో హి పరమశ్శ్రేయః పురుషార్థచతుష్టయే"

"వక్తలలో శ్రేష్ఠుఁడా! కాలోపయోగముం దెలిసినవిచక్షణుఁడు కాలము విభజించి ధర్మార్థకామముల సేవింపనలయును. ఈపురుషార్థము లన్నిటిలో మోక్ష మనునది యుత్కృష్టశ్రేయము నిచ్చునది" అని యుధిష్ఠిరునితో భీమసేనుఁడు చెప్పియున్నాఁడు. కావున మోక్ష మితరపురుషార్థములకంటె మిక్కిలిహితకరము ముఖ్యతమము ధర్మాదులుగూడ మోక్షమునకును సాధనము లగుటవలననే పురుషార్థము లని వ్యవహరింపఁబడుచున్నవి. వీనిలో ధర్మము ప్రవృత్తిరూప మనియు నివృత్తిరూప మనియు ద్వివిధము. ఇందు మొదటిది యిష్టాపూర్తాదికర్మరూపము. * ఇది స్వర్గాదిలోకప్రాప్తికిసాధనము. రెండవది, యైహికాముష్మికాల్పాస్థిరసుఖసంధాయకము లగుకర్మలఁ బరిత్యజించి కేవలపరమాత్మానుసంధానపరుఁడై యుండుట. దీనికిఁ బ్రమాణము—

"ప్రవృత్తిసంజ్ఞికే ధర్మే ఫల మభ్యుదయో మతః,
నివృత్తిసంజ్ఞికే ధర్మే ఫలం నిశ్శ్రేయసం మతమ్."

"ప్రవృత్తిరూపధర్మమునలన స్వర్గాదిపారలౌకికసుఖమును, పశుపుత్రవృష్ట్యన్నాదిలాభమును నివృత్తిరూపధర్మమువలన మోక్షమును సంభవించును" ఇట్లుభయలోకశ్రేయస్సాధన మగునది ధర్మము; ఇది యతీంద్రియము (చక్షురాదీంద్రియాగోచరము.) ఇట్టిధర్మమును బోధించునది వేదము

"ప్రత్యక్షేణానుమిత్యా వా య స్తూపాయో న బుధ్యతే,
ఏతం విదన్తి వేదేన తస్మా ద్వేదస్య వేదతా"

---

* యాగము సేయుట, చెఱువులు త్రవ్వించుట మున్నగునవి యిష్టాపూర్తకర్మలు.

"ప్రత్యక్షానుమానప్రమాణములచే బోధింపఁబడనియుపాయము దేనిచేఁ దెలియఁబడునో దానికి వేద మనిపేరు." ఇట్టిమూలప్రమాణమగు వేదము పౌరుషేయమువలె భ్రమవిప్రలిప్సాదిదోషజుష్టముగాక యపౌరుషేయమును స్వతఃప్రమాణము నయి యనాదినిధనావిచ్ఛిన్న సంప్రదాయప్రవర్తమానము నయి యున్నది. "యః కల్పస్య కల్పపూర్వః" అనున్యాయము ననుసరించి యీసంసార మనాది. సర్వజ్ఞుం డగునీశ్వరుండు గతకల్పమందలి వేదము నీకల్పాదియందు స్మరించి "యో బ్రహ్మాణం విదధాతి పూర్వం యో వై వేదాంశ్చ ప్రహిణోతి తస్మై" అనుప్రమాణానురోధముగఁ బ్రథమజుఁ డగుచతుర్ముఖున కుపదేశింప నతఁడు మరీచ్యాదులకును, వారు తమశిష్యసంఘమునకును, నుపదేశింప నీరీతి నుపదేశపరంపరాప్రాప్త మయ్యె నని పూర్వమీమాంసకులసిద్ధాంతము. మఱికొందఱు శాస్త్రజ్ఞులు (నైయాయికులు) వేదము లీశ్వరప్రణీతము లందురు. "అస్య మహతో భూతస్య నిశ్వసిత మేత దృగ్వేదో యజుర్వేద స్సామవేదః" అనునది వారికిఁ బ్రమాణము.

ఇట్టి వేదము కర్మభాగ మనియు బ్రహ్మభాగ మనియుభాగద్వయాత్మకము. ఇందుఁ గర్మభాగము భగవదారాధనక్రమమును, బ్రహ్మభాగము భగవత్స్వరూపరూపగుణవిభూతులను దెల్పుచున్నవి. ఇట్లు భగవత్ప్రతిపాదక మగునీవేదము సంసారిచేతనులకు దత్త్వజ్ఞానము నొదవించుటయందు ముఖ్యసాధనము. తత్త్వజ్ఞాన మనఁగా; సర్వస్మాత్పరుఁడైనశ్రీమన్నారాయణునకు సర్వప్రకారములఁ బరతంత్రము లగునీయాత్మలకు స్వరూపానురూపపురుషార్థ మగుభగవత్ప్రాప్తిని నిరోధించు ననాదికర్మసంబంధమును నివర్తింపఁ జేయునుపాయము. ఇది యర్థపంచకజ్ఞానమూలము. అర్థపంచకజ్ఞాన మనఁగా: స్వస్వరూప పరస్వరూప పురుషార్థస్వరూపోపాయస్వరూప విరోధిస్వరూపముల యథార్థముగ నెఱుంగుట. వీనిలో స్వస్వరూప మాత్మస్వరూపము, (ఆత్మలక్షణ మిట్టి దని యెఱుంగుట.) పరస్వరూప మీశ్వరస్వరూపము: పురుషార్థస్వరూపము మోక్షలక్షణము. ఉపాయస్వరూపము కర్మజ్ఞానభక్తిప్రపత్తిలక్షణము. విరోధిస్వరూపము భగవత్ప్రాప్తిప్రతిబంధకీభూతానాదికర్మబంధము ఇట్లర్థపంచకజ్ఞానపూర్వకముగఁ బరతత్త్వ మగుశ్రీమన్నారాయణుని పాదారవిందములయందు నన్యస్తాత్మరక్షణభరుండై యతనికత్యర్థప్రియుఁడై మెలఁగుటయే మోక్షసాధనములలో మౌళిభూత మని సర్వవేదాంతతాత్పర్యము.

అనంతశాఖాంచితచతుర్దశవిద్యాస్థానోపబృంహితమై దుర్జ్ఞేయార్థప్రతిపాదక మగువేదమును గూలంకషముగఁ జదివినఁ గాని పరబ్రహ్మతత్త్వనిర్ణయసామర్థ్యముఁ దత్త్వజ్ఞానముఁ గలుగదనియు, రాఁబోవుకలియుగమునందలిజను లల్పాయువులు, రోగపీడితులు నగుటచే నిట్టిదుర్ఘటజ్ఞానమును సంపాదింపఁ జాల రనియు నూహించిసకలభూతానుకంపాసంపన్నచిత్తులుఁ, బరావరతత్త్వయాథాత్మ్యవిదులు, దేవతాపారమ్యవేత్తలు నగుపరాశరవ్యాసవాల్మీకాదిమహర్షులు "ఇతిహాసపురా

ణాభ్యాం వేదం సముపబృంహయేత్'' ''ఇతిహాస (భారతరామాయణాదిపూర్వ రాజవృత్తము,) పురాణము (సర్గప్రతిసర్గాదిపంచలక్షణసమన్వితము) లచే వేదార్థమును వివరింపవలయును'' అను న్యాయమునుబట్టి దురవగాహ మగు వేదార్థమును దాము చక్కఁగఁ బరిశీలించి మేఘముచేఁ ద్రావఁబడి విస్పష్ట మైనసముద్రజలము సర్వజనోపజీవ్య మగునట్లు పండితపామరసామాన్యముగ నెల్లరకు సులభముగఁ దెలియురీతిఁ బరతత్త్వనిర్ణయమును, మోక్షోపాయనిష్కర్షమును జేసి బద్ధచేతనులకు సంసారసుఖసంతరణోపాయమును దెలిపిరి.

## వాల్మీకి - శ్రీ రామాయణము.

సంసారార్ణవనిమగ్నచేతనోద్ధరణార్థ మై పరమకారుణికత్వము నవలంబించి వేదార్థోపబృంహణము నొనరించినవారిలో వాల్మీకి ప్రథమగణ్యుఁడు.

''వేదవేద్యే పరే పుంసి జాతే దశరథాత్మజే
వేదః ప్రాచేతసా దాసీ త్సాక్షా ద్రామాయణాత్మనా''

''వేదముచేఁ దెలియఁబడు పరమపురుషుఁడు దాశరథి యై జనింప నా వేదము కూడ వాల్మీకివలన రామాయణరూపముగఁ బరిణమించెను'' అనున ట్లితఁడు సాక్షా ద్వేదసమ్మిత మగు రామాయణమును రచించి,

'' ఇతిహాసపురాణాభ్యాం వేదాంతార్థః ప్రకాశ్యతే,
ప్రాయేణ పూర్వభాగార్థో ధర్మశాస్త్రేణ కథ్యతే.''

'' వేదముయొక్క యుత్తరభాగార్థము (ఉపనిషదర్థము) ఇతిహాసపురాణములచేతను, బూర్వభాగార్థము ధర్మశాస్త్రముచేతను వెల్లడియగుచున్నది.''అనురీతినందు సకలముముక్షుజనోపజీవ్యము లయిన వేదాంతార్థములను సంపూర్ణముగఁ బ్రతిపాదించియున్నాఁడు.

### శ్రీరామాయణోత్పత్తికి మూలమగుకథ.

ఒకనాఁడు వాల్మీకి యదృచ్ఛగా దయచేసిననారదమునివలన శ్రీరామచరిత్రమును సంగ్రహముగ నుపదేశము నొంది యంత మాధ్యాహ్నికస్నానార్థము జాహ్నవీనదీసమీపమున నుండుతమసానది కరిగియచట నిటునటుఁజూచుచుసంచరించుచుండనొకబోయ యానదీతీరవనమందువిహరించుక్రౌంచపక్షిమిథునములో మగపిట్టను గొట్టఁగాఁ జూచి కరుణార్ద్రచిత్తుఁడై యాకఱకుటెఱుకును గోపముతోఁ దిట్టఁగా నది యొకశ్లోకముగ వెలువడెను.

''మా నిషాద! ప్రతిష్ఠాం త్వ మగమ శ్శాశ్వతీ స్సమాః,
య త్క్రౌంచమిథునా దేక మవధీః కామమోహితమ్''

హఠాదావిర్భూతసారస్వతఝురీనిష్యందరూపం బగునీశ్లోకమును వినిశిష్యుఁడు వెఱఁగందనాసంయమీంద్రుఁ డప్పుణ్యనదిని దీర్థమాడియథోచితముగసంధ్యా

విధి నాచరించి నిజాశ్రమమునకుం బోయి సుఖాసీనుండై తచ్ఛ్లోక భావము
నకుం జెప్పుచుండ సత్యలోకమునుండి పరమేష్ఠి యచ్చటి కేతెంచి "
త్తమా నుత్ప్రసాదవిశేషమున నీకిట్లు సరస్వతి స్వతఃప్రాదుర్భావము
కావున నారదునివలన నీవు వినినరామచరిత్ర మంతయు నీతపోమహిమచే
మగును కాన దాని నేతాదృశశ్లోకములచే సవిస్తరముగఁ జెప్పుము. లే
నీవాక్కున నసత్యముండదు." అని చెప్పి తిరోహితుఁ డగుడు వాల్మీకి,
యణ కావ్యరచనోద్యతుం డయ్యెను.

శ్రీ రామజననము, విశ్వామిత్రయాగసంరక్షణము, సీతావివాహ
షేకవిఘ్నము, రామవివాసనము, సీతాహరణము, వానరసేతుబంధము,
వధము లోనగు పూర్వరామచరిత్రము జరిగినకొంతకాలమునకుఁ దరువా
రాముఁడు రాజ్యమును బాలించుచున్నసమయమున వాల్మీకి యీరా
మును రచించినట్లు రామాయణావచనప్రామాణ్యమువలననే కానవచ్చు
(రామా. బా

ఈకథ జరిగిన కొంతకాలమునకు మహర్షి గ్రంథలేఖన మారంభిం
యాఱుకాండములు వ్రాసి పిదపఁ గొంతకాలమునకు రామునిచే లోక
వలన నరణ్యమునందు విడువఁబడిన గర్భవతి యగుసీత తనయాశ్రమముఁ
నామె కనినకొడుకు లగుకుశలవులు పెరిఁగి ద్వాదశాబ్దవయస్కు లయి
కాండము వ్రాసి గ్రంథమును ముగించి యాకుశలవులచే నీగ్రంథము
ముగఁ జదివించిన ట్లీక్రింద వ్రాసినశ్లోకములవలనఁ గానవచ్చుచున్నది.
(బాల. 3-

వాల్మీకి రామునకు సమకాలికుఁ డని నిర్ణయించుటకు మన కిం
తరప్రమాణ మెద్దియుఁ గానరాదు. వాఙ్మయచరిత్రమును విమర్శింప
యనియు, నితఁడు రచించినరామాయణ మాదికావ్య మనియు నిశ్చయి
ఎట్లన:—"వాల్మీకినాదశ్చ ససర్జ పద్యం జగ్రంథ యన్న చ్యవనో వ
యశ్వఘోషుఁడును, "ప్రాచేతసోపజ్ఞం రామాయణమ్" అని కాళిదా
కవి రసి తదుద్ద్రిహి రామచరితమ్"అని భవభూతియును, "బభూవ వల్మీ
పురా"అని రాజశేఖరుఁడును, ఈరీతిగఁ దక్కినకవిసత్తము లందఱును ద
ములలోఁ గృత్యాదిని వాల్మీకి నాదికవి యని శ్లాఘించి యున్నారు.

"శ్రుత్వా పూర్వం కావ్యబీజం దేవర్షే ర్నారదా దృషిః,
ధర్మకామార్థసంయుక్తం పుణ్యశ్రవణకీర్తనమ్"

అను రామాయణప్రామాణ్యముచేతను,

"ఋగ్యజుస్సామాథర్వా చ భారతం పాంచరాత్రకమ్,
మూలరామాయణం చైవ శాస్త్ర మి త్యభిధీయతే
య చ్చానుకూల మేతచ్చ తచ్చ శాస్త్రం ప్రకీర్తితమ్."

అనుస్కాందపురాణవచనములవలనను, ఈరామాయణము సర్వాలంకారశాస్త్రలక్షణోపేత మై సకలభారతవర్షీయప్రత్ననూత్నవాఙ్మయగ్రంథసమితికి నిదానమై, సకలపురుషార్థప్రద మై విరాజిల్లుచున్నది. ఏతత్కథాశరీరసంబద్ధులగు రామలక్ష్మణభరతశత్రుఘ్నహనుమద్విభీషణాదిమహాపురుషులసచ్చరిత్రముల వినుట వలన మాతాపితృభక్తి, సోదరప్రీతి, జ్యేష్ఠానువర్తనము, లోకమర్యాదానువర్తనము, స్వప్రతిజ్ఞారక్షణాభినివేశము, శబ్దాదివిషయవిరక్తి, ఆశ్రితవాత్సల్యము, స్వామికార్యనిర్వహణతత్పరత్వము, స్వార్థపరతానివృత్తి, చిత్తశుద్ధి, పరోపకారబుద్ధి మొదలగుసద్గుణములు గలిగి లోకము సద్వృత్తము నేర్చికొనును.

వాల్మీకి యిట్టిలోకోత్తరమహాకావ్యరచనాపటిష్ఠత కాకర మైనతపోమాహాత్మ్యము, దివ్యజ్ఞానసంపత్తియుఁ గలవాఁడని ప్రసిద్ధి నొందుటయే కాక యితఁడు ఛందశ్శాస్త్రమున క్రొక్రొత్తయుగమును గల్పించి యాశాస్త్రమున కత్యద్భుతపరిణామమును గల్పించెను.

మొట్టమొదట వైదికఛందస్సులను లౌకికసంస్కృతశ్లోకరచనకొఱకుపయోగించినవాఁ డితఁడే. ఇతనికిముందు శ్లోకములు లేవు. ఇతనికిఁ బూర్వులగుమహర్షులందఱు గద్యమునే వ్రాసి రనుటకునీక్రిందఁగనఁబఱిచినరఘువంశశ్లోకముయొక్క హేమాద్రివ్యాఖ్యానముచితప్రమాణము—

“నిషాదవిద్ధాండజదర్శనోత్థశ్లోకత్వ మాపద్యత యస్య శోకః.” (రఘు. స. 14-70.)

“వ్యా. చాండాలవిద్ధక్రౌంచమిథునదర్శనోత్థేన శోకేన చాండాలం యదాఽభిశప్తవాన్ తదాప్రభృతి వృత్తాని పద్యాని వ్యభవన్. పూర్వం తు వాక్యా న్యేవేతి శ్రూయతే.”

వైదికలౌకికఛందస్సులతారతమ్యవిమర్శన మతిలాభకరము గాన, వానిని వాల్మీకి యెట్లభివృద్ధినొందించెనో యాయంశ మిచటఁ గొంత చర్చించెదము.

అనుష్టుప్ఛందస్సునకుఁ బ్రత్యేకముగ నెనిమిదేసియక్షరములు గలనాల్గుపాదము లుండును. వేదమునందును ఈరామాయణప్రయుక్తానుష్టుప్పు గలదు. దీని కుదాహరణము ఋగ్వేదసంహితలో—

“ఆత్వా గ్రావా వద న్నిహ సోమీ ఘోషేణ యచ్ఛతుః
దివో అముష్య శాసతో దివం యయ దివావసో.”

ఇందుఁ బాదమున కెనిమిదేసియక్షరములచొప్పున నాల్గుపాదములకుముప్పదిరెం డక్షరములు సరిగ నున్నవి. అయినను వైదికానుష్టుప్ఛంద స్సగుటచే నీవర్ణములు దీర్ఘములుగను, నీవర్ణములు హ్రస్వములుగ నుండవలయు నననునియమము లేదు. కాఁబట్టి పైవైదికానుష్టుప్పు లిట్లుగాక యంతట నవ్యభిచరితముగ రెండు నియమములతోఁ గూడియున్నవి. ప్రథమతృతీయపాదములలోని పంచమాక్షరము దీర్ఘముగను, ద్వితీయచతుర్థపాదములలోనిసప్తమాక్షరము హ్రస్వముగ నుండవల

యును. వైదికవృత్తములకంటెఁ బృథగ్లక్షణము గలిగి లయానుగత మగునొకనూతనవృత్తజాతి వాల్మీకి కల్పించెను ప్రతిపాదముఁదందలియక్షరములలో నివిగురువు లివి లఘువు లని నిశ్చితమైనయేర్పాటు గలదీర్ఘవృత్తములజాతి యింకొకటి కాలక్రమమునఁగలిగినది. లౌకికవృత్తములగు గురులఘువర్ణానుపూర్వియు వైదికవృత్తముల గురులఘువర్ణానుపూర్వినే యనుసరించియున్నది. ఉదా:—

"సహస్రశీర్షా పురుషః సహస్రాక్షః సహస్రపాత్,
సభూమిం విశ్వతో వృత్వా అత్యతిష్ఠ ద్దశాంగులమ్"

ఈదిగు నుదహరించిన త్రిష్టుప్ఛందస్సును గొంత మార్పుచేసిన లౌకికములగు నింద్రవజ్రోపేంద్రవజ్రావృత్తములవలెఁ జదువవచ్చును.

| వైదికము, | లౌకికము. |
|---|---|
| ఉదీర్ష్వ నార్యభిజీవ లోకం | ఉదీర్ష్వ నారీ అభిజీవ లోకం |
| గతాసు మేత ముపశేష ఏహి, | గతాసు మేతం ఉపశేష ఏహి, |
| హస్తగ్రాభస్య దిధిషో స్తవేదం | హస్తగ్రభస్యా దిధిషో స్త వేదం |
| పత్యు ర్జనిత్వ మభిసంబభూవ. | పత్యు ర్జనిత్వం అభిసంబభూవ. |

వైదికానుష్టుప్ఛందస్సును వాల్మీకి లౌకికానుష్టుప్ఛందస్సునుగా నెంతసులభముగ మార్చెనో చూడుఁడు. ఇతనిమార్గమునే వ్యాసాదులు ననుసరించిరి. త్రిష్టుప్ఛందోమూలకము లగువైదికదీర్ఘవృత్తము లాధునికము లగునింద్రవజ్రోపేంద్రవజ్రావృత్తములుగ మాఱెడుదశలో వ్రాయఁబడినశ్లోకములు భారతమునఁ గానవచ్చుచున్నవి. ఇవిగాక మఱికొన్నివృత్తములు వైదికఛందోబద్ధముగనే కనఁబడుచున్నవి. ఉదా:—

"ప్రపూర్వగౌ పూర్వజౌ చిత్రభానూ గిరా వాశంసామి తపసా హ్యనంతౌ,
దివ్యౌ సుపర్ణౌ విరజౌ విమానా వధిక్షియంతౌ భువనాని విశ్వా.
హిరణ్మయౌ శకునీ సాంపరాయౌ నాసత్యదస్రౌ సునసౌ వైజయంతౌ,
శుక్రం వయంతౌ తరసా సువేమా నధివ్యయంతౌ వసితం వివస్వతః."

(భార. ఆది. పౌష్యపర్వ. అ. 3.)

బ్రహ్మ వేదములకువలె వాల్మీకి సంస్కృతశ్లోకనిర్మాణమునకును సంస్కృతకవనమునకును జనకుఁడు. కవి యనఁగా వాల్మీకి. "కవి ర్వాల్మీకిశుక్రయోః" అని విశ్వనిఘంటువు. కాళిదాసుగూడ నీయర్థమున నుపయోగించెను. "కవిః కుశలవావేవ చకార కిల నామతః." రఘు. 14-32.

మఱియుఁ దైత్తిరీయప్రాతిశాఖ్యయందును, వాజసనేయసంహితయందును వాల్మీకినామ ముదాహరింపఁబడుటచే నితఁడు శ్రుతిప్రత్యభిజ్ఞాతమాహాత్మ్యము గలవాఁ డని స్పష్టము.

(తైత్తి. ప్రాతి. 5. 36; 9. 4; 18. 6.)

## శ్రీరామాయణ ప్రక్షిప్తభాగవిచారము.

ఈకాలమందు సర్వజనవ్యవహారసిద్ధమైయున్న శ్రీరామాయణము మొదట వాల్మీకి యెట్లు రచించెనో అట్లే యున్నదా? లేక, దాని కిటీవల నెవ్వరైన నెవ్వియైన మార్పు లొనర్చిరా? ఆయంశము విచారింతము.

ప్రకృతపు రామాయణముయొక్క యే దేశపుఁబ్రతినైనఁదీసియొకసారియక్కడక్కడ మందూకప్లుతితోఁ జదువువారికిసైతము దానియందుండు పరస్పరవచనవ్యాహతులు, సంబంధవిచ్ఛేదము, నవీనప్రాచీనాభిప్రాయసాంకర్యము మొదలగునవి కనఁబడక మానవు. ఈకారణమునుబట్టి యీ వాల్మీకిరామాయణ ముత్పన్నమైన కొంతకాలమునకుఁ దరువాత నిందులో నెవ్వరో కొన్ని ప్రక్షిప్తములం జొనిపినారని నిస్సంశయముగాఁ జెప్పవచ్చును. ఈగ్రంథము నామూలాగ్రముగాఁ జదివి విమర్శించియుండనివారికొఱకు నట్టి పరస్పరవిరుద్ధము లగునంశములం గొన్నింటినిచట నుదాహరించుచున్నాను.

1. కథాసంక్షేపమను ప్రథమసర్గమున, "ఈకాలమునం దీలోకములోఁబరమోత్కృష్టుఁడగువాఁడెవ్వఁ"డని వాల్మీకినారదు నడిగినప్రశ్నకు నారదుఁడు "అట్టివాఁ డిక్ష్వాకువంశప్రభవుఁ డైనరాముఁ" డని చెప్పి యతనిచరిత్రమునంతయు వక్కాణించెను ఇట్లు ప్రథమసర్గము గ్రంథమునకంతకు సంగ్రహము. నారదు నడిగిన ప్రశ్నవలననే వాల్మీకి రామునిఁ గాని యాతనిచరిత్రముగాని లేశము నెఱుంగనివాఁ డని స్పష్టముగాఁ గానవచ్చుచున్నది. "మామాను దశరథుఁడు. మాతండ్రి జనకుఁడు. నీవు రామమహిషివి ని న్నీకానలో రాఘవుఁడు విడిచిపెట్టుటకుఁ దగినకారణమునుగూడ నే నెఱుంగుదు" నని యుత్తరకాండములో వాల్మీకి సీతతోఁ జెప్పుచున్నాఁడు.—

"ఉవాచ మధురాం వాణీం హ్లాదయ న్నివ తేజసా,
స్నుషా దశరథస్య త్వం రామస్య మహిషీ ప్రియా.
జనకస్య సుతా రాజ్ఞ స్స్వాగతం తే పతివ్రతే!
ఆయాం త్వే వాసి విజ్ఞాతా మయా ధర్మసమాధినా,
సర్వం చ విదితం మహ్యాం త్రైలోక్యే యద్ధి వర్తతే." (ఉత్త. 49. స.)

ఇందువలన వాల్మీకి రామవృత్తాంతము నెఱిఁగినట్లును, నారదు నడిగిన ప్రశ్నవలన నెఱుఁగనట్లును గానవచ్చుచున్నది. ఈరెండంశములు పరస్పరవిరుద్ధములు. కావున నిందులో నేదియో యొకటి ప్రక్షిప్తమై యుండవలెను.

2. కిష్కింధాకాండములో సుగ్రీవుఁడు మొదట రావణుని నివాసస్థానమునుగాని వాని పరాక్రమమునుగాని యెంతమాత్ర మెఱుంగ నని—

" న జానే నిలయం తస్య సర్వథా పాపరక్షసః,
సామర్థ్యం విక్రమం వాపి దౌష్కులే యస్య వా కులమ్" (కిష్కిం. 7. 2.)

అని చెప్పి తిరుగ సీతాన్వేషణార్థ మయి దక్షిణదిక్కునకుఁ బంపినహనుమ దాదులతో—

"తత స్సముద్ర మాసాద్య సంప్రధా ర్యార్థనిశ్చయమ్,
చిత్రనానానగ శ్శ్రీమా నవగాఢో మహార్ణవమ్.
స హి దేశస్తు వధ్యస్య రావణస్య దురాత్మనః,
రాక్షసాధిపతే ర్వాస స్సహస్రాక్షసమద్యుతేః. (కిష్కిం. స. 41.)

అని రావణుని నివాసస్థానము తనకుఁ దెలిసినట్లు చెప్పుచున్నాఁడు.

౩. ఉత్తరకాండము 36-వ సర్గలో నగస్త్యుఁడు రామున కాంజనేయజన్మప్రకారము నంతయుఁ జెప్పి యాతఁడు వ్యాకరణశాస్త్రమునందు మహాపండితుఁడని యిట్లు చెప్పెను.—

"అసౌ పురా వ్యాకరణం గ్రహీష్య న్సూర్యోన్ముఖః పృష్ఠగమః కపీన్ద్రః,
ఉద్యద్గిరే రస్తగిరిం జగామ గ్రన్థం మహ ద్ధారయ దప్రమేయః.
ససూత్రవృత్త్యర్థ పదం మహార్థం ససంగ్రహం సాధ్యతి వై కపీన్ద్రః,
న హ్యస్తి కశ్చి త్సదృశో౽స్య శాస్త్రే వైశారదే ఛందగతౌ తథైవ." (ఉత్తర. 49 50.)

వ్యాఖ్యా:—"సూత్రం - అష్టాధ్యాయీలక్షణం, వృత్తిః—స్తాత్కాలికసూత్రవృత్తిః, అర్థపదం - సూత్రార్థబోధకపదవద్వార్తికం, మహార్థం - మహాభాష్యం పతంజలికృతం, ససంగ్రహం - వ్యాడికృతసంగ్రహాఖ్యగ్రంథసహితమ్."

పైశ్లోకములోఁ జెప్పబడినయష్టాధ్యాయి, మహాభాష్యము, సంగ్రహము, వ్యాకరణశాస్త్రమునకుఁ బ్రధానగ్రంథములు. కథా సరిత్సాగరమందుఁ జెప్పఁబడినకథ విశ్వాస్య మైనయెడల వరరుచి కుపాధ్యాయుఁ డైనయీవ్యాడి నందచంద్రగుప్తులకాలమందు జీవించినవాఁడు మహాభాష్యకర్త యగుపతంజలి "అరుణద్యవనస్సాకేతమ్" అను మహాభాష్యోదాహరణమునుబట్టి సాకేతపురమును ముట్టడించినయవనుఁడగు 'మినేండ'రను గ్రీకుదేశపురాజునకుసమకాలికుడని దేశచరిత్రము వలన నిశ్చయింప నగు. ఈశ్లోకమువలన రామునికాలమం దున్నహనుమంతుఁడు రెండువేలసంవత్సరములక్రిందట రచింపఁబడిన నవీనగ్రంథములనధ్యయనమొనర్చెనని తేలుచున్నది. ఇది యెట్లుసంభావ్యము?

4. భరతుఁడు చిత్రకూటమం దున్నరామునిఁ గలసికొని పితృమరణవార్తఁ జెప్పి యాతని నయోధ్యకుఁ దోడితెచ్చుటకుఁ జనఁగాఁ జూచి రాముఁడు భరతుని విషయమయి చేసినకుశలప్రశ్నతోఁ గూడిన "కచ్చిత్సర్గను" గుఱించి కొంత చర్చించెదము. ఇది యయోధ్యాకాండలో నూఱవసర్గ. సర్వసంపత్సమృద్ధ మగురాజ్యమును దనకొఱకు విడనాడి రాముఁ డరణ్యములపా లయ్యె ననియు, నిందువలనఁ దాను సర్వలోకనిందాపాత్రుఁడ నైతి ననియుఁ, దండ్రి మృతుఁ డనియు నపారదుఃఖసాగరనిమగ్నుఁ డయి యెట్లయిన బోధించి యాతనిఁ దిరిగి యయోధ్యకుం గొని

పోయి రాజ్యముఁ బ్రతిగ్రహింపఁజేయఁ నడుకట్టి సపరివారముగాఁ దనకడకు వచ్చిన భరతునిఁ జూచి మహాప్రాజ్ఞుఁడైన రాముఁడు "ఏమి తమ్ముఁడా! వృద్ధుఁడైన మన తండ్రి కుశలమా! అతఁడు సజీవుఁడై యుండఁగా నీవి ట్లరణ్యమున కేల వచ్చితివి? అతర్కితమగు నీరాక సంశయమును బొడమించుచున్నది. చెప్పుమా! మన తండ్రి కుశలియే?" అని యింతమట్టుకు నత్యుద్వేగముతోఁ గుశలప్రశ్న చేయుటయే యవసరప్రాప్తమై యుండ "నీవు బాగుగ రాజ్య మేలుచుంటివా? నీమంత్రులు మంచివారేనా? నీపురోహితుఁ డెట్టివాఁడు? ఆయవ్యయములఁ జక్కఁగఁ బరీక్షించుచుంటివా?" అని యనవసరప్రశ్న లడుగుట కేవలము లోకస్వభావమునకు విరుద్ధముగాఁ దోఁచుచున్నది. ఈరాజనీతిప్రశ్నపరమయినశ్లోకము లన్నియు నిస్సంశయముగా భారతమునుండి యిందులో వ్రాయఁబడినవి. మహాభారతాంతర్గతసభాపర్వ పంచమాధ్యాయములో నారదుఁడు ధర్మరాజుకడకు వచ్చి యతనిని రాజ్యాంగ రాజ్యపరిపాలనలవిషయమయి కుశలప్రశ్నముఁ జేసి రాజనీతి నంతయు నుపదేశించెను. ఆశ్లోకములే యివి. ఈదిగువఁ గొన్నింటిని బట్టికారూపముగాఁ గనఁబఱుచుచున్నాను.

మహాభారతము - సభాపర్వము.

5 వ అధ్యాయము.

1. విజయో మంత్రమూలో హి
రాజ్ఞో భవతి భారత!
కచ్చి త్సంవృతమంత్ర స్తే
హ్యమాత్యై శ్శాస్త్రకోవిదైః?.
2. కచ్చి దాత్మసమా వృద్ధా
శ్శుద్ధా స్సంబోధనక్షమాః,
కులీనా శ్చానురక్తా శ్చ
కృతా స్తే వీర! మంత్రిణః?.
3. కచ్చి న్నిద్రావశం నైషీః?
కచ్చి త్కాలే ప్రబుధ్యసే?
కచ్చి చ్చాపరరాత్రేషు
చింతయ స్యర్థ మర్థవిత్?.
4. కచ్చి న్మంత్రయసే నైకః?
కచ్చి న్న బహుభి స్సహ?
కచ్చి త్తే మంత్రితో మంత్రో
రాష్ట్రం న పరిధావతి?.
5. కచ్చి దర్థా న్వినిశ్చిత్య
ఫలమూలా న్మహోదయాన్,
క్షిప్ర మారభసే కర్తుం
న విఘ్నయసి తాదృశాన్?.
6. కచ్చి ద్రాజన్ కృతా న్యేవ
కృతప్రాయాణి వా పునః?

రామాయణము - అయోధ్యాకాండము.

100 వ సర్గ.

1. మంత్రో విజయమూలం వా
రాజ్ఞాం భవతి రాఘవ!
సుసంవృతో మంత్రివరై
రమాత్యై శ్శాస్త్రకోవిదైః?.
2. కచ్చి దాత్మసమా శ్శూరా
శ్శ్రుతవంతో జితేంద్రియాః,
కులీనా శ్చేంగితజ్ఞా శ్చ
కృతా స్తే తాత! మన్త్రిణః?.
3. కచ్చి చ్చాపరరాత్రేషు
చింతయస్యర్థనైపుణమ్?
కచ్చి న్నిద్రావశం నైషీః?
కచ్చి త్కాలే ప్రబుధ్యసే?.
4 కచ్చి న్మంత్రయసే నైకః?
కచ్చి న్న బహుభి స్సహ?
కచ్చి త్తే మంత్రితో మంత్రో
రాష్ట్రం న పరిధావతి?.
5. కచ్చి దర్థం వినిశ్చిత్య
ఫలమూలమహోదయమ్,
క్షిప్ర మారభసే కర్తుం
న దీర్ఘయసి రాఘవ?.
6 కచ్చి త్తే సుకృతా న్యేవ
కృతరూపాణి వా పునః,

విదుస్తే వీర! కర్మాణి
నావవాప్తాని కానిచిత్?.

7. కచ్చి ద్బలస్య భక్తం చ
వేతనం చ యథోచితమ్;
సంప్రాప్తకాలే దాతవ్యం
దదాసి న వికర్షసి?.

౮. కాలాతిక్రమణా దేతే
భక్తవేతనయో ర్భృతాః,
భర్తుః కుప్యంతి దౌర్గత్యా
త్సోఽనర్థ స్సుమహాన్ స్మృతః.

విదుస్తే సర్వకార్యాణి
న కర్తవ్యాని పార్థివ!.

7. కచ్చి ద్బలస్య భక్తం చ
వేతనం చ యథోచితమ్,
సంప్రాప్తకాలే దాతవ్యం
దదాసి న విలంబసే?.

8. కాలాతిక్రమణా దేతే
భక్తవేతనయో ర్భృతాః,
భర్తుః కుప్యంతి దౌర్గత్యా
త్సోఽనర్థ స్సుమహాన్ స్మృతః.

ఇట్టిశ్లోకము లనేకము లున్నవి. గ్రంథవిస్తరభీతిచే వ్రాయఁబడ లేదు.

నలోపాఖ్యానములోని శ్లోకములు కొన్ని సుందరకాండమందలి పదునైదవ సర్గలోఁ గానవచ్చుచున్నవి.

భారతము - నలోపాఖ్యానము.

1. మందప్రఖ్యాయమానేన
రూపే ణాప్రతిమేన తామ్,
నిబద్ధాం ధూమజాలేన
ప్రభా మివ విభావసోః.

2. తాం సమీక్ష్య విశాలాక్షీ
మధికం మలినాం కృశామ్,
తర్కయామాస భైమీతి
కారణై రుపపాదయన్.

3 పూర్ణచంద్రనిభాం శ్యామాం
చారువృత్తపయోధరామ్,
కుర్వన్తీం ప్రభయా దేవీం
సర్వా వితిమిరా దిశః

4. చారుపద్మవిశాలాక్షీం
మన్మథస్య రతీ మివ,
ఇష్టాం సమస్తలోకస్య
పూర్ణచంద్రప్రభా మివ.

5 మలపంకానులిప్తాంగీం
మృణాళీ మివ చోద్ధృతామ్,
పౌర్ణమాసీ మివ నిశాం
రాహుగ్రస్తనిశాకరామ్.

6 పతిశోకాకులాం దీనాం
శుష్కస్రోతాం నదీ మివ,
విధ్వస్తపర్ణకమలాం
విత్రాసితవిహంగమామ్

రామాయణము - సుందరకాండము 15 వ సర్గ.

1. మందప్రఖ్యాయమానేన
రూపేణ రుచిరప్రభామ్,
పినద్ధాం ధూమజాలేన
ప్రభా మివ విభావసోః.

2. తాం సమీక్ష్య విశాలాక్షీ
మధికం మలినాం కృశామ్,
తర్కయామాస సీతేతి
కారణై రుపపాదిభిః.

3. పూర్ణచంద్రాననాం సుభ్రూం
చారువృత్తపయోధరామ్,
కుర్వంతీం ప్రభయా దేవీం
సర్వా వితిమిరా దిశః.

4 సీతాం పద్మపలాశాక్షీం
మన్మథస్య రతిం యథా,
ఇష్టాం సర్వస్య జగతః
పూర్ణచంద్రప్రభా మివ.

5 తప్యమానా మివోష్ణేన
మృణాళీ మచిరోద్ధృతామ్,
పౌర్ణమాసీ మివ నిశాం
రాహుగ్రస్తేందుమండలామ్.

6. పతిశోకాతురాం దీనాం
నదీం విస్రావితా మివ,
ఉత్కృష్టపర్ణకమలాం
విత్రాసితవిహంగమామ్.

7. హ స్త్రీహ స్తపరామృష్టాం
వ్యాకులా మివ పద్మినీమ్,
సుకుమారీం సుజాతాంగీం
రత్నగర్భగృహోచితామ్.

8. భర్తా నామ పరం నార్యా
భూషణం భూషణా దపి,
ఏషా తు రహితా తేన
శోభమానా న శోభతే.

7. హ స్తిహ స్తపరామృష్టా
మాకులా మివ పద్మినీమ్,
సుకుమారీం సుజాతాంగీం
రత్నగర్భగృహోచితామ్.

8. భర్తా నామ పరం నార్యా
భూషణం భూషణా దపి,
ఏషా తు రహితా తేన
భూషణార్హా న శోభతే.

ఇట్లు కొంత యీపరిశుద్ధ మయిన మొదటిరామాయణ గ్రంథము నచ్చు టచ్చుటఁ దమయిచ్చవచ్చినటుల మార్చి ప్రక్షిప్తములఁ జేర్చియుందు రని పైన వ్రాసిన సంగతులవలనఁ దోఁచుచున్నది.

సార్వజనీనముగా నార్యులందఱు యజ్ఞమునే ముఖ్యమైన దేవపూజగా నేర్పఱుచుకొని బ్రాహ్మణక్షత్రియు లాయాసమయముల విధిదృష్టప్రకారము మాంసముఁ దినుచున్నవా రయి, స్త్రీలు వేదములఁ జదువుచు వైదికకర్మల నొనర్చువా రయి, వేదశాస్త్రవిద్యలలో క్షత్రియులు బ్రాహ్మణులు సమానపాండిత్యముగలవా రయి, ధనుర్విద్య, రాజనీతి, యుద్ధశాస్త్రము. మొద లగువానిలో బ్రాహ్మణులు క్షత్రియసమాను లయినవా రయి యున్నయుగకాలవిశేషమం దీరామాయణము రచింపఁబడి యుండె నని సవిమర్శముగాఁ జదివినయెడల నిస్సంశయముగాఁ జెప్ప వచ్చును. రాముఁడు, సీత, దశరథుఁడు, కౌసల్య, దండకారణ్యవాసు లైనయగస్త్యభరద్వాజాదిఋషిసత్తములు మొదలగువారియొక్క చరిత్రలనుజదివినయెడల మన మిపు డున్నసాంఘికస్థితికంటె నత్యంతవిభిన్న మయినదియు, లేశము బౌద్ధమతాభిప్రాయసాంకర్యము లేనిదియు నగు నతిచిరంతనసాంఘికస్థితిలోఁ జైన వేరొక్కనఁబడినవా రున్నట్లు మనము తెలిసికొనఁగలము. రామలక్ష్మణులు వనమందు నివసింపఁబోవుసమయమునలక్ష్మణుఁడు కట్టినపర్ణశాలలోఁ బ్రవేశించుటకు ముందు రాముఁడు వాస్తుదేవతల నారాధించి హోమము వేల్చి లక్ష్మణుఁడు గొట్టితెచ్చిన హరిణముయొక్కమాంసమును దేవతల కర్పించెను. సౌమిత్రి వధించి తెచ్చినలేడి నగ్నిలోఁ బెట్టి కాల్చుట యిప్పటిశాకాహారద్విజులకు వింతగాఁ దోఁచు.

"అయం సర్వ స్సమస్తాంగ శ్శృతః కృష్ణమృగో మయా,
దేవతాం దేవసంకాశ! యజస్వ కుశలో హ్యసి." (అయో. 56. 29.)

రాముఁడు జటాయువునకుఁ బరలోకక్రియల నాచరించునపుడు హరిణ మాంసమును నివేదించెను.

"రోహిమాంసాని చోత్కృత్య పేశీకృత్వా మహాయశాః,
శకునాయ దదౌ రామో రమ్యే హరితశాద్వలే." (ఆర. 68. 33.)

ద్విజుఁ డాచరింపవలసినకర్మలతో సంబంధించినమంత్రము లన్నియు రాము

నికి వచ్చియున్నట్లు లతఁ డాయాసమయములయం దాయామంత్రములఁ బఠించి నట్లు కూడఁ గానవచ్చుచున్నది.

“రాఘవోఽపి మహాతేజా నావ మారుహ్య తాం తతః,
బ్రహ్మవత్ క్షత్రవచ్చైవ జజాప హిత మాత్మనః” (అయో. 52. 79.)

మఱియొకచోట,

“యత్తత్ప్రేతస్య మర్త్యస్య కథయన్తి ద్విజాతయః,
తత్స్వర్గగమనం పిత్ర్యం తస్య రామో జజాప హ.” (అర. 68. 34.)

ప్రతిదినము రాముఁడు సంధ్యోపాస్తి సల్పుచున్నట్లు ఋషి యనేకస్థలముల యందుఁ జెప్పియున్నాఁడు. నిజముగా రామునికున్న వేదమంత్రపఠనసామర్థ్యము వైదికకర్మశ్రద్ధయు విచారింపఁగా నొకవైదికకర్మఠునికంటె నెంతమాత్రము న్యూనము కాదు. రాముఁ డరణ్యమునకుఁ బోయెద నని కౌసల్యతోఁ జెప్పఁబోయినపు డామె నియమముతో సమంత్రకముగా హోమము వేల్చుచున్నట్లు చెప్పఁబడినది.

“సా క్షౌమవసనా హృష్టా నిత్యం వ్రతపరాయణా,
అగ్నిం జుహోతి స్మ తదా మన్త్రవత్కృతమఙ్గళా.” (అయో. 20. 15)

వాయుపుత్త్రుఁడు లంకలో సీతను వెదకివెదకి యెచటను గానక నిర్విణ్ణుఁడై యశోకవనమం దున్నయొకచిన్ననదియొద్దున నున్నచెట్టుపైఁ గూర్చుండి ‘సీతసంధ్యోపాస్తికిచటికిఁ దప్పక వచ్చు’ నని తలంచుచుండెను.

“సంధ్యాకాలమనాః శ్యామా ధ్రువ మేష్యతి జానకీ,
నదీం చేమాం శివజలాం సంధ్యార్థే వరవర్ణినీ.” (సుం. 14. 49.)

పూర్వ మతిప్రాచీనకాలమందు స్త్రీలకుఁగూడ నుపనయనము వేదాధ్యయనము స్వబంధుగృహమందే భిక్షాచర్యయును విధింపఁబడియుండెను.

“పరాశరమాధవీయే ఆచారకాండే వివాహప్రకరణే హారీతేనోక్తమ్:—“ద్వివిధాః స్త్రియః-బ్రహ్మవాదిన్యః, సద్యోవధ్వః ఇతి తత్ర బ్రహ్మవాదినీనా ముపనయన మగ్నీంధనం వేదాధ్యయనం స్వగృహే భిక్షాచర్యేతి; సద్యోవధూనాం తూపస్థితే వివాహే కథంచి దుపనయనం కృత్వా వివాహః కార్య ఇతి.”

తథా చ యమః.—

“పురా కల్పే తు నారీణాం మౌంజీబంధన మిష్యతే,
అధ్యాపనం చ వేదానాం సావిత్రీవచనం తథా.
పితా పితృవ్యో భ్రాతా వా నైనా మధ్యాపయేత్పరః,
స్వగృహే చైవ కన్యాయా భైక్షచర్యా విధీయతే
వర్జయే దజినం చీరం జటాధారణ మేవ చ.”

"పూర్వకాలపుస్త్రీలస్థితి యిది యయియుండెను. తరువాత నిటీవల చాల కాలమునకు "స్త్రీశూద్రద్విజబంధూనాం త్రయీ న శ్రుతిగోచరా" అనిపుట్టినవచనప్రామాణ్యముఁబట్టి వేదాధ్యయనాధికార మట్లుండఁగా స్త్రీలకు వేదమంత్రశ్రవణమందుఁగూడ నధికారము లేదని నిషేధింపఁబడెను. ఇట్లు ప్రాచీనద్విజసాంఘికస్థితి కాలక్రమమున వైదికత్వమును గోలుపోయి క్షీణదశనొందఁగా నిటీవల పూర్వమట్టికర్మజ్ఞానసంపత్తికిఁ బ్రసిద్ధికెక్కి పురుషతుల్యసర్వాధికారము గలిగియుండిన స్త్రీజాతియే "స్త్రీశూద్రహూణశబరా అపి పాపజీవాః" అనియు, "స్త్రియో వైశ్యాస్తథా శూద్రా యేఽపి స్యుః పాపయోనయః" అని యర్వాచీనగ్రంథములయందుఁ బాపయోనియనియు, మాధ్యాస్పదమనియు నెన్నఁబడెను. నిషిద్ధవేదాధ్యయనార్హత గలస్త్రీలతో నున్నయిప్పటికాలపువార మయినమనకుఁ బూర్వపుస్త్రీలందఱు నధ్యయనసంపన్నలే యని ప్రాచీనమతగ్రంథములయందుఁ జదివినచో నెంతోవింతగాఁ దోఁచును. అంతవింతగాఁ దోఁచుటచేతనేకదా యిప్పటికాలపు వ్యాఖ్యాతలు పైనవ్రాసిన "సంధ్యాకాలమనాః శ్యామా" అనెడుసుందరకాండశ్లోకమున కీరీతిగా వ్యాఖ్యానమును వ్రాసిరి.

"అత్ర సమ్యగ్భగవద్ధ్యానస్యైవ సంధ్యాపదార్థత్వే నాస్త్యేవ తత్ర స్త్రియా అధికారః, గాయత్రీమంత్రేణ తదర్థస్మరణపూర్వకధ్యానే తు ద్విజస్యైవాధికార ఇత్యన్యత్."

"ఇచట సంధ్యాశబ్దమునకు భగవద్ధ్యాన మర్థముగావున నిట్టిదానియందు స్త్రీకధికార మున్నది. గాయత్రీమంత్రార్థానుసంధానపూర్వకధ్యానమం దన్ననో ద్విజునికే యధికారము."

కౌసల్య యశ్వమేధాశ్వమును దనచేతిలో నున్నకత్తితో స్వయముగా మూఁడునఱకులు నఱికి చంపె నని విన్నప్పుడు మన మేమి యాలోచింప వలసి యుండును?.

"కౌసల్యా తం హయం తత్ర పరిచర్య సమంతతః,
కృపాణై ర్విశశా సైనం త్రిభిః పరమయా ముదా." (బాల. 13—31.)

రామాయణములో నగస్త్యశరభంగభరద్వాజాదిమహామునీంద్రులయాశ్రమంబు లెట్లు వర్ణింపఁబడినవో చిత్తగింపుఁడు. ఈవర్ణనమున వారిజీవనములు రజస్తమోగుణాతీతము లయి కేవలసత్త్వాద్వైతముగా నుండె నని మన మూహించుకొనఁగలము. ఈఋషితల్లజు లాకాలమందు నైసర్గికరామణీయకము గలవివిక్తప్రదేశములయందు నివసించువా రయి, సర్వకాలము శ్రౌతస్మార్తాదికర్మనిరతు లయి, శాస్త్రవ్యాసంగము, వేదప్రవచనము, శిష్యాధ్యాపనము, భగవదుపాసనము మొదలగువానిచేఁ గాలముఁ గడుపుచుండెడివారు. ఇట్టివా రని లోక మెఱుంగనిదికాదు. నిస్పృహులు, వీతరాగులు, విదితవేదితవ్యులు, స్వయముగాఁ గృషిఁజేసి పండించు

గొన్న సస్యఫలమువలన జీవించెడివారు, తమకుఁగాని తమయాగాదికర్మలకుఁగాని, తమకృషిఫలమునకుఁగాని సంభవించునయనర్థములఁ దొలఁగించుకొనుట కాయుధములు ధరించి పోరాడెడువారు.

ఆకాలమందు వేదప్రతిపాద్య దేవతలయిన యింద్రవరుణాదులఁ బూజించుచుండెడువారు. ఈదేవతలకు వారిపర్ణకుటీరములయందు వేలువేలు పూజాస్థలములు హోమకుండములు నుండెను.

"సహ పత్న్యా విశాలాక్ష్యా నారాయణ ముపాగమత్,
గతే పురోహితే రామ స్స్నాతో నియతమానసః.
వాగ్యత స్సహ వై దేవ్యా భూత్వా నియతమానసః,
శ్రీమ త్యాయతనే విష్ణో శ్శిశ్యే నరవరాత్మజః." (అయో. 6. 1, 4.)

ఈశ్లోకములవలన శ్రీరాముభవనమం దొకవిష్ణ్వాలయ మున్నట్లు గానవచ్చుచున్నది.

"యథా హి చోర స్స తథా హి బుద్ధ స్తథాగతం నాస్తిక మత్ర విద్ధి,
తస్మాద్ధి య శ్శంక్యతమః ప్రజానాం న నాస్తికే నాభిముఖో బుధ స్స్యాత్ "
(అయో. 109. 34.)

ఈశ్లోకము నాస్తికమతోపన్యాస మొనర్చినజాబాలిసిద్ధాంతమును ఖండించుటలో రాముఁడు చెప్పినమాట ఇందులోబుద్ధుఁడు చోరుఁడని నిరసింపఁబడినది. రామునికాల మెక్కడ? బుద్ధునికాల మెక్కడ? ఆకాలమందు బుద్ధునిపేరైన వినఁబడెనా ? వైదికమతావలంబులైన యగ్నిమిత్రపుష్పమిత్రులకాలమున (అనఁగాఁ గ్రీస్తుకుముందు నూటయేఁబది సంవత్సరముల సమయమున) నశోకుఁ డీమతమును రాజమతముగాఁ జేసినపిమ్మట నీమతమునకు సంభవించిన దూషణలో బౌద్ధుఁ డిట్లు దూషింపఁబడియుండును. లేక, క్రీస్తుకుముందు షష్ఠాబ్దశతకములో బుద్ధుఁడు క్రొత్తగాఁ దనమతమును బోధించుచున్నసమయమందైన నీదూషణము పుట్టియుండవలయును.

"తత స్స కింకరాన్ హత్వా హనుమాన్ ధ్యాన మాస్థితః,
వనం భగ్నం మయా చైత్యప్రాసాదో న వినాశితః." (సుందర. 43. 1.)

ఇచట చైత్య మనఁగా "దేవాలయ" మని వ్యాఖ్యాతలు వ్రాసియున్నారు. చైత్యశబ్దమునకు బుద్ధాలయ మర్థము. కాలక్రమమున నీశబ్దమునకు సభ యనియు, నుద్దేశపాదప మనియు, దేవాలయ మనియు ననేకార్థములు గలిగినవి. ఇదియే 'పూర్వపులంక' యని వ్యవహరింపఁబడు సింహళద్వీపమందుఁ గ్రీస్తుశకమునకుముందుండి బౌద్ధమత ముచ్చదశలో నుండెను. ఇప్పటికి నీద్వీపవాసు లందఱు బౌద్ధమతము నవలంబించియే యున్నారు. కావున నీశ్లోకము కూడఁ బ్రక్షిప్తమే కావచ్చును.

కావునఁ బై హేతువులనుబట్టి విమర్శింపఁగా శ్రీరామాయణము బౌద్ధకులోత్పత్తికిఁ బూర్వము బహుకాలము ముందున్నసాంఘికస్థితిలో వ్రాయఁబడినది. అట్టి సాంఘికస్థితిలో బ్రాహ్మణులు వేదప్రతిపాద్యవరుణేంద్రాదిదైవతల నుపాసించుచుండువారు. ఆకాలము మందున్నబ్రాహ్మణులకు క్షత్త్రియులకు, నీకాలము మందున్నంతభేదము లేదు. అప్పటికాలపుస్త్రీ లిప్పటిస్త్రీలవలెఁ గాక పురుషులవలె వేదాధ్యయనాదులయందును వైదికకర్మాచరణమందును నధికారము గలిగియుండిరి. నిస్సంశయముగ శ్రీరామాయణకవి యగువాల్మీకి యాకాలమువాఁడు. కాఁబట్టి యిప్పటిరామాయణమునం దచ్చటచ్చటఁ గానవచ్చు కొన్నికొన్ని యభిప్రాయవిశేషము లంతప్రాచీనకాలపువాఁ డగుకవి కుండుట యసంభావ్యముకదా! కావున నీగ్రంథ ముత్పన్నమైనకొంతకాలమునకుఁ గొందఱిచే నచ్చటచ్చట మార్పఁబడియుండు నని నిర్ణయించుటకుఁ బైనవ్రాసినయంశములే నిదర్శనములు.

## శ్రీరామాయణప్రతిపాద్య వేదాంతార్థము.

"ఇతిహాసపురాణాభ్యాం వేదాంతార్థః ప్రకాశ్యతే"

అనువచనము ననుసరించి వాల్మీకి సకలవేదాంతసారార్థము నిట్లు ప్రతిపాదించియున్నాఁడు. ఎట్లన:—జగజ్జన్మాదికారణ మగుపరబ్రహ్మము చతుర్ముఖుఁడా? విష్ణువా? రుద్రుఁడా? యనుమీమాంసలో రామరూపముగ నవతరించిన విష్ణువే పరబ్రహ్మ మని వాల్మీకి * షడ్విధతాత్పర్యలింగములచే శ్రీరామాయణమందు నిర్ణయించియున్నాఁడు.

ఉపక్రమమందు:— "ఇపు డీలోకమున వేదాంతోదితసకలగుణసంపన్నుఁడు విష్ణువా? లేక, బ్రహ్మరుద్రేంద్రాదులయం దన్యతముఁడా!" అని వాల్మీకి ప్రశ్నసేయఁగా "ఇక్ష్వాకువంశప్రభవో రామో నామ జనైః శ్రుతః." అను నీ మొదలగువానిచే "రామరూపముగ నవతరించినవిష్ణువే"యని నారదుఁడు ప్రత్యుత్తర మొసఁగెను.

ఉపసంహారమందు, చతుర్ముఖుఁడు:—

"త వాహం పూర్వకే భావే పుత్త్రః పరపురంజయ,

---

* షడ్విధతాత్పర్యలింగములు:—

"ఉపక్రమోపసంహారా వభ్యాసోఽపూర్వతాఫలమ్,
అర్థవాదోపపత్తీ శ్చ లింగం తాత్పర్యనిర్ణయే."

ఉపక్రమము (ఆరంభము), ఉపసంహారము (అంతము), అభ్యాసము (చెప్పినదాని నావృత్తి చేయుట), అపూర్వత(ఇతరప్రమాణములచేఁ దెలియఁబడకపోవుట,) ఫలము, అర్థవాదము (చెప్పిన యర్థమును స్తుతించు వాక్యము.)

ప్రాజాపత్యం త్వయా కర్మ సర్వం మయి నివేశితమ్."
"భవా న్నారాయణో దేవ శ్శ్రీమాం శ్చక్రాయుధో విభుః,
వధార్థం రావణ స్యేహ ప్రవిష్టో మానుషీం తనుమ్." (యుద్ధ. 120. స.)
"సీ. అనఘాత్మ! నీవు నారాయణుండవు,.. మొందితి వయ్య! నీవు." (గోపీ. యుద్ధ.)

దీనివలన జగములను సృజించినబ్రహ్మకు నుత్పత్తికారణ మగుటచేఁ బరబ్రహ్మము విష్ణువే యని చెప్పఁబడియున్నది. అభ్యాసములో, ననఁగా రామాయణములో నచ్చటచ్చట:—

"ఏతస్మి న్నంతరే విష్ణు రుపయాతో మహాద్యుతిః,
శంఖచక్రగదాపాణిః పీతవాసా జగత్పతిః." (బాల. 15. 15.)
"సీ. బుధజనకులవనంబులు పల్లవింపఁ జేయుట మాధవమూర్తి నొనరఁ గాంచి, మేన దీపింప భార్గవీజాని దోఁచె." (గోపీ. బాల. 359.)

ఇత్యాదులచే జగత్కారణత్వము విష్ణువునకే చెప్పఁబడినది. మఱియు—

"త్వం గతిః పరమా దేవ సర్వేషాం నః పరంతప!
వధాయ దేవ! శత్రూణాం నృణాం లోకే మనః కురు." (బాల. 15. 24.)

"కావున నీవు మనుష్యరూపంబున నవతరించి రావణుని వధించి లోకంబులకుఁ బరమకల్యాణంబు సంపాదింపవలయు నీవే గతి."

ఇందువలనఁ బరత్వాసాధారణ మగుసర్వరక్షకత్వము విష్ణువునకే చెప్పఁబడినది. ఇంతియకాక—

"తతో దేవా స్సగంధర్వా స్సరుద్రా స్సాప్సరోగణాః,
స్తుతిభి ర్దివ్యరూపాభి స్తుష్టువు ర్మధుసూదనమ్." (బాల. 15.31.)

అనునీమొదలగు శ్లోకములచే విష్ణువునకే పరత్వము చెప్పఁబడినది.

"అహం వేద్మి మహాత్మానం రామం సత్యపరాక్రమమ్,
వసిష్ఠోఽపి మహాతేజా యే చేమే తపసి స్థితాః." (బాల. 19. 14.)
"గీ. రామభద్రుఁడు........రతని మహిమ." (గోపీ బాల. 469.)

అను విశ్వామిత్రవాక్య మీరామరూపి యైనవిష్ణు వపరిచ్ఛిన్నమహిమ గలవాఁడనియు మహాపురుషుఁ డనియుఁ,దపోమహిమ లేక యతనిప్రభావ మెఱుంగశక్యము గాదనియుఁ జెప్పుచున్నది. సీతావివాహఘట్టమునందు వసిష్ఠుఁడు—

"అవ్యక్తప్రభవో బ్రహ్మా శాశ్వతో నిత్య అవ్యయః,
తస్మా న్మరీచి స్సంజజ్ఞే మరీచేః కాశ్యప స్సుతః." (బాల. 70. 20.)
"గీ. అవ్యక్తసంభవుం........గశ్యపాహ్వయుఁడు పుట్టె" (గోపీ. బాల. 1246.)

అనుశ్లోకమువలన నితఁడే సర్వకారణమని స్పష్టము. పరశురాముఁడు సైతము.

"అధికం మేనిరే విష్ణుం దేవా స్సర్షిగణా స్తథా,
జృంభితం తద్ధను ర్దృష్ట్వా శైవం విష్ణుపరాక్రమైః." (బాల. 75. 19.)

"గీ. అంతఁ బరమేష్ఠి........దమతమసదనములకు." (గోపీ. బాల. 1325.)

అనుశ్లోకముచే నీతనిసర్వాధికత్వముఁ బ్రకాశింపఁ జేసెను.

"స హి దేవై రుదీర్ణస్య రావణస్య వధార్థిభిః,
అర్థితో మానుషే లోకే జజ్ఞే విష్ణు స్సనాతనః." (అయో. 1. 2.)

"గీ. ఆరఘూత్తమా...రమాధవుఁడు గాఁడె యెంచి చూడ." (గోపీ. అయో-7.)

అనుశ్లోకములవలన రామరూపి యగువిష్ణువునకే సనాతనత్వము వక్కాణింపఁబడినది. ఈకాండములోనే మఱియొకచోట "ఆకాశప్రభవో బ్రహ్మ శాశ్వతో నిత్య అవ్యయః" అని చెప్పఁబడియున్నది. ఇచ్చట నాకాశశబ్దము "ఆకాశో హ వై నామరూపయో ర్నిర్వహితా, కో హ్యే వాన్యా త్కః ప్రాణ్యా దాకాశ ఆనందో న స్యాత్" (తై. ఉ.) "ఆకాశ స్తల్లింగాత్" ఇత్యాదిశ్రుతిసూత్రములయందువలెనే, ప్రసిద్ధాకాశపరము గాక పరబ్రహ్మపరముగాఁ బ్రయోగింపఁబడినది. దీనివలన స్వయంప్రకాశకత్వము, సర్వవ్యాపకత్వము సూచింపఁబడినది. మఱియు—

"అప్రమేయం హి త త్తేజో యస్య సా జనకాత్మజా,
న త్వం సమర్థ స్తాం హర్తుం రామచాపాశ్రయాం వనే." (అర. 37. 18.)

"గీ. అమ్మహాత్మునిఘనతేజ...హరియింపఁ జాల వీవు." (గోపీ. అర. 649.)

అనుమారీచవచనముచే నీరామరూపియగువిష్ణుపరిచ్ఛేద్యమహిమగలవాఁడని చెప్పఁబడినది.

"నివాసవృక్ష స్సాధూనా మాపన్నానాం పరా గతిః,
ధాతూనా మివ శైలేంద్రో గుణానా మాకరో మహాన్." (కిష్కిం. 15-18-19.)

"గీ. రణపటిష్ఠుఁ డాపన్న...డార్తిహరుఁడు...
అతులితగతి నమ్మహాత్ముఁ డాశ్రయ మధిపా!" (గోపీ. కిష్కిం. 381-382.)

మఱియు నీకాండమందే—

"త్వ మప్రమేయ శ్చ దురాసదశ్చ జితేంద్రియ శ్చోత్తమధార్మిక శ్చ,
అక్షయ్యకీర్తి శ్చ విచక్షణ శ్చ క్షితిక్షమావాన్ క్షతజోపమాక్షః." (కిష్కిం. 24. 31.)

"సీ. అవనీశతిలక...బాలింపఁ జాలు దీవు." (గోపీ. కిష్కిం. 612.)

అను నీ తారావచనముచే నీవిష్ణువునకు జ్ఞానానందామలత్వాదిసమస్తకల్యాణగుణాకరత్వము స్థాపింపఁబడినది.

"బ్రహ్మా స్వయంభూ శ్చతురాననో వా రుద్ర స్త్రినేత్ర స్త్రిపురాంతకో వా,
ఇంద్రో మహేంద్ర స్సురనాయకో వా త్రాతుం న శక్తా యుధి రామవధ్యమ్." (సుం. 51. 44.)

"రామబాణంబులబారం బడిన...విరించియు రక్షింప శక్తులు గారు." (గోపీ. సుంద. 1149.)

ఇందువలన సర్వసంహర్తృత్వము ద్యోతిత మైనది.

"కిం వైష్ణవం వా కపిరూప మేత్య రక్షోవినాశాయ పరం సుతేజః,
అనంత మవ్యక్తమచింత్య మేకం స్వమాయయాసాంప్రత మాగతంవా."(సుంద.54.38.)
"చ. వనజభవప్రకోప మిటు......దైత్యవినాశసార్థ మై." (గోపీ. సుంద. 1215.)

దీనిచే ననంతరూపము చెప్పఁబడినది.

ఇంతియకాక మఱియొకవిశేషము గలదు. "స దేవ సో మ్యేద మగ్ర ఆసీత్" "ఈజగత్తు సృష్ట్యాదియందుసత్తే(అనఁగా బ్రహ్మమే)అయియుండెను." "అసద్వా ఇదమేక ఏ వాగ్ర ఆసీత్" "ఈజగత్తు సృష్ట్యాదియందు అసత్తే (అనఁగానామరూపభోగానర్హ మయిన బ్రహ్మమే) అయియుండెను" "బ్రహ్మ వా ఇద మేక ఏ వాగ్ర ఆసీత్" "ఈజగత్తు సృష్ట్యాదియం దొకబ్రహ్మమే యయియుండెను" "న సన్నచాసచ్ఛివ ఏవ కేవలః" "సృష్ట్యాదియందు సదసత్తులు లేవు. ఒకశివుఁడే యుండెను." "హిరణ్యగర్భ స్సమవర్త తాగ్రే" "సృష్టికంటె ముందు హిరణ్యగర్భుఁడు (అనఁగాఁ జతుర్ముఖబ్రహ్మ) ఉండెను." "సర్వైశ్వర్యసంపన్న స్సర్వేశ్వర శ్శంభురాకాశమధ్యే ధ్యేయః" "సర్వైశ్వర్యసంపన్నుఁడు సర్వేశ్వరుఁడునగుశంభు వాకాశమధ్యమందు ధ్యానింపఁ దగినవాఁడు" "అస్య లోకస్య కా గతి రిత్యాకాశ ఇతి హోవాచ" "ఈలోకమునకు గతి యేది యనఁగా నాకాశ మనెను" "ఇంద్రో మాయాభిః పురురూప ఈయతే" "ఇంద్రుఁడు మాయలచే బహురూపుఁ డగుచున్నాఁడు" "కతమా సా దేవతా ప్రాణ ఇతి హోవాచ" "ఆదేవత యెవ రనఁగాఁ బ్రాణ మని చెప్పెను."

ఇత్యాద్యన్యార్థాన్యపరత్వశంకాజనకములగుసదసదవ్యాకృతాత్మహిరణ్యగర్భశంభ్వాకాశప్రాణేంద్రాదిశబ్దములకుఁబశ్వధికరణన్యాయముచే"సామాన్యవాచినాం పదానాం సతి విశేషే విశేషపర్యవసానమ్" అనున్యాయము ననుసరించి ఛాందోగ్యమహోపనిషన్మైత్రాయణీయసుబాలోపనిషత్తులయందు "ఏకో హ వై నారాయణ ఆసీ, న్న బ్రహ్మ్మా, నేశానః" ఇత్యాదిశ్రుతిపఠిత మైనవిశేషవాచక మగు నారాయణశబ్దమందుఁ బర్యవసానము. "అగ్ని రవమో దేవానాం, విష్ణుః పరమః." "దేవతలలో నగ్ని తక్కువవాఁడు. విష్ణువు గొప్పవాఁడు" "యో బ్రహ్మాణం విదధాతి పూర్వం యో వై వేదాంశ్చ ప్రహిణోతి తస్మై" "మొదట నెవఁడు బ్రహ్మను సృజించుచున్నాఁడో? ఎవఁడు వానికొఱకు వేదముల నిచ్చుచున్నాఁడో?"

"ఆపో నారా ఇతి ప్రోక్తా ఆపో వై నరసూనవః,
తా యదస్యాయనం పూర్వం తేన నారాయణ స్మృతః"
"యత్తత్కారణ మవ్యక్తం నిత్యం సదసదాత్మకమ్,
తద్విసృష్ట స్స పురుషో లోకే బ్రహ్మేతి కీర్త్యతే."

"ధ్యాయే న్నారాయణం దేవం స్నానాదిషు చ కర్మసు"
"ఆలోడ్య సర్వశాస్త్రాణి విచార్య చ పునఃపునః,
ఇద మేకం సునిష్పన్నం ధ్యేయో నారాయణ స్సదా."
"వేదశాస్త్రా త్పరం నాస్తి న దైవం కేశవా త్పరమ్;"
"సర్వే వేదా య త్పద మామనంతి, సర్వే వేదా యత్రైకం భవన్తి"
"వేదై శ్చ సర్వై రహ మేవ వేద్యః."
"న తాస్మిన్ సర్వవచసాం ప్రతిష్ఠా యత్ర శాశ్వతీ."
"వేదే రామాయణే చైవ భారతే భరతర్షభ!
ఆదౌ మధ్యే త చాన్తే చ విష్ణు స్సర్వత్ర గీయతే."
"నారాయణపరా వేదా నారాయణపరా మఖాః, నారాయణపరం జ్ఞానం."
"మత్తః పరతరం నాన్య త్కించి దస్తి ధనంజయ!"
"విష్ణో స్సకాశా దుద్భూతం జగ త్తత్రైవ చ స్థితమ్,
స్థితిసంయమకర్తా చ జగతోఽస్య జగచ్చ సః."
"నారాయణ పరం బ్రహ్మ తత్త్వం నారాయణః పరం"
"వేదవేద్యో హి భగవాన్ వాసుదేవ స్సనాతనః,
గీయతే స పరో వేదై ర్యో వే దైనం స వేదవిత్"

ఇత్యాదిశ్రుతిస్మృతిసాత్త్వికపురాణవాక్యశతములచే శ్రీమన్నారాయణ పరత్వము స్థాపింపఁబడుచున్నది.

"వ్యక్త మేష మహాయోగీ పరమాత్మా సనాతనః,
... ... ... ... ... ... ...
శ్రీవత్సవక్షా నిత్యశ్రీ రజయ్య శ్శాశ్వతో ధ్రువః." (యుద్ధ. 114.14-15.)
"సీ. స్వాభావికజ్ఞానశక్తియుక్తుఁడు... నేఁ డిద నిక్కువంబు." (గోపీ. యుద్ధ.)

అనెడిమండోదరీవాక్యమువలనఁ బరమాత్మత్వశ్రియఃపతిత్వాద్యసాధారణ చిహ్నాయుతుఁ డగువిష్ణువే యీరాముఁ డని సర్వదేవతాపారమ్యముస్థాపింపఁబడు చున్నది. మఱియు "భవా న్నారాయణో దేవః" (యుద్ధ. 120. 13.) ఇత్యాది బ్రహ్మవాక్యమువలన రామరూపి యగువిష్ణువునకే నారాయణత్వజగత్కారణత్వ ములు ప్రతిపాదింపఁబడినవి.

ఇఁక "అపూర్వత" యనఁగా నితరప్రమాణములచేఁ దెలియఁబడకుండుట. పరతత్త్వము విష్ణు వని ప్రమాణాంతరములచేఁ దెలియ శక్యము గాదు.

'ఫలము,' ఉత్తరకాండము చివర—

"యాని పశ్యన్తి కాకుత్స్థం స్థావరాణి చరాణి చ,
సర్వాణి స్వర్గమనే హ్యనుజగ్ము ర్హితా న్యపి.
నోచ్ఛ్వస త్తదయోధ్యాయాం సుసూక్ష్మ మపి దృశ్యతే,
తిర్యగ్యోనిగతా శ్చాపి సర్వే రామ మనువ్రతాః."

అనుశ్లోకములచే భగవత్సాలోక్యాదిక మని స్పష్టము ఇఁక 'నర్థవాదము'. ఇయ్యది బాలకాండములో గనపఱుపఁబడెను.

"ఇమే ద్వే ధనుషీ శ్రేష్ఠే దివ్యే లోకాభివిశ్రుతే,
... ... ... ... ... ... ...
అధికం మేనిరే విష్ణుం దేవా స్సర్షిగణా స్తదా." (బాల. 75.11-19.)

"ఉ. మున్ను సమస్తదేవమునిముఖ్యులు......
గీ. సమ్మదంబునఁ దమతమసదనములకు" (గోపీ. బాల. 1119-1325.)

దీనివలన బ్రహ్మదేవగణములు మొదలగువారు మీమాంసాపూర్వకముగా విష్ణురుద్రులలో విష్ణువే యధికుఁ డని నిర్ణయించుటయే నర్థవాదోపపత్తులు చెప్పఁబడినవి.

విష్ణువు పరదైవత మైనచో నతఁడు రామరూపమున భూమిపై నేల యవతరింపవలయును? అనిన, "అజాయమానో బహుధా విజాయతే; తస్య ధీరాః పరిజానన్తి యోనిమ్" "జన్మరహితుఁడయ్యు ననేకప్రకారములఁ బుట్టుచున్నాఁడు. అతనిజన్మకారణమును జ్ఞాననిష్ఠు లెఱుంగుదురు" "న సా కర్మనిమిత్తజా" "ఆయనజన్మ మస్మదాదులజన్మమువలెఁ గర్మమునఁ గలుగునది కాదు."

"యదా యదా హి ధర్మస్య గ్లానిర్భవతి భారత!
అభ్యుత్థాన మధర్మస్య తదాఽఽత్మానం సృజామ్యహమ్.
పరిత్రాణాయ సాధూనాం వినాశాయ చ దుష్కృతామ్
ధర్మసంస్థాపనార్థాయ సంభవామి యుగే యుగే."

"ఓభారతా! ఎప్పుడెప్పుడు వేదవిహితధర్మమునకు హాసమును, అధర్మమునకు వృద్ధియుఁ గలుగుచున్నదో? అప్పుడంతయు నన్ను నేనే సృజించుకొనుచున్నాను. సాధువులను రక్షించుటకును, పాపుల నశింపఁజేయుటకును, నశించిన ధర్మమును మరల స్థాపించుటకును బ్రతియుగమందుఁ బుట్టుచున్నాను."

"అజోఽపి స న్నవ్యయాత్మా భూతానా మీశ్వరోఽపి సన్
ప్రకృతిం స్వా మధిష్ఠాయ సంభవా మ్యాత్మమాయయా."

"నేను జన్మ లేనివాఁడను, పరిణామము లేనివాఁడను, సర్వభూతములకు నీశ్వరుఁడను. అయినను నాయీశ్వరస్వభావమును విడువకయె నాసంకల్పరూపజ్ఞానముచేఁ బుట్టుచున్నాను" ఇత్యాదిప్రమాణములచే నాతఁడు లోకానుగ్రహప్రేరితుఁ డై చేతనవర్గమును రక్షించుట కవతరించుచున్నాఁడు; కాని యస్మదాదిబద్ధులవలె గర్భజన్మజరామృతిక్లేశకర్మపడూర్తిగుఁ డై, షడ్భావవికారములు గలవాఁ డై జనించువాఁడు కాఁ డని పూర్వోక్తచోద్యము పరిహరింపఁబడుచున్నది.

"యా గతి ర్యాగశీలానా మాహితాగ్నేశ్చ యా గతిః
... ... ... ... ... ... ... ...

గృధ్రరాజ! మహాసత్త్వ! సంస్కృతశ్చ మయా వ్రజ.'' (అర. 68.29-30.)
''యజ్ఞశీలురను........బనుభవించుచుందుము.'' (గోపీ. అర. 1216.)

దీనిచే జటాయువు దహనసంస్కారాదికర్మల కనర్హ మయినతిర్యగ్జంతు వైనను, బ్రాహ్మణహతుఁడైనను భగవంతునివిశేషకటాక్షమునకుఁ బాత్రుఁ డగుటచే ననితరసులభ మగుపునరావృత్తిరహితశాశ్వతవిష్ణులోకము నొందెను ఇందువలనఁ బరదేవతాసాధారణ మైనమోక్షప్రదత్వము తెలియఁజేయఁబడెను.

ఈవిధముగా వేదాంతవేద్య మగుపరతత్త్వము రామరూపి యగువిష్ణువే యని యుపక్రమాదిషడ్విధతాత్పర్యలింగములచే స్థాపింపఁబడినది. గ్రంథాంతమందు బ్రహ్మ యిట్లు చెప్పుచున్నాఁడు—

''అస్యాః పరిషదో మధ్యే య ద్బ్రవీమి నిబోధ తత్
ఏత దేవ హి కావ్యం తే కావ్యానా ముత్తమం శ్రుతమ్.
సర్వం విస్తరతో రాజ న్వ్యాఖ్యాస్యతి న సంశయః
ఆదికావ్య మిదం రామ! త్వయి సర్వం ప్రతిష్ఠితమ్.
న హ్యన్యోఽర్హతి కావ్యానాం యశోభా గ్రాఘవా దృతే'' (ఉత్త. 98.17-19.)

''ఈసభామధ్యమందు నేను భాషించుదానిని మీరందఱు తెలిసికొనుఁడు. అన్నికావ్యములలో నత్త్యుత్తమ మైనకావ్య మిదియే యని ప్రసిద్ధి నొందినది. అఖిలవృత్తాంతమును వ్యాఖ్యానముచేయుచున్నది. ఓయిరాముఁడా! ఆదికావ్య మైనయీరామాయణమునకు నీవే ప్రధానప్రతిపాద్యుఁడవు. రామునికంటె నితరులెవ్వరును కావ్యకీర్తికిఁ బాత్రులుగారు'' కావున నీశ్రీరామాయణముచేఁ బ్రతిపాదింపఁబడుపరతత్త్వము శ్రీమహావిష్ణువే యని సమర్థింపఁబడినది. రామునిచేనొనర్పఁబడినసూర్యోపస్థానాదికము విశ్వామిత్రాద్యనువృత్తివలె మనుష్యభావనానుసరణముచేఁ జేయఁబడిన దని గ్రహింపవలయును.

సేతునిర్మాణకాలమం దాసేతువువద్ద రాముఁడొకశివలింగమును బ్రతిష్ఠచేసె నని వాల్మీకి రామాయణమందుఁ జెప్పినట్లు కానరాదు. అగస్త్యసంహితాధ్యాత్మరామాయణాదులయందు—

''సేతు మారభమాణ స్తు తత్ర రామేశ్వరం శివమ్,
సంస్థాప్య పూజయిత్వాఽఽహ రామో లోకహితాయ చ.'' (అధ్యా. యుద్ధ. 4 స.)

అని స్పష్టముగాఁ జెప్పఁబడియున్నది.

రాముఁడు సపరివారుఁడై పుష్పకవిమాన మెక్కి లంకనుండి యయోధ్యకుఁ దిరిగివచ్చుచున్నసమయమున సీత కాయావిశేషములఁ గనఁబఱుచుచు సేతువుఁ జూపించి—

"సేతుబంధ ఇతి ఖ్యాతం త్రైలోక్య నాభిపూజితమ్
ఏత త్పవిత్రం పరమం మహాపాతక నాశనమ్."

అని చెప్పి, "అత్ర పూర్వం మహాదేవః ప్రసాద మకరో త్ప్రభుః" అని చెప్పి యున్నాఁడు. కూర్మపురాణమందు:—

"సేతుమధ్యే మహాదేవ మీశానం కృత్తివాససమ్
స్థాపయామాస వై లింగం పూజయామాస రాఘవః.
తస్య దేవో మహాదేవః పార్వత్యా సహ శంకరః
ప్రత్యక్ష మేవ భగవాన్ దత్తవా న్వర ముత్తమమ్.
యే త్వయా స్థాపితం లింగం ద్రక్ష్యం తీహ ద్విజాతయః
మహాపాతకసంయుక్తా స్తేషాం పాపం వినశ్యతి."

పద్మపురాణమందు—

"రామః పుష్పకా దవరుహ్య మహాదేవం ప్రతిష్ఠాపితవాన్
సోఽస్మై ప్రసన్నోఽభూ దిత్యుచ్యతే"

ఇత్యాదిప్రమాణవచనములు రాముఁడు సేతువుదగ్గర శివలింగప్రతిష్ఠను జేసినట్లు చెప్పుచున్నవి. కావున, "అత్ర పూర్వం మహాదేవః ప్రసాదమకరోత్ప్రభుః" అనుశ్లోకమునఁ గూడ రామకర్తృకశివలింగప్రతిష్ఠ బోధింపఁబడుచున్న దని కొందఱు వ్యాఖ్యాతలు వ్యాఖ్యానము చేసియున్నారు; కాని యిది సమంజసముగా నున్నట్లు తోఁపదు. ఈశ్లోకములో 'పూర్వం' అనుటచే శివుఁడు రాముని యందుఁ బ్రసాదముఁ జూపించుట సేతునిర్మాణకాలమునందా? లేక లంకనుండి తిరిగివచ్చుసమయమునందా? సేతునిర్మాణకాలమునం దన్నచో నపుడు రావణవధాదికము జరగలేదు కావున శివుఁడు రామునిఁ గటాక్షించుట కవకాశములేదు. లంకనుండి తిరిగివచ్చునపుడన్నచో "అత్ర" అనునది చాలును. 'పూర్వ' మనునది విరోధించును. మహేశ్వరుఁడు రావణవధానంతరమునఁ గదా వచ్చి రాముని గౌరవించెను. పూర్వ మనుదానికిఁ బూర్వకల్ప మనియర్థముఁ జెప్పఁగూడదాయన్నచో, "ఆత్మానం మానుషం మన్యే రామం దశరథాత్మజమ్" అని మనుష్యభావనతో నున్నరాముఁడు సుగ్రీవాదులదగ్గఱ స్వకీయవిష్ణ్వవతారద్యోతక మయినపూర్వవృత్తోద్ఘాటనము చేయుట మఱింత యనుచితముగాఁ గానవచ్చును. పూర్వకల్పమందుఁ గట్టఁబడినసేతు వుండఁగా మరల నిపుడు సేతువుఁ గట్టుట వ్యర్థము. కావున "అత్ర"అనుపదము పూర్వశ్లోకోక్త మయిన నలకృతసేతుబంధము నే పరామర్శించుచున్న దనిచెప్పుట యుచితము. ఇచ్చటిమహాదేవశబ్దమునకు సముద్రుఁడనియర్థము. "స్నేహం స్నిహ్యం మహ చ్ఛుద్ధం వారుణం సర్వతోముఖమ్" అని జల పర్యాయములలో యాదవనిఘంటు.

"మహాత్ జలం, తద్రూపో దేవః సముద్రః"
"దర్శయామాస చాత్మానం సముద్ర స్సరితాం పతిః."

అని లోఁగడఁ జెప్పఁబడిన ట్లిచట ననకు సముద్రుఁడు ప్రత్యక్షమయి నీటిలో సేతువు నిలుచునట్లు దయ చూపించె నని రాముఁడు సీతతోఁ జెప్పె ననుటయే యుచితమయినయర్థము. లేక మహాదేవశబ్దమునకు శివుఁ డని యర్థముఁ జెప్పినచో రావణవధానంతరము శివుఁడు రామునికడ కేతెంచి స్తుతించి "ఏష రాజా విమానస్థః పితా దశరథ స్తవ" అని దశరథుని రామునికిఁ జూపింపఁగా—

"మహాదేవవచ శ్శ్రుత్వా కాకుత్స్థ స్సహలక్ష్మణః
విమానశిఖరస్థస్య ప్రణామ మకరో త్పితుః."

అనునట్లు, రాముఁడు దశరథునికి నమస్కరించెను. కావున నిచటఁ బితృప్రదర్శనమే మహాదేవప్రసాద మనియర్థము చెప్పినచో సమంజసముగా నుండును. రాముఁడు దీని కనుగుణముగా హనుమంతుని ద్వారా భరతునికి నిజాగమనవార్తాప్రేషణమందు "మహాదేవప్రసాదా చ్చ పిత్రా మమ సమాగమః" "మహాదేవునికృపచేఁ బితృసమాగమము నాకు లభించె" నని చెప్పి పంపెను. కావున నిదియే యర్థసామంజస్యమని బుద్ధిమంతు లూహింపవలయును. పూర్వోక్తపురాణవచనములగతి యేమనఁగా నవి మాహాత్మ్యపరము లని గ్రహింపవలయును.

## శ్రీరామాయణసారాంశము.

"శ్రీవిష్ణోః ప్రథమే కాండే జగజ్జననహేతుతా
ద్వితీయే స్థితిహేతుత్వం తృతీయే మోక్షదాయితా
చతుర్థే గుణసంపత్తిః పంచమే సర్వహర్తృతా
షష్ఠే వేదాంతవేద్యత్వం సప్తమే స్రష్టృహేతుతా.
ఏవం విష్ణోః పరం తత్త్వం రామాత్మేతి సునిశ్చితః"

బాలకాండమందు "అవ్యక్తప్రభవో బ్రహ్మా" ఇత్యాదివాక్యములచే జగజ్జననహేతుత్వము; "ప్రజాపాలనతత్త్వజ్ఞః" ఇత్యాదులచే నయోధ్యాకాండమందు స్థితిహేతుత్వము; అరణ్యకాండమందు "మయా త్వం సమనుజ్ఞాతో గచ్ఛ లోకా ననుత్తమాన్" అని జటాయువునకు మోక్షమొసంగుటచే మోక్షప్రదాయిత్వము; కిష్కింధాకాండమందు "త్వ మప్రమేయ శ్చ దురాసద శ్చ" ఇత్యాది తారావాక్యములచే గుణసంపత్తియు; సుందరకాండములో "కిం వైష్ణవం వా కపిరూపమేత్య రక్షోవినాశాయ" ఇత్యాదికముచే సర్వహర్తృత్వము; యుద్ధకాండమందు బ్రహ్మాదులచే నొనర్పఁబడిన స్తుతులవలన వేదాంతవేద్యత్వము;

ఉత్తరకాండములో—

"పద్మే దివ్యేఽర్కసంకాశే నాభ్యా ముత్పాద్య మా మపి
ప్రాజాపత్యం త్వయా కర్మ సర్వం మయి నివేశితమ్."

ఇత్యాది బ్రహ్మవాక్యములచే స్రష్టృహేతుత్వము ప్రతిపాదింపఁబడియుండుటచే నీరామాయణమందు రామరూపముగా నవతరించినవిష్ణువే పరతత్త్వ మని నిశ్చయింపఁబడినది.

శరణాగతి నిరూపణము.

ఇట్టిపరతత్త్వముఁ బొందుటకుఁ దగినసాధన మెద్దియన:-శరణాగతి. తనను తాను రక్షించుకొనుటయందు స్వప్రయత్నమును మాని భగవంతుఁడే నాకు సర్వవిధరక్షకుఁ డని నమ్మి యాతనియందుఁ దనరక్షణభారమును సమర్పించుట శరణాగతి యనఁబడును. ఈశరణాగతి ప్రపదము, ప్రపత్తి, న్యాసము, భరన్యాసము మొదలగు శబ్దములచే వ్యవహరింపఁబడుచున్నది. ఇది శ్రీపాంచరాత్రశాస్త్రమందు సహస్రముఖముగా వివరింపఁబడినది.

"యో బ్రహ్మాణం విదధాతి పూర్వం యో వై వేదాం శ్చ ప్రహిణోతి తస్మై,
త మిహ దేవ మాత్మబుద్ధిప్రసాదం ముముక్షు ర్వై శరణ మహం ప్రపద్యే."

అనెడు శ్వేతాశ్వతరోపనిషత్తులోఁ గూడ నీశరణాగతి వక్కాణింపఁబడెను. సర్వశరణ్యమైనపరతత్త్వమును వశపఱుచుకొనుటకు సమర్థమయి పరమహితమయి యుండెడు శరణాగతిధర్మమునకు విధాయకము లైన వేదభాగముల నీవిధంబున వాల్మీకి యుపక్రమము మొదలుకొని యుపసంహారమువరకు నుపబృంహణము చేసియున్నాఁడు. ఎట్లన:—అవతారారంభమందు దశరథుఁ డాచరించుచున్న యజ్ఞములో హవిర్భాగములఁ గొనుట కేతెంచిన దేవత లందఱు

"ఏతస్మి న్నంతరే విష్ణు రుపయాతో మహాద్యుతిః
శంఖచక్రగదాపాణిః పీతవాసా జగత్పతిః."

అన్నటుల యచటఁ, బ్రత్యక్షమైనసర్వశేషి యైననారాయణుని సన్నిధిలో "సిద్ధగంధర్వయక్షా శ్చ తత స్త్వాం శరణం గతాః" అని రావణవధార్థ మయి శరణాగతి చేసి రని చెప్పఁబడెను. పిమ్మట త్రిశంకు శునశ్శేఫాది వృత్తాంతములయందు విశ్వామిత్రాదుల వ్యాపారవిశేషములఁ జెప్పి శరణాగతరక్షణము పరమధర్మమనియు,సమర్థకారుణికవిషయ మగుశరణాగతి తప్పక ఫలప్రద మగు ననియు వివరింపఁబడెను. అయోధ్యాకాండములో రాముని వనప్రయాణసమయమందు నాతో రావల దని లక్ష్మణుని రాముఁడు నివారింపఁగా లక్ష్మణుఁడు—

"ఏవం శ్రుత్వా తు సంవాదం లక్ష్మణః పూర్వమాగతః
అహం సర్వం కరిష్యామి జాగ్రత స్స్వపత శ్చ తే."    (అయో. 31. స.)

"ఆసమయంబున సుమిత్రానందనుం డచ్చోట.
......సీతం బ్రార్థించుచు రామున కిట్లనియె" (గోపీ. అయో. 691.)

"దేవా! న న్ననుచరునిఁగాఁ బరిగ్రహింపుము మీయనుచరత్వకరణంబునందు... నేనును భవత్సేవవలనఁ గృతార్థుండ నగుదు నట్లుగావున." (గోపీ. అయో. 705.)

చ. "వనలు సమస్తవన్యఫలపంక్తులఁ దెచ్చి యొసంగుచు న్నికల్
సవినయబుద్ధి బద్ధగురుచాపముఁ దాల్చి సుషుప్తిఁ దక్కఁ గ
న్గవ కటు ఱెప్ప వ్రేయక సుఖస్థితి నెప్పుడుఁ గాచుచుండఁగా
నవనిజఁ గూడి నీవు గిరులందు విహార మొనర్చు టొప్పదే." (గోపీ. అయో. 707.)

పురుషకారభూత యగు సీతాసమక్షమందు నన్ను సకలవిధకైంకర్యముల నొనర్చెడు దాసునిఁగాఁ బరిగ్రహింపు మని ప్రార్థించుచు రామవిషయ మయి చేసినశరణాగతి యమోఘముగా ఫలించె ననియు, నిందువలన నమ్మవారు స్వామియుఁ జేరి నమిథునమునకు దాస్య మొనర్చెడున పేక్షఁ జూపించుటచే ద్వయమంత్రార్థము వివరింపఁబడె ననియుఁ దేలుచున్నది.

భరతుఁడు చిత్రకూటమునకు వచ్చి "శిశ్యే పురస్తా చ్ఛాలాయాం యావన్మే న ప్రసీదతి" అని పట్టాభిషేకముఁ జేసికొ మ్మని రామునిఁ బ్రార్థించి శరణాగతిఁ జేసెను. ఇది ఫలింపలేదే యన్నచో నట్లు గాదు. రావణవధముకొఱకు మొదట దేవతలుచేసినశరణాగతిని సఫలము చేయుటకుఁ దా నిల్లు వెడలి వచ్చెను. గాన రాముఁడు తనకుఁ బ్రతినిధి యగుపాదుకలను భరతుని కిచ్చి పంపి దేవతామనోరథపూర్తిఁ గావించి వెనుక నుండి పట్టాభిషేకమును స్వీకరించెను. కావున భారత శరణాగతి విఫలత నొందలేదు. తరువాత దండకారణ్యవాసు లగు ఋషులు—

"ఏహి పశ్య శరీరాణి ఋషీణాం భావితాత్మనామ్
పరిపాలయ నస్సర్వాన్ రాక్షసేభ్యో నృపాత్మజ!" (అర. 6. స.)

"భవదధీనచిత్తులమైయున్న మాశరీరంబులు బహుప్రకారంబుల రాక్షసపీడితంబులై యున్నవి.........బహుప్రకారంబుల భీమకర్ము లగురాక్షసులచేతఁ గ్రియమాణంబైన విప్రకారంబు సహింపఁజాలక సర్వలోకరక్షణసమర్థుండవైననిన్ను శరణంబునొందుటకుఁ జనుదెంచితిమి. సర్వలోకంబులయందు నీకంటె నైహికాముష్మికసాధనదేవతాంతరం బెద్దియు లేదు గావున ననన్యశరణ్యుల మైనమమ్ము రాక్షసబాధవలన విముక్తులం జేసి కృపాళుండవై రక్షింపుము." (గో. అర. 83.)

అని రాక్షసబాధానివృత్తికొఱకు శరణాగతిఁ జేసిరి. సీతావక్షోవిదారణరూపాసహ్యాపచారముఁ జేసినకాకాసురుఁడు, బ్రహ్మాస్త్రము వెంటఁ దఱుమఁగా

"స పిత్రా చ పరిత్యక్త స్సురైశ్చ సమహర్షిభిః
... ... ... ... ... ... ...
వధార్హ మపి కాకుత్స్థః కృపయా పర్యపాలయత్." (సుంద. 38. 33-34)

"ఇట్లడరినఁ జూచి యవ్వాయసంబు...ప్రణమిల్లినం గరుణించి" (గోపీ. సుంద. 910)

ప్రాణార్థి యయి రామునిపాదములమీఁదఁ బడి శరణాగతి యొనర్చెను. సీతను వెదకుటఁ గపుల రావించెదనని ప్రతిజ్ఞఁజేసి కామపరవశుఁడై తారాసక్తిచే

రామకార్యము పేక్షించి కిష్కింధాగుహాలోఁజొచ్చి యున్నసుగ్రీవునిపైఁ గోపించి దండించుట కుద్యుక్తుఁడైనలక్ష్మణుని

"కృతాపరాధస్య హి తే నాన్య త్పశ్యా మ్యహం క్షమమ్,
అంతరే ణాంజలిం బద్ధ్వా లక్ష్మణస్య ప్రసాదనాత్." (కిష్కిం. 32. 17.)

"క. ఉపకారి యైనలక్ష్మణు
కృప వెలయుటకంటె నొందు కీశాధీశా!
యపరాధివి కృపణుండవు
చపలాత్ముఁడ వైన నీకు శరణము గలదే." (గోపీ. కిష్కిం. 836.)

వేఁడుకొను మని హనుమంతుఁడు బోధింపఁగా సుగ్రీవుఁడు లక్ష్మణునివిషయమయి శరణాగతి చేసెను. సాత్త్వికాగ్రేసరుఁ డగువిభీషణుఁడు రామునకు సీత నర్పింపు మని రావణున కనేకవిధములు బోధించినను వినక యతఁడు కాలచోదితుఁడై విభీషణునిఁ దిరస్కరింపఁగా "గతాయువు లగునరులు మిత్రులహితవాక్యములను విన నొల్లరు గాన నేను బోయినచ్చెద సుఖం బుండు" మని పలికి సర్వభరన్యాసపూర్వకముగా శరణాగతి చేసెను అపుడు సుగ్రీవాదులు ద్విషత్పక్షము వాని నమ్మఁగూడదనియనేకవిధముల నుపన్యసింప వారివాదముల నన్నిటిని ఖండించి హనుమంతుని పురుషకారమున

"సకృదేవ ప్రపన్నాయ తవాస్మీతి చ యాచతే
అభయం సర్వభూతేభ్యో దదా మ్యేత ద్వ్రతం మమ.
ఆన యైనం హరిశ్రేష్ఠ! దత్త మస్యాభయం మయా
విభీషణో వా సుగ్రీవ యది వా రావణ స్స్వయమ్." (యుద్ధ. 18. 30-34.)

"ఉ ఈదివిజారి కే నభయ మిచ్చితి రావణు నైనఁ గాఁచెదన్.
... ... ... ...
ఎ. మఱియు నితండు............దోడ్కొ నిరమ్ము." (గోపీ. యుద్ధ. 381, 382.)

అని పరమకారుణికుఁడై రక్షించెను. ఈ రామాయణమందుఁ బ్రధానముగను విస్తరముగను నుపబృంహితమైనది యీవిభీషణశరణాగతియే!

ఈలాగున నీశ్రీరామాయణము శరణాగతిపరంపరను బ్రతిపాదించుచుండుటచే దీనికి 'దీర్ఘశరణాగతి' యని పేరొదవినది.

## శరణాగతి స్వరూప విశేషనిరూపణము.

"తౌ తు మేధావినౌ దృష్ట్వా వేదేషు పరినిష్ఠితౌ
వేదోపబృంహణార్థాయ తా వగ్రాహయత ప్రభుః."

అనునట్లు శ్రీరామాయణము వేదోపబృంహణార్థము ప్రవృత్తమైనప్రబంధ మగుటచే జగత్కారణభూతవస్తు ప్రతిపాదకము లయిన "అద్భ్య స్సంభూతః పృథివ్యై

రస్యా చ్చ" అనువాక్యములను, అట్టిపరవస్తువుయొక్క దివ్యావతారోపపాదకములైన "అజాయమానో బహుధా విజాయతే" అనువాక్యములను, అవతారప్రయోజనమైనసాధుపరిత్రాణదుష్కృద్వినాశములను బ్రతిపాదించు "యో దేవేభ్య ఆతపతి యో దేవానాం పురోహితః" అనునవిమొదలగు వాక్యములను నుపబృంహణము సేయుచున్నది ఎట్లన:—

"వ్యక్త మేష మహాయోగీ పరమాత్మా సనాతనః"

"భవా న్నారాయణో దేవ శ్శ్రీమాం శ్చక్రాయుధో విభుః

"అర్థితో మానుషే లోకే జజ్ఞే విష్ణుస్సనాతనః"

అని పరతత్త్వము రామరూపముగ నవతరించె ననునంశము పైనఁ జూపింపఁబడినది. విశ్వామిత్రాధ్వరత్రాణము,దండకారణ్యవాసు లగుఋషులను రక్షించుట, వరభుజబలములచే గర్వితు లయినరావణాదులచే బాధింపఁబడిన యింద్రాదులబాధలను నివారించుటయు లోనుగాఁ గలపనులచే సామాన్యరక్షణమును,

"రామో రామో రామ ఇతి ప్రజానా మభవ న్కథాః

రామభూతం జగ దభూ ద్రామే రాజ్యం ప్రశాసతి."

"తిర్యగ్యోనిగతా శ్చాపి సర్వే రామ మనువ్రతాః"

అన్నటుల తనసౌందర్యసౌశీల్యాదికల్యాణగుణములచే సకలచరాచరభూతములు తన్ను విడిచినచో ధరింపలేనట్లు చేసి కొనకు వానికి మోక్ష మొసంగుటచే సాక్షాదవతారప్రయోజన మైనవిశేషరక్షణమును బ్రతిపాదించుటచే సాధుపరిత్రాణమును వక్కాణింపఁబడెను. తాటకా తాటకేయఖరదూషణరావణకుంభకర్ణాదినిరసనముచే, దుష్టసంహారము, పితృవచనపరిపాలనము, ఋషిదేవతాద్యనువర్తనము, పెద్దజంతువు చిన్నజంతువును బాధింపకుండ రక్షించుటచే క్షాత్రధర్మము, అశ్వమేధశతాహరణము మొదలగువానిచే సామాన్యధర్మమును,

"సుగ్రీవం శరణం గతః" "సముద్రం రాఘవో రాజా శరణం గంతు మర్హతి" అని విశేషధర్మమును, "మర్యాదానాం చ లోకస్య కర్తా కారయితా చసః" "స్వే స్వే ధర్మే నియోక్ష్యతి" అన్నట్లు తా నాచరించి పరులచే నాచరింపించె నని చెప్పుటవలన ధర్మసంస్థాపనమును నుపపాదింపఁబడినవి. ఈరీతిగా వేదార్థోపబృంహణ మైనశ్రీరామాయణమునకుఁ బ్రధానప్రతిపాద్యము—

"న్యాస ఇ త్యాహు ర్మనీషిణో బ్రహ్మాణం......తస్మా న్న్యాస మేషాంతపసా మతిరిక్త మాహుః"

"యో బ్రహ్మాణం విదధాతి పూర్వం యోవై వేదాం శ్చ ప్రహిణోతి తస్మై తం హ దేవ మాత్మబుద్ధిప్రసాదం ముముక్షు ర్వై శరణ మహం ప్రపద్యే"

ఇత్యాదిశ్రుతులచే ధర్మములలోఁ బరమధర్మ మని చెప్పఁబడినది శరణాగతీ ధర్మము. ఇట్టిపరమధర్మమును వాల్మీకి విభీషణవృత్తాంతముచే నుపబృంహణము చేసి యున్నాఁడు.

ఈశరణాగతి రామాయణమునకుఁ బ్రధానప్రమేయ మెట్లైన దనఁగా "ఈప్రబంధనాయకుఁ డైనశ్రీరామచంద్రుఁడు పరుఁడైనను తనపరత్వమునుజూడక సంసారిసజాతీయు లైనగుహశబరీసుగ్రీవప్రభృతులతో క్షీరనీరన్యాయముగాఁ గలిసినసౌశీల్యగుణము,సాధుపరిత్రాణము,ధర్మసంస్థాపనము,దుష్టసంహారము మొదలగువానిచేఁ బ్రకాశ్యమాన మగుసర్వరక్షకత్వ మనునదియే శరణ్యస్వభావము. అందుచే నీప్రబంధక్రమము విభీషణవృత్తాంతమందుఁ జెప్పఁబడినశరణాగతికిఁ బ్రతిసంబంధి యగుశ్రీరామునిస్వభావమును బ్రతిపాదించునది యగుటచే శరణాగతియే ప్రధానప్రమేయ మయినది.

ఈశరణాగతిప్రకరణమందు శరణ్యునికి శరణాగతరక్షణమం దుండెడుదీక్షయు శరణ్యుఁడు శరణాగతుని రక్షించుసమయమున నాశ్రితపరాధీనుఁ డై యుండునని యును, శరణ్యునివిషయమయి యాశ్రితుల కుండెడుప్రేమపారవశ్యమును, ఈశరణాగతి కంగమైనస్వభావములను బ్రతిపాదించుచు వాల్మీకి శరణాగతివైభవమును సవిస్తరముగా వర్ణించియున్నాఁడు.

## ప్రవృత్తిలక్షణము.

"భగవత్ప్రవృత్తివిరోధిస్వప్రవృత్తినివృత్తిః ప్రపత్తిః".

ఈశ్వరునిచేఁ దనరక్షణప్రవృత్తికి విరోధించెడు స్వరక్షణప్రవృత్తిని మానుకొనుట; అనఁగా నీశ్వరునియం దాత్మాత్మీయములను సమర్పించి స్వరక్షణమందు స్వప్రయత్నము మాని సర్వరక్షకుఁ డైనయీశ్వరుఁడే నన్ను రక్షించు నని నమ్మి నిర్భరుఁ డై యుండుట.

పాంచరాత్రసంహితలలో నొకటి యగునహిర్బుధ్న్యసంహితలో నీప్రపత్తిస్వరూప మిట్లు నిరూపింపఁబడెను.

"అహ మస్మ్యపరాధానా మాలయో ఽకించనోఽగతిః
త్వ మే వోపాయభూతో మే భవేతి ప్రార్థనా మతిః.
శరణాగతి రి త్యుక్తా సా దేవేఽస్మిన్ ప్రయుజ్యతామ్."

"సర్వాపరాధములకు నేను నివాసభూతుండను, అకించనుఁడను (ఏమియు లేనివాఁడు), అనన్యగతికుఁడను, నీవే నా కుపాయము కమ్ము."

అని యీశ్వరునిఁ బ్రార్థించుట శరణాగతి యనంబడు. ఇది యీశ్వరునియందుఁ బ్రయోగింపఁబడవలెను.

"అనన్యసాధ్యే స్వాభీష్టే మహావిశ్వాసపూర్వకమ్
త దేకోపాయతా యాచ్ఞా ప్రపత్తి శ్శరణాగతిః"

తనవాంఛిత మితరమైనయేయుపాయములచేతను సిద్ధింపనపుడుమహావిశ్వాసపూర్వకముగా నీశ్వరునే యుపాయముగాఁ గోరుట శరణాగతి యనఁబడు. ఆగ్రంథమందే యీప్రపత్తిమాహాత్మ్య మిట్లు వర్ణింపఁబడినది.

"అనే నైవం ప్రపన్నస్య భగవంతం సనాతనమ్
త స్యానుబంధాః పాప్మాన స్సర్వే నశ్యంతి తత్క్షణాత్
కృతా న్యనేన సర్వాణి తపాంసి తపతాం వర."
"సర్వతీర్థా స్సర్వయజ్ఞా సర్వదానాని తత్ క్షణాత్
కృతా న్యనేన మోక్ష శ్చ తస్య హ స్తే న సంశయః."

"ఈయుపాయముచే భగవంతునిఁబొందినవానియొక్క సకలపాపములు క్షణములో నశించును. తపమొనరించినవారిలో శ్రేష్ఠుఁడా! భగవత్ప్రపన్నుఁడు సకలతపశ్చర్యాఫలమును సర్వతీర్థాటనఫలమును, సర్వయజ్ఞఫలమును బొందుచున్నాఁడు. మోక్షము వానిచేతిలోనిది."

"నిక్షేపాపరపర్యాయో న్యాసః పంచాంగసంయుతః
సన్న్యాస స్త్యాగ ఇత్యుక్త శ్శరణాగతి రిత్యపి."

"ఈప్రపత్తి యైదంగములు కలది నిక్షేపన్యాస సన్న్యాస త్యాగాదిశబ్దములచే వ్యవహరింపఁబడును."

అంగము లెవ్వియన:—

"ఆనుకూల్యస్య సంకల్పః ప్రాతికూల్యస్య వర్జనమ్
రక్షిష్య తీతి విశ్వాసో గో ప్తృత్వవరణం తథా
ఆత్మనిక్షేపకార్పణ్యే షడ్విధా శరణా గతిః."

"భగవంతుని కనుకూలముగా నడుచుట; ఈశ్వరుఁడు తప్పక రక్షించు నని నమ్మియుండుట; రక్షకునిగా నీశ్వరుని వరించుట, ఆత్మసమర్పణము, ఈశ్వరునికిఁ దనదైన్యమును దెలియఁజేయుట."

ఈప్రపత్తికి దేశకాలప్రకారనియమములు, నధికారిఫలనియమములు లేవు. అనఁగా:ఈప్రపత్తిని, కాశీకురుక్షేత్రాదిపుణ్యప్రదేశములలోనే చేయవలయుననియు, నితరదేశములయందుఁ జేయఁగూడదనియును, జ్యోతిష్టోమాదికర్మలకువలె "వసంతే వసంతే జ్యోతిషా యజేత" అన్నటుల వసంతాదికాలములయందే చేయవలయుననియు నన్యకాలములలోఁ జేయఁగూడ దనియు, స్నానాచమనపవిత్రధారణాదినియమములతో నాచరింపవలయు ననియుఁ,దాదృశనియమరహితముగా నాచరింపఁగూడ దనియు, బ్రహ్మక్షత్రియవైశ్యులే దీని కధికారు లనియుఁ, దద్భిన్ను లనధికారులనియు, జేతనుఁ డపేక్షించుఫలములలో నొకానొకఫలమునే యిచ్చు ననియు, నన్యఫలముల నీయ దనియు నియమము లేదు. ఈనియమము లన్నియుఁ గర్మోపాయమునకే యావశ్యకములు.

ఈప్రపత్తికి విషయనియమముమాత్రముకలదు. అనఁగా: జ్ఞానశక్త్యాదిసకలగుణపూర్ణునివిషయముననే ప్రపత్తిని జేయవలెను.కానితద్వ్యతిరిక్తులవిషయమునఁ జేయఁగూడ దనునియమముమాత్రము కలదు. ఈవిషయ మిఁక ముందు వివరింపఁబడును.

శ్రీరామచంద్రుఁడు లంకనుగూర్చి బయలువెడలి దర్భశయన మనుస్థలమున నుండఁగా విభీషణుఁడు రావణునిచేఁ బరిభవము నొందినలుగురుమంత్రులతో స్వామి సన్నిధికి వచ్చి శరణాగతిఁ జేయఁగా సుగ్రీవుఁడు జాంబవంతుఁడు మొదలగువారు శ్రీరామునిసన్నిధిలో "ఈవిభీషణుఁ డీదేశమందు నకాలమందు నిచటి కేతెంచిన వాఁడు గనుక పరిగ్రహింపఁ గూడదు" అని విన్నవింపఁగా హనుమంతుఁడు వారి మాట నొప్పుకొనక శరణాగతికొఱకు స్వామిసన్నిధి కేకాలమందు వచ్చుట తటస్థించునో అదే కాల మనియు, నేదేశమందు వచ్చుట తటస్థించునో అదే దేశమనియు విన్నవించెను. అందుకు శ్రీరామచంద్రుఁడు నంగీకరించెను. కావునఁ బ్రపత్తికి దేశకాలనియమములు లేవు.

ఈయర్థము "శ్రీమన్నారాయణచరణౌ శరణం ప్రపద్యే శ్రీమతే నారాయణాయ నమః" అనుమంత్రరత్నముయొక్క ప్రథమఖండమందలి ప్రథమపద మగు 'శ్రీమత్' అనుదానిలో 'మత్' అనుమతుప్ప్రత్యయమందు స్పష్టముగా నున్నది.

"భూమి నిందా ప్రశంసాసు నిత్యయోగే ఽతిశాయనే" అనుననుశాసన ప్రకారముగా 'మత్' అనుమతుప్ప్రత్యయము శ్రీశ్రియఃపతుల కుండెడునిత్యయోగమునకుఁ బ్రయోజనము, చేతనున కెప్పు డాశ్రయింపవలయు ననురుచి, అద్వేషము, ఆభిముఖ్యము కలిగినచో నప్పు డాశ్రయించుటకవకాశము కలిగియుండుట.

ఈప్రపత్తికిఁ బ్రకారనియమము లే దనెడియంశమును భగవత్ప్రపన్నులయినయందఱియెడలను జూడవచ్చును ఎట్లన: ద్రౌపది ఏకవస్త్రయయియుండఁగా దుష్టుఁ డగుదుశ్శాసనుఁ డామె నీడ్చుకొనిపోయినసమయమందు స్నానమైనను జేయక యపవిత్రావస్థతోనే ప్రపత్తిఁ జేసియుండ లేదా? అర్జునుఁడు భారతయుద్ధారంభమున యుద్ధప్రదేశమందు సేనలు నిండియుండఁగా నామధ్యమున నిలిచి శ్రీకృష్ణునివలనఁ బ్రపత్త్యుపదేశమును విన లేదా? కావునఁ జేతనునకుఁ బ్రపత్తిఁ జేయుటకుద్దేశము పుట్టినసమయమునందుఁ దా నశుద్ధిగా నున్నయెడల శుద్ధిని సంపాదింపవలసినయవసరము లేదు. శుద్ధుఁడుగా నున్నసమయములో నశుద్ధిని సంపాదింపవలసినపని లేదు. ఏస్థితిలో నుండునో ఆస్థితితోనే ప్రపత్తికధికారి యగును.

ఈయంశములో భగవత్ప్రపన్నుఁ డైనయొకవైష్ణవున కొకగురు వుపదేశించినవార్త యనుసంధింపఁ దగియున్నది. అది యేమనఁగా: పాంచరాత్రము మిగుల బాగుగఁ దెలిసినయొకవైష్ణవుఁడు శ్రీరామాయణము నొకపర్యాయము పారాయణ మొనర్చుచుండఁగా శ్రీరాముఁడు సేయుశరణాగతిఘట్టములోఁ బాంచరాత్రమునందుఁ బ్రపత్తి కేవిధమయినియమములు నక్కఱలే దని చెప్పఁబడియున్నయంశమునకు వ్యతిరిక్తముగా శ్రీరాముఁడు సముద్రునిఁగూర్చి చేయుశరణాగతిలోఁ బ్రాఙ్ముఖత్వాదినియమముల నవలంబించినట్లు చెప్పఁబడియున్నందున నితరోపాయములతోఁ బాటు ఈప్రపత్తికిని గొన్నినియమము లున్నవా? లేవా? అని

సంశయితుఁడై యాలోచించుచుండఁగా నంతటఁ గొరణాంతరమున నాగురు వాతఁడున్న గ్రామమునకు వచ్చి యుండెను. అపు డీతఁ డాగురువుతోఁ దనసందేహమును దెలుపఁగా శ్రీరాముఁ డవలంబించిననియమములు ప్రపత్తికొఱకుఁ గావనియును, వారి వర్ణాశ్రమానుగుణముగా వచ్చిన వనియును, ఈనియమములు ప్రపత్తి కావశ్యకము లైనయెడల విభీషణునిశరణాగతియందు నావశ్యకము లయి యుండు ననియు, నట్లు విభీషణునియెడలఁ గనఁబడకపోయినందునఁ బ్రపత్తి కానియమము లావశ్యకములు కావనియు నాతఁడు ప్రత్యుత్తర మొసఁగెను. కాఁబట్టి యీప్రపత్తి నాచరించుటకై యోగ్యుఁ డయోగ్యతను సంపాదించుకొన నక్కఱ లేదు; అయోగ్యుఁడు యోగ్యతను సంపాదించుకొన నక్కఱ లేదు.

క్షత్రియు లైనధర్మరాజాదులు, స్త్రీయైనద్రౌపదియు, దేవరూపమును దాఁచుకొని పక్షిరూపము ధరించి మహాపరాధముఁ జేసినకాకాసురుఁడును, క్రూరసర్పజాతి యై ప్రతికూలుఁ డైనకాళియుఁడు, తిర్యగ్జాతి యయ్యు ననుకూలుఁ డైన సుగ్రీవుఁడు, నిత్యవిభూతి నుండి కైంకర్యార్థ మై స్వామితో నవతరించినయనంతాంశసంభూతుఁ డగులక్ష్మణస్వామియును, మొదలైనవారందఱు జాత్యాదినియమములు లేకుండఁ బ్రపత్తి నవలంబించుటచే నీప్రపత్తి కధికారినియమము లేదను సంశము స్పష్టము.

ధర్మరాజాదులు రాజ్యముకొఱకు, ద్రౌపది వస్త్రముకొఱకు, కాకాసురకాళియులు ప్రాణముకొఱకు, శ్రీరాముఁడు సముద్రతరణముకొఱకు, లక్ష్మణస్వామి రామునితోఁగూడ నరణ్యమునకుఁ బోవుటకుఁ బ్రపత్తిఁ జేయుటచే నీప్రపత్తికి ఫలనియమము లేదు.

జ్ఞానశక్తిసౌఖ్యసౌశీల్యాదికల్యాణగుణపూర్తి యెవ్వనియం దుండునో వాని విషయమయియే ప్రపత్తిఁ జేయవలయును. ఇదియె విషయనియమ మని చెప్పఁబడును. సముద్రుఁడు గుణపూర్తి లేనివాఁ డగుటచేత నేకదా యతనియెడల రాముఁడొనరించినశరణాగతి ఫలింపక వ్యర్థమయ్యెను.

## రామాయణపాత్రశీలవర్ణనము.

### సీత.

ఈమె శ్రీరామాయణకావ్యనాయిక. "కావ్యం రామాయణం కృత్స్నం సీతాయాశ్చరితం మహత్" అనున ట్లీరామాయణమంతయు సీతాచరిత్రవర్ణనపరమే. "శ్రీమద్రామాయణ మపి పరం ప్రాణితి త్వచ్చరిత్రే" అని యభియుక్తోక్తి. ఈమె యయోనిజురాలు. విదేహదేశాధీశ్వరుఁ డగు జనకమహారాజు యజ్ఞభూమిని దున్నించుచుండఁగా నాఁగలిచాలులో దొరకినందున నీమెకు సీత యని పే రిడి పుత్రికగా నభిమానించి పెంచెను. సీత యనఁగా నాగలిచాలు. ("సీతా లాంగలపద్ధతిః" అని యమరసింహుఁడు). హరధనుస్సును విఱిచి రాముఁడీమెను బెండ్లియాడెను. "ప్రియా

తు సీతా రామస్య దారాః పితృకృతా ఇతి" అనునట్లామె రూపౌదార్యాదిగుణము
లట్లుండఁగాఁ 'దండ్రి చేసినపెండ్లి' యని రామునికి సీతయం దత్యంతానురాగము
గలిగెను. సీతయు రామునియం దధికతరప్రేమగలదియయి "ఛాయేవానుగతా
సదా" అని తోడునీడవలె నెడఁబాయక యెల్లప్పు డనువ్రత యై యుండెను. రామ
రూపి యగునారాయణున కీమె నిత్యానపాయిని. నాయకుఁ డైనసర్వేశ్వరుఁ డేయే
యవతారముల నెత్తునో ఆయాయవతారములకు సజాతీయ మైనశరీరమును
ధరించి—

"రాఘవత్వేఽభవత్సీతా రుక్మిణీ కృష్ణజన్మని,
అన్యేషు చావతారేషు విష్ణో రేషాఽనపాయినీ."

అనునట్లాదిదేవుఁ డగునారాయణుఁడు దశరథపుత్రుఁ డై లోకమం దవతరింప
నీమె జనకరాజపుత్రిక యగుసీత యాయెను. ఈశ్వరుఁడు కృష్ణుఁడై యీలోక
మందు జనింపఁ దా రుక్మిణి యై పుట్టెను. ఇట్లే యితరావతారములయందును
శ్రీమహావిష్ణువున కీమె యనపాయిని యై యుండును. సర్వశక్తియు స్వతంత్రుఁడు
నగునీశ్వరుఁడు సంతత మపరాధముల నొనర్చుచేతనులపైఁ గోపించి "క్షిపామ్యజ
స్ర మశుభా నాసురీ ష్వేవ యోనిషు" అన్నట్లు చేతనుల నశుభయోనులయం
దుఁ ద్రోసెద నని శిక్షించుట కుద్యుక్తుఁ డై యుంటఁ జూచి యీమె లోకములో
దుర్వినీతు లగుసుతులను దండింపఁబోవుతండ్రిని నివారించుతల్లివలె నఖిలమాతృత్వ
సంబంధముచేఁ జేతనులపై వాత్సల్యముగలది యయి "దేవా! లోకములో నపరా
ధికానివాఁ డెవ్వఁడు? అపరాధులను క్షమింపనియెడల మీకృపకు విషయ మెద్ది?"
యని యుచితాలాపములచే నీశ్వరుని బోధించి యాతనిమనస్సులోఁ బుట్టినయాగ్ర
హమును నివారించును. లక్ష్మి యిట్లు సేయుటకుఁ బురుషకార మని పేరు.

"మత్ప్రాప్తిం ప్రతి జంతూనాం సంసారే పతతా మథ,
లక్ష్మీః పురుషకారత్వే నిర్దిష్టా పరమర్షిభిః"

"సంసారమందు మునుఁగుచుండెడుచేతనులను నన్నుఁ బొందించుటను లక్ష్మి పురుషకారముఁ
జేయు నని మహర్షులచే నిర్దిష్ట మయినది."

లక్ష్మి పురుషకార మొనర్చుట యనఁగా:—సాపరాధు లయినచేతనులయం
దీశ్వరునికిఁ గలిగినకోపమును మాన్పి యాతఁడు వీరి ననుగ్రహించి స్వీకరించుటకుఁ
దగినప్రయత్నములను సల్పుట యని యర్థము. దీనికే ఘటకత్వ మని నామాంత
రము. చేతనుల కీయుభయులతో సంబంధ ముండుటచే నీశ్వరునిఁ జేతను లాశ్ర
యించునపు డీలక్ష్మి పురుషకార మొనర్చును. ఈమె యీశ్వరునివలెఁ గాఠిన్యమార్ద
వములతోఁ గూడినస్వభావము గలది గాక మాతృత్వప్రయుక్త మైనవాత్సల్యము
గలదిగావునఁ గేవలమృదుస్వభావురాలయి పరులకు సంభవిల్లుకీడునుజూచిసహింపఁ
జాలనిప్రకృతి యగుటచే సాపరాధులుకూడ సంకోచములేనివా రయి వెళ్లి పాద
ములపైఁ బడఁ దగినసౌలభ్యము గలది. పుంస్త్వప్రయుక్త మగుకాఠిన్యమును

వహించి తండ్రి యగుటచే హితపరుఁడై చేతనులదోషములను బదింబదిగా గణించి క్రూరశిక్షల విధించువాఁ డగుటవలన నపరాధులు ముఖముఁ గనఁబఱుచుటకు శక్యముగాని యీశ్వరుని మ్రోల నీమె చేతనులపక్షము నవలంబించి మంచిమాటలఁ జెప్పి యుచితోపాయములచే నాతనికోపమును మఱపించి చేతనులయందు విముఖుఁడైనయాతని నభిముఖునిఁగాఁ జేయుటకుఁ దగినప్రయత్నములం జేయును. ఈ యర్థము కఠవల్ల్యుపనిషత్ప్రతిపాదితమగు ద్వయమంత్రమందుఁ బ్రథమఖండములోఁ జెప్పఁబడినది.

లక్ష్మీశబ్దపర్యాయమగు శ్రీశబ్దమున కాఱువిధముల వ్యుత్పత్తి భగవచ్ఛాస్త్రమందు వ్రాయఁబడియున్నది.

"శ్రుణోతి నిఖిలాన్ దోషాన్ శ్రీణాతిచ గుణై ర్జగత్,
శ్రీయతే చాఖిలై ర్నిత్యం శ్రయతే చ పరం పదమ్.
శ్రయంతీం శ్రయమాణాం చ శృణాతీం శృణ్వతీ మపి"

1. "శ్రీయతే చేతనై రితి శ్రీః 'శ్రీఞ్ సేవాయామ్' "
"చేతనులచే నాశ్రయింపఁబడుచున్నది గావున శ్రీ". ఇది కర్మణివ్యుత్పత్తి.

2. "శ్రయతే భగవంత మితి శ్రీః-"
"ఈమె భగవంతు నాశ్రయించుచున్నది గావున శ్రీ". కర్తరివ్యుత్పత్తి.

3. "శ్రుణో త్యాశ్రితవిజ్ఞాపన మితి శ్రీః". 'శ్రు శ్రవణే'
"ఆశ్రితులు విన్నవించుదానిని వినును గావున శ్రీ". కర్తరివ్యుత్పత్తి.

4. "శ్రావయతి విముఖాన్ హిత మితి శ్రీః."
"ఆశ్రితులను హితము వినునట్లు చేయునది". శ్రుధాతువుకు ణిజర్థమందుఁ బొడమినకర్తరి [వ్యుత్పత్తి.

5. "శ్రుణాతి హిన స్త్యాశ్రితదోషానితి శ్రీః." 'శ్రూ హింసాయామ్'
"ఆశ్రితదోషములను నశింపఁజేయునది".

6. "శ్రీణాతి విస్తారయతి గుణై రాశ్రితా నితి శ్రీః."
"ఆశ్రితులను గుణములచే వృద్ధినొందించునది".

ఈలక్ష్మి పురుషకార మొనర్చునపుడు ముఖ్యముగాఁ గృప, భగవత్పారతంత్ర్యము, భగవదనన్యార్హత్వము ననుమూఁడుగుణము లావశ్యకములు.

కృప యనఁగాఁ బరదుఃఖాసహిష్ణుత. భగవత్పారతంత్ర్య మనఁగా భగవంతునికిఁ బరాధీనులై యుండుట. భగవదనన్యార్హత్వ మనఁగా నీశ్వరవ్యతిరిక్తాన్యవిషయానర్హత్వము. ఈగుణత్రయము పురుషకారమున కెట్లవశ్యాపేక్షితమనఁగా:—1. చేతనులు సంసారమం దనుభవించునానావిధదుఃఖములఁ జూచి సహింపఁజాలక యీశ్వరునితో వీరిని జేర్చుట కుపయోగించుప్రయత్న మొనర్చుటకుఁ గృప యావశ్యకము.

2. స్వతంత్రుఁ డగునీశ్వరుని వశపఱుచుకొనునపుఁ డనువృత్తిచే నాతనివశపఱుచుకొనవలయును కావునఁ బారతంత్ర్య మపేక్షితము.

3. నన్ను విడిచి మఱియొకవిషయమున కర్హత లేనిదయి నాకే యతిశయమును బుట్టించువస్తు వగుటచే మన కార్యమునే కదా యీమె చెప్పుచున్న దని లక్ష్మి చెప్పిన ట్లీశ్వరుఁడు చేయుట కుపయోగించుటచే ననన్యార్హత్వ మావశ్యకము.

ఈసీత మొదట, మధ్యను, అంతమందును రాము నెడఁబాసెను.

నిజకృపాప్రకాశనమే ప్రథమవిశ్లేషమునకుఁ బ్రయోజనము. రావణుఁడు హరించె ననునది యొకమిష. ప్రథమవిశ్లేషమం దీమె తనకృప నెట్లు వెల్లడిచేసె ననఁగా:—ఒకపల్లెటూరిలో నుండుబడియిల్లు శిథిలమయి యెండవానలకు రక్షకము గాక యందుఁ జదువుబాలురకు మిక్కిలిబాధక మయియుండ నింతలో నొకనుకు మారుఁ డైశ్వర్యవత్పుత్రుఁ డందుఁ జేరి వానిమూలముగా నాపాఠశాలామందిరము బాగుపడి బడిపిల్లల కందఱకు సౌఖ్యదాయక మయినటుల, రావణుఁడు బలాత్కారముగా హరించె ననునొకవ్యాజమును గల్పించి తాను స్వయముగా లంకకుఁబోయి యచటఁ బదిమాసములు చెఱలో నుండి యంతకుమున్ను రావణునిచేఁ గారానిబద్ధ లైన దేవతాస్త్రీలచెఱ విడిపించుటచేఁ దనకృపాతిశయమును వెల్లడిచేసెను.

ఇదియకాక త్రిజటాస్వప్నవృత్తాంతములో

"సీతాం తాభి రనార్యాభి ర్దృష్ట్వా సంతర్జితాం తదా, ...
అల మేషా పరిత్రాతుం రాక్షస్యో మహతో భయాత్." (సుందర. 27 స.)

అట్లనేకవిధములఁ దర్జనభర్త్సనాదులచే సీతను బీడించుచున్నయేకాక్షి యేకకర్ణి మొదలగురాక్షసస్త్రీలను జూచి యపుడు నిద్రనుండి లేచినత్రిజట యిట్లనియె. "అనార్యలారా! ఇఁక సీతను బాధింపఁబోకుఁడు. రాక్షసులందఱు నశించునట్లు నీమెభర్త జయముగొన్న ట్లిప్పుడ నేనొకభయంకర మైనకలఁ గంటిని. కావున నీమెను, మంచిమాటలతో బతిమాలుఁడు. మన మీమెకు నమస్కరించినయెడలఁ బ్రసన్నురా లయి రాక్షసస్త్రీలను భయమునుండి రక్షించుటకు సమర్థురాలు." ఇట్లు త్రిజటపల్కినపల్కులు విని రాక్షసస్త్రీలు భయము నొందుచున్న సీత వారినిఁ జూచి "మీ రెంతమాత్రము భయపడవలదు. అట్లు మీ కాపద సంభవించిన యెడల నేను మిమ్ముఁ దప్పక రక్షించెద" నని యభయప్రదాన మొసఁగెను. ఇట్లనుటయేకాక తానుచేసినప్రతిజ్ఞఁ దరువాతఁ దప్పక నెఱవేర్చెను. ఎట్లన: రావణవధానంతరమందు రామవిజయవార్తను దనతోఁ జెప్పుటకు వచ్చినవాయుపుత్త్రుఁడు—

"ఇమా స్తు ఖలు రాక్షస్యో యది త్వ మనుమన్యసే * * *
ఇచ్ఛామి వివిధై ర్ఘోరై ర్హంతు మేతా స్సుదారుణాః." (యుద్ధ. స 116. 31-32)

"చిరకాలమునుండి నిన్ననేకబాధలు పెట్టుచున్నయీరాక్షసస్త్రీలను వధియింప నిశ్చయించితి; అనుజ్ఞ యొసంగితివేని యిప్పుడ చరణజానుజంఘోరుపాణిము

ష్టిదంతనఖప్రహారంబుల నిండఱ నిశ్శేషంబుగా వధించెద చిత్తంబుకొలందియాన తి" మ్మనిన నమ్మహాదేవి యమ్మరున్నందనున కిట్లనియె.

> "ఏవ ముక్తా హనుమతా వైదేహీ జనకాత్మజా * * *
> ... ... ... ... ...
> కుర్వతా మపి పాపాని నైవ కార్య మశోభనమ్" (యుద్ధ. 116. 37-45.)

> సీ. "శ్వసననందనరాజసంశ్రయవశ్యలై ... ... ...
> ఏ. ... ... బట్టివారియందు దండనంబు సముచితంబుగా దని పలికె."
> (గో. యుద్ధ.2919-2921.)

ఈమెభర్త కండుగాథను, కపోతకథను నుపన్యసించి వధించుటకు సన్నద్ధులైనవానరులవలన భయముమాన్పి విభీషణునిఁ జేపట్టి రక్షించెను. ఈమహాశయురాలు హనుమంతునికి ఋక్షగీతము నుపదేశించి తన్ను నానావిధముల బాధించిన రాక్షసస్త్రీలను జంపెద నని యుద్యుక్తుఁడైనయాతనియుద్యమము నివారించి వారిని క్షమించి రక్షించెను. సర్వభూతాభయప్రదానధర్మదీక్షితుఁ డగుశ్రీరామచంద్రుని.కీయమ తగినసహధర్మచారిణి వివాహసమయమందు "ఇయంసీతా మమ సుతా సహధర్మచరీ తవ" అని జనకుఁడు చెప్పినమాట సత్యమాయెను. ఈదంపతులిరువురికిఁ దమవిషయ మయి యపరాధముఁ జేసినవారినిగూడ రక్షించుటయే పరమధర్మము.

మధ్యవిశ్లేషము పారతంత్ర్యప్రదర్శనార్థము. ఎట్లన: రావణవధానంతరము రామునితో నయోధ్యకుఁజని పట్టాభిషిక్తురాలయి సర్వభోగంబుల ననుభవించుచు సుఖంబునఁ గాలంబు గడపుచుండ నింతలో గర్భవతి యైనయామెను జూచి రాముఁడు—

> "అపత్యలాభో వైదేహి ! మమాయం సముపస్థితః,
> కి మిచ్ఛసి సకామా త్వం బ్రూహి సత్యం వరాననే!"

"వైదేహీ! నీ విపుడు దౌహృదలక్షణమును దాల్చియున్నావు. కావున నీమనములో నున్నకోరికను నిజముగాఁ జెప్పుము. నేఁ దీర్చెద" ననవుడు సీత—

> "తపోవనాని పుణ్యాని ద్రష్టు మిచ్ఛామి రాఘవ !
> గంగాతీరనివిష్టాని ఋషీణాం పుణ్యకర్మణామ్."

"గంగాతీరమందునివసించెడుపుణ్యాత్ములగుఋషులయొక్క యాశ్రమములను జూచుటకు నాకుఁ గోరిక కల" దని విన్నవింప నది మిషపెట్టి పదిమాసము లామె తన్ను విడిచి రావణగృహమం దుండుటవలనఁ గలిగినలోకాపవాదమును దొలఁగించుకొనుటకు సంకల్పించి నిజముగా నామెకోరికఁ దీర్చువానివలె లక్ష్మణునిఁ దోడిచ్చి యరణ్యమందు దిగఁబెట్టించెను. కూడి యున్నపు డెట్లో యెడఁబాసియున్నపు డట్లే సర్వకాలములయం దేకరీతిగా భర్తృచిత్తము ననువర్తించునీమె తనపత్నీత్వప్రయుక్త మగుపారతంత్ర్యమును వెల్లడిచేయుటయే నీద్వితీయవిశ్లేషమునకు

ముఖ్యప్రయోజనము. గంగానదీతీరమునకుం బోయినతరువాత లక్ష్మణుఁడు సీతతోఁ దనయన్న కామెవిషయ మయి కలిగినదురభిప్రాయమును మిక్కిలి భీతుఁడై యెట్టకేలకుఁ దెల్పఁగా మిక్కిలి దుఃఖించి సీత మఱఁదితో నిట్లనియె.

"న ఖ త్వద్యైవ సౌమిత్రే ! జీవితం జాహ్నవీజలే,
త్యజేయం రాజవంశ స్తు భర్తు ర్మే పరిహాస్యతే." (ఉ త్తర.)

"లక్ష్మణా! నీవుచెప్పినయీదుర్వార్త విన్నతోడనే నేను గంగలోఁబడి ప్రాణములను ద్యజించుకొనవలసియున్నది. కాని, భర్తృసంబంధి యగుసంతతికి విచ్ఛేదము సంభవించు నని తలఁచి యట్టిసాహసకృత్యమును జేయుట మానితిని. భర్త్రభిమత మైనగర్భము నాయం దుండుటవలనఁ బారతంత్ర్యము నవలంబించి నేను దేహమును ధరించియుండవలయును." ఇట్లు తనవిషయమయి భర్తమనస్సులోఁ గలిగినకాలుష్యమును జింతించి వెంటనే దేహత్యాగమున కుద్యోగించి యప్పనిఁ జేయ నోపక పరతంత్రత వహించి భర్తృచిత్తవృత్తిని రక్షించుకొనుచుఁ దనప్రాణములను ధరించియుండెను. పరులకొఱకు జీవింపవలసియున్నపరతంత్రునికిఁ దనమరణమందుఁగూడఁ దనకు స్వాతంత్ర్యము లేదుగదా ! ఈమె ప్రథమవిశ్లేషమందుఁ బదిమాసములు పడవలసినబాధ లన్నియుఁ బడి—

"పతి ర్హి దైవతం నార్యాః పతి ర్బంధుః పతి ర్గతిః,
ప్రాణై రపి ప్రియం తస్మా ద్భర్తుః కార్యం విశేషతః."

అని తాను నిశ్చయించుకొన్నటుల పతిచిత్తానువిధానమే తనకు విధి యని పారతంత్ర్యబుద్ధిచే ననేకవత్సరము లోర్చినది. కావున నీద్వితీయవిశ్లేషమందుఁ బారతంత్ర్యమును వెల్లడిచేసెను.

"అనన్యా రాఘవే ణాహం భాస్కరేణ ప్రభా యథా,
అనన్యా హి మయా సీతా భాస్కరేణ ప్రభా యథా."

అన్నట్లుభయసమ్మత మైనతనయనన్యార్హతను సర్వసమ్మతముగాఁ బ్రకాశింపఁజేయుటయే తృతీయవిశ్లేషమునకుఁ బ్రయోజనము. ఎట్లన: రాముఁ డశ్వమేధయాగము నొనర్చుకాలములోఁ గుశలవులు వాల్మీకియాజ్ఞచే శ్రీరామాయణము నచ్చటచ్చటఁ బాడుచుఁ దిరుగుచుండ రాముఁ డావార్తవిని యాబాలుర రావించి విద్వత్సభఁ గావించి యాసభలో వారిపాట విని వీరు సీతాపుత్త్రు లని యెఱింగి సీతను దలంచి రేపటిదినమున నాసభకు వచ్చి నేనుబరిశుద్ధురాలనని తిరుగఁ బ్రమాణము చేసినయెడల నేను బరిగ్రహింపఁగలవాఁడనని సీతకు వార్తనంపెను. లోకాపవాదపరిహారార్థమయి యొకప్రమాణము చేయు మని చెప్పఁగా సీత రాముని సన్నిధి కేతెంచి

"సర్వాన్ సమాగతాన్ దృష్ట్వా సీతా కాషాయవాసినీ,
అబ్రవీత్ప్రాంజలి ర్వాక్య మధోదృష్టి రవాఙ్ముఖీ.
యథాఽహం రాఘవా దన్యం మనసాఽపి న చింతయే,

తథా మే మాధవీ! దేవీ! వివరం దాతు మర్హసి.
తథా శపంత్యాం వైదేహ్యాం ప్రాదురాసీ న్మహాద్భుతమ్,
భూతలా దుత్థితం దివ్యం సింహాసన మనుత్తమమ్.
ధ్రియమాణం శిరోభి స్తం నాగై రమితవిక్రమైః,
దివ్యం దివ్యేన వపుషా సర్వరత్నవిభూషితమ్.
తస్మిం స్తు ధరణీ దేవి బాహుభ్యాం గృహ్య మైథిలీమ్,
స్వాగతే నాభినం ద్యైనా మాసనే చోపవేశయత్.
తా మాసనగతాం దృష్ట్వా ప్రవిశ న్తీం రసాతలమ్,
పుష్పవృష్టి రవిచ్ఛిన్నా దివ్యా సీతా మవాకిరత్." (ఉత్తర.)

రామునికంటె నన్యుని నేను మనస్సుచేఁ గూడఁ దలంపనిదాన నయిన యెడల నీభూదేవి నాకు వివరము నిచ్చుఁగాక యని శపథము సేయఁగా నాక్షణంబ యత్యద్భుతముగా భూమిలోనుండి పైకుబికిన రత్నసింహాసనముం దామెను భూదేవి తన రెండుచేతులచే నెత్తి కూర్చుండఁబెట్టుకొని పాతాళములోనికిఁ గొనిపోవ నంతరిక్షమునుండి పుష్పవర్షము కురిసెను. ఇట్లంత్యవియోగమందు సీత తనయనన్యార్హత్వమును బ్రకాశింపఁజేసెను. కావున సీతావతారమం దీమె తనకృప పారతంత్ర్యము ననన్యార్హత్వము నను మూఁడుగుణములను గ్రమముగా లోకములకు వెల్లడిచేయుటకొఱకే భర్తనుండి మూఁడుపర్యాయములు వియోగమును బొందినది. ఇట్లు కానిచో నీశ్వరుని కనపాయిని యయి కర్మవశ్యురాలు కాని యీమెకుఁ గర్మవశ్యులకువలె నీరీతి భర్తృవియోగము సంభవించుటకుం గారణమేమి?

సుందరకాండమున సీత రాక్షసస్త్రీలవలనఁ దాఁ బడుచున్న బాధల నిఁక సహింపఁజాల ననియు, శీఘ్రముగా రాముఁడు వచ్చి రావణుని వధించి నన్నీవిపత్సముద్రమునుండి దరిఁజేర్చు మని రామునితోఁ జెప్పు మనియు నాంజనేయుని యెదుట మొఱ్ఱవెట్ట నాతఁ "డమ్మా! నిన్నీక్షణముననే రామునికడకుఁ గొనిపోయెద నావీఁపుపై నెక్కుము.

"అథవా మోచయిష్యామి త్వా మద్యైవ వరాననే!
అస్మా ద్దుఃఖా దుపారోహ మమ పృష్ఠ మనిందితే!" (సుంద. 37-19)

అని హనుమంతుఁడు పలుకఁగా సీత విని యిట్లనియె.

"తత స్త్వం బలం చైవ విజానామి మహాకపే!
... ... ... ... ... ...
మా మితో గృహ్య గచ్ఛేత తత్తస్య సదృశం భవేత్." (సుంద. 37. 40-62)

"సీ. వనచరోత్తమ! నన్నుఁ గొనిపోవ దక్షుండ * * * *
చ. * * గొనిచనె నేనిఁ గీశకులకుంజర! తత్ప్రతికారమే చనుగా."
(గోపీ. సుంద. 886-896.)

అని యిట్లు సీత హనుమంతునికిఁ బ్రత్యుత్తర మిచ్చెను. తాను సకలబాధలఁ బడుట కైన నొప్పుకొనియెఁగాని భర్తకీర్తిగౌరవములకుఁ దనమూలకముగా

హానివాటిల్లుట దన కెంతమాత్ర మిష్టపడదాయెను లోకములో నేస్త్రీయిట్లు పలుకును? ఎవతె యిట్లు భర్తృయశస్సంపాదనముకొఱకే దృఢనిశ్చయము గలదియగును? ప్రతిస్త్రీయును దాను "ప్రకృతమం దనుభవించుచున్నకష్టములు నివారింపఁబడినఁ జాలును. భర్తృకీర్తిప్రతిష్ఠ లాతర్వాత నాలోచింతము." అని తలంచునుగాని యీరీతి స్వప్రాణాపాయనిర్వ్యపేక్షముగా భర్తృప్రశస్తికొఱకే యాలోచించునాఁడుది లోకమందు మృగ్యురాలు. సీతవంటిమహాపతివ్రతాశిరోమణి కిట్లే యుండును. అత్రిమహామునిభార్య యగునసూయ యీమెపాతివ్రత్యగుణమును మిక్కిలి శ్లాఘించి యంగరాగము మొదలగువస్తువుల నీమెకొసంగెను. ఈమె యిట్టి లోకోత్తర యగుగుణవతి, సుశీల, పతివ్రత, వివేకిని, జ్ఞానవంతురాలు నయినను రామబాణనిహతుఁడైనమారీచుని కపటాక్రందనమును విన్నతోడనే రామునికాపద సంభవించె నని యెంచి యాతనిరక్షణమునకై శీఘ్రముగాఁ బరుగిడ మని లక్ష్మణునిఁ బ్రేరణచేసెను. అప్పు డతఁడు స్త్రీ నొక్కతె నరణ్యమందు విడిచి పెట్టి పోవుట భావ్యము కా దని తలంచి "మేరువు తలక్రిందైనను సముద్రము లింకఁ జొచ్చినను వహ్ని శీతలత్వంబు నొందినను జగదేకవీరుఁ డగుమాయన్న కించుకంతయు నపాయము రాసేరదు నీవు వగవకుండుము. నిన్నొంటి నిట విడనాడి నే నేఁగినచో నునయం దింతకుమున్నే బద్ధవైరులయియున్నరాక్షసులు నిన్ను భక్షించెదరు. నామాట విను" మని వేయివిధముల బోధించినను నామాటలు వినక యాతని—

"సౌమిత్రే! మిత్రరూపేణ భ్రాతు స్త్వ మసి శత్రువత్,
... ... ... ... ... ...
లోభా త్త్వం మత్కృతే నూనం నానుగచ్ఛసి రాఘవమ్." (అర. 45. 5-7)

"సుదుష్ట స్త్వం వనే రామ మేక మేకోఽను పశ్యసి,
... ... ... ... ... ...
తన్న సిద్ధ్యతి సౌమిత్రే! తవ వా భరతస్య వా" (అర. 45. 24-25.)

"ఉ. దోస మటంచు నించకయుఁ దోఁపక రాఘవుఁ డొంటిసేఁగి ...
చ. ... బునఁ బడు టంతె గాక యిది పోలునె? చేకుఱునే కులాధమా!"
(గోపీ. అర. 766-767.)

అని యుచ్చావచపరుషభాషణంబుల మనస్సు నొప్పించెను. జితేంద్రియులలో నగ్రగణ్యుఁడుగా నెన్నఁదగినవాఁడు, వివేకి, సద్గుణాలయుఁడు, సీతారాములను దలిదండ్రులతో సమానముగాఁ జూచుకొనులక్ష్మణుని సీమె యిట్టియవాచ్యపు మాట లనవచ్చునా? లక్ష్మణుని కెన్నఁడైన నిట్టిదురాశయ ముండు నని లోకము నమ్మునా ? ఇట్లు సీత స్త్రీజనస్వభావసులభ మయినతొందరపాటు, అవివేకము, అవిమృశ్యకారిత్వము గనుపఱుచుట తనతోంటియోగ్యత కెంతో వైసాదృశ్యము నాపాదించు నని పాఠకులకుఁ దోఁచక మానదు. ఈమె భర్త్రనువ్రతత్వము లోకమున కుదాహరణభూతము. సకల సుఖోచితురాలయి యెన్నఁడుం గష్ట మన్న

దాని నెఱుంగక యితరజనులకే కాక యంతరిక్షమందు సంచరించెడు సూర్యచంద్రాదిగ్రహములకుఁగూడ నగోచరురా లయి యుండెడుసీత రాముఁ డడవికిఁ బోవునపుడు తన్నుఁగూడ వెంటఁ దీసికొని వెళ్లుమని నిర్బంధించెను. వనవాసము బహుక్లేశ మని చెప్పి వలదని రాముఁ డెన్నివిధముల బోధించినను వినక "నాకు భర్తకంటె నొండుదైవంబు లేదు. కావున నట్టిదైవస్వరూపుండ వయిననీచరణకమలసేవావిశేషంబున విగతకల్మష నై యుభయలోకసుఖంబుల బడసెద, నది యెట్లనినఁ దండ్రిచేత సలిలధారాపూర్వకంబుగా దత్త యైన యువతి యీలోకంబునఁ బతివ్రతాధర్మంబునం బ్రవర్తించెనేనియు నది పరలోకంబునందును నతనికే హితైషిణి యై యుండు నని బ్రాహ్మణముఖనిర్గతం బైన వేదవాక్యంబువలన వినఁబడుచుండ శ్రుతిస్మృతిన్యాయంబులవలన మన కిరువురకు నిత్యసంబంధంబు సిద్ధంబగుచుండ సదాచారసంపన్నను బతివ్రతను స్వకీయ నై నన్నుఁ బురంబుననుండి వనంబునకుఁ దోడ్కొనిపోవుట కేల యనుమతింపవు?. సమానసుఖదుఃఖనగునన్ను నీతోడ వనంబునకుఁ దోడ్కొనిపొమ్ము. దీని కొడంబడ వేని విషాగ్నిజలంబులవలనఁ బ్రాణంబులవిడిచెద"నని నానావిధన్యాయానుసరణంబులగువాక్యంబులఁ బ్రార్థించి యతనిచిత్తంబు ప్రసాదాయత్తంబు గాకున్నం గనుంగొని యద్దేవి ప్రణయాభిమానంబుల నీషత్కోపదీప్తవదన యై వెండియు నిజవల్లభున కిట్లనియె.

"కిం త్వామన్యత వైదేహః పితా మే మిథిలాధిపః ... ...
ఇతి జాన న్పరాం ప్రీతిం గచ్ఛ రామ! మయా సహ." (అయో. 30. 3-8.)

"చ. విను మిథిలాధినాథుఁ డతివిశ్రుతకీర్తి విదేహుఁ డైన ... ...
క. ... జీవునికరణి నొసఁగఁ దలఁచితివి పరులకున్." (గోపీ. అయో. 655-666 )

అని యిట్లు ప్రణయాతిరేకంబున ననేకకఠినోక్తులం బలికి యెట్టకేలకు స్వానుగమనంబునకు నిజనాథు నొడంబఱిచె. రాక్షసులు హనుమంతునిలాంగూలాగ్రమం దుంచినయగ్నిని సీత "శీతో భవ హనూమతః" అని సంకల్పించి తనపాతివ్రత్యమాహాత్మ్యముచేఁ జల్ల నగున ట్లొనర్చె. "దగ్ధో భవ దశానన!" యన్నచో రావణుఁ డట్లు కావలసినదే కాని,

"శరై స్తు సంకులాం కృత్వా లంకాం పరబలార్దనః,
మాం నయే ద్యది కాకుత్స్థ స్త త్తస్య సదృశం భవేత్."

అని తనభర్తకు రావణవధజనితయశస్సు రావలయు నని కోరినది గావున నట్లు చేయలేదు. మీఁదుమిక్కిలి

"మాం చాస్మై ప్రయతో భూత్వా నిర్యాతయితు మర్హసి,
విదిత స్సహి ధర్మజ్ఞ శ్శరణాగత వత్సలః.
తేన మైత్రీ భవతు తే యది జీవితు మిచ్ఛసి."

"నన్ను రామునికర్పింపుము. అపరాధి నైన నే నతనికడకు నెట్లు పోఁగల నని నీకు సంకోచము వలదు. ఆయన ధర్మజ్ఞుఁడు. తనవిషయమయి యపరాధముఁ జేసిన

వాఁడయిన శరణుచొచ్చినచోఁ దప్పక రక్షించు" నని రావణునికిఁ బలువిధముల హితము బోధించెను. మహాపరాధియు వధార్హుఁడు నగు కాకాసురుఁ డీమెమూలముగా రామునిచే రక్షింపఁబడియె.

రాముఁడు.

ఇతఁడు రామాయణకథానాయకుఁడు ఇతఁడు సమర్థుఁడు. అతిశాంతుఁడు. క్షమి. సత్యసంధుఁడు కృతవేది. వృద్ధోపసేవి. లోకమాన్యుఁడు. భార్య కిట్టిభర్త, తల్లిదండ్రుల కిట్టిపుత్త్రుఁడు, సోదరుల కిట్టిసోదరుఁడు, ప్రజల కిట్టిరాజు, సేవకుల కిట్టి సేవ్యుఁడు, యాచకుల కిట్టిదాత, ఆశ్రితుల కిట్టిప్రభువు, జగత్తులో మఱి లేఁడు. ఈతఁ డొక్కఁడే. అయోధ్యానగరవాసులచే నీతనిగుణ మిట్లు వర్ణింపఁబడినది.

"స హి రూపోపపన్న శ్చ వీర్యవా ననసూయకః ... ...
గుణై ర్విరురుచే రామో దీప్త స్సూర్య ఇ వాంశుమాన్." (అయో. 1. 8-33.)

"ఆ. అతఁడు వీర్యవంతుఁ డనసూయకుండు రూ, పోపపన్నుఁ డెన్న నుర్వి నతఁడ..."
"ఆరాముండు కిరణంబులచేతఁ బ్రదీప్తుం డగుసహస్రాంశునిచందంబున నభిరాముండయ్యె."
(గోపీ. అయో. 931.)

"సాంత్వయ న్సర్వభూతాని రామ శ్శుద్ధేన చేతసా,
విద్యా చ గురుశుశ్రూషా శ్రుత్వా ణ్యేతాని రాఘవే." (అయో. 12. 28-30.)
"తే. రాఘవుఁడు శుద్ధబుద్ధిచేఁ బ్రాణికోటి, నెప్పుడు రంజిల్లఁ జేయుచు నిష్టకారు ..."
"న. ఇవి మొదలగుసకలగుణంబు లక్కుమారునందు సన్నివిష్టంబు లై యుండు."
(గోపీ. అయో. 296-298.)

రేపు ప్రాతఃకాలమందు రామునికిఁ బట్టము గట్టెద నని నిశ్చయించి దశరథుఁ డానాఁటిరాత్రి కైకేయికడకుఁ బోయెను. మంథరాదుర్వాక్యప్రచోదితురాలయి యామె పూర్వమందు దశరథుఁడు తనకు వాగ్దత్తముచేసిన వరద్వయము నపు డాతనిస్మృతిపథమునకుఁ దెచ్చి తనకుమారుఁడగు భరతునిఁ బట్టముఁ గట్టవలయు ననియుఁ బదునాలుగేండ్లు రాముఁడు మునివృత్తితో నుండవలయు ననియు నిర్బంధించి దశరథుని మనస్సును శోకసాగరమందు ముంచెను. అపు డచటికి సుమంత్రునిచేఁ దోడ్కొనిరాఁబడినరాముఁ డట్టిదీనస్థితిలో నున్న తండ్రిం జూచి యిదేమని యడిగెను. కైకేయి తనయభిప్రాయమును రామునికిఁ దెలియఁజేయఁగా రాముఁడు

"అహం హి వచనా ద్రాజ్ఞః పతేయ మపి పావకే ... ...
... ... ... ... ...
నియుజ్యమానో విస్రబ్ధః కి న్నకుర్యామ్యహం వయమ్." (అయో. 19. 2-5.)

"తండ్రి, పూజ్యుఁడు, హితుఁడు, నటపై రాజు నగునీదశరథుఁ డాజ్ఞాపించినచోఁ దీక్ష్ణ మగువిషము నైన భక్షించెద నగ్నిలో నుఱికెద సముద్రములోఁ జొచ్చెద. జటావల్కలముల ధరించి రాజునాజ్ఞ శిరసావహించి యీక్షణంబయరణ్య

మునకుఁ జనియెద నాతండ్రికిఁ బ్రియ మైనపనిని దేనినిఁ జేయు నని పలికి మరలఁ గై కేయి కిట్లనియె.

"య దత్ర భవతః కించి చ్ఛక్యం కర్తుం ప్రియం మయా,
వనే వత్స్యామి విజనే వర్షా ణీహ చతుర్దశ." (అయో. 19. 21—23.)

నాప్రాణములఁ బరిత్యజించియైనను నావలన నైనప్రియమును నాతండ్రికిఁ జేయఁగలను. తండ్రి చెప్పినట్లు చేయుటకంటె గొప్పపని యేమున్నది? అతఁడు చెప్పకపోయినను నీయాజ్ఞవలన నైన నే నరణ్యమునకుఁ బోయి పదునాలుగేం డ్లుండువాఁడ నని కైకేయితో దృఢముగాఁ బలికి యామెకు దశరథునికిఁ బ్రదక్షిణ మాచరించి యచ్చోటు విడిచి మాతృభవనమునకు వచ్చుచున్న యా రామునిముఖ మందు లేశము దైన్యముగాని వికారముగాని, కాంతిహీనతగాని, హర్షాభావము గాని కానరాలేదు.

"న చాస్య మహతీం లక్ష్మీం రాజ్యనాశోఽపకర్షతి ... ...
నాలక్షయంతి రామస్య కించి దాకార మాననే." (అయో. 20 32½-36.)

రామునిపట్టాభిషేకమున కిట్లు విఘ్నము వాటిల్లినదని విని లక్ష్మణుఁడు మిక్కిలి కుపితుఁడై.

"మయా పార్శ్వే సధనుషా తవ గుప్తస్య రాఘవ! ... ...
అమిత్రభూతో నిస్సంగం వధ్యతాం బధ్యతా మపి." (అయో. 21. 9-12)

"ధనుష్పాణి నై నిన్నుఁ గాపాడుచు నీప్రక్క నిలిచెద. నీపట్టాభిషేకమున కెవ్వఁడు విఘ్న మాచరించునో నేఁ జూచెద. మన కెవ్వఁ డైన నప్రియమాచరిం చినయెడల నావాఁడియగు బాణములచే నీయయోధ్యను మనుష్యశూన్యముగాఁ జేసెద. కైకేయిచేఁ బ్రేరితుఁ డై నమనతండ్రి మనకుశత్రుభూతుఁడు. దుష్టుఁడు. కావున నతఁడు వధింపఁబడవలయు" నని పలుకఁగా రాముఁడు.—

"తవ లక్ష్మణ! జానామి మయి స్నేహ మనుత్తమమ్ ... ...
ధర్మ మాశ్రయ మా తైక్ష్ణ్యం మద్బుద్ధి రనుగమ్యతామ్." (అయో. 22. 29. 30.)
"మా చ లక్ష్మణ! సంతాపం కార్షీ ర్లక్ష్మ్యా విపర్యయే,
దైవాభిపన్నా హి వద త్యనిష్టం జానాసి దైవం చ తథా ప్రభావమ్" (అయో. 21.39)

"ఓయి లక్ష్మణా! నీపరాక్రమమును నీతేజస్సును నీకు నాయందుండునిరుప మాన మగుస్నేహమును నే నెఱుంగుదు. కాని తల్లికిఁగాని, తండ్రికిఁగాని, బ్రాహ్మ ణునికిఁగాని చేసినప్రతిజ్ఞను ధర్మము నవలంబించియుండఁ గోరువాఁడు వ్యర్థపుచ్చ గూడదు. కావున నేను తండ్రియాజ్ఞ నుల్లంఘింపఁ జాలను కాఁబట్టి నీవు క్షాత్ర ధర్మము నవలంబించిన యీదుష్టబుద్ధిని విడువుము. ధర్మమార్గము నవలంబింపుము. బుద్ధిలోఁ దీక్ష్ణభావ ముంచుకొనవలదు. నామతము ననుసరింపుము. రాజ్యనాశనము గలిగె నని చింతింపకుము. నాకు రాజ్యమైన వనవాసమైన నొక్కటియె. దానిలో వనవాసమే మహోదయము. మనపినతల్లి యగుకైకేయిమూలముగా నీకార్యము

విక్షిప్త మయ్యె నని తలంపకుము. ఈమె దైవప్రేరిత యయి యిట్లు పలికెను. దైవమున కున్నప్రభావము నీ వెఱుంగుదువు." అని లక్ష్మణుని నివారించి తండ్రిని సత్యసంధునిఁగాఁ జేయఁ దలంచి వనవాసోన్ముఖుఁ డై కౌసల్యకడకుఁబోయి నవృత్తాంతం బంతయు నామెకు నెఱింగించి దుఃఖించుచున్నయామెనుదొల్లిపిత్రాజ్ఞచేనకార్యంబుల నైన నాచరించినకొందఱ చరిత్రంబులఁ జెప్పి యోదార్చి యెట్టకేలకు నిజనివాసనంబున కొడంబఱిచె. ఆహా! యిట్టిమహాపురుషుం డెందైనఁ గలఁడా? చేతిలోఁ జిక్కినసర్వసంపత్సమృద్ధ మగురాజ్యమును విడిచి యడవికిఁ బొమ్మని యొకయాఁడుదాని నిర్బంధముచేఁ దండ్రి యాజ్ఞాపింప "ధన్యోస్మి"యని నిర్వికారచిత్తుఁడై నవ్వుమొగముతో నడవికిఁ జనువాఁ డెవఁడు? ఇందువలన సీతనికిఁ దండ్రియాజ్ఞను మన్నించుటయం దుండెడునభినివేశము, ధర్మబుద్ధి, భోగతృష్ణాపరాఙ్ముఖత్వము, రాజ్యనిస్పృహత, మహామనస్కత, విషయవైరాగ్యము మొదలగునాత్మగుణములు ప్రకాశింపఁ జేయఁబడినవి.

చిత్రకూటమందు నివసించియున్నరామునిఁ జూచుటకుఁ జతురంగసైన్యముతో భరతుఁడు వచ్చుచుండఁగా నంతరిక్షముపై కెగసిన సేనాపరాగమును వీక్షించి "భరతుఁడు మనలఁ జంపుటకు యుద్ధసన్నాహముతో నిటకుఁ జనుదెంచుచున్నాఁడు. కావున వీని నవశ్యము నే నిపుడు చంపెద. మనమనుభవించుచున్న కష్టము లన్నియు వీనివలననే గలిగినవి.

"భరతస్య వధే దోషం నాహం పశ్యామి రాఘవ!
పూర్వాపకారీ భరత స్త్యక్తధర్మ శ్చ రాఘవ!
ఏతస్మి న్నిహతే కృత్స్నా మనుశాధి వసుంధరామ్" (అయో. 96. 24-26)

భరతుని వధించినయెడల దోషమేమియు లేదు. ధర్మహీనుఁ డగువీఁడు మనకుఁ బూర్వాపకారి. వీఁడు నాచేఁ జంపఁబడఁగా నీభూరాజ్యము నంతయు నీ వేలుము." అని లక్ష్మణుఁ డమితకోపముతో భరతునియందు ద్రోహబుద్ధి నూహించి సంభ్రమము నొందఁగా రాముఁడతనిని మంచిమాటలతో ననునయించి "లక్ష్మణా! తండ్రిసత్యమును నిలుపరించుటకుఁ బ్రతిజ్ఞఁ జేసి యిపుడిచటికి వచ్చినభరతునిఁ జంపుటచే నపవాదముతోఁ గూడినరాజ్యము నాకేల? బంధునాశము మిత్రనాశము వలన లభించుద్రవ్యమును విషమిశ్రభక్ష్యమునువలె నేనొల్ల."

"ధర్మ మర్థం చ కామం చ పృథివీం చాపి లక్ష్మణ! ... ...
త్వాం మన్యే ద్రష్టు మాయాతః పితా దశరథ స్స్వయమ్," (అయో. 97-5-20.)

"తే. ధర్మ మర్థంబు కామంబు ధరణి సిరియు ... ...
ఆ. .........మజ్జనకుం డైనదశరథుండును జనుదెంచుచున్నవాఁ డని తోఁచుచున్నది."

(గోపీ. అయో. 1842-1858.)

ఇందువలన దూరదృష్టి, శాంతచిత్తత్వము, భ్రాతృవాత్సల్యము, నిష్పక్షపాతము, సహిష్ణుత, మొదలగుసద్గుణములు రామునిచే లోకమునకుఁ జూపఁబడినవి.

రాముని జూచుటకు భరతునితో వచ్చినఋషులలో నొక్కఁ డగుజాబాలి
ఋషి వనవాసముచేయుటయందు రామునికిఁ గలపట్టుదలను జూచి యాతని
ంపవలె ననుబుద్ధితో ని ట్లుపన్యసింపఁ దొడంగె.

"ఓయి రాముఁడా ! ఆర్యబుద్ధివి, మనస్వివి నగునీబుద్ధి ప్రాకృతునిబుద్ధివలె నిరర్థక మయినది
గాఁదు. లోకములో నెవ్వఁడును మఱియొకనికి బంధువు గాఁడు. ఏలయన : ప్రతిమనుజుఁడు
-ఁడే జనించుచున్నాఁడు. ఒక్కఁడే మృతినొందుచున్నాఁడు. కావున వీఁడు నాతండ్రి
ము నిది నాతల్లియనియు నేనరుఁడు వారలయం దాసక్తుఁ డగునో వానికంటె వెఱ్ఱివాఁడు
. ఏమన: ఎవ్వఁడు నెవ్వని కేమియుఁ గాఁడు. గ్రామాంతరమునకుఁ బోవుబాటసారి యొక
టసఁజేసి యామఱునాఁ డాస్థలమును విడిచి స్థలాంతరమునకుఁ జనునట్లు మనుష్యులకుఁగూడఁ
ండ్రి గృహము మొదలగునవి బసలవంటి రని యెంచి ప్రాజ్ఞుఁడు వానియం దాసక్తిని
గూడదు కులక్రమాగత మగురాజ్యమును విడిచి దుఃఖబహుళము కుత్సితమార్గము నగునీవన
ం నంగీకరించుట నీకుఁ దగదు. కావున సకల సంపత్సమృద్ధ మగునయోధ్యానగరమందుఁ
షిక్తుఁడవై సకలభోగముల ననుభవించుచు స్వర్గమం దింద్రునివలె సుఖంబుగ నుండుము. నీకు
ఁ డేమియుఁ గాఁడు నీవు నతని కేమియుఁ గావు. అతఁ డొకఁడు. నీవు మఱియొకఁడవు.
ఁ దండ్రి యల్పకారణము. తల్లి ప్రధానకారణము. దశరథుఁడు పొందవలసినగతిని బొందెను.
నుష్యులప్రవృత్తి. వ్యర్థ మగు పితృపుత్రాదిసంబంధముచే నీవు క్లేశము నొందుచున్నావు.
క్షసౌఖ్యమును విడిచి యప్రత్యక్షమగుధర్మముకొఱకుఁ బాటుపడునీవంటివారిని గుఱించి నేను
ెద. అష్టకాశ్రాద్ధ మనియుఁ, బ్రతిసాంవత్సరికశ్రాద్ధమనియుఁ గల్పించి మనుష్యులు తాము
ఁదగినయన్నమును వ్యర్థముచేయుచున్నారు ఒకఁడు తిన్న యన్నము మఱియొకనిదేహమును
యెడల నూరికిఁబోయినవాని నుద్దేశించి వానియింటిలోనున్నవారు మఱియొకని భుజింపఁ
నాతృప్తి ప్రోషితున కుండవలయును. అట్లు గానరాదు. కావున యజ్ఞము, దానము,
మొదలగువానినిఁ జేయవలయు నని మనుష్యులను వశపఱచుకొనుసాధనములుగా బుద్ధిమంతులు
యున్నారు. పరలోక మనునది లేదు అప్రత్యక్ష మగుపరమును వెనుకఁ బెట్టి ప్రత్యక్ష
జ్యభోగాదికమును బరిగ్రహింపుము."

ఇట్లు పలికిన జాబాలిపలుకులు విని రాముఁ డిట్లనియె.

"ఋషివర్యా ! నాప్రియముకొఱకు నీవు చెప్పినదంతయు నకార్యం బయ్యును గార్యము
నవచ్చుచున్నది. నిర్మర్యాదుఁడు పాపాచారయుతుఁడు నగుపురుషుఁడు సత్పురుషులచే సన్మా
డఁడు. మనుష్యుఁడు సద్వంశజాతుఁడో, దుష్కులప్రసూతుండో, శుచియో, అశుచియో,
ారిత్రమే తెలియఁజేయును. శిష్టసమ్మతుఁడను శీలవంతుఁడను నగు నేను శిష్టగర్హితునివలె
్సాధనం బగు వైదికకర్మంబుఁ బరిత్యజించి లోకసంకరకారణం బగుభవదుక్తాధర్మమార్గము
ంచితినేని దుర్వృత్తుఁడ నగునన్ను సదాచారసంపన్ను లగుశిష్టజనులు దూషింపరా ? విహీ
ఁడ నగునాకు స్వర్గ మెట్లులభించును ? లోకమంతయుఁ గామవృత్తముగలది. రా జెట్టివాఁ
బ్రజలు నట్టివారగుదురు. కావున సనాతనముగా రాజవృత్తము, రాజ్యము, సత్యమూలమయి
కము సత్యమందు స్థాపింపఁబడినది. ఋషులు దేవతలు సత్యమును బహూకరింతురు. లోక
సత్యవాది పరమపదము నొందును. అనృతవాది సర్పమువలె లోకమునకు భయము గలిగించును.

సర్వనియంత యగునీశ్వరుఁడు లక్ష్మి, వేదములు, దానము, తపస్సు, యాగము, హోమము మొదలగునవి సత్యము నాశ్రయించియుండును. ఇదిగాకయొకఁడు లోకమును బాలించును. మఱియొకఁడు కులము నేలును. ఒకఁడు స్వర్గము నొందును. మఱియొకఁడు నరకములోఁ గూలును. అందఱు నొక్కరీతిగా నుందురా? మునీంద్రా! నన్ను మాతండ్రి వనంబునకుం బొమ్మని యాజ్ఞాపించె. నేనును సభలో నాతనియాజ్ఞ మన్నించుటకుఁ బ్రతిజ్ఞ సేసితి. నాతనియాజ్ఞ చొప్పునఁ బదునాలుగేండ్లు వనవాసంబు జరుపువాఁడ. అసత్యసంధుఁ డగువానిం జూచి పితరులు దేవతలు నేవగింతురు. భవదుక్త ధర్మంబు క్షుద్రనృశంసలుబ్ధపాపకర్ములచేత సేవింపఁబడఁదగినది కాని యస్మాదుల కంగీకార్యంబు కాదు. ఏను గురుసన్నిధియందుఁ బదునాలుగువత్సరంబులు వనవాసంబు సలిపెద నని ప్రతిజ్ఞ సేసి వచ్చినపుడు మద్వాక్యంబులు విని కైకేయి సంప్రహృష్టచిత్త యయ్యె. ఇప్పుడు గురువచనోల్లంఘనంబుఁ జేసి భరతునివచనం బెట్లు గావించెద? గురువాక్యప్రకారంబున వనవాసంబు సేయుచు నియతవన్యాహారుండనై, శుచినై పుణ్యంబులైన ఫలమూలంబులచేత దేవతలఁ బితృదేవతలఁ దృప్తినొందించుచు సంతుష్టేంద్రియవర్గుండనై శ్రద్ధధానుండనై కార్యాకార్యవిచక్షణుండనై పితృవచన పరిపాలనరూపం బైనలోకవర్తనంబు ననుసరించి ప్రవర్తించెదను. మఱియుఁ బరోక్షధర్మంబు మిథ్యయని పరిహరించి ప్రత్యక్షధర్మం బంగీకరించినశాస్త్రంబు లప్రమాణంబు లగు. ప్రత్యక్షధర్మం బెల్లవారికిఁ దెల్లం బై యుండుఁగావున నదియె పరమార్థం బయ్యె నేని సర్వజనంబులకు సామాన్యంబు గలుగు. దానంజేసి జ్ఞానాజ్ఞానంబులు లేక వర్ణాశ్రమాచారంబులు విడిచి జనంబు లిచ్ఛాప్రకారంబున వర్తింతు రక్కారణంబున లోకంబంతయు సంకరం బై చెడు. వైదికమార్గనిష్ఠారతుండవు చార్వాకమతానుసారిబుద్ధి ప్రవర్తకుండవు, వీతధర్మమార్గుండవు, నాస్తికుండవైన నీవాక్యం బంగీకరించి జనకునివాక్యం బెత్తెఱంగున నతిక్రమింతు? చోరుం డెట్లు నిరాకరణీయుం డగు నట్లు వేదబాహ్యత్వంబున నప్రసిద్ధుం డైనబుద్ధుండును నిరాకరణీయుం డై యుండు. ఈలోకంబునఁ జార్వాకుని సుగతతుల్యునిఁగా నెఱుంగందగు కావున నతండు బహిష్కరించుటకు యోగ్యుండు. బుధుండగువాఁడు నాస్తికవాదశీలున కాభిముఖ్యం బొసంగం దగదు. నీకంటెఁ బురాతను లగునట్టి జ్ఞానాధికు లయిన జనంబులు శుభకర్మంబు లాచరించి యిహపరలోకంబులు జయించి సంతతంబును గ్రహనక్షత్రాదిరూపంబులం బరిదృశ్యమానులై వర్తింపుచున్నవారు గావున నది ప్రమాణంబుగాఁ గొని విప్రులు మంగళాత్మకం బైన కర్మంబును యజ్ఞదానాదికంబునుం గావించుచున్నవారు. దానగుణప్రధాను లయినవారును, ధర్మరతు లైనవారును, నహింసకు లైనవారును వీతపాపు లై తేజోమయు లై లోకపూజ్యు లై ప్రకాశించుచున్నవారు.''

ఇట్లు జాబాలి ప్రతిపాదించిననాస్తికమతమును ఖండించి రాముఁడు స్వకీయమగువైదికమతమును స్థాపించెను. ఇందువలన నీతనికిఁ గలశాస్త్రప్రామాణ్యబుద్ధియుఁ, బితృవాక్యపరిపాలనమందు-వైదికధర్మాచరణమందు నుండెడుశ్రద్ధయు, నాస్తికమతమందలిహేయబుద్ధియు వెల్లడిచేయఁబడుచున్నవి. ఆహా! తా నొనర్చినప్రతిజ్ఞను బూర్ణముగా నెఱవేర్చుట కెట్టిపట్టుదల గలదో చూడుఁడు. చదువరులారా! ఈమహానుభావునిగుణములు లోకమున కుదాహరణభూతములు గావా?

దండకారణ్యవాసు లగుఋషులకు రాక్షసులవలనిభయము నివారించెద నని రాముఁడు ప్రతిజ్ఞ చేయఁగా నది సీత తెలిసికొని క్రూరకర్ము లగురాక్షసులతో

నిష్కారణవైరము మన కేల యని రామునితో విన్నవింప నాతఁ డామెమాటను లక్ష్యము సేయక సీతతో నిట్లనియె.

"దండకారణ్యవాసు లగుఋషు లందఱు గుంపు గూడి నాయొద్దకు వచ్చి తమకు రాక్షసుల వలనఁ గలుగుబాధలను దొలఁగించు మని నన్ను వేఁడుకొనిరి. నేను వారి కభయ మొసంగితి. నాప్రాణముల నైనఁ గోలుపోయెద. నాప్రాణములకంటె నెక్కుడయైన నిన్నైన లక్ష్మణు నైన విడువఁగలను గాని యొకరికిఁ జేసినప్రతిజ్ఞను విశేషించి బ్రాహ్మణవిషయమయి చేసినప్రతిజ్ఞను విడువఁజాలను నాయందు నీ కుండెడు స్నేహముచే నిట్టు పలికితివి. మిక్కిలి సంతసిల్లితిని."

ఇందువలన సీతని కార్తరక్షణమం దున్నపరాకాష్ఠయు స్వప్రాణవ్యయము నైన నరకుగొనక తాఁ జేసినప్రతిజ్ఞను నిర్వహించుటయం దుండుస్థైర్యముఁ దెలియఁ జేయఁబడుచున్నవి. ఒకకాలమందు సీతారామలక్ష్మణులు పర్ణశాల నొకదానిని నిర్మించుకొని పంచవటియం దుండఁగా హేమంతఋతువు వచ్చెను. అపుడు భరతు నుద్దేశించి లక్ష్మణుఁడు రామునితో నిట్లనియె.

"అస్మిం స్తు పురుషవ్యాఘ్రః కాలే దుఃఖసమన్వితః ... ...
తా మే వేక్ష్వాకునాథస్య భరతస్య కథాం కురు." (అర. 16-27-37.)

"ఉ. మానము రాజ్యభోగములు మాని మహాత్ముఁడు కైకపట్టి ... ...
శా. ... కారామామణి దొష్టయై మెన్నఁదగదో యజ్ఞాత్తవంశోత్తమా!" ...
(గోపీ. అర. 259-260.)

ఇందువలనఁ దనవిషయమయి మహోపకారముఁ జేసినవారి దుర్గుణముల నైన నెన్నుట కీమహాపురుషుని కిష్టము లేదని మన మెఱుంగవలయు. మహాపరాధి యగుకాకాసురునివంటివాఁడు మూఁడు లోకములు దిరిగి యెచ్చటను నెవరివలనను రక్షణము గానక తండ్రిచేఁ బరిత్యక్తుఁడై తిరుగవచ్చి నన్ను రక్షింపు మని పాదములపైఁ బడఁగా "వధార్హ మపి కాకుత్థ్సః కృపయాపర్యపాలయత్" అన్నట్లు వధార్హుఁడైనను రఘురాముఁడు కృపతో వానిని రక్షించెను. శత్రువునియందైనను గుణ మున్నచోఁ జూచి సంతోషించువాఁ డితఁడే. మొట్టమొదట యుద్ధరంగమునకు వచ్చిన యపూర్వదర్శనుఁ డగురావణుని తేజస్సు నాకారమును జూచి—

"అహో! దీప్తో మహాతేజా రావణో రాక్షసేశ్వరః ... ...
దేవదానవవీరాణాం వపు ర్నైవంవిధం భవేత్." (యుద్ధ. 59.)

"చ. కరములచే దురీక్షుఁ డగు ... కోపమును జేయుచు నున్నది వీనిఁ జూచినన్."
(గోపీ. యు. 1075.)

హనుమంతుఁడు సుందరకాండములో రామమూర్తియాత్మగుణసంపదను సీత కిట్లు వర్ణించి చెప్పెను.

"రామః కమలపత్రాక్ష స్సర్వసత్త్వమనోహరః ... ...
ధనుర్వేదే చ వేదేషు వేదాంగేషు చ నిష్ఠితః." (సుంద. 35. 8-14.)

"శా. తల్లీ! రాముఁడు రూపవంతుఁడు ... ... (గోపీ. సుం. 726.)

ఉ. ... వీరుఁడు సాధుజనోపకారియున్." (గోపీ. సుందర. 762-766.)

"దద్యా న్న ప్రతిగృహ్ణీయా న్న బ్రూయా త్కించి దప్రియమ్,
అపి జీవితహేతో ర్వా రామ స్సత్యపరాక్రమః"

"సత్యపరాక్రముఁ డగురాముఁడుప్రాణాత్యయము సంభవించినను బరుల కిచ్చును గానిపరులవలన నెద్దియు స్వీకరింపఁడు. బరులవిషయములో నప్రియముఁ బలుకఁడు."

ఇతనికి శత్రువులు లేరు. ఆశ్రితశత్రువులే యితనికి శత్రువులు.

"తతో రామో మహాతేజా రావణేన కృతవ్రణమ్,
దృష్ట్వా ప్లవగశార్దూలం కోపస్య వశ మేయివాన్."

రావణుఁడు హనుమంతునిఁ గొట్టఁగాఁ జూచి రామునికిఁ గోపము వచ్చెను. రాముఁడు మొదటిమాఱు యుద్ధమునకు వచ్చినరావణునితోఁ గొంతవడి యుద్ధము చేసి, సారథిని, గుఱ్ఱములను, రథమును గొట్టివేసి వానిచేతిలోని ధనుస్సును ఖండించి కిరీటమును నేలఁ గూలనేసి యనేకవిధములఁ జీకాకునొందింపఁగా

"యో వజ్రపాతాశనిసన్నిపాతా న్న చుక్షుభే నాపి చ చాల రాజా,
స రామబాణాభిహతో భృశార్త శ్చచాల చాపం చ ముమోచవీరః."(యు. 111-111.)

"పిడుగులకు వజ్రాయుధప్రహారములకుఁ జలింపనిరావణుఁడురామబాణాభిహతుఁ డై యార్తినొంది వడఁకుచుఁ జేతిలోనిధనుస్సును జారవిడిచెను."

ఇట్లనేకవిధములఁ బరాజయము నొంది కాంతిహీనుఁ డైనసూర్యునివలె నున్న యారావణునిఁ జూచి రాముఁడు దయార్ద్రహృదయుఁ డై

"కృతం త్వయా కర్మ మహా త్సుభీమం హతప్రవీరశ్చ కృత స్త్వయాహమ్,
ఆశ్వాస్య నిర్యాహి రథీ చ ధన్వీ తథా బలం ద్రక్ష్యసి మే రథస్థః."

(యుద్ధ. 59. 140-143.)

"ఓయి రావణుఁడా! నాసైనికులలోఁ బెక్కుమందిని బరిమార్చి ఘోరముగాఁ బోరితివి. అందువలనఁ గొంచె మలసినవానివలెఁ గానవచ్చుచున్నావు. ఇఁక నిన్నుఁ గొట్టరాదు. నీకు సెలవిచ్చితి. ఇఁక నీలంకకుఁ బోయి సేద దేరి క్రొత్తరథ మెక్కి క్రొత్తధనస్సును బట్టుకొని మరల యుద్ధమునకు రమ్ము. అప్పుడు నాబలముఁ జూతువు గాని"

అనిపలికెను. లోకములో నెవ్వరేని శత్రువు చేతిలోఁ జిక్కి నేని వధింపఁ జూతురు గాని యిట్లు రామునివలె శత్రువుయొక్క పరాక్రమమునకు మెచ్చి వానికిఁ గలిగినదైన్యమునకుఁ గనికరించి "నీయింటికిఁ బొమ్ము. చాలయలసితివి. రేపు మరల యుద్ధముసేయవచ్చు"నని యెవరు సెల విచ్చి పంపుదురు? ఈగుణము నొకభక్తుఁ డిట్లు వర్ణించి యున్నాఁడు.

"కోఽయం గుణః కతరకోటిగతః కియా న్వై
కస్య స్తుతేః పద మహో! వద కస్య భూమిః,
య త్త్వాదృశాగస మరిం రఘువీర! వీక్ష్య
విశ్రమ్యతా మితి ముమోచిథ ముగ్ధ మాజౌ."

"స్వామీ యుద్ధమందు మూర్ఛితుఁడై నయట్టిశత్రువును "విశ్రమింపు" మని సెలవిచ్చి విడిచితివి. అహో ! యీనీగుణ మెట్టిది? దీని నెవ్వరు నుతింపఁగలరు? "

ఈ మహాపురుషుని మహోదారత, ఆశ్రితవాత్సల్యము, విమృశ్యకారిత్వము సకలశాస్త్రవైచక్షణ్యము, సనాతనధర్మానువృత్తి, సర్వభూతానుకంప మొదలగు సద్గుణము లన్నియు విభీషణశరణాగతియందుఁ గన్పట్టుచున్నవి. రావణవధానంతరము విభీషణునిచేఁ దనయొద్దకుఁ దీసికొని రాఁబడినసీతను జూచి—

"ప్రాప్తచారిత్రసందేహా మమ ప్రతిముఖే స్థితా,
దీపో నేత్రాతురస్యేవ ప్రతికూలాసి మేదృఢమ్."
(యు. 118. 17-18.)

"పరగృహవాసముచే జనించినచారిత్రసంశయముగలనీవు నేత్రరోగికి దీపమువలె నాకుఁ బ్రతికూలురాల వగుచున్నావు."

అని రాముఁడు కోపముతోఁ బలికెను. ఏలయన: రావణభవనమం దున్న పదిమాసములు సంస్కారహీనురా లయియుండుటచే "మలపంకధరాం దీనామ్" అన్నట్లు సీత మలినవస్త్రముతోను మలినశరీరముతో నుండెను. అట్టియవస్థలో నున్నసీతను జూచుటకు రాముఁడు గోరెను గాని పైకి నలుగురు వినునట్లు—

"దివ్యాంగరాగాం వై దేహీం దివ్యాభరణభూషితామ్,
ఇహ సీతాం శిరస్స్నాతా ముపస్థాపయ మాచిరమ్."
(యు. 117. 7.)

"శిరస్స్నానము చేయించి నగలతో నలంకరించి సీత నిటకు శీఘ్రముగాఁ దోడ్కొనిరమ్ము"

అని విభీషణుని కాజ్ఞాపించెను. విభీషణుఁడు సీతతో భర్త్రభిప్రాయమును దెలుపఁగా నామె రామునిమనసును బాగుగ నెఱింగినదిగావున "అస్నాతా ద్రష్టుమిచ్ఛామి భర్తారం రాక్షసాధిప! " "ఓయి విభీషణా! నీవు స్వామి యభిప్రాయ మెఱుంగవు నీతో నాతఁడు నన్ను స్నానముచేయించి యలంకరించి తీసుకొని రమ్మని చెప్పినమాట సమనస్కముగాఁ జెప్పినది కాదు కావున నీమలినావస్థతోనే భర్తసన్నిధికి వచ్చెదను తీసికొని వెళ్ళు" మని చెప్పినను విభీషణుఁడు స్వామి యాజ్ఞయిచ్చె రని నిర్బంధించి యామె కభ్యంగస్నానము చేయించి తీసికొని వెళ్లెను. కాని మలినావస్థలో నున్న సీతను జూచుట కపేక్షించినరాముని కది కోపకారణ మయ్యెను. రాముఁడు సీతయొక్క పారిశుద్ధ్యము నెఱింగినవాఁడై సను, పరగృహమందుఁ గొంతకాల ముండుటచే నామెచారిత్రమునుగుఱించి లోకులకుఁ గలుగుసంశయమును దీర్చుటకై యామె యగ్నిప్రమాణముఁ జేయునట్లు కొన్ని పరుషోక్తులను బలికెను. అందుపై నామె యగ్నిలోఁ బడి—

"కర్మణా మనసా వాచా యథా నాతిచరా మ్యహమ్,
రాఘవం సర్వధర్మజ్ఞం తథా మాం పాతు పావకః.
యథా మే హృదయం నిత్యం నాపసర్పతి రాఘవాత్,
తథా లోకస్య సాక్షీ మాం సర్వతః పాతు పావకః."
(యు. 120. 24-26 )

అని ప్రమాణముఁ జేయఁగా "విశుద్ధభావాం నిష్పాపాం ప్రతిగృహ్ణీష్వ రాఘవ!" అని లోకులందఱు హర్షించి చెప్పిరి. అపుడు రాముఁడు

"అవశ్యం త్రిషు లోకేషు న సీతా పాప మర్హతి,
దీర్ఘకాలోషితా హీయం రావణాంతఃపురే శుభా.
బాలిశః ఖలు కామాత్మా రామో దశరథాత్మజః,
ఇతి వక్ష్యంతి మాం సంతో జానకీ మవిశోధ్య హి." (యు: 121. 13-14.)

"సీతపాపరహితురాలని నే నెఱుంగుదు. చిరకాలము రావణునియింటనున్న యీమెను నేను బరీక్షింపక స్వీకరించితి నేని లోకులు నన్ను నిందింతురు. అందువలన నీమెచే నిట్లు ప్రమాణముఁ జేయించితి"నని చెప్పి యామెనుబరిగ్రహించెను. తా నెంతపరిశుద్ధుఁ డయ్యును తనపరిశుద్ధివిషయమై శంకించుటకు లోకుల కవకాశము గలుగఁజేయకుండ సత్పురుషుఁడు ప్రవర్తింపవలయు ననునీతిని రాముఁ డిందువలన లోకమునకుఁ గఱపెను. ఇట్లు రామునిసద్వృత్తము నామూలాగ్రముగా విమర్శించినచోఁ బితృమాతృభక్తి, సౌభ్రాత్రము, ఏకపత్నీవ్రతము, సత్యము, ప్రజ్ఞాస్థైర్యము, శ్వానక్రోధత్వము, సర్వభూతదయ, సర్వభూతసమత్వము, ప్రియవాదిత్వము, క్షాంతి, స్వార్థపరిత్యాగపూర్వకపరోపకృతి మొదలగునసంఖ్యాకములగు సద్గుణములు గానవచ్చుచున్నవి. వీని నన్నిటి నామహాపురుషుఁడు లోకమున కుదాహరణముగాఁ జూపెను.

## లక్ష్మణుఁడు.

ఇతఁడు సుమిత్రాపుత్త్రుఁడు, సపత్నీసోదరుఁ డైనను బాల్యమునుండియు రామునియందు నిర్వ్యాజమగుభక్తి, యనురాగము, ప్రేమయుఁ గలవాఁడు.

"బాల్యాత్ప్రభృతి సుస్నిగ్ధో లక్ష్మణో లక్ష్మివర్ధనః, ... ...
లక్ష్మణో లక్ష్మిసంపన్నో బహిఃప్రాణ ఇవాపరః." (బాల. 18. 27-28.)

"మ. ఘనుఁడుర్ స్నిగ్ధుఁడు ... ... ...
... ... రఘీం దగ బహిఃప్రాణంబు చందంబునన్." (గోపీ. బాల. 433.)

అట్లే రాముఁడును బిన్ననాఁటనుండియు లక్ష్మణునియం దత్యంతవాత్సల్యము సోదరప్రీతియుఁ గలవాఁడై విహారశయ్యాసనభోజనాదులయం దొకత్రుటికాల మయిన నతని విరహము సహింపలేనివాఁ డయియుండెను.

"న చ తేన వినా నిద్రాం లభతే పురుషోత్తమః,
త దైనం పృష్ఠతోఽన్వేతి స ధనుః పరిపాలయన్." (బాల. 18. 29-30.)

"కం. సొంపార రామభద్రుఁడు ... ... ...
కం. ... వీరుఁడు లక్ష్మణుఁడు పోవు వెనుకొని ప్రీతిన్." (గోపీ. బాల. 433-434.)

ఇట్లు బాల్యమునుండియు రామలక్ష్మణు లిరువురు నన్యోన్యానురక్తులై యుండిరి. రామునిపట్టాభిషేకము విఘ్నమయినపుడు లక్ష్మణుఁ డత్యంతకోపోద్దీపిత

మానసుఁడై కార్యవిఘ్నకరు లగుకై కేయీదశరథప్రభృతులను జంప నుద్యుక్తుఁడై యుండ రాముఁ డాతనిసంరంభమును మంచిమాటలతోఁ శమింపఁ జేసి యార్యసమ్మత మగుధర్మమార్గము నవలబించు మని బోధించెను. ఇతఁడు రామునియందుఁ బరమభక్తి గలవాఁడైనను, క్షిప్రకారిత్వము, సులభక్రోధము, తొందరపాటును గలవాఁడు. తక్కినవిషయములో రామసదృశుఁడే యనవచ్చును. రాముని బతిమాలి తిరుగ నయోధ్యకుఁ గొనిపోవుటకు భరతుఁడు చిత్రకూటమం దున్నరాముని యొద్దకు సైన్యసమేతుఁడై వచ్చుచుండ లక్ష్మణుఁడు దూరమునుండి పొడవైన చెట్టెక్కి చూచి భరతుఁడు మనమీఁదికి దండెత్తివచ్చుచున్నాఁ డని భ్రమఁజెంది రామునితోఁ జెప్పి యాతనివధించుటకు సన్నద్ధుఁడాయెను. అంత రాముఁడు లక్ష్మణుని తొందరపాటుఁ జూచి "భరతుఁడు మనలను దిరుగ నయోధ్యకుఁ దీసికొనిపోవుటకు వచ్చుచున్నాఁడు. అతనిపై నాయుధ మెత్తఁదలఁచితివా? తండ్రిమాటఁ జెల్లించెదనని ప్రతినవట్టి యిపుడు మనయొద్దకు వచ్చినభరతుని జంపి నన్ను రాజ్యమేలు మని చెప్పెదవా? నేను సంపాదించు ధర్మార్థకామములు రాజ్యము సోదరులయినమీకొఱకుఁగాని నామేలుకొఱకుఁ గాదని నమ్ముము. భరతుఁడు నా కెన్నఁ డహిత మాచరించువాఁడు కాఁడు. మనలఁ జూచుట కిచ్చటికి వచ్చుచున్నాఁడు. నీకు రాజ్యమందుఁ గోరికయున్నదని భరతునితోఁ జెప్పి నీకు రాజ్య మిప్పించెద. నా కతఁడు మాఱాడఁడు." అని పలికి రాముఁడు లక్ష్మణుని వారించెను. అరణ్యమునకుఁ బోవునపుడు లక్ష్మణుఁడు తానుగూడ వెనుక వచ్చుట కనుమతించుమని పలువిధముల వేఁడుకొనెను.

"కురుష్వ మా మనుచరం వైధర్మ్యం నేహ విద్యతే ... ...
అహం సర్వం కరిష్యామి జాగ్రత స్స్వపత శ్చ తే." (అయో. 31. 24-27.)

"ఉ. దేవా! నన్ననుచరునిఁగాఁ బరిగ్రహింపు ... ...
చ. ... ... విహార మొనర్చ కొప్పదే? (గోపీ. అయో 7(5-7(7.)

పంచవటిలో నొకమంచిస్థలము నెంచి చూచి యచట నొకపర్ణశాలఁ గట్టుమని రాముఁడు లక్ష్మణుని కాజ్ఞాపించెను. లక్ష్మణుఁ డామాట విని రాముఁడు తనయందుంచిన స్వాతంత్ర్యమునకు భీతి నొంది

"పరవా నస్మి కాకుత్స్థ! త్వయి వర్షశతం స్థితే,
స్వయం తు రుచిరే దేశే క్రియతా మితి మాం వద." (అర. 15. 7.)

"చ. అన విని లక్ష్మణుండు వినయంబున ... ...
... ... మటంచు వచింపుఁ డెంతయుఁ౯." (గోపీ. అర. 224.)

అని లక్ష్మణుఁ డన్నతో విన్నవింపఁగా రాముఁడు తానే స్వయముగా నన్నియిమ్ములు గలప్రదేశ మొకదాని నిర్దేశించి "యచటఁ బర్ణశాలను నిర్మింపు" మని చెప్పెను. అపుడు సౌమిత్రి శీఘ్రముగా నడవినుండి దారువులు దెచ్చి చక్కనిపర్ణకుటీర మొకటి నిర్మించి యన్నకుఁ జూపెను. అంతఁ దనమనస్సులో నున్నయభిప్రా

యము నూహించి బాగుగఁ బర్ణశాలను రచించినలక్ష్మణునిఁ జూచి రాముఁడు మిక్కిలి సంతోషించి కౌఁగిలించుకొని యిట్లనియె. "లక్ష్మణా! నేను సీతతోఁగూడి రహస్యముందు వర్తించుట కిట్టిస్థల మొకటి నిర్మించుమని చెప్పుటకు లజ్జించి యూరకున్నను నాయభిప్రాయమునుగని పెట్టి యట్టియిట్టి స్థలమునేర్పఱచినాఁడవు. అందుచే భావజ్ఞుఁడవు నాయం దుండెడునత్యాదరముచే మనతండ్రి యగుదశరథుఁడు నాచంద్రతారాబలములు నరసి యెట్లు నాకొకగృహముగట్టించెనో యాప్రకారమేనీవు నిపుడొనర్చితివి. కావున మనతండ్రి పనులు చేయించురీతిని కూడ నెఱింగినవాఁడవు నీవును రాజపుత్రుఁడ వయియున్నను నీవుండుటకుచితమైనస్థలము నేర్పఱచికొనక రామునియిష్టమువచ్చినటుల నేనుండవలయునని తెలిసికొన్నవాఁడవు గావున ధర్మజ్ఞుఁడవు. ఎల్లపుడు మదిష్టసంపాదనమే తననునరకమునుండి దాఁటించునని తలంచుచుండుమనతండ్రి తనకు శక్తియున్నంతవఱకు నాయిష్టమును చేసి తుదకుఁ దనచరమదశయందుఁ బానీయశాలాప్రవర్తకునివలె నిన్నేర్పఱచి యుంచి తాఁ జనియె. కావునమాతండ్రి మృతినొందలేదు. నీవే మాతండ్రివి. మాతండ్రి నీద్వారా నాసర్వాభిలషితములను సంపాదించుచున్నాఁ డని శ్లాఘించెను. సీత కూడ హనుమంతునితో మాట్లాడినపుడు లక్ష్మణు నిట్లని స్తుతించెను.

"నియుక్తో ధురి యస్యాం తు తా ముద్వహతి వీర్యవాన్
యం దృష్ట్వా రాఘవో నైవ వృత్త మార్య మనుస్మరేత్." (సుందర. 39.)

"తే. గీ. రాముఁ డెవ్వానిఁ గార్యభారంబునందుఁ
దగ నియోగించినను దానె దానిఁ దాల్చు
గరిమ నెవ్వానిఁ గాంచి రాఘవుఁ డతీతుఁ
డైనతండ్రిని దలపోయఁ డనుదినంబు"

రావణుఁడు కొనిపోవుచుండఁగా సీతతననగలను మూటకట్టి హనుమత్సుగ్రీవాదులున్న ఋశ్యమూకముపైఁ బడవైచెను. తరువాత రామునితో సఖ్య మొనర్చినసుగ్రీవుఁ డాయాభరణములను రామునికిఁ జూపఁగా రాముఁడు లక్ష్మణునిఁ బిలిచి మీావదినె ధరించునీనగల నానవాలు పట్టఁగలవా యని యడిగినపుడు

"నాహం జానామి కేయూరే నాహం జానామి కుండలే
నూపురే త్వభిజానామి నిత్యం పాదాభివందనాత్."

"గీ. అధిప! యీాకమనీయ ... ...
... ... తెలియంగదు క్షాంత!" (గోపీ. కిష్కి. 209.)

అని ప్రత్యుత్తర మిచ్చెను. ఆహా! లక్ష్మణుఁ డెట్టిజితేంద్రియుఁడు. ఇందువలన లక్ష్మణుఁ డెన్నఁడును గన్నెత్తి సీతమొగము నైనఁ జూచి యెఱుంగఁ డని స్పష్ట మగుచున్నది. ఈలక్ష్మణునియందుఁ బుత్రభావము గలసీతగూడ నీతని నిట్లు శ్లాఘించెను.

"ప్రజాశ్చ సర్వరత్నాని ప్రియాయాశ్చ వరాంగనాః ... ...
మృదు ర్నిత్యం శుచి ర్దక్షః ప్రియో రామస్యలక్ష్మణః." (సుంద. 34. 57-64.)

"సీ. ననుఁ దల్లినట్లు రామునిఁ దండ్రినట్లు సం
భావించి యెవ్వాఁడు భక్తిసలుపు
... • ... దండితారాతిధీరుండు పండితుండు." (గోపి. సుంద.924-926)

"దేశే దేశే కళత్రాణి దేశే దేశే చ బాంధవాః
తం తు దేశం న పశ్యామి యత్ర భ్రాతా సహోదరః" (యుద్ధ. 102-13)

"ప్రతిదేశమందును భార్యలను బంధువులను సంపాదింపవచ్చును గానియెచ్చటను సహోదరుని సంపాదింపఁజాలము." అని లక్ష్మణమూర్ఛలో రాముఁడు చెప్పినమాటనుబట్టి విచారింపఁగా రామునికి సీతకంటె లక్ష్మణుఁడు ప్రియతరుఁ డని తేలుచున్నది. రామునితో నరణ్యమం దున్నపదునాలుగేండ్లు లక్ష్మణుఁ డాహారనిద్రలవర్జించె నని లోకప్రవాద మొకటి గలదు. గాని శ్రీరామాయణమం దట్లు గానరాదు సరేకదా మీఁదు మిక్కిలి లక్ష్మణుఁడు గొట్టితెచ్చిన మృగములు మాంసములను సీత రామునితో లక్ష్మణునికి వడ్డింపఁగా భుజించినట్లు ప్రమాణము గానవచ్చుచున్నది.

"అగ్రే ప్రదాయ భూతేభ్య స్సీతాఽథ వరవర్ణినీ
తయో రుపాదదే భ్రాత్రో ర్మధుమాంసంచ తద్భృశమ్.
తయో స్తుష్టి మ థోత్పాద్య వీరయోః కృతశౌచయోః
విధివ జ్జానకీ పశ్చా చ్చక్రే తత్ప్రాణధారణమ్."
"తత స్తత్ర సుఖాసీనౌ నాతిదూరే నిరీక్ష్యతామ్
న్యగ్రోధే సుకృతాం శయ్యాం లభేతే ధర్మవత్సలౌ." (అయో. 53.)

## భరతుఁడు.

ఇతఁడు రామభక్తాగ్రగణ్యుఁడు. కైకేయీపుత్త్రుఁడు. శాంతి, దాంతి, తితీక్ష, భూతమైత్రి, విషయవైరాగ్యము మొదలగుననేకాత్మగుణములుగలవాఁడు. రామాయణకథాపురుషులలో రామునితరువాత యోగ్యుఁడుగా నెన్నఁదగినవాఁ డితఁడే. రాముఁడు వనవాసమునకుఁ బోయినపు డితఁ డయోధ్యలో లేఁడు. శత్రుఘ్నునితోఁ గలసి మాతామహుఁ డగుకేకయరాజు గృహమునకుఁ బోయియుండెను. కైకేయిదురాలోచనచే రామునిపట్టాభిషేక మాఁగిపోవుట, రాముఁ డడవి కేఁగుట, పుత్త్రవియోగదుఃఖముచే దశరథుఁడు స్వర్గగతుఁ డౌట భరతుఁ డెఱుఁగఁడు. దశరథమరణానంతరము వసిష్ఠునియాజ్ఞచే దూత లశ్వపతియొద్దకుఁ బోయి భరతునిఁ దోడితెచ్చిరి. మార్గమం దనేకావశకునములఁ జూచి స్వజనక్షేమశంకాపర్యాకులుఁడై నిరానంద మై యున్నయయోధ్యను బ్రవేశించి తొలిని బితృదర్శనోత్కంఠచేఁ బితృభవనమునకుఁ జని పితృకాననతుల్య మగుటచ్చోటఁ దండ్రిని గానక తల్లియొద్దకుఁ బోయెను. పితృమరణము, రామవివాసనము మొదలగు వృత్తాంతమునంతయుఁ గైకవలనఁ దెలిసికొని శోకసాగరనిమగ్నుఁ డై మూర్ఛిల్లి యెట్టకేలకుఁ దెలివిఁ దెచ్చుకొని తల్లి నిట్లు నిందింపసాగెను.

"కిన్ను కార్యం హతస్యేహ మమ రాజ్యేన శోచతః
... ... ... ... ...
సుఖం పరిహృతం మోహాత్త్యక్తేఽస్మి కులపాంసని!" (అయో. 73. 12-15)

"ఆ. అకట! తండ్రిచేత నలతండ్రి కెనయైన
... ... ... ... ...
తే. ... ... ఫణిని జేనంటి యజ్ఞుఁడు పడిన పగిది."
(గోపీ. అయో. 1495-1499.)

అంత శత్రుఘ్నుఁడు తీవ్రకోపావిష్టుఁడై

"స చ రోషేణ తామ్రాక్షః శత్రుఘ్నః శత్రుతాపనః
... ... ... ...
త్వాం చ మాం చ హి ధర్మాత్మా నాభిభాషిష్యతే ధ్రువమ్." (అయో. స. 78)

"జుట్టుఁ బట్టుకొని లాగి మంథరను నేలపైఁ బడఁద్రోచి చంపుట కుద్యుక్తుఁ డయ్యె కైకేయినిగూడ దుఃఖకరములగు పరుషభాషణములచే నిందించి కొట్టుట కుద్యోగించుచుండ నామె భయపడి కుమారునిమఱుఁగుఁ జొరఁగా స్త్రీలను జంపఁగూడదని చెప్పి భరతుఁడు కుపితుఁడైన శత్రుఘ్నుని నివారించి యిట్లనియె. "ఓయిశత్రుఘ్నుఁడా! దుష్టురా లగునీకైకేయిని నేనే చంపఁ దలంచితిని గాని పరమధార్మికుఁ డగురాముఁడు నేను మాతృహత్యఁ జేసితి నని తెలిసికొని నాముఖముఁ జూడఁ డని యాపనినుండి విరమించితి. ఈమంథరనైన మనము చంపినయెడల రాముఁ డిఁక మనతో సంభాషింపఁడు. కావున నూరకుండుము" ఇందువలన భరతునికి రామునియం దున్నపరమభక్తి స్పష్టమగుచున్నది.

అపుడు భరతునికంఠధ్వని విని కౌసల్య భరతునియొద్దకు వచ్చి మిక్కిలి దుఃఖముతో

"ఇదం తే రాజ్యకామస్య రాజ్యం ప్రాప్తమకంటకమ్
... ... ... ... ...
హస్త్యశ్వరథసంపూర్ణం రాజ్యం నిర్యాతితం తయా." (అయో. 75. 11-16)

"క్రూరకర్మురా లగునీతల్లి నీకొఱకు ధనధాన్యసమృద్ధము నిష్కంటకము నగు రాజ్యమును సంపాదించినది. శీఘ్రముగా దాని నంగీకరింపు" మని పుండులో సూదిఁ బెట్టి పొడిచిన ట్లిదివఱకే యతిదుఃఖితుఁడై యున్న భరతునిమనస్సు నొచ్చునటుల నిష్ఠురోక్తులఁ బలికెను. అంత భరతుఁ డామెపాదములపైఁ బడి దుఃఖావేగవివశుఁడై మూర్ఛ నొంది కొంతవడికి లబ్ధసంజ్ఞుఁడై

"ఆర్యే! కస్మా దజానంతం గర్హసే మా మకిల్బిషమ్
... ... ... ... ...
తస్య పాపేన యుజ్యేత యస్యార్యోఽనుమతే గతః." (అయో. 75. 20-60.)

"అమ్మా! ఏపాప మెఱుఁగనినన్నెందుకు నిందించెదవు? నాకు రామునియం దున్నస్థిరప్రీతిని నీవెఱుఁగవా? రాముఁ డడవికిఁ బోవుట నాకిష్టమైనయెడలఁ బాయసమును, మాంసముఁ, గృసరము నిర్నిమిత్తముగ భక్షించినవానిపాపమునఁ బోయెద. గోవులను బాదముతోఁ దన్నినవానిపాపము, గురువులను నిందించినవానిపాపము, మిత్రద్రోహముఁ జేసినవానిపాపము, రాజును, స్త్రీని, బాలుని, వృద్ధునిఁ, జంపినవానిపాపము, నాకుఁ గలుగును గాక......" యని యనేకవిధముల ననేకశపథములఁ జేసి పాదములపైఁ బడి విలపించుచున్న భరతు నెత్తి కౌఁగిలించుకొని "వత్స! సత్యప్రతిజ్ఞో మే సతాం లోక మవాప్స్యసి" "నాయనా! నీవు సత్యప్రతిజ్ఞుఁడవు. నేనెఱుఁగుదు. సత్పురుషులలోకమును బొందఁగల" వని కౌసల్య భరతు నోదార్చెను. అపుడు వసిష్ఠచోదితుఁ డై భరతుఁడు దశరథుని కౌర్ధ్వదైహికక్రియల నాచరించి మంత్రులు బోధించినను బట్టాభిషేకమున కియ్యకొనక రామునిఁ దిరుగ సాకేతపురికిఁ దీసికొనివచ్చెద నని పరివారసహితుఁ డై చిత్రకూటమునకుఁ బోయెను. మార్గమధ్యమునందు సీతారామలక్ష్మణులు బసదిగినవసతివృక్షములను స్థలములను జూచుచు నిచట రాముఁడు శయనించె నిచట లక్ష్మణుఁడు భుజించె నిచట సీత నిద్రించె నని యాయాచిహ్నములఁబట్టి యూహించి యేడ్చుచుఁ బోయెను. త్రోవలో భరద్వాజముని యీభరతునిఁ జూచి

"కచ్చిన్న తస్యాపాపస్య పాపం కర్తు మిహేచ్ఛసి
అకంటకం భోక్తుమనా రాజ్యం తస్యానుజస్య చ." (అయో. 90. 13.)

నిష్కంటక మయినరాజ్యము ననుభవింపఁ దలంచి నిష్పాపుఁ డైనరామునియందు ద్రోహ మాచరింపఁ బూనితివా యని యడిగెను. అందుకు భరతుఁడు మిక్కిలిదుఃఖితుఁ డై

"హతోఽస్మి యది మా మేవం భగవా నపి మన్యతే
మత్తో న దోష మాశంకే నైవం మా మనుశాస్తిహి." (అయో. 90. 15.)

"అతీతానాగతముల నెఱిఁగినతమరుకూడనిట్లానతియ్యఁగా నిదివఱకేరామవివాసనజనితాపయశస్సంతాపములచే హతుఁడ నైననేను మఱింతహతుఁడ నైతి. నాయందు లేశమును దోషము లేదు. తిరుగ నయోధ్యకు విచ్చేయు మని రామునిఁ బ్రార్థించుటకుఁ బోవుచున్నా" నని పలికెను. అంత భరతుఁడు రాముఁ డున్నచిత్రకూటమునకుం బోయి పితృమరణవార్త నెఱింగించి రాజ్య మనాథ మై యున్నది. గావున నయోధ్యకు వచ్చి పట్టాభిషిక్తుఁడవు కమ్మని వేయివిధములఁ బ్రార్థించి

"ఇహ మే స్థండిలే శీఘ్రం కుశా నాస్తర సారథే!
... ... ... ... ... ...
శేష్యే పురస్తా చ్ఛాలాయా యావ న్న ప్రతియాస్యతి." (అయో. సం. 99.)

రామునికిఁ దనయందు దయవచ్చువఱకు గోమయానులిప్తప్రదేశమందు

దర్భలు పఱుచుకొని ప్రాయోపవిష్టుఁడై పడియుండుటకు నిశ్చయించెను. రాముఁ డతనియుద్యమమును వారించి

"కులీన స్సత్త్వసంపన్న స్తేజస్వీ చరితవ్రతః

... ... ... ... ... ...

వ్యాదిశ్య చ మహాతేజా వనం దశరథో గతః" (అయో. 104. 16-24.)

"మ. అనఘాత్మా! చరితవ్రతుండు నిజవంశాచారసంరక్షణుం

... ... ... ... ... ...

సీ తే. ... ... ... ... ...

మనుభవింపుము తగ సందియంబు వదలి." (గోపీ. అయో. 1988-1993.)

అని ధర్మాధర్మప్రదర్శన పూర్వకముగా బోధించి

"లక్ష్మీ శ్చంద్రా దపేయాద్వా హిమవాన్ వా హిమం త్యజేత్

... ... ... ... ... ...

న త్వ న్మనసి కర్తవ్యం వర్తితవ్యంచ మాతృవత్." (అయో. 112. 18-19)

"క. కమలారి కాంతివీడిన, హిమవంతుం డాత్మనిష్ఠ హిమము విడిచినన్
గమలనిధి వేల దాఁటినఁ, గ్రమమునఁ బితృశాసనంబుఁ గడతునె యనఘా!
క. అనఘవిచారక! కామం, బున నైనను రాజ్యలోభమున నైన భవ
జ్జనయిత్రి నీకుఁ గానిది' కనికని కావించె నింకఁ గడఁకఁగ నగునే.?"

(గోపీ. అయో. 2139-2140)

అని దృఢప్రతిజ్ఞుఁడై యున్నరామునిఁ జూచి భరతుఁ డిట్లనియె.

"అధిరో హార్యపాదాభ్యాం పాదుకే హేమభూషితే

... ... ... ... ... ...

నద్రక్ష్యామి యది త్వాం తు ప్రవేక్ష్యామి హుతాశనమ్." (అయో. 112. 21-25.)

"సీ. తరణివంశోత్తమ! ధర్మసంహిత మైన ... ... ...

సీ. ... ... ... ... ...

చంద్రసూర్యాగ్ను లొక్కట సాక్షిగాఁగ" (గోపీ. అయో. 2142-2143.)

అని పలికి స్వలంకృతం బైన రామపాదుకాద్వయంబుఁ బ్రతిగ్రహించి నిజ శీర్షంబున నిడికొని రథారూఢుఁడై నిజపరివారంబుతో నయోధ్యకుం జనియె.

ఇట్లు భరతుఁడు పదునాలుగేండ్లును రామవియోగానలదందహ్యమాన స్వాంతుం డై శరీరసౌఖ్యము నపేక్షింపక రామునివలె జటావల్కలములు ధరించి వన్యఫలమూలమాత్రనిర్వర్తితదేహయాత్రుఁడై తల్లివలనఁ దనకుఁ గలిగినదుర్యశమును గుఱించి యనవరతము దుఃఖించుచు లోకమునకుఁ దనముఖమును జూప లేక లజ్జితుఁడై

"అత్యంతసుఖసంవృద్ధ స్సుకుమార స్సుఖోచితః
కథం న్వపరరాత్రేషు సరయూ మవగాహతే"

అన్నట్లు పగ లైనచో లోకులు దన్నుఁజూచి "వీనివలననే రాజకుటుంబమున కిట్టియనర్థము సంభవించె" నని నిందింతు రని భయపడి మధ్యరాత్రములయందు సరయూనదికిఁ బోయి స్నానమాడెడువాఁడై కాలముఁ గడపెను. ఇతఁడు రాముఁడు లేనిపదునాలుగేండ్లు నయోధ్యఁ బ్రవేశింప నొల్లక నందిగ్రామమునుండి రాజ్యముచేసెను గ్రామమం దున్న యితనికంటె నరణ్యమం దున్న రాముఁడే నూఱింతలు సుఖవంతుఁ డై యుండె నని చెప్పవచ్చును ఇతఁడో యనవరతవ్రతకర్శితుఁ డై దుఃఖసంతప్తుఁ డై యుండె. రామునికి లక్ష్మణునియందుకంటె నితనియం దధికతరప్రీతి గలదు. రాముఁడు తిరుగ నయోధ్య కేతెంచినపుడు భరతుఁడు—

"పాదుకే తే తు రామస్య గృహీత్వా భరత స్స్వయమ్

... ... ... ...

అవేక్షతాం భవాన్ కోశం కోష్ఠాగారం పురం బలమ్" (యుద్ధ. 130. 52-55.)

"చ. భరతుఁడు హేమరత్నమయపాదుక లెంతయు ... ...

ఉ. ... ... గోష్ఠకో

శాదిక మంతయున్ దశగుణాధిక మై యలరారెఁ జూడుమా!"

అని సవినయంబుగా రామునితో విన్నవించి

"పూజితా మామికా మాతా దత్తం రాజ్య మిదం మమ

... ... ... ...

నాన్వేతు ముత్సహే రామ! తవ మార్గ మరిందమ!" (యుద్ధ 131. 2-5.)

"సీ. రఘుకులోత్తమ! నీవు రాజ్యంబు విడనాడి ... ...

... ... ... ... ...

ననుసరింపఁ జాల నధిప! యేను." (గోపీ. యుద్ధ. 3232-3234.)

ఇట్లు ప్రార్థించి రాజ్యము నాతనికిఁ బ్రత్యర్పణముఁ జేసె.

పట్టాభిషేకానంతరము రాముఁడు యౌవరాజ్యము నంగీకరింపు మని లక్ష్మణుని బతిమాలిన నతఁ డిష్టపడకపోవుటచేత భరతుని యౌవరాజ్యమం దభిషిక్తునిఁ జేసె.

"సర్వాత్మనా పర్యనునీయమానో యదా న సౌమిత్రి రుపైతి యోగమ్
నియుజ్యమానోఽపి చ యౌవరాజ్యే తతోఽభ్యషించ ద్భరతం మహాత్మా"
(యుద్ధ. 131-95.)

"ఉ. నావిని లక్ష్మణుండు నరనాథునిఁ గన్గొని భక్తి నిట్లనున్

... ... ... ... ...

వావిరిఁ గోర నద్దియు భవత్పరిచర్యయుఁ దక్క నెంతయున్" (యుద్ధ. 3344.)

ఈరీతిగా భరతుఁడు భువనేద్యగుణుఁడు. కాళిదాసుఁడు భరతునిగుఱించి రఘువంశములో నీపగిది వ్రాసెను.

"లంకేశ్వరప్రణతిభంగదృఢవ్రతం త
ద్వంద్యం యుగం చరణయో ర్జనకాత్మజాయాః
జ్యేష్ఠానువృత్తిజటిలం చ శిరోఽస్య సాధో
రన్యోన్యపావన మభూ దుభయం సమేత్య." (రఘు. స. 13. 78)

"మ. దశకంఠప్రణతిప్రయోగవితతిధ్వంసైకబద్ధవ్రతం
బశుభోచ్ఛేదక మైనయయ్యవనిజాపాదద్వయంబున్ మహాగ్ర్యంబునా
ప్రశమస్వాంతుని కైకయీసుతుజటాబద్ధోత్తమాంగంబునన్
భృశసంయుక్తము లై పరస్పరగతిన్ బెంచెన్ బవిత్రస్థితిన్."

## శత్రుఘ్నుఁడు.

లక్ష్మణుఁడు రామానువర్తనపరుఁ డైనట్లు శత్రుఘ్నుఁడు భరతానువర్తనపరుఁడు. లక్ష్మణుఁడు భగవచ్ఛేషభూతుఁడు. శత్రుఘ్నుఁడు భగవచ్ఛేషత్వమునకుఁ బరమావధి యగు భాగవతశేషత్వము గలవాఁడు.

"గచ్ఛతా మాతులకులం భరతేన తదాఽనఘః
శత్రుఘ్నో నిత్యశత్రుఘ్నో నీతః ప్రీతిపురస్కృతః." (అయో. 1. 1.)

ఇచట "గచ్ఛతా" అనువర్తమానకాలమును దెలియఁజేయుశతృప్రత్యయముచే భరతునితో నేకకాలమునందే శత్రుఘ్నుఁడు పోవుచున్నాఁడు. కావున ననివసనాదులవలె భరతునికి శత్రుఘ్నుఁడుగూడఁ బరతంత్రుఁడని తెలియఁబడుచున్నది.

"మాతులకులం" ఇచట ద్వితీయచే భరతోద్దేశ్యమే శత్రుఘ్నోద్దేశ్య మని యెఱుంగునది.

"భరతేన". రామలక్ష్మణులు వనమున కరుగ దశరథుఁడు స్వర్గమునొందఁగాఁ గేవలరామాజ్ఞచే రాజ్యభారమును నిర్వహించుటవలన భరతుఁ డని పేరొదవె.

"తదా"="భరతగమనకాలమందు" ఇందువలన శత్రుఘ్నుని కనుకూలమయిన చంద్రతారాబలాదులతోఁగూడిన ముహూర్తము నపేక్షింపకపోవుటచే నత్యంతపారతంత్ర్యము ద్యోతిత మయినది.

"అనఘః"="అఘము లేనివాఁడు." ఇచట నఘమనఁగా రామభక్తి. తనకు శేషియగుభరతునికి రామభక్తి యిష్టముగావునఁ దనకు రామభక్తి రుచించినది. అట్లు గానిచో రుచింప దనుట. అనిష్టమును గలుగఁజేయునది పాప మనఁబడును గావునఁ దనకు శేషియగుభరతుని కుద్దేశ్యము గానియపుడు రామభక్తి తనకనిష్టావహ మగుటచే నఘమని చెప్పఁబడుచున్నది. "సుకృతదుష్కృతే విధూనుతే— అస్య సర్వే పాప్మానః ప్రదూయంతే—శుభే విద్వాన్పుణ్యపాపే విధూయ" ఇత్యాది శ్రుతులయందు ముముక్షువుకుఁ బుణ్యమువలెఁ బాపమును ననిష్టావహముగావునఁ బాపశబ్దవ్యవహారము.

"శత్రుఘ్నః". ఇతఁ డిఁకముందు లవణాఖ్యసురులను జంపు నని వసిష్ఠునిచే నుంచఁబడినపేరు గలవాఁడు.

"నిత్యశత్రుఘ్నః" శరీరమందుండి యెల్లపుడు విషయాంతరప్రావణ్యమును గలిగించునవి యగుటచే శత్రువు లగుజ్ఞానేంద్రియములయుద్రేకము నణఁచువాఁడు. ఇంద్రియనిగ్రహము గలవాఁడు.

"నీతః" "తీసుకొనివెళ్లఁబడెను" గాని స్వయముగాఁ బోలేదు. ఇందువలన నచిత్తువంటిపారతంత్ర్యము గలవాఁ డనుట.

"ప్రీతిపురస్కృతః" విధిప్రేరితుఁ డై వెళ్లలేదు, ప్రీతిప్రేరితుఁ డై వెళ్లెను. ఇందువలనఁ జిదాశ్రయవృత్తి ప్రతిపాదింపఁబడినది. ఇందువలన సారగ్రాహి యగు పురుషుఁడు శత్రుఘ్నునివలె భాగవతపరతంత్రుఁ డై యుండవలె నని వ్యక్త మగుచున్నది.—

## —దశరథుఁడు.—

ఇతఁడు రామునితండ్రి. పరమధార్మికుఁడు. సత్యసంధుఁడు. ఇక్ష్వాకువంశపు రాజులలోఁ బ్రసిద్ధికెక్కినవాఁడు. అనేకాశ్వమేధముల నొనర్చినవాఁడు. తనపూర్వులు పాలించినరీతిగా న్యాయముతోఁ బ్రజలఁ బాలించి తానకు విశ్రాంతినొందఁగోరి జ్యేష్ఠపుత్త్రుఁ డైనరాముని రాజ్యమునకు రాజుగాఁ జేయం దలంచి యొకనాఁడు పౌరుల రావించి వారితోఁ దనయభిప్రాయము నిట్లు తెలియఁ జేసెను.

"మయా ప్యాచరితం పూర్వైః పంథాన మనుగచ్ఛతా

... ... ... ... ...

సోఽహం విశ్రాంతి మిచ్ఛామి పుత్త్రం కృత్వా ప్రజాహితే" (అయో. స. 2.)

తే-గీ. అట్టి యిక్ష్వాకుకులమునఁ బుట్టినట్టి,

... ... ... ... ...

తే-గీ. ... ... ... ...

సకలజనములు చూడంగఁ జరితమయ్యె." (గోపీ. అయో. 51-53 )

దశరథుఁడు ప్రజలతో నీరీతి నాలోచించి రామునికిఁ బట్టముఁ గట్టుటకు నిశ్చయించెను. ఇంతలో మంథరాప్రేరితురా లగుకైకేయి పూర్వమీతఁడుతనకుఁ జేసినవరదానప్రతిజ్ఞ నిపుడు నిర్వహింపవలయునని నిర్బంధింపఁగా ననృతవాదమున కోడి సత్యమును నిలువఁబెట్టికొనువాఁ డై సకలకల్యాణగుణాకరుఁ డగురాముని వనమునకుఁ బంపి తద్వియోగార్తిచేఁ బ్రాణముల విడిచెను. గాని తా నన్నమాట నుండి తిరుగఁజాలకపోయెను. కామాతురుఁ డగుటచేఁ గ్రూరహృదయురా లగుకైకేయికి లోఁబడి యట్టికుమారు నడవి కంపినయవివేకి యని లోకు లీతనినిందింతురు; గాని మన మీతనిసత్యవ్రతపరిపాలనమునకు మెచ్చుకొనక తీరదు.

## —కౌసల్య.—

ఈమె సప్తలోకైకవీరుఁ డగురాముని గన్నతల్లి. "కౌసల్యా లోకభర్తారం సుషువే యం మనస్వినీ" అన్నట్లు సాధారణముగా లోకములోఁ దల్లులు తమకు

భావికాలమున వీరు పెద్దపెరిగి ప్రాజ్ఞులై సకలవిధముల సంరక్షణఁ జేయుదు రను ప్రత్యాశతోఁ దనయులఁ బడయుదురు. కౌసల్య యట్లు గాదు. స్వార్థపరత నొకమూలకుఁ ద్రోసి సర్వలోకరక్షణార్థ మయి రాముని గనెనఁట! ఈమె దశరథుని పట్టమహిషి. మహాపతివ్రత. భర్తృసేవాపరాయణురాలు. దశరథునికి సమ్మానపాత్రురాలు. కైకేయి రాము నడవికిఁ బంపుమని ప్రేరణచేయునపుడు దశరథుఁడు పలికిన పలుకులు కౌసల్యపై నతని కున్నగౌరవాభిమానములం దెలుపుచున్నవి.

"కిం మాం వక్ష్యతి కౌసల్యా రాఘవే వన మాస్థితే

... ... ... ... ...

అపథ్యవ్యంజనోపేతం భుక్త మన్న మి వాతురమ్." (అయో. 12. $61\frac{1}{2}$-$70\frac{1}{2}$).

"సీ. అనిశముఁ బ్రియపుత్త్రయును ... ... ...

గీ. ... ...నపథ్యభోజ

నంబు విషరోగినింబలె నాతినేఁడు." (గోపీ అయో. 322.)

రామునిపట్టాభిషేకము నిర్విఘ్నముగా జరుగుటకు నాతని మాంగల్యము వృద్ధినొందుటకు ననేకవ్రతములు నోములు పుణ్యకర్మములు సలుపుచు నాతని యభ్యుదయాభివృద్ధిఁగోఅకు నిరీక్షించుచున్న యీమెతో "అమ్మా! యీరాజ్యమును మాతండ్రి కైకేయిప్రార్థనచే భరతుని కీయ నిశ్చయించి న న్నరణ్యమునకుఁ బోవ నాజ్ఞాపించెఁ గావున నే నరణ్యంబునకుఁ బోయివచ్చెద సెలవిచ్చిపంపు" మని రాముఁడు పలుకఁగా నీమె—

"సా నికృత్తేవ సాలస్య యష్టిః పరశునా వనే

పపాత సహసా దేవీ దేవ తేవ దివ శ్చ్యుతా" (అయో. 20-32.)

అన్నట్లు మూర్ఛనొంది కొంతసేపటికిఁ దెలివిదెచ్చుకొని యనేకవిధముల విలపింపఁదొడఁగె. రాముఁడు వనమునకుఁబోకుండ బహుప్రకారములఁబోధించెను; గాని యాతఁడు వినఁడయ్యె. అపుడీమె—

"అ పీదానీం సకాల స్స్యా ద్వనా త్ప్రత్యాగతం పునః

య త్త్వాం పుత్త్రక ! పశ్యేయం జటావల్కలధారిణమ్."

అని కోరెను. ఈరీతి నీమె పుత్త్రవియోగమువలనఁ బొందినదుఃఖము చెప్ప నలవి కాదు.

## సుమిత్ర.

ఈమె దశరథుని రెండవభార్య. లక్ష్మణశత్రుఘ్నులతల్లి భర్త్రనువ్రత. గుణవతి. రామునియం దధికప్రీతిగలది. రామునితో నేనుగూడ నరణ్యమునకుఁ బోయెద నని లక్ష్మణుఁ డీమెతోఁ జెప్ప రాఁగా నీమె యి ట్లుపదేశించెను.

"సృష్ట స్త్వం వనవాసాయ స్వనురక్త స్సుహృజ్జనే

... ... ... ... ...

అయోధ్యా మటవీం విద్ధి గచ్ఛతాత! యథాసుఖమ్." (అయో. 7. 11.)

"పుత్రా! నీవు సుహృజ్జనంబునందుఁ బరమానురక్తుండవై నను వనవాసంబునకొఱకు... ...

గీ. ... ... భూరిసుఖలీల నడవికిఁ బోయి రమ్ము". (గోపీ. అయో. 854-855.)

ఇట్లీమె తనకొడుకు సవతికొడుకు ననుభేదబుద్ధి లేని దగుటచేతను రాముని యం దధికతరవాత్సల్యము గలది యగుటచేత నీచాడ్పునఁ దనసుతుని కుపదేశించి యడవికిఁ బంపెఁగాని లోకములో నెవ్వ తెయైన నీరీతి సర్వసంపత్సమృద్ధం బగుస్వగృహంబును విడిచి సపత్నీసోదరునికిఁ బరిచర్యఁ జేయుచు నతనివెంట నడవికిఁ బొమ్మని తనకుమారునికి బోధించునా ? ఈమె నిష్పక్షపాతబుద్ధి రాజభక్తి స్వార్థపరిత్యాగపూర్వకపరార్థప్రవృత్తియు మిక్కిలిశ్లాఘనీయములు.

## కైకేయి.

ఈమె కేకయరాజపుత్రిక. దశరథుని మూఁడవభార్య అతని కత్యంతప్రేయసి. ఈమెతో నుపయమము దశరథుని కుపయమవాసము నొసంగెను. ఈమె పన్నినదుర్నాటకమునం దీమెతాల్చినభూమికయే రామాయణకథ నింతగాఁ బెంచెను. ఈమె మిగులఁ గఠినాత్మురాలు. క్రూరనిశ్చయురాలు. రామవివాసనమునకే కాక దశరథమరణమునకుఁ గూడముఖ్యకారణము. ఈకైకేయితల్లియు నిజభర్తృమరణమునకుఁ దానే కారణమయ్యె. "అవశ్యం పితురాచారః" అన్నట్లీమెకూడ నట్లనే చేసెను. మంథర యనునొక క్రూరదాసిచే బోధింపఁబడి దశరథుఁ డెప్పుడో పూర్వమందుఁ దనకు వాగ్దానముఁ జేసి తరువాత మఱచిపోయినరెండువరముల నాతనికి జ్ఞప్తికిఁ దెచ్చి "అది బొంకితివా నరకమునఁ బడుదువు. మీపూర్వులందఱు సత్యసంధులు. అనృతముఁ బలికినవారు కారు. నీవలన నీవంశమున కంతకు నపయశస్సువాటిల్లును. నీవుచేసినప్రతిజ్ఞ నిర్వహింపవలయు నని నీ కిచ్ఛయున్నయెడల నిపుడు సిద్ధ మగు రాజ్యాభిషేకమును నాసుతుఁ డగుభరతునికిఁ జేసి రామునిఁ బదునాలుగేండ్లరణ్యములో నుండనియమింపు" మనిగట్టిపట్టుపట్టి దశరథుఁడు లోనగువా రెవ్వ రెన్నివిధముల నయభయముల బోధించినను వినక యతికఠినతనుమాత్యమును వహించి కొనకు సజ్జీకృత మైనరామపట్టాభిషేకము నాఁపివైచి రామునిఁ బ్రవ్రజింపఁజేసి సర్వలోకనిందాపాత్రురా లయ్యెను.

"న విషేణ న శస్త్రేణ నాగ్నినా న చ మృత్యునా,
అప్రతీకారపారుష్యా స్త్రీభి రేవ స్త్రియః కృతాః."

అన్నట్లు ఆహా! స్త్రీ లెంతక్రూరులు? క్రూరస్వభావమం దీమెను మించిన స్త్రీలు లోకములో మఱి లే రని దృఢముగాఁ జెప్పవచ్చును. ఈకథాసందర్భములో నీమెకు దశరథునికి జరిగినయుక్తిప్రత్యుక్తులఁ గనుఁగొనుఁడు.

"తతః పర మువా చేదం వరదం కామమోహితమ్
... ... ... ... ... ...
తస్యైవ త్వ మనర్థాయ కిన్నిమిత్త మిహోద్యతా" (అయో. 11-12. సర్గ)

"సీ. భూనాథ! యొకవరంబునకు మత్సుతునకు

...            ...            ...            ...            ...

గీ. పరగ నాచేత నేమిపాపం బొనర్పఁ
బడియె నిట్టిదుర్వాక్యంబుఁ బలికె దేల?"

(గోపీ. అయో. 277-283.)

## హనుమంతుఁడు.

ఇతఁడు సుగ్రీవునిమంత్రి. వాయుపుత్త్రుఁడు. రామాయణకథాపురుషుల లోఁ బ్రధానుఁడు. మహాపరాక్రమశాలి అతిధైర్యసాహసములు గలవాఁడు. ప్రభుకార్యధురంధరుఁడు జితేంద్రియులలో నగ్రగణ్యుఁడు. పట్టినపట్టు విడువక పనిచేయువాఁడు. మంచివక్త. విద్వాంసుఁడు. వినీతుఁడు. ఇఁక వేయేల ? సర్వసద్గుణసంపన్నుఁ డగునిట్టిభటుఁడు రామునకు లభింపనియెడల నీయావత్సముద్రమును దరింప లేకపోవును.

అన్న యగువాలితోఁ గలహించి యిటునటు నరణ్యములోఁ దిరుగుచున్న సుగ్రీవుఁడు రామలక్ష్మణులఁ జూచి వాలిప్రేరితు లయి తన్నుఁ జంపుట కాయుధపాణు లయితిరుగుచున్నవా రని శంకించి తనమంత్రి యగునీతని రామలక్ష్మణుల వృత్తాంత మరసి రమ్మని వారియొద్దకుఁ బంపెను. అపుడు హనుమంతుఁడు రామునితో సంభాషించిన సంభాషణను విని రాముఁ డీతనివక్తృత్వమునకు మేధాశక్తికి నాశ్చర్యపడి యితనియందు మంచియభిప్రాయము గలవాఁడై యిట్లు శ్లాఘింపఁ దొడఁగెను

"నానృగ్వేదవినీతస్య నాయజుర్వేదధారిణః,

...            ...            ...            ...            ...

తస్యసిద్ధ్యన్తి సర్వార్థా దూతవాక్యప్రచోదితాః."

(కిష్కి౦. 3. స.)

తే-గీ. జనవరకుమార! ఋగ్యజుస్సామవేద
పారగులు            ...            ...            ...

వా.            ...            ...            దూతవాక్యప్రబోధితంబు లయి సిద్ధించుఁగాదె."

(గోపీ. కిష్కి౦. 150-154.)

స్తనంధయశిశుదృష్టి తల్లియితరాంగములను విడిచి స్తనములయందే పడినట్లు రామలక్ష్మణసమాగమునం దీమహావీరునిదృష్టి యావీరులబాహువులయందే పడి విస్మయావిష్టునిఁ జేసి యి ట్లనిపించెను.

"ఆయతా శ్చ సువృత్తా శ్చ బాహవః పరిఘోపమాః
సర్వభూషణభూషార్హాః కిమర్థం న విభూషితాః."

"తే. పరిఘనిభములు, దీర్ఘముల్ కరటికరసమములు భూషణభూషోచితములు నైన
కరము లేటికి భూషణవిరహితంబు లగుచునున్నవి చెప్పరే యనఘులార!"

ఈతఁడు రామకార్యధురమును బూని శతయోజనవిస్తీర్ణ మగుసముద్రమును దాఁటి నిర్భయుఁడై లంకఁ జొచ్చి మొదట లంకినిని బరిభవించి లంకలో సీతను

వెదకి వెదకి యెచ్చటను గానకపోయినను తాను పట్టినపట్టు వదలక విసుగు లేక మాటిమాటికిఁ జూచినస్థలములయందే తిరుగ నన్వేషించుచుఁ గొనకు సీతను జూచుటయందు నెఱవేఱెను.

"అనిర్వేద శ్శ్రియో మూల మనిర్వేదః పరం సుఖమ్,
అనిర్వేదో హి సతతం సర్వార్థేషు ప్రవర్తకః."

అని యీహనుమంతునిసిద్ధాంతము ఇతఁడు రావణాంతఃపురమున నర్ధరాత్రమునందు సీతను వెదకునపు డచట నిద్రాపరవశులై యొడ లెఱుంగక పడియున్న స్త్రీలను ప్రమాదవశమునఁ జూచి తనకుఁ బరదారావలోకనముచే ధర్మలోపము సంభవించె నని యెంచి.

" నహి మే పరదారాణాం దృష్టి ర్విషయవర్తినీ,
అయం చాత్ర మయా దృష్టః పరదారపరిగ్రహః.
నహి మే మనసః కించి ద్వైకృత్య ముపపద్యతే,
మనో హి హేతు స్సర్వేషా మింద్రియాణాం ప్రవర్తనే.
శుభాశుభా స్వవస్థాసు తచ్చ మే సువ్యవస్థితమ్."

అని తలంచుకొని తనలోఁ దా నిట్లనుకొనెను. "నే నీస్త్రీలను జూచినను నామనస్సు నిర్వికార మైయున్నది ఎల్లవారికిని సర్వావస్థలయందు మనస్సుకదా యింద్రియములను మంచిచెడ్డలయందుఁ బ్రవర్తింపఁ జేయునది. అట్టి నామనస్సు పరస్త్రీదర్శనమందుఁ గూడ లేశము వికారములేనిది యయి నిశ్చలముగా నున్నది. నా కెట్లు పాపము సంభవించును.?"

ఇతఁడు మొట్టమొదట సీతను జూచినపుడు రామవృత్తాంతము నామెకుఁ దెలియఁజేయుటకు సమయము నిరీక్షించుచుండెను. అప్పుడితఁడు తనలోఁ దా నాలోచించినయాలోచనయు, బుద్ధినిష్కర్షయు మిక్కిలిశ్లాఘనీయములు. ఎట్లన:—
"నేనిపుడు బ్రాహ్మణునివలె సంస్కృతవాక్కులతో మాటాడినయెడల నన్ను రావణునిఁగాఁ దలంచి యీసీత భీతి నొందును ఇదివఱకే రాక్షసులవలన భయపెట్టఁబడుచున్న యీమె నారూపమును జూచి మఱింతభయము నొంది కేకలు వేయును. అది విని రాక్షసు లందఱు నచటికి వచ్చి నన్నుఁ బట్టుకొనుటకుఁగాని వధించుటకుఁగాని ప్రయత్నము సలుపుదురు. లేక యీసీత నైనఁ జంపుదురు. అపుడు స్వామికార్యము నశించును. నాశ్రమమంతయు నిష్ఫలమగును. నేను వీరిచేతులలోఁ జిక్కిన సీసముద్రమును దాఁటి యిచటికి వచ్చి రామకార్యమును సాధించుటకుఁ దగిన మఱియొకమాత లేఁడు. నేను వేలకొలఁది రాక్షసులఁ జంపుటకు సమర్థుఁడనే కాని నాశక్తి యంతయు రాక్షసులతో యుద్ధము సేయుటయందు క్షీణించినచో సముద్రమును దాఁటుట కశక్తుఁడ నగుదును. యుద్ధములలో నెల్లపుడు మనమే గెల్తు మనరాదు.

యుద్ధసిద్ధి చంచలముగదా ! సీత నిపుడు నేఁబలుకరించిన నింతయనర్థము సంభవిల్లును.

> "భూతా శ్చార్థా విపద్యంతే దేశకాలవిరోధితాః
> ... ... ... ... ...
> ఘాతయంతి హి కార్యాణి దూతాః పండితమానినః." (సుందర. 30-37-39.)

"భూతార్థంబు లవివేకి యయినదూతకతంబున దేశకాలవిరోధితంబు లయి సూర్యోదయంబునందుఁ దమంబు నశించునట్లు నశించు. కార్యాకార్యవిషయంబునందు సునిశ్చిత యయ్యును విక్లబుం డగుదూతకతంబున బుద్ధి శోభిల్లదు. పండితమానులగుదూతలు కార్యంబులఁ జెఱుపరు. ఎవ్వండుబహుప్రకారంబులఁగార్యంబు తెఱంగు విచారించు నతం డర్థసాధనంబునందు సమర్థుం డగుఁ గావున నిప్పుడు కార్యంబు నశింపకుండ నాకు వైక్లబ్యంబు గలుగకుండ సముద్రలంఘనంబు వ్యర్థంబు గాకుండ సీతారామలక్ష్మణులకు హానిగలుగకుండ నెవ్విధంబునఁగార్యంబు నడుపుదునో" యని కొండొకసేపు విచారించి బుద్ధిమంతుం డగుహనుమంతుం డెట్టకేలకు రాక్షసస్త్రీలు వినకుండ నక్లిష్టకర్ముం డగురాముని మెల్లనఁ బ్రశంసించె.

ఈరీతిగా నితనిబుద్ధి, కార్యకరణపాటవము, జితేంద్రియత్వము, సాహసనిర్భీకత్వములు, ధైర్యము, పరాక్రమము, దుర్ఘటకార్యసాధకత్వము, మొదలగుసద్గుణములు శ్రీరామాయణమం దెల్లెడలఁ గానవచ్చుచున్నవి. ఇతనివివేకము, దూరదృష్టి, పరాభ్యుదయసహిష్ణుత మొదలగునవి విభీషణశరణాగతిలో విభీషణునివిషయమయి యీతఁడు రామునితోఁ జెప్పినమంచిమాటలలోఁ బ్రతిఫలించుచున్నవి.

---

# కపిప్రశంస.

ఇట్టి మహనీయ మగునీవాల్మీకిరామాయణము సంస్కృతభాషలో వ్రాయఁబడియుండుటచే దానియర్థ మంతయు సంస్కృతభాష నెఱుంగనివారికిఁ దెలియదని యెంచి భక్తాగ్రగణ్యుఁడు మహాకవియు నగుగోపీనాథము వేంకటకవియను నాతఁడు మూలము ననుసరించి చక్కఁగా నాంధ్రీకరించెను. ఇదివఱకే కొంతకాలముక్రిందట కేవలరామాయణకథాప్రతిపాదకము లగుభాస్కరరామాయణము రంగనాథరామాయణము మొదలగునవి తెలుఁగున వ్రాయఁబడియున్నవి గాని యవి యీగోపీనాథము వేంకటకవి యాంధ్రీకరించిన రామాయణమువంటివి కావు. ఇది మూలముననుసరించి వ్రాయఁబడినది. మూలమున కన్యూనాతిరిక్తముగాఁ దెలుఁగు వ్రాసెద నని ప్రతిజ్ఞచేసి కవి యట్లనే యీమూలాగ్రముగా గ్రంథమునంతయు నిర్వహించెను. ఈతఁడు వైదికబ్రాహ్మణుఁడు. నెల్లూరిమండలమం దున్న కావలి

తాలూకాలోని లక్ష్మీపుర మనుగ్రామ మీతని నివాసస్థానము. ఇతం డీగ్రంథమును రచించి దీనినిఁ బ్రసిద్ధినొందించుట యెట్లోకో? యని తలంచుచుండ నింతలో వేంకటగిరిసంస్థానాధీశ్వరుఁ డగుసర్వజ్ఞకుమారయాచేంద్రమహీపాలుఁ డొక్కనాఁడు సభామంటపంబున సుఖాసీనుం డై విద్వజ్జనంబులు పరివేష్టింపఁ బురాణేతిహాసకావ్యనాటకాలంకారాది ప్రస్తావనాసరసగోష్ఠి నుండి యీకవి యాంధ్రీకరించినరామాయణమును గుఱించి పండితులవలన విని తమయభిప్రాయప్రకారంబున గీర్వాణంబున కనురూపం బై శ్రీకృష్ణాంకితం బై యున్నదని మిగులశ్లాఘించి పరమానందభరితుం డై స్వర్ణకటకాంగుళీయకహారాగ్రహారాదుల నొసంగి యిమ్మహాగ్రంథంబును లోకహితార్థంబుగా జగంబునందు విస్తరింపఁ జేసెనని యీకవియే తనరామాయణముయొక్క కృత్యాదియందు వ్రాసియున్నాఁడు. మఱియునీతఁడు బ్రహ్మకైవర్తపురాణములోని శ్రీకృష్ణజన్మఖండము నెనిమిదాశ్వాసములుగలపద్యకావ్యముగాను రచించెను. శ్రీభగవద్గీతాశాస్త్రమునుగూడఁ దెనిఁగించెను. స్వప్నమందుఁ దనకు సాక్షాత్కరించిన శ్రీకృష్ణదేవు నీగ్రంథమునకుఁగృతినాయకునిగాఁ జేసెను.

ఈకవిగ్రామణి పరమభాగవతోత్తముఁడు. అధిగతపరమార్థుఁడు. విదితవేదితవ్యుఁడు. కావున నీతఁడు తనగ్రంథమును నరాంకితముఁ జేయక శ్రీకృష్ణునకర్పించెను. ద్రవ్యాభిలాషచే మనుష్యులను దమగ్రంథములకుఁగృతిపతులఁగా నొనర్చిన కవుల నీతఁ డిట్లు నిందించియున్నాఁడు.

"చ. నృపతుల వేఁడినన్ గరుణ నిచ్చిన నిత్తురు దంతివాజిర
త్నపటధనాగ్రహారములు దప్పక యన్నియు నస్థిరంబు లా
విపులకృపాపయోధి యదువీరుని వేఁడిన బ్రీతి నిచ్చు ని
త్యపదము నట్టివానిఁ గొనియాడక యన్యుల వేఁడ నేటికిన్."

ఈతఁడు తెలిఁగించిన శిశుపాలవధమహాకావ్యమునందలి—

"తే. శాలివాహనశకమందు శశివసుగగ
నాష్టసంఖ్యలుఁ గలపార్థివాబ్దమందుఁ
బ్రకటితంబుగ వేంకటసుకవిచేత
నీకృతి రచింపఁజేసె నాలోకవిభుఁడు."

అనుపద్యమువలన శాలివాహనశకము 1808 (క్రీస్తు శ. 1886.) సంవత్సరమందు మాఘకావ్యమును దెనిఁగించినట్లు స్పష్టమగుచున్నది. ఇపుడు శాలివాహనశకవత్సరములు 1839 కావున నీకవి క్రీస్తుశకైకోనవింశత్యబ్దశతముయొక్క చరమభాగమం దుండె నని నిశ్చయముగాఁ జెప్పఁగలము.

"సీ. గరిమ రామాయణకావ్యరాజము నాంధ్ర
కావ్యంబుఁ జేసినఘనుఁడ వీవు,

బ్రహ్మకైవర్తపురాణంబులోఁ గృష్ణ
జన్మఖండంబును జారుఫణితిఁ,
నాంధ్రభాష రచించినట్టిపుణ్యుండవు.''

అనుమాఘకావ్యపద్యమువలన రామాయణమును బ్రహ్మకైవర్తమును మొదట సర్వజ్ఞకుమారయాచేంద్రునాజ్ఞచే రచించినట్లును, దరువాత నమ్మహీవల్లభుని జ్యేష్ఠపుత్త్రుం డగుగోపాలకృష్ణయాచేంద్రునాజ్ఞచే మాఘకావ్యమును రచించినట్లును, మాఘకావ్యమునఁ దెలియఁబడుచున్నవి.

కావ్యసామాన్యలక్షణము:—

''ప్రభుసమ్మిత శబ్దప్రధానవేదాదిశాస్త్రేభ్య స్సుహృత్సమ్మితార్థతాత్పర్యవత్పురాణాదితిహాసేభ్య శ్చ శబ్దార్థయో ర్గుణభావేన రసాంగభూతవ్యాపారప్రవణతయా విలక్షణం యత్కావ్యం లోకోత్తరవర్ణనానిపుణ్యకవికర్మ కావ్యమ్.''

''ప్రభుసమ్మితములు, శబ్దప్రధానము లగు వేదములకంటెను సుహృత్సమ్మితార్థము గలపురాణేతిహాసాదులకంటెనువిలక్షణ మయినదియు, రావణాదులవలెఁ గాక రామాదులవలెఁ బ్రవర్తింపవలె నని కాంతాసమ్మితముగా నుపదేశించునదియు, రసమున కంగ మైనవ్యంజనావ్యాపారముచే నప్రధానముగాఁ జేయఁబడిన శబ్దార్థములు గలదియు లోకస్వభావోత్తీర్ణ మగువర్ణనాశిల్పమందుఁ బ్రౌఢుఁడైనకవియొక్క కర్మయు నగునది కావ్య మనంబడు.'' ''తదదోషౌ శబ్దార్థౌ సగుణావనలంకృతీ పునః క్వాపి'' (కావ్యప్రకాశిక.) ''దోషరహితములు గుణయుక్తములు నగుశబ్దార్థములకుఁ గావ్య మని పేరు.'' ఒకప్పు డలంకారములు లేకున్నను కావ్యమునకు భంగములేదు. ఇట్టికావ్యము లుత్తమమధ్యమాధమభేదంబులచే మూఁడువిధములు. ''ఇద ముత్తమ మతిశయిని వ్యంగ్యే వాచ్యా ద్ధ్వని ర్బుధైః కథితమ్'' ''వాచ్యముకంటె వ్యంగ్య మతిశయించియుండ నది యుత్తమకావ్య మనంబరఁగు. దీనికి 'ధ్వని'యని నామాంతరము.'' ''అతాదృశిగుణీభూతవ్యంగ్యం వ్యంగ్యేతు మధ్యమమ్'' ''వ్యంగ్యము వాచ్యముకంటె నతిశయింపనిదై యుండ దానికి మధ్యమకావ్యమనిపేరు. దీనికి 'గుణీభూతవ్యంగ్య' మని నామాంతరము.'' ''శబ్దచిత్రం వాచ్యచిత్ర మవ్యంగ్యమపరంస్మృతమ్'' ''శబ్దగుణాలంకారయుక్తము నర్థగుణాలంకారయుక్తము నై యల్పవ్యంగ్యోపేత మయి యుండునది యధమ కావ్యము.'' ఈయాంధ్రవాల్మీకిరామాయణ ముత్తమకక్ష్యలోనిదిగా గణింపఁ దగినది. దీనియందుఁ బూర్ణముగా నగరార్ణవశైలర్తువర్ణనలతోఁ గూడినమహాకావ్యలక్షణము గూడఁ గన్పట్టుచున్నది.

మహాకావ్యలక్షణము:—

''ఆశీర్నమస్క్రియావస్తునిర్దేశో వాఽపి తన్ముఖమ్,
ఇతిహాసకథోద్భూత మితర ద్వా సదాశ్రయమ్.

చతుర్వర్గఫలోపేతం చతురోదాత్తనాయకమ్,
నగరార్ణవశైలర్తుచంద్రార్కోదయవర్ణనైః.
ఉద్యానసలిలక్రీడామధుపానరతోత్సవైః,
విప్రలంభై ర్వివాహై శ్చ కుమారోదయవర్ణనైః.
మంత్రద్యూతప్రయాణాజినాయకాభ్యుదయై రపి,
అలంకృత మసంక్షిప్తం రసభావనిరంతరమ్.

ఆరంభమందాశీర్వాదనమస్కారవస్తునిర్దేశరూపమగు మంగళాచరణములతోఁ గూడినదియుఁ, బ్రాచీనపురాణేతిహాసములనుండి తీయఁబడినకథగాని లేక సత్పురుషచరిత్రమును బ్రతిపాదించుకథగాని గలదియు, ధర్మార్థకామమోక్షరూపఫలములతోఁ గూడినదియుఁ, జతురుఁడు, కార్యదక్షుఁడు నగునాయకునితోఁ గూడినదియుఁ, బట్టణము, సముద్రము, ఋతువులు, చంద్రోదయసూర్యోదయాదులు, వనవిహారము, జలక్రీడ, మధుపానము, వివాహము, సంభోగశృంగారము, విప్రలంభశృంగారము, కుమారోత్పత్తి, ఆలోచనము, ద్యూతము, ప్రయాణము, యుద్ధము, నాయకాభ్యుదయము మొదలగువానివర్ణనలు గలదియునై యుండవలయును.

ఈగోపీనాథరామాయణముయొక్క ప్రారంభంబునందు భగవన్నమస్కారరూప మగుమంగళ మాచరింపఁబడెను. ఇందు ధర్మార్థకామమోక్షరూపఫలములు ప్రతిపాదింపఁబడుచున్నవి. ధీరోదాత్తనాయకుఁ డగురాముఁడు దీనికి నాయకుఁడు. దీనిలో బాలకాండమందు నగరవర్ణనము, సుందరకాండములో సముద్రవర్ణనము, చంద్రోదయవర్ణనము, కిష్కింధాకాండములోఁ దుదను సూర్యోదయచంద్రోదయవర్ణనము, అరణ్యకాండములో సీతారాములవనవిహారము, పరస్పరవియోగము, బాలకాండమునందు సీతారాములవివాహము, యుద్ధకాండములో యుద్ధవర్ణనము, శత్రువధచే నాయకాభ్యుదయము మొదలగునవి సమగ్రముగా నుదాహరింపఁబడెను.

## కవిత్వవిమర్శనము.

ఈమహాకవీశ్వరునికవిత్వ మతిసుకుమారసరసవచనగ్రథితము. రసవంతము. పండితపామరజనహృదయాకర్షక మయి శబ్దార్థాలంకారోపశోభితం బై యనతికఠిన మై, పాఠకుల కానందసంధాయక మయి యున్నది. చదువునపుడు సులభముగా నర్థమగుటచే నీకవిపుంగవునికవిత్వము ద్రాక్షాపాకభరితము. "ద్రాక్షాపాకస్స కథితో బహిరంతస్స్ఫురద్రసః". "లోపలఁ బైని ప్రకాశించురసము గలది ద్రాక్షాపాక మనంబడు" ఉదా:—

"ఉ. పిన్నటనాఁటనుండియును బెక్కుసుఖంబుల వర్ధమాన యై
యెన్నియుఁ గన్నదొట నిటువంటియవస్థల కోర్వలేక యా
పన్నత నొంది యున్నది నృపాలక! జానకి కంటె భక్తిసం
పన్నతయుఁ శుచిత్వ మసమానసతీత్వము మాకుఁ దెల్పెడిన్."

చ. నరవర! సద్మసౌఖ్యము మనంబున నెంచక యీవధూటి దు
ర్భరవనవాససంజనితబాధఁ దలంపక భర్తృభక్తిచే
నరుగ నరణ్యసీమ కిటు లచ్చుటఁ జేసి యపాంసులాళిలో
వరమణి యయ్యెఁ గాదె తనవారికి నిత్యయశంబు గల్గఁగన్. (అర.)

ఈకవిత్వము కైశికీవృత్తిబహుళము. "అత్యర్థసుకుమారార్థసందర్భా కైశికీ మతా." "అసంయుక్తకోమలవర్ణసందర్భసహకృత మగునత్యంతసుకుమారార్థయుక్తము కైశికీవృత్తి" ఉదా:—

"ఉ. వారిమనోజ్ఞవేషములు వారిసమోరచనాచమత్కృతుల్
వారివిలాసవైఖరులు వారిసమంచితరూపసంపదల్
వారివిహారచాతురియు వారియసాంగద్యగంధంబు లిం
పారఁగఁ జూచి మన్మథశరాతురుఁడై పవనుండు చెచ్చెరన్"

"చ. జలజదళాక్షులార! నవచంపకనాసికలార! యేను మీ
చెలువముఁ జూచి మేలుపడి చేకొన వచ్చితి నాకు భార్యలై
కలసి రమింపుఁ డుత్తమసుఖంబులు చేకొని మానుషత్వముం
దలఁగు శుభోదయం బెసఁగుఁ దప్పక కల్గుఁ జిరాయురున్నతుల్." (బాల.)

ఈకవి రౌద్రరసవర్ణనములో నచ్చటచ్చట నారభటీవృత్తిగలపద్యములఁ గూడ వ్రాసియున్నాఁడు. "అత్యుద్ధతార్థసందర్భా వృత్తి రారభటీ మతా". "పరుషవర్ణములతోఁ గూడినయత్యుద్ధతార్థసందర్భమున కారభటీ వృత్తి యనిపేరు." ఉదా:—

"సీ. కల్పాంతకాలసంకర్షణానలశిఖామాలికాజాజ్వల్యమాన మగుచుఁ
బ్రళయకాలోదగ్రభాస్కరతిగ్మమరీచికాగణదుర్నిరీక్ష్య మగుచుఁ
గాలజీమూతసంఘాతనిర్గతమహానిర్ఘాతతులితోగ్రనినద మగుచుఁ
బ్రబలమహీధరోత్పాటనక్షమమహావిలయఝంఝూవాతవేగ మగుచు
తే-గీ. సంబరంబున నల్లేఁగి యమ్మహాస్త్ర, మెల్లవారలు చూడ నహీనరత్న
ఖచితకుండలకోటీరకలిత మయిన, జంభసూదనరిపునిమస్తకముఁ ద్రుంచె"

ఇట్లే, ఓజః ప్రసాద శ్లేష మాధుర్యాదికావ్యగుణము లీకవికవనమం దెల్లెడలఁ బుష్కలముగాఁ గానవచ్చుచున్నవి. గ్రంథవిస్తరభీతిచే నుదాహరింపలేదు. శ్రీమద్భాగవతము నాంధ్రీకరించిన బమ్మెర పోతనామాత్యునికవిత్వమువలె నీతని కవిత్వమును సంస్కృతపదబహుళమై మిగులరసవంతముగా నున్నది. అనేకవిధములగు శబ్దాలంకారములలో నీకవి పోతనవలె నంత్యప్రాసనియమము నీతనికృతులయం దెల్లెడల మెండుగాఁ బ్రయోగించియున్నాఁడు. ఈయంత్యప్రాసనియమము పోతనామాత్యునికవిత్వమం దతిమనోజ్ఞరీతిగాఁ బ్రకాశించినవిధంబున నితరకవులరచనలయం దెచ్చటను గానము. ఉదా:—

"మ. జలజాతాక్షుఁడు శౌరి డగ్గఱె మహాసౌధాగ్రశృంగారకన్
కలహంసావృత హేమపద్మపరిఖాకాసారకన్ దోరణా
వలిసంఛాదితతారకన్ దరులతావర్గానువేలోదయ
త్ఫలపుష్పాంకురకోరకన్ మణిమయప్రాకారకన్ ద్వారకన్." (భాగ. 1.)

ఎఱ్ఱాప్రగ్గడయు నీనియమములఁ బ్రయోగించియున్నాఁడు.

"క. ధీమంతు లంతఁ గాంచిరి, గోమంతము విపినకుసుమకుంచితశబరీ
సీమంతము సిద్ఝుకణ, హేమంతముఁ గనకమయమహామవంతంబున్." (హరి. ఉ.)

ఈయలంకారమును మొదట భాస్కరుఁడు కనిపెట్టెనని తోఁచుచున్నది. ఉదా:—

"ఉ. పాటితదుష్టసత్త్వఘనవాటక సిద్ధబలాన్విద్ధశృం
గాటక గ్రంథిల భ్రుకుటి గాఢలలాటకఁ గ్రూరతారకా
నాటక నాంత్రకాంచిపరిణద్ధశవప్రపతత్క్రిమిచ్ఛటా
కీటకఁ రక్తసిక్తపటుఖేటకఁ దాటకఁ గాంచి రయ్యెడన్." (భాస్కర. బాల.)

దీనినిఁ బోతన యనేకచిత్రగతుల మిగులరసవంతముగాఁ బోషించెను. ఈరామాయణకర్త యగు వేంకటకవియుఁ బోతన ననుకరించి యీయలంకారవిశేషమును దనగ్రంథములయందుఁ బలుచోట్ల స్థాపించెను. ఉదా:—

"శా. ఆర్తిం దూలుచు రామబాణపతితుం డై యున్నవానిన్ సమి
త్కర్తన్ దుర్లభసర్వకీశవిలసత్సామ్రాజ్యసింహాసనో
ద్ధర్తన్ దుందుభిదానవాదికసమస్తారాతిసంతానసం
హర్తన్ భర్తను గాంచెఁ దార ఘనశోకాకల్పితస్వాంత యై." (కిష్కిం.)

"ఉ. రాముఁడు భానుమత్కులలలాముఁడు భూరిభుజాపరాక్రమో
ద్దాముఁడు కీర్తనీయగుణధాముఁడు ఘోరబలాధికాసుర
స్తోమవిరాముఁ డుగ్రరణసోముఁడు వీర్యజితైకపింగసు
త్రాముఁడు భూరిదోర్విజితరాముఁడు సుమ్ము నిశాచరాధమా!" (అర.)

"తే-గీ. అట్టి బలశాలి జయశీలి నబ్జమాలి, నమితతేజోవిశేషజితాంశుమాలి
వాలిని వధించె నమ్మహీపరుని గెల్తు, ననుచుఁ దలపోయు టది వెఱ్ఱితనము గాదె." (యుద్ధ.)

"క. పుణ్యము తపస్విలోకశ,రణ్యము బహుతరుమృగాభిరాజితరమ్యా
రణ్యము ధృతఫలజలలా, వణ్యకమాభూధరం బవారితశౌర్యా!" (అయో.)

"తే-గీ. తివిరి తపసుల కోర్కులు తీర్చుదాత, శ్రితపరిత్రాత భారతీచిత్తనేత
భూతనిర్మాత కుశలసంధాత ధాత, చెలఁగి దీర్ఘాయువొసఁగి రక్షించుఁ గాత!" (కృష్ణజన్మ.1.)

"చ. పొలుపుగ శక్రునంశమునఁ బుట్టెఁ బ్రతాపజితాంశుమాలి దో
ర్బలపరిపాలితాగచరపాళి దురంతనితాంతవిద్విష
త్కులవనకీలి హైమశతతోయజమాలి యనారతాజిని
శ్చలజయశీలి వాలి దివిషద్గణసన్నుతశౌర్యశాలి యై." (బాల.)

ఈకవి వ్రాసినపద్యములయందుఁ గొంచెము పూర్వకవిచ్ఛాయలు గానవచ్చుచున్నవి.

"చ. అటఁ జని కాంచె రామవిభుఁ డంబరచుంబిరసాలభూర్జరీ
కుటజతమాలతాలనటకుందకురంటకకోవిదారవి
స్ఫుటకరవీరలోధ్రతరుచూతమధూకవిశాలశింశుపా
పటలవిరాజితం బయినభాసురదావము భూరిదావమున్." (అర.)

"చ. అటఁ జని కాంచె భూమిసురుఁ డంబరచుంబిశిరస్సరజ్ఝరీ
పటలముహుర్ముహుర్లుఠదభంగతరంగమృదంగనిస్వన
స్ఫుటనటనానురూపపరిఫుల్లకలాపకలాపిజాలమున్
గటకచరత్కరేణుతరకంపితసాలము శీతశైలమున్." (మను. 2.)

"క. కలరవ మై జితకోకిల,కులరవ మై యారనం బకుంఠితగతి వీ
నులవిం దై యమృతపుసో, నలపొం దై పురమునిండ నలువుగ మ్రోసెన్." (బాల.)

"క. వీనులవిం దై యమృతపు, సోనలపొం దై యమందసుమచలదళినీ
గానముక్రం దై యాస్వన, మానందబ్రహ్మ మైన నధిపతి వల్కెన్." (వసు. 2. 14.)

"సీ. నేఁడుగా నా కనిందితయజ్ఞఫలవృద్ధి సఫలంబు మీరాక సంయమీంద్ర!
నేఁడుగా నాకు మానితజన్మసంసిద్ధి గలిగె మీకరుణచే గాధితనయ!
నేఁడుగా నేను భూనేతలలోఁ జాల మాన్యుండ నైతి నో మౌనివర్య!
నేఁడుగా నాకు నగ్నియు సమకూర నీయాలోకనమునఁ బద్మాప్తతేజ!
తే.గీ. బ్రహ్మతుల్యుండ వైననీపాదరజము, సోక నాయజ్ఞసదన మస్తోకభంగిఁ
గడుఁ బవిత్ర మై తనరారెఁ గల్మషంబు, లడఁగె మిక్కిలి ధన్యుండ నైతి నేఁడు." (బాల.)

"సీ. నేఁడుగా మాకనిందితపర్వసామగ్రి సవరించె నీరాక కువలయేశ!
నేఁడుగా మాతమోనివహంబు లడఁచె నీయాలోకమహిమ లోకైకమిత్ర!
నేఁడుగా మాకు నన్నియుఁ గూర్చె నభిమతార్థములు నీసన్నిధి రాజరాజ!
నేఁడుగా మాకు మానితసౌమనస్యంబు లొసఁగె నీపాదాప్తి వసుధకేంద్ర!
తే. గీ. సురభిచరితుని నిన్ను నిచ్చో భజింపఁ
గాఁ గలిగెఁ గాని సఫలతాకలిత యై వె
లసె మదీయకాంతారాగలక్ష్మి యింకఁ
దరమె మానాతిచిరభాగ్యగరిమఁ బొగడ." (వసు. 3. 56.)

"ఉ. ఎక్కడ నల్కు డైనఁ దరళేక్షణ వచ్చి నటంచుఁ జూచు నే
యిక్కువఁ జప్పు డైనను మహీసుతపల్కని యాలకించు నే
దిక్కు దలంక్కు మన్న సుదతీమణి మైజిగిగాఁ దలంచు లో
నక్కజ మైనమోహమున నారఘునాథుఁడు భ్రాంతచిత్తుఁ డై." (అర.)

"ఉ. ఎక్కడఁ జప్పుడైనఁ దరళేక్షణ వచ్చె నటంచు లేచు నే
దిక్కున నల్కు డైన సుదతీమణిమాటని యాలకించు నే

చిక్కఁ దళుక్కు మన్న నెలజవ్వని మైసిరి యంచుఁ జూచు న
ష్టక్క! కిరీటిమోహసముదగ్రత నేమనవచ్చు నయ్యెడన్." (విజయ. 3. 5.)

ఇట్టివి మఱికొన్ని యున్నను గ్రంథవిస్తరభీతిచే నింతటితో విరమించితి.

ఈగ్రంథమందు ఛందోవ్యాకరణలక్షణ విరుద్ధము లగు పెక్కుప్రయోగములు గనఁబడుచున్నవి గాని యీముద్రణమునం దవి చాలవఱకుముద్రణాలయస్థ పండితులచే మార్పఁబడినవిగాన నుదాహరింపలేదు. ఇట్టిదోషములు ప్రాచీనకవుల గ్రంథములయందుఁ గూడఁ గానవచ్చుటంబట్టి యీకవి లాక్షణికుఁడు గాఁ డని మనము చెప్పలేము.

ఈరామాయణముయొక్క ప్రత్యాశ్వాసాంతమందును నానావిచిత్రబంధములతోఁ గూడినపద్యముల నతినిపుణముగా వ్రాసియున్నాఁడు ఆరణ్యకాండములో రాముఁడు సీతనువెదకునపు డీకవి నానావిధచిత్రవృత్తరచనయందుఁ దన కున్న ప్రావీణ్యమునంతయుఁ బ్రకాశింపఁజేసెను.

## భాషాంతరీకరణము.

భగవద్వాల్మీకిమహర్షి ముఖకమలనిరర్గళవినిస్సృతమకరందప్రవాహాయమానం బై చతుర్వింశతిసహస్రశ్లోకసంఖ్యాపరిమితం బై విరాజిల్లుమూలరామాయణము నిస్పృహాకవి యొక్కండే స్వప్నసాక్షాత్కృతశ్రీకృష్ణవరప్రసాదాధిగత నిరుపమానవిశృంఖలకవితామహిమంబున సహృదయహృదయంగమం బగురచనాఫణితి శోభిల్ల సమగ్రముగా నాంధ్రీకరించి శాశ్వతకీర్తిం బడసెను. ఇట్టిపని మిగులఁ దుష్కరము. ఏలయనఁగా:—కవులకు నొకగ్రంథమును స్వతంత్రముగా రచించుట సుకరము.స్వకృతియందుఁ దమకవితాపాటవమునకును బాండిత్యపరిమితికిని ననురూపము లగువర్ణనంబులను విషయములను నలవరించుకొని దానిని రచింపవచ్చును. భాషాంతరీకరణమందో యట్లు సేయ శక్యముగాదు మూలగ్రంథము ననుసరించి వ్రాయవలయును.నానావిధవర్ణనోపశోభితం బై తత్త్వప్రతిపాదకం బై యతిగంభీరార్థయుక్తం బై మధుమయఫణితిసమలంకృతం బై యొప్పారు నీరామాయణ మనునితిహాసరాజము ననన్యూనాతిరిక్తముగా నాంధ్రీకరించుటమిక్కిలిదుష్కరము. అది సరసవచనరచనాధురంధరుఁ డగు నిట్టిమహాకవికిఁ గాని తదితరుల కలవిగాదు.

వాల్మీకిరామాయణమునకు మతత్రయపూర్వాచార్యులనేకులనేకవ్యాఖ్యానములను రచించిరి. వానిలోఁ గతక మహేశ్వరతీర్థీయ గోవిందరాజీయ వ్యాఖ్యానము లెన్నఁదగినవి. కతకవ్యాఖ్యాన ముత్తరహిందూస్థానమం దేకాని మన దేశపు వాడుకలో లేదు. మిగిలినమహేశ్వరతీర్థీయ గోవిందరాజీయవ్యాఖ్యానములు రెండింటిలో విశిష్టాద్వైతుల దగుగోవిందరాజీయవ్యాఖ్యానము రసవత్తరమయినది. ఇంతరసవంత మయినవ్యాఖ్యాన మీప్రపంచమం దెచ్చటను గాన మని ప్రతిజ్ఞ చేయవచ్చును. వాల్మీకి రచించినమూల మెట్టిదో యీవ్యాఖ్యాన మట్టిది. "పెరియ

వాచ్చాంబిళ్ల" యనునొకప్రాచీన విశిష్టాద్వైతాచార్యుఁడు రామాయణమందలి యైదువందలశ్లోకముల నెంచి ద్రావిడభాషచే నొకరసవంతమయినవ్యాఖ్యానమును వ్రాసియున్నాఁడు. దానికి "తనిశ్లోకి" (అద్వితీయశ్లోకములు) యని పేరు.

ఈవేంకటకవి యీవాల్మీకిరామాయణమును దెనిఁగించుటలో మూఁడు రీతుల నవలంబించియున్నాఁడు. ఎట్లన:—

1. పూర్వప్రబంధసరణి ననుసరించి కొన్నిచోట్ల యమకానుప్రాసాదిశబ్దాలంకారములతోను, రూపకోత్ప్రేక్షాతిశయోక్త్యాద్యర్థాలంకారములతోను స్వతంత్రముగా వర్ణించి యర్థమును బెంచి పద్యముల వ్రాసియున్నాఁడు. (ఉదా:— గోష్పీ. బాల. 459,851, అయో. 400,90; అర. 63,138; కిష్కిం. 90; సుంద. 864, 256; యుద్ధ 99.)

ఈకవి యుద్ధకాండముకొనను సంధ్యాసమయవర్ణనము, చంద్రోదయసూర్యోదయ వర్ణనములు మొదలగువానిని స్వతంత్రముగా నతిరమణీయ మగు కల్పనలతో వ్రాసెను.

2. మఱికొన్నిస్థలములయందు మూలశ్లోకమునకు సరి యైన తెనుఁగర్థము వ్రాసియున్నాఁడు. ఉదా—

మూ. "న చ తేన వినా నిద్రాం లభతే పురుషోత్తమః

... ... ... ... ...

ఉభూవ పరమప్రీతో దేవై రివ పితామహః." (బాల. 18 స.)

ఆంధ్రీకరణము. "కం. సొంపార రామభద్రుఁడు ... ...

గీ. ... ... ననిమిషులచేతఁ బంకజాసనుఁడు వోలె."

(బాల. 433-436.)

మూ. "రత్నం హి భగవ న్నేత ద్రత్నహారీ చ పార్థివః

... ... ... ... ...

స్వాహాకారవషట్కారౌ విద్యా శ్చ వివిధా స్తథా." (బాల. 53. 9-14.)

ఆంధ్రీ. "క. మునివర! గోరత్నం బిది, ... ... ...

సీ. ... ... నీదివ్యశబళ నీదగదు నీకు" (బాల. 1005, 1006.)

మూ. "నానృగ్వేదవినీతస్య నాయజుర్వేదధారిణః

... ... ... ... ...

సిధ్యంతి హి కథం తస్య కార్యాణాం గతయోఽనఘ!" (కిష్కిం. 3. 28-34.)

ఆంధ్రీ. "తే. గీ. జనవరకుమార! ఋగ్యజుస్సామవేద ... ...

వ. ... ... నట్టివానికార్యగతు లెవ్విధంబున సిద్ధించు."

(కిష్కిం. 150-154.)

మూ. "ధర్మజ్ఞో గురుభి ర్దాంతః కృతజ్ఞ స్సత్యవా క్శుచిః.

... ... ... ... ...

మన్యతే హి యథాఽఽత్మానం తథా భ్రాతౄం స్తు రాఘవః." (అయో. 8. 14-19.)

ఆంధ్రీ. "మ. గురుదాంతుండు కృతజ్ఞుఁ డార్తిహరు ... ...

చ. ... ... మనమున నింతవట్టు పలుమాఱుఁ గుందఁగ నేల దీనతన్."

(అయో. 197-202.)

మూ "అత్యంత సుఖసంవృద్ధ స్సుకుమార స్సుఖోచితః.

... ... ... ... ...

తా మే వేక్ష్వాకునాథస్య భరతస్య కథాం కురు." (అర 16. 29-37.)

ఆంధ్రీ. "క. అతిసుఖసంవృద్ధుఁడు ... ... ...

శా. ... ... కారామామణిదోష్టయి మెన్నఁ దగ దోయబ్జాక్షసంశోత్తమా!"

(అర. 261-266.)

మూ. "యా భాతి లక్ష్మీ ర్భువి మందరస్థా తథా ప్రదోషేషు చ సాగరస్థా

... ... ... ... ...

రాజ్యం సమాసాద్య యథా నరేంద్ర స్తథా ప్రకాశో విరరాజచంద్రః."(సుంద. 5 3-7)

ఆంధ్రీ. "తే. గీ. అవనిలో మందరాద్రిస్థ యైనలక్ష్మి ... ...

క. ... ... మనోజ్ఞ పూజ్యసామ్రా

జ్యము నొందిన నృపతిభంగిఁ జంద్రుం డలరెన్." (సుంద. 186-191.)

మూ. త స్యాభిచంక్రమ్య రథం సచక్రం సాశ్వధ్వజచ్ఛత్రమహాపతాకమ్

... ... ... ... ...

హరీ న్విశల్యాన్ సహ లక్ష్మణేన చకార రామః పరమాహ వాగ్రే." (యుద్ధ.59. 136-145)

ఆంధ్రీ. "చ. అనుపమఘోరకార్ముకగుణార్భటు లంబరవీథి నింపఁ ... ...

... ... ... ... ...

ఉ. ... ... విశల్యులఁగా నొనరించె నందఱన్." (యుద్ధ.)

3. తాను విశిష్టాద్వైతమతసిద్ధాంతనిష్ణాతుఁడై వేదాంతఘట్టములయందును, బహుస్థలంబులయందును గోవిందరాజీయవ్యాఖ్యానము ననుసరించియే సుమారు గ్రంథమునంతయుఁ దెనిఁగించెను. ఈరీతియే గ్రంథమందంతటను బహుళముగాఁ గానవచ్చుచున్నది. ఉదా:—

"ప్రాప్తే యూపోచ్ఛ్రియే తస్మిన్ షడ్బైల్వాః ఖదిరా స్తథా
తావంతో బిల్వసహితాః పర్ణినశ్చ తథాపరే;
శ్లేష్మాతకమయ స్త్వేకో దేవదారుమయ స్తథా
ద్వౌ వేన విహితౌ తత్ర బాహువ్యస్తపరిగ్రహౌ
కారితా స్సర్వ ఏ వైతే శాస్త్రజ్ఞై ర్యజ్ఞకోవిదైః
శోభార్థం తస్య యజ్ఞస్య కాంచనాలంకృతా భవన్"

గోవిందరాజీయవ్యాఖ్యానము.

"రాజ్జుదాల శ్లేష్మాతకః అయ మత్ర విన్యాసక్రమః రాజ్జుదాలోఽగ్నిష్ఠః; అగ్నిశబ్దేన అగ్నిస్థానవేది రుచ్యతే. సోఽగ్నిష్ఠః ప్రథమయూపః; తస్యదక్షిణోత్తరపార్శ్వయో ర్దేవదారుయూపౌ;

తేషాం త్రయాణాం దక్షిణత స్త్రయో బైల్వా ఉత్తరత స్త్రయః. తేషాం నవానాం దక్షిణత స్త్రయః ఖాదిరా ఉత్తరత స్త్రయః పంచదశానాం దక్షిణత స్త్రయః పాలాశా ఉత్తరత స్త్రయః."

ఆంధ్రి. వ "ఇట్లభినవవిభవశేషంబున నయ్యాగంబు చెల్లుచుండ ... ... ...
నంతియదూరంబున నాఱు పాలాశయూపంబులుగా నేర్పఱిచి" (బాల. 338)

"హోతాఽధ్వర్యు స్తథోద్గాతా హస్తేన సమయోజయన్
మహిష్యా పరివృత్త్యాథ వావాతాం చ తథా పరామ్." (బాల. 14-32.)

"వ్యా. ఏతే బ్రహ్మాదయ శ్చత్వారః, ప్రధాన ర్త్విజో మహిషీపరివృత్తిభ్యాం సహవావాతా మపరాం పాలాకలీం చ రాజ్ఞో దక్షిణార్థం పరిగృహ్య హస్తేన సమయోజయన్; రమణార్థ మస్తే నాగృహ్ణ న్నిత్యర్థః. "మహిషీం బ్రహ్మణే దదాతి వావాతాం హోత్రే పరివృత్తి ముద్గాత్రే పాలాకలీ మధ్వర్యవ ఇతి."

ఆంధ్రి "వ తత్కాలదక్షిణార్థంబు దశరథునివలన .....వారల గ్రమ్మఱ నతని కొసంగిరి."
(బాల. 338.)

"గచ్ఛతా మాతులకులం భరతేన తదాఽనఘః
శత్రుఘ్నో నిత్యశత్రుఘ్నో నీతః ప్రీతి పురస్కృతః." (అయో. 1-1.)

"వ్యా. మాతులకులం మాతులగృహమ్, తదా పితృభ్రాత్రనుజ్ఞానంతరం, అనఘః సోదరో లక్ష్మణో బలవంతం రామ మాశ్రితః, మయాఽపి మహదాశ్రయః కర్తవ్య ఇత్యేవంవిధకలుషబుద్ధిరహిత ఇత్యర్థః నిత్యశత్రుఘ్నః - నిత్యశత్రవః కామాదయః తాన్ హంతీతి, తథా. నీతః మాతులగృహవాసజనితసౌఖ్యాదిక మనేన వినా అసత్కల్ప మితి ధియాఽఽనీత ఇతిభావః; ప్రీతిపురస్కృతః - ప్రీత్యా భరతవిషయస్నేహేన పురస్కృతః ప్రేరిత ఇత్యర్థః."

ఆంధ్రి. "వ. పితృభ్రాత్రనుజ్ఞానంతరంబున ..... యతనివెంటం జనియె." (ఆయో. 2.)

"తత స్సుఖతరం రామే వత్స్యామ స్సతి రాజని
అల మద్య హి భుక్తేన పరమార్థై రలం చ నః
యథా పశ్యామ నిర్యాంతం రామం రాజ్యే ప్రతిష్ఠితమ్
తతో హి నః ప్రియతరం నాన్య త్కించి ద్భవిష్యతి.
యథాఽభిషేకో రామస్య రాజ్యే నామితతేజసః" (అయో. 17.)

"వ్యా. రామే రాజనిసతి తతోఽపి సుఖతరం వత్స్యామః; అల మితి. రామ రాజ్యే ప్రతిష్ఠితం అభిషిక్తం రాజమార్గే నిర్యాంతం, అద్య పశ్యామ యథా సాక్షాత్కుర్మో యది—ఏతత్సుఖలాభో యది, తదా భుక్తేన ఐహికవిషయేణ తజ్జన్యసుఖేన చ తథా పరమార్థైః పరమైః శ్రేష్ఠైః అర్థైః స్వర్గాదిభిః తజ్జన్యసుఖై శ్చ - నః అస్మాకం, అలం. మాస్తు; కథ మేవ మిత్యత ఆహ;—తత ఇతి. అమితతేజసః - రామస్య రాజ్యప్రాప్తిహేతునా అభిషేకో యథా అభిషేక ఇతి యత్, తతః అభిషేకజన్యభూమానందబ్రహ్మసాక్షాత్కారజన్యసుఖాత్, ప్రియతరం ప్రేమాతిశయాస్పదం, అన్య త్కించి న్నభవిష్యతి."

మూ "నహి తస్మా న్మనః కశ్చి చ్చక్షుషీ వా నరోత్తమాత్,
నర శ్శక్నో త్యపాక్రష్టు మతిక్రాంతేఽపి రాఘవే,

యశ్చ రామం న పశ్యేత్తు యంచ రామో న పశ్యతి,
నిందిత స్స వసే ల్లోకే స్వాత్మాఽ ప్యేనం విగర్హతే."

"వ్యా. రాఘవే, అతిక్రాంతేఽపి దృష్టిపథమతీతేఽపి, సకలజనమనోనయనసంమోహనాకారానుభవజనితేన వాసనాబలేన పురతః పరిదృశ్యమానఇవ స్థితాత్ తస్మాన్నరోత్తమాత్; మనశ్చక్షుషీవా అపాకృష్టుం నివర్తయితుం కశ్చిదపినరఃపుమాన్ న శక్నోతి; నరాఅప్యేవం; నార్యః కిముతేతి భావః. యశ్చేతి. స్వాత్మాఽప్యేనం విగర్హతే రామేణ సకృదప్యదృష్టంతస్య సాన్నిధ్యాసాన్నిధ్యయో శ్చక్షుర్మనోభ్యా మపశ్యంతం చ లోకా ఏవ న కేవలం విగర్హంతే; అపి తు స్వాత్మాఽపి స్వయ మపి దుర్భాగ్యం మాం ధి గితి విగర్హంత ఇత్యర్థః."

ఆంధ్రీ "ఐ. మన కిప్పుడు భోజనం బేల? ... ... తన్నుఁ దాన గర్హించుకొనును." (అయో.)

"కిం త్వా మన్యత వైదేహః లతా మే మిథిలాధిపః,
రామ! జామాతరం ప్రాప్య స్త్రియం పురుషవిగ్రహమ్" (అయో. 30. 3.)

"వ్యా. మాం త్యక్త్వా వనం గతం త్వాం, యది మే పితా శృణుయాత్ తదా త్వాం స్త్రైణ కాచి త్పురుషవేషం ధృత్వా మత్కన్యా ముపయేమే ఇతి మన్యేత. యద్వా. హేరామ! త్వాం పురుషవిగ్రహం ఆకారమాత్రేణ పురుషం స్త్రియమేవ వసంతం జామాతరం ప్రాప్య కి మమన్యత తత్త్వం నజ్ఞాతవా నిత్యర్థః. యద్వా వైదేహో మే పితా, త్వాం జామాతరం ప్రాప్య లోకే త్వద్వ్యతిరిక్తం పురుషవిగ్రహం పురుషాకృతిం సర్వ మపి స్త్రియ మమన్యతకిం కిమర్థ మమన్యత. యద్వా రామజ, అమాతరం, ప్రాప్య, స్త్రియం, పురుష, విగ్రహం, ఇతిచ్ఛేదః. హేరామజరమయితుం జాత అనతీర్ణ హేపురుష! క్రీడార్థమవతీర్ణపరమపురుష! అమాతరం స్త్రియం మాతృవ్యతిరిక్తాం సపత్నీమాతరం కైకేయీం ప్రాప్య ఉద్దిశ్యవైదేహో మే పితా విగ్రహం కలహం అమన్యతకిం నామన్యతైవ కైకేయ్యా సహ ఏతాదృశకలహ ఆయాస్య తీతి నజ్ఞాతవా నిత్యర్థః. యద్వా—రామజామాతరం ఇ త్యేకం పదం. పురుషవిగ్రహం. రామజామాతరం ఆనందరూపజామాతరం త్వాం ప్రాప్య వైదేహో మే పితా, స్త్రియం స్వస్త్రియం, స్త్రియ మి త్యుపలక్షణం; పుత్రమిత్రకళత్రాదిక మాముష్మికం చ సత్య మమన్యతకిం? కింతు సర్వం తుచ్ఛమితి జ్ఞాత్వా పరమానందపూర్ణోఽభవత్."

ఆంధ్రీ. "చ. విను మిథిలాధినాథుఁ డతివిశ్రుతకీర్తి విదేహుఁ డైనమ ... ...
... ... ముగఁ దలంపుచు నానందపూర్ణుఁ డయ్యె." (అయో. 655-660.)

"అహం జ్ఞాత్వా నరవ్యాఘ్ర! వర్తమాన మదూరతః,
బ్రహ్మలోకం న గచ్ఛామి త్వా మదృష్ట్వా ప్రియాతిథిమ్.
త్వయాఽహం పురుషవ్యాఘ్ర! ధార్మికేణ మహాత్మనా,
సమాగమ్య గమిష్యామి త్రిదివం దేవసేవితమ్." (ఆర. 5.)

"వ్యా. హేనరవ్యాఘ్ర పురుషోత్తమ! అదూరతో వర్ధమానం బహుకాలం మనసా ధ్యాతం అధునామమ భాగ్యవశేన బాహ్యేఽప్యదూరే వర్తమానం ప్రియాతిథిం త్వామదృష్ట్వాబ్రహ్మలోకం నగచ్ఛామి."

త్వయేతి హేదేవ! ధార్మికేణ భక్తసంరక్షణరూపధర్మశీలేన కుతః మహాత్మనా మహాన్ జగదాధారః ఆత్మా మూర్తిః యస్య త్వయా పరమపురుషేణ సమాగమ్య త్రిదివం గమిష్యామి నిత్యనిరతిశయ

నిర్మలానందస్వరూపస్య భక్తజనపారిజాతస్య తవ దర్శనానందం విహాయ మమ బ్రహ్మలోకేన కిమపి భోక్తవ్య మస్తి?"

(అర. 75.)

ఆంధ్రీ. "వ. చిరకాలంబు మనోమార్గంబున వెదకంబడి......బ్రహ్మలోకంబునకుం జనియెద."

"వైఖానసా వాలఖిల్యా స్సంప్రక్షాళా మరీచిపాః,
అశ్మకుట్టాశ్చ బహవః పత్రాహారా శ్చ ధార్మికాః.
దంతోలూఖలిన శ్చైవ తథై వోన్మజ్జకాః పరే,
గాత్రశయ్యా అశయ్యా శ్చ తథైవాభ్రావకాశకాః."

(కిష్కిం. 6.)

"వ్యా. బ్రహ్మణో నఖజాతా వైఖానసాః, కేశజాతా వాలఖిల్యాః, సంప్రక్షాళాస్తుభగవతః శ్రీపాదప్రక్షాళనజాతా మహర్షయః, యద్వా ప్రత్యహంజీవనసాధనంసంపాద్యసర్వం తద్వినియుజ్య వర్తంతే యే తే సంప్రక్షాళాః మరీచిపా శ్చంద్రికాపాయినః అశ్మకుట్టా స్తు భక్షణార్థం ప్రియంగ్వాదీ నశ్మ న్యేవకుట్టయంతీతి తథా, పత్రాహారాః జీర్ణపర్ణాశనాః యే వ్రీహ్యాదీన్ దంతైః ఖండయిత్వా భక్షయంతి తే దంతోలూఖలినః, ఉన్మజ్జకా నామ కంఠదఘ్నజలే స్థిత్వా తపః కుర్వంతః, గాత్రశయ్యా స్తు కేవలం స్థలే గాత్రే ణేవ యే శేరతే తథా, యే కదాచి దపి న శేరతే తే అశయ్యాః, అభ్రావకాశకాః యే వాతాతపవర్షేషు అభ్రావకాశే అసంవృతదేశే తపశ్చరంతి తథా, ఆకాశనిలయాః ఆకాశ ఏవ వాయుధారణబలేన యే నిలీయంతే తే తథా!"

ఆంధ్రీ "వ. మఱియు భగవత్పాదప్రక్షాళనజాతమహర్షులును......గగనంబునందు విలీనులగునట్టి యాకాశనిలయులును."

(కిష్కిం.)

సుందరకాండములో హనుమంతుఁడు సీతతోఁ జెప్పిన "త్రిస్థిర స్త్రిప్రలంబ శ్చ త్రిసమ స్త్రిషు చోన్నతః." అను నీమొదలగు రాముని సాముద్రికలక్షణములను దెలుపువిశేషముల కన్నింటికి నీకవి వ్యాఖ్యానార్థము ననుసరించి పద్యములఁ గూర్చెను.

(సుందర. 770-796.)

"మూ. రావణో నామ దుర్వృత్తో రాక్షసో రాక్షసేశ్వరః,
తస్యాహ మనుజో భ్రాతా విభీషణ ఇతి శ్రుతః." విభీషణశరణాగతి (యుద్ధ. 17 స.)

"వ్యా. రావయతీతి రావణః ఇతి వ్యుత్పత్త్యా నామ్నైవ లోకకంటకత్వంద్యోత్యతే దుర్వృత్త ఇత్యనేన కృత్యాకరణాకృత్యకరణరూపదోషత్వ ముచ్యతే. రాక్షస ఇత్యనేన జాత్యా క్రౌర్య ముచ్యతే. రాక్షసేశ్వర ఇత్యనేన భృత్యసంబంధప్రయుక్తదోషత్వ ముచ్యతే తస్యాహ మనుజో భ్రాతేత్య నేన స్వస్య రావణసంబంధనిబంధనదోషవత్త్వ ముక్తం భవతి అనేన:—"ఉపాయే నైవ సిద్ధ్యంతి హ్యపాయా వివిధా స్తథా, ఇతి యా గర్వహాని స్తద్దైన్యం కార్పణ్య ముచ్యతే" ఇత్యుక్త గర్వహానిలక్షణం కార్పణ్యరూపమంగం ప్రదర్శితమ్."

"మూ సోఽహం పరుషిత స్తేన దాసవ చ్చావమానితః,
త్యక్త్వా పుత్రాంశ్చ దారాంశ్చ రాఘవం శరణం గతః."

(యుద్ధ. స. 17;)

"వ్యా. దాసవ చ్చావమానితః, అనేన ఈశ్వరస్యనిర్హేతుకకరుణాపరిపాకభూతే నైవ రావణావమానేన ప్రయోజనాంతరవైముఖ్యం జాతం. తత శ్చ పరమపురుషార్థరూపరామప్రాప్త్యర్థం రామ మేవ శరణ ముపగతోఽస్మీ త్యాహ;—త్యక్త్వేతి. త్యక్త్వా పుత్రాంశ్చ దారాం శ్చే త్యనేన ప్రాతికూల్య

వర్జనరూప మంగ ప్రదర్శితమ్. రాఘవంశరణం గత ఇత్యనేన ఆత్మనిక్షేపరూప మంగం ప్రదర్శితమ్.

"మూ. సర్వలోకశరణ్యాయ రాఘవాయ మహాత్మనే,
నివేదయత మాం క్షిప్రం విభీషణ ముపస్థితమ్."

(యుద్ధ. స 17.)

"వ్యా. సర్వలోకశరణ్యాయ అధికారిభేదమంతరేణ సురనరవానరతిర్యక్స్థావరాంతానాం సర్వేషాం సమాశ్రయణీయాయ రాఘవాయ, "అన్యేఽపి సంత్యేవ నృపాః పృథివ్యాం మాంధాతృరేతే తనయాః ప్రసూతాః, కిం త్వర్థినా మర్థితదానదీక్షాకృతవ్రతశ్లాఘ్య మిదం కులం తత్" ఇత్యాదివచనైః ప్రసిద్ధవైభవే రఘువంశే అవతీర్ణాయ, అనే నార్థినాం ప్రార్థనావైఫల్యం నాస్తీతి ద్యోతితమ్. మహాత్మనే పరమాత్మనే మాం రామ మేవ సర్వవిధబంధుత్వే నాశ్రితం క్షిప్ర మిత్యనేన శీతల సురభిసలిలం పద్మాకరం దృష్టవతః తృషిత స్యేవ విలంబాసహత్వం ద్యోత్యతే. నివేదయత విజ్ఞాపయత "వాచా ధర్మమవాప్నుహీ"తి న్యాయేన అక్లేశేన భవతాం మహా నుపకార స్సేత్స్యతీతిభావః. సర్వలోకశరణ్యాయేత్యనేన శ్లోకేన "అప్రార్థితో నగోపాయే దితి తత్ప్రార్థనామతిః, గోపాయితా భవ త్వేవం గోప్తృత్వ వరణం స్మృత" మిత్యుక్తమ్ గోప్తృత్వవరణరూప మంగం ప్రదర్శితమ్. ఉపస్థితం సమీపప్రాప్యస్థితిం అనేన "రక్షిష్య త్యనుకూలం న ఇ త్యేవం సుదృఢా మతిః, స విశ్వాసో భవేచ్ఛాత్ర సర్వదుష్కృతినాశన" ఇ త్యుక్తం విశ్వాసరూప మంగం ప్రదర్శితమ్. నను ఇక్ష్వాకువంశస్య రాజ్ఞో రామభద్రస్య సర్వలోకశరణ్యత్వం పరత్వంచ విభీషణేన కథ ముక్తమితిచేత్ ఉచ్యతే:—"పరమాపద్గత స్యాపి ధర్మే మమ మతి ర్భవేత్, యా యా మే జాయతే బుద్ధి ర్యేషు యేష్వాశ్రమేషు చ, సా సా భవతు ధర్మిష్ఠా తం తం ధర్మం చ పాలయే" దితిప్రార్థితేన బ్రహ్మణా "ధర్మిష్ఠత్వం తథా వత్స! తథా చైతద్భవిష్యతీ"తి దత్తవరత్వేన రామం సకలజగద్రక్షణార్థ మిక్ష్వాకువంశేఽవతీర్ణం పరమధర్మరూపం పరమపురుషం నారాయణం జ్ఞాత్వాతథోక్తవానితిసర్వంసమంజసమ్.

ఆంధ్రీ. "వ నే నిల్లు వానిచేతఁ బరుషితుండను, దాసుని యట్ల యవమానితుండనై ... ...
... ... ... భగవచ్ఛాస్త్రోక్తషడ్విధశరణాగతిలక్షణంబు లేర్పడం బలికిన."

(యుద్ధ-325.)

ఇట్లీకవి యనేకస్థలములయందు వ్యాఖ్యానము ననుసరించి వ్యాఖ్యానపదములను సంగ్రహించి భాషాంతరీకరణము చేసియున్నాఁడు. తెనిఁగించిన గ్రంథమంతయు విశిష్టాద్వైతమతానుసారముగా నున్నదిగాని యద్వైతి తెనిఁగించినదని యెచ్చటను నద్వైతసిద్ధాంతలేశమయినను గానరాదు.

---

సంస్కృతరామాయణాంధ్రీకృతరామాయణములలో నున్నకథావైషమ్యము.

దశరథుఁడు పట్టాభిషేకమునుగూర్చి రామునితోఁ జెప్పుమాట—

"విప్రోషిత శ్చ భరతో యావ దేవ పురాదితః,
తావదే వాభిషేక స్తే ప్రాప్తకాలో మతో మమ."

(అయో. 4 స.)

ఈశ్లోకమునకు:—

"కేకయరాజాయ రాజ్యశుల్కం దత్వా కైకయీవివాహం కృతవాన్"

అని గోవిందరాజీయ వ్యాఖ్యానావతారిక.

"అయం వృత్తాంత స్పష్టోత్తరశతతమేసర్గే:—

"పురా భ్రాతః పితా నః స మాతరం తే సముద్వహన్,

మాతామహే సమాశ్రౌషీ ద్రాజ్య శుల్క మనుత్తమమ్" ఇతిస్పష్టీభవిష్యతి"

అనివ్యాఖ్యానము. ఇందు కీకవి యాంధ్రీకరణములో "దశరథుండు తొల్లి కేకయరాజునకు రాజ్యం బుంకువసేసి కైకేయిని బెండ్లియైనవాఁడుగావునఁదద్వృత్తాంతంబు మనంబున నిడికొని వెండియు నిట్లనియె." అని వ్యాఖ్యానార్థమునే సంగ్రహించి వ్రాసెను.

యుద్ధకాండములో రావణుఁడు తనకు హితము బోధించిన విభీషణునిఁ బాదముతోఁ దన్ని యాసనమునుండి దిగువకుఁ ద్రోచి ఖడ్గముతో నాతనిశిరస్సుఁ దెగ వ్రేయుట కుద్యుక్తుఁడు కాఁగాఁ బ్రహస్తుఁ డడ్డపడి రావణుని నివారించె ననియు, నంత విభీషణుఁడు తల్లియొద్దకుఁ బోయి యన్నవలనఁ దనకుఁ గలిగినపరాభవము నామెతోఁ జెప్పి యేడ్వఁగా నామె సర్వలోకశరణ్యుఁ డగుశ్రీరామచంద్రునిపాదారవిందముల నాశ్రయించు మని హితోపదేశముఁ జేసిన ట్లాంధ్రీకరణములో నీవెంకటకవి వ్రాసియున్నాఁడు. దీనికాకరము గానరాదు. ఏబదియేండ్లక్రిందట ననఁగాఁ గ్రీ. శ. 1864 సం. లోఁ బురాణము హయగ్రీవశాస్త్రిగారు చెన్నపురిలో నచ్చొత్తించినమూలరామాయణమందుఁ గాని, తరువాత వ్యాఖ్యానములతో మఱికొందఱు ముద్రించిన రామాయణకోశములలోఁగాని యీవృత్తాంతము గానరాదు. ఇట్లే యుద్ధకాండములో రావణశక్తిచేఁ గొట్టఁబడి మూర్ఛనొందినలక్ష్మణునిఁ బునరుజ్జీవితునిఁ జేయుటకు ద్రోణాద్రినుండి దివ్యౌషధంబులఁ దేఁబోయినహనుమంతుని మార్గమందుఁ గాలనేమి యనురాక్షసుఁ డాశ్రమమును గల్పించుకొని యుండుట, హనుమంతుఁ డాయాశ్రమమునకుఁబోయి పిపాసాశాంతికి జల మడుగుట, ఆరాక్షసుఁడు మొసలితోఁ గూడినసరస్సును గనఁబఱుచుట, హనుమంతుఁడు మొసలిని జంపఁగా నది ధాన్యమాలిని యనునప్సరస్స్వరూపమును ధరించుట, హనుమంతుఁడు కాలనేమిని జంపుట మొదలగుకథలను వ్రాసియున్నాఁడు. ఈకథాభాగ మిప్పుడున్న యేరామాయణప్రతులలోను గానరాదు. ఇదియంతయుఁ బ్రక్షిప్తమని యచ్చుప్రతులలోనుండి తీసివేయఁబడినది. ఈకవి యతిప్రాచీనమగుతాళపత్రరామాయణకోశమును జూచి యాంధ్రీకరించె నని యూహింపవలసియున్నది.

శ్రీరామాద్యవతారఘట్టమందు వాల్మీకిచెప్పినతిథులు వారములు లీకవి చెప్పియున్నాఁడు. ఇవి యెచ్చటనుండి గ్రహించినవో తెలియరాదు.

"ఉ. మేటిగఁ జైత్రశుద్ధనవమీయుతవారపునర్వసూడుక

ర్కాటకలగ్నమందు గురురాజులు నొక్కటఁ గూడి పరఁ స

య్యాటముతో శుభగ్రహము లైగు సముచ్చగతిం జరింప నా
ఖేలవిభుండు మింటినడుక్రేన సముజ్జ్వలుండై వెలుంగఁగన్." (బా.)

ఇంతకంటెఁ గథాభాగములో మఱియెచ్చటను మూలమునుండి భేదము గానరాదు.

శ్రీరామాయణములోఁ గొన్నియంశము లాపాతముగాఁజూచినచోఁ గొంత సందిగ్ధముగాఁ గానవచ్చుచున్నవి. వాని నన్నిటినిఁ దిలకగోవిందరాజీయవ్యాఖ్యానములు సమన్వయింపఁ జేసినవి.

1. పాయసవిభాగము.

"కౌసల్యాయై నరపతిః పాయసార్ధం దదౌ తదా,
అర్ధాదర్ధం దదౌ చాపి సుమిత్రాయై నరాధిపః.
కైకేయ్యై చావశిష్టార్ధం దదౌ పుత్రార్థకారణాత్,
ప్రదదౌ చావశిష్టార్థం పాయస స్యామృతోపమమ్
అనుచింత్య సుమిత్రాయై పున రేవ మహీపతిః,
ఏవం తాసాం దదౌ రాజా భార్యాణాం పాయసం పృథక్" (బా. 16-స.)

దశరథుఁడు ప్రాజాపత్యపురుషుఁ డిచ్చినపాయసము నంతయును రెండుసమానభాగములఁ జేసి వానిలో నొకభాగమును జ్యేష్ఠమహిషి యగుకౌసల్య కొసఁగెను. తక్కినభాగమును దిరుగ రెండుసమాంశములుగా విభజించి యొకభాగమును సుమిత్ర కిచ్చెను. రెండవభాగమునుదిరుగ రెండువంతులు చేసియొకవంతుకైకేయి కిచ్చి మిగిలినవంతు తిరుగ సుమిత్ర కిచ్చెను. కౌసల్య సర్వజ్యేష్ఠురా లగుటచేఁ బాయసములో సగముభాగ మామె కిచ్చెను. కైకేయ ప్రేమాస్పదురాలయ్యెను దదపేక్షచే సుమిత్ర జ్యేష్ఠురాలు పట్టమహిషీక్రమములో మధ్యమురాలు నగుటచే జ్యేష్ఠాకనిష్ఠావైషమ్య ముండవలయుననియెంచి దశరథుఁడు పాయసమును రెండవమాఱుకూడ సుమిత్రకిచ్చెను. దశరథుఁడు కౌసల్యాసుమిత్రాకైకేయీలకుఁ బాయసముఁ బంచి యిచ్చినరీతి యిది. భర్త పాయసము నిట్లు విషమముగాఁ బంచియిచ్చినను, వారు ముప్వురు "సమ్మానం మేనిరే సర్వాః ప్రహర్షోదితచేతసః" అని హర్షనిర్భర లయి దీని నొక పెద్దసన్మానముగాఁ దలంచిరి. ఇందువలనఁ బుత్త్రులుగూడ నేతాదృశపాయసవిభాగానుగుణముగా జనించిరి. ఎట్లన:

"కౌసల్యాఽజనయ ద్రామం దివ్యలక్షణలక్షితమ్,
విష్ణో రర్ధం మహాభాగం పుత్ర మిక్ష్వాకునందనమ్." (బా.)

పాయసార్ధభక్షణముచే రాముఁడు విష్ణువుయొక్క యర్ధాంశ మని తేలినది. ఇచట నర్ధశబ్ద ముపపన్న మై యున్నది గాని—

"భరతో నామ కైకేయ్యాం జజ్ఞే సత్యపరాక్రమః,
సాక్షా ద్విష్ణో శ్చతుర్భాగః సర్వైః సముదితో గుణైః." (బా.)

అనుశ్లోకమును బట్టిచూడఁగా భరతుఁ డష్టమాంశభాగి గావలసియుండ విష్ణువుయొక్క చతుర్భాగ మని చెప్పుట విరోధముగా నున్నది. పైశ్లోకమువలన భరతుఁడు చతుర్థాంశభాక్కని చెప్పినచో నట్లుకాదు. ఎట్లన:—“సాక్షాద్విష్ణోశ్చతుర్భాగః” అనుటచే రాముఁడు విష్ణువుయొక్క యర్ధాంశ మని లోగడఁ జెప్పియుండుటచే భరతుఁడు రామునియొక్క చతుర్థాంశ మనఁగా: సాక్షా ద్విష్ణువుయొక్క యష్టమాంశ మని తేలుటచే విరోధము లేదు.

“అథ లక్ష్మణశత్రుఘ్నౌ సుమిత్రాఽజనయ త్సుతౌ,
వీరౌ సర్వాస్త్రకుశలౌ విష్ణో రర్ధసమన్వితౌ.”

(బాల.)

ఈశ్లోకమందు “విష్ణోరర్ధసమన్వితౌ” విష్ణువుయొక్క యర్ధాంశముతోఁగూడినవా రని చెప్పుటచే లక్ష్మణశత్రుఘ్నులకుఁ జతుర్థాంశభాక్త్వము ప్రతీయమాన మగుచున్నది. ఇది విరోధింపదు. ఏలయన:—ఇచట నర్ధశబ్దమున కేకదేశ మని యర్థముకాని సమానాంశ మర్థము కాదు. గావున విరోధము లేదు. దానిచే “విష్ణో రర్ధసమన్వితౌ” అనుదానికిఁ దేలినయర్థ మేమనఁగా: విష్ణువుయొక్క యంశముతోఁ గూడినవా రని యర్థము.

రామలక్ష్మణభరతశత్రుఘ్నులు పరమాన్నభక్షణక్రమమున జనియించిరి. మొదట దశరథుఁ డిచ్చినపాయసార్ధమును కౌసల్య యాక్షణమునంద భక్షించెను. అనంతర మవశిష్టార్థములో నర్ధమును సుమిత్ర కిచ్చెను. కాని యామె దానిని వెంటనే భుజింపక మిగిలినదాని నితఁ డేమిచేయునో చూత మని విచారించుచుఁ జేతిలోఁ బరమాన్న ముంచుకొని నిలువఁబడియుండెను. అంతలో దశరథుఁడు మిగిలినపరమాన్నమును రెండుసమానభాగములఁ జేసి యొకభాగమును కైకేయి కొసఁగెను. ఆమె దానిని వెంటనే భుజించెను. పిమ్మట రాజు మిగిలినయష్టమాంశమును కైకేయి కిచ్చుటకు మనస్సుగలవాఁడైనను రహస్యక్రీడలయందుఁ బ్రేయసి యెడలఁ బక్షపాత ముండవలయును గాని ఇట్టి ధర్మ్యవిభాగకర్మమందుఁ బక్షపాతముఁ జూపఁగూడ దనుధర్మము నెఱింగినవాఁడు గావున మిగిలిన భాగమునుగూడ సుమిత్ర కిచ్చెను. కాఁబట్టి మొదట శ్రీరామజననము, తరువాత భరతోత్పత్తి, పరదినమందు లక్ష్మణశత్రుఘ్ను లుదయించి రనుటకు విరోధము లేదు

2. లక్ష్మణభరతులలో నెవ్వరు పెద్ద?

రామశత్రుఘ్ను లుభయులలో రాముఁడు సర్వజ్యేష్ఠుఁ డనియు, శత్రుఘ్నుఁడు సర్వకనిష్ఠుఁ డనియు స్పష్టముగా నెల్లరకుఁ దెలిసియుండుటచే జ్యైష్ఠ్యకానిష్ఠ్యవిషయకవివాదమునకుఁ బ్రసక్తియే లేదు. కొన్నిచోట్ల భరతుఁడు పెద్దవాఁడనియు, మఱికొన్నిస్థలములయందు లక్ష్మణుఁడు పెద్దవాఁ డనియుఁ జెప్పఁబడియుండుటచే నాయంశ మిపుడు చర్చింపఁ దగియున్నది.

“పుష్యే జాత స్తు భరతో మీనలగ్నే ప్రసన్నధీః,
సార్పే జాతౌ తు సౌమిత్రీ కుళీరే ఽభ్యుదితే రవౌ.”

(బాల. 18. 14.)

ఈశ్లోకార్థము నాలోచింపఁగా శ్రీరామోత్పత్తికిఁ బరమగుపుష్యమీనక్షత్రయుక్తదినమందు భరతుఁడు పుట్టె నని స్పష్టమగుచున్నది. ఇతఁడు పుట్టినదినమునకు మఱుచటిదినమునం దుదయకాలమున లక్ష్మణశత్రుఘ్నులు జన్మించి రని యుత్తరార్థమువలనఁ దెలియఁబడుచున్నది. ఇందువలన లక్ష్మణునికంటె భరతుఁడే జ్యేష్ఠుఁడని యెఱుఁగవలయును. జ్యేష్ఠుఁ డెప్పుడును కనిష్ఠునికి నమస్కరించుట యుచితము కాదుగదా! ఇట్లుండఁగా—

"ఇతి లోకసమాకృష్టః పాదేష్వద్య ప్రసాదయన్,
రామస్య నిపతిష్యామి సీతాయా లక్ష్మణస్య వా." (అయో. 99. 17.)
"అంకే భరత మారోప్య ముదితః పరిషస్వజే,
తతో లక్ష్మణ మాసాద్య వైదేహీం చ పరంతపః.
అభివాద్య తతః ప్రీతో భరతో నామ చాబ్రవీత్." (యుద్ధ. 130. 40.)

ఈశ్లోకములయందు "లక్ష్మణ మాసాద్య" "అభివాద్య" "నామచాబ్రవీత్" అని కంఠోక్తముగాఁ జెప్పఁబడియున్నది.

"ఏవం దత్వా తత స్సీతాం మంత్రోదకపురస్కృతామ్,
అబ్రవీ జ్జనకో రాజా హర్షే ణాభిపరిప్లుతః.
లక్ష్మణాగచ్ఛ భద్రం తే ఊర్మిళా ముద్యతాం మయా,
ప్రతీచ్ఛ పాణిం గృహ్ణీష్వ మాభూ త్కాలస్య పర్యయః.
త మేవ ముక్త్వా భరతం జనక శ్చాభ్యభాషత,
గృహాణ పాణిం మాండవ్యాః పాణినా రఘునందన!
శత్రుఘ్నం చాపి ధర్మాత్మా అబ్రవీ జ్జనకేశ్వరః,
శ్రుతకీర్త్యా మహాబాహో! పాణిం గృహ్ణీష్వ పాణినా." (బాల. 73. స.)

అను నీశ్లోకముల ననుసరించి వివాహసమయమందు మొదట రామునికి సీత యీయఁబడియె. తరువాత లక్ష్మణుని కూర్మిళయు, భరతునికి మాండవియుఁ గడపట శత్రుఘ్నునికి శ్రుతకీర్తియు నీయఁబడిరి. ఈరీతిగాఁ గన్యాప్రదానక్రమమందుఁ గూడ రామునితరువాత జనకునిచే లక్ష్మణుఁ డుద్దేశింపఁబడియెఁ గాని భరతుఁ డుద్దేశింపఁబడలేదు. ఇందువలన భరతునికంటె లక్ష్మణుఁడే జ్యేష్ఠుఁ డనునంశము వెల్లడియగుచున్నది. ఇతరరామాయణములయందుఁ గూడ నీవాల్మీకిరామాయణప్రతిపాదితకన్యాదానక్రమమే యనుసరింపఁబడినది కనిష్ఠునికి జ్యేష్ఠుఁడు వందన మాచరించుట గాని, జ్యేష్ఠునికంటె ముందు కనిష్ఠునికిఁ గన్యాప్రదానముచేయుట గాని యుక్తము కాదు. కావునఁ బైనివ్రాసినయుక్తిద్వయమువలనను—

"సీతా మాదాయ గచ్ఛ త్వ మగ్రతో భరతాగ్రజ!
పృష్ఠతోఽహం గమిష్యామి సాయుధో ద్విపదాం వర!." (అయో. 55.)

ఇత్యాదిప్రమాణములవలనను భరతునికంటెలక్ష్మణుఁడే జ్యేష్ఠుఁడనిపూర్వ

పక్షము. దీనికి సమాధానము. తిలకమాహేశ్వరతీర్థీయగోవిందరాజీయాదివ్యాఖ్యానములఁబట్టి యాలోచింపఁగా:—

"ఇతి లోకసమాకృష్టః పాదేష్వద్య ప్రసాదయన్,
రామస్య నిపతిష్యామి సీతాయా నిపతిష్య వా.
అంకే భరత మారోప్య ముదితః పరిషస్వజే,
తతో లక్ష్మణ మాసాద్య వైదేహీం చ పరంతపః.
అభివాద్య తతః ప్రీతో భరతో నామచాబ్రవీత్." (అయో.)

అనునీశ్లోకములకు యథాశ్రుతార్థము గాక వ్యాఖ్యాత లర్థాంతరమును వ్రాసియున్నారు. ఎట్లన "లోకసమాకృష్టః" అనుశ్లోకమందు "లక్ష్మణస్య" అను షష్ఠికి ద్వితీయార్థము. లక్ష్మణుని "ప్రసాదయన్" మంచిమాటలతో వేఁడుకొనుచు "రామస్య సీతాయాశ్చ పాదయో ర్నిపతిష్యామి" "సీతారాములపాదముల యందుఁ బడఁగలను" లేక నాతల్లి చేసినయపకారమును దలఁచి నిర్దోషి నైన నాయందు సీతారాములకుఁ గోప ముదయించినయెడల వారిపాదములపయిం బడుదును. అప్పుడు లక్ష్మణుఁడు నాతల్లి పలికినదుర్వాక్యముల నుద్ఘాటనఁ జేసి రాముని మనస్సులో ద్వేషమును బుట్టించినయెడలఁ గనిష్ఠునికాళ్లు జ్యేష్ఠుఁడు పట్టుకొనుట శాస్త్రనిషిద్ధ మైనను లక్ష్మణునికాళ్లమీఁదఁగూడఁ బడెదను. అంతియెకాని భరతుఁడు లక్ష్మణునికి నమస్కరించె నని యర్థము కాదు. "అంకే భరత మారోప్య ముదితః పరిషస్వజే" అనుశ్లోకమునకుఁగూడ నర్థము మఱియొకరీతిగాఁ గల్పింపవలెను "భరతుఁడు లక్ష్మణునియొద్దకుఁ బోయి యతనిఁ గౌఁగిలించికొని కుశలప్రశ్న చేసి గారవించి యనంతరము యథాశాస్త్రముగా స్వనామోచ్చారణ పూర్వకముగా సీతకు నమస్కరించెను" వాల్మీకియొక్కహృదయాంతరస్థిత మగునీయర్థమునే తత్త్వసంగ్రహరామాయణకర్త లక్ష్మణుఁడే భరతునికి నమస్కరించె నని యీదిగువ వ్రాసినశ్లోకములో స్పష్టముగాఁ జెప్పెను.

"ఏవం తే భరతో భ్రాతా వైదేహీం చ పరంతపః,
రామేణాపి పరిష్వక్తో లక్ష్మణే నాభివాదితః" (యుద్ధ. ౯౩ స.)

ఇచ్చట "లక్ష్మణేనాభివాదితః" అని కంఠోక్తిగాఁ జెప్పుటచే లక్ష్మణునికంటె భరతుఁడు జ్యేష్ఠుఁ డన్నసంగతి స్పష్ట మగుచున్నది. అయిన జ్యేష్ఠుఁ డయినభరతుని విడిచిపెట్టి జనకుఁడు కనిష్ఠుఁ డైనలక్ష్మణునికెట్లు కన్యాప్రదానముఁ జేసెను. ఇది శాస్త్రవిరుద్ధము కాదా యని శంకింపనలదు. కన్యాప్రదానసమయమందె జనకుఁడు ధారాపూర్వకముగా శ్రీరామునికి సీత నర్పించి లక్ష్మణభరతశత్రుఘ్నులఁ బిలిచి మీరుముగ్వురు నూర్మిళామాండవీశ్రుతకీర్తులయొక్క పాణిని గ్రహింపుఁడని మాటమాత్రమే చెప్పియుండుటవలనను భరతునికిఁ గన్య నీయకముందు లక్ష్మణుని కిచ్చిన ట్లాశ్లోకమం దుండకపోవుటవలనను విరోధము లేదు. లేక ఏకోదరు లైనవారిలో జ్యేష్ఠుఁడు వివాహము లేకయుండఁగాఁ గనిష్ఠుఁడు పెండ్లిచేసికొనుట నిషిద్ధముగాని

లక్ష్మణభరతులు భిన్నోదరు లగుటచే భరతునికంటె ముందు లక్ష్మణునికిఁ గన్యా ప్రదానము చేసినను దోషము లేదని గోవిందరాజీయవ్యాఖ్యానములో సమర్థింపఁబడెను. లేక యీసర్గయందే యుత్తరగ్రంథమందు—"చత్వార స్తే చతస్ఱాణాం వసిష్ఠానుమతే స్థితాః, యథోక్తేన తథా చక్రుః" అని చెప్పఁబడియుండుటచేత వసిష్ఠునిచేఁ బ్రేరితులయి భరతలక్ష్మణశత్రుఘ్నులు యథాశాస్త్రముగా జ్యేష్ఠానుక్రమము ననుసరించి పెండ్లియాడి రనునర్థము సమంజసముగా నున్నట్లు తోఁచుచున్నది.

"సీతా మాదాయ గచ్ఛ త్వ మగ్రతో భరతాగ్రజ!
పృష్ఠతోఽహం గమిష్యామి సాయుధో ద్విపదాంవర!." (అయో. 55. స.)

ఇది రాముఁడు లక్ష్మణునితో నన్నమాట. ఇచట "భరతాగ్రజ!" అను సంబుద్ధికి భరతుఁ డగ్రజుఁడుగాఁ గలవాఁడని తాత్పర్యము గాని భరతుని కగ్రజుఁ డని కాదు. (గోవింద. వ్యా. చూడుఁ.) కావునఁ బైనవ్రాసినయుక్తులచే భరతుఁడే లక్ష్మణునికంటె పెద్దవాఁ డని నిశ్చయింపఁబడుచున్నది. లక్ష్మణునికి రామానుజుఁ డని వ్యవహార మున్నట్లు భరతానుజుఁ డనికూడ నున్నది.

"హిమవాన్ మందరో మేరు స్త్రైలోక్యం వా సహామరైః,
శక్యం భుజాభ్యా ముద్ధర్తుం న సంఖ్యే భరతానుజః." (యు. 59. 112.)

ఇందువలన భరతుఁడు లక్ష్మణునికంటె పెద్దవాఁ డని నిశ్చయముగాఁ జెప్పవచ్చును.

### 3. రాముఁ డేకపత్నీకుఁడా? బహుపత్నీకుఁడా?

కైకేయి మంథరతోఁ జెప్పుమాట:—

"హృష్టాః ఖలు భవిష్యంతి రామస్య పరమా స్త్రియః,
అప్రహృష్టా భవిష్యంతి స్నుషా స్తే భరతక్షయే."  (అయో. 8. 12.)

"రామునకుఁ బట్టాభిషేకము గాఁగా నతని స్త్రీలు సంతోషము గలవా రగుదురు. భరతునిగ్రహము దుండెడునీకోడండ్రు హర్షహీన లగుదురు."

దశరథవిలాపములో:—

"య స్సుఖే ష్వాపధానేషు శేతే చందనభూషితః,
వీజ్యమానో మహార్హాభి స్స్త్రీభి ర్మమ సుతోత్తమః."  (అయో. 42. 15.)

"ఏనాకుమారుఁడు చందనముఁ బూసికొని యుత్తమస్త్రీలచే వీవఁబడుచున్నవాఁ డయి సుఖకర మైనశయ్యలపైఁ బవళించునో?"

సీత రామునిఁగూర్చి తనలోఁ దా ననుకొనుమాట:—

"పితు ర్నిదేశం నియమేన కృత్వా వనా న్నివృత్త శ్చరితవ్రత శ్చ,
స్త్రీభి స్తు మన్యే విపులేక్షణాభిః స్త్వం రంస్యసే వీతభయః కృతార్థః."
(సుంద. 28. 14.)

"సీతం డ్రియాజ్ఞను నియమముతో నెఱవేర్చి వనమునుండి నివృత్తుండ నయి కృతార్థతనొంది సుందరు లగు స్త్రీలతోఁ గ్రీడింపఁగల నని నేఁ దలంచెద."

"వరకాంచనకేయూరముక్తాప్రవరభూషణైః;
భుజైః పరమనారీణాం పరిమృష్ట మనేకధా." (యుద్ధ. 21-2.)

"ఉత్తమస్త్రీలసాలంకారభుజములచేఁ బలుమాఱు స్పృశింపఁబడినది."

"మాతరశ్చైవ సర్వా మే కుమారాః స్త్రీగణాని చ,
అగ్రతో భరతం కృత్వా గచ్ఛం త్వగ్రే సమాహితాః." (ఉత్తర 91. 23.)

"నాతల్లులు నాకుమారులు స్త్రీగణము భరతుని ముం దుంచుకొని నడుతురుగాక."

మొదటిశ్లోకములో "రామస్య పరమాః స్త్రియః" అన్నచోట "స్త్రియః" అని బహువచననిర్దేశముచేఁ బరిచారికాస్త్రీ లని యభిప్రాయము గాదు. స్నుషాశబ్ద సాహచర్యమువలన నీస్త్రీశబ్దము భార్యాపరముగాఁ జెప్పవలెను.

"వరకాంచన"యనుశ్లోకములో వచ్ఛశయనవర్ణనమందు—భుజములచే భుజములను స్పృశించుట భార్యలకంటె నితరస్త్రీలకుఁ దగదు—

"మాతరశ్చైవ" అనుశ్లోకమందుఁ జెప్పఁబడినస్త్రీగణము కుమారులు, సీతకంటె నితరులయినభార్య లుండినఁగాని సంభవింపదు. రాముఁ డనేకాశ్వమేధయాగము లొనరించినట్లు గానవచ్చుచున్నది. అపత్నీకునికి యజ్ఞానుష్ఠానమం దధికారము లేదు. కావున రాముని కితరభార్య లుండవలయును. సీతయం దుండు స్నేహబహుమానములచే రాముఁ డామెప్రతికృతిని దగ్గఱ నుంచుకొనెనుగాని యజ్ఞకర్మానుష్ఠానముకొఱకుఁ గాదు.

"పితుర్నిదేశమ్" అనుశ్లోకములో "స్త్రీభిః రంస్యసే"అని చెప్పుటవలన నితరభార్య లున్నట్లు స్పష్టము.

కావునఁ బైనవ్రాసినశ్లోకములఁబట్టి యాలోచింపఁగా రాముఁడు బహుపత్నీకుఁ డని తోఁచుచున్నది.

## సిద్ధాంతము.

రాముఁ డేకదారవ్రతుఁ డన్నసంగతి సర్వసిద్ధము. ఎంతమాత్ర మతని కితరభార్యలు లేరు. సీతాపరిత్యాగానంతర మతఁ డాచరించినయజ్ఞములయం దెల్ల సీతాప్రతికృతియే సహధర్మచారిణి. తనభార్య దూరదేశమం దుండఁగాఁ బురుషుఁడు యజ్ఞము చేయఁగూడ దనునిషేధము లేదు నరేకదా! మీఁదుమిక్కిలి యట్టిభార్యయొక్క ప్రతికృతిని దగ్గఱ నుంచుకొని కర్మ నాచరింపవలయు నని విధి గానవచ్చుచున్నది. ఇందుకు హేమాద్రి యనుధర్మశాస్త్రమందు—

"దూరభార్యోఽననుకూలభార్యశ్చ దర్భపుంజీలైర్భార్యాప్రతినిధిం విధాయ పార్వణం కుర్యాత్. పత్నీకర్తవ్యాని కర్మాణ్యాత్మన స్స్వయం యజమానో వా కుర్యాత్. యథా తస్యా మసమర్థాయాం పత్నీవినాశాభావా న్నాగ్నేర్వినాశః."

ఎవనిభార్య దూరదేశమం దున్నదియు యవిధేయురాలును నయి యుండునో యాపురుషుఁడు దర్భతో భార్యాప్రతికృతిని జేసి దగ్గఱ నుంచుకొని శ్రౌతకర్మ నాచరింపఁదగును. పత్ని చేయవలసిన కర్మలను యజమానుఁడుగాని అధ్వర్యుఁడుగాని చేయును. భార్య కర్మాచరణమం దసమర్థురా లయి యున్నను వర్జింపలేదు గావున నగ్నికిఁ గూడ నాశము లేదు.''

ఈవచనప్రమాణము ననుసరించి చూడఁగా రాముఁడు దూర దేశగతురా లయి జీవించియున్నసీత ప్రతికృతిని దనయొద్ద నిడికొని కర్మల నాచరించుట శాస్త్ర విహితముగాఁ గానవచ్చుచున్నది. ఇదియే కాక

''ఇష్ట యజ్ఞో రఘుపతిః పుత్రద్వయసమన్వితః,
న సీతాయాః పరాం భార్యాం వవ్రే స రఘునందనః.'' (ఉత్త. 99.8.)

''సీత భూమిలోఁ బ్రవేశించినతరువాత శ్రీరామచంద్రుఁడు సీతావియోగదుఃఖము ననుభవించుచుఁ బుత్రద్వయముతోఁ గూడుకొన్నవాఁడై సీతకంటె నితరభార్యను వరింపలేదు.''

రాముఁడు సీతయం దుండెడుస్నేహబహుమానములచే నామెప్రతికృతిని దగ్గఱ నుంచుకొనెను గాని యజ్ఞము నితరభార్యాసహాకారముతోఁ జేసె ననుట మిక్కిలి యసమంజసము పరిత్యజించినభార్యయం దేపురుషుఁడు స్నేహబహుమానములఁ గనుపఱుచును? అట్లు చేసినచో నెంత యవద్యముగా నుండును?

రాముఁడు లక్ష్మణునితోఁ జెప్పుమాట.—

''కాంచనీం మమపత్నీం చ దీక్షార్హాం యజ్ఞకర్మణి,
అగ్రతో భరతః కృత్వా గచ్ఛ త్వగ్రే మహాయశాః.'' (ఉత్త. 91.24.)

అనుప్రమాణమువలన యజ్ఞాచరణమందును సీతాప్రతికృతియే కాని రామునికితరభార్యలు లేనట్టు స్పష్టమగుచున్నది. కాళిదాసుకూడ రఘువంశములో, ''అనన్యజానే స్సైనవాసీ ద్భార్యా యస్య హిరణ్మయీ'' అని చెప్పియున్నాఁడు కావున రాముఁ డేకపత్నిగలవాఁడుగాని బహుపత్నీకుఁడు కాఁడు. ''స్త్రీభి స్తు మన్యే విపులేక్షణాభిః''అని సీతచెప్పినమాట తాను మృతినొందఁగాఁ దనభర్త తిరుగఁ బెండ్లియాడు నని యూహించి సీత యీర్ష్యవలనఁ బలికినపలుకుగాఁ దలంపవలయును. గాని సత్యముఁగాదు. ''పరమనారీణాం'' మిత్యాదిశ్లోకములయందుఁ జెప్పఁబడినస్త్రీలు దాసీజను లని గ్రహింపవలయును.

## 4. సీతారాముల వయోనిర్ణయము.

వివాహసమయమునకు సీతారాముల వయ స్సింతయని వాల్మీకిరామాయణమం దెచ్చటను నిశ్చయముగాఁ జెప్పలేదు. అనుక్తాంశ మన్యగ్రంథములనుండి గ్రహింపవలయు నను న్యాయము ననుసరించి రామాయణార్థోపబృంహణము లైన పద్మపురాణము మొదలగువానిని విమర్శించి చూడఁగా రామునికంటె సీతయే వయోధికురా లయిన ట్లగపడుచున్నది. ఎట్లన:—

''ఊనషోడశవర్షో మే రామో రాజీవలోచనః,
న యుద్ధయోగ్యతా మస్య పశ్యామి సహ రాక్షసైః.'' (బాల)

"పద్మములవంటి నేత్రములుగలనారాముఁడు పదునాఱేండ్లకుఁ దక్కువవయస్సుగలవాఁడు. కావున రాక్షసులతోఁ బోరుటకుఁ దగిన సామర్థ్య మితని కున్న దని నేఁ దలంపను."

ఇది విశ్వామిత్రునితో దశరథుఁ డన్నమాట. పదునాఱేండ్లకుఁ దక్కువ వయస్సు గలవాఁ డనుటచేఁ బూర్ణముగా షోడశవర్షము లున్నచోఁ గొంచెము యౌవనప్రాదుర్భావ మగుటవలన రాక్షసులతో యుద్ధము చేయుటకు శక్తిగలవాఁడై యుండవచ్చును. ఆపాటివయస్సైనను రాలే దనుదశరథోక్తిచే రాముఁడు శైశవావస్థలో నున్నట్లు సూచింపఁబడినది.

2. మారీచుఁడు రావణునితోఁ జెప్పుమాట.

జనస్థానవాసు లగుఖరాదులను వధించి నాసోదరి యగుశూర్పణఖను వైరూప్య మొందించుటచేనా కపకర్తయగురామునిపైఁ బగఁ దీర్చికొనుట కాతనిభార్య యగుసీత నపహరించుటకుఁ దలంచియున్నా నిపుడు నీవు కొంచెము తోడ్పాటు గావింపవలయునని రావణుఁడు మారీచునిఁ బ్రార్థింపఁగా వాఁడిట్లనియె.

"కదాచి దప్యహం వీర్యా త్పర్యట న్పృథివీ మిమామ్,
బలం నాగసహస్రస్య ధారయ న్పర్వతోపమః.
న్యచరం దండకారణ్యే ఋషిమాంసాని భక్షయన్,
భయం లోకస్య జనయ న్కిరీటీ పరిఘాయుధః.
విశ్వామిత్రోఽథ ధర్మాత్మా మద్విత్రస్తో మహామునిః,
స్వయం గత్వా దశరథం నరేంద్ర మిద మబ్రవీత్.
అద్య రక్షతు మాం రామః పర్వకాలే సమాహితః,
మారీచా న్మే భయం ఘోరం సముత్పన్నం నరేశ్వర!.
ఇ త్యేవ ముక్తో ధర్మాత్మా రాజా దశరథ స్తదా,
ప్రత్యువాచ మహాభాగం విశ్వామిత్రం మహామునిమ్.
బాలో ద్వాదశవర్షోఽయ మకృతాస్త్రశ్చ రాఘవః,
కామం తు మమ య త్సైన్యం మయా సహ గమిష్యతి." (అర. 38. 2.7.)

ఈశ్లోకములయందుఁ జెప్పఁబడినట్లు పండ్రెండేండ్లవాఁ డనుదానికి దశరథుఁడు విశ్వామిత్రునితోఁ జెప్పినపుడు ఊనషోడశవర్షుఁ డనుదానికి నైక్యము ఘటింపఁజేయుటకు "ఊనషోడశ" శబ్దమునకుఁ బాదోనషోడశవర్ష మని నాల్గుచేఁ దక్కువైన పదునాఱు, (అనఁగా పండ్రెండు.) అని యర్థముఁ గల్పించినచోఁ బండ్రెండు సంవత్సరము లని లభింపఁగా రాముఁడు విశ్వామిత్ర యాగరక్షణసమయమునకుఁ బండ్రెండేండ్లవాఁ డనియు, యాగరక్షణానంతరము సుమారు రెండు మాసములలో సీతావివాహము జరుగుటచే సీత రామునికంటెఁ బెద్ద దని తోఁచుచున్నది.

"పతిసంయోగసులభం వయో దృష్ట్వా చ మే పితా,
చింతా మభ్యగమ ద్దీనో విత్తనాశా దివాధనః." (అయో. 118.34.)

అత్రిమహామునిభార్య యగు ననసూయతో సీత చెప్పిన పైశ్లోకమువలన వివాహకాలముకంటెఁ బూర్వమందే సీతకుఁ బతిసంయోగయోగ్య మగువయస్సు ప్రాప్తించినటుల స్పష్ట మగుచున్నది.

పద్మపురాణములో సీతోత్పత్తిక్రమ మిట్లు సెప్పఁబడినది.

"అథ లోకేశ్వరీ లక్ష్మీ ర్జనకస్య నివేశనే,
శుభక్షేత్రే హలోత్ఖాతే సముద్భూతా సుమధ్యమా.
బాలార్క కోటిసంకాశా పద్మపత్రనిభేక్షణా,
లంకాయాం వై సుశ్శ్రోణి పద్మకోశే పురా హ్యభూత్.
సర్వలక్షణసంపన్నా నిత్యయౌవనశాలినీ,
ధృత్వా వక్షసి చార్వంగీ మాలా మమ్లానపంకజామ్.
సీతాముఖే సముత్పన్నా సీతేతి భువి విశ్రుతా,
తాం దృష్ట్వా జనకో రాజా కన్యాం వేదమయీం శుభామ్.
ఉద్ధృత్యాపత్యభావేన పుపోష మిథిలాధిపః,
జనకస్య కులే రమ్యే సర్వలోకేశ్వరప్రియా.
ఐవృధే సర్వలోకస్య రక్షణార్థం సురేశ్వరీ."

వాల్మీకి చారిత్రములోఁ జెప్పఁబడినసీతోత్పత్తిక్రమ మిది:—

"పురా లక్ష్మీ స్త్వభూ జ్జాతా పద్మకోశే సరోవరే,
లంకాయాం శివపూజార్థం రావణేన మహాత్మనా.
పద్మా న్యాహర్తుకామేన దృష్టా సా శుభేక్షణా,
తాం దేవీం పద్మమధ్యస్థాం యౌవనస్థా మయోనిజామ్.
దృష్ట్వా తు కేయ మితి వై రావణో విస్మయాకులః,
ప్రహస్తాదిభి రాలోచ్య మంత్రిభి ర్మంత్రకోవిదైః.
నిక్షిప్య తాం పేటికాయాం సింధుమధ్యే వ్యచిక్షిపత్,
కృతార్థ మివ చాత్మానం మేనేఽసౌ రాక్షసేశ్వరః.
సముద్రమధ్యే విక్షిప్తా నామ్నా వేదవతీ స్మృతా,
పేటికాంతస్థ్సితా తన్వీ మిథిలానగరం గతా.
నదీజలప్రవాహా చ్చ చిరకాలం స్థితా హ్యభూత్,
మిథిలాయా శ్చోపకంఠే భూమే రంతర్గతా సతీ."

పైనవ్రాసినశ్లోకములవలన సీత జననకాలమునుండియు "నిత్యయౌవనశాలినీ" "అయోనిజా" "యౌవనస్థా" అనువిశేషణములఁబట్టి యౌవనవిశిష్టురా లని తెలియఁబడుచున్నది. పైనవ్రాసిన మారీచదశకంఠోక్తులఁబట్టి యాలోచింపఁగానప్రాప్తయౌవనుఁ డైనరామునికిఁ బ్రాప్తయౌవన యగుసీతకు వివాహము జరిగినట్లుగా నవచ్చుచున్నది. ఇట్టివివాహ మెట్లుజరిగె నని శంకపొడమును. దీనికి సమాధానము:—

సామాన్యముగా లోకములో స్త్రీలకుఁ బండ్రెండవసంవత్సరము మొదలుకొని యౌవన మంకురించును. సీతకు నట్లే యౌవన మంకురించె నని చెప్పుటచే నామెకుఁ బండ్రెండుసంవత్సరములవయ స్సని మన మూహించుకొనవచ్చును. రాముఁడుగూడ నంతవయస్సు గలవాఁ డగుటచే "తేజసాం హి న వయ స్సమీక్ష్యతే" అన్నట్టు లతఁ డప్రాకృతదివ్యమూర్తి యగుటవలనఁ బండ్రెండేండ్లకుముందే ప్రాప్తయౌవనుఁడగుటచే సీతారాములవివాహవిషయమునను విరోధము లేదు. సీతారాములుభయులు వివాహమునాఁటికిఁ బండ్రెండేండ్లవయస్సు గలవారై యుండి రని యొప్పుకొనినచో నరణ్యకాండములో సీత సన్న్యాసివేషధారి యై తనకడకు వచ్చిన రావణునితోఁ జెప్పినమాటకు విరోధింపదు.

"ఉషిత్వా ద్వాదశ సమా ఇక్ష్వాకూణాం నివేశనే,
భుంజానామానుషాన్ భోగాన్ సర్వకామసమృద్ధినీ!
తత్ర త్రయోదశే వర్షే రాజాఽమంత్రయత ప్రభుః,
... ... ... ... ...
మమ భర్తా మహాతేజా వయసా పంచవింశకః,
అష్టాదశ హి వర్షాణి మమ జన్మని గణ్యతే.

(ఆరణ్య.)

వివాహకాలమునకుఁ బండ్రెండేండ్లవయస్సు గలసీత వివాహానంతర మత్తవారియింట సకలభోగముల ననుభవించుచు మఱిపండ్రెండేండ్లు కాపురము చేసి యరణ్యమునకుఁ బోయినపుఁడామె కిరువదినాలుగేండ్లవయ స్సని చెప్పుట సోపపత్తికముగాని పదునెనిమిదేండ్లవయ స్సని చెప్పుట యసంగతముకదా! యన్నచోఁ గానేరదు. జనకరాజుయొక్క యజనశాలాభూమిలో దొరకినస్వర్ణపేటికఁ దెఱచి యేముహూర్తమందు సీతాముఖకమలసందర్శనం బొనర్చెనో యాక్షణమే సీతాజననకాలమను నభిప్రాయముతో గణించినయెడల సీతకుఁ బదునెనిమిదివత్సరములవయ స్సని చెప్పుట యుపపన్నమే. ఇచటఁ దత్త్వ మిది.

పూర్వకాలమందు లంకలో నుండెడు నొకతామరకొలనులోఁ దామరమొగ్గయందు వేదవతి యను నొకకన్యక యుద్భవించెను. శివపూజార్థ మయి పద్మములం గోయఁ బోయినరావణుఁ డామెనుజూచి ప్రహస్తాదిమంత్రివర్గముతో నాలోచించి యీామె మనలంకలో నున్నయెడల మన కందఱకుఁ గీడు మూడు నని నిశ్చయించి బంగారుపెట్టెలోఁ బెట్టి సముద్రములోఁ బడవైచెను. అంతట నాపెట్టె ప్రవాహవేగముచే మిథిలానగర సమీపమునకుఁ గొట్టివేయఁబడి యచట భూమిలోఁ బాతివేయఁబడియుండెను అపుడు జనకరాజు యజ్ఞముచేయుటకయి యొకసాల నిర్మింపఁబోవువాఁడై మొదట భూమిని సమముగాఁ జేయించుటకు నాఁగలితో దున్నించుచుండఁగా నాఁగలికిఁ దగులుకొని భూమిలోనుండి పై కుబికినపెట్టెను దీయించి తెఱచి చూడఁగా నం దొకకన్యక గాన్పించెను. అపుడామెకు సీత యనుపేరిడి పుత్త్రికాభిమానముచే నాఱుసంవత్సరములు పోషించి రాముని కిచ్చి వివాహము

చేసెను. పెండ్లి యైనతరువాతఁ బండ్రెండేండ్లు రామునితోఁ గాపురముచేసి సకల సుఖముల ననుభవించి పదునెనిమిదవయేఁట రామునితో నరణ్యమునకుఁ బోయెను. ఈరీతిగాఁ జూచుకొన్న యెడల సీత రావణునితోఁ బలికినప్రకార మామెకుఁ బదునెనిమిదేండ్లును రామని కిరువదియైదేండ్లును నుపపన్నముగా నున్నవి.

"దశ సప్త చ వర్షాణి జాతస్య తవ పుత్రక!
ఆస్థితాని ప్రకాంక్షంత్యా మయా దుఃఖపరిక్షయమ్." (అయో. 20. 40)

అను కౌసల్యావచనముంబట్టి చూడఁగావనప్రవేశసమయమునకు రామునికిఁ బదునేడు సంవత్సరము ప్రాయ మయినట్లు తేలుచున్నది. ఈకౌసల్యావచనమున కును నాభర్త యిరువదియైదేండ్ల ప్రాయముగలవాఁ డని సీత రావణునితోఁ జెప్పిన మాటకును విరోధింపదా యన్నచో విరోధింపదు

"దశ సప్త చ వర్షాణి జాతస్య తవ పుత్రక!" అనుశ్లోకములోఁ గౌసల్యచే నుద్దిష్టమయినకాలము "జన్మనా జాయతే శూద్రః కర్మణాజాయతే ద్విజః" అనుశాస్త్రానుశాసనమువలననుపనయనకాలము మొదలుపదునేడుసంవత్సరములుగాని రాముని జననకాలమునుండి పదునేడేండ్లు కాదు. (గోవింద. రా) "గర్భైకాదశేషు రాజన్యమ్" అనుగృహ్యసూత్రములో నున్నగర్భైకాదశశబ్దముయొక్క బహువచనసారస్యమునుబట్టిక్షత్రియునికి గర్భస్థుఁడైనసంవత్సరము మొదలుకొనితొమ్మిదవసంవత్సరములోఁగాని పదియవసంవత్సరములోఁగాని పదునొకండవసంవత్సరములోఁగాని యుపనయనముఁ జేయవచ్చు నని విధాన ముండుటవలన రాముఁ డెనిమిదవయేఁట నుపనయన మయినచో నాకాలము మొదలుకొని వనప్రయాణసమయమునకుఁ బదునేడేండ్లు కాఁగా రాముని వయస్సు సీత చెప్పిన ట్లిరువదియైదేండ్లు కుదిరినది.

౮. రావణుని, మొదట నలకూబరుఁడు శపించెనా? బ్రహ్మ శపించెనా?.

ఒకకాలమందు నలకూబరునియొద్దకుఁ బోవుచున్నరంభను రావణుఁడు బలాత్కారముగాఁ బట్టుకొని రమింపఁగా నలకూబరుఁ డీవృత్తాంతము రంభవలన నెఱింగి కోపించి 'ఇకమీఁద రావణుఁ డిష్టములేనిస్త్రీలఁ జెఱుప నుద్యమించిన యెడల వానిశిరస్సు నూఱుముక్క లగుఁగాక" యని శపించె నని యుత్తరకాండము 26 వ సర్గలోఁ జెప్పఁబడియున్నది.

"ధర్షణాం తాం పరాం శ్రుత్వా ధ్యానం సంప్రవివేశ హ
తస్య తత్కర్మ విజ్ఞాయ తదా వైశ్రవణాత్మజః.
ముహూర్తా త్క్రోధతామ్రాక్షః తోయం జగ్రాహ పాణినా,
గృహీత్వా సలిలం దివ్య ముపస్పృశ్య యథావిధి.
ఉత్ససర్జ తదా శాపం రాక్షసేంద్రాయ దారుణమ్.
యదా హ్యకామాం కామార్తో ధర్షయిష్యతి యోషితమ్
మూర్ధా సహస్రధా తస్య శకలీభవితా తదా."

ఈరీతిగా మఱియొకసమయమందు రావణుఁడు పుంజికస్థల యనునప్సరస నొకదానిని మానభంగము సేయఁగా నది చతుర్ముఖునికడ కేఁగి మొఱలిడె. అంత బ్రహ్మ యమితకోపము గలవాఁడై యిటపై నీవుప్రత్తుఁ డన్యస్త్రీలను బలాత్కరించినయెడల నీనిశిరస్సు శతశకలములు కావలయు నని శపించె నన్నవృత్తాంతమును దశకంఠుఁడే సీతను పేక్షించుటకుఁ గారణ మే మని మహాపార్శ్వుఁ డడుగఁగా నిట్లు చెప్పుచున్నాఁడు:—

"అథ సంకుపితో దేవో మా మిదం వాక్య మబ్రవీత్,
అద్యప్రభృతి యా మన్యాం బలా న్నారీం గమిష్యసి.
తథా తే శతధా మూర్ధా ఫలిష్యతి న సంశయః."

(యుద్ధ. 13.)

బ్రహ్మనలకూబరశాపములలో నేద్ది మొదట సంభవించినది? నలకూబరుని శాపము మొదటి దనుకొనినయెడల రావణుఁడు పుంజికస్థలను స్పృశింపఁగూడదు. బ్రహ్మశాపమే ప్రథమమందు సంభవించినయెడల రంభాదూషణప్రయుక్త మగు నలకూబరశాపమున కవకాశము లేకపోవలసివచ్చును. ఈరీతిగా నీరెండుశాపములలో నేద్ది మొదటిది యను సందేహములో గొప్పవిరోధము ప్రసక్తమగుచున్నది. దీనికి సమాధానము:—

నలకూబరునిశాపమే మొదటి దని యంగీకరించుట న్యాయ్యము. ఏలయన? పతివ్రత లగుస్త్రీలను మాత్రమే రావణుఁడు దూషింపఁగూడ దని నలకూబరునిశాపమునకు వినియోగ మున్నట్లు స్పష్టముగాఁ గానవచ్చుచున్నది.

"తేన నిస్సీమతాం స్త్రీత్తి మాషు స్సర్వాః పతివ్రతాః,
నలకూబరనిర్ముక్తం శాపం శ్రుత్వా మనఃప్రియమ్."

(ఉత్త. 26. స)

ఈశ్లోకమునుబట్టి యాలోచింపఁగా నలకూబరశాపము పతివ్రతాదూషణనివారణమాత్రమందుఁ జరితార్థ మయ్యెనని నిశ్చయింపఁబడుచున్నది. ఈకారణమునఁ బుంజికస్థల యప్సరస గావున సామాన్య యగుటచే దానియుపభోగమందు దోషము లేదని తలంచినరావణునిచేఁ బుంజికస్థల బలాత్కరింపఁబడఁగా స్త్రీసామాన్యమును గూడ నీఁ డిటపైని దూషింపఁ గూడ దని బ్రహ్మ శపించియుండెను. ఈయర్థమునే మనస్సునం దుంచుకొని రావణుఁడు మహాపార్శ్వునితోఁ దనవృత్తాంతమును బ్రస్తావించుటలో సీతాసంస్పర్శవిషయమై బలవత్తరప్రతిబంధక మగు స్త్రీసామాన్యవిషయక బ్రహ్మశాపమునే చెప్పియున్నాఁడు గాని రంభాదూషణప్రయుక్త మగునలకూబరశాపము నుదాహరింప లేదు. కావున నలకూబరశాపమే మొదటిది.

శ్రీరామాయణ మామూలాగ్రముగాఁ బరికింప నచ్చటచ్చటఁ గొన్నియాక్షేపములు స్ఫురించుచున్నవి. వానికి సమాధానము చెప్పుట యావశ్యకము.

ప్రథమాక్షేపము:—

అయోధ్యాకాండలో శ్రీరామపట్టాభిషేకప్రకరణమందు దశరథుఁడు పూర్వము కేకయరాజునొద్దకుఁ బోయి కైకేయి యనుకన్యను దనకిమ్మని ప్రార్థించెను. ఆమెగర్భమందు జనించుపుత్త్రునికి రాజ్య మిచ్చెద నని నీవు ప్రతిజ్ఞ చేసినయెడల నీయభిలాష నెరవేర్తు నని కేకయరాజు నుడువఁ బంక్తిరథుం డట్ల కావించెద నని శపథము చేసి యామెను బెండ్లాడెను. ఈకథ రామాయణార్థోపబృంహకము లయిన పురాణములయందుఁ బ్రసిద్ధము.

"పురా భ్రాతః! పితా న స్స మాతరం తే సముద్వహన్
మాతామహే సమాశ్రౌషీ ద్రాజ్యశుల్క మను త్తమమ్" (అయో. 107. 3.)

కైకేయీవివాహకాలమందే కైకేయికిఁ బుట్టఁబోవుపుత్త్రునికి దశరథునిచే రాజ్యప్రదానము ప్రతిజ్ఞాతమయినట్లు పైశ్లోకమువలనఁ గానవచ్చుచున్నది. కాన దశరథుఁడు తాను కైకేయికిఁ జేసినవాగ్దానమునకు విరుద్ధముగాఁ జోరవృత్తినవలంబించి రామాభిషేకసమయమున ననేక దేశములనుండి యనేకరాజులను దూతలద్వారా రప్పించినను కేకయరాజునకు మాత్ర మీవృత్తాంతమును దెలియనీయకయే రామునిఁ బిలువనంపి—

"విప్రోషిత శ్చ భరతో యావ దేవ పురా దితః,
తావదే వాభిషేక స్తే ప్రాప్తకాలో మతో మమ." (అయో.)

అని రామునితోఁ జెప్పి రామపట్టాభిషేకమున కుద్యమించెను. దశరథునంత గొప్పవాఁ డిట్లేల చేయవలయును?

శ్రీరామాయణవ్యాఖ్యాతలు దీని కిట్లు సమాధానము వ్రాసియున్నారు:—

దశరథుఁడు కేవలము నీకుమారునికి రాజ్యమిచ్చెదననియే కైకేయికిఁ బ్రతిజ్ఞ చేసియుండలేదు. మఱేమనఁగా: "సమయమందు నాకు నీవు జ్ఞాపకము చేసినయెడల నీపుత్త్రునికే రాజ్యమిత్తును నీవు మఱచిపోయినయెడల సకలసద్గుణసాగరుఁడు రాజ్యపరిపాలనార్హుఁ డైనమఱియొక పుత్త్రునికి ధర్మశాస్త్రమునకు విరోధము లేకుండ రాజ్యమిచ్చెద" ననియే ప్రతిజ్ఞ చేసెను. అందువలన దశరథుఁడు తనప్రతిజ్ఞ నతిక్రమింపలేదు. కైకేయియీయంశమును యుక్తసమయమునందు దశరథునికి జ్ఞాపకముచేయక పోవుటచే దశరథుఁ డీసంగతి నాలోచించి భరతుఁ డయోధ్యకు రాకమున్నె శాస్త్రవిహితముగా రాజ్యపరిపాలనార్హుఁ డైనరామునికిఁ బట్టాభిషేక మొనర్ప నిశ్చయించెను ఇందుచేతనే పట్టాభిషేకమహోత్సవవృత్తాంతమును దెలియఁ జేయుటకుఁ గేకయరాజుకు దూతలఁ బంపలేదు. ఈయర్థ ముమాసంహితలో నుమామహేశ్వరసంవాదమం దిటుల పరిష్కరింపఁబడియున్నది. పార్వతి శివు నడుగుచున్నది.—

"రాజ్ఞో దశరథ స్యాస్య మృషావాదిత్వ మాగతమ్,
ప్రతిజ్ఞోల్లంఘనం యస్మా త్కృతం త త్కేకయాధిపే,

కైకేయ్యా గ్రహణే పూర్వం త దుద్వాహే హ్యుపస్థితే.'' (ఉమాసంహిత)

దశరథుఁడు రాజ్య మిచ్చెదనని కేకయరాజునకుఁ బ్రతిజ్ఞ చేసి యట్లివ్వకపోవుటచే నన్నృతవాది కాలేదా యని పార్వతి శివు నడుగఁగా:—

''వివాహసమయే రాజ్ఞా ప్రతిజ్ఞాత మిదం శృణు,
పట్టాభిషేకసమయే భవేయం స్మారితో యది.
త్వయా వాఽన్యేన భూపాల! తథా చ కరవా ణ్యహమ్,
ఇత్థం ప్రతిజ్ఞా మకరో ద్వివాహ గ్రహణే నృపః.
తస్మా దస్మి న్నరవ్యాఘ్రే న దోషో స్తి శుభాననే.'' (ఉమాసంహిత)

దశరథుఁడు వివాహసమయమందుఁ గేకయరాజునకిట్లు ప్రతిజ్ఞ చేసెను. ''ఓయి రాజా! పట్టాభిషేకసమయమందు నీసంగతి నీవు నాకు జ్ఞాపకముచేసిన యెడల నట్లే చేయుదు'' ననెను. కావున దశరథునియందు దోషము లేదు. ఇదిగాక మఱియొక విశేషము కలదు.

''దైవాసురే చ సంగ్రామే జనన్యై తవ పార్థివః,
సంప్రహృష్టో దదౌ రాజా వర మారాధితః ప్రభుః.'' (అయో. 107. 4.)

కైకేయి తనవివాహకాలమందే కన్యాశుల్కముగాఁ దనపుత్త్రునికి రాజ్యప్రాప్తి సిద్ధమైయుండఁగాఁ దిరుగ దేవాసురయుద్ధములోఁ దానొనర్చినయుపచారములచేఁ బరితుష్టుఁడైనరాజువలన భరతునికి రాజ్య మిప్పించెడు వరము నేట్లుకోరెనని మఱియొక ప్రశ్న. వివాహకాలమందు దశరథుఁడు కైకేయికిఁ జేసినప్రతిజ్ఞ బాల్యమందు జరిగినదగుటచేతను జిరకాలాంతరిత మగుటవలనను కైకేయి యీసంగతి మఱచియుండవచ్చును. తరువాతమఱికొంతకాలమునకుజరిగినవరద్వయదానముసన్నిహితమైనదగుటవలనఁ జిరకాలాంతరిత మైనదానిని మఱచి స్మృతిపథమునందు నూతనముగా నున్నవరద్వయమునే యాచించె నన్నచో దోషము లేదు. మధ్యకాలమందు జరిగిన యీవరద్వయమునుగూడ కైకేయి మఱవఁగా:—''కిం న స్మరసి కైకేయి! స్మరంతీ వా నిగూహసే'' (అయో. 9. 5.) అని మంథరజ్ఞాపకము చేసిన మీఁదఁ గైకేయి స్మృతిపథమునకుఁ దెచ్చుకొన్నదన్నచో బాల్యమందు జరిగిన వృత్తాంతము బొత్తిగా మఱచెననుట యుపపన్నతరమే వివాహకాలమందుఁ గైకేయీపుత్త్రునికి రాజ్య మిచ్చెద నని ప్రతిశ్రుతిచేసి దశరథుఁడు రామునికెట్లు పట్టముఁ గట్ట నుద్యోగించెను? అన్నచో,

''ఉద్వాహకాలే రతిసంప్రయోగే ప్రాణాత్యయే సర్వధనాపహారే,
విప్రస్యచార్థేఽప్యనృతం వదేయుః పంచానృతా న్యాహు రపాతకాని.''

అనున్యాయము నవలంబించి దశరథుఁ డట్లు చేసె నన్నయెడల దోషము లేదు.

ద్వితీయాక్షేపము:—

కిష్కింధాకాండములో వాలి నిరపరాధి నైనన న్నేలవధించితి వని యడుగఁగా శ్రీరామచంద్రుఁడు—

"తద్వ్యతీతస్య తే ధర్మా త్కామవృత్తస్యవానర!
భ్రాతృభార్యావమర్శేఽస్మి౯ దండోఽయం ప్రతిపాదితః.
న చ తే మర్షయే పాపం క్షత్రియోఽహం కులోద్భవః,
ఔరసీం భగినీం చాపి భార్యాం చాప్యనుజస్య యః.
ప్రచరేత నరః కామా త్తస్య దండో వధస్స్మృతః." (కిష్కిం. 18. స.)

అని చెప్పి శాస్త్రమును గనుపఱిచి "నీవు భ్రాతృజాయాసక్తుఁడ వగుట వలన మహాపాతకి వని నిశ్చయించి నీవంటివానికి వధ తప్ప నితరశిక్షలు లే వని తలంచి నిన్ను వధించితి"నని చెప్పెను. ఇట్లు జరిగియుండఁగాఁ బట్టాభిషేకానంతర మందుఁ దారను వశపఱుచుకొనుటచే సుగ్రీవుఁడుగూడ భ్రాతృభార్యాగామిత్వ రూపపాపము గలవాఁ డయ్యె. ఉమాసంహితలోఁ బార్వతి శివునిఁ బ్రశ్నించు చున్నది.—

"పుత్త్రభార్యా శిష్యభార్యా కనిష్ఠభ్రాతు రేవ చ,
స్నుషా చ జ్యేష్ఠ భార్యాచ మాతులస్య కుటుంబినీ.
మాతృతుల్యా ఇతి ఖ్యాతాః కథం తారాసమాగమః." (అధ్యా. 10.)

ఇందువలన మాతృతుల్యురా లయినతారతోఁ గాఁపురముచేయుట సుగ్రీవునికి మహాపాప మని స్పష్ట మగుచున్నది. కావున సుగ్రీవుఁడుగూడ వాలివలెఁ బాతకి యగుటచే వధదండనార్హుఁ డై యుండఁగా రాముఁడు పక్షపాతము గలవాఁ డై సుగ్రీవునిఁ జంపక వాలి నేల చంపె నని యాక్షేపము.

సమాధానము:—

శ్రీరామునికి లేశమయినను బక్షపాతము లేదు. సుగ్రీవుఁడు దోషి కాఁడు. ఇందు కుమాసంహితలో బ్రమాణము.—

"యోనిజాతాసు నారీషు సంసర్గో లోకగర్హితః,
యోన్యజాతా స్వంగనాసు గమనే నైవ కిల్బిషమ్." (అధ్యా. 10.)

ఇందువలనఁ దార యయోనిజురా లగుటచేఁ దత్సంగతుఁ డైనసుగ్రీవునికి దోషము లే దనుధర్మతత్త్వ మెఱింగినరాఘవుఁడు సుగ్రీవునియందు దయగలవాఁ డయ్యె సుగ్రీవునిభార్య యగుటను యోనిసంభూతురా లగుటచేఁ దత్సపృత్తుఁ డగువాలి పాపిష్ఠుఁ డని నిశ్చయించి రాముఁడు వానిని వధించెను. ఇది గాక మఱి యొకవిశేషము.

"అస్య త్వం ధరమాణస్య సుగ్రీవస్య మహాత్మనః,
రుమాయాం వర్తసే కామాత్ స్నుషాయాం పాపకర్మకృత్." (కిష్కిం. 18. 19)

ఇందువలన సోదరుఁడు జీవించియుండఁగా నతనిభార్యను ముట్టఁగూడదు. మృతుఁ డైనసోదరునిభార్య పరిగ్రాహ్యురా లని వానరకులధర్మము రామాయణము నాంధ్రీకరించిన గోపీనాథము వేంకటకవిగూడ నీయర్థమునే యాంధ్రీకరణమందు విశదీకరించియున్నాఁడు. రాముఁడు వాలితోఁ జెప్పుమాట:—

"వానరేంద్రా! భ్రాతృభార్యాపమర్శనంబు సుగ్రీవునికిని సమానం బని యంటివేని సుగ్రీవుండు మాయావి బిలాంతర్గతయుద్ధంబుననీమరణంబునిశ్చయించి తారయందు వర్తించె. నీవు సుగ్రీవుండు సప్రాణుం డగుట యెఱింగియు నతనిపత్నియగు రుమయందు వర్తించితివి. కావున నీదోషంబునకును సుగ్రీవుని దోషంబునకును వైషమ్యంబు గలదు. అట్లగుటం జేసి నిన్ను వధించితి."

తృతీయాక్షేపము:—

బాలకాండములో వానరోత్పత్తిప్రకరణమందుగంధమాదనసుషేణశరభులయుత్పత్తి యొకరీతిగాను యుద్ధకాండములో రావణశార్దూలసంవాదమందు మఱియొకరీతిగాను బ్రతిపాదింపఁబడియున్నది. ఎట్లన:—

"ధనదస్య సుతశ్శ్రీమాన్ వానరో గంధమాదనః"

అని ప్రారంభించి

"వరుణో జనయామాస సుషేణం నామ వానరమ్,
శరభం జనయామాస పర్జన్యస్తు మహాబలః." (యుద్ధ.)

ఈశ్లోకములయందు గంధమాదనుఁడు కుబేరపుత్త్రుఁ డనియు, సుషేణుఁడు వరుణసుతుఁ డనియు, శరభుఁడు పర్జన్యునికుమారుఁ డనియుఁ జెప్పఁబడినది.

తే. గీ. అవనిఁ గిన్నరేశునంశంబున జనించె, జగము లొక్కభంగి సన్నుతింప
దైత్యసూదనుండు ధైర్యనిర్జితగంధ, మాదనుండు గంధమాదనుండు.

తే. గీ. ఘనబలుఁడు సింధుపతియంశమున జనించె, నలసుషేణుఁడు వనచరకులవరుండు
జవవినిర్జితశరభుండు శరభుఁ డనెడు, వనచరవరుండును పర్జన్యువలనఁ గలిగె."

యుద్ధకాండములోఁ జెప్పఁబడినరీతి పైదానికి విరుద్ధముగా నున్నది. ఎట్లన:

"సుషేణశ్చాత్ర ధర్మాత్మా పుత్త్రో ధర్మస్య వీర్యవాన్"

అని మొదలిడి

"పుత్త్రా వైవస్వతస్యాథ పంచ కాలాంతకోపమాః,
గజో గవాక్షో గవయ శ్శరభో గంధమాదనః." (యుద్ధ. 30. 26)

"ధర్మాత్ముఁ డగుసుషేణుండు ధర్మపుత్త్రుండు గజగవయగవాక్షగంధమాదనశరభులు వైవస్వతునిపుత్త్రులు."

అని యిట్లు సుషేణుఁడు ధర్మపుత్త్రుఁ డనియు, శరభగంధమాదనులు వైవస్వతపుత్త్రులనియుఁ జెప్పుటచేత బాలకాండయుద్ధకాండోక్తార్థములకుఁ బరస్పరవిరోధము చూపట్టుచున్నది. దీనికి సమాధాన మెట్లన:—సుషేణశరభగంధమాదనులను పేరుగలవానరులు పెక్కుమంది యుండుటచే బాలకాండోక్తసుషేణశరభాదులకంటె యుద్ధకాండోక్తసుషేణశరభాదులు వేఱుగావునఁ బూర్వోక్త మయిన విరోధము లేదని తిలకవ్యాఖ్యానము ప్రతిపాదించుచున్నది.

చతుర్థాక్షేపము:—

పదునాలుగేండ్లాహారనిద్రల వర్జించినవానిచేఁ గాని యింద్రజిత్తు వధింపఁ

బడఁ డని వానికి బ్రహ్మ వర మిచ్చినట్లు వాసిష్ఠరామాయణమందుఁ గానవచ్చు చున్నది.

"మేఘనాదో మహాఘోరం తపః కృత్వాఽబ్రవీత్తతః,
బ్రహ్మాణం లోకకర్తారం వరాన్మే దేహి సాంప్రతమ్.
బ్రహ్మా తద్వచనం శ్రుత్వా మేఘనాదం తదాఽబ్రవీత్,
... ... ... ... ...
చతుర్దశ చ వర్షాణి నిద్రాహారవివర్జితః,
రామ స్యావరజో య స్స్యా త్తేన నాశో భవే త్తవ." (వాసిష్ఠరామాయణ.)

ఈయంశము వాల్మీకిరామాయణమం దెచ్చటను గానరాదు సరేకదా,యీ కథకు విరుద్ధముగా లక్ష్మణుఁడు నిత్యము మాంసాద్యాహారములను భుజించుచున్నట్లు రాత్రులయందు నిద్రించుచున్నట్లు ననేకస్థలములయందు బ్రమాణములు గానవచ్చుచున్నవి.

"అగ్రే ప్రదాయ భూతేభ్య స్సీతాఽథ వరవర్ణినీ,
తయో రుపదదే భార్యా మధు మాంసం చ తద్భుశమ్.
తయో స్సుప్తి మథోత్పాద్య వీరయోః కృతశౌచయోః,
విధివ జ్జానకీ పశ్చా చ్చక్రే తత్ప్రాణధారణమ్.
అథ రాత్ర్యాం వ్యతీతాయా మవసు ప్త మనంతరమ్,
ప్రబోధయామాస శనై ర్లక్ష్మణం రఘునందనః.
స సు ప్త స్సమయే భ్రాత్రా లక్ష్మణః ప్రతిబోధితః,
జహౌ నిద్రాం చ తంద్రీం చ ప్రస క్తం చ పథి శ్రమమ్" (అయో. 56. 1-3.)

రాముఁడు వనవాసార్థ మయోధ్యానగరము విడిచినదినము మొదలుకొని దిరుగ నాపట్టణమును బ్రవేశించుటకుఁ బట్టినపదునాలుగు వత్సరములలో నెప్పు డేయేప్రదేశములకుఁ బోయెనో? ఎప్పు డేయేకార్యములం జేసెనో యాకాల మిప్పుడు నిర్ణయింపఁబడవలయును.

వాల్మీకిమహర్షి తనగ్రంథమందు రాముఁ డీదినమం దీకార్యమును జేసెనని కంఠోక్తిగాఁ జెప్పకపోయినను అచ్చటచ్చట నతఁడు సూచించినయర్థములను వ్యాఖ్యాతలొనర్చినవ్యాఖ్యానములను నాలోచింపఁగా నాకార్య మిట్లేర్పఱుపఁబడుచున్నది. రాముఁ డరణ్యమునకుఁ బోవుటకు నిశ్చయించి యయోధ్యను విడిచి బయలుదేఱినదినమే చతుర్దశవత్సరపరిమితవివాసనకాలమునకుఁ బ్రథమదినము.అది చైత్రశుద్ధపంచమి. ఆనాఁటిరాత్రి తమసానదీతీరమందు నివాసము.

"తతు స్తు తమసాతీరం రమ్య మాశ్రిత్య రాఘవః,
సీతా ముద్వీక్ష్య సౌమిత్రి మిదం వచన మబ్రవీత్.
ఇయ మద్య నిశా పూర్వా సౌమిత్రే! ప్రహితా వనమ్" (అయో. 46.)

షష్ఠినాఁడు శృంగిబేరపురప్రవేశము. గుహునితో సమాగమము.

"ఆససాద మహాబాహు శ్శృంగిబేరపురం ప్రతి" (అయో. 50. స.)

సప్తమినాఁడు వనస్పతిమూలనివాసము.

"ఆదాయ మేధ్యం త్వరితం బుభుక్షితౌ
వాసాయ కాలే యయతు ర్వనస్పతిమ్." (అయో. 52. 102.)

అష్టమిరోజున భరద్వాజాశ్రమముఁ జేరుట.

"గత్వా ముహూర్త మధ్వానం భరద్వాజ ముపాగమత్". (అయో. 54. స.)

నవమినాఁడు యమునాతీరముఁ జేరుట.

"అథాఽఽసాద్యతు కాళిందీం శీఘ్రస్రోతస సమాపగామ్
చింతా మాపేదిరే సర్వే నదీజలతితీర్షవః." (అయో. 54. 13,)

దశమినాఁడు సాయంకాలమందు సుమంత్రుఁడయోధ్యను బ్రవేశించెను.

"అనుజ్ఞాత స్సుమంత్రోఽథ యోజయిత్వా హయోత్తమాన్,
అయోధ్యా మేవ నగరీం ప్రయయౌ గాఢదుర్మనాః.
తత స్సాయాహ్నసమయే తృతీయేఽహని సారథిః,
అయోధ్యాం సమనుప్రాప్య నిరానందాం దదర్శహ." (అయో. 57. 4.)

ఆరాత్రియందే దశరథుఁడు స్వర్గతుఁ డగుట. ఏకాదశినాఁడు దశరథునిమృత కళేబరము తైలద్రోణిలో నుంచఁబడినది.

"స రాజా రజనీం షష్ఠీం రామే ప్రవ్రాజితే వనమ్,
అర్ధరాత్రే దశరథ స్సంస్మరన్ దుష్కృతం కృతమ్." (అయో. 63. 4.)
"తైలద్రోణ్యా మథామాత్యా స్సంవేశ్య జగతీపతిమ్,
రాజ స్సర్వా ణ్యథాదిష్టా శ్చక్రుః కర్మాణ్యనంతరమ్." (అయో. 66. 14.)

ద్వాదశినాఁడు భరతునివద్దకు దూతల నంపుట.

"వసిష్ఠే నాభ్యనుజ్ఞాతా దూతా స్సంత్వరితా యయుః" (అయో. 68. 11.)

ఆదూతలు త్రయోదశి చతుర్దశి మార్గమందుఁ గడపి పౌర్ణమినాఁటిరాత్రి కేకయనగరమును బ్రవేశించిరి. పాడ్యమినాఁడు భరతుఁడు మాతులగృహమునుండి యయోధ్యకు బయలుదేఱెను. మార్గమధ్యమందు దేడురాత్రులు గడపి యెనిమిదవ రోజు నవమినాఁ డుదయమున కతిత్వరతో భరతుఁ డయోధ్యను బ్రవేశించెను.

"తాం పురీం పురుషవ్యాఘ్ర స్సప్తరాత్రోషితః పథి,
అయోధ్యా మగ్రతో దృష్ట్వా సారథిం వాక్య మబ్రవీత్." (అయో. 71. 18.)

ఆదినమందే దశరథునికి దహనాదిసంస్కారములు జరిగెను. ఆదినము మొదలుకొని పదుమూఁడురోజులవఱకు ననఁగా వైశాఖశుక్లపంచమివఱకు భరతుఁడు దశరథునికి శ్రాద్ధకర్మల నాచరించెను.

"బ్రాహ్మణేభ్యో దదౌ పుత్రో రాజ్ఞ స్తస్యౌర్ధ్వదైహికమ్,
తతః ప్రభాతసమయే దివసేఽథ త్రయోదశే." (అయో. 77. 4.)

షష్ఠిరోజున దేశీయాచారసిద్ధ మగుదహన దేశశోధనము. సప్తమినాఁడు మార్గశోధనకొఱకుఁ గూలివాండ్రను బంపుట

"త్రయోదశోఽయం దివసః పితుర్వృత్తస్య తే విభో!
సావశేషాస్థినిచయే కిమిహ త్వం విలంబసే." (అయో. 77. 22.)

సప్తమి మొదలుకొని దశమివఱకు త్రోవ బాగుచేయించుట. ఏకాదశి నాఁడు భరతుఁడు రాముని యొద్దకు బయలు దేరుట. ఆనాఁటిరాత్రి గంగాతీరమందు నివాసము. ద్వాదశినాఁడు భరద్వాజాశ్రమప్రాప్తి. త్రయోదశినాఁడు భరతుఁడు రామునితోఁ గలిసికొనుట. చతుర్దశి, పౌర్ణమాసి, పాడ్యమి, మూఁడురోజులు భరతుఁడు చిత్రకూటమం దుండెను. వైశాఖబహుళద్వితీయ భరతుఁడు తిరుగ నయోధ్యకు బయలు దేరెను. చవితినాఁ డయోధ్యలోఁ బ్రవేశించెను. ఈరీతిగా నొకనెలమీఁదఁ బదునైదురోజులుకాఁగా వైశాఖబహుళపంచమినాఁడు రాముఁడు చిత్రకూటమునుండి వెడలి యత్రిమున్యాశ్రమముఁ బ్రవేశించెను. ఈరీతిగా

"క్వచి త్పంచ దశా మ్మాసా నేకం సంవత్సరం క్వచిత్,
క్వచి చ్చ చతురో మాసాన్ పంచ షట్చాపరాన్ క్వచిత్.
అపర త్రాధికం మాసా దప్యర్థ మధికం క్వచిత్,
త్రీ న్మాసా నష్ట మాసాంశ్చ రాఘవో న్యవస త్సుఖమ్.
తథా సంవసత స్తస్య మునీనా మాశ్రమేషు వై,
రమత శ్చానుకూల్యేన యయు స్సంవత్సరా దశ." (అర. 11.)

రాముఁడు మఱి మూఁడుసంవత్సరములు పంచవటియందుఁ గడపెను. తరువాతఁబదునాలవసంవత్సరపుఁజైత్రమాసమునసీతాహరణము. వైశాఖమాసములో సుగ్రీవునిఁ జూచెను. ఆషాఢమాసములో వాలివధము. ఆశ్వయుజమాసమందు సైన్యోద్యోగము. ఫాల్గునమందు వానరులు ప్రాయోపవిష్టు లగుట. ఫాల్గుణశుద్ధ చతుర్దశినాఁడు లంకాదహనము. ఫాల్గుణబహుళ అమావాస్యనాఁడు రావణవధ. చైత్రశుద్ధపాడ్యమినాఁడురావణునికివిభీషణుఁడుదహనాదిసంస్కారములు సేయుట. ద్వితీయయందు విభీషణపట్టాభిషేకము, సీతాప్రాప్తి. తృతీయరోజున లంకనుండి రాముఁడు బయలు దేఱుట. చవితినాఁడు కిష్కింధాప్రాప్తి. పంచమినాఁడు భరద్వాజాశ్రమప్రాప్తి.

"పూర్ణే చతుర్దశే వర్షే పంచమ్యాం లక్ష్మణాగ్రజః,
భరద్వాజాశ్రమం ప్రాప్య వవందే నియతో మునిమ్. (యుద్ధ. 127. 1.)

షష్ఠినాఁడు నందిగ్రామప్రాప్తి. జటావిశోధనము. అయోధ్యాప్రాప్తి. సప్తమి నాఁడు శ్రీరామపట్టాభిషేకము. (గోవింద. వ్యా.)

బుధవరుల కొకవిజ్ఞప్తి.

ఆర్యులారా! మా ప్రియమిత్రులు, నాంధ్రభాషాభివృద్ధికిఁ జిరకాలమునుండి పాటుపడుచుండువారిలో నగ్రగణ్యులునగు బ్రహ్మశ్రీ, వావిళ్ల. వేంకటేశ్వరులుగారు గోపీనాథము వేంకటకవిశిరోమణివిరచిత మగునీయాంధ్ర రామాయణమున కొక యుపోద్ఘాతము వ్రాయుమని కొంతకాలముక్రిందట నన్నుఁ బ్రోత్సాహము సేయఁగా నాఱుమాసములక్రిందట నారంభించి నేఁటికి ముగింపఁగలిగితిని. శ్రీరామాయణ మువంటి మహనీయగ్రంథముయొక్క విశేషార్థములను సాకల్యముగా వివరించుట యెవ్వరికైన నశక్యము అందులో ముఖ్యముగా గోవిందరాజీయవ్యాఖ్యానము, తనిశ్లోకి మొదలగు గ్రంథములయందుఁ బ్రతిపాదింపఁబడిన యర్థములచే స్వీకరించితిని గాని స్వతంత్రముగా నెద్దియు వ్రాయలేదు తుదను వ్రాసినరామాయణ ఘట్టముల యొక్క పరిష్కారములను బ్రహ్మశ్రీ, వావిళ్ల. రామస్వామిశాస్త్రిగారు సంస్కృత వాల్మీకిరామాయణమునకువ్రాసినసంస్కృతోపోద్ఘాతమునుండి తెనిఁగించిసంగ్రహముగా వ్రాసితిని. గుణదోషవిమర్శకు లగుబుధజనులు నాయందు దయసేసి యందలి దోషములను విడనాడి గుణములను గ్రహింతురుగావుత మని యెల్లపుడును బ్రార్థించుచున్నాఁడను.

ఇట్లు, విన్నవించు బుధజనవిధేయుఁడు,
మేడేపల్లి. వేంకటరమణాచార్యులు.
శ్రీ విజయనగర మహారాజసంస్థాపితాంగ్లేయపాఠశాలా,
సంస్కృతభాషాధ్యాపకుఁడు.

విజయనగరము
26-మే. 1916.

# విషయసూచిక.

## పీఠిక.



## బాలకాండము.

# వి ష య సూ చి క.

విషయము. | పుట.

# విషయసూచిక.



## అయోధ్యాకాండము.

విషయము. ... పుట.

## ఆరణ్యకాండము.

శ్రీ ర స్తు.

శ్రీరామచంద్రపరబ్రహ్మణేనమః.

# గోపీనాథ

# రామాయణము

## పీఠిక.



మీఱ న్వనజాసనాదికులు ప్రార్థింపన్ ఖలశ్రేణి సం
గ్రామక్షోణి జయించి సాధుజనులన్ రక్షించి భూభారము
ద్దామప్రీతి హరించి ధర్మమును సంస్థాపింపఁ గృష్ణాకృతిన్
భూమానందముతో జనించినకృపాపూర్ణున్ హరిం గొల్చెదన్. 1

చ. కలశపయోధిపుత్త్రి యలకాంచనగర్భునిఁగన్నతల్లి క
ల్వలదొరతోడఁబుట్టు హరివల్లభ లేములఁబాపులేమ సొం
పలరఁగఁ బద్మషండములయందు వసించెడుతన్వి లచ్చి నా
కెలమి సమస్తసంపదల నిచ్చి కృతార్థునిఁ జేయుఁగావుతన్. 2

సీ. కరటిచర్మముఁ దాను గట్టి భక్తులకు సువర్ణచేలంబు లెవ్వాఁ డొసంగె
ఫణిహారములుదాను బైఁదాల్చి యెవ్వాఁడు మణిహారములుదాసగణమునకిడెఁ
గాలకూటముఁ దాను గబళించి సేవకతతుల కెవ్వాఁ డమృతంబొసంగెఁ
దాను గపాలంబు ధరియించి యెవ్వాఁడు మితిలేనిభాగ్య మాశ్రితుల కిచ్చె

తే. నట్టిపరమదయాశాలి నబ్జమౌళి, నఖిలలోకేశు భూతేశు నభ్రకేశుఁ
బ్రమథగణనాథు వినతసుపర్వనాథుఁ, బార్వతీనాథు మదిలోనఁ బ్రస్తుతింతు.

మ. పతిసామేన వసించి భారతియు లోపాముద్రయున్ లక్ష్మియున్
సతతంబున్ భజియింప బూరికరుణా చంచత్కటాక్షంబులన్
బతికన్న న్నతకోటి కెక్కుడుగ సంపద్భోగసౌభాగ్యముల్
చతురత్వంబున నిచ్చుగౌరి నను వాత్సల్యంబునన్ బ్రోవుతన్. 4

మ. హరినాభీకమలంబునం బొడమిభాషాబ్జేక్షణం బత్నిఁగాఁ
గర మర్థిం గొని తత్సమేతముగ వేడ్కన్ బద్మపీఠస్థుఁడై
పరమప్రీతి సనందనాదులు భజింపన్ నేర్పు మీఱన్ ద్రయీ
సరణిన్ ముజ్జగముల్ సృజించిన జగత్స్రష్ట న్విధిన్ గొల్చెదన్. 5

శా. వీణాపుస్తకపాణి షట్పదలసద్వేణిన్ బృహత్సైకత
శ్రోణిన్ బద్మజురాణి సర్వసుగుణక్షోణిన్ బురాణి న్నతేం
ద్రాణి న్నేత్రజితైణిఁ బాదగతగీర్వాణిన్ బ్రవృద్ధాశ్రిత
శ్రేణి న్వాణి నభీష్టసిద్ధికి మదిన్ సేవింతు నశ్రాంతమున్. 6

పంచచామరము. అజాదిదేవబృంద మేమహాత్ము భక్తినాత్మలో
నజస్రము న్భజించి వాంఛితార్థసిద్ధిఁ గాంచు నా
గజాస్యు సర్వదేవతాగ్రగణ్యుఁ గార్తికేయపూ
ర్వజున్ గణాధిపుం ద్రిలోకవందితున్ భజించెదన్. 7

సీ. రామనామాంకితరత్నముద్రిక యిచ్చి జనకజప్రాణ మేఘనుఁడు నిలిపె
మైథిలీవరశిరోమాణిక్య మర్పించి కడిమి నెవ్వాఁడు రాఘవునిఁ బ్రోచె
బ్రతికించె నెవ్వాఁడు పరమదివ్యౌషధీ దానంబుచే సుమిత్రాతనూజుఁ
బూని యెవ్వాఁడు రామునిరాక యెఱిఁగించి భరతశత్రుఘ్నుల బ్రతుకఁజేసె.

తే. సమరమున మూర్ఛ నొందినసకలకపులఁ
బ్రాణము లొసంగి యేమహాబలుఁడు మనిచె
నట్టిపరమోపకారి జితాక్షిలారి
నద్భుతవిహారి సామీరి నభినుతింతు. 8

చ సరసిజగర్భనిర్మితలసచ్ఛతకోటివిశాలరాఘవే
శ్వరచరితంబు లోకహితసంగతి నిర్వదినాల్గువేలుగా
వరుస రచించినట్టి మునివల్లభు నాదికవీంద్రు యోగవి
స్ఫురితు విరించనాంశభవుఁ బుణ్యుఁ బ్రచేతసుపుత్రుఁ గొల్చెదన్. 9

చ. తొలుత జగద్ధితంబుగ శ్రుతుల్ విభజించి తదర్థయుక్తిచే
నెలమిఁ బురాణము ల్పదియు నెన్మిదియున్ రచియించి సన్మతిన్
బలువుగ భారతం బనెడుపంచమవేదముఁ జేసినట్టిని
ర్మలునిఁ ద్రివిక్రమాంశజుఁ బరాశరపుత్రుని సన్నుతించెదన్. 10

సీ. వేడ్కతో నెద్దాని వినినఁ బఠించినఁ గర మర్థి భోగమోక్షము లొసంగు
నరుదార నెద్దిగాయత్ర్యాఖ్యసత్పరబ్రహ్మనివాసమై పరఁగుచుండు
రత్నాఢ్య మగుసముద్రముభంగి సత్కథా విస్తీర్ణమై యెద్ది వినుతి కెక్కు
నొక్కపాదంబైన నొక్కపదం బైన నెద్దానిఁ బఠియింప నిచ్చుఁ బరము
తే. శ్రుతిమనోహర మెద్ది విశ్రుతపురాణ, మునిరచితమెద్ది సత్కావ్యముఖ్యమెద్ది

యట్టిబుధసేవ్య మైనరామాయణమున, కాదికావ్యంబునకు నతులాచరింతు.

ఉ. శంకర పంకజాక్ష గిరిజా హనుమన్ముఖ దేవతానుకం
పాంకకటాక్షలబ్ధ కవితాకరులై బహుకావ్యనాటకా
లంకృతు లాచరించి విపులం బగువిశ్రుతిఁ గన్నయట్టిని
ష్పంకులఁ గాళిదాసముఖసత్కవుల న్మది సన్నుతించెదన్. 12

ఉ. భారతరామసచ్చరిత భాగవతాది మహాపురాణము
ల్గోరి తెనుంగున న్నిఖిలలోకహితంబుగఁ జేసినట్టియా
ధీరుల నన్నపార్య కవితిక్కన భాస్కర పోతనాదులన్
సూరివరేణ్యులం బరమశుద్ధులఁ జిత్తమునం దలంచెదన్. 13

చ. సరసపదార్థసంగతులఁ జారుతరంబుగ సత్ప్రబంధము
ల్వరుస రచించి ప్రీతి మధువైరి కొసంగి కృతార్థులై రహిం
బరరచితప్రబంధములు బాగుగఁ గన్గొని యాదరించుచున్
బరఁగెడు వర్తమానకవివర్యుల నార్యులఁ బ్రస్తుతించెదన్. 14

మ. ఇల సర్వజ్ఞుఁడు దేవదేవుఁడు రమాధీశుండు లేఁ డన్యుఁ డే
నెలమిన్ నేర్చినభంగిఁ జెప్పితి శుభం బీరామచారిత్రమున్
బలుమా ఱిందులఁ దప్పు లుండినఁ గణింపన్ బోక సద్భక్తితోఁ
దిలకింపం దగు భావిసత్కవు లమందీభూతచేతస్కులై. 15

ఉ. కొంచెపువిద్యల న్గడుపుకూటికి నన్యులయొద్దఁ జేరి తా
రించుక పారమార్థికము నెంచక యన్నియు నేర్చినట్టు గ
ర్వించి కృతుల్ రచించుటకుఁ బెల్కుఱి సత్కవులన్ గుయుక్తులన్
వంచన సేయు దుష్కవుల వారక బుద్ధి నిరాకరించెదన్. 16

చ. నృపతుల వేఁడినన్ గరుణ నిచ్చిన నిత్తురు దంతివాజిర
త్నపటధనాగ్రహారములు దప్పక యన్నియు నస్థిరంబు లా
విపులకృపాపయోధి యదువీరుని వేఁడినఁ బ్రీతినిచ్చు ని
త్యపదము నట్టివానిఁ గొనియాడక యన్యుల వేఁడ నేటికిన్. 17

చ. స్థిరమతి మాధవాంకితముఁ జేసి రచింపఁగఁ బోలు సత్కృతు
ల్సరసత నందుఁ జెప్పఁబడు లక్షణదోషము లెన్ని యున్న నా
హరికరుణావిశేషమున నన్నియుఁ జాల గుణంబులై చనున్
బరుసువు సోఁక లోహము ధ్రువంబుగఁ గాంచన మైనకైవడిన్. 18

చ. చతురత మీఱఁ బాకములు శయ్యలు రీతు లలంకృతుల్ ధ్వనుల్
వితతరసంబులున్ మఱియు వృత్తులు దోషములున్ గుణంబు లు
న్నతిఁ బరికించి సత్కృతి యొనర్చినఁ దత్కృతి లోకపూజ్యమై
యతులితభంగి వృద్ధిఁ గను నావిధుభాస్కరతారమై భువిన్. 19

చ. అరుదుగ నాణిముత్తెముల హారము గూర్చినమాడ్కి లో వెలిఁ
సరి మెఱుఁగుల్ సెలంగుపదజాలము గూర్చి రసార్థగౌరవ
స్ఫురణ దలిర్ప సత్కృతులు పూని రచించిన సత్కవిత్వముల్
సరసకవిత్వ మంద్రు కవిసత్తము లన్యకృతు ల్గణింతురే. 20

వ. అని యివ్విధంబున నభీష్టదేవతాప్రార్థనంబును సుకవిజనబహూకరణంబును గుకవిజననిరాకరణంబును సత్కృతి ప్రస్తుతియుం గావించి మద్వృత్తాంతంబు వివరించెద నేను బదియాఱువత్సరంబులవాఁడనై యుండుతఱి నొక్కనాఁడు సింహపురంబునుండి నృసింహదేవ కల్యాణోత్సవసమాలోకనకుతూహలాతిరేకంబున వేదశైలంబునకుం జని యం దొక్కమహాయోగివలన నొక్కవిద్య వడసి తత్ప్రసాదలబ్ధకవిత్వవిద్యావిశేషుండనై యుదంచితమందార కుసుమబృందనిష్యంద మకరంద బిందుసందోహ పేశల సుధామయ మంజులశబ్దప్రపంచంబును నవరసోచితచాతుర్య సౌకర్య నిగూఢార్థ సంగ్రహ సాహిత్య సాధ్య నానాలంకారసంగ్రహంబును ధర్మార్థకామమోక్ష ప్రదంబును బురాణమునికథితంబును సకలవిద్వజ్జనసేవ్యంబును నగు నొక్కమహాకావ్యంబు భగవత్ప్రీతికొఱకుఁ గవిజనానుమతంబున రచియింపం దలంచి యట్టిమహాకావ్యం బెయ్యది యామహాప్రబంధరాజంబునకు నాయకరత్నం బెవ్వండొకో యని విచారించు చున్న సమయంబున. 21

సీ. రమ్యహాసమువాఁడు రతిరాజుబుతురాజు వలపించురహి మించు చెలువువాఁడు
మొగులువన్నియవాఁడుమురిపెంపుమురిపెంపుదొలగించుచక్కనిగలమువాఁడు
కౌమరుప్రాయమువాఁడుకమలారికొమ్ముగోలిఁ బురుణించుసొబగైన మోమువాఁ
వలుఁదచెక్కులవాఁడుబంగారుపొంగారు వలిపెంపుజిగిమించువలువవాఁడు [డు
తే. చారుకోటీరకేయూరసారహీర, హారకుండలధాళధళ్యములవాఁడు
బర్హిబర్హావతంసుండు పరమపురుషుఁ, డొకఁడు కలలోనఁ జూపట్టె నుత్సుకమున.

ఉ. మీఱినవేడ్క నవ్వనదమేచకదేహమువానిఁ గాంతి పె
ల్లూరెడుతమ్మిఱేకు లన నొప్పెడుకన్నులవానిఁ బూర్ణిమాం
భోరుహవైరిమండలవిభూతిఁ గనం దగుమోమువాని సొం
పారెడువానిఁ గాంచి మది నద్భుతము న్ముద మంకురింపఁగన్. 23

తే. కువలయానందరసమొనగూర్చువిధున.
కలరుపద్మానుమోదియై వెలయుహరికి
మహితసుమనఃప్రబోధియై మలయుమాధ
వునకు నిట్లంటి వినయోక్తి ననుపమముగ. 24

తే. అనఘపూర్ణకళానిధి యనఁగ లోక
బాంధవుఁ డనంగఁ జతురాస్యభవ్యుఁ డనఁగ

మాధవుఁ డనంగ సర్వజ్ఞ మహిముఁ దనఁగ
వఱలు నీవెవ్వరయ్య యో పరమపురుష. 25

క. హరుఁడవొ మధుకైటభసం,హరుఁడవొ పల్కులవెలంది యగు వాణిమనో
హరుఁడవొ ఘనశంబరసం,హరుఁడవొ శితకరుఁడవో మహాత్మ తెలుపవే. 26

ఆ. దివ్యపురుష నీదు తేజంబు పొడగన, విమలవృత్తి నాదు తమము విరిసెఁ
బొసఁగఁ దెలివిఁ దాల్చె బుద్ధిప్రపంచంబు, చిత్తపంకజంబు చెలువు మీఱె.

క. అనవుడు నద్దేవుఁడు మె,ల్లన వదనసరోజగంధలహరీలుబ్ధా
ళినిచయముకరణి మోమున, ఘనాలకము లలరఁ బలికె ఘననాదమునన్. 28

తే. ఏను గృష్ణుండ యుష్మదహీనభక్తి, కలరి యీపుట్టువునకు నత్యంతకీర్తి
సౌఖ్యములనంతరంబ మోక్షంబొసంగఁ, దలఁచి సాక్షాత్కరించితిఁ దపముకలిమి.

ఆ. నన్ను మున్ను నెన్నుచున్నకతంబున, నతజనావనము గుణమ్ము గాన
నిను మెచ్చి కడుఁ బ్రసన్నుఁడ నైతి లే, కున్నఁ గానవశమె నన్నుఁ గుఱ్ఱ.

క. వచ్చితి వర మిచ్చితి ని, న్నెచ్చితి నీభాగ్య మెన్న నేర్తురె యొరు లో
సచ్చరిత సకలదోషస, ముచ్చయములఁ బాసితివి సమున్నతిఁ బుత్రా. 31

వ. వత్సా నీవు పవిత్రంబులైనమదీయ దివ్యావతారచరిత్రంబులలో నీ కభీష్టమెయ్యది దాని మదంకితంబుగా నాంధ్రభాష వచింపు మక్కావ్యంబు నిర్విఘ్నంబుగాఁ బరిసమాప్తి నొందించునట్టిభారం బేను బూనెద నీకును నీవు రచించినకావ్యంబునకు నభ్యుదయపరంపరాభివృద్ధి యగునట్లుగా ననుగ్రహించెద నీ కీజన్మంబు దక్క నొండు జన్మంబులేదేతజ్జన్మాంతంబునఁ బునరావృత్తిరహితం బైన పరమపదంబుఁ బ్రాపించెదవు. 32

క. అని యాకమలాక్షుఁడు స, న్గని యుపదేశం బొసంగి ఘనకరుణాసం
జనితానందమున వెసం, జనెఁ దా నందమున నందసంభవుఁ డంతన్. 33

వ. ఏనుమేలుకాంచి మేలుకాంచితినని యనంతసంతోషకలితస్వాంతుండనగుచుఁ దదుదంతం బంతయు నార్యులకెఱింగించితిఁ దదనుమతంబునఁ బురాతన పుణ్యశ్లోకబ్రహ్మర్షి విరచితంబును ననేకార్థప్రతిపాదకంబును నానావిధవిచిత్రమధురశబ్దప్రపంచంబును వివిధాలంకారభూషితంబును గాయత్రీబీజసమ్మితంబునగుటం జేసి వేదతుల్యంబును సకలరత్నంబులకు సముద్రంబునుంబోలె బహువిధేతిహాసంబులకుఁ దానకంబును నాదికావ్యంబును సమస్తసురమునిగణ సేవ్యంబును వక్తృశ్రోతలకు భవ్యంబును బురుషార్థంబులకు నివాసస్థానంబు నగు రామావతారచరిత్రంబు భగవంతుం డగు వాల్మీకి సెప్పిన క్రమంబునఁ జతుర్వింశతి సహస్రపరిమితగ్రంథములోనం ద్రయోవింశత్యుత్తర సప్తశతవింశతి సహస్రపరిమితం బైన బాలకాండప్రభృతిషట్కాండకథాప్రపంచం బంతయు సమగ్రంబుగా నంధ్రభాష రచియింప నిశ్చయించి. 34

శా. వ్యాప్తి న్రామకథాసుధార్ణవము నిత్యంబు న్దమిం గ్రోలియుం
దృప్తిం జెందనిపుణ్యు నాదిమకవిన్ దివ్యప్రభావాఢ్యునిన్
సప్తార్చిప్రతిమానపింగళజటాసందోహు నుద్యత్తప
స్తప్తుం గొల్చెద నిష్టసిద్ధికి మరుత్సంపూజ్యుఁ బ్రాచేతసున్. 35

క. అని యమ్మునిఁ బ్రార్థించినఁ, బనిగొని ముద మలర నాకుఁ బ్రత్యక్షంబై
తన కజుఁ డొసఁగిన తెల్వని, ఘనముగ నాకొసఁగి చనియెఁ గారుణ్యమునన్.

వ. ఇట్లమ్మహాముని యంతర్ధానంబు సేసిన నేను బహుజన్మకృతసుకృతపరిపాకంబున నిమ్మహాకావ్యరాజంబు దొరకొనియెఁ గదా యని సంతసిల్లి రామాయణకథాప్రపంచవిరచనాదక్షుండనై యాభిముఖ్యంబు నొందితి. 37

ఉ. మున్నలభాస్కరాదికవిముఖ్యులు ప్రీతి రచించి రీకథం
జెన్నుగ నీవు గ్రమ్మఱ రచించుట కెయ్యది హేతు వంచు మీ
రన్న బుధేంద్రులార వినుఁ డారఘునాథచరిత్ర మెంద తె
ల్లెన్నిన నన్నిరూపుల కహీనగతిన్ దగి యుండు నుర్వరన్. 38

వ. అదియునుంగాక తిక్కనసోమయాజి హరిహరనాథునిం గృతినాథునిం జేసి భారతంబు సాంగోపాంగంబుగాఁ రచించెఁ బోతనామాత్యుండు సీతాపతిం గృతిపతిం జేసి భాగవతంబు రచించెఁ గంకంటిపాపరాజప్రధానుండు రుక్మిణీశ్వరుం గృతీశ్వరుం జేసి యుత్తరరామాయణంబు రచించె నాదికావ్యంబును మహామునిప్రణీతంబును షట్కాండకథాప్రపంచసంచితంబైన యీపూర్వరామాయణంబు భాస్కరాదు లొక్కమర్త్యునిం గృతినాథునిం జేసి రచించి రిది సమీచీనంబు గా దిమ్మహాకావ్యంబునకు రమానాథుండె కృతినాథుం డైనఁ బదియాఱువన్నెబంగారునకు మాణిక్యంబుతోడి సంపర్కంబు గలిగిన చందంబున నధికోదయంబై యుండుఁ గదా యని తలంచి యీరామాయణకావ్యంబు తొలుతం గుశలవులవలన రామరూపధరుండైననారాయణుండె వినియెఁ గావున నేనును దత్క్రమంబున శ్రీకృష్ణరూపధరుం డైన రమావల్లభునిం గృతినాథునిం జేసి యీపుణ్యకావ్యంబు రచింప నిశ్చయించితి నీరామాయణరహస్యార్థతత్త్వంబు దెలియుటకు వామలూరుతనయుం డొక్కండు దక్క నన్యు లెవ్వరును సమర్థులు గారైనను నాయెఱింగినంతఁ దేటపఱచెద సత్యాదరంబున నంగీకరింపవలయు నింక మదీయవంశావతారం బభివర్ణించెద. 39

గ్రంథకర్తృ వంశావతార వర్ణనము.

చ. జలజభవాన్వయాటవివసంతుఁడు పావనగోపినాథస
త్కులకలశాబ్ధికైరవహితుండు కళాఢ్యుఁడు లోకబాంధవుం
డలఘుపదార్థకర్త చతురాస్యుఁడు కామహరుండు నిమ్మహీ
స్థలి సుమనోవిభూతిఁ దగు సాధుఁడు వేంకటశాస్త్రి ధీరుఁడై. 40

తే. అట్టిసర్వజ్ఞునకు గౌరియనఁగ నార్య, యనఁగ శ్యామయనఁగ శివయనఁగ సర్వ
మంగళయనంగ సతియనమహితభద్ర, యగుచుఁ గామాక్షి దేవి యర్ధాంగియయ్యె.

క. ఆయిరువుర కుదయించిరి, పాయక భగవంతుఁడైన భగవంతుఁడు సు
శ్రీయుతుఁడు బుచ్చనార్యుం, డాయతసత్పథగు లగుచు నర్యమసములై. 42

తే. అంత భగవంతుపరిణయానంతరమున, నతనికూరిమితమ్ముఁ డద్భుతుఁడు బుచ్చ
నార్యుఁడారీతి ననసూయనత్రివోలెఁ, బ్రేమతోఁ గోనమాంబను బెండ్లియయ్యె.

క. ఆమిథునమునకుఁ గల్గిరి, ధీమహితులు నారసింహధృతిశాలి యశో
ధాముఁడు రామాగ్రజసు, త్రాముఁడు విభవాభిరామ రామానుతులై. 44

క. అం దగ్రజుండు విప్రపురందరుఁ డనఁ బొగడు గనెఁ బురందరకరిస
త్కుందేందుశారదాంబుద, చందనయశుఁ డగుచు నరసశాస్త్రి వసుధలోన్.

తే. ఆనరసశాస్త్రిసతి వెంకమాంబ పతికి, భోగసౌభాగ్యనిత్యవిభూతు లొసఁగుఁ
దనువు సగముగ నొనరించి ధవుని బికిర, మెత్తఁ జేసిన గిరిపుత్రి నీసడించి.

ఉ. ఆమహనీయమూర్తికి సముంచితకీర్తికి వెంకమాంబయం
దీమహిఁ బద్మనాభుఁ డన నెంతయు నొప్పెడుపద్మనాభుఁడున్
సోమనిభుండు బుచ్చనయుఁ సొం పలరన్ వరదుండు భూరివి
ద్యామహిమాఢ్యుఁ డీతఁ డన నాభగవంతుఁడు గల్గి రిమ్ముగన్. 47

క. వారలలో నగ్రజుఁ డగు, నారాయణసముఁడు పద్మనాభుఁడు వెలసెన్
హారాంబుజహీరాంబుజ, వైరిపటీరహరహార వర్ధితయశుఁడై. 48

తే. నయవిశారదుఁ డగు పద్మనాభునకుఁ బు
రంధ్రి వేంకటలక్ష్మ్యంబ రహి వహించెఁ
గలిమిజవ్వని యన నెల్లకడల సిరులు
పరఁగ వెదచల్లు జలజాతపాణి యగుచు. 49

క. హరునకు నుమ కైటభసం, హరునకు రమ పద్మయోని కలవాణి నిశా
కరునకు రోహిణిక్రియ నా, నరసున కద్దేవి ధర్మచారిణి యయ్యెన్. 50

ఆ. చంద్రశేఖరునకు శైలజ కెనయగు, పద్మనాభునకును బరఁగ లక్ష్మి
కొనర వేంకటాఖ్యనుదయించితిఁ గుమార, మదనుఁడనఁగ నేనుమహిమ వెలసి.

సీ. చిత్తంబు హరిగుణచింతనంబులయందు కరములు విష్ణుపూజనములందుఁ
బాదంబులు రమాధిపతిభజనమునందు వీనులు విభుకథ ల్వినుటయందు
శిరము కైటభదైత్యహరనమస్కృతులందు రసన గోవిందకీర్తనమునందుఁ
జక్షువు ల్హరిరూపసందర్శనమునందుఁ గాయంబు శౌరికైంకర్యమందు

తే. సంతతము గీలుకొల్పి ప్రసన్నబుద్ధి, నన్యమేమియు నెఱుఁగక యవ్విభుండె
శరణమని నమ్మి కొలుచుచు ధర శరీర, యాత్రసలుపుదు సన్మార్గ మధిగమించి.

మ. జననం బాదిగ రామపాదయుగళీ సంసక్తచిత్తుండనై
జనితోత్సాహమునం దదీయకరుణాసంలబ్ధనానాకళా
ఖనినై తద్గుణవైభవప్రచురమై కన్పట్టురామాయణం
బనువొంద న్విరచింతుఁ బ్రౌఢకవితావ్యాపార మేపారఁగన్. 53

గ్రంథకర్త తనగ్రంథము ప్రసిద్ధి కెక్కినచందం బెఱింగించుట.

వ. మఱియు నిమ్మహాకావ్యంబు ధర్మార్థకామమోక్షప్రదంబై పుత్రపౌత్రప్రవర్ధనంబై యాయుఃకీర్తికరంబై కల్పద్రుమంబుచందంబున నందంబై యుండు నని యిట్లు మద్వృత్తాంతంబును రామాయణకావ్యకరణసామర్థ్యంబు గలుగుటకుం దగినయుపపత్తియు శ్రీకృష్ణదేవునిం గృతినాయకునిం జేసి రచించుటకుం దగినకారణంబును మద్వంశక్రమంబును వివరించి నాచేత రచియింపంబడిన యీరామాయణంబు లోకంబునం బ్రసిద్ధి కెక్కినచందంబుఁ దేటపఱచెద నేను శ్రీకృష్ణదేవాంకితంబుఁ జేసి తదనుగ్రహబలవిశేషంబున నిరంతరాయంబుగా నిమ్మహాపుణ్యకావ్యంబు వక్ష్యమాణక్రమంబున సాంగోపాంగంబుగా రచియించి దీని లోకంబునం గలపండితసభలయందు విస్తరిల్లం జేయుటకుం దగినశ్రద్ధాభక్తులు గలమహీపతు లెవ్వరొకో యని వితర్కించునట్టికాలంబున. 54

శ్రీవేంకటగిరిపురవర్ణనము.

సీ. కమలాప్తబింబంబుఁ గలశంబుగాఁ జేసి కొనఁజాలుపడగలఁ దనరురథము
లటు కరంబులు సాఁచి యమరధునీసరోజములఁ ద్రుంపఁగఁ జాలుసామజములు
హరితేరిబాబాల కర్థపులాయితక్రమముఁ జెప్పఁగఁ జాలుఘనహయములు
పిడికిటిపోటుల బిరుదుకొండల నైనఁ బిండి సేయఁగ నోపు వీరభటులు
తే. కనకరౌప్యవినిర్మిత గగనచుంబి, మేరుకైలాససన్నిభాగారములును
నందనోపమోద్యానవనములు గలిగి, పొలుచు వేంకటగిరినామపురవరంబు.
క. సిరి కిరవై కవిశేఖర, పరిశోభితమై యనంతవైభవయుతమై
నిరుపాధికసుఖమై య, ప్పుర మలవైకుంఠపురము పోలికి నమరున్. 56

శ్రీవేంకటగిరిపురాధిరాజవంశావతారవర్ణనము.

సీ. యద్వంశకర్తయై యలరెఁ బరాక్రమఘనుఁడు రుద్రాదిత్యజనవిభుండు
ఆచంద్రతారార్క మైయుండ సప్తసప్తతిగోత్రముల నుర్విఁ బాదుకొల్పి
కోరి యేకాదశగోత్రంబు లొక్కొక్కగణముగా విభజించి క్రమముతోడ
నాగతాళంబులు నయముతో వృషభంబు పంచవర్ణంబు సముచితముగ
రమ్యభేరుండవరాహఖడ్గంబులు వానికిఁ బడగలుగా నొనర్చి
ఖడ్గనారాయణఖ్యాతి సంపాదించి వారలచేతఁ గప్పములు వడసి
పరఁగునయ్యనపోతనరనాథతిలకుఁ డే పుణ్యవంశంబునఁ బుట్టి యెసఁగె
జగతిలో శ్రీరంగ జంబుకేశ్వరపురసీమాపరిచ్ఛేదశాలి యగుచుఁ

పాండ్యకిరీటంబు బలిమిచేఁ గొన్నమాధవభూధవుం డెందు నవతరించెఁ
బలుశక్తి సింగభూపాలీయ మనెడియ లంకారశాస్త్రంబు లలి రచించి
యసదారరాయవేశ్యాభుజంగుండన బిరుదుఁ గాంచి యుదాత్తచరితుఁ డగుచుఁ
జెలువొందుసర్వజ్ఞసింగభూపాలుఁ డే యమలాన్వయంబున నవతరించె
తే. నట్టివెలుగోటివంశమునం దవతరించి, వెలయ రేచర్లగోత్రపవిత్రుఁ డగుచు
వీరవర్యుండువిఖ్యాతకుమారయాచ, జనవిభుం డెప్పారం బేలెఁ జతురుఁ డగుచు.
తే. విశ్వనాథప్రతిష్ఠఁ గావించి వెలసి
నట్టిపుణ్యుండు బంగారుయాచవిభుఁడు
తనయుఁడై పుట్టె నతని కాధరణివిభుఁడు
విమలునిఁ గుమారయాచభూవిభునిఁ గాంచె. 58
తే. ధన్యుఁ డగు రాజమౌళికిఁ దనయుఁ డగుట
విబుధగణములఁ బ్రోచువివేకి యగుట
పొసఁగఁ దారకహారయశఃస్ఫూర్తిఁ గనుట
యానుహీనేతకుఁ గుమారనాము మను రె. 59
చ. వెలయఁగ నన్నరేశ్వరుఁడు విష్ణుపురాణము నాంధ్రభాష నిం
పలర రచింపఁ జేసి దనుజారికృపాప్తికిఁ బాత్రభూతుఁడై
చెలఁగి జగంబులం గడుప్రసిద్ధికి నెక్కఁగ విశ్వనాథు ని
శ్చలవిభవంబులిం దనిపి చక్కఁగఁ దత్కృపఁ గాంచె నుర్వరన్. 60
తే. ఆమహారాజునకుఁ బుత్త్రుఁ డతిపవిత్రుఁ, డాదిరాజనిభుండు దివ్యప్రభుండు
దానమానధనుండు విద్యాఘనుండు, వఱలు బంగారుయాచభూపాలమౌళి.
చ. అపలకుఁ గాలదండ మఖిలార్థులకు న్సురశాఖిశాఖ భూ
భరము ధరింప భోగి జయపద్మకుఁ జక్కని జీవగఱ్ఱయై
పరఁగు జయాభిరాముఁ డగుబంగరుయాచమహీవరేణ్యను
స్థిరతరబాహుదండ మని ధీవరు లెన్నఁ జెలంగు చిమ్మహిన్. 62

శ్రీవెలుగోటిసర్వజ్ఞకుమారయాచేంద్ర భూపాలప్రశంస

ఉ. ఆజ్ఞకు బద్ధులై నృపతు లందఱు గొల్వఁగఁ బెక్కువర్షముల్
విజ్ఞులు మెచ్చ ధాత్రి నతిపవిత్రతవై ఖరి నేలె నమ్మహా
ప్రాజ్ఞున కుద్భవించె నిరపాయమహావిభవోన్నతుండు స
ర్వజ్ఞకుమారయాచనరపాలుఁ డమేయగుణాభిరాముఁడై. 63
మ. గణనాతీతగుణోన్నతుండును త్రిలోకఖ్యాతచారిత్రుఁడుం
బ్రణుతప్రాభవుఁ డివ్విభుండు ధ్రువుఁడో ప్రహ్లాదుఁడో యావిభీ
షణుఁడో యంచు బుధు ల్నుతింప భగవత్సంసేవనాసక్తవీ
క్షణచిత్తంబులకుం బ్రియుం డగుచు నాత్మాభర్త ప్రోచు న్మహిన్. 64

మ. అనిశంబున్ ద్విజకోటిచే మఖము లుద్యత్ప్రీతిఁ జేయించి యో
దనదానంబున మర్త్యులన్ బహుహవిర్దానంబులన్ వేల్పులం
దనియం జేసి మహీసురర్షులకు నందం బొప్ప భూవస్త్రగో
ధనదానంబు లొసంగి మించె శుచియై ధన్యాత్ముఁడై యుర్వరన్. 65

సీ. అలతర్కశాస్త్రయుక్తు లుపన్యసించుచోఁ, గణుతింప రెండవగౌతముండు
బహువిధశబ్దనిష్పత్తిఁ గావించుచోఁ, దలపోయ నపరపతంజలి యగు
నఖిలవేదాంతశాస్త్రార్థతత్త్వవిచారమందు సాక్షాజ్జనకాధిపుఁ డగు
లలిఁ గావ్యనాటకాలంకారకవితా ప్రముఖవిద్యలం దన్యభోజనృపతి [ను

తే. యుత్తరోత్తరయుక్తి నొండొకను రేజ్యఁ, జతులగాంధర్వవిద్యయం దనుపమా
షనుచు జనములు దనుఁ గొనియాడ వాసి, కెక్కె సర్వజ్ఞయాచమహీవరుండు.

తే. ధరణి నెవ్వానికీర్తిప్రతాపరుచులు, వరుస నిఖిలదిశాంగనావక్షములకు
సరసచందనకాశ్మీరచర్చ లయ్యె, నన్నరేంద్రునిఁ గీర్తింప నలవి యగునె.

వ. ఇట్లనన్యసామాన్యప్రభావుండై రాజ్యంబుఁ జేయుచు నారాజన్యశేఖరుండు భారత భాగవత రామాయణ ప్రముఖ నిఖిలపురాణంబులఁ బరిశోధించి భాస్కరాదులు రచించిన యాంధ్రరామాయణంబులందు వాల్మీకివిరచిత శ్రీమద్రామాయణంబునం గలయర్థం బంతయు సమగ్రంబుగాఁ గధితం బైనయది గాదనియు భగవదంకితంబు గాకున్న వనియుఁ దలంచి యిమ్మహాకావ్యంబు గీర్వాణంబున కన్యూనానతిరిక్తంబుగా భగవదంకితంబుఁ జేసి యాంధ్రభాష రచియింప సమర్థుం డగుపండితుం డెవ్వండో యని విచారించుచు నేనిక్కావ్యంబు గీర్వాణంబున కనురూపంబుగాఁ బద్యప్రబంధంబుఁ గావించుట యంతయు విని ప్రీతిపూర్వకంబుగా నన్ను రావించి యొక్కనాఁడు సువర్ణ మణిగణస్థగితంబై సుధర్మకు సాటి సేయం దగినసభామండపంబున నగణిత మణిగణ ప్రభాపటల జటిలంబైన భద్రపీఠంబున సుఖాసీనుండై యుదయమహీధర శిఖరోపరిస్థితుండైన లోకబాంధవునిభంగి వెలుంగుచు సకల విద్వజ్జనంబులు పరివేష్టింప బృందారకపరివృతుం డగు సహస్రాక్షునిచందంబున నందం బగుచు మద్విరచితం బైన యాంధ్రరామాయణకావ్యం బంతయు సమగ్రంబుగా సత్యాదరంబున నాకర్ణించి యిది మదీయాభిప్రాయప్రకారంబున గీర్వాణంబున కనురూపంబై శ్రీకృష్ణాంకితంబై యున్న దని బహూకరించి పరమానంద భరితాంతఃకరణుండై చారు చామీకరకటకాంగుళీయక హారాగ్రహారాది ప్రదానంబుల నన్ను సత్కరించి పరమభాగవతోత్తముండును శ్రీరామచంద్రచరణ సేవాసంసక్తచిత్తుండును గావున లోకహితార్థంబుగా నిమ్మహాపుణ్యకావ్యంబు జగంబునందు విస్తరిల్లం జేసి శ్రీరామభద్రుని యపారంబైన కృపారసంబునకుఁ బాత్రభూతుం డయ్యె. 68

చ. వెలయఁగ నీకథఁ జగతి విశ్రుతి కెక్కఁగఁ జేసి పుణ్యుఁడై
వెలసిన యిమ్మహీపతికి వేడ్క ననంతయశంబు నాయువుం
బొలుపుగ వంశవృద్ధియును భోగసమృద్ధియు రాజ్యవృద్ధియుం
దొలఁగక యిచ్చి సత్కరుణతోఁ గృతినాథుఁడు ప్రోచు నిత్యమున్. 69

షష్ఠ్యంతములు.

క. శ్రీవల్లభునకు బుధసం, భావితునకు భావుకప్రభావునకు విభా
ప్రావీణ్యహాసితకోటివి, భావసునకు భక్తలోకపరతంత్రునకున్. 70

క. హీరామృత చందన శశి, హారాయిత కీర్తిఘృణికి నదితిజమణికిఁ
వీరాగ్రణికి జగన్నుత, సూరిమరున్మణికి యోగిచూడామణికిన్. 71

క. వ్రజయువతినయనకుముద, ద్విజరాజున కఖిలలోకవిశ్రుతునకు నం
డజరాజగమనునకు బుధ, భజనానందునకు హరికి భద్రాత్మునకున్. 72

క. సనకాదియోగినుతునకు, వనమాలాకనకచేలవరకౌస్తుభభా
సురపాంచజన్యధరునకు, నిరుపమవిభవునకు రుక్మిణీనాథునకున్. 73

క. గోపాలనందనునకు ధ, రాపాలకిరీటరత్నరంజితదివ్య
శ్రీపాదపద్మునకు నత, గోపాలావళికి మదనగోపాలునకున్. 74

శ్రీః

# బాలకాండము.

## కథాప్రారంభము.

---

నారదమహర్షి వాల్మీకికడకు వచ్చుట.

వ. శ్రీకృష్ణదేవునకు సమర్పితంబుగా నాయొనర్పం బూనిన శ్రీమద్రామాయణం
బునకుఁ గథాప్రారంభం బెట్టి దనిన శతకోటిప్రవిస్తరంబై బ్రహ్మలోకంబునందు
సుప్రసిద్ధం బైనరామచరితంబు భూలోకవర్తులయిన నాలుగువర్ణంబులవారికిఁ
దాపత్రయవిమోచనంబుకొఱకు సంక్షేపించి రచియింప నుద్యుక్తుండై పరమ
కారుణికుం డైనపరమేష్ఠి వాల్మీకిరూపంబున విశ్వంభరయం దవతరించె నట్టి
బ్రహ్మాంశసంభూతుం డైన వాల్మీకి తనచేతఁ జర్చితంబైన రామచరితంబు గురు
ముఖంబువలన వినం గోరి భగవత్కథోపదేశంబునందు సర్వజ్ఞుండైన నార
దుం బ్రతీక్షించుచుండ నొక్కనాఁడు భగవంతుండైన యన్నారదుండు బ్రహ్మ
నియోగంబున వాల్మీకికడకుం జనుదెంచిన నత్తపస్వివర్యుండు తపస్స్వాధ్యాయ
నిరతుండును వాగ్విశారదుండును దేవమునిశ్రేష్ఠుండు నైననారదు నవలోకించి
పూజించి మునీంద్రా యిప్పు డీలోకంబున దృష్టగుణవ్యతిరిక్తప్రశస్త గుణ
వంతుండును దానవసుతుం డగుచుఁ బరులజయించు వీర్యవంతుండును సామా
న్య విశేషరూప ధర్మజ్ఞుండును దనకొఱకుఁ గావింపం బడిన యుపకారం బల్పం
బైనను బహుత్వంబున నెఱుంగునట్టి కృతజ్ఞుండును సర్వావస్థలయందును సత్య
వచనశీలుండును ఫల పర్యంతంబు సమారబ్ధంబైన వ్రతంబు విడువనట్టి స్వ
భావంబు గల దృఢవ్రతుండును వంశక్రమాగతాచార యుక్తుండును నపరా
ధంబు గావించినవారియందైనను హితంబుఁ జేయునట్టి శీలంబు గలవాఁడును
విదితసకలవేద్యపదార్థుండును నన్యులకు నిర్వహింపంగూడనికార్యంబు నిర్వ
హించుటకు సమర్థుండును నద్వితీయ ప్రియదర్శనుండును నసమానసర్వాంగ
సుందరుండును నాత్మవంతుండును విధేయకోపుండును జితారిషడ్వర్గుండును
ద్యుతిమంతుండును ననసూయారహితుండును నగుపురుషుం డెవ్వఁడు సంయుగం
బునందు జాతరోషుం డగునప్పు డెవ్వానికి సురాసురాదులు దలంకుదు రట్టి
వాని వినం గుతూహలం బగుచున్న దట్టి పురుషశ్రేష్ఠు నెఱుంగ నీవె సమర్థుం
డవు కృపామతి నెఱింగింపు మని యభ్యర్థించినఁ ద్రిలోకగోచరజ్ఞానుం డయిన
నారదుం డవ్వాల్మీకిప్రశ్నజాతంబు విని యమ్మునిశ్రేష్ఠు నేకాగ్రసిద్ధికొఱకు నభి

ముఖుం గావించి యీప్రశ్న సకలగుణవిశిష్ట సార్వభౌమ విషయకంబై యున్నదైనను సార్వభౌమమాత్రంబునందు నీయడుగంబడిన ప్రశస్తగుణసంపత్తి యంతయు సంభవింపనేరదు సకలజగద్రక్షణార్థంబు మనుష్యరూపంబున నవతీర్ణుం డైన పరమపురుషునందు సులభం బగు దైవయోగంబున దద్గుణకీర్తనంబు లబ్ధంబయ్యె నని ప్రహృష్టుండై ప్రాచేతసు నవలోకించి నీచేతఁగీర్తితంబు లైన యీవీర్యాదిగుణంబు లన్నియు దుర్లభంబు లేతాదృశ ప్రశస్త సమస్త గుణవిశిష్టుండైన మహాపురుషు నిశ్చయించి చెప్పెద నట్టిపురుషు నాకర్ణింపు మని యిట్లనియె. 75

## నారదుఁడు వాల్మీకికి శ్రీరామకథ నెఱింగించుట.

మ. మతిమంతుండును నీతిమంతుఁడును శ్రీమంతుండు సర్వజ్ఞుఁడుఁన్
ధృతిమంతుండును వాగ్మియున్ వశియు విద్విడ్వర్గసంహర్తయుం
ద్యుతిమంతుండు గుణోన్నతుండు నియతాత్ముండు న్మహావీర్యుఁడున్
హితుఁడు న్రాముఁ డనంగఁ జెన్నలరు న య్యిక్ష్వాకువంశంబునన్. 76

సీ. వెడఁదకన్నులవాఁడు విపులాంసములవాఁడు రాకేందుబింబవక్త్రంబువాఁడు
కంబుకంఠమువాఁడు ఘనలలాటమువాఁడు రమణీయమృదుకపోలములవాఁడు
పీనవక్షమువాఁడు పృథునితంబమువాఁడు సముదగ్రచారుమస్తకమువాఁడు
దివ్యదేహమువాఁడు దీర్ఘబాహులవాఁడు కమనీయశుభలక్షణములవాఁడు
తే. ప్రబలచాపంబు మూఁపునఁబరఁగువాఁడు, శ్యామవర్ణంబువాఁడుప్రశస్తగూఢ
జత్రుదేశంబు గలవాఁడు సువిభక్త,సముచితమనోజ్ఞసుందరాంగములవాఁడు.

వ. మఱియు వృత్తపీవరబాహుండును గామాది వికారరహితుండును గజసింహ గతిసదృశగమనుండును షణ్ణవత్యంగుళ విగ్రహుండును నిర్ణిక్తేంద్ర నీలవర్ణుండును శ్రవణమాత్రంబున శత్రుహృదయ విదారకత్వంబుచేతఁ బ్రశస్త పౌరుషుండును సర్వోత్తరావయవసౌభాగ్యయుక్తుండును సాముద్రికశాస్త్రోక్తమంగళాయతనసర్వలక్షణలక్షితుండును శరణాగతరక్షణరూపధర్మజ్ఞుండును సత్యప్రతిజ్ఞుండును బ్రజాహితకరణతత్పరుండును నాశ్రితరక్షణముఖ్యయశుండును సర్వవిషయజ్ఞానశీలుండును బాహ్యాభ్యంతరశుద్ధియుక్తుండును నాశ్రిత పరతంత్రుండును బిత్రాచార్య వినీతుండును నాశ్రిత రక్షణచింతాభిరతుండును జగద్రక్షణార్థంబు ప్రజాపతితుల్యత్వంబును నవతీర్ణుండును నఖండి తైశ్వర్య సంపన్నుండును సకలలోకసముద్ధరణపరిపోషణశక్తియుక్తుండును నాశ్రితజన విరోధినిషూదనుండును బ్రజల కరిష్టనిరసనపూర్వకంబుగా నభీష్టప్రాపణకర్తయు వర్ణాశ్రమధర్మపరిపాలకుండును శరణాగతపరిపాలనరూపస్వధర్మరక్షకుండును యజనాధ్యయనదానాది స్వధర్మపరిపాలకుండును నాశ్రితబాంధవాది జీవలోకంబుకం

లకు రక్షితయు ఋగ్యజుస్సామాదిచతుర్వేదపదార్థవిదుండును శిక్షాదిషడంగపారగుండును ధనుర్వేదనిష్ఠితుండును సాంఖ్యయోగతర్కవైశేషికపూర్వోత్తర మీమాంసా వ్యాకరణధర్మశాస్త్రాదిశాస్త్రార్థ తత్త్వజ్ఞుండును విజ్ఞాతార్థవిషయంబులందు సదావిస్మరణలేశరహితుండును బ్రతిభానవంతుండును సర్వలోకప్రియుండును నపకారులయందైన నుపకారశీలుండును వ్యసనపరంపరలయందైన నక్షుభితాంతఃకరణుండును నతిగంభీరప్రకృతియుక్తుండును దత్తత్కాలకర్తవ్యచతురుండును నై ప్రకాశించు నదియునుం గాక. 78

క. సింధువులతోడఁ గూడిన, సింధువుచందాన గుణవిశిష్టుఁడు కరుణా
సింధువు రాముఁడు ప్రజ్ఞా సింధువులగు బుధులఁగూడి చెలఁగు ననిశమున్. 79

తే. అనుదినంబు సర్వావస్థలందు సారె, సారె కవలోకితుం డయ్యు జనులచేతఁ
బరఁగ మున్నెప్పుడును జూడఁబడనివాని, యట్ల విస్మయదర్శనుం డైనవాఁడు.

క. అలఘుచరిత్రుఁడు పూజ్యుఁడు, సలలితచిత్తుండు మిత్త్ర శత్రూదాసీ
నులయం దవిషమభావము, గలవాఁ డానందకరుఁడు కౌసల్య కొగిన్. 81

సీ. గాంభీర్యమందు సాగరముఁబోలినవాఁడు ధైర్యంబుచే మహీధరనిభుండు
వీర్యసంపదచేత విష్ణుతుల్యుఁడు శశధరునికైవడిఁ బ్రియదర్శనుండు
కరము క్రోధమునందుఁ గాలాగ్ని కెనయగు, క్షమచేతఁ బృథివికి సాటివచ్చుఁ
ద్యాగంబునందు ధనాధిపసదృశుండు నపరధర్ముండు సత్యంబునందు

తే. భూరివిజ్ఞానరమకుఁ దాఁ బుట్టినిల్లు, దానదాక్షిణ్యదయలకుఁ దానకంబు
నీతిసత్యధర్మములకు నిలయ మతఁడు, లలితసద్గుణసందోహములకుఁ బేటి. 82

వ. అని యిట్లు నారదుండు సాక్షాద్భగవదవతారంబైన రామభద్రునందలి సకలానంతకల్యాణగుణంబు లన్నియు వక్కాణించి యిక్ష్వాకువంశప్రభవుం డనుశబ్దంబున రామావతారకథనంబును శత్రునిబర్హణుఁ డనుశబ్దంబునఁ దాటకాదివధంబును మహావీర్యుం డనుశబ్దంబున సర్వాస్త్రశస్త్రగ్రహణంబును లక్ష్మీవంతుం డనుశబ్దంబున సీతాపరిణయంబును సత్యపరాక్రముం డనుశబ్దంబునఁ బరశురామభంగంబును మొదలుగాఁగల బాలకాండకథ యంతయు సంక్షేపంబుగా సూచింపంజేసి యయోధ్యాకాండ కథాక్రమం బెఱిఁగించువాఁడై వెండియు వాల్మీకి నవలోకించి యిట్లనియె నిట్టిసమస్తసద్గుణగరిష్ఠుండును బురుషశ్రేష్ఠుండును రాజ్యాభిషేకసముచిత విశిష్ట గుణవరిష్ఠుండును నమోఘపరాక్రమవంతులలోన నతిశ్రేష్ఠుండును బ్రకృతిజనేష్టుండును గుమారజ్యేష్ఠుండు నైన కల్యాణగుణాభిరాము రామునింజూచి తండ్రియగు దశరథుండు పరమానందభరితాంతఃకరణుండై సకలజనంబులకు హితంబు సంపాదింపఁ దలంచి యౌవరాజ్యంబున కభిషిక్తునిం జేయనుపక్రమించి తదభిషేకార్థసంభృతదధ్యాదిమంగళద్రవ్యవిశేషంబుల విలోకించి దశరథుని కొండొకభార్య కైకేయునునది మంథరా

వాక్యచోదితయై తొల్లి దేవాసురయుద్ధంబునందు వల్లభునిచేత దత్తవరయైనది గావున నాసమయంబునఁ గట్టఁడితనంబున దిట్టయై రామునకు వివాసనంబును నిజపుత్త్రుండైన భరతునకు రాజ్యాభిషేకంబునుం గోరిన నమ్మహీరమణుండు సత్యవాదిగావున ధర్మమయపాశనిబద్ధుండై విడివడసమర్థుండుగాక ప్రియపుత్త్రుండైన నురాముని వనంబునకుం బనిచిన నవ్వీరోత్తముండు కైకేయీప్రీతినిమిత్తంబు పితృవచననియోగంబువలనఁ దద్వచనపరిపాలనవిషయస్వకృతప్రతిజ్ఞను బరిపాలించుచు వనంబునకుం జనిన నమ్మహాత్మునితమ్ముండు సుమిత్రానందవర్ధనుండగులక్ష్మణుండు సహజప్రీతిమంతుండును నిష్టుండును గావున వినయసంపన్నుండై సౌభ్రాత్రంబుఁ జూపుచు స్నేహంబువలన ననురూపం బగు వ్రతం బంగీకరించి యన్నవెంట నరణ్యంబునకుం జనియె. 83

ఉ. ఆరఘునాథుభార్య జనకాలయజాత సమస్తలక్షణ
శ్రీరమణీయరూప హితశీల సతీతిలకంబు నిందిరా
కారయు సాధ్వి ప్రాణములకంటె గరీయసి యైన సీత సొం
పారఁ బతిన్ భజించి చనె నప్పుడు రోహిణి చంద్రునిం బలెన్. 84

క. పౌరులచే జనకునిచే, దూరం బారాముఁ డనుగతుం డగుచు రయం
బారఁగ ననుజుఁడు సీతయు, వారక తనతోడ రాఁగ వనమున కరిగెన్. 85

తే. ఈతెఱంగునఁ జని జాహ్నవీతటమున, శృంగిబేరాఖ్యపట్టణ మేలువానిఁ
బరమసఖుని నిషాదాధిపతిని గుహునిఁ, జేరి నూతునిఁ గ్రమ్మఱ నూరికనిచి.

ఆ. అట నిషాదనాథుఁడైన యాగుహునితో, నలఘుయశుఁడు చాలఁ జెలిమిఁ జేసి
వానియనుమతమున జానకీలక్ష్మణ, కలితుఁ డగుచు వేగ గంగ దాఁటి. 87

క. భూవల్లభుండు రాముఁడు, తేవనమున వనము సొచ్చి ధీరత్వమునం
ద్రోవ నవవారిపూరిత, పావననదు లుత్తరించి పరమప్రీతిన్. 88

తే. చతురుఁ డగుభరద్వాజునిశాసనమునఁ
జిత్రకూటాద్రిఁ జేరి తచ్ఛిఖరిమీఁద
వేడ్కతోఁ బర్ణశాలఁ గావించి యందు
నిందుసుఖగోష్ఠి వసియించి యుండె నంత. 89

వ. దేవగంధర్వసంకాశులైన సీతారామలక్ష్మణులు మువ్వురు చిత్రకూటోపాంత వనంబునందు రమమాణులై సుఖంబుగా నివసించి యుండి రిట సాకేత పురంబున 90

క. ఆరఘునరుఁడు శైలముఁ, జేరుట విని పుత్త్రశోకచింతార్దితుఁడై
దారుణగతి విలపించుచు, భూరమణుఁడు మేను విడిచి పోయెన్ దివికిన్ 91

వ. దశరథమరణానంతరంబున మహాబలుండగుభరతుండు వసిష్ఠప్రముఖ మహాత్ముల చేత రాజ్యంబునందు నియుజ్యమానుండయ్యును దానినంగీకరింపక చతురంగ

బలంబులతోఁ గూడి రామపాదప్రసాదకుండై వనంబునకుం జని యార్యభావ
పురస్కృతుండై మహాత్ముండును సత్యపరాక్రముండును నభిరామదర్శనుండును
నగు రామునిం జేరి మహాత్మా నీవు సర్వగుణశ్రేష్ఠుండైన నను కనిష్ఠునకు రాజ్యా
ర్హత్వంబు లేమి యెఱింగి సధర్మజ్ఞుండవు గావున నీవె రాజ వని పలికిన సర్వస్వరూ
పగుణంబులచేత నాశ్రితచిత్తరంజకస్వభావుండయ్యును వనీపకాభీష్టప్రదానత
త్పరుండయ్యును యాచకజనలాభంబుచేతఁ బ్రసన్నవదనుండును మహాయశుం
డయ్యును నేకసాయకవిమోచనమాత్రంబున సమస్తదానవహననసమర్థుం
డయ్యును రాముండు పితృవచనగౌరవంబున రాజ్యం బంగీకరింపక రాజ్యంబు సే
యుటకహల్యాస్పృష్టవైభవపాదసంస్పృష్టంబులైన పాదుకలు న్యాసరూపంబున
భరతున కొసంగి బహువిధసాంత్వవచనంబులు సారెసారెకు నతనిఁ గ్రమ్మఱించిన
నా భరతుం డభిషేకార్థంబు రామప్రత్యానయనలక్షణమనోరథంబు నొందక
నందిగ్రామంబునం దనుదినంబును రామపాదుకలకు నమస్కరించుచు రామా
గమనకాంక్షుండై రాజ్యంబుఁ బాలించుచుండె నంత సర్వాతిశయకాంతిమం
తుండును సత్యప్రతిజ్ఞుండును రాజ్యభోగలౌల్యరహితుండు నగు రాముండు భర
తుండాదిగాఁ గల పురజను లందఱు వెండియుఁ జిత్రకూటంబునకుం జనుదెంతు
రని తలంచి పితృవచనపరిపాలనంబునం దేకాగ్రచిత్తుండై దండకారణ్యంబుఁ
బ్రవేశించె నని యిట్లయోధ్యాకాండకథ యంతయు సంక్షేపంబుగా నెఱిం
గించి యద్దేవమునిశ్రేష్ఠుం డారణ్యకాండకథాక్రమం బెఱింగించువాఁడై
వెండియు నిట్లనియె నట్లు రాజీవలోచనుండగు రాముండు మహారణ్యంబగు దండ
కారణ్యంబుఁ బ్రవేశించి యపూర్వసంస్థానవనవిలోకనజనిత కుతూహలంబు
చేతను మహావనప్రవేశసంభావిత రాక్షసరణారంభోర్జితహర్షంబుచేతను విక
సితలోచనారవిందుండై. 92

తే. మునివిరోధి విరాధుని మొనసి చంపి
మాననీయాంగు శరభంగు మౌనిఁ జూచి
ఘను సుతీక్ష్ణమహాముని గని యగస్త్య
ననుజుఁ జూచి యగస్త్యునిఁ గని ముదమున. 93

తే. ఆయగస్త్యమహామునియనుమతమున, నైంద్ర మగు కార్ముకంబు మహాసిపత్త్రి
దారుణాక్షయబాణతూణీరములును, రిపు వినిగ్రహార్థంబు పరిగ్రహించె. 94

వ. ఇట్లు జగదేకవీరుం డగు రాముండు స్వవీర్యసదృశవరాయుధలాభంబు నొంది
పరమప్రీతుండై శరభంగవనంబున నివసించియుండ నప్పు డచ్చటి మహర్షులు
చిత్రకూట పంపానన నివాసులయిన వానప్రస్థులం గూడి యసురరాక్షసవధా
కాంక్షులై రాముని సమీపంబునకుం జనుదెంచి రాక్షసబాధ నెఱింగించిన

నారఘుపుంగవుండు రాక్షసావాసభూతంబైన వనంబునందు నమ్మహామునుల
ప్రార్థనావచనం బంగీకరించి. 95

ఆ. దహనకల్పు లైనదండకారణ్యనివాసిమునుల మ్రోల వరుసతోడ
సంగరమున నింక సకలరాక్షసుల వధించువాఁడ నని ప్రతిజ్ఞఁ జేసి. 96

క. అనఘుఁడు రాఘవుఁ డక్కాననమున నివసించి తగ జనస్థాననివా
సిని యగుశూర్పణఖను గ్రక్కునఁ బట్టి విరూపఁ జేసె ఘోరాసిహతిన్. 97

వ. ఇట్లు కామరూపిణియైన శూర్పణఖను కర్ణనాసికాచ్ఛేదనంబున విరూపిణిం జేసి.

క. శూర్పణఖాప్రేరితుఁ డై; దర్పంబున సమరమునకుఁ దఱిసినఖరుని
న్నేర్పున వధించె రాముఁడు, సర్పాభీలోగ్రతీవ్రశాతశరములన్. 99

వ. ఇట్లు రాక్షససేనాధ్యక్షుం డైన ఖరునిం బరిమార్చి తదనుచరు లైనదూషణ
త్రిశిరుల వధించి పదంపడి చతుర్దశసహస్రసంఖ్యాకప్రధానరాక్షసుల నాజిరం
గంబున నంతంబు నొందించి తదనుచరు లైనయామినీచరుల నందఱ నిశ్శేషం
బుగా రూపుమాపె నంత నకంపనశూర్పణఖలవలన జ్ఞాతివధం బంతయు విని
రావణుండు క్రోధమూర్ఛితుం డై సీతాహరణకార్యంబునందు మారీచుం డను
రాక్షసుని సహాయునిఁ గా వరించి బలవంతుం డైనయారామునితోడివిరోధంబు
యుక్తంబుగా దుడుగు మని బహుప్రకారంబుల నమ్మారీచునిచేత నివార్య
మాణుం డయ్యును వానివచనం బనాదరణంబు చేసి కాలచోదితుం డై మారీ
చసహితంబుగా రామునియాశ్రమస్థానంబునకుం జనుదెంచి. 100

శా. మారీచుం డొకమాయఁ బన్నియలరామత్స్వావరున్ లక్ష్మణున్
దూరంబు న్గొనిపోయినప్పు డదయున్ దోషాచరాధీశ్వరుం
డారామామణి సీత నెత్తికొని ఘోరాకారుఁ బక్షీంద్రు దో
స్సారోదారు జటాయువుం దునిమి భాస్వల్లీల నేగె న్వడిన్. 101

తే. అంత రాముండు దైత్యశితాసిలూన, పత్త్రపాదుఁ డై పడియున్న పక్షినాథుఁ
గని మహీపుత్త్రి హృత యౌట విని దురంత,గాఢతరదుఃఖభరమున గాసిపడుచు.

క. చలితేంద్రియుఁ డై మిక్కిలి, పలవించుచు రామవిభుఁడు పక్షీంద్రునకు
న్విలసిత శాశ్వతసౌఖ్యము, గలుగఁగ సంస్కారవిధులఁ గావించి వెసన్. 103

క. వనమున జానకి వెదకుచుఁ, జనిచని యొకచోటఁ గాంచె సత్త్వోద్రేకం
బున జగము మ్రింగఁ జాలెడు, ఘనరూపుని ఘోరవికృతకాయుఁ గబంధున్.

వ. కనుంగొని వాని భుజంబులు రెండును నిశాతఖడ్గంబుల ఖండించి పంచత్వంబు
నొందించి తత్కళేబరంబు దహించిన వాఁడు స్వర్గగమనయోగ్యం బగుస్వకీ
యం బైనగంధర్వరూపంబు నొంది రామునిం జూచి మహాత్మా నీవు శ్రవణకీర్త
నాదిభగవద్ధర్మాచరణశీలయు సామాన్యవిశేషధర్మనిపుణయుఁ జతుర్థాశ్రమ
ప్రాప్తజితేంద్రియత్వపూర్వకమోక్షోపయుక్తాచారనిష్ఠయు నైనశబరిఁ గానం

జను మని పలికి దివంబునకుం జనిన నారఘువల్లభుండు తద్వచన ప్రకారంబున శబరిం గానం జని దానిచేత నర్ఘ్యాదిఫలసమర్పణాంతోపచారంబున నర్చితుం డయ్యె నని యిట్లు సత్యప్రతిజ్ఞత్వప్రధానం బైనయారణ్యకాండచరిత్ర సంక్షేపంబుగా సూచించి మిత్రకార్య నిర్వాహకత్వపరంబైన కిష్కింధాకాండ కథావృత్తాంతం బెఱింగించువాఁడై వెండియు వల్మీకజన్ము నవలోకించి యిట్లనియె మునీంద్రా యిట్లు రాముండు శబరిచేతం బూజితుం డై పంపాసరోవర తీరవనంబునందు హనుమత్సమాగమంబుఁ జేసి హనుమద్వచనంబున సుగ్రీవునితోడ సాచివ్యంబుఁ జేసి మహాబలుండగు రాముండు జన్మప్రభృతిస్వవృత్తాంతంబును రావణహృతత్వాదిసీతావృత్తాంతంబును సర్వంబును సుగ్రీవునకుం జెప్పిన నా సుగ్రీవుండు రామసంబంధి యైనతత్సర్వంబును విని సమానదుఃఖ మహాబలసంబంధంబు గలుగుటకు సుప్రీతుం డయి రామునితోడ వహ్నిసాక్షికంబుగా సఖ్యంబుఁ జేసి సుహృత్సన్నిధియందు స్మృతదుఃఖుం డై తనకును వాలికిం గల వైరం బంతయు సాకల్యంబుగాఁ బ్రణయంబువలన నెఱింగించిన నారఘుసత్తముండు వైరవృత్తాంతంబు విని వాలిం బరిమార్చెద నని ప్రతిజ్ఞఁ జేసిన సుగ్రీవుండు రామున కుత్సాహవర్ధనార్థంబు వాలిపౌరుషం బంతయు నెఱింగించి రామునకు వాలిహననసామర్థ్యంబు గలదో లేదో యని శంకించి బలపరిజ్ఞానార్థంబు తొల్లి వాలిచేత నిహతుం డైనదుందుభి యనురాక్షసుని కళేబరంబుమహాపర్వతసంకాశం బైనదాని రామునకుం జూపి యీరాక్షసకళేబరంబు వాలిచేత నింతదూరంబు విక్షిప్తం బైనదని పలికిన విని నఖాగ్రంబున లోకవిరోధిసకలదానవదైత్యాదిహననశక్తియుక్తుండును నపరిచ్ఛేద్యబలుండు నగు రాముం డుదారబలోత్సాహవికసితాననుం డై యస్థినిచయరూపం బైన రాక్షసశరీరంబుఁ జూచి దాని దశయోజనపరిమితమాత్రంబు దవ్వులం బడఁ బాదాంగుష్ఠంబునం జిమ్మి తచ్ఛరీరంబు తొల్లి యార్ద్రం బిప్పుడు శుష్కం బై యున్న దని యెడసుగ్రీవునియభిప్రాయంబు విమర్శించి వెండియు విశ్వాసంబుం బుట్టించుచు సప్తసాలవృక్షంబులును దత్సమీపశైలంబును రసాతలంబు నొక్కసాయకంబున భేదించిన నవ్విధం బాలోకించి సుగ్రీవుండు సర్వప్రకారంబుల రాముండు దర్శనమాత్రంబున వాలిని వధింపం గలఁ డని విశ్వాసంబు నొంది కపిరాజ్యంబు శీఘ్రంబునఁ గరగతం బగు నని హర్షించి. 105

క. భూవరుననుమతమున సుగ్రీవుఁడు కిష్కింధ కేగి కీశాధీశున్
దేవేంద్రసుతుని వాలిని, గావరమున ననికిఁ బిలిచె ఘననాదమునన్ 106

క. పిలిచిన వాలి రయంబున, వలవ దుడుగు మనుచుఁ దార వారించినఁ దా
నిలువక వచ్చి భుజాబల, మలర రవిజు దాఁకె నాతఁ డాతనిఁ దాఁకెన్. 107

క. ఇత్తెఱఁగునఁ దలపడి కవి, సత్తము లుగ్రగతిఁ బోరు సమయంబున రా
జోత్తముఁ డొకబాణమున వి, యత్తల మద్రువంగ వాలి ననిఁ బడ నేసెన్.

మ. అటు వాలిం బరిమార్చి రాముఁడు తదీయంబైనసామ్రాజ్య మం
తట సుగ్రీవున కిచ్చినం గొని సముద్యత్ప్రీతితో నాతఁ డం
తట నల్దిక్కుల కమ్మెయిం బనిచి సీతం జూచి రం డంచు ను
త్కటవేగోద్ధతులన్ వలీముఖుల నందం బొప్పఁ బంచెన్ నడిన్ 109

వ. అని యిట్లు కిష్కింధాకాండకథాసంగ్రహం బెఱింగించి వెండియు నిట్లనియె
నంత బలవంతుం డగు హనుమంతుండు దక్షిణదిక్కునకుం జని సంపాతివచ
నంబున శతయోజనవిస్తీర్ణం బైనసముద్రంబుదాఁటి లంకాపురంబు సొచ్చి
యం దశోకవనికాఖ్యం బైనరావణుప్రమదావనంబున. 110

తే. ఒనర రామునిఁ జింతించుచున్నదాని,సీతఁ గనుఁగొని ప్రమదంబుసెలఁగ విభుని
కుశల మెఱిఁగించి ముద్రికగుఱుతొసంగి,మానితంబైనతచ్ఛిరోమణి గ్రహించి.

ఆ. వనము నీఱు సేసి వనపాలకులఁ ద్రుంచి, సప్తమంత్రిసుతుల సంహరించి
పంచసైన్యపతులఁ బంచత్వమొందించి, యసమసమరదక్షు నక్షుఁ దునిమి.

ఆ. శక్రజిత్ప్రయుక్త చటులలోకేశాస్త్ర, పాశమున రణోర్వి బద్ధుఁ డయ్యు
విధివరంబుకలిమి వేగ విముక్తుఁడై, దేవరిపుల యవమతికి సహించి. 113

ఆ. పరఁగఁ దనకుఁ దానె బద్ధుఁడై రాక్షస, వరునిపాలి కేగి వానితోడ
నవనివిభునిమహిమ లన్నియుఁ బ్రకటించి, చుట్ల నున్నరాక్షసుల వధించి.

మ. ఘనవాలాగ్నిశిఖాపరంపరల లంకాపట్టణం బంతయుం
దను శక్రాదులు మెచ్చ నొక్క త్రుటిలో దగ్ధంబు గావించి గ్ర
ద్దన భూపుత్రికిఁ జెప్పి రామునకు సీతాక్షేమముం దెల్పఁగా
వనధిం గ్రమ్మఱ దాఁటి వచ్చె విజయవ్యాపారధౌరేయుఁడై. 115

వ. ఇట్లు చనుదెంచి మహాత్ముం డగురామునకుం బ్రదక్షిణంబుఁ జేసి యమేయా
త్ముం డగుహనుమంతుండు తనచేత సందృష్టయయ్యె సీత యని యెఱింగించె
నని యిట్లు సుందరకాండవృత్తాంతంబు సంక్షేపంబుగా నెఱింగించి క్రమ్మఱ
నిట్లనియె నట్లు సీతావృత్తాంతం బెఱింగించిన విని రాముండు సుగ్రీవసహితం
బుగాఁ గదలి మహోదధిదక్షిణతీరంబుఁ జేరి సంతరణోపాయం బెఱింగించు
టకు సముద్రునిం బ్రార్థించి యతండు పొడసూప కున్న నలిగి. 116

క. ఇనకిరణనిభశరంబుల, వననిధి శోషిల్లఁ జేయ వారిధి భీతిం
జనుదెంచి రాఘవునిముఖ, వనజము వీక్షించి మధురవైఖరిఁ బలికెన్. 117

వ. మహాత్మా యిన్నలుండు సేతువుఁ గావించుంగాక యని యరిగిన నారఘుపుం
గవుని శాసనంబున సముద్రవచనప్రకారంబున నలుండు సేతువుఁ గావించె నంత
రాముండు నలవిరచితసేతుమార్గంబున శరనిధిం దాఁటి లంకమీఁదికిం జని.

క. దురమున దశకంఠుని శిత, శరముల వధియించి పుచ్చి జనకకుమారిం
బరమపతివ్రతఁ గనుఁగొని, నరపతి వ్రీడాభరమున నతవదనుం డై. 119

వ. వానరరాక్షససభామధ్యంబునఁ బరుషంబు లాడిన నద్దేవి పాతివ్రత్యవిషయసంశయవచనంబు సహింపక వహ్నిప్రవేశంబుఁ జేసిన నయ్యగ్నిదేవుం డద్దేవి కతిశీతలుండై రామునకుం బొడసూపి సీత నర్పించి మహాత్మా విశుద్ధభావ యగు సీతం బరిగ్రహింపు మని పలికిన నారాముం డగ్నివచనంబువలన జానకిని విగతకల్మషఁ గా నెఱింగి సీతాదేవిం జేకొని సంప్రహృష్టుండై దేవతలచేత నర్చితుండై ప్రకాశించె నప్పు డయ్యద్భుతకర్మంబుఁ జూచి చరాచరాత్మకం బైన త్రైలోక్యం బంతయు సంతోషంబు నొందె నంత రాముండు విభీషణుని లంకారాజ్యంబున కభిషిక్తునిం జేసి కృతకృత్యుండును విగతమనస్తాపుండును నై జగత్కంటకుం డైన రావణుని వధించుటవలనం బొడమినహర్షవశంబునం దన్నువిలోకింపం జనుదెంచిన శంకరహిరణ్యగర్భమహేంద్రప్రముఖబృందారకులచేత దుర్లభంబు లైనవరంబులు వడసి రాక్షసులచేత నిహతు లైనవానరుల నందఱఁ బునస్సంజీవితులం జేసి సీతాలక్ష్మణహనుమత్సుగ్రీవాంగదవిభీషణాదులం గూడి పుష్పకవిమానం బారోహించి యయోధ్యాపురంబునకుఁ బోవుచు భరద్వాజాశ్రమంబుఁ బ్రవేశించి నిజాగమనబోధనంబుకొఱకు హనుమంతుని భరతునిపాలికిం బనిచి యతం డెదుర్కొని తోడ్కొని పోవ సీతకుం బూర్వవృత్తాంతం బెఱింగించుచుం జనిచని నందిగ్రామంబుఁ జేరి యందు భ్రాతృసహితంబుగా మునివేషంబు విడిచి చతుర్విధాలంకారంబులఁ గైసేసి సీతాసాదృశ్యంబు నొంది క్రమ్మఱ నయోధ్యాపట్టణసింహాసనాధ్యక్షుం డయ్యెనని యిట్లు యుద్ధకాండకథాప్రపంచంబు సంగ్రహంబుగా నెఱింగించి వెండియు నిట్లనియె నట్లు సామ్రాజ్యపట్టాభిషిక్తుం డై మహాత్ముం డగు రాముండు రాజ్యపరిపాలనంబు సేయునప్పుడు సర్వజనంబు సంజాతరోమాంచం బై ముదితాంతఃకరణం బై సర్వకామలాభజనితప్రీతియుక్తం బై రామసంశ్లేషణపరిపుష్టసర్వాంగం బై యిష్టదేవతానమస్కారాదిరూపధర్మఫలలాభసమన్వితం బై మనఃపీడారహితం బై వ్యాధిరహితం బై దుర్భిక్షభయవర్జితం బై యలరెఁ బురుషు లొకానొకప్పు డైన నొక్కింతైనఁ బుత్రమరణంబు లేక సుఖించుచుండిరి యువతులు వైధవ్యం బెట్టిదో యెఱుంగక పతివ్రత లై సుఖించుచుండిరి జలాగ్నివాతజ్వరతస్కరక్షుత్పిపాసాప్రముఖాధ్యాత్మికాధిదైవికాధిభౌతికబాధలం బొరయక జనంబు లానందించుచుండిరి నగరంబులు రాష్ట్రంబులు ధనధాన్యోపేతంబు లై ప్రహృష్టజనాకీర్ణంబు లై నిత్యోత్సవయుక్తంబు లై కృతయుగంబునందుం బోలె ప్రముదితంబు లై యొప్పె రాముండు బహుసువర్ణాఢ్యయాగవిశేషంబుల నశ్వమేధశతంబుల దేవతలం దృప్తి నొందించి

రాజవంశంబుల శతగుణితంబులఁ బ్రత్యేకంబుగా రాజ్యదానంబున సంస్థాపించి యసంఖ్యేయం బగుధనంబును గోకోటిసహస్రంబులను బ్రాహ్మణుల కొసంగి యీలోకంబునందు నాల్గువర్ణంబులవారిని స్వస్వధర్మనిరతులంజేసి పదునొకొండువేలవత్సరంబులు రాజ్యంబుఁ జేసి స్వలోకం బైనవైకుంఠంబునకు వేంచేయఁగలండు. 120

క. అనఘము శ్రుతిసిభము శుభం, బనుపమసేవ్యంబు దురితహారి పగునీరా మునిచరితముఁ బఠియించినఁ,జనుఁ డఘములఁబాసి పొందు శాశ్వతసుఖమున్.

క. ఆయుష్యం బగు నీరా, మాయణముఁ బఠించు మనుజుఁ డైహికసౌఖ్య శ్రీయుతుఁడై సుతపౌత్రస, మాయుక్తుం డై యమర్త్యుఁ డగు నటమీఁదన్.

ఉ. భోగము మోక్ష మిచ్చురఘుపుంగవ దోశ్చరితప్రబంధమున్ బాగుగ విన్న విప్రనరపాలకవిట్ప్రజు లక్రమంబున న్వాగ్మృషభత్వమున్ క్షితిధనత్వముఁ బుణ్యఫలత్వము న్సము ద్యోగమహత్త్వముం గలిగి యెప్పుడు రెంతయు వీతశోకులై. 123

వ. అని యి ట్లుత్తరకాండకథాసమన్వితంబుగా సప్తకాండకథావృత్తాంతం బంతయు సంక్షేపంబుగా నెఱింగించిన వాక్యవిశేషజ్ఞుండును ధర్మాత్ముండును మహామునియు నగువాల్మీకి యన్నారదుని సంపూర్ణార్థప్రతిపాదకపదసమూహరూపం బైనతత్ప్రశ్నానురూపోత్తరవాక్యంబు విని శిష్యసహితుండై యద్దేవర్షి వర్యుం బూజించిన నన్నారదుం డవ్వాల్మీకిచేత యథార్హంబుగాఁ బూజితుండై యామంత్రణంబు నడసి యాకాశంబున కుద్గమించి స్వల్పకాలంబులోన బ్రహ్మలోకంబునకుం జనియె. 124

వాల్మీకి స్నానార్థము తమసానది కరుగుదెంచుట.

ఉ. ఆజటినాథుఁడుం జనిన యవ్వల నమ్ముని స్నానకాంక్షి యై యోజ దలిర్ప డెందమున నూరెడుభక్తిరసంబుతో భర ద్వాజుఁడు వెంట రా వికచతామరసోత్పలభూరిసౌరభ భ్రాజితదివ్యగంధవహబంధుర యాతమసా స్రవంతికిన్. 125

క. చని తత్తటినీమహిమకు, జనితప్రమదాభియోగసంభ్రమమతి యై ఘనసుజనావనపావన,వనగాహన మాచరింప వడిఁ దివురు చెదన్. 126

తే. తగ నకర్దమ మైనయత్తటినితీర్థ
మది విలోకించి తనక్రేవ నతివినీత
చిత్తుఁ డై యున్న యమ్ముఖ్యశిష్యునిఁ గని
యింపు దళుకొత్త మధురోక్తి నిట్టు లనియె. 127

ఆ. అనఘ కంటె రమ్యమై నిష్కళంక మై, స్వాదుయుక్త మై, ప్రసన్నసలిల మై నుతింప నయ్యె నీనదీతీర్థంబు, సాధుపురుషమానసంబుకరణి. 128

క. కలశం బచ్చుటఁ బెట్టుము, తలఁగక వల్కలముఁ దెమ్ము తమసాతటినీ
జలమజ్జన మొనరించెద, మలఘుగుణా సాంధ్యకృత్య మది దీర్చుటకున్. 129

క. అని పలుక భరద్వాజుఁడు, ఘనముగ వల్కల మొసంగఁ గైకొని ఘనుఁ డ
మ్ముని తత్తీరవనంబున, వినుతతపోధనుఁడు వేడ్క వీక్షించు నెడన్. 130

మ. హరిదశ్వస్ఫుటవర్ణతుల్యనవదూర్వాంకూరకాంతిచ్ఛటా
భరితస్ఫీతవిశాలశాద్వలచరత్పంచాస్త్రకేళీవినో
దరసోన్మత్తమనోజ్ఞనాదశకునద్వంద్వంబు క్రీడింపఁగాఁ
దరులం బొంచి నిషాదుఁ డొక్కఁ డలుకన్ దర్పాంధుఁడై గ్రుక్కనన్.

క. మించినవేడ్క రమించెడు, క్రౌంచంబుల రెంటిలోనఁ గనుఁగొని పురుష
క్రౌంచమును జంపె నురవడి, వంచించి నిషాదుఁ డెంత పాపాత్ముఁడో. 132

వ. అప్పుడు శోణితపరీతగాత్రంబుతో విచేష్టమానుండై నేలం బడి యున్న నిజ
వల్లభుం జూచి భర్తృమరణశోకాక్రాంతయై సహచరి యగు క్రౌంచాంగన దీన
స్వనంబునఁ గరుణంబుగా విలపించిన. 133

వాల్మీకిమహర్షి క్రౌంచమును వధించిననిషాదుని శపించుట.

ఉ. ఆరవ మాలకించి ముని యద్దెస ఘోరనిషాదపాతితుం
డై రస వ్రాలి యున్న విహగాధిపు రక్తపరీతశీర్షుని
న్వారక గాంచి భూరికరుణ న్మధురోక్తి ననూనయించి యా
కార యధర్మ మింత తగునా యని బుద్ధిఁ దలంచి యి ట్లనున్. 134

శ్లో. మా నిషాద ప్రతిష్ఠాం త్వ మగమ శ్శాశ్వతీ స్సమాః,
య త్క్రౌంచమిథునా దేక మవధీః కామమోహితమ్.

మ. అని యి ట్లామునిరాజు పల్కినఁ దదీయాలాపముల్ శ్లోకమై
తనరం గ్రౌంచవధంబుఁ గాంచి వగచేతం దూలు నాచేతఁ జ
య్యన నీలక్షణయుక్తపద్య మెటు లాహా వ్యాహృతం బయ్యె నేఁ
డని చింతించుచు శిష్యునిం బిలిచి నెయ్యం బొప్పఁగా నిట్లనున్. 135

వ. క్రౌంచీశోకార్తుండనై యిప్పు డేను నిషాదుని శపించిన శాపోక్తి చతుష్పాద
యుక్తం బై సమాక్షరపదం బై లక్షణోపేతం బై యనేకార్థప్రతిపాదకం బై తం
త్రీలయసమన్వితం బై శ్లోకరూపం బయ్యె శ్లోకంబు కంటె నన్యం బైన కేవల
పదసందర్భంబు గాదు వింటివే యని పలికిన నా భరద్వాజుండు వాల్మీకివచ
నంబు విని హృష్టచిత్తుం డై బహుప్రకారంబుల నుత్తమం బైన యాశ్లోకరా
జంబుఁ బఠించిన సంతుష్టాంతరంగుం డై. 136

తే. సత్వరంబుగ వాల్మీకిసంయమీంద్రుఁ, డన్నదీపుణ్యజలమున నర్మభంగి
స్నాన మొనరించి యిది యేమంత్రంబు గాఁగ, నచలభక్తిజపించుచు నచటు వాసి.

మ. తనవెంటం జలకుండిఁ గైకొని భరద్వాజుండు సంతోషి యై
చను దేరంగ ననేకవైఖరుల భాస్వత్పద్యభావంబు శి
ష్యునకుం జెప్పుచు నాశ్రమంబునకుఁ బుణ్యోదారుఁ డేతెంచి తా
ననిశధ్యాతతదర్థవర్ణపదుఁ డై యాసీనుఁ డై యుండఁగన్. 138

వాల్మీకిమహర్షికడకు పరమేష్ఠి యేతెంచుట.

ఉ. బంగరుటంచతేజిపయి బాగుగ నెక్కి సనందనాదులుం
బొంగుచు వెంట రాఁగ నలుమోముల వేదరవంబు లుప్పతి
ల్లం గమలాసనుండు మునిరాజును బుణ్యచరిత్రుఁ గన్గొనన్
సంగతి మీఱి వచ్చె సురసాధ్యులు మ్రోల జొహారు సేయఁగన్ 139

ఉ. వచ్చినధాతఁ గాంచి మునివర్యుఁడు దిగ్గన లేచి యాత్మలో
నొచ్చెము లేనిభక్తిరస మూరఁ బ్రదక్షిణముం బ్రణామము
న్మెచ్చుగ నాచరించి తమి మించి యథావిధిఁ బూజ లిచ్చి తా
నచ్చుగ ఫాలభాగఘటితాంజలి యై గురుబుద్ధి నుండఁగన్. 140

క. వనజాసనుండు **ముదమునఁ**, బనిగొని వాల్మీకిదత్త పరమాసనమం
దనువుగ నాసీనుం డై, మునిపతిఁ గూర్చుండఁ బనిచె మునుకొని ప్రేమన్. 141

వ. ఇట్లు బ్రహ్మచేత ననుజ్ఞాతుం డై వామలూరుతనయుం డుచితనిజాసనంబునం గూర్చుండి క్రౌంచగతం బైనచిత్తంబున ధ్యానంబుఁ బూని యెవ్వండు చారురవం బైనతాదృశక్రౌంచంబు నకారణంబుగా వధించె నట్టి నిషాదుం డెంత పాపాత్ముం డెంత వైరగ్రహణబుద్ధి యయ్యె నని సారెసారెకుఁ గ్రౌంచాంగన నుద్దేశించి దుఃఖించుచు హృద్గతావశోత్పన్నశ్లోకార్థంబునందు నివేశితచిత్తుం డై సాతొల్లోకపితామహుం డైన పరమేష్ఠి కిట్లనియె. 142

మ. కలుషాత్ముండు నిషాదుఁ డొక్కఁ డలుకం గ్రౌంచంబు హింసింపఁగాఁ
గలఁక న్భర్తృవియోగదుఃఖమున నాక్రందించు క్రౌంచాంగన
న్బలుచం గన్గొని యేను శోకమున వానిం దిట్టితిం దిట్ట న
ప్పలుకుల్ వి న్శ్లోకపద్య మై తనరె శుంభల్లక్షణోపేత మై. 143

వ. అని పలికి యాశ్లోకంబుఁ బఠించి దేవా యిది యేమి కారణంబున నుత్పన్నం బయ్యె నాశ్చర్యరసావిష్టచిత్తుండ నై యున్నవాఁడ నెఱింగింపవే యని యభ్యర్థించిన నాకర్ణించి విరించి యుదంచితకరుణాకటాక్షవీక్షణంబుల నిరీక్షించి మదాజ్ఞానుసారంబున నవతీర్ణ యైనసరస్వతి నెఱుంగఁ డయ్యె నని మందహాసంబుఁ జేసి యిట్లనియె. 144

తే. తాపసోత్తమ మత్ప్రసాదమునఁ జేసి, భారతీదేవి నీజిహ్వఁ బాదుకొనియె
నట్లు గాకున్న నీచేత ననఘ నేఁడు, పరఁగ నీశ్లోక మిబ్భంగి బద్ధ మగునె. 145

తే. అనఘ నీమీఁది కూర్మిచే నమరమౌని, నారదుఁడు సర్వలోకవిశారదుండు.

తెలిపి పోయిన రాముని దివ్యచరిత, మఖిలము నవిస్తరంబుగా నర్థిఁ జెపుము.

క. శ్రీమంతుఁడు గుణవంతుఁడు, ధీమంతుఁడు ధార్మికుండు ధీరుం డగునా
రామునిచరితముఁ జెప్పుట, ప్రామాణ్యము పుట్టువునకు ఫల మగుఁ జుమ్మీ.

ఉ. ఉత్తమవిక్రముం డగురఘూత్తమునచ్చరితంబు జానకీ
వృత్తము సర్వరాక్షసులవృత్తము లక్ష్మణువృత్త మంతయుం
జిత్తముఁ జేరి యున్నయవి సేరక యున్నవి నేఁడు పూర్ణవి
దవ్త్తమ మత్ప్రసాదమునఁ దప్పక తోఁచెడు నీకు సర్వముల్. 148

క. దురితహరంబును జేతో, హర మీాదృక్శ్లోకబద్ధ మగురాముని న
చ్చరితముఁ జేయుము నీపలు, కరయఁగ నొక్కైన నసృతమై యుండ దొగిన్.

మ. క్షితి నెందాఁకఁ గులాచలంబులు రహిం జెల్వొందుఁ బుణ్యాపగా
తతి యెందాఁకఁ జరించు నర్ణవము లెందాఁకం జెలంగు న్భవ
త్కృతరామాయణకావ్య మందనుక నూరిస్తుత్యమై యుండు స
న్మతి నందాఁక సుఖంచె దీవు తగ నస్మల్లోకసంవాసి వై. 150

మ. అని దీవించి విరించి నప్మదరనవ్యాకోచచిత్తాబ్జుఁ డై
చనియెం బిమ్మటఁ దాపసోత్తముఁడు చంచత్ప్రీతి నాశ్లోకముం
బనిగా శిష్యులు సారెసారెకుఁ బఠింప న్వేడ్క నాలించి త
ద్ఘనరామాయణపుణ్యకావ్యరచనాకౌతూహలోల్లాసి యై 151

వ. మఱియుఁ గ్రౌంచాంగనాదీనస్వరసమాకర్ణ నసంజాతశోకంబు సమాక్షరచతు
ష్పాదగీతం బైనశ్లోకం బయ్యె నింక నాశీర్నమస్క్రియావస్తునిర్దేశముఖం
బును నితిహాసకథాసంయుక్తంబును నితరదార్వసంశ్రయంబును జతుర్వర్గ
ఫలప్రదంబును జతురోదాత్తనాయకంబును నగరసముద్రశైలర్తు చంద్ర
సూర్యోదయోద్యాన జలక్రీడా మధుపానోత్సవవిప్రలంభ వివాహకుమారో
దయ మంత్రకరణ దురోదర ప్రయాణ రణ నాయకాభ్యుదయ వర్ణనంబుల
చేత నమలంకృతంబును నసంక్షిప్తంబును రసభావనిరంతరంబును సుసంధి
శ్రావ్యవృత్తానతివిస్తీర్ణసర్గోపేతంబును లోకరంజనంబును నగు యశస్విరామ
చరితరూపమహాకావ్యంబు వృత్తాశ్రయంబులై నశృంగారాదిరసంబులును నర్థా
శ్రయంబు లై నద్రాక్షాపాకనారికేళపాకరసాలపాకంబులలోబహిరంతరావిర్భూత
రసం బై నద్రాక్షాపాకంబును బదాశ్రయంబులై నశయ్యలును వైదర్భిగాడీపాం
చాలీప్రముఖరీతులలోన బంధపారుష్యశబ్దకాఠిన్యాతిదీర్ఘసమాసవర్జితం బైన
వైదర్భీరీతియందు విషమాక్షరవృత్తరాహిత్యంబును శబ్దార్థాశ్రయంబు లైన
యనుప్రాసోపమాద్యలంకారజాతంబును శబ్దావయవాశ్రయంబు లైన గుణం
బులును గైశిక్యాదివృత్తులును దేటపడునట్లుగా రచించెద సమానదోష సంధి
దోష పదదోషాది సమస్త దోషపరివర్జితం బగుదానిని నన్యూనాతిరిక్తమహా

నందై కరసోపనతవాక్యబద్ధం బగుదాని మద్విరచితం బగుదాని రావణవధం బధికరించి కావింపంబడినదాని శ్రీరామచరితంబు సమాహితచిత్తుల రై వినుండని శిష్యులతోడం బలికి కీర్తిమంతుండును నుదారబుద్ధియు నగునమ్మునిశ్రేష్ఠుండు ప్రక్షాళితపాణిపాదుం డై ప్రాచీనాగ్రదర్భాసనంబున నుపవిష్టుం డై యంజలి ఘటించి విరించనోక్తప్రకారంబున నచలసమాధియోగంబుఁ బూని నారదోక్తం బైనరామచరితవస్తుతత్త్వంబు వ్యక్తం బగునట్లు కథారహస్యంబు లన్వేషింప నప్పుడు చతుర్ముఖప్రసాదబలంబున దశరథునివృత్తంబును సీతారామలక్ష్మణులయోధ్యయందు నివసించునప్పు డేవృత్తంబు సంజాతం బయ్యెఁ దద్వృత్తంబును వారలహసితభాషితగతిచేష్టితంబులును సాకేతపురనిర్గమనానంతరంబున వనవాసంబునం దెయ్యది సంజాతం బయ్యె నట్టివృత్తంబును సత్యసంధుండగు రామునిచేత రచింపంబడినకార్యంబు లన్నియుఁ గరతలగతామలకంబునుం బోలె నిరీక్షించి. 152

—:o:—. వాల్మీకిమహర్షి రామాయణమహాకావ్య మొనరించుట. —:o:—

తే. అఖిలధర్మార్థగుణయుక్త మైనదాని, రమ్యకామార్థగుణవిస్తరంబు నైన
దాని నీరధిఁబోలె రత్ననిభలలిత, మానితపదార్థసంపూర్ణ మైనదాని. 153

సీ. షడ్జాదికస్వరసంబంధికాంతాదికాఖిలశ్రుతిహృద్య మైనదాని
వేడ్కతో వినువారి వీనులఁ జిత్తంబు నభిముఖంబుగఁ జేయునట్టిదాని
సర్వోపనిషదర్థసారసంభూతాశయప్రతిపాదకంబయినదాని
నరసురగంధర్వపరమర్షియక్షవిహంగకిన్నరసేవ్యమయినదాని

తే. నర్కకులమున నవతీర్ణుఁ డైన పరమ, పురుషుఁ డగురామభద్రునిపుణ్యచరిత
నమరమునినారదుఁడు సెప్పినట్టిఫణితి, నంతయును గావ్య మొనరింపనాత్మఁ దలఁచి.

వ. రామునిజన్మంబును దన్మహావీర్యంబును సర్వానుకూలత్వంబును సర్వప్రియత్వంబును క్షాంతియు నిరతిశయప్రియదర్శనత్వంబును సత్యశీలత్వంబును విశ్వామిత్రసమాగమంబునునానావిచిత్రకథలును జానకీవివాహంబును ధనుర్విభేదనంబును రామరామవివాదంబును దాశరథిగుణానుకీర్తనంబును రామాభిషేకసమారంభంబును గైకేయీదుష్టభావంబును నభిషేకవ్యాఘాతంబును రామవివాసనంబును దశరథశోకవిలాపంబును దశరథునిపరలోకగమనంబును బ్రకృతివిషాదంబును బ్రకృతివిసర్జనంబును నిషాదాధిపసంవాదంబును సుమంత్రోపావర్తనంబును గంగానదీతరణంబును భరద్వాజదర్శనంబును భరద్వాజుని శాసనంబునఁ జిత్రకూటప్రవేశంబును జిత్రకూటంబునందు గృహనిర్మాణంబును బర్ణశాలావస్థానంబును భరతాగమనంబును రామపాదప్రసాదనంబును దశరథునకు సలిలప్రదానంబును బాదుకాగ్ర్యాభిషేకంబును నందిగ్రామంబునందు భరతనివాసంబును బాదుకాస్థాపనంబును ననసూయాసందర్శనంబును నంగ

రాగసమర్పణంబును దండకారణ్యగమనంబును విరాధవధంబును శరభంగదర్శనంబును సుతీక్ష్ణసమాగమంబును నగస్త్యదర్శనంబును జటాయువుతో సమాగమంబును బంచవటీగమనంబును శూర్పణఖం జూచుటయు శూర్పణఖాసంవాదంబును విరూపకరణంబును ఖరాదివధంబును రావణునిజానకీహరణోద్యోగంబును మారీచవధంబును వైదేహీహరణంబును రామునివిలాపంబును జటాయుర్నిబర్హణంబును గబంధదర్శనంబును బంపాదర్శనంబును శబరీదర్శనంబును హనుమద్దర్శనంబును ఋశ్యమూకగమనంబును సుగ్రీవసమాగమంబును సాలభేదనంబున సుగ్రీవునకు విశ్వాసంబుఁ బుట్టించుటయు సుగ్రీవునితోడి సఖ్యంబును వాలిసుగ్రీవులయుద్ధంబును వాలిప్రమథనంబును సుగ్రీవరాజ్యసంస్థాపనంబును దారావిలాపంబును రామసుగ్రీవులసంకేతంబును వర్షరాత్రనివాసంబును రామునికోపంబును వానరులపరస్పరమేళనంబును హరిత్ప్రస్థాపనంబును సుగ్రీవునిచేత వానరుల నుద్దేశించి పృథివీసంస్థానకథనంబును నంగుళీయకదానంబును బిలదర్శనంబును బ్రాయోపవేశనంబును సంపాతిదర్శనంబును బర్వతారోహణంబును సముద్రలంఘనంబును సముద్రునివచనంబున మైనాకదర్శనంబును సింహికానిధనంబును లంకాద్వీపగతమలయగిరిదర్శనంబును నేకాంతవిచింతనంబును రాత్రియందు లంకాప్రవేశంబును రావణదర్శనంబును బుష్పకదర్శనంబును నాపానభూమిగమనంబును నవరోధదర్శనంబును నశోకవనికాయానంబును సీతాదర్శనంబును రావణాగమనంబును రాక్షసీతర్జనంబును ద్రిజటాస్వప్నదర్శనంబును నంగుళీయకప్రదానంబును సీతాసంభాషణంబును సీతామణిప్రదానంబును వృక్షభంగంబును రాక్షసీవిద్రవంబును గింకరనిబర్హణంబును వాయుసూనుగ్రహణంబును లంకాదాహాభిగర్జనంబును బ్రతిప్లవనంబును మధుహరణంబును రాఘవాశ్వాసనంబును మణినిర్యాతనంబును విభీషణసంసర్గంబును వధోపాయనివేదనంబును సముద్రసంగమంబును సేతుబంధనంబును సముద్రతరణంబును రాత్రియందు లంకావరోధంబును గుంభకర్ణనిధనంబును మేఘనాదనిబర్హణంబును రావణవినాశంబును నరిపురంబున సీతావాప్తియు విభీషణాభిషేకంబును బుష్పకదర్శనంబును నయోధ్యాగమనంబును భరతసమాగమంబును రామాభిషేకోత్సవంబును సర్వసైన్యవిసర్జనంబు నివి యన్నియు విచిత్రపదార్థంబులగు యిరువదియొక్క వేయుం బదియుఁ దొమ్మిదిశ్లోకంబులను నేనూటముప్పదియేడు సర్గలను నాఱుకాండంబులను జేసి యాత్మవంతుండును భగవంతుండును మహర్షియు నైనవాల్మీకి విచిత్రపదంబును రామచారిత్రప్రతిపాదకంబును నైన కావ్యంబుగా రాముండు సంప్రాప్తసామ్రాజ్యుండై యుండునప్పుడు లోకహితార్థంబు రచించి స్వరాష్ట్రరంజనంబును సీతావిసర్జనంబును బ్రాహ్మణపుత్రజీవనాశ్వమేధాదిభవిష్యత్కథలును నుత్తరకాండంబుగా రచించె నుత్తరకాండం

బుతోఁగూడ శ్రీరామాయణంబునం దిప్పుడు యాఱున్నూట నలువదియేడుసర్గ
లును నిరువదినాల్గువేల యిన్నూటయేఁబదిమూఁడు శ్లోకంబులును గలిగి
యుండు నందు బాలకాండమునందు డెబ్బదియేడుసర్గలును రెండువేలయి
న్నూటయేఁబదియాఱు శ్లోకంబులును నయోధ్యాకాండంబునందు నూటపం
దొమ్మిదిసర్గలును నాలుగువేలనన్నూటపదియేను శ్లోకంబులును నారణ్యకాం
డంబునందు డెబ్బదియయిదు సర్గలును రెండువేలయేన్నూటముప్పదిరెండుశ్లో
కంబులును గిష్కింధాకాండంబునం దఱువదియేడుసర్గలును రెండువేలయా
ఱున్నూటయిరువదిశ్లోకంబులును సుందరకాండంబునం దఱువదియెనిమిదిసర్గలును
మూఁడువేలయాఱు శ్లోకంబులును యుద్ధకాండంబునందు నూటముప్పది
యొక్క సర్గలును నయిదువేలతొమ్మన్నూటతొమ్మిది శ్లోకంబులును నుత్తర
కాండంబునందు నూటపది సర్గలును మూఁడువేలయిన్నూటముప్పదినాల్గు
శ్లోకంబులునుం గలిగి యుండు మహర్షి యగువాల్మీకి చతుర్వింశతిసహస్రశ్లోక
పరిమితంబుఁ జేసి యిమ్మహాకావ్యంబు రచించెఁ గావునఁ దక్కిన యిన్నూట
యేఁబదిమూఁడుశ్లోకంబులు జగతీచ్ఛందం బాదిగాఁ గల ఛందంబులవలనం
బుట్టినవృత్తంబులయక్షరాధిక్యంబున నుత్పన్నంబులయ్యె నని కొంద ఱందురు
బహుయుగంబు లతీతంబు లగుటవలన వాల్మీకిప్రతిజ్ఞాతసంఖ్యకు వ్యత్యయంబు
గలుగుట యుక్తం బని కొంద ఱందురు వాల్మీకిమహర్షి వసుం డిరువదినాల్గు
వేలశ్లోకంబులు పరిమితంబు చేసి గ్రంథంబు రచించె ననియెడు నది వాల్మీకి
సంకల్పమాత్రంబె కాని పరిసమాప్తిదశయందు గ్రంథపరిపూర్తికొఱకు నీశ్లో
కంబులు కథితంబులై యుండఁ బోలు నని కొందఱు వక్కాణింతురు చతుర్విం
శతిసహస్రశ్లోకనిర్ణయంబు కావ్యంబుకొఱకు నన్యూనాభిప్రాయంబె కాని
యనతిరిక్తాభిప్రాయంబు కాదని కొందఱు వచింతు రిరువదినాల్గువేలశ్లోకంబుల
మీఁద నల్పసంఖ్యాతంబులైన యిన్నూటయేఁబదిమూఁడుశ్లోకంబు లధికంబు
లై యుండు టది వ్యత్యయంబుగా దెట్లనిన విరించికి మహాయుగంబులు వేయుఁ
జనిన నొక్కపగ లనియు నాపగటికిఁ బదునలుగురు మనువులు చనుదు రని
యు మనుకాలంబు డెబ్బదియొక్క మహాయుగంబు లనియుఁ బురాణంబు
లందు వినంబడు వేయుమహాయుగంబులఁ బదునాల్గు మనువులకు విభాగించిన
డెబ్బదియొక్క మహాయుగంబులకంటె నించుక కాలం బధికం బై కానఁ
బడిన నది యెట్లు వ్యత్యయంబుగా గణింపంబడ కుండు నట్టుల యయ్యల్పం
బై నయాధిక్యంబు పరిగణితంబుగానేరదు భగవంతుం డగు ప్రాచేతసుండు
చతుర్వింశత్యక్షరసంఖ్యాకగాయత్రీవర్ణంబు లీరామాయణంబునందు వేయి
శ్లోకంబుల కొక్కొక్క యక్షరంబు శ్లోకఘటితంబుగాఁ జేసి బాలకాం
డంబునందు మూఁ డక్షరంబులును నయోధ్యాకాండంబునందు నాల్గక్ష

రంబులును నరణ్యకాండమునందు రెం డక్షరంబులును గిష్కింధాకాండము నందు రెండక్షరంబులును సుందరకాండంబునందు మూఁడక్షరంబులును యుద్ధ కాండమునం దా అక్షరంబులును నుత్తరకాండంబునందు నాల్గక్షరంబులును సంస్థాపించి రచించె నిక్కావ్యంబు చతుర్వింశత్యక్షరాత్మకగాయత్ర్యాఖ్యపర బ్రహ్మనివాసం బై యుండు నుత్తరకాండంబునందు సమస్తజనులకు భగవంతు నితోఁ గూడఁ దల్లోకప్రాప్తి యతిశయం బై యుండుటం జేసి యిక్కావ్యంబు ప్రాచుర్యంబుగాఁ బరత్వాభివ్యక్తి కలిగి యుండు దానం జేసి సర్వోత్తరత్వంబు వలన నిది యుత్తరకాండం బనం బరఁగె నివ్విధంబున రామాయణంబు సమ గ్రంబుగా రచియించి. 155

క. మునిపతి కృతార్థుఁ డై తా, నొనరించిన రామచరిత మొప్పారఁగ నె
వ్వనిచేఁ జదివించెదనో, యని మదిఁ దలపోయు చుండ నానమయమునన్.

వాల్మీకిమహర్షి శ్రీరామాయణ మహాకావ్యముఁ గుశలవుల కుపదేశించుట.

సీ. రూపవంతులు తుల్యరూపులు తుల్యవయస్కులు ధర్మకామార్థవిదులు
సుకుమారమూర్తులు సుందరాంగులు యశస్కరులన్నదమ్ములు చారుముఖులు
లలితలక్షణలక్షితులు మధురస్వరభాషులు గంధర్వవేషధరులు
శ్రుతినిష్ఠితులు బహుశ్రుతులు మేధావులు మునివేషధరులు సంపూర్ణతేజు
తే. లఖిలగాంధర్వతత్త్వజ్ఞు లఖిలశాస్త్ర, విదులు మూర్ఛనాస్థానకోవిదులు రాజ
నందనులు సర్వసంపన్ను లిందుసదృశ, లపనులుకుశీలవులుకుశలవులు వచ్చి.

తే. భక్తి వాల్మీకిమునినాథుపాదములకు, వందనముఁ జేసి పేశలవాగ్విభూతి
మమ్ముఁజదివింపుఁ డనవుఁడు మౌనివిభుఁడు, కరుణ దళుకొత్త వారల●గారవించి.

తే. పరఁగ రామదేహాఖ్యబింబంబువలన, సముదితము లై నయపరబింబములరీతి
నమరువారి మనోజ్ఞవేషములవారి నక్కుమారోత్తములఁ జాల నాదరించి.

మ. సమతంత్రీలయయుక్తమై మధుర మై సప్తస్వరోపేత మై
రమణీయామృతకల్ప మై నవరసప్రాగల్భ్య మై సన్మనో
రమ మై యొప్పెడురామచంద్రచరిత ప్రత్యగ్రకావ్యంబు స
ర్వము సార్థంబుగ నక్కుమారులకు నవ్వాల్మీకి సెప్పె న్రహిన్. 160

తే. చెప్పినఁ గుశీలవులు ముదఁ మొప్ప మౌని
కరుణ నక్కావ్య మంతయు వరుసఁ జదివి
రమణ సర్వంబు వాగ్విధేయముగఁ జేసి
తాపసకులోత్తమునిప్రసాదంబు వడసి. 161

మ. మదనాకారులు రాజనందనులు సమ్యగ్గానవిద్యారహ
స్యధురీణు ల్మధురస్వరు ల్లవలు చంచన్మూర్ఛనాస్థానకో
విదు లై రామకథాప్రబంధము లసద్వీణానుకూలంబుగా

ముద మొప్ప న్మునినేతయొద్ద సతతంబు న్బాడి రిం పొందఁగన్. 162

తే. మఱియుఁ గడువేడ్క నమ్మునివరుని కడకు
వరుస మౌనులు సాధులు వచ్చినపుడు
వారి మ్రోల నప్పార్థివవరతనయులు
గాన మొనరించి రమ్మహాకావ్యకథను. 163

కుశలవులు శ్రీరామయజ్ఞవాటములో శ్రీరామాయణ గానముఁ జేయుట.

వ. మఱియు నిసర్గమధురశబ్దప్రపంచసంచితం బైనయక్కావ్యంబు దదీయమధురస్వరవాగ్విధేయం బై పరిమళోపేతం బై నకుందనంబుచందంబున నందం బై యొప్పె నంత నొక్కనాఁడు సర్వాంగసుందరు లగునారాజనందనులు మునిపతి చేత ననుజ్ఞవడసి మునివేషంబులు ధరించి సాకేతపురంబున కరిగి రామభద్రుం డశ్వమేధయాగంబుఁ జేయుచుండ నయ్యజ్ఞవాటంబుఁ బ్రవేశించి మునిసభామధ్యంబున విపంచిక లలవరించి రంగు రక్తులు గులుకఁ గవ గూడి జంత్రగాత్రంబు లొక్కటియై మధురంబుగా మ్రోయఁ జేతనాచేతనత్వనిరూపణంబు లేర్పడకుండ సమాక్షరపాదవిచిత్రపదార్థవ్యక్తం బగుదాని స్వరూపోచ్చారణమాత్రంబునందును స్వరవిశేషసమన్వితగానంబునందును మధురం బగుదానిఁ ద్ర్యశ్రచతురశ్రమిశ్రసంజ్ఞకద్రుతమధ్యవిలంబితగానధ్వనిపరిచ్ఛేదకాన్వితం బగుదాని షాడ్జీనైషాదీధైవతీపాంచమీమాధ్యమీగాంధార్యార్షభీసంజ్ఞకసప్తజాతిబంధం బగుదాని వీణాతంత్రియం దధిరోపించి తాలవేణుమృదంగాదివాద్యంబులతోఁ గూడ నభివ్యక్తంబుగాఁ బాడం దగినదాని శృంగారకారుణ్యహాస్య వీరభయానకరౌద్రబీభత్సాద్భుతశాంతరస సహితంబగుదాని నుద్దీపనాలంబనాదివిభావయుక్తం బగుదాని సంభోగవిప్రలంభసంజ్ఞకద్వివిధశృంగారరసోపేతం బగుదాని సీతాచరితపౌలస్త్యవధరామశోకప్రతిపాదకం బగుటం జేసి శృంగారవీరశోకరసప్రధానం బగుదాని సర్వాలంకారపూర్ణంబగుదాని వేదార్థవ్యక్తీకరణంబుకొఱకు వాల్మీకిచేతఁ గథితం బైనదాని సీతాచరితరావణవధప్రతిపాదకం బైనదాని రామాయణకథాప్రబంధంబు మునిపతి యభిప్రాయంబు మనంబున నిడికొని శృంగారాదిరసావిర్భావం బెట్లగు నట్లు మధురంబును రంజనంబును సమీచీనరాగయుక్తంబునుం గాఁ బాడిన. 164

శా. ఆశ్లోకప్రచురత్వ మామధురశబ్దార్థోపమానోపమే
యశ్లేషాదికపోషణంబు ఘనగీతౌదార్య మాలించి పు
ణ్యశ్లోకు ల్మునిపుంగవు ల్భువనవిఖ్యాతుల్ ప్రశస్తప్రభా
వశ్లాఘ్యు ల్పరమాద్భుతంబు మనముల్ నైదుష్య మేపారఁగన్. 165

శా. ఆహా! యెంత విచిత్ర మంచుఁ గనులన్ హర్షాశ్రువార్బిందుసం
దోహంబుల్ చినుకం గుమారకుల నస్తోకప్రభావాఢ్యుల

స్నీహారాంశుసమానవక్త్రుల రహి న్వీక్షించి కారుణ్య ము
త్సాహంబుం జెలఁగ న్నుతించి రతిచిత్రప్రౌఢివాగ్వైఖరిన్. 166

వ. మఱియు నీరామచరితంబు బహుకాలనిష్పన్నం బైనను బాకవిశేషంబునఁ బ్రత్యక్షంబుగా ననుభూయమానం బైనపగిది దర్శితం బగు చున్న దని యిట్లు ప్రశంసించి. 167

కుశలవులకు మునీశ్వరులు బహుమతు లొసంగుట.

సీ. ఒకమౌని వల్కలం బకలంకమతి నిచ్చెఁ గరుణతో నొకమౌని కలశ మొసఁగెఁ
దపసియొక్కఁడు గూర్మి జపమాల దయచేసెఁ బ్రీతితో నొకమౌనిబ్రుసి నొసంగె
నొకసంయమీంద్రుఁ డాయుష్యంబుగ్రపనిచ్చెయతియొక్కఁడిచ్చెఁ గృష్ణాజినంబు
మునిపతియొకఁడిచ్చె ముంజియుదండంబు మఱియొక్కఁడిచ్చెఁ గమండలువును
తే. దపసి యొక్కఁడు యజ్ఞసూత్రం బొసంగె
మఱియుఁ బెక్కండ్రు మునులు క్రమంబుతోడఁ
దమకుఁ గలిగిన వస్తువుల్ దయ దలిర్ప
నొసఁగి రవ్వేళ నక్కుమారోత్తములకు. 168

వ. ఇట్లు రామాయణకథాశ్రవణసంజాతపరమానందానుభవపరవశు లై మునీంద్రు లుచితసత్కారంబుల నారాజపుత్త్రులఁ బ్రీతిచేతస్కులం జేసి మహాత్మం డగు వాల్మీకిచేత నిక్కావ్యంబు కల్పితం బయ్యె నీయాఖ్యానం బింక సమస్తకవుల కాధారం బయి సర్వగీతంబులయం దుత్తమగీతం బై సర్వశ్రుతిమనోహరంబయి మహాభ్యుదయకారణం బై యాయుష్కరం బై యద్భుతం బయి ప్రాశస్త్యంబు వహించుఁ గాక యని పలికి రంత నక్కుమారు లొక్కనాఁ డయోధ్యానగర రాజమార్గంబులందుసుధామధురపేశలసమాక్షరపాదవిచిత్రపదార్థభవ్యం బైన యక్కావ్యంబుఁ గాంతాప్రభావతి ప్రభృతిసర్వశ్రుతిమనోహరం బగునట్లుగా గానంబు చేసిన. 169

క. కలరవ మై జితకోకిల, కులరవమై యారవం బకుంఠితగతి వీ
నులవిం దై యమృతపుసో,నలపొం దై పురమునిండ నలువుగ మ్రోసెన్. 170

ఉ. మ్రోసిన నాలకించి రఘుముఖ్యుఁడు రాముఁడు భూరిసమ్మదో
ల్లాసవిలాసి యై తపనరాజులకై వడిఁ గ్రాలువారిఁ బే
రాసఁ గనుంగొన న్నిజగృహంబునకుం బిలిపించి మించి సీ
తానుభగుండు పేశలసుధామధురోక్తి బహూకరించుచున్. 171

శ్రీరాముండు కుశలవులం దనగృహంబునకు రావించుట.

వ. సచివసామంతభ్రాతృసమన్వితంబుగా నొక్కకమనీయకాంచనకమ్రకిరణసముజ్జ్వ లదివ్యసింహాసనంబున నాసీనుం డయి యుదయమహీధరోపరిభాగసముజ్జ్వల

పుండరీకవనబంధుండునుంబోలెఁ దేజరిల్లుచు లక్ష్మణభరతశత్రుఘ్నుల నవలోకించి. 172

ఉ. వీరిమనోజ్ఞవేషములు వీరివచోరచనాచమత్కృతుల్
వీరివిలాసవైఖరులు వీరిమృదుస్వరకల్పనంబులున్
వీరికళాకలాపములు వీరిసమంచితగానసాహితుల్
చారుతరంబులై ముద మొసంగుచు నున్నవి మీరు వింటిరే. 173

చ. సరసవిచిత్రశబ్దపదసంగతమై కడు విశ్రుతార్థమై
సురుచిరరక్తిఁ దంత్రిలయశోభితమై మధురాంచితాయత
స్వరమయి పొల్చుమామకరసస్ఫుటదోశ్చరితప్రబంధముం
గర మనురక్తిఁ బాడెదరు కంటిరె యీసుకుమారసుందరుల్. 174

క. మానసహారమై కర్ణపు, టానందంబై సుధాభమై మధురంబై
యీనవ్యకథాగానం, బానందబ్రహ్మమయ్యె నాలించితిరే. 175

వ. అని పలికి యమందానందకందాయమానమానసుండై రాముండు ముఖారవిందంబునకు మందహాసంబు చెలువొసంగ సుమిత్రానందనాదు లభినందింపఁ దత్కథాశ్రవణకుతూహలపరుండై మెల్లన సింహాసనంబు డిగ్గి సభామధ్యంబున నాసీనుండై తత్సభాసదనంబు నెల్ల నలంకరింపం జేయుచు. 176

చ. సురుచిరమూర్తుల న్భువనసుందరుల న్మునివేషధారులన్
వరనృపలక్షణాఢ్యుల దివాకరతేజుల దివ్యబోధసు
స్థిరుల సమానరూపులఁ గుశీలవులం గని మాకు వేడ్కన
న్నిరుపమకావ్యరాజకథ నేర్పలర న్వినిపింపుఁ డింపుగన్. 177

వ. అని పలికి సభాసదుల నందఱ విలోకించి మహానుభావు లగునీకుమారులు పార్థివలక్షణలక్షితులయ్యు మును లై కుశీలవులయ్యు మహాతపస్వు లై యొప్పుచున్నవారు వీరివలన శ్రేయస్కరంబై నమదీయచరితంబు వినుండని పలికె నంత నారాజనందనులు సభామధ్యంబున విపంచిక లలవరించి ఘనరక్తిరాగంబులెఱింగి కాలంబు వీక్షించి మధురస్వరజాతు లేర్పఱిచి సార్వత్రికంబైనమార్గంబును గ్వాచిత్కంబైనదేశీయంబునుం దెలిసి మధురంబును మనోహరంబును రంజనంబును స్వేచ్ఛానురూపస్వరాయామంబును దంత్రీలయవంతంబును బ్రసిద్ధార్థంబును మనస్సంహ్లాదజనకంబును శ్రోత్రేంద్రియసుఖకరంబును సకలవిద్వజ్జనసేవ్యంబు నగుశ్రీమద్రామాయణమహాకావ్యంబు గానంబుసేయ నుపక్రమించి కావ్యముఖంబునం దాశీర్నమస్క్రియావస్తునిర్దేశంబు లావశ్యకంబు లని యాలంకారికోక్తి గలుగుటం జేసి రామరూపవస్తునిర్దేశపూర్వకంబుగా నిట్లని చదువం దొడంగిరి. 178

-:-శ్రీరాముని సభయందుఁ గుశలవులు రామాయణంబు గానము సేయుట.-:-

సీ. తొల్లి యావైవస్వతుఁడు మొదల్గాఁ గొని యేవంశమున వారి దీధరిత్రి
యేవంశమునఁ బుట్టె నృపలోకవిద్వేషి సమవర్తి సగరాఖ్యచక్రవర్తి
వారిధు లేపుణ్యవంశము వారిచే నటుద్రవ్వఁబడి సాగరాఖ్య నొందె
నేవంశమునఁ బుట్టె నిలకు మందాకినిఁ గోరి తెచ్చినయాభగీరథుండు
తే. నట్టియిక్ష్వాకువంశంబునందు శుభద, మైనరామాయణాఖ్యమహాప్రబంధ
మంచితంబుగ నుత్పన్నమయ్యె నిదియు, ధర్మకామార్థసహితమై తనరుచుండు.
క. ఈయాఖ్యానము సర్వమ,నూయారహితాత్ము లగుచు సూరిజను లుపా
దేయంబుగఁ గొని వినఁ దగుఁ, బాయక వినకున్నఁ బ్రత్యవాయము గల్గున్.
క. స్ఫీతం బై ధనధాన్యో, పేతం బై ముదిత మై యపేతదురిత మై
ఖ్యాతిగ సరయూనామన, దీతటమునఁ గోసలాఖ్య దేశం బలరున్. 181
సీ. శ్లాఘ్యమానానంతలక్ష్మీవిలాసమై పొలుపారు వైకుంఠపురముభంగి
రాణించుఁ జతురాస్యవాణీసుహృద్యమై కమనీయసత్యలోకంబుకరణి
గురుసుధర్మామోఘసురభిశతక్రతుకలిత మై స్వర్గలోకంబుకరణి
ధననాథవరపుణ్యజనసమాకీర్ణమై, రాజిల్లు నలకాపురంబురీతి
తే. వీరభద్రగణేశకుమారసహిత, మై నగాధీశుపురముచందానఁ దనరుఁ
గనకకలశితదినమధ్యగతమనోజ్ఞ, ధామనిధిగోపురం బయోధ్యాపురంబు.
ఉ. ఆనగరంబు తొల్లి మను వానఁగ రానిమనోరథంబుతో
శ్రీ నలువందఁగా సరయుచెంగట ద్వాదశయోజనాయతం
బౌ నిడుపుం ద్రియోజనమునంత తనర్పును గల్గునట్లుగా
దాని రచించె నేర్పలర ధారుణిఁ గోసలదేశమండలిన్. 183
క. ముక్తాప్రసూనకలికా, యుక్తం బై శీతపరిమళోపేతపయ
స్సిక్తం బై తనరెడునువి, భక్తమహాపథముచేత వఱలుచు నుండున్. 184
తే. చారుశిల్పవిశేషంబు సర్వశస్త్ర, యంత్రములు సువిభక్తాంతరాపణములు
హాటకవిచిత్రసౌధకవాటగోపు,రములు గలిగి చెలంగు నారాజధాని. 185
క. అతులప్రభ మై సుశ్రీ, యుత మై యట్టాలకధ్వజోపేతం బై
వితతశతఘ్నిశతపరి,వృత మై యప్పురము వఱలు విశ్రుతభంగిన్. 186
తే. సూతమాగధయుక్తమై సుప్రచిరామ్ర, వణమహోద్యానరచితమై వరణదామ
కలిత మై కామినీనాటకప్రకీర్ణ, మై యనారత మప్పురి యలరుచుండు. 187
క. కరిహరిరథోష్ట్రగోఖర, పరివృత మై ఘనగభీరపరిఖావృత మై
పరులకు దురాసదం బై, కర మద్భుతభంగిఁ బురము గ్రాలుచు నుండున్. 188
సీ. బలిదాత్మసామంతపార్థివసంఘంబు వివిధదేశాగతవిజ్ఞనంబు
రత్ననిర్మితబహుప్రాసాదపఙ్క్తు లత్యున్నతక్రీడాశిలోచ్చయములు

మహనీయకూటాఖ్యమందిరశ్రేణులు హృద్యమృదంగాదివాద్యములును
నలు వొప్పు వరసరనారీగణంబులు నిక్షుకాండరససదృశజలము

తే. సర్వరత్నంబులు విమానసద్గృహములు
శాలితండులములు చిత్రశాల లక్షల
మణినిబద్ధభూములు హేమమండపములు
గలిగి యప్పురి భువనవిఖ్యాతి వడయు. 189

తే. అనుపమాష్టాపదాకార మై విచిత్ర, మై యవిచ్ఛిద్ర మై రమ్య మై దివమున
సిద్ధులు దపంబుచే వడసినవిమాన, మట్లు సురుచిరగతి నొప్పు నప్పురంబు. 190

సీ. వరసతీక్రీడావిభవభంగ మాటచే జగతిఁ గామ్యవనంబు శస్త మయ్యె
వసుమతీజార్తిసంపాదక మగుటచేఁ దగ నశోకవన ముఖ్యాత మయ్యె
నజరభుజంగభోగాస్పదం బగుటఁ బుణ్యజనశూన్యం బయ్యె నందనంబు
కౌశికాధీన మై క్రాలుచుండుటఁ జేసి ధరణి ఖాండవవని దగ్ధ మయ్యె

తే. ననుచు వీని నన్నింటిని యుపహసించి, రాజరాజసేవ్యము లౌట రమణ చైత్ర
రథములౌట నొక్కింత చైత్రరథమీడు, సేయఁదగి యొప్పునుద్యానసీమలందు.

ఉ. పాఱెడువానిఁ గైదువులఁ బట్టనివాని వివిక్తునిం గులా
ధారుని భీరుఁ గాంచి రణధాత్రి మహాలఘుహస్తు లయ్యు సొం
పారఁగ యుద్ధధర్మవిధ మంత నెఱింగి వధింప రెంతయున్
వారలఁ గాచి పుచ్చుదురు వారక వీటిమహారథోత్తముల్. 192

చ. నిరుపమబాహుసత్త్వమున నేర్పున వ్యాఘ్రవరాహభల్లకే
సరిముఖవన్యసత్త్వములసాహస మొప్పఁగఁ గాననంబులోఁ
గరమునఁ బట్టి వాఁడిగలఖడ్గముచేతఁ దలల్ గఱుక్కునన్
నఱికెడునట్టిసాహసజనం బొకకోటి వసించు నప్పురిన్. 193

చ. అనఘులు బ్రహ్మకల్పులు మహాత్ములు వేదషడంగపారగుల్
మునిసము లాహితాగ్ను లతిపూజ్యులు శాస్త్రవిశారదుల్ తపో
ధనులు సహస్రదు ల్సుగుణధాములు సత్యరతు ల్జితేంద్రియుల్
దనరుదు రందు భూసురులు దామరసప్రియతుల్యతేజు లై. 194

సీ. రమణీయచారుసరస్వతీకలితు లై చతురాస్యు లనఁగ విశ్రుతి వహించి
యరుణప్రభామనోహరసారసహితు లై లోకబాంధవుల నాయూఢి మెఱసి
సమధికాక్షరసమస్తపదార్థకర్త లై పుణ్యజనేశ్వరస్ఫూర్తిఁ గాంచి
సమవర్తిగురుదత్తసత్కళావాసు లై ద్విజరాజు లనఁ జాల వినుతి కెక్కి

తే. ధర శతానందులును ద్రయీతను లనంగ
ధనదు లనఁగ జైవాతృకు లనఁగఁ జాలఁ

బొగడు వడసి సర్వజ్ఞతాస్ఫురణ నెగడి
వఱలుదురు విప్రు లప్పురవరమునందు. 195

చ. అతులితదివ్యశక్తిధరు లైనకుమారులు జన్యదుర్ధరా
హితబలహంత లై తగుమహేంద్రులు రాత్రిచరైకశిక్షణో
ద్ధతు లగునారసింహులు మహాహవదీక్షితదక్షభంజనో
ద్యతు లగువీరభద్రులు జితశ్రము లప్పురి రాజనందనుల్. 196

మ. అసమిత్రుం డొగి భైక్షవృత్తి నటు నిత్యంబుం బ్రవర్తింపఁగాఁ
గని వారింపని శ్రీదుఁ డెం తని రహిన్ గర్వించి సన్మిత్రులన్
ఘననానావిధకాగుదానముల వేడ్కం దృప్తి నొందించి మిం
చి నుతిం గాంచెద రప్పురీవరమునం జెల్వొందువైశ్యోత్తముల్. 197

మ. వల నొప్పన్ హలముం ధరించి కుజనవ్రాతంబులం ద్రుంచె నా
బలభద్రుం డది యేఘనంబు ముద మొప్ప న్నేము తత్సీరముం
బొలు పారం గొని నిత్యముం గుజనులం బోషింతు మీ ఱౌనె ని
స్తులతం బేర్కొనుమాకు నాముసలి యంచున్ బొల్తు రప్పాదజుల్. 198

తే. లలి వధీజవనాయుజారట్టజములు, చీనబాహ్లీకకాంభోజసింధువిషయ
సంభవంబులు హరిహయసన్నిభంబు, లగుహయంబులచే నొప్పు నప్పురంబు.

చ. అనుపమసార్వభౌమకుముదాభ్రమువల్లభరమ్యవామనాం
జనవరసుప్రతీకకులసంభవము ల్గిరితుల్యము ల్దురం
తనిబిడభూరిసత్త్వకలితంబులు నైనమదేభసంఘము
ల్ఘనతరబృంహితధ్వని సెలంగ రహి న్విహరించు నప్పురిన్. 200

తే. భద్రమంద్రమృగంబులు భద్రములును
మంద్రములు మృగములు భద్రమంద్రములును
బరఁగ మృగమంద్రములు మృగభద్రములును
మదరసకటంబు లై యొప్పు మత్తకరులు. 201

వ. మఱియు నప్పురంబునం దల్పసన్నిచయుండును నసిద్ధార్థుండును గామైకపరుం
డును గదర్యుండును నృశంసుండును నవిద్వాంసుండును నాస్తికుండును నకుం
డలియు నమకుటియు నస్రగ్వియు నల్పభోగవంతుండును ననిర్మలశరీరుండును
నననులిప్తాంగుండును నసుగంధుండును నమృష్టభోజియు నవదాన్యుండును ననం
గదనిష్కుండును హస్తాభరణరహితుండును ననాత్మవంతుండును ననాహితా
గ్నియు యాగరహితుండును క్షుద్రుండును దస్కరుండును వర్ణసంకరుండును
ననృతవాదియు నబహుశ్రుతుండును నసూయకుండును నసమర్థుండును నష
డంగవిదుండును నపండితుండును నవ్రతుండును ననహస్రప్రదుండును దీనుం
డును విక్షిప్తచిత్తుండును వ్యాధితుండును నరూపవంతుండును నరాజన్యభక్తి

మంతుండును నొక్కండైన లేఁడు బ్రాహ్మణజనంబులు ధర్మాత్ములును ముదితు
లును బహుశ్రుతులును సత్యవాదులును త్యాగశీలురును గుటుంబవంతులును
గవాశ్వధనధాన్యవంతులును సుసంయుతులును శీలవంతులును వృత్తసంపన్ను
లును మహర్షికల్పులును స్వకర్మనిరతులును విజితేంద్రియులును దానాధ్య
యనశీలురును బ్రతిగ్రహంబునందు సంయతులును నై ప్రకాశించుచుండుదు
రు క్షత్రియులును వైశ్యులును జఘన్యజులును నీమూఁడువర్ణంబులవారు కృతజ్ఞు
లై శూరులై వదాన్యులై విక్రమసంయుతులై యలరుచుండుదురు మఱియు
నప్పురంబునం గలసర్వజనంబులు దీర్ఘాయుష్మంతులై సత్యధర్మరతులై పుత్ర
పౌత్రసహితులై కళత్రవంతులై నఱలుదురు మఱియును. 202

క. ద్విజుల భజింతురు నృపతులు, ద్విజనృపుల భజింతు రెపుడు వీటికిరాటుల్
ద్విజనృపవైశ్యుల నిత్యము, భజియింతురు పాదజనులు పరమప్రీతిన్. 203

శా. హర్యక్షప్రతిమానశౌర్యులు మహాహంకారులుం గాంచనా
హార్యాభస్ఫుటధైర్యు లుగ్రసమరవ్యాపారులున్ విక్రమా
దార్యస్ఫీతమతుల్ మహామహులు యోధగ్రామణుల్ నిత్యమున్
హర్యక్షంబులు వోలె ద్రిమ్మరుదు రుద్యత్ప్రీతితో నప్పురిన్. 204

సీ. రంభ గాడను టెట్లు లలితోరుకాండము ల్వరికించి సిగ్గున శిరము వంప
హరిణి జోడను టెట్లు స్ఫురితేక్షణవిలాస మది కాంచి నంతనె బెదరి పఱచు
నలతిలోత్తమ నాటి యను టెట్లు నాసికాకృతిఁ గనుంగొని తలక్రిందు గాఁగ
శశిరేఖ సరి సేయఁ జను టెట్లు నెన్నొసల్వసఁ గాంచి కళలకుఁ బాసి పోవ
తే. హేమ యెన యగు టెట్లు యహీనగాత్ర,కాంతిఁ జూచినమాత్ర నెకరఁగి పోవ
నఖిలభువనమనోజ్ఞరూపాఢ్య లగుచుఁ, దనరు నప్పీటివారకాంతామణులను.

తే. అలఘుతరతారకావ్యాప్యమైయమేయ, వసువిశాలమైయుచ్ఛ్రితధ్వజమునగుచు
రాజమార్గంబుకరణి నారాజధాని, రాజమార్గంబు శోభిల్లు రమ్య మగుచు.

తే. ఎలమి శక్రుండు సురలోక మేలినట్లు, శ్రీదుఁ డలకాపురంబు రక్షించినట్లు
ధరణి రాజోత్తముండైనదశరథుండు, లీలతో నప్పురంబుఁ బాలించుచుండు.

చ. అలఘుతరప్రతాపమున నారయ శీతలచిత్తవృత్తికిం
బలరఁగ నామసామ్యమున నయ్యినరాజులె సాక్షిగాఁ జతు
ర్జలనిధు లెన్ని చూడ వసుధన్ బలిమేరలుగా సమస్తభూ
తలగురుభారవాహి యయి తద్దయు నొప్పె నతండు ధారుణిన్. 208

వ. మఱియు నచ్చట నివసించి దశరథుండు జగంబుఁ బరిపాలించుచుండు నట్టియో
జనత్రయవిస్తారం బైనసాకేతపురమధ్యంబునందు యోజనద్వయమాత్ర
ప్రదేశంబున కయోధ్య యనెడునామంబు సత్యనామం బై యుండునట్టిమహా
రాజధానిఁ బరిపాలించుచు నమ్మహారాజశేఖరుండు సర్వవిదుండును సర్వసంగ్ర

హుండును దీర్ఘదర్శియు మహాతేజుండును పౌరజానపదప్రియుండును నిక్ష్వాకు
శ్రేష్ఠుండును యాగశీలుండును ధర్మరతుండును నియతేంద్రియుండును మహర్షి
కల్పుండును రాజర్షిముఖ్యుండును త్రిలోకవిశ్రుతుండును బలవంతుండును జితా
మిత్రుండును సుమిత్రవంతుండును విజితేంద్రియుండును శక్రవైశ్రవణసంకాశుం
డును నై ప్రసిద్ధి వహించినవాఁడు మఱియును. 209

క. అనిమిషపతి సురలోకం, బనువుగఁ బాలించుభంగి నన్నరపతి మే
దినిఁ బాలించుచునుండును, మను విక్ష్వాకుండువోలె మంజులఫణితిన్. 210

తే ఆమహారాజమౌళి కర్ధాంగు లగుచు, గరిమఁబో సర్వమంగళాఖ్యాతి వడసి
వరసతీత్వవిశేషవిస్ఫురణఁ బొల్తు, రెలమి మున్నూటయేఁబండ్రు జలజముఖులు.

తే. మించి కౌసల్య కైక సుమిత్ర యనఁగ, హంసగతి సతీజలజాతహస్త లగ్ర
సతులు గల రందు ముగ్వు రాసకలలోక,ధవున కారాజమౌళి కాదశరథునకు.

క. ఆరాజవరున కభినుత, కారులు ఋత్విజులు మునులు గల రిరువురు సొం
పారఁగ వసిష్ఠుఁ డనఁగా, ధీరోదారుండు వామదేవుం డనఁగన్. 213

చ. వినయపరు ల్వివేకగుణవిశ్రుతిధన్యులు మంత్రకోవిదుల్
జనపతికార్యసాధనవిచారసమర్థులు శత్రుమర్మభే
దనసదుపాయధుర్యు లతిధార్మికు లుత్తము లష్టమంత్రు లా
ర్యనుతులు సత్యవాదులు మహామహులుం గల రాజితారికిన్. 214

తే. అర్థసాధకవిజయసిద్ధార్థధృష్టి, మంత్రపాలకాశోకసుమంత్రులును జ
యంతుఁ డనుపేర్ల నొప్పగునట్టివారు,ధన్యులు సునీతిపరులు ప్రధానవరులు.

తే. క్రోధమున నైనఁ గామంబుకొఱకు నైన, నర్థకారణమున నైన ననృత మాడ
రన్యులం దైన స్వజనులం దైన వారి, కవిదితం బైనకార్య మింతైన లేదు.

తే. సంతతముఁ జారముఖమున సర్వరాష్ట్ర
కృత్యము లెఱింగి హితశత్రువృత్తిఁ దెలిసి
పరులకలిమియు లేమియు నరసి యభయ
మొసఁగి వ్యవహారకుశలు లై యుందు రెప్పుడు. 217

తే తప్పు గలిగినవేళ నందనుల నైనఁ, గూర్మి విడిచి దండింతురు ధర్మభీతిఁ
దప్పు లేనిచో నరి నైన నొప్పు విడిచి, కడిమి దండింప రెంతయుఁ గలుషభీతి.

క. సతతంబు విషయవాసుల, వ్రతశీలుర శుచుల నరసి రక్షించుచు దు
ర్మతుల వెదకి శిక్షించుచు, క్షితిపతికోశాభివృద్ధిఁ జేయుదు రెలమిన్. 219

చ. పురుషబలాబలం బెఱిఁగి పొందు ఘటించుచు వర్ణధర్ముముల్
దఱుఁగక యుండునట్లు సతతంబును బ్రోచుచు నేకబుద్ధులై
వెరవరులం దగం బనులవెంటఁ జరింపఁగఁ బంపుచున్ మహీ
వరునకుఁ గీర్తిలాభవిభవంబులఁ దా రొనఁగూర్తు రెంతయున్. 220

క. పురమందు రాష్ట్రమందును, బరదారరతుండు కల్లఁ బలికెడువాఁడున్
గురుదూషకుండు ఖలుఁ డొ,క్కరుఁ డైనం గలుగకుండఁ గాతురు మిగులన్.

క. పతిహితముకొఱకు ననిశము, చతురత నయలోచనమున జాగ్రన్మతు లై
సతతంబు నఖిలకార్యము, లతులితముగఁ దీర్చుచుందు రధికప్రీతిన్. 222

క. మతినిశ్చయంబువలనను, వితతపరాక్రమమువలన వీర్యమువలనన్
ధృతి పెంపునఁ బరవిషయ, ప్రతతులయం దైనఁ బొగడువడయుదు రెందున్.

క. ప్రకృతివినీతులు జితరిపు, లకలంకులు గపటరహితు లద్భుతశీలుల్
సకలజ్ఞులు ఘనబృందా, రకగురుసన్నిభులు వరకళాశాలు రిలన్. 224

వ. మఱియు మంత్రజ్ఞులును ముఖవికాసాదిచిహ్నంబులచేతఁ బరాభిప్రాయవిదులును బ్రియహితరతులును విద్యావినీతులును నియతేంద్రియులును హ్రీమంతులును బరస్పరానురక్తులును నీతిమంతులును బహుశ్రుతులును శ్రీమంతులును మహాత్ములును శాస్త్రజ్ఞులును దృఢవిక్రములును గీర్తిమంతులును సర్వకార్యంబులయందు సావధానులును నానాస్త్రప్రయోగప్రతిపాదకధనుర్వేదవిదులును యుక్తవచనకారులును దేజఃక్షమాయశోయుక్తులును స్మితపూర్వాభిభాషులును వీరులును సువాసులును సువేషులును సుశీలురును విఖ్యాతపరాక్రములును గుణదోషవిశారదులును సర్వాభిజ్ఞులును మంత్రరక్షణంబునందు యుక్తులును సూక్ష్మార్థవిషయనిశ్చయంబునందు శక్తులును నీతిశాస్త్రవిశేషజ్ఞులును బ్రియవాదులును భృశానురక్తులును సమర్థులును నై యొప్పుచుండు రిట్టిమంత్రులచేత నద్దశరథుండు పరాభిభవసామర్థ్యప్రచురమయూఖసహస్రంబులచేత నుదితార్కుండునుం బోలె దీప్తి నొంది సర్వగుణంబులకు మూలంబై చారముఖంబువలన స్వపరరాష్ట్రకృత్యంబు లెఱింగి ధర్మంబునఁ బ్రజల రక్షించుచు లోకత్రయంబునందుఁ బ్రసిద్ధి వహించి తనకు సమానునిఁ దనకంటె నధికునిం గానక ప్రతాపనిహతకంటకుం డై వశీకృతసామంతుం డై మిత్రవంతుం డై శక్రుండు స్వారాజ్యంబునుం బోలె స్వరాజ్యంబుఁ బెద్దకాలంబుఁ బరిపాలించుచుండె. 225

ఆ. నీతిధర్మవిదున కేతాదృశప్రభా,వునకు సుతనిమిత్త మనవరతముఁ
దపము సలుపునట్టి దశరథునకు వంశ, కరుఁడు నందనుండు గలుగఁ డయ్యె.

క. ఘనముగఁ జింతించెడునా, మనుజవిభుని కిన్నినాళ్లు మఱి యే నేలా
తనయార్థ మశ్వమేధ, మ్మొనరింపఁగ నైతి ననుచు నొకమతి వొడమెన్. 227

ఉ. మానుగ నమ్మహీవిభుఁడు మంత్రుల నందఱిఁ గూడి యాగముం
బూనికిఁ జేయువాఁడ నని మోదముతో మది నిశ్చయించి తా
మానక మంత్రిసత్తము సుమంత్రునిఁ గన్గొని నీవు సర్వవి
ద్యానిధు లైనమద్గురుల నందఱిఁ దోడ్కొని రమ్ము నావుడున్. 228

వ. రయంబునం జని పురోహితుం డగువసిష్ఠుని వేదపారగు లైనసుయజ్ఞవామ దేవజాబాలికాశ్యపులను మఱియుం దక్కినబ్రాహ్మణోత్తముల రాజప్రియ చికీర్షుల రాజసకాశంబునకుం దోడ్కొని వచ్చిన నద్దశరథుం డమ్మహాత్ముల నుచితసత్కారంబులఁ బ్రీతులం జేసి మృదుపూర్వకంబుగా ధర్మార్థసహితం బగు వాక్యంబున ని ట్లనియె. 229

దశరథుండు పుత్రార్థ మశ్వమేధచికీర్షుఁడై వసిష్ఠాదులతో నాలోచించుట.

తే. వరసుతార్థము పెక్కుసువ్రతము లేను
జాలఁ జేసియు వడయంగఁ జాల నైతి
ననఘసుతులార యిపుడు మీయనుమతమునఁ
బూని హయమేధ మొనరింప బుద్ధి వొడమె 230

క. కావున హయమేధం బేఁ, గావించెద శాస్త్రదృష్టకర్మంబున నా
కేవిధిఁ దనయుని వడయం, గా వలనగు నట్టితెఱఁగు ఘటియింపుఁ డీఁకన్.

చ. అని జనభర్త వల్కుటయు నమ్మునినాథులు తన్మఖేరితం
బును బరమార్థసాధన మమూల్యము నైనతదుక్తిఁ గౌశలం
బును విని కౌతుకంబు ముదముం జెలువార బహూకరించుచున్
మనుజవరేణ్యుతో ననిరి మానుగ వెండియు మంజులోక్తులన్. 232

చ. క్షితివర నీతలంపు పరికింపఁగ మంచిది దీన నీదువాం
ఛితము ఫలించు నిక్కముగఁ జెప్పెడి దే మిఁకఁ దత్ప్రయత్నముం
జతురతఁ జేయు మశ్వమును సత్వరత న్విడిపింపు మాప్తసం
యుతముగ యజ్ఞశాల సరయూత్తరమందు రచింపు మింపుగన్. 233

చ. అన విని భూమిభర్త ముద మంది యమాత్యులఁ జూచి వారి కి
ట్లను గురువాక్యపద్ధతి మఖాశ్వము నుగ్రబలాన్వితంబుగా
నొనరిచి చెచ్చెర న్విడువుఁ డొప్పుగ నాసరయూతటంబునన్
ఘనతరశాస్త్రసమ్మతముగా రచియింపుఁడు యజ్ఞవాటికన్. 234

వ. మఱియుఁ గల్పోక్తప్రకారంబున యథాశాస్త్రంబుగా యజ్ఞవిఘ్ననివారకకర్మంబులునిర్వహింపుఁ డీయజ్ఞంబునందుమంత్రలోపక్రియాలోపాద్యపరాధంబులు గలుగకుండెనేని యీయజ్ఞంబు సర్వమహీపతులచేతఁ బ్రాపించుటకు శక్యం బై యుండు విద్వాంసులు బ్రహ్మమునుంబోలె విద్వాంసు లగుబ్రహ్మరాక్షసులిందు ఛిద్రం బన్వేషించు చుండుదురు వారివలన యజ్ఞంబు నిహతం బయ్యె నేని యజ్ఞకర్త నశించు మీరు సమర్థులరు గావున నట్టివిఘ్నంబు లెవ్వియుఁగలుగకుండుశాస్త్రదృష్టవిధానంబున యజ్ఞంబుఁ బరిసమాప్తి నొందించునట్టి భారంబుఁ బూనవలయు నని పలికిన నయ్యమాత్యులు మహీరమణుని వచనంబుల కలరి దేవా భవత్ప్రసాదంబున నెల్ల పనులుఁ గొఱంత వడకుండ నిర్వ

ర్తించెద మని పలికి యతనిచేత ననుజ్ఞాతులై నిజనివాసంబులకుం జనిరి వసిష్ఠాది మహర్షులు యుక్తప్రకారంబున దశరథునిచేతఁ బూజితులై యాశీర్వదించి య నుజ్ఞ వడసి తమతమనివిడుదులకుం జని రంత నమ్మహీకాంతుండు సచివుల నంద ఱ నిజనివాసంబులకుం బోవం బనిచి తాను నభ్యంతరమందిరంబునకుం జని మనోహారిణు లగునిజపత్నులం జూచి యేను సుతార్థంబు హయమేధయాగంబుఁ జేసెద మీరు దీక్ష వహింపుం డనిన వారు మనోహరం బైనపతివచనంబు విని హిమాత్యయంబునం గలిపద్మంబులుం బోలె ముఖపద్మంబు లత్యంతకాంతి సౌకుమార్యంబునం దనరఁ బరమానందభరితహృదయ లై యుండి రప్పు డేకాంతంబున సూతుం డంజలి ఘటించి దశరథున కి ట్లనియె. 235

సుమంత్రుండు దశరథునకు సనత్కుమారోక్తరహస్యముం దెలుపుట.

తే. నరవరోత్తమ తొల్లి సనత్కుమార, మౌనివర్యుండు మునిసభామధ్యమందుఁ
బొసఁగ మీకుఁ గుమారులుపుట్టునట్టివిధము దెలియంగఁ బలికె సవిస్తరముగ.

మ. అది యేను న్విని యున్నవాఁడఁ దగ నయ్యర్థంబు మీ కర్థిఁ దె
ల్పెద నాలింపుము కాశ్యపాత్మజుఁడు సక్లిష్టస్వభావుండు ని
ర్మదుఁ డార్యుండు విభాండకుం డనఁగ విప్రశ్రేష్ఠుఁ డుదగ్రగుణా
స్పదుఁ డొక్కండు గలండు నిశ్చలతపస్సంపన్నుఁ డస్మానికిన్. 237

చ. ఘనమతి ఋశ్యశృంగుఁ డనఁగా నొకపుత్త్రుఁడు గల్గు నాతఁ డా
వనమున నిత్యముం బెరిగి వారక పిత్రనువర్తనంబుచే
ననవరతంబుఁ గాననమునందె చరించుచు నుంటఁ జేసి తా
మనమున నించుకైనఁ బరమర్త్యు నెఱుంగక యుండు నెంతయున్. 238

క. ధీవరుఁ డగునమ్మానికిఁ, బావనలోకప్రసిద్ధపరమర్షికృతం
బై వఱలు బ్రహ్మచర్య, దై్వవిధ్యము గలుగు నధికతాత్పర్యమునన్. 239

క. పితృశుశ్రూష యొనర్చుచు, సతతముఁ బావకునిసేవ సలుపుచు యోగా
న్వితుఁ డై యీగతి నిత్యవ్రతుఁ డై మునిసుతుఁడు గాన వర్తించు నెడన్. 240

రోమపాదమహారాజవృత్తాంతము.

చ. అనఘవిచారుఁ డంగవిభుఁ డద్భుతవీర్యుఁడు రోమపాదుఁ డ
త్యనుపమలీల లోకనుతుఁ డై బుధసమ్మతుఁ డై యరాతిసూ
దనుఁ డయి రాజధర్మ మది దప్పక రాజ్యము సేయు చుండుఁ జం
దనశశికుందపాదరసధామవిడంబియశోభి రాముఁ డై. 241

వ. అమ్మహీపతివిధినిషేధోల్లంఘనంబున. 242

తే. అఖిలభూతక్షయావహ మై సుఘోర, మై సుదారుణ మై లోక మబ్బదళన
లిలముగతిఁ దల్లడిల ననావృష్టి దోఁచె, నమ్మహీపతి సేయురాజ్యంబునందు.

తే. అట్టికాలవిపర్యాస మంతఁ జూచి, ధారుణీభర్త శోకసంతప్తుఁ డగుచు

వేదవేదాంగవిదు లైనవిప్రవరులఁ, బిలువ నంపించి యిట్లని పలుకు నవుడు.

క. మునివర్యులార మీ రెఱుఁ,గనియర్థ మొకింత లేదు కద ముల్లోకం
బున నేయుపాయ మొనరిం,చిన వానలు గురియు దానిఁ జెప్పుఁడు మీరల్.

వ. అని యడిగిన నమ్మునీంద్రు లన్న రేంద్రునిం జూచి యీయనావృష్టి వాయు
టకుం దగినయుపాయం బెఱింగించెదము వినుము. 246

క. ఘనుని విభాండకతనయునిఁ, బ్రణుతగుణుని ఋశ్యశృంగు రావించి భవ
త్తనయను శాంత నొసఁగి మిం,చినయనురాగమునఁ బెండ్లిసేయుము ప్రీతిన్.

తే. ఈయుపాయంబుఁ దక్క యొం డేయుపాయ
మునఁ జనదు యీయనావృష్టి యని మునీంద్రు
లానతిచ్చిన విని విభుఁ డామునీంద్రుఁ
డిచటి కరుదెంచుట కుపాయ మెద్ది యొక్కొ. 248

వ. అని బహుప్రకారంబులం దలపోసి నిశ్చయించి. 249

క. తనమంత్రులను బురోహితుఁ, గనుఁగొని మునినాథునిం దగం దోడ్కొని రం
డని పలికిన వారు మనం,బున నెక్కుడు భయము గదుర భూపతితోడన్. 250

క. మోమున దైన్యం బడరఁగ, నే మామునిసుతునిపాలి కేగఁగ లే మో
భూమీశ యనుచు వేఁడిన, నామనుజవిభుండు చిత్తమందుఁ దలఁకుచున్. 251

వ. ఇంక నెయ్యది కార్యం బని విచారించుచున్నంత. 252

—రోమపాదుండు వేశ్యలచే ఋశ్యశృంగుఁ దోడి తెప్పించుట.—

క. లలితసుకుమారయౌవన, కలితాంగులు రూపవతులు గణికలు నృపు ముం
గల నిల్చిరి నయమున నం,జలిఁ జేసి మృదూక్తు లలరఁ జతురత మెఱయన్.

క. జనవర యే మామునిసుతు, ననుపమచాతుర్య మొప్ప నతిరయమునఁ దో
డ్కొని వచ్చెద మిప్పురమున, కనుపుము మము మా కసాధ్య మవనిం గలదే.

వ. అని పలికి యమ్మహీపతిచే ననుజ్ఞాత లై యవ్వారకాంతలు వనంబునకుం జని
వివిధోపాయంబుల నమ్మునిసుతునిచిత్తంబు లోఁ గొని పురంబునకుం దోతేరఁ
గల రట్లు దోడ్కొని వచ్చిన. 255

క. మునిపతి వచ్చినమాత్రనె, తనివి సన న్వృష్టి గురియు ధరణీవిభుఁ డా
యన సత్కరించి గ్రక్కునఁ, దనకూఁతును శాంత నొసఁగుఁదద్దయుఁ బ్రీతిన్.

తే. రోమపాదునిజామాత లోకనుతుఁడు
ఋశ్యశృంగుఁడు మీకు సంప్రీతిసుతుల
నిచ్చు నని పల్కె తొల్లి మునీంద్రుఁ డాస
నత్కుమారుఁడు మునులు వినంగ నధిప. 257

వ. ఏ న త్తెఱంగు సంక్షేపంబుగా మీకుం జెప్పితి నని విన్నవించిన విని యద్దశర

ఘుండు సంతుష్టాంతరంగుండై సుమంత్రుతో ఋశ్యశృంగుండు గణికలచేత నె ట్లెఱంగున నానీతుం డయ్యె దాని సవిస్తరంబుగా వినవలతుం జెప్పు మని యడిగిన నతండు సనత్కుమారోక్త ప్రకారంబున మహీరమణున కి ట్లనియె.

సుమంత్రుఁడు దశరథునకు ఋశ్యశృంగానయనవిధంబుఁ జెప్పుట.

ఆ. అధిప రోమపాదుఁ డాఋశ్యశృంగుఁ డిం, కెవ్విధమున నిచటి కేఁగుదెంచు
నని తలంచుచుండ నాసమయమునఁ బురోహితుండు వలికె నూహఁ జేసి.

తే. మాకుశక్యంబు గాదు యమ్మౌనిసుతునిఁ, దోడి తెచ్చుటకాత్మలోఁ దోఁచినంత
పాటినిరపాయ మైనయుపాయ మొకటి, యేను జెప్పెద వినుము మహీశవర్య.

ఉ. ఆమునినందనుం డుదయ మాదిగఁ గానల నుంటఁ జేసి తాఁ
గామినిరూపయౌవనవికాసము నింద్రియసౌఖ్యసౌష్ఠవం
బేమి యెఱుంగఁ డించుకయు నెప్పుడు నన్యులతోడిపొత్తుఁ గై
కోమి గుణప్రభూత మగుకోపముఁ గైకొన కుండుఁ గావునన్. 261

వ. ఇప్పుడు రూపయౌవనసంపన్న లగువారకాంతలు బహువిధాలంకారంబులం గైసేసి మునిపాలికిం జని మనోరమాభిమతేంద్రియార్థంబులచేత నతనిచిత్తంబు వడసి నానావిధోపాయంబుల నిచ్చటికిం గొని తెచ్చెదరు శీఘ్రంబున నట్టివారి నేర్పఱించి పంపు మనిన నమ్మహీరమణుండు రూపయౌవనవిలాసతిరస్కృతాప్సరసకాంత లగువారకాంతల నమ్మునిపుత్త్రుపాలికిం జనుం డని. 262

చ. పనిచిన వేడ్కతోఁ దపసి భవ్యతరాశ్రమభూమి కేఁగ రా
వనరుహగంధు లందమున వారక గంధవహాస్యపుష్పసూ
తనశుకశారికాభిసముదాయమరాళమయూరపఙ్క్తి లో
య్యన నయిదోడుగా నడువ నవ్వెలరాయనితూపులో యనన్. 263

వ. ఇట్లు తదాశ్రమసమీపంబునకుం జని. 264

తే. వనచరుఁడు ధీరుఁ డాశ్రమవాసి పురుష,మానినీతారతమ్య మింతైన నెఱుఁగఁ
డమ్మునికుమారుఁజూచు టె ట్లతనితోడఁ,బలుకు టెట్లు తచ్చిత్తంబువడయు టెట్లు.

క. పితృపూజాతత్పరుఁ డై, సతతతపోయుక్తి నాత్మసంతుష్టుం డై
చతురత నొప్పెడు నమ్ముని, పతి యె ట్లాశ్రమము విడిచి పఱతెంచు నొకో

తే. జనన మాదిగ నమ్మహామునిసుతుండు,పురమునందు రాష్ట్రమునందుఁ బుట్టినట్టి
పురుషు నైనను సతి నైన మఱియు నన్య,మెద్ది యేనియు నెఱుఁగఁ డొకించు కైన.

క. అనుచుఁ దలపోయు నెడ నమ్మునిపుత్త్రుఁడు దైవయోగమునఁ జేసి తనం
తనె తాను వారియొద్దకుఁ, జనుదెంచినఁ జూచి చెలులు సంభ్రమ మలరన్.

చ. సలలితచిత్రకంచుకము చాటునఁ గుల్కుమిటారిగబ్బిగు
బ్బ లోలయఁగా హిరణ్మయవిపంచికలం ధరియించి వారకాం
తలు మునిపుత్త్రుకట్టెదుటఁ దంత్రులు మీటుచు రాగసంపద

ల్దుబఁగొనఁ బాడి రందు సుకల స్వరముల్ సరవిం జెలంగఁగన్. 269

వ. ఇట్లు సుస్వరంబుగా గానంబుఁ జేయుచు నమ్మునిచెంత నిలిచి యతనితో ని ట్లనిరి. 270

క. ధరణీసుర నీ వెవ్వఁడ, వరయఁగ నతిఘోర మీమహాగహనమునన్
జరియించె దేల యొంటిగఁ, దిరముగ నీకల తెఱంగుఁ దెలియం జెపుమా.

ఆ. అనుచు వార లడుగ నమ్మునితనయుండు, హృష్టచిత్తుఁ డై యదృష్టపూర్వ
లగుటఁ జేసి మిగులహర్షంబునల న, య్యిందుముఖులఁజూచి యిట్టు లనియె.

తే. బ్రహ్మసముఁడు మాతండ్రి విభాండకాఖ్యుఁ, డతని కౌరసపుత్రుండ నాదు పేను
బృథివి నానాము మది ఋశ్యశృంగుఁ డనఁగ, నధికవిశ్రుతమైయొప్పు ననుదినంబు.

వ. ఇది మదీయాశ్రమంబు మీ కందఱికి విధిపూర్వకంబుగా నతిథిసత్కారంబుఁ గావించెదఁ బ్రతిగ్రహింపుం డని పలికిన నతనిపలుకుల కలరి యవ్వేలందులు పర్ణశాలలోనికిం జనిన. 274

క. మునినందనుండు వారికిఁ, బనిగొని యుచితాసనార్ఘ్యపాద్యంబులు నూ
తనమూలఫలంబులు న,య్యన నొసఁగి కృపన్ గ్రహింపుఁడని వేఁడుటయున్.

క. వారంద ఱుత్సుకంబున, గౌరవమునఁ దపసిపూజఁ గైకొని మరలన్
శైరీషకుసుమపేశల, సారామృతకల్పసూక్తిసంయమితో డన్. 276

ఆ. మునికుమార నీకు ముఖ్యఫలంబులు, దివిరి కానుకగాఁగఁ దెచ్చినార
మివె పరిగ్రహింపు మిప్పుడె భక్షింపు, మలఘుతేజ శుభము గలుగు నింక.

చ. అని నయ మారఁ బల్కి చెలులందఱు కౌతుక ముప్పతిల్లఁగా
మునిసుతుఁ గౌఁగిలించుకొని మోద మెలర్పఁగ మోదకాదినూ
తనబహుభవ్యభక్ష్యము లుదారత నిచ్చిన నారగించెఁ బా
వనగుణమూర్తి నిక్కముగ వన్యఫలంబు లటంచు నెంచుచున్. 278

వ. అంత నక్కాంతలు మునివలనిభయంబున వ్రతచర్యోపదేశంబు నతనికిం జెప్పి యరిగిన నవ్విభాండకనందనుం డస్వస్థహృదయుం డై తద్వియోగజనితదుఃఖం బునం బెటలిపడుచు నా రేయి గడిపి మరునాఁడు తదాశ్రమసమీపంబున విహ రించు నెడ నెప్పటియట్ల యలంకృత లై వెలయాం డ్రమ్మునికిం బొడసూపి తగు తెఱంగున నుపసర్పించి తచ్చిత్తం బాత్మాయత్తం బయ్యెనని హర్షించి యతని కిట్లనిరి. 279

చ. అనఘచరిత్ర తాపసకులాంబుధిపూర్ణశశాంక మీతపో
వనమున కేగుదెంచితిమి వారక మే మిఁక మీరు మాతపో
వనమున కర్థి రావలయు వంచన సేయక యంచుఁ బల్క న
మ్మునిసుతుఁ డట్ల కాక యని మోద మెలర్పఁగ సమ్మతించినన్. 280

చ. తరుణులు నత్తపస్విని ముదంబున గ్రుచ్చి కవుంగిలించి చె

చ్చెర నధరంబు నాని తమిఁ జెక్కులు నొక్కి యురం బురంబునం
గర మనురక్తి హత్తి జతనంబున హస్తముఁ బట్టి యిమ్మెయి
న్వరఁకులఁ బెట్టి తెచ్చిరి యవార్యరతిన్ నృపవర్యువీటికిన్. 281

క. ఈకరణి మునికుమారుం, డాకమలాసనసమానుఁ డప్పురమునకున్
వీఁకఁ జనుదేర నప్పుడె, ప్రాకటముగ వృష్టి గురిసె పర్జన్యుఁ డిలన్. 282

మ. జననాథుం డెదు రేగుదెంచి మదిలో సంతోష మేపారఁగాఁ
బ్రణతుం డై పురవాసు లందఱు నుతింపన్ వైభవాడంబరం
బున నత్తాపసపుత్రుఁ దచ్చెరువుతో మోదింప సద్మాంతరం
బునకుం దోడ్కొని వచ్చి యర్ఘ్యవిధులం బూజించి యత్యున్నతిన్. 283

మ. తనకూఁతుం జరలేక్షణం దతకటిం దారుణ్యపాథోనిధిన్
ఘనవేణిన్ నతనాభి నిందువదనం గళ్యాణి శాంతన్ మహా
మునిరాజానుమతంబునం దపసి కామోదంబుతో నిచ్చి య
జ్జననాథాగ్రణి పెండ్లిఁ జేసె నృపు లెంచ న్మంచిలగ్నంబునన్. 284

క. ఈసరణిం దనపుత్త్రిక, నాసంయమి కొసఁగఁ గూతు రల్లుఁడు నింటం
భాసిల్లు చుండఁగాఁ ద, ద్దేశం బతిసుఖద మయ్యెఁ దేజం బెసఁగన్. 285

వ. ఇట్లు ఋశ్యశృంగుండు శాంతావశంగతమానసుం డై యంగపతిగృహంబున నభీష్టవినోదంబులం దేలుచుండు. 286

సీ. అత్తఱి భానువంశాంభోధిచంద్రుండు దశరథుం డనియెడు ధరణివిభుఁడు
సత్యప్రతిశ్రవుం డత్యంతశౌర్యుండు గొడుకులఁ బడయంగఁ గోరి క్రతువుఁ
గావింపఁ దలఁచి యంగక్షితీశ్వరుఁ డైన రోమపాదునితోడ రూఢి మెఱయ
సాచివ్య మొనరించి చతురత నాతనియనుమతి వడసి మహాత్ముఁ డైన

తే. ఋశ్యశృంగునిఁబత్నీసహితునిఁ జేసి, వేడ్కఁగొని వచ్చి యమ్మహాద్విజవరేణ్యు
నధ్వరప్రజాస్వర్గార్థ మటు వరించి, శిష్టసమ్మతి జన్నంబు సేయఁ గలఁడు. 287

వ. మఱియు నమ్మునిపుత్త్రునిప్రసాదంబున నిమ్మహీపతికి వంశప్రతిష్ఠానకరులును సకలలోకవిశ్రుతులును వీర్యవిక్రమసంపన్నులు నగుకుమారులు నలుగు రుదయింతు రని భగవంతుండును దేవప్రవరుండు నగుసనత్కుమారుండు మున్నెఱింగించెఁ గావున. 288

చ. పురుషవరేణ్య నీ విపుడు పొందుగ సర్వబలాన్వితుండ వై
గురుమతి నమ్మునీంద్రకషకుం జని సత్కృతిఁ జేసి వేఁకతో
నరుదుగఁ గోరి తెచ్చి తగ నాయనచే హయమేధయాగముం
జిరశుభలీల నాంగముగఁ జేసితి వేని జనింతు రాత్మజుల్. 289

క. అని యాసచివాగ్రణి యా, యనతో మునిపుత్త్రుచరిత మంతయుఁ జెప్ప
న్విని సంతోషము గుతుకము, జనియింపఁగ దశరథుండు సంభ్రమపరుఁ డై.

క. ఆవేళనే వసిష్ఠుని, రావించి యమాత్యవరుల రావించి నతుల్
గావించి చాల మన్ననఁ, గావించి యనుజ్ఞ వడసి గమనోన్ముఖుఁ డై. 291

—దశరథుఁడు ఋశ్యశృంగమహామునిఁ దోడితెచ్చుట.—

తే. మంత్రిబాంధవసచివసమన్వితముగఁ
గదలి వనములు నదములు నదులుఁ గడచి
విషయములు గొన్ని దాఁటి యవ్విభుఁడు ఋశ్య
శృంగముని యున్న దేశంబుఁ జేరఁ బోయి. 292

క. అలరుమఖాయతనంబున, విలసిల్లెడుదీప్తవహ్నివిధమున నిత్యం
బలరోమపాదుగృహమున, నలరారెడుఋశ్యశృంగు నర్మిలిఁ గాంచెన్. 293

క. కని వినయవిధేయుం డై, జననాథకులోత్తముండు సముచితగతి న
మ్మునివంశశిఖామణి కా, సనార్ఘ్యపాద్యాదిపూజ సలిపి ముదమునన్. 294

వ. నానావిధనయవాక్యంబులం బ్రస్తుతించి యున్నంత. 295

క. ఆరోమపాదుఁ డల్లుని,తో రమణీయార్కవంశతోయధిచంద్రుం
డీరాజు దశరథుం డను,పేరన్ విలసిల్లువాఁడు పృథుబలుఁ డుర్విన్. 296

ఆ. అనుచుఁ దెలిపి యంగజనపతి దశరథ, జనవరేణ్యుఁ బ్రీతి సత్కరించి
ప్రాభవమునఁ జాలఁ బ్రార్థింపఁ బదియైదు, దినములుండి యొక్కదినమునందు.

వ. రోమపాదున కి ట్లనియె. 298

క. జనవర నీపుత్త్రిని శాం,తను గాంతోపేతఁ జేసి దయ మత్పురికిం
బనుపంగ వలయు మాకొక, పని గల దమ్మౌనివలనఁ బరికింపంగన్. 299

ఉ. నా విని రోమపాదుఁడు మనంబున సంతస మంది యల్లునిం
ధీవరుఁ గాంచి యీమనుజదేవునివెంట సతీయుతంబుగాఁ
బోవలె నన్న నాజటిలపుంగవుఁ డట్లగుఁ గాక యంచు నా
ర్యానరువెంట నేగెఁ గుతుకం బలరన్ వనితాయుతంబుగన్ 300

వ. ఇవ్విధంబున నవ్వసుమతీవల్లభుండు రోమపాదునిచేత సంభావితుం డై య
తనిం దగినతెఱంగున సంభావించి యతం డుచితసత్కారంబులఁ బ్రీతునిం
జేసి యనుప శాంతాసమేతుం డైనఋశ్యశృంగునిం దోడ్కొని పరమా
నందంబున మగిడి తనపురంబునకుం జనుదెంచుచుఁ బురం బలంకరించు
వారు గాఁ బౌరుల నియోగింపుం డని శీఘ్రగమను లగుదూతల నయో
ధ్యకుం బనిచిన వార లతిత్వరితగమనంబునం బఱచి రాజాగమనం బెఱిం
గించి పురం బలంకరింపుం డని యాజ్ఞాపించిన వారును సమ్మదాయత్త
చిత్తు లై తత్తఱంబున సిక్తసమ్మార్జితపథంబును సముచ్ఛ్రితధ్వజపతాకాశోభి
తంబును నానావిధసుగంధద్రవ్యవాసనావాసితంబునుం గా నగరం బలం
కృతంబుఁ గావించి రంత నమ్మహీకాంతుండు శంఖదుందుభినిర్ఘోషపూ

ర్వకంబుగా ఋశ్యశృంగునిం బురస్కరించికొని పురంబుఁ బ్రవేశించి, రాజమార్గంబునం జని పురజను లమందానందంబున నభినందింప సుముహూర్తంబున నంతఃపురంబుఁ బ్రవేశించి వివిధప్రకారంబుల నమ్మహర్షి నందనుం బూజించి తన్నుఁ గృతకృత్యునిం గాఁ దలంచుకొనుచు సుఖం బుండె నంతఃపురకాంతలెల్ల శాంతామహాదేవి నర్హ విధులఁ బూజించి యుపసర్పించి వివిధోపచారంబుల సంప్రీతం జేసి రిట్లు ఋశ్యశృంగుండు సత్కారసత్కృతుండై శాంతం గూడి పరమానందంబున నభీష్టోపభోగంబు లనుభవించుచు సుఖంబుండు నంత నొక్కింతకాలమునకు సకలజగన్మనఃకాంతం బైనవసంతంబు వనాంతంబుల నలంకరించిన నమ్మేదినీకాంతుండు స్వాంతంబున ముఖంబుఁ జేయం దలంచి శాంతాకాంతుని రావించి నమస్కరించి ప్రసన్నుం గావించుకొని కులసంతానంబుకొఱకు హయమేధంబుఁ గావింప నిశ్చయించితి సాంగ్రహణేష్టి గావించుటకు మొదల బ్రహ్మత్వంబున ఋత్విగ్వరణంబుఁ గావించెద నంగీకరింప వలయు నని ప్రార్థించిన. 301

క. నా విని యామునిపుత్త్రుఁడు, భూవరుతో మంచిపనియె పూనితి వింకన్
నీ వాయత్నము సేయుము, పావనగుణ విడువు మింక భద్రమయంబున్. 302

క. అని పలుక నతనియనుమతిఁ, గొని భూరమణుండు మంత్రకోవిదుని సుమంత్రునిఁ గని యస్మద్గురులం, గొనితె మ్మనవుడు నతండు కుతుకం బెసఁగన్. 303

చ. రయమున నేగి కోసలధరావరునానతిఁ బుణ్యకర్ములన్
నియతుల వేదపారగుల నిత్యతపోధనులన్ మహాత్ములన్
నయవిదులన్ వసిష్ఠమునినాథముఖాఖిలసంయమీంద్రులం
బయనముఁ జేసి భూవిభునిపాలికి గ్రక్కునఁ దోడి తెచ్చినన్. 304

క. భూవిభుఁడు వారినెల్ల య,థావిధిఁ బూజించి వినయతత్పరమతి యై
భావించి భక్తి నంజలిఁ, గావించి ముదం బెలర్పఁ గా నిట్లనియెన్. 305

—దశరథుఁడు ఋశ్యశృంగమునియనుమతంబున నశ్వమేధంబుఁ జేయఁ బూనుట.—

తే. వరసుతార్థము పెక్కువ్రతము లేను
జాలఁ జేసియు వడయంగఁ జాల నైతి
ననఘమతులార యిపుడు మీయనుమతమునఁ
బూని హయమేధ మొనరింప బుద్ధి వొడమె. 306

క. కావున హయమేధం బేఁ, గావించెద శాస్త్రదృష్టకర్మంబున నీ
పావనుఁ డగుమునిపుత్త్రప్ర,భావంబున నిష్టసిద్ధి వడసెద నింకన్. 307

చ. అని జనభర్త పల్కుటయు నమ్మునినాథుఁడు దన్మనీషితం
బును సకలార్థసాధన సుమూల్యము నైన తదుక్తిఁ గౌశలం
బును విని కౌతుకంబు ముఖమ్మున జెలు వార బహూకరించుచున్

మనుజవరేణ్యుతో ననియె మానుగ వెండియు మంజులోక్తులన్. 308
చ. క్షితివర నీతలంపు కడుసిద్ధము యాగ మొనర్ప నీదువాం
ఛితము ఫలించు నిక్కముగఁ జెప్పెడి దే మికఁ దత్ప్రయత్నముల్
జతురతఁ జేయు మశ్వమును సత్వరతన్ విడిపింపు మంగసం
యుతముగ యజ్ఞశాల సరయూత్తరమందు రచింపు మింపుగన్. 309
తే. ధారుణీనాథ నీ విట్లు ధర్మసహిత, మైనయీబుద్ధి జనియించినందువలన
భూరివీర్యుల నల్వురఁ బుత్త్రవరుల, నెల్లభంగులఁ బడసెద విది నిజంబు. 310
చ. అన విని భూమిభర్త మునమార నమాత్యులఁ జూచి వారి కి
ట్లను గురువాక్యపద్ధతి మఖాశ్వము నుగ్రబలాన్వితంబుగా
నొనరిచి చెచ్చెరన్ విడువుఁ డొప్పుగ నాసరయూతటంబునన్
ఘనతరశాస్త్రసమ్మతముగా రచియింపుఁడు యజ్ఞవాటికన్. 311

వ. మఱియుఁ గల్పోక్తప్రకారంబున విధిపూర్వకంబుగా శాంతిక్రియలు నిర్వర్తింపుఁ డిమ్మహాయజ్ఞం బెల్లనృపులకు దుర్లభంబు గావున నిం దొక్కింతైన నపరాధంబు గలుగకుండ నిర్వర్తింపుఁడు విద్వాంసు లగుబ్రహ్మరాక్షసు లిందు ఛిద్రంబు లన్వేషించుచుండుదురు వారివలన యజ్ఞంబునకు విఘ్నంబు గలిగెనేని యజ్ఞకర్త నశించుం గావున నట్లు గాకుండ మీరు సమర్థులై యిమ్మఖంబు శాస్త్రదృష్టవిధానంబున నిర్విఘ్నంబుగాఁ బరిసమాప్తి నొందించునట్టిభారంబుఁ బూనవలయు నని చెప్పిన నయ్యమాత్యులు మహీరమణునిపలుకుల కలరి భవత్ప్రసాదంబున నెల్లపనులు గొఱంత వడకుండ నిర్వర్తించెద మని పలికి యతనిచేత ననుజ్ఞాతులై నిజనివాసంబులకుం జనిరి వసిష్ఠాదిమహర్షులును యథోచితవిధానంబుల నద్దశరథునిచేత నభీష్టపూజలు వడసి యతనిననురూప వాక్యంబులం బ్రశంసించి యతనిచేత ననుజ్ఞ వడసి తమతమవిడుదులకుం జని రంత నమ్మహీకాంతుండు సచివుల నందఱ నిజనివాసంబులకుం బోవం బనిచి తాను నభ్యంతరమందిరంబునకుం జని ప్రథమవసంతచిత్రాపౌర్ణమాస్యయందు సాంగ్రహణేష్టిఁ గావించి రెండవనాఁడు బ్రాహ్మాదనంబును నుత్తమాశ్వబంధనప్రోక్షణవిమోచనాదికంబునుం గావించి ప్రతిదినంబును సావిత్రాదికర్మంబులు సలుపుచుండ సంవత్సరంబు పూర్ణం బగుటయు రెండవవసంతకాలంబు సంప్రాప్తంబయ్యెఁ బ్రథమసంవత్సరాంతమావాస్యయందుఁ గావింపందగినయుఖాసంభరణ త్రైధాతవీయదీక్షణీయాదికంబులు నైన దేవయజనంబులు నిర్వర్తించి చిత్రాపౌర్ణమాస్యయందు సంతానార్థం బశ్వమేధయాగంబుఁ గావింప నుద్యుక్తుండై యధ్వర్యుత్వంబున వరింపంబడినవసిష్ఠు నవలోకించి నమస్కరించి పూజించి వినయంబున నిట్లనియె. 312

సీ. అనఘాత్మ నీవు మా కనిశంబు సఖుఁడవు గోప్తవు శాస్తవు గురుఁడ వట్లు

గాన నే నొనరింపఁబూనినయిమ్మహాక్రతుభారమున నీవు కరుణఁ దాల్చి
విఘ్నంబు గాకుండ విధియుక్తి నాచేతఁ జేయించి నాదువాంఛితముఁ దీర్ప
మనవుడు నమ్మహామునినేత నీచెప్పినట్లు సర్వముఁ దీర్తు ననుచుఁ బలికి
తే. యజ్ఞకర్మసునిష్ఠితు లయినద్విజుల, ఖనకకర్మాంతికుల శిల్పకరుల నటుల
వర్తకుల గణకుల మఖన్యాయవిదుల, వేదవిప్రుల నెల్ల రావించి పలికె. 313

వ. మీరు రాజశాసనంబున యాగకార్యంబుల నన్నియు నిర్వర్తింపుం డిష్టకాసహస్రంబులు శీఘ్రంబునం దెం డౌన్నత్యవిశాలత్వాదిబహువిధగుణసమన్వితంబు లైన రాజగృహంబులు రచింపుండు బహువిధభక్ష్యాన్నపానసమేతంబులుగా వృష్టివాతంబులచేత నప్రకంప్యంబులుగా శుభంబు లైన బ్రాహ్మణగృహంబులు నిర్మింపుం డట్లు పౌరజనంబునకు బహుభక్ష్యంబు లయి సర్వకామసమన్వితంబు లై యుండునట్టుగా ననేకనివాసంబులు గల్పింపుం డట్లు జానపదజనంబునకు నుచితనివాసంబులు గల్పించి సత్కరించి సరసపదార్థసంపన్నం బైనయన్నంబు యథేష్టంబుగాఁ గుడువం బెట్టుఁడు వారల నవజ్ఞ సేయ వలదు చతుర్విధవర్ణంబులవారిని త్యాదరంబున నుచితసత్కారసత్కృతులం జేయుండు కామక్రోధవశంబువలన నైన నవజ్ఞ సేయ వలదు మఱియు యజ్ఞకర్మంబునందు పరినిష్ఠితు లగుపురుషుల విశేషించి వసుభోజనాదిదానంబుల సత్కృతులం జేయ వలయు మఱియు నెల్లపనులకుం జాలనేర్పరు లయి వర్తింప వలయు నని పలికిన వారలందఱు వసిష్ఠుండు చెప్పినక్రమంబున సర్వంబు నిర్వహించుటకుం జాలి యర్థాకృత్యంబులు నల్పు చుండి రంత వసిష్ఠుండు సుమంత్రుని రావించి యి ట్లనియె.

మ. ధరణీచక్రమునందుఁ గల్గినసమస్తక్ష్మాతలాధీశులన్
మఱియుం దక్షిణదేశవాసు లగుబ్రహ్మక్షత్రవిట్శూద్రులన్
నరనాథాగ్రణిశాసనంబున వెస న్జన్నంబు వీక్షింపఁగా
నరుదారం దగఁ బిల్వ నంపుము సమస్తాశావకాశస్థులన్. 315

ను. మిథిలాధీశుని సత్యసంగరుని సన్మిత్రున్ మహీపాంబుధిన్
విధిసంకాశుని శాస్త్రనిష్ఠితుఁ జతుర్వేదజ్ఞు నుదగ్రస్మృతిన్
బ్రధనోత్సాహు విదేహరాజు జనకేలానాథుఁ దో డ్తెమ్ము శౌ
ర్యధురీణుం డతఁ డీమహావిభుని కత్యంతప్రియుం డారయన్. 316

క. సతతప్రియవాదిని రణ, చతురుని సద్వృత్తు దేవసన్నిభుఁ గాశీ
పతిని జగన్నుతశీలుని, నతిరయమునఁ దోడి తెమ్ము యజ్ఞముఁ జూడన్. 317

క. నృపశార్దూలుని మామను, విపులపరాక్రమునిఁ బరమవృద్ధుని ధర్మా
ధిపునిన్ గేకయరాజును, జపలమ్మునఁ దోడి తెమ్ము జన్నముఁ జూడన్. 318

క. అంగేశ్వరుని మహాగుణ, సంగుని నలరోమపాదజననాథుని మి
త్త్రుం గాంచనగిరిధైర్యుని, సంగతిగాఁ దోడి తెమ్ము సవనముఁ జూడన్. 319

మ. పరమోదారులు దాక్షిణాత్యులు కురుల్ పాశ్చాత్యకోదీచ్యకు
లవ్యాసం బ్రాచ్యులు సింధుమాత్స్యకులు సౌరాష్ట్రీయసౌవీరకుల్
మఱియుం దక్షిణదేశనాథులు జగన్మాన్యుల్ బలోపేతు లై
తఱు లై వీటికి వచ్చువారలుగ నూతా సేయు ముద్యన్మతిన్. 320

ఉ. నా విని సూతుఁ డాజటిలనాథుఁడు చెప్పినయట్ల సర్వథా
త్రీవరులన్ మహామహుల ధీరులఁ జారులచేత గొందఱిం
గోవిదుఁ డాటఁ దానె చని కొందఱి నంపఱి నంద మొందఁగా
క్ష్మావిభుమాటఁ దెల్పి వరుస న్వసఁ దోడ్కొని వచ్చె వీటికిన్. 321

క. అంత భవచ్ఛాసనమునఁ, బంతంబున నలయునట్టిపను లన్నియు నే
మెంతయుఁ దీర్చితి మని క్ష్మాంతికు లరుదెంచి పలికి రమ్మునితోడన్. 322

చ. పలికిన నాలకించి మునిపాలుఁడు వారి బహూకరించి సొం
పలరఁగ నిమ్మహామఖమునం దపరాధము గల్గె నేనియు
న్దలఁగక యజ్ఞకర్తకు వినాశము సేకుఱు నట్లు గాన మీ
రలు దగ నిర్వహింపుఁ డపరాధ మొకింతయుఁ గల్గకుండఁగన్. 323

అశ్వమేధయాగంబునకు నానాదేశములనుండి రాజు లేతెంచుట.

వ. అని పలికి బహుప్రయత్నంబుల నప్రమాదు లై యుండుం డని యందఱ నయ్యై పనుల వెంటం బంచి తానును దగినచందంబునం బ్రవర్తించుచుండు నంతఁ గొన్నివాసరంబు యాగోత్సవసమాలోకనకౌతుకోల్లాసంబున నానాధనరత్న సంచయంబు లుపాయనంబులుగాఁ గొని నానాదేశాధీశు లందఱుఁ జతురంగ బలపరివృతు లై యయోధ్యకుం బఱతెంచిన వారి నందఱ నుచితసత్కారం బులం బ్రీతులం జేసి యథార్హస్థానంబుల విడియ నియమించి మునిశ్రేష్ఠుం డగువసిష్ఠుండు దశరథున కిట్లనియె. 324

క. నరవర నీశాసనమున, నరపతు లందఱును వచ్చినారలు వారిం
బరమప్రీతులఁ జేసితి, సరసత్వముతో యథార్హసత్కారములన్. 325

క. క్షితివర సరయూతటమునఁ, జతురత శాస్త్రోక్తభంగిఁ జక్కఁగ యజ్ఞా
యతనము రచించినారము, వితతంబుగ నెల్లపనులు వేడుక నయ్యెన్. 326

చ. నృపవర జాగు సేయ నిఁక నేటికి నన్మఖదీక్షితుండ వై
నిపుణుల వేదపారగుల నిర్మలచిత్తులఁ గూడి వేడ్కతో
నుపహృతసర్వకామముల నొప్పగు నధ్వరశాల సొచ్చి ని
ర్దపుఁ డమి యజ్ఞకర్మము యథావిధిగా నొనరింపు మిత్తఱిన్. 327

శ్రీమదశ్వమేధయాగప్రారంభము.

వ. అని పలికిన నమ్మహీరమణుండు వసిష్ఠానుమతంబున ఋశ్యశృంగుం బురస్కరించుకొనివసిష్ఠవామదేవాదిమహర్షిసమేతుం డై సునక్షత్రంబైనయొక్క శుభదినం

బున నానావిధమంగళవాద్యఘోష స్వస్తివాచనపూర్వకంబుగా సరయూతటవి
రచితం బైనయజ్ఞవాటంబుఁ బ్రవేశించి శాస్త్రంబు నతిక్రమింపక కల్పసూ
త్రానుసారంబుగా యజ్ఞకర్మారంభంబుఁ గావించి హయాగమనంబుఁ గోరుచుం
డ సంవత్సరంబు పరిపూర్ణం బగుటయు నయ్యుత్తమాశ్వంబు సనుదెంచె నంత
వసిష్ఠాదిమహర్షులు ఋశ్యశృంగుం బురస్కరించుకొని కల్పసూత్రప్రకారంబున
మఖకర్మం బాచరింప నుపక్రమించి శాస్త్రోక్తభంగిఁ బ్రవర్గ్యంబు నుపసదంబు
నుం గావించి యుపదేశశాస్త్రంబునకంటె నధికం బైనకర్మం బంతయు నిర్వ
ర్తించి బహిష్పవమానాదులచేతఁ దత్తత్కర్మదేవతలఁ బూజించి ప్రాతస్సవనం
బుఁ గావించి పదంపడి యింద్రప్రీతిసిద్ధం బైనసోమాంశంబు విధ్యుక్తంబుగా
నింద్రున కొసంగి పాపనివర్తకుం బైనహోమరాజును స్తోత్రశస్త్రంబులచేత నభిను
తించి యథాక్రమంబుగా మాధ్యందినసవనంబును తృతీయసవనంబునుం గావిం
చి పాత్రాదిస్థలనప్రభృతిదోషంబు లెవ్వియుం గలుగకుండ సర్వంబును మం
త్రవంతంబుగా నిర్విఘ్నంబుగా నిర్వర్తించి. 328

తే. పరఁగ నయ్యజ్ఞమునఁ గలవాఁ డెందు, నాస్తుఁ డశాంతుఁ డనుచరుఁడు క్షుధాతురుండు
శ్రాంతుఁ డపరీక్షితుఁడు విద్య రానిమూఢుఁ, డరసిచూచిన లేఁ డొక్కఁడైనఁ గాని.

చ. వరమున నగ్రజుల్ నృపులు వైశ్యులు పాదజను ల్క్రమంబునం
దనుజులు బాలవృద్ధులును దక్కితురాజమహోత్సవస్థితిన్
సుచిరభంగిఁ బ్రత్యహముఁ జూచియు స్వాదురసోచితాన్నముం
జిరశుభలీల నిత్యము భుజించుచుఁ దృప్తి వహింతు రెంతయున్. 330

శా. అశ్రాంతంబును మ్రోయు నమ్మఖమునం దాలించినం దట్టమై
యశ్రాంతస్ఫుటయాజకోక్త నుగుస్వాహానాద మాశ్రావయా
స్తుశ్రౌషణ్ణినదంబు తీవ్రముగ నాసోదీయతాం దీయతాం
చశ్రాణౌదన మన్నవంబు కృపయా క్షుంతవ్య మన్నాదమున్. 331

ఆ. అన్నపర్వతంబు లాజ్యప్రవాహముల్, భవ్యసూపశాకభక్ష్యరాసు
లేమి చెప్పవచ్చు నేకోత్తరశతంబు, లగుచుఁ జూడ నయ్యె ననుదినంబు.

శా. నానాదేశనివాసు లైనపురుషు ల్నారీమణు లర్భకుల్
నానాభంగుల నన్నపానవసువిన్యాసంబులం దృప్తు లై
యానందంబున భద్ర మస్తు నృపతే యంచు న్నుతింపం గరం
బానాదంబు వినంగ నయ్యెఁ బతి కిం పారంగ నశ్రాంతమున్. 333

తే. విప్రవరులు కలంకృతవేషు లైన, జనము లిష్టపదార్థము ల్చాల నొసఁగి
రందుఁ గుండలశోభితు లైనకొంద, ఱనుసరించిరి వారిసాహాయ్యమునకు.

మ. అనిశంబు న్మఖమందు విప్రులు సువేషాఢ్యు ల్కృతాలంకృతు
ల్కనదుద్యన్మణికుండలస్ఫురితు లై కర్మాంతరంబందుఁ బా

యనిన దివ్యముఖంబు పరస్పరజిగీషాయుక్తచేతస్కు లై
ఘనయుక్తిఁ బహుహేతువాదము లొగి న్గావింతు రత్యున్నతిన్. 335

క. ధరణీసుర లన్మఖమున, నారవుగ నానాటికిం బ్రయోగకుశలు లై
గురుమతిఁ గర్మము లన్నియుఁ, గర మరుదుగ యుక్తభంగిఁ గావించి రొగిన్

తే. వెలయ నయ్యజ్ఞమునఁ గలవిప్రులందు
నవ్రతుఁ డనాదరతుఁ డషడంగకోవి
దుం డగుణవంతుఁ డబహుశ్రుతుం డయోగ్యుఁ
డననులిప్తాంగుఁ డొక్కరుం డైన లేఁడు. 337

వ. ఇట్లు ఘనవిభవవిశేషంబున నయ్యాగంబు సెల్లుచుండ నప్పు డయ్యాగశాస్త్రజ్ఞు లగుఋత్విజులు ప్రయోగకుశలు లై యజ్ఞవేదియందు నడుమ నొక్కశ్లేష్మాతకయూపంబు సంస్థాపించి దానిదక్షిణోత్తరపార్శ్వంబుల బాహుద్వయమాత్రంబుదవ్వుల రెండు దేవదారుయూపంబులును దానిదక్షిణోత్తరపార్శ్వంబుల నంతియదూరంబున నాలు బిల్వయూపంబులును దానిదక్షిణోత్తరభాగంబుల నంతియదూరంబున నాలు ఖాదిరయూపంబులును దానిదక్షిణోత్తరపార్శ్వంబుల నంతియదూరంబున నాలుపాలాశయూపంబులుగా నిట్లేకవింశత్యరత్నిప్రమాణంబు లైన యేకవింశతియూపంబులు శాస్త్రోక్తక్రమంబున సంస్థాపించి శోభార్థంబు నొక్కొక్కయూపంబు నొక్కొక్కచేలంబుచేత నాచ్ఛాదించి గంధపుష్పంబులచేత నలంకరించిన నప్పుడాయూపంబు లనూనాతిరిక్తంబు లై సుషిరాదిదోషవర్జితంబు లై యష్టాశ్రయుక్తంబు లై సుస్నిగ్ధంబు లై దివియందు దీప్తిమంతు లైన సప్తఋషులచందంబునఁ బ్రకాశించుచుండె నిత్తెఱంగున యూపోచ్ఛ్రయంబుఁ గావించి శుల్బకర్మంబులయందు నిపుణు లైన బ్రాహ్మణోత్తములు యూపసంస్థాపనంబునకంటెఁ బూర్వంబె కావింపఁ దగిన చయనంబుఁ గావింప నమకట్టి యథాశాస్త్రంబుగాఁ బ్రమాణవిశిష్టంబు లైన యిష్టకల నగ్న్యగారవేదియం దుపధానంబు సేసిన నది స్వర్ణగరుత్మంతం బై యధోగతవీక్షణం బై ప్రాఙ్ముఖం బై యష్టాదశప్రస్తారాత్మకం బై గరుడాకారంబుగా నొప్పుచుండె నంతఁ బూర్వోక్తయూపంబులందు శాస్త్రానుసారంబుగా నింద్రాదిదేవతల నుద్దేశించి గ్రామ్యపశువులం బంధించి యారోకంబులందు సూకరపన్నగపతత్త్రిప్రముఖారణ్యపశువులం బంధించి వేదోక్తప్రకారంబునఁ బర్యగ్నికృతంబు లైన యారణ్యపశువుల విసర్జించి శామిత్రస్థానంబునందు యాగీయం బైన హయంబును గూర్మాదిజలచరంబులను దదన్యం బైన గ్రామ్యపశుజాతంబును విశసనార్థంబు సంగ్రహించి రిట్లు యూపనిబద్ధంబు లైన మున్నూఱు ప్రధానపశువులను సర్వరత్నవిభూషితం బైన హయరత్నంబును విశసించి రంతఁ గౌసల్యాదిరాజపత్నులు శామిత్రస్థానంబునందు మృతం బైన హయంబుకడకుం

జని సవ్యాపసవ్యంబుగాఁ బరిచరించి నిరవధికశ్రద్ధచేత సువర్ణముఖం బైన సూచీత్రయంబున నయ్యశ్వశ్రేష్ఠంబున కసిపథంబులఁ గల్పించి రంతఁ గౌసల్య ధర్మసిద్ధి వడయం గోరి మృతహయకళేబరస్పర్శనిందారహితచిత్త యై యయ్యశ్వంబుతోఁ గూడ యొక్కరాత్రి నివసించె నప్పుడు తత్కాలదక్షిణార్థంబు దశరథునివలన బ్రహ్మ మహిషిని హోత వావాతను నుద్గాత పరివృత్తిని నధ్వర్యుండు పాలాకలినిఁ గ్రమంబునఁ బ్రతిగ్రహించి భర్తలుం బోలె హస్తగ్రహణంబుఁ గావించి యద్దశరథునివలనఁ దత్ప్రతినిధిద్రవ్యంబుఁ గొని వారలఁ గ్రమ్మఱ నతని కొసంగి రంత నధ్వర్యుండు తురంగమవప నాకర్షించి నియతేంద్రియుం డై వహ్నియందు శ్రపణంబుఁ గావించి శాస్త్రోక్తప్రకారంబున హోమంబుఁ జేసె నప్పుడు. 338

తే. ధన్యచారిత్రుఁ డైన యద్దశరథేంద్రుఁ
డొప్పు మీఱంగ నవ్వపాహోమధూమ
గంధ మాస్వాదనము సేసి కలుషనిచయ
మంతయును బాసి మిగులఁ గృతార్థుఁ డయ్యె. 339

క. పదియార్వురు ఋత్విజు లిం, పొదవ హయాంగములు పచన మొనరించి ముదం
బెదుగ శిఖియందు వేల్చి, పదపడి తచ్ఛేష మర్థిఁ బ్రాశించి రొగిన్. 340

తే. వసుధలో నన్యపశువుల వపను బ్లక్ష
శాఖయం దిడి వేల్తురు శాస్త్రభణితిఁ
బరఁగ హయమేధమఖమందు వైతసంబు
మీఁద నిడి హోమ మొనరింతు రాదరమున. 341

వ. మఱియు నయ్యశ్వమేధంబునకుఁ జతుష్టోమాత్మకం బైన జ్యోతిష్టోమంబు ప్రథమాహం బనియు నుక్థ్యంబు ద్వితీయాహం బనియు నతిరాత్రంబు తృతీయాహం బనియు నిట్లు కల్పసూత్రంబుచేతను దన్మూలభూతము లైన బ్రాహ్మణములచేతను బలుకంబడుటవలన నమ్మహాయజ్ఞంబు త్ర్యహం బనంబడు నిట్లుక్తప్రకారంబున నశ్వమేధంబుఁ గావించి తదంగభూతంబు లైన జ్యోతిష్టోమాయురతిరాత్రద్వయాప్తోర్యామాభిజిద్విశ్వజిత్ప్రభృతిబహుయజ్ఞంబులఁ గావించె నిత్తెఱంగునఁ దొల్లి బ్రహ్మనిర్మితం బైన నమ్మహాయజ్ఞంబు సాంగంబుగాఁ బరిసమాప్తి నొందించి. 342

సీ. హోతకుఁ బ్రాగ్దేశ ముద్గాత కుత్తరం బుదార బ్రహ్మకు యామ్యదేశ
మధ్వర్యునకు వేడ్క నపరదేశంబును యాగదక్షిణ గాఁగ నర్థి నొసఁగె
నొసఁగిన వారు తాపసుల మై వనమున వర్తించుమాకు నీవసుధ యేల
మనుజేంద్ర నీకుఁ గ్రమ్మఱ విక్రయించెద మావుల స్వర్ణరత్నాదికముల
తే. నిచ్చి కైకొని సంప్రీతి నేలు మనినఁ, గోటిగోవుల మఱి దశకోటిమాడలఁ

గాంచనం బొకశతకోటి గరిమ నొసఁగి, ధాత్రిఁ గ్రమ్మఱఁ గొనియె నద్దశరథుండు.

వ. అంత నాఋత్విజు లందఱు యాగదక్షిణార్థంబు లబ్ధం బైనధనం బంతయు వసిష్ఠఋశ్యశృంగులకు సమర్పించిన నమ్మహాత్ములు యథాశాస్త్రంబుగా విభాగించి ఋత్విజుల కందఱికి వేర్వేఱ యొసంగినఁ బ్రతిగ్రహించి యేమందఱము సంతుష్టాంతరంగుల మైతి మని పలికి యమ్మునిపుంగవులం గొనియాడి రంత నమ్మహీరమణుండు యజ్ఞదర్శనార్థంబు సమాగతు లైనబ్రాహ్మణులకు జంబూనదీప్రభవం బైనహిరణ్యం బొక్కకోటి యొసంగి హస్తాభరణంబులఁ గోరినదరిద్రు లైనయాచకులకు హస్తాభరణంబు లొసంగి వార లందఱు సంప్రీతు లగుచుండఁ దానును హర్షపర్యాకులేక్షణుం డై భక్తిపూర్వకంబుగా నందఱికి దండప్రణామంబుఁ జేసిన. 344

ఆ. అభిమతార్థసిద్ధి రస్తు తే భూపతే, రాజశేఖరాయ రాఘవాయ
యనుచుఁ బెక్కుగతుల నాశీర్వదించి రా, ధరణిదివిజు లెల్లఁ గరుణ నృపుని.

ఆ దురితహరము కీర్తికర మనవ్యరాజదు, ష్కరము స్వర్గసౌఖ్యకరము నైన
మఖముఁ జేసి రాజు పావనీయచరితుఁడా, ఋశ్యశృంగమౌని కిట్టు లనియె.

క. అనఘాత్మ మీప్రసాదం,బున యజ్ఞము పరిసమాప్తిఁ బొందె నిఁక ముదం
బున వంశవర్ధనుం డై, తనరారెడుపట్టిసుతుని దయ సేయు మొగిన్. 347

—ఋశ్యశృంగముని పుత్త్రికామేష్టిఁ జేయ నారంభించుట.—

ఉ. నా విని యత్తపస్వికులనాథుఁ డోకించుక సేపు ధ్యానని
ష్ఠావశుఁ డై పదంపడి రసాపతి కిట్లను నీమనంబునం
భావమ చింత సేయకుము పుత్త్రచతుష్టయ ముద్భవించు నీ
కావిధ మంతఁ గాంచితిఁ దదర్థముగా నొకయిష్టిఁ జేసెదన్. 348

వ. అని పలికి సమాహితచిత్తుం డై యతీంద్రియార్థదర్శి యగునమ్మునిపుంగవుండు వహ్నిప్రతిష్ఠాపనంబుఁ జేసి యథర్వణోక్తప్రకారంబున మంత్రప్రకాశితకర్మం బగుహోమంబుఁ గావింపఁ దొడంగిన నప్పుడు భాగప్రతిగ్రహార్థంబు దేవర్షిగంధర్వసిద్ధవిద్యాధరాదు లచ్చటికిం జనుదెంచి యంతకు మున్న మానిమంత్రబలాహూయమానుం డై చనుదెంచి యున్నలోకకర్త యగువిరించి నవలోకించి యి ట్లనిరి. 349

—పుత్త్రకామేష్టియం దాహూతు లగుదేవతలు బ్రహ్మతో మొఱ లిడుట.—

సీ. వాణీమనోనాథ వాసవవందిత లోకనాయక భక్తలోకవరద
ముని మీరొసంగిన ఘనవరంబునఁ జేసి రావణుం డనియెడు రాక్షసుండు
మత్తుఁ డై ఘనబలోద్వృత్తుఁ డై నిత్యంబు లోకత్రయంబుఁ జీకాకుఁ జేసి
శక్రాదిసకలదిశాపాలకులఁ దోలి గంధర్వయక్షుల గాసి పఱచి

తే. ద్విజుల హింసించి తపసుల వెదకి చంపి, సురల బాధించి జన్నము ల్చెఱచి సిద్ధ

సాధ్యవిద్యాధరాదుల ననుయఁ జేసి, కన్ను గానక వర్తించుచున్నవాఁడు.

చ. పవనుఁడు వీవ నోడె సితభానుఁడు వెన్నెల గాయ నోడె నా
రవి తపియింప నోడె జలరాసులు పొంగి చెలంగ నోడె మృ
త్యువు వలఁ జూప నోడె విభవోన్నతిఁ జూపఁగ నోడె శక్రుఁడుం
భువనభయంకరస్ఫురణఁ బొల్చుదు రంత దశాస్యఘాటికిన్. 351

చ. అసురులచేత బాధితుల మై పను లన్నియు మాని రేఁ బవ
ల్దైన చెడి భీతిఁ జేయునది లేక తపించుచు నున్నవార మో
యసురవిరోధినందన దయాహృదయా మము నావరించి వాఁ
డసువులకుం దొలంగి చనునట్టియుపాయముఁ జింత సేయవే. 352

మ. అని యిట్లాసురకోటి వల్కఁ ననుకంపాయత్తచేతస్కుఁడై
వనజాతాసనుఁ డంతఁ గొంతవడి భావంబందుఁ జింతించి య
మ్మనుజాంధఃప్రభుఁ డీల్గునట్టివిధముం బాటించి యూహించి ప
ర్వసమోదంబున వారి కిట్లనియెఁ బ్రావృట్కాలమేఘూర్భటిన్. 353

మ. వినుఁడో నిర్జరులార మున్నతఁడు దోగిం బెక్కేండ్లు నన్గూర్చి కా
ననభూమిం గడుఘోరనిష్ఠఁ దపముం గావించి మెప్పించి చ
య్యన గంధర్వవిహంగచారణమరుద్యక్షోరగశ్రేణిచే
ననిలో నాశము నొందకుండ వర మొయ్యం గొన్నవాఁ డెంతయున్. 354

ఉ. కావున రావణుం గెలువఁగా సమకూడదు మీ కతండు నా
చే వర మందినాఁడు మఱచె న్నరవానరజాతిచే ననిం
జావనియవ్వరం బడుగ సభ్రముఁడై యటు గాన వాఁ డికం
జేవ దలిర్చుమానవుని చేతనుగాని యడంగఁ డెంతయున్. 355

క. ఇంతటి పని సాధింప న, లంతులచే నగునె శరధి రాజకుమారీ
కాంతునకుఁ గాక మన కీఁక, నింత విచారం బిదేల హితమతులారా. 356

క. కరుణారతు శరణాగత, భరణోచితు నఖిలభువనపాలనదీక్షా
చరణోద్ధతు దనుజాహితు, శరణముఁ గోని మనుట యొప్పు జాలఁ దలంపన్.

బ్రహ్మాదిదేవతలకు శ్రీనారాయణుండు పొడసూపుట.

వ. అని పలుకుచున్నసమయంబున. 358

సీ. బుధజనకులవనంబులు పల్లవింపఁ జేయుటఁ జేసి మాధవసూక్తి గాంచి
కామరొప్పు నతలోకతమముఁ బాయఁగఁ జేయుకతన విధుం డన ఖ్యాతి వడసి
సాధుమానససరోజము వికసింపఁ జేయుటఁ జేసి హరి యన నొప్పు మీఱి
భూరివిశ్వంభరాభారంబు దాల్చుట వలన ననంతాఖ్య వాసి కెక్కి

తే. గదయు శంఖంబు చక్రంబు కౌస్తుభంబు, లక్ష్మి నందక శ్రీవత్సలాంఛనములు
శార్ఙ్గవనమాలికలు హైమచారుపటము, మేన దీపింప భాగ్యవిజాని దోఁచె,

దేవతలు శ్రీనారాయణునికి తమబాధల నెఱింగించుట.

క. ఈవిధమునఁ బొడసూపిన, శ్రీవల్లభుఁ గాంచి వినతిఁ జేసి ప్రమోదం
బావహిల శక్రవిధిముఖ, దేవత లిట్లనిరి ఫాలదీప్తాంజలులై. 360
శా. దుష్టాత్ముం డగు రావణుం డనెడునా దోషాచరాధీశ్వరుం
డష్టాశేంద్రులఁ బాఱఁ దోలి దివిషద్యక్షోరగాదుల్ కటా
కష్టం బంచుఁ గపించుచుం బఱవ నుగ్రస్ఫారదోస్సారుఁడై
శిష్టాచారవిహీనుఁడై జగములం జీకాకుఁ జేసెన్ రహిన్. 361
సీ. రమణీయనందనారామదేశంబుల విహరింప మఱచిరి వేల్పుచెలులు
పసమీఱు మిన్నేటి యిసుకతిన్నెల వేడ్కఁ గ్రీడింప వెఱచిరి కింపురుషులు
నధ్వరంబులయందు నర్ఘ్యభాగంబులఁ గైకొన వెఱచిరి నాకివరులు
చటులమణిప్రభోజ్జ్వలవిమానము లెక్కి తిరుగంగ వెఱచిరి పరమసిద్ధు
తే. లఖిలదిగధీశ్వరులు భీతి యానవహిల్లఁ, దివిరి పురములవాకిళ్లఁ దెఱవ వెఱచి
రేమిఁ జెప్పుదు మయ్య రమేశ మీకు, దానవేంద్రునిరాఘాటధాటిఁ జూచి.
మ. వనజాక్షా మును మీరు సత్కరుణ నస్వప్నత్వముల్ సంతతం
బనిమేషత్వ మొసంగినందున మహాత్మా రేఁబవ ల్వానిరా
క నిరీక్షించి మొఱంగి పాఱి చని వీఁకన్ మంటి మబ్భంగి మా
కను వై తోడ్పడ కుండినం గలదె దేవా ప్రాణ మిన్నాళ్లకున్. 363
శా. సామాన్యేతరభంగిఁ బేర్చి యనిలోఁ జంపంగ నీ వోపితే
నేమో కాని దురంతదుస్సహఘనాహీనస్ఫురద్ఘోరసం
గ్రామప్రస్ఫుటబాహుశౌర్యమున లీలం గ్రాలు వాని న్సమి
ద్భూమి న్నేము వధింపఁ జాల మసురేంద్రుల్ మాట లింకేటికిన్. 364
క. అనిశంబు మేలు మే లని, సనకాదులు వొగడ రాత్రిచరవిభుని దశా
స్యునిఁ దునిమి ముజ్జగంబులఁ, బ్రణుతగుణా కరుణ నెలయ రక్షింపఁ గదే.

దేవతలు శ్రీనారాయణునికి రావణవధోపాయంబుఁ జెప్పుట.

చ. అని సుర లాడిన న్విని రమాధిపుఁ డిట్లను సాధురక్షణం
బును మఱి దుష్టశిక్షణముఁ బొల్పుగ మాకు నిసర్గధర్మ మిం
తనఁ బని లేదు మీరు సుగుణాకరులార రణంబునన్ దశా
ననుని వధించి మీకు భువనంబులకుం గడు మేలు సేసెదన్. 366
క. సందియము విడిచి రణమున, నందముగా వానిఁ జంపునట్టి యుపాయం
బందఱు చింతించి రహిన్, డెందము రంజిల్ల మాకుఁ దెలియం జెప్పుఁడీ. 367
చ. అన విని నిర్జరప్రవరు లామధువైరికి విన్నవించి రో
ప్రణుతగుణా సుదర్శనధరా సకలజ్ఞుఁడ వీవు మమ్ముఁ జ
య్యన నదుపాయముం దెలుపుఁ డంచు వచించుట చాలఁ జిత్రమౌ

నను మదిఁ దోఁచినంతయు ఘనంబుగఁ దెల్పెద నాలకింపవే. 368

శా. దేవా తొల్లి విరించిఁ గూర్చి హర ముద్దీపింపఁ బెక్కేండ్లు నా
దేవారాతి దపంబు సల్పుటయు నద్దేవుండు తా వచ్చి త
త్ప్రావీణ్యంబున కిచ్చ మెచ్చి కృప సొంపార న్వరం బిచ్చెద
న్నావాక్యం బెద నమ్మి ఘోరతపముల్ దైత్యేంద్రు చాలింపుమా. 369

వ. అని పలికిన నద్దశముఖుండు సుధారసోపమం బైనయరవిందగర్భునివచనంబుల కలరి తపంబు సాలించి నమస్కారంబుఁ గావించి యంజలిఁ గీలించి యాగమసూక్తులం బ్రస్తుతించి మహాత్మా నాయందుఁ గృప గల దేని మనుష్యుల వలనం దక్కఁ దక్కినసమస్తభూతంబులవలనం జావు లేకుండ వరంబుఁ గృప సేయుమని యడిగిన నప్పరమేష్ఠి యట్ల యగుంగాక యని పలికి యంతర్ధానంబుఁ జేసె నిత్తెఱంగున నద్దైతేయవల్లభుండు మనుజులు హీనబలు లని తలంచి సరకుగొనక వారి నిరాకరించి తక్కినవారివలన మృత్యువు లేకుండ వరంబు వడసి వీర్యదర్పితుం డై యవక్రపరాక్రమంబున ముల్లోకంబుల నాక్రమించి సమస్తభూతంబుల బాధించుచు విశేషించి కామవ్యసనంబునఁ బాపం బని తలంపక పుణ్యాంగనలం జెఱపట్టుచున్నవాఁ డప్పాపాత్ముని మనుష్యావతారంబునం గాని తక్కినయవతారంబులచేత వధింపఁగూడదు కావున మీరు మనుష్యరూపంబున నవతరించి రావణుని వధించి లోకంబులకుఁ బరమకల్యాణంబు సంపాదింపవలయు నీవే గతి యని శరణాగతులమై మొఱ లిడుచున్నమమ్ము రక్షింపవే యని యభ్యర్థించిన నవ్విరించిగురుం డుదంచితకరుణాకటాక్షవీక్షణంబుల నిరీక్షించి వారి కిట్లనియె. 370

శ్రీనారాయణుండు దేవతల కభయదానం బొసంగుట.

చ. అనిమిషులార మీర లిపు డాడినకై వడి మానుషాకృతిన్
దనుజునిఁ జంపి మీకుఁ బ్రమదం బొనగూర్చెద నెందుఁ బుట్టుదుం
జనకునిఁ గాఁగ నెవ్వనిఁ బ్రసన్నమతి న్వరియింతు నేక్రియం
దనరుదు నెన్నిరూపములు దాల్పుదు నింత యెఱుంగఁ బల్కుఁడీ. 371

ఉ. నా విని నిర్జరుల్ కమలనాభుని కిట్లని రయ్య సర్వగో
త్రావరమౌళిరత్నరుచిరంజితపాదసరోరుహుం డయో
ధ్యావిభుఁ డాఢ్యుఁ డాదశరథావనినాథుఁడు పుత్రకాముఁ డై
వావిరి దీక్షఁ గైకొని హవనం బొనరించుచు నున్నవాఁ డిఁకన్. 372

శా. సుశ్రావ్యస్ఫుటవీరశబ్దధరుఁ డై శోభిల్లు నాతేనికిన్
హ్రీశ్రీకీర్త్యుపమాన లై కలుగు నారీరత్నముల్ మువ్వు ర
గ్రశ్రోత్రివ్యలు వారియందుఁ జతురాకారంబులం బుట్టి దై
త్యశ్రేష్ఠు న్వధియించి సత్కృపను దేవా మమ్ము రక్షింపవే. 373

వ. అని విన్నవించిన విని సర్వలోకనమస్కృతుం డగు నాసుదర్శనధరుండు సంపూర్ణ
మనోరథుండై కరుణాతరంగితాపాంగవీక్షణంబులోలయఁ బురందరాదిబృందా
రకులం జూచి మీరు వెఱవ వలదు మీ చెప్పినక్రమంబున నిద్దశరథునకు నాల్గు
రూపంబుల నవతరించి యొక్క రూపంబున సబాంధవుం డైన రావణుని నొక్క
రూపంబున నింద్రజిత్తు నొక్క రూపంబున గంధర్వుని నొక్క రూపంబున లవణుని
సంగ్రామరంగంబునం బరిమార్చి లోకంబున కత్యంతసంతోషంబు సంపాదించి
పదునొకండు వేలసంవత్సరంబులు రాజ్యంబుఁ జేసి కృతార్థుండ నై క్రమ్మఱ మ
దీయదివ్యస్థానంబునకుం జని యెద నని యభయదానం బొసంగి బృందారకసం
దోహవంద్యమానుండును గంధర్వగీయమానుండును సనందనాదిమహాయోగి
సేవ్యమానుండును నై యప్పరమపురుషుం డంతర్ధానంబుఁ జేసె నంత మహేం
ద్రప్రభృతిబృందారకులు యాగభాగంబులం బరితుష్టు లై రావణునివలని
భయంబు వదలి పితామహుం గొల్చి నిజనివాసంబులకుం జని రంత. 374

ప్రాజాపత్యపురుషుండు దివ్యపాయసంబు దశరథున కొసంగుట.

తే. పుత్రకాముఁడై దశరథభూవిభుండు, ఋశ్యశృంగుండు చెప్పినరీతి నియతి
క్రాలఁ దగుభంగి వేదమంత్రములచేతఁ, బవిలిహోమంబుఁ గావించునవసరమున.
సీ. కంజాతసఖసమాకారంబు గలవాఁడు జ్వలితాగ్నిశిఖభంగిఁ జెలఁగువాఁడు
రమణీయతరకృష్ణరక్తాంబరమువాఁడు తామ్రమయాఖవక్త్రంబువాఁడు
సముదగ్రదివ్యభూషావిశేషమువాఁడు కమనీయశుభలక్షణములవాఁడు
శైలశృంగముమాడ్కిఁ జాలనొప్పగువాఁడు ప్రబలశార్దూలవిక్రమమువాఁడు
తే. బలము వీర్యంబు తేజంబు గలుగువాఁడు, దివ్యరూపంబువాఁడు ప్రదీప్తకనక
వర్ణములవాఁడు దుందుభిస్వనమువాఁడు, చారుసుస్నిగ్ధఘనశిరోజములవాఁడు.
తే. నిరుపమానప్రభావుఁడు పురుషుఁ డొకఁడు, దివ్యపాయససంపూర్ణ దీప్తకనక
రాజతాంతఃపరిచ్ఛదరమ్యపాత్రఁ, గాంతనుంబలె బాహులఁ గదియఁ బట్టి.
క. ఘనయాగదీక్షఁ గైకొని, తనయులఁ బడయంగఁ గోరి తప్పక హోమం
బొనరించుచున్న నరపతిఁ, గని ప్రాజాపత్యపురుషుఁ గా ననుఁ గనుమా. 378
క. అన విని యద్భుతరూపం, బునఁ గ్రాలెడుయజ్ఞపురుషుఁ బొడగని నృపుఁ డి
ట్లనుఁ గేలు మొగిచి దేవా, పని యెయ్యది నాకు ఘనకృపం దెలుపఁ గదే.
వ. అనిన ప్రాజాపత్యనరుండు గ్రమ్మఱ నమ్మహీపతి కిట్లనియె. 380
ఉ. భూవర నీ వొనర్చుఘనపూజలు గూర్మిఁ బ్రతిగ్రహించి యా
దేవత లెల్ల మెచ్చి తమి దీరఁగ నీకు నొసంగు మంచు నా
చే వరదివ్యపాయసముఁ జెచ్చెరఁ బంపఁగఁ దెచ్చినాఁడ సొం
పావహిలం బ్రజాకరము నయ్యెడు దీనిఁ బ్రతిగ్రహింపుమా. 381
తే. ధన్య మారోగ్యవర్ధన మన్యదుర్ల, భంబు నగు దీని నీకూర్మిసత్నులకు నొ

సంగు మల్లైన వారు కాంక్షఁ గొని మెసవి
కడుముదంబునఁ గొడుకులఁ గాంతు రనఘ. 382

వ. అని పలికి యద్దివ్యపురుషుండు దేవాన్నసంపూర్ణం బైనహిరణ్మయకలశం బొసంగినం గైకొని యద్దశరథుండు నిర్ధనుండు ధనంబు నొందినచందంబున పరమానందభరితచేతస్కుం డై ప్రియదర్శనం బైనయయ్యద్భుతంబునకు భక్తిపూర్వకంబుగాఁ బ్రదక్షిణంబును బ్రణామంబునుం గావించి తన్నుఁ గృతార్థునింగాఁ దలంచుకొనుచుఁ దనయనుమతంబున నమ్మహాభూతం బంతర్ధానంబుఁ జేసినయనంతరంబ యజ్ఞకర్మంబు సాంగంబుగా నిర్వర్తించి సాదరంబుగ నప్పాయసకలశంబు శిరంబున నిడికొని పత్నీసమేతంబుగా నంతఃపురంబుఁ బ్రవేశించి శారదాభిరాముం డగుచంద్రుండు నిజకరంబులచేత నభంబునుం బోలె నిజానందరశ్ములచేత నయ్యంతఃపురంబును బ్రకాశింపఁ జేయుచు దేవదత్తం బై యమృతోపమానం బైనయమ్మహనీయపాయసాన్నంబు దైవచోదితబుద్ధిం జేసి ప్రత్యేకంబుగా విభాగించి. 383

దశరథుం డాదివ్యపాయసంబు విభజించి భార్యల కొసంగుట.

తే. సగముఁ గౌసల్య కొసఁగి యాసగములోన
సగ మలసుమిత్ర కొసఁగి యాసగములోన
సగముఁ గైకేయి కొసఁగి ప్రసన్నదృష్టి
మిగిలినసగంబు మరల సుమిత్ర కొసఁగె. 384

క. ఒసఁగిన నయ్యమృతాన్నము, మెసవి మిసిమి పసలు పొసఁగ మెల్లనఁ దగనా
కిసలయపాణులు మువ్వురు, వెసఁ దాల్చిరి గర్భములఁ బ్రవీణత మెఱయన్.

ఉ. ఆరఘువంశవర్యుఁ డపు డయ్యెలనాఁగలగర్భచిహ్నముల్
వారక చూచి చిత్తమున వారనికౌతుకహర్షరాగముల్
గూరఁగ నన్యకార్యములఁ గూడక రేఁ బవ లొక్కరీతి నా
దారలఁ గూడి చెన్నలరెఁ దారలఁ గూడినరాజు కైవడిన్. 386

వ. మఱియు నారూఢగర్భ లై యారాజపత్నులు హుతాశనాదిత్యసమానతేజు లై యభూతపూర్వశోభావిశేషంబున నలరి రా దశరథుండు సురేంద్రసిద్ధర్షిగణాభిపూజితుం డైనహరిచందంబునం దేజరిల్లుచుండె. 387

తే. ఇట్లు నారాయణుఁడు దేవహితముకొఱకు
నుర్వివిభున కపత్యత్వ మొందుచుండె
సకలలోకేశ్వరుం డైన జలజగర్భుఁ
డఖిలదివిజులఁ గూర్చి యి ట్లనుచుఁ బలికె. 388

బ్రహ్మ దేవతలను వనచరయోనులఁ బుట్ట నియోగించుట.

చ. మనకు హితంబు సేయుటకు మాధవుఁ డుర్వి జనించు చున్నవాఁ
డనిమిషులార యవ్విభున కాజిని సాయ మొనర్పఁగా రహిన్
మనమును ధాత్రిఁ బుట్ట నగు మానక ఋక్షవనాటయోనులం
దనువుగ వీర్యవంతులగు నట్టివలీముఖులన్ సృజింపుఁడీ. 389

వ. మఱియు బలవంతులును గామరూపులును మాయావిదులును గరుడానిలతుల్య వేగులును శూరులును నయజ్ఞులును బుద్ధిసంపన్నులును విష్ణుతుల్యపరాక్రములును నుపాయజ్ఞులును దివ్యదేహయుక్తులును దుర్జయులును సర్వాస్త్రసంయోగసంహారాదిగుణయుక్తులును నమృతప్రాశనులు నగు భల్లూకగోలాంగూల వానరుల యక్షగంధర్వపన్నగసిద్ధవిద్యాధరకిన్నరాప్సరఃకాంతలయందు మీ మీ యంశంబుల వేర్వేఱ సృజింపుండు 390

తే. సృష్టి నింతకు మున్నె నాచేత సృష్టుఁ
డయ్యె జాంబవంతుండు ఋక్షాధినాథుఁ
డతఁడు కడు జృంభమాణుండ నైననాదు
ముఖమువలన జనించె సముత్సుకతను. 391

దేవతలు వనచరయోనులఁ దత్తన్నామంబుల నవతరించుట.

చ. అని నయ మారఁ బద్మభవుఁ డాడిన నట్లొనరింతు మంచు న
య్యనిమిషసద్య లందఱు నిజాంశములన్ సృజియించి రాఘ్యులన్
ఘనతరసింహవిక్రముల గ్రావసమానుల నాత్మతుల్యులన్
వనచరవీరులన్ బలవివర్ధనులన్ భువనప్రసిద్ధులన్. 392

చ. పొలుపుగ శక్రు నంశమునఁ బుట్టెఁ బ్రతాపజితాంశుమాలి దో
ర్బలపరిపాలితాగచరపాళి దురంతనితాంతవిద్విష
త్కులవనకీలి హైమశతతోయజమాలి యనారతాజిని
శ్చలజయశీలి వాలి దివిషద్గుణసన్నుతశౌర్యశాలి యై. 393

క. ఉగ్రకరునంశమున విపులగ్రీవుఁడు లోకభీకరస్ఫుటరిపువం
శగ్రావఘనశతారుఁడు, సుగ్రీవుఁడు పుట్టెఁ బూర్ణసోమునిభంగిన్. 394

క. ధీరుఁడు శూరుఁడు వీరుఁడు, తారుఁడు కీర్తిజితవిపులతారుఁడు సుగుణో
దారుఁడు వరాతిలోచన, ఘోరుఁడు జన్మించె దేవగురునంశమునన్. 395

ఆ. అవనిఁ గిన్నరేశు నంశంబున జనించె, జగము లొక్కభంగి సన్నుతింప
దైత్యసూదనుండు ధైర్యనిర్జితగంధ, మాదనుండు గంధమాదనుండు. 396

తే. విశ్వకర్మాంశమునఁ బుట్టె వీరలోక
నుతబలుఁడు భూరిశౌర్యనిర్జితబలుండు

సంతతౌదార్యముఖగుణోజ్జ్వలుఁడు కీశ
కులుఁడు రిపువంశవనదవానలుఁడు నలుఁడు. 397

క. నాలాయము వినుతమహో, కాలుఁడు దుర్మదవిపక్షకాలుఁడు ఘనవా
గ్జాలుఁడు జగదభినుతరణ, శీలుఁడు నీలుఁడు జనించె శిఖియంశమునన్. 398

క. బృందారకకులవైద్యులు, పొందుగఁ దమయంశములను బుట్టించిరి య
స్పందపరాక్రమవంతుల, మైందద్వివిదు లనుపారి మర్కటవరులన్. 399

తే. ఘనబలుఁడు సింధుపతియంశమున జనించె, నలసుషేణుఁడు వనచరకులవరుండు
జవవినిర్జితశరభుండు శరభుఁ డనెడు, వనచరవరుండు పర్జన్యువలనఁ గలిగె 400

ఉ. అంతఁ బ్రభంజనాంశమున నద్భుతభంగి సమిన్నయాకర
స్వాంతుఁడు నీతిమంతుఁ డతిశాంతుఁడు వైరికృతాంతుఁ డుగ్ర సుధీ
మంతుఁడు వీర్యవంతుఁడు సముంచితవిక్రమవంతుఁ డాహనూ
మంతుఁడు గల్గె సర్వసుర మానితచర్యల నార్యధుర్యుఁ డై. 401

క. సురగంధర్వభుజగఖే, చరకిన్నరసిద్ధసాధ్యచారణవిద్యా
ధరమరుదంశంబులఁ గల్గిరి పెక్కండ్రు ఘనబలులు కీశశ్రేష్ఠుల్. 402

తే. ఋక్షగోపుచ్ఛవానరస్త్రీత్వ మొంది, నట్టిగంధర్వచారణ యక్షసిద్ధ
పుణ్యసతులందుఁ గీశగోపుచ్ఛభల్ల, వరులఁ బుట్టించి రఖిలదేవతలు ప్రీతి 403

క. ఏ వేల్పున కేరూపం, బే వేషం బెట్టిశౌర్య మెసఁగఁ బొసఁగు నా
దేవునితనయులు కలవడె, నా వేషం బట్టిరూప మాశౌర్యంబుల్. 404

తే. సమనగజశైలసంకాశు లమితబలులు
వీర్యధనులు విక్రాంతులు వేగవంతు
లనఘులు ప్రతాపవంతులు ఘనులు వలయు
నట్టిరూపంబుఁ గొన నేర్చునట్టివారు. 405

క. ఇతరేతరానురక్తులు, చతురులు సకలజ్ఞు లాజి సంసక్తులు ను
ద్ధతి రిపుల నొడువ శక్తులు, మతియుక్తులు మంజుమధుర మానితసూక్తుల్.

సీ. శరధినాథుని దాఁటఁ జాలుదు రతిజవగరిమచే గాంభీర్యగరిమచేత
బెఱుసుకొండల నైనఁ బెకలింప నేర్తురు బలముచే ధీరత్వబలముచేత
మిహికాంశుధరు నైన మెప్పింపఁ గలరు దోశ్శక్తిచే ఘనతపశ్శక్తిచేత
హరి నైన మీఱ నేర్తురు భూరిలాఘవమహిమచే ఘనదీప్తిమహిమచేత

తే. రూపవంతులు చటులప్రతాపనిధులు, వృక్షపాషాణనఖదంతహేతు లుగ్రు
లఖిలదివ్యాస్త్రకోవిదు లమితయశులు, మేఘగంభీరఘోషు లమోఘబలులు.

వ. మఱియు నప్రమేయపరాక్రములును బహువిధసంస్థానవ్యంజనలక్షణోపేతులును
మేఘబృందాచలకూటకల్పులును యుద్ధకర్మవిశారదులును దుర్గకాంతారదీప
సంభవులును శతసహస్రాయుతనియుతప్రయుతార్బుదసంఖ్యాతులును నై పుడమి

యీనిన తెఱంగున నిఖిలజలధివలయితమహీమండలం బెల్ల నిండి మెండుకొని ప్రచండపరాక్రమంబునం గ్రాలుచు. 408

ఉ. కొందఱు శక్రనందనునిఁ గొందఱు పంకజమిత్రపుత్రునిం
గొందఱు మారుతాత్మజునిఁ గొందఱు నీలునిఁ గొంద ఱానలుం
గొందఱు తారముఖ్యులను గొల్చి హిమాచలమందుఁ గొంకఱుం
గొందఱు మేరుముఖ్యగిరికూటముల న్వసియించి రెంతయున్. 409

తే. ఋక్షగోపుచ్ఛవానరశ్రేణికెల్ల, నాథుఁడై నిర్జరకులేంద్ర నందనుండు
వాలి తనతండ్రిగీర్వాణపాళిఁ బోలె, మించి భుజగర్వగరిమఁ బాలించుచుండె.

వ. అంత నిక్కడ నయోధ్యాపురంబునందుఁ బూర్వోక్తప్రకారంబున హయమేధంబు పరిసమాప్తి నొందుచుండ దేవత లందు హవిర్భాగంబుఁ గొని నిజనివాసంబులకుం జనినయనంతరంబ యద్దశరథుండు సమాప్తదీక్షానియముండై సుహృదమాత్యబాంధవబలవాహనంబులఁగూడి పత్నీగణసమేతంబుగాఁ బురంబుఁ బ్రవేశించి యజ్ఞదర్శనార్థం బానీతులైన నానాదేశాధిరాజుల నెల్ల యథార్హసత్కారంబులం బూజించిన వారు సంతుష్టులై వసిష్ఠునకు నమస్కరించి తమయట్ల వస్త్రాదిదానంబులచేత సంతుష్టు లయినబలంబులం గూడి నిజదేశంబులకుఁ జనిరి యనంతరంబ యమ్మహీరమణుండు శాంతాసహితుం డైనఋశ్యశృంగుని బహువిధపూజలం దనిపిన నమ్మహర్షిపుంగవుండు సంతుష్టాంతరంగుండై యంగపతి యైనరోమపాదునిచేత నాహూయమానుండై పత్నీసమేతంబుగా నతనివెంటం జనియె నిత్తెఱంగున సర్వజనంబుల యథార్హసత్కారంబులఁ బ్రీతచేతస్కులం జేసి స్వదేశంబులకుం బనిచి దశరథుండు పుత్రోదయంబుఁ గాంక్షించుచు సుఖం బుండె నంత. 411

క. పంతంబున దశరథభూ, కాంతుని కాంతామణులకు గర్భంబులు సం
తంతకుఁ గర మెదుగఁగ నా,వంతనడుము లెంత బటువులై తనరారెన్.

సీ. నాగేంద్రయానలనడలు మందము లయ్యెఁ బదపడిరుచిరోక్తి బహుళమయ్యె
గండరేఖలు పాండు డిండీరరుచిఁ బొల్చెఁ గమ్మనిట్టూర్పులు గ్రమ్మ సాగె
లలిముద్దుమోములఁ గళలయింపులు దేఱెఁ దెలివాల్గనుడాలు తేఁటయెసఁగె
ముద మారఁ జూచుకంబుల నల్పు రెట్టించె వళులు నానాఁటికి వన్నె కెక్కె

తే. రుచిరమేచకరుచిఁ బొల్చె రోమరాజి, నాదమంతంత కెలమి మందతవహించెఁ
బేదకౌనుల మొలనూలు బిగువుఁ జెందెఁ, బలుచమేనులకొకవింత పసలుగలిగె.

తే. పూర్ణగర్భిణు లగుచు నాపుష్పగంధు, లతివిశదకాంతి నలఘారి దద్భుతముగఁ
గెలుపుపూతేసిగర్భంబు నలరఁ దాల్చి, పఱలుప్రాచీదిశాంగన యొఱపుఁ బెగడి.

శ్రీరామావతారఘట్టము.

క. నల లంతంతకు డగ్గఱ, నలనటలుం దఱుచు నిగుడ నభినవగతి నా

పాలఁతుకలకు నానాఁటికి, నలవడ నీళ్లాడఁ బ్రొద్దు లయ్యె న్నిగులన్. 415

ఉ. మేటిగఁ జైత్రశుద్ధనవమీబుధవారపునర్వసూడుక
ర్కాటకలగ్నమందు గురురాజులు నొక్కటఁ గూడి పర్వ స
ర్యాటముతో శుభగ్రహము లైదు సముచ్చగతిం జరింప నా
ఖేటవిభుండు మింటినడుక్రేవ సముజ్జ్వలుఁ డై వెలుంగఁగన్. 416

వ. ఇట్టిశుభసమయంబున. 417

సీ. మొలకనవ్వులవాని వలరాజు నలరాజు నలపింపునవకంపుఁజెలువువాని
నరచందురునియందమిరవొంద నను వొందు పసమీఱుమిసిమి నెన్నొసలవాని
నలతమ్మివిరిఱెమ్ము లవిసొమ్ముగాఁగొన్న గరువంపుఁ దెలిసోఁగ కనులవాని
నెలమావిననకావిచెలువులోఁగొని చాల మురువుఁగాంచినముద్దుమోవివానిఁ

తే. జారులక్షణశుభవిలాసములవాని
నచ్యుతార్ధాంశ మగువాని నరివిరాము
సకలగుణధాము రాముఁ గౌసల్య గనియెఁ
గలువదొరఁ బూర్వదిక్సతి గన్నయట్లు. 418

క. ఘనతేజుఁ డైన యానం,దనుచేఁ గౌసల్య పుడమిఁ దద్దయు నొప్పెన్
అనిమిషలోకవిభుం డై, యనువందెడువజ్రిచేత నదితియుఁ బోలెన్. 419

భరతలక్ష్మణశత్రుఘ్నులు కైకేయీసుమిత్రలయం దుదయించుట.

చ. అలికులవేణి కైక గనె నాదశమీగురుతారయందు సొం
పలరఁగ మీనలగ్నమున నబ్జముఖున్ సుముఖున్ జగత్సఖు
న్నలగిరిధైర్యు సజ్జనమనోహరుఁ బద్మవిశాలనేత్రునిన్
లలితగుణాఢ్యునిన్ సుజనలాభరతు న్భరతు న్ముదంబునన్. 420

మ. ఘనకర్కాటకలగ్నమందు ఫణినక్షత్రంబున న్భూరిశో
భనవిస్ఫూర్తి సుమిత్ర గాంచె సుతులం బంచాంబకాకారుల
న్ననువంశాఢ్యుల దీర్ఘబాహుల మహానందాత్ముల న్వంశవ
ర్ధనుల న్లక్ష్మణునిన్ జగన్నుతకళాధారేయు శత్రుఘ్ననిన్. 421

తే. వరకుమారునిఁ గన్నపార్వతివిధమునఁ, జంద్రుఁగాంచిన పూర్వదిక్సతిసొబగున
హరిహయునివామనునిఁగన్నయదితికరణి,మెఱసెఁగౌసల్యకైకసుమిత్రమిగుల.

వ. ఇట్లు కౌసల్యాదేవియందు నారాయణార్ధాంశంబున రాముండును సుమిత్రయం
దుఁ దచ్చతుర్థాంశంబున లక్ష్మణుండును దదష్టాంశంబున శత్రుఘ్నుండును గైకే
యియందుఁ దదష్టాంశంబున భరతుండును నవతరించి దశరథుని కనుహూ
ఫులై గుణవంతు లై నిజద్యుతులచేతఁ బ్రోష్ఠపదోపమాను లై యొప్పి రపుడు.

క. మొఱసెను సురదుందుభు లటు, కురిసె న్మందారకల్పకోమలసుమము
ల్మొఱసెం గిన్నరగీతో, త్కరము లెసఁగె నిర్జరవనితానటనంబుల్. 424

సీ. సకలామరశ్రేణి చటులాపదలు దీఱ దివిజారిగుండెల దిగులు సేరఁ
తాపసంతతులు పటాపంచలై పాఱ వినుతచిత్తులమనస్తమము జాఱ
లలితాంబుధులఁ బుష్కరములు దేటలఁ దేఱ దిఙ్ముఖంబుల వింత తెలుపులూరె
రవిశశధరమండలములఁ గాంతులు మీఱ వసుధాచకోరాక్షి వగపు దీఱ
తే. మహితతాపససందోహమానసాంబు, జములు వికసించి తనరారె సకలలోక
ములకుఁ గళ్యాణసుఖములు మొలకలెత్తె, నచ్యుతుఁడు రాముఁడై పుట్టినట్టి వేళ.

వ. అప్పు డప్పురవరంబు నటనర్తకగాయకవాచకజనసంకులరాజమార్గంబై యు
త్సవనృత్యంబు సేయుచుండె నంత నద్దశరథుండు పుత్త్రు లుదయించుట విని
పరమానందభరితహృదయారవిందుం డై తత్ప్రియాఖ్యాయులకు రత్నాంబర
భూషణాదు లొసంగి బ్రాహ్మణులకు ధనంబును ధేనువులు నొసంగె నంతఁ బద
నొకొండవదినంబున మహర్షిశ్రేష్ఠుం డగువసిష్ఠుండు. 426

వసిష్ఠమహర్షి రామాదులకు నామకరణంబుఁ జేయుట.

తే. క్రమముగా నగ్రసుతునకు రాముఁ డనఁగఁ
బరఁగఁ గైకేయిసుతునకు భరతుఁ డనఁగ
మఱి సుమిత్రాత్మజునకు లక్ష్మణుఁ డనంగ
రమణ శత్రుఘ్నుఁ డనఁగఁ బేళ్లనుర నిడియె. 427

వ. ఇట్లు నామకరణంబుఁ జేసి జాతకర్మాదిశుభకర్మంబు లన్నియు నిర్వర్తించి బ్రాహ్మ
ణులకుఁ బుష్కలంబుగా నన్నంబుఁ బెట్టించి యథేష్టంబుగా మణిసువర్ణవస్త్రా
దికంబు లొసంగి యమందానందంబునం బొదలుచుండె నంత నారాజనంద
నులు పూర్వపక్షశశాంకునిపోలికి దినదినప్రవర్ధమాను లై జననీజనకులకు
ముదంబు రెట్టింప బాల్యంబు వీడి సకలజగన్మోహనం బైనయౌవనంబు నొంది
శాస్త్రంబులయందుఁ బరిచయంబు గలిగి నీతులయం దభిరతులై ధర్మశాస్త్రం
బులయందుఁ బరిజ్ఞాతలై కోదండపాండిత్యంబులం దారి తేఱి గజహయాధిరో
హంబులయందు జితశ్రము లై పరిపంథిమర్మభేదనవ్యూహద్వంద్వయుద్ధచిత్ర
శస్త్రాస్త్రనైపుణ్యంబులం బ్రవీణతగలిగి చతుర్విధోపాయంబులం బ్రసిద్ధు లై
గర్భైకాదశవర్షంబుల నుపనీతు లై వేదాధ్యయనంబు సేసి కళంకరహిత
శశాంకుపోంకంబున నతనుత్వరహితకుసుమశరుపోలికి సకలజగన్మోహనాకార
లీలావిహారచాతుర్యంబుల నిఖిలజనమనోహరు లగుచు వినోదించుచుండి రందు.

క. జ్యేష్ఠుం డగు రాముఁడు లో, కేష్టుం డై దశరథునకు హితుఁ డై పురుష
శ్రేష్ఠుం డై విధికై వడి, శిష్టుం డై చంద్రుభంగిఁ జెలువు వహించెన్. 429

క. ధీరుం డై ఘనసుగుణో, దారుం డై కీర్తివిజితతారుం డై గం
భీరుం డై ధీరుం డై శూరుం డై యొప్పె నతఁడు సుగుచిరభంగిన్. 430

క. పితృశుశ్రూషణరతుఁ డై, శ్రుతివిదుఁ డై చాపవేదశోధకుఁ డై సు

వ్రతుఁడై యతిరథుఁడై బుధ, హితుఁడై తనరారె నాతఁ డెంతయుఁ బ్రీతిన్.

మ. ఘనుఁ డుర్విన్ స్నిగ్ధుఁడు లక్ష్మీవర్ధనుఁ డమోఘప్రేముఁ డాలక్ష్మణుం
డనఘుం డన్నయు లోకరాముఁడు హితవ్యాపారుఁ డారామభ
ద్రునకుర్విన్ దక్షిణబాహువై ప్రియుఁడునై తోడై సదాభూరిశో
భనసందాయకుఁడై రహిం దగె బహిఃప్రాణంబుచందంబునన్. 432

క. సొంపార రామభద్రుఁడు, నింపుగ లక్ష్మణుని విడిచి యించుకయు న్ని
ద్రింపఁడు సరసాన్నము భుజి, యింపఁడు క్రీడారతిఁ జరియింపఁడు నెపుడున్.

క. ఆరామవిభుఁడు చటులా, శ్వారూఢుం డగుచు వేఁట కరిగెడుతఱిఁ ద
ద్భూరిశరాసనధరుఁడై, వీరుఁడు లక్ష్మణుఁడు పోవు వెనుకొని ప్రీతిన్. 434

తే. ఇంపు సొంపార లక్ష్మణుం డెల్లప్రొద్దుఁ, బూనిరాముని కతిహితుం డైనభంగిఁ
బరఁగ శత్రుఘ్నుఁడును జాల భరతునకును, బ్రీతి నెప్పుడుఁ గడుహితుండై తనర్చె.

తే. మఱియు దశరథధారుణీమండలేంద్రుఁ, డక్కుమారోత్తములచేత ననవరతము
సేవ్యమానుఁడై మిక్కిలిచెలఁగుచుండె, ననిమిషులచేతఁ బంకజాసనుఁడు వోలె.

వ. ఇట్లు దశరథుండు నందనులచేత నుపాస్యమానుండై యక్కుమారు లాయాధ
యావను లగుటఁ దలపోసి తగినకన్యలం దెచ్చి వివాహంబులు సేయుటకు
నుపాధ్యాయబాంధవసహితంబుగా విచారించుచున్నసమయంబున. 437

విశ్వామిత్రమహర్షి దశరథమహారాజుకడ కేతెంచుట.

సీ. అలవసిష్ఠునితోడఁ గలహించి యెవ్వాఁడు సదమలబ్రహ్మర్షిపదము వడసె
సురలపై నలిగి భూవరునకై యెవ్వాఁడు ప్రతినాక మొనరించె వితతమహిమ
ఘనతపంబునకు విఘ్నము సేయ వచ్చిన రంభ నెవ్వాఁడు దిట్టె రాయిగాఁగఁ
బరఁగ నెవ్వాఁడు యాగపశువుగాఁ గొనిపోవుద్విజపుత్త్రు బ్రతికించె విపులకరుణ

తే. నట్టితాపసకులవర్యుఁ డమితతేజుఁ, డంబురుహగర్భసముఁడు మహామహుండు
గాధినందనుఁ డమ్మహీకాంతుఁ జూడ, నక్కజంబుగఁ జనుదెంచె నొక్కనాఁడు.

తే. వచ్చి వాకిట నిలిచి దౌవారికులను, గాంచి మారాక యానృపాగ్రణికిఁ దెలుపు
మనుడు రయమున నొకఘణిహారుఁ డరిగి, నరవరాగ్రణి కొలువున్ననగరుసొచ్చి.

ఉ. ఏలికఁ గాంచి కేలు ఘటియించి నృపాలమణీ పరాకు నా
యేలినసామి కౌశికమునీంద్రుఁ డుపాత్తలసన్మహాతప
శ్శీలుఁడు వచ్చి సంభ్రమముచేఁ దలవాకిట నున్నవాఁడు తే
జోలసితుండు నావు డలసూర్యకులేంద్రుఁడు హృష్టచిత్తుఁడై. 440

క. గురుసహితుఁడై మహేంద్రుఁడు, వరచతురాననున కెదురు వచ్చినభంగిన్
గురుసహితుఁడై మహీంద్రుఁడు, కర ముద్ధతభక్తి నెదురుగాఁ జనుదెంచెన్.

తే. అట్లు చనుదెంచి ప్రజ్వలితాగ్నిమాడ్కిఁ
గ్రాలు మునినాథు సంశ్రితవ్రతునిఁ గాంచి

భక్తిఁ దత్పదాబ్జములకుఁ బ్రణతిఁ జేసి
యర్ఘ్యపాద్యప్రముఖపూజ లాచరించి. 442

వ. వినయంబున గృహంబులోనికిం దోడ్కొని చని కాంచనాసనంబున నాసీనుం జేసి శాస్త్రప్రకృష్టవిధానంబున నర్చించిన నప్పరమతపస్వి తత్పూజనంబుఁ బ్రతిగ్రహించి పురరాష్ట్రకోశజనపదబాంధవసుహృజ్జనంబులయందుఁ గుశలంబడిగి.

తే. అనఘ పగతులు నిర్జితు లైరె మంత్రి, వరులు వశవర్తులై చరింతురె సమస్త
నృపులు సన్నుతు లగుదురె నీకుఁ జేయఁ, గంటివే దైవమానుషకర్మచయము.

వ. అని పలికి పదంపడి వసిష్ఠమునిశ్రేష్ఠునిం జూచి సగౌరవంబును సస్నేహంబును సవినయంబునుం గా సేమం బరసి తక్కినమహర్షుల నందఱ నయ్యై తెఱంగుల సంభావించి వారిచేత నుపాస్యమానుండై నిజతేజోజాలంబులఁ దత్సభాంతరం బెల్ల వెలుంగం జేయుచు సుఖాసీనుండై యుండె నప్పు డద్దశరథుండు విశ్వామిత్రు నవలోకించి వినయంబున నిట్లనియె. 445

ఆ. అమృతకలశ మబ్బిన ట్లనూదకమందు, నీరు సెందినట్లు నిర్ధనునకు
నమితధనము దొరికి నటుగాదె మీరాక, నేఁడు మాకు గాధినృపకుమార.

ఆ. ధర్మపత్నులందుఁ దనయులఁ బడసిన, నాఁటికంటె మౌనినాథ నేఁడు
యినుమడించె నాదుహృదయమందుఁ బ్రమోద, మాభ మనఘ నీదురాకవలన.

క. మునినాథ దైవికంబునఁ, జనుదెంచితి వీవు నాదుసదనంబునకుం
బను లన్నియు సమకూడెను, పనివడి మీకృపకుఁ జాలఁ బాత్రుఁడ నైతిన్. 449

తే. సంయమీశ్వర ఘోరసంసారజలధి, మగ్నమౌ దృశనరపాలమండలంబు
నుద్ధరింపంగ నదుపాయమెందుఁ గలదె, యుష్మదీయకృపాపోతమొకటి దక్క.

మ. అనఘుం డై సుపవిత్రు డై శుభకరం డై యొప్పు మీదర్శనం
బున నాజన్మము సార్థ మయ్యె యశము న్బొల్పొందె బల్నిష్ఠఁ జే
సినపుణ్యంబు ఫలించె నిత్యశుభము ల్సేకూడె నోగాధినం
దన వెయ్యేటికి సాధుభూపతులలో ధన్యుండ నై మించితిన్. 450

తే. మొదల రాజర్షివై చాలఁబోగడువడసి, పిదపఁ దపమున బ్రహ్మర్షిపదముగాంచి
మున్ను భువనప్రసిద్ధిఁగైకొన్ననీదు, మహిమ లెఱిఁగి నుతింపంగ మాకు వశమె.

క. గురుఁడవు దైవతమవు శుభ, కరుఁడవు బలదాయకుఁడవు కర్తవు సంప
త్కరుఁడవు దైవతమవు సుఖ, కరుఁడవు మా కెపుడు నీవ కావె మహాత్మా. 452

వ. మునీంద్రా మిముబోఁటి పరమసిద్ధులకు సమ్ముఖంగవలసినకార్యం బొక్కింతైనఁ గలుగమి నిక్కువం బైనను నడుగ వలసి యడిగెద నేమి దలంచి విజయంబు సేసితిరి నా కెయ్యది కర్తవ్యం బానతిందుపాత్రభూతుంగ నగుటం జేసి భవత్కామితంబుఁ దీర్చెద మహానుభావుం డైననీవు మద్గృహంబున కరుదెంచుట నాయందుం గలవాత్సల్యాతిశయంబునం గదా యని శ్రవణసుఖంబుగాఁ బల్కిన

నప్పలుకుల కలరి నిజతేజోధరీకృతశతపత్రమిత్రుం డగువిశ్వామిత్రుండు హర్ష
పులకితగాత్రుం డై యజరాజపుత్రున కిట్లనియె. 453

చ. మనుకులసంభవుండ వసమానవసిష్ఠకృతోపదేశసం
జనితలసద్వివేకుఁడవు సాధువిధేయుఁడ వన్వయోచిత
ప్రణయవిదుండ వీవగిదిఁ బల్కుట నీ కనురూపమే కదా
మనుజవరేణ్య నీ వనినమాట కసత్యము గల్గ నెన్నఁడున్ 454

క. హితమతి నస్మన్మానస, గతకార్యం బెఱుకపఱతు గ్రక్కున దానిం
జతురత నొనర్చి సత్య, ప్రతిశ్రవుఁడ వగుము నీవు పార్థివముఖ్యా. 455

వ. అని బహూకరించి వెండియు. 456

చ. అనఘచరిత్ర యే నొకమహాధ్వరకర్మ మొనర్పఁ బూని ను
ద్వనమున దీక్షఁ గైకొని యథావిధి హోమము సేయుచుండఁగా
దనుజవరేణ్యు లిద్ద ఱతిదర్పితు లుగ్రులు కామరూపు లై
వెనుకొని వచ్చి యెంతయును విఘ్న మొనర్తురు సారెసారెకున్. 457

క. ఏ నెన్నిమార్లు సేయం, బూనిన వా రన్నిమార్లు పూని చలమునన్
నానావిధవిఘ్నంబుల, దానిం గొనసాగనీరు దశరథనృపతీ. 458

ఉ. నెత్తురు వహ్నికుండముల నించుచుఁ బావనయజ్ఞవేదిపైఁ
గుత్తుకబంటిమాంసమును ఘోరముగా దివినుండి వైచుచుం
దత్తఱపాటుతో మునులఁ దద్దయుఁ గాఱియపెట్టుచుం గడుం
జిత్తము గంద నత్తపముఁ జెల్లఁగనీ రిఁక నేమి జెప్పుదున్. 459

చ. పెనుకినుక న్నిశాటుల శపింపఁ గడంగియు దీక్షితుండ నై
మనమున నల్కఁ బూనిన సమంచితయాగఫలంబు వ్యర్థమై
చను నని యుం జిరార్జితవిశాలతపంబున కగ్గి హాని గ
ల్గు నని యుఁ దాల్మిచేత మదిఁ గూరినకిన్క సహింతు సారెకున్. 460

విశ్వామిత్రుఁడు యాగరక్షణార్థమై రాముని దన కొసఁగఁగోరుట.

తే. వారు సుందోపసుందకుమారు లమిత
విక్రములు కామరూపులు వీరకర్మ
విదులు మాయావులు దశాస్యవీరభటులు
జనవర సుబాహుమారీచు లనెడివారు. 461

చ. జనయుతుల న్నిశాటుల వెసం దునుమ న్భవదగ్రనందనున్
భువనమనోహరు న్బలరిపుప్రతిమున్ సుగుణాభిరామునిన్
రవికులవార్ధిసోముని నరాతివిరాముని రాము నెంతయు
న్నవరణ మీఱఁ దోడ్కొని చనం జనుదెంచినవాఁడ వేడుకన్. 462

క. భూమీశతిలక సుగుణో,ద్దాముని ఘనకాకపక్షధరుని న్సూనున్

భీమసమానపరాక్రము, రాముని నాకొసఁగు మిపు డరాతుల నోడువన్.
క. ఇతఁ డెంతయు నాచే బాలితుఁడై యాత్మీయదివ్యపృథుతేజమునన్
దితిజుల వినాశనమునం, దతులితగుణధుర్యశక్తుఁడై తనరారున్. 464
క. ఎద్దానివలన సీతఁడు, దద్దయు ముజ్జగములందు ధన్యుం డనఁగాఁ
బెద్దయు విఖ్యాతి వడయు, నద్దివ్యానేకరూపయశము నొసఁగెదన్. 465

దశరథుఁడు రామునివెంటఁ దన్నును దోడ్కొని పొమ్మనుట.

క. రామునిముంగల నిలువఁగ, నామనుజాశనులు చాల రనిలో వారిన్
రాముండు దక్క నన్యుం, డీమహిలోఁ దునుమఁ జాలఁ డినకులతిలకా. 466
తే. అధిప బలవీర్యదర్పితు లగుటఁ జేసి, ప్రాప్తులై కాలపాశనిబద్ధు లగుచు
నున్నవా రన్నిశాటులు యుద్ధమందు, ఘనబలుం డైన రామునిఁ గడువలేరు.
క. విమలాత్మక పుత్రస్నేహము విడువుము నీదుభావ మంత యెఱుఁగుదున్
సమరమున దానవుల నిక్కము రామశరాభిహతులఁ గా నెఱుఁగు మొగిన్.
తే. రామభద్రుఁడు సత్యవిక్రముఁడు లోక
హితుఁడును మహాత్ముఁ డని నుది నే నెఱుఁగుదు
నీవసిష్ఠమహాముని యెఱుఁగు మఱియు
నితరతాపసు లెఱుఁగుదు రితనిమహిమ. 469
తే. శాశ్వతం బైనయశమును సర్వధర్మ, లాభము నఖండభూరికల్యాణలాభ
మును వడయఁగోరితేని యోభూతలేంద్ర, చంద్రరాముని నాకునొసంగుమిపుడు.
తే. అధిప నావెంట బంపుట కఖిలమంత్రి, వరులును వశిష్ఠముఖమునివరులుసమ్మ
తించి యున్నారు నీవు సందియము దక్కి, నాకొసంగుము రాముని లోకనుతుని.
వ. మహాత్మా యే నొనర్పం బూనినదశరాత్రయాగకాలం బతీతంబు గాకుండ శీఘ్రంబున భవత్కుమారకుం డైనరాముని నాపిఱుందం బంపి సత్యప్రతిజ్ఞుండవు గమ్మైన నీకు శుభంబు గలుగు నని ధర్మార్థసహితంబు లగుపలుకులఁ బలికి క్రమ్మఱ నతం డిచ్చునదుత్తరంబు వినువాఁడై యూరకున్న నావిశ్వామిత్రునివచనంబులు విని యద్దశరథుండు వ్యథితమనస్కుండై తీవ్రశోకంబున నొక్కింతసేపు మైమఱచి యుండి క్రమ్మఱ లబ్ధసంజ్ఞుండై మొగంబున దైన్యంబు దోఁప నిరుద్ధబాష్పోదయసన్నకంఠుం డై యి ట్లనియె. 472
తే. అనఘ రాజీవలోచనుం డైనరాముఁ, డూనషోడశవర్షుండు వీని కాజి
నసురుల నెదిర్చి పోరాడునట్టి భూరి, కర్కశం బైనభుజశక్తిఁ గాన మిపుడు.
ఉ. బాలుఁడు ధీరుఁ డై రిపులపాళి నెదిర్చి రణం బొనర్పఁగాఁ
జాలఁడు యస్త్రశస్త్రములచంద మొకింత యెఱుంగఁ డాజివి
ద్యాలసితుండు గాఁ డరిబలాబలయుక్తు లెఱుంగఁ డుగ్రుడై
త్యారి నెదిర్చి పోర నకృతాస్త్రుని రామునిఁ బంపఁ జెల్లునే. 474

తే. నిన్న మొన్నటివాఁడె యీచిన్నకుఱ్ఱఁ, డకట రాఘవుఁ డెక్కడ యసురు లేడ
సమరమున వారి నీతఁడు సంపు టేడ, యింత చింతింపవలదె మీ రేమిచెప్పు.

మ. సుతులం గానక పెద్దకాలము మదిన్ శోకించి పెక్కేండ్లకీ
సుతులం గంటిఁ గృపన్ భవాదృశజటీశుల్ సేయునాశీర్వరో
న్నతి మద్భాగ్యవిశేషమున్ భవదధీనంబే కదా యీజగ
ద్ధితునిం దైత్యులతోడఁ బోరుటకు నే నేలాగు పుత్తెంచెదన్. 476

చ. ఘనగుణశాలి ప్రాణములకంటెఁ బ్రియుం డగురామచంద్రునిన్
జననుత నొంటిఁ బంపి నిమిషం బయినన్ మనఁ జాల వంశవ
ర్ధనుఁ డగునట్టియీతలికుప్రాయపుముద్దులకుఱ్ఱఁ డేల నీ
యనుమతి నేనె వచ్చెద సురారులఁ జంపి సుఖంబుఁ గావఁగన్. 477

—దశరథుఁడు విశ్వామిత్రుని సుబాహుమారీచాదుల సమాచారం బడుగుట.—

వ. మహాత్మా మిముబోఁటిమహాత్ముల యనుగ్రహవిశేషంబున నా కక్షౌహిణీపరిపూర్ణం బైనసైన్యంబు గొఱంతపడకుండఁ గలిగి యున్నది మఱియు సర్వాస్త్రకుశలు లగువీరులు దండనాథు లనేకు లున్నవారు వీ రందఱు భవత్ప్రసాదంబున రక్షోగణనిగ్రహంబునందు దక్షులై యుండుదు రట్టివీరభటకోలాహలసంకులం బైనబలంబునుం గూడి ధనుర్ధరుఁడ నైనయేను జనుదెంచి రణంబున నసురుల నెదిర్చి ప్రాణంబులు దాఁపక నాయకపరంపరల నిశ్శేషంబుగా రూపుమాపి భవద్వ్రతచర్య నిర్విఘ్నంబుగా సమాప్తి నొందించి వచ్చెద రామునిఁ దోడ్కొనిపోవ నిశ్చయించితి రేని చతురంగబలోపేతుం జేసి మత్సహితంబుగాఁ దోడ్కొని చనుము నాకు నల్వురు పుత్త్రులు గలరైనను వారిలోన రాముండు జ్యేష్ఠుండును ధర్మప్రధానుండు గావున నితనియందు మిక్కిలిఁ బ్రీతి గలిగి యుండుదు నద్దనుజు లెట్టివా రెవ్వనికొడుకు లెవ్వనిచేత రక్షితు లగుదు రెట్టి పరిమాణంబు గలవారు నాకును రామునకు నాబలంబునకు నెత్తెఱంగునఁ బ్రవర్తింపవలయు నేయుపాయంబునఁ బరిమార్ప వచ్చు నెచ్చటనుండి చనుదెంతు రేచందంబునం జరింతు రింతయు నెఱింగింపుం డనిన మునిగ్రామణి నృపగ్రామణికి నిట్లనియె. 478

సీ. జననాథ యలపులస్త్యబ్రహ్మ మనుమఁడు రావణుం డనియెడు రాక్షసుండు
విధిదత్తవరజాతవీర్యగర్వంబున మత్తుఁడై తనయట్ల మత్తులైన
దుష్టనిశాటులతోఁ గూడి యనిశంబు ఘనబలప్రౌఢి లోకముల నెల్లఁ
బ్రతిహతద్యుతులుగా బాధించుచున్నవాఁ డనుమాట మన మెల్ల నాలకించి
తే. సదియె కద యద్దశాస్యుఁడు యక్షనాథు, సనుజుఁ డలవిశ్రవునిపుత్త్రుఁ డధికసత్త్వుఁ
డయ్యు జగతినాసురభావుఁ డగుటవలన, గహ్వరీనాథ మఖవిఘ్నకర్త యయ్యె.

శా. ఆరక్షఃపతిపంపునన్ ఘనమహోగ్రాకారు లుద్యద్బలుల్

శూరుల్ దుష్టులు కామరూపధరులుం సుందోపసుందాత్మజు
ల్మారీచుండు సుబాహుఁడుం సురరిపుల్ దైర్యోద్ధతుల్ క్రవ్యభు
గ్వీరుల్ సారెకు వత్తు రాసవనముం విఘ్నంబుగావింపఁగన్. 480

— దశరథుఁడు రాక్షసబలంబువిని వెఱచి రామునిఁ బంప నొల్లననుట. —

క. అని పలికినమునినాథువ, చనముం విని యొల్లఁ బోయి జననాథుఁడు నె
మ్మనమున భీతి గదుర నా, ననమున దైన్యంబు దోఁప నమ్రుం డగుచున్. 481

వ. అంజలిఁ గీలించి యిట్లనియె. 482

చ. మునివర రావణుం డనఁగ మున్నసహాయతఁ బెక్కుమాఱు ల
య్యనిమిషదైత్యసంగరములందు దిగీశులతోడఁ బోరువాఁ
డనుపమవిక్రమాప్తి బిరుదందిన మేటిమగండు వానితో
నని నెదిరించి పోర దివిజాధిపముఖ్యుల కైనఁ జెల్లునే. 483

తే. అంతలంతటి వేల్పు లట్లగుచు నుండ, దానవుని తేజము సహింప మౌనినాథ
మనుజులన నెంత వారలు మనుజులఁ దిను, వారి మనుజులు వధియింపఁ గోరు టెట్లు.

క. ఆరావణుండు సమరజి, తైరావణుఁ డనఁగ వినమె యాతనితోఁ దఱ
మా ఱొడ్డి సంగరంబునఁ, బోరఁగ నాతరమె మౌనిపుంగవ తలఁపన్. 485

వ. మఱియు సుందోపసుందనందను లగుమారీచసుబాహులు వీర్యగర్వంబున నెవ్వరి మెచ్చక మాయాబలవిశేషంబునఁ బురందరాదిబృందారకుల లెక్క సేయక యుక్కుసంగ్రాలుచు యజ్ఞవిఘ్నకరు లై ప్రవర్తింతు రనునది జగత్ప్రసిద్ధం బై మ్రోయుచుండు నే నెట్టిజెట్టిజోదు లైన బిట్టెదిరించి కట్టల్క గట్టితనంబుఁ జూపి యిట్లట్లు సుడి వెట్ట నోపుదుం గాని కాలాంతకయమోపము లగు నమ్మారీచసుబాహుల నోర్వం జాల ననేకసంగ్రామంబులనారితేఱి పేరుకొన్న నాయట్టిశూరులకుం దీర్పరానికార్యంబు బాలుండును నకృతాస్త్రుండు నగు రాముఁ డెట్టెలంగునం దీర్చువాఁడు నీవు సర్వజ్ఞుండవు గురుండవు నాకు దైవమవు కావున మందభాగ్యుండ నైననన్నుం గరుణించి రామునియందుఁ బ్రసాదంబు సేయుము. 486

— విశ్వామిత్రుఁడు దశరథువచనంబు విని క్రుద్ధుఁ డగుట —

మ. అని ధాత్రీవరమౌళి వల్క ముని విశ్వామిత్రుఁ డత్యాగ్రహం
బున యజ్ఞాయతనంబునందు విలసత్పూతాజ్యసిక్తాగ్నిభం
గి నితాంతద్యుతితో సుదీప్త మగుచుం గెంజాయ రంజిల్లులో
చనకోణంబుల రాజుఁ జూచి పలికెం శస్త్రోపమానోక్తులన్. 487

ఉ. అచ్చుపడంగ మే మడిగి నప్పుడె లే దని పల్కుటొప్పు గా
కిచ్చెద నంచుఁ బల్కి తుది నీగతి బొంకుట రాజనీతియే
రచ్చల నీవలెం రఘుకులంబునఁ బుట్టినరాజు లెన్నఁడుం

బొచ్చెము లాడ రన్నయు నుపుణ్యముఁ జేసితి వేమి చెప్పుదున్. 488

ఎంతో గౌరవ మంత యాగ్యోస్య నయితే నేమూయెఁ గానిమ్ము మా
కింతే చాలుఁ గొఱంతె యేమి పను లింకేరీతిచే నైన నా
క్కింతైనం దుది ముట్టనే పలుకు లింకేలా మృషావాది నై
సంతోషంబున నుండు మీ వు సుఖినై యుత్స్వానాథ యేఁ బోయెదన్. 489

అని పలికిన నవ్విశ్వామిత్రుని దుర్నివారక్రోధరసోద్దీర్ణం బైన సరూపలక్షణం
బుపలక్షించి. 490

ధర దిరిగెం గులశైలము, లారగెఁ దిగ్భిత్తు లవార నురుపతి రాలెన్
శరనిధు లింకెన్ భూతము, లతిముక్తి సనసన వడంకె హారినరుఁ డదరెన్. 491

—వసిష్ఠుండు రాముని విశ్వామిత్రునితోఁ బంపుమని దశరథునకు బోధించుట.—

అంతం గొంత వసిష్ఠుఁ డాజనితలోకోత్పాతరూపముం జూచి లో
వంతం జంతలి క్రోధుఁడీ ముని మునిన్ నా ప్రచ్చి యిప్పేదినీ
కాంతుం డనిశతంబునం దపసి శాంతం బాయఁ గోపించినాఁ
డెంతో మోసము వచ్చె నంచు మనసుఁ బ్రహ్మర్షీంద్రుతో ని ట్లనున్. 492

జననాథా సుపవిత్రమైన మనువంశంబందు జన్మించి స
జ్జనమాన్యుం డన సుప్రతుం డనఁగ నాత్మీ స్వధర్మతుల్యుం డనా
వినుతప్రజ్ఞుఁ డనా మహాదృఢమతి యనా విఖ్యాతి వాటించి నేఁ
డనుమానింపక వంశధర్మ మెడ సేయం బూనఁగాఁ జెల్లునే. 493

ఇనకులవర్య తాఁ దొలుత నిచ్చెద నంచు వచించి నేఁడు బో
యినఁ గడులోభబుద్ధి దుది నీక పనంగిన యాగపూర్తముల్
పనిచెడి పోవు నంచు మును పల్కిరి కాన సధర్మవృత్తిఁ గై
కొనక స్వధర్మ మూఁది గిబుకుంజరి రాముఁ బంపు మిత్రతన్. 494

అధిప యకృతాస్త్రుఁ డైనఁ గృతాస్త్రుఁ డైన, నేమి కౌశికగుప్తుఁడై యెనఁగునట్టి
రాము వీక్షింపఁగా లేరు రాత్రిచరులు, దారుణానలగుప్తామృతమును బోలె.
ఈమునివంశశేఖరు మహీనమహాత్వము లెన్నఁ జిత్రముల్
భూమివరాగ్రగణ్యకులభూషణ పూర్వ మఖండచండని
ష్ఠామహిమంబుచేఁ దపము సల్పి తపద్భుతశక్తియోగవి
ద్యామహిమాధికుం డనఁగ సద్భుతశీలముఁ గన్నవాఁ డిలన్. 496

ఘనుఁ డీసంయమి నేత దివ్యశరశిఖాశాలి మార్తాండవ
హ్నినిభుం డుగ్రతపంబునన్ మును భవానీనాథు మెప్పించి యా
యనచేఁ జెక్కునిశాతసాయకము లుద్యత్ప్రీతిఁ జేకొన్నవాఁ
డెనయే యీయన కెవ్వరైన విపులాహిస్వర్గలోకంబులన్. 497

వెలయఁగ నిమ్మునిప్రభుఁడు విగ్రహవంతుఁడు ధర్మశీలుఁడున్

బలరిపుతుల్యవిక్రముఁడు పావనమూర్తి తపఃపరాయణుం
డలఘుయశుండు నద్భుతవిహారుఁడు బుద్ధ్యధికుండు ముజ్జగం
బులఁ గలదారుణాస్త్రచయముల్ సకలంబు నెఱుంగు భూవరా. 498

మహీంద్రా నీకుమారుం డైన రాముండు సువిగ్రహవంతుఁడును సహజవీర్యుండును సహజజ్ఞానశక్తియుక్తుండును దపంబునకుఁ బరమప్రాప్యంబును నై యుండు నట్టియు నతండు చరాచరాత్మకత్రిలోకస్థసమస్తాస్త్రశస్త్రంబుల నెఱుంగు నతనిప్రభావం బెవ్వ రెఱుంగరు శక్రాదిదిగీశు లైన నతనికి సములు గా రది య ట్లుండనిమ్ము తొల్లి భృశాశ్వుండు తనుమధ్య లగుదక్షకన్యల జయ సుప్రభ లనువారి నిద్దఱఁ బరిణయం బై యక్కాంతలయందు రాక్షసవధార్థంబు క్రమంబున నస్త్రశస్త్రస్వరూపులఁ బరమభాస్వరుల నతిధార్మికుల నానావర్ణరూపుల మహావీర్యుల దీప్తిమంతుల జయశీలుర నప్రమేయప్రభావుల నప్రతిహతతేజులఁ గామరూపుల దురాధర్షుల బలవంతుల నేవురఁ బుత్త్రులం బడసె శంకరుం డితనితపంబునకు మెచ్చి యయ్యస్త్రశస్త్రంబుల నన్నింటి నిమ్మునీంద్రున కొసంగె దానం జేసి యితండు సర్వాస్త్రశస్త్రకుశలుం డై యస్త్రవిదులలో నుత్తముం డై త్రిలోకప్రసిద్ధుం డై యుండుఁ జరాచరాత్మకంబు లైన జగంబులం దిమ్మునీంద్రుం డెఱుంగనియర్థం బొకిం తైన లేమి నిక్కువంబు మహావీర్యుండును మహాతేజుండును మహానుభావుండు నగునితండు రాక్షసవినాశంబునందుఁ దాను శక్తుం డయ్యును భవన్నందనుం డైన రామున కమేయకల్యాణం బొసంగం దలంచి కృపావిశేషంబునఁ జనుదెంచినాఁడు కావున నీవు సందియంబు వదలి పరమానందంబున రాము నిమ్మునిరాజున కొసంగు మని బోధించిన నగ్గురువచనంబు విని యన్నరశార్దూలుండు ప్రసన్నచిత్తుం డై యానందించి మహాత్ముం డగువిశ్వామిత్రునకు రాము నొసంగెద నని నిశ్చయించి. 499

దశరథుఁడు రామలక్ష్మణుల విశ్వామిత్రుని వెంటఁ బంపుట.

ఉ. ఆమనుజాధిపుండు ముద మారఁగ సూతునిఁ జూచి రాజపు
త్త్రాముని రాఘవాన్వయలలామునిఁ గోమలనీలనీరద
శ్యామునిఁ బూర్ణకాముని నమంచితచారుగుణైకధామునిన్
రాముని వేడ్కఁ దోడుకొని రమ్మిటు లక్ష్మణసంయుతంబుగన్. 500

చ. అనిన మహాప్రసాద మని యాతఁడు గ్రక్కున నేగి మానినా
థునిమది కింపుగా నటకుఁ దోడ్కొని వచ్చెఁ బ్రతాపసాంద్రునిన్
జననుతరూపనిర్జితవసంతజయంతరతీంద్రచంద్రున
త్యనుపమభోగభాగ్యవిజితానిమిషేంద్రుని రామచంద్రునిన్. 501

ఉ. వచ్చినపుత్త్రుఁ గాంచి జనవర్యుఁడు చాల ముదంబుఁ బొంది తా

గ్రుచ్చి కవుంగిలించి వెసఁ గూఁకటి దువ్వి నిజాంకపీఠిపై
ముచ్చట నుంచి తచ్ఛిరము మూర్కొని చెక్కిలి ముద్దుఁ గొంచి లో
హెచ్చినకూర్మి నివ్వటిల నిట్లని పల్కె సుధామయోక్తులన్. 502
నన్నుఁ గన్నతండ్రి నాముద్దులయ్య నా, చిన్నియన్న నిన్నుఁ జెన్నుమీఱఁ
గుశికసుతుండు దోడుకొని పోవ వచ్చినాఁ, డరుగు మితనివెంట ననుజుఁగూడి.
అని పలికి యద్దశరథుండు ప్రీతచేతస్కుం డై ప్రాస్థానికం బగుస్వస్త్యయనంబుఁ
బ్రయోగించి ప్రియనందనుం డైనరాముని విశ్వామిత్రుని కొసంగెన. 504
తల్లులకు మ్రొక్కి పతికి వందనముఁ జేసి
మౌనివరునకుఁ బ్రణమిల్లి మంగళాభి
మంత్రితుం డయి గాధేయమౌనివెంట
హర్ష మిగురొత్త నరుగు నయ్యవసరమున. 505
మందారవృష్టి గురిసెను, బృందారకబృందదుందుభిస్వను లెసఁగెఁ
మందానిలంబు వీచెను, గ్రందుగ వడి మొఱసె శంఖకాహళరవముల్.
నిరుపమదివ్యమౌక్తికమణీముకుళీకృతకాకపక్షుఁ డై
సురుచిరదివ్యహారపరిశోభితరమ్యవిశాలవక్షుఁ డై
శరములుఁ గార్ముకం బసినిషంగములుం గొని మౌనివెంటఁ దా
నరిగెఁ బినాకివెంట ముద మారఁగ నేగుకుమారుఁడో యనన్. 507
రాము నెడఁబాయ కప్పుడు, భీమశరాసనశరాసపృథుతూణము లు
ద్దాముగతిఁ దాల్చి వెంటనె, సౌమిత్రికుతూహలం బెసంగం జనియెన్ 508
రాణింప రఘువర్యు లీక్రియఁ దనుత్రాణుల్ కృపాణుల్ ధను
ర్బాణుల్ శౌర్యధురీణు లద్భుతులు భాస్వద్బద్ధగోధాంగుళీ
త్రాణుల్ తాపసరాజువెంటఁ జని రందం బొప్ప లీలారతిఁ
వాణీనాథునివెంట నశ్వులు విభాస్వల్లీలఁ బోవున్ గతిన్. 509
ఇత్తెఱంగున నత్తరణికులగ్రామణులు నిజతేజోజాలంబుల దశదిశల వెలుంగం
జేయుచు ద్రిశీర్షంబు లగుపన్నగంబులకరణి నలరుచు విశ్వామిత్రుని వెనుకొని
యెడనెడఁ జనవుఁ గఱపుచు మందాంచితగమనంబునం బోవునప్పు డమ్మునీం
ద్రుండు లబ్ధమనోరథుం డై యక్కుమారులతో లీలావినోదంబులం దగిలి
దయార్ద్రస్నేహభూయిష్ఠం బైనచిత్తంబునందు హర్షంబు పల్లవింపఁ జనిచని
సార్ధయోజనమాత్రంబుదవ్వులం గలసరయూనదిదక్షిణతీరంబుఁ జేరంబోయి
రామా యని మధురంబుగాఁ బేర్కొని యిట్లనియె. 510

### విశ్వామిత్రమహర్షి రామునకు బలాతిబల లనెడు మంత్రంబుల నుపదేశించుట.

అనఘ మహానుభావ సుకృతాత్మ లచిత్తముభంగి రమ్య మై
తనరుచు నున్న దీతటిని దప్పక నీవిపు డీజలంబు గ్ర

క్కునఁ దగ సంస్పృశించి బలుకోరికతోఁ జనుదెమ్ము సజ్జనా
వనగుణధుర్య నీ కిట ధ్రువంబుగ విద్యలు రెండొసంగెదన్. 511

సీ. చతురత నెద్దాని జపియింప రుజయును జరయు నాఁకలి దప్పి పొరయ కుండు
నెద్దానిఁ జేకొన్న నెట్టియవస్థలందైన దైత్యులబాధ లన్ని దొలఁగు
నెద్దానిఁ దలఁచిన నీ రేడుజగములం దసమాన తేజుఁడై యలరు చుండు
భక్తితో నెద్దానిఁ బఠియింప రణములం దనుపమజయశాలి వై తనర్చు

తే. నవని నెద్దానిఁ గొనియాడ నమితసత్త్వ,మాయురారోగ్యములును సర్వార్థసిద్ధి
గలుగు నట్టిబలయు నతిబలయు ననెడు,విద్యలత్యంతకృపనిత్తు వేడ్కఁగొనుము.

వ. మఱియు నమ్మహావిద్యలు లోకకర్త యగుపరమేష్ఠివలన సృజింపంబడినయవి యేను దపఃప్రభావంబునం బడసితి నమ్మంత్రంబులు వీర్యతేజస్సమన్వితంబులై సర్వజ్ఞానప్రదీపనంబులై యుండు వాని నభ్యసింప నీవ యష్టాంశవుతత్ప్రభావం బునం జేసి సౌభాగ్యదాక్షిణ్యజ్ఞానబుద్ధినిశ్చయోత్తరప్రతివక్తవ్యంబులందు నీకు సమానుండు లేక యుండు దానం జేసి యతులంబైన యశోలాభంబు గలుగు నానావిధంబు లగుగుణంబు లన్నియు నీయందు సన్నివిష్టంబులై యుండు బహురూపంబు లంగీకరించి వలసినకార్యంబు లన్నియు సాధించుచుండు సమాహితమనస్కుండవై ప్రతిగ్రహింపుమని పలికిన నారఘూత్తముండు ప్రహృష్టవదనుండై జలంబు లుపస్పృశించి శుచియై వినయపూర్వకంబుగా నుపసర్పించిన నవ్విశ్వామిత్రుండు గరుణావిధేయుండై యమ్మహావిద్య నుపదేశించిన నది బాలసూర్యమండలంబువలన నిర్గమించినపరమద్యుతి స్ఫురత్పద్మంబుఁ బ్రవేశించినపగిది నమ్మహర్షి వదనంబువలన నిర్గమించి రాముని ముఖంబు బ్రవేశించె నంత నారాముండు విద్యాసముదితుండై శరత్కాలంబునందలి సహస్రరశ్మి యగుదివాకరుండునుం బోలె నభిరాముండై పాదోపసంగ్రహణాదిగురుకార్యంబు లన్నియు నిర్వర్తించి.

అనఘపవిత్రుఁడా రఘుకులాగ్రణి రాముఁడు పర్ణశయ్యపై 513
మునిపతిచే నమేయగతిఁ బుణ్యకథాశ్రవణంబుఁ జేయుచు
న్ఘనముగ నన్నదీతటమునన్ సుఖలీల వసించె నాఁటిరే
యనుజునితోడఁ గూడి శిశిరానిలముం బయి వీఁచు చుండఁగన్. 514

క. మఱునాఁ డరుణోదయమున, గురుమతి కౌశికుఁడు మేలుకొని మృదుతృణసం
స్తరమందుఁ బవ్వళించిన, తరణికులోత్తమునిఁ జూచి తగ నిట్లనియెన్. 515

క. కౌసల్యాసుత రాఘవ, భాసురముగఁ బూర్వసంధ్య పరఁగెడు నిఁక ను
ల్లాసమున నిద్ర లెమ్ము ను, ధీసన్నుత యాహ్నికంబుఁ దీర్పుము ప్రీతిన్. 516

చ. అని మునిరాజు పల్కు విని యారఘువీరులు మేలుకాంచి చ
య్యన సరయూనదీప్రవిమలాంబువుల న్వడిఁ జల్లులాడి నె

మ్మనమున భక్తి మీఱఁ బరమం బగుమంత్ర మొగిం జపించి య
మ్మునికి నమస్కరించి కడుమోదమునం గృతకార్యసిద్ధులై 517

తే. తపసియనుమతి వడసి తత్సహితు లగుచు, నచటు వాసి రయంబున నవలనగిరి
మహితసరయూనదీసంగనుంబునందు, భువనపావని యైనజాహ్నవిని గాంచి.

చ. అనుపమవృక్షశోభితతపంతికకాననసీమయందు మిం
చిననియమంబునం దపముఁ జేసెడువారి నమేయదీప్తిచేఁ
దనరెడువారి మౌనుల నుదారతఁ గాంచి మునీంద్రుతోడ మె
ల్లన వినయంబుతోఁ బలికె రాఘవరాముఁ డమోఘధాముఁడై. 519

క. ఈపుణ్యాశ్రమ మెవ్వరి, దేపుణ్యచరిత్రుఁ డిప్పు డిచ్చట నుండున్
గోపాలవనముఁ బోలెడుఁ, దాపసకులవర్య మాకు దయఁ దెల్పఁ గదే. 520

క. నా విని కౌశికుఁ డిట్లను, భూవరనందనునితోడఁ బొలుపుగ వినుమీ
పావనతపోవనోత్తమ, మేవిధమునఁ గలిగె దాని నెఱిఁగింతుఁ దగన్. 521

వ. తొల్లి భగవంతుం డగుశశాంకశేఖరుం డుద్వాహానంతరంబునఁ బార్వతీసహితంబుగా సమాహితమనస్కుండై యిచ్చట నఖండచండనిష్ఠాసౌష్ఠవంబేర్పడఁ దపంబుఁ జేయుచుండ నప్పుడు సురప్రార్థితుండై కందర్పుండు దర్పం బేర్పడ నహంకరించి దర్పించిన నద్దేవదేవుండు కినుక పొడమినచిత్తంబున మూఁడవ కన్నువిచ్చి చిచ్చురలం జూచి హుంకరించినఁ దదీయనేత్రానలజ్వాలాజాలదందహ్యమానశరీరుం డై యక్కాముఁడు నాటంగోలె యనంగుఁ డనం బరఁగె నిచ్చట మదనుం డంగవిమోచనంబుఁ జేసెం గావున నీవిషయం బంగవిషయం బన విశ్రుతి వహించె నీయాశ్రమం బాదికాలంబున శంకరస్థానం బనం బరఁగ నిప్పు డయ్యాదిదేవునిశిష్యులు పరమఋషులు ధర్మపరు లిచ్చట నున్నవా రిచ్చట వసించువారికిఁ బాపంబు లే దని శివునివచనంబు గలదు కావున. 522

తే. నరవరకుమార యీరెండునదులనడుమఁ, బొల్పుపావన మైనతపోవనమున
నేఁటిరాత్రిముదంబుననిలిచి యెల్లి,మిహిరుఁ డుదయించునంతను మేలుకాంచి.

తే. స్నాన మొనరించి జపియించి సముచితముగ
వహ్నికార్యంబు సలిపి యవ్వేల స్రవంతి
దాఁటి తాపసాశ్రమము లందంద చూచి
కొనుచు మాయాశ్రమమునకుఁ జనుద మనఘ. 524

వ. అని పలికి యవ్విశ్వామిత్రుండు తదనుమతంబున మనోజ్ఞం బైనగంగాసరయూమధ్యప్రదేశంబున నివసించి యుండ నప్పుడు. 525

ఉ. అచ్చటఁ దాపసప్రవరు లద్భుతశీలుని గాధినందనున్
వచ్చినవానిఁగా నెఱిఁగి వన్యఫలంబులు సంగ్రహించి తా

రచ్చుపడంగ సప్తువరసాతినవీకృతమానసాబ్జు లై
చెచ్చెర వచ్చి యుక్తనిధిచే నిడి రాసన మర్ఘ్యపాద్యముల్. 526

తే. అంచితంబుగ నిట్లు పూజించి భక్తి, ఫలము లర్పించి పదపడి భానువంశ
శేఖరులకు యథావిధిఁ జేసి రపుడు, తాపసోత్తము లతిథిసత్కారములను. 527

వ. ఇట్లుచితసత్కారంబులఁ గావించి. 528

ఆ. మరల వారు సేయు మహితసత్కారంబు, లందికొని సమాహితాత్ము లగుచు
సముచితముగ మునులు సంధ్య నుపాసించి, పుణ్యకథలఁ గొంతప్రొద్దుఁ బుచ్చి.

క. ప్రియమున వారలఁ దోడ్కొని, రయమున నుటజముల కేగ రమణీయకథా
ధ్యయనముఁ జేయుచు నాపుణ్యయుతులు నాఁ డచట నుండి రతిసుఖలీలన్.

క. మునిపతి విశ్వామిత్రుఁడు, ఘనకృప నెఱిఁగించుఁ బుణ్యకథలు వినుచు నా
జననాథతనయు లానిశ, ననుపమపుణ్యనిశఁ జేసి రద్భుతభంగిన్. 531

వ. ఇట్లారఘుపుంగవులు శీతవాతనీతనవ్యపరిమళాఘ్రాణంబుఁ జేయుచు నుచిత కథావినోదంబుల నారాత్రిఁ గడపి మఱునాఁడు ప్రభాతకాలంబున లేచి యాహ్నికక్రియలు నిర్వర్తించి విశ్వామిత్రసహితు లై యచ్చటిమునులు గఱపిన తెఱంగున యోడ నెక్కి వారలు సంప్రీతితో నొసంగుబహువిధాశీర్వాదంబులఁ గైకొని యమ్మహాత్ముల నానావిధపూజనంబులఁ బరితుష్టులం జేసి యనుజ్ఞఁగొని యమ్మహానదీమధ్యంబునం బోవుచుఁ బ్రావృట్కాలధారాధరగర్జాసముజ్జృంభితం బైనయొక్కనిర్ఘోషంబు వినవచ్చిన నాలించి రాముండు విశ్వామిత్రు నవలోకించి మహాత్మా యొక్కగంభీరశబ్దంబు దుములం బై వినంబడియెనిది యేమికారణంబున నుత్పన్నం బయ్యె నెఱింగింపవే యనియడిగినసకలగుణాభిరాముం డగురామునకు జగత్పవిత్రచరిత్రుం డగువిశ్వామిత్రుం డిట్లనియె.

మ. మనువంశాంబుధిపూర్ణసోమ రఘురామా రాజసుత్రామ పా
వన కైలాసనగంబున న్మను జగద్వంద్యుండు లోకేశ్వరుం
డనఘుం బైనమనంబుచే నొకసరం బాయాఢి నిర్మించె నా
య్యనఁ గీర్తింతురు దాని మానససరం బంచుఁ సురగ్రామణుల్ 533

క. ఆసరసియందు సముదిత, మై సరయు వనంగ నొకమహానది పుణ్య
శ్రీసంతతులకు నెలవై, భాసురముగ నలరు భువనపావని యగుచున్. 534

తే. పరఁగ నన్నది సాకేతపురముఁ దిరిగి, వచ్చి జాహ్నవీనదిలో నవార్యభంగిఁ
గలసె నచ్చటఁ బొడమినఘనతరంగ, ఘట్టనోద్భూతరవ మిది కంటె వత్స. 535

క. వసుధేశతనయ నీ వ, ద్దెసకుం బ్రణమిల్లు మనిన ధీరుఁడు రాముం
డసమానతేజుఁ డాదెస, కనదృశగతి వినతిఁ జేసె ననుజయుతముగాన్. 536

వ. ఇట్లు కృతప్రణాముండై యమ్మహానది నుత్తరించి యవ్వలం బోవుచు రవికిరణంబులకుం జొరవ యీక సాంద్రతరువిటపపలాశపటలపరిచ్ఛన్నం బైనయొక్క

వనంబు విలోకించి విశ్వామిత్రునిం జూచి మహాత్మా యిమ్మహాగహనంబు మత్తవేదండశుండాదండకాండాభిహతమహానోకహమండలం బై సింహవ్యాఘ్రవరాహభైరవనిర్ఘోషభీషణం బై మృగేంద్రనఖవిదళితమత్తమాతంగకుంభపరిపతితనూతనముక్తాఫలవిరాజితవనాంతం బై దారుణారావనానాపతత్త్రికంఠకుహూకారం బై ఝిల్లికాగణనాదితం బై గంభీరస్వనశ్వాపదసంపూర్ణం బై ధవాశ్వకర్ణకకుభబిల్వతిందుకపాటలబదరీసంకీర్ణం బై దుష్ప్రవేశం బై యున్నయది దీని తెఱం గెఱింగింపవే యని యభ్యర్థించిన నమ్మునిమండలాఖండలుండు రఘువంశపద్మినీమార్తాండున కిట్లనియె. 537

శా. కాలాంభోధరతుల్యమూర్తి గిరిసంకాశుండు వృత్రుండు శౌ
ర్యాలంకారుఁడు దొల్లి ఘోరతప ముద్యత్ప్రీతిఁ గావింపఁగా
నాలోకించి బలాంతకుం డలుకతో నాభీలవజ్రాహతిన్
వేలోపాంతనితాంతకాననమున న్వే ద్రుంచెఁ దన్మూర్ధమున్. 538

ఉ. త్రుంచినయంతలో హరికిఁ దోడనె గ్రక్కున బ్రహ్మహత్య ప్రా
ప్తించినఁ జూచి తాపసులు దేవతలున్ వగ గూర నాత్మఁ జిం
తించి యఘాపనోదనవిధిం దగుభంగిఁ బ్రబుద్ధులై విచా
రించి బలారి నీకు నిలింపులు దోడ్కొని వచ్చి సమ్మతిన్. 539

తే. కలశతటినీజలంబు లంగమునఁ జిలికి, బాధకం బైననిర్జరనాథగాత్ర
కలితమలముఁ గరూశంబు నలఘుభంగి, నిచట విడిపించి ప్రీతులై రెల్లవారు.

ఆ. అటుల నిర్మలాత్ముఁడై నిష్కరూశుఁడై, పాకశాసనుండు భవ్యుఁ డగుచు
మునులు దేవతలును మోదింప భాసిల్లె, హిమము విరియ వెలుఁగునినునికరణి.

వ. ఇట్లు కృతార్థుం డై మహేంద్రుండు మదీయాంగమలకరూశంబుల ధరించినవోట నీజనపదంబులు మలదకరూశనామంబులం బ్రసిద్ధికి నెక్కుం గాక యని యిద్దేశంబునకు వరం బొసంగిన. 542

చ. అనిమిషు లవ్విధంబు విని హర్షము మీఱఁగ నాబలాంతకుం
బనిగొని సాధువాక్యములఁ బ్రస్తుతిఁ జేసి సురాధినాథ నీ
వనిన తెఱంగునన్ శుభములై ధనధాన్యసమృద్ధి నిమ్మహా
జనపదముల్ సమస్తగుణసంపదలం జెలువారు నిత్యమున్. 543

విశ్వామిత్రుఁడు రామునికిఁ దాటకావృత్తాంతంబుఁ దెల్పి దానిఁ జంప నియోగించుట

వ. అని పలికి బృందారకబృందంబు పురందరసహితం బై దివంబునకుం జనియె నంతఁ గొంతకాలంబునకు సుందుం డనువానిభార్య తాటక యనునొక్కయక్షి కామరూపిణి యై వేయుమదపుటేనుంగులకుం గలబలంబు గలిగి తన పుత్త్రుండగు మారీచుం డనురాక్షసుని శక్రతుల్యపరాక్రముని మహాబాహుని గిరిసంకాశదేహుని విపులాంసుని మహాశీర్షునిం గూడి మలదకరూశ

సంజ్ఞలం గల యీజనపదంబుల రెంటి నాక్రమించి నిత్యంబు వినాశంబు నొం
దించుచుం దపోధనుల హింసించుచు దుష్టచారిణియై సార్ధయోజనమాత్రంబు
దవ్వుల కాంతారమార్గంబు నిరోధించి యున్న దీయక్షిచేత విజనీకృతం బైన
యీగహనంబు విడిచి దేశోపప్లవంబుకంటె మున్ను నివసించి యున్నజనం
బిప్పటికిని మరలం బ్రవేశింప కున్నది గావున. 544

సీ. మనుజేంద్రనందన మున్నియోగంబున నాత్మీయభుజబలం బాశ్రయించి
యీదుష్టచారిణి నీయక్షి వధియించి నేఁడె యీదేశంబు నిర్భయంబుఁ
గాఁ జేయు మిమ్మహాకాంతారమును జొరవెఱతు రింద్రాదిదిగ్వరులు దీని
వలనిభయంబున వాఁడి దీపింపంగ దీని నోర్చెడునట్టి ధీరు నెందుఁ

తే. గాన మంబకహాతి దీనిఁగడపి పుచ్చి, పుడమి నత్యంతవిఖ్యాతి వడయు మయ్య
తెలియఁ జెప్పితి నీకు నీదేశవిధము, రమ్యగుణసాంద్ర రాజేంద్రరామచంద్ర.

క. అని యప్రమేయుఁ డగున, మ్మునిపతి వల్క విని రాజపుత్త్రుఁడు రాముం
డనియెం గ్రమ్మఱ వానికి, ఘనవిస్మయ మాత్మలోన గడలుకొనంగన్. 546

తే. అనఘ యక్షులు ధాత్రిలో నల్పసత్త్వ
లనఁగ విని యుందు నబల కట్లనుపమాన
మదకరిసహస్రసత్త్వ మేమాడ్కిఁ గలిగెఁ
గరుణ దళుకొత్తఁ దెల్పుము గాధితనయ. 547

వ. అని యడిగిన విదితాత్ముం డగురాముని వచనంబు విని విశ్వామిత్త్రుం డది
యొక్కవరప్రభావంబునం గలిగిన సత్త్వం బత్తెఱం గెఱింగించెద విను మని
యి ట్లనియె. 548

చ. అలఘుయశుండు ధార్మికుఁడు యక్షవరుండు సుకేతునామకుం
డలరు నొకం డతండు తనయార్థముగా నతిఘోరనిష్ఠతో
జలజభవుం గుఱించి ముని సంయమి యై బహువర్షముల్ దమం
బెలవడ సాంద్రదుర్గగహనాంతరసీమఁ దపంబుఁ జేయఁగన్. 549

ఉ. మెచ్చి పయోజసంభవుఁ డమేయకృపాకలితాంతరంగుఁ డై
వచ్చి కుమారు నీక వెస వానికిఁ బుత్త్రిక నిచ్చి సమ్మదం
బచ్చుపడంగ దానికి సహస్రమదావళసత్త్వ మిచ్చి తా
మెచ్చుగఁ దాటకాఖ్య నిడి మెల్లన నేఁగె సుపర్వయుక్తుఁ డై. 550

వ. అంత సుకేతుండు రూపయౌవనశాలి యగుతనపుత్త్రికను దాటకను ఝర్ఝ
పుత్త్రుం డగుసుందునకుం బత్నిగా నొసంగినంతఁ గొండొకకాలంబునకు నయ్యక్షి
మారీచుం డనునాని నొక్కకొడుకుం బడసి సుందుండు నిహతుం డై నయనం
తరంబ పుత్త్రసహిత యై వనంబునం జరించుచు నొక్కనాఁడు జాతసంరంభ
యై గర్జించుచు భిక్షార్థం బగస్త్యమునీంద్రునిపైఁ గవిసిన నమ్మహానుభావుండు.

మ. కడక న్నెత్తఁగఁ జేసి రాక్షసుఁడవుం గన్గొంచు మారీచునిం
గడునల్కన్ శపియించి తోడనె జగత్కళ్యాణుఁ డత్తాటకం
గడిమిన్ దారుణసత్త్వయై వికటరాక్షస్యాకృతిం దాల్చి కా
అడవిన్ మర్త్యులఁ దించు నుండు మని కోపాటోపుఁ డై తిట్టినన్. 552

క. ఆపాపయక్షి యీగతి, శాపకృతామర్ష యగుచు జల మడరఁగఁ ద
త్తాపసవరచరితం బగు, నీపావనవనమునన్ రహిం జరియించున్. 553

క. క్షితివరసుత నీ వీదు, ర్మతిని దురాధర్ష దుష్టరాక్షసిని మహో
ద్ధతసత్త్వను గోబ్రాహ్మణ, హితార్థము వధింపు మయ్య యినకులతిలకా

తే. అనఘ శాపసంస్పృష్టయైనట్టి దీనిఁ, జంప ముల్లోకములయందుఁ జాలినట్టి
ఘనుఁడు పురుషుఁ డొక్కరుఁడైనఁ గానఁబడఁడు,లోకసన్నుత నీవొక్కరుఁడవు దక్క.

మ. వనితం జంపుట నీతి గా దనుచు భావంబందు రాజేంద్ర నీ
వనుమానించెద వేమొ ధాత్రిజనరక్షాదక్షుఁ డౌ శ్రేనికి
స్బనిగా దౌష్ట్యము గల్గుచోఁ బురుషు నైనం గాంత నైనం దగన్
ఘనవర్ణాశ్రమరక్షణార్థము వడిన్ ఖండింప ధర్మం బగున్. 556

చ. వెదకి దురాత్ములం దునిమి పీరత నాథులఁ బ్రోచు టెంతయు
న్మదనసమానసుందర సనాతనధర్మము రాజమాళికి
న్నదమలకీర్తి గల్గు వృజినంబు ఘటిల్లదు కావునం బటు
ప్రదరహతిన్ జగంబు లలరన్ వడిఁ ద్రుంపుము దీని నుద్ధతిన్. 557

చ. మును పృథివిన్ వడిం జెఱుపఁబూనినదాని విరోచనాఖ్యనం
దని నలఘుందరం దునుమఁడా మఘవుండు జగం బపాకసూ
దనముగఁ జేయఁ బూనినయధర్మవిచారిణి గావ్యమాత ప
ద్మనయనుచే రహిం దెగదె దాశరథీ వినమే తదర్థముల్. 558

వ. మఱియు ధర్మపరిపాలనతత్పరు లగుమహాత్ములు మహీపతులు పెక్కండ్రధర్మనిరతు లగుయువతులఁ బెక్కండ్ర వధించిరి కావున నీవును సంశయంబు వదలి దుష్టచారిణి యగుదీనిం జంపి లోకంబులకుఁ బరమకల్యాణంబు సంపాదించి కీర్తి వడయు మని పలికిన నక్లీబం బగుమునివచనంబు విని దృఢవ్రతుం డగు రాఘవుండు ప్రాంజలి యై వెండియు ని ట్లనియె. 559

ఉ. తాపసరాజుమాట జవదాఁటక చేయుము రామ యంచ యో
ధ్యాపురమందు సద్గురుసభాంతరమందు మహాత్ముఁ డైనధా
త్రీపతిచేత నేను నుపదిష్టుఁడ నైతిని వచ్చువేళ భా
షాపతితుల్య యప్పలుకు సత్యము మీఱఁగ రాదు నాకికన్. 560

ఉ. కావున మద్గురుం డనినకై వడి నీదగుశాసనంబునం
గావర మెత్తి లోకములఁ గాఱియపెట్టుచు నున్నతాటకన్

వే వధియించి గోవులకు విష్టపపఙ్క్తికి విప్రకోటికిన్
ధీవర మేలుఁ జేసి జగతిన్ సహనీయయశంబుఁ గాంచెదన్. 561

### శ్రీరాముఁడు తాటకను సంహరించుట

వ. అని పలికి యరిందముం డగు రాముండు మహనీయశరాసనంబు లీలం గేల నందుకొని ముష్టి నలవరించి తీవ్రంబుగా గుణప్రణాదంబుఁ జేసిన. 562

శా. ఘోరం బై నతదీయనాదము కులక్షోణీధ్రభాస్వద్గుహా
ద్వారోద్యత్ప్రతిశబ్దమున్ దళితదిగ్దంతావళాఘోషమున్
దోరంబై కుహరంబు నిండఁ బరవం దోడ్తో నభోభూదిశా
పారావారవిహారజంతువులు విభ్రాంతాత్ములై రంతటన్. 563

క. ఆరావము వీనులకుఁ గఠోరం బై యురమునకుఁ బటుప్రోదిని యై
కారింప మదవిఘూర్ణిత, ఘోరానన యగుచు యక్షి క్రోధవివశ యై. 564

మ. ఎలమిం బాదయుగాహతిన్ క్షితితలం బిట్టట్టు నజ్జాడఁగాఁ
ప్రళయాబ్దంబువిధంబునన్ భయదశుంభద్భూరిగర్జాధ్వనుల్
సెలఁగన్ మార్వినినాద మెందుఁ బొడమెన్ శీఘ్రంబ యచ్చోటికిన్
గుల శైలాకృతి నేగుదెంచెఁ గన్నులన్ ఘోరాగ్నికీలల్ వడన్. 565

ఉ. భూరినిశాతఖడ్గములపోలిక నొప్పుమహోగ్రదంష్ట్రలున్
దారుణభంగి నూతులవిధంబునఁ గ్రాలెడువృత్తనేత్రముల్
ఘోరనినాదముల్ సెలఁగఁ గోపమునన్ దనపైకి వచ్చుదు
శ్చారిణి యక్షిఁ జూచి రఘుచంద్రుఁడు లక్ష్మణుతోడ నిట్లనున్. 566

క. కనుఁగొంటె లక్ష్మణా యీ, దనుజని ఘోరమగు మేనుఁ దప్పక దీనిన్
ఘనభీషణవక్త్రము గనుఁగొనినంతనె యలఁతివారిగుండె లవియు వే. 567

సు. గజితం జంపుట పాడిగాదు జగముల్ గైవారముల్ సేయ భీ
కరఖడ్గంబున దీనిముక్కు సెవులన్ ఖండించి తోడ్తోడ దు
ర్భరసత్త్వంబును దేజమున్ గతియు శౌర్యంబున్ హరింతున్ దివా
కరవంశోత్తమ చూడు మిప్పుడు సమగ్రం బైనమద్వీర్యమున్. 568

వ. అని రాముండు వల్కుచుండ నప్పుడు నిశాటి యగు తాటక క్రోధమూర్ఛిత యై యాటోపంబున భుజంబు లెత్తి గర్జించుచు నారఘుపుంగవుని డాయ వచ్చిన తెఱంగు విలోకించి బ్రహ్మర్షిపుంగవుం డగు విశ్వామిత్రుండు దాని హుంకారంబున నదల్చి రాఘవులకు స్వస్తి యగుఁ గాక విజయంబు గల్లుం గాక యని పల్కె నంత నయ్యక్షి యక్షీణబలంబున సాంద్రరజోవృష్టి ఘోరంబుగా నారాఘవులం బొదివి యొక్కముహూర్తంబు నిరంతరరజోమేఘంబున దెగడుపఱచి పదంపడి మాయఁ బన్ని నీరంధ్రంబు నాశిలావర్షంబుఁ గురిసినం గోపించి. 569

క. రాముఁడు శరవర్షంబున, భీమశిలావృష్టి మాన్చి పృథుకాండములన్

యూమవతీచరిభుజములు, భూమిఁ దునిసి పడఁగ నేసె మునిపతి మెచ్చన్.

ఉ. తోఁపనె లక్ష్మణుండు ముదితుం డయి రాక్షసికర్ణనాసముల్
వాఁడిఁ జెలంగుఖడ్గమున వారక గాధిసుతుండు మెచ్చ తా
నోడక నంటఁ గోసి రయ మొప్ప విరూపిణిఁ జేసె మింటిపై
వేడుక మీఱ నిర్జరులు వేయుముఖంబుల సన్నుతింపఁగన్. 571

సీ. అంతఁ దాటకకోప మగ్గల మై పర్వఁ గామరూపము లనేకములఁ దాల్చి
మింటిపై కెగసి భ్రమించుచుఁ దనమేను గన్పడకుండఁగ గాఢభంగి
జీఁకట్లు సేయుచు శిలలు పై నువ్వుచు రజము రేఁపుచు సాంద్రరక్తవృష్టి
గురియుచు మేఘంబుకరణి గర్జించుచు నట్టహాసముఁ జేయ నపుడు తెలిసి

తే. యశ్మవృష్టివికీర్యమాణాంగు లైన, మనుజపతినందనులఁ జూచి మునికులాబ్ధి
హరిణధరుఁడువిశ్వామిత్రుఁడమితయశుఁడు, హితముదీపింపమెల్లన నిట్టులనియె.

చ. ఇనకులసార్వభౌమ తడవేల దినేంద్రుఁడు గ్రుంకుచున్నవాఁ
డనుపమసంధ్య వచ్చె నసురాలికి రాత్రులయందు సత్వముల్
ఘనతరతేజ మెక్కుడగుఁ గావున వే దెగఁ జూడు దీని స
జ్జనులకు బాధఁ జేసెడునిశాచరిపైఁ గృపఁ గూర్ప నేటికిన్. 573

క. ఈయక్షి మునివరేణ్యుల, సేయుమఖంబులకుఁ గీడు సేయుచు నుండున్
వే యేల లోకహిత మిది, పాయక తెగఁ జూడు దీని భ్రమము గలుగున్.

వ. అని పలికిన నవ్విశ్వామిత్రుని వచనంబు విని సంశయంబు వదలి తీవ్రం బగు వీర్యం బంగీకరించి శబ్దవేధిత్వంబుఁ జూపుచు సాంద్రంబుగా శిలావర్షంబు గురిసెడుతాటకమీఁద నాయకపరంపరలఁ బరఁగించి యవరోధించిన నది శరజాలపరీత యై మాయాబలవిశేషంబునం దెరల్చుకొని గర్జించుచు నశనికరణి శీఘ్రజవంబున రామలక్ష్మణులం బట్టుకొనం గమకించిన దానిం జూచి రాముండు రయంబున నొక్కశిలీముఖంబు దానియురంబు గాడ నేసిన నయ్యమ్ముతాఁకున కోర్వక యక్షి తత్క్షణంబ నోఁజుచుఁ బుడమిం ద్రెళ్లి విగతప్రాణ యయ్యె నయ్యద్భుతకర్మంబు విలోకించి పురందరుండు బృందారకసందోహసహితుం డై సాధువాక్యంబుల నభినందించుచు నచ్చటికిం జనుదెంచి రామలక్ష్మణుల నుచితభంగిం బూజించి పదంపడి విశ్వామిత్రు నర్హవిధంబునం బూజించి మందమధురాలాపంబులం బ్రస్తుతించి పరమప్రీతుం డై యి ట్లనియె. 575

దేవేంద్రుఁడు ప్రీతుఁడై కౌశికునితో కృశాశ్వపుత్రుల రాముని కొసంగు మనుట.

సీ. మునినాథ నీమహాద్భుతదివ్యచారిత్రమహిమ నుతింపంగ మాతరంబె
యారాఘవునిచేత నేపారుతాటకఁ ద్రుంపించి కరుణ ముజ్జగములకును
మేలుఁ గావించితి మే మందఱము నిర్భయానందపరుల మై యలరఁ గంటి
మిత్రుఁడు నిర్జరులకు హితముఁ జేయఁగఁ బుట్టినట్టిసుహాయుం డట్లు గాన

తే. మున్ను నీవు తపోబలంబునఁ బడసిన
ధన్యుల భృశాశ్వకార్శ్మినందనుల నస్త్ర
శస్త్రగాత్రుల సముదగ్రశౌర్యనిధుల
నితని కొసఁగుము వేర్వేఱ యింపు మెఱయ. 576

క. అని పలికి గాధితనయుని, వినుతించి తగఁగ రఘుప్రవీరుం డగురా
ముని వినుతించుచు సురపతి, చనియె న్సురకలితుఁ డగుచు సమ్మోదమునన్.

తే. అంతఁ దాటకావనవాసు లైనమునులు
భక్తిఁ జనుదెంచి కౌశికుఁ బ్రస్తుతించి
రాము నాశీర్వదించి యశ్రాంత మింకఁ
దపములు ఫలించె నని పల్కి తలఁగి చనిరి. 578

వ. అంత విశ్వామిత్త్రుండు తాటకావధతోషితుం డై జగత్పవిత్త్రుం డగు కౌసల్యాపుత్త్రుని బాహువులం బరిరంభించి శిరంబు మూర్కొని మందమధురాలాపంబుల ని ట్లనియె 579

తే. అమరదూషిణి యైనయాయక్షిఁ జంపి
రవికులోత్తమ నీవు త్రిభువనములకు
నేఁడు మితి లేనిప్రమదంబు నించినాఁడ
వింక నీ కుర్వర నసాధ్య మెద్ది లేదు. 580

ఆ. ఇనుఁడు గ్రుంకె సంధ్య యేతెంచె నీరాత్రి, నిచట నధివసించి యెల్లి గదలి
పోద మస్మదీయ పుణ్యాశ్రమమునకు, నచటివారు లెల్ల హర్ష మొంద. 581

క. నా విని సంతోషము మది, నావిర్భవ మంద రాముఁ డయ్యామినియం
దావిపినమున వసించెను, ధీరుం డగులక్ష్మణుండు ధృతి సేవింపన్. 582

తే. దేవతల కైనఁ జొరరాని యీవనంబు, ముక్తశాప మై నరమృగమునివరులకు
సులభ మై చాల నవ్వేళఁ జూడ నొప్పె, రమ్యతర మైన యలచైత్రరథముకరణి.

వ. ఇ త్తెఱంగున నారఘుసత్తముండు తాటకం బరిమార్చి సురసిద్ధసంఘంబులచేతఁ బ్రశస్యమానుం డై విశ్వామిత్రలక్ష్మణసహితంబుగా నారాత్రి యచ్చట సుఖలీల నిద్రించి మఱునాఁడు ప్రభాతకాలంబున మేలుకాంచె నంతకు మున్న మేల్కొని గాధేయుండు కరుణావిధేయుం డై రామభద్రు నవలోకించి మధురాక్షరవ్యక్తంబుగా ని ట్లనియె. 584

విశ్వామిత్త్రుఁడు శ్రీరామునకు భృశాశ్వాపత్యంబు లగుసమస్తాస్త్రంబుల నొసంగుట.

ఉ. తామరసారితుల్యశుభదర్శన దారుణశత్త్రుకర్శనా
రామ దినేశ్వరాన్వయలలామ భవన్మహనీయవిక్రమం
బే నని చెప్ప వచ్చు మది కిం పొనరించెఁ గృపాప్తి నీ కికం
బ్రేమ నొసంగెదం గనుము పెం పలరంగ భృశాశ్వపుత్త్రులన్. 585

చ. నరసురయక్షకింపురుషనాగనభశ్చరసిద్ధసాధ్యఖే
చరగరుడాసురాద్యగుల సంగరరంగమునం జయించి సు
స్థిరజయలక్ష్మిఁ జేకొనఁగఁ జేయుప్రభావము గల్గునట్టిభీ
కరనిఖిలాస్త్రశస్త్రములఁ గైకొను మిచ్చెద నిష్టసిద్ధికిన్. 586

వ. అని పలికి జలంబు లుపస్పృశించి ప్రసన్నవదనుం డై నియమంబున సర్వాస్త్రమంత్రంబులు సంస్మరించుచుఁ దనయట్ల ప్రక్షాళితపాణిపాదుం డై శుచి యై చనుదెంచినరామభద్రునిఁ బ్రాఙ్ముఖంబుగా నాసీనుం జేసి క్రమక్రమంబున దండచక్రంబును ధర్మచక్రంబును గాలచక్రంబును విష్ణుచక్రంబును నైంద్రాస్త్రంబును వజ్రంబును శైవం బగుశూలంబును బ్రహ్మశిరంబును నిషీకంబును బ్రహ్మాస్త్రంబును మోదకీశిఖరీనామకం బైనగదాయుగ్మంబును ధర్మపాశంబును గాలపాశంబును వరుణపాశంబును శుష్కార్ద్రనామకం బైనయశనిద్వయంబును పైనాకం బైనయస్త్రంబును నారాయణాస్త్రంబును నాగ్నేయాస్త్రంబును శిఖరంబును వాయవ్యాస్త్రంబును బ్రథనంబును హయశిరంబును గ్రౌంచాస్త్రంబును విష్ణుశక్తి రుద్రశక్తి నామకశక్తిద్వయంబును మఱియు నసురులు ధరించునట్టికంకాళముసలకాపాలకంకణంబులును వైద్యాధరాస్త్రంబును నందనాస్త్రంబును నసిరత్నంబును గంధర్వాస్త్రంబును మానవంబును బ్రస్వాపనప్రశమనంబులును సౌర్యాస్త్రంబును దర్పణంబును శోషణంబును సంతాపనవిలాపనంబులును మదనంబును పైశాచాస్త్రంబును మోహనంబును సౌమనంబును తామసంబును సంవర్ధనంబును మౌసలంబును సత్యాస్త్రంబును మాయాధరంబును దేజఃప్రభంబును బరతేజోపకర్షణం బగుసోమాస్త్రంబును శిశిరాస్త్రంబును ద్వష్ట్రుదేవతాకం బైనయస్త్రంబును సుదామనంబును దారుణం బగుభగాస్త్రంబును శితేషువును మానవాస్త్రంబును మొదలుగాఁ గల యనేకదివ్యాస్త్రశస్త్రంబు లుపదేశించి యమ్మునిపుంగవుం డమ్మహాస్త్రంబు లన్నియు రామాధీనంబులు గావించుటకుఁ గ్రమ్మఱసంస్మరించి మంత్రగ్రామం బంతయు జపియించిన నవి యన్నియు నవ్విశ్వామిత్రునిచేత ననుమతి వడసి భీమముఖంబులును విజయసంపాదనంబులును దంష్ట్రాకరాళవక్త్రంబులును జ్వలనజ్వాలాభీలంబులును విస్ఫులింగపటలీసంచారఘోరంబులును జైత్రంబులును భీషణప్రతాపదుర్నిరీక్షంబులును బ్రచండతేజఃకలితంబులును భయంకరాకారంబులును నానావర్ణరూపంబులును నై రాముని ముంగలం బొడసూపి కేలు మోడ్చి ఫాలంబునం జేర్చి యిట్లనియె. 587

క. ఏపగిదిఁ జరింతుము మే, మేపగతునిమీఁదఁ జనుదు మెయ్యది పని మా
కీపట్ల నతసమస్తో,ర్వీపా నీకింకరులము కృప నేలు మిఁకన్. 588

క. అన విని రాముఁడు వానిని, దనకరమున సంస్పృశించి తప్పక మిమ్ముం
బని గలయప్పుడు చిత్తం,బునఁ దలఁచెద నపుడు రం డిపుడు పొండు రహిన్.

క. నా విని యయ్యస్త్రంబులు, భావంబునఁ బొంగి రాముపాదంబులకుం
సేవలభక్తి నమస్కృతిఁ, గావించి యథేచ్ఛఁ జనియెఁ గౌతుక మలరన్. 590

తే. అంత రఘుపతిముఖమున హర్ష రేఖ, గనుపడ మునీశ్వరునిపాదకమలములకు
వందనముఁ జేసి పేశలవాగ్విభూతి, వెలయు మధురోక్తి నిట్లని విన్నవించె.

తే. అనఘ సర్వాస్త్రకుశలుండనై తినీదు, కరుణముల్లోకములయందు నిరుపమాన
మహిమ వడసితి నింక నసుంచితముగ, నస్త్రముల కుపసంహార మానతీవె.

మ. అపు డిట్లారఘునేత వల్క విని బ్రహ్మోభుండు గాధేయుఁ డో
నృపవంశోత్తమ యస్త్రకోటికి నయం బేపార జన్మంబులం
దుపసంహార మెఱింగికొంటె యను వై యొప్పారునంప్రీతితో
నపురూపంబుగ నిచ్చెదం గొనుము సంహారాస్త్రముల్ చెచ్చెరన్. 593

వ. అనిపలికి ధారణశక్తియు క్తుండును సువ్రతుండును శుచియు నగువిశ్వామిత్రుండు సత్యవంతంబును సత్యకీర్తియు ధృష్టంబును రభసంబును బ్రతిహారతరంబును బరాఙ్ముఖంబును నవాఙ్ముఖంబును లక్షాక్షవిషమంబులును దృఢనాభసునాభ పద్మనాభమహానాభదుందునాభంబులును దశాక్షశతవక్త్రదశశీర్షశతోదరంబులును జ్యోతిషంబును గృశనంబును నైరాశ్యంబును విమలంబును యోగంధరంబును హరిద్రంబును దైత్యప్రశమనంబులును సార్చిర్మాలియు ధృతిర్మాలియు వృత్తిమంతంబును రుచిరంబును బిత్ర్యసౌమనసంబును విధూతమకరంబులును గరవీరకరంబును ధనధాన్యంబులును గామరూపంబును గామరుచియు మోహంబును నావరణంబును జృంభకంబును సర్వనాభంబునుసంతానవరణంబులు మొదలుగాఁ గలపరమభాస్వరులఁ గామరూపుల భృశాశ్వతనయుల దివ్యదేహుల నొసంగి యి ట్లనియె. 59[illegible]

తే. అనులగుణపాత్రభూతుండ వగుటఁ జేసి, నీకు నొసఁగితి నీయస్త్రనిచయ మెల్ల
సమ్మతిఁ బ్రతిగ్రహింపుముసంతతంబు,శుభము వీర్యంబు తేజంబుసుఖముగలుగు.

క. అని పలుక నపుడు రాముఁడు, మునిదత్తభృశాశ్వసుతుల మునుకొని మోదం
బునఁ గైకొని ఘనతేజ[illegible] జూడఁగ నొప్పె నుదితపూషునిభంగిన్. 596

సీ. ప్రళయకాలాభీలపావకార్చులభంగిఁ గమలమిత్రుని మయూఖములమాడ్కిఁ
గమనీయరాకేందుకరములకై వడి దీప్తఖద్యోతదీధితులరీతి
లలితక్షణప్రభాలతికలసొబగున గాఢాంధకారసంఘములకరణి
భీమకాంగారకాభీలరోచులయట్లు సముదగ్రధూమజాలములపగిదిఁ

తే. జతురమునిదత్తదివ్యాస్త్రశస్త్రములటు
మూర్తిమంతంబులై రామమూర్తిమ్రోల

నిలిచి సేవాంజలులఁ జేసి నిరుపమాన
లలితసుమమంజులోక్తులఁ బలికె నపుడు. 597

వ. దేవా యేము భవదీయశాసనంబు శిరంబున నిడికొని యెద్ది పంచినఁ జేయం గలవార మానతిండనిన నారఘునందనుండు మునిపతిమంత్రప్రభావంబునకచ్చెరు వొందుచుఁ బని గలయప్పుడు మిమ్ముం దలంచెద నప్పుడ వచ్చి యభిమతార్థసిద్ధిఁ జేయుం డని పలికి బహుమానపురస్సరంబుగా ననిచిన నయ్యస్త్రంబులు రామున కభివాదనంబుఁ జేసి యతనిచేత ననుజ్ఞఁ గొని యట్ల చేసెద మని పల్కియదృశ్యం బనియె నంత నారాముండు తనకు విశ్వామిత్రుండు గృపనొసంగిన శస్త్రాస్త్రంబు లన్నియు లక్ష్మణున కుపదేశించి లక్ష్మణోపేతుం డై విశ్వామిత్రసహితంబుగా నచ్చోటుఁ బాసి యవ్వల రమ్యంబు లైన తాపసాశ్రమంబులు విలోకించుచుం జని చని యొక్కచోట సుమనోవిరాజితం బై పుణ్యజనసమాకీర్ణం బై ఖగసంచారకమం బై యనంతలక్ష్మీవిరాజమానం బై మునీంద్రవాణీవిలాసం బై స్వర్గలోకంబుభంగిఁ జైత్రరథంబుమాడ్కి వియన్మార్గంబుకరణి వైకుంఠంబుకై వడి సత్యలోకంబుచందంబున మనోరమం బై దివ్యం బై భవ్యం బై సేవ్యం బై దర్శనీయం బై దూరవాసితాపసప్రవేశసంకులం బై యొక్క పర్వతసమీపంబున నొప్పునొక్కమహనీయతపోవనంబు విలోకించి విశ్వామిత్రున కి ట్లనియె. 598

చ. అనఘ మహానుభావ కరుణాభరణా మునివంశవర్య యీ
వనమునఁ గల్గుపక్షిమృగవర్గ మనర్గళభంగి నొప్పెడుఁ
ఘనతరవేదమంత్రముల గానముఁ జేయుచు నున్న వేతపో
ధనుఁడు వసించుయాశ్రమపదం బిది దీని తెఱంగుఁ జెప్పవే. 599

సీ. అనఘాత్మ, నీదు దివ్యాశ్రమం బెయ్యది యలరారు నెచ్చోట యజ్ఞవాటి
యజ్ఞవిఘ్న మొనర్చు నట్టిపాపాత్ములు దితిపుత్రులు వసించు దేశ మెద్ది
యెచ్చోటనుండి వా రేతెంతు రిచటికి నెవ్విధంబునఁ జరియించువారు
సవనంబుఁ జేయించు సంయము లెవ్వార లిచ్చటి కాదేశ మెంత దవ్వు

తే. నిర్జరారుల వధియించి నీసుఖంబు
కడమ పడకుండఁ గాచు టో గాధితనయ!
నాకు వలసినకార్యంబు నయ మెలర్ప
నన్నియును మాకుఁ గృప మీఱ నెన్ని చెపుము. 600

విశ్వామిత్రుఁడు రామునకుఁ దనదగు సిద్ధాశ్రమముయొక్క ప్రభావం బెఱింగించుట.

క. అని యడిగిన నద్దశరథ, జననాథకుమారుఁ జూచి సమ్మోదమున
న్మునికులశేఖరుఁ డి ట్లని, వినిపింపఁ దొడంగె నపుడు విపినక్రమమున్. 601

చ. అనఘ రమాధినాథుఁ డగు నచ్యుతుఁ డీవిపినంబునందు న

త్యనుపమఘోరనిష్ఠ చెలువార సమస్తజగద్ధితంబుగా
మును బహుదివ్యవర్షము లమోఘతపం బొనరించె రాజనం
దన యిది వామనాశ్రమ మనంగ రహిం దనరారు నుర్వరన్. 602

ఆ. రామ యిచటఁ దొల్లి రాజీవనేత్రుండు, విపులనిష్ఠ ఘోరతపముఁ జేసి
సిద్ధుఁ డయ్యెఁ గాన సిద్ధాశ్రమ మనంగఁ, బరఁగఁ బేరు వడసెఁ బృథివియందు.

చ. చెలువుగ నీగతిన్ జపము సేయుచు మాధవుఁ డున్నవేళ దో
ర్బలమహిమాధికుండు బలిరాక్షసభర్త విరోచనాత్మజుం
డలఘుయశుండు శక్రుని సురాలి రణంబునఁ దోలి ముజ్జగం
బులఁ గడుమేటి యై త్రిదివము స్వబాహుళద్యుతి నేలుచున్నెడన్. 604

వ. దేవత లందఱు వహ్నిపురోగము లై యిచ్చటఁ దపంబుఁ జేయుచున్న విష్ణు
కడకుం జనుదెంచి దేవా విరోచననందనుం డైన బలి యజ్ఞంబుఁ జేయుచు నర్థి
కు లెద్ది గోరిన దాని నెల్ల నొసంగుచున్నవాఁ డయ్యజ్ఞంబు సమాప్తి నొందిం
పకమున్నె నీవు దేవహితార్థంబుకొఱకు మాయాయోగబలంబున వామ
నత్వం బంగీకరించి దేవతాకార్యంబుఁ దీర్చి యుత్తమం బైనకల్యాణంబుఁ
జేయుము 605

ఆ. అనుచు సురలు వేఁడ నపుడు జితారి యై, కాంత నదితిఁ గూడి కశ్యపుండు
వ్రతముఁ బూని దివ్యవర్షసహస్రంబు, దపము సల్పుటయును దయ దలిర్ప

తే. కమలలోచనుఁ డపుడు సాక్షాత్కరింప
నలరి కశ్యపుఁ డతిభక్తి నెలఁగ మ్రొక్కి
నిగమసూక్తుల వినుతించి నిరుపమాన
పేశలసుధానుయోక్తులఁ బిదప ననియె. 607

వ. దేవా నీవు తపోమయుండవు తపోరాశివి తపోమూర్తివి తపస్స్వభావుండ వట్టి
నిన్ను దుస్తరం బైనతపంబుచేతం గంటిఁ బురుషోత్తముండ వైన నీశరీరంబునం
దుఁ జరాచరాత్మకం బైనజగంబంతయుఁ గానంబడుచున్నది కుక్షినిక్షిప్తా
ఖిలలోకుండ వైన నీ వాదిమధ్యాంతరహితుండవనియు ననిర్దేశ్యుండ వనియును
శ్రుతులు నొడువు నట్టి నిన్ను శరణంబు నొందెద. 608

క. అని నానానూనోక్తుల, వినుతించిన నాత్మ మెచ్చి విష్ణుం డను నో
యనఘ వరార్హుఁడ వైతివి, కొను మిచ్చెద వరము నీకుఁ గుతుకం బెసఁగన్.

చ. అన విని కశ్యపుం డనియె నంజలిఁ జేసి మహాత్మ నాకు నీ
యనిమిషకోటి కీయదితి కంచితభంగి వరం బొసంగు నా
కనుపమబుద్ధి నీ యదితియందుఁ గుమారుఁడ వై బలారి క
ట్లనుజుఁడ వై జనించి పరమార్తుల వేల్పుల నుద్ధరింపుమీ. 610

వ మహాత్మా యిచ్చటఁ దపంబు సిద్ధించుటం జేసి యీదేశంబు సిద్ధాశ్రమం బనం

బడు నని కశ్యపుండు ప్రార్థించిన మహాతేజుం డగువిష్ణుండు భక్తసులభుండు
గావునఁ గశ్యపుండు గోరిన తెఱంగునఁ దత్తేజంబునవదితిగర్భంబునందువామన
రూపంబున నవతరించి యాగదీక్షుం డైనవైరోచనికడకు భిక్షురూపంబునం
జని యతని నడిగి పదత్రయమాత్రంబు ధాత్రిఁ గొని త్రివిక్రమరూపంబున
జగత్త్రయంబు నాక్రమించి బలిని రసాతలంబున నుండ నియమించి క్రమ్మఱ
ముల్లోకంబు లింద్రున కొసంగిన నతండు పూర్వప్రకారంబునఁ ద్రివిష్టపరా
జ్యంబుఁ బరిపాలించు చుండె. 611

తే. మొదల వామనాశ్రమ మనఁ బొగడుఁగాంచి, పిదపసిద్ధాశ్రమంబనఁ బేరువడసె
ననఘచారిత్ర నాఁడు నీయాశ్రమంబె, నేఁడునీయాశ్రమంబెయీ నెలవుదలఁప.

మ. దితిజారాతి తపంబు సల్పి తగ సిద్ధిం గాంచి జంభారికి
న్హితముం జేయఁగఁ జన్నపిమ్మట ముదం బేపారఁ గొన్నాళ్ల కే
నతినిష్ఠం దప మిచ్చట న్సలిపి పద్మాధీశుచందాన సు
స్థితి సిద్ధిం గని క్రొత్తఁ జేసితి సుమీ సిద్ధాశ్రమత్వం బొగిన్. 613

మ. రవివంశోత్తమ యేను దీక్షితుఁడ నై ప్రారంభ మేపారఁగా
సవనం బుద్ధతిఁ జేయఁ బూనిన దురాచారాఢ్యు లై సారెకు
న్దివిషత్కంటకు లేగుదెంచి నడుమ న్విఘ్నంబుఁ గావింతు రా
ర్జవ మొప్పారఁగ వారిఁ ద్రుంచి మఖము న్సాఫల్య మొందింపవే. 614

విశ్వామిత్రుండు రామలక్ష్మణులతోడ స్వకీయాశ్రమంబుఁ బ్రవేశించుట.

చ. ఇదియె మదాశ్రమంబు మనుజేశ్వరనందన రమ్ము పొద మ
భ్యుదయము గల్గు నంచు మునిపూజ్యుఁడు గాధిసుతుండు రామునిన్
సదమలచిత్తు లక్ష్మణుని సమ్మతిఁ దోడ్కొని యాశ్రమోర్వి కిం
పొదవఁ జనె న్పునర్వసుయుతోజ్జ్వలచంద్రునిభంగి నొప్పుచున్. 615

వ. ఇట్లు నిజాశ్రమపదంబుఁ బ్రవేశించినయనంతరంబ. 616

చ. పొరుగిరుగాశ్రమంబులతపోధను లారఘువర్యుల న్మునీ
శ్వరుఁ గనువేడ్క డెందముల సందడిపెట్టఁగ నేగుదెంచి శం
కరనిభు దివ్యబోధఘను గాధిసుతుం దగ సత్కరించి సుం
దరు లగురామలక్ష్మణులఁ దద్దయుఁ బ్రీతి భజించి రెంతయున్. 617

ఆ. అంత నొకముహూర్త మచ్చోట వసియించి, రాజవరాళిసుతు లరాతిదమను
లారఘుప్రవీరు లమ్మునిశార్దూలు, తోడ ననిరి కేలుదోయి మొగిచి. 618

క. ఇప్పుడె దీక్ష వహింపుఁడు, చెప్పెడిదే మింక మీరు సెప్పినకరణిం
దప్పక యీసిద్ధాశ్రమ, మిప్పుడు సిద్ధ మగుఁ గాక హీనగుణాఢ్యా. 619

విశ్వామిత్రుఁడు యాగారంభముఁ జేయుట.

మ. అన నౌఁగా కని మౌనిరాజు కుతుకవ్యాకోచచిత్తాబ్జుఁ డై

మునుల న్రమ్మని చీరఁ బంచి నియమంబుం గ్రాలఁగా యాగదీ
క్ష నితాంతస్పృహఁ దాల్చి మౌనియుతుఁ డై సంపూర్ణయజ్ఞాంగపా
వన మై యొప్పెడుయజ్ఞవేదిపయి భాస్వన్మూర్తి యై యుండఁగన్. 620

వ. రఘునందనులు సమాహితమానస్కు లై యారాత్రిఁ గడపి మఱునాఁడు ప్రభాత కాలంబున లేచి జలంబు లుపస్పృశించి పూర్వసంధ్య నుపాసించి శుచు లై నియమంబునం గ్రాలుచు హుతాగ్నిహోత్రుం డై రెండవ వైశ్వానరుండునుం బోలె వెలుంగుచు వేదిమధ్యంబున నాసీనుం డై యున్నవిశ్వామిత్రునకు నమస్కరించి దేశకాలతత్త్వజ్ఞులును వచనకోవిదులును దివ్యాయుధపరిష్కృతులును బరిపంథిశిక్షాచతురు లగురామలక్ష్మణులు నమ్మహాత్మున కిట్లనిరి 621

క. దానవు లెక్కాలంబున, మానక చనుదెంతు రిటకు మా కేకరణిం
బూని చరియింపఁగాఁ దగు, మౌనికులాధీశ యింత మాకుం జెప్పుమా. 622

క. అని రాజతనయు లడిగిన, విని యచ్చటిమౌను లెల్ల వేమఱు వారిం
గొనియాడి మౌనిచంద్రము, వినుఁ డని యి ట్లనిరి వాక్ప్రవీణత మెఱయన్.

క. అక్షీణమహిముఁ డీముని, దక్షత నేఁ డాదిగాఁగఁ దగ నాఱు నిశ
ల్దీక్షఁ గొని పలుక కుండును, రక్షింపఁగ వలయు నన్నిరాత్రులు మీరల్. 624

ఉ. నా విని రాజపుత్రులు మనంబున నుత్సుక మంకురింప ను
శ్రీ విలసిల్లుభీకరశిలీముఖకార్ముకము ల్ధరించి ర
క్షావిధిఁ గంటికి న్నిదురఁ గానక రేపవ లొక్కరీతిగాఁ
గేవల నిష్ఠఁ గాచిరి జిగీషులు వర్మనిషంగధారు లై. 625

ఉ. ఆరయ యాగ మీకరణి నైదు దినంబులు సెల్లె నంత న
య్యాఱవనాఁడు రాముఁడు మహామతి లక్ష్మణుఁ జూచి రాక్షసు
ల్వారక జన్నముం జెఱుప వత్తురు నేఁ డటు గాన నీవు సొం
పారఁగఁ గాచి యుండవలె నంచు వచించి సమాహితాత్ముఁ డై. 626

క. దానవులఁ దునిమి సవనము, మానక రక్షించి భువి సమంచితకీర్తి
న్మానుగఁ బడసెదఁ గా కని, యానృపమణి గాచి యుండె ననుజయుతుం డై.

క. సోపాధ్యాయపురోహిత, మై పావనకుశసమిల్లతాంతోచ్చయ మై
యేపారు మౌనియుత మై, చూపఱులకు యాగవేది సొంపై యలరెన్. 628

వ. ఇట్లు కల్పసూక్తప్రకారంబున మంత్రవంతం బై యాగంబు చెల్లుచున్నసమయంబున. 629

సీ. తొలుదొల్తఁ గల్పాంతతోయదధ్వనిభంగి వినువీథి దారుణస్వనము లెసఁగె
నటుమీఁదఁ బద్మినీవిటుఁడు గన్పడ కుండ సాంద్రరజోమేఘజాల మడరెఁ
దరువాతఁ జూపఱు ల్దల యెత్త రాకుండ వితతంబుగా శిలావృష్టి గురిసెఁ
బదపడి మఖశాలపై గహాసంబుపై వేదిపై శోణితవృష్టి గురిసె

తే. నసురసేనాసమేతులై యంబరమునఁ, బన్నిదుష్టాత్ముఁ డైనసుబాహుఁడును దు
రంతసత్త్వుఁడుమారీచుఁడనెడువాఁడు, పాయకురుశ కీఁ గావించు మాయవలన.

ఉ. అంత దినేశవంశవరుఁ డత్తెఱఁ గంతయుఁ జూచి యాత్మలో
నెంతయు గిన్కఁ బర్వఁగ నహీనబలంబున మింటనుండి య
త్యంతరయంబునం బఱచు నట్టినిశాటులఁ బోలఁ జూచి కా
లాంతకుమాడ్కిఁ గ్రాలుచు సుహృద్ద్యుతి లక్ష్మణుతోడ నిట్లనున్. 631

శ్రీరాముఁడు మానవాస్త్రంబున మారీచుని సముద్రంబునం బడవైచుట.

వ. వత్సా దుష్టాత్ము లగుపిశితాశను లంబరంబునం బన్ని మాయాబలవిశేషం
బున యజ్ఞవిఘ్నంబుఁ గావించుచున్నవారు సమీరణంబుచేత ఘనంబులం
బోలె వీరి నందఱ మానవాస్త్రసముద్ధూతులం జేసెదఁ జూడు మని పల్కి
సమాహితుండై చాపంబు సారించి మార్వ్రోయించి పరమసంక్రుద్ధుండై
పరమభాస్వరంబును బరమోదారంబును మహావేగంబు నగుమానవాస్త్రంబు
సంధించి మారీచునియురంబుఁ దాఁక నేసిన నారాక్షసుండు శితేషుబలతాడి
తుండై మైమఱచి యాక్రందనంబుఁ జేయుచు వజ్రప్రహారంబున ఱెక్కలు
విఱిగి మహామహీధరంబు సాగరంబునఁ బడినతెఱంగున శతయోజనమాత్రం
బు దవ్వుల సముద్రజలంబులం గూలిన నవ్విధంబు విలోకించి రాముండు
లక్ష్మణున కిట్లనియె. 632

మ. అవలోకించితె లక్ష్మణా చటులదివ్యస్మానవాస్త్రప్రభా
వవిశేషంబు దురాత్ముఁ డైనదనుజు న్వంచించి కొంపోయి య
ర్ణవతోయంబుల వైచెఁ గాని వెసఁ బ్రాణంబుం గొనం జూడ దెం
త విచిత్రంబు మహాత్ముఁ డైనమునిమంత్రం బిట్టిదై యొప్పుఁగన్. 633

శ్రీరాముఁ డాగ్నేయవాయవ్యాస్త్రంబులచే సుబాహుని దత్సైన్యంబులఁ గూల్చుట.

క. ఘోరాకారుల దుష్టవిహారుల నిర్ఘృణుల ఖలుల యజ్ఞఘ్నుల దే
వారుల రుధిరాహారుల, దారుణకర్ముల వధింతుఁ దడయక యింకన్. 634

వ. అని పలికి. 635

శా. శోణభ్రాజితనేత్రుఁ డై రఘుకులేశుం డుద్ధతి న్సర్వగీ
ర్వాణవ్రాతము మెచ్చి చూడ ననలాస్త్రప్రోద్ధతిం బూర్వగీ
ర్వాణశ్రేష్ఠు సుబాహుఁ ద్రుంచి పటురౌద్రస్ఫూర్తి వెంట న్మరు
ద్బాణంబు న్నిగుడించి కూల్చె నిఖిలేంద్రద్వేషుల న్వ్రేల్మిడిన్. 636

వ. ఇత్తెఱంగున నారఘుసత్తముండు యజ్ఞవిఘ్నకరు లగురాక్షసుల నందఱ నిశ్శే
షంబుగా రూపు మాపి తొల్లిరాక్షసజయంబునందు శక్రుండునుంబోలె సమస్త
మునిగణపూజితుం డై యొప్పె నప్పుడు. 637

ఉ. అంత శ్రుతీరితస్థితిని నమ్ముని యమ్మఖ మొక్కఁ డైన గో
రంత గొఱంత లేక తుది నంతఁగ జేసి కృతార్థుఁ డై సుధీ
మంతుఁడు యాగనిష్ఠ నగుమానము వీడి నిరీతిక ల్దిశల్
సంతస మంకురింపఁ గని చయ్యన రామునితోడ ని ట్లనున్. 638

క. గురుకార్యముఁ జెల్లించితిఁ, బరఁగఁ గృతార్థుండ నైతిఁ బార్థివతనయా
గుఱుతుగ నీయాశ్రమమున, కరుదుగ సిద్ధాశ్రమత్వ మది నిజ మయ్యెన్.

వ. అని పలికె నంత నారామలక్ష్మణులు కృతకృత్యు లై యారాత్రి సుఖలీల వసి
యించి మఱునాఁడు ప్రభాతకాలంబున మేల్కని కాల్యకరణీయంబులఁ దీర్చి
బరమానందరసపూరితహృదయు లై పావకునిచందంబునం దేజరిల్లు చున్న
విశ్వామిత్రునిచరణంబుల కభివాదనంబుఁ జేసి తక్కినమునులకు నమస్కరించి
విశ్వామిత్రు నవలోకించి మధురోదారం బగువాక్యంబున ని ట్లనిరి. 640

తే. అనఘ నీ కింకరులము దయార్ద్రవీక్ష, ణముల వీక్షింపు మింక మా కొనర్పవలసి
నట్టిపని యెద్ది తెలియంగ నానతిమ్ము, కడిమిఁ దీర్చెద మెంతటికార్య మైన.

విశ్వామిత్రుఁడు రామలక్ష్మణుల జనకయాగముఁ జూడరా నియోగించుట.

క అని పలికిన నద్దశరథ, తనయుల వాక్యముల కలరి తాపసవర్యు
ల్మునిపతి యగువిశ్వామిత్రుని ము న్నిడుకొని రఘుపతితో ననిరి తగన్. 642

చ. అలమిథిలేంద్రుఁ డైన జనకాధిపుఁ డుత్తమధర్మశీలుఁ డిం
పలరఁగ నద్భుతంబుగ మహాధ్వర మొక్కటి సేయుచున్న వాఁ
డలయక యమ్మఖంబుఁ గన నచ్చటి కేగెద మేము విక్రమో
జ్జ్వల మముఁ గూడి నీవును బ్రసన్నమతిం జనుదెమ్ము చెచ్చెరన్. 643

వ. అదియునుం గాక. 644

ఉ. ఆనృపమౌళిమందిరమునం దొకవిల్లు సుమేరుసార మై
మానుగ నొప్పి యుండుఁ బురమర్దనువి ల్లది తొల్లి ప్రీతు లై
దానవవైరు లిచ్చిరి మునంబునఁ దన్మహనీయమౌర్వీనం
ధాన మొనర్ప నీవు వసుధావర యోగ్యుఁడ వెన్ని చూడఁగన్. 645

క. సురగరుడోరగనరఖే,చరకిన్నరసిద్ధసాధ్యచారణయక్షా
సురు లాదివ్యశరాసన,వర మెక్కిడఁ జాల రమరనరసమ తేజా. 646

క. జననాథు లనేకులు ద, ద్ఘనకార్ముకశక్తి దెలియఁగా వచ్చి బలం
బున దానిసమారోపణ, మొనరింపఁగ లేక చనిరి యొదవినలజ్జన్. 647

క. జనవరసుర పూతోడను, జనుదె మ్మచ్చటికి జనక జనపతిచాపం
బును సముదితయజ్ఞంబును, గనవచ్చును దాన నీకుఁ గలుగు శుభంబుల్. 648

విశ్వామిత్రుఁడు రామలక్ష్మణులఁ దోడ్కొని మిథిలాపురంబున కరుగుట.

వ. మఱియు నయ్యుత్తమశరాసనంబు దేవతలవలనం బడసి వై దేహుండు దాని

యజ్ఞఫలంబునుఁగా సంభావించుచుఁ దనగృహంబున నిడికొని నిత్యంబును గంధపుష్పధూపదీపంబులచేత నర్చించుచు ధనురుత్సవంబునందుఁ బ్రాధాన్యంబునఁ బూజించుచున్నవాఁ డని పలికిన నవ్విశ్వామిత్రుండు రామలక్ష్మణులం దోడ్కొని మునిసహితుండై యాసిద్ధాశ్రమంబు విడిచి జాహ్నవీనదియుత్తరతీరంబున నున్నహిమవంతంబునకుం జనియెద మీకు స్వస్తి యగుం గాక యని యచ్చటి వనదేవతలకుం జెప్పి యప్పుడ కదలి యయ్యాశ్రమంబునకుఁ బ్రదక్షిణంబుగాఁ దిరిగి యుత్తరాభిముఖుండై మిథిలానగరమార్గంబుఁ బట్టి చనియె నప్పు డమ్మహనీయాశ్రమంబుననున్నబ్రహ్మవాదులైన మహర్షులయగ్నిహోత్రసంభారంబులచేతఁ బరిపూర్ణం బైనశకటీశతమాత్రం బమ్మహాత్ముని వెనుకొనియరిగెను మఱియు నయ్యాశ్రమంబునంగల మృగపక్షిగణంబులు భక్త్యతిశయంబున నవ్విశ్వామిత్రునివెంటం గొండొకదూరంబరిగి యతనిచేత ననుజ్ఞ వడసి మరలి నిజనివాసంబులకుం జనియె నంత గాధినందనుండు గొంతదూరంబు సని సూర్యుండు గ్రుంకువేళకు మునిసహితంబుగా శోణనదీసమీపంబుఁ జేరి యన్నదీపుణ్యతీర్థంబులం గ్రుంకి యగ్నిసమారాధనంబుఁ జేసి విశ్వామిత్రుండు దత్తీరవనంబున నివసించె నంత రాముండు లక్ష్మణసమేతుం బుగా సంధ్య నుపాసించి మునుల నభివాదనంబుఁ జేసి మునిసభామధ్యంబున విశ్వామిత్రున కభిముఖంబుగా సుఖోపవిష్టుండై మృదుమధురవాక్యంబున నమ్మహాత్మున కిట్లనియె. 649

విశ్వామిత్రుఁడు రామలక్ష్మణులకుఁ దనవంశక్రమంబుఁ దెల్పుట.

తే. అనఘ యీదేశ మతిరమ్య మై తనర్చె
మంజులవనాంతజాతసంపదలచేత
ననిశ మేపుణ్యుఁడు వసించునట్టి నెలవు
దీనివిధ మెల్లఁ గృపతోడఁ దెలియఁ జెపుమ. 650

క. అని యడిగిన గాధేయుఁడు, దనమనమునఁ బొంగి రాజతనయునితోఁ ద
ద్ఘనదేశక్రమ మెల్లను, వినిపింపఁ దొడంగె వాక్ప్రవీణత మెఱయన్. 651

తే. దశరథకుమార బ్రహ్మకుఁ గుశుఁడనంగ, నొక్కతనయుండు గలఁడు గుణోత్తరుండు
నిత్యధర్మజ్ఞతావ్రతనియతిమహిమ, నలరె నాతండు రెండవనలువకరణి. 652

శా. ఆపుణ్యుండు విదర్భరాజసుత నుద్యత్ప్రీతితోఁ బెండ్లి యై
యాపద్మాననయందు నందనుల సారాచారులం ధీరుల
న్భూపాలోత్తములన్ గుణోత్తరుల సంపూర్ణప్రభావాఢ్యులన్
శ్రీపుత్రాకృతుల న్సుధీరతులఁ గాంచె న్నల్వుర న్వేడుకన్. 653

తే. నరవర కుశాంబుఁడనఁ గుశనాభుఁడనఁగ, వసువన నధూర్తరజుఁడనవఱలువారు
వారిజవనప్రియాభులై వాలువారు, వాసవసమానులై క్రాలువారు వారు, 654

క. వారి విలోకించి కుశో, దారుఁడు కుశుఁ డిట్టు లనియె ధర్మచికీర్ష
స్మి రందఱు ధారుణి నయ, మారఁగఁ బంచికొని కుడువుఁ డనురాగమునన్.

వ. అని నియమించి కుశుండు మహీమండలం బంతయుఁ జతుర్ఖండంబుగా విభాగించి యిచ్చినం గైకొని యన్నలువురు ధర్మపరు లై లోకసమ్మతంబుగా రాజ్యంబుఁ జేయుచు. 656

తే. అంబురుహమిత్రతేజ కుశాంబుఁ డనెడు
ఘనుఁడు దనపేరఁ గౌశాంబి యనెడుపురము
మహిమ నిర్మించి యందు ధర్మంబుకలిమి
శిష్టసమ్మతి రాజ్యంబుఁ జేయుచుండె. 657

తే. శక్రతుల్యుండు కుశనాభజనవిభుండు
పొలుపుగ మహోదయం బనుపురవరంబు
వేడ్కఁ గావించి యందుఁ బ్రావీణ్య మొదవ
నింపు సొంపారఁ బ్రజలఁ బాలించుచుండె. 658

క. అనఘుఁ డధూర్తరజుం డను, ధననాథనిభుండు ప్రీతి ధర్మారణ్యం
బనుపురముఁ జేరి యచ్చట, నినవంశోత్తమ ధరిత్రి నేలుచు నుండెన్. 659

క. వసు వనువాఁడు పయోజా, క్షసమద్యుతి యై గిరివ్రజం బనుపురముం
బెస నిర్మించి ముదంబున, వసుమతిఁ బాలించె నం దవార్యప్రౌఢిన్. 660

చ. మనుజవరేణ్య యీధరణి మానుగ నవ్వసురాజమౌళి యే
లినయది గ్రాలుచున్నయది క్రేవ మహీధ్రము లైదు గంటె నూ
తనసితపుష్పమాలికవిధంబున మాగధి యీనగాంతరం
బున విలసిల్లుచున్నయది పొల్పలర న్మగధాత్మజాత యై. 661

వ. మఱియు నిమ్మహానది ప్రత్యగ్వాహిని యై యుండు నిచ్చటి వసుంధర వసురాజధర్మమహిమం జేసి మాగధీనదీసలిలస్పర్శంబున సంపూర్ణసస్యశాలిని యై సుక్షేత్ర యై యుండు. 662

తే. తవిలికుశనాభనృపతి ఘృతాచియనెడు,నచ్చరను బెండ్లియై దానియందుఁ గాంచె
రూపసౌందర్యమహిమచే మాఱఁగన్న, యట్టితనయల నూర్వుర నతిముదమున.

ఉ. ఆనరనాథమౌళిసుతలంచితరూపవిలాసయౌవన
శ్రీ నిర వంద హారమృదుచేలములం గయిసేసి మంజులో
ద్యానముఁ జేరి యందు ముదమారఁగ వాద మొనర్చుచు న్రహిం
గానముఁ జేయుచుం శిఖులకై వడి నృత్యము లాచరించుచున్. 664

క. ఘనమధ్యస్థితశంపల, యనువున గగనగతతార లట్ల వెలుఁగుచు
న్వనమధ్యస్థిత లై నృప, తనయలు విహరించి రద్భుతక్రమ మెసఁగన్. 665

ఉ. వారిమనోజ్ఞవేషములు వారివచోరచనాచమత్కృతుల్

వారివిలాసవైఖరులు వారిసమంచితరూపసంపద
ల్వారివిహారచాతురియు వారియపాంగదృగంచలంబు లిం
పారఁగఁ జూచి మన్మథశరాతురుఁడై పవనుండు చెచ్చెరన్. 666

తే. కన్నులారంగ నయ్యళికచలచెలువుఁ
బోలు పలరఁ గాంచి తమి మించి వలపు నించి
ధృతిఁ దొలంగించి విచలితహృదయుఁ డగుచుఁ
జేర నేతెంచి పలికె సమీరణుండు. 667

చ జలజదళాక్షులార నవచంపకనాసికలార యేను మీ
చెలువముఁ జూచి మేలుపడి చేకొన వచ్చితి నాకు భార్యలై
కలసి రమింపుఁ డుత్తమసుఖంబులు సేకురు మానుషత్వముం
దలఁగు శుభోదయం బెసఁగుఁ దప్పక కల్గుఁ జిరాయురున్నతుల్. 668

క. మనుజాంగనలకు జవ్వన, మనిత్య మమరులకు నిత్య మటుగావున నీ
మనుజత్వ ముడిగి మీ రిఁక, ననిమేషత్వమున సుఖము నందఁగ రాదే. 669

వ. అని పలికిన నక్లిష్టకర్ముం డగుసదాగతివచనంబు విని యుపహసించుచుఁ గన్యా
శతం బతని కిట్లనియె. 670

తే. అమరవర్య సమస్తభూతముల కీవు, పరఁగ నంతశ్చరం బైన ప్రాణ మగుట
నలువ నీకు జగత్ప్రాణనామ మిడియె, నరయ నీయట్టిపూజ్యుఁ డిట్లాడనగునె.

క. అనిలా మముఁ గుశనాభుని, తనయల మని యెఱుఁగవే పదభ్రష్టునిఁగా
నినుఁ దిట్టఁగ జాలుదు మైనను సైఁచితి మిటు తపోవినాశ నశంకన్. 672

ఆ. సత్యవాది యైన జనకున కవమతిఁ, గూర్చి తుచ్ఛసుఖముఁ గోరుకంటె
మానవతులు కుర్వ మరణ మభ్యుదయంబు, గాదె పల్కఁ దేల గాన కిట్లు.

క. సురవర్య మాకు దండ్రియె, పరమం బగు దైవతంబు ప్రభు వటు గానన్
గురుఁ డెవ్వని కొసఁగిన న, ప్పరమోదారుండె మాకు భర్త దలంపన్. 674

తే. అనఘ మజ్జనకుండు నీ కరయ నంత, కుండు గాకుండుఁ గాక యాకోవిదునకు
నవమతియొనర్పకుముధర్మమాశ్రయించి, ధవునివరియింపఁగోరియున్నారమేము.

క. అని కుశనాభమహీపతి, తనయులు వల్క విని గాడ్పు దవశిఖమాడ్కి
న్గనలుచుఁ బ్రభంజనత్వము, దనరఁగ భంజించె వేగ తద్గాత్రంబుల్. 676

క. జననాథతనయ లీగతి, ననిలునిచే భగ్నగాత్రలై ఘనలజ్జా
వనతాననలై గ్రక్కునఁ, జని రింటికిఁ గనుల బాష్పజలములు చినుకన్. 677

వ. ఇట్లు చనుదెంచినకన్యలం జూచి సంభ్రాంతచేతస్కుం డై కుశనాభుం
డిట్లనియె. 678

ఉ. కన్నియలార మీకుఁ గను గానక యెవ్వఁడు గీడుఁ జేసె న
పన్నత నొంటి తొల్లిటి జపాకుసుమద్యుతి వీడి కుబ్జలై

కన్నుల నశ్రుబిందువులు గాఱఁగ నేడ్చెద రేల మీరు మా
కున్నది యున్నయట్లు రయ మొప్పఁగఁ జెప్పుఁడు దాఁచ నేటికిన్. 679

తే. అని యడిగి దీర్ఘనిశ్వాస మడర నూర
కున్నజనకునిఁ గాంచి యయ్యువతు లెల్ల
చరణములు ముందలలు సోఁక సాగి మ్రొక్కి
హస్తములు మోడ్చి యిట్లని రడలు గదుర. 680

మ. మనయుద్యానవనంబునందు విహరింపన్ దుర్మదుండై ప్రభం
జనుఁ డచ్చోటికి నేగుదెంచి యశుభాచారస్థుఁడై ధర్మమా
ర్గనియామస్థితి వీడి రాగవశుఁడై కామాస్త్రసంవిద్ధుఁడై
తనకుం బత్నులు గం డటంచు మము వీతన్యాయుఁడై వేఁడినన్. 681

తే. వెలఁదులుస్వతంత్రలేధర్మవిధినెఱుఁగవె, కోర్కెగలదేనినీవుమద్గురునినడుగు
మానవేంద్రుఁడు నీ కిచ్చునేని ప్రీతి, నిను వరించెద మిందఱ మనఘచరిత. 682

క. అని యేము పలుక విన క, య్యనిలుఁడు గోపించి చిత్త మలమటఁ జెందం
బనిగొని మదంగములు గ్రక్కునఁ గుదియం బట్టి మమ్ముఁ గుబ్జలఁ జేసెన్.

వ. అని విన్నవించిన విని పరమధార్మికుం డై నకుశనాభుండు గన్యాశతంబున కిట్లనియె. 684

సీ. ఆత్మజలార మీ రైకమత్యము నొంది వంశధర్మస్థితి వదల కుండ
సైరణఁ గావించి చనుదెంచితిరి క్షమావంతుల కేమి గొఱంత లేదు
లోకత్రయమునందు మీకుఁ బోలినతాల్మి పరికింప మఱియు నెవ్వరికి లేదు
సురలయందైన దుష్కర మిట్టిశాంతంబు పురుషుల కైనఁ బూఁబోండ్లకైన

ఆ. క్షమయె భూషణంబుక్షమయెదానంబుయ, జ్ఞంబు సత్యమార్జవంబు యశము
తపము శీల మధికధర్మంబు క్షమయందె, నిలిచి యుండుఁ జూడ నిఖిలజగము.

క. అని పలికి సుతలఁ బోవం, బనిచి మహీవిభుఁడు మంత్రిబాంధవయుతుఁడై
తనయల నెవ్వరి కిచ్చెద, ననుచు విచారించు చుండ నాసమయమునన్. 686

చ. ఘనుఁడు జితేంద్రియుండు విధికల్పుఁ డనల్పతపుండు చూళి నాఁ
దనరుతపస్వి బ్రాహ్మసముదగ్రతపం బొనరించు చుండఁగా
ననిమిషలోకకాంత యగునట్టిది యూర్మిళముద్దుకూఁతు రా
ననజితసోమ సోమద యనం దగుయచ్చరమిన్న చెచ్చెరన్. 687

క. మునివంశవార్ధిచంద్రునిఁ, గనఁ జని తచ్చరణములకు ఘనతరభక్తి
న్వినతి యొనరించి నిత్యం, బును సేవ యొనర్చు చుండెఁ బుత్రార్థిని యై. 688

తే. అంతఁ గొంతకాలంబునకమ్మునీంద్రుఁ, డాత్మసంతుష్టుఁడై మెచ్చి యన్నెలంతఁ
జూచి నీకిష్టమెద్దియోసుదతి దాని, నడుగు మిచ్చెద ననిన నప్పుడతి యలరి.

క. పలుకుల నమృతపుసోనలు, చిలుకఁగ మధురస్వరంబుచే నిట్లనియెన్

జలరుహగర్భసమానున, గలచూళికి ఫాలకీలితాంజలి యగుచున్. 690

వ. మహాత్మా యేను బుత్త్రార్థినినై మిమ్ము భజించితి నేనింతకు మున్న పతినై యిప్పుడన్యునిం గోరక నైష్ఠికబ్రహ్మచారిణి నై యున్నదాన నీవు బ్రహ్మతేజోసముదితుండవు బ్రహ్మభూతుండవు తపస్సంపన్నుండవు నాయందుఁ గృప గలదేని శరణాగత నైననాకుఁ దపోమహిమచే బ్రాహ్మణశక్తియోగయుక్తుం డైనపుత్త్రుం బ్రసాదింపు మని యభ్యర్థించిన నప్పరమతపస్వి దయాళుం డై యాగంధర్వి కోరినయట్ల పరమధార్మికుం డైనపుత్త్రు నొసంగిన నతండు బ్రహ్మదత్తుం డనాఁ బరఁగె నట్టి చూళిమానసపుత్త్రుండైన బ్రహ్మదత్తుండు శక్రుం డమరావతీపురంబు నుంబోలె కాంపిల్యానామనగరంబుఁ బరిపాలించుచు మహాసంపద్యుక్తుం డై యుండె నట్టి బ్రహ్మదత్తుని రావించి కుశనాభుఁడు ప్రీతచేతస్కుం డై సమస్తలోకసమ్మతంబుగాఁ గన్యాశతంబు నొసంగిన నా బ్రహ్మదత్తుం డక్కన్యల యథాక్రమంబుగాఁ బాణిగ్రహణంబుఁ జేసిన. 691

క. వరుని ప్రసాదంబున న, త్తరుణులు కుబ్జత్వ ముడిగి తత్క్షణమె మనో
హరగాత్రలై తనర్చిరి, యరు దారఁగ మరుని మోహనాస్త్రములక్రియన్.

ఆ. వీతకుబ్జభావలై తారకలమాడ్కి, వెలుఁగుచున్నసుతలఁ గలయఁ జూచి
యద్భుతంబు నొంది యాకుశనాభుండు, గాఢహర్ష మాత్మఁ గడలుకొనఁగ.

చ. తనయల నల్లుని న్బహువిధంబులఁ గామితముల్ ఘటించి మిం
చినయనురక్తి దివ్యమణిచేలసువర్ణము లిచ్చి యాదరం
బునఁ దగ వీడుకొల్పినఁ బ్రమోదమునం జని రగ్రభాగమం
దనుపమహృద్యవాద్యనినదార్భటు లంబరవీథి నింపఁగన్. 694

క. తనయునిఁ గోడండ్రను గనుఁ, గొని సోమద హర్ష మొంది కుశనాభమహీం
ద్రునిఁ గొనియాడుచు వారల, ననుపమగతి గారవించె నధికప్రీతిన్. 695

వ. ఇట్లు బ్రహ్మదత్తుండు గాంపిల్యానగరంబుఁ బ్రవేశించి పత్నీసహితుండై శక్రుండు త్రిదివంబునందుం బోలె సుఖించుచుండె. 696

తే. అంతఁ గుశనాభరాజు పుత్త్రార్థ మొక్క, యిష్టిఁ గావింప నాపృథివీశుకడకుఁ
గోర్కెతో బ్రహ్మపుత్త్రుండుగుశుఁడువచ్చి, యింపుసొంపారమధురోక్తినిట్టులనియె

క. తనయా నీకు సమానుఁడు, తనయుఁడు గాధి యనువాఁడు ధార్మికుఁడు యశో
ధనుఁడు జనియించు ధర న, య్యనఘునిచే నీ కనంతయశముం గలుగున్.

క. అని పలికి కుశుఁడు ముదమునఁ, దనయుని నాశీర్వదించి తపనునిచందం
బున నుజ్జ్వలుఁ డగుచు సనా, తన మగువిధిలోకమునకుఁ దడయక చనియెన్.

ఉ. అంతటఁ గొంతకాలమున కద్భుతతేజుఁడు పుత్త్రుఁ డామహీ
కాంతుని గర్భవార్ధిమిహికాద్యుతి యై జనియించె మంజుల
స్వాంతుఁడు గాధిరా జనుప్రసన్నకళాకలితాత్ముఁ డమ్మహో

స్వాంతున కే జనించితి రసాపురుహూతునకున్ రఘూత్తమా. 700

సీ. అవనీశ కుశవంశమునందుఁ బుట్టుటఁ జేసి కౌశికనామంబు గలిగె నాకు
సరసాత్మ మాయక్క సత్యవతీదేవి దివ్యగుణాఢ్య సతీలలామ
వెనుకొని తనప్రాణవిభుఁ డైన ఋచికుతోఁ గూడి శరీరంబుతోడ నాక
లోకంబునకుఁ బోయి లోకహితంబుగా నీలోకమునఁ బర్వతేంద్రుఁ డనఁగఁ

తే. బరఁగు ప్రాలేయపర్వతప్రాంతమందుఁ, జెలఁగి కౌశికి యనుపేర నలరుదివ్య
నిర్ఝరిణి యయ్యె నయ్యమ నిత్యమమ్మ, హైతటినిచెంత వసియింతు నయ్య నేను.

వ. పదంపడి నేను యాగనియమంబున హిమవంతంబు విడిచి సిద్ధాశ్రమంబుఁ జేరి భవత్తేజంబునఁ దపస్సిద్ధుండ నైతి మద్భగిని యగు సత్యవతి మహానదీస్వరూపంబున లోకపావని యై సజ్జనులదురితంబుఁ దొలంగం ద్రోయుచుండు రఘువరా మదీయవంశక్రమంబును దచ్చరిత్రంబును నీదేశవిశేషవిధంబును బ్రస్ఫుటంబుగా నెఱింగించితిఁ గదా యని పలికి హర్షపులకితగాత్రుం డై విశ్వామిత్రుండు వెండియు నిట్లనియె. 702

మ. అవనీశాత్మజ పూర్వరాత్రిసమయం బయ్యెం దమోజాలము
ల్భువి నీరంధ్రముగాఁగఁ బర్వెఁ దఱుచై భూరిద్యుతిం దారక
ల్దివిపై నుజ్జ్వలభంగిఁ బొల్చె సురవిద్వేషు ల్బలోద్రేకు లై
దవధూమాకృతి సంచరించెదరు నందం బొప్ప వీక్షించితే. 703

క. గిరిగుహలయందుఁ దరుకోటరములయం దాపగాతటంబులయందుం
దరులందు ఖగమృగంబులు, నెఱి సెడి లీనంబు లయ్యె నిద్రాసక్తిన్. 704

చ. తొవలకుఁ బ్రేమఁ జూపి యలతోయరుహంబకు నిద్ర లేపి ప
ద్మవనముకాంతి మాపి సుర మండలికి న్సుధఁ జేపి చాల న
ర్ణవమున కుబ్బు దాపి రఘునాయక తావకకీర్తిమూర్తి నాఁ
ది వెడలె నాఁగ నిప్డు హిమదీధితి యొప్పెడిఁ గంటె ప్రాగ్గిరిన్. 705

వ. రాజనందనా రాత్రివిశేషకాలం బయ్యె మేల్కొని యుండుటవలన నెల్లి జాగరజనితపరిశ్రాంతివలన మార్గవిఘ్నంబు సంభవించుం గావున నింక సుఖనిద్ర సల్పుము. 706

చ. అన విని తోడిమౌనివరు లామునికి ట్లని రో మహాతపో
ధనవర తావకాన్వయవిధంబు యథావిధిగా వినంబడె
న్ననఘులు బ్రహ్మతుల్యులు మహాత్ములు తావకవంశజాతుల
ట్లనియుతభూరిదివ్య పృథులద్యుతి నై తనరారితి విలన్. 707

తే. నృపుఁడ వై పుట్టి పదపడి విపులతపము, కలిమి బ్రహ్మర్షిపదమును గన్నవాఁడ
వీవు నీయంతవాఁడవు నీవె కాక, జగతి వేఱొక్కఁడును నీకు సాటి గలఁడె.

వ. మహాత్మా భవత్సహోదరి యైనసత్యవతి కౌశికి యనుపేరం దనరుదివ్యనది యై

భువనపావని యై కులోద్యోతకరి యై ప్రకాశించుచున్నయది యని బహుప్రకారంబుల నత్తాపసులు విశ్వామిత్రునిం బ్రశంసించిన నమ్మునిశ్రేష్ఠుం డుల్లంబు పల్లవింప సస్మితవదనారవిందుం డై వారి నందఱం దగిన తెఱంగున నభినందించి వారలుం దానును మంజుకిసలయకుసుమవిరచితశయ్యాతలంబుల నధివసించి యొక్కింతసేపు పుణ్యకథావినోదంబులం బ్రొద్దుఁ బుచ్చి పదంపడి సుఖనిద్రం జేసి రారఘుప్రవరులును విశ్వామిత్రుని సేవించి యమ్మహాత్మునివలన నిష్టకథాశ్రవణంబుఁ జేయుచు మృదుతల్పంబులం బవ్వళించి సుఖనిద్రం గావించిరి తదనంతరంబ. 709

క. శతపత్రకుట్మలబహి, ర్గతమదమధుపాంగనానికాయరవంబు
ల్జత గూడి కేవలాదం,భత మీఱం బ్రభాతకాలమహిమం దెలిపెన్. 710

తే. అంతఁ గౌశికముని యంతికావనీరు, హాగ్రసంగతపారావతారవములు
మేలుకొలుపులు పాడంగ మేలుకాంచి, సరసమతిఁ దోడిమునుల కెచ్చరికఁ జేసి.

చ. చెలువుగ రామలక్ష్మణులఁ జీఱి రఘూత్తములార మేలుకొం
డలతపనోదయావసర మయ్యె నటంచు సుధామయోక్తి మే
ల్కొలిపిన నిద్ర లేచి రఘుకుంజరు లాహ్నికకృత్యము ల్నయం
బలరఁగఁ దీర్చి రత్తఱి నృపాగ్రణి గౌశికుతోడ నిట్లనున్. 712

తే. కంటె యీశోణనదిమహాగాధ మగుచుఁ, బులినమండితమై శుభసలిలపూర్ణ
మగుచు నొప్పెడు మనము సొంపార నెద్ది, మార్గమున దాఁటిపోదము మౌనివర్య.

క. అన విని గాధేయుఁడు రా,మున కిట్లనుఁ దాపసోత్తములు దాఁటెడు రే
వున దాఁటి పోద మని గ్ర,ద్దన నన్నది దాఁటె మౌనితతియుతుఁ డగుచున్.

విశ్వామిత్రుఁడు రామలక్ష్మణసహితుం డై గంగానదిఁ జేర నరుగుట.

వ. ఇత్తెఱంగున నత్తపోధనగ్రామణి రామలక్ష్మణసహితుం డై తాపసులం గూడి శోణనది నుత్తరించి తత్తీరవనంబులు విలోకింపుచు దూరం బరిగి యినుండు నభోమధ్యగతుం డగునంతకు సమస్తమునినిషేవితం బగుదాని హంససారసనాదితం బగుదానిఁ బుణ్యోదకం బైనదాని గంగానదిఁ డాసి యమ్మహానదియందు సుస్నాతు లై పితృతర్పణంబుఁ గావించి కృతాగ్నిహోత్రు లై యమృతతుల్యం బైనహవిశ్శేషంబు భక్షించి యమ్మహానదీతీరంబున నొక్కరమ్యప్రదేశంబున నావాసపరిగ్రహణంబుఁ జేసి పరమానందభరితాంతఃకరణు లై రచ్చట సమస్తమునిపరివృతుం డై విశ్వామిత్రుండు నివసించె నంత నారాముండు విశ్వామిత్రుని కభిముఖంబుగా నాసీనుం డై యమ్మహాత్మున కిట్లనియె. 715

విశ్వామిత్రుఁడు శ్రీరామునికి గంగాపణ్ణులసంభవప్రకారంబుఁ దెల్పుట.

క. తాపస యీదివ్యాపగ, యేపగిది జనించె జగము లేక్రియ నిండె
న్నేపగిది జలధిఁ గలసెను, నాపైఁ గృపఁ జేసి యంత నయముగఁ జెపుమా

క. అనవుడు రఘువరముఖసం,జనితవచోమృతముఁ జెవులఁ జవిగొని స్మేరా
ననుఁ డై సుమనోగతి న,మ్మునిరా జిట్లనియెఁ గుతుకముం దళుకొత్తన్. 717

క. కల దొకయళిచికుర సురా, చలపుత్త్రి మెఱుంగుఁదీఁగె శశికళ మఱుఁగ
జ్జెలగుత్తి మఖిలసురరమ,ణుల చూడాభూషణము మనోరమ యనఁగన్. 718

చ. హిమవదహార్యరాజు మది హెచ్చినకోరిక నివ్వటిల్లఁగాఁ
బ్రమద మెలర్ప నక్కలువరాయని రేకఁ దృణీకరించు న
య్యమను యథావిధిం బరిణయం బయి తత్సతియందుఁ గాంచె నా
సుమహితరూపయౌవనసుశోభితగాత్త్రులఁ గూఁతు లిద్దఱన్. 719

తే. సురలు దేవహితార్థ మాసుతలలోనఁ, బెద్దకూఁతురు గంగ యన్పేర నలరు
దాని నిమ్మని హిమధరాధరుని నెయ్య, మెసఁగ నడిగిరి త్రైలోక్యహితముపొంచె.

క. అడిగిన నక్కుధరేంద్రుఁడు, పడఁతుకఁ దనపుత్త్రి భువనపావని గంగ
న్గడువేడ్క లోకహితముగఁ, దడయక దేవతల కిచ్చెఁ దద్దయుఁ బ్రీతిన్. 721

క. ఇచ్చినఁ గైకొని నిర్జరు, లిచ్చ నలరి లోకములకు హిత మొనరింపం
జెచ్చెర గంగను దోడ్కొని, యచ్చుపడఁగ నాకమునకు నరిగిరి పెలుచన్.

వ. ఇట్లు స్వచ్ఛందపథగామిని యైనగంగ సురలచేత నాహూయమాన యైదివంబు
నకుం జని మహానదీరూపంబున సురగరుడోరగమునిసేవిత యై యెల్లవారలఁ బ
విత్త్రులం జేయు చుండె నంత రెండవకూఁతు రుమాదేవి యుగ్రం బైనవ్రతం
బంగీకరించి శైలసానుకందరంబులఁ దపంబుఁ జేయుచుండ నాహిమవంతుం
డక్కన్యకుం దగినవరుని విచారించి సకలలోకనమస్కృతుం డైనరుద్రునకొసంగె
నిది త్రిభువనాభివంద్యు లైనగంగాపర్ణలసంభవప్రకారం బందుఁ ద్రిపథగ యైన
గంగానది మొదలఁ ద్రివిష్టపంబు నధిగమించి యందు మహానదీస్వరూపిణి యై
స్వర్లోకంబునం బ్రవహించినచందంబు నెఱింగించితి నని పలికిన నారామ
లక్ష్మణు లిరువురు ప్రీతిసంహృష్టసర్వాంగు లై విశ్వామిత్త్రు నవలోకించి మహా
త్మా ధర్మయుక్తం బైనయీగంగాఖ్యానంబు సంక్షేపంబుగా మీచేతఁ గథితం
బయ్యె నీవు దివ్యమానుషసంభవప్రకారం బంతయు సవిస్తరంబుగా నెఱిఁగిన
మహానుభావుండవు శైలపుత్త్రి యైనగంగాదేవి మహానదీస్వరూపిణి యై ముల్లో
కంబులం బ్రవర్తించుటకుఁ గారణం బెయ్యది యేకర్మంబులం గూడి ముల్లో
కంబులయందు విశ్రుతి వహించె నేకారణంబున మార్గత్రయగామిని యయ్యెఁ
దత్ప్రకారం బంతయు సవిస్తరంబుగా నెఱింగింప నీవే యర్హుండ వనిన ఋషిస
భామధ్యగతుం డైనవిశ్వామిత్త్రుండు హర్షపులకితగాత్త్రుం డై యి ట్లనియె.

విశ్వామిత్త్రుఁడు శ్రీరామునికిఁ బార్వతీవృత్తాంతంబుఁ దెలుపుట.

చ. ఎలమి శశాంకమౌళి కుధరేశ్వరనందన నిట్లు పెండ్లి యై
చెలువుగఁ బుష్పితావిగతిఁ జిత్తము లొక్కటిగాఁ బరస్పరం

బలఘుముదంబుతో నహరహం బెడఁబాయక సౌఖ్యసంపదం
దలకొని పోల్చి రెంతయు సనాతనదంపతు లై జగంబులన్. 724

వ. అంత. 725

చ. మృడుఁ డొకనాఁడు వేడుక నమేయభుజాబలశాలిపుత్త్రునిం
బడయఁగఁ గోరి యత్తుహినపర్వతరాజకుమారిఁ గూడ సొం
పడరఁగ నూఱువర్షము లహర్నిశము ల్పరమానురక్తిచే
నెడఁ బడకుండ నిత్యము రహి న్సురతం బొనరించుచుండఁగన్. 726

చ. జలజభవాద్యశేషసురసత్తము లొక్కట గుంపుఁ గూడి యా
యళికవిలోచనుండు తుహినాచలనందనితోడఁ గూడి మి
క్కిలి సురతం బొనర్పఁ దొడఁగెం దగ వారలతేజ మేఘనుం
డిల సహియింప నోపు మన మిత్తఱి నవ్విధి మాన్పఁగాఁ దగున్. 727

మ. అని చింతించి సుర ల్కుతూహలముతో నచ్చోటి కేతెంచి యం
దు నిరూఢేచ్ఛ నఖండత న్సురత మెంతో వేడ్కఁ గావించులో
కనిదానం బగుశంకరుం గని నమస్కారంబుఁ గావించి ఫా
లనిబద్ధాంజలు లై నుతించిరి శుభాలాపంబుల న్భక్తితోన్. 728

తే. దేవదేవ మహాదేవ దేవవినుత, లోకనాయక నతభక్త లోకవరద
శర్వ శంకర యీశాన చంద్రమౌళి, నీకు మ్రొక్కెద మాలింపు నిర్మలాత్మ.

తే. ఈశ యేపారు నీతేజ మెవరు దాల్ప
నోపువా రిట్టిరతికృత్య ముడుగవలయు
బ్రహ్మచర్యవ్రతంబునఁ బరఁగవలయు
నివ్వరము మాకీఁక ననుగ్రహింపవలయు. 730

వ. దేవా యమోఘం బైనభవత్తేజంబు సహింప జగంబు లోపవు కావునఁ దేజంబు నీయందు ధరింపుము లోకహితార్థంబు దేవీసహితుండ వై తపంబుఁ గావింపు మని ప్రార్థించిన దేవతలవచనంబు విని దయాళుం డై సర్వలోకమహేశ్వరుం డగుపార్వతీశ్వరుండు వేల్పులం జూచి మీచెప్పినట్ల మదీయం బైనతేజంబు నాయందె నిలిపెద స్వస్థచిత్తులరు గం డిప్పు డనుత్తమం బైన మద్వీర్యంబు రేతస్స్థానహృదయసంపుటసంక్షుభితం బయ్యె దీని నెవ్వాఁడు ధరించువాఁ డెఱింగింపుం డనిన నయ్యాదితేయులు వృషభధ్వజున కిట్లనిరి.

క. విడువుము తావక తేజముఁ, దడయక తాల్పంగ నోపు ధాత్త్రి యటన్నన్
మృడుఁ డౌఁగా కని గ్రక్కునఁ, బుడమిం గాపంచెఁ దద్విమోచన మనఘా.

వ. ఇట్లు విసర్జించిన నమ్మహాతేజంబు శైలకాననసహిత యైనమహి యెల్ల నిండె నప్పుడు. 733

తే. అమరు లనలునిఁ గనుఁగొని యనిలుఁ గూడి
చెలఁగి నీవిందుఁ దగఁ బ్రవేశింపు మనిన
విని యతం డట్ల కావించె జనవరేణ్య
యవని శ్వేతాద్రి యన నొప్పె నచటి నెలవు. 734

వ. మఱియు రౌద్రం బైన తేజం బచ్చోట విసృష్టం బయ్యె నది కార్తికేయజన్మస్థానం బైనదివ్యశరవణం బై పావకాదిత్యసన్నిభం బై విలసిల్లె నంత దేవతలు సమస్తమునిగణసమేతంబుగా నయ్యుమామహేశ్వరులం బూజించి రప్పుడు.

క. కట్టడితనమున వేల్పులు, గట్టిగఁ దన కప్రియంబుఁ గావించుటకుం
గట్టలుకఁ దత్ఫలంబును, గట్టి కుడుచునట్లొనర్తుఁ గా కని యుమయున్. 736

క. కనుఁగొనలఁ దామ్రదీధితి, దనరారఁగ మేను దీప్తదవశిఖిచందం
బున నలరఁ గ్రోధమదిపై, కొనఁగా దోయిట జలంబుఁ గొని యిట్లనియెన్.

చ. కొడుకును గోరి ప్రాణవిభుఁ గూడి సుఖించెడు నాకు నిమ్మెయిన్
విడువక దుష్టులై నడుమ విఘ్న మొనర్చితి రిట్లు గాన నిం
పడరఁగ వేల్పులార యిది యాదిగఁ బత్నులయందు మీకుఁ గం
గొడుకులు పుట్టకుండెదరు కోరి శపించితి నిక్క మింతయున్. 738

వ. అని పలికి వెండియు. 739

తే. ఇలను వీక్షించి క్రుద్ధయై యేను దాల్పఁ
దగిన యీ తేజ మీ వెట్లు దాల్చితి విది
మొదలు బహునాయకత్వంబుఁ బొందు మనుచు
శాప మిచ్చెఁ బదంపడి శైలతనయ. 740

వ. మఱియు వసుంధర నుద్దేశించి యూషరత్వాదినానావిధరూపిణి వై మచ్ఛాపక్రోధవిపర్యస్తప్రకృతివై పుత్రకృతప్రీతి నొందకుండు మని యిట్లు కఠోరంబుగా శపించె నంత దేవతలు పార్వతిచేత శప్తులై మొగంబుల లజ్జావిషాదంబులు వొడమ నిజనివాసంబులకుం జనిరి శంభుండు దేవీసహితుండై యచ్చోటు విడిచి తుషారగిరియుత్తరభాగంబునకుం జని తదీయం బైన యొక్క మహోన్నతశృంగంబుమీఁదఁ దపంబుఁ జేయు చుండె నిది పార్వతీవృత్తాంతం బింక గంగావృత్తాంతం బెఱింగించెద వినుము. 741

విశ్వామిత్రుఁడు శ్రీరామునికి గంగావృత్తాంతంబుఁ దెల్పుట.

సీ. అమరు లంతఱును మహర్షిసమేతులై కడువేడ్క బ్రహ్మను గానఁ బోయి
వినయంబు భక్తివివేకంబు లేర్పడఁ దత్పాదములకు వందనముఁ జేసి
నలువ మా కొకఁడు సేనానాయకుఁడు లేమిఁ జేసి దైత్యులచేతఁ జిక్కువడితి
మష్టమూర్తికిఁ బుట్టినట్టివాని గ్రహింతు మని యున్న నదియు నాఁ డట్లయయ్యె
తే. దామరసగర్భ మాకింకఁ దగినకార్య, మెద్ది యోచించి త్రైలోక్యహితముఘాంబె

నానతిమ్ము సమస్తవిధానవిదుఁడ, వీవు మాకందఱకు దిక్కు నీవ కావె. 742

వ. దేవా తొల్లి మాకు భగవంతునిచేత నెవ్వఁడు సేనాధిపతిగా దత్తం బయ్యె నమ్మహాత్ముఁ డిప్పు డుమాసహితంబుగాఁ దపంబుఁ జేయు చున్నవాఁ డింక వేఱొక్కని నిర్దేశింపుము. 743

క. అని సురలు విన్నవించిన, విని వేలుపుపెద్ద వారి వీక్షించి కృపా
జనితానురాగమున ని, ట్లనియెం బలుకులు సుధామయములై యుండన్.

చ. పరమసతీలలామ యగు పార్వతి పల్కినభంగి నింక మీ
గఱితలయందు నందనులు గల్గుట చొప్పడ దింత నిక్కువం
బఱమర లేదు పావకునియందు సమున్నతమైనశూలభృ
త్పరమపవిత్రతేజ మది భాసిలు చున్నది హేమరూపమై. 745

తే. శాంభవంబైనదివ్యతేజంబుచేతఁ, జిత్రభానుండు కడు వేడ్క శీతశైల
పుత్త్రి యగుగంగయందు సత్పుత్త్రు నొకనిఁ, బూనికలిగించుమీకుసేనానిగాఁగ.

వ. మఱియు నాగంగాదేవి హిమవంతంబునకుం బెద్దకూఁతురు గావున నుమాదేవి ధరింపం దగినశైవం బగు తేజంబు దా నశ్రమంబునం దాల్పనోపు నవ్విధం బయ్యుమకును బహుమతం బై యుండు నని పితామహుం డానతిచ్చిన నిలింపులు కృతార్థుల మైతి మని సంతసిల్లి యమ్మహాత్మునిం బూజించి యనుజ్ఞ వడసి బహుధాతుమండితం బైనకైలాసనగంబునకుం జని సర్వదేవపురోహితుం డైనపావకునిం జూచి మహాత్మా నీయందు నిక్షేపించి యున్నమాహేశ్వరం బగుతేజంబు పుత్త్రార్థంబుగా శైలపుత్త్రి యగుగంగయందుఁ జేర్చి దేవతలకు హితంబుఁ జేయు మని నియోగించిన నప్పావకుండు గంగకడకుం జని సర్వదేవతాహితార్థంబు గర్భంబు ధరింపు మని పలికిన నద్దేవి దివ్యస్త్రీరూపధారిణి యై పొడసూపినఁ దదీయసౌందర్యాతిశయంబు విలోకించి మోహితుం డై పావకుండు దనయందు వ్యాప్తం బైనతేజంబు సర్వావయవంబులవలన విసర్జించి గంగాదేవి సర్వావయవంబులయందుఁ బ్రసరింపం జేసిన నద్దివ్యతేజంబు ముఖనాసాదిసర్వావయవంబులయందు నిండిన నద్దేవి ప్రవ్యథితచేతన యై పావకుం జూచి యి ట్లనియె. 747

క. అమరపురోహిత నీతే, జముఁ దాల్పఁగ నోప నైతి జాంబూనదశై
లముభంగిఁ జాల వ్రేఁగై, విమలలయాగ్నిశిఖమాడ్కి వెలిఁగెడుఁ గంటె.

క. అని పలికిన నద్దేవికి, ననలుం డిట్లనియె నపుడు హైమవతీ శం
భునితేజ మిది సుతార్థము, పనిగొని నీయందు నుంపఁ బడె నాచేతన్. 749

ఆ. మోయఁ జాల వేని మునుకొని నీ వతి, గౌరవంబు గలుగు గర్భము హిమ
శిఖరిపాదమందుఁ జేర్పుము గ్రక్కున, ననిన నట్ల చేసె నమరతటిని. 750

వ. ఇట్లు గంగాదేవి తనయందుఁ జేర్చిన యద్దివ్యతేజంబు వహ్నివ్యాప్తశ్వేత

శైలీకృతశివతేజోరాశియందు విసర్జించినఁ దద్గర్భనిక్షేపమాత్రంబునఁ దత్తేజంబుచేత నభిరంజితం బై పూర్వోక్తశ్వేతపర్వతసహితం బై నశరవణంబు సర్వంబును గాంచనమయం బయ్యె నందు భాస్వరతరదివ్యదేహుండును జిత్రభానుసమప్రభుండును నగుకుమారుండు జన్మించెఁ దచ్ఛోణితాధిక్యంబువలనఁ దప్తజాంబూనదప్రభం బైనకాంచనంబును నిర్మలం బైనరజతంబును బొడమి యచ్చట మేదినియందు వ్యాపించెఁ దత్క్షారగుణంబువలనఁ దామ్రకృష్ణాయసంబులు దన్మలంబువలనఁ ద్రపుసీసకంబులును బుట్టెఁ దద్దివ్యతేజఃప్రభావంబున నచ్చటి తరుగుల్మలతాప్రతానంబు లన్నియు సువర్ణమయంబు లై తేజరిల్లె నచ్చటినెలవు నానాధాతుమండితం బై యొప్పె నాఁటంగోలె సువర్ణంబునకు జాతరూపవిఖ్యాతియు వైశ్వానరసమప్రభయునుం గలిగె. 751

చ. రయమున నక్కుమారునకుఁ గ్రమ్మర క్షీరము లిచ్చి పెంపఁగాఁ
బ్రియమున వేల్పు లందఱును గృత్తికల న్నియమింప వార లెం
తయుఁ గృప మీఱఁగాఁ దమకు నందనుఁ డంచుఁ దలంచి యాతని
న్బ్రియమున జన్నుపా లొసఁగి పెంచిరి లోకహితార్థ మత్తఱిన్. 752

తే. కృత్తికాస్తన్యపానప్రవృద్ధుఁ డగుట, వలన నక్కుమారుండు సొం పలరఁ గార్త్తి
కేయుఁ డన ముజ్జగంబులఁ గీర్తితుఁ డగు, ననుచు సంప్రీతితో వేల్పులాడి రపుడు.

క. ఇందుధరునిఘనరేతః, స్కందంబున జనన మాట కతమున నతని
న్బృందారకసందోహము, స్కందుం డని పొగడె నపుడు కౌతుక మురలన్.

తే. గరిమ గర్భోదకంబందు స్కన్న మగుచు, నధికకాంతిచే దీప్యమానాగ్నిభంగి
వెలుఁగుపుత్త్రునిఁ గని కృత్తికలు చెలంగి, స్నపన మొనరించి రప్పుడు సంత్రసమున.

తే. అనయఁ గృత్తిక లట్లాఱ్వు రగుటవలన
నాఱుమోములఁ దాల్చి సొంపార నొక్క
దివసమున వారిచనుపాలు దవిలి త్రావి
మిగుల సుకుమారదేహుఁ డై పొగడుఁ గాంచె. 756

తే. సముదితం బైనదివ్యతేజంబుచేత, సురబలాధీశుఁ డై రాక్షసుల వధించె
నందువలన నతండు షడాస్యుఁ డనఁగ, గరిమ సేనాని యనఁగ విఖ్యాతిఁ గనియె.

చ. అమరసమాన గంగవిధ మద్భుత మైనకుమారసంభవ
క్రమమును సర్వముం దెలియఁగా వినిపించితిఁ గార్త్తికేయునం
దమలినభక్తిఁ జేయునతఁ డాయువు గల్గి సపుత్త్రపౌత్త్రుఁ డై
ఘనసుఖియై చరించి తుదిఁ గాంచు సముంచితతత్సలోకతన్. 758

వ. అని పలికి విశ్వామిత్రుండు వెండియు రామభద్రు నవలోకించి యి ట్లనియె. 759

విశ్వామిత్రుఁడు శ్రీరామునకు సగరచక్రవర్తికథఁ దెల్పుట.

చ. అలరు భవత్కులాంబుధిహిమాంశుఁ డనా సగరావనీశ్వరుం

డలఘుతరప్రతాపమున నాతఁడు సాగరవేష్టితావనీ
తల మనిశంబు ధర్మగతిఁ దప్పక యేలుచుఁ జక్రవర్తియై
బలరిపువైభవస్ఫురణ భాసిలుచుండు సమానుషప్రభన్. 760

తే. దశరథకుమార వినుము విదర్భరాజ, తనయ ధర్మిష్ఠ సత్యవాదిని పతివ్ర
తాగ్రగణనీయ కేశిని యనెడుసాధ్వి, యగ్రగేహిని యయ్యె నయ్యవనిపతికి.

తే. మఱియు నారాజమౌళికి గరుడభగిని
కామునిజయాస్త్రము యరిష్ట నేమిదుహిత
సుమతి యనుపేర నొప్పారు సుందరాంగి
నేయ మెసఁగ ద్వితీయ ద్వితీయ యయ్యె. 762

క. ఆయిరువురు పత్నులు తన, కాయతసౌఖ్యం బొసంగ నభినవవిభవ
శ్రీయుతుఁడై బహుకాలము, పాయక యిలయేలె నానృపాలుఁడు ప్రీతిన్.

వ. ఇట్లు రాజ్యంబుఁ జేయుచు. 764

క. తనయులు లేమికి వగ నెక్కొనఁ బత్నియుతముగా భృగుప్రస్రవణం
బను శైలమందు నేమము, దనరారఁగ నుగ్రభంగిఁ దప మొనరించెన్. 765

వ. అంత. 766

క. నూఱేండ్లు సనినవెన్క ను, రారాధ్యుం డైనభృగుమహాముని కరుణో
దారుఁడు ప్రత్యక్షం బై, కూరిమితో నిట్టు లనియెఁ గువలయపతికిన్. 767

చ. అలఘుచరిత్ర నీకు సముదంచితమై తగుపుత్రలాభముం
గలుగు ననంతవైభవ మఖండయశంబును వృద్ధిఁ బొందు నీ
యలికచలందు నొక్కతెకు నఱ్వదివేలసుతుల్ జనింతు రిం
పలర నొకర్తె కొక్కఁ డగుణాఢ్యుఁడు వంశకరుండు గల్గెడున్. 768

క. అని మునిపతి వర మిచ్చిన, విని నరపతిసుత లతనికి వినత లయి ముదం
బున వినయవాక్యముల ని, ట్లని రప్పుడు ఫాలకీలితాంజలిపుటలై. 769

తే. నీపలుకు నిక్కమగుఁ గాక తాపసేంద్ర
పరఁగఁ బెక్కండ్రసుతుల నేతరుణి గాంచు
నొక్కసుతుఁ డేమృగాక్షికి నుద్భవించుఁ
గరుణ దళుకొత్త నింతయు నెఱుఁగఁ జెపుమ. 770

క. ఆరాముల వచనము విని, సారసగర్భాత్మజుండు సంయమి పలికెన్
మీ రెవ్వ రెట్లు గోరిన, నారీతి జనింతు రిది యథార్థము చుండీ. 771

క. ఒక్కఁడు వంశకరుం డగుఁ, బెక్కండ్రుసుతుల్ ధరిత్రిఁ బృథుబలయుక్తిన్
మిక్కిలిఁ గీర్తి వహింతురు, నిక్కము నావచన మింక నృపసుతలారా. 772

ఆ. అనిన నగ్రపత్ని యగు కేశిని కుమార, వరునిఁ గోరె నొకని వంశకరునిఁ
దక్కినట్టిసుదతి తనయులఁ బెక్కండ్ర, నధికబలులఁ గోరె నద్భుతముగ. 773

వ. అమ్మునీంద్రుం డక్కాంతలు గోరిన వరంబు లొసంగె నారాజశేఖరుండు లబ్ధమనోరథుండై భృగువునకుఁ బ్రదక్షిణంబును బ్రణామంబునుం గావించి యతని చేత ననుజ్ఞ వడసి పత్నీసమేతుండై నిజపురంబునకుఁ జనుదెంచి పుత్రోదయంబుఁ గోరుచున్నంతఁ గొంతకాలంబు సనిన యనంతరంబ. 774

క. జనవిభుని యగ్రసతి కేశిని గాంచె సమస్తసాధుశిక్షోద్ధతునిన్
జనకంటకు నసమంజుం, డనుపుత్రుని వంశకరు మహాబలు నొకనిన్. 775

ఆ. అంత సుమతియనెడు కాంతగర్భంబునఁ, దుంబ యొకటి పుట్టెఁ దొలుత నదియు
విరియఁ దోడుతోడ నఱువదివేవురు, సుతులు పుట్టి రందు సుచిరముగ. 776

ఆ. వారి నెల్ల దాదు లారూఢిగా నాజ్య, పూర్ణఘటములందుఁ బొసఁగ నునిచి
సంతతంబుఁ బెనుపఁ గొంతకాలమునకు, శైశవంబు వీడి సంభ్రమమున. 777

చ. భువనమనోహరస్ఫురణఁ బొల్చుసముంచితయౌవనప్రభా
సువిహితరూపులై మిగుల సొంపును బెంపును గల్గి తేజమున్
జవమును విక్రమంబు భుజసత్త్వముఁ గ్రాల జగత్త్రయైకసం
స్తవమున నొప్పి రెంతయును దండ్రికిఁ జాల ముదం బెలర్పఁగన్. 778

ఉ. ఆయసమంజుఁ డెంతయు దురాత్మకుఁడై బహుళావలేపతం
బాయక సంతతంబు బుధపాళికి బాధ యొనర్చుచున్ రహిన్
డాయుచు బాలురన్ బహువిధంబుల నొక్కటఁ జిక్కఁ బట్టుకు
య్యో యని తల్లడిల్ల సరయూనదిలోఁ బడవైచు నుగ్రతన్. 779

వ. ఇట్లు పాపసమాచారుండును సజ్జనప్రతిబాధకుండు నై వర్తించుచుండ నంతఁ గొంతకాలంబున కయ్యసమంజునకుఁ దేజోజితాంశుమంతుం డై యంశుమంతుం డనుకుమారుం డుదయించి సర్వజనులకును బ్రియంవదుం డై సర్వలోకసమ్మతుం డై యొప్పుచుండఁ దద్గుణంబులకు సంతసిల్లుచు సగరుండు గొడుకువలని మోహంబు విడిచి యతనిదుశ్చారిత్రంబులు వినరామికి రోయుచు సకలజనానురాగంబుగా నసమంజుఁ బురంబు వెడల ననిచి కొంతకాలమునకు ఋత్విక్పురోహితుల విచారించి నిశ్చయించి సకలమహీనాయకత్వంబు సార్థకముగా నొక్కయశ్వమేధయాగంబుఁ గావించె నని పలికిన విశ్వామిత్రునిపలుకుల కలరి రాముం డమ్మహాత్ము నవలోకించి మునీంద్రా మదన్వయంబునం బుట్టిన పూర్వికులచరిత్రంబు వినవలఁతు సగరుని యజ్ఞం బెత్తెఱంగునం బ్రవర్తిల్లె సవిస్తరంబుగా నెఱింగింపవే యని యభ్యర్థించిన నమ్మునిస్వామి రఘుస్వామి కిట్లనియె. 780

మ. హిమవింధ్యాచలమధ్యదేశమున ధాత్రీశుండు చిత్తంబునం
బ్రమదం బొప్పఁ దురంగమేధ మొనరింపం బూని కావించుచో
రమణీయుం డగు నంశుమంతుఁడు దదర్థం బై నయశ్వంబు న

య్యమరారుల్ గొని పోవ కుండఁగ సముద్యచ్ఛక్తి రక్షింపఁగన్. 781

ఇంద్రుఁడు వంచనచే సగరునియాగీయాశ్వమును గొనిపోవుట.

చ. అనిమిషనాథుఁ డొక్క కుహనాసురవేషముఁ దాల్చి యంశుమం
తుని వెస డాఁగుటించి కుపితుం డయి పర్వమునందు నశ్వముం
గొని ఫణిరాజలోకమునకుం జని యం దతిగుహ్య మైనయా
ఘనకపిలాశ్రమంబు వెనుకన్ వడి దాఁచి చనెన్ రయంబునన్. 782

సీ. అంత ఋత్విగ్వరు లధ్వరాశ్వము పోవు టెఱింగి మహీపతి కిట్టు లనిరి
పార్థివోత్తమ యాగపశువు హృతం బయ్యె వెస నశ్వచోరుని వెదకి చంపి
హయమును దెప్పింపు మధ్వరంబునకు ఛిద్రము గల్గె నేనియుఁ దప్ప కిపుడు
మన కందఱకును నమంగళం బొనఁగూడు నట్లు గాకుండ నీయధ్వరంబు
తే. సాంగముగఁ జేయు మనవుడు జనవిభుండు
చాల మనమునఁ జింతించి సభకు వేగ
యమితసత్త్వుల షష్టిసహస్రసుతుల
నపుడె రావించి వారి కి ట్లనుచుఁ బలికె. 783

ఉ. పుత్రకులార యేవలనఁ బూర్వసుపర్వులు చూడఁ గాన మీ
సత్రము శాస్త్రదృష్టవిధి సాగుచు నున్నది యధ్వరక్రియా
సూత్రవిదుల్ మహామునులు సూచు సదస్యులు నేలకో మహా
చిత్రముగా మహాశ్వ మది చెచ్చెర సంహృత మయ్యె నీయెడన్. 784

ఉ. మీరు మదాజ్ఞచే రయము మీఱఁగ నేగి పయోధిచేత నా
వృతమగు మేదినీజగముఁ నారసి యశ్వము లేక యున్న న
ట్లూరక ధారుణీతలము నొక్కొకఁ డొక్కొకయోజనంబు సొం
పారఁగఁ ద్రవ్వఁ డధ్వరహయం బది గన్పడుదాఁక నుద్ధతిన్. 785

తే. భుజబలంబును నిభ్భంగి భుజగజగము
దాఁక వడి నంటఁ ద్రవ్వి యస్తోకమహిమ
నందు శోధించి హయచోరు నరసి చంపి
సవనహయమును గొని తెండు సత్వరముగ. 786

వ. ఏను దురంగదర్శనం బగునందాఁకఁ బౌత్రకుం డైన యంశుమంతునిం గూడి
యుపాధ్యాయగణసహితుండ నై దీక్ష వహించి యిచ్చట నుండువాఁడ. 787

సగరపుత్రులు భూమియంతయుఁ ద్రవ్వ నారంభించుట.

చ. అనిన మహాప్రసాద మని యాసగరుల్ ప్రళయావసానసం
జనితపయోధరారవము చాడ్పున నింగి చెలంగ నార్చి యే
ర్చినబడబాగ్నికీలలవిశేషము దోఁపఁ బ్రదీప్తమూర్తు లై
చనిరి మఖాశ్వము న్వెదక శక్తిగదాప్రముఖాయుధాఢ్యు లై. 788

వ. ఇత్తెఱంగునఁ జని గుహోపదేశక్రమంబునఁ బూర్వదెస మొదలుగా
జంబూద్వీపంబు చుట్టురాఁ దిఱుగ నొక్కొక్కఁ డొక్కొక్క యోజనంబుఁ
ద్రవ్వెద మని వజ్రస్పర్శసమంబు లైననఖంబుల నశనికల్పంబు లైనశూలం
బుల దారుణంబు లైనహలంబుల మహీతలంబు భేదింపం దొడంగిన నప్పుడు
భిద్యమానమహీనినాదంబును వధ్యమాననాగాసురనానాసత్త్వనిర్ఘోషంబును
సగరులకోలాహలంబును సాంద్రంబుగా నొక్కటి యై భూనభోంతరాళంబు
నిండి చెలంగె 789

చ. నిరుపమభంగి నిట్లు ధరణీతలముం భుజశక్తియుక్తిచే
నఱువదివేలయోజనము లద్భుతవైఖరిఁ ద్రవ్వి రానరే
శ్వరసుతు లంత సిద్ధముని సాధ్యసురుల్ భయ మంది భారతీ
శ్వరు కడ కేగి తచ్చరణవారిరుహద్వయికిన్ వినమ్రు లై. 790

దేవతలు సగరపుత్రభీతులై బ్రహ్మతో మొఱలిడుట.

క. పటుతరభంగి సపర్యలు, ఘటియించి హృదంతరమునఁ గౌతుక మలరన్
నిటలతటన్యస్తాంజలి, పుటు లై యిట్లనిరి కడుఁ బ్రబుద్ధత వెలయన్. 791

చ. వెలయఁగ మీకుఁ దెల్ప నొకవిన్నప మున్నది చిత్తగింపు మో
జలరుహగర్భ యాసగరసంభవు లుర్విఁ బ్రదక్షిణంబుగాఁ
జలమున ముష్టిముద్గరకశానఖసీరముఖంబులన్ రసా
తలభువనంబుదాఁకఁ జనఁ ద్రవ్వి రిభూరిభుజాబలంబునన్. 792

ఉ. వీఁడె మఖాశ్వచోరకుఁడు వీఁడె దురాత్ముఁడు వీఁడె వైరి పో
వీఁడె సుమీ తలంప మఖవిఘ్నకరుండు వధింపుఁ డంచు నె
గ్గాడుచు వీఁడు వాఁ డనక నఖులకుం గనఁబడ్డవారి మో
మోడక త్రుంచి రింకఁ గమలోద్భవ తద్విధి వేగ మాన్పవే. 793

మ. అని యావేల్పులు విన్నవించుటయు భాషాధీశుఁ డవ్వేల్పులం
గని యోనిర్జరులార శౌరి కపిలాఖ్యస్థాని యై యున్నవాఁ
డనిశం బామహనీయమూర్తి ఘనకోపాగ్నిస్ఫులింగాలి చ
య్యనఁ బంచత్వము నొందఁగాఁ గలరు మీ కత్యంతహర్షంబుగన్. 794

(తే. క్షితివిభేదనంబున దీర్ఘజీవు లైన, సగరపుత్త్రుల నాశంబు స్వర్గులార
నిశ్చిత మవశ్యభావులు నియతివలన, వగవవలవదు దీనికి స్వస్థుల రయి.)

క. మీమీ నెలవులకుం జనుఁ, డీ మనమున నెమ్మి మీరు ధృతి వదలక మీ
కీమీఁద శుభము గలిగెడు, నామాధవుకరుణఁ జేసి యనిమిషులారా. 795

క. అని ద్రుహిణుఁ డానతిచ్చినఁ, జని రయ్యాదిత్యు లాత్మ సదనంబులకున్
వినయమున మ్రొక్కి వీడ్కొని, ఘనతరసంతోషకుతుకకలితహృదయు లై.

వ. అంత నిక్కడ. 797

ఉ. ఆసగరావనీంద్రసుతు లయ్యహిలోకముదాఁకఁ ద్రవ్వి య
చ్చో సవనాశ్వముం జనినచొప్పు గనుంగొనలేక మిక్కిలి
న్వేసరి తండ్రిచక్కటికి వెండియు వచ్చి నమస్కరించి యు
ల్లానము లేనిమానసము ల న్వచియించిరి దీనవక్త్రులై. 798

ఉ. అయ్య ధరిత్రియంతయు రయంబునఁ ద్రవ్వితి మెందు నశ్వముం
జయ్యన నశ్వచోరుఁ బెలుచం గన నైతిమి దోర్బలంబుచే
నయ్యెడ యక్షదైత్యపతగాదులఁ జంపితి మింకమీఁద మా
కెయ్యది కార్య మన్న వసుధేశ్వరుఁ డిట్లనుఁ జండకోపుఁ డై. 799

ఉ. క్రమ్మఱ నేగి మీరలు ధరాతలము న్వడిఁ ద్రవ్వి లోకముల్
ద్రిమ్మరి యశ్వచోరకునిఁ దేకువఁ గన్గొని వే కృతార్థులై
సమ్మతి రండు పొం డనినఁ జయ్యన వారు రసాతలప్రదే
శమ్మున కేగి రొక్కమొగి సత్వరతఁ జనయుక్తి వెండియున్. 800

క. ఈగతి భుజావలేప, శ్రీగరిమ దలిర్ప భుజగసీమకుఁ జని యెం
తో గాఢకుతూహలమునఁ, బ్రాగాశకుఁ జనిరి మొదలఁ బ్రాభవ మొప్పన్. 801

వ. ఇవ్విధంబునఁ జని యందు సర్వకాలంబునం దెయ్యది భూభారవాహనజనిత ఖేదంబున నొక్కింత విశ్రమార్థంబు శిరంబుఁ జలింపంజేసి దాన భూకంపంబుఁ గలుగంజేయునట్టిదానిఁ బర్వతారణ్యసహితం బైనమహీతలం బంతయు శిరంబున మోచికొని యున్నదాని మహాపర్వతసన్నికాశం బైనదాని విరూపాక్షనామకం బైనదిగ్గజంబు విలోకించి సమ్మానించి దానికిం బ్రదక్షిణంబుఁ జేసి యచ్చోటుఁ బాసి యామ్యదిశకుం జని యందు. 802

ఆ. అఖిలభువనభారమంతయు శిరమునఁ, దాల్చి హేమపర్వతంబుకరణి
నలరుదాని యలమహాపద్మమనుదిశాగజముఁ గాంచి యరుదు గడలుకొనఁగ.

తే. దాని వలగొని యవ్వల మానితముగఁ, బశ్చిమాశకుఁ జని యందు పర్వతంబు
మాడ్కి నొప్పెడుదాని సౌమనసమనెడు,సామజంబును గని దానిసేమ మరసి.

తే. దానికిఁ బ్రదక్షిణముఁ జేసి ధరణి యెల్లఁ, ద్రవ్వికొనుచు బలప్రౌఢి నివ్వటిల్ల
నరిగి తుహినాద్రిభూషితం బైనయుత్త,రాశఁ జేరి నృపాత్మజులంద ఱచట.

క. హిమశైలపాండురం బై, క్షమాభరము నెల్ల భద్రగాత్రముచే న
శ్రమమునఁ దాల్చి యలరునా, గముఁ గాంచిరి భద్రనామకం బగుదానిన్.

వ. ఇత్తెఱంగున విలోకించి దాని నభినందించి ప్రదక్షిణంబుఁ గావించి యచ్చోటుఁ బాసి మహీతలంబు భేదించుకొనుచు నీశాన్యదిక్కునకుం జని యం దొక్కచోటఁ దపంబుఁ గావించుచున్నకాపిలరూపధరుం డగువాసుదేవునిం జూచి తత్పరిసరంబునం జరించుచున్నహయంబు నవలోకించి సంప్రహృష్టచిత్తు లై యమ్మహాత్ముని హయచోరకుంగాఁ దలంచి ఖనిత్రలాంగలశిలాపాదపంబులు

ధరించి క్రోధపర్యాకులేక్షణు లై యమ్మహాత్ముని డాయం జని. 807

—కపిలమహర్షి క్రోధానలంబున సగరపుత్త్రులు దగ్ధులగుట.—

తే. ఔర దుష్టాత్మ నిలు నిలు మస్మదీయ, తురగమును గొని తెచ్చినదాంగ వీవు
మమ్ము సగరపుత్త్రులనుఁగామదినెఱుంగు,మనుచుఁ బలికిన నమ్మునికినుకఁ బూని.

తే. ఘోరహుంకార మొనరింప వార లమ్మహాత్ముకోపాగ్ని దగ్ధులై యద్భుతగతి
క్షోణిపై భస్మరాసులై కూలిరపుడు, దైవకృత మెవ్వరికినైన దాఁటవశమె.

వ. అంతఁ జరవిప్రోషితు లైనపుత్త్రులం దలంచుకొని సగరుండు. 810

ఉ అచ్చుపడంగఁ బుత్త్రులు మహాధ్వరసైంధవరాజముల్ వెసం
దెచ్చెద మంచుఁ బోయి రతితీవ్రగతిన్ బహుకాల మయ్యె రా
రెచ్చటి కేగిరో మదికి నెంతయు నెవ్వగ నివ్వటిల్లెడుం
జెచ్చెర వారల మ్మగముఁ జెందఁగ నెన్నఁడు చూడఁ గల్గునో. 811

—సగరుఁడు దనపుత్త్రులజాడఁ గనుంగొనుట కంశుమంతుఁ బుత్తెంచుట.—

చ. అని తలపోసి యమ్మనుకులాఘ్యుఁడు పౌత్త్రకు నంశుమంతుఁ గ
న్గొని యను వత్స నీదుజనకుల్ సవనాశ్వముఁ దెత్తు మంచుఁ జ
య్యనఁ జని రారు పెక్కుహాము లయ్యె నహంకృతి నెందుఁ బోయిరో
జనకులజాడఁ గాంచి మఖసైంధవముం గొని తెమ్ము నీ విఁకన్. 812

వ. మఱియు నీవు శూరుండవు కృతవీర్యుండవు కృతవిద్యుండవు పూర్వరాజసంకా
శుండవు గావున నీకుం జెప్పనలసినవిశేషం బెద్దియు లేదాంతర్భూమంబు లగు
మహాసత్వంబులు వీర్యవంతంబులై యుండు నీవు నిరాయుధుండవై పోవం జన
దు కార్ముకఖడ్గంబులు ధరియించి యపుడ కదలి పెద్దలగువారి సమ్మానించుచు
విఘ్నకరు లగువారి వధియించుచు నప్రమాదుండ వై యరిగి సిద్ధార్థుండవై
క్రమ్మఱం జనుదెమ్ము యజ్ఞపారగుండవు గమ్మనిపల్కి యనిచిన నయ్యంశుమంతుం
డు పితామహునిశాసనంబునఁజాపఖడ్గంబులు ధరియించి పితృఖాతంబైనయంత
ర్భూమమార్గంబునం జని దైత్యదానవరక్షఃపిశాచపతంగోరగంబులచేతఁ బూ
జ్యమానుం డగుచు దిగ్గజంబుకడకుం జని ప్రదక్షిణంబుఁ జేసి పితృహయవార్త
నెఱింగింపు మని యడిగిన నద్దంతావళరాజంబు పరమానందంబున ని ట్లనియె.

తే. రాజనందన నీవు శీఘ్రంబె సవన,తురగమును వెంటఁగొని కృతార్థుండ వగుచు
నరుగుదెంచెద విది నిక్కమరుగుమనిన,నతఁడుమనమునహర్షించియనలఁబోయి.

ఆ. దాని నడిగినట్లు తక్కినదిక్పాల, సామజముల నడుగఁ బ్రేమ నవియు
నభ్రగజము సెప్పినట్లు చెప్పినఁ బ్రీతి, నంశుమంతుఁ డవల నరిగి యరిగి. 815

—అంశుమంతుఁడు కపిలాశ్రమంబున నశ్వమును భస్మీకృతజనకులనుం గాంచుట.—

వ. మహోన్నతం బైనకపిలునిదివ్యాశ్రమంబునకుం జని యందు. 816

చ. తురగముఁ గాంచి సంతసిలి తోడనె యమ్మునినాథుచెంగటన్

గుఱుతుగ భస్మరాసు లయి కూలినతండ్రులఁ గాంచి భూరిశో
కరసనిమగ్నచిత్తుఁ డయి గాసిలి పెక్కువిధంబులం గడుం
దఱలుచుఁ గొంతసేపునకుఁ దద్దయు ధైర్యబలావలంబి యై. 817

క. జనకులకు నుదకతర్పణ, మొనరింపఁ దలంచి యచట నుదక మరసి యెం
దును గానక నడ్డెస ల,త్యనుపమగతిఁ జూచు చుండ నాసమయమునన్. 818

గరుడుఁ డంశుమంతునికిఁ బొడసూపి తజ్జనకులకు సద్గతి గలుగునుపాయం బెఱిఁగించుట.

ఉ. ఆయతపక్షవాతచలితాచలుఁ డై ఖగవంశనాయకుం
డా యెడ కేగుదెంచినమహాత్ముని తండ్రులమేనమామనుం
బాయక కాంచి యంఘ్రులకు భక్తినమస్కృతి యాచరించి కే
ల్దోయి ఘటించి చాల వినుతుల్ పచరించి భజించి యుండఁగన్. 819

వ. మనుమనిం గని సాంత్వవచనంబుల ననునయించి యిట్లనియె. 820

మ. అనఘా నీజనకుల్ వడిం గపిలుకోపాగ్న్యర్చులన్ భస్మమై
చని రీ వింకిట వారికై వగచు టేసాధించుకార్యంబు గ్ర
న్నన నెవ్వారికి నైన దైవకృతముం దప్పింపఁగా వచ్చునే
విను కర్మంబులు గాలచోదితము లై వెన్నాడి వర్తింపవే. 821

తే. జనవరకుమార వీరల చావు లోక, సమ్మతము దీని కింత శోకమ్ము వలదు
కపిలు కోపానలంబునఁ గాలి నిరయ, గతికి జని యున్నవారు సాగరులు వీరు.

క. కావున నీజలదానముఁ, గావించిన ఫలము లేదు ఘనముగ వీరల్
ధీవర్య వినుము శుచు లై, దేవత్వము నొందునట్టి తెరు వెఱిఁగింతున్. 823

క. జగతీశతనయ హిమవ, న్నగపతియగ్రసుత గంగ నాఁ గల దయ్యా
పగయందుఁ దండ్రులకుఁ జక్కఁగ నుదకక్రియ యొనర్పఁ గలుగు శుభగతుల్.

వ. మఱియు నమ్మహానది లోకపావని గావునఁ దద్విమలజలంబుల నీభస్మరాసులఁ
దడిపితి వేని పరిశుద్ధు లై యూర్ధ్వలోకంబునకుం జనియెద రిప్పు డిచ్చట మసలక
శీఘ్రంబున హయంబునుం గొని చని పితామహునిచేత యజ్ఞంబు సాంగం
బుగాఁ జేయింపు మనిన నాసుపర్ణుని వచనంబు విని వీర్యవంతుం డగు నంశుమం
తుండు హయంబును రయంబునం గొని దీక్షితుం డైన సగరునియొద్దకుఁ గ్రమ్మ
ఱం జని యశ్వోత్తమంబు సమర్పించి తండ్రులపోక యెఱింగించి సుపర్ణునివచ
నంబు విన్నవించిన విని యమ్మహీరమణుండు దుఃఖితుం డై కొండొకధైర్యం
బున నమ్మహాయజ్ఞంబు సమాప్తి నొందించి నిజపురంబునకుం జనుదెంచి స్వర్గం
గను బుడమికిం దెచ్చుటకుఁ దగినయుపాయంబుఁ జింతించి నిశ్చయింపం జాల
క ముప్పదివేలవత్సరంబులు రాజ్యంబుఁ జేసి కాలధర్మంబు నొందె నంత. 825

తే. మంత్రులయ్యంశుమంతునిమహితరాజ్య,మందు నభిషిక్తుఁ గావించి రన్నరేంద్ర
వరుఁ డలదిలీపుఁ బుత్త్రుఁగా బడసి యతనిఁ, జెలఁగి సామ్రాజ్యమం దభిషిక్తుఁ జేసి.

తే. గరిమతోఁ దుహినాద్రిశృంగంబుమీఁదఁ
బ్రీతి మెఱయంగ ముప్పదిరెండువేల
యేండ్లు దపముఁ గావించి యభీష్టసిద్ధిఁ
గాంచఁ జాలక యతఁడు నాకమున కరిగె. 827

సీ. అంత దిలీపభూపాగ్రణి తాతలమరణంబు విని చాల మనములోన
దుఃఖించి హిమశైలదుహిత యాగంగ యెబ్భంగి ధాత్రికివచ్చుఁ బరఁగ సలిల
తర్పణం బెట్టు లొనర్పంగఁ జేకుఱు నొనర వారల నెట్లు నుద్ధరింతు
ననుచుఁ జింతాపరుం డై నిశ్చయింపంగఁ జాలక ముప్పదివేలయేండ్లు
తే. రాజ్యమొనరించి బహుళాధ్వరములఁ జేసి
రమణధార్మికుఁ డగుభగీరథుని ఘనుని
సుతునిఁ గాఁ గని యతని భూపతినిఁ జేసి
వ్యాధిపీడితుఁ డై దివి కరిగె నతఁడు. 828

—భగీరథుఁడు గంగావతరణమునకుఁగాఁ దప మొనర్చుట.—

ఉ. ఆనరరాజసూనుఁడు మహాద్భుతవీర్యుఁడు వంశపావనుం
డై నభగీరథుండు నిఖిలావని నేలుచు నుండి ధాత్రికి
మానుగ గంగఁ దెత్తు నని మంత్రుల రాజ్యమునందు నిల్పి లో
నానినకౌతుకంబు సెలువారఁ దపంబున కేగెఁ బ్రీతితోన్. 829

వ. ఇవ్విధంబున నమ్మహీమిహికాంశుండు గోకర్ణాశ్రమంబునకుం జని యందు.

సీ. కుడికాలు పెనువ్రేలు పుడమిపై మోపి డాపలికాలు గుడికాలుపై ఘటించి
చేదోయిఁ బెనువ్రేల నూఁదిమీఁదికిఁ జాఁపి జగతిఁజూడక యేగుమొగముఁ జేసి
కటికివేసవియందు ఘనచతుర్వహ్నిమధ్యమున నిల్చి మహోగ్రహాంసమండ
లంబుఁ గన్గొనుచు వర్షాకాలమున వారినడుమ నిల్చుచు నిట్లు కడు సమాధి
తే. నచలనిష్ఠ మాసాహారుఁడై యమోఘ, ఘనతపోవహ్నిశిఖలు లోకములఁబర్వి
ప్రళయకాలాగ్నిహేతులపగిది నేర్పఁ, దవిలి యబ్దసహస్రముల్ దప మొనర్చె.

భగీరథునకు బ్రహ్మప్రత్యక్షమై గంగాపాతము సహించుటకై యీశ్వరుని బ్రార్థింపుమనుట.

ఉ. అంత సమస్తలోకగురుఁ డంబుజగర్భుఁడు వేల్పుపెద్ద వా
క్కాంతుఁడు మెచ్చి నిర్జరనికాయసమన్వితుఁ డై రయంబునం
బంతముతో నమేయగతి భవ్యతపం బొనరించు చున్నభూ
కాంతునిఁ జేర వచ్చి కుతుకం బలర న్మధురోక్తి ని ట్లనున్. 832

ఉ. మెచ్చితి ధారుణీరమణ మించినవేడ్క వరం బొసంగఁగా
వచ్చితి నీతపం బుడిగి వాకొని యిష్టము దెల్పు మన్న నా
సచ్చరితుండు దచ్చరణసారసముల్ దల సోఁక మ్రొక్కి లో
హెచ్చినభక్తి దేటపడ నింపుగ నంజలిఁ జేసి యి ట్లనున్. 833

క. నిక్కముగ నీకు నాప్తై, మక్కువ గలదేని దేవ మాతాతలు పెం
పెక్కఁగ నాచే సలిలము, గ్రక్కునఁ గొనువారు గాఁగ ఘటియింపఁగదే. 834

వ. మఱియు నాతపం బమోఘం బేని భస్మరాసులు గంగాసలిలక్లిన్నంబు లగు చుండ సాగరు లూర్ధ్వగతికిం జనువారు గాఁ బ్రసాదింపవలయు నదియునుం గాక ఘోరం బైనయనపత్యతాదోషంబున సౌమనస్యంబుఁ గానక శోకించు చున్ననాకు వంశకర్త లగుపుత్త్రుల ననుగ్రహింపవలయు నని యడిగిన సర్వ లోకపితామహుం డగువిరించి యుదంచితకరుణాకటాక్షవీక్షణంబుల భగీరథు నిరీక్షించి మంజుమధురాక్షరవ్యక్తంబుగా ని ట్లనియె. 835

తే. అనఘచారిత్ర నీకోరినట్ల యగును, డెందమున నింక సందియ మందవలదు
వితతమతి నీకు నింకొకహితముఁ జెప్పెదను సమాహితబుద్ధివై వినఁగవలయు.

చ. హిమగిరిపుత్త్రి గంగ నొగి నిమ్మని పల్కితి వట్ల యిచ్చితిన్
విమలగుణాఢ్య తత్పతనవేగము ధాత్రిసహింపఁ జాల దా
ప్రమథగణాధినాథుఁ డగురాజకిరీటుఁడు దాల్పఁగావలెం
బ్రవిమలతేజ నవ్విభునిఁ బ్రార్థనసేయు మమోఘనిష్ఠతోన్. 837

వ. మఱియు నాగంగానది హిమవంతునకు జ్యేష్ఠపుత్త్రిక గావున దాని ధరింప నీశ్వ రుండె యర్హుం డగు నమ్మహాత్ముండుదక్క నన్యుండు గంగాపతనవేగంబు సహిం చుటకు శక్తుండు గాఁ డద్దేవదేవు నారాధింపుము. 838

చ. అని యిటు లానతిచ్చి యజుఁ డానృపమౌళికి వంశకర్తలం
దనయుల నిచ్చి క్రమ్మఱ ముదంబున గంగను బిల్చి యామహా
త్మునివెనువెంట నేగుము సముద్ధతిఁ గోరినయప్పు డంచుఁ జ
య్యన నియమించి యాత్మనిలయంబునకుం జనియెన్ సలేఖుఁ డై. 839

భగీరథునికిఁ బరమేశ్వరుండు ప్రొడసూపి గంగను శిరంబునవహింతు నని కరుణించుట.

ఉ. అంత సరస్వతీరమణు నానతి నమ్మహికాంతుఁ డద్రిజా
కాంతునిఁ గూర్చి వత్సరము గ్రక్కునఁ బాదతలాగ్ర మూర్విపై
నెంతయు మోపి బాహుయుగ మెత్తి నిరాశ్రయుఁ డై చలింప క
భ్యంతరసిద్ధినొంది పవనాశనుఁడై తప మాచరించినన్. 840

వ. అంత సంవత్సరంబు పరిపూర్ణం బగుటయుఁ దత్ప్రియాసంబుఁ జూచి కరుణించి సర్వలోకనమస్కృతుం డై నయుమావల్లభుండు క్షమావల్లభునకుం బొడసూపి యిట్లనియె. 841

క. నరనాయక నీనిష్ఠకు, నిరుపమసంతోష మొదవె నీకుఁ బ్రియముగా
గిరిరాజపుత్త్రి గంగను, శిరమున ధరియింతుఁ దెమ్ము చెచ్చెర దానిన్. 842

క. అని రాజమౌళి వల్కిన, జననాయకుఁ డుల్లసిల్లి చతురతచే న
య్యనిమేషధునిని వేఁడుట,యును దయ నప్పావ నాపగోత్తమ యంతన్. 843

తే. సంగతాభంగరంగతరంగసంగ
ఘట్టనోద్భూతరవము లోకత్రయంబుఁ
బగులఁ జేయంగ సకలదిగ్భాసమాన
యగుచు మిన్నేఱు గగనంబు దిగియె నపుడు. 844

—గంగావలేపంబునకుఁ గ్రుద్ధుఁడై పరమేశ్వరుఁడు దనజటాజూటంబుఁ బెంచుట.—

వ. ఇట్లు దుర్వారవేగంబునం బఱతెంచి శివం బగుశివశిరంబునం బడి యంత నిలువక మదీయస్రోతోవేగంబున శంకరుం బరిగ్రహించి పాతాళలోకంబుఁ బ్రవేశించెదఁ గాక యని సరభసంబుగాఁ బఱవం దొడంగిన నయ్యాదిదేవుండు దానియవలేపనం బెఱింగి క్రుద్ధుండై యొక్కింత గర్వవిమోచనంబుఁ జేయుదుఁ గాక యని తలంచి వాటంబుగా జటాజూటంబుఁ బెంచిన నయ్యె అయ్యుమావల్లభునిజటామండలగహ్వరమధ్యంబునఁ దుషారకణమాత్రంబై చిక్కువడి తన శక్తికొలంది మహీతలంబున కవతరింప నతిప్రయత్నంబుఁ జేసి మరల వెడలు తెఱం గెఱుంగక యనేకవత్సరంబులు దిరుగుడు వడుచుండె నంత. 845

—భగీరథుఁడు శివశిరంబునఁ బడినగంగం గానక తపం బొనరింప శివుండు కరుణించుట.—

ఉ. ఆమను జేంద్రచంద్రుఁడు వియన్నదిఁ గానక యెందుఁ బోయెనో
నామదిఁ జూడఁ గోరి గణనాథుశిరంబున నెందు డాగెనే
యేమి యొనర్చువాఁడ నిఁక నెయ్యది కర్జ మటంచుఁ గ్రమ్మఱం
గామహరుం గుఱించి కుతుకంబున ఘోరతపం బొనర్చినన్. 846

క. మేటిగ నతఁ డొనరించెడు, గాటపుఁదపమునకు గరుణ గదుర నిజజటా
జూటంబువలన శంభుఁడు, వాటముగా విడిచె దేవవాహిని నంతన్. 847

వ. ఇటు హిమవన్నందని యైనగంగ సర్వలోకనమస్కృతుండైన పినాకధరుని జటాజూటంబువలన నిర్గమించి బిందుసరోవరంబునం బడి సప్తప్రవాహ యయ్యె నందు హ్లాదినీ పావనీ నళినీ సంజ్ఞంబు లగుమూఁడు ప్రవాహంబులు దూర్పుదెసకుం జనియె సీతా సింధు సుచక్షు సంజ్ఞలు గల మూఁడు ప్రవాహంబులు పశ్చిమదిక్కునకుం జనియె మఱియును. 848

సీ. దివి కేగ మదిలోనఁ దివురుభూజనులకు నిశ్శ్రేణు లన నూర్మినికరములును
జెలిమిఁ దారలతోడఁ జేయంగఁ జనుమాడ్కి వినువీధి కెగయుజీవనకణములు
ధర్మాత్ము లగువారి నిర్మలకీర్తులకరణి నొప్పెడు ఫేనఖండతతులు
నీరీతిఁ ద్రిప్పుదు నెల్లదోసము లంచు దెల్పుచందంబునఁ దిరుగు సుళ్లు

తే. వెలయ వినువీధి శరదభ్రవిభ్రమంబు, గలిగి యొకదివ్యవాహిని యలభగీర
థావనీనాథువెనువెంట నంటియఘున,మూహములఁ బాప భూలోకమునకువచ్చె.

వ. అది మఱియు శంకరజటాజూటతటాధివాసుం డగుహిమకరునికిరణము లన్నియు సర్వతోముఖత్వంబు మాని యేకీభవించి యక్కురంగలాంఛనుని

శరీరంబుననుండి దిగ్గెసాగి పఱతెంచు చున్నచందంబున నందంబై, యుల్లోల కల్లోలమాలికాడోలికాకలితరథాంగ బాలికాతను చ్ఛాయావిలాసంబుల దదీయస్రోతో వేగ బాహుళ్యంబున గగనంబున నుండఁజాలక పుడమిం బడ నడరుధారాధరమండలంబువలన నెడతెగక పడునీరమ్ముసలసంపదసొంపు సంపాదింప, నిలింపులు దమకు నిరంతరజీవనం బైనయిన్నేఱు పుడమికి దిగుటకుఁ జిరకాలసంస్తవంబుననోర్వక బాష్పధారాపూరవ్యాజంబున వగవఁగరకిసలయంబులుసాఁచి మంజువాక్యంబుల వారి ననునయించు చున్నదో యన నంబరచుంబిసముత్తుంగరంగత్తరంగంబులుఘుమఘుమారావంబులతో నొండొంటిం దాఁక, భవద్విషయకృతాపచారదోషవిశేషంబుగా నిరయగతికింజనిన సగరధరణీతరుణీపురందర నందనసందోహంబు సద్గతినొందింపంబూని యనుజ్ఞ వడయుటకు మదుత్పత్తిస్థానం బైనభవదీయచరణమూలంబులు సేవింప వచ్చుచున్నదాన మద్వాంఛితంబు ఫలింపం జేయవే యని కపిలమహామునిం బ్రార్థించుటకుఁ గరంబులుతిరంబుగా మొగిచెనో యని యుపమింప సొం పైనతదీయ విమలసంవర్ధితజాంబూనదారవిందకుట్మలంబులు నయనానందకరంబు లై యలర, సమ్మృతరసాధి దేవత సమస్తభువనజీవనం బైనతనజీవనంబునకు ననవరత సర్వతోముఖ తావిచ్ఛేదకత్వంబుసంపాదింపందలంచి జగన్మాతనావహింపం జేసి పూర్ణపరికీర్ణపరాగపటలపరిలేనంబు సంఘటించి వినూతన కేసరవిరహారిద్రాక్షతంబులు సమర్పించి రంజన్మకరందబిందుబృందపాద్యం బొసంగి సముంచితరంజత్కింజల్కపుంజచ్ఛాయదీపాంకురంబు లిడి మకరందపానమత్తమధుకరమధుర గానమంత్రంబు లుచ్చరించుచు ముహుర్ముహుర్గ్లురదభంగతరంగమృదంగనిస్వనంబు సెలంగ నర్పించినసంపూర్ణసుధాపూర్ణకనత్కనకకలశంబులచెలువున నలరువినూతనచామీకరసారసకోరకంబులఁ గలంచి బిసఖండకాండంబులు మెసవి తదీయమధురమధుపానవశంబున మదించినయంచతండంబుల పక్షవిక్షేపణసంజాతసముద్ధూతశీతలజలబిందుబృందంబులు వాయువశంబున మింటి కెగసి తత్పతనచాతురీసమాలోకనకౌతుకాతిరేకంబున విమానారూఢు లై చనుదెంచి తదుపరిప్రదేశంబునఁ జాలుగొని యున్నసిద్ధవిద్యాధరాంగనల గొప్పకప్పుకొప్పులకుం జుట్టినదట్టంపుఁగ్రొత్తముత్తియంపుసరుల మొత్తంబుల గతి నతిరమణీయంబు లై చూపఱులచూడ్కులకు వేడ్కఁ జేయఁ బెక్కుకాలంబుననుండి హిరణ్యగర్భుండు కమలంబున నివసించినకారణంబున నతనిమేని జిగి సోఁకి కుందనపుఁజాయల నలరు కేసరవిసరంబులనడుమ వాసంబుఁ జేయుటం జేసి నిజమాలిన్యంబు దొఱంగి పుటపాకశోభితకార్తస్వరకలికానుషమాభిరామంబు లైనచందంబున నందంబు లగుకమలపరాగపటలపిశంగీకృత పుష్పంధయసముదయంబులు సరోజపరిమళరసాస్వాదనంబునం దనివి సనక

మిన్నునం జాలుగొని యున్న కిన్నరాంగనలచికురబంధంబులం జుట్టినసంతాన కుసుమవాసన లాఘ్రాణింప మింటి కెగసి జంట గూడి ఝంకారంబులు సేయుచుఁ దదీయమధురగానంబున కనురూపం బైనశ్రుతినాదవిలసనంబు హత్తింప, నాచార్యదారపరిగ్రహదోషవిశేషంబున దోషాకరుండు పవిత్రం బైనసర్వజ్ఞునిశిరంబున నుండ నర్హుండు గాక యద్దేవదేవునిచేత వెలువరింపం బడి ప్రవాహంబు వెంటం బఱతేరఁ దుమురై నతచ్ఛకలంబులభంగి నిండుకొని యున్నజలబుద్బుదంబులుగలిగి సగరమహీమండలాఖండలతనుజాతసమాజాతాఘవ్రాతంబుల నత్తెఱంగున నుడిఁ బెట్టెద నింక సందియంబునొందకు మని యమ్మహానది భగీరథనరేంద్రచంద్రునకు సాంద్రానందంబుగాఁ దెల్పిన ట్లులసిల్లు సుళ్ల పెల్లునకుఁ దల్లడిల్లుచునుత్ఫుల్లసల్లలితహల్లకాంతర్బహిర్గతమత్తమధువ్రతవ్రాతంబులు సుడివడి మునుంగ నిత్తెఱంగున మదీయపావనజీవనంబులఁ గనుంగొనినవారిమునింగినవారికలుషవ్రాతంబుల వారింతు నని యత్తరంగిణీమణి యెల్లవారి కెఱింగించె నని యుపమింపం దగి యలర, నద్దివ్యవాహినీరత్నంబు దనకుం గలమహిమాతిరేకం బితరతరంగిణులకు లే దని యుభయతటనటత్కారండవపటలస్వనమిషంబున నాడుచు నవ్వినచెలువునవ్వుచందంబున నందం బగుపాండురడిండీరఖండకాండంబులు గండంబులపై మెండుగ నిండుకొని యిండువేడుక నెఱప, భగీరథమహీపాలునిపైఁ బొడమినరుద్రదేవునికరుణారసంబు వాహినీరూపంబు నొంది సితశతపత్రాతపత్రంబులతోఁ గాశచామరంబులతో రంగద్భృంగసంగీతనాదంబులతో రథాంగదంపతినిర్ఘోషసాహోనినాదంబులతో దరంగపాళీకేళీకలితమరాళీగణంబులుమంజులశబ్దంబుల జోహారు సేయఁ గల్లోలమాలికాపరస్పరసంఘటనసంజాతబహుళస్వనంబులు మంగళతూర్యనిస్వనంబులఁ దెలుపఁ జలిమలనుండి భగీరథమహీమండలాఖండలునివెంట భూలోకంబుఁ బావనంబు సేయుటకు మీఱిన కోరికతో నూరేగుచుఁ జనుదెంచు చున్నదో యని యుత్ప్రేక్షింపం దగి పట్టరానివేగంబున మట్టు మీఱి యిట్టట్టు గదల్ప రాక యెదురు దట్టించినబెట్టిదంబు లగుపెనుగట్టుల నెల్ల బట్టబయలు సేయుడు భగీరథునిమనోరథంబు సఫలంబుఁ జేయుటకు దుర్వారవేగంబున నరుగుదెంచు చుండె నప్పుడు. 851

క. ఎడ తెగక మింటివలనం, బడియెడుఘనమత్స్యకచ్ఛపంబులచేతన్
వడిఁ బాఱుజలముచేతను, బుడమి కడువిచిత్రభంగిఁ బొలుపై యొప్పెన్.

క. దితిజారులచే విలస, ద్వితతతదీయావతంసదీధితిచేతన్
గతతోయద మగు గగనము, శతార్కమయిన క్రియ నలరె సాంద్రద్యుతియై.

తే. చంచలము లైనమత్స్యకచ్ఛపవిహంగ, శింశుమారగణంబులచేత నపుడు
గగన మొప్పారె మఱియు భాస్కరకులాబ్ధి, శీతకరదీప్తశంపలచేతఁ బోలె.

మఱియు గగనంబు సంకీర్యమాణవిమల
ఘనవనోత్పీడహంససంఘములచేతఁ
బరివృతం బయి శారదాభ్రములచేతఁ
బరివృతం బైనకరణి నచ్చెరు వొనర్చె. 855
గొదసేయుచు సుడి దిరుగుచు, నెదు రేగుచు గగనమునకు నెగయుచు వడితోఁ
బడపడి ధరపై వ్రాలుచు, ముదమునఁ జనుదెంచె గంగ భూపతివెంటన్. 856
ఏమార్గమున భగీరథ, భూమీశలలామ మరిగెఁ బోలుపుగ నదియుం
బ్రేమ దళుకొత్త రయమున, నామార్గముఁ బట్టిచనియె నాతనివెంటన్.
అప్పుడు. 858
సరసిజగర్భుఁ డాది యగుసర్వదివౌకసు లమ్మహాపగన్
సరసతఁ జూచువేడుకఁ బ్రసన్నమణీమయహారచేలనూ
పురమకుటాంగదాదివరభూషణముల్ ధరియించి మించి యు
ప్పరమున నిల్చి మ్రొక్కి బహుభంగుల నంజలిఁ జేసి యింపునన్. 859
అతులితభక్తియుక్తు లయి యన్నది నందఱు వేయునోళ్లఁ బ్ర
స్తుతు లొనరించి నేర్పుమెయిఁ దోరపువేడుక గట్లఁ జూడ నం
చితగతి డిగ్గి తద్విమలశీకరపఙ్క్తులు మీఁద వ్రాలఁగాఁ
జతురతఁ బుణ్యతీర్థముల స్నానముఁ జేసి జపించి రెంతయున్. 860
ఆనందంబునఁ గూడి యాడిరి పదవ్యక్తంబుగా నచ్చరల్
నానాసూనవితానమాలికల నందం బొప్ప నర్పించి రా
మౌనిశ్రేష్ఠులు మ్రోసె నౌర పటుశుంభత్తూర్యనిర్ఘోషముల్
గానం బున్నతి సల్పి రశ్వవదనుల్ గల్యాణభావంబునన్. 861
సురసిద్ధసాధ్యకిన్నర, గరుడోరగయక్షదైత్య గంధర్వాదుల్
బఱతెంచుచుండి రప్పుడు, ధరణీపతిరథమువెంట దద్దయుఁ బ్రీతిన్. 862

జహ్నుమహాముని గంగానది యంతయు మ్రింగుట.

తనపావనజీవనములఁ, గనువారి మునుంగువారికలుషౌఘంబుల్
మునుముట్టఁ గొట్టిపెట్టుచు, ననిమిషనది నృపునివెంట నరుదెంచె రహిన్.
అను వందం దగ జహ్ను వర్యోడ మఖం బారూఢిఁ గావింపఁ ద
ఘ్నయజ్ఞాయతనంబు వారిమయముం గావించినన్ దానిఁ జ
య్యన వీక్షించి బళా యటంచుఁ గుపితుం డై యమ్మహాపుణ్యుఁ డా
ననగోళంబుఁ దెరల్చి మౌను లరుదంద న్మ్రింగె నవ్వాహినిన్. 864
ఆమహిమంబు గన్గొని మహర్షులు లేఖవరుల్ భగీరథ
క్ష్మావరనేతయున్ వివిధమార్గములం దను సన్నుతింపఁగా
నామౌని వెండి తా నుమిసి యన్నది నెంగిలి సేయ నొల్ల కెం

తో ముద మొప్పఁగా విడిచెఁ దోడన కర్ణబిలంబులన్ రహిన్. 865

వ. అప్పు డమ్మహానదిం జూచి దేవతలు జాహ్నవి యని పొగడి రిట్లు జహ్నుకర్ణ బిలంబువలన నిర్గమించి మరల నెప్పటియట్ల నప్పుడమితేనిరథంబు వెనుకొని మహామహిమాతిశయంబునం జని సాగరంబునం గలసి కడ లెత్తి నిండి వెల్లిగొని రసాతలంబునకు డిగ్గి భగీరథునిమహాప్రయత్నంబు సార్థకంబుగా నమ్మహానది భస్మరాశీకృతు లై యున్నసాగరులమీఁదం బ్రవహించినఁ దత్క్షణంబ సాగరులు పీతకల్మషులై త్రిదివంబునకుం జని రప్పు డచ్చటికిం జనుదెంచి.

బ్రహ్మ భగీరథునిఁ బ్రశంసించి వరంబు లొసంగుట.

ఉ. అంబుజసంభవుండు ముద మంది భగీరథుఁ గాంచి పల్కె నో
యంబుజమిత్రసంశకలశాంబుధిచంద్ర మహీనరేంద్ర యీ
యంబుధియందు నెందనుక నప్పులు భాసిలు నంతదాఁక ని
క్కంబుగ నీదుతాతలు సుఖంబులఁ గాంతురు నాకమం దొగిన్. 867

వ. మఱియును. 868

సీ. దివ్యభూషణములు దివ్యాంబరంబులు దివ్యమాల్యంబులు దివ్యగంధ
ములఁ దాల్చి ఘనదివ్యమూర్తులఁ గై కొని దివ్యభోగముల వర్తింతు రింక
నినవంశ యిది మొద లీనది నీపేర భాగీరథి యనంగఁ బ్రణుతి కెక్కు
నదిగాక త్రిపథగ యనఁగ సరిద్వర యనఁగ జాహ్నవి యన నలరు ధాత్రిఁ
తే. దవిలి యీధునిలోన నీతాతలకు స
మంచితంబుగఁ దర్పణ మాచరించి
కోర్కితోడఁ బిత్ర్యాణముక్తుఁడవు గమ్ము
జనవరేంద్ర సత్యప్రతిశ్రవుఁడ వగుచు. 869

తే. ధర్మవంతులలోన నుత్తముఁ డనంగ, భూరియశుఁ డన నత్యంతశూరుఁ డనఁగ
ఖ్యాతి వడసిననీదుముత్తాత యైన, సగరుఁ డిప్పని సాధింపఁజాలఁ డయ్యె.

తే. అంశుమంతునిచందాన నధికతేజుఁ
డంశుమంతుఁడు మీతాత యమరతటినిఁ
దెత్తు నని యత్న మొనరించి తెచ్చుటకు ను
పాయ మెంతయు నెఱుఁగక పోయె నతఁడు. 871

తే. అనఘ రాజర్షి ఘనుఁడు సుమహర్షి తేజుఁ, డమితతపమున మత్సముం డగుదిలీప
నృపుఁడు మీతండ్రి గంగ నర్థించి వడయఁ,జాలక దివంబునకు నేగెజనవరేణ్య.

మ. మును మీపెద్దలు గాఢనిష్ఠురతపంబుల్ సేసి సాధింపఁజా
లనియిక్కార్యము నేఁడు నీవలన సార్థం బయ్యె నీయంతథ
న్యుని నెవ్వాని నెఱుంగ ముజ్జగమునన్ భూమీశ గంగానదీ
కనదుత్తుంగతరంగమంగళసమాఖ్యం బొందు మిం పారఁగన్. 873

చ. అరయ సమస్తసద్గుణగణాకరులై నిజవంశకర్తలై
పరమపవిత్రులై జగతి భాసిలుపుత్రులఁ గాంచు మింక ని
ద్దఱ నొగి సర్వధర్మసుకృతంబులకుం దగ నాలవాలమై
వఱలితి విందుఁ గ్రుంకి నరవర్య కృతార్థత నొందు మెంతయున్. 874

మ. అని దీవించి విరించి సమ్మదరసవ్యాకోచచిత్తాబ్జుఁడై
చనియెం బిమ్మట సాతఁ డాతటినిలో స్నానంబుఁ గావించి గొ
బ్బున సిద్ధాత్మకుఁడై పితామహులకుం బుణ్యోదకం బిచ్చి మిం
చినప్రీతిం గృతకృత్యుఁడై మరల వచ్చె న్వీటి కింపారఁగన్. 875

క. వచ్చిన నరపతిఁ గనుఁగొని, చెచ్చెరఁ బురజనులు ముదముఁ జెందిరి మేనం
జొచ్చినప్రాణముఁ గనుఁగొని, క్రచ్చఱ నలరాఁ సర్వకరణముల క్రియన్. 876

వ. ఇట్లు పురంబుఁ బ్రవేశించి సకలప్రజానురాగంబుగా రాజ్యంబుఁ బరిపాలించుచుండె నని చెప్పి వెండియు విశ్వామిత్రుం డిట్లనియె రాజనందనా పరమశుభంబైనయీగంగావతరణోపాఖ్యానం బవ్యగ్రుండై యెవ్వండు విను నతండు సర్వపాపవిముక్తుండై సర్వకామంబులంబొంది యాయుఃకీర్తిలాభంబు వడయు దేవతాపితృగణంబు లతనికొఱకు సంతోషింతురు మఱియు నిది ధన్యంబును యశస్యంబును స్వర్గ్యంబును నాయుష్యంబు నై యొప్పు. 877

క. అని మునిపతి గంగాకథ, వినిపించినఁ జిత్తమలర విని క్రమ్మఱ న
మ్మునిపరిబృఢునిఁ గనుంగొని, యినకులవర్ధనుఁడు రాముఁ డిట్లని పలికెన్. 878

మ. ఘనకీర్త్యన్విత నేఁడు మీవలన నీగంగాప్రభావంబుఁ బ
ర్విన మోదంబున నానుపూర్విని దగన్ వింటిం గృతార్థుండ నై
తిని మీ కీయఖిలప్రపంచకథ లెంతేఁ బ్రాశినీరంబుగా
యని యగ్గించుచు రాజపుత్రులు ప్రభూతాశ్చర్యులై రత్తఱిన్. 879

వ. ఇట్లు పరమానందంబు నొంది. 880

మ. అను వందం దగ మందసుందరసమీరాందోళితైలానుగం
ధనికుంజాంతమునం దమందముద మందం గూర్కి యారాత్రి వే
గిన మర్నాఁడు ప్రభాతకాలమునఁ దత్తీరంబులం గ్రుంకి గొ
బ్బునఁ బూర్వాహ్ణికకృత్యముల్ సలిపి సంపూర్ణప్రభావంబునన్. 881

చ. మునిపతిఁ గాంచి మ్రొక్కి రఘుపుంగవుఁ డంజలిఁ జేసి పల్కె నో
యనఘ భవన్ముఖేరితసమగ్రవియత్తటినీప్రభావముల్
వినుటకతంబునం గరము వేడుక నీనిశ స్వల్పకాలయై
చనియె జగత్ప్రశస్తగుణచాతురి ధన్యుఁడ నైతి నీకృపన్. 882

వ. మునీంద్రా హిరణ్యగర్భసమానుండ వైన మీరాక యెఱింగి మహర్షులారోహింపం దగినరమణీయపోతం బాసన్నం బైయున్నది దీనినారోహించి భాగీరథి

నుత్తరించి యవ్వలం బోవ నునిన నమ్మహర్షిశ్రేష్ఠుం డట్లు కాక యని యీయ
కొని మునిసమేతుం డై రామలక్ష్మణసహితంబుగా నావ యెక్కి యమ్మహానది
నుత్తరించి తదుత్తరతీరంబుఁ జేరి యచ్చటిమునిగణంబులం బూజించి యచ్చట
నొక్కింతసేపు విశ్రమించి కొండొకదూరం బరిగి. 883

శా. భూకాంతామణిఫాలభూషణ మనాఁ బొల్పొంది నానావిధా
స్తోకశ్రీకర మై కనుంగవకు నెంతో వేడ్కఁ బుట్టించుచుం
బ్రాకారావృత మైనయొక్కపురముం బ్రాన్వన్వయాంభోధిరా
డ్రాకాబ్జుండు రఘూత్తముండు గని యుల్లంబందు నుల్లాసి యై. 884

చ. కరములు మోడ్చి మంజుగతి గాధికుమారునిఁ జూచి పల్కె నో
పరమమునీంద్ర మ్రోల నొకపట్టణ మాసురలోకతుల్య మై
గురుతరపుణ్యసంపదలకుం గని యై తనరారు చున్న దె
వ్వరిపుర మెద్ది నామము ధ్రువంబుగ నా కెఱిఁగింపు మింతయున్. 885

విశ్వామిత్రుఁడు శ్రీరామునికి సముద్రమథనవృత్తాంతం బెఱిఁగించుట.

వ. అని యడిగిన గాధేయుండు కృపావిధేయుం డై యప్పురివృత్తాంతంబు శక్ర
కథాపూర్వకంబుగా నిట్లని చెప్పం దొడంగె. 886

చ. వినుమక యాదికాలమున వేల్పులు దైత్యులు మైత్త్రితో సుధం
బడయుద మంచు మాధవుని పంపున వాసుకిఁ ద్రాడుఁ జేసి యె
క్కుడుతమి మందరాచలము గొబ్బునఁ గవ్వముఁ జేసి యుగ్రు లై
కడువడి దోర్బలంబు లెసఁగం గలశాంబుధిఁ ద్రచ్చి రుద్ధతిన్. 887

వ. ఇట్లపారబలసంపన్ను లై రాక్షసులు ఫణంబులును దేవతలు పుచ్ఛంబును
బట్టి సవ్యాపసవ్యపరిగ్రహణవిశేషంబు లేర్పడఁ బెక్కుసంవత్సరంబులు దరువఁ
దరిత్రా డైనవాసుకిశిరంబులు మహోన్నతంబు లైనగండశైలంబులఁ గఱ
చుచు హాలాహలవిషంబునుం గ్రక్కిన నది కాలాగ్నిసదృశం బై దేవాసుర
మనుష్య సహితం బైనజగం బంతయు దహింపం దొణంగిన దాని సహింపం
జాలక. 888

శివుండు దేవతలచేఁ బ్రార్థితుఁ డై విష్ణునానతి హాలాహలంబును మ్రింగుట.

క. శరణార్థు లై దివౌకసు, లరుదారఁగ రక్ష రక్ష యనుచు నుమాధీ
శ్వరుకడకుం జని భక్తిం, గరములు ముకుళించి వినుతిఁ గావించి రొగిన్.

ఉ. అత్తఱి శంఖచక్రధరుఁ డై నరమాపతి సర్వదేవతా
సత్తముఁ డీశ్వరుం డటకుఁ జయ్యన వచ్చి యుమాధినాథు న
త్యుత్తమశూలధారి దివిజోత్తముఁ గన్గొని భూరిసమ్మదా
యత్తమనస్కుఁ డై పలికె నాస్యమునం జిఱునవ్వు దోఁపఁగన్. 890

చ. వినుము సురేశ నీ వఖిలవేల్పులలోఁ గడుఁ బెద్ద గావునం

బనివడి నిర్జరాసురులు పట్టి మథించెడువార్ధిలోపలన్
మునుకొని బల్విడిన్ మొదలఁ బుట్టినయావిష మగ్రపూజగా
మనమున నెంచి కైకొని సమస్తజగంబుల నుద్ధరింపవే. 891

. అని పలికి వాసుదేవుం డంతర్ధానంబుఁ జేసిన. 892

క. సురల కొదవినభయమును జూచిశౌరి, వాక్య మాలించి యలభగవంతుఁడైన
హరుఁడుహాలాహలవిషంబులమృతకబళ,నట్లమ్రింగియంత ర్హితుం డయ్యె నపుడు.

—మందరగిరిని విష్ణువు కూర్మరూపంబున వీఁపుమీఁద ధరించుట.—

వ. అంత దేవాసురులు వెండియు సముద్రంబు మథింపం దొడంగిన. 894

మొనసి మందరాద్రి వనరాశినిర్మగ్న, మై రసాతలంబుఁ జేర నపుడు
దానిఁ జూచి సురలు దైత్యాంతకుం డైన, విధుని శరణ మొంది వినుతిఁజేసి.

వ. దేవా నీవు సమస్తభూతంబులకుఁ బరమగతి వందు విశేషించి మాకు శరణ్యుం
డవు గావున జలరాశిలోన మునింగినమంథానశైలంబుఁ గ్రమ్మఱ నుద్ధరించి
మమ్ము రక్షింపు మని ప్రార్థించిన. 896

తే. వారిమొఱ విని భార్గవీవల్లభుండు, కమఠరూపంబుఁ గైకొని కంధిలోన
మునిఁగి శైలంబుఁ బైకెత్తిమూఁపుమీఁదఁ,బరఁగనిడికొనిజలధిపైఁ బవ్వళించె.

వ. ఇట్లు రమావల్లభుండు మందరశైలంబుఁ గమఠాకారుం డై తనవీఁపునందు
ధరించి దానియగ్రంబు కరంబులం బట్టికొని దేవతామధ్యంబుననుండి య
పారబలంబునఁ బెక్కువర్షంబులు మథించిన నందు మొదల దండకమండలు
హస్తుం డై ధన్వంతరి పుట్టెఁ బదంపడి రూపయౌవనసంపన్ను లయినయువ
తులు పెక్కండ్రు పొడమిరి నిర్మథనంబువలన నప్పులం బొడమినకారణంబుల
నయ్యంగన లప్సరస లనం బరఁగిరి వారలలోన నఱువదికోట్లయప్సరసలు ప్రధా
నభూత లైరి వారిపరిచారికాజనం బసంఖ్యం బై యుండు వారి దేవదానవులు
ప్రతిగ్రహింపమింజేసి వారు సాధారణ లైరి వెండియుం దరువ నందు వరుణ
కన్య యైనవారుణి యనుసురాధిదేవత పొడమి పరిగ్రహవిచారంబుఁ జేయు
చున్న దాని రాక్షసులు గైకొన రోసి విడిచిన దేవతలు పరిగ్రహించిరి
నాఁటంగోలె సురాపరిగ్రహణంబున దేవతలు సుర లైరి మఱియుం దరువ ను
చ్చైఃశ్రవం బనుహయశ్రేష్ఠంబును మణిరత్నం బగుకౌస్తుభంబును నుత్త
మం బగునమృతంబునుం బుట్టిన నయ్యశ్వంబును శక్రుండు గైకొనియెఁ గౌస్తు
భంబు విష్ణువక్షంబున వెలింగె నయ్యమృతంబు నసురులు చేకొనిన సహింపక.

మ. అనిమేషు ల్కడు నుగ్రు లై చటులనానామోఘహేతిద్యుతు
ల్వినువీథిం గడుఁ జిత్రభంగి మెఱయ న్వీరాంకు లై వాసవా
రినికాయంబులఁ దాఁకి వారు నటువారిం దాఁకఁ ద్రైలోక్యమో
హనసంగ్రామము సెల్లె నయ్యుభయసైన్యశ్రేణికి న్రాఘవా. 899

~ విష్ణువు మోహినీవేషంబున నమృతంబు సురలకుఁ బంచిపెట్టుట. ~

మ. అపు డానందకపాణి రమ్య మగుమాయామోహినీరూపముం
గపటత్వంబునఁ దాల్చి దైత్యవరుల న్వంచించి పీయూషము
న్నిపుణత్వంబునఁ గ్రమ్మఱం గొని వెసన్ దేవాళి కందీయ వా
రపురూపంబుగఁ గ్రోలఁ జూచి ఘనకోపాటోపు లై రాక్షసుల్. 900

చ. అమరులఁ దాఁకి దారుణవరాయుధదీప్తులు నింగి ముట్టఁగా
సమర మొనర్ప వేల్పులు ప్రసన్నసుధారసపానజోగ్ర తే
జమున నసాధ్యు లై హరిలసత్కృపఁ దోడ్పడి విక్రమింపఁగా
నమరవిరోధులం దునిమి రాజి నఖండపరాక్రమంబునన్. 901

వ. ఇట్లు నిలింపులు రణంబున నసురుల నందఱ నిశ్శేషంబుగాఁ బరిమార్చిన నిలింప
వల్లభుండు విజయలక్ష్మీవిరాజమానుం డై దేవర్షిగంధర్వచారణసహితంబుగా
నమరావతికిం జని జగత్త్రయంబుఁ బరిపాలించుచు నుండె నంత. 902

మ. తనపుత్త్రు ల్సమరంబులో సనతిసంతానంబుచేఁ జచ్చినా ?
రని విన్నంతనె పుత్త్రమోహమున శోకాక్రాంత యై వ్రాలి దూ
లినధైర్యంబున నొక్కనాఁడు దితి యుద్రేకంబునం బ్రాణనా
థునితో ని ట్లనె శోకపావకశిఖాదోధూయమానాంగి యై. 903

~ దితికిఁ గశ్యపుం డింద్రుని జయించుఁ బుత్త్రునిఁ బడయ వరం బొసంగుట. ~

శా. దేవా వేల్పులు మించి ఘోరరణవీథి న్మత్కుమారావళిం
బ్రావీణ్యంబున విష్ణుదేవుకరుణ న్మర్దించి రిం కేమి నీ
సేవ ల్సేయుచుఁ బుత్త్రహీన నగుచున్ జీవించు దోశ్శక్తిచే
దేవేంద్రుం బరిమార్చుపుత్త్రునిఁ గృపాదృష్టి న్బ్రసాదింపవే. 904

తే. అనవు డనుకంప గదురఁ గశ్యపుఁడు పలికె
నబల వ్రతనిష్ఠ శుచి వై సహస్రవర్ష
ములు గడుప నట్టితనయుండు గలుగు ననుచు
వరమొసఁగి యమ్మహామునివరుఁడు ప్రీతి. 905

వ. తనహస్తంబున నమ్మహాదేవియుదరంబు సంస్పృశించి పుత్త్రోత్పత్తిరూపం బైన
శుభంబు గలుగుఁగాక యని యనుగ్రహించి తపంబునకుం జనియె నిట్లు కశ్య
పుండు సనిన యనంతరంబ యద్దేవి బలవంతుండును మహేష్వాసుండును
స్థితిజ్ఞుండును సమదర్శనుండు నై నకొడుకుం బడయుదు నని కశ్యపోక్తప్రకారం
బున వ్రతం బంగీకరించి కుశప్లవనంబునందు దారుణక్రమంబునఁ దపంబుఁ
జేయుచుండె. 906

~ ఇంద్రుఁడు కపటంబునఁ బరిచరించుచు దితిగర్భంబును ఖండించుట. ~

ఉ. అంత నెఱింగి దంభవినయం బెసఁగన్ దితిపాలి కేగి జం

భ్రాంతకుఁ డించు కైనఁ దనవ్యాజము గన్పడ కుండ మాటి య
క్కాంతమనం బెఱింగి యతిగౌరవ మొప్పఁగ భక్తియుక్తుఁ డై
సంతస మంకురింపఁ బరిచర్య లొనర్చుచు నుండె నిష్ఠ మై. 907

వ. ఇట్లు శ్రమాపనయనంబు లగుగాత్రసంవాహనంబుల జలాగ్నికుశకాష్ఠఫల
మూలప్రదానంబుల నిత్యంబును దితికిఁ బరిచర్యఁ జేయుచుండె నంతఁ దొమ్మ
న్నూటతొంబదియబ్దంబులు సనినయనంతరంబ. 908

చ. అపు డొకనాఁడు మానిని రహస్యము దాఁచఁగ లేక భూమిభృ
ద్రిపుఁ డొనరించుసేవకు ముదిం గడు సంతస మొంది మోమునం
గృప దళుకొత్త నయ్యనిమిషేంద్రుని గన్గొని పల్కె నక్కటా
కృపణమనస్కులం దెలియ లేరుగదా యువతుల్ రఘూత్తమా. 909

సీ. వాసవ వినుము భవత్సమానుని నొక్కకొడుకును బడయంగఁ గోరి యేను
గశ్యపుఁ బ్రార్థింపఁ గరుణతో వెయ్యేండ్లు వితతంబుగా దృఢవ్రతము సల్పి
తేనియుఁ గల్గునం చానతి యొసఁగెఁ గావున నింకఁ బదియేండ్ల కనఘమూర్తి
యనుఁగుఁదమ్ముండు నీకవతార మందెడుఁ గడఁగి మీరిరువు రేకత్వ మొంది
తే. మొనసి క్షీరోదకన్యాయమునఁ దనర్చి
మూఁడు లోకంబు లొక్కట భూరిసత్వ
మహిమ రక్షింపుఁ డన్యోన్యమైత్రి గలిగి
యనుచు నిర్వ్యాజముగఁ బల్కె నాలకించి. 910

క. తరుణియుదరస్థుఁ డగువాఁ, డరయఁగఁ దన కరి యటంచు నతని వధింప
న్వేర వెఱుఁగక తఱి నరయుచు, స్థిరమతి నింద్రుండు సేవఁ జేయుచు నుండెన్.

వ. అంత నొక్కనాఁ డత్తలోదరి పులోమజాకాంతుం డొనరించుబహువిధోపచా
రంబులు దనహృదయంబునకు ముదావహంబు లై తనర శారీరసుఖంబులుమరిగి
వ్రతదీక్షాసమయభంగం బెఱుంగక కాలచోదిత యై మధ్యాహ్నసమయమున
మఱచి కాల్గడ తలయంపిగా సుఖసుప్తి వహించిన. 912

చ. ఇది సమయం బటంచు దివిజేశ్వరుఁ డుల్లము పల్లవింపఁగా
భిదురముఁ గేలఁ బూని జళిపించుచు ధీరత యోగశక్తిచే
నుదరములోనఁ జొచ్చి రయ మొప్పఁగ దిత్యుదరస్థబాలకుఁ
గదురుచు సప్తఖండములుగా నరికెం దనకోర్కి దీరఁగన్. 913

ఆ. రాజ్యకాంక్షఁ జేసి రాజులు సతి నైన, బాలు నైనఁ జంపఁ బాలుపడుదు
రఘభయంబు వారి కనిశంబు నది దోష, మనఁగ వినమె రఘుకులాబ్ధిచంద్ర.

వ. ఇట్లు బలారాతిచేత వ్రేటు వడి దితిగర్భంబు యెలుం గెత్తి బిట్టేడ్చిన నదరిపడి
దితి మేల్కాంచె నప్పు డమ్మఘవుండు మారుద మారుద యనుచు లఘురీతిం
బలికి వృథాగర్భం బేల వధించెదవు చాలుఁ జాలుడుగు మని పలుకుదితివాక్యం

బాకర్ణించి రయంబునఁ దద్గర్భంబు నిర్గమించివచ్చి తనచేసినయుపకారంబునకుఁ గినుకఁ బూని శపించునో యని శంకించి యొడలు వడంకఁ బ్రదక్షిణపూర్వకంబుగాఁ బ్రణామంబుఁ గావించి నిటలతటఘటితకరపుటుం డై గుణవతీమతల్లి యగుతల్లిముందఱ నిలిచి యి ట్లనియె. 915

క. వ్రతనిష్ఠాభంగం బది, మతిఁ దలఁపక సుప్తభంగి మానక నిద్రిం
చితి వాదోషంబున నీ, గతి నాచే లూన మయ్యె గర్భము తల్లీ. 916

వ. అదియునుం గాక. 917

క. తఱి యెఱిఁగి రిపు వధించుట, నిరుపమధర్మంబు గాన నీయుదరమునం
బెరిఁగెడుబాలుఁడు మది నా, కరి యని ఖండించినాఁడ నలుగకు మింకన్.

క. నా విని గర్భము వృథ యై, పోవుటకు దురంతదుఃఖపూరితమతి యై
దేవేంద్రునిఁ గని యపు డ, ద్దేవి మది గ్లినుక విడిచి ధీరతఁ బలికెన్. 919

క. సురలోకనాథ నీయం, దరయఁగ దోషంబుఁ గాన మరు దారఁగ మ
ద్దురితమున నయ్యె నింతయు, దురితహరుని నిన్ను దూఱ దోసము వచ్చున్.

వ. స్వయంకృతాపరాధంబున నై నకార్యంబునకు వగవం బని లేదు నిరపరాధి వై ననీ కపరాధంబు సేయం బూనిన దై వంబు ననుకూర నిచ్చునే యింక నీసప్తఖండంబులు నీచేత మారుద యని పలుకంబడినవి గావున మారుత సంజ్ఞకంబు లై యుండు నదియునుం గాక యావహప్రవహసంవహోద్వహవివహపరివహపరావహాఖ్యలం గలసప్తవాతాభిమానదేవతలం దొక్కటి బ్రహ్మలోకంబునందును నొక్కటి యింద్రలోకంబునందును నొక్కటి యంతరిక్షంబునందును దక్కిననాలుగు నాలుగుదిక్కులయందును బ్రవర్తిల్లుచుండు నట్టి సప్తవాతస్కంధంబులకు నాయకులం జేసి సప్తఖండంబు లై ననుపుత్రుల రక్షింపు మనిన నతం డట్ల కావించి యద్దేవిచేత ననుజ్ఞాతుం డై నాకంబునకుం జనియె నీదేశమందున నాఖండలుండు దితికి శుశ్రూషఁ గావించె నని పల్కి విశ్వామిత్రుండు వెండియు రామచంద్రున కి ట్లనియె. 921

తే. పొసఁగ నిక్ష్వాకునకు నలంబుసకు మున్ను
పుట్టినట్టివిశాలుఁ డన్భూపమౌళి
పుడమి యేలి విశాల యన్పుర మొనర్చె
నిచట రాజేంద్ర తనపేర నింపు మీఱ. 922

తే. ఆవిశాలునిపుత్త్రకుం డై నహేమ
చంద్రునకుఁ బుట్టె ఘనుఁడు సుచంద్రుఁ డతఁడు
ఏ పరఁగ ధూమ్రాశ్వు నతఁడు సృంజయునిఁ గాంచె
నతఁడు సహదేవు నతఁడు కుశాశ్వుఁ గాంచె. 923

తే. ఆకుశాశ్వుఁడు సోమదత్తాఖ్యుఁ గనియె
నతఁడు కాకుత్స్థుఁ గాంచె నయ్యవనివిభుఁడు
సుమతి యనువానిఁ గనియె నాసుమతి యిప్పు
డీవిశాలపురం బేలు నిద్ధయశుఁడు. 924

వ. మఱియు నిక్ష్వాకుప్రసాదంబున వీరందఱు వైశాలికు లనం బ్రసిద్ధి కెక్కి దీర్ఘాయువులును మహాత్ములును వీర్యవంతులును బరమధార్మికులును నై యుందు రీరాత్రి యిచ్చట వసియించి యెల్లి మిథిలకుం బోద మని పలుకుచున్నసమయంబున. 925

సుమతి యనురాజు విశ్వామిత్త్రుని బూజించుట.

చ. ఘనతరసుప్రభావుఁ డగుకౌశికసంయమినాథు రాక యి
వ్విని సుమతిక్షమాపతి నవీనముదంబుధిపూరమగ్నుఁ డై
తనదుపురోహితు ల్మిత్రులు దాసులుఁ జుట్టలు వెంట రా రయం
బునఁ జని కాంచి యమ్మునికి మ్రొక్కి సపర్య లొనర్చి యి ట్లనున్. 926

మ. అనిశంబు న్హృదయప్రపంచము సముద్యద్భూరితేజంబుచే
నను వై మించెను లోచనాంబురుహముల్ వ్యాకోచతం జెందెఁ జ
య్యన దట్టంపుఁ దమచ్ఛట లివ్విరిసె వస్వావాప్తి చేకూరె నేఁ
డను వయ్యెం గద యిన్ని మా కిచట విశ్వామిత్ర మీరాకచేన్. 927

క. మాన్యుఁడ నగుమీకృపచే, ధన్యుండను బేరు గలవదాన్యుండను రా
జన్యులలో మాన్యుఁడ సౌ,జన్యయుతుఁడ నైతి నేఁడు సంయమివర్యా. 928

వ. అని బహుప్రకారంబుల సన్నుతించి యొండొరులకుశలప్రసంగంబులు గడపినయనంతరంబ విశ్వామిత్త్రునియిరుగెలంకుల నలంకృతు లై సూర్యసోముల చందంబున నింద్రోపేంద్రులకై వడి యశ్వినీదేవతలపోఁడున మనోహరాకారంబులం దేజరిల్లుచున్నరామలక్ష్మణులం జూచి కౌశికున కిట్లనియె. 929

సీ. గజసింహగమనులు ఖడ్గతూణీధనుర్ధరులు శార్దూలవిక్రములు రాజ
సింహులు గుణరూపచేష్టితంబులఁ బరస్పరసమానులు చారుచంద్రముఖులు
రమణీయమూర్తులు కమలపత్త్రవిశాలనయనులు సురభువనంబు విడిచి
ధరణికి వచ్చినసురలకై వడిఁ గ్రాలువారు దస్రులభంగి వఱలువారు
తే. రాజభానులగతి దివ్యతేజమున హ,రిన్నికాయము వెలిఁగించుచున్నవారు
ధీవరేణ్య వీ రెవ్వరు తేవనమున, నేల చనుదెంచి రిచటికి నింత చెపుమ. 930

క. మునినాథ నీతపంబును, ఘనకీర్తియుఁ దనువు లిట్లు గైకొని వెంటం
జనుదెంచె నొక్కొ హరిహరు,లన నొప్పెడువీరిచంద మానతి యీవే. 931

క. అన విని మునిపతి సుమతిం, గనుఁగొని యిట్లనియె వీరు కాకుత్స్థవరు
ల్ఘనమతులు రామలక్ష్మణు, లనువారలు దశరథాధిపాత్మజు లనఘా. 932

సీ. రాజేంద్ర నాచేతఁ బ్రార్థితు లై వేడ్కఁ జంటగా నావెనువెంట వచ్చి
తాటక యనుఘోరదానవి ఖండించి పరఁగ మారీచసుబాహు లనెడు
దైత్యుల సంగ్రామతలమున భంజించి కరుణతో నాదుయాగంబుఁ గాచి
జనకుజన్నముఁ జూడఁ జనుచున్నవారలు ఘనులు పాపౌఘలంఘనులు శౌర్య
ఆ. ధనులు పుణ్యఘనులునన విని సుమతి య,చ్చెరువు గదురఁ బూజఁ జేసియుఁదన
యింట నాఁటిరాత్రి యెలమితో నిడుకొని, వేఁగుటయును భక్తివినయ మెసఁగ,
తే. అతిథిసత్కారము దొనర్చి యనుప నతని
వీడ్కొని రఘూత్తములు మునివితతి వెంట
రా విదేహక్ష్మాపతి రాజధాని
కరుగు తెరువునఁ గౌశికుఁ డరిగె నపుడు. 934

వ. ఇట్లు చని దవ్వుల నతిరమణీయకాంచనప్రాకారశోభితం బైనదాని నంబర చుంబిశిఖరరేఖామయూఖపుంజరంజితశర్మదభర్మహర్మ్యం బైనదాని కుసుమ కిసలయ ఫలభరితవిటపివాటికావిహరమాణ మత్తమధుకరకీరశారికాకలకంఠమ ధురశబ్దాయమానమంజులోద్యానపరిష్కృతం బైనదాని మిథిలాపురంబుఁ గనుం గొని తదీయసుషమావిశేషంబున కిచ్చ మెచ్చుచుఁ దదుపవనంబునందుఁ బురాణం బై రమ్యం బై నిర్జనం బై యున్నయొక్కమహనీయాశ్రమంబు విలోకించి. 935

మ. జలజాతాకరతీరరాజదవనీజాతావళీయుక్తశీ
తలమార్గం బటు పట్టి పోవునెడ నందం బొప్పఁగా భానువం
శలలాముం డగురామచంద్రుఁడు మునిస్వామి న్విలోకించి సాం
పలరం బల్కె గిరీశమౌళిగళదుద్యద్దోస్స్వయంగాంగార్భటిన్. 936

—విశ్వామిత్రుఁడు రామునకహల్యావృత్తాంతంబుఁ దెల్పుట.—

మ. అనఘాత్మా రమణీయ మై సురుచిరం బై శ్లాఘ్య మై యొప్పునీ
వన మి ట్లేలకొ నిర్జనం బయి యసేవ్యం బయ్యె ము న్నీడ నే
ముని యుండెం గృప నింత నాకుఁ దెలియ న్మోదంబుతోఁ దెల్పవే
యని ప్రార్థించినఁ జెప్పఁ గాఁ దొడఁగె విశ్వామిత్రుఁ డుద్యన్మతిన్. 937

తే. అనఘ ము న్నీవనంబు మహాత్ముఁ డైన,గౌతమునియాశ్రమం బనఘునత కెక్కు
నిది సకలదేవపూజితం బిది సురేంద్ర,నందనోపమ మై యొప్పు నయచరిత్ర.

చ. లలనలలోఁ ద్రిలోకనుతలక్షణ యైనయహల్యతోడుతం
గలసి సుఖాత్ముఁడై యిచట గౌతమమౌని దపంబు సేయఁగా
నలరి బలాంతకుం డలయహల్యవయోవిభవాతిరేకముం
దొలఁగక చూచి యవ్వెలఁదితో సుఖియింపఁగఁ గోర్కె పుట్టినన్. 939

వ. ఒక్కనాఁ డమ్మునివల్లభుండు స్నానార్థి యై యరిగిన నప్పు డెడఁ గని పురంద

రుండు మునివేషధరుండై యహల్యకడ కరుగుదెంచి యిట్లనియె. 940

తే. అంబుజేక్షణ కామభోగార్థు లైన, పురుషు లెప్పుడు ఋతుకాల మరయుచుండు
రట్లు గావున నీతోడ నతనుసౌఖ్య, మనుభవింపంగఁ గోరితి నబ్జవదన. 941

తే. అనిన నమ్మాయతపసివాక్యములపటిమ
మొగముఁ జాయయుఁ గాంచి నామగని కింత
నరస మేడది శక్రుఁ డిక్కరణి నాదు
వలనిమోహంబుచే నిట వచ్చె ననుచు. 942

వ. తలంచి యతనిం గూడి కందర్పక్రీడానందరసం బనుభవించి వెండియు నహల్య శక్రునిం జూచి యేను నీవలనఁ గృతార్థ నైతి నింక నిచట మసలవలవదు నన్నును నిన్నును రక్షించుకొనుచు శీఘ్రంబునం జను మనిన నయ్యింద్రుండు నీవలనఁ బరితుష్టుండ నైతి నింక రయంబునం జనియెద నని యద్దేవిచే ననుజ్ఞాతుండై యప్పర్ణశాల నిర్గమించి గౌతమాగమనంబు శంకించుచు ససంభ్రముండై రయంబునం బోవుచు. 943

చ. అనిమిషలోకనాథుఁడు నిజాశ్రమవాటికి నేఁగుదెంచున
మ్మునిపతి దీప్తపావకనిభుం బరమేష్ఠిసముం దపోధను
న్ననుశిఖివేల్పు నెచ్చెలి సమిత్కుశహస్తుఁ గృతాభిషేకునిం
గనుఁగొని సాంద్రభీతిపరికంపితుఁడై చనుదెంచుచుండఁగన్. 944

గౌతముఁడు దేవేంద్రుని శపించుట.

చ. తనుఁ గని భీతుఁడై మొగము దద్దయు వెల్వెలఁ బాఱఁ గ్రమ్మఱం
జనియెడువజ్రిఁ గన్గొని నిశాసమయంబున నిట్లు దేలకో
యనిమిషనేత వచ్చె నని యంతయు గ్రక్కున యోగదృష్టిచేఁ
గనుఁగొని రోషశోణితవికంపితలోచనుఁడై రయంబునన్. 945

వ. పరుషవాక్యంబున నిట్లనియె. 946

ఉ. ఓరి దురాత్మ యోరి శఠ యోరిమదాంధుఁడ శక్ర మానికాం
తారతి దూషితం బని మనంబున నించుక గొంక కిట్లు మ
న్నారిని వంచనం గపటతాపసతన్ రమియించి తీ విదే
కారణమై యముష్కుఁడవు గమ్మని శాప మొసంగె నుద్ధతిన్. 947

వ. ఇట్లు నిష్ఠురంబుగా శపియించినఁ దత్క్షణంబు వజ్రప్రహారంబునఁ దునిసిపడినచందంబున నింద్రునివృషణంబులు దెగి ధరణిం బడియె నంత నమ్మునివరుండు. 948

తే. పర్ణశాలకుఁ బోయి విశీర్ణకేశ, పాశయై డస్సి సురతవిభ్రమముఁ దెలుపు
చున్న యన్నారిఁ గనుఁగొని కన్నుఁగవకుఁ, గెంపు సొంపార నిట్లని కెరలి పలికె.

గౌతముఁ డహల్యను శపించుట.

తే. నీవు నిజవంశధర్మంబు నీఱుఁ జేసి, పుష్పవిశిఖార్థవై పరపురుషరక్తి

బయిసి మాలి నీవిటు వంటిపను లొనర్చి, మాకుఁ దలవంపుఁ జేసితి మగువ నేఁడు.

ఉ. ఈయటవీప్రదేశమున నెవ్వరుఁ జూడక యుండ నిత్యముం
వాయువు నారగించుచుఁ బ్రభూతజభూరిరజఃపరీత వై
పాయక పెక్కువర్షములు పాపవశంబున నుండు మంచు వా
ఙ్నాయకతుల్యదర్శనుఁడు గౌతముఁ డాలి శపించె నుద్ధతిన్. 951

వ. ఇట్లు శప్తయై యహల్య భయంబున వడంకుచు గౌతమునియంఘ్రులం బడి
లేచి మహాత్మా కృతాపరాధ నైన నన్ను శపించుట నాయందులం గలదయాతి
శయంబున నిష్కళంకఁ గాఁ జేయుటకే కదా యీనిష్ఠురశాపంబునకుఁ దుది
యెయ్యది తన్మోక్షప్రకారం బానతి మ్మని ప్రార్థించినఁ బ్రియురాలికడం గను
మెచ్చి యతీతానాగతవర్తమానవిశారదుం డగు గౌతముం డిట్లనియె. 952

తే. అతివ దశరథనందనుం డైనరాముఁ, డెప్పు డీఘోరవనమున కేగుదెంచి
యంఘ్రివిన్యాస మొనరించు నపుడు తత్ప,దాబ్జరేణువుచేఁ బూతవయ్యెదీవు.

తే. అమ్మహాత్మున కాతిథ్యమాచరించి, యపగతాఘ వై లోభమోహములు విడిచి
మత్సకాశంబునందు సముచితముగ, ధన్య వై పూర్వరూపంబుఁ దాల్చెదీవు.

వ. అని యిట్లు గౌతముం డహల్యకు శాపంబిచ్చి పదంబడి తన్మోక్షణప్రకారం బెఱిం
గించి యచ్చోటుఁ బాసి సిద్ధచారణసేవితం బయినహిమవంతంబునకుం జని
యందుఁ దపంబుఁ జేయుచుండు. 955

చ. అట బలవైరి శప్తుఁ డయి యారని నెవ్వగ వేల్పువీటికిం
దటుకున నేగి శోకపరితాపమునం గడు పస్సి లజ్జన
క్కట పరకాంత నిట్లు కనుఁ గానక పొందఁగ నేల దానిచే
నిటు సమకూరనేల విధి యెంతటిపాటొనరించె నియ్యెడన్. 956

వ. అని విచారగ్రస్తమానసుండై దేవతల నందఱ రావించి గౌతముండు సర్వ
దేవతాపదచ్యవనకారణం బైన తపంబుఁ గావించుచుండ నే నాతపంబు విఘ్నంబు
సేయుటకు సమకట్టి క్రోధంబుఁ బుట్టించినం గాని తపోభంగంబు గా దని నిశ్చ
యించి క్రోధోత్పాదనంబుకొఱ కమ్మహామునిపత్ని యగుయహల్యతోడం గ్రీ
డించిన నమ్మునిపుంగవుం డలిగి మదీయవృషణంబులు దునిసిపడ నన్ను శపించి
పదంపడి తనపత్నికి శాపం బొసంగె నే నాకారణంబున విఫలుండ నైతి. 957

దేవేంద్రుఁడు మేషవృషణుఁ డగుట.

ఆ. వేల్పులార యిట్లు విఫలుండ నై యేను, భువనజాల మెట్లు ప్రోచువాఁడ
హితముఁ గోరి మీర లిందఱు యోచించి, దేవకార్య మిపుడు తీర్పవలయు.

వ. అని పురందరుండు పలికిన బృందారకు లందఱు పితృదేవతలకడకుం జని శక్రు
నకుం బాటిల్లిన వైఫల్యం బెఱింగించి యిప్పుడు యజ్ఞంబునందు మీకొఱకు
నిజ్యమానం బైనయీ మేషవృషణంబు లింద్రున కొసంగుఁ డిమ్మేషంబు వృషణ

రహితం బయినను మీకుఁ బరమతుష్టి నొసంగుం గాక యనియు నేమానవులు భవత్ప్రియంబుకొఱకు ముష్కం బైనమేషంబు నొసంగుదు రట్టి దాతలకు ఫలలోపంబు గాకుండ సంపూర్ణఫలం బొసంగుం గాక యనియు ననుగ్రహింతు మని పలికిన యగ్నిపురోగము లైన దేవతలవచనంబు విని పితృదేవతలు యూపనిబద్ధం బైనమేషవృషణంబు లుత్పాటించి తెచ్చి సహస్రాక్షునకు సంఘటించిరి నాఁటంగోలె పితృదేవతలు తత్సజాతీయంబు లగుటం జేసి యవృషణంబు లైనమేషంబుల భుజించుచు దాతలకు సవృషణమేషదానఫలంబు లొసంగు చుండుదురు. 959

తే. అనఘచారిత్ర వినుము నాఁ డాదిగాఁగ
సరసిజాసనతుల్యుండు సకలమౌని
వర్యుఁ డగుగౌతమునిప్రభావంబువలన
వృత్రదైత్యాంతకుఁడు మేషవృషణుఁ డయ్యె. 960

చ. అనిశము తావకాగమన మాత్మఁ దలంచుచు నాఁటఁ గోలె నీ
ఘనవని ఘోరశాపమున గౌతమపత్ని యహల్య యేరికిం
గనుపడకుండ నున్నయది గ్రక్కున నాశ్రమభూమి సొచ్చి నీ
వనుపమసత్కృపాగరిమ నమ్మునిగేహిని నుద్ధరింపుమా. 961

క. అని యిటు కౌశికుఁ డాడిన, ఘనుఁడా రాముండు కౌశికపురస్కృతుఁ డై
యనుజన్మయుతంబుగ నప్పనముఁ బ్రవేశించె దీప్తవర తేజుండై. 962

రామపాదరజస్స్పర్శంబున నహల్య శాపవిముక్త యగుట.

వ. ఇట్లు గౌతమాశ్రమంబుఁ బ్రవేశించి యందు వాయుభక్షణాదితపంబుచేతఁ బ్రద్యోతితప్రభ యగుటం జేసి సురాసురమనుష్యులకు దుర్నిరీక్ష యగుదాని విరించిచేత నతిప్రయత్నంబున నిర్మింపంబడినయతిమానుషరూప యగుమాయపగిది నలరుదాని వృక్షలతాపుష్పపటలపరిచ్ఛన్న యగుటం జేసి తుషారాభ్రపటలపరిచ్ఛన్న యైనపూర్ణచంద్రప్రభ సొబగున నొప్పుదాని యక్రూరత్వదుర్నిరీక్షత్వాదులచేత నుదకమధ్యంబునం బ్రతిబింబించినప్రదీప్తభాస్కరప్రభచందంబున నందం బగుదాని యహల్య నవలోకించె నప్పు డద్దేవి గౌతమశాపంబున రామసమాగమపర్యంతంబు త్రైలోక్యంబున కదృశ్య యై యుండి యప్పుడు శాపాంతంబు నొంది యెప్పటిశరీరంబు తోడఁ జూపట్టె నిట్లు సందృష్ట యైనయహల్యచరణంబులకు లక్ష్మణసహితంబుగా రాముండు నమస్కారంబుఁ గావించె నప్పు డద్దేవి గౌతమవాక్యంబుఁ దలంచి వారి నిరువుర నాదరించి యర్ఘ్యపాద్యాదికంబు లర్పించి యాతిథ్యం బొసంగినఁ బ్రతిగ్రహించి రంత. 963

క. మొఱసెఁ సురదుందుభు లటు, గురిసెఁ మందారవృష్టి గోమలఫణితిఁ

వరగంధర్వులు పాడిరి, యరుదారఁగ మేనకాదు లాడిరి వరుసన్. 964

తే. అప్పు డచటికి సురసిద్ధు లమరమునులు, గరుడగంధర్వకిన్నరు లరుగుదెంచి
రాఘవు ననేకభంగులఁ బ్రస్తుతించి, యలయహల్యను బూజించిరతిముదమున.

తే. అంతలో గౌతముఁ డట కరుగుదెంచి, పొలుపుమీఱఁగ రామునిఁ బూజచేసి
ఘనతపోబలపరిశుద్ధగాత్రి యైన, వెలఁదితోఁ గూడి తపముఁ గావించుచుండె.

—— విశ్వామిత్రుఁడు రాములక్ష్మణసహితుఁడై జనకునియజ్ఞవాటంబుఁ జేరుట ——

వ. అంతనారాముండు లక్ష్మణసహాయుం డై విశ్వామిత్రునిం గూడి యప్పుణ్యాశ్రమంబుఁ బాసి యీశాన్యదిగ్భాగంబుఁ బట్టి యొక్కింత దూరం బరిగి పావనం బైనజనకునియజ్ఞవాటంబుఁ జేరి మునిశార్దూలుండైనవిశ్వామిత్రు నవలోకించి యిట్లనియె 967

చ. అనఘ మహాత్ముఁ డైనజనకాధిపుయజ్ఞసమృద్ధి సాధ్వి యై
తనరెడు పుణ్యమూర్తు లతిధన్యులు వేదషడంగపారగుల్
దినకరతేజులుఁ సకలదేశనివాసులు సత్త్వపరపరా
యణు లగుబ్రాహ్మణుల్ బహుసహస్రము లిచ్చట నున్నవా రొగిన్. 968

క. శకటీశతసంకుల మై, ప్రకటితమునినిలయ రాజిరాజిల్లెడు నిం
దొకచోట మనకు వాసం, బకలుషధిషణా విధింపుఁ డనుపమభంగిన్. 969

క. అన విని విశ్వామిత్రుఁడు, ఘనతరసలిలాయుతంబు గమనీయతరం
బనుపమము వివిక్తం బగు, ఘనదేశమునందు వసతిఁ గావించె రహిన్. 970

సీ. జనకుండు గాధిపుత్రునిరాక విని శీఘ్రమున శతానందుని మున్నిడుకొని
ఋత్విజుల్ గొందఱు ప్రీతితో నర్ఘ్యంబుఁ బాద్యంబుఁ గొని వెంటఁబరఁగుదేర
వినయముతో నెదుర్కొని సమంత్రకముగానర్ఘ్యంబు విమలపాద్యం బొసంగె
జనకుం డొసంగుపూజనమంతయుగ్రహించిహవనిరామయమ్ముఁదచ్చివమునరసి

తే. కూర్మి మెఱయ శతానందుఁ గుశల మడిగి
ప్రీతిఁ బూజించినట్టి ఋత్విజులసేమ
మది విచారించి పిదప వారడుగఁ దనదు
కుశల మంతయు నెఱిఁగించెఁ గుశికసుతుఁడు. 971

వ. ఇట్లుపరస్పరని వేదితకుశలవృత్తాంతు లయినయనంతరంబ జనకమహీనాథుండు గాధేయు నవలోకించి మహాత్మా యీయాసనంబులయందు మునిసమేతంబుగా నాసీనుండవు గమ్మని ప్రార్థించిన నమ్మునిపుంగవుండుజనకోక్తప్రకారంబున నుచితాసనంబున నాసీనుం డయ్యెఁ దక్కినమునులు యథార్హపీఠంబులయం దాసీను లై రంత జనకుండు విశ్వామిత్రునియనుమతంబున సకలమంత్రిబాంధవసహితంబుగా నర్హపీఠంబున నాసీనుం డై యమ్మహాత్మున కి ట్లనియె. 972

సీ. నేఁడుగా నా కనిందితయజ్ఞఫలసమృద్ధి సఫలించె మీరాక సంయమీంద్ర

నేఁడుగా నాకు మానితజన్మసంసిద్ధి గలిగె మీకరుణచే గాధితనయ
నేఁడుగా నేను భూనేతలలోఁ జాల మాన్యుండ నైతి నోమౌనివర్య
నేఁడుగా నాకు నిన్నియు సమకూరె నీయాలోకనమునఁ బద్మాప్తతేజ
తే. బ్రహ్మతుల్యుండ వైన నీపాదరజము, సోఁక నాయజ్ఞసదన మస్తోకభంగిఁ
గడుఁ బవిత్రమై తనరారె కల్మషంబు, లడఁగె మిక్కిలి ధన్యుండ నైతి నేఁడు.
తే. వినుము యజ్ఞంబు పండ్రెండుదినము లింకఁ
గొదవ యున్న దటంచుఁ గోవిదులు పలికి
రంత భాగార్థులై వేల్పు లరుగుదేరఁ
గలరు వారలఁ జూచి పోవలయు మీరు. 974
వ. అని పలికి తత్పరిసరంబున. 975
సీ. గజసింహగమనుల ఖడ్గతూణీధనుర్ధరుల శార్దూలవిక్రముల రాజ
సింహుల గుణరూపచేష్టితంబులఁ బరస్పరసమానులఁ జారుచంద్రముఖుల
రమణీయమూర్తులఁ గమలపత్రవిశాలనయనుల సురభవనంబు విడిచి
ధరణికి వచ్చినసురలకై వడిఁ గ్రాలువారి దస్రులభంగి వఱలువారి
తే. రాజభానులక్రియ దివ్యతేజమున హ,రిన్ని కాయము వెలిఁగించుచున్నవారిఁ
గమ్రతరకాకపక్షముల్ గలుగువారి, మహితకీర్తుల రామలక్ష్మణులఁ జూచి.
ఉ. వారిమనోజ్ఞవేషములు వారివచోరచనాచమత్కృతుల్
వారివిలాసవైఖరులు వారిపరస్పరబద్ధభావముల్
వారక చూచి మెచ్చుచు నవారితసమ్మద మంకురింప నా
భూరమణీపురందరుఁడు పొల్పుగఁ గౌశికుతోడ నిట్లనున్. 977

—విశ్వామిత్రుఁడు జనకునికి రామలక్ష్మణులవృత్తాంతంబుఁ జెప్పుట.—

ఉ. ఈశరచాపఖడ్గధరు లీసుకుమారకు లీకుమారకుల్
ఈశుభమూర్తు లీచతురు లెవ్వరివా రిట కేల వచ్చినా
రీసుమబాణకోటిసము లింతయు నా కెఱిఁగింపు మన్న న
క్కౌశికుఁ డిట్లు పల్కు జనకక్షితినాథునితో ముదంబునన్. 978
సీ. అనఘాత్మ దశరథజననాథతనయులు రామలక్ష్మణు లని నామధేయ
మమితవిక్రములు ధర్మాత్ము లుదారులు శూరులు ధీరులు వీరు బాహు
శక్తిచే మద్యాగసంరక్షణముఁ జేసి పరఁగ నహల్యశాపంబు మాన్పి
నిరుపమలీలతో నీయింటఁ బొలు పందుపంచాస్త్రవైరిచాపంబుఁ జూడ
తే. నరుగుదెంచినవా రన నపుడు గౌత
మాత్మజుండు శతానందుఁ డధికహర్ష
మలర రోమాంచకంచుకితాంగుఁ డగుచుఁ
గనుల నానందబాష్పముల్ గ్రమ్ముదేర. 979

తే. విమలపీఠంబుల సుఖోపవిష్టు లయిన, దాశరథులముఖారవిందములఁ గనుల
కఱవుదీరంగఁ గనుఁగొని కౌశికునకు, నింపుసొంపార మధురోక్తి నిట్టు లనియె.

శతానందుఁడు విశ్వామిత్రుని రామునిం బ్రశంసించుట

సీ. మునినాథ మాతల్లి మునుకొని మీచేత దర్శింపఁ బడియెనే దాశరథిని
నతిభక్తి నర్ఘ్యపాద్యములచే నద్దేవి పూజించెనే మహాపురుషమణిని
దేవేంద్రకృత్యమా దిగఁ బూర్వవృత్తంబు నెఱిఁగించితివె సర్వ మినకులునకు
మనువంశ్యుఁ గన్నపిమ్మట నహల్యాదేవి రహిఁ గూడుకొనియెనే ప్రాణవిభుని
తే ఘనుని రామునిఁ జూచెనే గౌతముండు, పూజలొనరించెనే భక్తిపూర్వకముగఁ
బత్నితోఁ గూడి చేసెనే పటుతపంబు, ధన్య యయ్యెనె మాతల్లి తాపసేంద్ర.

క. నా విని కౌశికుఁ డిట్లనుఁ, గావింపఁగఁబడియె నిన్ని గౌతముఁ గూడెన్
వావిరి నహల్య రేణుక కోవిద జమదగ్నితోడఁ గూడిన మాడ్కిన్. 982

వ. అని పలికిన నిజప్రభావతిరస్కృతశతానందుం డగుశతానందుండు పరమా
నందరసపూరితహృదయారవిందుం డై కౌసల్యానందనునివదనారవిందం బుప
లక్షించి మందమధురవాక్యంబున నిట్లనియె. 983

సీ. దశరథసుత నీవు దైవయోగంబున వచ్చితి విటకు నేఁ డచ్చుపడఁగ
ననఘ మజ్జనని యహల్యపాపము నేఁడు కడిగె యుష్మత్పాదకమలరజము
గౌతమశాపదుర్గము నిస్తరించె వెండియు భర్తతోఁ గూడె నేఁటి కధిప
రాఘవ నీపాదరాజీవమహిమంబు నెఱిఁగి నుతింపంగ నెవ్వఁ డోపుఁ
తే గనకగర్భసమానుఁ డీకౌశికుండు, రక్షకుం డఁట నీకుఁ గొఱంతయేమి
విమలచారిత్ర నీకంటె వేఱొకండు, ఘనుఁడు ధన్యుండు లేఁడు జగత్త్రయమున.

వ. మహాత్ముం డైనయీవిశ్వామిత్రుండు జగత్పవిత్రచరిత్రుండ నైననిన్ను దో
డ్కొని వచ్చి మ మ్మింపెఱఁ గృతార్థులం జేసె నిట్టిమహోపకారి జగత్త్రయంబు
నం దెవ్వం డైనఁ గలఁడే యని పలికి యంత కంతకుఁ బ్రసంగవశంబున విశ్వా
మిత్రునిప్రభావంబులన్నియు విస్పష్టంబుగా నెఱింగించువాఁ డై శతానందుండు
రామచంద్రున కిట్లనియె. 985

శతానందుఁడు రామునికి విశ్వామిత్రువృత్తాంతంబుఁ దెల్పుట.

క. అతులప్రభుఁ డపరాజితుఁ డతర్క్యకర్ముం డమర్షి యగుకౌశికు ది
వ్యతరప్రభావములఁ బ్రస్తుతి సేయఁగ మాకు వశమె సుగుణోదారా. 986

క. దశరథకుమార బ్రహ్మకుఁ, గుశుఁ డన నొకరాజు పుట్టెఁ గుశునకు సుతుఁ డై
కుశనాభుఁ డమరె నాతఁడు, వెస గాధిని గాధి యితని వేడుకఁ గాంచెన్.

చ. ఇతఁ డతిధర్మనిష్ఠ నిల నేలె ననేకసహస్రవర్షముల్
చతురత నెల్లలోకములు సంతతముం దను సన్నుతింపఁగా
నతులితవైభవం బెసఁగ నం దొకనాఁడు చమూసమేతుఁ డై

క్షితిఁ గలశైలదుర్గవన సిద్ధతపోవనముల్ చరించుచున్. 988

వ. చనిచని యొక్కచోట. 989

సీ. కలితనానావిహంగమసంఘములు లసత్కృతిపురాణార్థసంతతులు దెలుప
నెలమావిమ్రాకొమ్మల శుకసంతతుల్ జత గూడి శ్రుతులలో జటలు చదువ
సరసకాసారరంజద్రాజహంసలు చటులవేదాంతముల్ చర్చ సేయఁ
బరపుష్టములు మనోహరమాధురీనిస్వనముల శాస్త్రప్రసంగములు సలుప

తే. జాతివైరంబు లుడిగి మార్జాలమూషి, కోరగశిఖండిగణము లన్యోన్యమైత్రి
నెఱప నిరుపమతరులతోత్కరముగలిగి, రాజిలువసిష్ఠమునివరాశ్రమముఁ గనియె.

వ. మఱియు బాహ్యేంద్రియవ్యాపారంబులు వర్జించి రాగద్వేషంబు లుడిగి ఫల
మూలంబు లుపయోగించి జపహోమార్చనపరాయణులై పెద్దకాలంబు
ఘోరతపంబుఁ జేసి సిద్ధి వడసి వహ్నులుం బోలె వెలుంగుచు సాక్షాత్పితా
మహునకు సాటి సేయం దగిన దేవర్షి బ్రహ్మర్షి మహర్షి వాలఖిల్య వైఖానసులుం
గలిగి దేవదానవగరుడగంధర్వకిన్నరకింపురుషసిద్ధచారణుల కాశ్రయం బై ప్ర
శాంతసింహవ్యాఘ్ర వరాహభల్లూక ప్రముఖనిఖిలమృగంబుల కాటపట్టై రెండవ
బ్రహ్మలోకంబుకరణి నందం బగుచున్నవసిష్ఠునిదివ్యాశ్రమంబుఁ జూచి యచ్చె
రు వందుచుఁ దన్మధ్యదేశంబునం జని యొక్కచోట. 991

విశ్వామిత్రుఁడు వసిష్ఠాశ్రమముఁ జేరుట.

సీ. ఒకనాఁడు జలపాన మొనరించి వెయ్యేండ్లు తపముఁ గావించినధన్యమతులు
నొకనాఁడు గాడ్పుఁ గ్రోలి కలంతకాలంబు నిష్ఠ సల్పినమహనీయమూర్తు
లొకనాఁడు జీర్ణపర్ణోపయోగ మొనర్చి పెక్కేండ్లు తపము సల్పినమహాత్ము
లాహారవర్జితులై కల్పకాలంబు నచలయోగ మొనర్చినట్టిఘనులు

తే. సమరసాధ్యాత్మవిద్యాప్రసంగవశత, బలసి తనుఁ గొల్వ వారికిఁ బ్రకటితార్థ
బోధ సేయుచు దీప్తాగ్నిఁబోలెఁ దేజరిల్లుచున్నవసిష్ఠు నుత్ఫుల్లయశుని. 992

ఉ. కాంచి తదంఘ్రిమూలములు గ్రక్కున ఫాలము సోఁక మ్రొక్కి దీ
వించి మునీశ్వరుం డుచితవిష్టరమందు వసింపఁ బంచి పూ
జించి ఫలంబు లిచ్చిన విశేషమతిం దగ సంగ్రహించి య
భ్యంచితభక్తిఁ గేల్మోగిచి యానృపుఁ డమ్మునినేత కి ట్లనున్. 993

మ. అనఘా సేమమె మీకు మీఘనతపం బవ్యాహతంబే తపో
ధనులై శిష్యులు గొల్తురే దనుజబాధల్ లేవుగా సంతతం
బనలోపాసన సెల్లునే ద్రుహిణపుత్రాగ్రేసరా యన్న నా
యన సేమంబున నున్నవార మని విశ్వామిత్రుతో ని ట్లనున్. 994

సీ. పార్థివోత్తమ నీవు ప్రజలఁ బాలింతువే తండ్రికైవడిఁ బాడి దప్పకుండ

నవనీత సంభృతు లై భృత్యగణములు చరియింతురే నీదుశాసనమున
బలకోశమిత్ర సంపత్పుత్రపౌత్రులం దరయుదే కుశల మహర్నిశంబు
మనుజేంద్ర రాజధర్మప్రకారంబునఁ బగతుల గెలుతువే ప్రాభవమున
తే. సాధుజనుల రక్షింతువే సవనకలన
వేలుపులఁ దృప్తినొందింతువే యటన్న
కుశలుఁడు పల్కె సర్వత్రకుశల మనుచు
వినయ మిగురొత్త నమ్మునివిభునితోడ. 995

వ. ఇట్లు ధర్మిష్ఠు లగువసిష్ఠవిశ్వామిత్రులు పరమసంతుష్టు లై పరస్పరప్రియాలాపం
బుల నొక్కింత సేపు కుశలకథాప్రసంగంబులు సలిపి బద్ధానురాగు లై యు
న్నంతఁ గథాంతంబున భగవంతుం డగువసిష్ఠుండు విశ్వామిత్రుతో నిట్లనియె.

—వసిష్ఠుఁడు విశ్వామిత్రుని చమూయుతముగఁ బూజఁ గైకొనఁగోరుట.—

మత్తకోకిల. రాజశేఖర నీవు ధాత్రికి రాజవాటకతంబునం
బూజనీయుఁడ వెల్లభంగులఁ బుణ్యమూర్తివి నీకు నేఁ
బూజఁ జేసెద నర్హభంగిఁ జమూయుతంబుగ నేఁడు మ
త్పూజనంబుఁ బ్రతిగ్రహింపు మభూతపూర్వసుఖంబుగాన్. 997

తే. మనుజనాయక యీనవేశమాగృహమున, నంచితంబుగ విం దారగించి యెల్లి
చనవలె నటంచుఁ బలికె నాజనవిభుండు, నింపు సొంపార నమ్మౌనికిట్టులనియె.

చ. అనఘచరిత్ర మీరు దయ నానతియిచ్చినమాటకంటె భో
జన మది యెక్కుడే సెల వొసంగినఁ బోయెద నంచుఁ బల్కన
ట్లనవల దంచు సారెకును బ్రార్థనఁ జేసిన మీరు వల్కిన
ట్ల నడచు గాక యంచు మనుజాధిపుఁ డెంతయు సమ్మతించినన్. 999

సీ. మునినాథుఁ డప్పుడు తనహోమధేనువు మానుగా రప్పించి దాని కనియె
నందిని వినుమ యీనరనాథునకు బలంబునకు విం దొనరింపఁ బూనినాఁడ
మచ్ఛాసనమున నీమహిమ తేఁటపడంగ వలయువస్తువులు నవారిగాఁగఁ
దృటిలోన నిచ్చట సృజియింపు మని పల్క మీఱినభక్తి నాసారభేయి
తే. షడ్రసనమన్వితములుగా స్వాదుసంగ
తములుగాఁ బరిపాకభేదములుగాఁగ
రుచ్యములుగాఁగ నమ్మునిలోకవిభుఁడు
హర్ష మొందఁ బదార్థంబు లపుడు కురిసె. 1000

—నందినీధేనువు విందుకు వలయువస్తువులు వర్షించుట.—

వ. మఱియుఁ బర్వతోపమంబు లగునిష్టకించిదుష్ణాన్నరాసులును సూపంబులును
సద్యోఘృతకూపంబులును దధికుల్యంబులును నిక్షురసమధుమైరేయవరాసవం
బులును మహార్హంబు లగుపానంబులును నుచ్చావచంబు లగుభక్ష్యంబులును

సహ్యంబు లైనలేహ్యంబులును దూష్యంబులు గానిచోష్యంబులును షా
డబంబు లగునానాస్వాదురసంబులును గుడపూర్ణంబులును బరమాద్భుత
ప్రకారంబుగ ననంతంబుగా సృజియించిన నత్తెఱంగు విలోకించి యద్భుతంబు
నొంది బ్రాహ్మణపురోహితామాత్యమంత్రిసుభృత్యసహితుండై. 1001

చ. కడు ముద మంది రాజు మునికాంతుని భూరితపోవిభూతి కిం
పడరఁగ హోమధేనువు మహామహిమంబున కిచ్చు మెచ్చుచున్
దృఢమతి వేయుభంగుల నుతించుచుఁ గాంచనభాజనంబునన్
గడి యొకమాడగాఁ గుడిచెఁ గాంక్షలు దీర యథాక్రమంబునన్. 1002

క. మఱియుం దక్కినవారలు, వరుసన్ దమ కిచ్చు వలయు వస్తువు లెల్లం
గర మరుదుగ భుజియించిరి, పరమానందాత్ము లగుచు భానుకులేశా. 1003

విశ్వామిత్రుఁడు నందినిధేనువును గ్రహింప నిచ్ఛయించుట.

చ. జనపతి దృప్తి నొంది మునిచంద్రుని హోమగవిన్ గ్రహింప నె
మ్మనమునఁ గోరి యమ్మునికి మానుగ నిట్లనె లక్షగుఱ్ఱము
ల్ఘనముగ లక్షధేనువులు లక్షమణుల్ మఱి లక్షకాంచనం
బెనయఁగ నిత్తు నోయనఘ యీమొదవుం గృప నిమ్ము నా కొగిన్. 1004

క. మునివర గోరత్నం బిది, యనిశము పార్థివుఁడు రత్నహారియుఁ గానన్
వినుము పరికింప నిది నా, ధన మొసఁగుము దీని నాకు ధర్మముపేర్మిన్.

సీ. అనుచు విశ్వామిత్రుఁ డాడిన నమ్మాట విని వసిష్ఠుఁడు చాల విహ్వలించి
ధరణీశ మా కేల కరులు హయంబులు మణిరత్నములు ధేనుమండలములు
హవ్యకవ్యములకు నాధార యగుదానిఁ బ్రాణయాత్రకు మూల మయినదాని
స్వాహావషట్కార సర్వమంత్రక్రియావిద్యలనిలయ మై వెలయుదాని
తే. నగ్నిబలిహోమసాధనం బైనదాని, నాత్మవంతునికీర్తియ ట్లనవరతము
నాశనము లేనిదాని సంతస మొసంగు, దాని నీదివ్యశబళ నీఁ దగదు నీకు.

ఆ. విడువఁదగనిదాని విడువుమ యని నీకుఁ, బలుక ధర్మమగునె పార్థివేంద్ర
గోసువర్ణవాజికోటులు వేయైన, సురభి కెనయె గాధివరకుమార. 1007

వ. అని పలికిన విశ్వామిత్రుండు సంరంభవిజృంభితుండై వసిష్ఠునవలోకించి సుహా
త్మా హైరణ్యకక్ష్యగ్రైవేయతోమరాంకుశభూషితంబు లగుపదునాల్గువేల
మత్తకుంజరంబులును గింకిణీజాలవిభూషితంబులును వేగవంతంబులును గాం
భోజసింధుదేశసంభవంబు లగుపదివేలహయంబులును శ్వేతాశ్వకలితంబులు
చతురశ్వయుతంబు లగు నెనమన్నూఱు కాంచనరథంబులును నానావర్ణవిభ
క్తంబు లగు కోటి పాడిమొదవులును మఱియు యథేష్టంబుగా మణిసువర్ణం
బు లిచ్చెదఁ బ్రతిగ్రహించి యీకల్మాషి నొసంగుమనిన నవ్వసిష్ఠుండిట్లనియె.

ఉ. రాజవరేణ్య మా కిదియె రత్నసువర్ణధనాదికంబులున్

వాజులు ధేనుసంతతులు వారణముల్ రథముల్ మఖక్రియల్
జేజెలు మెచ్చుజన్నములు జీవిత మాత్మతపఃఫలంబు వి
ద్యావిజయశీలవృత్తగుణధర్మములుం గృతకార్యసిద్ధియున్. 1009

వ. కావున. 1010

ఉ. ఎంత బహూకరించిన నహీనజవాశ్వము లెన్ని యిచ్చినం
బంతముతోడ ధేనువులు భద్రకరుల్ పదివేలకోట్లు గొం
పంతధనం బొసంగిన జనాధిప ధేనువు నీను నీకు నేఁ
డింత దురాశ యేల జనియించె వచింపక పొమ్ము నెమ్మదిన్. 1011

—: విశ్వామిత్రుఁడు నందినీధేనువును బలాత్కారముగాఁ గొనిపోవుట. :—

చ. అనవుడు గాధినందనుఁ డహంకృతి నీతని నింత వేఁడఁగా
మన కిఁక నేల మాని బలుమానిసిచందన మెఱుంగ నేర్చునే
వనముల నాకలంబు దిని వాడుట యొక్కటిగాక యంచుఁ జ
య్యన శబళిం గ్రహించి చతురంగయుతంబుగఁ బోవు చున్నెడన్. 1012

తే. మనుజనాథునిచే హ్రియమాణయగుచుఁ, జాలదుఃఖితయై మాని శబళయపుడు
దారుణధ్వని నేడ్చుచుఁ దనమనమున, నిట్లని కడంకఁ జింతించె నినకులేశ.

చ. తనహృదయం బెఱింగి సతతంబు మెలంగుచు వాఙ్మనోగతుల్
దనపయిఁ జేర్చి భక్తినయి తద్దయుఁ గొల్చెడునన్నుఁ గావరం
బున నిపు డిట్లు బల్మిఁ గొనిపోవఁగఁ జూచి వసిష్ఠుఁ డేలకో
కసలకుపేక్షఁ జేసె నపకార మొకింత యెఱుంగ నక్కటా. 1014

—: విశ్వామిత్రగృహీత యై నందిని వసిష్ఠునియొద్దకు వచ్చి మొఱ లిడుట. :—

వ. అని బహుప్రకారంబులం దలపోసి నిట్టూర్పు నిగుడించి. 1015

ఉ. వారిని జెఱికిం గొనక పందర చిందర లాడి కొమ్ములం
జీరి నఖమ్ములం జదిపి చిక్కక చిక్కులఁ బెట్టి బెట్టుహుం
కారముతో నదల్చుచు రయంబున దాఁటి మునీంద్రచంద్రునిం
జేరఁగఁ బోయి యిట్లనె వసిష్ఠుపదంబుల వ్రాలి దీనయై. 1016

మ. నను బల్మిం గొని భూవరుం డరుగుచున్నాఁ డీవు వారింప కి
ట్లునికిం బాడియె నీకు నన్నతని కిట్లొప్పింపఁగాఁ జెల్లునే
యనఘా నే నపరాధి గా నకట యిట్లన్యాయపుంగృత్యముల్
గని మీరూరకె యుండుట ల్కృప దొలంగం ద్రోచు టింతే కదా. 1017

వ. అని పెక్కువిధంబుల భగినియుం బోలె విలపించుచుఁ గన్నీరు మున్నీరుగా
రోదనంబుఁ జేసిన నమ్మొదవుదృఢభక్తివినయములకు మెచ్చి సస్నేహంబును
సగౌరవంబునుం గా ని ట్లనియె. 1018

ఉ. పటిమ నిన్ను నే విడుతు నెంతయు నీతఁడు దోర్బలంబునం

బోటరి యీచు నిమ్నఁ గొని పోయెడుఁగాని పయోధిసంఘముల్
ధాటికి మేర మీఱినవిధంబున రాజులు న్యాయహీను లై
పాటి దొలంగి వచ్చినను బ్రాహ్మణు లెంతటివారు చెప్పుమా. 1019

క. ఈక్షోణికి విభుఁ డీతం, డక్షౌహిణ్యన్వితుండు నది గాక యితం
డక్షీణసమరదోహలుఁ, డీక్షితిపతి నెట్లు గడతు నింతయుఁ జెపుమా. 1020

ఉ. నా విని వేల్పుటావు మునినాథుని కిట్లను బ్రహ్మతేజముం
గ్ష్మావరభూరితేజమునకంటెను మిక్కిలిగా నెఱుంగుదుం
గావున నీప్రతాపమునకంటె నృపాలునితేజ మెక్కు డా
నావసుధేశుసైన్యముల నాను మణంచెదఁ బంపు మన్ననన్. 1021

వ. అని పలికిన యానందినివచనంబు విని వసిష్ఠుండు దాని నవలోకించి శత్రు
బలంబులనాశంబు నొందించునట్టిసైన్యంబు సృజింపు మని యాజ్ఞాపించిన నా
సురభి బ్రహ్మతేజోసంభృత యై హుంకారంబుఁ గావించిన నమ్మహారవంబువల
నఁ బప్లవు లనేకులు జనించి విశ్వామిత్రునిసర్వసైన్యంబు నాశనంబు నొందిం
చిన నతండు కోపించి రథంబుఁ దోలించి యాక్రమించి. 1022

క. కడువడి లోచనములఁ గెం, పడరఁగ నుచ్చావచంబు లగుశస్త్రములన్
విడక యరాతుల నందఱఁ, బొడిసొడి గావించె భూరిభుజబల మలరన్. 1023

తే. మానవేంద్రశస్త్రార్దితు లైనవారిఁ, బప్లవులఁ జూచి శబళ కోపంబు గదుర
యవనపప్లవమిశ్రితు లైన శకుల, నపుడు పుట్టించెఁ గ్రమ్మఱ నద్భుతముగ.

వ. ఇట్లు సృజించిన వారు దీర్ఘాసిపట్టిసప్రాసపాణులును హేమకింజల్కసన్నిభు
లును గాంచనవర్ణాంబరావృతులును మహాప్రభావసంపన్నులును నై పుడమి
నాచ్ఛాదించి పావకశిఖలు శుష్కారణ్యంబు నేర్చువిధంబున విశ్వామిత్రుని
బలంబు నెల్ల నిర్దగ్ధంబుఁ గావించినం గినిసి. 1025

క. మానవపతి శరజాలము, జానుగఁ బరఁగింప యవనశకబల మెల్లన్
మీనక్షోభప్రచలిత, మైనమహాహ్రదముభంగి నాకుల మయ్యెన్. 1026

క. నరపతిచేతను సైన్యము, గరుసలిచేఁ బండుటాకు గతి నుడివడినన్
బరికించి తపసి ధేనువు, నరుదుగ బలముల సృజింపు మని పురికొల్పెన్. 1027

వ. ఇట్లు వసిష్ఠచోదిత యై యక్కామదోహిని దక్షణంబ హుంకారరవంబుల
వలన రవిసన్నిభు లగు కాంభోజులను బొదుఁగు వలన నానాస్త్రశస్త్రపాణు
లగుపప్లవులను యోనిదేశంబువలన భీషణాకారు లగుయవనులను శకృద్దేశం
బువలన సంతకహూపు లగుశకులను రోమకూపంబులవలన దంష్ట్రాకరాళవక్త్రు
లగుకిరాతులం బుట్టించిన నబ్బలంబులు విశ్వామిత్రబలంబులపయిం గవిసి
శతాంగమాతంగతురంగభటాంగంబుల నాజిరంగంబునఁ గసిమసంగి పొడ
వడంగించిన. 1028

చ. తనబల మంతయున్ ముని యుదారతపోబలసంపదన్ జెడ
న్గనుఁగొని మానవేంద్రుఁడు మహంబున నచ్చెరు వొంది చూడఁ ద
త్తనయులు నూర్గు రుద్ధతు లుదగ్రులు రోషవిభీషణాంగు లై
మునిపతి డాసి బిట్టవియ మొత్తుద మంచుఁ గడంగి శూరతన్. 1029

వసిష్ఠునికోపంబున విశ్వామిత్రునిసైన్యంబులు హతము లగుట.

తే. గిట్టి బెట్టుగ నమ్మౌనిఁ జుట్టు ముట్టి, యట్టహాసంబు సేసిన నట్టె గినిసి
యట్టికన్నులమిడుఁగుఱులుట్టిపడఁగ, గట్టితనమునఁ జెడుఁడంచుఁ దిట్టుటయును.

క. వా రాముని కోపంబున, వీరత్వము శూరతయు వివేకము నెడగా
నీఱై చనిరి మునుల కప, చారంబు లొనర్చునట్టి శఠులు మడియరే. 1031

వ. ఇట్లు బలంబును గుమారులును నిశ్శేషంబుగా వసిష్ఠునిదివ్యప్రభావంబున హతులైనం జూచి విశ్వామిత్రుండు వ్రీడితుండై నిర్వేగం బగుసముద్రంబు చందంబున భగ్నదంష్ట్రం బగుభుజంగంబుకైవడి నుపరక్తుం డగుభాస్కరుని భంగి లూనపక్షం బగువిహంగమంబుచాడ్పున హతపుత్త్రుండును హతబలుండును హతదర్పుండును హతోత్సాహుండును బరమనిర్వేదనపరుండునై నిష్ప్రభత్వంబు నొంది. 1032

ఉ. కొడుకులపాటుఁ జూచి నృపకుంజరుఁ డెంతయు దుఃఖరోషముల్
వొడమఁగఁ బట్టణంబునకుఁ బోయి యుదారుఁ గుమారు నొక్కనిన్
బుడమికి రాజుఁ జేసి చలమున్ మెఱయన్ హిమశైలమందు లో
నడరినభక్తి మీఱ నలికాక్షునిఁ గూర్చి తపం బొనర్పఁగన్. 1033

విశ్వామిత్రుఁడు శివునివలన సమస్తాస్త్రంబులు వడయుట.

క. జనవరుఁ డొనరించుతపం, బున కెంతయు మెచ్చి భుజగభూషణుఁడు రయం
బునఁ బ్రత్యక్షం బై నెమ్మనమునఁ గృప గదురఁ బలికె మధుమధురోక్తిన్.

క. నరవర ఘోరతపం బిటు, కర మరుదుగ నేమి గోరి కావించెదవో
వర మొసఁగ వచ్చినాఁడను, గురుమతి నిష్ట మగుదానిఁ గోరు మొసఁగెదన్.

క. నా విని విశ్వామిత్రుఁడు, భావంబునఁ బొంగి శివునిపాదంబులకుం
గేవలభక్తి నమస్కృతిఁ, గావించి వచించె ఫాలకలితాంజలి యై. 1036

మ. కృప నాపైఁ గల దేని శంకరధనుర్విద్యారహస్యంబు య
క్షపతంగోరగసిద్ధచారణమరుత్క్రవ్యాదశస్త్రాస్త్రముల్
విపులప్రక్రియ సర్వమున్ దెలియఁగా వేర్వేఱ సాంగంబుగా
నుపదేశింపు మటంచు శత్రుమదనప్రోత్సాహి యై వేఁడినన్. 1037

క. మెచ్చి వచించిన వన్నియు, నిచ్చితి నరపాల యని మహేశ్వరుఁడు ముదం
బచ్చుపడ వెండికొండకు, విచ్చలవిడి నరిగె దేవవితతులు గొల్వన్. 1038

వ. అంత.
1039

క. అన్నరవిభుఁ డివ్విధమున, నన్నగకార్ముకునిచేత నఖిలజగములం
దెన్నికగల వన్ని బాణము, లున్నతగతిఁ బడసి సంగరోత్సాహమునన్. 1040

శా. శుంభల్లీల మహోగ్రుఁడై కుపితుఁడై సొంపొందు కల్పాంతకృ
చ్ఛంభుండో యన దుస్సహప్రకటదోస్సారంబు దీపింపఁగా
నంభోధిక్రియ నింగిఁ బొంగి సమరవ్యాపారలీలాకళా
రంభం బొప్ప వసిష్ఠునాశ్రమము సేరం బోయి యత్యుద్ధతిన్. 1041

విశ్వామిత్రుఁడు మహాస్త్రంబుల వసిష్ఠునాశ్రమముమీఁదఁ బ్రయోగించుట.

మ. నియతిన్ ఘోరశరంబు లేసిన మహాగ్నిజ్వాలికామాలికల్
వియదాగారము భూతధాత్రియు దిశల్ భీమాకృతి న్నిండఁగన్
భయదప్రక్రియ విస్ఫులింగచయశబ్దంబుల్ రహి న్మ్రోయఁగ
న్రయ మొప్పారఁ బొగల్ మహీస్థలము సంధత్వంబు నొందింపఁగన్. 1042

వ. అమ్మహనీయదివ్యాస్త్రంబులు రభసాతిశయంబునం బఱతెంచి వసిష్ఠముని యాశ్రమవనంబుఁ జుట్టుముట్టి దహింపం దొడంగినఁ దదీయభీషణజ్వాలాసంతప్తంబులై ఖగమృగంబులును వసిష్ఠశిష్యులునుం దక్కినమునులును భయభీతులై విరావంబులు సేయుచు దశదిక్కులకుం బఱచిరి తదీయాశ్రమం బొక్కముహూర్తం బిరిణసన్నిభం బై యుండె నప్పు డక్కులకలం బాలించి యది విశ్వామిత్రునికృత్యం బని యెఱింగి భాస్కరుండు నీహారంబునుం బోలె గాధేయు నిప్పుడ నాశంబు నొందించెద నోడకుండుం డని వారి కందఱ కభయంబుఁ దెల్పి పాదవిన్యాసంబునఁ బుడమి గ్రక్కదల బ్రహ్మదండంబు మహోద్దండదండధరకాలదండంబుకరణిఁ బ్రచండలీలం గేలం గ్రాల విధూమకాలాగ్నియుం బోలె మండుచు రౌద్రరసోల్లాసమూర్తి యై శీఘ్రంబునం బఱతెంచి నిజకోపాగ్నిజ్వాలాజాలదహ్యమానవిశ్వామిత్రప్రయుక్తవిశిఖశిఖాపరంపరుం డగుచు విశ్వామిత్రునాలోకించి ప్రళయజీమూతసంఘాతసంజాతగర్జాసముజ్జృంభణగంభీరభాషణంబుల నిట్లనియె. 1043

తే. వినుము మూఢాత్మ చిరపరివృద్ధ మైన
యాశ్రమము దగ్ధ మొనరించి తందువలనఁ
గడు దురాచారపరుఁడవు కలుషబుద్ధి
వైతి వింక నశించెదు నీతిదూర. 1044

వ. అని పలికిన నవ్విశ్వామిత్రుండు కోపించి చాపంబునం దాగ్నేయాస్త్రంబును సంధించి నిలు నిలు మని యదల్చిన నవ్వసిష్ఠుండు కాలదండంబుఁ బోని బ్రహ్మదండం బెత్తి పరమసంక్రుద్ధుం డై విశ్వామిత్రున కిట్లనియె. 1045

తే. ఓరి రాజ్యమదాంధుఁడ యోరిశఠుఁడ, కడఁగి పుణ్యాశ్రమము లిట్లు కాల్పఁదగునె
యింత కేనేడ నీవేడ నిట్టిపాప, కార్యము లొనర్పఁ బాడియె కలుషబుద్ధి. 1046

ఉ. బ్రహ్మబలం బెఱుంగక నృపాలుఁడ నంచు మదాభిమాని వై
బ్రహ్మసమాను నన్ను వడి బాములఁ బెట్టఁగ వచ్చి తీవు మ
ద్బ్రహ్మబలంబున న్నిను శరంబుల వ్రేల్మిడి గీటణంచెదన్
బ్రహ్మవిరోధి నీ కగుబలం బది సర్వముఁ జూపు మిత్తఱిన్. 1047

వసిష్ఠుఁడు బ్రహ్మదండమున విశ్వామిత్రునియస్త్రముల నన్నియు మడియఁ జేయుట.

వ. అనిపలికి కాలదండంబుం బోని బ్రహ్మదండంబుచే విశ్వామిత్రునియాగ్నే
యాస్త్రంబులు సలిలంబున వహ్ని వేగంబుం బోలె శాంతి నొందించినఁ గనలి
విశ్వామిత్రుండు క్రమంబున రౌద్రంబును నైంద్రంబును బాశుపతంబును
నైషీకంబును మానవంబును మోహనంబును గాంధర్వంబును స్వాపనంబును
జృంభణంబును సంతాపంబును విలాసంబును శోషణంబును మార్గణంబును
సుదుర్జయం బగువజ్రంబును బ్రహ్మపాశంబును గాలపాశంబును వరుణపాశం
బును బినాకాస్త్రంబును శుష్కార్ద్రనామకం బైనయశనిద్వయంబును
దండాస్త్రంబును బైశాచంబును గ్రౌంచంబును ధర్మచక్రంబును గాలచక్రం
బును విష్ణుచక్రంబును వాయవ్యాస్త్రంబును మథనంబును హయశిరంబును
శక్తిద్వయంబును గంకాళంబును గాపాలంబును గంకణంబును ముసలంబును
వైద్యాధరాస్త్రంబును గాలాస్త్రంబును దారుణం బగు త్రిశూలంబును మొద
లుగా ననేకాస్త్రశస్త్రపరంపరలు పరఁగించిన. 1048

చ. ఇటు కుశవంశజుం డడరి యేయు మహోగ్రశితాస్త్రశస్త్రముల్
చటులరవంబులన్ భువనజాలములన్ సుడిఁ బెట్టెఁ గాని యా
జటి నొక కేని నొంచుటకుఁ జాలదు తత్పృథుశక్తి యెట్టిదో
కుటిలులు సేయుకృత్యములు కోరి మహాత్ములచెంతఁ జేరునే. 1049

ఉ. అప్పుడు బ్రహ్మదండమున నమ్మునిశేఖరుఁ డుష్పరంబునం
దెప్పర మై తనర్చి పఱతెంచు నరేంద్రుని యస్త్రపఙ్క్తి నే
ర్పొప్పఁగ ద్రుంచి యొప్పెసఁగె యోగివరేణ్యుఁడు దత్త్వబోధచేఁ
గప్పిన యింద్రియస్ఫురణ క్రక్కున మాన్చి చెలంగుకైవడిన్. 1050

శా. బ్రహ్మణ్యం డగుమౌనిచేఁ దనశరవ్రాతంబు లిట్లాటకున్
బ్రహ్మణ్యం డితఁ డన్యసాధనములన్ బంచత్వ మొందం డిఁకన్
బ్రహ్మాండం బటు తల్లడిల్లఁగఁ జతుర్వారాను లింకన్ దగన్
బ్రహ్మాస్త్రం బడరింతు నంచుఁ జల మొప్పం గౌశికుం డుద్ధతిన్. 1051

మ. తగ నయ్యస్త్రము మౌర్వితో నియమమంత్రస్ఫూర్తి సంధించినన్
బగిలెన్ మిన్ను కులాద్రు లొడ్డగిలెఁ గంపం బొంది మ్రోసెన్ దిశ
ల్ఖగరాజుల్ గతి దప్పి రంబునిధికీలాలంబు లింకెన్ గజో
రగముల్ మ్రొగ్గె జగంబు ఘూర్ణిలెఁ బరిత్రస్తాత్ము లై రంతటన్. 1052

వ. ఇట్లు సముచితంబుగా సంధించి విశ్వామిత్రుఁ డమ్మహనీయాస్త్రంబు లోక
క్షోభంబుగాఁ దిగిచి విడిచిన. 1053

మ. చటులస్ఫూర్తి మిడుంగుఱుల్ సెదర దిక్చక్రంబునందున్ జట
చ్ఛటశబ్దంబులు పెల్లు రేఁగి దివియున్ క్ష్మాభాగమున్ నిండ ను
త్కటవేగంబున లోకజాలములు మ్రింగన్ వచ్చుమాడ్కిన్ మహో
త్కట మై సుంపుచు బ్రహ్మదండమును గిన్కన్ దాఁటి యేతేరఁగన్. 1054

చ. కనుఁగొని మౌని ము న్నలయగస్త్యమునీశ్వరుఁ డబ్ధిపూరమున్
ఘనముగ నొక్కగ్రుక్కఁ గొనుకైవడి గ్రక్కున వక్త్రగహ్వరం
బనువుగ విచ్చి మ్రింగె నపు డస్త్రము తాపసుగర్భమందుఁ జ
య్యన వెలిఁగెన్ మహార్ణవమునందు వెలింగెడుబాడబం బనన్. 1055

వ. అప్పు డత్తేజోమూర్తి దివ్యరూపంబు త్రైలోక్యమోహనం బై రౌద్రం బై
దారుణప్రకారంబునం బొలిసె మఱియు. 1056

ఉ. ఆరయ నిట్టు లమ్మునికులాగ్రణి తత్ప్రథితాస్త్రరాజము
న్నారక మ్రింగి భాస్కరునివైఖరి శోభిలె నంత నమ్మహో
ద్దారుని యంగరోమసముదాయములన్ శిఖ లుప్పతిల్లి బల్
దారుణభంగి లోకములఁ దద్దయు నేర్వఁ దొడంగె నయ్యెడన్. 1057

వ. ఇట్లు భువనభయంకరుండై ప్రళయకాలమార్తాండుండువోలె దుర్నిరీక్షుండై
వెలుంగుచున్నవసిష్ఠునిం జూచి భయంబుఁ గొని దేవర్షిగణంబు లచ్చటికిం
జనుదెంచి ప్రస్తుతించుచు ని ట్లనిరి. 1058

ఉ. మానవభర్త బల్దురభిమానమునం జెనకంగ వచ్చి నీ
చే నిగృహీతుఁ డయ్యె మునిశేఖర ని న్గని లోకముల్ భయ
స్థానము లయ్యె నింకిటఁ బ్రసన్నుఁడవై కృపఁ బూని భూతముల్
దీనత వీడ నీదు ఘనతేజము తేజమునన్ ధరింపుమా. 1059

క. అని ప్రార్థించిన మునిపతి, తనరౌద్రత విడిచి సౌమ్యదర్శనుఁ డయ్యెన్
మునులు తెలివొంది రనిమిషు, లనుపమహర్షాబ్ధి నోలలాడిరి వరుసన్. 1060

విశ్వామిత్రుఁడు వసిష్ఠుచే నవమానితుండై తపంబుఁ జేయఁ బోవుట.

వ. అంత నవ్విశ్వామిత్రుండు పరాభవంబునొంది సారెసారెకు నిట్టూర్పులు
వుచ్చుచు నమ్మునీంద్రుం డొక్కబ్రహ్మదండంబున మదీయదివ్యబాణంబు లన్ని
యు నాశంబు నొందించె బ్రహ్మతేజోబలంబె బలంబుగాక క్షత్త్రియబలం బేటి
బలం బని నిందించి ప్రసన్నేంద్రియమానసుండై తపంబుచేసి బ్రహ్మత్వంబు
వడసెదఁ గా కని నిశ్చయించి వసిష్ఠుతోడఁ గృతవైరుండై భార్యాసమన్వి
తంబుగా దక్షిణదిక్కునకుం బోయి యం దొక్కతపోవనంబున ఫలమూలాశ
నుండై మానసేంద్రియంబులు జయించి ఘోరతపంబు సేయుచు హవిష్యంద

మధుష్యంద దృఢనేత్ర మహారథు లనుసత్యధర్మపరాయణుల నలువ్వురం బుత్రులం
బడసి. 1061

—— బ్రహ్మ విశ్వామిత్రునకుఁ బ్రత్యక్షమై రాజర్షిత్వం బొసంగుట. ——

ను. చలముఁ గడింపక గాధినందనుఁడు నిష్ఠాభక్తియుక్తంబుగా
జలజాతప్రభవుంగుఱించి బహువర్షంబుల్ తపం బున్నతిన్
జలుపన్ మెచ్చి విరించి వచ్చి వసుధేశా నీతపఃప్రౌఢికిం
బలరన్ మెచ్చితి సంస్తుతిన్ బడయు మయ్యా యింక రాజర్షివై. 1062

మ. అని రాజర్షిపదం బొసంగి ద్రుహిణుం డంతర్హితుం డైన న
య్యనఘుం డింత తపంబుఁ జేసియును బ్రహ్మర్షిత్వముం గాంచ నై
తిని రాజర్షిపదం బిదేల యనుచున్ దీవ్రవ్రతప్రక్రియన్
ఘనకౌతూహలుఁడై యఖండతపముం గావించుచుండెన్ రహిన్. 1063

—— త్రిశంకుమహారాజు సదేహముగా స్వర్గముఁ బొందఁ గోరుట. ——

సీ. అప్పు డిక్ష్వాకువంశాంభోధిచంద్రుండు వినుతకీర్తి త్రిశంకు జనవిభుండు
తనువుతోడనె గూడి తా నాకలోకంబునకుఁ బోవఁ దగుజన్న మొకటి సేయఁ
బూని భక్తి వసిష్ఠమునిపాలి కేతెంచి యుచితసపర్యల నుపచరించి
యనఘ యిక్ష్వాకువంశాధీశులకు నెల్ల నిఖిలకామదుఁడవు నీవె కావె

తే. నిగుల మీకృప గలవారి కగునె కోఱఁత
లమరలోకంబునకు స్వదేహంబుతోడ
నరుగఁ దగినట్టి యొకయాగ మర్థితోడ
నమర నాచేతఁ జేయింపు మయ్య యనిన. 1064

చ. ఘనుఁడు వసిష్ఠుఁ డిట్లనియె గాత్రముతో సురరాజువీటికిన్
జనఁగ నసాధ్య మెవ్వరికి జ్ఞానవరము న్నిటువంటియాగ మే
జనపతులైనఁ జేసిరె విచారము సేయక యిట్టియధ్వరం
బొనరుపఁ బూను టెట్టు లిటు లొప్పనికార్యము కాదు పొమ్మికన్. 1065

—— త్రిశంకుఁడు వసిష్ఠుచేతఁ దిరస్కృతుండై వసిష్ఠపుత్త్రులపాలి కరుగుట. ——

వ. అని పలికిన నమ్మహీరమణుండు వసిష్ఠునిచేతఁ బ్రత్యాఖ్యాతుండై లజ్జావనతే
వదనుం డగుచు దక్షిణంబునకుం జని యందు సంశితవ్రతులై తపంబు సేయు
చున్నవారి సూర్యసంకాశుల వసిష్ఠపుత్రుల నూర్వురం గని యానుపూర్విగా
నగ్గురుకుమారులకు నమస్కరించి కృతాంజలిపుటుం డై యిట్లనియె. 1066

సీ. అనఘాత్ములార యే నంగంబుతోఁ గూడ దివి కేగఁ దగునట్టిసవన మొకటి
సేయంగఁ బూని వసిష్ఠునికడ కేగి ప్రార్థింపఁ గాదు పొమ్మనియె నింక
మీకన్న నెవ్వారు నాకు శరణ్యులు గురుసుతులగు మీకు శిరముతోడ
నభివాదనముఁ జేసి యాచించెదఁ గృపాప్తి యాజకులై మీర లట్టిక్రతువు

తే. తవిలి నాచేతఁ జేయింపుఁ డవనిపతులు
గురువుల ప్రసాదమునఁ గాదె కోర్కె నడయు
నెల్ల మీకృప నయ్యాగ మెలమిఁ జేసి
నేను జరితవ్రతుండనై నెగడవలదె. 1067

వ. అని పలికినఁ ద్రిశంకునివచనంబులు విని క్రుద్ధులై వసిష్ఠపుత్రు లతని కిట్లనిరి.

మ. భువి నిక్ష్వాకుల కెల్ల నొజ్జ త్రిజగత్పూజ్యుండు సత్యవ్రత
శ్రవుఁ డస్మద్గురుఁ డుత్తపస్వివలుకుల్ దాఁటంగ లే రెవ్వరా
రవితుల్యుండు గురుండు కాదనినఁ గార్యం బట్టె వో నీక భూ
ధవ శాఖాంతర మొంది తీవు తగునే ధర్మంబుఁ దప్పింపఁగన్. 1069

వ. భగవంతుం డగువసిష్ఠుం డశక్యంబన్నదాని నే మెట్లు నాధింపనేర్తు మతం డాడిన
మాట సత్యం బగుం గాని రిత్త యగునే నీవు బాలిశుండ వగుటం జేసి మమ్ము
నడుగ వచ్చితి పమ్మహానుభావున కవమానంబు సేయుటకు సహింపం జాలము నీ వీ
దుర్విచారంబు విడిచి పురంబునకుం బొమ్మని పలికినఁ గ్రోధపర్యాకులాతురం
బగువాసిష్ఠుల వచనంబు విని వెండియుఁ ద్రిశంకుం డిట్లనియె. 1070

తే. తొలుత మీతండ్రిచే నట్లు త్రోయఁబడితిఁ
బిదప మీచేత నిటు లైతిఁ బెద్దసేయఁ
జనునె మి మ్మింక నే నన్య శరణ మొంద
నరిగెద శుభంబు గలుగుఁగా కరయ మీకు. 1071

వసిష్ఠపుత్రులు త్రిశంకునిఁ జండాలుఁడవు గమ్మని శపించుట.

వ. అనిన ఘోరాభిసంహితం బగునమ్మహీపతివచనంబు విని. 1072

క. మండిపడి మునికుమారు లఖండతపోమహిమ వెలయ ఖ్యాతలవిభునిం
జండాలుండవు గమ్మని, చండతరక్రోధ మరల శపియించి రొగిన్. 1073

వ. ఇట్లు శపించి మునిపుత్రులు నిజాశ్రమంబుఁ బ్రవేశించి రంత నారాత్రి చనిన
మఱునాఁడు. 1074

క. దండిసెడి మునికుమారక, చండతరక్రోధజనితశాపంబున భూ
మండలపతి కష్టం బగు, చండాలత్వము వహించె జనవరణనయా. 1075

సీ. అపుడు వాసిష్ఠకోపాగ్నితేజంబున నలిఁ గాలెనన మేను నల్లనయ్యె
నెఱిమించు పైఁడివన్నియ సన్న మగుపట్టు కమ్మిచీరయు మేచకత్వ మొందెఁ
బ్రణుతకాంతిస్ఫూర్తిఁ బరఁగెడుసౌవర్ణమణిహారములు లోహమయములయ్యె
వీడినశిఖతోడఁ బోఁడిమిసెడి నీచనామోక్తిభేదంబు లాముకొనియె

తే. నరయఁ దజ్జాతి కనురూప మైనవేష, మంతయును దాల్చి కన్నవా రంత నంతఁ
బరవఁ గేవలచండాలభావుఁ డగుచుఁ, బురమునకువచ్చె నంత నాభూవిభుండు.

తే. అతనిచండాలరూపంబు నరసిచూచి, పౌరులు నమాత్యభృత్యులు బంధుజనులు

నతని వర్జించి రంత నయ్యవనినాథుఁ, డార్తిఁ గుందుచు నేకాకియై రయమున.

—త్రిశంకుఁడు విశ్వామిత్రుకడ కేగుట.—

క. జనములఁ జూచిన నొదుఁగుచుఁ, దనదురవస్థకును జాలఁ దలఁకుచు మదిలో
మునిసుతులచేత కులుకుచు, ఘనుఁ డగు నగ్గాధిసుతునికడకుం జనియెన్.

క. తనపాలికిఁ జను దెంచిన, జననాథవరేణ్యు మేని చండాలతయుం
గని కరము విస్మయంబునఁ, గనికర మెసఁ బొదవ ననియెఁ గౌశికుఁ డంతన్.

చ. నరవర సర్వధారుణికి నాథుఁడవై నయధర్మశాలివై
వఱలెడునీకు నిట్టిదురవస్థపురూప మిదేలవచ్చె నా
కెఱుకపడంగఁ జెప్పు మన నెంతయు నానృపమౌళి దీనుఁడై
కరములు మోడ్చి సిగ్గుగొని గద్గదికం దలవాంచి యిట్లనున్. 1080

చ. ఎలమిగ మేనితోడ దివి కేగఁగఁజాలిన యొక్కయాగముం
బొలుపుగ నే నొనర్ప మదిఁ బూని వసిష్ఠునితోడఁ జెప్ప ని
వ్వలపనిపోలి యేటి కిటువంటిసుఖం బొనరింపఁబోల దం
చలవడఁ జెప్పెఁ జెప్పుటయు నమ్మునిసూనులఁ జేరి వారితోన్. 1081

వ. యే నిట్లంటి. 1082

తే. దేహయుక్తుఁడనై యేను దివిజలోక, మునకుఁ బోవుట కధ్వనవనము సేయఁ
బూనితిని దాని నాచేత మానితముగ, నర్థిఁ జేయింపుఁ డనినఁ గా దనిరి వారు.

ఉ. అంతటఁ గొన్ని నిష్ఠురము లాడిన యమ్మునినాథపుత్రు ల
త్యంతదురంతరోషయుతులై నను మాలవుగ న్శుటంచు న
త్యంతి శపించి రప్పు డది కారణ మే నిటు లౌట కో మహీ
కాంతశిఖావతంస తనకర్మఫలంబులు రిత్తవోవునే. 1084

ఆ. పెక్కుధర్మములును బెక్కుదానంబులుఁ, బెక్కుజన్మములును బెంపుతోడఁ
జేసి గురుల కర్చఁ జేసితి గురువుల, కరుణలేమి నిట్టికార్య మయ్యె. 1085

తే. అనఘ నావచనము కలనైన బొంకు
గాదు నేఁ డిట్టిమునిశాపకారణమున
నధ్వర మొనర్తు ననుమాట యనృతమయ్యె
ననుచు నామది వొక్కెడు నహరహంబు. 1086

తే. ఇట్టియాపదలం దైన నింకమీఁదఁ, బట్టి సత్యంబు పాలింతుఁ బరమనిష
నీదుగాఢానుకంపచే నోదయాబ్ధి, దైవమైన ననుఁ జేపట్టి ప్రోవుమయ్య. 1087

క. దైవం బెక్కుడు పౌరుష, మేవంక నిరర్థకం బహీనగుణాఢ్యా
దైవాధీనము సర్వము, దైవమె పరమగతి యనుచుఁ దలఁచెద బుద్ధిన్. 1088

తే. అట్టిదైవంబుచే నుపహతుఁడనైన, నాకు నీకంటె శరణ మన్యంబు లేదు
పురుషకారంబుచే దైవమును గడంగి, క్రమ్మతింపంగఁ దగు దీవు గాధితనయ.

విశ్వామిత్త్రుఁడు త్రిశంకుయాగమునకై ఋషుల నందఱఁ బిల్వంపుట.

చ. అనిన దయార్ద్రుఁడై కుశికులాగ్రణి యిట్లను నోశకుంభవ మో
జనవర దీనుని న్నినుఁ బ్రసన్నతఁ బ్రోచితి నింక మానుల
న్ఘనముగఁ బిల్వ నంపి సవనం బొనరించి వపుర్యుతంబుగా
ననిమిషనాథులోకమున కంపెద నీవచనంబు చెల్లఁగన్. 1090

క. అనఘాత్మ శరణ్యుఁడ వగు, నను శరణము నొందినకతనం దగ నీకున్
మునుకొని నిర్జరలోకం, బనిశముఁ గరకలితమైన దనుచుఁ దలఁచెదన్. 1091

వ. అని యూఱడిలం బలికి విశ్వామిత్త్రుండు తనపుత్త్రుల మహాప్రాజ్ఞుల హవిష్యం దాదుల నవలోకించి మీరు యజ్ఞసంభారంబు లన్నియు నొనగూర్పుం డని నియమించి శిష్యులం బిలిచి మీ రతిత్వరితగమనంబునం జని మదీయశాసనంబుఁ దెలిపి బ్రహ్మవాదులును బహుశ్రుతులు నగు మహర్షుల నందఱ శిష్యసుహృత్సహితంబుగా మత్సకాశంబునకుఁ దోడ్కొని రండు మద్వాక్యబలచోదితుండై యెవ్వండు రాక నిరాకరించి నిందావాక్యంబుఁ బలుకు నతనిచేత నుక్తం బైన దాని నంతయు నా కెఱింగింపుఁ డని పలికిన వారలు శీఘ్రంబున దశదిక్కులకుం జని విశ్వామిత్త్రునివచనంబుఁ దెలిపి సమస్తసంయములం దోడ్కొని వచ్చి విశ్వామిత్త్రు నుచితభంగి సందర్శించి కేల్మొగిచి యిట్లనిరి. 1092

ఉ. వీరె సమస్తసంయములు వేగమె వచ్చినవార లెంతయు
న్నారు వసిష్ఠునాశ్రమమునం గలమానులు వారుదక్క నీ
ధారుణిలోపలం గలుగుతాపసు లందఱు నేగుదెంచి రిం
కారయ నవ్వసిష్ఠసుతు లాడినపల్కులు చిత్తగింపుఁడీ. 1093

సీ. చతురత వాటించి జన్నంబు సేయించువాఁడు రాజఁట మాలవాఁడు సేయు
నఁట వానిమఖమున నఖిలసంయమివర్యు లుండి భుజింతురే యుక్తిఁ జేసి
యచటి కెవ్విధమున నరుదెంచెదరు హవిర్భాగంబుఁ గొన సర్వయాగభుజులు
చెలఁగి గాధేయరక్షితుఁడై నవాఁడెట్లు సురవిష్టపమునకు నరుగఁగలఁడు

తే. వినవిన విచిత్ర మిమ్మాట యనుచు వార
లమ్మహోదయసంయుతు లగుచుఁ జాల
నేత్రముల రక్తిమ చెలంగ నిష్ఠురముగఁ
గనలి దూషించి రనవుడు గాధిసుతుఁడు. 1094

విశ్వామిత్త్రుఁడు వాసిష్ఠమహోదయుల శపించుట.

క. కటము లదర లోచనములఁ, జిటచిటఁ బావకకణములు సెదరఁగ రోషో
త్కటమున మేను వడఁక మి, క్కుటముగఁ గలుషించి పండ్లుగొఱుకుచుఁ బలికెన్.

వ. అదూష్యుండ నైన నన్ను దూషించినదురాత్ము లగువాసిష్ఠులు భస్మీభూతులై కాలపాశంబునం గట్టువడి నిస్సంశయంబుగా నిప్పుడ యమసదనంబునకుం జని

యందు నానావిధనరకంబు లనుభవించి పదంపడి సప్తశతజన్మంబులు నీచజాతు
లం బుట్టి నిర్ఘృణులై వికృతులై విరూపులై మృతశునకమాంసభక్షకులై
భూలోకంబున వర్తింతురుగాక మఱియు నన్ను దూషించినదుర్బుద్ధి యగు
మహోదయుండు సర్వలోకదూషితుండై నిషాదత్వంబు నొంది ప్రాణాతిపాత
నిరతుండై నిరనుక్రోశత్వమతో విధంబువలన దీర్ఘకాలంబు దుర్గతినొందుంగాక
యని యిట్లు మహాతేజుం డగువిశ్వామిత్రుండు మహోదయసహితులైన వసిష్ఠ
పుత్త్రులఁ దపోబలనిహతులం గావించి ఋషిమధ్యంబున నొక్కింతసే పూర
కుండి తనచుట్ల నున్నమహాత్ముల నందఱ విలోకించి యిట్లనియె. 1096

ఉ. మునులారా వినుఁ డింక నీమనుజరాణ్ముఖ్యుం ద్రిశంకుం సుశీ
లుని ధర్మజ్ఞుని సత్యసంధునిఁ గృపాలోలుం మహావైభవుం
ఘనపుణ్యుం గరుణార్ద్రదృష్టిఁ గని యీగాత్రంబుతో జంభసూ
దనులోకంబున కేగునట్టిమఖ ముద్యత్ప్రీతిఁ గావింపరే. 1097

వ. అని విశ్వామిత్రుం డాజ్ఞాపించిన నమ్మును లొక్కింత తమలో విచారించి యీ
విశ్వామిత్రుండు పరమకోపనుం డితండు చెప్పినకార్యంబు ధర్మసహితంబు గా
దంటిమేని రోషితుండై దంభోళికఠోరఘోరవాక్యంబున శపించుం గావున
నితండు గఱపినమార్గంబున నిమ్మహీరమణుండు సశరీరుండై విశ్వామిత్రుని తే
జంబున దివంబునకుం జను నట్టిమహాధ్వరంబు సేయించుట కర్తవ్యం బని నిశ్చ
యించి మంత్రకోవిదు లగుమహాత్ములు యాగకర్మకౌశలంబుమెఱయఁగల్పోక్త
ప్రకారంబున సర్వకర్మంబులు నిర్వర్తించుచుండి రప్పుడు. 1098

విశ్వామిత్రుండు తనతపోమహిమచేఁ ద్రిశంకుని స్వర్గమునకుఁ బంపుట

క. ఆగాధిసుతుండు యాజకుఁ, డై గీర్వాణాధిపతుల హావద త్తహవి
ర్భాగముఁ గొనఁ బిల్చిన వా, రాగతి రామనుచుఁ బలికి రంబరవీథిన్. 1099

క. అన విని రోషము మదిలోఁ, బెనఁగొనఁ గౌశికుఁడు కుశపవిత్రము కేలం
దనర స్రువ మెత్తికొని యజ్ఞనాథునితోడ ననియె సమ్మతితోడన్. 1100

మ. జగతీనాయక చింతసేయవల దశ్రాంతంబు నే సత్యవా
క్యగరిష్ఠుండన యేని ఘోరతప ముద్యన్నిష్ఠఁ గైకోర మా
దిగఁ గాపింపుదు నేని నాకమున కీదేహంబుతోఁ గూడఁ బో
యి గరీయస్థితి నుండు పొమ్మనిన ధాత్రీశుండు సోల్లాసుఁడై. 1101

క. అచ్చటిమును లందఱు కర, మచ్చెరువడి చూచుచుండ నపు డంగముతోఁ
జెచ్చెర దుర్లభ మయిన వి, యచ్చరలోకమున కరిగె నద్భుతభంగిన్. 1102

వ. ఇట్లు త్రిశంకుండు దివంబునకుం జనినఁ బురందరుండు బృందారకులతోడ
నాలోకించి. 1103

క. చండాలుండవు నీ విం, దుండఁగఁ దగ దనుచు శక్రుఁ డాగిఁ ద్రోయింపం

బెండు నెఱి శిరము క్రిందై, మండలపతి వచ్చుచుండె మానము దూలన్.

వ. ఇట్లంతరిక్షంబుననుండి తలక్రిందుగా సుహావాతపతితం బైనకల్పద్రుమంబుచం దంబున విశ్వామిత్రా రక్షరక్ష యనుచు విలాపంబునం బ్రలాపించుచు వచ్చు చున్నత్రిశంకుం జూచి కరుణావిధేయుం డగుగాధేయుండు నిలునిలు మని పలికి తీవ్రరోషపరీతుండై సాక్షాత్ప్రజాపతియుం బోలె ఋషిమధ్యంబున వెలుం గుచుఁ దనతపఃప్రభావంబున. 1105

విశ్వామిత్రుఁడు త్రిశంకునకై యన్యస్వర్గంబు సృజియించుట.

క. ఆక్షణమున నలుక సహా, ప్రాక్షునితోఁ జలము మెఱసి యన్యస్వర్గం
బాక్షణమున సృజియించెను, దక్షుండై సకలభూతతతి వెఱఁ గందన్. 1106

తే. ఇట్లు ప్రతినాక మొనరించి యెలమిఁ దార,కలను సప్తర్షులను వేఱె గలుగఁజేసి
వేఱె సురలను వజ్రికి వేఱె వజ్రి, నిపుడె కల్పింతు నని పల్కు నంతలోన.

సీ. పరమసంభ్రాంతులై సురసిద్ధచారణగరుడగంధర్వకిన్నరులు మునులుఁ
గౌశికుపాలికిఁ గడురయంబున వచ్చి సానునయోక్తి ని ట్లనుచుఁ బలికి
రనఘాత్మ యీనృపుఁ డరయంగ గురుశాపహతుఁ డయ్యెఁ గావున నమరపదముఁ
బడయ నర్హుఁడు గాఁడు పరికింప కిట్లు కోపింప నీ కవునె శమింప వయ్య

ఆ. యనిన గాధితనయుఁ డనుకులఁ జూచి యీ, నృపుని మేనితోడఁ ద్రిదివమునకు
నర్థిఁ బంపువాఁడ నని ప్రతిజ్ఞ యొనర్చి, యింకఁ గాదు పలుకు బొంకుసేయ.

సీ. ఎందాఁక భూలోక మెందాఁక మీలోక మందాఁక నీలోకమందు నిలిచి
కడఁగి పాతకవీధికంటెఁ బై కుడుగక దివ్యతేజోజాలదీప్తుఁ డగుచు
నంబుజారిస్ఫూర్తి నలరుచు దేవత్వగతి నొప్పి తలక్రిందు గాఁగ నీతఁ
డీతారకలఁ గూడి యెలమి వాటించుచుఁ గృతపుణ్యుఁడై భూరికీర్తికలితుఁ

తే. డగుచు వెలుఁగొందుఁగా కని యమ్మునీంద్రుఁ, డాన తిచ్చిన దేవత లట్ల గాక
యనుచుఁబలికి విశ్వామిత్రు నభినుతించి,చనిరియజ్ఞాంతమం దాత్మసదనములకు.

వ. అంత విశ్వామిత్రుండు త్రిశంకునకు శాశ్వతం బైనదివ్యస్థానం బొసంగి కృతకృ త్యుండై యచ్చటిమహర్షుల నవలోకించి యి ట్లనియె. 1110

విశ్వామిత్రుఁడు పశ్చిమదిక్కున కరుగుట.

తే. ఇమ్మొ లే దిందు మనకుఁ దపమ్ము సేయ
మిక్కుటంబుగ విఘ్న మీ ప్రక్కఁ గలిగె
గాన మనమింక నొండొకకడకుఁ బోద
మనుచు వారలతోఁగూడ యచటువాసి. 1111

వ. విశాలతపోవనోపేతం బైనపశ్చిమదిక్కునకుం జని యందుఁ బుష్కరతీరంబు లందు మూలఫలాశనుండై యత్యుగ్రతపంబుఁగావించుచుండెనానసమయంబున.

చ. కలఁ డొకఁ డిందుకుందశితికంఠపురందరనాగవాహసం

కలితయశుండు సూర్యకులకంధిశశాంకుఁడు కోసలేంద్రుఁ డ
త్యలఘుఁడు నంబరీషుఁ డన నవ్విభుఁ, డొక్కమఖంబు సేయుచో
దలఁకొని పాకశాసనుఁడు తత్పశువుం గొనిపోయి డాఁచినన్. 1113

క. అతనిపురోహితుఁ డిట్లను, నతనికి నృప నీదు దుర్నయమునఁ బశు వొగిన్
హృత మయ్యె నరక్షిత యగు, క్షితివిభు హింసించు నాత్మకృతదోషంబుల్.

క. జనవర ప్రాయశ్చిత్తం, బొనరింపఁగ వలయు నిక్క మొగి నరపశువుం
గొని తెమ్ము యజ్ఞకర్మం, బనుపమగతిఁ జెల్లుచుండు నంతటిలోనన్ 1115

క. నావిని మానవనాథుఁడు, గోవుల నొకలక్ష వెంటఁ గొని రయమున నా
నావనజనపదనగరత, పోవనవిషయములు నెమకి పోవుచు నొకచోన్. 1116

క. భృగుతుంగమునకుఁ జని య, చ్చగ నచ్చటఁ బేద యగుచు సువ్రతనియతిం
దగి యున్న ఋచీకుం డను, జగతీసురవర్యుఁ గాంచి సమ్మద మొదవన్. 1117

తే. తపము పెంపున రెండవతపనుమాడ్కిఁ
దనరు మునివర్యుపదములు తనశిరంబు
సోఁకఁ బ్రణమిల్లి పూజించి సువినయోక్తి
నిట్లనియెఁ గేలు మోడ్చి మహీవరుండు. 1118

వ. మహాత్మా యే నొక్క జన్నంబు సేయుచుఁ బ్రమాదంబున యాగపశువుం గోల్పడి ప్రాయశ్చిత్తంబునకుపాధ్యాయుండు చెప్పినతెఱంగున నానా దేశంబుల నరపశు వరయుచు నెందుం బడయఁ జాలక నీకడకుం జనుదెంచితి లక్షధేనువుల నొసంగెదఁ బ్రతిగ్రహించి పశ్వర్థంబుగా నీకొడుకుల నొక్కని దయ సేయు మని యడిగిన నతం డతని కిట్లనియె. 1119

చ. మనుజవరేణ్య నీపలుకు మంచిది నిత్యముఁ బెద్దవానిపై
ఘనముగ వేడ్క సేయుదును కావున వాని నొసంగ నన్న నా
తనిసతి పిన్నవానిపయిఁ దద్దయుఁ గూర్మి నొనర్తుఁ గానఁ ద
త్తనయు నొసంగ నన్నఁ దలిదండ్రులమాటల కున్మలించుచున్. 1120

ఆ. వారిలోన నడిమివాఁడు శునశ్శేఫుఁ, డవనివిభున కనియె నగ్రసుతునిఁ
దండ్రి ప్రోచుఁ బిన్నతనయు జనని ప్రోచు, వార లెట్లు నీకు వత్తురయ్య. 1121

క. జనయిత్రీజనకులచే, తను విడువంబడితి నేను దగ నీవెంటం
జనుదెంచెద వారలకుం, గొనకొని వెస నిమ్ము లక్షగోధేనువులన్. 1122

చ. అనిన ధరాధినాథుఁడు రయంబున నట్లొనరించి తేరిపై
మునివరపుత్రు నుంచుకొని మోద మెలర్పఁగఁ బుష్కరాశ్రమం
బున కటుపోయి యప్పటికి మూఁడవకాలము డాయ వచ్చినం
బనివడి విశ్రమించె నరభర్త పథిశ్రమ వాయ నచ్చటన్. 1123

మ. అపు డచ్చోటఁ దపంబు సేయుచు జితాహంకారుఁ డై యున్నలో-

కపవిత్రుం దపనాభతేజు ననఘున్ గాధేయు నుద్యన్మతిన్
విపులశ్రేయుని బ్రహ్మతుల్యుని జగద్విఖ్యాతచారిత్రుఁ జూ
చి పరోద్వేజితుఁ డైన బాలుఁడు శునశ్శేఫుండు శోకార్తుఁ డై. 1124

శునశ్శేఫుఁడు విశ్వామిత్రుని శరణము నొందుట.

క. తనమేనమామ గావున, ఘనముగ నే మరల బ్రతుకఁ గంటి ననుచుఁ జ
య్యన మునిపదములపైఁ బడి, తనమోమున దైన్య మడరఁ దా నిట్లనియెన్.

క. ఓతాపసవంశోత్తమ, మాతల్లియుఁ దండ్రియు నను మఖపశువుంగా
భూతలనాథున కిచ్చిరి, గోతతి నొకలక్ష నీడు గొని ముద మలరన్. 1126

ఉ. తల్లియుఁ దండ్రియున్ గురువు దైవము దాతవు బాంధవవ్రజం
బుల్లమునం దలంప జటిలోత్తమ నాకిఁక నీవె సుమ్ము మే
నల్లుని దీనుని న్నను దయానుతివై బ్రతికించి యీమహీ
వల్లభు జన్న మింక ననివార్యముగా ఫలియింపఁ జేయవే. 1127

సీ. అనిన విశ్వామిత్రుఁ డతిదయాకలితుఁడై తనతనూభవుల నందఱకు ననియె
సుతులార పరలోకసుఖమునకే కదా సుతులఁ గోరుట యెల్లసుతులు మఱియు
జనకుని కోర్కులు సఫలంబు సేయుటకే కదా యిది సర్వలోకధర్మ
మదిగాన మాపాలి కిదె పరలోకంబు శరణంబు నొందె నీసత్యశాలి

తే. మీరు పుణ్యులు ధర్మవిచారపరులు
ప్రాణమాత్రంబుచే నాకుఁ బరమనిష్ఠఁ
బ్రియ మొనర్పుఁడు తండ్రికిఁ బ్రియ మొనర్చు
కంటె సుతులకు వేఱొక్కఘనత లేదు. 1128

వ. కావున మీయం దొక్కరుండు మహీపతియాగపశుత్వంబున కొడంబడి బా
లుం డగుశునశ్శేఫుని బ్రదికించి దేవతలఁ దృప్తి నొందించి యంబరీషునకు
యాగఫలం బొసంగి నావచనం బమోఘంబు సేయుండనినమధుష్యందాదులు
సాభిమానంబుగా నిట్లనిరి. 1129

క. తనసుతుల విడిచి యన్యుని, తనయుని రక్షింప నీవు దలఁచితి వది భో
జనమందు నిందితం బగు, శునకపిశితమట్టు లిపుడు చూచెద మనఘా. 1130

క. నావిని విశ్వామిత్రుఁడు, భావంబున నుమ్మలించి పటురోషమునన్
దావాగ్నిమాడ్కి మండుచుఁ, గేవలకఠినోక్తి ననియెఁ గెరలి సుతులకున్.

వ. నావచనం బతిక్రమించి పితృవచనభయరహితంబును ధర్మవిగర్హితంబును
దారుణంబును రోమహర్షణంబు నైన యీవాక్యంబు పలికితిరి గావున మీరింక
వసిష్ఠపుత్రులభంగిముష్టికజాతులం బుట్టిశునకమాంసభక్షకులై భూలోకంబున
వేయి సంవత్సరంబులు వర్తింపుఁ డని శపియించి యార్తుం డైనశునశ్శేఫునకు

నిరామయుం బగు నట్లు మంత్రితభస్మధూళ్యాదిప్రక్షేపరూపం బైన రక్షఁ
గావించి యిట్లనియె. 1132

—శునశ్శేపుఁడు విశ్వామిత్రప్రభావంబున నింద్రోపేంద్రులయనుగ్రహంబువడయుట.—

ఉ. ఇంపుగ నీకొసంగెద మహీసురనందన రెండు మంత్రముల్
దెంపున నిన్ను యాజకు లతిస్ఫుటయూపమునందుఁ గట్టి హిం
సింపఁ గడంగు నప్పుడు విశేషమతిన్ జపియించు చగ్నిఁ గీ
ర్తింపుము శక్రముఖ్యు లరుదెంచి కృపన్ నినుఁ గాతు రత్తఱిన్. 1133

వ. అని పలికి యింద్రోపేంద్రదేవతాకంబు లైనయద్దివ్యమంత్రంబులుపదేశించినం బ్రతిగ్రహించి శునశ్శేపుండు ధీరుండై యతనిచేత ననుజ్ఞాతుండై యంబరీషుం గనుంగొని మహీంద్రా యింక నిచ్చటఁ దడవు సేయ నేల శీఘ్రంబుగం జని యజ్ఞకర్మంబు లన్నియు నిర్వర్తింపు మనిన నతనిపలుకుల కలరి యంబరీషుండు రయంబున యజ్ఞవాటంబునకుం జని యాజకానుమతంబున రక్తమాల్యాంబరగానులేపనంబుల శునశ్శేపుని యాగపశువుఁగా నలంకరించి పవిత్రపాశంబుల వైష్ణవం బగుయూపంబున బంధించె నిట్లు బద్ధుండై యతండువహ్నికభిముఖుండై విశ్వామిత్రుం డుపదేశించినదివ్యమంత్రద్వయంబు రహస్యంబుగా నచలనిష్ఠ జపించి యింద్రోపేంద్రుల స్తుతించిన స్తుతితర్పితుండై తత్క్షణంబ సహస్రాక్షుండు పరమానందంబున నచ్చటికిం జనుదెంచి శునశ్శేపుని బంధవిముక్తునిం జేసి దీర్ఘాయు వొసంగి యంబరీషునకు బహుగుణంబుగా యాగఫలం బొసంగి నిజనివాసంబునకుం జనియె నమ్మహీవిభుండు నుగ్కృతార్థుం డై నిజపురంబునకుం జనియె. 1131

—బ్రహ్మ విశ్వామిత్రునకు. ఋషిత్వం బొసంగుట.—

తే. అంతఁ గౌశికుఁ డచట సహస్రవత్స, రంబు లత్యుగ్రతపము సల్పఁగ విరించి
వచ్చి కుశికవంశజ నీవు వరఋషిత్వ, మొందితని చెప్పి చనియె నమందగతిని.

క తనివి సనక గాధేయుం, డనిశముఁ బరమేష్ఠిఁ గూర్చి యద్భుతభంగిన్
ఘననిష్ఠాతిశయంబున, సునిశితగతిఁ దపము సేయుచుం దనరు నెడన్. 1136

క. సురసంప్రేషితయై య, చ్చర మేనక యచటి కర్థిఁ జనుదెంచి మనో
హరవేష యగుచుఁ దగఁ బుష్కరజలముల మజ్జనంబు సలుపుచు నుండెన్.

—మేనక విశ్వామిత్రుతపంబునకు విఘ్నము జేయుట.—

క. ఘనుఁడు మహాతేజుం డగు, మునిపతి కౌశికుఁ డతుల్యమోహనరూపన్
ఘనమధ్యస్థితసౌదా, మినిగతిఁ దనరారుదాని మేనకఁ గనియెన్. 1138

క. కని దానితోడ నిట్లను, వనిత మదాశ్రమమునందు వసియింపుము మిం
చిన యనురాగంబున న, న్ననంగమోహితునిఁ బ్రోవు మనుపమబుద్ధిన్. 1139

వ. అని నిజాభిప్రాయంబు తేటపడ నెఱింగించి యొప్పులకుప్ప యగు నప్పువ్వుఁబోఁడి నొడంబఱచి. 1140

గీ. కేళివనములందు గిరులందు నదులందుఁ,గొలఁకులందుఁ గుంజతలములందు
నన్నెలంతఁ గూడి యబ్దంబు లొకపది, యతను కేళిఁ దేలె నమితగతుల.

ఉ. అంత వివేకియై కుశకులాగ్రణి యెంతటిమోస మయ్యె ని
క్కాంతకతంబునన్ సకలకల్మషముల్ వొదలెం దపోధనం
బంతయు వీటిఁబోయె దివిజాధిపుకృత్య మెఱుంగ నక్కటా
యెంతవివేకు లైన భువి నీశ్వరుమాయఁ దలంప నేర్తురే. 1142

చ. అని యిటు చింత నొంది ముని యాదట మేనక నింద్రుపాలి క
ట్లనిచి గడంగి కామవిజయం బొనరించెద నం చుదీచికి
న్జని హిమపర్వతాంతికమునం దగఁ గౌశికిచెంతఁ జేరి ని
ష్ఠను దప మాచరించెఁ బ్రకటంబుగఁ దాను సహస్రవర్షముల్. 1143

బ్రహ్మ విశ్వామిత్రునకు మహర్షిత్వ మొసఁగుట.

వ. అమ్మహాతపంబునకు భయంబుఁ గొని వేల్పులు మహర్షిసమేతులై బ్రహ్మ కడకుం జని విశ్వామిత్రునకు మహర్షిశబ్దం బొసంగుం డని ప్రార్థించిన నవ్విరించి దేవతాసమన్వితంబుగాఁ గౌశికుకడకుం జనుదెంచి మునీంద్రా యేను భవత్తపంబునకు సంతోషించితి నీకు మహర్షిశబ్దం బొసంగెదఁ జాలింపు మని పలికిన నవ్విశ్వామిత్రుండు విషణ్ణుండును సంతుష్టుండునుంగాక సర్వలోకేశ్వరుం డైన యప్పితామహునకుఁ బ్రణతుండై యంజలిఁ గీలించి స్వార్జితంబు లైన శుభకర్మంబులచేత ససమానం బైనమహర్షిశబ్దంబు నీచేత దత్తం బయ్యెనేని యవ్వల నేను జితేంద్రియుండనే కదా యని యడిగిన నప్పరమేష్ఠి యతని వాక్యంబు విని మునీంద్రా వికారకారణవస్తుసన్నిధానంబునం దైన నెంతకాలంబు వికారంబు గలుగుచుండు నంతకాలంబు నీకు జితేంద్రియత్వసిద్ధి గలుగ నేరదు గావున నీవు తావత్కాలపర్యంతంబు తపంబుఁ గావింపు మని పలికి యంతర్ధానంబు నొందె. 1144

క. అట విశ్వామిత్రుఁడు నుత్కటనిష్ఠామహిమఁ దపముఁ గావించుచు నా
దట బ్రహ్మర్షిస్థానముఁ, బటుతరముగఁ గాంతు ననుచుఁ బ్రజ్ఞాన్వితుఁడై.

ఉ. ఊరుపు పుచ్చ కట్లు తగ నూర్ధ్వకరుం డయి మారుతాశియై
వారక మండు వేసవిని వహ్నులమధ్యమునందు నిల్చి సొం
పారఁగఁ బుండువంటివలియందు జలంబుల నిల్చి వృష్టియం
దూరక మింట నిల్చి కడు నుగ్రతపం బొనరించె ధీరతన్. 1146

ఇంద్రుఁడు విశ్వామిత్రునితపము మాన్ప రంభను నియోగించుట.

ఉ. అంత బలాంతకుం డదరి యాతనియుగ్రతపంబు మాన్ప న
త్యంతరయంబునం గువలయాక్షిని రంభను జీరి పల్కె నో
కాంత కుశాన్వయోత్తముని గాఢతపోగతి మాన్చి మా కిఁకన్

సంతతసౌఖ్యసంపద లొసంగుము వేగమ పొమ్ము నావుడున్. 1147

ఉ. అక్కలకంఠి యిట్లనియె నక్కట వహ్నియుఁ బోలె నుగ్రుఁ డై
యుక్కున ఘోరనిష్ఠఁ దప ముద్ధతి సల్పెడువాఁడు కౌశికుం
డక్కడ నుండు నన్నుఁ గనినంతనె యల్గి శపించుఁ గాక న
న్నక్కడి కంప వల్వదు సురాధిప నీపద మాశ్రయించెదన్. 1148

చ. అన విని శక్రుఁ డిట్లనియె నంగన యింత భయం బిదేల నా
పనుపునఁ గీరశారికలు బాలసమీరుఁడుఁ దోడు వత్తు రే
ననుపమలీల మన్మథసహాయుఁడనై వెనువెంట వచ్చెదం
బ్రణుతవిలాసరూప మలరం జని తన్మనముం హరింపవే. 1149

వ. అని నియోగించిన నెట్టకేలకు నీయకొని సకలజగన్మోహనం బైనరూపంబుఁ దాల్చి. 1150

చ. మలయసమీరపుష్పశరమాధవకోకిలకీరశారికల్
మలయుచు వెంట రాఁ గదలి మౌనివనంబున కేగి యచ్చటం
సొలయక లాస్యముల్ సలుపుచుం లలితంబుగఁ బాట పాడుచుం
గలయఁ జరించె రంభ యల కౌశికుమ్రోల ననేకభంగులన్. 1151

చ. చిలుకలు రద్దిసేయుటయుఁ జెంగటఁ గోవెల కూయుటల్ తరుల్
దలముగఁ బల్లవించుటయుఁ దప్పక వెంటనె రంభ వచ్చుటల్
గలయఁగఁ జూచి చిత్తమున గాధికుమారుఁడు సంశయించి యా
బలరిపుకృత్య మింత యని భావమునం దలపోసి కోపియై. 1152

విశ్వామిత్రుండు రంభను శపించుట.

చ. మెలపున శక్రుఁ డంప మును మేనక వచ్చి కలంచినట్లుగా
వెలయఁగ మత్తపంబునకు విఘ్నము సేయఁగ నేఁడు వచ్చితే
పలుమఱు మోసపోవుటకు బాలుఁడనే యది చెల్ల దింక నో
యలికులవేణి యుండు మిట నశ్మమవై పదివేలవర్షముల్. 1153

వ. అని యిట్లు పట్టరానికోపంబున విశ్వామిత్రుండు వేల్పువెలయాలిని దిట్టి పదంపడి దయాళుండై తపస్స్వాధ్యాయసంపన్నుం డైనవసిష్ఠువలన శాపమోక్షణంబగు నని యనుగ్రహించిన నారంభ తత్క్షణంబ పాషాణం బయ్యె మీనకేతనుండు భీతుండై పాఱె నంత విశ్వామిత్రుండు తనతపం బొక్కింత దఱుఁగుటకుఁ బరమనిర్వేదపరుండై స్వార్జితం బైనతపంబంతయు మొదలఁ గామంబునకుఁ బదంపడి క్రోధంబునకును సమర్పించితి నింకఁ గామక్రోధంబులు జయించి జితేంద్రియుండనై యాహారంబు వర్జించి యూర్పు పుచ్చక శరీరంబు శోషింపం జేసి తపస్సమార్జితం బైనబ్రాహ్మణ్యంబు లభించునందాఁకఁ బెక్కుసంవత్సరంబు లచలనిష్ఠ ఘోరతపంబుఁ గావించెదఁ దపస్సంతప్తుండ నై నమచ్ఛరీరావయ

వంబులు క్షయంబు నొందకుండుఁ గాక యని యిట్లు నిష్ఠురంబుగాఁ బ్రతిజ్ఞఁ
జేసి దీక్షితుండై. 1154

ఉ. అక్కడనుండి యక్కుశికులాంబుధిపూర్ణశశాంకుఁ డంతఁ బ్రా
గ్దిక్కున కేగి వాసవుఁడు కిన్క నొనర్చెడువిఘ్నకోట్లకుం
జిక్కక నక్కడక్కడఁ బ్రసిద్ధపదంబులఁ బెక్కువర్షము
ల్మిక్కిలి ఘోరనిష్ఠ నచలీకృతభక్తిఁ దపం బొనర్చుచున్. 1155

—ఇంద్రుఁడు వృద్ధబ్రాహ్మణరూపుఁడై విశ్వామిత్రుకడ కరుగుట.—

తే. అంత సిద్ధాశ్రమంబున కరుగుదెంచి
యందు బ్రహ్మర్షి ననిపించుకొందు ననుచుఁ
దలఁచి వర్షసహస్రంబు తపము సల్పి
తవిలి పారణ సేయంగఁ దలఁచునపుడు. 1156

వ. ఆఖండలుం డొక్కముదిపాఱుండై చనుదెంచి సిద్ధాన్నం బొసంగు మని
యభ్యర్థించిన నక్కౌశికుం డయ్యన్నం బొసంగిన నమ్మాయావిప్రుండు దాని
నంతయు నిరవశేషంబుగా భుజించినం జూచి నిర్వికారుఁడై యేమి బలుకక
వెండియు విశ్వామిత్రుండు పూర్వప్రకారంబున మౌనంబుఁ బూని యూర్పు
వుచ్చక వేయిసంవత్సరంబు లత్యుగ్రతపంబు సేసిన. 1157

ఉ. ఆముని యౌదలం బొడమి యద్భుతధూమము లష్టదిక్కులన్
భూమియు నాకముం బవనభోజనలోకము నెల్ల నిండినన్
భూమి వడంకె దిక్కరులు మ్రొగ్గె నగంబులు గ్రుంగెఁ దారకా
స్తోమము వ్రాలె దూలె రవి తోయధు లింకెను బర్వెఁ జీఁకటుల్. 1158

తే. అపుడు నిస్తేజులై వేల్పు లమరమునులుఁ
గశ్మలోపహతాత్ములై కమలయోని
కడకుఁ జని భక్తిఁ దత్పాదకమలములకు
మ్రొక్కి యిట్లని రటు కరంబులు మొగిడ్చి. 1159

ఉ. వారిజగర్భ కౌశికుఁ డవార్యతపం బొనరించుచున్నవాఁ
డారయఁ దన్మనోరథము నర్థి నొసంగి తపంబు మాన్పకి
ట్లూరకయున్న నీజగము లొక్కట దిక్కఱి తత్తపోగ్నివి
స్ఫారశిఖాపరంపరల దగ్ధములై చనుఁ గాక దక్కనే. 1160

వ. మహాత్మా యితండు కామక్రోధంబులు వర్జించి గాఢనిష్ఠఁ దపంబు సేయుచున్న
వాఁ డతనియందు వృజినం బించుకేని లే దమ్మహాత్మునితపంబునకుఁ బ్రతి
విధానం బెద్దియుఁ గాన మైతి మఖిలజగత్సంక్షోభవశంబువలనజనంబంతయుఁ
గర్మానుష్ఠానశూన్యంబై యున్నది త్రైలోక్యంబు సంక్షుభితమానసం బయ్యె
మఱియు మహాద్యుతి యగునతండు సాక్షాద్వైశ్వానరుండుం బోలె వెలుంగు

చున్నవాఁడు నిజతపోవహ్నిశిఖాపరంపరల లోకంబుల నన్నింటి నొక్క
పెట్ట భస్మంబు సేయక మున్నె యనుగ్రహింపవలయు. 1161

చ. తపము ఫలించు టొండె వితతంబుగ ఘోరతపోగ్ని హేతిచేఁ
గృపణత లోకజాలము దహించుట యొండె నటంచు నిష్ఠతోఁ
దప మొనరింపఁగాఁ దొడఁగె ధాత యతండు సురాధిపత్యము
ట్లిపుడ యొసంగు మన్న మన కీయక తీరదు మాటలేటికిన్. 1162

—బ్రహ్మ విశ్వామిత్రునికి బ్రహ్మర్షిత్వ మొసఁగుట.—

సీ. అని విన్నవించుచు నమరులవాక్యంబు విని పద్మభవుఁడు మన్నన యెలర్ప
వారెల్లఁ దనుఁ గొల్వ వరదుఁడై రాయంచ నెక్కి కౌశికుపాలి కేగుదెంచి
వినుము కౌశిక యింత విపరీతతపమేల మానుము మాకు సన్మన మొసంగెఁ
బ్రబలతపంబున బ్రహ్మర్షివైతివి దీర్ఘాయువును బ్రహ్మతేజ మేను

తే. దయ నొసంగితి నీకు భద్రంబు గలుగు
నింక సుఖలీల వలసిన యెల్లలోక
ములఁ జరింపు మటన్న నమ్మునివరుండు
మ్రొక్కి కడుభక్తిఁ గరములు మోడ్చి పలికె. 1163

వ. దేవా నాకు భవత్ప్రసాదంబున బ్రాహ్మణ్యంబును దీర్ఘాయువును సంప్రాప్తం
బగుట నిక్కంబేని యోంకారంబును వషట్కారంబును వేదంబులును నన్ను
వరించుం గాక యని పలికె వెండియు ని ట్లనియె. 1164

తే. బ్రాహ్మణక్షత్రవేదసంపన్నుఁడైన
యల వసిష్ఠుండు బ్రహ్మర్షి వైతి వనుచుఁ
బలికె నేనియు నమ్మెదఁ బలుకకున్న
నమ్మఁగాఁ జాల నిదియును నాతలంపు. 1165

క. అని పలికిన విని ద్రుహిణుం, డనిమిషులును బిల్వ వచ్చి యమ్ముని సత్యం
బనుపమతపోబలంబున, ననఘా బ్రహ్మర్షి వైతి వని పల్కుటయున్. 1166

వ. విశ్వామిత్రుండును బరమానందకంద ళితహృదయారవిందుండై వసిష్ఠుని నానా
విధ పూజావిధానంబులఁ దృప్తి నొందించె నంత విరించనాదిబృందారకులు
విశ్వామిత్రుని దీవించి తత్ప్రభావంబుఁ గొనియాడుచు నిజనివాసంబులకుం జనిరి
వసిష్ఠుండును విశ్వామిత్రునితో సఖ్యంబుఁ జేసి నిజాశ్రమంబునకుం జనియె
విశ్వామిత్రుండు ప్రాప్తకాముండై బ్రహ్మతేజంబున దిశలు వెలింగించుచు యథా
సుఖంబుగా విహరించె నీవిశ్వామిత్రుండు దివ్యతపఃప్రభావవిశేషంబున బ్రహ్మ
స్థలలో నధికుం డని విశ్రుతిం గన్నవాఁ డిమ్మహాత్ముండు విగ్రహవంతంబగుతపం
బును వీర్యంబునకుఁ బరాయణుండును ధర్మపరుండు నని పల్కి శతానందుం
డూరకున్న నతని పలుకులు విని రాముండును దదనుజుండును జనకాదు లైన

సభాసదులును బరమానందరసపూరితహృదయులై సాధువాక్యంబుల నభినం
దించి విశ్వామిత్రునిం బూజించి రంత జనకుండు విశ్వామిత్రు నవలోకించి
యి ట్లనియె. 1167

క. కాకుత్స్థసహితముగ మీ, రీకరణి మదీయమఖము నీక్షించుట క
స్తోకగతి వచ్చినందున, నే కడుఁ ధన్యుండ ననుగ్రహీతుఁడ నైతిన్. 1168

తే. తాపసోత్తమ నీదుసందర్శనమున
బహువిధగుణంబు లిపుడు ప్రాప్తంబు లయ్యెఁ
బరఁగ మీచేత నెంతయుఁ బాలితుండ
నైతి నిష్టార్థసంసిద్ధి యయ్యె నేఁడు. 1169

తే. మానితంబుగఁ బరికీర్త్యమానమైన, నీమహాతప మంతయు నిరుపమగతి
నేఁడు నాచేత సీరఘునేతచేత, నింపుసొంపార నిచట నాలింపఁబడియె. 1170

తే. కుశికకులవర్య మీబహుగుణము లిప్పు, డీసదస్యులచేతను నింపుమీఱ
వినఁబడియె నీదుగుణములువీర్యబలము, లప్రమేయంబులు నుతింపనలవియగునె.

చ. అనఘచరిత్ర పుట్టినది యాదిగఁ బెక్కువిచిత్రసత్కథల్
వినఁబడె నెద్దియేని కడు వేడుక నీకథ యట్ల నెమ్మనం
బునకు నొసంగ దీశ్రుతులు పుట్టినయందుకు నీచరిత్రము
న్వినుట ఫలంబు గాదె పృథివిం గడుధన్యుఁడ నైతి నెంతయున్. 1172

క. ఇనుఁ డస్తగిరిసమీపం, బునకుం జనె నుక్తకర్మముం దీర్పఁగ నా
కనఘాత్మ సెల వొసంగుము, ఘనముగ రేపకడఁ జూడఁగా రమ్ము కృపన్.

వ. అని పలికి పురోహితామాత్యబంధుసహితంబుగా విశ్వామిత్రునకుం బ్రదక్షి
ణంబుఁ జేసి యనుజ్ఞాతుండై యనిచిన నమ్మహర్షి వరుం డచ్చటిమునులచేతఁ బూ
జితుండై జనకునిం బ్రశంసించి రామలక్ష్మణసహితంబుగా నిజనివాసంబునకుం
జనియె నంతఁ బ్రభాతకాలంబున జనకుండు కృతకర్ముండై రామలక్ష్మణసహితుం
డైనవిశ్వామిత్రుని రావించి శాస్త్రదృష్టం బైనకర్మంబుచేత నమ్మునిపతిం బూ
జించి పదంపడి రామలక్ష్మణుల నుచితసత్కారంబులఁ బ్రీతచేతస్కులం జేసి
విశ్వామిత్రు నవలోకించి మహాత్మా మీరాక మాకు శుభం బయ్యె నా కెయ్యది
కర్తవ్యంబు మీచేత నాజ్ఞాపింపం దగినవాఁడఁ గావునఁ గర్తవ్యకార్యంబాన
తి మ్మని యడిగిన నవ్విశ్వామిత్రుండు జనకున కిట్లనియె. 1174

జనకుండు విశ్వామిత్రునకు శివధనుర్మాహాత్మ్యంబుఁ దెల్పుట.

మ. ఇనవంశోత్తము లిందుసన్నిభులు ధాత్రీశాత్మజుల్ సాధుస
జ్జనసంస్తుత్యులు మన్మథాకృతులు భాస్వద్వీర్యులై యొప్పు వీ
రనఘా నీగృహమందుఁ బొల్చుహరుని ల్లాసత్కీర్తితోఁ జూడఁగా
నను వేఁడం జనుదెంచినారు నృపవర్యా దానిఁ జూపింపుమా. 1175

క. అనిన జనకుఁ డప్పలుకులు, విని విస్మయ మొంది వింటివిధ మెల్లను గ్ర
క్కునఁ జెప్పఁ బూని యిట్లనె, మునినాథునితోడ నపుడు ముదమొదవంగన్.

తే. అనఘ మద్వంశకూటస్థుఁ డైననిమికి
నాఱవతరంబువాఁడు మహాభుజుండు
దేవరాతుండు గలఁ డాధరావిభునకు
నమరు లొసఁగిరి చాపంబు న్యాసఫణితి. 1177

సీ. అనఘాత్మ మును దక్షయాగవిధ్వంసనకాలంబునందు శంకరుఁడు గినిసి
విల్లు సజ్యముఁ జేసి వేల్పుల నందఱ నటుసూచి భాగార్థినైన నాకుఁ
గర మర్థి భాగంబుఁ గల్పింపరైతిరి గాన మీయుత్తమాంగములు దునిమి
వైచెద నని యిట్లు పటురోషమునఁ బల్క విని సురలందఱు భీతి నొంది

తే. కరములు మొగిడ్చి ప్రార్థింప హరుఁడు కోప
మంతయును వీడి సంప్రీతుఁ డగుచుఁ గరుణ
మీఱ నీచాపరత్నంబు వారి కిచ్చె
నిచ్చినఁ బ్రతిగ్రహించి సంహృష్టు లగుచు. 1178

క. మెచ్చుగ దేవత లందఱు, నచ్చుపడఁగ న్యాసరూప మగునాధనువుం
జెచ్చెర మత్పూర్వకునకు, నిచ్చిరి వాత్సల్య మలర నినసమతేజా. 1179

క. అదిమొదలుగ మాయింటం, గొదువ పడక యుండఁ బూజఁగొనుచు శుభదమై
పొదలుచునున్నది యావిలు, త్రిదశాలయమందరక్షితిధరసదృశమై. 1180

సీ. కౌశిక యేను యాగము సేయఁగాఁ బూని గురుబుద్ధిభూశుద్ధి కొఱకుఁ బుడమి
గడఁగి దున్నింప నాఁగటిచాలులో నద్భుతంబుగా నొక్కసుందసము వొడమె
దడయక దాని ముద్రాభంగ మొనరింప రాకానిశాకరురేకవోలె
జలదంబు నెడఁబాసి జగతికి వచ్చిన మెఱుఁగారు క్రొక్కారుమెఱుఁగువోలె

తే. నొక్కకన్నియ దోఁచె నం దక్కజముగ
దానిఁ జేకొని యేను సంతస మెలర్ప
సీత యనుపేరువెట్టి యాచిన్నికూన
నబ్బురంబుగఁ బెంచితి ననుదినంబు. 1181

వ. ఇట్లు దినదినప్రవర్ధమాన మైనయక్కన్య యయోనిజ గావున వీర్యశుల్క యనం బరఁగె నాసమయంబునఁ జారులక్షణలక్షితయు ననన్యసామాన్యలావణ్యయు దేవతారూపిణియు వీర్యశుల్కయు నైనమత్కుమారిం బెండ్లియాడ నమందానందంబున ధరణీపురందరనందను లెందఱేనియుం జనుదెంచి తమతమబిరుదాంకంబులు వక్కాణించి కన్య ని మ్మని యడిగిన వారలకెల్లఁ బ్రత్యుత్తరంబుగా నే నిట్లంటి. 1182

ఉ. కన్నియ వీర్యశుల్క యటు గావున నీఁ దగ దిప్డు దూరకే

పన్నుగ మన్నికాంతమునఁ బర్వతభంగిఁ జెలంగు చున్నయా
పన్నగరాజభూషణుని భవ్యశరాసన మెక్కువెట్టినన్
సన్నుతగాత్రి నిత్తు నిది సత్యము వల్కినవాఁడ నెంతయున్. 1183

వ. అనిన నమ్మహీవరు లందఱు ముందుముందుగాఁ దల మిగిలి తమతమభుజాబలంబుల కొలందు లెఱుంగక బహువిధంబులం బోరి యవ్విల్లు నెట్టుట్టు గదల్పఁజాలక బెండుపడి సిగ్గునం దల యెత్తక నిరాశులై తమతమదేశంబులకుం జని.

తే. తరుణి నిచ్చెద ననుచుఁ గోదండ మొకటి
ఘనత నెప మిడి గారించె మనల జనకుఁ
డతని నేచందమున నైన నాజి గెలిచి
యన్నెలంతను గొని వత్త మనుచుఁ గడఁగి. 1185

మ. సకలక్ష్మావరకోటు లద్భుతభుజాసంరంభ మేపారఁగా
సకలానీకముతోడ వచ్చి పటుసచ్ఛౌర్యాతిరేకంబునం
బ్రకటప్రక్రియ మత్పురీవరణము ల్సన్నాహులై చుట్టి స
ర్వకఠోరంబుగ నాక్రమించుటయు నే వీక్షించి యత్యుద్ధతిన్. 1186

క. చతురంగంబులు గొల్వఁగ, నతులితవిభవంబు మెఱయ నాహవనిపుణో
ద్ధతి వెడలి తీవ్రబాణ, ప్రతతులఁ బరఁగించి భుజబలం బలరారన్. 1187

వ. నానాప్రకారంబుల నొక్కసంవత్సరంబు రణంబుఁ జేసి మదీయసాధనంబు లన్నియు సంక్షయించిన భృశదుఃఖితుండ నై సమాహితచిత్తంబున వేల్పుల నారాధించిన వారు ప్రత్యక్షం బై చతురంగబలంబుల నిచ్చి చనిన దేవదత్తచమూసమేతుండ నై క్రమ్మఱ రణంబునకుం జని బహువిధశరపరంపరలు నిగుడించిన. 1188

క. కొందఱు దెస చెడి పాఱిరి, కొందఱు మద్బాణనిహతిఁ గూలిరి మఱియుం
గొందఱు శరణము నొందిరి, యందముగా నిట్లు విజయ మందితిఁ గడిమిన్.

క. అనఘాత్మ, పరమభాస్వర, మనుపమసారోద్ధతంబు నగునాధనువున్
మునుకొని తెప్పించి యిఁకం, గనిపించెద రాఘవులకుఁ గడుమోదమునన్.

క. ఆవిల్లు నీరఘూత్తముఁ, డేవిధమున నైన బలిమి నెక్కిడ నేసినన్
నావరపుత్త్రిక నిచ్చెదఁ, బావకగగనాంబుభూమి పవనులు గుఱిగాన్. 1191

క. నా విని విశ్వామిత్త్రుఁడు, భూవల్లభుఁ జూచి పలుకుఁ బోలుపుగ ధనువున్
వావిరి దెప్పించి ముదం, బావహిలం జూపు మీనృపాత్మజున కొగిన్. 1192

క. అనిన విని జనకుఁ డమ్ముని, యనుమతమున గంధమాలికార్చిత మగుత
ద్ధనువును దెప్పింపుం డని, పనివడి మంత్రులకుఁ జెప్పె బ్రాభవ మలరన్. 1193

జనకుఁడు విశ్వామిత్త్రుకడకు శివధనువు దెప్పించుట.

వ. ఇట్లాజ్ఞాపించిన వారు రయంబునఁ బురంబులోనికిం జని. 1194

సీ. కమనీయసుమనఃప్రకాండసంకీర్ణ మై కనకాచలముభంగిఁ దనరుదాని
నగరాజనందినీనాథాంకయుక్తమై యలరజతాద్రియ ట్లలరుదానిఁ
జటులవేగోద్ధతచక్రసందీప్తమై యుదయాచలముమాడ్కి నొప్పుదాని
ననదృశశ్రీగంధరసఘుమంఘుమితమై గంధమాదనమట్ల గ్రాలుదాని
తే. ననుపమాయసనిర్మితం బైనదాని, మహితగతి నొప్పుదాని నామందసమును
గాంచి కడుదీర్ఘదేహు లై క్రాలునమిత,బలులఁ బంచసహస్రవీరులను బంచి.

వ. వారిచేత దాని నతిప్రయత్నంబున నెత్తించుకొని వచ్చి సురసదృశుం డైన జనకునిముంగలఁ బెట్టించి రాజేంద్ర సర్వరాజులచేతఁ బూజితం బైనయిమ్మహాకార్ముకరత్నం బానీతం బయ్యె నిదె విలోకింపుఁ డనిన నమ్మంత్రివాక్యంబులు విని జనకుండు విశ్వామిత్రునిం జూచి బద్ధాంజలి యై రామలక్ష్మణుల నుద్దేశించి యి ట్లనియె. 1196

క. మునివర మా పెద్దలచే, ననిశముఁ బూజింపఁ బడియె నతిశయభక్తిన్
వినుఁ డీచాపము దీనిన్, మునుకొని పూరింపలేకపోయిరి నృపతుల్. 1197

చ. సరసురయక్షకింపురుష నాగనభశ్చరసిద్ధసాధ్యకి
న్నరవసురుద్రభాస్కరవితానము లైనను జూడ నెక్కిడం
గరమున నంటఁగా నలవి గానిది యీమహనీయచాపముం
బనివడి దీని నెక్కిడఁగ మానవు లెంతటివారు చూడఁగన్. 1198

రాముఁడు శివధనువు భగ్నముఁ జేయుట.

వ. ఇమ్మహాధనుశ్శ్రేష్ఠంబు నిట్టట్టు గదల్చుటకుఁ బూరించుటకు నారోపణంబు సేయుటకు శరంబుఁ గూర్చుటకు నాకర్షించుటకు ముల్లోకంబులయందు నెవ్వండు సమర్థుండు లేఁ డట్టిదాని భవద్వచనప్రకారంబున నతిప్రయత్నంబున నిచ్చటికిం దెప్పించితి దీనిని రాజపుత్రులకుం జూపు మని పలికిన ధర్మాత్ముం డగు విశ్వామిత్రుండు జనకునివాక్యంబు విని రామునిం జూచి వత్సా ధనువు విలోకింపు మనిన నమ్మహర్షి వాక్యప్రకారంబున నమ్మనువంశతిలకుండు మంజూషాముద్రాపళనం బొనరించి తన్మధ్యనిక్షిప్తం బైనమహాకార్ముకం బవలోకించి విశ్వామిత్రున కి ట్లనియె. 1199

తే. మునికులోత్తమ యీధనుర్ముఖ్య మేను
గరముచే సంస్పృశించితిఁ గడఁగి దీని
నశ్రమంబున మోపిడి యనుపమగతి
వెస సమాకర్షణంబుఁ గావించువాఁడ. 1200

వ. అని పలికి విశ్వామిత్రజనకులయనుమతంబు వడసి సభాసదు లయినమహర్షులు మహీపతు లందఱుఁ జూచుచుండ రాముం డవలీల నమ్మహాకార్ముకంబు పయి కెత్తి గొనయం బెక్కించి యాకర్ణపూర్ణంబుగాఁ దిగిచి విడిచిన,

తే. ఆరఘుస్వామి సత్త్వ మే మనఁగ వచ్చుఁ
బగిలి పేటెత్తి జగములు పల్లటిల్లఁ
గరికరాహతి విఱిగిన చెఱకువోలె
ఘనరవంబునఁ దచ్ఛరాసనము విఱిగె. 1202

చ. విఱిగెఁ గులాచలంబు లట బీఁటలు వాఱె దిగంతకుడ్యముల్
పఱియలు వాఱె భూతల మపాన్నిధులుం గలఁగెన్ వెసన్ దిశా
కరులు వడంకె భూతతతి గందెఁ గుశాన్వయుఁ డావిదేహ దా
శరథులుఁ దక్క సర్వజనసంఘము మూర్ఛ మునింగె నత్తఱిన్. 1203

ఆ. అంతఁ గొంతవడికి నమ్మహాశబ్దంబు, శాంతి నొందెఁ బిదప సభ్యు లెల్ల
మూర్ఛ దేఱి చాల మోదంబు నొందిరి, జనకవిభుఁడు సాధ్వసంబు విడిచె.

క. అత్తఱి జనకక్షితినా, థోత్తముఁ డత్యంతసమ్మదోత్కర్షమునం
జిత్త మిగు రొత్త నమ్ముని, సత్తమునిం జూచి పలికె సవినయుఁ డగుచున్.

క. జగతీసుర దశరథసుతుఁ, డగు రాముఁడు దృష్టవీర్యుఁ డయ్యె నితనిదో
ర్యుగగతవీర్య మచింత్యం, బగణ్య మమితం బమోఘ మత్యద్భుతమున్.

క. జనవినుతుఁ డైన రామునిఁ, బెనిమిటిఁగాఁ బడసి సీత పృథుగుణయుక్తిన్
జనకకులంబున కెంతయు, ఘనతరయశ మాహరింపఁ గలదు మహాత్మా.

తే. సుగుణమండన విను వీర్యశుల్క యనుచుఁ
బట్టిన ప్రతిజ్ఞ సత్య మై పరఁగె నేఁడు
ప్రాణబహుమత యగుసీత రాఘవునకు
నిచ్చితి భవాదృశులు సూచి మెచ్చి వొగడ. 1208

జనకుఁడు దశరథునియొద్దకు దూతలఁ బంపుట.

చ. అనఘచరిత్ర శీఘ్రగతు లైనయమాత్యుల నయ్యయోధ్యకుం
బనిచి కుమారభద్రమును భర్గధనుర్దళనంబు వీర్యశు
ల్కను ముద మార నిచ్చుటయుఁ గౌశికు రాకయుఁ దెల్పి పెండ్లికై
యనుపమవైభవున్ దశరథాధిపునిం బిలిపింతు నీయెడన్. 1209

క. నా విని సంతోషము మది, నావిర్భవ మందఁ గుశకులాధిపుఁ డను నో
భూవల్లభ నీ వట్టుల, గావింపుము తడవు సేయఁగా వల దింకన్. 1210

వ. అనిన నమ్మహీవల్లభుండు వికసితముఖుం డై శీఘ్రంబుగ మంత్రుల రావించి యొక్క కాంచనపట్టికయందు యథాక్రమంబున శుభవాచకాక్షరంబుల లిఖించి కుంకుమం బలఁది మంత్రులచేతి కొసంగి మీ రతిత్వరితగమనంబున నయోధ్యకుం జని దశరథు నుచితభంగి సందర్శించి రామలక్ష్మణుల కుశలంబుఁ దెల్పి యిచ్చటిశుభప్రసంగం బంతయుఁ బ్రకటించి కుటుంబపరివార

సమేతంబుగా నమ్మహీపతిని సీతా రాముల పరిణయంబునకుఁ దోడ్కొని రండు
పొం డని పనిచిన. 1211

ఉ. వారు మరుజ్జవంబు లగువాహనరాజము లెక్కి వేడుకల్
మీఱఁ బథంబునన్ శుభనిమిత్తములం గనుఁగొంచుఁ గౌతుకం
బార దినత్రయంబునకు నద్భుతవేగముతో నయోధ్యకుం
జేరఁగఁ బోయి రాజగృహసీమ రయంబునఁ జొచ్చి యచ్చటన్. 1212

తే. కనకమండపమునఁ బెద్ద గద్దెయందు
వలసుధర్మాననాసీనుఁ డగుబలారి
పగిదిఁ గొలు వుండి కొడుకులపై నొకింత
కూర్మిఁ దలపోయు చున్న కాకుత్స్థవరుని. 1213

వ. సముచితంబుగా సందర్శించి బద్ధాంజలిపుటు లై మధురాక్షరవ్యక్తంబుగా
ని ట్లనిరి. 1214

చ. అలమిథిలేంద్రుఁ డై సజనకాధిపుఁ డెంతయు సంతసంబునం
బలుమఱు మంజులోక్తుల భవత్కుశలంబు పురోహితప్రధా
నులకుశలంబు బాంధవమనోజ్ఞసతీకుశలంబు వహ్నికౌ
శలమును సర్వముల్ దెలియ సమ్మతితో నడిగెన్ నృపాగ్రణీ. 1215

ఆ. మఱియుఁ గౌశికానుమతిచేత నమ్మహీవిభుఁడు సెప్పు మన్నవృత్త మెల్ల
వేడ్కతోడ మీకు విన్నవించెద మిపు, డింపు మీఱఁ జిత్తగింపు మధిప.

సీ. పృథ్వీశ మత్పుత్రి వీర్యశుల్కయటంచుఁ జెలఁగి యేను బ్రతిజ్ఞసేయుటయును
జనపతు లరుదెంచి శంభునిచాపంబు మోపఁగలేక వైముఖ్య మంది
తెరలి నిర్వీర్యులై యరుగుటయును మీకు విదిత మై యున్నదిగద మహాత్మ
మానుగ నక్కన్య మద్భాగ్యవశమునఁ బరగఁ గౌశికువెంట వచ్చినట్టి

తే. భూరివిక్రముఁ డగుభవత్పుత్త్రుచేతఁ
జాల నిక్షిప్త యయ్యె నాచంద్రమౌళి
కార్ముకంబు సభాసదుల్ గనుఁగొనంగఁ
గడిమి మెఱసి రాముండు భగ్నంబుఁ జేసె. 1217

తే. అనఘచరిత మహాత్ముఁ డై నట్టిరాము, భద్రునకు వీర్యశుల్కయై పరఁగు సీత
నిచ్చెదనటంచుఁ బల్కితి నింపుతోడ, సమ్మతించి యనుజ్ఞ యొసంగవలయు.

వ. మహాత్మా నీవు పురోహితోపాధ్యాయబంధుమిత్రామాత్యసహితుండవై కుమా
రులపరిణయంబునకు శీఘ్రంబునఁ జనుదెంచి మదీయసమ్మదంబునకు సార్థ
క్యంబు సంపాదించి కుమారకల్యాణోత్సవ సమాలోకనసంజాతపరమానందం
బనుభవింప నర్హుండ వని యిట్లు జనకుండు విశ్వామిత్రశతానందానుమతి
స్థితుండై వలికె నని విన్నవించిన నజ్జనకామాత్యులవచనంబు విని యద్దశరథుండు

పరమహర్షసహితుం డై వసిష్ఠవామదేవులను దక్కినమంత్రుల నవలోకించి
యి ట్లనియె. 1219

దశరథుఁడు కుమారకల్యాణంబునుగూర్చి ప్రశంసించుట.

క. మనరామలక్ష్మణులు నెమ్మనమున సంతోష మొదవ మానిసహితు లై
జనకమహీపతిసదనం, బున శోభిలుచున్నవారు పొలుపుగ వింటే. 1220

ఉ. ఆనరనాథునింటఁ జెలువారుచు వేల్పుల కైన దుస్సహం
బైనపురారిచాపము రయంబున రాముఁడు ద్రుంప మెచ్చి సు
శ్రీనిధి నాత్మపుత్త్రికను సీతను రామున కీఁ దలంచి య
మ్మానవభర్త పెండ్లి కిటు మమ్ము రమ్మని పంచె మంత్రులన్. 1221

తే. అనఘచారిత్రులార మహాత్ముఁ డైన,యవ్విదేహునిసంబంధ మరయ మీకు
నభిమతంబయ్యెనేని రయమున నచటి, కరుగుదము కాలయాపన మనుచితంబు.

క. అన విని మంత్రులు మునివరు, లనుపమహర్షమునఁ బోద మని పల్కిన న
జ్జనపతి సుప్రీతుం డై, యనువుగ రేపకడఁ బయన మని పల్కె తగన్. 1223

క. జనకునిమంత్రుల నంతట, ననుపమగతి సత్కరించె నప్పుడు వార
ల్ఘనసర్వగుణాన్వితు లై,యనువుగ నారాత్రి యుండి రచ్చటఁ బ్రీతిన్. 1224

దశరథుండు ఋత్విగుపాధ్యాయసహితుఁడై మిథిల కరుగుట.

వ. అంతఁ బ్రభాతకాలం బగుటయు నద్దశరథుండు హర్షవికసితాననుం డై యుపాధ్యాయబాంధవపరివృతుం డై సుమంత్రునిం జూచి యిప్పుడ ధనాధ్యక్షులందఱుఁ బుష్కలంబుఁగా ధనంబు గొని నానారత్నసమన్వితు లై సుసమాహితు లై యగ్రభాగంబునం జనువారుగా నియోగింపుము చతురంగబలంబును ననుత్తమంబు లైనయానంబులును యుగ్యంబును సత్వరంబునం జనునట్లు గావింపుము వసిష్ఠవామదేవజాబాలికశ్యపకాత్యాయనమార్కండేయప్రభృతి మహర్షు లందఱు ముంగలం జనువారుగా విజ్ఞాపనంబు సేయుము జనకామాత్యులు వేగిరపడి పలుకుచున్నవారు గావున నింకఁ దడవు సేయుట యుక్తంబు గాదు మదీయరథం బాయితంబు సేయు మని పలికిన నతం డట్లు గావింప రథారూఢుం డై ఋత్విగుపాధ్యాయసహితంబుగాఁ జనియె నమ్మహీపతి వెనుకొని చతురంగబలంబును దక్కినవారును బరమానందంబున నరిగిరి యిత్తెఱంగునం గదలి దశరథుండు నాలుగుదినంబులకు మిథిలానగరంబుఁ జేరం బో నంత. 1225

చ. ముదమున నవ్విదేహపతి పుణ్యచరిత్రకుఁ డైనయాజి క
ల్లెదురుగ వచ్చి ప్రేమయు నహీనకుతూహల మాత్మ నోపల
న్గదుర హితోపచారము లొనర్చి బహుకృతు లాచరించుచున్
సదమలచిత్తుఁ డై కుసుమసన్నిభమంజులసూక్తి ని ట్లనున్. 1226

క. జనవర మాభాగ్యంబునఁ, జనుదెంచితి వీవు వీర్యసముపార్జితనం
దనసంప్రీతిని బొందితి, వనుపమపుణ్యమున నేఁ గృతార్థుఁడ నైతిన్. 1227
క. సురపరివృతుఁ డగుశక్రుని, కరణి సముంచితమహర్షికలితుం డై మ
ద్గురుతరపుణ్యవశంబున, నరుదారఁగ నీవసిష్ఠుఁ డరుదెంచెఁ గృపన్. 1228
తే. ఈమునీంద్రులఁ గూడి మహీశవర్య, నీవు విచ్చేయుకతమున నెగడె శుభము
విఘ్నము లడంగెఁ గోర్కులు విస్తరిల్లె, నన్వయం బది పావనం బయ్యె నేఁడు.
ఉ. తోయజమిత్రవంశజులతోఁ దగ వియ్యము గల్గె సంతతం
బాయతకీర్తి నైతి మనుజాధిప యెల్లి ముహూర్త మింక మీ
రేయెడ నెల్లకార్యముల కెంతయుఁ జాలి ప్రసన్నచిత్తులై
పాయక యుండుఁ డంచు నిటు పల్కిన నయ్యజసూనుఁ డిట్లనున్. 1230
క. అనఘచరిత్ర ప్రతిగ్రహ, మనిశము దాతృవశ మనిరి యటు గావున నీ
వొనరింపు మనినకార్యం, బొనరించెద నిఁక స్వతంత్ర మున్నదె మాకున్.
క. నిర్మలకీర్తికరంబును, ధర్మిష్ఠం బైనయట్టి దశరథువాక్యం
బర్మిలి విని జనకుఁడు నృప,ధర్మవిదుఁడు మిగుల నద్భుతము నొప్పు రహిన్.
ఆ. అచట నున్నమానులంద ఱన్యోన్యస, మాగమంబునందు హర్షయుక్తు
లగుచు నతిసుఖముగ నారాత్రి వసియించి,రుచితపదములందు నొప్పు మీఱ.
క. మనుకులుఁ డగుదశరథనృపుఁ, డనఘుల నందనులఁ జూచి హర్షం బలరన్
జనకునిచేఁ బూజితుఁ డై, ఘనమతి సుఖలీల నుండెఁ గౌతూహలి యై. 1234
వ. అంత మహాతేజుం డగుజనకుం డవశిష్టయాగకర్మంబు నిర్వర్తించి యారాత్రి వివాహాంగభూతం బైనయంకురార్పణాదికంబుఁ గావించి యథాసుఖంబుగా వసియించి ప్రభాతకాలంబున సమాప్తయజ్ఞక్రియుం డై పురోహితుం డైన శతానందు నవలోకించి యిట్లనియె. 1235

జనకుండు దనతమ్ముం డగుకుశధ్వజుని రావించుట.

సీ. అనఘాత్మ నాతమ్ముఁ డలకుశధ్వజుఁ డతిధార్మికుఁడు జగన్నుతప్రభుండు
గరిమ వార్యాఫలకప్రాంత మై యొప్పు నిక్షుమతీజల మింపుతోడఁ
గ్రోలుచు స్వర్గంబులీల విమానంబుకై పడి నలరుసాంకాశ్యయందు
నలరారు చున్నవాఁ డతఁడు నాచందానఁ జెలఁగి యీప్రీతి భుజింప నర్హుఁ
ఆ. డతఁడు యజ్ఞగోప్త యతని విలోకింపఁ, గౌతుకంబు చాలఁ గలదు నాకుఁ
గానఁ దగినవారిఁ గడువడిఁ బుత్తెంచి, పిలువ నంపు మతనిఁ బెండ్లిఁ జూడ.
ఆ. అనుచుఁ బలికి ప్రీతి నప్పుడే చారుల, నతనిపాలి కనుప హయము లెక్కి
సత్వరమున నేగి సముచితగతిఁ గుశ, ధ్వజునిఁ గాంచి కుశలవార్తఁ దెలిపి.
ఆ. ఇంద్రునాజ్ఞచే నుపేంద్రునిఁ దోడ్కొని, వచ్చిన ట్లనంతవైభవమున
జనకునాజ్ఞచేఁ గుశధ్వజుఁ దోడ్కొని, వచ్చి రపుడు వేగవంతు లగుచు.

క. ఘనుఁడు కుశధ్వజుఁ డీగతిఁ, దనయాద్వయయుక్తుఁ డగుచుఁ దడయక వేగం
బున వచ్చి గౌతమజునకు, జనకునకును మ్రొక్కి వారిసన్నుతి నొకచోన్.
తే. శిశిరకరకాంతపీఠి నాసీనుఁ డయ్యె
నట సుదామనుఁ డనుమంత్రి కనియె జనకుఁ
డాజిని సుతాప్త గురుబాంధవాన్వితముగఁ
దోడుకొని రమ్ము పొమ్ము సంతోష మెసఁగ. 1240
వ. అని పలికిన నతండు రయంబున. 1241
క. చని దశరథునకు నతుఁడై, జనవర మిముఁ బిల్వ నంపె జనకుఁడు నన్నుం
దనయగురుమంత్రియుతముగఁ, జను దేరఁగ వలయు మీరు సమ్మద మలరన్.
క. అన నౌఁ గా కని దశరథుఁ, డనుపమసంతోష మలర నందఱితోడం
జని భర్మాసనగతుఁ డగుచును నిట్లనె జనకుతోడ సొం పలరారన్. 1243
చ. నరవర యీవసిష్ఠమునినాథుఁడు మత్కులదైవతంబుఁగా
నెఱుఁగుము సర్వకృత్యముల కీయన వక్త గుణుండు దేవతా
గురునిభుఁడై నకౌశికునిఁ గూడి సుహర్షులసన్నుతంబునన్
సరసత మత్కులక్రమము సర్వము మీ కెఱిఁగించు నింపుగన్. 1244

వసిష్ఠుఁడు జనకుని దశరథాన్వయక్రమం బెఱింగించుట.

ఉ. నా విని యవ్వసిష్ఠమునినాయకుఁ డాజనకక్షితీశుతో
నావనజాప్తవంశవిధ మంతయుఁ జెప్పఁగఁ బూని యిట్లను
న్భూవర సత్యవాక్యగుణభూషణ వేడుక సర్వలోకసం
భావిత మైనసూర్యకులపద్ధతిఁ జెప్పెద నాలకింపుమా. 1245
సీ. అవ్యక్తసంభవుం డన్యయుఁ డజుఁడు శాశ్వతుఁడు చతుర్ముఖబ్రహ్మ దనరు
నతనిమానసపుత్రుఁడై మరీచి జనించె నతనికిఁ గశ్యపాహ్వయుఁడు పుట్టె
నతఁడుసూర్యునిఁగాంచె నతఁడువైవస్వతుఁడను మనువునుగాంచెనమితయశుని
నాతఁ డిక్ష్వాకుమహారాజుఁ గాంచె నాతఁడు కుక్షిఁ గనియె నాతఁడు వికుక్షి
తే. నతఁడు బాణునిఁ గనియె నయ్యధిపతి యన
రణ్యుఁ డనువానిఁ గనియె నారాజు పృథునిఁ
గాంచె నతఁడు త్రిశంకునిఁ గనియె మఱియుఁ
నాతనికి దుందుమారాఖ్యుఁ డవతరించె. 1246
క. అతఁడు యువనాశ్వుఁ బడసెను, నతనికి మాంధాత పుట్టె నన్నరపతికిన్
సుతుఁడై సుసంధి వొడమెను, నతనికి ధ్రువసంధి వొడమె నవనీనాథా.
వ. అతనితమ్ముండు ప్రసేనజిత్తుఁ డనంబడు. 1248
చ. చతురత నొప్పునట్టి ధ్రువసంధి కిల న్భరతుండు పుట్టె నా
స్తుతచరితుండు గాంచె నసితుం డనువాని నతండు ధాత్రి న

త్యతులవిభూతి నేలఁ గని యాతని శత్రులు హైహయుల్మహో
గ్రత శశిబిందు లాజికి సఖర్వగతిం జనుదెంచి యుద్ధతిన్. 1249

వ. అయ్యసితుని రణంబునకుం జీరిన నతండు వారలతోడ నోపినకొలంది సంగ్రా
మంబుఁ గావించి యల్పబలుం డగుట వారల నోర్వం జాలక పలాయితుం డై
మంత్రిసహితంబుగా హిమవంతంబుఁ జేరి యందు భృగుప్రస్రవణంబున నివ
సించి కొంతకాలంబునకు మృతుండయ్యె నతనిపత్ను లిరువురు భర్తృమరణ
కాలంబునకు గర్భిణు లై యుండి యం దొక్కతె యొక్కదాని చూలుఁ
జెఱుప గరంబుఁ బెట్టిన నక్కాళింది విషవేదన సహింపం జాలక యమ్మహాపర్వ
తంబుమీఁదఁ దపంబుఁ గావించుచున్నవాని భృగువంశశ్రేష్ఠుం డై నచ్యవనుం
జేరి పుత్రార్థిని యై యమ్మహాత్మునకు నమస్కరించి శరణంబు వేఁడిన. 1250

చ. కరుణ దలిర్ప న మ్మునిశిఖామణి య త్తరలాక్షిఁ జూచి యో
తరుణి విపక్షశిక్షకుఁడు ధార్మికుఁ డుత్తముఁ డర్కతేజుఁ డ
త్యురుతరపుణ్యుఁ డొక్కసుతుఁ డొయ్యన నీ కుదయించు నంచుఁ జె
చ్చెరఁ గరుణింప న త్తరుణిశీతకరాళిక సంతసంబునన్. 1251

క. మునినాథునిపాదంబులు, దనఫాలము సోఁక మ్రొక్కి తప్పక పురికిం
జని యొకశుభలగ్నంబునఁ, గనియె న్నందనుని నమృతకరసమమూర్తిన్.

తే. గరముతోడనె జన్మించెఁ గాన నతఁడు
సగరుఁ డన నొప్పె సంతతైశ్వర్యుఁ డగుచు
నతని కసమంజుఁ డనఁ బుట్టె నతని కంశు
మంతుఁడు జనించె భుజవీర్యవంతుఁ డగుచు. 1253

క. ఆవసుధేశునకు దిలీ, పావనినాథుండు పుట్టె నానృపతికి గం
గావతరణకారణ మగు, జ్యావిభుఁడు భగీరథుండు జనియించె నృపా. 1254

క. ఆత్మానాథునకుఁ గకుత్, స్థత్మానాథుండు పుట్టె నతత్ప్రాతే
యత్మాధరధైర్యుండై, యాత్మాపతి కుదయ మయ్యె నట రఘువు నృపా. 1255

క. అతనిసుతుఁడు పురుపాదకుఁ, డతఁడే కల్మాషపాదుఁ డనఁ దగె నిలలో
నతఁ డమరశంఖణునిఁ గనె, నతనికిఁ బుట్టె న్సుదర్శనాధిపతి నృపా. 1256

సీ. అతనికి నగ్నివర్ణాభిధుఁ డుదయించె నతనికి శీఘ్రకుం డవతరించె
నతనికి మరువు మహాత్ముఁడు జనియించె నతఁడు ప్రశుశ్రుకు నర్థిఁ గనియె
నంబరీషుని నాతఁ డమితసమాఖ్యునిఁ గడువేడ్క నహుషునిఁ గాంచె నతఁడు
ధన్యు యయాతి నాతండు నాభాగుని నాతండు నజుని నయ్యమలచరితుఁ

తే. డీదశరథునిఁ దగఁ గాంచె నితనివంశ
జలధి హరిణాంకుఁ డై యల శంభుచాప

విదళనోచితభుజబలావిష్టుఁ డైన
రాముఁ డుదయించె లోకాభిరాముఁ డగుచు. 1257

జనకుఁడు వసిష్ఠునితోఁ దనవంశక్రమంబుఁ జెప్పుట.

వ. ఈరాముండు త్రిలోకవిఖ్యాతపౌరుషుండును ననన్యసామాన్యప్రతాపదీపితుండును సురాసురుల కభేద్యం బైనచంద్రమౌళిశరాసనభంగంబె సాక్షిగా నితని మహత్త్వంబు దెలియు నిట్టిమహాపురుషశిఖామణికి నీకుమారి నీఁగంటివి కృతార్థుండ వైతివి భవదన్వయంబు శుభాంకితం బయ్యె నీద్వితీయపుత్త్రికను లక్ష్మణున కొసంగు మీరామలక్ష్మణుల కిరువురకు వయోరూపలావణ్యగుణంబులచేత సమాను లైననీకూఁతుల నిరువుర నొసంగుట దది యతియుక్తం బై యుండు నని పలికిన విని జనకుండు ప్రీతుం డై కృతాంజలి యై యిట్లనియెఁ గన్యాప్రదానంబునందుఁ గులజుండు స్వకులంబు నిరవశేషంబుగా వక్కాణింపవలయు నస్మత్కులక్రమంబుఁ జెప్పెద వినుము పరమధార్మికుం డై సత్త్వవంతులలో నుత్తముం డై నిమి యను మహారాజశిఖామణి యొప్పుఁ దత్ప్రభావంబు మీ రెఱింగినదియె కదా యాభూపతికి వీర్యవంతుం డై నమిథి పుట్టె నయ్యచలాధీశునకు సత్యసంధుం డైనప్రథమజనకుండు పుట్టె నయ్యనంతావల్లభునకుఁ దేజోవంతుం డైనయుదావసుండు పుట్టె నారసాధినాథునకు ధర్మజ్ఞుం డైననందివర్ధనుండు పుట్టె నావిశ్వంభరాభరునకు శూరుం డగుసుకేతుండు పుట్టె నాధరారమణునకు రాజర్షి యైనదేవరాతుండు పుట్టె నాధరిత్రీవిభునకు ధర్మాత్ముం డగుబృహద్రథుండు పుట్టె నాధరణీపురందరునకుఁ బ్రతాపవంతుం డగుమహావీరుండు పుట్టె నాక్షోణీంద్రునకు సత్యవిక్రముం డగు సుధృతి పుట్టె నాసర్వంసహావరమహీకాంతునకు ధృతిమంతుం డైనధృష్టకేతుండు పుట్టె నావసుమతీనాథునకు రాజోత్తముం డైనహర్యశ్వుండు పుట్టె నావసుధాధీశ్వరునకు యశోధనుం డైనమరువు పుట్టె నావసుంధరారాజంభారికి గుణవంతుం డైనప్రతీంధకుండు పుట్టె నాపృథివీధవునకు దీప్తిమంతుం డగుకీర్తిరథుండు పుట్టె నామేదినీకాంతునకు జితారి యైనదేవమీఢుండు పుట్టె నామహీవరోత్తమునకుఁ దేజోజితోపస్పృధుం డగువిబుధుండు పుట్టె నాగహ్వరీభర్తకు వంశకర్త యైనమహీధ్రకుండు పుట్టె నాధాత్రీశునకు జన్యదుర్ధర్షుం డైనకీర్తిరాతుండు పుట్టె నయ్యిలాబలారికి బలవంతుం డైనమహారోముండు పుట్టె నక్కుంభినీభృన్మణికి నీతిమంతుం డైనస్వర్ణరోముండు పుట్టె నాజగతీపతికి సాధుపోషకుం డైనహ్రస్వరోముండు పుట్టె. 1258

క. ఆరాజమణికి ముక్తా, హారామలకీర్తిఘృణికి నేనును సుగుణో
దారుఁడు కుశధ్వజుఁడు నిం, పారఁగ నిరువురము సుతుల మైతి మజసుతా.

క. అం దగ్రసుతుఁడ నగుననుఁ, బొందుగ భూవిభునిఁ జేసి పొలుపుగ జనకుం

దండమున ఘోరవనమున, కుందప మొనరింపఁ జనియె గుణరత్ననిధీ. 1260
ఆ. తండ్రి చనిన వెనుకఁ దమ్మునితోఁ గూడి, ప్రజలు సంతతంబుఁ బ్రస్తుతింపఁ
దాపసేంద్ర రాజధర్మంబు దప్పక, యేను బూజ్యరాజ్య మేలుచుండ. 1261
ఆ. సైన్యయుక్తుఁ డగుచు సాంకాశ్యపురమున, నుండి వీర్యవంతుఁ డుగ్రతేజుఁ
డగుసుధన్వుఁ డాజి కరుదెంచి సంరంభ, మడర వేగ మిథిల నడ్డగించి. 1262
క. వచ్చినవాఁడు సుధన్వుఁడు, చెచ్చెర శివకార్ముకమును సీతను వెస నా
కిచ్చిన నిష్టను లేదని, వచ్చి రణ మొనర్పు మనుము నడలక నాతోన్. 1263
క. అని చెప్పి యొక్కదూతను, ఘనముగ నాకడకుఁ బంప గ్రక్కున నేను
న్వెనుఁ బడక వానితో వెస, ననిఁ జేసి వధించితి న్మహాశరనిహతిన్ 1264
వ. ఇట్లు సుధన్వుని వధించి సాంకాశ్యంబునందుఁ గుశధ్వజు నభిషిక్తుం జేసితి నిది మద్వంశక్రమంబు సర్వంబు నెఱింగించితి. నింక మునీంద్రా సత్యంబు దప్పక యేను వీర్యశుల్క యగుసీతను రామునకును రెండవకూఁతు నూర్మిళను లక్ష్మణునకును ద్రిశుద్ధిగా నిచ్చెద నిప్పుడు రామలక్ష్మణుల కభ్యుదయంబు గలుగుటకు గోదానపూర్వకంబుగా నాందీముఖంబును సమావర్తనంబును జేయింపుఁ డెల్లుండి యుత్తరఫల్గునీనక్షత్రంబు శుభగ్రహయుతంబై యున్నది వైవాహికంబు సేయుం డనిన నప్పుడు విశ్వామిత్రుండు వసిష్ఠసహితుండై వైదేహుని కిట్లనియె. 1265

—వసిష్ఠవిశ్వామిత్రులు భరతశత్రుఘ్నులకుఁ గుశధ్వజుకూఁతుల నడుగుట.—

క. ఇల నిక్ష్వాకువిదేహుల, కులము లచింత్యములు ధర్మగుణనిష్ఠము ల
త్యలఘుయశోనిలయంబులు, తలపోయఁగ నెందు లేదు తత్సమ మనఘా.
క. సిరియును వీర్యము శౌర్యము, గురుతేజము యశము బలముగుణముధనము మీ
యిరువురకు సరియె కావున, నరవర సంబంధ మది ఘనంబై చెల్లున్. 1267
తే. రామునకు సీతఁ దగ సుమిత్రాసుతునకు
నూర్మిళ నొసంగుటది చాలయుక్త మింక
నీకుశధ్వజుకూఁతుల నిరువురను మ
హీశ భరతశత్రుఘ్నుల కీయవలయు. 1268
ఉ. ఆతతరూపయౌవనవిహారవచోరచనాదిసద్గుణ
వ్రాతగతిప్రమాణవిభవంబుల నల్వురు నొక్కభంగి వి
ఖ్యాతి వహింతు రీదశరథాత్మజులం గడు వేడ్క మీరు జా
మాతలఁగా వరించుట సముచితకీర్తియె గాదె చూడఁగన్. 1269
వ. అని పలికిన నవ్వైదేహుండు కృతాంజలియై యమ్మునిపుంగవుల కిట్లనియె.
సీ. మౌనిపుంగవులార మద్భాగ్యమున రాఘవులతోడ వియ్యంబు గలిగె నాకుఁ
జాల ధన్యుఁడనైతి సత్కీర్తి వర్ధిల్లె నన్వయంబు పవిత్ర మయ్యె నేఁడు

గోత్రములు శాస్త్రములు గురువులు గతులును సారభూతులు మాకు మీరె కారె
ప్రియముతో మీరు చెప్పినయట్ల మాకుశధ్వజునిపుత్రికల నిద్దఱను వేడ్క
తే. భరతశత్రుఘ్నులకు నిత్తుఁ బ్రాభవమున, రాఘవులు నల్వురొకశుభరమ్యలగ్న
మందె నల్వురపాణిగ్రహణములు దగఁ,జలుపునట్లు ఘటింపుఁడుశాస్త్రఫణితి.
వ. అని పలికి వెండియు ని ట్లనియె. 1272
ఉ. తాపసులార యీదశరథక్షితిభర్తకు మత్పురంబయో
ధ్యాపురమట్ల యై వఱలు నాయనపైఁ దగఁ జేర్పు సత్కృపర్ణ
నాపయిఁ జేర్చి మీరలు ఘనంబుగ సర్వము నిర్వహింపుఁ డే
యేపను లెట్లు సేయ నగు నింతయుఁ భారము మీఁదె సుం డీఁకన్. 1273
వ. అని పలికిన నతనిపలుకుల కలరి దశరథుండు జనకున కి ట్లనియె. 1274
క. మీరన్నదమ్ము లిరువురు, మీరు లసంఖ్యేయగుణులు విడువక మీచే
నీరాజసంఘ మంతయు, వారక నీబుధులు పూజ వడసిరి మిగులన్. 1275

{ దశరథుఁడు కుమారాభ్యుదయంబుకొఱకు గోదానంబుఁ గావించుట
భరతునిమాతులుఁ డగుయుధాజిత్తు దశరథునికడకు వచ్చుట. }

వ. ఏనింక విడిదలకుం బోయెద మీకు శుభంబు గలుగుఁ గాక యని పల్కి జన
కునిచేత నామంత్రణంబు వడసి వసిష్ఠవిశ్వామిత్రసహితంబుగా నిజనివాసంబు
నకుం జని మఱునాఁడు ప్రభాతకాలంబున విధ్యుక్తప్రకారంబునఁ బితృదేవ
తల నర్చించి గోదానాఖ్యకర్మంబుఁ గావించి కుమారుల యభ్యుదయంబు
కొఱకుఁ గలధౌతాంచితఖురవిషాణంబులును దామ్రపుచ్ఛంబులును గాంస్య
దోహనంబులునై సవత్సలైన పాఁడిమొదవుల నొక్కొక్కని కొక్కొక్క లక్ష
మహీసురుల కొసంగి దక్షిణార్థం బనంతధనం బొసంగి తక్కినబ్రాహ్మణులకు
రత్నసువర్ణవస్త్రాదు లొసంగి కృతగోదానులైననందనులచేతఁ బరివృతుండై
సుప్రసన్నచిత్తుండైనయద్దశరథుండు లోకపాలపరివృతుండైన ప్రజాపతియుం
బోలెఁ బ్రకాశించుచుండె నట్టియెడ యుధాజిత్తనుభరతునిమాతులుండు
తనతండ్రి యగు కేకయాధీశుండు దౌహిత్రుం డగుభరతునిం జూచువేడ్కఁ
దన్నుఁ బుత్తెంచిన నయోధ్యకుం జనుదెంచి యచ్చటఁ బుత్రసహితుండై
దశరథుండు వివాహార్థంబు మిథిలకుం బోవుట యెఱింగి యతిత్వరితగమనం
బున మిథిలకుం జనుదెంచి దశరథుని సందర్శించి కుశలం బరసి యాగమన
ప్రయోజనం బెఱింగించిన నద్దశరథుండు పూజార్హుం డగుసతనిఁ బరమసత్కా
రంబులఁ బ్రీతునిం జేసి యథోచితవ్యాపారంబులఁ బ్రవర్తించుచుండె నంత
నారాత్రి చనిన మఱునాఁ డరుణోదయంబున దశరథుండు పుత్రసహితంబుగా
యథోచితకర్మంబు లాచరించి వసిష్ఠాదిమునులం బురస్కరించుకొని యుత్సవ
శాలకుం జనియె నంత రాముండు భ్రాతృసహితంబుగా నానావిధమణిభూషణ

వస్త్రమాల్యానులేపనంబులచేత నలంకృతుండై వసిష్ఠవిశ్వామిత్రాది మహర్షులచేతఁ గృతవివాహసూత్రబంధనమంగళాచారుండై విజయావహం బైన వివాహానురూపశుభముహూర్తంబునందు మహర్షిసమేతుండై యుత్సవశాలకుం జనుదెంచె నంత నద్దశరథమహీనాథుండు కృతకౌతుకమంగళు లైనకుమారులం గూడి వసిష్ఠవిశ్వామిత్రాదిమహర్షులం బురస్కరించుకొని నానావిధమంగళవాద్యఘోషపురస్సరంబుగా జనకమహీనాథునినగరద్వారంబు సేరంజనియె నప్పుడు వసిష్ఠుండు జనకునికడకుం జని యిట్లనియె. 1276

-ఆ- వసిష్ఠుఁడు జనకునికి దశరథుఁడు నగరద్వారంబున నున్నవాఁడని తెల్పుట. -ఆ-

క. చెలువుగఁ గృతకౌతుకమం, గళు లగుతనయులను గూడి కాకుత్స్థవరుం
డెలమిఁ జనుదెంచి వేడ్కం, దలవాకిట నున్నవాఁడు దాతను జూడన్. 1277

ఆ. దాతచేఁ బ్రతిగ్రహీతచే దానప్ర, తిగ్రహాదికములు దీర్పవలయుఁ
గాన నీవు పెండ్లికార్యంబుఁ గావించి, నేర్పుతోఁ బ్రతిజ్ఞ నెఱపు సుధిప.

క. అని యిటు వసిష్ఠముని పావనచారిత్రకుఁడు వల్కఁ బరమోదారుం
డనుపమధర్మవిదుం డగు, జనకుం డిట్లనియె మరల సంయమితోడన్. 1279

సీ. ఎలమితోఁ దనకడ్డ మెవ్వాఁడు వాకిటఁ దనకాజ్ఞ యొసఁగ స్వతంత్రుఁ డెవ్వఁ
డనఘాత్మ తనయింటఁ దనకుసందియ మేమి యూహింప నిది తనయూరుగాదె
మానుగఁ గృతసర్వమంగళాచారులై మత్పుత్రికలు వేదిమధ్యమందుఁ
జెలువొప్పు దీప్తాగ్నిశిఖలకైవడిఁ బ్రకాశించుచున్నవా రంచితముగ

తే. ననఘ విను మేను నీవేదియందె యుండి
కుతుక మలరార మీరాకఁ గోరుచున్న
వాఁడ నెందుకుఁ గాలయాపన మవిఘ్న
ముగ వివాహంబు సేయుఁడు ముదముతోడ. 1280

క. అని పలుక నపుడు మునిపతి, యనుమతమున దశరథేంద్రుఁ డఖిలమునులతోఁ
దనయులఁ దోడ్కొని గ్రక్కున, మనుకులుఁడు వివాహవేదిమధ్యముఁ జేరెన్.

-ఆ- సీతారామవివాహఘట్టము. -ఆ-

వ. అప్పుడు. 1282

క. జనకుఁడు వసిష్ఠుఁ గనుఁగొని, మునిపుంగవ మీరు సర్వమునియుతముగ రా
మునకు వివాహక్రియ గ్రక్కునఁ గావింపుఁ డిఁకఁ దడవుగూడ దనవుడున్.

వ. భగవంతుం డైనవసిష్ఠుండువిశ్వామిత్రశతానందులం బురస్కరించుకొని ప్రపామధ్యంబున శాస్త్రోక్తప్రకారంబున వేదిక నిర్మించి దానిగంధపుష్పంబులనలంకరించి సువర్ణపాలికలను సాంకురంబు లగుకరకంబులును నంకురాఢ్యంబులగుశరావంబులును సధూపకంబు లగుధూపపాత్రంబులును శంఖరూపపాత్రంబులును స్రుక్స్రువంబులును నర్ఘ్యపాత్రంబులును లాజపాత్రంబులును నక్షతపాత్రం

బులును సమంబు లగుదర్భలును సంఘటించివిధిమంత్రపూర్వకంబుగావివాహ వేదికయందు వహ్నిప్రతిష్ఠాపనంబుఁ జేసి మంగళహోమంబు లాచరించె నంత జనకుండు సర్వాభరణభూషిత యైనసీతను రావించి వహ్నిసమక్షంబున రామున కభిముఖంబుగాఁ గూర్చుండ నియోగించి కౌసల్యానందవర్ధనుం డగు రామున కిట్లనియె. 1284

తే. నాతనూజాత సాధ్వి యీసీత నీకు
ధర్మసహచరియై సంతతంబు ఛాయ
గతి ననుగతయై యుండు నీకన్యకరముఁ
గరమునఁ బ్రతిగ్రహింపుము గలుఁగు శుభము. 1285

క. అని పలికి సమ్మదంబున, జనకుఁడు శుభమంత్రపూతజలమును వెస రా
మునికరపంకజమున విడి,చెను సర్వజనములు సంతసించి నుతింపన్. 1286

క. అప్పుడు సురవాద్యధ్వని, లుప్పరమున మొనసె వేల్పు లొగి విరివానల్
కుప్పలుగాఁ గురిసిరి ముద, మొప్పఁగ నాడిరి సుపర్వయోషిజ్జనముల్. 1287

జనకుఁడు లక్ష్మణభరతశత్రుఘ్నులకు నూర్మిళామాండవీశ్రుతకీర్తుల నిచ్చుట.

వ. ఇట్లు మంత్రోదకపురస్సరంబుగాఁ దనపుత్త్రి సీతను రామున కొసంగి హర్షపరి
ప్లుతుండై జనకుండు వెండియు. 1288

సీ. లక్ష్మణ గైకొమ్ము లక్షణవతియైనదాని నూర్మిళను మత్తనయ నెలమిఁ
బరమహర్షంబున భరత చేకొను నవ్యఘనకేశి మాండవీకన్య నిపుడు
శత్రుఘ్న మోదం బెసంగ నీశ్రుతకీర్తికరము గ్రహింపుము కరముచేత
నలువురు నయధర్మ మలరఁ బత్నీవంతులై సుఖింతురుగాక యనుచుఁ బలుక

తే. జనకువచనంబు విని రాజతనయు లపుడు, నెమ్మితో రాజసుతలపాణిగ్రహణము
లర్థిఁ గావించిరి వసిష్ఠుననుమతమునఁ, దల్లిదండ్రులకోర్కులు పల్లవింప.

తే. అంత సుముహూర్త మని సమ్మదాత్ము లగుచు
నడిమితెర దీయ రఘుకులనాయకుండు
సీత నెమ్మోముఁ గాంచి హర్షించె రాము
మోముఁ గనుఁగొని యలరె నామోహనాంగి. 1290

చ. రమణుని ముద్దుమోముఁ గని రాకసుధాంశుని నిండువెన్నెలం
గొమరు వహించు కల్వలనఁ గోమలి వాలికచూపు లారఘూ
త్తమురమణీయదివ్యపదతామరసంబులమీఁద నెంతయుం
బ్రమద మెలర్ప వ్రాలెఁ బతిపాదములం బ్రణమిల్లుకై వడిన్. 1291

చ. జనకజమోముఁ జూడ మఱి చన్గవఁ జూడఁగఁ గోరుఁ జన్గవ
న్గనుఁగొన నవ్వల న్నడుముఁ గాంచఁగఁ గోరు సుమధ్యముం గనుం
గొన మఱి యూరువుల్ గనఁగఁ గోరు నరేంద్రుమనంబు భూవరుల్

దనియెక యుత్తరోత్తరపదస్ప్రృహులే కద యెన్నిచూడఁగన్. 1292

తే. సరసిజానన లావణ్య సరసి లోన, నలరువికసితాబ్జంబులో యనఁగ రాజ
వరుని చూపులు సతిమేన వ్రాలె శశిక,రములు కుముదినిపైఁ జాల వ్రాలినట్లు.

తే. దశరథకుమారవరుని సౌందర్యవార్ధి
కడరి యెదు రెక్కు మీనులో యనఁగ సీత
వాలుచూపులు పతిమీఁద వ్రాలె నపుడు
రాజుపై వ్రాలు ఘనచకోరములకరణి. 1294

వ. అంత. 1295

క. మంగళవాద్యరవంబులు, సంగతిగా మెండుకొనఁగ జనవరసుతుల
య్యంగనల యఱుతఁ గట్టిరి, మంగళసూత్రములు చతురిమం గ్రమయుక్తిన్.

వ. మఱియుఁ గ్రమంబున నమూల్యముక్తాఫలంబులుతలఁబ్రాలుఁబోసి దారాన్వితులై యగ్నికి వేదికి జనకునకు మహాత్ములకు వృద్ధరాజులకుఁ బ్రదక్షిణంబుఁ గావించి రప్పుడు వసిష్ఠవిశ్వామిత్రవామదేవాది పరమర్షులు దీవించిరి సభాసదులు హర్షించిరి వందిమాగధులు జయశబ్దంబులం గీర్తించిరి వేల్పులు కుసుమవృష్టి గురియించిరి దేవదుందుభులు మ్రోయించిరి రంభాదు లాడిరి గంధర్వులుపాడి రప్పు డమ్మహోత్సవంబు పరమాద్భుతదర్శనంబై యొప్పె నంతనారాజనందనులు తమతమయగ్నులకుం బ్రదక్షిణత్రయం బాచరించి సాంగంబుగావివాహశుభకర్మంబులన్నియు నిర్వర్తించి భార్యాసమన్వితులై యుపకార్యలకుం జనిరి దశరథుండును గృతోద్వాహులైనపుత్త్రుల నవలోకించుచు వసిష్ఠవిశ్వామిత్రాదిమహర్షులం గూడి బంధుసహితుండై విడిదం జనియె నంత నమ్మఱునాఁడు.

చ. జనకుఁడు రాఘవుండు కడు సంతస మొప్పఁగ గాధినందనున్
ఘనతరపూజలం దనిపి కౌతుక మొప్ప నుతించి వేడ్కతో
ననిచిన నాతఁ డేగె మిహికాద్రికి నంత సమస్తరాజుల
న్జనకుఁడు సత్కరించి వసుసం బనిచె న్వెస వారివీళ్లకున్. 1298

—దశరథుఁడు జనకునిచేతఁ బూజితుండై యయోధ్యకుఁ బోవుట.—

వ. మఱియు దశరథుని వసిష్ఠాదిమహర్షులను సముచితప్రకారంబునం బూజించి తనపుత్త్రికల కనేకశతసహస్రగోవులును గంబళంబులును బెక్కు చతురంగబలంబులును నలంకారసహితంబులును దివ్యరూపంబులు నైన దాసదాసీజనసహస్రంబులును సువర్ణమయం బయినహిరణ్యం బొక్కకోటియువమౌక్తికంబులొక్కకోటియుఁ గోటివిద్రుమంబులును గన్యాధనంబొసంగికొండొకదూరంబు తోడ నరిగి సముచితప్రకారంబుగా వీడుకొల్పి నిజనివాసంబునకుం జనియె నాదశరథుండు వైదేహు నామంత్రణంబు వడసి కొడుకులం గోడండ్ర ననర్ఘరత్నాందోళికల నెక్కించుకొని పురోహితామాత్యసామంతభృత్యపరిచారక

వందిమాగధపాఠకగాయకనటనర్తకాదులంగూడి సైన్యోపేతుండై హృద్యం
బులగుమంగళవాద్యరవంబులు సెలంగ మరలి యయోధ్యకుం బోవునెడ.

దశరథుఁడు మార్గమున దుశ్శకునములఁ గని వితర్కించుట.

క. మొదల ఖగప్రకరంబులు, భిదురకఠోరస్వరములఁ బెల్లుగ మ్రోసెం
బదపడి సౌమ్యం బగు మృగ, కదంబము ప్రదక్షిణంబు గాఁ దిరిగె రహిన్.

క. అత్తెఱఁగు సూచి రఘువం, శోత్తముఁ డగు నాదశరథుఁ డూహించి మనం
బుత్తలపడ వెసఁ దాపస, సత్తముని వసిష్ఠుఁ గాంచి చయ్యనఁ బలికెన్. 1301

క. ఇది యేమికారణంబో, మొదల ఖగము లుగ్రభంగి మ్రోసెడు మృగముల్
పదపడి వలపటఁ దిరిగెడు, మదిఁ దహతహవొడమె నింత మాకుం జెప్పుమా.

చ. అనవిని మౌనినాథుఁడు నృపాగ్రణి కిట్లను వింటె ముంగల
న్ఘనముగ నొక్కయాపద దగ న్బొడము న్గహిఁ నంతలోనఁ జ
య్యన మితివెట్ట రానివిజయంబు ఘటిల్లును నోడకుండు మం
చను నెడ దారుణాశుగధుతాతతధూళి జగంబు గ్రింగినన్. 1303

చ. కరిహరిసైన్య మొండొకటి గానఁగ లేక గలంగి పాఱె న
త్తఱి రథికుల్ రథంబుల నుదారత డిగ్గి పరిభ్రమంబునం
బరువడిఁ బాఱె రుగ్గతి భానునికాంతులు మాసెఁ దారక
ల్ధరపయి వ్రాలె దిక్కులు గలంగెఁ బయోనిధు లింకె నెంతయున్. 1304

వ. ఇట్టిమహోత్పాతంబులు వుట్టినం జూచి సపుత్రకుం డైనదశరథుండును వసిష్ఠాది
మునులునుం దక్కఁ దక్కినసర్వజనంబులును వలంకుచుండిరి మఱియు
నయ్యంధతమసంబున మునింగి యేమియుం దోఁచక సమస్తసైన్యంబుభస్మచ్ఛ
న్నం బైనతెఱంగున నిశ్చేష్టితం బై యుండె నట్టియెడ. 1305

రఘురామునొద్దకుఁ బరశురాముఁడు వచ్చుట.

సీ. మనములోఁ బొడమినమహితకోపరసంబు వెలికుబ్బెనా స్వేదజలము లొలయ
జయలక్ష్మిచే నొప్పెసఁగుమృణాళికతోడిపద్మంబనా ఘోరపరశు వలరఁ
దతకోపశిఖిశిఖాతతి వెలిఁ బర్వెనాఁ గన్నులఁ గెంజాయ గడలుకొనఁగ
వీరరసాంభోధి వేలావిధంబున వికటభయంకరభ్రుకుటి మెఱయ

తే. నమితగతితో నొనర్చు తపోగ్ని మిడిసి
మౌళిపై నుడి గొన్న పెన్మంట లనఁగ
నెగడుకెంజాయ రంజిలు నిడుదజడలు
గ్రాల లోకభయంకరాకారుఁ డగుచు. 1306

చ. ఇరువదియొక్కమాఱు పృథివీశుల నెల్లఁ గుఠారధారచే
దర మిడి త్రుంచినట్టిజమదగ్నిసుతుం డరుదేరఁ గాంచి యం

దఱు భయ మంది రాజశరథక్షితిభర్త వసిష్ఠముఖ్యధీ
వరులను భక్తితో భయనివారకమంత్రము లుచ్చరించుచున్. 1307

పరశురామునకు ఋషు లందఱుఁ బూజఁ జేయుట.

ఉ. ఈతఁడు మున్ను తండ్రిపగ కెంతయు రోషకషాయితాత్ముఁడై
యాతతసత్కుఠారమున నారసి యుర్విదియొక్కమాఱు ధా
త్రీతలనాథులం దగ వధించి గతజ్వరమన్యుఁ డయ్యు నీ
రీతి నిదేలకో కనికరింపక గిన్కవహించెఁ గ్రమ్మఱన్. 1308
తే. అనుచుఁ దలపోసి బ్రహ్మర్షు లర్ఘ్యముఁ గొని
భీమదర్పను భార్గవరాముఁ జేరి
దేవ మత్పూజనంబుఁ బ్రతిగ్రహింపు
భార్గవ యటంచు మధురోక్తిఁ బల్కుటయును. 1309
క. మునిదత్తసపర్యను గై, కొని యట నిల్వక ప్రభూతకోపం బడరం
గనుల హుతాశనకణములు, చినుకఁగ రఘురాముఁ జేరెఁ జడిముడి వడుచున్.
వ. మఱియుఁ గైలాసంబుకరణి దుర్ధర్షుండును గాలాగ్నియుంబోలె దుస్సహుం
డును విద్యుద్గణసదృశుండును మహాపరశ్వధాలంకృతవిశాలస్కంధుండును శర
చాపధరుండును నై త్రిపురఘ్నుం డైనసాక్షాచ్ఛంభుండునుంబోలె దుర్నిరీక్షుం
డై పావకునిభంగి వెలుంగుచు రాముని మ్రోల నిలిచి యిట్లనియె. 1311

పరశురాముఁడు రఘురామునితో ఘోరంబుగాఁ బల్కుట.

చ. దశరథరామ నీవు బలదర్ప మెలర్ప విదేహుపీటిలోఁ
బశుపతిఘోరకార్ముకము భగ్నముఁ జేసినమేటి వంచు నే
విశదముగాఁగ నింత విని వేగమె చూడఁగ వచ్చినాఁడ న
న్పశుపతిశిష్యుఁ డైనయల భార్గవరామునిఁగా నెఱుంగుమా. 1312
చ. జనవరపుత్త్ర జీర్ణ మగు శంభునిచాపముఁ ద్రుంచు టేఘనం
బనుపమలీల నాదువిశిఖాసనముం బరికింపు దీనిఁ గై
కొని వడి నెక్కు వెట్టి శరకోటి ఘటించితివేని రామ నీ
ఘనభుజశక్తిఁ జూచి వెనుకం దగ నిచ్చెద ద్వంద్వయుద్ధమున్. 1313

దశరథుఁడు పరశురాముని సవినయంబుగ ననునయించుట.

చ. అన విని భీతుఁడై దశరథాధిపుఁ డంజలిఁ జేసి దైన్య మా
ననమునఁ దోఁపఁ బల్కె మునినాథునితో ననఘాత్మ భూమిభృ
జ్జనములఁ ద్రుంచి త్రుంచి తుది శాంతుఁడవై కడు బ్రహ్మనిష్ఠచేఁ
బ్రణుతికి నెక్కితీవు కృప బాలుని రామునిఁ బ్రోవఁగాఁ దగున్. 1314
ఉ. భూసురవర్య భార్గవుల పుణ్యకులంబునఁ బుట్టి భక్తితో
వాసవవహ్నిముఖ్యసురవర్యులు ప్రార్థనసేయ నస్త్రస

న్నాశ్రయన మొనర్చి కాశ్యపున కర్థి సమస్తధరిత్రి నిచ్చి శౌచు
ల్లాసముతో మహేంద్రకుధరంబున కేగితి గాదె మున్నొగిన్. 1315

చ. ఇరువదియొక్కమాఱు ధరణీశుల నందఱఁ ద్రుంచి మేటివై
పరఁగెడునీకు మౌనివర బాలుఁడు రాముఁ డనంగ నెంత యా
సురుచిరవిగ్రహుం గనులఁ జూడక నే బ్రతుకంగఁ జాల ని
ష్ఠురగతి రామభద్రుఁ దెగఁ జూడకు నీపద మాశ్రయించెదన్. 1316

వ. అని బహుప్రకారంబుల నద్దశరథుండు ప్రార్థించిన నప్పరశురామదేవుం డతని
పలుకులయెడ ననాదరణంబుఁ జేసి రామున కిట్లనియె. 1317

పరశురాముఁడు రఘురామునికి శైవవైష్ణవధనువులయుత్పత్తిప్రకారంబుఁ జెప్పుట.

ఉ. మున్ను సమస్తదేవమునిముఖ్యులు ప్రార్థనసేయ వేడ్కతోఁ
బన్నుగ విశ్వకర్మ నిరపాయముగాఁ దనశిల్పనైపుణం
బెన్నిక కెక్కఁ జేసెఁ బృథివీశ్వర చాపయుగంబు మేరుభూ
భృన్నవసారము న్గధరభిత్కఠినత్వముఁ గల్గునట్లుగన్. 1318

ఉ. ఏపున వేల్పు లందఱు నహీనబలాన్వితమై తనర్చు త
చ్చాపయుగంబులోన నొకచాపము శూలి కొసంగ నయ్యప
ర్ణాపతి దానిఁ జేకొని కరంబు బలంబుఁ దలిర్ప లోకసం
తాపము నిర్జరార్తియుఁ జనం ద్రిపురంబులఁ గూల్చె నొక్కటన్. 1319

క. రెండవది యైనఘనకో, దండము నచ్యున కొసంగఁ దగ దని వెస నా
ఖండలముఖనిర్జరవరు, లండజగమనున కొసంగి రద్భుతభంగిన్. 1320

ఉ. అంత సుపర్వు లందఱు రమాధిప శంకరదోర్బలాంతరం
బంతయుఁ జూడఁగోరి ముద మారఁగ నందొకనాఁడు భారతీ
కాంతునితోడ నత్తెఱఁగు గ్రక్కునఁ దెల్పిన నప్పితామహుం
డెంతయుఁ గల్గఁ జేసెఁ బరమేశరమేశులకు న్విరోధమున్. 1321

వ. ఇట్లు జాతరోషులై యప్పురాణపురుషు లిరువురు కోదండంబులు గొని పర
స్పరజయకాంక్షలం దలపడిన నయ్యిద్దఱకు ఘోరంబైనసంగ్రామం బయ్యె
నప్పుడు. 1322

క. హుంకారంబున వెస మఱి, శంకరుఁ డటు ధనువుతోడ స్తంభితుఁ డయ్యె
న్బంకజభవాదిసురు లా, వంకకుఁ జనుదెంచి వారి రావించి రొగిన్. 1323

తే. అనిమిషులచేతఁ బ్రార్థితులై పినాక
చక్రపాణులు జగములు సంతసింపఁ
బోరు సాలించి తమలోనఁ బొందుఁ జేసి
చనిరి ముదమున నాత్మీయసదనములకు. 1324

తే. అంతఁ బరమేష్ఠివాసవాద్యమరవరులు, శంభుసత్త్వంబుకంటె నీచక్రిసత్త్వ

మెక్కుడని తలపోయుచు నేగి రథిక, సమ్మదంబునఁ దమతమసదనములకు.

వ. అంత రుద్రుండు తనచాపంబు విదేహులలో నుత్తముం డైన దేవరాతుం డను రాజర్షి కిచ్చె విష్ణుండు పరపురంజయం బగుతనచాపంబు భార్గవుం డైన ఋచీకున కిచ్చె నమ్మహాత్ముండు మజ్జనకుం డైనజమదగ్ని కొసంగె నమ్ముని శ్రేష్ఠుండు న్యస్తశస్త్రుం డయి తపోవనంబునకుం జని యందుఁ గార్తవీర్యుని చేత హతుం డయ్యె నంత నేను బితృవధంబుఁ జూచి జాతరోషుండ నై వైష్ణవం బగుచాపంబుఁ గొని యిరువదియొక్కమాఱు శోధించి యర్జునాది రాజుల నందఱ నిశ్శేషంబుగాఁ బరిమార్చి జగం బంతయు నక్షత్రంబుఁ జేసి వసుంధర నెల్ల యజ్ఞాంతంబునందు దక్షిణార్థంబుగాఁ గాశ్యపున కొసంగి మహేంద్రకృతకేతనుండ నై తపంబు సేయుచుండి శివధనుర్విభేదనంబు విని వచ్చినాఁడ నిది వైష్ణవం బగుచాపంబు మత్కరంబునం గ్రాలు చున్నయది దీనిఁ బ్రతిగ్రహించి క్షత్త్రధర్మం బవలంబించి సజ్యంబుఁ జేసి శరసంధానంబుఁ గావించితివేని యవ్వల ద్వంద్వయుద్ధం బొసంగెద నని పలికిన నా రామభద్రుండు పరశురామునివచనంబు విని పితృసన్నిధిగౌరవంబువలన నియమితకంఠుండై నయంబున భార్గవరామున కిట్లనియె. 1326

రఘురామునిచేతఁ బరశురాముఁడు భగ్నవీర్యుఁ డగుట

సీ. అనఘాత్మ మాతండ్రి యగుజమదగ్నిని జలమున హైహయు ల్చంపుటయును
దానికి నీ వల్గి తప్పక యిరువదియొకమాఱు శోధించి యుర్వీపతుల
వరపరశ్వధముచే నఱికి చంపుటయును నరుసతో నేను సర్వంబు వింటి
నెలమితోడఁ బిత్ర్యాణ మీఁగుట కబ్బంగిఁ జేయుంగ సుతునకుఁ జెల్లు ననుచు
తే. మది సహించితి క్షత్త్రధర్మంబునం ద,శక్తునిఁగ నన్నుఁ దలఁచితి నైఁప నింక
నాదు తేజంబు భుజవీర్యనైపుణంబు, నంతయును నేఁడు చూడుము పంతమేల.

చ. వెఱవనినన్ను నింత వెఱపింపఁగ నేటికిఁ దెమ్ము నీధను
ర్వర మని జామదగ్న్యునికరంబున రాజిలు చాపబాణము
ల్బనుపడిఁ గేల నందుకొని బాణము వింట ఘటించి కన్నులం
జుఱచుఱ కెంపు సొంపెసఁగఁ జూచి రయంబున రాముఁ డిట్లనున్. 1328

ఆ. బ్రాహ్మణుండ వనియుఁ బరఁగ విశ్వామిత్ర, బాంధవుండ వనియు భక్తితోడ
మొనసి జీవితంబుఁ గొనఁ జాలు నట్టి యీ, విశిఖ ముగ్రభంగి విడువ నైతి.

వ. మహాత్మా యిది దివ్యం బైనవైష్ణవసాయకం బమోఘంబు గావున దీనిచేత భవదీయపాదగమనశక్తిని ఖండించెద నట్లు గాదేని తపోబలసముపార్జితపుణ్యలోకప్రాపణశక్తిని హరించెద నీరెంటిలోన నీయభిమతం బెయ్యది యెఱింగింపు మని సంరంభవిజృంభితుండై పలికిన దశరథరాముని రూపలక్షణం బుపలక్షించి పరశురాముండు దర్పబలోత్సాహంబులు వదలి ధైర్యంబు విడిచి చేష్టలు

మాని నిర్వీర్యుం డై విచిత్రాకారంబున నిచ్చవడి రామునివదనంబు సూచు చుండె నప్పు డయ్యద్భుతకర్మంబు విలోకించి యచ్చెరువొందుచు బ్రహ్మయు నింద్రప్రముఖదిక్పాలకులును నక్కజ సురాసురయక్షగరుడగంధర్వకిన్నరకింపురుషసిద్ధసాధ్యచారణాదు లంబరంబునం బన్ని బహుప్రకారంబుల శరచాపధరుం డైన రాముని మహామహిమంబులు వక్కాణించుచుండి రంతఁ గొంతవడికిం దెలివొంది భార్గవరాముండు మందవాక్యంబున రామున కి ట్లనియె. 1330

—రఘురాముఁడు పరశురామునిపుణ్యలోకములపై బాణప్రయోగంబుఁ జేయుట.—

సీ. బ్రహ్మణ్యుఁ డగు కశ్యపబ్రహ్మ కిచ్చితి ము న్నుర్వి యెల్ల నమ్మునివరుండు
తన దేశమున నుండఁ దగదు పొ మ్మనిన నే నట్ల చేసెదువాఁడ నని ప్రతిజ్ఞ
నెఱపి నాఁటంగోలె వరమహేంద్రాద్రిపై వసియించి పగ లెల్ల వసుధ యెల్లఁ
దిరిగి రేలు నివాసగిరికిఁ బోవుచు నిట్లు కాలంబు వెరువున గడపుచున్న
తే. వాఁడఁ గాన మద్గతి నేయవలదు నాదు, పాలిపుణ్యలోకంబులు లీల నేయు
మనిన నారాముఁ డట్లకాక యని రయమునఁ, గడఁగి యాతనిపుణ్యలోకంబు లేసె.

—పరశురాముఁడు రఘురామునిఁ బ్రశంసించుట—

వ. అంత నప్పరశురామదేవుండు రామశరాభిహతంబు లైనస్వార్జితపుణ్యలోకంబులు విలోకించి వెండియు రాముని వీక్షించి మహాత్మా నీవు జగద్గురుండ వైన సుదర్శనధరుండవు భవదీయమాయామహత్త్వం బెఱుంగ నెవ్వం డోపు రణంబున నీకోడుట నాకుఁ గొఱంతకాదు భవదీయదివ్యపరాక్రమప్రకారంబు సూచి దేవర్షిగణంబులు గగనంబుననుండి బహుప్రకారంబుల వక్కాణించుచున్నవారు నీవు దీర్ఘాయుష్మంతుండవై శిష్టప్రతిపాలనంబును దుష్టశిక్షణంబును గావించుచు ధర్మసంస్థాపనంబు సేయుచుఁ గీర్తిమంతుండవు గమ్మని దీవించి ప్రదక్షిణంబుఁ జేసి మహేంద్రపర్వతంబునకుం జనియె సురాసురగణంబులు రామునిఁ బ్రస్తుతించుచు దివంబునకుం జని రప్పుడు సుఖస్పర్శంబు లై వాయువులు విసరె దిక్కులు కాంతియుక్తంబు లయ్యె నంత రాముండు ప్రశాంతాత్ముం డై యమ్మహనీయబాణాసనంబును శరంబును వరుణున కొసంగి వసిష్ఠప్రముఖపరమర్షులకు నమస్కరించి విహ్వలుం డైనదశరథు నవలోకించి యి ట్లనియె. 1332

—దశరథుఁడు పుత్రులతోఁగూడి యయోధ్యాపట్టణంబుఁ బ్రవేశించుట.—

క. ఘనుఁ డగుభార్గవరాముఁడు, చనియెం దగఁ జాతకాళిజలదముఁ బోలెన్
మన సేన భవచ్ఛాసనమును గోరెడు నానతిమ్ము పురమున కరుగన్. 1333
క. అన విని సంతోషము మది, జనియింపఁగ నృపుఁడు రామచంద్రుఁ బునర్జా
తునిఁగాఁ దలఁచుచు రాగం,బునఁ గౌఁగిటఁ జేర్చి శిరముమూర్కొని యంతన్.

వ. బంధుమిత్రపుత్రామాత్య సామంతపురోహితసేనాసహితుండై మంగళవాద్య
ఘోషపురస్సరంబుగాఁ గదలి యెడనెడ నెదుర్కొను పౌరుల నవలోకించి
సన్మానించుచు సుముహూర్తంబున సకలసామ్రాజ్యలక్ష్మీనివాసంబైన యయో
ధ్యాపట్టణంబుఁ బ్రవేశించి సిక్తసమ్మార్జితంబును బ్రకీర్ణకుసుమోత్కరంబును
బతాకాధ్వజశోభితంబును దూర్యోద్ఘుష్టనినాదితంబు నైన రాజమార్గంబునం
జని శ్రీమంతులైన పుత్రులం గూడి స్వస్తివాచనపూర్వకంబుగా హిమవచ్ఛి
ఖరసంకాశంబైన స్వగృహంబుఁ బ్రవేశించి సర్వవిషయభోగపరికరసమన్వితుం
డై మందిరవాసులైన స్వజనులం గూడి యానందించుచుండె నంతఁ గౌసల్యయు
సుమిత్రయుఁ గైకయుఁ దక్కిన రాజకాంతలును గోడండ్రైన సీతోర్మిళా
మాండవీశ్రుతకీర్తులను బరిగ్రహించి క్షౌమపటంబులు దాల్చి మంగళాలాప
శోభితలై మంగళాలంకారంబులచేత దేవతాయతనంబులం బూజించి రంత
సీతాప్రముఖరాజకన్యకలు గృహదేవతలకుఁ గౌసల్యాదిరాజపత్నులకు నమ
స్కరించి తమతమభర్తలం గూడి యేకాంతంబున యథాసుఖంబుగాఁ గ్రీడించు
చుండిరి మహాత్ములగు రామాదికుమారులు వీర్యంబుచేత నప్రతిమానులై
కృతదారులై కృతాస్త్రులై ధనవంతులై సుహృజ్జనసమన్వితులై యనా
రతంబుఁ దండ్రి యగు దశరథునకు శుశ్రూషఁ గావించుచుఁ బరమానందం
బున నిష్టోపభోగంబు లనుభవించుచుండి రంత 1335

భరతశత్రుఘ్నులు యుధాజిత్తువెంటఁ గేకయరాజునొద్దకుఁ బోవుట

సీ. ఒకనాఁడు దశరథుఁ డుత్సాహమునఁ బుణ్యరతుని సువ్రతుని భరతునిఁ బిలిచి
యోతనూభవ నీదుమాతామహుఁడు నిన్నుఁ గనుఁగొను వేడుక గడలుకొనఁగ
నీమాతులునిఁ బంపె నినుఁ దోడి తెమ్మని కడుఁబ్రీతి నీవు కాన్కలను గొనుచు
శత్రుఘ్నయుతుఁడవై చను మని పల్కి యుధాజిత్తుఁ బూజించి తాపనీయ
తే. భూషణంబు లొసంగి విభూతి మెఱయ
ననుప నాతఁడు భరతుని నతనియనుజుఁ
దోడుకొని హేమరథ మెక్కి తొగలఱేఁడు
వోలె వెలుఁగుచు నిజపురంబునకుఁ జనియె. 1336

వ. ఇట్లు భరతుండు తల్లిదండ్రులకు రామునకు నమస్కరించి యనుజ్ఞఁగొని శత్రు
ఘ్నసహితుండై మాతులునివెంటం జనినయనంతరంబ రామలక్ష్మణులు దేవ
సంకాశుండైన దశరథునిం బూజించి రంత. 1337

శ్రీరామసౌజన్యాభివర్ణనము

ఉ. కాల మెఱింగి ధర్మమును గామము నర్థముఁ గూడఁ బెట్టుచుఁ
లీల మహీప్రజన్ ద్రుహిణులీలఁ గృపావశుఁడై నిజప్రజం
బోలె ననారతం బరసి ప్రోచుచు నొజ్జలఁ దల్లిదండ్రులం

జాల భజింపుచు నొ్బలిచె శత్రువిరాముఁడు రాముఁ డ త్తఱిన్. 1338

తే. జిష్ణుతపనచంద్రులు జయశీలమునఁ బ్ర,తాపమున సంతతప్రియదర్శనమునఁ
బరఁగ నన్వర్థు లైనట్లు ప్రకృతిరంజ,నమువలన రాముఁ డన్వర్థనాముఁ డయ్యె.

తే. అంశువులచేత నుజ్జ్వలుం డగుసహస్ర
కరునిచందాన దివ్యమంగళగుణముల
నలరి తలిదండ్రులకు గురువులకుఁ బౌరు
లకు ముద మెలర్ప రాముండు లలి నెలింగె. 1340

సీతారామపరస్పరానురాగాతిశయాభివర్ణనము.

ఉ. వేడుకతోడ రాముఁడు వివృద్ధమనోహర మైనతావిచేఁ
గూడినపువ్వుమాడ్కి రఘుకుంజరుఁ డాజనకాత్మజాతతోఁ
గూడి యథేచ్ఛభంగి నుదిఁ గోర్కులు మీఱ వినూతనాతను
క్రీడల సోలుచు న్వినుతరీతి సుఖాంబుధి నోలలాడుచున్. 1341

తే. జానకీహృత్సమర్పితస్వాంతుఁ డగుచుఁ, దద్గతుం డయి నిత్యంబు దాశరథుఁడు
ఋతువులోకకొన్ని యమ్మహాసతినిగూడి, యనుపమేష్టోపభోగంబు లనుభవించె.

తే. శ్రీరఘుస్వామి నిత్యంబు సీతఁ గూడి, భావభవకేళికాసుఖసేవి యయ్యుఁ
బ్రతిదినంబును నూత్నసంగతుఁడువోలె, నిరుపమప్రేమభారసంభరితుఁ డయ్యె.

తే. ధరణిపుత్త్రియుఁబితృకృతదార యగుట,దాశరథునకు నత్యంతదయితయగుచు
గుణమువలన సౌందర్యాదిగుణమువలన, విభున కెంతయు సంప్రీతి వృద్ధిఁ జేసె.

క. రామునికంటె ద్విగుణమై, రామామణి ప్రేమ యొప్పు రామునిపై నా
రామవిభునియనురాగం, బామానిని మీఁద నొప్పు నట్లు ద్విగుణమై. 1345

క. సీతాంతర్గతరాగము, ఖ్యాతిగ రాఘవుఁడు రాఘవాంతర్గతరా
గాతిశయము సంతతమును, సీతయు సూక్ష్మమతి నెఱిఁగి చెలఁగిరి మిగులన్.

వ. ఇత్తెఱంగున రాజర్షిపుత్త్రుం డగురాముండు దేవతాసంకాశరూపిణియును త్తమ రాజకన్యయు లక్ష్మీసదృశసౌందర్యాదిసమస్తసద్గుణసమన్వితయు నైన సీతం గూడి లక్ష్మీసమేతుం డైననారాయణునిభంగిఁ బ్రకాశించె నని యిట్లు కుశ లవులు బాలకాండకథాప్రపంచం బంతయు సవిస్తరంబుగా వినిపించిన విని రాముండును లక్ష్మణుండును భరతశత్రుఘ్నులును దక్షిణసభాసదులును బర మానందభరితాంతఃకరణులై యట మీఁదికథాక్రమణిక యెట్లు వినిపింపుఁ డని యడుగుటయు. 1347

పుష్పమాలికాబంధము.

చ. ధరధర వీర శాశ్వత ధృతవ్రత మాధవ దేవదేవ మం
దరధర ధీర మోక్షదపదప్రద సుందరతారహార. భా

స్వైర సురవారపోష వర వల్లవశేఖర హారహార శం
కరధరసారకీర్తి కవికల్పక గోకులబాలఖేలనా. 1848

క. విశ్వాధిప విశ్వేవర, విశ్వాత్మక విశ్వసాక్షి విశ్వాధారా
విశ్వమయ విశ్వరూపక, విశ్వస్థితివిలయకరణ విశ్వాతీతా. 1849

మాలిని సరసిజదళనేత్రా సజ్జనస్తోత్రపాత్రా
నిరుపమసుచరిత్రా నీలమేఘాభగాత్రా
పరమగుణపవిత్రా పాపవల్లీలవిత్రా
హరివరసుతమిత్రా యబ్ధికన్యాకళత్రా. 1350

శా. ఈకావ్యప్రతిపాదితుం డయినసీతేశుండు రామప్రభుం
డీకల్యాణకృతీశ్వరుం డయిన శ్రీకృష్ణుండు సంప్రీతితో
సాకల్యంబుగ నిష్టసిద్ధికరు లై చంచత్కృపాపూర్ణత
లోకస్తుత్యకుమారయాచధరణీంద్రుం బ్రోతు రెల్లప్పుడున్. 1351

గద్య. శ్రీరామచంద్రచరణారవిందమకరందరసాస్వాదనతుందిలేందిందిరాయమాన
మానసగోపీనాథకులపవిత్ర కౌండిన్యగోత్రపద్మనాభసూరిపుత్ర విద్యాసాంద్ర
వేంకటకవీంద్రప్రణీతం బైనశ్రీమద్రామాయణం బనునాదికావ్యంబునందు
బాలకాండము

శ్రీరామచంద్రార్పణ మస్తు.

---

శ్రీ ర స్తు.

శ్రీరామచంద్రపరబ్రహ్మణేనమః.

# గో పీ నా థ రా మా య ణ ము

## అ యో ధ్యా కాం డ ము.

---



రాధాకుచకుంకుమ
సారాంకితతారహారసంకలితవిశా
లోరస్థల యాశ్రితమం
దారా నవనీతచోర నందకుమారా. 1

వ. దేవా అవధరింపుము కుశీలవు లగుకుశలవు లవ్వాలికథ యిట్లని చదువం దొడంగి రిట్లు పితృభ్రాత్రనుజ్ఞానంతరంబునఁ గామాదివికారరహితుం డగు శత్రుఘ్నుండు తనయన్న యగులక్ష్మణుండు బలవంతుం డగురామున కాశ్రితుం డయ్యె నాచేతను మహదాశ్రయంబు కర్తవ్యం బని తలంచి కలుషబుద్ధిరహితుం డై మాతులగృహంబునకుం జను భరతునిచేత మాతులగృహవాసజనితసౌఖ్యం బే నొక్కరుండ ననుభవించుట సముచితంబు గా దనుబుద్ధిచేత నీతుం డై భరతవిషయస్నేహపురస్కృతుం డై యతనివెంటం జనియె. 2

భరతుండు శత్రుఘ్నసమేతుఁ డై తనమాతులగృహంబునకుం జనుట.

ఉ. ఆతతతేజుఁ డాభరతుఁ డచ్చట భ్రాతృసమన్వితంబుగాఁ
జాతురి మీఱ నిత్యమును సత్కృతి సత్కృతుఁ డై కృపాలుఁ డా
మాతులుఁ డద్భుతక్రియఁ గుమారకవత్సలతం గడంగి వి
ఖ్యాతిగ గారవింపఁ జెలువారుచు నుండె ముదం బెలర్పఁగన్. 3

తే. అభిమతపదార్థములచేత నచటఁ దర్పి
మాఱు లయ్యు నయ్యిరువురు మానసమున
వృద్ధనృపుఁ డైనతండ్రిని వీరుఁ డైన
రాముని దలంచుచుండిరి రమణతోడ. 4

క. జననాథుండును జిత్తం,బున నిత్యముఁ దలఁచుచుండెఁ బ్రోషితసుతులన్
ఘనుల భరతశత్రుఘ్నుల, ననిమిషపతి వరుణనిభుల నర్కప్రభులన్. 5

ఉ. ఆనరనాథమాళికి నిజాంగజబాహుచతుష్టయంబుచం
దానఁ జెలంగు శిష్టగుణధన్యకుమారచతుష్టయంబులోఁ
జానుగ వేల్పులం దజుఁడు చక్రికిఁ బోలె ఘనుండు జానకీ
జాని యహర్నిశంబుఁ బటుసమ్మదదాయకుఁ డయ్యె నెంతయున్. 6

తే. ఆరఘూత్తముఁ డతిదుస్సహప్రతాప
కలితుఁ డగురావణునిచేతఁ దలఁచు దివిజ
వరులచేఁ బ్రార్థితుం డయి వసుధ నవత
రించినరమాధవుఁడు గాఁడె యెంచి చూడ. 7

ఆ. అమితతేజుఁ డైన యక్కుమారునిచేత, జనని ముదముఁ గాంచె సంతతంబు
దేవవిభునిచేత దివిజలోకమున సమ్మదముఁ గన్న దేవమాతకరణి. 8

ఆ. అతఁడు వీర్యవంతుఁ డనసూయకుండు సు, ప్రసన్నుఁ డెన్న నుర్వి ననుప
మానసూనుఁ డతులమానధనుఁడు దశ, రథసముండు సుగుణరాజికలన. 9

క. ఒరులు పరుసంబు లాడిన, నురుమతిఁ బేశలసుధామయోక్తులఁ దగ ను
త్తర మిచ్చుఁ గాని కినుక, న్బరుషోత్తర మీఁడు శాంతభావుం డగుటన్. 10

క. అపకృతులు నూఱొనర్చియు, నుపకృతి యొక టాచరింప నుత్తమమతి న
య్యుపకృతియె తలఁచుఁ గాక, య్యపకృతులఁ దలంపఁ డంచితాత్ముం డగుటన్.

తే. ఆమహీశకుమారపుష్పాస్త్రుఁ డనిశ
మస్త్రయోగాంతరములయందైన ప్రమద
మెసఁగ శీలవయోజ్ఞానవృద్ధులైన
సజ్జనులతోడ సద్గోష్ఠి సలుపుచుండు. 12

ఆ. బుద్ధిమత్తరుండు పూర్వభాషియుఁ బ్రియ, భాషి మధురమంజుభాషి యైన
జానకీప్రియుండు చటులపరాక్రమ, క్రమణశీలుఁ డయ్యు గర్వి గాఁడు. 13

మత్తకోకిల. వృద్ధసేవియు సత్యవాదియు విప్రపూజనతత్పరుం
డిద్ధతేజుఁడు వీర్యశాలి దినేంద్రవంశలలాముఁ డా
పద్ధరుండు ప్రశాంతచిత్తుఁడు పండితుండును దుష్టసం
పద్ధరుండు మహానుభావుఁడు భద్రమూర్తి దలంపఁగాన్. 14

క. నానావిధసద్గుణముల, జానుగ రంజిల్లఁ జేయు సతతముఁ బ్రజలన్
నానావిధసంస్తవముల, మానుగ ననురక్తుఁ డగును మఱి ప్రజచేతన్. 15

క. సదయుఁడు జితకోపుఁడు భూ, త్రిదశప్రతిపూజకుఁడును దీనావనుఁడు
న్విదితాఖిలధర్ముం డతి, వదాన్యుఁడును శుచియు నియమవంతుఁడు ధాత్రిన్.

వ. మఱియు నిక్ష్వాకుకులోచితదయాదాక్షిణ్యశరణాగతరక్షణాది ధర్మైక ప్రవణ
బుద్ధియై దుష్టనిగ్రహపూర్వక శిష్టప్రతిపాలన రూపం బగు స్వకీయక్షత్ర
ధర్మంబు బహుమానించుచు క్షత్రధర్మసంజాతకీర్తిచేత నతిశయితం బగుస్వర్గ

ఫలంబు సాధ్యంబని యెఱింగి నిషిద్ధకర్మంబులందును విరుద్ధకథలయందును సంసక్తుఁడు గాక బృహస్పతియుం బోలె నుత్తరోత్తరప్రమాణోపన్యాసచతురుండై యుండు మఱియును. 17

మ. రవితేజుండును వాగ్మియుం బురుషసారజ్ఞుండు లోకైకసా
ధువరేణ్యుండు నరోగుఁడుం వరుణుఁ డెందున్ దేశకాలజ్ఞుఁ డి
ద్ధవపుష్మంతుఁడు నైన రాముఁ డలరెన్ ధాత్రీప్రజాశ్రేణి కా
ర్యవితానస్తుతసద్గుణంబుల బహిఃప్రాణంబుచందంబునన్. 18

శా. వేదజ్ఞుండు తదంగపారగుఁడు సద్విద్యావ్రతస్నాతుఁడున్
సాధుగ్రామణి సత్యవాది ఋజుఁడు న్శాంతుండు దాంతుండు ని
త్యాదీనుండును మంగళాభిజనుఁ డిష్వస్త్రంబులందుం గృతా
మోదుం డాతఁడు తండ్రికంటె ఘనుఁడై భూమండలిన్ భాసిలెన్. 19

తే. వెలయ ధర్మార్థవిదు లగువృద్ధభూసు
రాగ్రణులచేత సంతత మభివినీతుఁ
డమితగుణధాముఁ డినధాముఁ డరివిరాముఁ
డవనిజారాముఁ డంబుదశ్యాముఁ డతఁడు. 20

క. ప్రతిభానస్మృతిమంతుం, డతులగుణుఁడు లౌకికసమయాచారమునం
గృతకల్పుఁడు గోవిదుఁ డు, న్నతుఁడును ధర్మార్థకామతత్త్వజ్ఞుండున్. 21

తే. గుప్తమంత్రుండు మంత్రాంగకోవిదుండు
ఘనుఁడు నిభృతుఁడు సంభృతాకారుఁ డమిత
సత్త్వవంతుఁ డమోఘరోషప్రసాదుఁ
డసదృశుఁడు త్యాగసంయమావసరవిదుఁడు. 22

మ. పరమోదారుఁ డదుర్వచస్కుఁడు స్థిరప్రజ్ఞుండు సద్గ్రాహియున్
సరసుండుం బురుషాంతరజ్ఞుఁడు కృతజ్ఞశ్రేష్ఠుఁడున్ సారశా
స్త్రరతుం డుజ్జ్వలుఁ డాత్మదోషపరదోషజ్ఞుండు నిస్తంద్రుఁడున్
గరుణాసింధుఁడు నప్రమత్తుఁడు త్రిలోకఖ్యాతచారిత్రుఁడున్. 23

తే. అరయ సత్సంగ్రహప్రగ్రహణములందు
బ్రగ్రహానుగ్రహములందు రాజనీతు
లందు న్యాయవిచక్షణుం డనఁగ మఱియు
నిగ్రహస్థానవిదుఁ డన నెగడు నతఁడు. 24

వ. మఱియు బుష్పంబులవలన మధుకరంబునుంబోలెఁ బ్రజలవలనఁ బీడనంబు లేకుండ నుపాయంబున ధనం బార్జించి శాస్త్రదృష్టవ్యయకర్మజ్ఞుండై యొప్పు మఱియు న్యాయవైశేషికవేదాంతాదిశాస్త్రసమూహంబులందును సంస్కృతప్రాకృతాదిభాషాత్మకకావ్యనాటకాలంకారాదులయందును నిపుణత్వంబు

నొంది యుండుధర్మార్థంబులు సంగ్రహించి సుఖతంత్రుం డై కర్తవ్య కార్యం
బులయం దుత్సాహంబు గలిగి యలరు నదియునుంగాక. 25

క. వారణతురంగచర్యవిన, యారోహములందుఁ జతురుఁ డార్యనుతుఁడు వై
హారికశిల్పవిజ్ఞాతయు, వీరోత్తముఁ డర్థభాగవిదుఁడు దలంపన్. 26

చ. అతిరథసమ్మతుండు నిఖిలారిహరుండు చమూనయజ్ఞుఁడుర్
వితతధనుష్కళావిదుఁడు వీరుల కెల్లను మేలుబంతి యా
తతసమరంబులందు సురదైత్యుల కెల్ల నసాధ్యవిక్రముం
డతని కతండె సాటి సుజనాభినుతాతతసద్గుణంబులన్. 27

క. జితకోపుం డనసూయుఁడు, మతిమంతుఁ డదృప్తకుం డమత్సరుఁడు జగ
ద్ధితుఁడు నయకోవిదుఁడు సు, వ్రతుఁడు బలాఢ్యుం డకాలవశగతుఁ డుర్విన్.

క. అతులితమతిచే వాచ, స్పతికిఁ సాటి యగువాఁడు శౌర్యమున దివ
స్పతికిం బ్రతివాది సము, న్నతసత్త్వమునం బ్రభంజనప్రతిముఁ డిలన్. 29

క. ధారుణికిం గలక్షమయును, సారసబాణునకుఁ గలుగుచక్కఁదనంబు
న్మేరువునకుఁ గలధైర్యం, బారఘుపతియందుఁ బొల్చు నద్భుతలీలన్. 30

వ. ఇట్లు సర్వప్రజాకాంతంబులును జనకునకుఁ బ్రీతిసంజననంబులు నైనప్రసిద్ధగు
ణంబులచేత నారాముండు కిరణంబులచేతఁ బ్రదీప్తుం డగుసహస్రాంశునిచం
దంబున నభిరాముం డయ్యె మఱియును. 31

క. ఏవంవిధగుణగణసం, భావితునిఁ బ్రచండవిక్రమక్రము నఖిలా
శావరసము రామునిఁ బృ, థ్వీవనజాతాక్షి దనకు విభుఁ డని తలఁచెన్. 32

తే. ఇట్టు లసమానబహుగుణహితుఁడు నైన
సుతునిఁ గనుఁగొని దశరథక్షితిబలారి
శేఖరుఁడు దనమదిలోనఁ జింతఁ జేసె
సకలజనహితహేతువిచారుఁ డగుచు. 33

క. ఘనవృద్ధుఁడు చిరజీవియు, ననయుం డగునృపతి కేను నప్రాణుఁడ నై
మనియుండ సుతుఁడు స్వామిత, మును జెవ్విధిఁ గలుగునను చుమదిఁ బ్రియమొదవెన్.

ఉ. పొందుగ సర్వభూరమణపూజితుఁ డై సకలావని న్మహా
నందముతోడ నేలుప్రియనందనుఁ గాంచి మనంబులో ముదం
బొందుట నాకు నెన్నఁ డగునో యనునీయధికప్రియంబు లో
సందడి పెట్ట సాగె గుణశాలికి తేని కహర్నిశంబునున్. 35

తే. వృద్ధికాముండు జనులకె వ్వేళలందు, వివిధభూతహితుండును వృష్టిమంతుఁ
డై నపర్జన్యుచందాన నధికమోద, కరుఁడు గద లోకమునకు నాకంటె నితఁడు.

క. ఈసర్వమహీభారం, బీసరణిం దాల్చుతనయు నీవయసునసే
నాసక్తితోడఁ గనుఁగొని, భాసురసురలోక మెట్లు పడయం గలనో. 37

క. యమశక్రతుల్యవిక్రముఁ, డమరగురుసమానబుద్ధి యవనీతులిత
క్షముఁడు నగోపమధైర్యుఁడు, కమనీయగుణోత్తరుండుగద నాకంటెన్. 38

వ. అని విచారించి. 39

—దశరథుండు శ్రీరాముని యువరాజుగాఁ జేయం దలంపుఁ గొనుట.—

క. సతతము సముదితగుణుఁ డగు, సుతునిం గని రాజమౌళి సువిహితమతి యై
హితకార్యవిశారదబుధ, యుతుఁ డై మదిఁ దలఁచె నతని యువరాజుగఁ గాన్.

వ. మఱియు మేధావి యగుదశరథుండు దివియందుఁ బొడమినగ్రహనక్షత్రాది వైకృతంబును నంతరిక్షంబునం బొడమినమహోత్పాతపరివేషసంధ్యాదిగ్దాహాదికంబును బుడమియందుం బొడమినభూకంపశిలాపాతవృక్షరక్తస్రవణాదికంబును మనుష్యాదిజాతివలన విజాతీయపశుపక్షిమృగాది సముత్పత్తియు నేతాదృశత్రివిధోత్పాత సంభూతదారుణభయంబును నిజశరీరంబునందు నూఁదినముదిమియును బరామర్శించి సచివులకుం జెప్పి సంపూర్ణచంద్రవదనుండును సకలసద్గుణసదనుండును సౌందర్యవిత్రాసితమదనుండును నిజకరోల్లసితచండకోదండవిముక్తకాండఖండితపరమహీపాలశిరోలంకృతకదనుండు నగుకుమారమదనునకుం గలప్రియత్వంబును దనకు శోకాపనోదకారణం బైనదాని నిరూపించి. 41

క. తనకును ధాత్రీప్రజలకు, ఘనభద్రముకొఱకుఁ బ్రాప్తకాలప్రియభ
క్తినయంబులచే నృపకుల, వనజవనార్కుండు త్వరితవంతుం డగుచున్. 42

వ. ఒక్కనాఁడు సభామందిరంబునకుం జనుదెంచి. 43

క. నానాపురవాస్తవ్యుల, నానాజానపదపరుల నానానృపులన్
నానాప్రధానులను మఱి, నానాహితమతులఁ దత్క్షణమె రావించెన్. 44

క. జనకమహీశునిఁ గేకయ, జనవల్లభు నీప్రియంబుఁ జతురత నవల
న్వినియెదరుగాక యని య, య్యనఘులఁ బిలిపింపఁ డయ్యె నతిశయయుక్తిన్.

క. తక్కినసకలమహీశుల, నక్కజముగ సభకుఁ బిలువ నంపించి ముదం
బెక్కుడు గాఁగ మహీపతి, గ్రక్కున సామంతమంత్రిగణయుతుఁ డగుచున్.

క. నానాభరణాలంకృతుఁ, డై నీరజభవుఁడు ప్రజల నట్టులు దనచే
మానితు లైననృపాలుర, మానుగఁ గని సంతసిల్లి మహిమ దలిర్పన్. 47

క. ఘనరత్నఖచితసింహా, సనమునఁ గూర్చుండె రాజసము మెఱయఁగఁ ద
క్కిననృపు లుచితాసనముల, ననువుగఁ గూర్చుండి రతని కభిముఖు లగుచున్.

వ. ఇవ్విధంబున వినయవిధేయులును లబ్ధమానులును సుఖోపవిష్టులు నగుసమస్తసభాసదులచేత నావృతుం డై యద్దశరథుండు బృందారకపరివృతుం డయిన సహస్రాక్షునిచందంబునం దనరి కొంతవడికి సభ్యుల నందఱఁ గలయ విలోకించి మనోహరంబును మధురంబును దుందుభిస్వనకల్పంబును రాజలక్ష

యుక్తంబును సరసంబును నిరుపమానంబును గంభీరంబును శ్రేయస్కరంబును
నానందజనకంబును నర్థగరిష్ఠత్వంబుచేతఁ బ్రసిద్ధంబు నగు వచనంబు ప్రావృ
ట్కాలవారివాహ గర్జాసముజ్జృంభణగంభీరస్వనంబునఁ దత్సభాంతరకుడ్యం
బులం బ్రతిధ్వనులు సెలంగ నిట్లనియె. 49

దశరథుండు సుమంత్రాదులతో శ్రీరామునకుఁ బట్టాభిషేకంబుఁ జేయ నాలోచించుట.

క. మును మా పెద్దలు సుముఖు, లినకులదీపకులు దొల్లి యీరాజ్యంబుం
దనయునివలెఁ బాలించిన, యనువెల్లను మీకుఁ దెల్లమైనదియె కదా. 50

తే. అట్టియిక్ష్వాకుకులమునఁ బుట్టినట్టి
యేనును జగంబు నోపిన ట్లింతదనుక
జాగరూకత నిత్యంబు సత్యధర్మ
హితుఁడనై పూర్వకులభంగి నేలితిఁ గద. 51

తే. అట్టియేను మనుప్రముఖాఖిలాచ, లాధిపులచేత రక్షితం బగుసుఖార్హ
లోకమును రామచంద్రాభిషేకరూప, లాభయుతముగఁ జేయఁదలంచినాఁడ.

తే. అఖిలలోకహితార్థినై యవని నేలు
నట్టినాచేత నీగాత్ర మనవరతము
నాయతసితాతపత్రసచ్ఛాయయందు
సకలజనములు చూడంగ జరిత మయ్యె. 53

శా. అశ్రాంతం బజితారిదుర్వహము రాజాజస్సదాజుష్టముం
సుశ్రేయం బగుధర్మభారము నతిస్థూలంబుగా మోచి శౌ
ర్యశ్రీసంపద దీర్ఘకాలమున శీర్ణం బైనయిమ్మేనికిన్
విశ్రాంతి న్మదిఁ గోరినాఁడ సుతు నుర్వీవల్లభుం జేసెదన్. 54

క. సురపతిసమవీర్యుఁడు పర, పురమర్దనుఁ డస్మదీయపుత్రాగ్రణి సుం
దరుఁ డగురాముఁడు నాతో, సరివచ్చుం గాదె సకలసద్గుణములచేన్. 55

క. కావున నేనిఁక బుధసం, భావిత మగుభూసురానుమతమున సుతునిం
భూవిభునిఁ జేసి పిమ్మట, వావిరిసుఖగోష్ఠి నుండువాఁడం జుండీ. 56

ఆ. పుష్యయుక్తుఁడైనపూర్ణచంద్రునిమాడ్కి, వఱలువాని ధర్మపరులలోన
నధికుఁడైనరాము నభినవయౌవరా, జ్యాభిషిక్తుఁ జేసి యలరువాఁడ. 57

తే. రమణ నెవ్వనిచే జగత్త్రయము నాథ, వత్తరం బయి యొప్పు నవ్వసుమతీసు
తాపతిఁ దలంప మీ కనురూపుఁడైన, విభుఁడు గాదె తదాజ్ఞచే వెలయరాదె.

క. ఈసర్వమహీభారం, బాసుతుపై నునిచి ధాత్రి నతులశ్రేయ
శ్శ్రీసంయుతఁ జేసి గత, క్లేశుఁడనై సుఖముఁ గాంతుఁ బ్రియ మలరారన్.

వ. మఱియు నీకార్యంబు మీ కనుకూలార్థం బయ్యె నేనియు నాచేత మిక్కిలి సు
మంత్రితం బయ్యె నేనియు మీ రందఱు నా కనుజ్ఞ నొసంగుండు భవదనుమ

తంబు వడయక కార్యంబునడవుట కేను సమర్థుండఁ గాను హితాహితవిచార సామర్థ్యంబునందు నీకంటె నధికుం డెవ్వం డన వలదు యీరామాభిషేక విషయాలోచనంబు నాకు మిక్కిలిఁ బ్రియం బైయున్న దైననంతకంటె వేఱొక్కటి హితంబు గలిగెనేని యోచింపుఁడు విచారంబుచేత నధికఫలం బైన మధ్యస్థాలోచనంబు స్వజనచింతావిలక్షణం బైయుండు నని పలికిన నతని విలోకించి సభామండపాగతజను లందఱు వృష్టిమేఘంబు నవలోకించి కేకారావంబులు సేయుశుక్లాపాంగంబులకరణి పరమానందరసపూరితహృదయులై దశరథుని బ్రశంసించి రప్పుడు హర్షసమీరితం బైనజనోద్ఘుష్టసుస్నిగ్ధసన్నాదంబు రాజమండపాభ్యంతరంబు నిండి చెలంగె నంత ధర్మార్థవిదుం డగుదశరథుని యభిప్రాయం బెఱింగి బ్రాహ్మణులును రాజులును పౌరజానపదులతో నాలోచించి నిశ్చయించి యైకమత్యంబు నొంది యమ్మహీపతి కి ట్లనిరి. 60

—జనంబంతయు దశరథునితోఁ దమయభిమతంబుఁ జెప్పుట.—

తే. అనఘ బహుకాల ముర్విపై మనుటకతనఁ, గరము వృద్ధుండ వైతివి కాన నీవు
ధార్మికుం డైనరాముని ధర్మయుక్తి, కడఁగి జగతికిఁ బట్టంబు గట్టుమయ్య.

తే. విపులకాంతి శత్రుంజయద్విపము నెక్కి
యాతపత్త్రావృతాస్యుఁ డై యరుగుదెంచు
నట్టిరాము మహాబాహు నమితసత్త్వు
నెలమి వీక్షింపఁ గోరెద మలఘుచరిత. 62

—జనులందఱు శ్రీరామునిగుణంబులఁ బ్రశంసించుట.—

వ. అని పలికిన విని దశరథుండు రామునిసర్వాతిశాయిత్వంబును దదభిషేకంబు సర్వజనసమ్మతం బగుటయు నెఱింగియు నెఱుంగనివాఁడపోలె స్వాభిప్రాయంబు మాటుపఱచి ప్రజాముఖంబువలన నెఱుంగువాఁడై వారల నవలోకించి మీరు మద్వచనశ్రవణానంతరంబున నించుక యైన విచారింపక రామునకుఁ బట్టాభిషేకంబుఁ గావింపు మని పలికితిరి దీన నాకు సంశయంబు వొడముచున్నది యేను ధర్మంబునఁ బృథివీచక్రంబు పాలించుచుండ యువరాజ్యపట్టభద్రుం డైనమత్పుత్త్రు వీక్షింప నపేక్ష యేల పొడమె నెఱింగింపుం డనిన వారమ్మహీపతిం జూచి దేవా యేమందఱము నీచేత మిక్కిలి పరిపాలితులమైతిమి నీయందు దోషగంధం బించుక యైన లేదు సత్యం బైనను రామునికళ్యాణగుణబాహుళ్యంబువలన వశీకృతచిత్తుల మైనమాచేత నిట్లు పలుకంబడియె నమ్మహాత్ముండు దేవకల్పుండును గుణవంతుండును ధీమంతుండు నన విశ్రుతిం గన్నవాఁ డతనియందు మంగళస్వభావంబులును నితరపురుషదుర్లభంబులు నగు సద్గుణంబు లనేకంబులు సన్నివిష్టంబులై యుండు శత్రువులకైనఁ బ్రీతిజనకం

బులును ననిష్టనివారణపూర్వకేష్టప్రాపకత్వంబునఁ బరమానందజనకంబు
నగుశౌర్యాదిగుణంబుల నెల్ల నెఱింగించెద మా రాముం డిక్ష్వాకువంశజులలో
నుత్తముండు నమానుషగుణంబులచేతఁ బ్రశస్తుండును సత్యపరాక్రముండును
సత్పురుషుండును లోకసమ్మతుండును సత్యధర్మపరాయణుండును ధర్మజ్ఞుండును
సత్యప్రతిజ్ఞుండును శీలవంతుండును ననసూయకుండును శాంతుండును సాంత్వ
వాదియుఁ బ్రియవచనశీలుండును గృతజ్ఞుండును విజితేంద్రియుండును మృదు
స్వభావుండును నతిసంకటంబులయం దైన నంగీకృతపరిత్యాగరహితుండును
భవ్యుండును దివ్యమంగళవిగ్రహుండును భూతంబులకుఁ బ్రియరూపసత్యవాది
యు బహుశ్రుతవృద్ధబ్రాహ్మణోపాసకుండును దేవాసురమనుష్యులలోన సర్వా
స్త్రంబులయందు విశారదుండును సమ్యగ్విద్యావ్రతస్నాతుండును సాంగవేద
విదుండును గాంధర్వశాస్త్రంబునందుఁ గృతపరిశ్రముండును గల్యాణాభిజనుం
డును సాధుసమ్మతుండును క్షోభహేతుసహస్రంబులయం దైన నక్షుభితాంతః
కరణుండును మహామతియు ధర్మార్థనిపుణులగుద్విజశ్రేష్ఠులచేతసుశిక్షితుండును
మహేష్వాసుండును వృద్ధసేవియు స్మితపూర్వాభిభాషియు నై యొప్పు నదియు
నుం గాక. 63

క. విలసితనృపధర్మము రాజ్యలక్ష్మితోఁ గూడ రామచంద్రునివలనం
గలిగె నతనిచే యశ ముజ్జ్వల తేజము కీర్తి చాల వర్ధిల్లె రహిన్. 64

చ. అతులమనీషచే నలబృహస్పతితో సరి సేయఁగాఁ దగుఁ
హితఘనవిక్రమంబున సురేంద్రునకుం బ్రతివాది యోర్పుచే
క్షితికి సముండు ధైర్యమున శీతగిరిప్రతిముండు సాధుస
మ్మతుఁడు ప్రజాసుఖత్వమునఁ బంకజవైరికి సాటి రాఁ దగున్. 65

తే. కరుణ గలవాఁడు గావునఁ గడఁగి పరుల
దుఃఖమునకును దానును దుఃఖితుఁ డగు
నొరులయుత్సవమునకు మే లోర్చువాఁడు
గానఁ దానును పరితుష్టిఁ గాంచు నధిప. 66

వ. మఱియు నెప్పు డేనియు సుమిత్రాపుత్రసేవితుం డై పరులతోడ రణంబునకుం
జని యందు వైరివధం బాపాదింపక మరలి పురప్రవేశంబుఁ జేయమి యెల్ల
వారికిఁ దెల్లంబు గదా యిట్లు పగతులం బరిమార్చి విజయలక్ష్మీవిరాజమానుం
డై మహోత్సవంబునం బొదలుచు రథవారణంబులలోన నిష్టం బైనదాని
నారోహించి మరలి పురప్రవేశంబుఁ గావించి పౌరుల నందఱ రావించి జన
కుండుఁ గుమారులం బోలెఁ బ్రసన్నుండై నిత్యంబును గుశలం బరయు
నింతియ కాక పుత్రమిత్రకళత్రాగ్నిహోత్రప్రేష్యశిష్యగణంబును యథో

చితవ్యాపారంబులం బ్రవర్తింతురు గదా యనియును గర్మసుదంశితులై
శిష్యులు నిత్యంబును శుశ్రూషఁ గావింతురు గదా యనియు నీదృశంబు
లగుకుశలప్రశ్నంబుల విప్రోత్తముల విచారించు నదియునుం గాక. 67

మత్తకోకిల. ఆర్యసమ్మతుఁ డుత్తమోత్తముఁ డంబుజారుణనేత్రుఁడుఁ
శౌర్యవీర్యపరాక్రమంబుల శార్ఙ్గికిం బ్రతివాది స
త్కార్యశీలి ధనుర్ధరుం డుపకారచిత్తుఁడు సంతతౌ
దార్యశాలి మహానుభావుఁ డతండు సుమ్మి మహీపతీ. 68

క. సరసుఁడు శ్రేయోవంతుం, డురువిక్రమశాలి యుత్తరోత్తరయుక్తిన్
గురునంతవక్త సతతము, విరుద్ధకథలందు నతఁడు విరతుఁడు ధాత్రిన్. 69

క. భూపాలశేఖరుఁ డరా, గోపహతేంద్రియుఁడు నరసురోరగలోక
వ్యాపారక్షముఁ డతనికి, భూపాలన మనఁగ నెంత పో చింతింపన్. 70

తే. పార్థివేశ్వర యతనికోపప్రసాద
ములు నిరర్థకములు గావు తలఁచి చూడఁ
గోప మెత్తిన గడెలోనఁ గూల్చు రిపునిఁ
గరుణ వొడమిన నంతలో ఘనునిఁ జేయు. 71

తే. దాంతములు సర్వభూప్రజాకాంతములు జ, నంబులకుఁ బ్రీతిసంజననంబులైన
ఘనగుణంబుల నతఁడు ప్రకాశమొందె, నంశువుల దీప్తుఁడగుసహస్రాంశుభంగి.

క. ఏవంవిధగుణనిధి ను, శ్రీవారాన్నిధిని ధర్మశేవధి నఖిలా
వావరసమానునిం బృథ్వీవనజాతాక్షి దనకు విభుఁ డని తలఁచెన్. 73

క. జనవర నీభాగ్యంబున, వినుతగుణుం డైనరామవిభుఁడు సుతుం డై
జనియించెఁ బుత్రగుణములు, గనియె న్మారీచుఁ డైన కాశ్యపుని క్రియన్. 74

వ. మఱియు దేవాసురగంధర్వోరగమహర్షులును నానానగరరాష్ట్రవాస్తవ్యజనంబు
లును బాహ్యాభ్యంతరజనంబులును బౌరజానపదజనంబులును విదితాత్ముం
డగు రామునకు బలాయురారోగ్యంబు నాశంసించు చున్నవారలు మఱియు
వృద్ధులును దరుణులు నగుస్త్రీలు సమాహిత లయి యశస్వి యగు
రామునియభ్యుదయవిషయంబునందు సర్వదేవతల నుద్దేశించి కాలత్రయం
బున నమస్కరించు చున్నవారు గావునఁ దదీయాయాచితంబు భవత్ప్రసా
దంబువలన సఫలం బగుం గాక యని పలికి వెండియు. 75

తే. రాము నిందీవరశ్యాము రాజకులల, లాము నఖిలారివంశవిరాము సుగుణ
ధాము నిఖిలావనీధురంధరునిఁ గాఁగఁ, గాంతుము కదయ్య కన్నులకఱవు దీఱ.

చ. అనఘు నుదారజుష్టు సుజనార్తిహరున్ మధువైరితుల్యుఁ గాం
చనగిరిధైర్యు శూరు రఘుచంద్రుని మాకు హితంబుగాఁగ లో

కనివహ ముత్సహింపఁగ జగద్భరణాభినివిష్టుఁగాఁగ నా
తని నభిషిక్తుఁ జేయుము ముదంబు హితంబు యశంబుఁ గల్గెడిన్. 77

క. అని యీగతి నుత్కంఠను, ననువారల ఫాలకీలితాంజలులం గై
కొని నరపతి గ్రమ్మఱ ని ట్లనియెఁ బ్రియముహితముఁదోఁపనతులమృదూక్తిన్.

క. జనహితముగోరుకు మత్ప్రియ, తనయుని బతిగాఁగ మీరు దలఁచినకతన
మనమునకు ముదము చేకురె, ననవరతము నత్ప్రభావ మతులం బయ్యెన్.

దశరథుండు వసిష్ఠాదులతో రామాభిషేకోచితసంభారంబు లొనఁగూర్పఁ దనుట.

వ. అని పలికి యుద్ధారారమణుండు వారి నందఱ నయ్యై తెఱంగుల సంభావించి వా రందఱు వినుచుండ వసిష్ఠవామదేవులను దక్కినబ్రాహ్మణశ్రేష్ఠులను విలోకించి యీచైత్రమాసంబు పుణ్యం బై శ్రీమంతం బై పుష్పితకాననం బై యొప్పు చున్నది గావున మత్కుమారశేఖరుం డగురాముని యౌవరాజ్యంబునం దభిషిక్తునిం జేయ వలయు సర్వసంభారంబు లొనగూర్పుం డని పలికినఁ గర్ణరసాయనంబు లగుదశరథునిపలుకుల కలరి సభాసదులు సాధువాక్యంబుల నభినందించిన సజ్జనఘోషంబు తుములం బై చెలంగెఁ బదంపడి యమ్మహానాదంబు శాంతిఁ బొందినయనంతరంబ నరేశ్వరుండు మునిలోకగ్రామణు లైన వసిష్ఠవామదేవుల నవలోకించి యి ట్లనియె. 80

క. తనయునియభిషేకార్థం, బనుపమగతి నెద్ది కర్మ మర్హము దానిం
బనివడి సపరిచ్ఛదముగ, ననుజ్ఞ యీ నర్హు లరు సుహోమునులారా. 81

క. అని విన్నవింప విని యమ్మునివర్యులు రాజవరునిముంగల ఘనఫా
లనిబద్ధాంజలిపుటు లయి, వినయముతో నున్నవారి వీక్షించి తగన్. 82

సీ. సర్వౌషధులును బూజాద్రవ్యములును గార్తస్వరముఖదివ్యరత్నములును
మధువును ఘృతమునుబృథుకంబులునులాజలును శ్వేతమాల్యంబులునునఖండి
తాంబరంబులు వేగయాయితం బొనరింపుఁ డదిగాక యరదంబు నాయుధములు
జతగూర్పుఁ డెలమితోఁజతురంగ మగు మనబలమును గూర్పుఁడు భద్రకరణిఁ

తే. జామరంబులు పాండురచ్ఛత్రమును న,సుగ్రశార్దూలచర్మంబు నగ్నివర్ణ
హేమకుంభశతంబును నెల్లియుదయ,వేళ గొనగూర్పుఁ డధిపాగ్నివేశ్మమందు.

వ. మఱియు మణిదండమండితమహోన్నతకాంచనధ్వజంబును హిరణ్యశృంగాలంకృతశృంగం బగుమహోక్షంబును శీఘ్రంబున నాయితంబు సేయింపుఁ డని పలికి వెండియు నిట్లనిరి. 84

క. అరసి సమస్తపురాంతర, పురవరణద్వారములను భూరిసుగంధో
త్కరచందనసుమమాలా, గరుధూపంబులును వేగ గైసేయుఁ డొగిన్. 85

వ. మఱియు దధిక్షీరసంస్కారవంతంబును గుణవంతంబును వ్యంజనోపేతంబును సరసపదార్థసంపన్నంబు నైనమృష్టాన్నంబు గావించి యెల్లి ప్రభాతకాలం

బున నపరిమితబ్రాహ్మణవరుల రావించి సత్కరించి యథేష్టంబుగా భోజనంబు సేయించి పుష్కలంబుగా దక్షిణ లొసంగుఁడు సూర్యోదయకాలంబున వేదపారగు లగువిప్రుల స్వస్తివాచనంబునకు నియమింపవలయు నానావిధ పరమాసనంబులు గల్పింపుఁడు పురంబునం దెల్లెడలఁ దోరణధ్వజంబు లెత్తుట కును రాజమార్గంబు లై సేయుటకును దగినవారి నియోగింపుఁ డదియునుం గాక తాళావచరు లగున ర్తకాదు లందఱును గణికలును జతుర్విధాలంకారం బులం గై సేసి ద్వితీయద్వారంబున నుండువారుగా సంఘటింపుఁడు మఱియు దేవాయతనచైత్యంబులందు దక్షిణాన్నమోదకహస్తు లై మాల్యప్రదాన యోగ్యులు వేర్వేఱ నుండునట్లు సంస్థాపింపుఁడు నిబద్ధదీర్ఘాసు లగుయోధులు సన్నద్ధు లై ధౌతాంబరంబులు ధరించి మహోదయం బగుమహారాజాంగణం బున నిండియుండువారుగా నియమింపవలయు నని యధికారులకు రామాభి షేకోపయోగికార్యంబు లన్నియు నాజ్ఞాపించి రాజశాసనంబున సర్వంబునుం గావించి హర్షప్రీతియుక్తు లై దశరథునకు సర్వంబు నుపకల్పితం బయ్యె నని యెఱింగించి రంత నమ్మహీపతి సుమంత్రు, నవలోకించి యి ట్లనియె. 86

సుమంత్రుఁడు దశరథునికడకు శ్రీరామునిఁ దోడి తెచ్చుట.

క. నయ మార నీవు చని సా,రయశోనయధర్మబుద్ధిరమ్యుం డగుమ
త్ప్రియపుత్త్రుఁ డైనరాముని, రయమునఁ దోడుకొని వేడ్క ర మ్మిచ్చటికిన్.

చ. అనిన మహాప్రసాద మని యాతఁడు నేలినవానియానతి
న్జని రథివర్యుఁ డై నరఘునాథుని హేమరథస్థుఁ జేసి నె
మ్మనమున నమ్ముదం బలరఁ బౌరులు వేడుకతోడఁ జూడఁ దో
డ్కొని చనుదెంచె భూవిభుని గొప్పహజారముఁ జేరి యచ్చటన్. 88

సీ. ఒకవంకఁ బ్రాచ్యు లత్యకలంకచిత్తు లై జయచిహ్నములు పెక్కు సన్నుతింప
నొకయోర దాక్షిణాత్యులు తటేఁగని తమదేశప్రవృత్తులఁ దెలియఁ జేయ
నొకదెసఁ బాశ్చాత్యు లొగిఁ దనుమనవుల కిదియె కాలం బని యెచ్చరింప
నొకక్రేవఁ దగ నుదీచ్యులు గరములు మోడ్చి కరములు గొనుమని కరము వేఁడ

తే. నన్యు లగుకాననమహీధరాంతవాసు, లై నమ్లేచ్ఛులు గొలువఁ దదంతరమున
దివిజపరివృతుఁ డై నవాసవునిభఁగి, నిండుకొలువుండి దశరథనృపవరుండు. 89

సీ. ఇనకులాంబుధిసోము నిందీవరశ్యాముఁ గమనీయగుణశీలు ఘనకపోలు
సురుచిరకీర్తిని సుకుమారమూర్తిని సద్గుణగేహు నాజానుబాహు
రమణీయవదనుని లావణ్యసదనుని నేత్రోత్సవప్రదు నిత్యవరదు
నధికతేజోలాభు నాదిత్యరాజాభు సౌవర్ణమణిభూషు సత్యభాషు

తే. విమతవిధ్వంసనోచితవీర్యయుతుని, భవ్యచారిత్రు నూతనదివ్యహేమ
రథగతుని నతజనమనోరథఫలదుని, రామచంద్రునిఁ గాంచె నారాజవరుఁడు.

క. కని తృప్తి నొందఁ డయ్యెను, మనమున ఘర్మాభితప్తమనుజులను ముదం
బునఁ బొదలఁ జేయు పర్జ, న్యుని క్రియ నలరారు నందనుని సుందరునిన్. 91

వ. మఱియు గంధర్వరాజప్రతిముఁ డగువాని విఖ్యాతపౌరుషుం డగువానిఁ జారుశోభాయుక్తసమానసత్త్వమహాదీర్ఘబాహుం డగువాని మహాసత్త్వుం డగువానిఁ దదనుగుణవిశేషసత్తమాంతరంగకుం డగువానిఁ జంద్రకాంతాననుం డగువాని నత్యంతప్రియదర్శనుం డగువాని రూపౌదార్యగుణంబులచేతఁ బురుషులదృష్టిచిత్తాపహారకుం డగువాని తనసమీపంబునకు వచ్చుచున్నవానిఁ బ్రతిక్షణదర్శనంబున నవనవప్రేమాస్పదుం డగువాని రామభద్రుని నిర్నిమేషదృష్టి నవలోకించి పరమానందభరితాంతఃకరణుం డై యుండె నప్పుడు. 92

క. అంత సుమంత్రుఁడు సీతా, కాంతుని యరదంబు దిగిచి కడువేడుక గు
ర్వంతికమున కరుగునతని, చెంతం జనె నొసలఁ గేలుసేర్చి ముదమునన్. 93

చ. జనకసుతావిభుండు నృపసత్తముఁ గన్గొను వేడ్కతో గిరీ
శనగసమానసవ్యఘనసౌధముమీఁదికి నెక్కి భక్తిచే
జనకుపదాంబుజంబులకు జాఁగిలి మ్రొక్కి తదంతికంబునం
దనుపమలీల నుండె ఘటితాంజలి యై వినయంబు దోఁపఁగన్. 94

వ. ఇవ్విధంబునం దనకు నమస్కరించి పార్శ్వభాగంబునం గొలిచి యున్నకుమారశేఖరు నవలోకించి బాహువుల నాకర్షించి కొండొకసేపు గాఢాలింగనంబుఁ గావించి పదంపడి దివ్యకాంచనమణిభూషితరుచిరపీఠంబునం గూర్చుండ నియోగించిన నాసీనుం డై విమలుం డగుసూర్యుం డుదయంబునందు సుమేరుశైలంబునుంబోలె స్వశరీరకాంతిచేత నయ్యాసనంబును భాసమానంబుఁ గావించె మఱియుఁ దత్సభామండపంబు వసిష్ఠదశరథాది బ్రహ్మర్షిరాజర్షులచేత భ్రాజమానం బయ్యును విశేషించి రామునిచేత విమలగ్రహనక్షత్రశోభిత శారదాకాశంబు సంపూర్ణచంద్రునిచేతంబోలె నుద్దీపితం బై యుండె నిట్లు సుఖోపవిష్టుం డైనప్రియకుమారు నవలోకించి యాదర్శతలసంస్థితుఁ డైన తన్ను విలోకించి యలరుమనుజునిమాడ్కి దశరథుండు సంతోషించి మందహాససుందరవదనారవిందుం డై కాశ్యపుండు పురందరునకుంబోలె కౌసల్యానందనున కిట్లనియె. 95

— దశరథుఁడు శ్రీరాముని ధరణీభారంబు వహింప నియోగించుట —

ఆ. రామభద్ర నీవు రమణతో సమాహాప, పత్ని యగు మదగ్రపత్నియందు
సదృశసుతుఁడ వగుచు జనియించితివి నాకు, సకలసద్గుణములసత్ప్రియుఁడుగఁ

తే. ధారుణీప్రజ లెల్ల నీచే రమింపఁ, బడిరి కావున నింక వైభవము మెఱయ
పుష్యయోగంబునం దెల్లి పుడమికెల్ల, నాథుఁడవు గమ్ము జానకీనాథ నీవు. 97

తే. ప్రకృతిచేతనె మిక్కిలి రామ నీవు
విమలగుణరాశి వైతివి వేఱె చెప్ప
నేటి కైనను గృప నొక్క హితము నీకుఁ
దెలియఁ జెప్పెద వినుము సందేహ ముడిగి 98

తే. విషయ మూఁది జితేంద్రియవృత్తి గలిగి
యంగనాదికకామజవ్యసనములను
వాక్పరుషతాదికోపజవ్యసనములను
విడువు మిది నీతివిదుఁ డైన విభునిగుణము. 99

తే. మఱియుఁ బ్రత్యక్షవృత్తిచే మంత్రివరుల
నింపు సొంపార నెపుడు రంజింపు మీవు
తత్ప్రముఖసర్వజనులఁ బ్రత్యక్షపదముఁ
జేర్పక పరోక్షవృత్తి రంజింపు వత్స 100

వ. మఱియుఁ గోష్ఠాగారాయుధాగారంబులతోఁ గూడఁ బ్రశస్తవస్తునిచయంబులు
సంపాదించి. 101

క. కర మనురక్తప్రకృతిత, ధరణిం బాలించు నెవఁ డతనిమిత్రు లొగిన్
బరమానందము నొందుదు, రరసుర లే కధిగతామృతామరులక్రియన్. 102

క. కావునఁ గుమారవర యీ, భావము భావంబునందు భద్రంబుగ సం
భావించి ప్రజల నందఱఁ, బ్రోవుము జగదేకరాజపూజ్యుఁడ వగుచున్. 103

క. అని పలుక నతనిపలుకులు, విని యచ్చట నున్నరామవిభునాప్తులు వే
చని కౌసల్యకుఁ జెప్పిరి, ఘనమతి రామాభిషేకకథ ముద మలరన్. 104

క. ప్రమదారత్నం బగున, య్యమ నానారత్నకాంచనాంబరధేనూ
త్తమమాల్యహారములు నెయ్యమెలర్పఁగఁ బ్రీతిఁ దత్ప్రియాఖ్యులకొసఁగెన్.

క. అంత ధరిత్రీతనయా, కాంతుఁడు జనకునకు మ్రొక్కి కాంచనరథ మ
త్యంతముదంబున నెక్కి నిజాంతఃపురమునకుఁ జనియె ననుచరయుతుఁ డై.

ఉ. పౌరులు మేదినీవిభుఁడు పల్కినవాక్యము లాలకించి యా
ధారుణినాథు వీడ్కొని ముదంబున నిండ్లకుఁ బోయి యందు సీ
తారమణీవిభుండు వసుధాధిపుఁ డయ్యెడు నంచు నెంచుచున్
సారమతి న్సురార్చనలు సల్పిరి భక్తినిబద్ధచిత్తు లై. 107

క. అట దశరథనృపరజనీ, విటుఁడు ప్రధానయుతుఁ డగుచు వెండియు హర్షో
త్కటమున మంత్రం బొనరిచి, పటుమతి నిశ్చయముఁ జేసి పదపడి పలికెన్.

క. ఎల్లి తగఁ బుష్యయోగం, బల్లన జలజాప్తగోత్రుఁ డగుజనకసుతా
వల్లభుని నిఖిలజగతీ, వల్లభునిం జేయువాఁడ వరమతులారా. 109

చ. అని యిటు లానతిచ్చి విభుఁ డాత్మగృహంబున కేగి సూతునిన్

వినమితగాత్రుఁ డాఁ బనిచి వెండియు రాముని దోడితెమ్ము నీ
వనిన మహాప్రసాద మని యాతఁడు రామునిదివ్యమందిరం
బునకు రయంబునం జనియె మోమున సంతస మంకురింపఁగన్. 110

సుమంత్రుఁడు వెండియు దశరథునికడకు రాముని దోడితెచ్చుట.

వ. ఇవ్విధంబునం జని ద్వారపాలకులచేతఁ దనరాక నెఱింగించి పుచ్చిన నా రాముండు
శంకాసమన్వితుం డగుచు నతని రయంబున రావించి యి ట్లనియె. 111

క. అనఘాత్మ నీదురాకకుఁ, బని యెయ్యది యనిన రాజు పదపడి మిముఁ గ
న్గొనఁ దోడ్తె మ్మన వచ్చితిఁ, బని గలిగిన వినఁ దగు న్నృపాలునివలనన్.

క. అన విని రాముఁడు గ్రమ్మఱ, జనకునిఁ గనువేడ్క మదిని సందడిపెట్ట
న్జనరాజభవనమునకుం, జనియె నతఁడు వెంట నడువ సత్వరుఁ డగుచున్.

క. వచ్చినతనయునిఁ గనుఁగొని, ముచ్చట పడి దశరథుండు మోమున మోదం
బచ్చుపడఁగ రుచిరాసన, మిచ్చి హితము దోఁపఁ బలికె మృదుమధురోక్తిన్.

ఉ. మించినవేడ్కతో జనులు మెచ్చఁగఁ బెక్కుదినంబు లుర్వి జీ
వించినకారణంబునఁ బ్రవృద్ధుఁడ నైతి ననారతంబు న
భ్యంచితభూరిదక్షిణల నన్నవదిష్టిశతంబు లుర్విఁ గా
వించితి సంతతం బనుభవించితి నీప్సితభోగభాగ్యముల్ 115

తే. అట్టిసకలార్థసిద్ధుండ నైననాకు, నిరుపమేష్టసుతుండ వై నీవు ప్రీతిఁ
బుట్టితివి గాన నాచేతఁ బుత్రవర్య, దత్త మగురాజ్యము భరింపఁదగుదువీవు.

వ. మఱియు నభీష్టంబు లగువిరసుఖంబులు నాచేత ననుభూతంబు లయ్యె యాగా
దీతపుత్రదత్తసుఖోపభోగంబులచేత దేవర్షిపితృవిప్రాత్మఋణంబులవలన విము
క్తుండ నైతి నింక భవదభిషేకంబుకంటె నొండు కార్యం బెద్దియుఁ గొఱంత
లేదు కావున నే నెద్ది గఱపిన దానిం గా దనక చేయవలయు నని పల్కి వెండి
యు ని ట్లనియె. 117

తే. అనఘ యిప్పుడు ధారుణీజనము లెల్ల
నిన్నుఁ బతిఁగా దలంచుచు నున్నవారు
గాన యువరాజపట్టంబు గట్టెదను భ
రింపుమా సర్వభూభార మింపు మెఱయ. 118

సీ. అనఘాత్మ ఘనదారుణాశుభంబులు పెక్కు కలలోన నిప్పుడు కానఁబడియెఁ
బటులనిర్ఘాతనిస్వనమహోల్కాతతు ల్పడసాగె మత్తారభౌమరాహు
రవిముఖదారుణగ్రహములచే నవష్టబ్ధ యయ్యె నటంచు సకలదైవ
చింతకు లిప్పుడు చెప్పిరి గావున నిట్టియుత్పాతము లుప్పుట్టు నెల్ల

ఆ. నవనిపతికిఁ జేటు నగుఁ గానిచో మితి, పెట్టరానివగవు పుట్టు నింక
నిట్టి దశలలోన నెద్ది బొందకమున్నె, ధారుణీభరంబుఁ దాల్పు పుత్ర. 119

వ. అదియునుం గాక. 120

క. అనఘాత్మ శరీరుల నె, మ్మనములు దలపోయ నిమిషభంగురములు గా
వునఁ దలఁచిన పని యప్పుడె, యనుకూలము చేయవలె సమంచితబుద్ధిన్. 121

వ. అట్లు గావున నాలస్యంబుఁ జేయుట కర్జంబు గాదు నేఁడు చంద్రుండు పునర్వసు నక్షత్రసహితుఁ డై యున్నవాఁ డెల్లి పుష్యయోగంబు నియతం బని దైవజ్ఞు లాదేశించిరి కావున నమ్మహనీయశుభలగ్నంబునందు సకలమహీరాజ్యంబున కభిషిక్తునిం జేసెద నేఁటిరాత్రి సీతాసమేతంబుగా దర్భప్రస్తరశాయి వగుచు నుపవసింపు మేతాదృశశుభకార్యంబుల కనేకవిఘ్నంబులు సంభవించు నట్లు గాకుండ నప్రమాదు లగుసుహృజ్జను లెల్లెడలం గాచికొని యుండువారు గా నియోగింపు మని పలికి యద్దశరథుండు దొల్లి కేకయరాజునకు రాజ్యం బుంకువఁ జేసి కైకేయిని బెండ్లి యైనవాఁడు గావునఁ దద్వృత్తాంతంబు మనంబున నిడికొని వెండియు. 122

క. భరతుండు గ్రమ్మఱఁ బురమున, కరుదేరక మున్నె రఘువరా నీవు మహీ
వరుఁడ వగు టొప్పు నని యే, నరయుదుఁ జిత్తంబునందు ననవరతంబున్. 123

దశరథుఁడు భరతునిగుఱించి శంకించుట.

వ. అని యిట్లు భరతునిసాధువృత్తంబు నెఱింగియు రామస్నేహంబువలన రాజ్యంబుకొఱకు నెట్లు తనచిత్తంబును శంకించె నట్లు భరతచిత్తంబును శంకించి పలికి సద్గుణయుక్తుం డైనభరతునం దిట్టిశంక యుక్తంబు గాదని పలుకునో యని యాలోచించి తత్పరిహారంబుకొఱకు మరల నిట్లనియె. 124

చ. అనఘుఁడు ధర్మశీలుఁడు దయాహృదయుండు జితేంద్రియుండు నై
తనరు నతండు సాధులపథంబు మనంబునఁ బట్టి నీయెడ
న్ఘనతరభక్తిగౌరవముఁ గల్గినవాఁ డగు నైన నేమి గా
మనుజులచిత్త మస్థిరము మాటికి నమ్మఁగరాదు తద్గతిన్. 125

తే. కుజనులమనంబె కాక యక్రూరజనుల
మనము చపలత్వ మొందునే యనఁగ వలదు
సత్యధర్మాభిరతు లైనజనులచిత్త
మైనఁ గృతశోభి యగు నిక్క మనఘచరిత. 126

వ. అని పలికి వీడుకొల్పినఁ దండ్రిచేత ననుజ్ఞాతుం డై రాముండు దచ్చరణంబులకుం బ్రణమిల్లి నిజనివాసంబునకుం జని యమ్మహోత్సవంబు నిజజనని కెఱింగించుతలంపునఁ బదంపడి తదీయమందిరంబునకుం జని యందు. 127

శ్రీరాముఁడు దశరథాభిప్రాయంబుఁ గౌసల్యకుఁ జెప్పుట.

క. రాముండు గనియెఁ బూజా, ధామంబున క్షౌమపటముఁ దాలిచి నియతిం
దామోదరుఁ దలఁచుచు ను,ద్దామశ్రీఁ గోరుచున్న తల్లిని బ్రీతిన్. 128

వ. మఱియు నంతకుమున్న చనుదెంచి యున్నసుమిత్రాసౌమిత్రి ధరిత్రీపుత్రీకలం గూడి లక్ష్మణునివలన రామాభిషేకవృత్తాంతంబు విన్న దగుట హర్షపుల కితసర్వాంగి యై కనుంగవ మూసి ప్రాణాయామంబునఁ బరమపురుషుండైన జనార్దనుని ధ్యానంబు సేయుచున్నతల్లి నవలోకించి తచ్చరణంబులకు నియ మంబున నభివందనంబుఁ గావించి యనిందిత యగున ద్దేవికిఁ బ్రియంబుగా మధురవాక్యంబున నిట్లనియె. 129

తే. అంబ రాజ్యపాలనకర్మమందుఁ దండ్రి
చేత నేఁడు నియుక్తుఁడ నైతి నేను
నెల్లి పుష్యయోగమున నహీనరాజ్య
పట్టబద్ధుఁ జేసెద నని పలికె విభుఁడు. 130

వ. మఱియు నీరాత్రి సీతాసమేతంబుగా నుపవాసం బుండు మని ఋత్విగుపా ధ్యాయసహితుం డై రాజేంద్రుండు నన్ను నియోగించెం గావున నెల్లి మత్ప ట్టాభిషేకంబునందు నాకును సీతకు నేయేమంగళకర్మంబు లాచరింపం దగు నవి యెల్లఁ జేయింపుం డని పలికినఁ జిరకాలాభికాంక్షితం బైనతత్ప్రియ వృత్తాంతంబు విని యానందబాష్పధారాపూరితలోచన యై యిట్లనియె. 131

తే. అనఘ రామ చిరంజీవివగుము నీదు, రిపులు హతు లైరి నీవు సుశ్రీయుతుండ వగుచు నాబంధుజనముల నలసుమిత్ర, బంధువులఁ బ్రోవు మానందపరులఁ జేసి.

తే. వత్స నీచేత మీతండ్రివరగుణముల, చేత నారాధితుం డయి చెలఁగెఁ గాన భవ్యనక్షత్రదినమందు భద్రమూర్తి, వై జనించితివి గద నాయందు నీవు.

తే. రామ యిబ్భంగి నిక్ష్వాకురాజ్యలక్ష్మి
యింపు సొంపార ని న్నాశ్రయించెఁ గాన
నచ్యుతునియందు నేఁ జేయునట్టివ్ర
తంబు నేఁటి కమోఘ మై తనరెఁ గాదె 134

క. అని యిట్లు జనని పలికిన, విని రాముఁడు సంతసిల్లి వినమితతనుఁ డై తనమ్రోల నున్నలక్ష్మణుఁ, గనుఁగొని యిట్లనియె హాసకలితాననుఁ డై. 135

తే. అనఘ నాయంతరాత్మ వై నట్టి నిన్ను, రమణతోఁ బొందె నిక్ష్వాకురాజ్యలక్ష్మి సంతతంబును ననుఁగూడి సంతసమున, నింపు సొంపారధాత్రిఁ బాలింపు మింక.

తే. అభిమతాఖిలభోగ్యపదార్థరాజ్య, ఫలములను బ్రీతి భుజియింపు మలఘుచరిత రాజ్యమునుజీవితంబును రమణ నెపుడు, మించిభవదర్థమాత్మఁగామించుచుందు.

వ. అని పలికి లక్ష్మణుమనంబుఁ గలపికొని తల్లికి నమస్కరించి సీత కనుజ్ఞ యొసంగి నిజనివాసంబునకుం జనియె నట్లు దశరథుండు వ్రతోపవాసాదికంబుఁ గావింపు మని రాముని నియోగించి పదంపడి వసిష్ఠు రావించి యి ట్లనియె.

దశరథుఁడు రామునిచే నుపవాసంబుఁ జేయింప వసిష్ఠుని నియోగించుట.

సీ. అనఘాత్మ నీవు రయంబునఁ జని రమాబలయశోరాజ్యలాభంబుకొఱకు
రాముని నేఁడు భార్యాయుతంబుగ నుపవాసంబుఁ జేయింపవలయు ననిన
నమ్మౌని యట్ల కా కని బ్రాహ్మణోచితం బైనరథం బెక్కి మానితముగ
రామునిమణిమందిరమునకుఁ జని మూఁడువాకిళ్లు దాఁటి పోవంగ నతని
తే. రాక ఫణిహారు లెఱిఁగింప రామవిభుఁడు, సత్వరంబున నమ్మునిసత్తమునకు
నెదురుగావచ్చి సంతోషమెసఁగ రథము, డించిపూజించినుతులుగావించె నపుడు.

వ. ఇట్లు భగవంతుఁడును మంత్రకోవిదుండు నగువసిష్ఠుండు రామునిచేత నవతారితుండును సత్కారసత్కృతుండు నై ప్రియార్హం బగురామభద్రు నవలోకించి ప్రసాదసుందరవదనారవిందుం డగుచు నమందానందంబున నిట్లనియె.

చ. నెనరున నీగురుండు గణించె రహి న్నహుషుండు వంశవ
ర్ధనుని యయాతినట్ల తగ రాజ్యపదస్థునిఁ జేయుఁ గాక నె
ల్లి నిఖిలరాజ్యభారమును బ్రీతి గ్రహించెద వీవు నేఁడు పా
వనగుణపత్నితోడ నుపవాస మొనర్పుము మంగళార్థ మై. 141

క. అని పలికి మునిప్రవరుఁడు, జనకజతోఁ గూడ రామచంద్రుని వేగం
బున నుపవాసముఁ జేయిం, చెను విధిపూర్వకముగాఁగ సిరి యుల్లసిలన్. 142

వ. ఇట్లు ధృతవ్రతుం గావించి రామునిచేత నర్చితుం డై యామంత్రణంబు వడసి తదీయదివ్యసదనంబు వెలువడి మరల రథారూఢుం డై రాజమార్గంబుఁ బట్టి చనియెఁ దదనంతరంబ. 143

తే. అవనిజాపతి ప్రియవాదు లగుసుహృజ్జ
నములతోఁ గూడ నంతఃపురమున కరిగె
నచట వారల కందఱ కాత్మనిలయ
ములకు విచ్చేయుఁ డిఁక నని సెల వొసంగె. 144

వ. అప్పుడు. 145

క. తగ హృష్టయువతిజనయుత, మగురామాలయము వికసితాంభోజము మ
త్తగరుత్మత్ప్రకరయుతం, బగుకాసారంబుభంగి నలరారె రహిన్. 146

వ. ఇత్తెఱంగున నవ్వసిష్ఠుండు రాజభవనప్రఖ్యం బగురామనివేశనంబువలన నిర్గమించి రాజమార్గంబు విలోకించె నది మఱియు రామాభిషేకదర్శనకుతూహలజనసమూహంబులచేత నభిసంవృతం బై తొలంగం ద్రోయరాక యుండె జనబృందోర్మిసంఘర్షహర్షసంజనితం బైనతదీయనిస్వనంబు సాగరస్వనంబు భంగిఁ జెలంగుచుండె నయోధ్యాపట్టణంబు సిక్తసంమృష్టరథంబును వనమాలియును సముచ్ఛ్రితగృహధ్వజంబును నై చూడ్కికి వేడ్కఁ జేయుచుండె నప్పట్టణంబునం గలస్త్రీబాలవృద్ధజనంబు లెల్ల రామాభిషేకం బనుశుభవార్త విని

ప్రజాలంకారభూతంబును సకలజనానందవర్ధనంబునగు తన్మహోత్సవంబుఁ గనుం గొనుతలంపున సూర్యోదయంబుఁ గోరుచుండిరి యిట్టి జనసంబాధం బగు రాజమార్గంబు నవలోకించుచు నజ్జనౌఘంబును విభజించుచున్నవాఁడు పోలె మందగమనంబునం జని చని సితాభ్రశిఖరప్రఖ్యం బగు రాజప్రాసాదం బారోహించి శక్రునిచేత బృహస్పతియునుం బోలె నద్దశరథునిచేతఁ బ్రత్యుద్గతుండును సమర్చితుండును గల్పితాననుండు నై యతనిచేత నామంత్రణంబు వడసి సభాసదులకుం జెప్పి నిజనివాసంబునకుం జనియె దశరథుండు నచ్చటి వారల నెల్ల విడుదులకుం బోవం బనిచి దృప్తకంఠీరవంబు గిరికందరంబునుం బోలె నగ్ర్యవేషప్రముదాజనాకులంబును మహేంద్రవేశ్మప్రతిమంబు నగు నిజాంతఃపురంబుఁ బ్రవేశించి చంద్రుండు తారాగణసంకులం బగు నభంబునుం బోలె నద్దివ్యభవనంబు వెలుంగం జేయుచుండె నంత నిక్కడ. 147

క. మునివరుఁడు సనినపిమ్మట, జనకసుతావల్లభుండు స్నాతుం డై స
న్మనమున నియతిన్ మధుసూ, దనుని నుపాసించె నాత్మదయితాయుతుఁ డై.

తే. శిరమునందు హవిష్పాత్ర నిరవుకొల్పి
మాధవునకుఁ బ్రియంబుగ మంత్రపూత
మగుఘృతంబును బ్రజ్వలితాగ్నియందు
హోమ మొనరించె నతులకల్పోక్తసరణి. 149

మ. చెలు వొప్పన్ రఘునాయకుం డలహవిశ్శేషంబుఁ బ్రాశించి కే
వలభక్తిన్ గృహదేవసద్మమున భాస్వన్న్యస్తదర్భాసన
స్థలిపై జానకిఁ గూడి శాశ్వతశుభాచార్యంబు వర్ధిల్ల దో
హలనిష్ఠన్ శయనించె మాధవగుణధ్యానంబు గావించుచున్. 150

వ. ఇట్లు సుఖనిద్రఁ జేసి ప్రభాతకాలంబున మేల్కని. 151

క. వందిజనంబులు మాగధు, లందంద యొనర్చు శ్రుతిసుఖావహ మగు వా
గ్బృందము విని రఘునాథుఁ డ, మందానందరసభరితమానసుఁ డగుచున్. 152

మ. విమలక్షౌమపటంబుఁ దాల్చి నియతిన్ వేగంబె సాధ్యాదికృ
త్యములం దీర్చి నితాంతభక్తియుతుఁ డై యంభోధిరాట్కన్యకా
రమణుం జిత్తములోఁ దలంచుచు నతుల్గావించి భూదేవతో
త్తములన్ మన్నన సేసె భావిశుభసంధానక్రియాపేక్షతన్. 153

వ. అంత. 154

క. ధరణీసురకృతపుణ్యా, హరవంబును భూరికాహళార్భటి మధురో
త్కరతూర్యధ్వానముఁ దత్పురము ప్రతిధ్వని సెలంగఁ బూర్ణం బయ్యెన్.

క. పురజనులు రామవిభుఁ డ, త్తఱి సీతాయుక్తుఁ డగుచుఁ దడయక వ్రతమున్
గురుభక్తి సల్పుటయు విని, కర మామోదించి రధికకౌతూహలు లై. 156

రామునిపట్టాభిషేకంబునకుఁ బురజనులు పట్టణ మలంకరించుట.

క. అంతటఁ బురమునఁ గలవా, రెంతయు రామాభిషేక మేర్పడ విని త
మ్యంతంబునఁ బట్టణ మా,ద్యంతము గయిసేయఁ దొడఁగి రామోదమునన్.

సీ. శీతాద్రిశిఖరోపమూతతదేవతాయతనంబులందు నంచితనగంబు
లందుఁ జైత్యములందు నట్టాలకములందు లలితశృంగాటకరథ్యలందు
శ్రీనుతకుటుంబసమృద్ధగేహములందు సౌవర్ణమయసర్వసభలయందు
వివిధపణ్యసమృద్ధవిపణాపణములం దతులితధ్వజము లాతతపతాక

తే. లలరె గాయకులును గణికలును నటులు
న ర్తకులుఁ బురి నందంద నయసహృదయ
కర్ణశర్మావహంబులు గాఁగఁ బాడి
రాడిరి తదుత్సవజనితహర్షు లగుచు. 158

వ. మఱియు రామాభిషేకార్థంబు ననుదెంచి యున్నజనంబులు రమ్యచత్వర
మందిరంబులం గూడికొని యన్యోన్యంబు రామాభిషేకకథాప్రసంగంబులు
సేయుచుండిరి ప్రతిగృహద్వారంబునందు గుమిగూడి క్రీడావినోదార్థంబు విహ
రించుచున్న పృథుకజనంబులును రామాభిషేకసంయుక్తంబు లగుశుభకథా
సల్లాపంబులు సేయు చుండిరి యుత్సవలక్ష్మీనృత్యరంగం బగురాజమార్గంబు
గృతపుష్పోపహారంబును ధూపగంధాధివాసితంబునుం గా నాగరులచేత
రచింపం బడియె రామాభిషేకమహోత్సవంబు పరిసమాప్తి నొందక మున్నె
రాత్రికాలంబు వచ్చు ననుశంకచేతఁ బ్రకాశకరణార్థంబు పురవీథులందు వృక్షా
కారదీపస్తంభంబులు నిల్పి రిట్లు పురంబు సర్వంబు నలంకరించి పురవాసులు
రామునియౌవరాజ్యాభిషేకంబుఁ గోరు చుండి రప్పుడు. 159

రాముఁడు రాజ్యాధిపతి యగుటకు జనులు సంతసిల్లుట.

ఉ. ప్రాకటభూరిచత్వరసభాభవనంబులయందు భూజనుల్
మూఁకలు గట్టి భూవరుఁడు బుద్ధిని వృద్ధు నెఱింగి తన్నున
స్తోకమనీష రాముని వసుంధరకుం బతిఁ జేయఁ బూనె నా
హా కడు సమ్మదం బని జనాధిపునిం గొనియాడి రెంతయున్. 160

తే. నేఁడు మనభాగ్యములు పండె నృపుని కరుణ
మనకు రక్షకుఁడును జగన్మాన్యుఁడుఁ గుల
దీపకుఁడు దృష్టలోకపరాపరుండు
నగు రఘూత్తముఁ డుర్వీంద్రుఁ డగుటఁ జేసి. 161

తే. పండితుఁడు ధర్మవంతుండు భ్రాతృవత్స
లుండు సుస్నిగ్ధుఁ డగురాఘవుండు మిగులఁ

దనదుతమ్ములయెడఁ జేర్పఁ దగినకరుణ
మనయెడలఁ జేర్చు నినుమడి ననుదినంబు 162

తే. ఎవ్వనిప్రసాదమున ధాత్రి కిపుడు సమభి
షిక్తుఁ డగురామవిభుని వీక్షింపఁ గలిగె
నట్టిపుణ్యుండు ధర్మాత్ముఁ డైనదశర
థాధిపుఁడు చిరజీవి యై యలరుఁగాక. 163

వ. అని యిట్లు వొగడుపౌరులప్రశంసావచనంబులును రామాభిషేకమహోత్సవవిలోకనకౌతుకాతిరేకంబున దిక్కులనుండి చనుదెంచి యున్నజానపదజనంబులు సేయుహర్షనాదంబులు పరస్పరవచనాకర్ణనంబు గాకుండ నప్పురంబు నిండి చెలంగె మఱియును. 164

తే. ఆమహాధ్వని పర్వములందు దీర్ణ, రంహుఁ డగుకంధివిభునివిరావమట్ల
యూవిసర్పత్ప్రజాసమూహంబుచేత, బంధురంబుగ నాలింపఁబడియె నపుడు.

చ. సనినద మై త్రివిష్టపముచాడ్పున భాసిలునప్పురంబు త
ద్ఘనతరదివ్యవైభవముఁ గాంచుటకై చనుదెంచి యున్నభూ
జననికరంబుచేతఁ గడుసంకుల మయ్యెఁ దిమింగిలాదిజం
తునివహసంకులం బయిన తోయధిరాడుదకంబుచాడ్పునన్. 165

పురాలంకారంబుఁ జూచి మంథర యాశ్చర్య పడుట.

వ. ఇప్పగిది నప్పురవరంబు సకలమహోత్సవంబుల కెల్ల నాటపట్టై యొప్పుచుండె నప్పూర్వదివసంబున దశరథుండు గొలువుకూటంబున నెల్లవారలు విన నెల్లి రామాభిషేకం బని ప్రకటంబుగాఁ బలికి యంతఃపురంబునకుం జనిన యనంతరంబ కైకేయీజ్ఞాతిదాసియు నవిజ్ఞాతదేశమాతాపితృకయు నైన మంథర యనునొక్కకుబ్జ స్వోదరపూరణార్థంబు కైకేయియొద్ద దాసీకృత్యంబులు సేయుచుండి యానమయంబున నది యదృచ్ఛచేతఁ జంద్రసంకాశం బైన ప్రాసాదం బారోహించి ప్రకీర్ణకుసుమోత్కరంబును వరార్హధ్వజపతాకాభిశోభితంబును బూరితనిమ్నోన్నతప్రదేశమార్గాలంకృతంబును గృతమంగళద్రవ్యకలితహస్తప్రశస్తధరణీదేవతాభినాదితంబును సుధాధవళితదేవగృహద్వారబంధురంబును వేదఘోషాభినాదితంబును సర్వవాదిత్రనిర్ఘోషసన్నాదితంబును సంప్రహృష్టజనాకీర్ణంబును సంతుష్టవరకరితురంగంబును సంప్రణర్దితగోవృషంబును బ్రహృష్టముదితపౌరజనసముచ్ఛ్రితధ్వజవిరాజితంబు నై యొప్పు నప్పురంబునవలోకించి పరమవిస్మయావిష్టచిత్తయై తత్తఱంబునఁ దన్మహోత్సవశ్రవణజనితపరమానందరోమాంచకంచుకితశరీర యగుదానిఁ బాండురక్షౌమపటశోభితకటి యగుదాని నభ్యాశప్రదేశసంచారిణి యగుదాని నొక్క

ధాత్రి నవలోకించి ధనపర యయ్యెరామమాత యుత్తమహర్ష కలిత యై యర్థు
లకు ధనం బొసంగు చున్నది జనం బంతయు నతిమాత్రప్రహర్షం బై కొనం
బడుచున్నది మహీపతి సంప్రహృష్టుండై యేమి సేయందలంచి యున్నవాఁ
డెఱింగింపు మని యడిగిన నది హర్షోపచితగాత్రి యై ముదంబున నిట్లనియె.

క. జనవిభుఁడు పుష్యయోగం, బున నెల్లి ప్రశాంతచిత్తుఁ బుణ్యచరితు ననన్.
త్యనఘుఁ జితేంద్రియు రాముని, మునుకొని యువరాజుఁ జేయఁ బూనె ముదము

—మంథర కైకకు దుర్బోధన సేయుట.—

వ. అని పలికిన. 169

శా. ఆపాపాత్మకురాలు మంథర ప్రశోకాపీడితస్వాంత యై
క్రోపోద్రేకమునన్ దహింపఁ బడి సంక్షోభంబునన్ దుస్సహా
వ్యాపారప్రతిబద్ధబుద్ధి యగుచున్ హర్మ్యంబు వే డిగ్గి శో
కాపాంగంబులు దీటుచుం బలికె వజ్రాభోక్తి నక్కైకకున్. 170

సీ. వనజాక్షి కడుమహాధ్యమున సమాగత మైనభయము నెఱుంగక పవ్వళించి
నిదుర వోయెద విట్లు. నిరుపమఘోరదుఃఖౌఘునిపీడిత నైతి నింక
నెయ్యది తెఱఁగు నాకేమి సేయుదు నంచుఁ బరితపింప వదేల భావమందు
సౌభాగ్య మది నాకుఁ జాల గల్దని వృథాయోగంబుచే విఱ్ఱవీఁగె దీవు

తే. నీదుసౌభాగ్య మంతయు నేఁటితోడ, నిండువేసవినాఁటిధునీప్రవాహ
మట్ల శోషించి చనె నిఁక నైన లెమ్ము, విభున కప్రియ వైతివి వేయు నేల.

వ. అని యిట్లు పాపదర్శినియును దుష్టస్వభావయు నగు కుబ్జ తన్నుం బదరి పలికిన
నప్పలుకుల కులికిపడి విషణ్ణవదనయై కైకేయి దనపురోభాగంబున దీనముఖి
యై దుఃఖించు చున్న మంథరం జూచి ప్రియసఖి యెవ్వనిచేతఁ బరాభవింపఁ
బడితి వెఱిఁగింపు మనవుడు మధురాయమానం బగు కైకేయీవాక్యంబు
విని క్రోధసంరక్తలోచన యై మనోవ్యథాకరంబును రామునియందు విరోధ
జనకంబు నగుపరుషవాక్యంబున నిట్లనియె. 172

క. పతి కౌసల్యకు వశుఁడై, యతివా త్వన్నాశహేతు వగువై దేహీ
పతిని యువరాజ్యమునకుం, బతిఁ జేయఁ దలంచె నీదు భ్రతు కేటికిఁకన్. 173

క. ఈవృత్తాంతము విని మది, తా వహ్నిం గాల్పఁ బడినదాని క్రియన్ దుః
ఖావిలమానస నై యిట, కే వచ్చితి వేగ నీకు హిత మొనరింపన్. 174

తే. దేవి నీదుఃఖమున నాకుఁ దీర్పరాని
దుఃఖ మొదవును నీవు సంతోష మంద
నాకు మితి వెట్టరాని యానంద మొదవు
నిందులకు మది సందియ మొందవలదు. 175

క. ధారుణి రాజకులంబున, నారయ జన్మించి దశరథావనిపతికిన్

దార వయి రాజధర్మ, క్రూరత్వం బెఱుఁగ వేల కువలయనేత్రా. 176

క. పలుకులఁ దీపును ధర్మముఁ, గలిగి హృదయమందుఁ జాలఁ గలుషముఁ గ్రౌర్యం బలవడఁగ నాఁటినుండియు, మెలఁగుచు నీమగఁడు దెలియుమిక వంచించెన్.

చ. జనపతి నిష్ఫలం బయినసాంత్వము నీపయిఁ జేర్చి యిప్పుడ త్యనుపమరాజ్యరూపకమహార్థముచేఁ బ్రథమద్వితీయనె మ్మన నుపకరించెఁ గానియెడ మానును జూచుటకై భవత్సుతుం బనిచి ధరాసుతాపతికిఁ బట్టముఁ గట్ట నుపక్రమించునే. 178

చ. అతివ వృథాప్రసాంత్వఁ డగునానరనాథకులోత్తముం డనా రతము సుఖోచితం బయినరాజ్యమునందు వసుంధరాత్మజా పతి నభిషిక్తుఁ జేయు నిఁక బాంధవ సంఘసమన్వితంబుగా క్షితిని సజీవ వయ్యు గతజీవిత వైతివి మాట లేటికిన్. 179

క. సుతునకు హితంబు నా కు, న్నతహర్షము నీకు మే లొనర్పుతలఁపు నీ మతిఁ గలిగిన నభిషేకముఁ, జతురత విఘ్నితముఁ జేయఁ జను నీ కబలా. 180

-:- రామునికిఁ బట్టాభిషేకంబు జరుగుట మంథరవలన విని కైకేయి సంతసిల్లుట. -:-

వ. బాలా దశరథుండు నీకుఁ బతివ్యపదేశంబుచేత శత్రుం డగు ఛన్నహృదయుం డగుసతండు ఋజుస్వభావ వైననీచేత సర్పశిశుపోషయిత్రిచేతంబోలె హితా చరణేచ్ఛచేతఁ బ్రతిచ్ఛన్నాంతర్విషం బైనసర్పంబువోలె నుత్సంగంబునందు బరిధృతుం డయ్యె నుపేక్షితంబు లైనశత్రుసర్పంబులచేతం బోలె బాపస్వభా వుండును వృథాసాంత్వుండు నగునద్దశరథునిచేత నిత్యసుఖోచిత వైన నీవు సపత్నీపుత్రాభిషేకరూపాపకారంబునఁ బుత్రమిత్రబంధుసహితముగా హత వైతి వింకనైన వివేకంబు గలిగి తత్కాలోచితోపాయ విచారకుశలవు గావున శీఘ్రంబునరామాభిషేకంబునకు విఘ్నంబుఁ గావించి భరతుని నిన్నును నన్ను నుం బ్రోవు మని పలికిన విని యక్కేకయరాజపుత్రి రామాభిషేకకథాశ్రవణ సంజాతపరమానందరసపూరితహృదయ యై చంద్రరేఖాలంకృత యైనశరద్ర జనియునుం బోలె నభిరామదర్శన యై యొప్పుచు రయంబున లేచి పర్యంకమ ధ్యంబునం గూర్చుండి వికసితమనోహరముఖారవింద యై కన్నుల నానంద బాష్పధారలు గ్రమ్ముదేర నరసమణిప్రభాపటలశోభితం బై యొక్క దివ్యాభర ణం బొసంగి యిట్లనియె. 181

క. చెలియా పరమప్రియ మగు, వల జనకసుతాధినాథునభిషేకము సొం పలరం జెప్పితి దీనికిఁ, గలప్రత్యుపకార మేమి గావింతు నిఁకన్. 182

-:- మంథర దుర్బోధనల విని సరిగా దనుచుఁ గైకేయి దానిని సమ్మతిపఱచుట. -:-

వ. అని యుత్సాహంబు దీపింపఁ బలికి వెండియు. 183

క. ఆరాముఁడు భరతుఁడు నా, కారయఁగా నొక్కరూప యటు గావున నా
భూరమణుఁ డతని రాజ్య, శ్రీరమణునిఁ జేయు టరయఁ బ్రియ మగుఁ గాదే.

వ. ప్రియార్థా నా కీరామాభిషేకకథనంబుకంటె నన్యం బొక్కటి యొక్కింతైన నభిమతం బగు శ్రేష్ఠవాక్యంబు నీచేతఁ బ్రమ్మెఱం జెప్పుట కశక్యంబై యుండు నట్లు సర్వప్రియంబులకంటె నుత్తమం బైన వేఱొక్కవస్తువు గల దేని యారసి చెప్పుము దాని నొసంగెద ననిన నమ్మంథర యమ్మాట గీటునం బుచ్చి యద్దేవి యొసంగిన యాభరణంబుఁ బాఱవైచి దండతాడితభుజంగంబు చందంబున సక్రోధ యై దుఃఖశోకంబులు పెనంగొన నిట్లనియె. 185

మంథర యతికఠినముగాఁ గైకేయికి దుర్బోధనలఁ జేయుట.

తే. దారుణాపత్సముద్రమధ్యస్థ వైతి, ననుచు నిను నీ వెఱుంగక యప్రమోద
విషయమం దిట్లు ముదముఁ గావించె దీవు, వనిత నీబాలిశత్వ మేమనఁగవచ్చు.

తే. రామభద్రసామ్రాజ్యసంప్రాప్తిరూప
మగుమహావ్యసనము నొంది వగవ కిట్లు
హర్ష మొందితి కాన దుఃఖార్తనగుచు
నిన్ను దూఱెద మది నవినీత వనుచు. 187

మ. మగువా నీకు సపత్నిపుత్త్రుఁ డగురామస్వామి మృత్యూపముం
డగుశత్త్రుండు దలంప వాని దగు రాజ్యప్రాప్తికిన్ నీ వయో
పగ సాధింపక మోద మందితి తిది యే ప్రజ్ఞావిశేషంబు మె
చ్చగునే తావకదుర్మతిత్వమున కే నాత్మన్ విషాదించెదన్. 188

తే. అకట రాజ్యసాధారణుం డైనభరతు
వలన రాముని కయ్యెడుభయముఁ దలఁచి
మిక్కిలి విషణ్ణ నైతి నిమ్మెయి ధరిత్రి
భీతి భీతున కొదవించు భీతుఁ డబల. 189

వ. మఱియు మహేష్వాసుం డగులక్ష్మణుండు మనోవాక్కాయకర్మంబులచేత రామునిం బొందియుండునట్ల శత్రుఘ్నుండును భరతునిం బొంది యుండు సన్నికృష్టం బైనపునర్వసుపుష్యనక్షత్రజననక్రమంబుచే నైనను భరతునకె రాజ్యప్రాప్తియగుఁ గనిష్ఠులైనలక్ష్మణశత్రుఘ్నులకు రాజ్యక్రమంబు వ్యవహితంబయ్యె లక్ష్మణశత్రుఘ్నులు వ్యవహితు లైనను బరతంత్రు లైనను రాజ్యవిషయంబునం దభిలాషంబు రామభరతులకుంబోలె వారలకుం గలిగియుండు నైనను మొదల రామునకుఁ బిదప భరతునకుఁ బదంపడి లక్ష్మణశత్రుఘ్నులకు రాజ్యక్రమంబు సన్నికృష్టంబై యుండు నట్లు గావునఁ బ్రథముం డగురాముండు ద్వితీయుం డగుభరతుని హింసించు గావున రామునివలన భయంబు భరతునకే కాక లక్ష్మణశత్రుఘ్నులకుం గలుగ నేర దిట్లు రాజ్యక్రమంబు సన్నిహితం బైనను రా

ముందు మొదట నేలుట కర్హుండై యుండ భరతున కెట్లు రాజ్యశంక గలుగున
ని యంటివేని వివేకశాలియు క్షత్త్రచారిత్త్రంబునందుఁ బ్రాజ్ఞుండును గాలోచిత
కర్తవ్యార్థకారియు నైన రామునివలన నయ్యేడు భావ్యనర్థకరణభయంబు
వలనఁ బూర్వోక్తవైశారద్యాదిరహితుం డైన భవత్పుత్త్రు నుద్దేశించి పరితపించు
చున్నదాన నని యిత్తెఱంగున భరతునకు రాజ్యసాధారణ్యం బుగ్గడించి
వెండియు గౌసల్యకుం గలసౌభాగ్యప్రసంగంబునఁ గైకకు నీర్ష్యోత్పాదనంబుఁ
జేయుతలంపున నిట్లనియె. 190

ఉ. ఎల్లి సమస్తబంధుజను లెంతయు మెచ్చఁగఁ బుష్యయోగమం
దల్లన ధారుణీసురకులాఢ్యులచే నభిషిక్తుఁ డై మహీ
వల్లభు లెల్ల మ్రొక్కు లిడ వారక గద్దియ నున్నజానకీ
వల్లభుఁ జూచి మోదమున వాలఁగ నీసవ తేమి నోఁచెనో. 191

తే. పగతు లెల్లను నిర్జింపఁ బడిరి కాన, నధికవిశ్రుతి సంప్రీతి నలరి యున్న
నీసపత్నికి దాసి వై నెవరు వుట్టఁ, బనులు సేయంగ వలసె నీ కనిశ మబల.

క. ఏ మెల్ల నిన్ను వీడ్కొని, రామజననిఁ గొలిచి యునికి ప్రాప్తించెఁ దగన్
రామునకు నీకుమారుం, డోమహిళా ప్రేష్యభావ మొందఁగ నలసెన్. 193

క. భరతునిగృహమున నీస్నుష, లరుదారఁగ నప్రహృష్టలై వర్తింపం
బరికించి రామయువతులు, గర మానందంబు నొంది కన్గొనవలసెన్. 194

వ. అని యిట్లు పాపవ్యవసాయంబునందుఁ జిత్తంబు తగులువడునట్లు బోధించు
పరిచారిక నవలోకించి రామునియందు సన్నివిష్టంబు లగుసద్గుణంబు లభివ
ర్ణింప నుపక్రమించి కైక యిట్లనియె. 195

కైక మంథరకు రామునిసద్గుణంబులఁ జెప్పుట.

మ. గురుదాంతుండు కృతజ్ఞుఁ డార్తిహరుఁ డక్రూరుండు ధర్మజ్ఞుఁడుం
గరుణోదారుఁడు సత్యవాది శుచియుం గాకుత్స్థవంశేంద్రుఁ డా
ధరణీజాపతి యాజి కగ్రసుతుఁ డై తాఁ బుట్టెఁ గావునన్ ధరం
బరిపాలింప నతండె యర్హుఁడు జగత్ప్రఖ్యాతనీతిం జెలీ. 196

క. అనుజుల భృత్యుల బంధుల, ననవరతముఁ దండ్రివోలె నారసి ప్రోచున్
మనరాముఁ డతనియభిషే, చనమునకు న్వగవఁ దగునె సకియా నీకున్. 197

క. అవనిసుతావిభుఁ డేలిన, యవల మహీచక్ర మెల్ల నస్మత్తనయుం
డువిదా పాలింపఁ గలం,డు విచారము దక్కి యూఱడుము నీ వింకన్. 198

క. ఎడఁబడక మీఁద భరతుఁడు, పుడమికి ఱేఁ డగుచు నుంట బుద్ధిఁ దలఁప కి
ప్పుడు రామాభ్యుదయమునకుఁ, బడఁతీ యిప్పగిది నడలుపడ నేటి కిటన్. 199

క. జనకతనయాకళత్త్రుం, డనిశము నిజజననికంటె నతిశయభక్తిన్
ననుఁ జేరి కొలుచుఁ గావున, మనభరతునికంటె నతఁడు మాన్యుఁడు నాకున్.

చ. అనవరతం బతండు తన యట్టులె తమ్ములఁ జూచుఁ గాన న
య్యనఘునియందుఁ జెందిన మహాప్రియ మంతయు మత్కుమారునం
దును దగఁ జెందినట్ల తలఁతు న్మృగువా మది కిప్డు దీనికై
మనమున నింతవట్టి పలుమా ఱదఁ గుందఁగనేల దీనతన్. 201

వ. అని యివ్విధంబునం గైక దనమనంబున రామునియందుం గలవాత్సల్యంబు తేటపడం బలికిన నక్కుబ్జ శోకశిఖిశిఖాదందహ్యమానస యై నిట్టూర్పువుచ్చి యొక్కింతసే పూర కుండి వెండియుఁ గైక కిట్లనియె. 202

ఆ. వినుము వ్యసనశోక వి స్తీర్ణ మగుదుఃఖ, వసధి మగ్న నైతి ననుచు నిన్ను
మది నెఱుంగలేవు మూర్ఖ్యంబువలన న,నర్థదర్శినివి గదా లతాంగి. 203

-ఽ మంథర కైకకు నానాప్రకారంబుల బోధించుట. ఽ-

వ. అని యిట్లు కైకయభిప్రాయం బనాలోచితం బని నిందించి రామరాజ్యానంత రంబునన్నైన భరతునకు రాజ్యంబు లేమి తెల్లంబుగా బోధించుతలంపున ని ట్లనియె. 204

సీ. ధరణీశ్వరులు రాజతంత్రంబులను జ్యేష్ఠసుతునందె ఘటియింతు రతిగుణాఢ్యు
లైనతక్కినవారియందుఁ జేర్పరు రాజునకుఁ గలసుతు లెల్ల నరపతిత్వ
మొందలే రబ్బంగి నొందినచోఁ జాల నయంబు వాటిల్లు నగ్రపుత్రుఁ
డగురాముఁ డేలిక యైనపిమ్మట వానితనయుండె భూపతిత్వము వహించు

తే. రాజవంశంబువలన వారక సుఖంబు
వలన నత్యంతనిర్భగ్నుఁ డగుచు నీదు
సుతుఁడు భరతుం డనాథుఁ డై సొంపు సెడి య
రణ్యమున కేగఁ గలఁ డిప్పురంబు విడిచి. 205

ఆ. కాంత నీదు మేలు ఘటియించుతలఁపున
హితముఁ గఱప వచ్చు టెఱుఁగ కిట్లు
సవతిభాగ్యమందు సంతసించెద వయో
యెంత చెనటి వైతి వే మొనర్తు. 206

తే. రాముఁ డధినాథుఁ డైన నీరాజ్యమునకు
హాని లేకుండ నీపుత్త్రు నన్య దేశ
మునకు నైన లోకాంతరమునకు నైనఁ
బనుచు నిక్కువ మీచంద మనుపమాంగి. 207

వ. దేవీ బాలుం డగుభరతుని మాతులగృహంబునకుం బుచ్చితి విది యవివేకంబు నేఁ డతండు సమీపంబున నుండె నేనియు మహీపతికి రామభరతాదుల యందు సమానసౌహార్దంబు సంఘటిల్లుఁ దృణగుల్మలతాదిస్థావరంబులయం దైనను నత్యంతసన్నిధానంబువలన నన్యోన్యసంశ్లేషరూపసుహృద్భావంబు

జనించుఁ బ్రాజ్ఞులైన రామభరతాదులయందు జనించుట కేమి యరిది యట్టి సన్నికర్షంబు నీచేత విఘటితం బయ్యె లక్ష్మణుండు రామునకుం బోలె శత్రుఘ్నుండు భరతునకు వశుండై యుండు సతతం బైన సమీపంబుననున్నఁ దనయస్నేహంబువలన భరతునియందు సౌహార్దంబు గలుగు నతండును బ్రస్థాపితుం డయ్యె వనోద్భూతతృణకాష్ఠజీవు లగువ్యాధాదులచేత ఛేత్తవ్యం బగుశాకవృక్షంబు కంటకప్రచురవేత్రతృణలతాదులచేత సన్నికర్షంబువలన ఛేదనరూపభయంబువలన నమోచితంబగునని వినఁబడుం గావున సన్నికర్షంబురక్షణకారణం బై యుండునది నీచేతఁ బరిహృతం బయ్యెనని విందుముగాదె యని పలికి వెండియుఁ గుబ్జ యిట్లనియె. 208

తే. రాఘవుఁడు లక్ష్మణునిఁ బ్రోచు లక్ష్మణుండు, ప్రోచు రాముని నశ్వినీపుత్రులట్ల
వారిసౌభ్రాత్ర మఖిలభువనమునందు, నధికవిశ్రుత మై యుండు నట్టు లగుట.

క. సౌమిత్రిపై రఘూత్తముఁ, డేమియుఁ బాపంబు సేయఁ డించుక యైనన్
లేమా మనభరతునిఁ బెనుఁ, బాముపగిదిఁ గినుకఁ బూని బాములఁ బెట్టున్.

వ. కావున భవత్కుమారుండు మాతులగృహంబుననుండి వనంబునకుం జనుం గాక భరతుండు ధర్మంబు దప్పక పిత్ర్యం బగురాజ్యంబుఁ బరిపాలించెనేని నాకుఁ బరమహితంబును నీకత్యంతహర్షంబును భవదీయజ్ఞాతుల కధికోదయంబును సంభవించు నదియునుంగాక. 211

తే. అతిసుఖోచితుఁ డగుభవత్సుతుఁడు రామ
చంద్రునకుఁ జూడఁ గేవల సహజశత్రుఁ
డతఁడు సతతసమృద్ధార్థుఁ డగుచు నుండ
నితఁడు నష్టార్థుఁ డై యెట్లు బ్రతుకుఁ దన్వి. 212

క. వనితా బలుసింగముచే, వనమున వెస నాక్రమింపఁ బడినకరివిధం
బున రామునిచేఁ బొదువఁ బడినభరతునిఁ బ్రోవు మతని డెందం బలరన్.

మ. రమణీ మున్ను విభుండు నీకు వశుఁ డై లాలించునాఁ డీవు గ
ర్వమునం జేసినయెగ్గు లన్నియును దాఁ బల్మాఱు చింతించి గి
న్క మదిన్ డాఁచిన నీసపత్ని యగునక్కౌసల్య రాముండు రా
జ్యము పాలించుచు నుండె నేనియు నినున్ సాధింపదే క్రమ్మఱన్. 214

తే. రామచంద్రుండు సకలసామ్రాజ్యమునకు
నాయకుం డయ్యె నేని నీనందనునకు
నీకు నీబంధుజనుల కస్తోకదైన్య
వృత్తి వాటిల్లు నిక్కువ మివ్విధంబు. 215

క. కావున భరతుని రాజ్య, శ్రీవిభునిఁ గఁ బగతుఁ డైన శ్రీరాము వర
ణ్యావాసునిఁ గాఁ దలఁవుము, భావంబున సుతుఁడు నీవు బ్రతుకఁ దలఁచినన్.

వ. అని బహుప్రకారంబుల నమ్మంథర తననేర్పుకొలంది వ్యాపాదంబునందుఁ జిత్తంబు తగులువడునట్లు బోధించిన నక్కైకేయి యెట్టకేలకు నీయకొని క్రోధానలజ్వలితవదన యై నిట్టూర్పు నిగిడించి క్రమ్మఱ నక్కుబ్జ కిట్లనియె. 217

చ. అనుపమబుద్ధి నీకఱపినట్టులె రాము నరణ్యభూమికిం
బనిపెద మత్కుమారునకుఁ బట్టముఁ గట్టు తెఱంగొనర్చెదన్
మనమున దీనికిం దగినమంచియుపాయముఁ జూచి చెప్పు మీ
వనిన మదిన్ ముదం బబర నప్పరిచారిక వల్కెఁ గ్రమ్మఱన్. 218

ఉ. ఓయెలనాగ నీదుతల పొప్పిద మయ్యె వసుంధరాసుతా
నాయకుఁ డుగ్రసత్త్వభయదాటవియందుఁ జరింప నీసుతుం
డాయతరాజ్యవైభవసమంచితుఁ డై తనరారు నట్టిసూ
పాయముఁ జెప్పెదన్ వినుమ పారసుధీరచనాధురీణ వై. 219

మంథర కైకకు రామవివాసన భరతాభిషేచనముల కుపాయం బెఱింగించుట.

వ. దేవీ నీచేత బహుప్రకారంబుల నుచ్యమానం బైనయాత్మప్రయోజనంబు నావలన వినం గోరితివి దీనికిం దగినయుపాయంబు నీ వెఱుంగక యడిగితివో యెఱింగి ప్రకటంబు గానీక మనంబున నిడుకొని యడిగితివో యెఱుంగరాదు నాచేతఁ బలుకంబడినదాని విన నభిలాషం బగునేని యెఱింగించెద దాని నాకర్ణించి యవ్వల విమర్శింపు మని పలికిన నమ్మంథరావాక్యంబు విని యక్కైకేయి స్వాస్తీర్ణం బైనశయనంబుననుండి యొక్కింత లేచి మంథర కిట్లనియె. 220

ఆ. ముదిత యేయుపాయమున మత్కుమారుండు
రాజ్య మధిగమించు రామభద్రుఁ
డడవి కిప్పు డరుగు నట్టియుపాయంబు
జెప్పు మీవు తడవు సేయ నేల. 221

క. అని పలికిన నమ్మంథర, ఘనతరరామాభిషేకకార్యవిఘాతం
బొనరించుచుఁ గైకేయిం, గనుఁగొని యిట్లనియె నురలఁ గడుహర్షమునన్.

వ. దేవీ తొల్లి దేవాసురసంగ్రామంబునఁ బురందరాదిబృందారకులు రాక్షసుల కోడి పోడిమిసెడి నీమగనిం దమకుఁ దోడుపడుమని ప్రార్థించిన నతండు నిన్నుం దనకు బాసటగాఁ గొని రాజర్షిసమేతుండై దక్షిణదిశకుం జని దండకారణ్యంబుఁ బ్రవేశించి యందు వైజయంతం బనుపురంబున కధివిభుం డైన తిమిధ్వజుం డగుశంబరుం డనుమహారాక్షసుని మహామాయునిం దాఁకి వీఁక శరాసారఘోరంబుగాఁ బోరి పోరి ప్రొద్దుగ్రుంకినఁ దదీయశూలాభిసంజాతక్షతవేదనాపనోదనార్థంబు నిదురించి యుండ నప్పు డప్పూర్వగీర్వాణులు నిశాసమయంబున సుప్తులైనవారి నందఱ నానావిధప్రహారణంబులం బ్రహరించిన

నక్కైదువులతాఁకున కోర్వక దశరథుండు మేల్కని నిజస్యందనంబు గడప
నిన్ను సారథిఁగా నియోగించుకొని రాక్షసులతోడ దారుణప్రకారంబున
రణంబుఁ జేసి రాక్షసప్రయుక్తశూలపట్టిసప్రాసాదిసాధనంబుల నొచ్చి నష్టచే
తనుం డైన నీ వప్పు డద్దశరథునిరణంబునకుఁ దొలంగించి దానవకృత్యంబులం
బడి నుడియకుండ రక్షించితి పదంపడి రాక్షసులు పై నెత్తివచ్చినఁ దత్తత్ప్ర
హరణంబులం బొలియకుండఁ గాచితి విట్లు ద్వివారంబులు నీచేత రక్షితుండై
యతండు మెచ్చి వరంబులు రెం డొసంగెద వేఁడు మనిన వలసినయపుడు గో
రెద నొసంగు మన నద్దశరథుం డట్లయ్యెడు నని నీయకొనియె నీవృత్తాంతంబు
తొల్లి యొక్కనాఁడు స్నేహబలంబున నాకుం జెప్పితి నేను నాఁటనుండి
మనంబున నిడుకొని తద్వినియోగసమయాన్వేషణంబు సేయుచుండఁ బెద్ద
కాలంబునకుఁ దగినసమయంబు దొరకొనియెఁ బదునాల్గువత్సరంబులు రా
మున కరణ్యవాసంబును భరతునకు రాజ్యాభిషేకంబునుంగా నివ్వరంబు లొ
సంగ వలయునని మగని బలాత్కరించి యడిగి రామాభిషేకసంభారంబులు
నివర్తింపు మట్లైన భరతుండు ప్రజాభిప్రాయసంప్రాప్తస్నేహుం డై సుస్థిరుం
డగు దానం జేసి నీకు వశులై సపత్నులెల్లఁ బనులు సేయుచుండ మాబోంట్ల
నెల్ల రక్షించుచు నీశ్వరివై యుండెద నని సౌభాగ్యంబునం దాశాకల్పనా
పూర్వకంబుగా రామవివాసంబునకుం దగినయుపాయం బెఱింగించి వెండియు
నిట్లనియె. 223

క. చెలువంబు దక్క బలుపడి, మలినపటముఁ గట్టి క్రోధమందిరమున సొ
మ్ములు దుల్చి నేలపైఁ గట్టలుకం బడియుండు మిపుడె యధిపుఁడు వచ్చున్.

క. వచ్చిన మగనిం గన్నులు, విచ్చి గనుంగొనక పూర్వవిధమునఁ బ్రేమ
న్మచ్చట లాడక తగ మన, సిచ్చి గలియ కేడ్చుచుండు మెంతయుఁ గినుకన్.

వ. అట్లైన భర్తృపరిత్యాగరూపానర్థంబు వాటిల్లు నని తలంచి తేని వినుము. 226

క. మానిని మగనికిఁ గూర్చిన, దానవు గావున నతండు త్వత్కృతమం దెం
తో నెనరు గలిగి ప్రజ్వలి, తానలమం దైనఁ జొచ్చు నది నిక్కముగన్. 227

తే. నెనరు గలవాఁడు గావున నీమగండు
నెలఁత నినుఁ గడదానిఁగాఁ దలఁచి దాను
నొక్కిఁ గోపింపఁ జాలఁడు యుష్మదర్థ
మాన సేయుట నసువుల నైన విడుచు. 228

క. పాటలగంధిరొ విను నీ, మాటకు జవదాఁట లేఁడు మానవపతి యి
ప్పాట భవదీప్సితార్థము, వాటముగాఁ జేకురుఁ ధ్రువం బది నీకున్. 229

వ. ఇట్లలుక వొడమినడెందంబుతో నీవు క్రోధాగారంబుఁ బ్రవేశించి శయ

నించి యున్నసమయంబున నీవిభుండు పరుదెంచి నీచిత్తంబు వడయుటకు బహు
రత్నసువర్ణభూషణాంబరమాల్యాదు లొసంగం జూచు మనోవిభ్రమకారణంబు
లైన యప్పదార్థంబులం దాదర సేయక తొల్లి దేవాసురసంగ్రామసమయం
బున సంప్రీతుండై యొసంగెద నన్నవరంబు లిచ్చునంతకుఁ గోపంబు డింపకుండు
మట్లైన నతండు మోహావిశేషంబున నవ్వరద్వయం బొసంగువాఁడై కోర్కికిం
దగినప్రయోజనంబు లెఱింగింపు మని యడుగు నప్పుడు నీవు భయంబు
విడిచి యమ్మహీవిభుని సత్యంబునందు సంస్థాపించి పదునాల్గువత్సరంబులు
రామునకు వనవాసంబును భరతునకు రాజ్యాభిషేకంబును గోరు మతం డివ్వ
రంబు లనుమానంబు దక్కి యొసంగు నంతట రాముండు వనంబునకుం జనిన
భరతుండు సామ్రాజ్యపదవిం గైకొని వశీకృతమూలబలుండై పగతులం బరి
మార్చి సంగృహీతమనుష్యుం డగుచు నిష్టజనంబులం గూడి మహీభార
ధౌరేయుండై యొప్పు నవ్వల నారాముండు చతుర్దశవత్సరంబులు వనవా
సంబు సల్పి గ్రమ్మఱం బురంబునకుం జనుదెంచె నేని భరతుని జయింప సామ
ర్థ్యంబు లేమిం జేసి యూరకుండు నంతట రాముండు రాముం డయ్యెడు భర
తుండు చతుర్దశవర్షవ్యతిరిక్తపురుషాయుఃకాలం బంతయు నేకచ్ఛత్రాధిపత్యం
బుగాఁ బుడమి నేలుం గావున నెల్లభంగుల సందియంబు దక్కి నిర్బంధంబున
దశరథుని స్వాధీనుం గావించుకొని రామాభిషేకంబునకు విఘ్నంబు సేయు
మిదియె భరతునకుఁ బ్రాప్తకాలం బని పలికిన నక్కుబ్జపలుకుల కలర యక్కై
కేయి యనుకూలార్థరూపంబునం బ్రతిబోధితయైన యయ్యర్థంబుం బరిగ్రహించి
సంతసించి యమార్గగతయై నకిశోరిచందంబున నవశయై మిక్కిలి విస్మయంబు
నొంది మంథర కిట్లనియె. 230

కైక మంథరను శ్లాఘించుట.

తే. బుద్ధినిశ్చయమందు నీవుడమిలోనఁ, గలుగు కుబ్జలలో నగ్రగణ్య వైతి
వింత హితమతి వనుచు నిన్నెఱుఁగ నైతి, నెంత శ్రేష్ఠాభిధాయినివే మృగాక్షి.

క. సతతము మదర్థములయం, దతులితముగఁ గూడి యుందు వటుగావున భూ
పతి పూనిన కార్యం బెఱిఁగితి నే నెఱుఁగంగ నైతిఁ గేవలజడతన్. 232

వ. ప్రియసఖి దారుణస్వభావలును వక్రరూపిణులును దుష్టావయవసంస్థానవిశేష
సంయుక్తలు నగు కుబ్జలు పెక్కండ్రు గలరు నీకు వారల సాటిసేయం దగదు
ప్రియదర్శన వగునీవు పద్మంబుకరణి వాతంబుచేత నమ్రవైతి వైన నేమి సహజ
సుందరం బయినపద్మంబు వాతంబుచేత నమ్రం బైన నెట్లనింద్యం బై యుండు
నట్లు సహజసౌందర్యశాలిని వగునీవు వాతోద్రేకంబువలన వక్రత్వంబు నొం
దియు ననింద్య వైతి వని పలికి వెండియు నిట్లనియె. 233

తే. స్కంధపర్యంతమును నొప్పు గలిగి యుభయ
పార్శ్వముల నొత్తికొని యున్న ప్రబలమయిన
యురముఁ గని సిగ్గువడి సునాభోదరంబు
శాతత వహించె ననఁ జాల సన్నమయ్యె. 234

క. పరిపూర్ణజఘనమును లస, దురుకుచములు విమలహిమకరోపమవక్త్రం
బరుదార నీకె కలిగెను, వరవర్ణిని యెంతరూపవతివే తలఁపన్. 235

చ. ఘనరవకింకిణీకలితకాంచియుతం బగునీనితంబముం
గనకనిషంగకాహళవికాసము లై నత్వదీయజంఘిక
లనువిచితభంగి దీర్ఘమయి శోభిలు నీదుపదద్వయంబు కాం
చనరుచిశోభితావయవసౌష్ఠవ మింత పొసంగునే చెలీ. 236

క. క్షౌమాంబరంబుఁ దాలిచి, కామిని నీవాయతోరుకాండంబులచే
నాముంగలఁ జను బిసభు, గ్భామపగిదిఁ జూడ్కి కింపు గావించె దిఁకన్. 237

క. ఘనమాయుఁ డైనశంబర, దనుజునియందుఁగల బహువిధస్ఫుటమాయ
ల్వనజాతనేత్రి నీయం, దనవరతము నొప్పు శతగుణాధికములు నై. 238

తే. సకియ యే నీస్థగుప్రదేశంబు దీర్ఘ, మగుచు రథఘోణమువలె నాయతత గలిగి
యలరు నచ్చోట రాజనీతులు మతులు వి,చిత్రతరయుక్తి శక్తులు జేరి నిలిచె.

వ. అని యిట్లు బహుప్రకారంబులఁ గుబ్జారూపంబు కురూపంబైనను సురూపంబుగాఁ గొనియాడి తదీయవాక్యంబులు లోకగర్హితంబులని యెఱుంగక కార్యసాధకంబు లని తలంచి హర్షోత్కర్షంబునఁ గైకేయి వెండియు నిట్లనియె. 240

చ. తలకొని మత్సుతుం డఖిలధారుణి నేలఁగఁ గల్గెనేని యో
నెలఁత మహోన్నతంబయిన నీస్థగునందు సుగంధిచందనం
బలఁది సువర్ణకంచుకము నర్మిలి నిచ్చెద నీమొగంబునం
దిలకము దిద్దెద న్విమలదివ్యవిభూషణపఙ్క్తి నిచ్చెదన్. 241

తే. పూర్ణచంద్రునిఁ గేరు నీముఖము నాదు, లోచనేందీవరములకు రుచులొసంగ
ధౌతకాంచనపరిధానధారిణివయి, నచ్చెర బలెం జరించెద వతివ నీవు. 242

తే. నీవు నా కెట్లు దాసివై నెసరు వుట్ట, సేవఁ జేసెద వారీతిఁ జెలియ నీకు
సకలకుబ్జలు విమలభూషణవిభూషి, తాంగులై సేవఁ గావింతు రనుదినంబు.

క. అని యిటు తనుఁ గొనియాడుచుఁ, దనబుద్ధికిఁ జిక్కి వేదితలగతశిక్షా
డ్వునఁ దల్పమ్ముపై శయనిం, చినకైకం గాంచి కుబ్జ చెచ్చెరఁ బలికెన్. 244

మంథరోపదేశంబునఁ గైకేయి క్రోధంబుఁ బూనుట.

చ. అతివ వృథాప్రసంగ మిపు డర్హమె శాత్రవుఁ డైనరాముఁ డా
తతసకలావనీభరముఁ దాల్చినపిమ్మట నీప్రయత్నముం

గతజలసేతుబంధనము కైవడి శూన్యనివాసదీపసం
గతి యగుఁ గాన నాపనుపుఁ గైకొని వేగమె సేయు మిత్తఱిన్. 245

ఆ. అనిన నట్లకాక యని కైక రయమునఁ, గుబ్జతోడఁ గూడి క్రోధగృహము
సొచ్చి మైలఁ గట్టి సొమ్ము లుర్వర వైచి, ధర వసించి మరల దాని కనియె.

చ. క్షితితనయావిభుండు వనసీమకుఁ బోవుచునుండ మత్సుతుం
డతులితపూజ్యరాజ్యవిభుఁ డయ్యె నటం చలకేకయావనీ
పతి కెఱిఁగింపు కానియెడఁ బ్రాణసఖి మది నుక్కు డక్కి నా
మృతి నెఱిఁగింపుమా దశరథేశున కాతని యుల్ల ముబ్బఁగన్. 247

వ. అని యి ట్లతిక్రూరంబుగాఁ బలికిన నక్కుబ్జ తనతలం పీడేఱె నని మనంబున నుబ్బుచు రాముండు రాజ్యస్థుండైన నీకుఁ జేటు వాటిల్లుం గావున నెల్లభంగుల నతండు వనంబునకుం జను నంతకు నిమ్మార్గంబు విడువ కుండవలయు నని యక్కైకకు నొత్తి చెప్పిన నద్దేవి మహాక్రూరంబు లగుతదీయవచశ్శిలీముఖంబుల ముహుర్ముహుస్స్ఖలితాంతరంగ యగుచు హస్తంబు లురంబున నిడికొని యమ్మంథరమతంబునకు బహువారంబులు కైవారంబులు సేయుచు సీతావల్లభున కరణ్యవాసం బొండె నాకు జీవితాంతం బొండె నందాఁక నీయలుక డింపక యుండు దాన నదియునుంగాక నిక్కార్యం బొడఁబడు నందాఁక భోజనమజ్జనపానశయనాదు లుడిగి స్రక్చందనాదిపదార్థంబులం దాస మాని దివ్యాంబరాభరణాదులం గైసేయ కుండెద నని నిష్ఠురంబుగాఁ బ్రతిజ్ఞఁ జేసి సర్వాభరణంబులు పుడమిం బడవైచి పుణ్యాంతంబునందు దివంబున నుండి నేలం బడిన కిన్నరాంగన తెఱంగున ననాస్తరణసంవృతమేదినిపయిం బడి యుండె నప్పు డప్పడంతి యుద్దీర్ణసంరంభతమోవృతముఖియును విముక్తముక్తామాల్యవిభూషణయునై యస్తమితతారకంబై తమశ్ఛన్నంబైన నభంబు ననుకరించె నప్పు డక్కుబ్జ మణికాంచనవిచిత్రంబు లైన తదీయ దివ్యాభరణంబులు కీలుడిపి యెల్లకడలం జల్లె నవి నక్షత్రంబులు నభంబునుం బోలె నచ్చటి వసుంధరను బ్రకాశింపం జేసె నిట్లేకవేణియును విముక్తభూషణాంబరయు నై కేకయరాజపుత్రి విపరీతార్థబోధిత యై యొంటి నేలం బడి నాగాంగనభంగి నూర్పులు పుచ్చుచు మంథరోపదిష్టకార్యంబు యుక్తం బని నిశ్చయించి మనచేత నాలోచితం బైన సర్వంబు సమీచీనం బని మెల్లన మంథరకుం జెప్పుచు నిజోద్యోగం బగునో కాదో యని నిశ్చయాభావంబువలన దీనయై సారెసారెకు నాత్మసుఖావహం బైన తన్నిశ్చయోపాయం బొక్కముహూర్తంబు చింతించి నిశ్చితార్థయై భ్రుకుటిబంధోదీర్ణవదనయై యుండె నప్పు డక్కుబ్జ కైకేయీకృతకార్యనిశ్చయం బెఱింగి రససాధనాదిసిద్ధి నొందినదాని తెఱంగునఁ బరమప్రీత యయ్యె నంత. 248

దశరథుఁడు కైకేయీగృహంబునకు వచ్చుట.

చ. ఇనకులవార్ధిశీతకరుఁ డెల్లి జనుల్వన రాఘవాభిషే
చన మని తెల్పి యవ్వలను సభ్యుల వీడ్కొని తత్ప్రియప్రయో
జనముఁ బ్రియార్హ యైనగుణశాలికిఁ గైకకుఁ దెల్పువేడ్కఁ జ
య్యనఁ జనియెం దదీయవిపులాయతసంబున కాతఁ డున్నతిన్. 249

వ. అది మఱియును. 250

సీ. క్రౌంచమరాళసారసనాదయుక్తంబు శుకపికశారికాశోభితంబు
చంపకాశోకరసాలప్రసవగంధమిళితలతాగృహావిలసితంబు
తపనీయరౌప్యవితర్దికాలంకృతరమ్యనిశాంతవిరాజమాన
మమృతోపమానభక్ష్యాన్నపానాదికసరసపదార్థోపసంభృతంబు
తే. నిత్యపుష్పఫలోపేతనిఖిలతరువి
కాసితోద్యానసహితంబు కనకరత్న
భూషణవిభూషితంబు నై పొసఁగ సింద్ర
కాంతసదనంబుక్రియ మనఃకాంత మగుచు. 251

క. వాపీకూపంబులచే, నాపాండురదాంతరాజతాసనములచే
నేపారెడు కుబ్జలచే, దీపించెడుదాని రుచులఁ దేలెడుదానిన్. 252

క. కైకేయిగృహముఁ గనుఁగొని, ప్రాకటముగ రాహుయుక్తపాండుఘనచ్ఛ
న్నాకాశముఁ జేరెడు దోషాకరుగతి నమ్మహాత్మ సదనముఁ జేరెన్. 253

వ. ఇట్లు ప్రవేశించి. 254

ఆ. కామబలయుతుండు గావున సురతసుఖంబుఁ గోరి తృష్ణ గదుర శయ్య
కడకుఁ బోయి యందుఁ గైకేయిఁ గానక, మనుజవిభుఁడు తనదుమానసమున.

దశరథుఁడు కైకేయిఁ గానక పరితపించుట.

సీ. రమణి నిత్యము మదాగమనవేళ యెఱింగి మాల్యచందనచేలమండనములఁ
గయిసేసి మోహనాకారయై నారాక కెదురు చూచుచునుండు నిప్పు డేల
తొల్లింటిచందానఁ బొయ్యలి చూపట్ట దని విషాదము నొంది యచట నున్న
ప్రతిహారిఁ గనుఁగొని భామిని యెక్కడఁ జెప్పు మీ వన నది చేతు లళిక
తే. భాగమునఁ జేర్చి దేవరవారిదేవి, యలుక వొడమినడెందాన నల్లక్రోధ
సదనమున నొంటిఁ గఠినభూశయ్యమీఁద, దీనయయిపడియున్నది దేవయనిన.

వ. విని యదర్శనమాత్రంబున మొదల సంప్రాప్తవిషాదుం డై యున్నయన్నర
పతి క్రోధాగారప్రవేశశ్రవణంబువలన ద్విగుణీకృతవిషాదుం డై లులితవ్యాకు
లేంద్రియుం డగుచు మెల్లనఁ గ్రోధాగారంబులోనికిం జని యందు వినిష్కృత్త
యై నలతికపగిదిఁ బుణ్యక్షయంబువలన స్వర్గంబున నుండి పుడమిం ద్రెళ్లిన

దేవతవిధంబున ధరణికిం జనుదెంచినవేల్పువెలయాలిచందంబునఁ బరమోహనార్థంబు ప్రయోగింపం బడినమాయకరణిఁ బరిమ్లాన యైనపుష్పమాలికకైవడి వాగురాదికంబులచేత నిబద్ధ యైనహరిణిపోలిక వేఁటకానిచేత వనాంతరంబున విషదిగ్ధబాణంబున నభిహత యైనకరిణిభంగి నసంవృతమేదినిపయిం బడియున్నదాని నతథోచిత యగుదానిఁ బ్రాణంబులకంటె గరీయసి యగుదాని రామాభిషేకవిఘాతానుకూలసంకల్ప యగుదానిఁ దరుణి యగుదానిఁ గైకేయి నవలోకించి యపాపుండును వృద్ధుండు నగుదశరథుండు పరమదుఃఖితుండై డాయం జని యరణ్యమధ్యంబున మహాగజంబు పూర్వోక్తవిశేషణయుక్త యైనకరిణిం బోలె స్నేహంబున నద్దేవిం బరామర్శించి కరంబులచేతఁ బరిమార్జనంబుఁ గావించి మదనబాణబాధితుండు గావున మిక్కిలి సంత్రస్తచేతనుం డై యిట్లనియె. 257

దశరథుండు కైకేయిని నానాప్రకారంబుల ననునయించుట.

ఉ. ఎవ్వనిచేత భంగపడితే మృదుకోకిలవాణి నీమనం
బెవ్వఁడు నొవ్వఁజేసె సొబ గేటికిఁ దప్పె మనోహరాంగి నీ
కివ్విధి నాపయిం గినుక యేల జనించినదో యెఱుంగ నా
కవ్విధ మంత వే దెలుపుమా కమలాయతచారులోచనా. 258

ఉ. ముద్దులగుమ్మ నాదుమునిముక్కున నూపిరి గల్గియుండ నీ
విద్దురవస్థ నొంది తపియించుచు ధాత్రి వసింప నేల నీ
ముద్దుమొగంబు పాంసుకణపూరిత మై యిటు లుండఁ గాంచి నా
కెద్దిసుఖత్వ మేటిబ్రతు కేగతిఁ దాళుదు నింకఁ జెప్పుమా. 259

క. రాకేందువదన భూతము, సోఁకెనొ శారీరరుజలఁ జొక్కితొ దానిఁ
వాకొని చెప్పుము వేగమె, చేకొని దివ్యౌషధంబు సేయింతు నొగిన్. 260

మ. వనజాక్షీ యటు గాకయున్నఁ బరుఁ డెవ్వాఁడైన నీకప్రియం
బొనరింపంగఁ దలంచెనే మఱియుఁ గోపోద్వృత్తి నెవ్వాని కై
నను నీ వప్రియముం ఘటింప మదిలోనం బూనితే తెల్పు మె
వ్వని శాసింపుదు నెవ్వనిఁ సుఖునిగాఁ బాలింతు నే నియ్యెడన్. 261

ఉ. మానిని యిట్టులుండఁ జలమా భవదిష్టముఁ దెల్పు మెత్తెఱం
గేని యవధ్యు నైన వధియించెద వధ్యుని నైనఁ గాచెదం
బూని దరిద్రు నైన ధనపూర్ణునిఁ జేసెద విత్తవత్తముం
డైన దరిద్రుఁ డై వగచున ట్లొనరించెద సిద్ధ మింతయున్. 262

క. జలరుహపత్రేక్షణ నా, బలమును నాధనము నాదుపత్నులు నామి
త్రులు నేను నాకుఁ గలబం, ధులు నీయాజ్ఞం జరింపుదుము గాదె రహిన్. 263

ఆ. బిసరుహాక్షి నీయభిప్రాయ మింతైనఁ, గాదనంగ రాదు గాన నాదు

జీవితానిలంబుచే నైన నొకటెద్దిఁ, గలిగె నేని దానిఁ దెలియఁ జెపుమ. 264

తే. రమణి నీమీఁదఁ గల యనురాగబలము
నెఱిఁగియును నది శంకించు టిది యుచితమె
జలజనేత్ర మత్సుకృతంబు సాక్షిగాఁగఁ
జెలఁగి నీకోర్కెఁ దీర్చెదఁ జెప్పు మిపుడు. 265

మ. జలజాక్షీ సకలాబ్ధిముద్రితధరాచక్రంబు నాయాజ్ఞచే
మెలఁగు న్వంగకళింగమత్స్యకురుకాశ్మీరాదిదేశాధినా
థులు నాకు న్వశులై చరింతు రెద నెంతో భీతి నచ్చోటులం
గల వస్తుప్రకరంబు లెవ్వియయినం గామించినం దెల్పవే. 266

వ. దేవి నాయందుం గల సామర్థ్యంబును నీపయింగల ప్రేమాతిశయంబును విచారించిన భవన్మనోరథంబు సిద్ధించుటకు సందియంబు లేదు ప్రయాసంబు విడిచి శయనస్థానంబునం గూర్చుండి స్వస్థచిత్తవై నీకు సంప్రాప్తం బైనభయంబుఁ దెలుపుము సూర్యుండు నీహారంబునుం బోలె దాని నపనయించెద నని బహుప్రకారంబుల నమ్మహీవల్లభుం డద్దేవిచిత్తంబు నడయుటకుఁ దగినతెఱంగున ననునయించిన నమ్మత్తకాశిని రామాభిషేకవిఘ్నరూపం బైనయప్రియం బెఱింగింపనిశ్చయించి ప్రతిజ్ఞాకరణంబుచేతఁ గ్రమ్మఱ నిర్బంధింప నుపక్రమించి మన్మథశరవిద్ధుండును గామవేగవశానుగుండు నగుదశరథు నవలోకించి దారుణవాక్యంబున నిట్లనియె. 267

కైకేయి దశరథునిచే శపథంబుఁ జేయించుట.

తే. మానవేశ్వర యేను నెవ్వానిచేతఁ, బరుషతఁ బరాభవింపంగఁ బడినదానఁ
గాను నాకొక్కకార్యంబు గలదు దానిఁ, గూర్మి పెంపునఁ దీర్ప దక్షుఁడవు నీవు.

క. మోసము సేయక యప్పనిఁ, జేసెద నని నీవు బాసఁ జేసితి వేని
న్యాసంక్రందన యన్వలఁ, జేసెద నని నమ్మి తలఁపుఁ జెప్పెద నీకున్. 269

వ. అనిన విని యద్ధరారమణుండు భవదాజ్ఞాకారి నైన నాయందు శపథాకాంక్ష పరిధృతం బయ్యె నని యుద్గతస్మితుం డై యద్దేవిశిరంబు నిజాంకంబున నిడికొని స్వాభిముఖీకరణంబుకొఱకుఁ జికురబంధంబునం గరం బిడి యిట్లనియె.

క. నాకుం గల స్త్రీపురుషుల, నో కాంతా జానకీప్రియునకంటెఁ దగన్
నీకంటెం బ్రియు లెవ్వరు, లేకునికి యెఱుంగ వొక్కొ లేమా యితరుల్. 270

సీ. కమలాక్షి యెవ్వానిఁ గానక యొక్కముహూర్తమైనను మని యుండఁ జాల
ఘనుఁ డెవ్వఁ డనువులకంటెఁ దక్కినపుత్రకులకంటె నిలఁ బ్రాణికోటికంటె
నట్టిముఖ్యుఁడు జీవనాథుఁ డజయ్యుఁడు సదయుఁడు నగురామచంద్రుతోడు
రమణి త్వద్వచనకరణము నుద్దేశించి శపథంబుఁ జేసితి శంక విడిచి

తే. నీకు హిత మాచరింపంగ నిశ్చయించి, యున్న నాబుద్ధిఁ దిలకించి యుష్మదిష్ట

కథనమున నన్నుఁ బ్రోవుము కల్ల గాదు, సత్యమాడితిఁ బుణ్యంబుసాక్షిగాఁగ.

వ. అని పలికిన నద్దేవి దశరథుండు తనవలని మోహంపుటురిం దగులువడియె నని యూహించి రామశపథపూర్వకస్వవచనక్రియావాక్యంబున సంహృష్ట యగుచు నిజపుత్రపక్షపాతంబువలనను సర్వప్రకారంబుల విభుండు తనకార్యంబు సఫలంబుఁ గావించు ననెడుహర్షంబువలనను శత్రువుల కైన వచించుట కశక్యం బైనదాని నభ్యాగతాంతకునిచందంబున నతిఘోరం బగుదానిఁ బుత్రాభిషేచన రామవివాసన రూపాభిప్రాయం బెఱింగించెదఁ గాక యని నిశ్చయించి రాజప్రతిజ్ఞ దుష్కరదారుణప్రయోజనవిషయం బగుటవలన విఫలత్వంబు నొందునో యని శంకించి దాని నశేషసాక్షీకరణంబున సుస్థిరత్వంబు నొందింపం దలంచి భర్త నుద్దేశించి దేవా యిప్పుడు సకలభూతంబులును జంద్రాదిత్యాదిగ్రహంబులును నగ్నిపురోగము లైనదేవతలును భూమ్యంతరిక్షదివంబులును దిక్కులును నహోరాత్రంబులును గంధర్వరాక్షసాది దేవయోని విశేషంబులును నిశాచరభూతంబులును గృహదేవతలును సాక్షిగాఁ బ్రియపుత్రసుకృతాదిపరిగ్రహక్రమంబున శపథంబుఁ జేసితివి తత్పూర్వకం బగువరంబు నాకొసంగితివి నీవు సత్యసంధుండవు ధర్మజ్ఞులలో నుత్తముఁడవు మహాతేజుండవు సకలభూతసమక్షంబున నీపలికినపలుకు లర్థవంతంబులు సేయుటకు సందియంబు లేదు గదా యని యిట్లు దశరథుని స్వమతంబునందు సంస్థాపించి సత్యసంధాదివిశేషణంబుల స్వవచనకృతిస్థైర్యంబుకొఱకుఁ బ్రశంసించి నిజాభిప్రాయంబు దేటపడ నిట్లనియె. 273

సీ. అవనీశ తొల్లి దేవాసురసంగ్రామమున శంబరుం డనుదనుజవరుని
చే నష్టసంజ్ఞుఁడ వైననీ వపుడు నాచే రక్షితుండ వై చిత్తమందు
మెచ్చి వరద్వయ మిచ్చెద నంటివి తఱి యగునంతకుఁ గరము నమ్మి
నీయొద్ద డాఁచితి నేఁ డవ్వరంబులు దయ సేయు మటు గాక తక్కె నేని
తే. నేఁడె మదుపేక్షకుఁడ వైననీవు చూడ
జీవితంబులు విడిచెద సిద్ధ మట్లు
గాన నను దక్కఁ గొనుకోర్కి గలిగెనేని
వరము లొసఁగి యభీష్టము ల్వడయు మిపుడు. 274

వ. అని పలికిన నద్దశరథుండు విశేషంబుగాఁ బరస్వరూపం బుక్తంబు గా కున్నను బూర్వదత్తవరస్మారకవచనమాత్రంబునఁ గైకేయీవశీకృతుండై మృగశబ్దానుకరణలుబ్ధకవాక్యంబున వశీకృతం బైనమృగంబు వాగురాదిపాశంబునం దగులువడినచందంబున ననుకూలవరప్రదానాభ్యుపగమసంజ్ఞం బగుపాశంబునం దగులువడియె నిట్లమ్మహీపతిని సత్యపాశబద్ధుం గావించి కైకేయి వెండియు నిట్లనియె.

కైకేయి దశరథుని భరతాభిషేచనరామవివాసనరూపవరద్వయం బడుగుట.

సీ. భూనాథ యొకవరంబునకు మత్సుతునకు ఘనరాజ్యపట్టంబుఁ గట్టవలయు
వినుము రెండవవరంబునకు రాముఁడు జటాజినచీరధారి యై సిరికిఁ బాసి
తాపసవేషంబుఁ దాల్చి చతుర్దశవర్షము ల్దండకాననమునందుఁ
జరియింపవలయును నిత్తెఱఁగున ఘటియింపు మిదియె నా మనమున నిగుడుకొనిన
ఆ. కార్యమట్లు గానఁ గడఁగి నీ విప్పుడు, రాఘవాభిషేకలగ్నమందె
పూజ్యయౌవరాజ్యమునకు నాతనయుని, విభునిఁ జేయు మవనివిభులు వొగడ.

చ. అఱమరఁ దక్కి యున్నవరము లర్థి నొసంగుము సత్యసంగర
స్థిరుఁడవు గమ్ము జన్మకులశీలములం దగఁ గాచికొమ్ము భూ
వరులకు సత్యమే సిరియు వైభవముం బరలోకసాధనో
త్కరమని తాపసుల్ బహువిధంబులఁ బల్కుచు చాటి చెప్పరే. 277

వ. రాజేంద్రా యేను నీచేత దత్తంబైన వరంబులనే యడిగితిం గాని నూతనవరం బడిగినదానఁ గా నని యిట్లు కర్ణశూలాయమానం బగు దారుణవాక్యంబు వలికిన విని కొండొకసేపు నిశ్చేష్టితుం డై చిచ్చుతాఁకునం దపించుమహాగజంబుపోలిక నేలం బడి పొరలుచు నిజాంతర్గతంబున. 278

దశరథుండు నానాప్రకారంబులఁ గైకేయిని దూఱుట.

క. ఊహింప సూక్ష్మకారణ, దేహావస్థ లొకొ రుజయొ తీఱని చేతో
మోహంబొ గాక తక్కిన, నాహా యే నింతవెఱ్ఱి నగుదునె యకటా. 279

మ. అని చింతించుచు గేహినీవచనవజ్రాభోగ్రనారాచదు
ర్దినసమ్మూర్ఛితమానసుం డగుచు ధాత్రీనాథుఁ డొక్కింతసే
పునకుం దేఱి యసంవృతావనిపయిం బొల్పేది కూర్చుండి మో
మున దీనత్వము గానుపింప విపదంభోరాశి నిర్మగ్నుఁ డై. 280

మ. ఘనమంత్రౌషధరుద్ధవిక్రమమహాకాలాహిమాడ్కిం గడం
గిననిట్టూర్పు నిగిడ్చి యొంటిమెయి వ్యాఘ్రిం గన్న పెన్లేడిచా
డ్పున భార్యం గని భీతి నొంది మరల న్మార్భాగతుం డై చిరం
బునఁ దెలొంది సుదుఃఖితుం డగుచు సపూర్వంబోఁడితో నిట్లనున్. 281

తే. పుత్రగర్ధిని దుష్టచారిత్ర కులవి, నాశిని నృశంస జానకీనాథుచేతఁ
బరఁగ నాచేత నేమి పాపం బొదర్పఁ,బడియె నిట్టిదుర్వాక్యంబుఁ బలికె దేల.

చ. సతతముఁ దల్లినట్ల బలుచందముల న్నినుఁ గొల్చు జానకీ
పతి కహితంబు సేయ మదిఁ బట్టితి వేమినిమిత్త మేను దు
ర్మతి నగునిన్ను దీక్ష్ణగరలప్రథితోరగినట్ల యిల్లు సే
ర్చితి జడబుద్ధిచేఁ జనవుఁ జేసితి నాత్మవినాశనార్థ మై. 283

ఆ. సకలజనులు రాముఁ డకలంకగుణధాముఁ, డనుచు సన్నుతింతు రట్టిపుణ్యు
నందు నేమి నేర మొందించి ఘోరకా, ననమునం జరింపఁ బనుపువాఁడ.

ఆ. పుడమి నైన రాజ్యభోగసంపద నైన, బలము నైనఁ బ్రాణపవను నైన
నాసుమిత్ర నైనఁ గౌసల్య నైనను, విడుతుఁ గాని యతని విడువఁ జాల. 285

ఆ. అగ్రపుత్త్రుఁ డైనయనఘుసుతాపతిఁ, గనిన నాదుప్రీతి ఘనత కెక్కు
నతనిఁ గాన కున్న నబల యుచ్చిత్త మా,నందరహిత మగుచుఁ గుందుచుండు.

తే. పన్నుగ సరోజసఖుఁడు లేకున్న జగము
నీరు లే కున్న సస్యంబు నిలుచుఁ గాని
రమణి రాముఁడు లే కున్న నిమిషమయిన
నాదుతనువునఁ బ్రాణంబు పాదుకొనదు. 287

క. అటుగావున నీపదములు, పటురయమున శిరము సోఁకఁ బ్రణమిల్లెద నీ
విటు క్రూరచింత సేయక, కుటిలాలక యొండుకోర్కిఁ గోరు మొసఁగెదన్.

తే. పరమదారుణ మయినయీపాప మెట్టు
లకట నీచేతఁ జింతితం బయ్యె నేఁడు
పుణ్యవర్ధనుఁ డైనరామునకు నెగ్గుఁ
దలఁచుదానికి నిహపరంబులును గలవె. 289

వ. దేవి నీ విప్పు డాడినవాక్యంబు భరతప్రియాప్రియవిషయంబునందు మచ్చి
త్తంబుఁ బరీక్షించుట కని తలంచెద నదియె భవదభిప్రాయం బేని భరతాభి
షేకంబె కోర వలయుం గాని రామునివివాసనంబుఁ గోర నేల తొల్లి నీవు
రాముండు నాకు జ్యేష్ఠపుత్త్రుండు ధర్మజ్యేష్ఠుం డని పలికితి వది ప్రియవాదిని
వగునీచేత రామకృతశుశ్రూషార్థం బొండె మదీయచిత్తంబు భవదాయత్తం
బై యుండుటకు నొండెఁ గథితం బయ్యె నని యిప్పు డూహించెద నట్లు గా
దేని రామాభిషేకంబునకు సంతసింపక శోకసంతప్తచిత్త వై యిత్తెఱంగున
నన్నేల పరితపింపం జేసెద వైనను శూన్యగ్రహంబు సోఁకి తత్పారవశ్యం
బున ని ట్లప్రియంబుఁ బలికితివి గావలయుఁ దొల్లి యొక్కింతైన భవదీయ
చిత్తం బధర్మాయత్తంబు గా కుండినట్టివినయసంపన్న వైన నీ విప్పు డీయధర్మ
కార్యం బవలంబించుటవలన ధర్మిష్ఠం బైనయిక్ష్వాకువంశంబునకుం దనివార్యం
బైనయనర్థంబు సంప్రాప్తం బయ్యెనని తోఁచుచున్నది మున్నొక్కింతైనలోక
విరుద్ధం బగుప్రతికూలవాక్యంబు నీవలన విని యెఱుంగనికారణంబున నేఁ
డీవాక్యంబు నమ్ముట కనర్హం బై యున్నది నాకు రాముండు భరతసముం డని
బహుప్రకారంబుల నాకుం జెప్పుచుండు దట్టినమచిత్త వైననీకు రాముని
యందు విరోధభావం బెత్తెఱంగున నుత్పన్నం బయ్యె. 290

దశరథుఁడు కైకేయికి రామునిసద్గుణంబు లభివర్ణించి బోధించుట.

చ. అనిశము ధర్మమార్గరతుఁడై యశ మెల్లెడఁ గూడఁబెట్టి వా
గనిసుకుమారత న్వెలయురాముఁడు నీపయిఁ జేయుభక్తి నై
నను దలపోయ కిట్లు పదునాలుగువర్షము లుగ్రకాననం
బునఁ జరియింపఁ బంపు మన మూఢమతీ మది నెట్లు సైఁచితే. 191

తే. కౌసలేయుండు భరతునకంటె నధిక,భక్తి శుశ్రూషఁ గావించుఁబరఁగ నీకు
నారఘూత్తముకంటె నీయందుభరతు,నకుఁ గలవిశేషమేమిఁ గానములతాంగి.

తే. కమలలోచన నీకు రాఘవునకంటె, నన్యుఁ డెవ్వాఁడు వచనక్రియాప్రణామ
వినయగౌరవసేవాదివృత్తులందుఁ, జతురుఁ డెందైనఁ గలఁడె ముజ్జగములందు.

తే. తరుణి కాంతోపజీవిశతంబులోన, రమణి యొక్కరిచే నైన రామునందు
బలుకఁబడు పరివాదాపవాదములు ద,లంప లే సట్టిఘను వని కంప నేల. 294

తే. రాఘవుఁడు శుద్ధబుద్ధిచేఁ బ్రాణికోటి, నెపుడు రంజిల్లఁ జేయుచు నిష్టకామ
దానములచేత స్వవశీకృతస్వదేశ, వాసిజనుఁడై ప్రకాశించువనజనేత్ర.295

తే. దానమున దీనజనుల సత్యమున లోక,ములను శుశ్రూషచే గురువులను వింటి
చే రణంబున దుస్సహవైరివరుల, ననిశముజయించి యున్నవాఁ డతఁడు తన్వి

వ. మఱియు సత్యంబును దానంబును దపంబును ద్యాగంబును మిత్రత్వంబును శుచిత్వంబును నార్జవంబును విద్యయు గురుశుశ్రూషయు నివి మొదలగు సకలగుణంబు లక్కుమారునందు సన్నివిష్టంబులై యుండు నట్టిశమాదిగుణ సంపన్నుండును దేవతుల్యుండు నగురామునియం దెవ్విధంబునఁ బాపంబు దలంచితివి లోకప్రియవాదియును మహాప్రియుండు నగురాముని విహాసము గుఱించి వాక్యంబు స్మరించుటకు నైనశక్తుండఁ గా నట్టియేను బ్రియుం డగు నారాముని భవద్ధంబు వనంబునకుఁ బొమ్మని యెట్లు వలుకుదు నని పలికి వెండియు శోకం బగ్గలం బైన దీనవదనుం డగుచు గద్గదకంఠుం డై యి ట్లనియె 297

తే. శమదమంబులు సత్యశౌచములు భూత
దయయు దాక్ష్యంబు ధర్మ మేధస్సునందు
నిలిచె నట్టిధరాసుతానేత వనికిఁ
జనినపిమ్మట నేగతిఁ జనుదు నేను. 298

వ. అని పలికి దుఃఖాతురుం డగుచుఁ గ్రమ్మఱ నమ్మహీవల్లభుండు ఘూర్ణమాన శరీరుండై శోకార్ణవంబునకుఁ బారంబుఁ బ్రార్థించునయ్యంగనచరణంబులకుం బడి లేచి యంజలి ఘటియించి యి ట్లనియె. 299

సీ. చతురబ్ధిముద్రిత క్షితియందుఁ గలసర్వమును నీ కొసంగెదఁ గినుక విడిచి
తలకొని ధర్మంబు దప్పక యుండ రాఘవునకు శరణంబు గమ్ము పెక్కు

దినములు పుడమిపై మనినకతంబునఁ గడువార్ధకంబున బడలి మిగుల
దైన్యము నొంది పుత్రవియోగజనితార్తి కోర్వఁజాలక చేతు లొగ్గి వేఁడు

తే. మామకాంజలిఁ గైకొనిమంజువాణి,చాలఁ గారుణ్య మొనరింపఁ జాలుదనిన
వినుచు బడబాగ్నిగతి శౌర్య వేషయగుచు,నలుక రెట్టింపఁబలికె నవ్వేలఁదిపతికి.

సీ. భూనాథ మును వరంబు లొసంగి క్రమ్మఱఁ బరితపించెదవు నీపాటినృపులు
విన్న మెత్తురె వారు విన నీదుధార్మికత్వం బెట్లు వాక్రుచ్చి పలుకఁ గలవు
మఱియు నాభూపతు ల్మద్వరదానప్రసంగంబుఁ జేసినసమత వారి
కుత్తరం బెయ్యది యొనరఁ జెప్పుదు వీవు భయద దేవాసురభండనమున

తే. నన్నుఁ గాంచిన కేకయనాథపుత్రి, కే నొసంగినవరములు పూని మిథ్య
యనుచుఁ బల్కెదవో నృపజనుల కెల్ల, నపయశం బొదఁగూర్చితి వధిప నీవు.

వ. అని గర్హించి పలికి క్రమ్మఱ సత్యంబు ప్రకటంబుగా నిరూపించుతలంపున
ని ట్లనియె. 302

చ. విమలవిచారు లైననృపవీరుల మెచ్చఁ గపోతరక్షణా
ర్థము మును శైబ్యుఁ డన్నృపుఁడు తత్పరిశితార్థియ నైనయొక్కశ్యే
నమునకు నెంత పుణ్యకలనం దనకండలు గోసి యిచ్చి న
త్యముఁ బ్రకటంబుగా నిలిపె ధారుణి నత్తెఱఁగి వెలుంగవే. 303

చ. అదియును గాక లర్కుఁ డనునాతఁడు నేత్రము లిచ్చి పుణ్యసం
పద నిరవందఁడే యది ధ్రువంబుగ నిల్చెనొ లేదొ వార్ధియుం
త్రిదశగణార్థితుం డయి తుది న్ననుయం బొనరించి వేలఁ దాఁ
బదపడి దాఁటెనే ధరణిపాలక సత్యము నూఁది నేఁటికిన్. 304

చ. జనవర పూర్వవృత్తముఁ బ్రసన్నమతిం గని మున్ను నీవు చే
సినసమయంబుఁ దప్పకుము శీలము సత్యముఁ బాయఁ బెట్టి రా
మునిఁ బృథివీశుఁ జేసి యిఁక ముప్పునఁ దప్పక నగ్రపత్నితో
ననిశముఁ గ్రీడ సల్ప హృదయంబున జూచితి వేమొ దుర్మతీ. 305

తే. జనవరోత్తమ నాకోర్కి సత్యధర్మ, యుక్త మయినను దద్వ్యతిరిక్తమైన
నిపుడు నీమ్రోల నాచేత నెద్ది పలుకఁ, బడియె దానికి నన్యథాత్వంబు లేదు.

తే. ఎంత లే దని త్రోచి నీ వెల్లి పుత్రు, కన్నెమగనికిఁ బట్టంబు గట్టి తేని
గరళ మైనను గ్రోలి నీకనులు చల్ల, గాఁగ మేనికిఁ బాసెదఁ గల్ల గాదు.

తే. వైభవంబునఁ బొదలు సవతిని గాంచి, యొకనిమిష మైననోర్వ లే నకట దాని
విభుత కంజలిఁజేయుచు వినయవృత్తి, బ్రతుకుకంటెను జచ్చుట పాడి గాదె.

క. జనవర రామువివాసన, మునకంటెను వేఱుకార్యమున నాచిత్తం
బున కానందము కలుగదు, విను భరతునిమీఁదియాన వే యన నేలా. 309

వ. అని యిట్లు పరమదారుణం బైనవాక్యంబుఁ బలికి యూఱకుండినసమ్మహీరమ

ణుండు మిక్కిలి యవాచ్యం బైనరామునివనవాసంబును భరతునిరాజ్యాభి
షేకంబును విని పరమశోకాక్రాంతచిత్తుం డై కోపంబునఁ గొండొకసేపుతెప్ప
ర్రేయక యప్పంతిమొగంబుఁ దప్పక చూచుచు నిశ్చేష్టితుం డై యూర
కుండి వెండియు నద్దేవివ్యవసాయంబును దాను జేసినశపథంబునుం దలంచి
యశక్యప్రతిక్రియం బగుటవలన నించుకసేపు ధ్యానంబుఁ జేసి రామా యని
నిట్టూర్పు పుచ్చి సన్నిపాతాదులచేత విపరీతప్రకృతి యైనవానిచందంబున
వ్యాధిగ్రస్తుం డైనవానిపోలిక నున్మత్తునికై వడి మంత్రాహృతవీర్యం బయిన
మహాసర్పంబుభంగి నష్టచిత్తుం డై పరశుచ్ఛిన్నం బైనతరువుమాడ్కి ధరణి
పయిం బడి కొండొకసేపునకు లబ్ధసంజ్ఞుం డై వెండియు దీనవాక్యంబున
నిట్లనియె, 310

క. రమణి యనర్థం బర్థా, ర్థముగా నెవ్వాఁడు గలిపె నకట పిశాచా
క్రమగతమతివలె దుర్వా, క్యముఁ బల్కుట కోడ వెంత యవివేకినివో 311

క. ఈసద్వృత్తభ్రంశము, నేసరణి న్నన్నెఱుంగ మిప్పుడు చెనటీ
యీశీలము విపరీతం, బై సర్వముఁ గానఁ బడియె నటు నీయందున్ 312

క. నీ కీభయంబు వొడముట, కేకారణ మాత్మసుతున కీశత్వము సీ
తాకాంతునకు వివాసన, మేకరణిం గోరితివి విహీనప్రజ్ఞా. 313

తే. మగఁడ నగునాకుసుతునకుజగమునకును,నప్పకప్రియంబుఁగావింపఁదలఁచితేని
రామవనవాసభరతసామ్రాజ్యరూప,మైన యీపాపభావంబు మాను మిపుడు.

క. రామునియం దపరాధం, బేమి విలోకించి పలికితే నీ కిపుడే
నేమి విరోధముఁ జేసితి, నీమాటలు నీతిశాస్త్రనిర్ణితము లే. 315

తే. అతివ నాచిత్త మెరియించు టంతెకాని
రాముఁడు భరింపఁ దగినసామ్రాజ్యభార
మేల భరతుఁడు పూను నీ తేశుకంటె
భరతుఁ డధికుఁడు నృపనీతిపరతఁ జేసి. 316

తే. అనఘ వనమున కీవు పొమ్మనిన యంత,రాహుసంగ్రస్తుఁ డగుదు రాజుపగిదిఁ
గడు వివర్ణత నొందినకౌసలేయు, వదన మేరీతిఁ గనుఁగొనువాఁడఁ జెపుమ.

ఆ. మఱియు సకలరాజమధ్యంబునఁ బ్రధాన, హితులఁ గూడి నిశ్చయింపఁబడిన
దాని శత్రురాజదళితసైన్యమునట్లు, కలుషచిత్త యెట్లు గ్రమ్మఱింతు. 318

వ. అదియునుంగాక. 319

సీ. జడబుద్ధి యైనదశరథుండు చిరకాల మెత్తెఱంగున రాజ్య మేలె ననుచు
గుణవంతు లగురాజకుంజరు ల్నను వెలిఁ బెట్ట రే జానకీప్రియుని యుత్స
వముఁ జూడ వచ్చిన వసుమతీధవులు రాఘవుఁ డాజచే నేమి కారణమున
నిర్వాసితుం డయ్యె నే చని రాము నుద్దేశించి పలికినఁ దిరిగి వారి

తే. కేమియు త్తర మొసఁగుదు నిపుడు మఱియుఁ, గైకచేఁబీడితుండనై కాననమున
కనిచితి నటంచుఁ జెప్పుదునా యశైన, సత్యవిచ్ఛిత్తి కేనోర్వఁ జాలు టెట్లు.

సీ. అనిశముఁ బ్రియపుత్త్రయును బ్రియవాదిని
ప్రియ కామయును మహాప్రియయు నైన
కౌసల్య యయ్యయికాలంబులను దాసి
యనువున సఖియట్ల జననివగిది
భగినిచందంబున భార్యపోలిక నొప్పు
నట్టికాంత కుమారుఁ డడవి కేగు
చుండ న న్నే మని యొప్పిదంబులు వల్కు-
నీదృశం బగుపాప మేను జేసి

తే. యే మని ప్రియంబుఁ జెప్పుదు నంతకాల
మేను నీయందుఁ జేసిన హితము నన్నుఁ
బరితపింపఁగఁ జేసె నపథ్యభోజ
నంబు విషరోగినిం బలె నాతి నేఁడు. 321

వ. మఱియు సత్కారోచిత యైనయకౌసల్య భవద్విప్రియశంకచే నాచేత నొ
క్కనాఁ డైన సత్కరింపం బడినయది గా దయ్యె నవియునుం గాక. 322

క. వనసంప్రయాణరూపా, వనిజా ప్రియవిప్రియంబు వదలక విని గ్ర
క్కున నలసుమిత్ర న న్నే, మని మనమున విశ్వసించు నక్కట చెపుమా.

వ. సకలలోకానందకరుం డైనరామభద్రునిఁ బరిత్యజింపం దలంచినదశరథుం
డింకనేమి యకార్యంబుఁ గావించుటకు వెఱచు నని ధిక్కరింపదే యని వెండి
యు ని ట్లనియె. 324

ఆ. విపినవాసి యైన విభుని లోకాంతర, వాసి యైననన్ను వరుసతోడ
జనకరాజపుత్త్రి వినుటకు నె ట్లోర్చు, నకట రెండు నప్రియములు గావె. 325

తే. పతివిపినయాత్త్రయును నాదుపంచతయును
విని మహీసుత కృపణ యై వెండికొండ
క్రేవఁ గిన్నరుఁ బాసిన కిన్నరిక్రియ
వెతలఁ బొంది ప్రాణంబులు విడువ కున్నె. 326

క. వనమునకుఁ జనినరాముని, వనగతుఁ డగువిభునిఁ గూర్చి వగచుమహీజం
గనుఁగొని యేను ధరణిపై, వనితా చిరకాల మింక బ్రతుకఁగఁ జాలన్.

క. జనసుతుఁ డగురాముని వన,మునకుఁ బనిచి నన్ను దుఃఖమునఁ జంపి రయం
బున భరతుఁ గూడి మోదం, బున విధవా రాజ్య మేలఁ బూనితొ బుద్ధిన్.

తే. అసతి వగు నిన్ను మది సతి వనుచు నమ్మి
పిదప దుఃఖార్తి నిట్లు తపింపవలసె

నరుఁడు మోహావశంబున గరళయుక్త
మద్యమును గ్రోలి దుఃఖించుమాడ్కి నబల. 329

క. వనమున లుబ్ధుఁడు గీత, ధ్వనిచే మృగమును గడంగి వంచించినచా
ద్పున శతృసాంత్వమున నను, దినమును వంచించి తుది వధించితి వకటా. 330

తే. ఎంతపాపాత్ముఁ డీనృపుఁ డిపుడు గ్రామ్య
సుఖముకొఱకుఁ గుమారుని సూరినుతుని
వనమునకుఁ బంచె ననుచు సజ్జనులు నన్ను
దూఱరే కల్లుఁ ద్రావిన పాఱునట్లు. 331

వ. దుష్టచారిణీ వరదానవిషయంబునందు రాముండు జటాజినచీరధారియై ముని వేషంబున వనంబునకుం జనవలయు నని పలికితి విట్టిక్రూరవాక్యంబులు విని క్షమింపవలసెం గావున మత్పూర్వాకృతదుష్కృతం బివ్విధం బపరిహార్యత్వం బున నవశ్యం బనుభావ్యం బయ్యె నక్కటాయిది యెంతకష్టం బెంతదుఃఖంబు చిరకాలంబున నుండి సౌఖ్యంబుకొఱకు నాచేత ననుష్ఠితం బైనభవద్రక్ష ణంబు. గంఠలగ్నం బైనపాశంబుభంగి స్వనాశనంబుకొఱకుఁ బరిణతం బయ్యె నని పలికి వెండియు నిట్లనియె. 332

క. బాలుం డేకాంతంబునఁ, గాలాహిని ముట్టినట్లు గానక జడతఁ
వాలాయము సతి వని దు, శ్శీలా పాణిగ్రహంబుఁ జేసితి నిన్నున్. 333

ఉ. కాంతకుఁ బ్రీతి సేయ ననుకంప దలంపక రాముని స్వనా
భ్యంతరసీమకుం బనిచె నక్కట యీనృపుఁ డెంతచంచలుం
డెంతవివేకశూన్యుఁ డని యెన్నిక వెట్టదె సర్వలోక మా
వంతయు శంక లేక యది యంతయు నిక్కముగాదె దుర్మతీ. 334

తే. రమణి సువ్రతబ్రహ్మచర్యములచేత, గురులచేతను నృపధర్మపరులచేత
సతత ముపకర్షితుం డైనసుతుఁడు మరల, భోగవేళ దుఃఖంబులుపొందెనకట.

క. వనమునకుఁ బొమ్ము సుత నీ, వనినంతనె యట్లుగాక యని శీఘ్రమునం
జనుఁ గాని మరలఁ దా నొం, డనఁ జాలం డట్టిసుమతి ననుచుట తగవే. 336

క. తనయా నీ విపుడు వనం, బునకుం బొమ్మనుచుఁ బల్కఁ బో నని నాతో
మునుకొని ప్రతికూలముఁ బల్కిన మేలగుఁ బల్కఁ డట్టు కేవలభక్తిన్.

తే. పాపచారిణి పరిశుద్ధభావుఁ డగుట, రామభద్రుండు నాయభిప్రాయ మించు
కైన నెఱుఁగక వనికిఁ బొమ్మనినఁ దడవు, సేయ కప్పుడె చనునేమిసేయఁగలను.

వ. మఱియు మహాత్ముం డగురాముండు వనంబునకుం జనిన సర్వలోకధిక్కా రంబు సహింపం జాలక యేను యమక్షయంబునకుం జనియెద రామప్రవ్రా జనమన్మరణానంతరంబు ననిష్టం బైన కౌసల్యాదిజనంబునం దేమి పాపం బాచరించెదవో యని భయంబు వొడము చున్నయది యన్వాలమన్మతానుసారి

జనంబంతయు మనోవాగగోచరం బైనదుఃఖంబు నొందు నీవలన నిక్ష్వాకుకులోచితం బైనయశం బంతయుఁ బరిక్షీణం బయ్యె రామునకు సహచరుం డగుటం జేసి లక్ష్మణుం డతని విడువం జాలక వెనువెంట నరణ్యంబునకుం జను నంతఁ గుమారవనవాసంబును భర్తృమరణంబునుం దలంచి శోకించి కౌసల్య ప్రాణంబులు విడువం గల దంతట సుమిత్ర నన్నును గౌసల్యను రామలక్ష్మణశత్రుఘ్నులం గానక శోకంబున సహగమనంబుఁ జేసి పంచత్వంబు నొందు నిట్లు కౌసల్యాసుమిత్రలను నన్నును రామలక్ష్మణశత్రుఘ్నులను దుఃఖనిమగ్నులం జేసి నాచేతను రామునిచేతను విడువం బడిన శాశ్వతం బైన యిక్ష్వాకుకులం బాకులంబుగాఁ బరిపాలించుచు సుఖం బుండుము భరతునకు రామవనవాసంబు ప్రియం బయ్యె నేని గతజీవితుండ నైననాకుఁ బ్రేతకృత్యంబు సేయుటకు నతం డర్హుండు గాఁడు మే మందఱ మరిగినపిదప నీవు లబ్ధకామితవై పుత్రునింగూడి విధవారాజ్యంబుగాఁ బరిపాలింపు మీవు రాజపుత్రీవ్యపదేశమాత్రంబున మద్గృహంబుఁ బ్రవేశించుటంజేసి నాకుఁ బాపాత్మునకుంబోలె నపయశంబును మహాజనసమక్షంబున ధిక్కారంబును సర్వభూతంబులయం దవమానంబును సంప్రాప్తం బయ్యె నని పలికి వెండియు నమ్మహీరమణుండు శోకోద్రేకంబున నిట్లనియె. 339

మ. అతివేగాన్వితఘోటకవ్రజముతో హాస్తీంద్రసంఘంబుతోఁ
జతురస్యందనరాజితో నెపుడు సంచారంబుఁ గావించు నా
క్షితికన్యాధవుఁ డుగ్రకంటకశిలాశ్లిష్టాటవీభూమి నే
గతిఁ బాదంబులచేఁ జరింపఁగలఁ డింక న్భర్తృవిద్వేషిణీ. 340

చ. సరసపదార్థము ల్వెలయుచందముల న్రసనొందఁ జేయ నే
ర్పరు లగుపాచకుల్ తనకుఁ బక్వతరోదనభక్ష్యభోజ్యము
ల్వరుస నొసంగ నిత్యముఁ గరం బనురక్తి భుజించు జానకీ
వరుఁ డికఁ గందమూలముఖవన్యము లెట్లు భుజించు నక్కటా. 341

ఉ. ధౌతసువర్ణవర్ణపరిధానములన్ గయి సేసి పుష్పశ
య్యాతలమందు నుండెడు మహాసుకుమారుఁడు నాకుమారుఁ డే
రీతి నముంజులాజినపరిష్కృతవల్కలముల్ ధరించి ఘో
రాతతకంటకాత్మకఠినావనియందు వసించుఁ జెప్పుమా. 342

చ. మదనవసంతవాసవకుమారమహాసుకుమారమూర్తి వా
రిదనిభగాత్రు నద్భుతచరిత్రునిఁ బుత్రునిఁ జూచి నప్పుడే
ముదుకఁడ నయ్యుఁ గ్రమ్మఱ సమున్నతయౌవన మొంది నిట్లు నె
మ్మది రహింయింతు నట్టి జనమాన్యునిఁ బాసి మనంగ నేర్తునే. 343

వ. మఱియు రామారణ్యగమనపూర్వకం బైనభరతాభిషేకం బతిదారుణకృతం

బవ్వాక్యం బెట్టి దుష్కర్మున కైన వినఁ దగియెడునది గాదు యువతులు నిం దింపం దగియెడువారని పలుకు లోకవాక్యంబు సర్వసాధారణంబైనను స్వార్థ పర వగునీయందుంగాని పతివ్రతలయం దవ్వాక్యంబు సార్థకంబై యుండదు నీవు స్వపరానర్థసాధనస్వభావసంయుక్తవు మత్పరితాపనివేశితాంతఃకరణవు స్వార్థసాధనపరవు. నీచందం బిట్టిదని మున్నెఱుంగ నైతి నమస్తజగద్ధితాను సారి యగురామునియందు నాయందు నేమియపరాధంబు విలోకించితివి రా మప్రవాసనసాధకం బైనభవద్వ్యాపారంబును వ్యసననిమగ్నుం డైనరాముని నిరీక్షించి జగంబంతయు నతికుపితం బగుఁ బితృపుత్రవధూవరు లన్యోన్యం బు పరిత్యజించు సూర్యుండు తపింపకున్న నింద్రుండు వర్షింపకున్న లోకంబు జీవించుంగాని వనంబునకుఁ జనురాముని విలోకించి యననుభూతరామస్వభా వుం డైనను జీవింపం జాలఁ డేనెట్లు జీవింపం గలవాఁడ భార్యాకారాగతమృ త్యు వని నిన్నెఱుంగక నజ్ఞానంబున నీతోడం గ్రీడించితిఁ గామభారావసన్నుం డ నైనయేను మహావిషం బైనసర్పంబునుం బోలెఁ జిరకాలంబున నుండి ని న్నంకభాగంబున నిడికొని తుది నిట్లు నీచేత వధియింపం బడితి దురాత్ముండ నగునాచేత మహాత్ముఁ డగురాముం డపితృకుండయ్యె నపుత్రకుండనైన నాచే తఁ బరిత్యక్తం బైనక్షోభరహితేక్ష్వాకురాజ్యంబును భరతుండు చేకొని సర్వ జనంబుల విడిచి బంధువుల నెల్ల వధించి భవత్సహితంబుగాఁ బరిపాలింపం గలఁడు నీవు మద్విమతులయందు స్నేహయుక్తవై యుండుము నేఁ డిట్లు పతి పత్నీభావంబుఁ దిరస్కరించి యాపత్కాలమందు నుపద్రవకారిణివై క్రూర వాక్యంబుఁ బలికితి విప్పాపంబున భవదీయదశనంబులు విశీర్యమాణంబు లై పుడమిం బడ వేల భవదీయరసన సహస్రప్రకారంబుల వ్రయ్య వేల యెన్నఁ డేనియు నప్రియంబు లగుపరుషవాక్యంబులు పలికి యెఱుంగం డట్టి యభి రామవాదియు గుణనిత్యసమ్మతుండు నగురామునియం దెవ్విధంబున దోషం బులు వలికితివి కైకేయి గ్లాని నధిగమించిన నధిగమింపుము కోపించినఁ గోపిం పుము నశించిన నశింపుము సహస్రప్రకారంబుల విస్ఫుటితవై మహీతలంబుఁ బ్రవేశించినఁ బ్రవేశింపుము యప్రియంబైన భవద్వచనంబు సఫలంబు గావిం పంజాల క్షురోపమానవు మిథ్యాప్రియవాదినివి దుష్టస్వభావవు స్వకులోపఘా తినివి మనోహారిణివి ప్రాణహారిణి వగునీవు జీవించి యుండుటకు సహింపంజాల నని పలికి వెండియు నిట్లనియె. 344

తే. రామభద్రుండు లేనిచో రమణి నాకుఁ
బ్రాణము సుఖంబు యశమును రతియు లేదు
నీదుపదములు ముట్టెద నెలఁత సుప్ర
సన్నవై ప్రోవు రాముని నన్నుఁ బ్రీతి. 345

క. అని యీగతి విలపించుచు, మనుజేంద్రుఁడు దుఃఖశోకమయనీరధిలోఁ
మునుఁగుచుఁ దేలుచుఁ గ్రమ్మఱ, వనితపదంబులకు వ్రాలె వ్యాధితుమాడ్కిన్.

వ. ఇట్లనాథునిభంగి విలపించుచు నతిక్రాంతమర్యాద యైనకైకేయిచేత నికృత్తమర్మ్ముండై చిత్తమూర్ఛయు జీవితవైమనస్యంబునుం బైకొనినఁ బ్రణామపరిహారబుద్ధిచేత నొండు దిక్కులకుం బ్రసారితంబులైన యద్దేవిచరణంబులు సంస్పృశింపక యాతురునిపగిది దారుణంబుగాఁ బుడమింబడి పుణ్యాంతంబున దేవలోకంబుననుండి ధరణిపయిం బడిన యయాతిచందంబున దీనవదనుండై యసంవృతమేదినిపయిం బడి రోదనంబు సేయుచున్నమగనిం గని యువతులకుం బ్రణామంబు సేయుట కనర్హుండనియు నంతకుమున్న ననుభూత తాదృశవ్యసనుం డనియును బుడమిం బడియున్నవాఁడనియుఁ దలంపక యనర్థరూపయు ననిష్పన్నప్రయోజనయు నభీతయు భయదర్శినియు నైనయక్కైక జనాపవాదశంకారహితచిత్త యగుచు వెండియుఁ బూర్వదత్తవరంబుల నుద్దేశించి దశరథుని సంబోధించుచు నిట్లనియె. 347

క. జననాథ సత్యసంధుఁడ, నని నినుఁ గడునాడుకొందు వధికరచనమై
మును వరము లిచ్చి లోభవుఁ, దనమున నేఁడేల యీక తప్పెద వకటా. 348

చ. మునుకొని నేఁడు తుచ్ఛజనముల్ వినఁ బల్కిన రాఘవాభిషే
చన మొనరింప కుండిన నసత్యజదోషమువచ్చునంచుఁ బే
ర్కొనియెద వీవు తొల్లి యమరుల్వినఁ నిచ్చెదనన్న మద్వరం
బు నొసఁగకున్న సూనృతసముద్భవపుణ్యము నిన్నుఁ జెందునే 349

చ. అన విని యమ్మహీరమణుఁ డద్భుతశోకపరీతచిత్తుఁడై
పనివడి కొంతకాల మటు పల్కక యూరక యుండి వెండియు
న్వనితమొగంబుఁ జూచి వదనంబునఁ గోపము చెంగలింపఁగాఁ
గనుఁగవ నశ్రువుల్దొరుఁగ గద్గదికన్ దలయెత్తి యిట్లనున్. 350

క. మానితగుణుఁ డగురాముఁడు, కాననమున కేగఁ బరమగతి కేఁ జనఁగా
మానిని యవ్వల రాజ్యముఁ, బూనికఁ బాలింపు మొదవుఁ బుణ్యమసుఖమున్.

ఉ. ఏనటు దేవలోకమున కేగ సురల్ ననుఁ జూచి జానకీ
జాని సుఖాత్ముఁడే యనినఁ జయ్యన నేమని చెప్పువాఁడ నా
ధీనిధిఁ గానకుం బనిచితిన్ సతికిం బ్రియమార నంటినా
దీనత నొంది కోపమున ధిక్కృతి సేయుదు రేమి సేయుదున్. 352

వ. మఱియుఁ గైకేయి కొసంగినవరంబునకుఁగా సత్యవశుండనై రాముని వనంబునకుం బుచ్చితినని సత్యంబుగాఁ బలికితినేని సకలజనసమక్షంబున నెల్లి రాఘుని రాజ్యంబున కభిషిక్తునిఁ జేసెద నని పలికినవచనంబున కసత్యదోషంబు కలుగునని పలికి యప్పుడమిఱేఁ డంతకంత కినుమడించినశోకంబున నిట్లనియె.

తే. తరుణి యనపత్యతాదురితమునఁ బెద్ద
కాల మత్యంతదుఃఖశోకముల బడలి
తుది నతనిఁ బుత్త్రుఁగాఁ గంటి దుష్కరముగ
నట్టిప్రియపుత్త్రు నెబ్భంగి ననుప నేర్తు. 354

క. శూరుండును గృతవిద్యుఁడు, వీరుండు క్షమాపరుండు విజితేంద్రియుఁడు
న్నారసనేత్రుఁడు రాముఁడు, వారక యేలాగు విడువఁబడు నాచేతన్. 355

క. రాముని నీలోత్పలసము, ధాముని నాజానులంబితతబాహుని ను
ద్దామబలుని నభిరాముని, భామిని యేపగిది వనికిఁ బంపఁగ నేర్తున్. 356

ఆ. సుఖము లొసఁగ దుఃఖశోకంబులకుఁ బాప, నర్హుఁడైనరాము నకట నేఁడు
వనికి నెట్లు పుత్తు పరమదుఃఖునిజేసి, దీన నేమి కోర్కి దీరు నీకు. 357

తే. కమలనేత్ర దుఃఖార్హుండు గానిరాఘ
వునికి దుఃఖంబుసేయక తనువు విడిచి
యనిమిషేంద్రులోకమునకుఁ జనితినేని
యొదవుసౌఖ్య మంతైనఁ గాకున్నఁ గలదె. 358

క. ఓకలుషచిత్త రాముని, నాకుం బ్రియుఁ డయినవాని నయధర్మవిదుం
జేకొని సుజనులు దూఱఁగ, నీకరణి న్వనికిఁ బనిచె దేటికిఁ జెపుమా. 359

క. వనితా రాముని వనికిం, బనిచిన సత్సభలయందుఁ బరిభవము జగం
బున ననుపమాపయశమును, మునుకొని నా కొదవు నిక్కముగఁ దోడ్తోడన్.

వ. అని యిట్లు బహుప్రకారంబులఁ బరిభ్రమితచేతస్కుండై యార్తుండై విలపించుచుండ నమ్మహీపతికిఁ జంద్రమండలమండితయైన యారాత్రి యతికష్టతరంబునఁ గించిదవశేషంబుగా నతిక్రమించె నప్పు డద్దశరథుండు వేఁడి నిట్టూర్పు నిగిడించి గగనాసక్తలోచనుండై యంజలిఁ గీలించి పరమార్తుండై విలపించుచు శర్వరి నుద్దేశించి యిట్లనియె. 361

సీ. విమలనక్షత్రశోభితయైన శర్వరి యంజలి ఘటియించి యధికభక్తిఁ
బ్రార్థింతు నినుఁ దెల్లవాఱిన రాముని కటవీప్రయాణ మట్లావహిల్లుఁ
గావున నామీఁదఁ గరుణించి వేగకు మటు గాక వేగుట యదియు నొక్క
హితమని గణుతింతు నెట్లన్న నెద్దానివలన నాకిట్లనివార్యమైన
తే. యమితదుఃఖంబు ప్రాపించె నట్టి క్షుద్ర
శీలయుఁ బతిఘ్నియును దుష్టచిత్తయుఁ గుల
ఘాతినియుఁ గ్రూరయైన యీకైకయాన
నంబుఁ జూడక తలఁగి చనంగ వచ్చు. 362

వ. అని పలికి వెండియు నతండు శోకరోషంబు లొక్కింత తనలోనఁ దాన యుపశమించుకొనియప్పు డంతిదిక్కు మొగంబై దేవీ సాధువృత్తుండును నల్పావశేషా

యువును సత్యవశగతత్వంబున భవదధీనుండును విశేషించి వల్లభుండనై ననాకుఁ బ్రసాదం బొసంగుము నీచేత వరబలంబునఁ బ్రతిగ్రహింపఁబడిన రాజ్యంబును మత్ప్రీత్యర్థంబుగా రామున కొసంగుము రామాభిషేకంబు నాచేత నిర్జనప్రదేశంబునందు సముదాహృతం బైనది గాదు రాజసభామధ్యంబునం బలుకఁబడిన యది గావున దాని కసత్యత్వంబు గలుగకుండ సార్థకత్వంబు నొందించి సత్యవశగతత్వంబువలన భవదధీనుండ నై నన్నుం బ్రోచి కీర్తిలాభంబు వడయు మిక్కార్యంబు నాకును రామునకు లోకంబునకు గురువులకు భరతునకుఁ బ్రియంబై యుండునని ధర్మబోధంబుగాఁ బలుకుచు శోకరోదనతామ్రాక్షుండై కన్నీరు నించుచు విలపించుచున్నయద్దశరథుంగనుంగొని తదీయవిచిత్రకరుణవిలాపంబు విని యద్దేవి కోపరసాధిదేవతయుం బోలె నేత్రకోణంబులఁ దామ్రదీధితులు నిగుడ మొగంబెత్తి యతనిం దనచూపుచిచ్చునంగాల్చుచు నదత్తప్రతివచనయై యూరకుండె నప్పు డమ్మహీనాథుండు నిత్యంబును మనోనుసారిణియై యుండి తత్కాలంబున బుద్ధివైపరీత్యంబునఁ బ్రతికూలభాషణంబులువలుకుచున్నకైకేయిమొగం బట్టె చూచి రామవివాసనరూపం బగువరంబుఁ దలంచి చిరపరిచితప్రేమంబున నద్దేవిని ధిక్కరించుటకుం జాలక ప్రియపుత్రుని వనంబునకుం బనుచుట కోర్వక మూర్ఛాక్రాంతుండై ధరణిపయిం బడియె నిట్లు విసంజ్ఞుండై పడియున్న యద్దశరథునకుఁ దెలివి దొరకొనుట కవ్విభావరి యనుగ్రహించె ననం దూర్పెట్ట నగుచు వచ్చెఁ బదంపడి బోధనసాధనమంగళగీతాదికంబు సెలంగె నప్పుడు దాని నివారించి పుత్రవియోగజనితశోకంబు సహింపం దరంబుగామికి నేలంబడి విచేష్టమానుండై విలపించుచున్నరాజు నవలోకించి మరల నత్తెఱవ యి ట్లనియె. 363

తే. జనవరోత్తమ మును నాకు సంశ్రవంబు, స్వీకరించియు దురితంబుఁ జేసినట్లు
ధరణిపయిఁబడి మిక్కిలి పరితపించె, దేల స్థితి యందు నిల్వ నీకిది గుణంబె.

తే. ధర్మవిదు లగువారు సత్యంబు పరమ, ధర్మ మని పల్కి రేనును ధర్మయుక్తిఁ
దడయ కడిగితి నీవును ధర్మ మూఁది, వరము లొసఁగక యిబ్బంగి వగచె దేల.

చ. మును తన మేనుఁ గోసి నృపముఖ్యుఁడు శైబ్యుఁడు పక్షి కిచ్చుట
ల్పరిణుతపదాన్యశేఖరుఁ డలర్కుఁడు పాఱున కక్షు లిచ్చుట
ల్వననిధి వేల దాఁటి సుకరంబుగ మేదిని ముంప కుండుట
ల్దినకరుఁ డెండ గాయుటయు ధీవర సత్యము నూఁదియే కదా. 366

క. సత్యమునఁ గలుగుఁ బరమును, సత్యంబున నుండు ధర్మసంచయ మెల్లన్
సత్యంబె శ్రుతులు బ్రహ్మము, సత్యేతర మైనదొకటి జగతిం గలదే 367

వ. రాజేంద్రా యేను ధర్మపరిపాలనార్థంబు నిన్నుం బ్రేరేపించితి నీకు ధర్మసంరక్షణంబునందు నియతి గలదేని మత్ప్రేరణంబునఁ బుత్రుం డగురాముని వనం

బునకుం బంపు మిమ్మాట ముమ్మాటికిం బలికితి నట్లు సేయవేని నీయెదుట నిప్పు డే జీవితంబు విడిచెద నని యిట్లు కైకేయిచేతఁ బ్రచోదితుండై యద్దశరథుం డు వేంద్రకృతం బైన సపత్రయ ప్రతిశ్రవరూపం బగుపాశంబునం గట్టువడిన బలి చందంబున నాత్మవినాశనకరం బైనసత్యపాశంబునం గట్టువడి విడివడ సమ ర్థుండు గాక యుగచక్రాంతరంబునం జిక్కిన ధురంబు పగిది నుద్భ్రాంతచిత్తుం డును వివర్ణవదనుండు నై నేత్రంబుల నశ్రుకణంబులు దొరఁగఁ గొండొకసే పూరకుండి వెండియు నొక్కింత ధైర్యం బవలంబించి యక్కైకయాననంబు విలోకింప రోసి యవాఙ్ముఖుం డై యిట్లనియె 368

తే. నిగమసంస్కృతమైన యే నీకరంబు, శిఖిసమక్షమునందు నాచే గ్రహింపఁ
బడియె నప్పాణి నిప్పుడు విడుతు నాకుఁ, బ్రియసుతుం డైన భరతుఁ బరిత్యజింతు.

వ. మఱియు సూర్యోదయసమయం బయ్యె నింక గురుజనంబు లభిషేకార్థంబు కల్పితంబులైన సంభారంబులచేత రామాభిషేకంబు నుద్దేశించి నన్ను వేగిర పడి పలుకుదురు గావున రాముండు కృతాభిషేకుం డై యుండఁగలం డట్లుగాక నీచేత విఘ్నంబు సంభవించెనేని యతనియాననం బాలోకింప నోడి యేను బరిత్యక్తకళేబరుండనై లోకాంతరంబునకుం జనియెద నప్పుడు మృతుండ నైన నాకు సలిలక్రియ సల్పుటకు రామభద్రుండె యర్హుం డగుం గాని సమాతృకుం డైనభరతుం డర్హుండు గాఁ డేను దొల్లి రామాభిషేకప్రారంభ వేళయందుఁ దాదృశసుఖయుక్తం బైనజనంబు నవలోకించి యిప్పుడు హత హర్షం బగుటవలన నిరానందం బైయున్నజనంబును గ్రమ్మఱ నవలోకింపం జాల నని పలికినఁ బాపచారిణి యగుకైక క్రోధమూర్ఛిత యై వెండియు ని ట్లనియె. 370

చ. జనవర క్రూరశస్త్రసదృశం బగువాక్యముఁ బల్కె దేల నీ
తనయుని రాము రాఁ బనిచి దారుణకాననసీమకు న్వెస
న్బనిచి మదీయపుత్రునకుఁ బట్టము గట్టి మహాత్మ నన్నుఁ జ
య్యన ససపత్నఁ జేసి చరితార్థుఁడవై సుకృతంబుఁ గాంచుమీ. 371

వ. అని పలికిన నమ్మహీరమణుండు తీక్ష్ణం బైన ప్రతోదంబుచేతఁ దాడితం బైన హయంబుభంగి సారెసారెకుఁ గైకేయీవాక్యచోదితుండై యద్దేవి నవలోకించి యేను ధర్మపాశంబున బద్ధుండ నైతి మద్బుద్ధి ప్రణష్ట యయ్యె యశస్వియు జ్యేష్ఠపుత్రుండును బ్రియుండును ధార్మికుండు నగురామునిం జూడఁ గోరెద నతని రావింపుము. 372

క. అని యిట్లు పలుదెఱంగుల, జననాథుఁడు పరితపించుసమయంబునఁ బూ
ర్వనగశిఖరోపరిస్థిత, ఘనరత్నమువోలెఁ దీవ్రకరుఁ డుదయించెన్. 373

—వసిష్ఠుఁడు దశరథునిమందిరంబునకు వచ్చుట.—

వ. తదనంతరంబ మహాత్ముం డగువసిష్ఠుండు సరయూనదియందు స్నానాద్యనుష్ఠానంబులు దీర్చి సునక్షత్రయోగంబైన సుముహూర్తం బరసి శిష్యగణంబు లభిషేకసంభారంబులు సంగ్రహించుకొని తోడ నడువ సిక్తసమ్మార్జితపథంబును బతాకాధ్వజభూషితంబు విచిత్రకుసుమాస్తీర్ణంబును సంహృష్టమనుజోపేతంబును సమృద్ధవిపణాపణంబును మహోత్సవ సమాకీర్ణంబును సర్వరాజాభినందితంబును సమంతతశ్చందనాగరుధూపపరిధూపితంబునై పురందరపురంబునుంబోలె సమస్తకల్యాణభాజనంబై యొప్పు నప్పురవరంబుఁ బ్రవేశించి రాజమార్గంబునం జని చని యందు నానాద్విజగణయుతంబును బౌరజానపదాకీర్ణంబును బ్రాహ్మణోపశోభితంబును యజ్ఞకర్మవిశారదపరమర్త్విగ్జనసదస్యసంపూర్ణంబునైన యంతఃపురంబు డాయం జని యచ్చటివారి నందఱ నతిక్రమించి రాజమందిరద్వారంబుఁ బ్రవేశించి యచ్చటికిం జనుదెంచి యున్నవానిఁ బ్రియదర్శనుం డగుసుమంత్రుం డనుసూతు నవలోకించి మహీపతికి మారాక యెఱింగింపు మని పలికి వెండియు నతని కిట్లనియె. 374

—వసిష్ఠుఁడు సుమంత్రునితో దశరథునికిఁ దనరాక యెఱింగింపు మనుట.—

సీ. నిర్మలమందాకినీకంధిజలపూర్ణకమనీయకాంచనఘటశతంబు
భర్మదామపినద్ధపాండరవృషభంబు భూరిచతుర్దంతవారణంబు
నభినవౌదుంబరం బగుభద్రపీఠంబు ననమానరుచిరకన్యాష్టకంబు
కాంచనాలంకృతఘనకేసరాన్వితరమణీయభవ్యతురంగమంబు

తే. చామరంబులు శశినిభచ్ఛత్రమును స
మగ్రశార్దూలచర్మసింహాసనంబు
ఖడ్గమును గార్ముకంబును గనకరథము
వర్ణితంబైన నరయుక్తవాహనంబు. 375

వ. మఱియు హిరణ్మయం బగుభృంగారువును సర్వబీజంబులును గంధంబులును వివిధంబు లగురత్నంబులును క్షౌద్రంబును దధియును ఘృతంబును క్షీరంబును లాజలును సమిత్కుశప్రముఖహోమద్రవ్యంబులును సర్వవాదిత్రసంఘంబులును బుణ్యంబు లగు మృగపక్షిగణంబులును స్వలంకృత లగు యువతులును బౌరజానపదశ్రేష్ఠులును నాచార్యులును బ్రాహ్మణులును శ్రేణిముఖ్యులును ధేనువులును బార్థివులును మఱియుం దక్షిణమంగళద్రవ్యంబు లన్నియు నొడఁగూడె మఱియు సమస్తజనంబులు గుతూహలపరులై యున్నవారు గావున నీవు రయంబున రాజసన్నిధికిం జని నారాక యెఱింగించి రామాభిషేకముహూర్తసమయం బాసన్నంబయ్యె నని చెప్పు మనిన నతం డట్లకాక యని యపార్థ

గమనంబున నంతఃపురంబుఁ బ్రవేశించి దశరథునకుం బాటిల్లిన దురవస్థ యె ఱుంగనివాఁ డగుటం జేసి యెప్పటియ ట్లమ్మహీపాలునికడకుం జని సంప్రీతచే తస్కుం డగుచు నిటలతటఘటితాంజలిపుటుండై ప్రాతఃకాలార్హంబులును బరితోషకారణంబులు నైన వాక్యంబుల నిట్లనియె. 376

సుమంత్రుఁడు దశరథుని మేలుకొలుపుట.

తే. అధిప సంపూర్ణచంద్రోదయంబునందు
సంక్రమితతన్మనోజ్ఞ తేజమున జలధి
చెలఁగి సుప్రీతుఁ డగుచు రంజిల్లఁ జేయు
కరణి రంజిల్లఁ జేయుము కరుణ మమ్ము. 377

ఉ. మాతలిజంభసూదనునిమాడ్కి శ్రుతు ల్పరమేష్ఠినట్ల య
బ్జాతసఖుండు చంద్రుఁడును బాయక నెప్పుడు మేదినింబలె
న్భూతలనాథ యే నినుఁ బ్రబోధితుఁ జేసెద మేలుకొమ్ము సం
జాతకుతూహలంబునఁ బ్రసన్నముఖుండవు గమ్ము నాయెడన్. 378

ఉ. రాజవరేణ్య మోద మలరం గృతకౌతుకమంగళుండవై
యోజ దలిర్ప రత్నరుచిరోత్తమభూషణభూషితుండవై
తేజ మెలర్ప భాస్కరుఁడు దేవనగంబున నుండి సర్వది
గ్రాజి వెలుంగ వెల్వడినకై వడి లెమ్ము ప్రసన్నమూర్తివై. 379

క. జననాథ పవనసోములు, దిననాథుఁ డుషర్బుధుండు దేవాధిపుఁడు
న్వననిధివిభుండు శంకరుఁ, డనిశము జయ మిత్తు రతిదయామతి నీకున్. 380

సీ. మనుజనాయక రాత్రి చనియె సహస్రాంశుఁ
డుదయించె మేల్కాంచి యుచితవిధులు
సలిపి రామాభిషేచనకార్య మొనరింపఁ
గడఁగు మరుంధతీకాంతుఁ డఖిల
సంభారములఁ గూర్చి సకలభూపురయుతుం
డై నగరద్వారమందు నిలిచి
యున్న వాఁ డెల్లవా రుత్సవశ్రీదర్శ
నోత్సాహులై కూడి యున్నవారు

ఆ. చందురుండు లేని శర్వరి కరణిఁ గా, పరియు లేని పసుల పగిది గిబ్బ
లేని మొదవుభంగి నై నీవు, లేని పీ, డూనర వేడ్క సేయ కున్న దిపుడు 381

వ. అని పలికిన నతనిస్తుతివచనంబు లాకర్ణించి క్రమ్మఱ నమ్మహీపతి శోకమూర్ఛా పరవశుం డగుచు నెఱ్ఱనిపిరితామరలం దెగడుకన్నులు విచ్చి సుమంత్రునవలోకించి నష్టహర్షుఁడై కైకేయీక్రూరవచననికృత్తమర్ముండ నైననన్ను స్తుతివాక్యంబుల

చేతఁ గ్రమ్మఱ నేల పరితపింపఁ జేసెద వనిన నతం డమ్మహీవిభుని దీనస్వరంబును వదనంబునందలి వైవర్ణ్యంబును బరికించి యిది యేమియొకో యని వెఱఁగందుచు నేమియుం బలుక నేరక యూరకుండె నప్పుడు స్వకార్యోచితవిచారజ్ఞ యగు కైక సూతపుత్త్రు నవలోకించి యిట్లనియె. 382

కైక రాముని దోడితెమ్మని సుమంత్త్రు నియోగించుట.

ఉ. ఓయి సుమంత్ర రామవిభవోత్సుకుఁడై జననాథుఁ డీనిశ
న్బాయక నిండుజాగర మొనర్చుటచేఁ గడు డస్సి యిందు ని
ద్రాయుతుఁ డయ్యె నీ వరిగి రాజకుమారవరేణ్యు జానకీ
నాయకు రామభద్రుని జనప్రియుఁ దోడ్కొని రమ్ము చెచ్చెరన్. 383

వ. అని వేగిరపడి పలికిన నద్దేవి పలుకులం దోఁచువిశ్వాసంబువలన నిక్కంబుగా మహీపతిశాసనంబున నద్దేవి యభిషేకార్థంబు రాముని దోడ్కొని రమ్మనియె నని తలంచుచుఁ బ్రీతచేతస్కుండై సాగరప్రాదసంకాశం బయిన యంతఃపురంబు నిర్గమించి జనసంబాధం బగు మొగసాలకడకుం జనుదెంచి యచ్చట నున్న మహీపతులను బౌరుల నుపహారపాణుల నుపస్థితుల విలోకించుచుం బోవుచుండె నప్పుడు సభాసదనంబునందు నిండి యున్న వేదపారగు లగు విప్రులును బలముఖ్యులును మంత్త్రులును మహీపతులును రాజపురోహితులును దక్కిన సమస్తజనంబు లొక్కట గుంపులు కట్టి తమలోన సూర్యుఁ డుదయించెఁ గర్కాటకలగ్నంబు డగ్గఱియె సమగ్రవ్యాఘ్రచర్మసమాస్తీర్ణం బగు రథంబును గాంచనమయం బగు భద్రపీఠమును సాగరగంగాయమునాసరస్వతీప్రముఖ ముఖ్యాపగాసరోవరప్రాదకూపజలపూరితంబులై క్షీరివృక్షపల్లవోపేతంబులై పద్మోత్పలకైరవశోభితంబులైన సరస్సులచందంబునం దనరు ధౌతకలధౌతఘటంబులును దధిమధుఘృతలాజదర్భపుష్పక్షీరప్రముఖమంగళద్రవ్యంబులును సర్వాభరణభూషిత లగు వారకాంతలును జంద్రాంశువికచప్రఖ్యంబును రత్నదండమండితంబును గంధపుష్పాలంకృతంబు నైన వాలవ్యజనంబును సుధాకరమండలసంకాశపాండరచ్ఛత్త్రంబును బాండురవృషభంబును బాండురాశ్వంబును బ్రవన్మదద్విపంబును రాజవాహ్యంబులును స్వలంకృతం బగు కన్యాష్టకంబును సర్వవాదిత్త్రంబులును సూతమాగధవందిగాయకులును దక్కిన సమస్తమంగళద్రవ్యంబులును సన్నిహితంబు లయ్యె నింకఁ దడ వేల యని వేగిరపడుచుండిరి మఱియు యోగ్యానర్ఘరత్నవస్తుజాతం బుపాయనంబుగాఁ గొని రాజశాసనంబున రామాభిషేకంబునకుం జనుదెంచిన మహీపతు లందఱుఁ గూడుకొని మహీపతిం జూడ మైతిమి సూర్యుం డుదయించె రామాభిషేకసంభారం బంతయు సజ్జం బయ్యె మనరాక మహీపతి కెఱిఁగించువాఁ డెవ్వండొకో యని విచారించుచుండ సార్వభౌములైన యమ్మహీపతుల నందఱ విలోకించి

రాజసత్కృతుండగుచు సుమంత్రుఁడేను రాజశాసనంబున రామునిం దోడి తెచ్చుటకుం బోవుచున్నవాఁడ మీరు దశరథునకు రామునకు విశేషించి పూజ్యులు గావున దీర్ఘాయుష్మంతు లైనమీవచనంబులవలన దశరథుని కుశలంబడిగి దర్శనంబునకు రాకుండుటకు నైనకారణంబు నడిగెద నని చెప్పి సామంత రాజానువర్తనరూపపురాణవృత్తాంతాభిజ్ఞుం డైనసుమంత్రుండు మరలి యంతఃపురద్వారంబు దాఁటి సదాసక్తం బైనయుష్మహనీయమందిరంబుఁ బ్రవేశించి యస్మహీపాలునివంశంబుఁ గొనియాడుచు శయనగృహంబులోనికిం జని యవనికమాటున నుండి గుణయుక్తంబు లైనయాశీర్వచనంబులచే స్తోత్రంబుఁ గావించుతలంపున నిట్లనియె. 384

సుమంత్రుఁడు మహీపతులనియోగంబున మరల దశరథునియొద్ది కరుగుట.

క. రవిసోములు వాసవవై, శ్రవణులు వహ్నియును మఱియు జలధివిభుండున్
శివుఁడును గారుణ్యంబున, నవనీశ్వర విజయ మిత్తు రనిశము నీకున్. 385

ఆ. అధిప రాత్రి చనియె నర్యముఁ డుదయించె, సర్వకృత్యములును జతనుపడియె
రాజవర్య యింక రమణతో మేల్కన, వలయుఁ గార్య మెల్ల నలుపవలయు. 386

క. బలముఖ్యులు భూసురులును, జెలువుగ నైగములు వచ్చి చిత్తంబున మి
మ్మెలఘుమతిఁ జూచుకోరికఁ, దలవాకిట నున్నవారు ధరణీనాథా. 387

క. అని పలుకు నలసుమంత్రుని, ఘనబుద్ధిని మంత్రవిదునిఁ గని యతని సుమం
త్రునిఁగా నెఱింగి వెసన, య్యినకులహారిణాంకుఁ డతని కిట్లని పలికెన్. 388

దశరథుఁడు రామునిఁ దోడితెమ్మని సుమంత్రున కాజ్ఞాపించుట.

సీ. సూతశేఖర నీవు సీతాధిపతిని శీఘ్రమునఁ దోడ్తెమ్మని కైకచేతఁ
బరఁగ నియోగింపఁ బడితి వట్లనుమత మనిషిద్ధ మనెడున్యాయంబుచేత
మొనసి మచ్ఛాసనంబున వచించినకైకవచన మమోఘ మవాక్య మేల
దీర్పక మరల నే తెంచితి వది నాదుమతమొ కాదో యని మానసమున

ఆ. సంశయించి యిట్లు చనుదెంచితివొ జాగు, సేయ వలదు మరలఁ జెప్ప నేల
రయము మీఱ నేగి రాముని రవివంశ, తోయరాశిసోముఁ దోడితెమ్ము. 389

చ. అనిన మహాప్రసాద మని యాతఁడు నేలినవానియాజ్ఞఁ జ
య్యనఁ దలఁ బూని భక్తివినయప్రమదంబులు మానసంబున
న్బెనఁగొన సంతతోత్సవనవీకృతరాజపథంబునం బురీ
జనములు దన్నుఁ జూచి కడుసంతస మందఁగ నేగె నున్నతిన్. 390

తే. రాజవీథుల నందంద రమణతోడఁ, జెలఁగి శ్రీరామచంద్రాభిషేకకథలఁ
జెప్పుకొనువారిమాటలు చిత్త మలర, నాలకించుచు రయమున నరిగె నతఁడు.

వ. ఇట్లరిగి యంగణంబునం జని. 392

సుమంత్రుఁడు శ్రీరామమందిరముఁ జేర నరుగుట.

సీ. సురుచిరోరుకవాటశోభితం బగుదాని వేదిశతంబుల వెలయుదానిఁ
గాంచనప్రతిమావికాసితం బగుదాని శరదంబుదములీల వఱలుదాని
రత్నప్రవాళతోరణయుక్త మగుదాని యమరాచలగుహాభ మైనదానిఁ
జందనాగరుధూపసంయుతం బగుదాని మణిమౌక్తికంబుల మలయుదాని

తే. నమలకైలాసశిఖరాభ మైనదాని, బలరిపునిమందిరముభంగి నలరుదాని
రుచిరమగుదాని రామభద్రునిమనోజ్ఞ, దివ్యమణిమయహేమమందిరముఁ గనియె.

వ. మఱియు వరమాల్యాంతరాళవిలంబమాననూతనమణిగణాలంకృతంబును మనోహరసుగంధబంధురదర్దురశైలశిఖరసంకాశంబును సారసమయూరసినదసంకులంబును సుకృతేహామృగాకీర్ణంబును సూక్ష్మచిత్రశిల్పాభిపూర్ణంబును సకలజనదృష్టిచిత్తాపహారంబును చంద్రభాస్కరసంకాశంబును కుబేరభవనోపమంబును నానాపత్త్రిసమాకులంబును సుమేరుశృంగసన్నిభంబును మహామేఘఘనప్రఖ్యంబును నానారత్నసమాకీర్ణంబును కుబ్జకైరాతకావృతంబును నుపస్థితప్రాంజలిజనసమన్వితంబును నుపాయనపాణిజానపదజనోపేతంబు నగురామభద్రునిభద్రభవనంబు విలోకించి రథంబుతోఁ గూడఁ బ్రవేశించి పురస్థితజనంబులచిత్తంబు రంజిల్లం జేయుచు యమ్మందిరంబు మహాధనంబై మహోన్నతంబై మృగమయూరసంకీర్ణంబై మహాజనాకులంబై మహేంద్రభవనంబుకరణి నలరుచునికి నానందించుచుఁ గైలాససన్నిభంబులై స్వలంకృతంబులై త్రిదశాలయోపమంబులై యొప్పుద్వారంబు లవలోకించుచు నచ్చట నున్నరామమతానుసారు లగుప్రియజనంబుల నతిక్రమించి శుద్ధాంతంబుడాసి యచ్చట హర్షయుక్తంబులు రామాభిషేకార్థప్రయుక్తంబులును రామచంద్రమంగళప్రతిపాదనప్రయోజనంబులు నగుజనవాక్యంబులువిని యలరుచు మహేంద్రసద్మప్రతిమంబును రమ్యంబును మృగపక్షిజుష్టంబును సుమేరుశృంగోన్నతంబును మనోహరప్రభావిరాజమానంబు నగునమ్మహనీయమణిసద్మంబు విలోకించి యందు వియుక్తయానులై యుపాయనపాణులై మ్రోల నిండియున్న జానపదుల వంజలికారులఁ గోటిపరార్ధసంఖ్యాతుల విలోకించి వారలచేత నభిసంవృతం బైనద్వారపథంబుఁ జూచి యచ్చట మహామేఘమహీధరసంకాశంబై మదధారాకలితగండభాగంబై యతిక్రాంతాంకుశంబై యప్రసహ్యంబై యుదగ్రకాయంబై యొప్పుచున్నదాని రామోపవాహ్యం బైనశత్రుంజయాఖ్యమహాగజంబు నీక్షించుచుం జని చని యుభయపార్శ్వంబుల స్వలంకృతులై గజాశ్వరథారూఢులై యొప్పువారి రాజప్రియుల బహుశతసంఖ్యాకుల . మహామాత్యుల నందఱ నతిక్రమించి యమ్మహాద్వారంబు దాఁటి యచ్చటఁ దేరు డిగ్గి యవ్వల ననంబాధం బై ప్రాసకార్ముకహస్తులై మృష్టకుండలులై యప్రమాదులై

యేకాగ్రమనస్కులై పరస్పరానురక్తులై యెప్పుడుయువపురుషులచేత నభిర క్షితమయినవేత్రోత్కటకక్ష్యఁడాయం జని యందుఁ గాషాయకంచుకధారులై స్వలంకృతులై సుసమాహితులై యలరునంతఃపురద్వారరక్షకులఁ బరమవృద్ధుల రామప్రియచికీర్షుల విలోకించి వా రందఱుఁ దన్ను సందర్శించి రయంబున నాసనంబుల నుండి లేచి ససంభ్రములై యెదుర్కొని వారి నభినందించి వినీతాత్ముండును సేవానిపుణుండు నగుసుమంత్రుం డిట్లనియె. 394

తే. చెలువు మీఱంగ మీరు లోపలికిఁ బోయి
రహి సుమంత్రుండు వచ్చి ద్వారమున నిలిచి
యున్నవాఁ డని నారాక యెప్ప మీఱ
మొనసి రామున కెఱిఁగింపుఁ డనిన వారు. 395

క. రయమున లోపలికిం జని, ప్రియాసహితుఁడైనరామవిభు నుచితగతిన్
నయ మారఁ గాంచి దెల్పిరి, ప్రియ మలర సుమంత్రురాక వినయముతోడన్.

క. చెప్పిన నారఘునత్తముఁ, డప్పుడు గుర్వంతరంగుఁ డయినసుమంత్రుం
దప్పక దోడ్తెమ్మని ముద, మొప్పఁగ సెల వొసఁగ వార లుత్సాహముతోన్.

వ. శీఘ్రంబున మరలం జనుదెంచి సుమంత్రునకు రామశాసనం బెఱింగించిన నతండు ప్రభూతరత్నం బగుసముద్రంబుఁ బ్రవేశించు మహామకరంబుకైవడి మహావిమానోత్తమవేశ్మసంఘవంతం బైనయంతఃపురంబుఁ బ్రవేశించి యం దొక్కసువర్ణపర్యంకమధ్యంబున. 398

సుమంత్రుఁడు రామునికి దశరథనియోగం బెఱింగించుట.

సీ. కటితటి శోభిల్లు కౌశేయచేలంబు ఘనముచెంగటిమించుకరణిఁ దనర
హరిచందనార్ద్రకాయంబు సంధ్యారాగఘనయుక్తనీలాద్రిగతి వెలుంగ
ఘనహారకలితవక్షము లసన్నక్షత్రశోభితాభ్రముభంగి సొం పెలర్ప
నిరువంక సేవించుపరరాజకీర్తులకరణి ముత్యాలచౌకట్లు మెఱయ

తే. రత్నహారంబు లురమునఁ గ్రాల వామ, భాగమున నుండి జానకి భర్మదండ
చామరము వీవఁ దారకాజానిభంగి, వెలయు రాఘవుని సుఖోపవిష్టుఁ గనియె.

క. కని వినయజ్ఞుఁడు సూతుఁడు, మునుకొని తత్పాదమూలములు దల సోఁకం
బ్రణమిల్లి కృతాంజలియై, వినయంబున నిట్లు లనియె విశ్రుతఫణితిన్. 400

క. అనఘాత్మ నృపతి కేకయ, మనుజేంద్రకుమారికాసమన్వితుఁ డగుచు
న్నినుఁ జూడఁ గోరి ననుఁ దో, డ్కొని రమ్మన వచ్చితి న్వటుత్వరితగతిన్. 401

క. నా విని రాముఁడు మోదం బావిర్భవ మొంద సూతు నర్హవిధుల సం
భావించి వేగ సీతా, దేవికి నిట్లనియె వదనదీధితు లడరన్. 402

క. వనితా నృపతియుఁ గైకయు, ఘనబుద్ధి మదర్థమందుఁ గడువడి నభిషే
చనసంయుతపర్యాలో, చనమును గావించు చున్నచందము దోఁచెన్. 403

వ. మఱియుఁ గేకయరాజనందని రాజసౌముఖ్యాదిప్రయోజనంబుకొఱకు సంతతంబు మృదుమధురభాషణపరిచర్యాభక్తియోగంబుల నమ్మహీపతిచిత్తం బెఱింగి వర్తించుచుండు నట్టిహితకామానువర్తినియు మదర్థవృద్ధ్యపేక్షిణియు నైనయద్దేవి వృద్ధుం డగుమహీపతియభిప్రాయం బెఱింగి సుదక్షిణ గావున రాజునకుఁ బ్రియంబు పుట్టఁ బరమానందంబున మదభిషేకంబును గూర్చి రంజిల్లుచున్నదని యూహించెద నట్లు గాదేనిఁ బ్రియాసహితుం డై మహీరమణుండు మదర్థకామకరుం డైనసుమంత్రుని మత్సకాశంబునకుం బుచ్చునే మదర్థైకప్రయోజనుం డగుసుమంత్రుండు చనుదెంచుటం జేసి రాజాంతఃపురంబునందు మదర్థైకప్రయోజనం బైనపర్యాలోచనంబు ప్రవర్తించుచున్నది సందియంబు లేదు మహీరమణుం డిప్పుడు నన్ను సామ్రాజ్యపట్టభద్రునిం జేయు నమ్మహాత్మునిసదనంబునకుం బోయి వచ్చెద నిచ్చట సఖీజనంబులతోడం గ్రీడించుచు సుఖం బుండు మని పలికినఁ బతిసన్మానిత యగుసీత సంతుష్టాంతరంగ యై మృదుమధురభాషణంబుల నిట్లనియె. 404

సీ. ప్రాణేశ సర్వశుభంబును నినుఁ బొందుఁ బరమేష్ఠి యలశచీపతికిఁ బోలె
నుర్వీశ్వరుఁడు నీకు యువరాజపట్టంబుఁ గట్టువాఁ డుత్తరకాలమందు
రాజసూయమహాధ్వరమున దీక్షితుఁడ వై యజినంబుఁ దాల్చి మహాభూతి
పటుకురంగవిషాణపాణి వై యలరారునినుఁ గాంచి భజియింతు నెమ్మితోడఁ
ఆ. బోయి రమ్ము వజ్రి పూర్వాశ శమనుండు, పరఁగ దక్షిణాశఁ బాశపాణి
పశ్చిమాశ యక్షపాలుఁ డుత్తరదిశఁ, గాతు రెపుడు నిన్నుఁ గరుణతోడ.

రాముండు దశరథమందిరంబునకుఁ బోవుట.

వ. అని యిట్లు మంగళం బొసంగి పతివెంట ద్వారపర్యంతం బరుగుదెంచి సముచితంబుగా వీడుకొల్పిన ననుష్ఠితార్థమంగళుం డగునారఘుపుంగవుండు సీతచేత నామంత్రణంబు వడసి గిరిగుహాముఖంబువలన నిర్గమించుదృప్తకంఠీరవంబుచాడ్పున నిజమందిరంబు వెలువడి యంతఃపురద్వారంబునందు బద్ధాంజలి యై గాచికొని యున్నలక్ష్మణుం గలిసికొని మధ్యమకక్ష్యాంతరంబునందు వ్యాఘ్రచర్మయుక్తంబును మణిహేమవిభూషితంబును మార్తాండమండలదుర్నిరీక్షంబును మేఘగంభీరనిర్హ్రాదంబును గరేణుశిశుకల్పజవతురంగసంగతంబును నసంబాధంబును నగుసుందరస్యందనం బారోహించి దివ్యరథాధిరూఢుం డైనసహస్రాక్షునిచందంబున నందం బగుచు మహాభ్రంబువలన నిర్గమించుశశాంకునిభంగి వెలుంగుచు గగనంబునందు స్వనవంతుం డైనపర్జన్యునిసొబగున రథనేమిఘట్టనసంజాతనిస్వనంబున దిగంతంబులు పూరించుచు నానావనీపకలోకంబుమీఁదఁ దనచల్లనిచూపులు వెదచల్లుచు ఛత్రచామర

హస్తుం డై లక్ష్మణుండు పిఱుంద దేశ రథంబుమీఁద నుండి బహుప్రాకారంబుల రక్షించుకొనుచుం జనుదేర వాయువేగంబు లగుహయంబులును గిరిసన్నిభంబు లగుగజంబులును బహుసహస్రంబులు పశ్చాద్భాగంబునం జనుదేర సన్నద్ధులై ఖడ్గచాపధరులై చందనాగరుధూపితులై యోధు లనేకు లగ్రభాగంబున నడువ సూతమాగధవందిగాయకపాఠకజనంబు లమందానందంబున నభినందింప మురజమృదంగపణవశంఖకాహళనిస్సాణవేణువీణాప్రముఖనిఖిలమంగళవాద్యరవంబులు సెలంగ హయహేషితంబులును గజబృంహితంబులును రథనేమినిస్వనంబులును తూర్యఘోషంబులును మాగధాదులస్తుతినాదంబులును గాయకులగానస్వనంబులును భూసురులయాశీర్వాదనాదంబులును జనంబులహర్షశబ్దంబులును వారకాంతలచరణనూపురక్రేంకారనినదంబులును వేత్రపాణులసాహోనాదంబులు శూరులసింహనాదంబులు నొక్కటియై మిన్నుముట్టి మ్రోయ హర్మ్యాగ్రభాగంబులనుండి పురాంగనలు పుష్పంబులు సేసలుఁ జల్ల భూసురాంగనలు కర్పూరదీపకళికలనివాళింప ననంతవైభవాభిరంజితుం డై యారఘుకుంజరుండు శ్రీమంతుం డగు వైశ్రవణునిభంగి వెలుంగుచుఁ గరేణుమాతంగరథాశ్వసంకులం బగుదాని మహాజనౌఘప్రతిపూర్ణచత్వరం బగుదానిఁ బ్రభూతయానం బగుదాని బహుపణ్యసంచయం బగుదానిఁ బతాకాధ్వజసంపన్నం బగుదాని మహార్హచందనాగరుధూపవాసితం బగుదాని నానాజనసమాకులం బగుదాని మహాభ్రసంకాశపాండురమందిరోపశోభితం బగుదాని ముఖ్యచందనాగరుసంచయంబుల మహార్హగంధంబుల క్షౌమకోశాంబరవితానంబుల ననర్ఘముక్తాజాలంబుల మహనీయస్ఫటికోపలంబుల నానాపణప్రసారితనానావిధభక్ష్యపదార్థంబులదధ్యక్షతహవిర్లాజచందనాగరునానామాల్యోపగంధంబులచేత నిరంతరాభ్యర్చితంబు లైనశృంగాటకంబుల నభిరంజితం బగుదానిఁ బాండురవిమానంబులచేత గగనంబునుం బోలెఁ గైలాసశిఖరోపమపాండురమేఘసంకాశరమణీయప్రాసాదశృంగంబులచేత నభిరామం బగుదాని రాజమార్గంబుఁ బ్రవేశించి సుందరమందగమనంబునం బోవుసమయంబున. 406

పౌరులు రాముని నానావిధంబుల నభినందించుట.

చ. లలితవిచిత్రహర్మ్యపటలంబులపై నలరారుపౌరకాం
తలు దమలోన నీరఘువతంసుఁడు రాజ్యపదప్రవిష్టుఁ డై
యిల నతులప్రభావమున నేలఁగ నేఁటికిఁ గంటి మెంతయుం
దలఁపఁగ నస్మదీయసుకృతంబు గణింపఁ దరంబె ధాతకున్. 407

తే. చెలఁగి సామ్రాజ్యపట్టాభిషిక్తుఁ డైన, సుతవరుని సిద్ధయాత్రునిఁ జూచి నేఁడు
పుణ్యసాధ్వి కౌసల్య యభూతపూర్వ, ఘనతరానందకలిత యై తనరుఁ గాదె.

తే. సోముఁ గూడినరోహిణీభామపగిది
నీజగన్మోహనునిఁ గూడి యింపు మెఱయ
సర్వభోగంబులు భుజించు జనకతనయ
సకలసీమంతినీవతంసంబు గాదె. 409

క. ఈఘనునకుఁ బ్రియగేహిని, యై ఘనరాజ్యాభిషి క్త యగుటకు మున్నా
మేఘులసత్కృచ మహిజ య, మోఘతపం బేమి నిక్కముగ సల్పె నొకో. 410

క. అని యిట్లు రామభద్రుఁడు, విను చుండఁగఁ జెప్పుకొనుచు వేడుకతోడం
గొనియాడుచు నప్పుణ్యునిఁ, గనుఁగొను చుండి రటు కౌతుకం బలరారన్. 411

వ. మఱియును. 412

ఉ. ప్రాకటభూరిచత్వరసభాభవనంబులయందు భూజను
ల్గాకలు గట్టి యీపరమపుణ్యుఁడు దీనశరణ్యుఁ డిష్టరా
జ్యైకపదస్థుఁ డయ్యె నహహా మముఁ బోంట్లకు నెల్ల సంతతా
స్తోకతరేష్టసంపదలు సొప్పడుఁ గాదె దలంచి చూడఁగన్. 413

ఆ. ఈమహానుభావుఁ డేలు రాష్ట్రంబునఁ, గాఁపురములు సేయుఘనుల కమర
లోక మేల యన్యలోకంబు లేల య, భీప్సితార్థసిద్ధు లిందె గలుగు. 414

తే. అనఘుఁ డీరాముఁ డధినాథుఁ డగుచు నుండ
నప్రియము దుఃఖ మొక్కింత యైనఁ గలుగ
దింతకంటె మహీప్రజ కెద్ది లాభ
మితఁడు చిరజీవి యై ధాత్రి నేలుఁ గాక. 415

రాముఁడు దుఃఖితుం డగుదశరథునిఁ జూచి విచారపడుట.

వ. మఱియు రాముండు రాజ్యాభిషిక్తుండగుచుండఁ బితృపితామహులచేత నుప లాలితు లైనపుత్రపౌత్రకులభంగి మన మందఱము సర్వసుఖంబులు వడయం గలవారము మన కిప్పుడు భోజనంబేల పరమపురుషార్థసాధనంబు లైనతపస్స్వాధ్యాయజపహోమధ్యానాదికంబు లేల యితండు రాజ్యంబునందు సుప్రతిష్ఠితుండై శత్రుంజయం బనుమహానాగంబు నారోహించి రాజమార్గంబునం జను దెంచు నప్పు డిమ్మహనీయమూర్తి నవలోకించునదియె మనకు సుఖలాభం బైహికవిషయంబుచేతను దజ్జన్యసుఖంబులచేతను శ్రేష్ఠార్థంబు లైనస్వర్గాదుల చేతను దజ్జన్యసుఖంబులచేతను దృప్తి నొందినవార మగుటకు సందియంబు లేదు మహాతేజుం డగురామునియభిషేకజన్యభూమానంద బ్రహ్మానాందోత్కా రసుఖంబునకంటెఁ బ్రేమాతిశయాస్పదం బగునొండుకార్యం బొక్కింతయైనఁ గలుగనేర దదియునుం గాక యీరాఘవుండు దృష్టిపథంబు నతిక్రమించిన వాఁడయ్యును సకలజనమనోనయనసమ్మోహనాకారానుభవజనితవాసనాబలం బునఁ గట్టెదుటం గనుపట్టిన ట్లొప్పుచున్నవాఁ డమ్మహాత్మునివలనం జిత్త

వీక్షణంబులు గ్రమ్మఱించుట కొక్క పురుషుండైన సమర్థుండు లేఁడు కాంతలం జెప్ప నేల నొక్కసారియైనఁ దత్సాన్నిధ్యాసాన్నిధ్యంబులయందుఁ జక్షుర్ధ్యానస్థంబులచేత నెవ్వండు రామునిం జూడ కుండుఁ గరుణాంతరంగితాపాంగవీక్షణంబుల రాముం డెవ్వని విలోకింప కుండు నట్టివాని లోకంబు గర్హించు నంతియె కాదే నెంత దుర్భాగ్యుఁడ నని తన్నుఁ దాన గర్హించుకొను నీపరమోదారుండు సకలవర్ణంబులకు సకలజనంబులకు వయోనురూపం బైనదయ నొసంగుం గావున సర్వజనంబు లితని కనువ్రతు లై యుందు రని యిట్లు పెక్కుతెఱంగుల వినుతించువారిభద్రవాక్యంబు లాకర్ణించుచు నెల్లవారిని యథార్హంబుగా వీక్షణోక్తిభ్రూవిక్షేపణాంజలులచేతఁ బూజించుచుఁ బితృపితామహులచేత నధిష్ఠితం బైనధర్మమార్గంబు ననుసరించి యభిషిక్తుండ వై చిరకాలంబు రాజ్యం బేలు మని పలుకుపరమవృద్ధుల యాశీర్వాదంబులు వీనులం బొలయ నుత్సుకుం డై మనోహర్షకరంబు లైన సుహృజ్జనులహితప్రసంగంబులు వినుచుఁ జైత్యాయతనదేవాగారంబులకుఁ బ్రదక్షిణంబు సేయుచుఁ గృతపుష్పోపహారం బై నక్షత్రశోభితం బైనయాకాశపథంబు మాడ్కిఁ జూడ్కికి వేడ్క సేయుచున్నరాజమార్గంబునం జని చని ముందఱ రత్నజాలపరిష్కృతంబు లైన వర్ధమానగృహంబులచేత శారదాభ్ర ప్రతీకాశంబు లైన విమానంబులచేతఁ గైలాసశిఖరాకారంబు లైనమహోన్నతప్రాసాదశిఖరంబులచేత నభిరామదర్శనం బై యున్న రాజభవనంబుఁ గాంచి హర్షపులకితగాత్రుం డై యమ్మణిమయమందిరంబుఁ బ్రవేశించి కక్ష్యాత్రయం బతిక్రమించి యచ్చట రథంబు డిగ్గి తేవసంబున నవ్వలికక్ష్యాద్వయంబు దాఁటి సహచరుల నందఱ నచ్చట నిలువ నియమించి క్రమంబునఁ గక్ష్యాంతరంబు లన్నియు నతిక్రమించి శుద్ధాంతఃపురంబుఁ బ్రవేశించె జనంబంతయుఁ జంద్రోదయంబు నాకాంక్షించుసరిత్పతిభంగి రాముని పునరాగమనంబుఁ గోరుచు మధ్యమద్వారంబున నుండె రామభద్రుం డట్లు సముచితంబుగా నంతఃపురంబునకుం జని యందుఁ గైకేయీసహితుండై పర్యంకమధ్యంబునం బవ్వళించి మొగంబున వైవర్ణ్యంబు దోఁపఁ గన్నుంగవ మోడ్చి యున్నతండ్రి నవలోకించి తదీయచరణంబులకు నిజనామోచ్చారణపూర్వకంబుగా నభివందనంబుఁ గావించి పదంపడి కైకేయిపదంబులకు నమస్కరించిన నద్దశరథుండు మెల్లనఁ గన్నులు విచ్చి కుమారువదనంబు విలోకించి రామా యని పేర్కొని బాష్పపర్యాకులేక్షణుం డై యతని విలోకించుటకుం జాలక గ్రమ్మఱ నేత్రంబులు ముకుళించి రామా యనెడు నక్షరద్వయోచ్చారణంబుకంటె నధికం బుచ్చరించుటకు భరం బై తోఁచిన నతనితోడ సంభాషించుటకుం జాల కుండె నివ్విధంబున క్షుభితం బగుసముద్రంబుపగిది నువ్వ్ల

తుం డై నసూర్యునిభంగి ననృతం బాడినమహర్షిపోలిక వ్యధితాకులిత చిత్తుం డై తేజోహీనుం డై శోకసంతాపకర్శితుం డై యదృష్టపూర్వవిషాదుం డై యప్రహృష్టేంద్రియుం డై యూర్పులు పుచ్చు చున్నదశరథుం జూచి పాదం బుచేతఁ బన్నగంబును సంస్పృశించినవానిపగిది భయంబుఁ గొని యచింత్య కల్పం బైనజనకునిశోకంబు విలోకించి పర్వకాలసముద్రునిభంగి సంరబ్ధతరుం డై పితృహితతత్పరుం డగురాముండు తొల్లి పరోక్షంబునందు నాయందుఁ గుపితుం డయ్యును నన్నువిలోకించినప్పుడు ప్రసాదం బొసంగు నట్టిపరమదయాళుం డై నయిమ్మహీరమణుం డిపు డేలకో నన్ను విలోకించి ప్రీతి సేయక దుఃఖంబు నొందియున్నవాఁ డని విచారించి విషణ్ణవదనుం డై దీనుండునుంబోలె శోకార్తుం డై కైకేయి కిట్లనియె. 416

రాముఁడు దశరథదుఃఖకారణముఁ గైకేయి నడుగుట.

చ. అతులకృపాసమృద్ధి నను నక్కునఁ జేర్చెడునట్టితండ్రి నేఁ
డతికుపితాత్ముఁ డై యునికి కైనవిధం బెఱిఁగింపు మేను దు
ర్మతి నొనరించినట్టియపరాధ మొకింతయు లేదు తల్లిరో
హితమతితోడ నీ వయిన నివ్విభు వేఁడు మనుగ్రహార్థ మై. 417

చ. ఇలపయి దేహధారులకు నెప్పు డపాయము లేనిసౌఖ్యము
ల్గలుగుట చాల దుర్లభము గావున మానవభర్త కంగహృ
త్కలితరుజావిశేషములు గల్గెనొ లే కనృతంబు లాడెనో
కలతెఱఁ గంతయుం దెలుపఁ గాఁ దగు నీ కిటు దాఁచ నేటికిన్. 418

క. భరతునియందు సుమిత్రా, వరపుత్రునియందు మాతృవర్గమునందు
న్నరవరుఁ డశుభం బేమియుఁ, బరికించెనొ దానిఁ దెలియఁబలుకుము నాతోన్.

క. జనకునకుఁ బ్రీతి సేయక, జనకునివాక్యంబు భక్తి సలుపక ధరలో
జననీ యొకత్రుటి యైనను, మనఁ జాలను గుపితుఁ డైన మనుటకు వశమే. 420

క. తనపుట్టువునకు మూలం, బని యెఱుఁగువివేకశాలి యగునరుఁ డేలా
జనకుని యనువర్తింపఁడు, తన కిలఁ బ్రత్యక్షదైవతం బగు చుండన్. 421

ఆ. జనని నీవు గర్వమునఁ గోపచిత్త వై, పరుషభాషణములు పలికి తొక్కొ
తండ్రిచంద మెల్లఁ దగఁ జెప్పు కుండిన, నిమిష మైన నోర్వనేర నింక, 422

క. శ్రీమహితరూపుఁ డగునీ, భూమీశ్వరునం దభూతపూర్వవికారం
బేమికతంబునఁ బొడమె ద,యామతి నెఱిఁగింపు మమ్మ యనవద్యగుణా.

కైక రామునికి మున్ను తనకు దశరథుఁడు వరద్వయం బిచ్చినతెఱం గెఱింగించుట.

వ. అనిన విని యయ్యంగన శంకారహితాంతరంగ యై సిగ్గు విడిచి రఘుపుంగవునవలోకించి పుత్రా భవజ్జనకుండు గుపితుండు గాఁ డతనికి వ్యసనంబు లే దొక్కింత మనోగతం బైనకార్యంబు గలదు ప్రియార్హుండ వైన నీతోడ నప్రియంబుఁ

బలుకంజాలక భయంబుఁ గొని యున్నవాఁడు నేను జనకునియట్ల నీకు మన్నించుటకుం దగినదాన నగుటం జేసి నాచేత నేది పలుకం బడు నక్కార్యంబు నీ కవశ్యకర్తవ్యంబు గదా తొల్లి యీమహీరమణుండు దేవాసురసంగ్రామంబున నన్ను మన్నించి వరద్వయం బిచ్చె నని పలికి పదంపడి ప్రాకృతునియట్ల పరితపించుచు సకలధర్మమూలం బైనసత్యంబు విడిచి భవన్నిమిత్తంబున నాయందుఁ గుపితుం డై రోషదోషంబున నవ్వరంబులు వ్యర్థంబులు సేయం దలంచియున్నవాఁడు తన్మనోగతం బైనకార్యంబు నీవు నిక్కంబుగా నెఱవేర్చెద నంటి వేని యతండు చెప్ప కున్న రాజానుమతంబున నేను దెలియఁ జెప్పెద నిమ్మహీపతి వరంబు లిచ్చెద నని పలికి క్రమ్మఱ లోభంబునఁ దప్పించుకొనఁ దలంచు టెల్లఁ గతజలసేతుబంధనంబు గదా యని పలికిన రాముండు వ్యథితుండై రాజసమక్షంబునఁ గైకేయి కి ట్లనియె. 424

రాముఁడు దశరథానుమతంబు నెఱవేర్చెద నని ప్రతిజ్ఞఁ జేయుట.

ఉ. ఇచ్చట రాజు దా నొడువ నిచ్చఁ దలంచినమాటఁ జెప్పు మే
జెచ్చెరఁ జేయువాఁడ నృపశేఖరునాజ్ఞ విషంబు నైన నే
నొచ్చెము లేక గ్రోలెదఁ బయోధిహుతాశనులందు నైన నేఁ
జొచ్చెద రాఘవుం డరసి చూచిన నాడినమాట దప్పునే. 425

వ. దేవీ యిమ్మహాత్ముండు నాకు గురుండును దండ్రియు నృపుండును హితుండును గావున నట్టివానివాక్యకరణంబునందు సందేహవిషయీభూతునిఁగా నన్నుఁ దలంచుట నీకు యుక్తంబు గాదు. 426

చ. అన విని కైక యిట్లనియె నాతనితో మును దేవదైత్యభం
డనమున భూవరుండు జగడం బొనరించి నిశాటబాణపా
తనమున మూర్ఛపోయినఁ బదంపడి యేను సజీవుఁ జేయ లో
ననుఁ గరుణించి సమ్మదమునన్ వరయుగ్మ మొసంగె మెచ్చుచున్. 427

కైక రామునికిఁ దాను వరద్వయంబునకుఁ గోరినతెఱంగుఁ జెప్పుట.

క. అనఘాత్మ యొకవరంబున, కనుపమగతి మత్తనయున కభిషేకముఁ ద
క్కిన రెండవవరమునకుం, గొనకొని నీ కడవి నునికిఁ గోరితి నిచటన్. 428

క. జనకుని సత్యవ్రతునిఁ గ, నొనరింపఁగఁ దలఁచి తేని యుత్తమగుణయు
క్తిని నాచెప్పెడువాక్యము, వినుము విచారంబుఁ దక్కి విమలవిచారా. 429

సీ. జనకునిశాసనంబున నీవు ఘనజటాజినచీరధారి వై సిరిని విడిచి
తాపసవేషంబుఁ దాల్చి చతుర్దశవర్షము ల్దండకావనమునందు
విహరింపవలయు నీవిభునిచే భవదర్థమందె భరతుఁడు గృతాభిషేకుఁ
డై యయోధ్యాపురమందు రాజ్యం బేలు నిమ్మాటఁ జెప్పుట కీనృపుండు
తే. నేరక విషణ్ణవదనుఁడై నిన్నుఁ జూడ, వెఱచి యున్నాఁడు గావున విభునిమాట

దప్పకుండంగ వనమున కిప్పు డరిగి, నృపవరుని సత్యమున నుద్ధరింపు మనఘ

వ. అని పలికిన మరణోపమం బైన యమ్మద్దేవిపరుషవాక్యం బాకర్ణించి యవ్వాక్యం బప్రియం బైనను మహానుభావుండు గావున నొక్కింత యైన మనంబున శోకంబు నొందక వదనంబున వైవర్ణ్యాదిబాహ్యవికారంబు నొందక వెండియుఁ గైకేయి కిట్లనియె. 431

రాముఁడు కైకేయిచెప్పినప్రకారము ఒప్పుకొనుట.

చ. అనఘవిచారుఁ డైనపతియాజ్ఞ శిరంబునఁ బూని వేడ్కతో
ననుపమబుద్ధి నీకఱపినట్ల జటాజినముల్ ధరించి కా
ననమున కేఁగెద న్మనుజనాయకుఁ డేటికి నన్నుఁ జూచి నె
మ్మనమున విశ్వసింపక విసన్నత నొందె నెఱుంగఁ జెప్పుమా. 432

క. మనమున దైన్యము విడువుము, వని కరిగెద నిపుడు జడలు వల్కలములు గ్ర
క్కునఁ దాల్చి సంతసింపుము, పనివడి నీమ్రోల నిజముఁ బల్కితిఁ దల్లీ. 433

క. క్షితివిభుఁడు గురుఁడు దండ్రియు, హితుఁడు గృతజ్ఞుండు నమ్మహీశువచనము
స్థితమతి విస్రబ్ధుఁడ నై, చతురతఁ గావింతుఁ గాక జవ దాఁటుదునే. 434

క. జననీ భరతునియభిషే, చన మీనరవిభుఁడు దానె సమ్మతితోఁ జె
ప్పనికారణమున నామన, మనలజ్వాలికల నేర్చిన ట్లయ్యె రహిన్. 435

ఆ. అప్రచోదితుండ నయ్యును భరతున, కఖిలరాజ్య మిచ్చునట్టివాఁడ
జనకుచేత నిట్లు సంప్రచోదితుఁడ నై, యిచ్చుటకు విచార మేల గలుగు. 436

సీ. కావున జనని భూకాంతుఁ డాడినమాటఁ జెల్లించుటకుఁ బూని యెల్లసిరులు
భరతున కొసఁగి సంపద్భోగములు వీడి నయశాలినికి నీకుఁ బ్రియముగాఁగఁ
బదునాల్గువర్షము ల్వనమున నుండెద నిపుడు భూవిభుఁ డేల హితము విడిచి
యాస్యంబు వాంచి ధరాసక్తనయనుఁ డై కన్నీరు నించుచు నున్నవాఁడు

తే. మానవేంద్రుని వేగ ననూనయింపు, మిపుడె కేకయధరణీశు నింట నున్న
భరతునిచటికిఁ దోడ్తేరఁ బటురయమున, జారులనుబుచ్చుమునృపాలుశాసనమున.

కైకేయి రామునితో భరతాగమనపర్యంతం బుండవలదని వేగిరపడి చెప్పుట.

వ. అని పలికిన నారఘుపుంగవుండు సమ్మతించుటకు సంతుష్టాంతరంగ యై యయ్యంగన నీచెప్పినట్ల శీఘ్రగతు లగుదూతలం బంచి మాతులకులంబున నున్నభరతుని రావించెద నతం డరుగుదెంచునందాఁక నీవిచ్చట నుండవలదు రయంబున నిపుడె వనంబునకుం జను మిమ్మహీరమణుండు నిజసత్యపారప్రాప్త్యదర్శనసంజాతవ్రీడాభరంబున మొగంబు వాంచి మూర్ఛాక్రాంతుం డై సంభాషించుటకుం జాలక యున్నవాఁ డిట్టివానిసంభాషణంబునుం గూర్చి చింతించుటకు కార్యంబు గాదు నీ వవిలంబగమనంబున నిద్ధరాపతిదైన్యం బపనయింపవలయు నదియునుం గాక నీ వరణ్యంబునకుం జనునందాఁక భవజ్జనకుండు మజ్జన

భోజనాదులు సలుపం డని వేగిరపడి పలికిన నక్కైకేయిదారుణవాక్యంబు
విని యక్కకుత్స్థకులతిలకుండు ధైర్యధుర్యుండు గావున నొక్కింత యైన మ
నంబున శోకింపక కైకేయివచనంబునకు రోయుచు శోకపరిప్లుతుం డై యూ
ర్పులువుచ్చుచు హేమభూషితం బైనపర్యంకంబు మీఁదం బడి పొరలు చున్న
తండ్రిం గ్రుచ్చి యెత్తి సాంత్వవచనంబులం దేర్చుచుఁ గశచేతఁ దాడితం
బైనవాజిచందంబున వనగమనంబునందుఁ గృతత్వరుండై వెండియుఁ గైకకి
ట్లనియె. 438

సీ. జనని నే ధనపరుండను గాను లోకంబు నొగి సంగ్రహించుట కుత్సహింప
ననుము ముని సమునిఁ గా నయసత్యధర్మతత్పరునిఁ గా నెఱుఁగుము పరఁగ నెద్ది
నాచేతఁ బతికిఁ బ్రాణత్యాగమున నైన సత్ప్రియం బొనరింప శక్య మదియుఁ
గృత మయ్యె నని నీవు మతి నెఱుంగుము జనవిభునకు హితముఁ గావించుకంటెఁ
తే. దలఁప నాకుర్వి వేఱొక్కధర్మ మెద్ది, లేదు గావున నృపుఁడు దా నూఁదిచెప్ప
కున్ననీయాజ్ఞ శిరమున నునిచి గహన,వాటి నుండెదఁ బదునాల్గువత్సరములు.
వ. తల్లీ నీవు నా కత్యంతనియంత్రి వయ్యు భరతున కభిషేకంబుఁ గావించి నీవు
వనంబునకుం జను మని భవద్వచనకారి నైన నన్ను నియోగింపక మహావిభుని
నిర్బంధించితివి గావున నాయందు సన్నివిష్టం బైనయార్జవౌదార్యాదిగుణం
బించుకయైన నెఱుంగనిదాన వని యూహించెద. 440

రాముఁడు దశరథునకు నమస్కరించి బయలుదేరుట.

ఆ. జననివగపుఁ దీర్చి జనకకుమారి న,నూనయించి పిదపఁ గాననమున
కిపుడె పోవు వాఁడఁ గృపఁ జేసి యందాఁక, దడవోసంగ వలయు ధర్మయుక్తి.
క. భరతుఁడు రాజ్యం బేలుచు, గురునకు శుశ్రూష సేయుగుణ మగు బెట్లా
తెఱఁగున నీచే సుగుణో, త్కరమునఁ గర్తవ్య మది ప్రథమధర్మ మగున్.442
క. అని పలుకుసుతునిమాటలు, విని భూపతి భూరిశోకవివశాత్ముఁ డై
కనుఁగొనల నశ్రు లొలుకఁగఁ, గనుఁగవ ముకుళించి ఘోరగతి దుఃఖంచెన్.
ఉ. అంత మహీశుపాదముల కారఘునేత నమస్కరించి త
త్కాంతపదద్వయంబునకు దండముఁ బెట్టి తదీయమందిరా
భ్యంతరసీమఁ దా వెడలె నశ్రులు నించుచు లక్ష్మణుండు దా
నెంతయుఁ గ్రుద్ధుఁ డై వదన మెత్తక వెంబడి నేగుదేరఁగన్. 444
తే. జానకీజాని యాభిషేచనికభాండ
మవుడు వలగొని చనియెఁ దా నందు మిగుల
దృష్టి సొరనీక కరము సాపేక్షుఁ డగుచు
మందగతి నిష్టజనములు సందడింప. 445
ఆ. రజనికాంత జగతి రాకాసుధాంశుని, కాంతి మాపలేనికరణి రాజ్య
నాశ మతనిమోమునం గలఘనకాంతి, నపహరింపఁ జాల దయ్యె నహహా.

తే. అవని దిగనాడి వనమున కరుగ నున్న, యతనిమానసవైక్లబ్య మచటివారి
కేమిఁ గనుపట్ట దయ్యె నదెంత చిత్ర, మఖిలలోకాతిగునిచిత్త మట్ల సమము.

క. విగతాతపత్త్రచామరుఁ, డగుచు రథము డిగ్గి యనుచరాలి విడిచి యొ
ప్పుగ నింద్రియములవెంటం, దగులక మది దుఃఖమడఁచెఁ దద్దయుఁ దాల్మిన్.

క. అంతటఁ బురజనములు శ్రీ, మంతుం డగునతనివదనమండలమున నొ
క్కింతైనవిషాదముఁ గన, రెంత మహాత్ముండు జనకజేశ్వరుఁ డహాహా. 449

తే. శరదుదీర్ణాంశుఁ డగుపూర్ణచంద్రుఁడాత్మ, తేజమును బోలె నమ్మహాధీరవరుఁడు
వితత మగునిజహర్షంబు విడువఁ డయ్యె, విమలవిజ్ఞానధైర్యవివేకయుక్తి. 450

వ. అప్పుడు విపులవిక్రముం డగులక్ష్మణుండు రామునియట్ల దుఃఖంబు మనంబున నిడికొని యమ్మహాత్మునివెంటం జను చుండె నివ్విధంబున నారఘుపుంగవుండు సమానశోకుం డగుసౌమిత్త్రితోడ నరుగు దేరఁ బ్రాణనాశశంకచేత సుహృజ్జనంబుల కభిషేకవిఘాతకథావృత్తాంతంబుఁ జెప్పక యెప్పటియట్ల మధురవాక్యంబున మన్నించుచు సాక్షాత్కృతనిత్యనిరతిశయానందాత్ముండై కౌసల్యానివాసయోగ్యం బైనదివ్యమందిరంబునకుం జనియె నంత నిక్కడఁ బురుషశార్దూలుం డగురాముఁడు మాతృగృహంబునకుం జనినవిమ్మట దురంతచింతాభరపరిశ్రాంతలై యంతఃపురకాంత లెల్ల నొక్కట నార్తధ్వనులు సేయుచుఁ దమలో నిట్లని విలపించిరి. 451

అంతఃపురస్త్రీలందఱు విలపించుట

ఉ. నెయ్యు మెలర్ప నెవ్వఁ డిట నిత్యము భూపతిచే నచోదితుం
డయ్యును రాష్ట్రకృత్యములయందు జితశ్రముఁ డై చరించు సా
హాయ్యము సేసి యెవ్వఁడు జనాలికి సద్గతి యై చెలంగువాఁ
డయ్యవనీసుతాపతి మహాగహనంబున కేగు నక్కటా. 452

తే. దాశరథి జన్మ మాదిగఁ దల్లియందు, ననిశ మేరీతి వర్తించు మనలయందు
నట్లెఱుంగున వర్తించు నమ్మహాత్ముఁ, డకట నేఁడు నిర్వాసితుం డయ్యె నేల. 453

వ. మఱియు నెవ్వాఁడు శ్రుతపారుష్యుం డైనను గ్రోధింపక క్రోధహేతుకర్మంబులు పరిత్యజించి కుపితు లగువారలఁ బ్రసాదంబు నొందించునట్టిపరమదయాళుం డగురాముని వనంబునకుం బుచ్చిన యచ్చపలాత్ముఁ డగుదశరథుండు జీవలోకంబు నెల్ల హింసించుట కోర్చువాఁ డని దశరథుని నిందించుచు ననేకులనేకప్రకారంబుల లేఁగలఁ బాసిన మొదవులచందంబున విలపించు చున్న వారల రోదనంబు విని పుత్త్రవియోగసంజాతశోకాభిసంతప్తుం డైన యద్దశరథుండు పర్యంకంబుమీఁదం బడి లజ్జితుండై దుఃఖించు చుండె నంత నిక్కడ.

సీ. స్వజనదుఃఖప్రాప్తి సంజాతఖేదుఁ డై రఘుపతి మత్తవారణముకరణి
నూర్పులు వుచ్చుచు నేర్పునఁ దద్దుఃఖమపనయించుచు మాతృవిపులగృహము

సేరంగఁ బోయి హజారంబునం దున్నవారిఁ గన్గొనుచు నవ్వలిద్వితీయ
కక్ష్య డగ్గఱి యందుఁ గడువృద్ధు లగువిప్రవరులకు మ్రొక్కుచుఁ బరఁగ నవల
తే. నలరుమూఁడవకక్ష్య డాయంగఁ బోవ
నందుఁ గావలి యున్నస్త్రీబృంద మపుడు
త్వరితముగ లోపలికిఁ బోయి తత్ప్రియంబుఁ
బ్రీతి నెఱిఁగించె నారామమాతతోడ. 455

రాముఁడు కౌసల్యకడకుఁ బోవుట.

వ. ఇట్లు రాముండు దనరాక యెఱింగించి పుచ్చి తోడన తానును నద్దేవి యున్న కడకుం జని యందు దేవపూజార్థంబు సంగ్రహింపఁ బడి యున్నదధ్యక్షత ఘృతహవిర్లాజంబులును మోదకంబులును శుక్లమాల్యంబులును బాయసంబును గృసరంబులును సమిత్తులును బూర్ణకలశంబులును గనుంగొనుచు సమాహితచిత్త యై యారాత్రి యుపవాసంబు సలిపి సూర్యోదయసమయంబునం గృతమంగళస్నాన యై శుక్లక్షౌమచేలంబుఁ దాల్చి తనయభ్యుదయంబుకొఱకు విప్రులచేత మంత్రపవిత్రాగ్నిహోత్రంబునందు హోమంబు సేయించుచు దేవతాసంతర్పణంబుఁ గావించు చున్ననిజజననిం గాంచి బాలాశ్వంబు నెదుర్కొనినహయాంగనభంగి తన్నెదుర్కొనినయద్దేవిచరణంబుల కభివందనంబులు గావించె నప్పు డద్దేవి సమాగతుం డైనకుమారు నవలోకించి కనుంగొనల నానందబాష్పధారలు జడిగురియ హర్షోత్కర్షంబున నిజకరంబులఁ గ్రుచ్చి యెత్తి చుబుకంబు పుణికి శిరంబు మూర్కొని వదనంబు ముద్దు గొని వాత్సల్యంబు దీపింప మధురవాక్యంబున ని ట్లనియె. 456

తే. అనఘశీలురు ధర్మాత్ము లమితతేజు, లధికవిశ్రుతు లై నపూర్వాధిపతుల
యశము నాయువుధర్మంబున ఖిలహితముఁ, బొందునీవింక సతతంబుఁ బుత్రవర్య.

ఆ. సత్యవాది యైనజనపతిఁ గనఁ జను, మమ్మహాత్ముఁ డిపుడె యఖిలధరణి
కధిపుఁ గాఁగ నీకు నభిషేక మొనరించు, నిఖిలనృపులు మెచ్చ నేఁడు వత్స.458

రాముఁడు తనకు సంభవించినయరణ్యాగమనంబుఁ గౌసల్య కెఱింగించుట.

వ. అని పలికి యొక్కకనకాసనం బిచ్చిన నారాముండు భోజనార్థంబు తల్లిచేత నిమంత్రితుం డగుచు నయ్యాసనంబు వ్రేల ముట్టి స్వభావవినీతుం డైనను మాతృత్వప్రయుక్తగౌరవంబువలన మిక్కిలి వినీతుం డై వ్రీడానమ్రవదనుఁ డగుచు దండకారణ్యగమనంబున కనుజ్ఞాకాంక్షి యై కేలుదమ్మి ఫాలంబునం గీలించి కౌసల్య కి ట్లనియె. 459

క. జననీ యేమని చెప్పుదు, ననివార్యం బైనయొకభయంబు గలిగె నీ
కును సీతకు సౌమిత్రికి, ఘనతరదుఃఖార్తిహేతుకం బది తలఁపన్. 460

తే. కొనలుగలపంచవింశతికుశలనిర్మి, తాసనవిశేషసముచితం బైనకాల
మిపుడుదొరకొనె దండకావిపినమునకు,నరుగుచున్నాఁడ నేలయీయాసనంబు.

సీ. ధరణీవిభుఁడు నన్ను దండకాటవి కేగు మని పంచె నమ్మనుజాధినాథు
నానతి నమ్మహాకాననంబున కేను జని పదునాల్గువత్సరము లందుఁ
గందమూలముల నాఁకలిఁ దీర్చికొనుచుఁ దాపసవేషధరుఁడ నై పరమశాంతి
యుక్తి వానప్రస్థయోగ్యకర్మంబుల నాచరించుచు వల్కలాజినములు
తే. మునివలె ధరించి మాంసంబు దినక కాన,నునికిఁ జేసెదనిపుడు రాజోత్తముండు
భరతుని సమస్తసామ్రాజ్యపట్టభద్రుఁ, జేయువాఁ డద్భుతోదయావిశేషమతిని.

కౌసల్య రామునిమాట విని మూర్ఛపోవుట

వ. అని వనప్రయాణంబెఱింగించినపద్దేవిపుత్రవియోగసంజాతశోకంబు సహింపం
జాలక మూర్ఛాక్రాంత యై పరశునికృత్త యైనసాలయష్టిచందంబున స్వర్గపద
భ్రష్ట యైనదేవతాంగనకై వడి మహావాతపతితం బైనకదళీద్రుమంబుపోలిక
ధరణిపయిం బడియె నిట్లవశ యై పడియున్నతల్లిం దనకరంబులం గ్రుచ్చియెత్తి
యొక్కకనకాసనంబునం గూర్చుండఁ బెట్టి భారవహనంబుఁ బ్రాపించి శ్రమ
నివృత్తికొఱకుఁ బుడమిం బడి పొరలి క్రమ్మఱ లేచినబడబచందంబున బాంసు
కుంఠితసర్వాంగి యై యున్నయద్దేవిశరీరం బంతయుఁ గరంబులం బరిమార్జిం
చి వివిధవినయవాక్యంబులం బ్రబోధించినఁ గొండొకసేపునకు మూర్ఛదేఱి
నిజకరంబున నక్కుమారశేఖరుని నెమ్మేను సంస్పృశించి కనుంగొనల నశ్రుకణం
బు లొలుక గద్గదస్వరంబుతో సుమిత్రాపుత్రుండు వినుచుండ రామున కిట్లనియె.

కౌసల్య రామునితోఁ దనదుఃఖంబు లన్నియుఁ జెప్పికొనుట

సీ. అనఘాత్మ ధాత్రి వంధ్యకు నపుత్రక నైతి నని యొక్కటియె దుఃఖమన్యదుఃఖ
ముది యించుకయుఁ బుట్టదట్లేను నినుఁ బ్రియపుత్రు నీఁ బడయక పుట్టినట్ల
వంధ్య నై యున్న నివ్విడువున నభిమతపుత్రవిశ్లేషసంభూతదుఃఖ
మొంది కృశింపక యుందుఁ గదా నేఁడు కొమరులు లేనిదుఃఖమునకంటెఁ
తే. బుత్రవిశ్లేషసంజాతభూరిదుఃఖ
మెక్కు డై యుండు దాని సహింపఁ గూడ
దకట నినుఁ బాసి యేలాగు ననువు లొడల
నిలిపికొని యిచ్చట వసింప నేర్తుఁ జెపుమ. 464

చ. అరయ మహీశుపౌరుషమునందు లభించుమనోజ్ఞభోగము
ల్పురుచిరసౌఖ్యము ల్మృదువచోగరిమంబు లొకప్పు డైన నే
నెఱుఁగినదానఁ గాను జగతీంద్రుఁ డిఁక న్నినుఁ జూచి యైన సు
స్థిరముగ నాపయిం గరుణఁ జేర్చు నఁటంచుఁ దలంతు నెమ్మదిన్. 465

క. జనవిభున కగ్రసతి నై, కనిష్ఠ లగుసవతు లెల్లఁ గడుగర్వమునన్
ననుఁ దూలనాడు చుండఁగ, విని యేఁగతిఁ దాళుదాన విమలవిచారా. 466

తే. జనవినుత పుత్త్రయుత లగుసవతు లాడు, వివిధపరిహాసవచనము ల్వినుటవలనఁ
బుట్టునాదుఃఖశోకంబు లిట్టి వట్టి, వనఁగ వచ్చునె వానికి నవధి గలదె. 467

ఆ. పాయ కెపుడు నీవు నాయొద్ద నుండఁగ, నధికహీనవృత్తి నడలు చుందు
నీవు గహనమునకుఁ బోవుచుండఁగ నాకు, మరణమే నిజంబు వరగుణాఢ్య.

వ. మఱియు నమ్మహీపతికి నగ్రపురంధ్రి నై యుండియు నతండు న న్నవమాన పురస్సరంబుగాఁ జూచుటవలన నప్రధానీకృత నై కైకేయిపరిచారికాజనంబునకంటె నొక్కింత యవర నైతి నదియునుం గాక భరతుండు ప్రాప్త రాజ్యుం డైన నతని విలోకించి నిత్యంబు నన్ను సేవించుజనంబును వాని భయంబువలన నింక నన్ను సేవింప కుండు నని పలికి వెండియు ని ట్లనియె. 469

చ. అనిశము వైరిభావమున నద్భుతకోపరసంబు ముక్కునం
గనుపడ భాగ్యగర్వమునఁ గష్టదురుక్తులఁ బల్కు కైకయా
నన మెటుచూచి యోర్చెద ఘనంబుగ దుర్దశ నొంది యుండి నే
నినకులదీప మానవతు లీలఘుజీవన మోర్చి యుందురే. 470

సీ. మది నుక్కు దక్కి సప్తదశాబ్దములనుండి యేక్షోభమునకుఁ బరిక్షయంబు
సతతంబు నాచేత నతికాంక్షితం బయ్యె నాక్షోభ మక్షయం బయ్యె నిపుడు
భాగ్యగర్వమున సపత్నులు గావించు విప్రకారము మది వెగటు పఱప
హీనదశాప్రాప్తి కే నోర్చి ధర మని యుండ లే నదియు నట్లుండ నిమ్ము

తే. కమలపత్త్రంబులను బోలుకనులతోడఁ, బూర్ణశశిబింబసదృశ మై భూరికళల
నొప్పునీమోముఁ జూడక యొక్కనిమిష, మైన నేగతి జీవించుదానఁ దండ్రి.

వ. వత్సా నీవు భాగ్యరహిత నైననాచేత నుపవాసదేవతాధ్యానవ్రతంబులచేత నిష్ఫలం బగునట్లు సంవర్ధితుండ వైతివి భవదీయపరివర్ధనం బిప్పుడు దుఃఖంబుకొఱకుఁ బరిణతం బయ్యెఁ బ్రావృట్కాలంబునందు మహానదీప్రవాహసలిలంబుచేతఁ దత్తీరంబు నశించినపగిది భవద్విప్రయోగశ్రవణంబున సహస్ర ప్రకారంబుల వ్రయ్య లై పోక యుండుటవలన మదీయహృదయం బతికఠినం బని తలంచెద: 472

సీ. వలనొప్ప కంఠీరవంబు బిట్టేడ్చెడు మృగిని గొంపోయినపగిది నన్నుఁ
గ్రుద్ధుఁ డై శమనుండు గొని పోనికతమున నల దండధరలోకమందు నాకు
స్థానంబు లే దని తలఁచెద నా కింక జగతి నెన్నటికిని జావు లేదు
కడువడి నిట్టిదుఃఖంబుచే నుపహతం బయ్యును నాహృదయంబు మేను

తే. మాన కిట వేయివ్రయ్యలై పోనికతన, నాయసాకృతి గాఁబోలు నని దలఁచెద
నందన యకాలమున నిధనంబు గలుగ, దేమి సేయుదు నింక నా కేదిదిక్కు.

తే. నయవిశారద పిన్నటనాఁటనుండి, యేను గావించు వ్రతములు దానములును
దపములు సపర్యలును నిరర్థకము లయ్యెఁ, జవుట విత్తిన విత్తులచందమునను.

తే. పృథివి దుఃఖకర్శితుఁ డెవ్వఁడేని దలఁచి; నపుడు శమనునివీటికి నరుగునేని
యేనును భవద్విహీననై ధేను వట్ల, తనువు విడిచి యమక్షయంబునకుఁ బోనె.

ఉ. ధీవర నీవు నన్నిచట దించి వనంబున కేగితేని గ
ర్వావహచిత్తలై సవతు లాడుదురుక్తులు విన్న మేనిలో
జీవము నిల్వ దట్లగుటఁ జేసి మదిం దనివారఁ జూచుచు
న్నీ వెనువెంట వచ్చెద ననిందితశీల యరణ్యభూమికిన్. 476

లక్ష్మణుఁడు మన్మథవశుఁడైన దశరథునిమాట వినుట యుక్తము గాదని చెప్పుట.

వ. అని యిట్లు పెక్కుతెఱంగులఁ గుమారుండు సత్యపాశబద్ధుం డయ్యె నని
యెఱింగి యతనిగమనంబు నివారించుటకు సామర్థ్యంబు లేమిం జేసి
భావిసంభావితవ్యసనంబు దలంచి కిన్నరియుం బోలె విలపించుచున్న కౌసల్య
నవలోకించి సుమిత్రానందనుండు మొగంబున దైన్యంబు దోఁపఁ దత్కాల
సదృశం బగువాక్యంబున నిట్లనియె. 477

క. పడఁతుకమాటకు రాజ్యము, విడిచి రఘూత్తముఁడు ఘోరవిపినంబున కి
ప్పుడు పోవఁ దలఁచు టెంతయుఁ, దడవఁగ నామది కయుక్తతరమై తోఁచెన్.

క. జనపతి మదనవశుండై, యనిశము సతిమాటఁ బట్టి యనుచితముగఁ బ
ల్కినఁ బలుకఁగ నిమ్మది మన, మున గట్టిగఁ బట్టి సేయఁ బూనఁగ నేలా. 479

క. దీమసమున మనుజవిభుం, డేమి తగనిదోస మెంచి యిప్పుడు కినుకన్
రాముని సుగుణోద్దాముని, భూమి వెడలి ఘోరవనికిఁ బొమ్మని పలికెన్. 480

క. ధర నెవ్వఁడు నరిదైనను, నిరసక్తుండైన నీయనింద్యగుణునిపైఁ
గరమొకదోషం బెన్నఁడుఁ, బరోక్షమందైన నూఁదిపలుకు టెఱుంగన్. 481

తే. ఘనుని దాంతునిధర్మవిగ్రహునిఋజుని, నమరతుల్యుని రిపులయందైనఁ గరుణ
గలుగునట్టికుమారునిఁగని యకారణమున నెవ్వాఁడు ఘోరవనమున కనుచు.

తే. అంగభవజాతపారవశ్యమున మేను, మఱచి నోటికి వచ్చినట్లఱచు నృపతి
యట్టిమాట నునంబునఁ బట్టి రాజ, ధర్మ మరయక నెవ్వాఁడు దవిలి సేయు. 484

వ. అని పలికి యన్నదిక్కు మొగంబై యిట్లనియె.

తే. అనఘ యాయర్థ మొకనరుండైన నేమి, యెంతలో వినఁ జాలఁ డీ వంతలోన
మత్సహాయతవలన సామ్రాజ్యమెల్ల, నాత్మవశముగఁ జేసికొ మ్మది హితంబు. 486

వ. అత్తెఱం గెట్లు శక్యం బగు నంటి వేని.

సీ. ధనువుఁ గైకొని పార్శ్వమున నేను రక్షింప నల జముమాడ్కి నీవలగుచుండ
నప్పు డెవ్వాఁడు నీయాజ్ఞ దాఁటి చరింప దక్షుఁ డవ్విధిగాక తక్కనేని
కాలసర్పాభీలఘనబాణముల నయోధ్యాపురి నిర్మనుష్యఁగ నొనర్తు

భరతుఁ డీపూజ్యసామ్రాజ్యస్థుఁ డగుఁగాక యని కోరువారల యమునిపురికిఁ

తే. బనుతుఁ గామాంధుఁడై యాలిపలుకులు విని, బుద్ధి నరయక లోకవిరుద్ధవృత్త
మూఁది పరిపంథిభూతుఁడై యున్ననృపునిఁ, గడఁగిచంపెదఁగానిచోఁ గట్టివైతు.

వ. తండ్రి కపరాధంబు సేయం దలంచుట ధర్మవిరుద్ధం బని తలంచి తేని వినుము.

తే. విషయపరతంత్రుఁడై ధర్మవిధికిఁదప్పి, మది ననారత మిది కార్యమిది యకార్య
మనియెఱుంగక వర్తించునతఁడు తండ్రి, యైనఁగడువధ్యుఁడనిపల్కి రార్యులధిప.

క. జనపతి నీ దగురాజ్యముఁ, గొనుటకు నేబలము గలఁడు గుణహీనతఁ దా
మునుకొని యేకారణమునఁ, దనమదిఁ గైకేయి కొనఁగఁ దలఁచె మహాత్మా.

తే. పరఁగ నీతోడ నాతోడ వైరముఁ గొని
యరినిషూదన కులయోగ్య మయినయట్టి
ధర్మనిధి నీవు దాల్పఁగఁ దగినసిరిని
భరతుని కొసంగఁ బతి కేటిబలము చెపుమ. 491

వ. అని పలికి క్రమ్మఱఁ గౌసల్య నవలోకించి తల్లీ యేను సర్వప్రకారంబుల రాముని కనురక్తుండ నిది యసత్యంబు గాదు సత్యచాపదావేష్టంబులచేత శపథంబుఁ జేసి పలికెద రాముం డరణ్యంబున కాదు దీప్తాగ్నిని బ్రవేశించిన నే నంతకు మున్నె ప్రవేశింతు నట్టివానిఁగా న న్నెఱుంగుము. 492

చ. జననిరొ నాప్రతిజ్ఞ విను సత్యము నీవును రాఘవుండుఁ గ
న్గొని మది మెచ్చ దీప్తశరకోటి నరాతుల గీటడంచి మిం
చినయనురక్తిచే నినుఁడు చీఁకటినట్లు భవన్మనోవ్యథం
బనివడి తీర్చెదన్ ధరకుఁ బట్టముఁ గట్టెద రామభర్తకున్. 493

—కౌసల్య రామునికి లక్ష్మణుఁడు చెప్పినట్లు చేయుమని బోధించుట—

వ. అని యిట్లు వీరాలాపంబు లాడుచున్న సుమిత్రాపుత్త్రునివాక్యంబు లాలకించి యద్దేవి రామునివదనం బుపలక్షించి దుఃఖించుచు ని ట్లనియె. 494

మ. అనఘా తమ్మునిమాట వింటె విహితం బై యున్న దారీతి నీ
వనుమానింపక సేయు టొప్పు నృపవంశాచార మీచందమై
చనుఁ గా కీవు సపత్నిమాటకయి రాజద్రాజ్యభోగంబు మా
ని నను న్నెవ్వగ ముంచి పోవఁ దగ వౌనే కాననక్షోణికిన్. 495

వ మఱియు నీవు పితృవాక్యకరణరూపం బగుధర్మం బనుష్ఠించుట సమస్తధర్మంబులలో నుత్తమధర్మం బని దలంచితి వది నిక్కంబై నను నీలోకంబున మాతృశుశ్రూషాపరుం డై ప్రవర్తిల్లుమహాత్మున కెల్ల లోకసుఖంబులు కరతలామలకంబులై యుండుఁ దొల్లి గృహంబున నుండి మాతృశుశ్రూషఁ గావించి తద్బలంబునఁ గాశ్యపుండు ప్రాజాపత్యపదంబుఁ బ్రాపించెఁ గావున నీవును నా వచనంబుఁ బట్టి భక్తిపూర్వకంబుగా నాకు శుశ్రూషఁ గావించుచు గృహం

బున నుండు మేనును దండ్రియట్ల పూజించుటకుం దగినదాన నట్లగుటం జేసి నాయనుమతి లేక నీవు వనంబునకుం బోవుట ధర్మంబు గా దదియునుంగాక శోకలాలస నైన నన్నువిడిచి వనంబునకుం జనితేని భవద్వియోగదుఃఖంబునం బ్రాయోపవేశంబుఁ జేసి ప్రాణంబులువిడిచెద దానం జేసితొల్లి సముద్రుండు మాతృదుఃఖంబున నరూపాధర్మంబువలన బ్రహ్మహత్య నొందినవిధంబున నీవు లోకవిశ్రుతం బైననిరయంబు నొందఁ గలవు నీవు వనంబునకుం జనినపిమ్మట నాకు సుఖజీవితంబులచేత నయ్యెడుకార్యం బేమి భవత్సహితనై యున్ననాకుఁ దృణభక్షణంబైనను శ్రేయస్కరంబై యుండు నని పలికి దుఃఖభరంబున రోదనంబు సేయుచున్నతల్లిం గాంచి మహానుభావుం డైనరాముండు ధర్మసహితం బగువాక్యంబున ని ట్లనియె. 496

రాముఁడు కౌసల్యకు సయుక్తికంబుగా సమాధానంబుఁ జెప్పుట.

క. జనకుని వాక్యము నదిగా, దని మీఱఁగ నా కశక్య మటు గాన మహావినయమున మ్రొక్కి వేఁడెదఁ, బని విని వనమునకు నన్నుఁ బనుపుము తల్లీ.

ఆ. పరమపండితుండు వ్రతచారియును ధర్మ, కోవిదుండు మహానుభావుఁ డైన కండు వనెడు మునిశిఖామణి జనకు వచనముఁ బట్టి గవిని జంపలేదె. 498

తే. మును మదన్వయకర్తయై తనరు సగరుఁ
డనుమహాత్మునియానతి నతనిసుతులు
ఘనమఖాశ్వంబుకొఱకు నఖప్రహతుల
బుడమిఁ ద్రవ్వి పడంపడి మడియ లేదె. 499

తే. విను మదియుఁగాక జమదగ్నితనయుఁ డైన
రాముఁ డతనియానతిని శిరంబునందు
దాల్చి దయమాలి మనమునఁ దల్లి యనక
పట్టి రేణుకఁ ద్రుంచఁడే పరశుహతిని. 500

వ. మఱియుఁ బ్రాణంబులనైనఁ బరిత్యజించి పితృవాక్యంబు పరిపాలనీయం బని పండితులైన కండుముఖమహర్షులు పలికిరి పితృవాక్యగౌరవంబున గోవధమాతృవధాదికంబు మహాత్ము లగుపూర్వులచేత నాచరితం బయ్యెఁ బితృవాక్యం బెట్లలంఘనీయం బట్లు మాతృవాక్యంబు నలంఘనీయంబై యుండు నైననేకకాలంబున నుభయవాక్యకరణంబునం బ్రవర్తిల్లుట దుర్లభం బట్లగుటం జేసి పితృవాక్యంబు ప్రథమకర్తవ్యం బని పలికి రదియునుం గాక పితృవాక్యోల్లంఘనంబునఁ బితృవధపాతకంబు వాటిల్లు నే నొక్కరుండనే కాను నాచేతఁ బరికీర్తితులైన వీ రందఱుఁ బితృశాసనంబుఁ గావించి కృతార్థులైరి గావున నాకునుం బూర్వాచారవిరుద్ధం బైనధర్మంబునం బ్రవర్తిల్లుట పాడి గాదు తొల్లి మహాత్ము లగువారిచేత నంగీకృతం బైనమార్గం బవలంబించి యెల్లభంగులఁ

పితృనిర్దేశంబున వనంబునకుం జనియెద నని పలికి లక్ష్మణు నవలోకించి యిట్లనియె. 501

రాముఁడు లక్ష్మణునకు సమాధానంబుఁ జెప్పుట.

చ. అనఘవిచార నీదగుమహత్త్వము తావక తేజముం ద్వదీ
యనిబిడదోర్బలంబు భవదద్భుతశౌర్యము నాపయిం జనిం
చినప్రియముం సమస్తమును జిత్తమునందు నెఱుంగుదుం యశో
ధనులకుఁ గల్గు టబ్బురమె తద్దయు లక్ష్మణుపాల వింతలే. 502

చ. పరమవివేక సత్యశమభావము భావమునం దెఱింగియుం
గర మనురక్తిఁ బ్రాకృతునికైవడి నీ వటు దుఃఖ మొంద దు
ర్భరతరశోకవేగమునఁ గ్రాఁగెడు నీయను తాల్మి దిక్కఁ తా
మఱిమఱి చొక్కుఁ గాన నిఁక మానుము తాదృశదీనవాక్యముల్. 503

తే. ధరణిఁ బురుషార్థములలోన ధర్మ మెక్కుఁ
డట్టిధర్మంబునందు సత్యంబు నిలిచి
యుండు నన్నిటికంటె సత్యోత్తమంబు
గురునియోగవతి నడుచుట గురుగుణాఢ్య. 504

తే. జనకవాక్యంబు జననీవచనము బ్రాహ్మ
ణోత్తమునిమాట ధర్మసంయుక్త మగుట
నుచితగతిఁ జేయవలయు నట్లోపఁడేని
యలఘుతరకల్మషాత్ముఁ డౌ ననిరి మునులు. 505

వ. కావున నేను పితృశాసనంబునఁ గైకేయిచేతఁ బ్రచోదితుండనైతి నింక దానిఁ గడువం జాల నీ వశుభం బైనక్షత్త్రధర్మంబునందు బుద్ధిఁజొరనీక తీక్ష్ణభావంబు విడిచి పరమశ్రేయోనిష్ఠ యైన మద్బుద్ధి ననుసరింపు మని సౌహార్దవిశేషం బునం బలికి వెండియు నక్కకుత్స్థకులదీపకుండు కౌసల్యదిక్కు మొగంబై వినయవినమితోత్తమాంగుం డగుచుఁ గేలుదోయి ఫాలంబునం గీలించి యిట్లనియె 506

క. వేవేగ విపినసీమకు, నావిరిఁ బోవంగవలయు వారింపకు మ
జ్జీవితము లాన గ్రక్కున, దీవన లిపు డొసఁగి పనుపు దేవీ నన్నున్. 507

తే. గురునివాక్యంబు నెఱవేర్చి మరల వేగ
నడవి నుండి పురంబున కరుగుదెంతు
మును ధరకు వచ్చి మరల విబుధనిలయము
నొందిన యయాతిరాడర్షిచందమునను. 508

క. జననీ నీకును నాకును, జనకజకు సుమిత్ర కట్ల సౌమిత్రికి గ్ర
క్కునఁ బతి యానతిఁ బోవఁగ, జను నిదియె సమస్తధర్మసమ్మతము సుమీ.

వ. తల్లీ యభిషేకసంభారంబులు విసర్జించి మనంబున దుఃఖంబు నిగ్రహించి
ధర్మంబు నవలంబించి వనవాసంబునకుం బోవ నిశ్చయించినవాఁడ. నేను
వనంబునకుంబోయి వచ్చునందాఁక శోకంబు దక్కి ధైర్యం బవలంబించి యుండ
వలయు నని పలికిన నమ్మహాత్ముని ధైర్యస్థైర్యంబుల కచ్చెరువంది యక్కౌసల్య
వెండియు మనంబునఁ బుత్రవియోగంబుఁ దలంచుకొని మూర్ఛాక్రాంతయై
చచ్చినదానియట్ల నేలంబడి యుండి క్రమ్మఱ నొక్కింత సేపునకు నానావి
ధోపచారంబులం దెలివొంది బాష్పధారాపూరితలోచనయై గద్గదస్వరంబున
ని ట్లనియె. 510

చ. అనఘవిచార యేను గుణవత్తై స్వధర్మముచేత సౌహృదం
బునను సుపూజకుం దగుదుఁ బూనికి మద్వచనంబు నెమ్మనం
బున నిరసించి దుఃఖరసపూరితభూరిగభీరవార్ధిలో
నన్నుఁ బడఁద్రోచి నీకుఁ దగునా యిటు కాననసీమ కేఁగఁగన్ 511

సీ. విను మీవు కాననంబునకుఁ బోయిన నాకు నింక లోకంబేల యేల ప్రాణ-
మేల సంపద్భోగ మేల పిత్రమరలోకంబులు నేమికార్యంబు సర్వ
లోకసంస్థితజీవలోకసాన్నిధ్యంబుకంటె నొక్కముహూర్తకాల మైన
సరసగుణాఢ్య నీసన్నిధానము నాకు ఘనతరశ్రేయ మై తనరుచుండు

తే. సిద్ధమన నాతఁ డుల్కలచే నపోహ్య, మాన మైనను హేభంబుమార్గ మనుస
రించినట్లు తదుక్తు లాలించి దృఢత,రంబుగ స్వవంశధర్మమార్గస్థుఁ డగుచు.

వ. వెండియు నారఘుపుంగవుండు విసంజ్ఞయై పడి యున్నతల్లిని దుఃఖపీడితుం డైన
తమ్మునిఁ జూచి యధర్మారంభంబునకు సుముఖుండు గాక ధర్మసహితం బగు
వాక్యంబున లక్ష్మణు నవలోకించి రఘువరా నీవు ధర్మైకనిష్ఠారూపం బైన
మదీయాభిప్రాయం బెఱుంగక పుత్రవాత్సల్యంబున వగచుతల్లిం గూడి దుఃఖిం
చెద వీ దుఃఖంబు నచ్చిత్తంబు గలంచుచున్నయది పురాకృతపుణ్యవిశేషం
బునం గలిగినభార్య యొక్కటి యయ్యును ననుకూల యై ధర్మంబును నభిమత
యై కామంబును సుపుత్ర యై యర్థంబును బతికిం జతగూర్చిన తెఱంగున
సకలపురుషార్థమూలం బైన ధర్మం బొక్కటి యయ్యును స్వానుష్ఠానంబున
ధర్మార్థకామఫలంబులు సిద్ధింపం జేయు నిది మదీయచిత్తంబునం గల యర్థంబు
గావున నే కర్మంబునందు ధర్మార్థకామంబు లసన్నివిష్టంబు లగు నట్టికర్మం
బుపక్రమింప నర్హంబు గా దెల్లభంగుల నెద్దానివలన ధర్మంబు గలుగు
నట్టికర్మం బనుష్ఠింప వలయు లోకంబునం గేవలార్థపరుం డగువాఁడు ద్వే
ష్యుం డగుఁ గేవలకామపరత్వం బప్రశస్తం బగు గురుండును వృద్ధుండును
స్వామియును జనకుండు నగు మహీరమణుండు కోపంబునం గాని ప్రసాదం

బునం గాని కామంబునం గాని సత్యప్రతిజ్ఞత్వరూపధర్మం బవలంబించి తత్పరిపాలనంబుకొఱకు నేకార్యంబు నేయు మని నియోగించె నక్కార్యంబు ననృశంసవృత్తి యగువాఁ డెవ్వాఁ డాచరింపకుండు నట్టియపాపుండ నగు నేను వరదానహేతుక భరతాభిషేక మద్వివాసనరూపం బైన పితృప్రతిజ్ఞను యథోక్తక్రమంబున సర్వంబును గావింప కుండుటకు సమర్థుండఁ గాను నాకును భరతునకును మహీరమణుండు నియోగంబునందు సమర్థుం డగు నంతియే కాదు మజ్జనని యగు కౌసల్యకును భర్తయుఁ బరమగతియుఁ గావున నిద్దేవియును మనయట్ల పతియాజ్ఞ ననుసరించి వర్తించు టది పరమధర్మం బైయుండు నద్దేవి పుత్రవాత్సల్యంబున నన్ను విడువంజాలక నాతోడ వనంబునకుం జనుదెంచెద నని తలంచి యున్నది ధర్మప్రవర్తకుండును బూర్వరాజులకంటె నధికుండును స్వకులాచారధర్మసంస్థితుండు నగు మహీరమణుండు జీవించి యుండ సహధర్మచారిణియైన యిమ్మహాదేవి పుత్రుండ నైన నాతోడ నన్యయువతిచందంబున వనంబున కెవ్విధంబునం జనుదెంచుఁ బతిహీన యగువనిత పుత్రునితోఁగూడఁ జనుదెంచు టది యుచితం బగుం గాని సభర్తృక యైనయువతి చనుదెంచుట యుచితంబు గా దదియునుం గాక. 513

చ. అతివల కిందు నం దభిమతార్థకరుండు విభుండు తన్మనో
గతి నతియుక్తిచేఁ గని యకల్మషభక్తి సదా మనంబులో
నతఁడె గురుండు దైవ మఖిలార్థదుఁ డంచుఁ దలంచుచు న్నము
న్నతమతిఁ గొల్చి యుండుట సనాతనధర్మము లాఁడువారికిన్. 514

క. కావున నీయమ మగనిం, దా విడిచి యధర్మముగ వనంబున కిమ్మై
నావెంట రాఁ బొసంగదు, ధీవిలసితధర్మసరణి తెలియదె నీకున్. 515

—రాముఁడు కౌసల్య ననూనయించుట.—

వ. అని పలికి క్రమ్మఱ నమ్మహానుభావుం డమ్మ కిట్లనియె. 516

క. జననీ పదునాల్గబ్దము, లనఁగాఁ బగునాల్గుదినము లట్ల గడపి చ
య్యన వత్తు మరల వీటికిఁ, బనివడి దీవించి నన్నుఁ బనుపు సుదవికిన్. 517

వ. తల్లీ యేను ధర్మవిరహితరాజ్యకారణంబున మహోదయం బగుయశంబును దిరస్కరించుటకుం జాల జీవితం బల్పకాలం బగుచుండ నధర్మంబునకుం దలంకక తుచ్ఛరాజ్యంబుఁ గోరుట తగవు గా దని యిట్లు జనయిత్రి ననూనయించి పలికి క్రోధశోకాకులుం డగుతమ్మునికి ధర్మరహస్యం బుపదేశించి వదంపడి నిజజననికిం బ్రదక్షిణంబుఁ జేసి వనప్రయాణోన్ముఖుం డై వెండియు మహావ్యథం జెందిగుందుచు మహాసర్పంబుకరణి రోఁజుచు రోషవిస్ఫారితేక్షణుండై

యున్నసౌమిత్రిం జూచి సౌహార్దవిశేషంబున నభిముఖుండై ధైర్యంబునఁ జిం
తాదివికృతులు వదనంబునం దోఁపనీక మనంబున నడంచుచు నిట్లనియె. 518

రాముఁడు లక్ష్మణుని ననూనయించుట.

చ. అనుపమధైర్యముం గొని రయంబున శోకము రోషము న్మనం
బునఁ జొరనీక యెంతయుఁ బ్రమోదము నొంది మహీశుపై జనిం
చిన పెనుకిన్క మాని యభిషేకవిచారము దక్కి సత్వరం
బుగ వనవాసయుక్తము ప్రభూతవివేకతఁ జేయు కార్యమున్. 519

తే. అస్మదీయాభిషేకార్థమందు నీకు, సముదితం బైనసంభారసంభ్రమంబు
తవిలి యిప్పుడు తన్నివర్తనమునందుఁ, జెల్లుఁగాక మనంబునఁ జింతయేల. 520

ఆ. అనఘ మదభిషేచనార్థమం దేదేవి, మానసంబు చాల మలఁగుచుండు
నట్టితల్లిహృదయమందుఁ బుట్టినశంక, వాయునట్లుగాఁగఁ జేయు మయ్య. 521

క. ఆమగువ మనోగతశం, కామయదుఃఖం బొకింతకాలం బైనన్
దీమసమునఁ గనుఁగొనుటకు, నామదికిం దాల్మి లేదు నయగుణశాలీ. 522

వ. వత్సా యేను జ్ఞానంబుచేతంగాని యజ్ఞానంబుచేతంగాని తల్లిదండ్రుల కించుక
యైన విప్రియం బొకానొకప్పు డైనఁ గావించుటకు నోడుదుఁ గావున. 523

తే. తల్లిదండ్రు లొకానొకతఱి నొనర్చు
నప్రియ మొకింతయైన నే నాడుకొనుట
యెన్నఁడేనియుఁ గలదె వేయేల వినుము
హృదయమున నైన నిలుపుట యెఱుఁగఁ జుమ్మి. 524

క. సత్యుండు సత్యసంధుఁడు, సత్యపరాక్రముఁడు నైన జనకుఁడు పరలో
కాత్యంతభయమువలనను, సత్యము విలసిల్లఁ గాక నిర్గతుఁ డగుచున్. 525

తే. అడవి కేఁ బోకయున్న నాయనకు సత్య
హాని యగు దాన నా కసత్యాగ మొదవు
నవలఁ బతికి మనస్తాప మతిశయిల్లఁ
బిదప నది నన్నుఁ జాలఁ దపింపఁ జేయు. 526

వ. కావున నేను సామ్రాజ్యంబునం దాస సేయక శీఘ్రంబున వనంబునకుం జని
యెద సపత్నీమాత యగుకైకేయి చీరాజినజటామండలధారినై వనంబునకుం
జనుచున్న నన్నవలోకించి పరమానందభరితాంతఃకరణ యగుచుఁ గుమా
రునిం బూజ్యరాజ్యంబున కభిషిక్తునిం జేసి కృతకృత్యయగు మఱియు నే
జనంబుచేత నీబుద్ధి ప్రణీతయయి దీనియందు మనంబు సమాహితం బయ్యె
నాజనంబునకును దుఃఖంబు సేయనొల్ల నేను వనంబునకుం బోవకుండిన మ
జ్జనకునకు మనఃఖేదంబు గలుగు నెవ్వని శిక్షోపదేశంబులచేత మనంబునకు

సౌగుణ్యంబు జాతంబయ్యె నట్టిజనకుని సంక్లేశింపఁజేయుటకుం జాల శీఘ్రం
బున వనంబునకుం జనియెద నని ప్రవాసంబునందు మనంబు గట్టిపఱిచి కైకే
యీనిమిత్తశంకచేత నద్దేవియందు లక్ష్మణునకుఁ గ్రోధనివారణంబు సేయు
తలంపున నిట్లనియె. 527

రాముఁడు లక్ష్మణునికిఁ గైకమీఁదం గలకోపమును బోఁగొట్టుట.

క. చేవచ్చిన సిరి గ్రమ్మఱఁ, బోవుటయును ఘోరవిపినభూమినివాసం
బావహిలుటయును దలఁపఁగ, దైవకృతము గాక యొరులతరమె కుమారా!

తే. అనఘ కైకభావంబు కృతాంతవిహిత
మైనయది యట్లు గానిచో మాన కిట్లు
తవిరి యనివార్య మగుచు నద్దేవి బుద్ధి
పరఁగ మత్పీడయం దేల పరిణమించు. 529

వ. మఱియు నద్దేవి భావవైపరీత్యంబు దైవకారణం బని పలికి తదీయసహజభావం
బెఱింగించుతలంపున నిట్లనియె. 530

తే. అమలగుణ నాకుఁ దల్లులయం దొకింత
యైన వైషమ్య మెట్లు లే దట్ల సంత
తంబు నాయందు సుతునందుఁ దారతమ్య
మేమియును గైకకును లేమి యెఱుఁగ వొక్కొ. 531

ఆ. అట్టి నేను గైక యభిషేచనము మాని, భూరిగహనమునకుఁ బొమ్మటంచు
నశనిపాతకల్ప మైనమాటాడుట, దైవకృత మటంచుఁ దలఁతు జుమ్మి. 532

ఉ. ఆవిధి గానిచో నరవరాత్మజ యింతకుమున్ను భూరిహా
ర్దావహచిత్తయై ప్రియము లాడుచు నుండినయట్టితల్లి గో
త్రావరు మ్రోలఁ దా నిపుడు ప్రాకృతకాంతబలెన్ మదర్థమం
దీవిరసోక్తు లేల మది నించుక గొంకక పల్కుఁ జెప్పుమా. 533

వ. మఱియు నద్దైవంబు భూతంబుల కనివార్యంబై యచింత్యప్రభావంబై యుండు
పూర్వస్థితవాత్సల్యాపగమరూపంబునఁ గైకయందును స్వగతరాజ్యభ్రంశ
రూపంబున నాయందును విపర్యయంబు గలిగించెగాదె తత్స్వరూపంబు కార్య
భూతఫలంబులకంటె నొండువిధంబునఁ గానంబడ దట్టి దైవంబుతోడ నొ
డ్డారించుట కెవ్వండును సమర్థుండు గాఁడు· లాభాలాభంబులును సుఖదుఃఖం
బులును భయక్రోధంబులును భవాభవంబులు నెయ్యది గలుగఁజేయు నదియె
దైవంబు విశ్వామిత్రాదితపోధనులును జితేంద్రియులయ్యును దైవప్రపీడితు
లగుచు నియమంబు విడిచి కామక్రోధాసక్తులగుట యెల్లవారికిఁ దెల్లంబు గదా
యీలోకంబునం దారబ్ధకార్యంబుఁ గ్రమ్మఱించి యసంకల్పితంబగుకార్యం బా
కస్మికంబుగాఁ బ్రవర్ధింపఁజేయు టదియె దైవకార్యం బని యెఱుంగవలయు

నిట్టి నిశ్చయబుద్ధిచేత నంతరింద్రియంబు నిరోధించి చూచిన న్యాహతం బైన
మదీయాభిషేకంబునందుఁ బరితాపంబు వుట్టదు గావున నీ వుపదిష్టబుద్ధి
యోగబలంబున సంతాపంబు దక్కి మద్బుద్ధి ననుసరించి యభిషేకాలంకా
రాదికర్మంబులం బరిహరింపు మని పలికి వెండియుఁ గౌసల్యానందనుండు
సుమిత్రానందనున కిట్లనియె. 534

తే. వినుము పట్టాభిషేకసంభృతములైన, కాంచనమయాఖిలఘటోదకముల చేత
మహితతాపసయోగ్యకర్మంబునందు, మిగుల నాకు వ్రతస్నాన మగు నిజంబు.

తే. అరయ రాజ్యార్థ మానీత మైనయట్టి, యీసలిల మేల మనచేత నింపు మీఱ
నుపహృతంబైన సలిలంబె యొనర నాకు, వెస వ్రతస్నానమిపుడు గావించు ననఘ.

తే. నాకుఁ జూడఁ బ్రజాపాలనమునకంటె, నవ్విపినవాస మధికోదయంబు గాన
ననఘ లక్ష్మీవిపర్యయమందు నీవు, మది విషాదంబు విడువుము మమత దక్కి.

లక్ష్మణుండు రామునితో దైవంబు ప్రబలంబు గా దనుట.

వ. అదియెట్లనినఁ బ్రజాకృత్యాకృత్యవిచారక్లేశరాహిత్యంబునను సంతతంబుఁదపః ప్రవృత్తిసాధనత్వంబువలనను విశిష్టపితృవాక్యపరిపాలనవిశేషప్రయోజనత్వంబువలనను రాజ్యపాలనంబుకంటెవనవాసంబుమహాభ్యుదయసాధనంబగుమఱియు మదభిషేచనవిఘ్నంబు కనిష్ఠమాతయైన కైకేయివలన నయ్యెనని శంకింపవలవ దద్దేవి దైవాభిపన్నయై యనిష్టంబులుపలికెదైవం బట్టిప్రభావంబు గలది యని యెఱుంగుదువుగదా యని యిట్లు పెక్కుభంగులం బ్రబోధించినరాముని వచనంబులువిని సుమిత్రానందనుండు శిరంబు వాంచి దుఃఖహర్షంబులు మనంబునం బెనంగొన నొక్కింతసే పూరకుండి పదంపడి రోషం బగ్గలంబైన బొమలు ముడివడఁ జేటికాబిలస్థం బైన మహాసర్పంబుపగిది రోఁజుచు నిజవదనంబు కోపోద్దీపితంబైనసింహముఖంబుకరణిం జూపట్టఁ గన్నులం గెంజాయ రంజిల్ల మదోద్దండవేదండశుండాదండంబునుం బోలె నిజభుజాదండంబు విదుర్చుచుఁ గ్రోధాతిశయంబున శిరోధూననంబుసేయుచుఁ దీక్ష్ణబాణంబులంబోని కటాక్షవీక్షణంబుల నిరీక్షించి దేవా పితృవచనపరిపాలనాకరణరూపధర్మదోషప్రసంగంబుచేతను దండ్రివచనంబు గావింపని రాముండు మనల నెట్లు రక్షించు నని జనంబునకుం బొడము శంక నపనయించు కోరికచేతను నీసంభ్రమం బేది యుదయించె నది భ్రాంతిమూలం బంతియెగాక యుక్తం బైన యది కాదు నినుబోఁటి యసంభ్రాంతచిత్తుం డట్లనం దగదు తనంతం దాను ముంగల నిలిచి యొక్కింతయైన నెద్దియుం జేయుటకు సామర్థ్యంబు లేమింజేసి స్వాపేక్షితార్థకరణంబునం బురుషాంతరంబు నపేక్షించుచుండునట్టి యశక్తంబును కృపణంబు నగుదైవంబు ప్రబలం బని పలికెదవు దైవంబు నిరా

కరించుటకు సమర్థుండు గాని ప్రాకృతునకుం గాక శౌండీరుం డగు భవాదృశ క్షత్రియశ్రేష్ఠునకుఁ గొనియాడం దగవు గాదని దైవాలంబనవాదంబు ప్రక్షే పించి ధర్మదోషప్రసంగంబును బరిహరించుతలంపునఁ గ్రమ్మఱ నమ్మహాను

—ఛఛ లక్ష్మణుఁడు రామునికిఁ గైకేయి దుర్మంత్రం బెఱింగించుట. ఛఛ—

భావు నవలోకించి దేవా పాపాత్మ లగు కైకేయీదశరథుల విషయంబునందుఁ బాపిత్వాశంక నీ కేల గలుగ దయ్యె వా రిరువురు నిక్కంబుగా నీకుఁ బాపం బాచరింప సమకట్టి రట్టిపాపాత్ము లగు కై. కేయీదశరథుల వాక్యాకరణంబు నందు నీకు ధర్మహానిప్రసక్తి గలుగ నేరదు లోకంబునం గొందఱు దోషమతు లయ్యును గపటధర్మాచరణకంచుకంబుచేత స్వదోషంబునుం గప్పి కొని యుందురు నీవు ధర్మైకశ్రవణస్వభావశాఠ్యంబుచే భవదభిషేకరూప ప్రయోజనంబుఁ బరిహరింప నుపక్రమించి యక్కైకేయీదశరథులు గావిం చిన దురాలోచనం బిది యని యేల యెఱుఁగ వైతి వది యె ట్లనిన భర తున కవశ్యంబు రాజ్యం బొసంగం దగినయది రాముఁడు జ్యేష్ఠుం డగుటను దద్విషయం బైనయభిషేకకార్యం బారంభించెద నప్పుడు నీవు వరద్వయం బడుగుము తద్వ్యాజంబున రాముని వనంబునకుం బనిచి భరతున కభిషేకంబుఁ గావించెద నని యిట్లు కైకేయీదశరథులచేత సంకేతితం బైనకార్యం బిది యట్లు గాదేని యద్దేవియే తావత్పర్యంతంబు వరద్వయం బేల యాచింప కున్నయది యవ్వరద్వయం బయాచితం బైనను నీతిజ్ఞుండగు దశరథుండైన నింతకుమున్నె పరిహరింప కేల యుపేక్షించి యున్నవాఁ డెల్లభంగుల నిదివర వ్యాజంబున భవత్సంపద నపహరింపం గోరి చేసినదుర్మంత్రం బగుటకు సందియంబు లేదని పలికి వెండియు ని ట్లనియె. 538

శా. శిష్టాచారము మాని రాజు సుగుణుక్ జ్యేష్ఠుక్ విసర్జించి తాఁ
గష్టుం డైనకనిష్ఠు నుర్వికి విభుంగాఁ జేయు టేధర్మని
ర్దిష్టం బైనవిధంబు దైవమని యే దీనుండనై లోకవి
ద్విష్టం బైన తెఱంగు సైఁతునె మహావీరోత్తముల్ మెత్తురే. 539

వ. మహాత్మా యేధర్మంబుచేత భవద్బుద్ధి రాజ్యపరిత్యాగవనగమనాంగీకారరూప ద్వైధంబునొందె నేధర్మంబువలనఁ బితృవాక్యాకరణంబునందుఁ బ్రత్యవాయం బగు నని మోహంబు నొందితి వట్టి ధర్మంబు నాకు ద్వేష్యం బై యున్నది నీవు ప్రతీకారకర్మంబునందు శక్తుండ వయ్యును గైకేయీవశవర్తియైన దశర థునివాక్యం బధర్మిష్ఠం బతిలోకనిందితం బని ద్రోచిపుచ్చక యెత్తెఱంగున నంగీకరించితి వభిషేకకార్యవిఘాతంబు వారలచేతఁ గిల్బిషంబువలనఁ గృతం బైన దని యెఱింగి పరిహరింపనికారణంబున నాకు మిక్కిలి దుఃఖంబు వొడము చున్నయది యిట్టి ధర్మాచరణంబు లోకవిరుద్ధంబు కామమన్యుపరీతచిత్తులును

బిత్రుప్రవాదశత్రువులు నగు కైకేయీదశరథులశాసనంబు మనంబునందైన
సంస్మరింపం దగినయదియె యని పలికి వెండియు నిట్లనియె. 540

క. అనఘా వారలయభిషే, చనవిఘటనబుద్ధి దైవసంకల్పము యం
చని పలికెద వల్లనను, ననవరత ముపేక్షణీయ మనుచుం దలంచెదన్. 541

క. విను మానుషుండు దైవం, బనుకొను సంభావితాత్ము లగువీరులు ప్రో
చి నడుతురుగాక దైవం, బని దానిప్రశంససేయ రతిధీయుక్తిన్. 542

క. ధర నెవ్వండు పౌరుషమునం, దఱిం గని దైవమును గడవ దక్షుం డగు న
ప్పురుషుం డాదైవముచేం, గరము నిరోధింపం బడండు కాకుత్స్థవరా. 543

క. దైవబల మెక్కుడో నృప, భావితుం డగుశూరవరునిపౌరుషమె ఘనం
బో వీక్షింపుము ధీవర, దైవపురుషశక్తితారతమ్యము దెలియున్. 544

క. ఏదైవముచే నిప్పుడు, నీదగు సిరి పరులయందు నెఱపంబడియె నేం
డాదైవమును మదీయబ, లౌదార్యాభిహతమునుగ నరయుదు రార్యుల్. 545

వ. దేవా యే నతిక్రాంతాంకుశవ్యాపారంబై విశృంఖలవృత్తి నభిముఖంబుగాం
జనుదెంచు మదబలోత్కటవేదండంబునుం బోలె దైవంబును బౌరుషంబునం
గ్రమ్మఱించెద నదియునుంగాక. 546

లక్ష్మణుండు తాను రాజ్యమును రామునికి లోంబఱతు ననుట

మ. అనుమానం బొకయింత లేక రఘువర్యా నీదురాజ్యాభిషే
చనవిఘ్నం బొనరింపంబూని పటుదోస్సత్త్వంబుతో లోకపా
లనికాయం బరుదెంచెనేని పటుభల్లవ్రాతఘాతంబునన్
దునుమం జాలుదు నట్టినాకు నరనాథుం డెంత చింతింపంగన్. 547

క. రవికులవర నిన్నిప్పుడు, వివాసితునిం జేసినట్టివిమతులు గరిమం
దవిలి పదునాలుగబ్దము, లవిరళగతి నడవి నుండున ట్లొనరింతున్. 548

క. జనవిభునకుం గైకేయికి, ననయవిధి న్భరతరాజ్యమందు మదిం బు
ట్టినదుర్భరాశ నస్మ, ద్ఘనబాహుబలాసిచేత ఖండింతు నొగిన్. 549

వ. మహాత్మా మదీయంబైనమహోగ్రపౌరుషంబు విరుద్ధజనులకు దుఃఖంబుకొఱకు
నెట్లగు నట్లు దైవబలంబు సుఖంబుకొఱకుం గానేరదని యెఱుంగు మని పలికి
వెండియు లక్ష్మణుం డొకానొకప్పుడైన భరతునకు రాజ్యంబు లేమిం దెల్లం
బుగా బోధించుతలంపున నిట్లనియె. 550

తే. అనఘ చిరకాల మీవు రాజ్యంబుం జేసి
వనమునకుం బోవుచుండ నవ్వల భవత్సు
తులె ప్రజాపాల్య మొనరింపంగలరు గాని
భరతునకు లేదు స్వాతంత్ర్య మరసి చూడ. 551

వ. అని పలికి స్వోక్తవచనవాసం బశేషజనసమ్మతం బని యిట్లనియె. 552

తే. వినుము సుతవత్ప్రజానుపాలననిమిత్త, మవనిభారంబు సుతులయం దమరనునిచి
యవ్వల నరణ్యమున కేగు టర్హ మనుచు, వేదవిదులు వచించిరి గాదె తొల్లి.

వ. మఱియు దశరథుం డిట్లు చలచిత్తుం డగుచుంటను రాజ్యవిభ్రమశంకచేత నీవు రాజ్యం బంగీకరింపవేని భవదీయరాజ్యంబును నేను జెలియలికట్ట సాగరంబునుం బోలె రక్షించెద నట్లు సేయనైతినేని వీరలోకసుఖంబు నాకుఁ గలుగకుండుం గాక యని నిక్కంబుగా నీతోడ శపథంబుఁ జేసెద మంగళద్రవ్యయుక్తంబు లగు జలంబులచేత నభిషిక్తుండ వగు మయ్యభిషేకకర్మంబునందు వ్యాసక్తచిత్తుండ వగు మే నొక్కరుండ సకలమహీపాలుర నివారించుటకుం జాలుదు నని పలికి వెండియు నిట్లనియె. 554

తే. అనఘ మద్బాహువులు చాప మసియు శరము
లరయ నివి యలంకారంబులకొఱకుఁ గావు
యతులపరిపంథిదురభిమానాపనోద
నార్థ మని చిత్తమునఁ జూడు మనుదినంబు. 555

వ. మఱియు నెవ్వండు నాకు మిక్కిలి శత్రుం డని పక్షులచేత సమ్మతుం డగు నట్టివానియునికి సహింపం జాల. 556

తే. వాసవుం డల్క మెయి నెత్తి వచ్చెనేని, వాఁడి గలఖడ్గధారచేఁ బోడిమి సెడ
నిగ్రహించెద నట్టినే నుగ్రభంగిఁ, దుచ్ఛు నన్యుని సరకుగొందునె మహాత్మ.

క. నిరుపమసుగుణాకర మత్కరోల్లసచ్చండఖడ్గఖండితకరిరా
ణ్ణరహరిశిరములచే ధర, కరము గహనమ ట్లగమ్యకరమై యుండున్. 558

వ. మఱియు మదీయఖడ్గధారావినిపాతితంబు లైనమత్తశుండాలంబులు తీవ్రవ్రణసంజాతరక్తధారాస్నపితంబు లై విద్యుత్సమన్వితంబు లగు మేఘంబులకరణి గైరికాదిధాతుమండితంబు లైనపర్వతంబులపోలిక ధరణిపయిం బడియెడుఁ గాక బద్ధగోధాంగుళిత్రాణుండనై శరాసనంబు కేలం దాల్చి పురుషమధ్యంబున నిలిచియుండఁ బౌరుషంబు ప్రకటించి నన్నుఁ దేఱిచూడం జాలువాఁడు గలఁడె యిట్లు సంరంభవిజృంభితుండ నై పెక్కండ్ర నొక్క బాణంబునను బెక్కుబాణంబుల నొక్కనిం గాఁ గుదులు గ్రుచ్చినట్లు విచిత్రవిహారంబున రణక్రీడ సలుపు నప్పుడు మదీయదివ్యాస్త్రప్రభావంబు మీరె చిత్తగించెదరు మద్దివ్యాస్త్రప్రభావంబు దశరథున కప్రభుత్వంబును నీకుఁ బ్రభుత్వంబును గావించుటకు సమర్థం బైనదని యెఱుంగు మిప్పుడు మదీయబాహువులు చందనపంకంబునకును గేయూరధారణంబునకును ధనత్యాగంబునకును సుహృత్పాలనంబునకును యోగ్యంబులైన నవి యన్నియుఁ బరిత్యజించి భవదభిషేచనకర్మవిఘాతంబుఁ గావించినట్టి దురాత్ముల వధంబునందుఁ బ్రవృత్తంబులు గాఁగలవు

తమ్ముండ నైనను నాకు నీకు హితంబు సేయుటకంటె నొండుకార్యంబు లేదు గావున గింకరుండనైన నావచనం బంగీకరించి కార్యంబు నడుపు తెఱంగానతి మ్మని ప్రార్థించుచున్న లక్ష్మణుం జూచి తదీయనేత్రగళదశ్రుబిందుసందోహంబు కొనగోట మీటుచుఁ బితృవచనవ్యవస్థితుండై యావజ్జీవపర్యంతం బును వాక్యకరణంబును బ్రత్యబ్దంబు భూరిభోజనంబునుగయయందుఁ బిండదానంబు నిమ్మాఁటిచేతఁ బుత్రత్వంబు ప్రాపించుఁ గావున నెల్ల భంగులవనంబునకుం జనియెద నీవంగీకరింపవలయునని ధర్మసంహితంబుగాబోధించుచున్నరాముని౦ గని బాష్పధారాపూరితలోచనయై కౌసల్య యి ట్లనియె. 559

సీ. ఎవ్వఁడు ధర్మాత్ముఁ డెవ్వాఁ డదృష్టదుఃఖుఁడు సర్వభూతప్రియుఁడు మహాత్ముఁ
డెవ్వాఁడు దశరథోర్వీశునివలన నాయందు జన్మించె సముచితముగ
నెవ్వానిదాసులు భృత్యులు మృష్టాన్న మారగింతురు నిత్య మట్టినీవు
భీకరవనములో నాకలంబులు దిని యేరీతి నుండెద విట్లు రాముఁ

ఆ. డడవి కేగ నన్నుఁగ నాల్ంచి విభుని నె, వ్వాఁడు విశ్వసించు వసుధ సుగుణ
వనధి వైననీవు వనమున కరుగ నే, మందు దైవ మింత యధిక మగు నె. 560

సీ. అనఘాత్మ భవదదర్శనమారుతోత్థిత మై దేహజాతశోకానలంబు
గాఢవిలాపదుఃఖసమిత్సమన్విత మగుచు సమ్యగ్గళదశ్రుఘృతము
చే వేల్వఁబడి మహాచింతోష్ణధూమంబు వఱల నూర్పుల నమావర్తనమునఁ
గడువృద్ధిఁ బొంది మద్గాత్రంబునేర్చుచు నతులదావాగ్ని హిమాత్యయమున

తే. నెండుపొదను దహించిన ట్లీవు నడవి
కరుగ నన్నుఁ దపింపఁ జేయదె గడంగి
కుట్టి నెడఁబాయఁ జాలని గోవుపగిది
నేను నీవెంట వచ్చెద నిపుడు వనికి. 561

క. అని యీగతి విలపించుచు, ననమున సంతాపవహ్ని మల్లడిగొనఁగాఁ
దనతోడ మాటలాడెడు, జననికి నిట్లనియె రామచంద్రుఁడు నూ_క్తిన్. 562

రాముఁడు కౌసల్యనుఁ దాను వనమునకుఁ బోవుటకు సమ్మతిపఱచుట.

మ. జననీ యే నలదావసీమ కరుగన్ త్యానేత కై కేయి చే
సినపాపంబునకుం గృశించు మతి నీచే నిప్పు డీరీతిఁ బ
యన్యనఁ దా వీడ్వడెనేని ఘోరతరదుఃఖార్తిన్ మదిం గుంది యా
యన జీవింపఁడు గాన నీ కతనిఁ బాయం బోల దీపట్టునన్. 563

క. రమణులకుఁ బతిపరిత్యా, గము కేవలఘోరపాపకారణ మగుటన్
సముదితగుణుఁ డగుపతి నో, రమణీయగుణాఢ్య విడువరా దిట నీకున్. 564

మ. జననాథోత్తముఁ డెంతకాల మిలపై సప్రాణుఁడై యుండు నీ
వనుమానింపక యంతకాలము సముద్యద్భక్తియోగంబుచే

తేను శుశ్రూష యొనర్పఁ బోలు నిది యుక్తం బీవు నే నెప్పుడా
యనవాక్యం బొనరింపఁ బోలుఁ బతియుఙ్క్ష్మాధీశుఁడుం గావునన్. 565

వ. అని బహుప్రకారంబుల బోధించి యద్దేవి నెట్టకేలకు నొడంబఱిచి పితృవచన ప్రకారంబునఁ బదునాల్గుసంవత్సరంబులు వనవాసంబుఁ గావించి వచ్చి భవదీయపాదారవిందంబులు గొలుచుచుండువాఁడ నని పలికిన నద్దేవి వెండియుఁ గుమారుని వనవాసంబు దలంచి కనుంగొనల నశ్రుకణంబులొలుక నక్కుమారవరు నవలోకించి యిట్లనియె. 566

చ. జనకునిమాటఁ గైకొని వెసన్ విపినంబున కీవు పోయిన
న్వినుము సపత్నులం గనుచు నే నరిగా మనియుండఁ జాల జ
య్యన విపినంబునం బొడమినట్టి మృగిం బలె నన్ను వెంటఁ దో
డ్కొని చను మేగుదెంచెద నకుంఠితభంగి నరణ్యసీమకున్. 567

వ. అని పలికి రోదనంబుఁ జేసిన తల్లిం జూచి తానును దుఃఖాక్రాంతచిత్తుం డగుచు ధైర్యధుర్యుండు గావున నొక్కింత యుపశమించుకొని గ్రమ్మఱ నయ్యమ్మదిక్కు మొగంబై యిట్లనియె. 568

చ. పతియె మృగాక్షికి న్విభుఁడు బంధుఁడు దైవత మట్లు గావునన్
క్షితిపతి నీకు నా కెపుడుఁ గేవలపూజ్యకుఁ డమ్మహాత్ముఁ డ
ద్భుతకరుణాకరుండు నిన్నుఁ బ్రోవక నేఁటి కుపేక్షసేయు స
న్మతి నిటు చింతవీడి గుణమండనగేహమునందె యుండుమా. 569

క. ఏ నడవి కరుగ భూపతి, దా నెంతయు దుఃఖశోకతాపముచేతన్
మ్రానుపడి యుండుఁ గావున, నీనేర్పున నమ్మహాత్ము నెగ లుడుపఁ దగున్. 570

వ. అదియునుంగాక. 571

క. పరమోత్తమయై యేనతి, నెఱిగల్గి వ్రతోపవాసనిరత యగుచుఁ దా
ధవుని భజియింప దాసతి, నిరయపదంబునకుఁ బోవు నిక్కము జననీ. 572

క. ధాత్రీసురసురపూజలు, పాత్రమెఱిఁగి సేయకున్నఁ బతిశుశ్రూషా
మాత్రమున సాధ్వి యెంతయుఁ, జిత్రంబుగ స్వర్గపదవి చేకుఱుఁ దల్లీ. 573

క. జననీ యేయుత్తమసతి, తననాథుని ధర్మసరణిఁ దప్పక యెపుడున్
ఘనభక్తిఁ గొలుచు నాయమ, యనిమిషలోకైకసౌఖ్య మందుచుఁ జెలఁగున్.

క. పగ యెంత తనకుఁ గలిగిన, మగువకుఁ బతిసేవ శ్రుతిసమంచితధర్మం
బగుఁ గాన దీనిఁ గనుఁగొని, మగనిఁ గొలుచుచుండు మెపుడు మాన్యచరిత్రా.

వ. అని పలికి భర్తృశుశ్రూషయందు యద్దేవిచిత్తంబు గీలుకొల్పి వెండియు నిట్లనియె. 576

క. భరతుఁడు ధర్మరతుండును, గరుణ గలుగువాఁడు గానఁ గైకను నినుఁ దా
నరిగాఁగఁ జూచు నారఘు, వరు నన్నుంబోలెఁ జూడు వాత్సల్యమునన్. 577

చ. అనుపమశాంతిహోమములయందు ఘృతాహుతిచేత వేల్పులన్
వినుతధనంబులం బుడమివేల్పులఁ దృప్తులఁగాఁగఁ జేయుచున్
జనపతిరక్షణంబునకుఁ జాలి మదాగమనంబుఁ గోరుచున్
మునుకొని కాల మొక్కగతిఁ బుచ్చుచు నుండుము పోయి వచ్చెదన్. 578

వ. ఏను గ్రమ్మఱఁ బురంబునకుం జనుదెంచునందాక మహీరమణుండు సప్రాణుండై యుండెనేని సకలాభీష్టఫలంబులు వడయంగలదానవని పలికిన నత్తల్లో దరిశోకాయత్తంబగు చిత్తంబున బాష్పపర్యాకులేక్షణయై వెండియు నక్కుమారున కిట్లనియె.

తే. వినుతగుణశీల విను నీకు విపినగమన, మందుఁ బుట్టిన బుద్ధి నావంతయైన
నిలువరింపంగ లేనైతి నేర్పు లేల, కాలము దురత్యయం బెంత ఘనున కైన.

వ. పుత్ర యేకాగ్రచిత్తుండవై నీవు చనుము నీ కెల్లప్పుడు భద్రంబు గలుగుం గాక నీవు కృతార్థుండవై చరితవ్రతుండవై పిత్రూణముక్తుండవై వనంబుననుండి గ్రమ్మఱఁ జనుదెంచినప్పుడు నిన్ను విలోకించి యేను గతక్లేశనై సుఖంబుఁ బ్రాపించెద నని పలికి వెండియు. 581

తే. దేవిప్రేరణచేతను బూని నాదు, వాక్యమును ద్రోసిపుచ్చి యిబ్భంగి నీవు
విపినమున కేగఁదలఁచె దవ్విధిమహిమము, దుర్విభావంబు నేరికి నుర్వియందు.

క. తనయా వనమున కిప్పుడు, చనుము కుశలి వగుచు మరలఁ జనుదెంచి ముదం
బునఁ జారుసామసూక్తుల, ఘనమతి నను హృష్టచిత్తఁగాఁ జేయు మొగిన్.

—కౌసల్య రామునికిఁ బ్రాస్థానికస్వస్త్యయనంబుఁ గావించుట.—

వ. వత్సా నీవు వనవాసవ్రతంబు పరిసమాప్తి నొందించి జటామండలధారివై చతుర్దశవర్షాంతరంబున మరలి మత్సమీపంబునకుం జనుదెంచినన్నుం దేర్చునట్టి కాలం బిదియ కారాదా యని తలంచెద నని పలికి దుఃఖం బడంచుకొని నిర్మలజలంబు లుపస్పృశించి శుచియై ప్రాస్థానికంబగు స్వస్త్యయనం బొనరింగనుపక్రమించి శ్రీరాము నుద్దేశించి 584

క. అతులితముగ నియమముచే, ధృతిచే నీచేత మిగుల నేధర్మము పా
లితమయ్యె నట్టిధర్మము, సతతము నినుఁ బ్రోచు నడవి నిత్యవిచారా. 585

వ. అదియునుం గాక చైత్యాయతనంబులందు నిత్యంబు నీచేత నెవ్వారు వందితులగుదు రట్టిదేవతలు మహామునులం గూడి నిన్ను రక్షింతురుగాక మహాత్ముం డగువిశ్వామిత్రుండు తొల్లి నీకొసంగిన దివ్యాస్త్రంబులు నీకు జయప్రదంబు లగుం గాక పితృమాతృశుశ్రూషాసత్యంబులచేత రక్షితుండవై బలాయురారోగ్యంబులు గలిగి వర్ధిల్లెదవు గాక మఱియు సమిత్కుశపవిత్రవేదికాయతనస్థండిలంబులును శైలవృక్షంబులును హ్రస్వశిఖంబు లగు శాఖావృక్షంబులును హ్రదంబులును నిన్ను నిరంతరంబు రక్షించుం గాక పతంగపన్నగసింహంబులు నీకు శుభంబు లొసంగుం గాక సాధ్యులును నాశ్వినేయులును వాయు

వులును ధాతయు విధాతయు. సూర్యుండును లోకపాలకులును మహర్షిగణంబులం గూడి సుఖప్రదులై రక్షింతురు గాక భగవంతుండగు స్కందుండును సోముండును బృహస్పతియు సప్తర్షులును నారదుండును. సర్వకాలంబు నీకు మంగళం బొసంగుచుండుదురు స్మృతియును ధృతియును ధర్మంబును సముద్రంబులును నదులును భూమ్యంతరిక్షదివంబులును దిక్కులును ఋతుసంవత్సరమాసపక్షంబులును నహోరాత్రంబులును గ్రహనక్షత్రంబులును సంధ్యలును గళాకాష్ఠాముహూర్తాదికాలంబులును నిత్యంబును మునివేషధరుండవై వనంబునం దిరుగు నీకు సకలమంగళప్రదములై వెలయుం గాక మఱియు భూతప్రేతపిశాచబ్రహ్మరాక్షస రక్షోయక్షపన్నగ వృశ్చిక దంశమశక సరీసృప కీట సింహశరభశార్దూల గజగవయవరాహ భల్లూక మహిషాదిక్రూరసత్వభయంబువలన సర్వదేవత. లేమఱక నిన్ను రక్షింతురుగాక యింద్రాదిదిక్పాలురు దండకారణ్యనివాసి వైననీకు సర్వోపద్రవనివారణంబు సేయుచుండుదురుగాక మార్గంబులు కందమూలమధుసంపన్నంబులై యుండుం గాక మునిముఖచ్యుతంబు లగు మంత్రంబులును నగ్నియును మారుతంబును హోమధూమంబులును నుపస్పర్శనకాలంబున నిన్ను రక్షింతురుగాక శిరంబు దివంబును శ్రోత్రంబులు దిక్కులును ముఖంబు నింద్రాగ్నులును నేత్రంబులు సూర్యుండును మనంబు చంద్రుండును బ్రాణంబులు వాయువు నాభి నంతరిక్షంబును బాదంబులు భూమియు రక్షించుఁగాక యని యీదృశంబులగు మంగళవాక్యంబుల స్వస్తివచనపూర్వకంబుగా నంగరక్షఁ గావించి గంధపుష్పాక్షతంబులచేత దేవగణంబులం బూజించి రామునకు మంగళాభ్యుదయపరంపరాభివృద్ధికొఱకు ఘృతంబును బుష్పంబులును శ్వేతసర్షపంబులు సమిత్తులుఁ గల్పోక్తప్రకారంబున బ్రాహ్మణునిచేత నగ్నియందు హోమంబు సేయించి మఱియు నారామునకు మంగళంబుకొఱకు స్వస్త్యయనక్రియ లాచరించి యవ్విప్రముఖ్యునకు గోభూహిరణ్యాదిదానంబు లొసంగి వెండియు సీతావల్లభు నుద్దేశించి యిట్లనియె. 586

సీ. వృత్రనాశనమందు నింద్రున కమరసమాజ మిచ్చిన జయమంగళంబు
నమృతంబుఁ దేఁబోవు నహికులారికి వినతాంగన యిచ్చినమంగళంబు
నమృతంబు వడయునాఁ డదితి దైత్యుల గెల్వ మఘవున కిచ్చినమంగళంబు
బలిఁ గట్ట నరుగునాఁ డలవామనున కింద్రమాత యిచ్చిన శుభమంగళంబు
తే. నీకె యగుఁ గాక యని రఘునేతశిరము
నందు మంత్రాక్షతలు నిడి చందనంబు
నలఁది సువిశల్యకరణి దివ్యౌషధియును
గుళికఁ గావించి ముంజేతఁ గూర్చి కట్టె. 587

వ. ఇట్లు రక్షాబంధనంబుఁ గావించి దాని వీర్యవంతంబు లగుమంత్రంబులచేత నభిమంత్రించి చుబుకంబు పుణికి శిరంబు మూర్కొని చెక్కిలి ముద్దుగొని గద్గదస్వరంబున ని ట్లనియె. 588

సీ. అనఘాత్మ పోయి రమ్మడవికి సుఖివై యరోగుండవై యందు సాక్షి మెఱయ
సమయంబుఁ దీర్చి ప్రసన్నాననుండ వై మరలఁ బురంబున కరుగుదెంచి
యవనిజఁ గూడి పట్టాభిషిక్తుండ వై యతులితవజ్రసింహాసనమునఁ గ్రన్నఁ
బూర్వాద్రిపైఁ బొల్చుపూర్ణచంద్రునిమాడ్కిఁ జెలఁగుచుఁ బ్రజల రక్షించు

తే. గన్ను లారంగఁ జూచెదఁ గాక యనుచు
నడవి వర్తించునిన్ను శివాదిసురులు
నసురమునులును నీకు దీర్ఘాయు వొసఁగి
కాచి రక్షించుచుందురుగాక వత్స. 589

—రాముఁడు స్వగృహంబున కరుగుట.—

వ. అని పలికి స్వస్త్యయనంబుఁ బ్రయోగించి రక్షార్థంబు ప్రదక్షిణంబు చేసి కొడుకుం గౌఁగిలించుకొని పోయి రమ్మని పంచిన నారఘుపుంగవుండు తల్లి పాదంబులకుఁ బ్రదక్షిణపూర్వకంబుగా సారెసారెకు నమస్కారంబుఁ గావించి దీవెనలఁ జెంది తదీయమందిరంబు వెలువడి నిజదేహప్రభాపటలసమలంకృతరాజమార్గుం డగుచుఁ బూర్వభాషిత్వప్రియవాదిత్వప్రభృత్యుక్తవిశిష్టగుణత్వంబున జనంబులచిత్తంబుల నిర్మథించుచు సంహృష్టజనాకీర్ణంబును గార్తస్వరవిభూషితంబు నగుస్వగృహంబునకుం జని యందుఁ బట్టాభిషేకవిఘాతాదికం బెఱుంగని దగుటవలన నాయావరాజ్యాభిషేచనంబు మనంబున నిడికొని దేవపూజాదికంబు నిర్వర్తించి యభిషిక్తభర్తృవిషయంబునందుఁ బట్టభార్యలచేతఁ జేయం దగినపాదార్చనాదిసమాచారం బెఱింగిన దగుటం జేసి సాక్షతగంధపుష్పపాత్రహస్త యై యభిషిక్తరాజనాధారణలక్షణపాండురచ్ఛత్రచామరపురస్కృతభద్రాసనాదికంబు లెఱిఁగినది గావున నుక్తలక్షణవిశిష్టుం డై వల్లభుం డెప్పుడు వచ్చునో యని తదాగమనంబుఁ బ్రతీక్షించు చున్న సీతకడకుం జని యద్దేవి కెవ్విధంబున నేతాదృశవిప్రియం బెఱింగింతు నని. వ్రీడావనమ్రవదనుం డై యుండె నప్పుడు. 590

తే. విభునిముఖమునఁ గనుపట్టువిన్నఁదనము, జిత్తమునఁ గూరియుండినచింతఁ జూచి
యొకవిధంబునఁ జూపట్టుచున్న దనుచుఁ, గాంతచింతాకులితసర్వకరణ యయ్యె.

—సీత రామునిముఖంబునం గల దుఃఖమునకుఁ గారణం బడుగుట.—

చ. అతివ తెఱంగుఁ జూచి హృదయంబునఁ దాలిమి నిల్పలేక దా
నతిశయదుఃఖవేగమున నశ్రులు రాల్పఁ దొడంగె నప్పు డా
పతికడఁ దోఁచులజ్జయు విపన్నతయుం బరికించి మేదినీ

సుత కడు నివ్వెఱ న్మునిఁగి శోకముతో నిజభర్తకిట్లనున్. 592

తే. దేవ నేఁడు బృహస్పతిదేవతాక, మైనపుష్యమి నీదురాజ్యాభిషేక
మునకుఁ దఱి యని విప్రోత్తములు వచించి, రది నిరర్థక మేభంగినయ్యెఁ జెపుమ.

క. జలఫేనసన్నిభము శత, శలాకికాయుతము పూర్ణచంద్రసదృశ ము
జ్జ్వల మగు శ్వేతచ్ఛత్రము, సులలిత మగుశిరముమీఁద శోభిల దేలా. 594

తే. నవసరోరుహపత్రాభనయన మైన, నీదువదనంబు మణిదండనిర్మితాచ్ఛ
చంద్రహంసప్రతీకాశచామరముల, చేత రంజింపఁ బడ దేల చెపుము నాకు.

తే. నిఖిలమంగళతూర్యవినిస్వనములు, సూతమాగధపాఠకస్తుతిరవములు
సకలభూసురస్వస్తివాచననినాద, మిపుడు వినఁబడ వేల ప్రాణేశ చెపుమ. 596

తే. వేదవేదాంగవిదు లైన విప్రవర్యు, లధిప మూర్ధాభిషిక్తుఁడ వైననీదు
శిరమునందుఁ దీర్థాంబుమిశ్రితమనోజ్ఞ, దధియుతక్షౌద్రంబు నిడ రేల తపనతేజ.

క. పరిషన్ముఖ్యులు మంత్రులు, పరమర్షులు జానపదులు పౌరులు భృత్యుల్
పరమానందంబున నీ, పిఱుంద దెన రా రదేల ప్రియ మలరారన్. 598

తే. ముఖ్యములు వేగసంపన్నములు మనోజ్ఞ
కాంచనవిచిత్రభాండయుక్తంబు లైన
భూరిహయములఁ బూన్చినపుష్యరథము
భానుతేజ నీమ్రోలఁ జూపట్ట దేల. 599

తే. నీలమేఘనిభ ప్రభానిరుపమాన, కుసుమపూజితసుందరకుంజరంబు
పృథుపరిష్కారరేఖాగభీర మగుచు, దేవ నీమ్రోల రా దేల తెలియఁ జెపుమ.

క. హరిహయసన్నిభవిక్రమ, సురుచిరమణివజ్రచిత్రసుందరచామీ
కరభద్రాసనముఁ బుర, స్కరించుకొని రా వదేల సముచితభంగిన్. 601

చ. సలలితచంద్రబింబసదృశం బగునీవదనం బదేలకో
చెలువము దక్కి నేఁడు పెనుచింత వివర్ణత నొంది యున్న దు
ల్లలదురురాజలక్షణవిలాసము లేమియుఁ గానరావు నా
కలవడఁ దెల్పు మింతయు మహాపురుషా యనుమాన మేటికిన్. 602

చ. అని విలపించుచున్న ప్రియురాలికి నాత్మవివాసనంబుఁ దా
ముని వినిపించినం బిదప మోసము వచ్చు నటంచు బెద్దయు
న్ఘనగుణకీర్తనంబున మనంబు దిరంబుగఁ జేయ రాఘవుం
డనియె మహీజతోడ ముదితాత్ముఁడుపోలె నయంబుఁ దెల్పుచున్. 603

రాముఁడు సీతకు దశరథనిదేశంబుఁ దెల్పుట.

చ. సరసిజనేత్ర తొల్లి నృపచంద్రుఁడు కైకకు మెచ్చి వేడ్కతో
వరములు రెం డొసంగె విభవంబున నాయమ నాఁటనుండి దా
మఱచియు నిప్డు తెల్పఁగని మానవనాథునియొద్ద నెంతయు

న్భరతున కుర్వి రాజ్యమును నాకుఁ బ్రవాసముఁ గోరెఁ గోరినన్. 604

చ. జనపతి సత్యవాదియును సత్యవిచారుఁడు గాన మున్ను దా
నసుమతిఁ జేసి వేడ్క మెయి నాడినవాక్యముఁ దప్పలేక నె
మ్మనమునఁ గైకపుత్త్రునకు మానవరాజ్యము నీఁ దలంచి న
న్వనమున నుండు పొమ్మనె నవారణలీలఁ జతుర్దశాబ్దముల్. 605

—రాముఁడు సీతకు బుద్ధులు గఱపుట.—

వ. నీచేత ననుజ్ఞాతుండ నై కాదె వనంబునకుం బోవువాఁడ నై నిన్నుం జూడ వచ్చితి మఱియు భరతునిసమీపంబునం దేను నీచేత నొకానొకప్పు డైన శ్లాఘనీయుండఁ గాను సమృద్ధియుక్తు లగుపురుషులు పరస్తవంబు సహింపం జాలరు గావున మద్గుణంబులు భరతునిమ్రోలఁ గథ్యంబులు గావు సర్వప్రకారంబుల నతనిసమీపంబున ననుకూలత్వంబున వర్తించు టిది యోగ్యంబు నీవు బంధుసాధారణ్యంబున భరణీయవుగాని భర్తవ్యవుగావునసాతనం బగురాజ్యంబు తండ్రిచేత నతనికి దత్తం బయ్యెఁ గావున నతండు నరపతి యగుటం జేసి నీచేత విశేషించి ప్రసాద్యుండై యుండుఁ బితృవచనప్రకారంబున నేను వనంబునకుం జనియెద నానచ్చునందాఁక వ్రతోపవాసంబులు సలుపుచుఁ గాలంబు దప్పకుండ దేవతాసపర్యలు గావించుచు నిత్యంబుఁ గౌసల్యాదశరథులకు నమస్కరించుచు విశేషించి మజ్జనని యగుకౌసల్య శోకసంతాపకర్శిత గాకుండ సన్మానంబు సేయుచు స్నేహప్రణయపాలనంబుల నాకుఁ దల్లు లందఱు నొక్కరూపు గావున నద్దేవుల కందఱకు వందనంబు లాచరించుచు మఱియు నాకుఁ బ్రాణతుల్యులును భ్రాతలును బుత్త్రసములు నగు భరతశత్రుఘ్నులయెడ వాత్సల్యంబు నెఱపుచు విశేషించి భరతుండు దేశకులంబులకు రాజు గావున నతనికి విప్రియంబుఁ గావింపక ప్రియవాదిని వై యుండు మనుకూలవృత్తిచేత నాలస్యత్యాగాదులచేత నవనీపతు లారాధితు లై ప్రసన్ను లగుదురు తద్విపర్యయంబునందుఁ గుపితు లగుదురు గుణంబు లేనియెడఁ బుత్త్రుల నైనఁ బరిత్యజింతురు గుణంబు గలచోట నన్యుల నైనం బరిగ్రహింతు రట్లు గావున నీ వీయర్థంబు మనంబున నిడికొని ధర్మంబు దప్పకుండ భరతుని కనువర్తినివై సత్యవ్రతపరాయణవై యొక్కని కైన నప్రియం బొనరింపక ధర్మైకనిష్ఠవై కాలంబుఁ గడపుచు మదాగమనంబుఁ బ్రతీక్షించుచుఁ గౌసల్యయొద్ద నుండు మేను వనంబునకుం బోయి వచ్చెద. 606

క. అని యీవిధమునఁ బతి వల్కినఁ బ్రణయమువలనఁ గోపగించినయటు లా
వనజాతనేత్ర నిజనాథునిఁ గనుఁగొని పలికె మరల దుఃఖము గదురన్. 607

-:- సీత రామునితోఁ దానును వెంటనే వత్తు ననుట. -:-

తే. అనఘ యేమి వచించెద వఱఁతిమాట, లఖిలధర్మపారంగతు లైన మీరె
తగవువిడనాడిపలుకు టెంతయును నాదు,మదికిఁబరిహాసమైతోఁచె మానవేంద్ర.
వ. అది యెట్లం టేని. 609
చ. తనయుఁడు భ్రాతయుఙ్ స్నుషయుఁ దల్లియుఁ దండ్రియు నాత్మకర్మసం
జనితఫలంబులం గుడువఁజాలి స్వభాగ్యనియుజ్యమాను లై
మనుదురు భర్తృభాగ్యమును మానిని యొక్క తె పొందుఁ గావున
న్మనుజవరేణ్య యేనును వనంబున నున్కి యొనర్పఁగాఁ దగున్. 610
వ. అదియునుంగాక "అర్ధో వా ఏష ఆత్మనో యత్పత్నీ" యను వేదవాక్యంబుగలదు
గావున భవదర్ధశరీరభూత నైన యేనును మహీపతిచేత వనవాసంబునందు నియో
గింపంబడినదాన నైతిఁ గావున నేను నీతోడ వనంబునకుం జనుదెంచెద. 611
క. జనకుఁడు జననియు సఖియును, దనయుండును దనకుఁ గాదు తథ్యము ధరలో
వినుము సతి కిందు నందును, మనుజగుపతి యొకఁడె పరమగతి తలపోయన్.
క. అనఘా నీ విపుడే వన, మునకుం జని తేని నీదుముంగలఁ గుతుకం
బునఁ గుశకంటకముల నొగి, వని మృదువుగఁ జేసికొనుచు వచ్చెదఁ బ్రీతిన్.
తే. రోషము నసూయయును మృషాభాషణంబు
భుక్తశేషోదకంబును బోలె విడిచి
కొని చనుము నన్ను నిర్విశంకుండ వగుచుఁ
బ్రాణనాథ నాయందుఁ బాపంబు లేదు. 614
వ. మఱియు వల్లభుండు ప్రాసాదాగ్రంబులకన్నను స్వర్లోకస్థితవిమానంబులకన్న
ను యోగబలంబువలనఁ గేవలవైహాయసగతంబులకన్నను సర్వావస్థలయందుఁ
బతిపాదచ్ఛాయయే యువతి కధికం బని విధింపఁబడియె నదియునుంగాక. 615
ఉ. తల్లియుఁ దండ్రియు న్బహువిధంబుల బుద్ధులఁ జెప్పుచోట నా
కెల్లెడ భర్తృసేవ మది నేమఱ కుండు మటంచుఁ బ్రీతితోఁ
దెల్లముగాఁగ ధర్మవిధిఁ దెల్పిరి గావున నత్తెఱంగు నా
యుల్లమునందుఁ బాదుకొని యున్నది వెండియుఁ జెప్ప నేటికిన్. 616
ఆ. పురుషవర్జితంబు భూరిమృగాకీర్ణ
మైనవిపినమునకు నరుగుదెంచి
తండ్రిగృహమునందు దగ వసించినమాడ్కి
నిన్నుఁ గూడి యచట నిలుచుదాన. 617
క. అతులత్రిలోకసుఖసం, తతి యైన నదేల వినుము ధరణీశ పతి
వ్రత లగుసతులకు నిత్యముఁ, బతిసేవ చతుర్విధేష్టఫలదము గాదే. 618
ఉ. కావున జీవితేశ ఘనకాననసీమఫలంబుల న్మదరి

బావహిలన్ గ్రసించుచు సమాహితబుద్ధి భవత్పదాబ్జముల్
వావిరిఁ గొల్చుచు న్మధుసువాసితభూముల నిన్నుఁ గూడి యి
చ్ఛావిధిఁ గ్రీడ సల్పెదఁ బ్రసన్నతఁ దోడ్కొని పొమ్ము వచ్చెదన్. 619

క. దేవా యన్యుల నైనను, బ్రోవ సమర్థుఁడవు నీవు పొలుపుగ నన్నుం
బ్రోవఁగఁ జాలవె మునుకొని, నీవెంట నరణ్యమునకు నిజముగ వత్తున్. 620

వ. మహాత్మా న్యాయప్రాప్తానుగమనత్వంబువలన నన్నుఁ బరిత్యజింప శక్యంబు గాదన్నపానవిశేషసంపాదనంబుకొఱకు నీకు దుఃఖంబుఁ గావింపక ఫలమూలంబులాహరించి నిత్యంబు నిన్ను సేవించుచుఁ ద్రైలోక్యైశ్వర్యంబు నైన గణింపక పాతివ్రత్యంబుఁ జింతించుచుఁ దపశ్చరణశీల నై నియమయుక్త నై నిన్నుం గూడి యుండెద నదియునుం గాక. 621

సీ. మనుజేంద్ర గుహలందు మధుగంధివనములయందుఁ బల్వలములయందు శైల
ములయందు శాడ్వలంబులయందు సానుదేశములందు బకహంసచక్రవాక
కారండవాకీర్ణకాసారములయందు మించి నీతోడఁ గ్రీడించుకంటె
నాకలోకం బైన నామనంబున కెక్కు డగునె మహాత్మ యిప్పుడిఁ బెక్కు

తే. వత్సరంబులు చరియింప వచ్చుఁ గాక
చిత్తమున కొక్కదురవస్థ చిక్కుపడునె
నిన్నుఁ బాసినయెడ నింట నున్న భోగ
మెంత గలిగిన సంతోష మింత లేదు. 622

ఉ. కావున నే నవశ్యమును గారుణికోత్తమ కాననోర్వికి
న్నీ వెనువెంట వచ్చెదను నేర్పులు దెల్పుచుఁ గాదఁటన్నచో
వావిరి దుఃఖశోకమయవారిధిలోన మునింగి చెచ్చెరన్
జీవితముల్ త్యజింతు నిది సిద్ధము పల్కులు వేయు నేటికిన్. 623

వ. దేవా మృగయుతంబును నాగవారణసమన్వితంబును సుదుర్గమంబు నగు నరణ్యంబునకుం జనుదెంచి యందు భవత్పాదారవిందంబులు సేవించుచుఁ బితృగృహంబునందుం బోలె సుఖంబుగా నుండెద నిరంతరానురక్తచిత్త నై యనన్యభావ నై భవద్వియుక్త నగుదు నేని మరణంబునకు నిశ్చిత నై ప్రార్థించుచున్న నన్ను శీఘ్రంబున వనంబునకుం దోడ్కొని చను మిది నీకు భారంబు గాదు.

చ. అని యిటు సర్వధర్మకలితాత్మక యైననృపకుమారి ప
ల్కిన విని రాఘవుండు పలికెన్ మరలన్ నిజపత్నిఁ జూచి కా
ననమునఁ గల్గు బాములు మనంబున నెంచుచుఁ దద్విలోలలో
చనగళదశ్రువుల్ దుడిచి సాంత్వమృదూక్తి ననూనయించుచున్. 624

తే. అంబుజేక్షణ నీవు మహాకులీన, నగుట ధర్మవిశారద వైతి విచట
విడిచి వనమున కింపుగా నిజబుధ ,, మాచరింపుము నన్నుఁగూర్చి యనుదినంబు

శ్రీరాముఁడు సీతను వనమునకు రావల దనుట.

క. ఏ నెద్ది బుద్ధిఁ గఱపిన, దాని నొనర్పంగ నీకుఁ దగుఁ గావునఁ బ
ద్మానన కాననసీమకు, మానుగ రావలదు నిలువుమా నిలయమునన్. 627

ఉ. కోమలి కాననంబు లతికోమలకుం జొర రాదు దుర్జన
స్తోమనివాసము న్బహుళదుఃఖతరంబు భయస్వరూప ము
ద్దామమృగప్రకాండ మతిదారుణ మచ్చట నెంతయు న్సుఖం
బేమియు లేదు నామతి గ్రహించి సుఖస్థితి నింట నుండుమా. 628

క. గిరినిర్ఝరజనితము లగు, పరుషనినాదములు భయదబంధురగిరికం
దరవాసిసింహనినదో, త్కరములు వీనులకు దుఃఖకరములు గావే. 629

క. జనశూన్యము లగుఘోరవి, పినదేశములందు భూరిభీషణఘోషం
బునఁ గ్రీడసలుపుమృగములఁ, గనుఁగొన్న భయమువొడముఁగాదె మృగాక్షీ.

క. దారుణనక్రవిహారో, దారము లై బురద గల్గి దంతికలితసం
చారంబు లై తనర్చెడు, భూరిమహానదులు దాఁటఁబోలునె చెపుమా. 631

క. హరిణాంకవదన భీషణ, తరకృకవాకూపనాదితములు లతాప్ర
స్తరకంటకయుతములు నగు, నరణ్యమార్గముల నడువ నలవియె నీకున్. 632

రాముఁడు సీతకు వనవాసంబునం గల యిడుమలఁ జెల్పుట.

క. వనజాతనేత్ర తమయం, తనె రాలినపర్ణతల్పతలములయందుం
బనివడి నిద్రించుటయును, ఘనసుకుమారులకు మిగులఁ గష్టముగాదే. 633

క. కమలాక్షి తరువు వలనం, దమయంతనె పడినఫలవితానముఁ దిని కా
లము పుచ్చుచు నాఁకటి నోర్చి మనంగాఁ జెల్లు నొక్క మృగనేత్రలకున్.

మ. చలిగాలిం బడి నిత్యముం ద్రిషవణస్నానంబుఁ గావించుచున్
ఫలమూలంబుల దేవతాతిథిపితృప్రాశంబుల న్భక్తి ని
చ్చలుఁ బూజించుచు సంతతవ్రతవిధుల్ సంధించుచున్ దీర్ఘవ
ల్కలముల్ దాల్చి వసింప నచ్చునె వనిం గాఠోర్యోపవాసంబులన్. 635

క. వానప్రస్థోచితవిధి,చే నిత్యము వేదియందు క్షితిజాత గళ
త్పూనార్చలు సలుపఁగ వలెఁ, గాన నరణ్యంబు దుఃఖకరము లతాంగీ. 636

తే. మానినీమణి లబ్ధంబు లైనమూల
ఫలము లవి కొంచె మైనను బరఁగ వాని
చేతనె మనంబునకుఁ దృప్తి సేయవలయు
గహనవాసంబు కడుదుఃఖకరము సుమ్మి. 637

వ. మఱియు మహావాతంబులు రజోరూషితంబు లై సుడియుచుండు రాత్రులయందు
గాఢతిమిరంబు వ్యాపించి యుండు సర్వకాలంబు మిక్కిలి భోజనేచ్ఛ గలిగి
యుండు గిరిసర్పంబులు బహురూపంబు లై యతికుటిలసంచారంబు లై మార్గంబు

నావరించుకొని యుండుఁబతంగవృశ్చికకీటదంశమశకంబులు నిత్యంబును బాధించుచుండుఁ గంటకవంతంబు లైనద్రుమంబులును గుశకాశంబులును వ్యాకులశాఖాగ్రంబు లై యుండు నదియునుం గాక యరణ్యవాసంబునందుఁ గాయక్లేశకరంబు లైనవ్రతోపవాసాదికంబులు గావింపవలయు నుక్తవిలక్షణంబు లైనభయంబు లనేకంబులు గలిగి యుండుఁ గ్రోధలోభంబులు వర్జించి నిత్యంబును దపంబునందు బుద్ధి నిలుపవలయుఁ గావున వివిధదురవస్థా ప్రాప్తిహేతు వగు కాంతారవాసంబు నీ కశక్యం బై యుండు నెల్లభంగుల మదీయవాక్యం బంగీకరించి వనప్రయాణం బుపసంహరింపు మని నానావిధానూనవాక్యంబుల ననూనయించు చున్న ప్రాణవల్లభుం గనుంగొని కన్నీరు నించుచు గద్గదస్వరంబున ని ట్లనియె. 638

తే. అనఘ మీ రాన తిచ్చినయటుల ఘోర
గహనమున దోషములు పెక్కు గలుగు టదియు
నిక్క మైనను నీదుసన్నిధివశంబు
వలన నవియు గుణంబు లై యలరు చుండు. 639

తే. దేవ సింహాదిమృగము లదృష్టపూర్వ, మైననీవిగ్రహముఁ జూచి యధికభీతిఁ
బఱచు నెవ్వారికై ననుభయము పుట్టుఁ, దవిలి భయహేతువస్తుసందర్శనమున.

క. మానక మును గఱపినగురు, నానతి నీతోడ వనికి నరుగుట యొండెం
గానియెడ జీవితము లు,ర్వీనాయక విడుచు టొండె వేఱొక టగునే. 641

ఉ. మానవనాథ యింత పలుమాఱు భయం బిటు పల్క నేల నీ
మానితబాహుదుర్గముల మాటున నిల్చిననన్ను వాసవుం
డైనను దేఱి చూడఁ గలఁడా భవదీయపరాక్రమక్రమం
బే నిపు డాత్మలోఁ దెలియ కిట్లు దలంతునె సాహసంబునన్. 642

ఆ. భానువంశవర్య పతిహీన యగుసాధ్వి, జగతిలోన బ్రతుకఁ జాల దనుచుఁ
బెక్కుమార్గ్ల మీరె ప్రీతితోఁ జెప్పితి, రిప్పు డన్యధర్మ మెట్లు గలిగె. 643

వ. అదియునుం గాక. 644

క. మును జనకునిగృహమున సజ్జను లగుభూసురులు పరమసాధ్వి పతితో
వనయాత్ర సలుపఁ గల దని, యనఘా వచియించి రదియు ననృతం బగునే. 646

వ. మఱియును.

ఆ. రాజవర్య సాముద్రికలక్షణజ్ఞు, లతివ పతితోడ వనమున కరుగఁ గలద
టంచు రేఖావిశేషంబు లరసి చెప్పి, రది నిరర్థక మగునె మహాత్మ యిపుడు.

ఆ. వాసవాభ విప్రవరులచే నుపదిష్ట, మైనవిపినవాస మనుభవింప
కేల తక్కు నాకు హితబుద్ధి నీవెంటఁ, బూని కాననమున కేను వత్తు. 648

క. వనవాసమందు దోసము, లనఘాత్మక పెక్కు గలుగు టది నిక్కం బై

నను విషయలోలుపులఁ జయ్యనఁ గలఁచుం గాక నియమితాత్ముల కగునే.

తే. పిన్ననాఁ డేను గురునింట నున్నవేళఁ, దల్లి మ్రోల నొకానొకతపసివలన
విపినవాసంబు గలుగుట వింటి నాఁట,నుండి యదియె కాంక్షించుచున్నదాన.

తే. అధిప నన మిద్దఱము విలాసార్థ మర్థి, వేడ్క విహరించుటకు జాహ్నవీతటస్థ
విపినమున కేగుదమె యనుచుఁ బెక్కుగతులఁ, బ్రీతితో నడుగ నిన్నుఁ బ్రార్థింపలేదె.

తే. కాంత నేఁటికి దైవయోగమున నదియు
దొరకొనియె మాట లింకేల పరమభక్తి
కాననంబున నీపాదకమల సేవ
సేయు చుండెద సంతుష్టచిత్త నగుచు. 652

సీత తన్ను వనమునకుఁ దోడ్కొనిపోవలయు నని నిర్బంధించుట.

వ. మఱియు నాకు భర్తకంటె నొండు దైవంబు లేదు గావున నట్టి దైవస్వరూపుండ వైన నీచరణసేవావిశేషంబున విగతకల్మష నై యుభయలోకసుఖంబులం బడసెద నది యెట్లనినఁ దండ్రిచేత సలిలధారాపూర్వకంబుగా దత్త యైన యువతి యీలోకంబునఁ బతివ్రతాధర్మంబునం బ్రవర్తించె నేనియు నది పరలోకంబునందును నతనికే దయిత యై యుండు నని బ్రాహ్మణముఖనిర్గతం బైన వేదవాక్యంబులవలన వినంబడుచుండు శ్రుతిస్మృతిన్యాయంబులవలన మన కిరువురకు నిత్యసంబంధంబు సిద్ధం బగుచుండె సదాచారసంపన్నను బతివ్రతను స్వకీయ నైన నన్నుఁ బురంబుననుండి వనంబునకుం దోడ్కొని పోవుట కేల యనుమతి సేయవు సమానసుఖదుఃఖ నగుచున్న నీతోడ వనంబునకుం దోడ్కొని పొమ్ము దీని కొడంబడ వేని విషాగ్నిజలంబులవలనం బ్రాణంబులు విడిచెద నని నానావిధన్యాయానుసరణంబు లగువాక్యంబులం బ్రార్థించి యతనిచిత్తంబు ప్రసాదాయత్తంబు గాకున్నం గనుంగొని యద్దేవి ప్రణయాభిమానంబుల నీషత్కోపదీప్తవదన యై వెండియు నిజవల్లభున కిట్లనియె.

చ. విను మిథిలాధినాథుఁ డతివిశ్రుతకీర్తి విదేహుఁ డైన మ
జ్జనకుఁడు పత్ని నై నను సమ్మతిఁ బ్రోవఁగఁ జాల కొంటి మై
వనమున కేగు నిన్ను విని వారక లోపల స్త్రీత్వముఁ వెలిఁ
ఘనపురుషార్హరూపమును గల్గినయల్లునిఁగాఁ దలంపఁడే. 654

తే. రామ మాతండ్రి జనకుండు రమణతోడ
రూపమాత్రంబుచేతఁ బురుషుఁడ వైన
నిన్ను స్త్రీనిఁ గా నెఱుఁగక నన్నొసంగె
నెఱిఁగి యుండినఁ గని కని యేల యిచ్చు. 655

తే. అనఘ మాయయ్య జనకుండు నిను మహాత్ము
నల్లునిఁగఁ గొని భువనత్రయంబునందుఁ

గలుగు భవదన్యపురుషవిగ్రహము సర్వ
మాత్మలో నెంచె స్త్రీ యని యనుదినంబు. 656

క. ఆతతబుద్ధి విదేహ, జ్యాతలనాథుండు మాత యగు కేకయభూ
నేతసుతవలనఁ గలహాం, బీతఁజేఁ బుట్టు నని యెఱుఁగ కిచ్చె న్నన్నున్. 657

వ. మఱియును. 658

తే. కాంత మాతండ్రి పురుషవిగ్రహుఁడ వనుచు
రామ జామాత వనుచుఁ గరంబు నిన్నుఁ
గాంచి యుభయలోకసుఖంబుఁ గరము తుచ్ఛ
ముగఁ దలంచుచు నానందపూర్ణుఁ డయ్యె. 659

వ. ఏతాదృశసర్వానందకరుండ వై నసీవు నన్నేల పరిభవింపం జేసెద వని పలికి
వెండియు నిట్లనియె. 660

శా. అ స్త్రీనేతపతీవరామనృపతాావత్యంత తేజఃపరం
చాస్తోక మ్మనుమాట న న్నిచటఁ బాయంబెట్టి నీ వేగిన
న్నా స్త్రీనేతపతీవరామనృపతావత్యంత తేజఃపరం
చాస్తోక మ్మని మ్రోయు నింక భువిలో నార్యాన్యసందీప్త మై. 661

తే. అనఘ యేల విషణ్ణుఁడ వైతి వీవు, నీకు భయ మెట్లు గలిగె ననింద్యశీల
యోగ్య నై నీవెగతియని యున్ననన్ను,రమణవిడుచుట కేమికారణము చెపుమ.

క. అనఘ ద్యుమత్సేనజుఁడును, జననుతుఁ డగుసత్యవంతుసతి యగుసావి
త్రినిఁ బోలె భవద్వశవ,ర్తిని నగుననుఁ జిత్తమందుఁ దెలియు మధీశా. 663

చ. అనఘవిచార యేను బరు నాత్మఁ దలంచి యెఱుంగ నక్కటా
పనివడి యిట్లు నన్నుఁ గులపాంసనినట్ల త్యజింప నేల చ
య్యనఁ గొని పొమ్ము ఘోరవిపినావలికి న్నను నట్ల సేయఁ బా
పనతము యోప వేని ఘనపాతకి వయ్యెద వింత యేటికిన్. 664

క. దేవ యనపాయఁ గామా, రావస్థాపరిణతను మహాసతి ననఘన్
దేవి నగునన్ను జాయా, జీవునికరణి నొసఁగఁ దలఁచితివి పరులకున్. 665

తే. అధిప వంశపరంపరాభాగ్యగతయును
భర్తృయోగ్యయు సతియును భద్రదయును
లలితకౌమారయును నగురాజ్యలక్ష్మి
నకట భరతాదుల కొసంగు టర్హ మగునె. 666

ఉ. ఎవ్వరిపథ్యముం బలికె దెవ్వరియర్థముఁ బొంటె వేఁగె దీ
వెవ్వరికిన్ హితంబు హృదయేశ యొనర్చెద వట్టివారికిన్
నవ్వులుగాక యెంతయు వినమ్రుఁడ విష్టకరుండ వై మదిన్
నెవ్వగ మాని యుండు మిట నిన్ను జనంబులు మెత్తు రెంతయున్. 667

వ. అని కోపంబు పెంపున నాక్షేపించి వెండియు నిట్లనియె. 668

క. తప మైన నాక మైనను, విపిన మయిన నిరువురకును వెస నొక్కటి యూ
విపరీత మేల పల్కెదు, చపలత లేకుండ వనికిఁ జనుదెంతు రహిన్. 669

తే. నిన్నుఁ గూడి వనంబున నున్నవేళ, నిడుమ లెన్నియుఁ గలిగిన హృదయమునకు
స్వర్గభోగసమాన మై వఱలు నాకు, దేవ తోడ్కొని పొమ్ము సందియము దక్కి.

ఆ. అధిప నీపిఱుంద నరుదెంచు నాకు ను, ద్యానవనవిహారమందుఁ బోలె
నధ్వమందు నొకింత యైన నాయాసంబు, గలుగ దిడుమలనుచుఁ దలఁప వలదు.

మ. మనుజేంద్రోత్తమ నిన్నుఁ గూడి యటవీమార్గంబునం బోవునా
కనిశంబుం గుశకాశముఖ్యకఠినజ్యాజాతముల్ భూరిశో
భనసంధాయకతూలతల్పకసమస్పర్శంబు లై యుండు న
న్ననుమానింపక నీదువెంటఁ గొని పొమ్మా కాననక్షోణికిన్. 672

తే. అధిప ఝంఝానిలోద్ధూత మైన యేర, జంబుచే నస్మదీయగాత్రంబు చాల
ధూసరిత మగు నమ్మహీధూళి నతుల, చందనముగాఁ దలంపుదు డెందమందు.

తే. చెలఁగి నీతోడ వనమధ్యసీమయందు
రమణ శయనించుతఱి శాడ్వలములకంటె
సదనమునఁ గల్గుఘనచిత్రమృదులతరకు
థాస్తరణతల్పకము లంతయధిక మగునె. 674

తే. అధిప నీవు కాంతారమధ్యంబునందుఁ, గరుణఁ జేసి యొసంగిన కందమూల
ఫలపలాశాదికములు స్వల్పంబు లైన, నవియె నాకు సుధాభంబులని తలంతు.

క. జనకుని తల్లిని గృహమును, మనమునఁ దలపోయ నెపుడు మత్కృతమున నీ
కనిశము శోకము గలుగదు, ననుఁ దోడ్కొని పొమ్ము కాననంబున కధిపా.

క. నినుఁ గూడి యున్నచో టది, వన మైనను స్వర్గసన్నిభం బగు మఱియు
నిన్నుఁ బాసి యున్నచో టది, ఘనపట్టణ మైన నారకసమం బధిపా. 677

క. కావున ననుఁ దోడ్కొని విపి, నావలికిం బొమ్ము దేవ యటు గానియెడ
న్నీ వవలోకింప విషముఁ, ద్రావి యయిన నిపుడె జీవితంబులు విడుతున్. 678

ఉ. అక్కటికంబుఁ బూని హృదయాధిప నన్విడనాడి కానకుం
గ్రక్కున నీవు పోవ నసుఖస్థిత నవ్వల నైన మేనిలో
నిక్కడఁ బ్రాణము ల్నిలువ వింతయు నిక్కము గాన నవ్వలం
దిక్కఱి చచ్చుకంటె దగ నీయెదుర న్మఱి చచ్చు టొప్పదే. 679

చ. అనఘ భవద్వియోగజనితార్తిని నొక్కముహూర్తకాల మై
నను భరియింపఁ జాలఁ బదునాలుగువర్షము లెత్తెఱంగునం
మనమున నోర్చి యుందు నని మానిని దుఃఖవిధూయమాన యై
తనపతిఁ గౌఁగిలించుకొని తద్దయు నేడ్చెఁ గలస్వనంబునన్. 680

తే. మఱియు నద్దేవి విషదిగ్ధశరనివిద్ధ, యైనకరిణిచందంబున నధిపవాక్య
విద్ధయై ఘనచిరసన్నిరుద్ధలోచ, నాశ్రువులు నించె నరణి ఘోరాగ్ని నట్ల. 681

తే. స్ఫటికసమములు సంతాపసంభవములు, నగులసద్బాష్పబిందువులపుడు చాల
జలజలోచనకన్నులవలనఁ దొరఁగెఁ, గమలదళములవలన నీరములుఁ బోలె.

—రాముఁడు సీతను వనమునకుఁ దోడుకొని పోవుటకు సమ్మతించుట.—

తే. లలిత కైరవమిత్రమండలసమంబు, దీర్ఘదృగ్వ్యాప్త మైనతదీయవదన
మపుడు బాష్పముచే శుష్కమగుచు నొప్పె,జలసముద్ధృతనవపంకజంబుకరణి.

క. అప్పుడు రఘునాథుఁడు దయ, ముప్పిరి గొన దుఃఖవేగమునఁ గ్రాఁగెడు నా
కప్పురగంధినిఁ గుతుకము, కుప్పలు గొనఁ గౌఁగిలించుకొని యిట్లనియెన్.684

చ. అమలశశాంకబింబవదనా విను మెంతయు నీవియోగదుః
ఖమున లభించునట్టిబలఘుస్వరుసంపద యైన నాదుచి
త్తమునకు నించుకైనఁ బ్రమదం బొనగూర్ప ద దెల్లచోటులం
గమలజసూతికిం బలెను గల్గదు నాకు భయం బొకింతయున్. 685

ఉ. ఆయతశక్తిరక్షణమునందు సమర్థుఁడ నయ్యు నీయభి
ప్రాయ మెఱుంగఁ గోరి వనవాసము వల్దని యంటిఁ గాక వి
చ్ఛేయము నాదువెంట వనసీమకు నిన్నొడఁ బాయఁ జాల నీ
తోయము ద్రిప్ప నాతరమె తోయరుహాయతచారులోచనా. 686

వ. దేవి నీవు నాతోఁ గూడ వనవాసంబుకొఱకు నిప్పుడు నిశ్చయించితివి గావున శీలవంతునిచేతఁ గీర్తియుంబోలె నాచేత విడువ నశక్య వైతివి ధర్మాత్ము లగు పూర్వరాజులచేతఁ బత్నీసమేతంబుగా వానప్రస్థధర్మం బాచరింపం బడియెఁ గావున నేనును సువర్చల సూర్యుని ననువర్తించినకైవడిఁ బూర్వరాజాచరితధర్మంబు ననుసరించెద సత్యోపబృంహితం బైనతండ్రివచనంబు నన్ను వనవాసంబుకొఱకుఁ దొరసేయుచున్నది. శీఘ్రంబున వనంబునకుం బోవవలయుఁ దల్లితండ్రులకు విధేయుండై యుండు టదియె పుత్రునకుఁ బరమధర్మంబు గావున నమ్మాతాపితృవిధేయత్వరూపధర్మంబు నతిక్రమించి యేను జీవింపఁ జాల. 687

—రాముఁడు సీతకు గుర్వాజ్ఞానువర్తనధర్మమును బ్రశంసించి చెప్పుట.—

తే. వినుముస్వాధీనమగుమాతృపితృగురుస్వ,రూపదైవంబు నవలఁబోఁద్రోచి తనకు
వశముగానట్టి యన్యదైవంబు నెట్లు, మచ్చకంటి యారాధింపవచ్చుఁ జెపుమ.

తే. ఎచటఁ బితృమాతృగురురూప మెనఁగుచుండు
నచట లోకత్రయం బుండు నట్లు గాన
దేవి తత్సేవచే జగత్త్రితయవర్య
శేష దేవపూజనఫలసిద్ధి గలుగు. 689

—రాముఁడు సీతతో బ్రాహ్మణులకు దానములు సేయు మనుట.—

వ. కావునఁ దత్సమం బైనపవిత్రం బన్యంబు లే దక్కారణంబున మాతృపితృగురురూపత్రయంబు నవశ్యం బారాధింపవలయు మఱియుఁ బరలోకసాధనోత్తమంబు లైనపితృసేవాదులచేతం బడయంబడులోకంబులు సత్యదానమానజపతపస్స్వాధ్యాయవ్రతక్రతువులం బడయ రా వదియునుం గాక గురుచిత్తప్రవృత్త్యనువర్తనంబున స్వర్గధనధాన్యవిద్యాపుత్రప్రముఖ నిఖిలసంపద్విశేషంబులు సిద్ధించు మాతాపితృపరాయణు లగుమహాత్ములు దేవగంధర్వగోలోకబ్రహ్మలోకంబులు వడయుదురు గావున సత్యధర్మమార్గస్థితుం డై దశరథుండు గఱపిన మార్గంబున నవశ్యంబు వనంబునకుం జనియెద భవదీయభావాపరిజ్ఞానంబువలన నిన్ను వనంబునకుం దోడ్కొనిపోవుటకు మొదల మదీయచిత్తంబు ధైర్యహీనం బయ్యె నీవు న న్ననుసరించి వనంబునకుం జనుదెంచెద నని పలుకుటవలన నిప్పుడు నిన్నుం దోడ్కొనిపోవుటకుఁ గ్రమ్మఱ నుద్యుక్తం బయ్యెఁ గావున నీవును గురూపదిష్టధర్మప్రవర్తకుండ నైన న న్ననుసరించి సహధర్మచారిణి వై వనంబునకుం జనుదెమ్ము పత్యనుసరణాధ్యవసాయంబు నధిగమించుటవలన నీవు సర్వప్రకారంబుల నాకును గులంబునకును సమ్మత వైతి విది నీకు సదృశంబును బరమశోభనం బై యుండు నింక విశేషించి వనవాసక్షమంబు లగుదానంబులం గావింపుము శీఘ్రంబున భిక్షుకులకు భోజనంబును విప్రులకు సువర్ణరత్నాదికంబు లిచ్చి పదంపడి మన కిరువురకుం గల వస్త్రమాల్యాభరణ శయనాసనంబులును గ్రీడార్థంబు సంగ్రహించినజాతరూపమయకృత్రిమపుత్త్రికాచయంబులును భృత్యుల కొసంగు మని పలికిన నద్దేవి పరమానందభరితాంతఃకరణ యై పతివచనప్రకారంబున బ్రాహ్మణులకు భృత్యవర్గంబులకు ధనధాన్యరత్నాదికంబు లొసంగుచుండె నాసమయంబున సుమిత్రానందనుం డచ్చోట నున్నవాఁ డగుటం జేసి తదీయసంవాదంబు విని యర్ధశరీరభూత యైనజానకివనానుగమనంబే బహుప్రయత్నంబున నంగీకృతం బయ్యె నా కెవ్విధంబున సంభవించు నని విరహసంజాతశోకంబు సహింపం జాలక యన్నచరణంబులకుం బ్రణమిల్లి నిజాభిమతసంసిద్ధికి సీతాశరణాగతి యమోఘం బైనయుపాయం బని యాలోచించి మదీయప్రార్థనఁ బురుషకారత్వంబున నంగీకరింపు మని సీతం బ్రార్థించుచు రామున కిట్లనియె. 690

—లక్ష్మణుఁడు తానును వనమునకు వచ్చెద నని రామునిఁ బ్రార్థించుట.—

సీ. అనఘాత్మ నన్నొక్కరుని లాఁతివానిఁగాఁ బోఁ ద్రోచి యడవికిఁ బోవ నీకు
న్యాయంబె నినుఁ బాసి నాకలోకాధిపత్యం బైన నమరత్వ మైన ఘనవి
భూతి యైన ను గోర భూరిచాపముఁ దాల్చి కడఁగి మీయగ్రభాగమునఁ గాన
నావని కరుదెంతు వచట మదీయదోర్బలఘనప్రాకారరక్షితుండ

తే. వగుచు నీదేవిఁ గూడి నానాటవులను, సంచరించెదు గాకని సవినయోక్తిఁ
జేసి ప్రార్థించి రామునిచే నిషిద్ధుఁ, డగుచుఁ గ్రమ్మఱ నతని కిట్లనియె నతఁడు.

చ. ఘనకరుణావిశేషమునఁ గానన మేదిని నున్కి నాకు ము
న్ననుమతిఁ జేసి యిప్పు డదయామతిఁ గాదని పల్కె దేలకో
పనివడి బాల్యమాదిగ భవత్పరతంత్రుఁడ నైననన్ను వ
ల్దనుటకుఁ జోద్య మయ్యెడి మహాపురుషా యిది యేమి చెప్పవే. 692

క. అని యిట్లు సుమిత్రానం, దనుఁడు నిటలఘటితహస్తనలినుం డై ప
ల్కిన విని క్రమ్మఱ రఘునం, దనుఁ డిట్లనె ధర్మసంహితం బగుసూక్తిన్. 693

—రాముఁడు లక్ష్మణుని వనమునకు రావల దనుట.—

తే. స్నిగ్ధుఁడవు వరుఁడవు ధర్మశీలుఁడవు ప్రియాత్ముఁడవు నీతిపరుఁడవు ప్రాణసముఁడ
వార్యనుతుఁడవు సఖుఁడవు శౌర్యనిధివి, యనుజుఁడవుగావె నాకు గుణాఢ్య నీవు.

తే. అనఘ నీవు నాతోడఁ గాననధరిత్రి
కరుగుదెంచిన ఘోరదుఃఖార్తిఁ గ్రాఁగి
బడలు కౌసల్య నిడుమలఁ బడుసుమిత్ర
నింక భరియించువా రెవ్వ రిచటఁ జెపుమ. 695

క. అనఘా పర్జన్యుని క్రియ, ననవరతముఁ గామవృష్టి నర్థులమీఁదం
దనివారఁగఁ గురియించెడు, జననాథుఁడు కామపాశసంయుతుఁ డయ్యెన్. 696

తే. అనఘచరిత మహీనాథుఁడై భరతుఁడు, కైకపనుపున మాతృత్వగౌరవంబు
విడిచి మజ్జనయిత్రుల వెతలఁ బెట్టు, మదిఁ దలంపఁడు వారిసేమంబు నెపుడు.

చ. తనయుని యాధిపత్యమును ధారుణినాథువశస్థితత్వముం
గనుఁగొని కైక భాగ్యభవగర్వమునన్ మనయమ్మల న్మభా
ననల ననారతంబును గనారిలఁ జేయుచు నుండుఁ గావున
న్ననివడి వత్స నీ వయిన వారిమనోవ్యథ దీర్ప వల్వదే. 698

తే. అనఘచరిత రాజానుగ్రహమున నైన
నిత్య మతిభక్తి నీయంత నీవ యైన
నరసి రక్షింపు మిచట మాయమ్మ నెపుడు
ధరణి గురుపూజనముచేత ధర్మ మొదవు. 699

తే. అనఘ యిట్లు మదాజ్ఞచే నతులభక్తి
నిచట మన్మాతృపూజన ముచితకరణిఁ
జేయు చుండుము నాయందుఁ జేయుభక్తి
కిదియె సార్థక్య మనుచు నే మదిఁ దలంతు. 700

—లక్ష్మణుండు సయుక్తికంబుగా రాముని వేఁడుట.—

మ. అని యిట్లారఘునేత పల్క విని నెయ్యం బొప్పఁగా లక్ష్మణుం

డనియెం గ్రమ్మఱ నోదినేశకులవర్యా మీ యనుజ్ఞ న్భవ
జ్జననిక్ మజ్జనని న్నితాంతసముదంచద్భక్తిచే సంతతం
బును శుశ్రూష యొనర్చుచు న్భరతుఁడే పోషించు జాగ్రత్తతోన్. 701

తే. దేవ యే దేవికృప నుపజీవితతము
లగ్రహారశతంబుల నధిగమించె
నట్టికౌసల్య మాదృక్సహస్రములను
సంతతముఁ బ్రోచు స్వభరణ మెంత చెపుఁడి. 702

క. ఆయమ్మఁ గూడి నిత్యము, మాయమ్మయు నెగులు దక్కి మహితసుఖాప్తిం
బాయక సేవించును దే,వా యీయెడ సందియంబు వలవదు బుద్ధిన్. 703

వ. దేవా న న్ననుచరునిఁగాఁ బరిగ్రహింపు మీయనుచరత్వకరణంబునందు సేవ్యసేవకధర్మరాహిత్యంబును వైపరీత్యసాధకంబును లేదు నారాకవలన నీకు ఫలమూలాద్యాహరణం బనాయాసంబుగాఁ గల్పింపంబడు నేనును భవత్సేవవలనఁ గృతార్థుండ నగుదు నట్లు గావున. 704

క. నిరుపమఖనిత్రపిటకా, ధరుండనై సగుణమైన ధనువుం గొని వెసం
దెరు వెఱిఁగించుచు ముంగల, నరుదెంచెద నట్లొనర్పు మయ్య మహాత్మా. 705

చ. పవలు సమస్తవన్యఫలపంక్తులఁ దెచ్చి యొసంగుచు న్నిశ
ల్నవినయబుద్ధి బద్ధగుణచాపముఁ దాల్చి సుషుప్తిఁ దక్కి క
న్గవ కటు తెప్ప వ్రేయక సుఖస్థితి నెప్పుడుఁ గాచు చుండఁగా
వనవిజఁ గూడి నీవు గిరులందు విహార మొనర్పు టొప్పదే. 706

క. అని యిట్లు సుమిత్రానం, దనుఁడు వివిధవినయవాక్యనైపుణ మలరం
దను వేఁడినఁ గౌసల్యా, తనయుఁడు హర్షించి మరలఁ దమ్మున కనియెన్. 707

-రాముఁడు లక్ష్మణ వనాగమనంబున కొడంబడుట.-

వ. వత్సా యేను నీవనప్రయాణంబున కొడంబడితి నాతోడం జనుదెమ్ము జనకయజ్ఞంబునందు మహాత్ముం డగువరుణుం డొసంగిన మహాకార్ముకంబులును నభేద్యకవచంబులును నక్షయబాణతూణీరంబులును హేమపరిష్కృతం బగుఖడ్గద్వయంబునుఁ బూజార్థం బాచార్యమందిరంబున నిక్షేపించి యున్నయవి వానిఁ గైకొని యిష్టులకుం జెప్పి రమ్మనవుడు నతండు వనవాసనిశ్చితుండగుచు సుహృజ్జనంబుల నందఱివలన నామంత్రణంబు వడసి సంభ్రమంబున వసిష్ఠగృహంబునకుం జని ధనురాదిసాధనంబులఁ గొని రయంబునఁ బఱతెంచినం జూచి కాలవిడంబనంబు సేయక చనుదెంచితి వని బహూకరించి వెండియు రఘువల్లభుం డిట్లనియె. 708

క. అనఘాత్మ మామకం బగు, ధనమును విప్రోత్తములకు దానము సేయం
జనుఁ గాన నిపుడె సని దో, డ్కొని రమ్ము సుయజ్ఞునిం బటుత్వరితగతిన్. 709

రాముఁడు వసిష్ఠపుత్త్రుం డగుసుయజ్ఞు రావించుట.

వ. మఱియు మననగరంబున గురుశుశ్రూషాపరాయణు లగువా రెవ్వరు గల రట్టివారికి నుపజీవులకు నధికంబుగా ధనం బొసంగ నిశ్చయించితి వారి నందఱం దోడ్కొని రమ్ము శిష్టు లైనబ్రాహ్మణోత్తముల నందఱం బూజించి వారిచేత ననుజ్ఞ వడసి వనంబునకుం జనువాఁడ నని యాన తిచ్చిన నతం డట్లగాక యని వసిష్ఠపుత్త్రుం డగుసుయజ్ఞునినివేశనంబునకుం జని యందు. 710

తే. అగ్నిశాలాగతుం డైనయతనిభక్తిఁ, గాంచి మ్రొక్కి దుష్కరకర్మకారి యైన
రామభద్రు వేశ్మమునకు రమ్ము కృత్య,మంతయును దగ వీక్షింపు మనిన నతఁడు.

తే. సంభ్రమంబున నప్పుడే సంధ్య వార్చి, లక్ష్మణోపేతుఁ డై శుభలక్షణాభి
రంజితం బైనరాముని రమ్యసదన, రాజమున కేగె రయమునఁ దేజ మలర.

క. వచ్చినమునినుతుఁ గనుఁగొని, యిచ్చ నలరి రాఘవుఁడు మహీజాన్వితుఁ డై
చెచ్చెర నెదురుగఁ జని కొని, దెచ్చి సుఖాసీనుఁ జేసి దృఢతరభక్తిన్. 713

రాముఁడు సుయజ్ఞాదులకు ధనధాన్యమణిగోభూషణాదుల నొసంగుట.

వ. జాతరూపమయకటకకుండలసువర్ణసూత్రగ్రథితవైడూర్యపద్మరాగమణిభూషితకేయూరాంగదప్రముఖనిఖిలశ్రేష్ఠభూషణంబులచేతం బూజించి పదంపడి సీతాప్రచోదితుం డై ముక్తాహారహేమసూత్రరశనావిచిత్రకేయూరాంగదవరాస్తరణనానారత్నవిభూషితహేమపర్యంకంబు లొసంగి యివి యన్నియు జానకి భవత్పత్ని కొసంగు మని పంచెఁ గావున నమ్మహాసాధ్వి కిమ్ము మాతులదత్తం బైనశత్త్రుంజయాఖ్యమహానాగంబు గజసహస్రంబుతోఁ గూడ నీ కొసంగెదఁ బరిగ్రహింపు మని పలికిన నా సుయజ్ఞుండు రామదత్తం బైనతత్సర్వంబునుం బ్రతిగ్రహించి సీతారామలక్ష్మణుల నాశీర్వదించె నంతఁ బ్రియంవదుండును బరమేష్ఠిసముండు నగురాముండు ప్రియుండును వాసవసంకాశుండు నగులక్ష్మణుం జూచి నీవు శీఘ్రంబున నగస్త్యవిశ్వామిత్రపుత్త్రుల రావించి వర్షోదకంబులచేత సస్యంబునుం బోలె నానావిధచిత్రదివ్యాంబరగోసహస్రసువర్ణరజతమహాధనంబులచేతఁ బూజించి సంతుష్టులం గావింపుము నిత్యంబును గౌసల్యాదేవి నాశీర్వదించుచు భక్తుం డై యాశ్రయించి యున్నతిత్తిరీయశాఖాధ్యేత్రాచార్యుం డైనవిప్రోత్తమునకుఁ బుష్కలంబుగాఁ గౌశేయచేలంబులును మహార్హయానంబులును దాసీజనంబుల నొసంగుము చిరకాలంబున నుండి మనగృహంబున నివసించి యున్నవాని రాజసచివుం డగువాని చిత్రరథుం డనుసూతుని రావించి వేయి గోవుల నజాదికంబు నిచ్చి మహార్హరత్నవస్త్రధనంబు లొసంగి ప్రీతచేతస్కునిం జేయుము కఠకలాపిప్రోక్తశాఖాధ్యాయులును బలాశదండయుక్తులును మృద్వన్నకాములును సజ్జనసమ్మతులును నిరంతరస్వాధ్యాయశీలత్వంబువలన నన్యం బేమియు నెఱుం

గనివారు నగుబ్రహ్మచారులకు రత్నపూర్ణంబు లగునశీతియానంబులును బలీ
వర్దసహస్రంబును గర్షణప్రవీణమహావృషభంబుల నిన్నూటిసి దధిఘృతాది
వ్యంజనార్థంబు గోసహస్రంబు నొసంగుము మఱియు వివాహార్థంబు కౌసల్య
నాశ్రయించి యున్నమేఖలిసంఘంబునకుఁ బ్రత్యేకంబుగా గోసహస్రంబు
లొసంగి మఱియు నయ్యంబకు మనోమోదంబు గలుగునట్లు యథేష్టంబుగా
ధనం బొసంగు మని పంచిన నతండు యథోక్తప్రకారంబున బ్రాహ్మణోత్తము
లకు ధనదునిపగిది ధనమణివస్త్రాదు లొసంగె నంత నారఘుపుంగవుండు
బాష్పగద్గదకంఠుఁడై తన మ్రోల నిలునం బడి యున్ననిజభృత్యులకుఁ బ్రత్యే
కంబుగా ననంతద్రవ్యం బొసంగి నా వచ్చునందాఁక నామందిరంబును లక్ష్మ
ణునిగృహంబునుం గాచికొని యిచ్చటనే యుండుం డని పలికి వెండియుఁ
బరమదుఃఖితు లై యున్నవారి నవలోకించి ధనాధ్యక్షు రావించి ధనంబుఁ దె
మ్మనవుడు నతం డట్ల కావింప రాశీభూతం బై నయమ్మహాధనం బంతయు బ్రాహ్మ
ణులకు భృత్యులకుఁ గృపణులకు బాలవృద్ధులకొసంగుచుండె నాసమయంబున.

—త్రిజటుఁ డనుబ్రాహ్మణోత్తముఁడు రామునికడ కేతెంచుట.—

సీ. చతురుఁడు గర్గవంశజుఁడు పింగళవర్ణుఁ డనఘుఁడు త్రిజటాఖ్యుఁ డగుద్విజాన్వ
యాగ్రణి గలఁ డొక్కఁ డాతఁడు ఫాలకుద్దాలలాంగలములఁ దాల్చి నిత్య
మడవిలో క్షుతవృత్తి నాఁకలి దీర్చుచు నుండ నాతనిభార్య యొనర నపుడు
దారకులను జూచి దారిద్ర్యమునఁ బొక్కి తనపతితోడ ని ట్లనియె దేవ

తే. ఫాలకుద్దాలకము లటు పాఱవైచి
తగ వదాన్యశేఖరు రాముఁ దడయ కిపుడు
గానఁ జనుము దారిద్ర్యంబు గడవ నగు మ
హాత్మ నావచనంబు సత్యంబు జువ్వె 715

చ. అన విని భూసురేంద్రుఁడు రయంబున దుశ్ఛదశాటి మేనిపైఁ
దనరఁ బ్రదీప్తపావకువిధంబున హేళిక్రియ న్వెలుంగుచున్
వనమున నుండి తద్దయు నవార్యగతిం జనుదెంచి సజ్జన
ప్రణుతగుణాతిరేకుఁ డగురామునిముంగల నిల్చి యి ట్లనున్. 716

—రాముఁడు త్రిజటునికి బహుసహస్రంబులు గోవు లొసంగుట.—

వ. రాజనందనా యేను బహుపుత్రకుండ ధనంబు లేమిం జేసి బాలకులశనాచ్ఛా
దనంబులకు దుఃఖింప వారి నూరార్చుట కుపాయంబు లేక దారిద్ర్యంబున
కంటె నొండు కష్టం బెద్దియు లే దని తలంచుచు దానిం బాపికొన వదాన్య
శేఖరుండ వై ననీకడకుం జనుదెంచితి ననిన నారాముం డవ్విప్రునిం జూచి చిఱు
నగవు నగుచు నామందలోఁ గలగోసహస్రంబులలోన నొక్కసహస్రంబు

ప్రత్యేకంబుగానే నొసంగలే దీదండం బెంత దవ్వు వీచి వైచిననంతదవ్వు నిండి యున్నగోజాతంబు నీకొసంగెద నని పలికిననవ్విప్రుండుసంతుష్టుం డగుచుశీఘ్రంబునఁ గటితటంబున శాటి బిగియించి భుజాబలంబుకొలంది దండంబు విసరివైచిన నది సరయూతటంబునతిక్రమించి బహుసహస్రసంఖ్యాతం బగు గోవ్రజంబున వృషభసన్నిధిం బడిన నారఘూత్తముండు నంతసిల్లి యమ్మహీసురుఁ గౌఁగిలించికొని సరయూతటపర్యంతంబు నిండి యున్నగోవుల నన్నింటి గోపాలకులచేత శీఘ్రంబున నతనియాశ్రమంబునకుఁ దోలించి బహూకరించుచు ని ట్లనియె.

తే. దివ్య మగునీప్రభావంబు దెలియఁ గోరి, యనఘచరిత వినోదార్థ మంటిఁగాక
నదటుపడి లోభబుద్ధిచే నన్నవాఁడఁ, గాను దయ సేసి నామీఁదఁ గినల వలదు.

క. ధనధాన్యకోశసంపద, లనవరతము బ్రాహ్మణార్థ మగుఁ గాదొకొ నా
మన మెప్పుడు గోబ్రాహ్మణ, జనరక్షణమందుఁ జిక్కి చతురత నొప్పున్. 719

రాముఁడు దశరథదర్శనంబున కేగుట.

వ. మహాత్మా యతివృద్ధుండ వైనభవదీయదురత్యయశక్తి నెఱుంగం గోరి నాచేత నీదండప్రక్షేపణపరిహాసార్థంబు నుద్దేశించి ప్రచోదితుండ వైతివి గోప్రకంబె నన్యం బైనదాని నెద్ది యేని వరింపం దలంచితి వేని నిర్విశంకుండ వై యింపు మొసంగెద నివ్వాక్యం బుపచారమాత్రంబు గాదు సత్యంబుగాఁ బలికితి సంకోచంబు వలవదు నాచేత నుపార్జితం బైనధనం బంతయు విప్రప్రయోజనసంపాదనార్థం బని యెఱుంగుము భవాదృశులయందు సమ్యక్ప్రతిపాదనంబుచేత నాకు నితాంతప్రీతియశంబులు గలుగు నని పలికిన నారఘుపతివచనంబుల కలరి యవ్విప్రోత్తముండు గోసమూహంబునుం బ్రతిగ్రహించి యశోబలప్రీతిసుఖంబులు గలుగుఁగాక యని యారఘుపుంగవు నాశీర్వదించి భార్యాసహితుం డై నిజాశ్రమంబునకుం జనియె నంత నారాముండు ప్రతిపూర్ణమానసుం డై ధర్మయుక్తపరాక్రమార్జితం బైననిజధనం బంతయు యథార్హసమ్మానవచనంబుల నుపలాలించుచు ద్విజసుహృద్భృత్యజన దరిద్రభిక్షాచరణులకు నందఱకు యథేష్టంబుగా నొసంగి సీతాలక్ష్మణసహితుం డై మాలానిచయసమాబద్ధంబులును గంధపుష్పాద్యలంకృతంబు లగుఖడ్గాదిసాధనంబుల ధరించి పితృసందర్శనోత్సుకుం డై రాజమార్గంబుఁ బట్టి తదీయమందిరంబునకుం బోవుచుండె నప్పుడు పౌరజనంబులు బహుజనాకులంబు లైన రాజమార్గంబులం జన నేరక ప్రాసాదహర్మ్యవిమానాగ్రంబు లెక్కి వర్జితాతపత్రుం డై పాదసంచారంబునం జను రామభద్రు నవలోకించి శోకవ్యాకులితచిత్తు లగుచు మొగంబున దైన్యంబుదోఁపఁ దమలో నిట్లనిరి. 720

చ. అనుపమలీలఁ బెక్కుచతురంగబలావలు లేమహాత్ముని
న్వెనుకొని పోవు నట్టిరఘువీరుపిఱుంద సుమిత్రపట్టి దా

జనకజతోడ రా నొకఁడె సంభ్రమియై చను చున్నవాఁడు గ
న్గొనుఁ డకటా విరించి కఠినుండు గదా తలపోసి చూడఁగన్. 721

తే. అతులితైశ్వర్యసారజ్ఞుఁ డగుచు యాచ,కులకు సకలేష్టఫలదాయకుండు నయ్యు
ధర్మగౌరవమునఁ జాలఁదండ్రి వాక్య,మనృతముగ జేయఁదలపోయఁ డయ్యె నేఁడు.

తే. కాంతతోడ నేసాధ్వి ననుఁగొనంగ, నభ్రచరభూతములకైన నలవి గాక
యుండు నాసీతనీక్షించుచున్నవారు,పురములోఁ గలపురుషు లందఱును నేఁడు.

తే. సురుచిరాంగరాగార్హ యు శోణగంధ, సేవినియునైన సీతను దావ మందు
మొనసి శీతోష్ణములు వర్ష మనవరతము,దీనతయును వైవర్ణ్య మొందింపకున్నె

జను లందఱు రామునిఁ జూచి పలుతెఱంగుల విలపించుట.

ఉ. ఇన్ని తలంపు లేల మనుజేశ్వరుఁ డిప్పుడు సత్య మూఁది యా
పన్నశరణ్యు నీనుజనపాలునిఁ బక్కడుఁగాక యట్లు కా
దన్నను ధాత్రి నెంత కఠినాత్ముఁ డైన సుతుఁ సునీతిసం
పన్నునిఁ బాసి నిందలకుఁ బాల్పడి యొంటి మనం దలంచునే. 725

తే. పుడమి గుణహీనుఁ డైనను బుత్రు విడువఁ, డెందు జనకుఁ డేఘనునియహీనవృత్తి
చేత సతతంబు జనము రంజింపఁ బడియె,నట్టి రాముని విడుచు నెయ్యవనివిభుఁడు.

తే. దమము శీలంబు శ్రుతమును శమము దయయు
నానృశంస్యంబు ననెడు నీయాఱుగుణము
లనవరత మీరఘుస్వామి ననఘచరితు
నింపు సొంపారఁగ నలంకరింపఁ జేయు. 727

ఆ. అట్టి పుణ్యపురుషుఁ డడవికిఁ బోయిన, ఘర్మకాలశుష్కఘనజలాశ
యమున నున్న మీల యట్ల లోకము దుఃఖ,తప్తమగుచు భీతిఁ దల్లడిల్లు. 728

చ. ఇతఁడు జగత్కుజంబునకు నెంతయు మూలము సర్వభూతముల్
సతతము పుష్పపల్లవఫలంబులు గావున నీత్రిలోకస
న్నుతుఁ డరిపీడనంబున సమస్తజగంబు విపన్నతం బరి
ప్లుత మగు మూలఘాతమునఁ బుష్పఫలోపగశాఖికైవడిన్. 729

మ. అతులోద్యానముల గృహంబులను మాన్యక్షేత్రవిత్తాదులం
జతురత్వంబునఁ ద్రోచి వచ్చి మన మీ సౌమిత్రిమాడ్కి న్సము
న్నతసౌహార్దము దోఁప నీరఘుకులోత్తంసంబు వెంట న్సతీ
సుతవర్గంబులఁ గూడి పోద మిచట న్శోకింపఁగా నేటికిన్. 730

మ. లలితైణాంకసమానవక్త్రుఁ డగునీ రాముం డరణ్యావనీ
స్థలికిం బోయిన వెన్కఁ బాడఱినసద్మం బట్ల నిస్తేజమై
ఖలచిత్తాకృతి నొప్పు నీపురములోఁ గైకేయి దా నొంటి వ
ర్తిలుఁ గా కేటికి నిచ్చట న్మన కసద్వృత్తిన్ బ్రవర్తింపఁగన్. 731

ఆ. రాఘవుండు లేనిరాజ్యంబు కాంతార, మమ్మహాత్ముఁ డున్న యదియె పురము
మనము రాముఁ గూడి మనుటొప్పుఁ గైక పా, డఱిన వీటనుండి వలయుఁగాక.

రాముఁడు దశరథునకుఁ దనరాకఁ దెల్పుమని సుమంత్రు నియోగించుట.

వ. మఱియు సముద్ధృతనిక్షేపంబులును బ్రభగ్నాంగణంబులును నపనీతధనభూషణ పశుధాన్యంబులును నపవృతశయ్యాసనాదికంబులును రజోవకీర్ణంబులును గృహదేవతాపరిత్యక్తంబులును సముద్భిన్నబిలపరిధావన్మూషకావృతంబులును నపేతోదకసేచనధూమంబులును హీనసమ్మార్జనంబులును సంప్రణష్టపూజాకర్మయాగమంత్రహోమజపంబులును క్షామరాజక్షోభయుక్తకాలంబుచేతం బోలెఁ బ్రభగ్నంబులును భిన్నభాజనంబులు నగుచు శూన్యంబులై మనచేత విడువం బడినసదనంబులం గైకొని కైకేయి శూన్యకుడ్యంబుల కాధిపత్యంబు సేయం గలయది మన నుంపఱము వనంబునకుం జనిన నస్మద్భయభీతంబులై గజసింహాదిమృగంబులును విహంగమంబులును సర్పంబులును వనాంతరపర్వతప్రస్థబిలంబులఁ బరిత్యజించి మనచేత సంత్యక్తంబైన యీపురంబుఁ బ్రవేశింపం గలయవి మన మాయరణ్యమధ్యంబున రామునిం గూడి సమానసుఖదుఃఖులమై పురంబునందుం బోలె సుఖాత్ములమై యుండుద మా కైకేయి సపుత్రబాంధవయై తృణమాంసఫలాదంబులైన పశువ్యాఘ్రమృగద్విజంబుల కాటపట్టయిన యీనగరంబు పాలించుచుండుంగాక యని యిట్లు పురజనులు పెక్కువిధంబుల విలపించుచుండ వారిదీనాలాపంబులు వినుచు మనోవికారంబు నొందక నిశ్చలుండై మత్తమాతంగగమనంబునం జని యన్నరశార్దూలుండు కైలాసశిఖరాకారం బైనపితృమందిరంబు డాయం బోయి వినీతవీరపురుషం బైన రాజాలయంబుఁ బ్రవేశించి యచ్చట దుఃఖపరిపీడితం బై కూడి యున్నజనంబును వీక్షించి తా నార్తస్వరూపుండు గాక చిఱునగవు నగుచు మెల్లనం జని ధర్మవత్సలుండు గావునఁ దండ్రిచేత ననుజ్ఞఁ గొని వనంబునకుం బోవుట యుచితం బని తలంచి ద్వారమధ్యగతుం డై నసుమంత్రు నాలోకించి నారాక మహీనాథుని కెఱింగింపు మనవుడు నతండు సంతాపకలుషేంద్రియుం డగుచు రయంబునం జని యభ్యంతరమందిరంబున రాహుగ్రస్తుం డైనసూర్యునిపోలిక భస్మచ్ఛన్నుం డగువైశ్వానరుచందంబున నిస్తోయం బగుతటాకంబుపగిది దుఃఖపరిత్రస్తుం డై యున్నవానిఁ బరమాకులచేతస్కుం డగువాని రామునిం జేర్కొని విలపించువాని దశరథుం గాంచి వివిధవాక్యంబులం బ్రస్తుతించి నిటలఘటితాంజలిపుటుం డై యిట్లనియె. 733

చ. అనఘ భవత్కుమారుఁడు వనావనికిం జనఁ బూని రత్నముల్
ధనమును విప్రసంతతికి దత్తముఁ జేసి కృతాభ్యనుజ్ఞుఁ డై
జననికిఁ జెప్పి మీవలన సమ్మతిఁ గైకొని పోఁ దలంపున

స్పనివడి వచ్చి భానుకులనాయక వాకిట నున్నవాఁ డొగిన్. 734
తే. అధిప రశ్మిసహస్రసమావృతుఁ డగు, భాస్కరునిచందమున సర్వపార్థివగుణ
పరివృతుండ వయి యున్న నీవరకుమారు, శిష్టసమ్మతుఁ గరుణ నీక్షింపు మిపుడు.
తే. రాజశేఖర నీ వంబరంబు కరణిఁ, గరిమ నిష్పంకుఁడవు మహౌఘనుఁడ వబ్ధి
సదృశగాంభీర్యుఁడవు మఱి సత్యవాది, వఖిలధర్మజ్ఞుఁడవు పుత్త్రు నరయు మనిన.
మ. అతఁ డాసూతకుమారుఁ గన్గొని సుమంత్త్రా నీవు శీఘ్రంబె మ
త్సుతులం దోడ్కొని రమ్ము పొమ్మనిన నాతం డట్ల కావింప న
ప్రతిమార్తిక్షుభితార్ధసప్తశతభార్యావేష్టితుం డై వెసం
బతి దాఁ గ్రమ్మఱ రాముఁ దోడుకొని రమ్మా సూత పొమ్మా యనన్. 737

—రాముఁడు సుమంత్త్రుఁడు వెంట రాఁగ దశరథునికడ కేగుట—

క. పతిపనుపున నతఁ డారఘు, పతిని సుమిత్త్రాతనూజ వసుధాతనయా
యుతముగ నెంతయు సత్వర, గతిఁ దోడ్కొనివచ్చెఁ దత్సకాశంబునకున్.
ఉ. అంత మహీవరుండు ఘటితాంజలి యై చనుదెంచురాము స
ల్లంతనె చూచి కన్నుఁగవ నశ్రులు గ్రమ్మఁగ దుఃఖశోకవి
క్రాంతమనస్కుఁ డై ధృతిదొలంగి కడంగినమూర్ఛతోడ న
త్యంతరయంబునం బడియె నప్డు డిలం బెనుమ్రానుకై వడిన్. 739
చ. పతి తెఱఁ గెల్లఁ జూచి బహుభంగుల శోకముఁ బట్టలేక త
త్సుతు లతిదుఃఖవేగమునఁ దత్సదనాంతరకుడ్యభాగముల్
ప్రతినినదంబు లీన వికలంబుగ నేడ్చుచు గాఢమూర్ఛచే
క్షితిపయి వ్రాలి తల్లడముఁ జెందిరి వాడినతీఁగెలో యనన్. 740
ఉ. అప్పుడు రామలక్ష్మణులు నారఘువీరునిఁ గాంచి యాత్మలో
ముప్పిరి గొన్నశోకమునఁ బొక్కుచు డగ్గఱి గ్రుచ్చి యెత్తి నే
రొప్పుఁగ మంజుశయ్యపయి నుంచి వచోమృతసేచనంబునన్
దెప్పర మైనతాపమును దేర్చిరి తల్లులు వెంటఁ దేరఁగన్. 741

—రాముఁడు వనమునకుఁ బోవ ననుజ్ఞ యిమ్మని దశరథుని వేఁడుట.—

వ. ఇట్లు దశరథుండు లబ్ధసంజ్ఞుం డై వేఁడి నిట్టూర్పులం గందినముఖారవిందంబుతోఁ
జెలువఱియున్నఁ దండ్రిం గని సీతావల్లభుండు కృతాంజలిపుటుం డై యిట్లనియె.
క. దేవా మాకందఱకును, దేవర వటు గాన మీరు ధృతిఁ బూని యర
ణ్యావనికిం జనఁ బూనిన, నావంకఁ గృపావిలోకనంబునఁ గనుఁడీ. 743
క. జానకియు లక్ష్మణుండును, బూనిక నాతోడ విపినభూమి నునికి డెం
దానం గోరిరి గాన, క్ష్మానాథ యనుజ్ఞ యిమ్ము మాముప్వరకున్. 744
చ. అనవుడు భూమిభర్త హృదయంబున నెవ్వగ నివ్వటిల్ల రా
మునిఁ బరికించి యోపురుషభూషణ కైక వరప్రదానమూ

పనిబిడదీర్ఘపాశమున బద్ధుఁడ నైతి నను౯ సునీతిదూ
రుని వడి నిగ్రహించి యవిరోధముగా మహి నేలు మిత్తతిన్. 745

ఉ. నా విని రాఘవుండు రఘునాథున కిట్లనుఁ గేలు మోడ్చి గో
త్రావర నీయనుజ్ఞను శిరంబునఁ బూని చతుర్దశాబ్దము
ల్వావిరి దండకాటవి నివాస మొనర్చి కృతవ్రతుండ నై
తావక పాదపద్మములు దప్పక గొల్వఁగ వత్తుఁ గ్రమ్మఱన్. 746

తే. రాజశేఖర పెక్కువర్షములు నీవు, పుడమి యేలితి వత్యంతపుణ్యమూర్తి
వై ననిన్ను మృషావాదిఁగా నొనర్పఁ, జాల నిప్పుడే నడవికిఁ జనెదఁ దండ్రి.

దశరథుఁడు రాముని కి వనమునకుఁ బోవ ననుజ్ఞ యొసంగుట.

క. ఒండు దలంపక నను వన, మండలికిం బంపు మో క్షమావర యన నా
ర్తుఁ డయి సీతాపతి కాతం డిట్లనుఁ గైకక్రూరతనుఁబ్రేరింపన్. 748

తే. వివిధభంగుల నిహలోకవృద్ధికొఱకు
వితతముగఁ బారలౌకికహితముకొఱకు
మనుకులోత్తమ పునరాగమనముకొఱకు
స్వస్తి యగు మంచి తెరువున వనికిఁ జనుమ. 749

చ. అతులితసత్యధర్మవినయాన్వితచిత్తుఁడ వై ననీదున
న్మతి నిఁకఁ గ్రమ్మఱించుటకు మాకు నశక్యము గానఁ గాన కు
న్నతగతి నేగు మచ్చట వ్రతం బొక వైఖరి సల్పి వేగ స
మ్మతిఁ జనుదెమ్ము సంతతశుభస్ఫురితుండవు గమ్ము పుత్త్రకా. 750

ఉ. తల్లియు నేను జాలఁ బ్రమదంబునఁ గామితముల్ ఘటింపఁగా
నుల్లము చల్లనై సిరుల నొందుచు భృత్యుల కెల్లఁ బ్రీతి సం
ధిల్లఁగ నీవిభావరి సుధీవర నాకడఁ బుచ్చి సాధ్వసం
బల్లన దేర్చి రేపకడ నంపక మై చనుమా వనోర్వికిన్. 751

వ. పుత్త్రా నాకు బ్రియంబు సేయుటకు సర్వైశ్వర్యంబు విడిచి హితజనంబులఁ
బరిత్యజించి వనంబునకుం బోవ నుపక్రమించితి వికార్యం బతిదుష్కరం బైన
యది గదా యని పలికి వెండియు నిట్లనియె. 752

మ. కలితచ్ఛన్నకృశానుకల్ప యగునీకైకేయిచే నెంతయుం
జలితప్రజ్ఞుఁడ నైతి నీదువనవాసం బించుకైన న్గుణో
జ్జ్వల నాకర్థిఁ బ్రియంబు గాదు విను మే సత్యంబుగాఁ బల్కితిం
గలకాలంబును నీ వెఱుంగవె జగత్కల్యాణ మద్భావమున్. 753

తే. అనఘ కులవృత్తసాదిని యైనకైక, చేత సంప్రచోదితుఁడ నై చెలఁగి యిపుడు
పరఁగ వంచించి యడిగినవరము నర్థ, వంతముగఁ జేయఁ బూనితి వెంత యరిది.

తే. ఘనత నన్ను వీతానృతకఘునిఁ గాఁగ, జేయు టది ధర్మరతుఁడవు జ్యేష్ఠసుతుఁడ

నర్కవంశప్రదీపుఁడ వరఘుపతివి, ధార్మికుఁడ వైననీకుఁ జిత్రంబు గాదు.

క. అని యీగతి విలపించుచు, మనుజవరేణ్యుండు పలుకుమాటకు దీనా
ననుఁడై యతఁడు సుమిత్రా,తనయుఁడువినుచుండ మఱియుఁ దండ్రికిననియెన్.

తే. ఇపుడు పొందెడిగుణముల నెల్లి యెవ్వ, రిత్తురటు కాన భానుకులేశ యిచటఁ
దడయఁగా నేలయిప్పుడే వెడలియడవి, కరుగుటయె నాకు నెంతయునర్హ మగును.

క. తరణికులోత్తమ నాచే, నిర వందఁగ విడువఁ బడిన యీసర్వమహీ
వరము సఫల మగునట్లుగ, భరతునకు నొసంగుఁ డిపుడు ప్రాభవ మలరన్. 759

సీ. అవనీశ వనవాసమందు నిశ్చిత యయ్యె పరఁగ నామతి యది దిరుగ దింకఁ
గరము సంప్రీతితోఁ గైకకు మీచేత దత్తమైనవరంబు దప్పకుండ
భరతుని సామ్రాజ్యపట్టభద్రునిఁ జేసి జగతి సత్యప్రతిశ్రవుఁడ వగుము
నీనియోగంబున నెఱిఁ బదునాల్గేండ్లు వనచరయుతుఁడ నై వని వసింతుఁ

ఆ. గౌతుకమునఁ బ్రియసుఖంబులకొఱకు రా, జ్యంబు నిచ్చగింప నధిప యేను
మీరు చెప్పినంత మెయికొని గావించు, టదియె కోరువాఁడ ననుదినంబు.

—— రాముఁడు దశరథు నూరార్చుట. ——

క. మనమున శోకము విడువుము, కనులఁ బాష్పములు నింపఁగా వలవదు మే
దినిలోఁ దటినీవల్లభుఁ, డినకులవర యెన్నఁడైన నింకునె చెపుమా. 760

వ. దేవా యేను రాజ్యసుఖంబులును జీవితంబును సీతనుసర్వకామంబులును స్వర్గం బునైన మనంబున నిచ్ఛింప మహానుభావుండ వైననిన్ను సత్యయుక్తునిఁగాఁ జేయుట యొక్కటియే యిచ్ఛించెదఁ బ్రత్యక్షదైవభూతుండ వైననీసన్నిధి యందు సత్యసుకృతంబులు సాక్షిగా శపథంబుఁ జేసితి నేనొక్కక్షణం బైన నిప్పు రంబున నుండ నోప సంకల్పితవనగమనోద్యోగనివృత్తి నాకుం గలుగనేరదు నీవు శోకంబు విడువుము వనంబునకుం జనుమని యేను గైకేయిచేతఁ బ్రార్థితుం డనై యట్ల సేయం గలవాఁడ నని నీయకొంటి దాని సత్యంబుగాఁ బరిపా లించువాఁడ నీ వీమనోవ్యథ విడిచి యెప్పటియట్ల స్వస్థచిత్తుండవు గమ్ము ప్రశాంతహరిణాకీర్ణంబును నానాపక్షిగణయుతంబు నగువనంబున సీతాల క్ష్మణసహితుండనై యథాసుఖంబుగా విహరించెద లోకంబున దేవతలకైనఁ దండ్రికంటె నొండు దైవంబు లేదని యార్యులునొడువుదురు గావునఁ బ్రత్యక్ష దైవస్వరూపుం డైనతండ్రివచనంబు యథోక్తప్రకారంబున నిర్వర్తించెద.

క. నరనాథ చతుర్దశవ, త్సరము లరణ్యమున నుండి తడయక మరలం
బురికిం జనుదెంచిన నను, బరికించెదు నీమనమున వగవకు మింకన్. 762

తే. అనఘ యీబాష్పగళ మైనజనములెల్లఁ, దగువిధంబునఁ దేర్పంగఁ దగినమీరె
తాల్మివిడిచియిబ్భంగి సంతాపమొంద, నింకనినుఁ దేర్చువా రెవ్వరిచటఁ జెపుమ.

తే. క్షితివరోత్తమ నాచే విసృష్ట మైన, సాగరపురాద్రికాననసంయుత మగు

ధరణి యంతయుఁ జేకొని భరతుఁ డేలుఁ, గాక నీమాట కనృతంబు గలదె యధిప.

క. ఫలమూలంబులు మెసవుచు, సొలయక గిరినదులు వేడ్కఁ జూచుచు సౌఖ్యం
బలరారఁ గాననంబునఁ, గలయఁగఁ జరియింతు సుఖవిగ్మిట నీవున్. 765

సుమంత్రుఁడు కైకేయి నధిక్షేపించి దూఱుట.

వ. అని పలికిన నద్ధరారమణుండు శోకసంతప్తచిత్తుండై కొడుకుం గౌఁగిలించుకొని మోహావిశేషంబున రోదనంబు సేయుచు నొక్కింతసేపు నష్టచేష్టితుండై యుండెఁ గైకేయిదక్కఁ దక్కినరాజపత్ను లందఱు హాహాకారంబులు సేయుచు మూర్ఛాక్రాంత లైరి సుమంత్రుండును దుఃఖాతిశయంబున వినష్టచేతనుండై ధరణిపయిం బడియె నిట్లందఱుం గొండొకసేపు వివశులై హాహాకారంబులు సేయుచుండి వెండియుం దెలిసినయనంతరంబ సుమంత్రుండు కటకటంబడి క్రోధాతిశయంబున శిరఃకంపంబు సేయుచు నిట్టూర్పులు పుచ్చుచు బొమలు ముడివడఁ గన్నులం గెంజాయ రంజిల్లఁ గైకేయిదిక్కు మొగంబై మహీపతిమనోవిధం బంతయు నెఱింగి నిశితంబు లగువాక్శరంబులచేత నద్దేవిహృదయంబుఁ గంపింపం జేయుచు వజ్రోపమానంబులగువాక్యంబులఁ దదీయమర్మంబులం గలంచుచు దేవి యెద్దానిచేత భర్తయు స్థావరజంగమాత్మకంబైనసర్వజగంబునకు నాథుండు నగుదశరథుండు విడువం బడియె నట్టినీకు నింకఁ జేయరానికార్యం బొక్కింతయైనఁ గలుగదు మహేంద్రుండునుంబోలె నజయ్యుండును మహాశైలంబునుం బోలె నప్రకంప్యుండును మహార్ణవంబునుం బోలె నక్షోభ్యుండు నగుమహీపతినీక్రూరవ్యాపారంబులఁ బరితపింపం జేయుటవలన నిన్నుఁ బతిఘ్ని వనియుఁ గ్రమంబునఁ గులఘ్ని వనియుఁ దలంచెద నని పలికి వెండియు నిట్లనియె. 766

తే. తనయు లోకకోటి గల్గిన ధరణిలోన, నంబుజాక్షికి భర్తృమనోనుసరణ
మరయ నిఖిలార్థసాధన మై చెలంగుఁ, గానఁ బతినింక నేఁచక గావు మబల.

తే. అతివ యిక్ష్వాకుకులవిభుం డితఁడు సుగతి, కరిగినయనంతరంబ జ్యేష్ఠానుపూర్వ
కముగ రాజ్యభారముఁ దాల్పఁగలరు పుత్రులిపుడు తద్ధర్మ మేల లోపించెదకట

మ. అమలుం డీనృపుఁ డట్టివానిపయిఁ బూర్వాచారధర్మంబు హై
న్యము నొందింపఁ దలంచి తీవు జననింద న్నీసుతుం డాధిప
త్యముఁ గావించుచు నుండనిమ్ము చెలువొంద న్మేము నిత్యంబు దా
వమున న్రామునిఁ గూడి నిశ్చయమతిఁ వర్తింతు మిచ్ఛారతిన్. 769

ఆ. యోగ్యుఁ డైనవిప్రుఁ డొక్కరుం డైన నీ, విషయమందు నిలిచి వెలయఁజాలఁ
డట్టిపాపకర్మ మాచరించితివేనిఁ, జెట్టఁదన మిఁకేమి చెప్పవచ్చు. 770

తే. రామునకు నెగ్గు సేయఁ దలంచియున్న, నీకు బ్రహ్మర్షి వాగ్దండనికర మేల
హింససేయదు నీవు కాలిడిన పుడమి, వ్రయ్యలై పోవ దేల చిత్రంబు గాదె.

తే. భర్త కెప్పుడు భవదనువర్తనంబు, కోమలి వృథాప్రయాసంబు కొఱకు నయ్యె
రమణిచూతంబు ద్రుంచినింబమును బాలుఁ, బోసి పెంచినమధురిమపుట్టఁగలదె.

వ. అని కోపంబుపెంపునం బలికి వెండియు మర్మవచనంబుల నిట్లనియె. 773

క. తల్లికిని బోలె నీకును, నుల్లంబునఁ గ్రూరచింత యొప్పుచు నుండుం
గల్లనఁగ వలదు వేఁపకుఁ, దెల్లంబుగ విసమె కాక తీపు గలుగునే. 774

సుమంత్రుఁడు కైకేయితల్లిదురాచారంబు లుగ్గడించుట.

వ అది యెట్లనినఁ దొల్లి భవజ్జనకుం డగు కేకయమహీనాథుం డొక్కయోగివలన సకలభూతరుతార్థజ్ఞానవిషయకం బైనయొక్కవరంబు వడసి తత్ప్రభావంబున సర్వభూతరుతంబును దదభిప్రాయంబు నెఱింగి దానం జేసి పశుపక్షిమృగాదుల వచనం బతనికి విదితం బై యుండు నంత నొక్కనాఁ డద్ధరారమణుండు శయనకాలంబునందు నొక్కజృంభనామకం బైనపక్షిరుతంబు విని దానియభిప్రాయం బెఱింగి నవ్విన నది విని మృత్యుపాశంబు నభిలషించుచు మీతల్లి కోపించి హాసకారణం బెఱింగింపు మనిన నతండు తత్ప్రకారం బెఱింగించిన నిప్పుడు నాకు మరణంబు సంభవించు ననిన నది వినక నీ వెట్లైన లెస్స నాకున వ్వటకుం గలిగిననిమిత్తం బెఱింగింపు మని నిర్బంధించిన నన్నరవరుం డవ్విధం బంతయు వరదాయకుం డగుయోగి కెఱింగించిన నతండు మోహవశంబున నాలికిఁ జెప్పి మరణంబు నొందక దాని నిరసింపు మనిన నక్కేకయుండు గురువచనప్రకారంబున భార్యను నిరసించి మృత్యువుం దిరస్కరించి సుఖియై కుబేరుండునుం బోలె యథాసుఖంబుగా విహరించె నిది మీతల్లివృత్తాంతం బెల్లవారికిఁ దెల్లం బై యున్నయది యట్టిక్రూరచిత్తకుం బుట్టిననీకు మంచిగుణం బేలదొరకొనుఁ దల్లియట్ల నీవును దుర్జనాచరితమార్గస్థితవై మోహంబున మహీపతిం జంపం జూచితివి పుత్రులకుఁ దండ్రిగుణంబును బుత్రికలకుఁ దల్లిగుణంబును నిక్కంబుగా సన్నిహితం బై యుండు నీవును దల్లిగుణం బంగీకరించి జనాపవాదంబున కోర్చి మహీపతిచిత్తంబుఁ గలంచెద విమ్మహీపతి సభామధ్యంబునం బలికినరామాభిషేకంబునకు విఘ్నంబుఁ జేసితి వేని నితని కసత్యదోషంబు వచ్చు జ్యేష్ఠునిం బరిహరించి కనిష్ఠు నభిషిక్తునిం జేసిన రాజధర్మంబునకు హాని వాటిల్లు నిమ్మనుజపుంగవుండు దేవరాజసమప్రభుండును గీర్తిరఘుండును సత్యవాదియుఁ గావున నమ్మహాత్మున కపయశంబు గలుగకుండ సత్యంబున నుద్ధరింపు మని పలికి వెండియు నిట్లనియె. 775

సుమంత్రుఁడు కైకేయికి నీతులు చెప్పుట.

చ. అనఘచరిత్రుఁ డీరఘుకులాంబుధిచంద్రుఁడు రాఘవుండు కా
ననమున కేగుచుండ నుడునాథుఁడు లేనితమిస్రభంగి శో
భనరుచి దక్కి దిక్కు సెడి పాఱటి యున్నపురంబులోపల

న్మనుజుఁ డోకండు నిల్చునె వనంబున కేగక దుష్టచారిణీ. 776

తే. రామభద్రుండు దండకారణ్యమునకుఁ, జనిన నీ కపవాదంబు సంభవించు
వంశధర్మమునకు హానివచ్చు మనుజ,పతికిఁ దీర్పంగ రానియాపద ఘటిల్లు. 777

క. కావున ననేకఘనదో,షావహ మగునీవిచార మటు వో నిడి నీ
తావిభుని సకలరాజ్య, శ్రీవిభునిఁగఁ జేయు మిపుడు చిత్తము లలరన్. 778

శా. సీతానాథుఁ డశేషరాజ్యపదవీసింహాసనాధ్యక్షుఁ డై
చేతోజాతసమానమూర్తులు నృపశ్రేష్ఠు లుసుమిత్రాతనూ
జాతు ల్శిత్రనయుండుఁ గొల్వఁ బ్రజలకా సంప్రీతితో నేలఁగాఁ
బూతాత్ముం డగురాజు కాన కదుగుం బూర్వాధిపప్రక్రియన్. 779

క. అని యిట్లు పెక్కుభంగులఁ, బనివడి సూతజుఁడు దీక్ష్ణభాషితముల మె
త్తనిమాటల న్యాయప్రవ,చనములఁ గొంతవడి ధర్మసరణిఁ బలికినన్. 780

క. పడఁతుక దుర్మతి మది తా, విడువక జనులాడునడికి వెఱవక మదిలోఁ
బొడమినకోపము మత్సర, ముడుగక మఱుమాట వలుక కూరకయుండెన్.

వ. అంత నమ్మహీనాథుండు ప్రతిజ్ఞాపీడితుం డై నిట్టూర్పునిగిడించి కన్నుల బాష్ప
కణంబు లొలుక సుమంత్రు దిక్కు మొగం బై రత్నసంపూర్ణంబు లగుచతుర్విధ
సైన్యంబులును బరచిత్తాపకర్షణచతురవచనలగు వారకాంతలును సుప్రసారితు
లగువణిగ్జనంబులును ముఖ్యంబులగు వరాయుధంబులును నాగరులునుశకటంబు
లును గాంతారగోచరు లగువ్యాధులును ధనధాన్యకోశంబులును రాముని
పిఱుంద వనంబునకుం జనునట్లు సేయుము సేనాయుతుం డై కుంజరాదిమృగం
బులం జంపుచు సహాయసంపన్నుం డై యారణ్యకం బగుమధువుఁ గ్రోలుచు
ధనవంతుం డై పుణ్యప్రదేశంబులందు యాగంబులఁ జేసి బ్రాహ్మణులకుఁ బుష్క
లంబుగా దక్షిణ లొసంగుచు మునులతోడఁ బుణ్యకథావినోదంబులం బ్రొద్దు
పుచ్చుచుఁ బురంబునందుంబోలెరాముండు సుఖగోష్ఠి వనంబునందు విహరించు
చుండు నిచ్చట భరతుం డయోధ్యఁ బాలించుచుండుఁ బదంపడి రాముండు
వనవాసానంతరంబున సకలమహీరాజ్యభారధౌరేయుం డై ప్రజలఁ బాలింపఁ
గలం డని పలికినఁ గై కేయి భయభ్రాంత యై మొగంబున వెల్లఁదనంబు గదుర
నద్దశరథున కభిముఖ యై యి ట్లనియె. 782

క. రమణా గతజన మగురా,జ్యము నసటూ పీతమండ నగునుద్యమున
ట్ల మలినమతిచేఁ గడుఁ గృ,త్రినుయుక్తి నొసంగఁ దలఁచితే భరతునకున్.

క. దాని నతఁ డేల చేకొను, నీ నేర్పులు దెలిసె నింక నిలువు మనిన న
మ్మానవపతి లజ్జాభయ,హీన యగు వెలంది కనియె నెంతయుఁ గినుకన్. 784

క. విను వారి కయుక్తం బగు, పని యైనను సత్యపాశబద్ధుఁడ నై గై
కొని సేయఁ గడంగిన న, న్ననుమానము దక్క యేమియలఁచెద వింకన్.

తే. పాపమతి రాము నడవికిఁ బంపు మనుచుఁ
బలికితివి గాని నామ్రోల బలయుతముగ
ననుప వల దని యంటివే యపుడు నాకుఁ
దోఁచిన ట్లిప్పు డొనరింతు దోస మేమి. 786

కైకేయి దశరథునితో సగరుఁ డసమంజునట్లు రాముని వనమునకుఁ బంపు మనుట.

క. అని పలికిన విని యమ్మా,నిని తనపతికంటె మిగుల నెఱి గల్గిన బల్
కినుక హృదయమునఁ గదురఁగ, ననుమానము విడిచి మరల నాతని కనియెన్.

ఉ. ఇంత విచార మేల పృథివీశ్వర మీకులమందుఁ దొల్లి వి
క్రాంతధురంధరుండు సగరక్షితినాథుఁడు జ్యేష్ఠపుత్త్రు న
త్యంతగుణప్రవీణుని మహాత్ముని నయ్యసమంజుని న్సుధీ
మంతునిఁ ద్రోచి పుచ్చఁడె క్షమావర యాతని కెగ్గు కల్గెనే. 788

వ. మహేంద్రా యసమంజునిచందంబున నీరాముండు నిర్వాసితుఁ డగుఁ గాక యనిన న ప్పుడంతివాక్యంబులు విన రోసి మహీనాథుం డూరకుండె జనం బంతయు బ్రీడితం బయ్యె నప్పుడు మహావృద్ధుం డగుసిద్ధార్థుం డనుమంత్రి పుంగవుండు కైకేయి కిట్లనియె. 789

క. ఆయసమంజుఁడు క్రీడా,వ్యాయామమువలనఁ దెగువులందు శిశువులం
బాయక కొని చని సరయూ,తోయంబుల వైచు భూరిదుర్మదలీలన్. 790

సిద్ధార్థుం డనువృద్ధమంత్రి కైకేయికి నయంబుఁ దెల్పుట.

వ. దానిం జూచి సహింపక పౌరులమ్మహీపతిపాలికిం జని భవన్నందనుండు దుర్మదంబున నస్మత్పుత్త్రులం గొని చని మౌర్ఖ్యంబున సరయూనదీజలంబులం బడ వైచు నిట్టిదుష్టు నొక్కనిం జేకొని మమ్ము నందఱ నుపేక్షించుట ధర్మంబుగాదని యాక్రోశించిన వారికిఁ బ్రియంబుగా సభార్యుండై నయసమంజుని యావజ్జీవపర్యంతంబు వనంబున నుండు మని రాష్ట్రంబు వెడల ననిచిన నయ్యసమంజుండు ఫాలపిటకధరుండై గిరిదుర్గంబుల నాశ్రయించి కందమూలఫలాశనుండై పాపకర్మంబునంబోలె సంచరించుచుండె నక్కుమారుండు జనకంటకుం డగుటం జేసి పరిత్యజించుటకుం దగియెడువాఁ డయ్యె నక్కుమారునియందుం బోలె రామునియం దేమి పాపంబు గంటిమి శశాంకునియందు మాలిన్యం బెట్లు లే దట్లు రామునియందు నిరయహేతుభూతం బైనదోషం బించుకయైన లే దిమ్మహాత్ముండు విడుచుటకుం దగియెడువాఁడే యని పలికి వెండియు నిట్లనియె. 791

క. మానిని సీతాపతిపైఁ, బూనిక నింతైన దోషముం గల దేని
దానిం బేర్కొను మిప్పుడె, కానకుఁ దగఁ బుత్తు మిట్టికారణ మేలా. 792

క. ముదితా సత్పథనిరతుం, డదుష్టుఁ డగువానిత్యాగమందుఁ దలంపం

ద్రిదశాధీశుని పటుసం,పద నైన దహించు ధర్మపథరోధమునన్. 793

క. మునుకొని రాముని వనికిం, బనిచిన నీకేమి ఫలము వచ్చు మృగాక్షీ
వినుమీ దుర్మతి ముడుగుము, గొనకొని జన నిందఁ బాపికొనుము సుమతివై.

దశరథుఁడు కైకేయికి నయంబుఁ దెల్పుట.

మ. అని యిట్లామహాప్రధానశేఖరునిమాటాలించి భూభర్త దా
ఘనశోకోపహతేంద్రియుం డగుచు నక్కైకేయి నెమ్మోముఁ గ
న్గొని మందధ్వని నిట్లనెన్ జను లుపక్రోశింప కుండన్ మహా
ఘనుఁ డీమంత్రివరుండు పల్కునయవాక్యం బర్థి నాలింపుమా. 795

తే. లేమ యీమంత్రివాక్య మాలింప వేని, సారిది నీకును నాకును సుఖము లేదు
వృజినపథ మొంది నీవు గావించునట్టి, కర్మ మది సాధులోకవిగర్హితంబు. 796

చ. పలుకులు వేయు నేల కులపాంసిని నీవును నీకుమారుఁ డీ
యిల నవిరోధతం గుజను లెల్ల నుతింపఁగ నేలు చుండుఁ డే
లలితగుణాభిరాముఁ డగురామునిఁ గూడి వనోర్వి కేగెద
న్గలువలపొత్తుఁ బోదురె ఘనుం డెడఁ బాసినచో యశోధనుల్. 797

రాముఁడు దశరథుని వల్కలము లడుగుట.

చ. అని జనభర్త పల్కునపు డారఘురాముఁడు మంత్రివాక్యము
ల్విని వినయంబు దోఁపఁ బృథివీపతి కిట్లను నోమహాత్మ శో
భనకరరాజ్యసంపదలఁ బాసి వనంబున నుండువాఁడనై
చనియెడునాకు నీసకలసైన్యసమాగమ మేల చెప్పుమా. 798

మ. నరనాథోత్తమ యెవ్వఁ డర్థి గజముం దా నిచ్చి తత్కక్ష్యయం
దురుమోహంబునఁ గానుకోరి యగు నోహో రజ్జుసంస్నేహత
త్పరత న్వానికిఁ గార్య మేమి గల దీదాక్షిణ్యము న్మాని చె
చ్చెరఁ దెప్పింపుము నారచీర లవియే శ్రీ లంచు నూహించెదన్. 799

మ. అని సీతావిభుఁ డాడువాక్యములకున్ హర్షించి కైకేయి చ
య్యన వల్కంబులఁ దెచ్చి రామ గయికొమ్మా యంచు నందీయఁ జే
కొని రాముం డటు సూక్ష్మవస్త్రము జను ల్క్షోభింపఁగాఁ బుచ్చి తా
ముని వస్త్రంబులు గట్టె నాయమకు సంమోదంబు సంధిల్లఁగన్. 800

ఉ. ఆదట లక్ష్మణుండును శుభాంబర మల్లనఁ బుచ్చి తాపసా
చ్ఛాదనము ల్ధరించెఁ దమయయ్య గనుంగొను చుండ నంత రా
కాధవళాంశువక్త్రయు జగన్నుతశీలయు భర్తృదుఃఖవి
చ్ఛేదిని జాతరూపమయచేలయు నైనధరాకుమారియున్. 801

రాముఁడు సీతకు వల్కముల గట్టుట.

తే. కైక కఠినాత్మ యై కృప లేక తన కొ,సంగిన యమునంజు తాపసాచ్ఛాదనంబు

హరిణి వాగుర నట్లు తా నందికొని సు,బాష్పపూర్ణాక్షి యై నిజభర్తఁ జూచి.
తే. పురుషవర యిట్టికఠినంపుఁబుట్టమెట్లు, మునులుదాల్పంగనోపుదురనుచుఁ గనుల
నశ్రువులు గ్రమ్మ వ్రీడిత యగుచు దానిఁ, గట్ట నేరక శోకంబు గడలుకొనఁగ.
తే. అంసమున నొక్కపరిధాన మలవరించి, పాణిచే నొక్కవసనంబుఁ బట్టి విభుని
మోముఁ జూచుచు మనమున నేమి దోఁప,కూర కున్నమహీపుత్త్రి నూఱడించి.
క. రాముఁడు రయమున సీతా, భామిని కనకాంబరంబు పై వల్కలము
ద్దామగతిఁ గట్టఁ గనుఁగొని, భూమీశ్వరుసతులు చాలఁ బొక్కుచు నంతన్.
ఉ. రామునిఁ జూచి యిట్లనిరి రాజకులోత్తమ యీధరిత్త్రిక
న్యామణి బాల గోలయు మహాసుకుమారియుఁ బుట్టి యెన్నఁడు
న్బాము లెఱుంగనట్టిఘనభాగ్యయుఁ గావున నీసతి న్వనీ
భూమికి నేఁడు దోడుకొని పోఁగ యుక్తము గాదు చూడఁగన్. 806
తే. ధన్యచరిత నీ వచ్చునందాఁక నిన్నుఁ
గాంచి యానందమునఁ బొంగుకరణి జనక
సుతను గనుఁగొని సంతోషయుతుల మగుచు
నసువులు ధరించి యుండెద మంచితముగ. 807
క. జనపతి నిన్నొంటిగఁ గా,ననమున కరుగు మని పంచె నరవర యటు గా
వున జనకసుతను దోడ్కొని, చను టొప్పదు తండ్రిమాట సత్యము కాదే. 808
క. మామాటఁ బట్టి సీతా, భామిని నిచ్చోట నునిచి భద్రయశుం డీ
సౌమిత్త్రి వెంట రా వన, భూమికిఁ జను మిదియు నీకుఁ బోలుఁ గుమారా. 809
క. అని యిట్లు తల్లు లందఱుఁ, దనకు హితముఁ బల్క వినుచుఁ దడయక రాముం
డనుమానింపక ధాత్త్రీ, తనయకు వల్కలముఁ గట్టె తత్పరమతి యై. 810
వ. ఆసమయంబున నృపపురోహితుం డగువసిష్ఠుండు సీతాదేవిని నివారించి కై
కేయి నవలోకించి యిట్లనియె. 811

వసిష్ఠుఁడు కైకేయిని దూఱుట.

తే. శీల మెన్నక మగని వంచించి రామ,భద్రు నడవికిఁ బొమ్మని పలికి తాఁ బ్ర
మాణ మందున నిలువ కీమానవతికి, సీత కిచ్చితి వేటికిఁ జీర లిపుడు. 812
ఉ. ఆతెఱఁ గెట్లు చొప్పడు మహాసుకుమారి పవిత్త్రశీల యీ
సీత నిజాధినాథుఁ దెడ సేయక క్రమ్మఱ వచ్చునంత కి
ట్లాతని శాసనంబున ధరాధిపతిత్వము నొంది యుండుఁ గా
కాతతకంటకాశ్మకతనావని కేటికిఁ బోవు నిత్తఱిన్. 813
తే. ఇంతి వినుము గృహస్థులకెల్లఁ బత్ని, యాత్మ యై యుండు రామున కాత్మ యైన
ధాత్త్రికన్య తత్ప్రతినిధిత్వమున నిఖిల, వసుధఁ బాలించుఁ దనపతి వచ్చుదాఁక.
ఆ. అట్లు గాక యీమహాసాధ్వి పతిఁ గూడి, యడవి కరిగె నేని యతులసుఖము

లిచట విడిచి పిదప నే మందఱము చను, వార మతఁడు వోవు ఘోరవనికి.

తే. తండ్రిచే ధర్మయుక్తి దత్తంబు గాని, యుర్వి( బాలింప భరతుఁ డర్హుండు గాఁడు
నృపతికి జనించుటదినిక్క మేని యింకఁ, దల్లివలె నిన్నుఁ జూడఁడు తథ్యమపుడు.

ఆ. మఱియు విషయజనులుపురజనంబులు దండ, నాయకులు సతీసహాయు లగుచు
నెచట రామభద్రుఁ డింపార వసియించు, నచటి కిపుడె పోదు రనృతశీల. 817

-- దశరథుఁడు కైకేయి యన్యాయంబు నుగ్గడించుట. --

వ. దుష్టచారిణీ నీవు భూతలంబున నుండి గగనంబున కెగసినఁ బితృవంశచరిత్ర విశారదుం డగు భరతుండు భవన్మతం బంగీకరింపఁడు పుత్త్రవినాశిని వగు నీచేత భరతున కప్రియంబు గావింపంబడియె మఱియు లోకంబున నెవ్వాఁడు రాముని ననుసరింపకుండు నతని లేనివానిఁగా నెఱుంగుము పశువ్యాళమృగద్విజంబులు ను బాదపంబులును దదున్ముఖంబులై రామునితోఁ గూడ వనంబున కిపుడె పోవఁ గలయవి తత్ప్రకారంబు విలోకింపం గలవు భరతుండును శత్రుఘ్నుండును రాముని యట్ల తాపసవేషంబులు దాల్చి దండకారణ్యంబున వసియింతు రంతట గతజనంబై శూన్యాకృతి నున్న యిప్పురంబు చేకొని విగతఫలంబులై నవృక్షంబుల కాధిపత్యంబు సేయుచుండుము మఱియు రాముండు లేనిపురం బరణ్యసమానం బగు నమ్మహాత్ముండు వసియించియున్న నెలవు విపినంబైన నునానాజనశోభితంబైనపురంబై యుండు మఱియు నొక్క రాముని వనవాసంబే నీచేతఁ బ్రార్థితంబైనయది గాని వరప్రదానంబునందు సీతావనవాసంబు ప్రార్థితంబైనయది గాదు కావున నలంకారనియత యైనయీసీత సర్వాలంకారభూషితయై మహార్హయానపరిచారకవస్త్రభూషణోపకరణసహితంబుగా వనంబునకుం జని యందు రామునితోఁ గూడ నివసించి యుండం గలయది నీ వీవైదేహికి దివ్యాంబరాభరణమాల్యాదు లొసంగి వల్కలంబులు గ్రమ్మఱఁ బ్రతిగ్రహింపు మని యిట్లు కైకేయిం బదరి పలికి జానకిని నివారించిన నద్దేవి యమ్మహాత్ముఁ డెంత జెప్పిన నుడుగక పత్యనుకారకామ గావున నిజవల్లభునిరూపంబున కనురూపంబుగా వల్కలంబు ధరించె నప్పు డచ్చటిజనంబు లందఱు దుఃఖించిన నమ్మహాధ్వని విని దశరథుండు శోకవ్యాకులితచిత్తుం డగుచు యశోధర్మజీవితంబు లయందుఁ బ్రియత్వంబు విడిచి నిట్టూర్పు నిగిడించి కైకేయి నవలోకించి యిట్లనియె. 818

సీ. పుట్టి యెన్నఁడు దుఃఖముల నెఱుంగక సరసాన్నంబుఁ గుడిచి చీనాంబరములఁ దాల్చి మహోన్నతిఁ బొల్చి యుండెడునట్టియీ బాల యీగోల యీసుభార్హ యీమహానుకుమారి యీధరిత్రీకుమారి కుశచీరఁ దాల్చి యాకులత గోర్చి ఘోరవనావని కేరీతిఁ బో నేర్చు గురునివాక్యంబు నిక్క వము సువ్వె

తే. ఘనసుఖోచిత యైనయీ జనకకన్య, తనయలంకారరూప మంతయును విడిచి

తాపసులు గట్టుపుట్టంబుఁ దాల్పఁ జూచి, కన్నవారలమనములు గంధ కున్నె.

తే. చీరలు పరిత్యజించి యీక్షితికుమారి
కనకభూషణభూషితాకార యగుచుఁ
గడుసుఖంబుగ వని కేగఁ గలదు శ్రమణి
యగుట కే నీయకొంటినె మగువ యిపుడు. 820

తే. అకట వల్కముఁ దాల్చి సభాంతరమున, శ్రమణిచందాన నొప్పెడుజనకపుత్త్రి
నెవ్విధంబున వీక్షింతు నెట్లు సైఁతు, నీవెలంది యెవ్వని కేమి యొగ్గుఁ జేసె.

తే. రమణి జానకి నారచీరలు ధరించి, వనికిఁ బోవుట కే నీయకొనుట లేదు
గావున సమస్తభూషణకలిత యగుచు, భూరిసుఖలీల నడవికిఁ బోవఁ గలదు.

వ. దేవి ముమూర్షుండ నైననాచేత భవత్ప్రార్థనంబుఁ గావించెద నని శపథపూర్వకంబుగా నతిక్రూరం బైనప్రతిజ్ఞ మొదలఁ గావింపం బడియెఁ బదంపడి నీచేత నజ్ఞానంబున రామప్రవ్రాజనభరతాభిషేకరూపప్రయోజనంబు ప్రతిపన్నం బయ్యెఁ గాని సీతాప్రవ్రాజనరూప ప్రయోజనంబు ప్రతిపన్నం బైనయది గాదే నందు కీయకొనిన యది లేదిప్పుడు ముఖ్యంబుగా సీతాప్రవ్రాజనం బె యారంభింపఁబడియెఁ గావున నిక్కార్యం బాత్మపుష్పంబు వేణువుం బోలె నన్ను దహింపం గలయది యని పలికి వెండియు ని ట్లనియె. 823

తే. ఈమహీజాత నీ కేమి యెగ్గొనర్చె, రాముఁ డే మింత నీకుఁ గాగామిఁ జేసె
నీదురత్యయబుద్ధి నీ కేల గలిగె, మంచికుల మేల నీఱు గావించె దకట. 824

తే. పరమసాధ్వి మృదుస్వభావయును గోల, మంజుభాషిణి హరిణీసమాననయన
బాల సుకుమారి ధర్మైకపరయు నైన, సీత యేమి విరోధంబు సేయు నీకు. 825

వ. దుష్టచారిణీ నీకు నరకానుభవంబునకు నీరామవివాసనం బెచాలు వెండియు నింతకంటె నధికంబుగా నీచేత ననుష్ఠీయమానం బైనయీయవాచ్యదుఃఖప్రదసీతాప్రవ్రాజనరూపపాతకంబుచేత నేమి యనుభవించెద వభిషేకార్థం బిచటికి సమాగతుం డైనరాము నుద్దేశించి నీచేతఁ బలుకం బడినరామవివాసనవిషయకం బైనవాక్యం బాకర్ణించి నాచేత రామవివాసనమాత్రం బె ప్రతిజ్ఞాతం బయ్యెఁ గాని సీతావివాసనంబు ప్రతిజ్ఞాతం బైనయది గా దిప్పుడు మత్ప్రతిజ్ఞాతం బైనరామవివాసనం బతిక్రమించి యప్రతిజ్ఞాతం బైనసీతావివాసనంబునుం గోరితి విది ధర్మవిరోధంబు చీరవల్కలవాసిని యైన వైదేహి నీక్షింప నిశ్చయించితివి గావున నీవు నిక్కంబుగా నిరయగతి నొందఁ గలవు.

ఉ. లోకముతో డిదాన వని దూఢిగ నెమ్మది నమ్మి యంత క
స్తోకముదంబునం బ్రియము దోఁపఁ గుమారుని మేలుకార్యము
న్నాకొని చెప్ప వచ్చి తుది వారనిదుఃఖము నొందితిం గటా
నీకడ కేగుదెంచు టది నేరము వచ్చెఁ దలంపు లేటికిన్. 827

మ. అని యిట్లాజనభర్త శోకమున భార్య న్దాఁకుచుం గోడలం
గని శోకించుచు బాష్పతోయకణముల్ గన్దోనలం దాల్చుచు
న్దనయు న్బాయుట కోర్వఁ జాలక మనస్తాపంబు వాటిల్లఁ గ్ర
న్నన దుఃఖంబు సహింప లేక సొరిగెం దల్పప్రఘాణంబునన్. 828

వ. ఇట్లు మూర్ఛితుం డై పడి యున్నతండ్రిం దేర్చి సీతావల్లభుండు గనునోన్ముఖుం డై వెండియు నిట్లనియె. 829

రాముఁడు కౌసల్యను సన్మానించుమండు మని దశరథునిఁ బ్రార్థించుట.

సీ. అనఘాత్మ మాతల్లి యైనయీకౌసల్య కడువృద్ధ కీర్తిసంకలిత పుట్టి
యెన్నఁడు దుఃఖంబు లెఱుఁగని దయుద్రశీల మహాధర్మచిత్త నన్ను
నిమిష మైనను బాసి నిలువ నేరని దట్లు గావునఁ బుత్రశోకమునఁ గుంద
కుండ సన్మానింపు మురుసమాదరమున నట్లు గావింపక నలఁతి గాఁగఁ

తే. జూచితేనియు దారుణశోకవహ్నిఁ
గ్రాఁగి యసువులు విడిచి నిక్కముగ యమపు
రంబునకుఁ బోవు ననిన నారాజవరుఁడు
మహితశోకాబ్ధిదోధూయమానుఁ డగుచు. 830

వ. మునివేషధరుం డై నకుమారు నవలోకించి వదనం బెత్తి యతనిం జూచుటకు నతనితోడ సంభాషించుటకుం జాలక పత్నీసహితంబుగా మూర్ఛితుం డై వెండియు నొక్కింతసేపునకుం దేఱి. 831

క. ముదమున మున్నే మొదవుల, వదలక కుఱ్ఱలకుఁ బాపి భంజించితినో
పదుగుర హింసించితినో, యది యెంతయుఁ గట్టి కుడువ నయ్యె న్నాకున్. 832

ఉ. అక్కట కైకమాటలకు నంగము లెల్ల మహోగ్రవేదన
న్స్రుక్కియు మానివేష మది సొప్పడఁ గైకొని యగ్రభాగమం
దుక్కఱి యున్నపుత్త్రుఁ గనియు న్మనియుండుటఁ జేసి ధాత్త్రిలోఁ
గ్రక్కునఁ జే టకాలమునఁ గల్గమి నిక్కము ప్రాణికోటికిన్. 833

తే. నను విరోధించి స్వప్రయోజనమునందుఁ
బ్రియము గలిగినకైకేయి కృతమునందు
జనము కటకటఁ బడు చున్న దనుచుఁ బలికి
యశ్రువులు గాఱ నంతలో నవశుఁ డయ్యె. 834

దశరథుఁడు సీతకు దివ్యవస్త్రాభరణాదుల నొసఁగుట.

వ. ఇట్లు మూర్ఛాక్రాంతుం డై ముహూర్తమాత్రంబునకుఁ గ్రమ్మఱ లబ్ధసంజ్ఞుం డై రామా యని పేర్కొని క్రమ్మఱ నుచ్చరింపం జాలక కొంతసేపూరకుండి వెండియు బాష్పకణంబులు కొనగోట మీటుచు సుమంత్రుం జూచి నీవురయంబునం జని యుపవాహనమాత్రోపయుక్తం బైనరథంబు నుత్తమాశ్వంబులం

బూన్చి తెమ్ము నాథుండును వీరోత్తముండు నగురాముండు తల్లిదండ్రులచేత వనంబున కనుపం బడియె నిదియె గుణవంతు లగువారిగుణంబులకు ఫలం బని యెంచెద నని దుఃఖాతిశయంబునం బలికిన విని యతండు రాజానుమతంబున సువర్ణరత్నభూషితం బైనరథం బాయితంబుఁ జేసి తెచ్చి ముందటం బెట్టి కృతాంజలిపుటుం డై కొలిచి యుండె నప్పు డద్దశరథుండు దేశకాలజ్ఞుండును బాహ్యాభ్యంతరబుద్ధియుక్తుండును దత్తత్కాలోచితవస్తువిషయనిశ్చితజ్ఞానవంతుండు నగుధనాధ్యక్షుని రావించి మంజువస్త్రంబులును మణిభూషణంబులును బదునాల్గువర్షంబులకుం జాలునట్లుగా వేర్వేఱ వైదేహికొసంగు మని పంచిన నతండు కోశగృహంబునకుం జని వస్త్రాభరణంబులు దెచ్చి యద్దేవి కొసంగిన నయోనిజయు సాముద్రికోక్తసర్వలక్షణసంపన్నయు నగు నమ్మహీపుత్రి వివిధవిచిత్రప్రభాపటలజటిలంబు లగుమణిభూషణంబులు దాల్చి ప్రాతఃకాలంబున నంతరిక్షంబు నలంకరించు భానుప్రభయునుం బోలె నమ్మహామందిరంబు వెలుంగం జేయు చుండె నప్పు డప్పుడమికన్నె నవలోకించి భుజంబులం బరిష్వజించి శిరంబు మూర్కొని బాష్పధారాపూరితముఖి యై కౌసల్య యిట్లనియె. 835

~ కౌసల్య సీతకు హితోపదేశముఁ జేయుట. ~

క. క్షితిలోన ననతు లెంతయు, సతతము నిజవిభులచేత సత్కృత లయ్యుం
బతి కృఛ్రగతుం డగుచో, క్షితితనయా నిగ్రహంబు సేయుదు రంతన్. 836

తే. పార్థివాత్మజ మున్నలభర్తవలనఁ, బెక్కు సుఖములు నడసియుఁ బృథివిలోన
వరున కొక్కింతయాపద వచ్చినప్పు, డతని విడుచుట యసతుల కాత్మగుణము.

తే. కల్ల నిజముగఁ బల్కుట కలుషవృత్తి, కఠినచిత్తంబుఁ దాల్చుట కపటబుద్ధి
తవిలి పురుషుని వంచించి తనకుఁ దలఁకు,వానిఁ జేయుట యసతులవర్తనములు.

క. విపరీతకర్మయుక్తలు, కపటవచోరతలు కృతము గాననికుమతు
ల్చపలాత్మలు వారి మనః,కపటత్వము దెలియ రాదు గా పురుషులకున్. 839

తే. ధర నవిశ్వసనీయలు దురితచిత్త, లగుటఁ గులకృతదానవిద్యాదికములు
సంగ్రహంబును ననతుల స్వాంతవృత్తిఁ, గ్రమ్మఱింపంగఁ జాలవు రాజతనయ.

క. సతులకుఁ గాంతామణి సు,శ్రుతశమదమసత్యశీల సుగుణములందు
న్నతి సేయునట్టి వారికిఁ, బతి యొక్కఁడె గతియు నతఁడె పరమార్థ మిలన్.

వ. కావున మత్తనయుండు ధనవంతుం డైనను నిర్ధనుం డైనను నీకు దైవం బట్లగుటం జేసి యమ్మహాపురుషునిఁ బరిచర్యాభక్తియోగంబుల నిత్యంబును సేవించు చుండు మని పలికిన ధర్మార్థసహితం బైనయక్కౌసల్యవాక్యం బెఱింగి కృతాంజలి యై యద్దేవి కిట్లనియె. 842

మ. క్షితిలో మెచ్చుగ నాకుఁ దొల్లి పతిసంసేవావిధం బంతయుం

చతురత్వంబునఁ దల్లిదండ్రులు మహాసంప్రీతితోఁ జెప్పి రా
గతి మీ రిప్పుడు క్రొత్తఁ జేసితిరి వేడ్క న్భక్తియోగంబుచేఁ
బతిశుశ్రూష యొనర్చు చుండెద జగత్ప్రఖ్యాతచారిత్ర నై. 813

క. ధరణి నతిదుర్జనులతోఁ, బరిగా ననుఁ దలఁచి తోర్కొ శశిఁ బాయనిత
త్పరమద్యుతిగతి నేనును, బరలక వర్తింతు నిత్యధర్మమువలనన్. 814

ఆ. వినుఁడు తంత్రి లేనివీణ మ్రోయదు రథాం, గములు లేనిరథము గదల లేదు
సుతులు నూర్వు రున్నఁ బతిభక్తి లేనితొ,య్యలి సుఖింపఁ జాల దవనియందు.

క. జననీజనకులు దనయులు, ననుజులు మితసుఖము నిత్తు రంతియె విభుఁ డిం
దును నం దమితసుఖదుఁ డగు, ననిశంబే సాధ్వి గొల్వ దాతని భక్తిన్.

క. శ్రుతధర్మపరావర సం,చితపాతివ్రత్యధర్మశీల నయిన నే
మతి నొండు తెఱఁగుఁ దలఁతునె, పతియె సతుల కేడుగడయు బాలింపంగన్.

రాముఁడు కౌసల్య నూరార్చుట.

వ. అని పలికిన హృదయంగమంబు లగుకోడలిపలుకులు విని శుద్ధగుణాఢ్య యగు కౌసల్య గనుంగొనల దుఃఖహర్షసంభూతంబు లగుబాష్పకణంబులు నించుచు సపత్నీమధ్యంబున నుండె నప్పుడు కల్యాణగుణాభిరాముం డగురాముండు నిజజననికిం బ్రదక్షిణంబుఁ జేసి కృతాంజలిపుటుండై యి ట్లనియె. 848

క. జననీ శోకింపకు మా, జనకునిఁ గనుఁగొనుము సత్యసంధుఁడు కరుణా
వనధి సుగుణుఁ డీ మహానీ,యుని నఱసుఱ లేక ప్రోచు చుండుము భక్తిన్.

క. వినుము చతుర్దశవర్షము, లనఁగఁ జతుర్దశదినంబులట్ల గడపి చ
య్యన వత్తు నంత దన పీ, వనుమానము దక్కి యుండు మధికప్రీతిన్. 850

వ. మఱియు నేకరాత్రంబునందు నిద్రవోయెడు నీకుఁ జతుర్దశఘటిక లెట్లు చను నట్లు చతుర్దశవత్సరంబులు త్రుటిమాత్రంబుగాఁ జను నందాఁకఁ గనుంగవ మూసికొని దుఃఖంబు గణింప కుండు మని సవినయంబుగాఁ బలికి క్రమ్మఱఁ బ్రదక్షిణంబు చేసి పరమదుఃఖాక్రాంతలై తన్ను విలోకించు చున్నతక్కినతల్లుల నందఱ నిరీక్షించి యేను సంవాసంబువలన నొక్కింత పరుషం బాడినను నజ్ఞానంబువలన నొక్కింత యపరాధంబుఁ గావించిన నది యంతయు సంస్మరింపక కృపఁ జేసి యనుజ్ఞ యొసంగుదురు గాక యని పలికిన ధర్మయుక్తంబును సమీచీనార్థసమన్వితంబు నైనరామునివచనంబు విని శోకోపహతచిత్త లగుచు నక్కుమారుని బహుప్రకారంబులం బ్రస్తుతించుచుం గైకేయి నిందించుచు బహువిధాలాపంబుల విలపించుచుండి రప్పుడు తదీయాక్రందితనినాదంబు క్రౌంచీనిస్వనంబుభంగిఁ జెలంగె మున్ను మురజపణవమేఘఘోషసహితం బై విలసిల్లు నమ్మందిరం బప్పుడు పరిదేవనాకులం బై వ్యసనగతం బై సుదుఃఖితం బై యుండె నంత రాముండును లక్ష్మణుం

డును సీతయును బాదగ్రహణపూర్వకంబుగా దశరథునకుం బ్రణామంబుఁ జేసి కృతాంజలిపుటు లై తల్లిదండ్రులకు శుశ్రూష యొనర్పక వనంబునకుం జన వలసెఁ గదా యనువిచారంబున దీనవదను లై ప్రదక్షిణంబుఁ జేసి యనుజ్ఞఁ గొని పదంపడి మాతృదుఃఖసందర్శనంబువలన శోకసమ్మూఢుం డై రాముండు సీతాసహితంబుగాఁ గౌసల్యకుం బ్రదక్షిణంబును బ్రణామంబునుం గావించి తోడనె సుమిత్రచరణంబులకుం బ్రణమిల్లె లక్ష్మణుండును రాముని యట్ల కౌసల్యకుం బ్రణామంబు లాచరించి నిజజనని యగుసుమిత్రచరణంబులు శిరంబు సోఁకఁ బ్రణమిల్లె నప్పు డద్దేవి దుఃఖించుచు నిజనందనుం డగులక్ష్మణునిశిరంబు మూర్కొని ప్రేమాతిశయంబున ని ట్లనియె. 851

మ. క్షితి నెవ్వాఁ డెడఁబాయ కెప్పుడును ర క్తిన్ జ్యేష్ఠు సేవించువాఁ
డతులశ్రేయము నొందుఁ గావున సముద్యత్ప్రీతితో నీవు న
ద్భుతచారిత్రకుఁ డైనరామునిఁ బదాంభోజాత సంసేవనా
రతిచే నెప్పుడుఁ గాచు చుండుము మహారణ్యంబునం బుత్రకా. 852

వ. పుత్రా నీవు సుహృజ్జనంబునందుఁ బరమానురక్తుండ వైనను వనవాసంబుకొఱకు నాచేత విసృష్టుండ వై తివి రామసేవయం దనవధానంబు గావింపకు మతండు రాజ్యాభావంబున వ్యసని యైనను రాజ్యప్రాప్తిచేత సమృద్ధుం డైనను నీకుఁ బరమగతి యై యుండు నెవ్వండు జ్యేష్ఠవశగతుం డై వర్తించు నతనికిఁ బరమశ్రేయంబు ప్రాప్తం బగు నిక్ష్వాకుకులంబునం బుట్టినవారికి దానంబును యజ్ఞంబులయందు దీక్షయు జ్యేష్ఠానువర్తనంబును రణంబులయందుఁ దనుత్యాగంబును బితృవాక్యకరణంబును సనాతనధర్మంబు గావున రాముని సేవించుచు వనంబునకుం జను మని పలికి వనవాసంబునందుఁ బితృమాతృనగరస్మరణంబున మనశ్చాంచల్యంబు గలుగునో యని శంకించి తత్పరిహారంబుకొఱకు వెండియు ని ట్లనియె. 853

తే. తనయ శేఖర రాముని దశరథునిఁగ, గహ్వరీపుత్రికను నన్నుఁ గాఁగ దండ
కాటవి నయోధ్యఁగా హృదయమున నెఱిఁగి, భూరిసుఖలీలనడివికిఁ బోయిరమ్ము.

వ. అని పలికి మఱియును. 855

తే. రాజనందన దశరథు రామునిఁగను
నన్ను జనకాత్మజను గాఁగ నయముతో న
యోధ్య నటవిఁగాఁ దలఁచుచు యుక్తభంగి
నన్నతోఁ గూడి చనుము ఘోరాటవులకు. 856

తే. దశరథకుమారరాము మాధవునిఁ గాఁగ, జనకపుత్రిని క్షీరాబ్ధితనయఁ గాఁగ
భూరిగహనంబు వైకుంఠపురము గాఁగ, నెఱిఁగి సుఖలీల వనమున కరుగుమీవు.

వ. మఱియు సపరిచారకాపరిచారకు లగుగురువులయందు దెవ్వండు ననువర్తించు
టకుం దగియెడువాండనియు నైహికసుఖరాజ్యభోగపారలౌకికజ్యేష్ఠాను
వర్తనధర్మములయందు దెయ్యది గరీయంబనియు విచారించుచు నరణ్యంబునకుం
బోయి రమ్మని పలికి దీవించి సముచితప్రకారంబున వీడు కొల్పె నప్పుడు
సుమంత్రుండు వినీతుండును వినయజ్ఞుండును బ్రాంజలియునై మాతలి యింద్రు
నిం బోలె రామభద్రు నవలోకించి మహాత్మా నీకిష్టం బైనచోటికిం గొని
పోయెద నీరథం బారోహింపుము కైకేయి వనంబున కిప్పుడే చనుమని పలికెం
గావున నద్దేవిచేత నియోగింపంబడినచతుర్దశవర్షపరిమితవనవాసవ్రతంబు
నారంభించుట కిదియె మొదలని పలికె నప్పుడు రామునిచేత ననుజ్ఞం గొని
సీతాదేవి సూర్యసంకాశం బైనకాంచనరథం బెక్కె నాసమయంబున. 858

—సీతారామలక్ష్మణులు రథారూఢులై తరలుట.—

క. వనవాసమునకు వేడుకం, దనవిభునిం గూడి యరుగం దలంచినధాత్రీ
తనయకుం గృపచే దశరథ, మనుజపతి యొసంగె వస్త్రమణిభూషణముల్. 859

వ. అంత రామలక్ష్మణులు దివ్యాయుధపరిష్కృతంబులును దివ్యఖడ్గకవచసమన్వి
తంబును జామీకరవిభూషితంబు నగునమ్మహారథం బారోహించి రిట్లు
మువ్వురు సముచితప్రకారంబున రథారోహణంబుం జేసినం జూచి సుమం
త్రుండు యుగ్యంబులపగ్గంబులు వదలి యతిత్వరితగమనంబునం దోలిన నది
మిన్ననం జనుభానునిరథంబు తెఱంగున దుర్నిరీక్షం బై పోవుచుండె నప్పుడు
రామునివనప్రయాణంబుం జూచి పురంబునం గలబాలవృద్ధజనంబులును
గజాశ్వాదికంబులును నుత్సవార్థం బరుగుదెంచిన జానపదులును మూర్ఛా
క్రాంతులై హాహాకారంబుల విలపించిన నయ్యాక్రందనస్వనంబును హయ
శింజితనిర్ఘోషంబును గుపితమత్తద్విపబృంహితంబులును బురంబు నిండి చెలంగె
నప్పుడు పౌరులు బాలవృద్ధసహితంబుగా దుఃఖపీడితు లగుచు రథంబు వెను
కొని బాష్పపూర్ణవదనులై యఱ్ఱు లెత్తి సుమంత్రు నుద్దేశించి యిట్లనిరి.

తే. విమలచారిత్ర హరులపగ్గములు పట్టి
మందగతిం దోలు మయ్య యీస్యందనమ్ము
రామచంద్రునిమోము నేత్రములకఱవు
దీఱం గని సంతసంబు నొందెదము గాని. 861

వ. అని పలికి మఱియును. 862

తే. దేవగర్భసమానుండు ధీరవరుండు
రాజసమ్మతుం డైనయీరాముం డడవి
కేగం గనుంగొని కౌసల్య హృదయ మగల
దాయసాకృతి గాంబోలు నకట తలంప. 863

క. ఈయవనికన్య రాముని, ఛాయపగిది ననుసరించి ననురసబుద్ధిం
బాయక గొల్చుచు వనవా,సాయాసము నోర్చి ధన్య యయ్యెడుఁ జుమ్మీ.

క. ప్రియవాది యైనరాముని, నయ మొప్పఁగఁ గొల్చి లక్ష్మణకుమారుఁడు దా
భయదాటవికిం బోవ హృ,దయమునఁ దలపోయుకతన ధన్యుం డయ్యెన్.

ఆ. రాజపూజ్యుఁ డైనరామభద్రుని భక్తి
ననుసరించి ఘోరవనికిఁ బోవు
టదియ పరమసిద్ధి యదియ మహోదయం
బదియ స్వర్గమార్గ మదియ హితము. 66

వ. అని పెక్కుచందంబుల దీనస్వరంబున విలపించుచుఁ గన్నీరు నించుచు రాముని రథంబు వెనుకొని చను చుండి రట దశరథుండు భార్యాసహితుం డై శోకావేశంబున రామునిం జూడఁ జనియెద నని మందిరంబు వెడల గమకించి యగ్రభాగంబునఁ బురుషకుంజరంబు నిరుద్ధం బగుచుండఁ గరేణువులు దుఃఖించిన తెఱంగున రోదనంబు సేయు నంతఃపురస్త్రీలమహాధ్వని విని ఖిన్నుం డై రాహుగ్రస్తుం డైనచంద్రునిచందంబున నొప్పి యుండె నంత రఘుపుంగవుండు రథంబు రయంబునం దోలు మని యాజ్ఞాపించిన సుమంత్రుం డట్ల కావింప రథచక్రక్షుణ్ణసముద్భూతమహీపరాగపటలంబు నీరంధ్రంబుగఁ గప్పినఁ బౌరజనలోచనగళద్బాష్పధారాసారంబున నది యడంగినఁ బదంపడి సకలజనంబులు దుఃఖపీడితు లై హాహాకారంబులతోడ విలపించి రప్పుడు మీనసంక్షోభచలితంబు లగుపంకజంబులవలనం దొరఁగుసలిలంబునుం బోలెఁ గామినీనయనంబులవలన నాయాససంభవంబగు బాష్పజలంబు సాంద్రంబుగాఁ గురిసె నంత మహీనాథుం డేకచిత్తగతం బైనపురంబు నాలోకించి దుఃఖాతిశయంబున ఛిన్నమూలం బైనపాదపంబుమాడ్కి ధరణిపయిం బడియె నప్పుడు పౌరజనంబులు భృశదుఃఖితుం డైనదశరథు నవలోకించి రామునిరథంబు వెనుకొని యుచ్చైర్నాదంబున హాహాకారంబులు సేయుచుం జను చుండిరి యంతఃపురకాంతలు రామలక్ష్మణజానకీకౌసల్యలం బేర్కొని యెక్కుపెట్ట నార్తనాదంబున రోదనంబుఁ గావించి రమ్మహాధ్వని విని రాముండు మరలి చూచి విషణ్ణుం డైన జనకుని భ్రాంతచిత్త యైనజనయిత్రి నవలోకించి తదీయదుఃఖాతిశయంబు సహింపం జాలక తోత్త్రార్దితం బైనమహాద్విపంబుచందంబున సంతప్తచిత్తుం డై పాశబద్ధం బైనబాలాశ్వంబుపోలికఁ దల్లి నుద్దేశించి ధర్మపాశబద్ధుం డై సంకుచితదర్శనవ్యాపారుం డయ్యె నప్పుడు సుమంత్రుండు రామప్రచోదితుం డై రథంబు రయంబునం దోలిన నవ్వేగిరపాటునకుఁ దలంకుచు సీతారామలక్ష్మణులం బేర్కొని దుఃఖించుచుఁ గన్నీరునించుచుఁ గౌసల్యపుత్రవత్సలయగుటం జేసి రామవియోగంబు సహింపంజాలక గృహబద్ధవత్స యైనగోవు గృహంబు

నకుం బోవుపగిది దుఃఖపరిత్రస్తయై రామునిరథంబు దెసకుం బాఱె నట్లు గృహంబు నిర్గమించి రోదనంబు సేయుచు వాతాందోళితపవనలతభంగి నడలుచు వచ్చుచున్న నమ్మహాదేవి నచ్చటివారక్షకంబు వచ్చి మరల్చిన మరలం జాలక విలపించుచుండె. నయ్యవస్థ విలోకించి రాముండు పరమదుఃఖితుండై మరలి మరలి చూచుచుం బోవుచుండె నప్పుడు నిలు నిలు మని పలుకుదశరథునివాక్యంబును రథంబు రయంబునం దోలు మనియెడు రామువాక్యంబును విని సుమంత్రుండు యెద్దియుం జేయనేరక చక్రమధ్యంబునం జిక్కినపురుషునిచందంబున దశరథరామవచనమధ్యంబునం జిక్కి యాందోళించుచున్నం జూచి రాముండు.

-ఈ రాముండు సుమంత్రుని రథమును వేగముగఁ దోలు మనుట. ఈ-

క. బరువడిఁ దనమదిలో నిస్తుంగతి ననుభూయమానశోకంబునకుం
జిరకాలావస్థానము, కర మిది దుస్సహ మటంచు గణుతించి తగన్. 868

వ. సుమంత్రు నవలోకించి. 869

ఆ. ఏను మాటిమాటి కిటు నిల్వు మనఁగ నా,మాట వినక పోవ మంచిదగు నె
యనుచు రాజు నిన్ను నాడిన రాముండు, వినఁగ నొల్లఁ డయ్యె నని వచింపు.

మ. ధరణీశుం డెడఁబాయలేక మనలన్ దాక్షిణ్యవిస్ఫూర్తిచే
మరలం జీరుచు నున్నవాఁడు మనకు న్మర్యాద గా దట్టి సేఁ
త రథంబు న్వెసఁ బోవ నిమ్మనిన నాతం డట్ల కావింపఁ ద
త్తురగవ్రాతము వాయులీలఁ జనియెన్ ధూళిప్రతిచ్ఛన్నమై. 871

వ. ఇట్లతిత్వరితగమనంబునం బోవుచుఁ దన్నుం గూడి వనంబునకుం బఱతెంచెద మని ప్రార్థించుచు వచ్చువారి సామంతబాంధవమంత్రిసంఘంబుల నంతఃపురజనంబుల నుపజీవిసహస్రంబుల భృత్యులఁ బౌరజానపదజనంబుల నిలువ నియమించిన వారంద ఱు బాష్పధారాపూరితముఖులై యతనిశాసనంబు నుల్లంఘింపం జాలక నంత నంత నిలువంబడియుఁ జిత్తవృత్తులం గ్రమ్మఱింపం జాలక రథమార్గసక్తవీక్షణులై యుండిరి పౌరజనంబు మరలక వెంటం బోవుచుండె నప్పుడు పుత్రవియోగసంజాతశోకంబునం బెటలిపడుచున్నదశరథు నవలోకించి శాస్త్రార్థకథనంబున ననూనయించుచు మంత్రిపుంగవు లిట్లనిరి. 872

క. జననాథ యేమి వగచెదు, తనయుఁడు దూరంబు చనియెఁ దడయక మరల
న్జనుదెంచినపుత్త్రునిఁ గని, మనమున నలరుదువు గాక మననం బేలా. 873

వ. మఱియు నెవ్వనిపునరాగమనం బిచ్ఛయింపంబడు నతని దూరం బనుగమింపఁ జన దని యాశ్వాసించిన విని యప్పుడమిఱేఁడు ప్రస్విన్నగాత్రుండై విషణ్ణముఖుండై చేయునది లేక కన్నీరు నించుచు రామరథమార్గగతవీక్షణుండై యుండె నంత నంతఃపురకాంతలు పరమచింతాక్రాంతస్వాంతలై యార్తనాదంబులు సెలంగఁ దమలో నిట్లనిరి. 874

-:o:- అంతఃపురస్త్రీలు రామువివాసనంబునుం గూర్చి విలపించుట. -:o:-

క. దిక్కెవ్వఁడు దుర్బలులకు, దిక్కెవ్వఁ డనాథులకు నధీరజనులకుం
దిక్కెవ్వఁ డట్టినాథుం, డొక్కఁడ నేఁ డెందుఁ బోవుచున్నాఁ డకటా. 875

క. ఎంత యభిశప్తుఁ డైనను, బంతంబునఁ గ్రోధకరణపరివర్జితుఁ డై
సంతత మనుగ్రహమె మది, నెంతయుఁ జింతించు నాథుఁ డెం దరిగెడినో.

తే. ఏమహాత్ముఁడు తనతల్లి నెట్లు గొలుచు, న ట్లనారత మధికభక్త్యాదరముల
మనల సేవించు నట్టిక్షమాసుతాధి,వల్లభుం డెందుఁ జనుచున్నవాఁడు నేఁడు.

తే. మఱియుఁ గైకేయిచేఁ గ్లిశ్యమానుఁ డైన
యవనిపతిచేఁ బ్రచోదితుం డగుచు నెవ్వఁ
డఖిలజనులకు రక్షకుం డట్టిరాముఁ
డుగ్రకాననమున కేగుచున్నవాఁడు. 878

తే. అకట దుఃఖాభిసంతప్తుఁ డయ్యె రాజు, సత్యధర్మవిచారుండు సర్వసముఁడు
సూరినుతుఁ డైనరాముఁడు ఘోరవనికి, నొంటిఁ బోవఁ గనుంగొనుచున్నవాఁడు.

వ. అని బహుప్రకారంబుల వివత్స లగుధేనువులచందంబున విలపించుచు రోదనంబుఁ జేసిన ఘోరం బైనయయ్యార్తధ్వని విని పుత్రశోకాభిసంతప్తుం డైన మహీవరుం డినుమడిగా దుఃఖించుచుండె నప్పుడు పట్టణంబునం గలగృహమేధు లగువిప్రు లగ్నిహోత్రకృత్యంబులు నన్నపానాదికృత్యంబులు మఱచి తెచ్చవడి యుండిరి రామశోకకర్శితుం డైనవాఁడుపోలె సూర్యుం డస్తమించినట్లుండె మృగాశ్వకుంజరధేనుకదంబంబులు కబళంబులకుం బాసి కన్నీరు నించుచు వత్సంబులం గైకొనకుండె నంగారకుండును త్రిశంకుండును బుధబృహస్పతులును దక్కిన గ్రహంబు లన్నియు వక్రగతిచేత సోము నాక్రమించి దారుణంబు లయి యుండె విశాఖాప్రభృతినక్షత్రంబులు దారుణగ్రహపీడితము లై పొగ లుమియుచు మార్గంబునకుం దప్పి యుండె మేఘంబులు వాయుహతంబు లై సముద్రంబుసం బడుచుండె మఱియు సకలజంతుస్వాంతసంచారచతురుం డైన రాముండు వనంబునకుం జను చుండ నగరంబు వాలికానిలవేగంబున నుత్థితం బైనసముద్రంబు భంగిఁ జలించినట్లయ్యె హరిదంతంబులు తిమిరసంవృతంబు లై పర్యాకులంబులయ్యెఁ బట్టణంబునం గలసర్వజనంబులు గుంపులుకట్టి కటకటా యనువారును నింతపుట్టునె యనువారును నింక నేమి గల దనువారును దశరథుం డెంత కఠినాత్ముం డయ్యె నను వారును నింతకుం గారణంబు పాపాత్మ యైనకైకేయి గదా యనువారును దైవంబునుం దిట్టువారును సతీసుతబంధుమిత్రులయందు మమత్వంబు విడిచి గృహకృత్యంబులు దలంపక రాముని మంగళగుణకీర్తనంబు సేయుచు నిరానందు లై కన్నీరు నించుచు బహుప్రకారంబుల విలపించువారు నై యుండిరి పవనుండు శీతలుం డై వీవకుండెఁ

జంద్రుండు సౌమ్యదర్శనుండు గా కుండె సూర్యుండు తపింపకుండె మఱియుఁ బౌరులు పుత్త్రమాతృభార్యాభర్తృభ్రాతలయెడఁ బరస్పరస్నేహంబు విడిచి రామునే చింతించు చుండిరి రాముని సుహృదు లందఱు శోకభారాక్రాంతులై మూఢచేతస్కులై మూర్ఛిల్లి పుడమిపయిం బడి యుండిరి సాగరసరిద్ద్వీపవనశైలసహితంబుగా మహి యెల్ల సంచలించె నప్పుడు. 880

క. అనఘాత్ముఁడై నరాముఁడు, జనకజతోఁ గూడి వనికిఁ జని యెడుతఱిఁ జే
తనములు దుఃఖించె ననం, బని లేదు జడంబు లెల్ల వ్రాన్పడి యుండెన్. 881

క. పొందుగ నరిగెడు రాముని, స్యందనగతచక్రయుగళసంజాతరజం
బెందాఁకఁ దోఁచె నుసువడి, నందాఁక నురల్పుఁడయ్యె నధిపుఁడు చూడ్కిన్.

చ. అనఘుఁడు పుత్త్రదర్శనమునందు మహాప్రమదంబు గల్గు నీ
మనుకులనేత కంచు గరిమం దలపోసి మహీపరాగ మా
మనుజపరేణ్యుఁ డెం దనుక మక్కువతోడ సుతు స్గుణాకరుం
గనుఁగొనుచుండె నం దనుక గాఢతరంబుగఁ బర్వె నత్తఱిన్. 883

తే రజముగనుపట్టునందాఁక రాజవర్యుఁ,డనఘునిఁగుమారుఁగనుఁగొనియంతకంత
కదియడంగినభూరిశోకార్తుఁడగుచు,మూర్ఛవైకొన నంతలోఁబుడమిఁబడియె.

వ. ఇట్లు మూర్ఛాపరవశుండై నేలం బడి యున్ననిజవల్లభునిం జూచి కౌసల్య దాపటను గైక వలపటం గ్రుచ్చి యెత్తి యాసీనుం గావించినం గూర్చుండి యమ్మహీపతి శోకంబు పెంపున వ్యథితేంద్రియుం డగుచుఁ గైకేయి నవలోకించి యి ట్లనియె. 885

—దశరథుఁడు కైకేయిని దూఱుట.—

క. ఓకలుషచిత్త నన్నుం, దాఁకకు నీకరము సోఁకఁ జేను వంతయు న
స్తోకగతి వాఁడినూదులు, సోఁకినయ ట్లార్తి నొంది స్రుక్కెం గడిమిన్. 886

వ. నీవదనంబుఁ జూడ నొల్ల నాకుఁ బత్నివిగావు బాంధవివి గా వని పలికి కోపం బగ్గలం బగుటయు నంత నిలువక. 887

క. సువిచారుఁడై నరాముని, నవిచారత నడవి కనిపినందున వంశ
ఘ్నివి బంధుఘ్నివి భర్తృఘ్నివి యైతివి నిన్నుఁ జూడ నేర్తునె యింకన్. 888

తే. జగదుపక్రోశితాచారసరణి నొంది, త్యక్తకులధర్మ వైతివి దానఁ జేసి
యాలి వని నమ్మఁజనునె నీయాననంబుఁ,గన్న ద్విజుఁ జంపినంతయఘంబురాదె.

చ. పురుషులచే ధరిత్రిపయిఁ బొల్పుగ నగ్నిసమక్షమందునం
గరము గ్రహింపఁగాఁ బడినకాంతలలోఁ బతికి న్నిరంతరం
బఱమఱ లేక ధర్మమును నర్థము కామముఁ గూడఁ బెట్టునే
ర్పరి వాక నీవె కాక కులపాంసిని వేఱొక తెందుఁ గల్గునే. 890

వ. తొల్లి వహ్నిసమక్షంబున ధర్మార్థకామంబులయందు నీతోడఁ జరించెద నని

పలికి భవత్పాణిగ్రహంబుఁ జేసితి నింక మీఁద నిహసౌఖ్యకరంబు లైన నీతోడిక్రీడాదివ్యవహారంబులును బరలోకసాధనంబు లైన నీతోడియగ్నిహోత్రాదికర్మంబులును బరిత్యజింపం గలవాఁడ నని పలికి వెండియు నిట్లనియె. 891

క. భరతుఁడు రాజ్యస్థుం డై, చిరభ క్తిని నాకుఁ బూజసేయుట కొఱకై
కర మెద్ది నొసఁగు నది నే, నరయుచు జన్మాంతరమున కయ్యేడు ననుచున్.

—దశరథుఁడు రాముని జేరొ్కని విలపించుట.—

వ. మఱియు భరతుండు సామ్రాజ్యంబుఁ జేకొని సంతుష్టుం డయ్యె నేనిమన్మరణానంతరంబున నతండు పితృప్రీత్యర్థం బెయ్యది యొసంగు నది మత్ప్రీతికొఱకుఁ గాకుండుం గాక యని యిట్లు కై కేయి నిందించుచు రాముని పిఱుందం బోవ నుద్యోగించిన నప్పుడు కౌసల్య పతి కష్టంబు వచ్చి మరల్చినం బ్రతిహతగమనుం డై కామాతిశయంబున బ్రాహ్మణుం జంపినవానియట్ల కరంబునఁ జిచ్చు సంటినవాని క్రియఁ గుమారునిం దలంచి సంతపించుచు రాహుగ్రస్తుం డై నభానునిచందంబున దీనవదనుం డై రథమార్గంబుఁ జూచి యెలుం గెత్తి రామునిం జేరొ్కనుచు నక్కుమారుండు పురం బతిక్రమించినం జూచి శోకవేగంబున ని ట్లని విలపించె 893

చ. అరదము దూర మయ్యె జవనాశ్వము లద్భుతవేగలీల బం
ధురగతిఁ బోవుచున్నయవి ధూళికతంబున నాకుమారకుం
డరసినఁ గాన రాఁడు తను నంతయు నేర్పఁ దొడంగె నింక నే
తెరువునఁ బోదు నెవ్వ రిఁక దిక్కొకటా విధి నేమిసేయుదున్. 894

చ. సరసపదార్థము ల్గుడిచి సన్నపుటొల్లియఁ గట్టి దీప్తహే
మరచితసౌధభాగముల మంజులశయ్యను బవ్వళించునా
వరసుతుఁ డాకలంబుఁ దిని వల్కముఁ దాల్చి మహీజమూలమం
దురుకఠినాశ్మతల్పమున నొప్పఱి యెట్లు వసించు నక్కటా. 895

తే. ధూళివృతదేహుఁడై యొప్పదొఱఁగిపురిమిం,నుండి ప్రస్రవణంబునందుండిమదగజంబునట్టు లుత్థితుఁ డయి చనెడుదీర్ఘ, బాహుఁ గాంత్రు రామునివనవాసు లెల్ల.

చ. అడవిఁ జరించునప్పుడు మృగారవము ల్వినువేళ నాఁకటఁ
దడఁబడువేళఁ గంటకపథంబున నేగెడువేళ నెండచే
బడలినవేళ నాకొడుకు భావమునందు ననుం దలంచి హా
యిడుములఁ బెట్టెఁ దండ్రి యని యించుకయైనఁ దలంప కుండునే. 897

క. జనకసుత యెంతఁ జెప్పిన, వినక మగనిఁ గూడి ఘోరవిపినంబునకుం
జనుచున్న పతిసుఖోచిత, మనమున దుఃఖించి యెంత మలఁగునొ యచటన్.

వ. గంభీరంబులును రోమహర్షణంబులు నగు శ్వాపదారవంబులు విని యెంత భయంపడునో యని విలపించి కై కేయి దిక్కు మొగం బై యి ట్లనియె.

చ. అకలుషచిత్తుఁ డంచితగుణాస్పదుఁ డైనసుతుండు కాననో
ర్వికిఁ జనియె న్మనంబు చెయిఁ బెట్టి గలంచినరీతిఁ జాలఁ ద్రి
ప్పుకొనఁ దొడంగెఁ బైపయిని మూర్ఛ ముసుం గిడు చున్న దిప్పు డం
బకములు గాన రావు ప్రసభంబున నంగము లార్తినొందెడిన్. 900

దశరథుండు కౌసల్యాసదనమున కరుగుట.

వ. నీవు విధవవై పతిపుత్త్రపరిత్యక్తం బైనరాజ్యంబు పాలింపు మని బహుప్రకారంబుల విలపించుచు నచ్చోట నిలువక యుపస్నాతునియట్లు నగరంబుఁ బ్రవేశించి శూన్యచత్వరవేశ్మాంతంబును సంవృతాపణదేవతాగృహంబును గ్లాంతదుర్బలదుఃఖార్తంబును వాత్యాకీర్ణమహాపథంబు నగుపురంబుఁ గనుంగొని దుఃఖించుచు సూతికాగృహంబునుంబోలెఁ గశ్మలంబై యున్నయంతఃపురంబు నకరిగి క్షోభించినమహాహ్రదంబుచందంబున సుపర్ణహృతం బైనపన్నగంబుకై వడి రామలక్ష్మణవైదేహీరహితం బై దిక్కఱి యున్నదాని నవలోకింప నొల్లక దౌవారికులం జూచి కౌసల్యాసదనంబునకు నన్నుం దోడ్కొని పొం డొండుచోట నీమనఃపరితాపంబు దీఱ దనిన వారు రయంబున వామదక్షిణపార్శ్వంబుల గ్రుచ్చి పట్టి దోడ్కొని చనిన నద్దేవిమందిరంబుఁ బ్రవేశించి తల్పంబునం దనువు వైచి యసంవృతమేదినిం బడి పొరలుచు నడలూనినచిత్తంబున భుజం బెత్తి దీర్ఘస్వరంబున రోదనంబు సేయుచుఁ బెక్కువిధంబులఁ గుమారునిగుణంబు లగ్గించుచుఁ బుత్త్రవియోగసంజాతశోకానలంబునం గాఱియపడు చుండ రాత్రిసమయం బయ్యె నారాత్రి దశరథునిపాలికిఁ గాళరాత్రి యై తోఁచె నప్పు డన్నరపతి కౌసల్య కిట్లనియె. 901

మ. అతివా రామునివెంటనంటినమదీయాలోక మాశానుష
క్తి తదీయాకృతిపై రమించుచును దృష్టిం జెంద కీవేళకున్
ధృతిచేఁ గ్రమ్మఱ దట్లు గావున నిను న్వీక్షింపఁగాఁ జాల స
మ్మతిచే నీదుకరంబునం దనువు సంభావింపుమా యుత్తమిన్. 902

వ. అని నియోగించిన నద్దేవి రామగుణకథనపరవశుం డై తన్నామంబు నె పేర్కొను చున్నదశరథునిదురవస్థఁ జూచి బహుప్రకారంబుల నాక్రందనంబు సేయుచుఁ గన్నీరు నించుచు వేఁడినిట్టూర్పులు పుచ్చుచు శోకభారావసన్నుం డైనయమ్మహీపతిశరీరంబు పాణితలంబునఁ బరిమార్జించుచు ని ట్లనియె. 903

క. వీరోత్తమ రామునిపైఁ, గూరిమి యించుకయు లేక గుబుసము వీడన్
ఘోరవిషము గ్రక్కెడుక్రూ,రోరగిగతిఁ గైకఁ గనలుచుండుం గాదే. 904

కౌసల్య పుత్త్రునిఁ బేర్కొని విలపించుట.

ఆ. అట్టిదానిఁ గూడి యధిప నాకేగతిఁ, బూని పొత్తు మనఁగఁ బోలు నకట
క్రూరపన్నగంబు సేరిన యింటిలో నూహఁ జేసి మనుజు లుండ వశమె. 905

తే. తవిలి రామునిఁ గైకకు దాసునిఁగ నొ, నర్చవై తివి యటు లైన నగరమందు
భైక్షవృత్తిఁ జరించుచుభవనమందె, యునికిఁ జేసిన వీక్షించుచుండుదుఁ గద.

వ. మఱియు నాహితాగ్ని యగువానిచేత. దర్శపూర్ణమాసయాగపర్వంబునందు ప్రీహిగతతుషాజాలం బెట్లు రక్షోభాగత్వంబుచేత నిర్దిష్టం బగు నట్లు కైకచేత రాముండు స్వరాజ్యావస్థానంబువలనను స్వగృహావస్థానంబువలనను వినిపాతితుం డై యథేష్టంబుగా రాక్షసభాగత్వంబున వినియుక్తుం డయ్యె నని పలికి వెండియు నిట్లనియె. 907

క. గజరాజగమనుఁ డమల, ద్విజరాజముఖుండు వినుతవీర్యుండు భృత
ద్విజుఁ డగునాతనయుఁడు జన,కజతోఁ గూడి యెటు నిల్వఁగా నేర్చు వనిన్.

క. కట్టా కైకేయికిఁ గాఁ, బుట్టి యెపుడు దుఃఖములను బొందనివారిం
గట్టిఁడితనమున నిప్పుడు, నట్టడవికిఁ బంప నీకు న్యాయమె యధిపా. 909

వ. అని దూఱి వగచి యంత నిలువక. 910

చ. శగుణులు రూపవంతులు సుదంచితమూర్తులు రామలక్ష్మణు
ల్వరఫలకాలమం దటు వివాసితు లై రటు రత్నహీను లై
బరువడిఁ గందమూలఫలభక్షకు లై యలకాననంబులోఁ
గర మతిదీనవృత్తి నిలుఁ గానక నెట్లు వసింతు రక్కటా. 911

ఉ. తమ్ముఁడు ప్రీతితో బహువిధంబుల సేవ యొనర్చు చుండ నం
దమ్ముగ సీతఁ గూడి ప్రమదంబున నిష్టసుఖైకశీలుఁ డై
సమ్మతితో నయోధ్యఁ గల సర్వజనంబు నుతింప నాధిప
త్య మ్మొనరించుకాలము జనాధిప యెప్పుడు చూడఁ గల్గెడిన్. 912

వ. అని యోసపెంపునం బలికి వెండియు. 913

ఉ. క్రన్నన రామలక్ష్మణు లరణ్యము వెల్వడి వీటి కింకఁ దా
రెన్నఁడు వత్తు రిష్టసుఖ మెన్నఁడు గాంతురు భానుమత్కులం
బెన్నఁడు తేజ మొందు మనుజేశ్వర మత్పృథుదుఃఖశోక మిం
కెన్నఁడు దీఱు బంధుజను లెన్నఁడు గాంతు రనంతమోదమున్. 914

క. పంకజదళనయనుని నక, లంకేందుసమానముఖుని రమణీయగుణా
లంకృతుని నాకుమారుని, నింకవిలోకింపఁ గలదె యీజన్మమునన్. 915

క. వనవాసము సల్పి రయం,బునఁ దమ్ముఁడు గొల్వ సతిని మున్నిడికొని చ
య్యన మరల వచ్చురామునిఁ, గనుఁగొనుభాగ్యంబు నాకుఁ గలదో లేదో.

ఉ. పొందుగ రామలక్ష్మణులు భూమికుమారియు రాజవీథి నా
నందముతోడ రాఁ గని మనంబునఁ గోర్కులు పల్లవింపఁగాఁ
జందురుఁ గన్నయోషధులచందము నొంది పురీకులాంగన
బృందముఁ గట్టి ప్రీతిమెయి నెన్నఁడు గాంతు రభీప్సితార్థముల్. 917

ఉ. పన్నఁగ రాఘవుం డడవిఁ బాసి పురంబున కేగుదెంచి య
భ్యున్నతవైభవస్ఫురణ నుర్వికుమారికతోడ సౌఖ్యవా
రాన్నిధి నోలలాడుచుఁ దిరంబుగ రాజ్యము సేయుచుండ నా
కన్నులు చల్లగాఁ గని సుఖస్థితిఁ బ్రీతిఁ దనర్చు టెన్నఁడో. 918

మ. రమణీయోజ్జ్వలకుండలంబు లలర న్రాముండు సౌమిత్రి ఖ
డ్గము చాపంబును దాల్చి శృంగవదగాకారంబులం బొల్చుచుం
బ్రమదం బొప్పఁగ విప్రకన్యకలపుష్పంబు ల్ఫలంబుల్ గ్రహిం
చి మహార్ఘంబు ప్రదక్షిణంబుగఁ బురి న్సేవించు టెం కెన్నఁడో. 919

తే. ప్రాయమున శక్రతుల్యుండు ప్రజ్ఞచేతఁ, బరిణతుండు ధర్మజ్ఞుండు నిరుపమాన
తేజుఁ డగు రాముఁ డెపు డరుదెంచి నాఁడు, మ్రోలమూఁడేండ్ల బాలునిలీల నాఁడు.

సీ. నరనాథ తొల్లి నందనులు తల్లుల పాలుఁ గ్రోలునప్పుడు తదురోజములను
గప్పితిఁ గాఁబోలుఁ గాకున్నచో లేఁత దూడ గల్గినమంచి పాఁడిమొదవు
చందాన నధికవత్సలత నొప్పెడు నేను మృగరాజుచే గోవు పగిది భూరి
కల్మషమతి యైన కైకేయిచే ముద్దుకుమరునిఁ బాసి శోకమునఁ గుందఁ

తే. గావలసెఁ బుత్త్రుఁ డొక్కఁడె కాని వేఱె, యొకఁడు లేఁ డట్టి సుగుణాభియుక్తుఁ బాసి
యెట్లు బ్రతుకుదు శోకాగ్ని యేర్చుఁ దొడఁగె, నేమి సేయుదు నెద్దిదిక్కెందుఁ జొత్తు.

తే. రాజవర్య నిదాఘకాలంబునందు, నుత్తమప్రభుఁ డైనసూర్యుండు తిగ్మ
కరముల ధరిత్రినిం బోలె గాఢశోక, మేర్చుచున్నది యధిప నన్నెట్లు సైఁతు.

సుమిత్ర కౌసల్య నూఱడించుట.

వ. అని బహుప్రకారంబుల విలపించుచున్న కౌసల్య నవలోకించి యుపశమన
వాక్యంబుల ననూనయించుచు సుమిత్ర యిట్లనియె. 923

ఉ. మంచివివేకి వైతి విటు మానిని ప్రాకృతకాంతయట్ల దుః
ఖించెద వేల నీసుతునిఁ గేవలమర్త్యునిఁ గాఁ దలంచితో
కాంచనశైలధీరుఁడు వకల్మషబుద్ధి మహానుభావుఁ డ
భ్యంచితసద్గుణాభిరతుఁ డాతని కెందును గీడు గల్గునే. 924

మ. అతులాముష్మికసౌఖ్య మెంచి ఘనశిష్టాచారధర్మాధ్వసం
స్థితుఁ డై తుచ్ఛసుఖంబుఁ గోరక పితృస్నేహంబున న్మేదినీ
పతివాక్యం బొనరింపఁ బూని నయ మొప్పం గాన కేగె న్భవ
త్సుతుఁ డా నీతివిచారుఁ బాయుటకు నై శోకింపఁగా నేటికిన్. 925

మ. ముదితా లక్ష్మణుఁ డన్నకుం బ్రియుఁడు నా పుత్త్రుం డై తగన్ భక్తిఁ ద
త్పదపద్మంబులు గొల్చుచున్ ఫలము లుద్యత్ప్రీతి నర్పించుచున్
ముద మేపార నహర్నిశంబు శరియై మున్నాడి రక్షించుచుం
డ దవక్షోణి నివాస మాతనికి సంతోషంబుఁ గావించునే. 926

క. పతిసేవ సేయుతలంపున, క్షితిసుత ధర్మాత్ముఁ డైన శ్రీరాముని స
న్మతితో వెనుకొని విపిన, క్షితికిం జనుచున్న దేల చింతింపంగన్. 927

తే. తామరసనేత్ర సత్యంబు దమము శమము, నార్జవము శీలశౌచంబులతనియందె
సన్నివిష్టంబు లై యుండుజగములందుఁ, బరగఁ గీర్తిధ్వజంబును బాదుకొలిపె.

చ. అతనిప్రతాప మున్నతమహత్త్వము శౌచ మెఱింగి కానన
క్షితి నహిమాంశుఁ డంశువులచేతఁ దపింపఁగఁ జేయఁ జాలఁ డం
చికగతి గాడ్పు లేఁబవలు చిత్తహరంబుగ వీచు చుండు స
న్మతి జలజారి రాత్రుల నదుద్యుతి వెన్నెల గాయు నిత్యమున్. 929

మ. అనిలోఁ గూలిన శంబరాత్మజుని దైత్యశ్రేష్ఠు నీక్షించి చ
య్యన నెవ్వానికి భారతీప్రియుఁడు దివ్యాస్త్రంబు లర్పించె న
య్యనఘుం డాఘృణుఁడు రాఘవుండు నిజబాహాశౌర్యమే తోడుగా
వనదేశంబున నింట నున్నపగిదిన్ వర్తించు నిర్భీకుఁ డై. 930

క. భువి నెవ్వని శరపథముం, గనిసి పగతు లంతకాంతికస్థు లగుదు రా
రవికులపతిశాసనముం, దవని యెటులు నిల్వఁ బోల దంభోజాక్షీ. 931

తే. వనిత యెవ్వానిశౌర్య మవార్య మేవి,ఖ్యాతకల్మషు తేజంబు దుర్నిరీక్ష
మారఘుస్వామి వనవాసమర్థి సలిపి,యవలఁ గైకొను సామ్రాజ్యమది నిజంబు.

చ. ఇనున కినుండు నీశ్వరున కీశ్వరుఁ డగ్నికి నగ్ని కీర్తికి
న్ఘన మగుకీర్తి గహ్వరికి గహ్వరి లక్ష్మికి లక్ష్మి పెద్దవే
ల్పున కిలువేల్పు భూతములలో ఘనభూతము నీకుమారుఁ డ
య్యినకులనేతకున్ విమతు లెవ్వరు రాష్ట్రమునం బురంబునన్. 933

చ. మెలుపుగ లక్ష్మి తన్నధిగమింప మహీసుతఁ గూడి రాఘవుం
డిల కభిషిక్తుఁడై జనుల కేలిక గాఁ గలఁ డేల సందియం
బలికచ పౌరజానపదు లాతని కభ్యుదయంబుఁ గోరి ని
శ్చలమతి సర్వదేవతల సన్నుతి సేయుచు నున్నవా రొగిన్. 934

చ. అనుపమశోకవేగహతులై పురిలోఁ గలవార లెవ్వనిం
గనుఁగొని యశ్రుబిందువులు గాఱఁగ నేడ్చుచు నున్నవార లా
యనఘుఁడు లక్ష్మితోడ జనకాత్మజతోడ ధరిత్రితోడ సొం
పెనయఁగఁ గూడి రాజ్యమున కేలిక గాఁగలఁ డెన్ని చూడఁగన్. 935

తే. అంబురుహనేత్ర వల్కల మద్ది దాల్చి
వనమునకుఁ బోవు రామభద్రు నిపిఱుంద
జనకసుతమాడ్కి విడువక చనియె రాజ్య
లక్ష్మి యాతని కెద్ది దుర్లభము చెపుమ. 936

తే. చాపశరఖడ్గములఁ బూని శస్త్రభృత్వ,రెండు లక్ష్మణుఁ డుగ్రవీర్యుండు మ్రోల

నప్రమాదుఁడై ప్రోచుచు నడుగుచుండ, రామభద్రుని కెద్ది దుర్లభము చెపుమ.

క. వనవాసము సల్పి రయం,బునఁ గ్రమ్మఱ నరుగుదెంచి పొలుపుగఁ జరణం
బునకుఁ బ్రణమిల్లు రామునిఁ, గనుఁగొని మది సంతసించు కాలము వచ్చున్.

క. రమణీ మాదృశలను శో,కమున బడల కుండఁ దేర్పఁ గాఁ దగు నీ వి
క్రమమున శోకింపఁగ నిను, హిమకరముఖి దేర్చువార లెవ్వారిచటన్. 939

క. తరుణీ రామునికంటెను, బరుఁ డొక్కఁడు లేఁడు ధర్మపరుఁడు జగతిలో
నరుదార రాఘవునియం, దరసిన లేదించుకైన నశుభం బబలా. 940

వ. మహానుభావుం డగు రాముండు లక్ష్మణసహితుం డై యరణ్యంబుననుండి గ్రమ్మఱఁ బురంబునకుం జనుదెంచి సామ్రాజ్యపట్టాభిషిక్తుం డై జానకిం గూడి రోహిణీయుక్తుం డైనచంద్రునిభంగి వెలుంగుచు మృదుపీనంబు లగు కరంబులచేత భవచ్చరణంబులు సంస్పృశింపం జనుదెంచు నప్పు డీవు మేఘరాజి శిలోచ్చయంబునుం బోలెఁ బరమానందసంభూతబాష్పజలంబులచేత నక్కుమారశేఖరునిం బ్రోక్షించెదవు సత్యంబుగాఁ బలికితి శోకమోహంబులు విడిచి యూఱడిల్లు మని యిట్లు సుమిత్రాదేవి పూర్వజన్మకృతభగవదారాధనజనితసుకృతపరిపాకంబున శ్రీరామునిం బరమాత్మఁగా నెఱింగి వివిధవినయసాంత్వవాక్యోపచారంబుల ననేకప్రకారంబుల నాశ్వాసించిన నాసుమిత్రాదేవివాక్యం బాలకించి శరద్గతం బగునల్పతోయమేఘంబుభంగి నరదేవపత్ని యగునక్కౌసల్యాదేవిశరీరంబునందలి శోకంబు వినాశంబు నొందె నంత నిక్కడ. 941

చ. జనకుని మిత్రవర్గమును సర్వవిధంబుల విడుకొల్పి కా
ననమున కేగురాముని జనప్రియుఁ బాయఁగ లేక రక్తులై
పనివడి పౌరజానపదవర్గము బల్విడి నమ్మహాత్ముని
న్వనుకొని యెంతఁ జెప్పినను వీడక పోవుచు నుండి రత్తఱిన్. 942

తే. సముదితుం డైనపూర్ణిమాచంద్రుమాడ్కి, రామభద్రుండు సాకేతరాజధాని
పౌరు లగువారి కెల్ల నుదారసద్గు, ణాబ్ధి గావున సత్ప్రియుం డై తనర్చె. 943

రాముఁడు పౌరుల నూఱడించుట.

క. వనికిం జనపల దని చ,య్యన రాముఁడు వారిచేత యాచితుఁ డయ్యెన్
జనకుని సత్యాత్మునిఁ గాఁ, నొనరింపఁగఁ బూని నిలువ కొయ్యనఁ జనియెన్.

వ. ఇవ్విధంబునం బోవుచు నారఘువంశశేఖరుండు వారి నందఱఁ గరుణాతరంగితాపాంగవీక్షణంబుల నిరీక్షించి స్నేహయుక్తంబు లగుమంజులవాక్యంబుల నిజపుత్రులం బోలె ననూనయించుచు ని ట్లనియె. 945

తే. చెలఁగి మీరలు నాయందు సలుపునట్టి, భక్తిబహుమానగౌరవరక్తులను వి
శేషముగ భరతునిమీఁదఁ జేర్పుఁ డింక, మామనంబునకదియెనమ్మదమొసంగు.

చ. అతఁ డపరాజితుండును మహాత్ముఁడు గీర్తిరథుం డమర్షి ప్రా
జ్ఞతముఁడు పిన్నవాఁ డయిన జ్ఞానముచేఁ గడుఁ బెద్ద సాధుస
మ్మితుఁ డగుఁ గాన నింకఁ దగ మీ కనురూపకుఁ డైననాథుఁ డై
తతమతిచేఁ బ్రియంబును హితంబును జేయుచు నుండు నిచ్చటన్. 947

క. జనకునిపనుపున భరతుఁడు, ఘనరాజ్యపదస్థుఁ డయ్యెఁ గావున మన మ
య్యనఘునియానతిఁ గైకొని, యనిశము వర్తింపవలయు నతిశయబుద్ధిన్. 948

వ. కావున మీరు మత్ప్రీతికొఱకు నతం డెట్లు పరితపింప కుండు నట్లనూనయించుచు నతనియాజ్ఞ నుల్లంఘింపక మదాగమనంబుఁ గోరుచుఁ దద్వశవర్తు లై యుండుం డని పలికిన నప్పు డప్పురజనంబులు రామభద్రుం డెట్లు పితృవచన పరిపాలనరూపధర్మంబునందు సంస్థితుం డయ్యె నట్లు తదాధిపత్యంబుఁ గోరుచు నమ్మహాత్ము నుద్దేశించి విలపించుచుఁ గన్నీరు నించు చుండి రప్పు డారాముండు సౌమిత్రిసహితుం డై బాష్పపిహితలోచను లైనపురజనంబుల రజ్జువులచేతం బోలె స్వగుణంబులచేత నాకర్షించుచు నతిత్వరితగమనంబునం బోవుచుండ నప్పుడు వయోజ్ఞానతపోవృద్ధు లైనవిప్రులు వయఃప్రకంపితమస్తకు లై మిక్కిలి వృద్ధు లగుటవలన సమీపధావనాశక్తిచేత దవ్వులం జూచి రామునికృపావిశేషం బుగ్గడించుటకుఁ దదీయరథకీలితహయంబుల నుద్దేశించి యిట్లనిరి. 949

ఉ. రామరథప్రకీర్ణహయరాజములార సమీరసన్నిభో
ద్దామరయంబునం జనక దాశరథి న్వెసఁ గ్రమ్మఱింపుఁ డ
ట్లే మని బ్రాహ్మణోత్తమముఖేరితసూక్తిఁ దిరస్కరించినం
దా మదిలో సహింపఁ డతిధార్మికుఁ డౌట రఘూద్వహుం డొగిన్. 950

తే. అవనిలోఁ గర్ణవంతంబు లైనభూత, సంఘములయందు మిక్కిలి శ్లాఘనీయు
లట్లు గావున మీరు దయాసమృద్ధి, మా మనవి బుద్ధిఁ గైకొని మరలుఁడిపుడు.

చ. రవికులసార్వభౌమునిఁ బరాక్రమశీలుని రామునిం బురో
పవనవిహార మర్థి సలుపం గొని పోవుట మాని మీరు భై
రవతరసింహముఖ్యమృగరాజివిరాజిత మైనదండకా
టవి కిటు సాహసంబునఁ గడంగి వెసం గొని పోవఁ జెల్లునే. 952

విప్రులందఱు రాముని వనమునకుఁ బోవలదని ప్రార్థించుట.

వ. అని యిట్లు విలపించు చున్నయావిప్రవరులదీనాలాపంబు లాలకించి రాముండు బ్రాహ్మణవాక్యశ్రవణానంతరంబున రథగమనంబునందు దోషం బగు ననియును బ్రాహ్మణాశ్వాసనంబున వ్రతభంగం బగుననియును దలంచి రథంబు డిగ్గి తదాగమనపర్యంతంబు సన్నికృష్టపదన్యాసుం డై చారిత్రవత్సలుండు గావున బ్రాహ్మణులయం దతివిశ్వాసంబువలనఁ దాను రథారూఢుండై యుండి

పదాతు లయినవారలఁ గ్రమ్మఱింప నుచితంబు గా దని నిశ్చయించి పాద సంచారంబున వనపరాయణుం డై మెల్లనం బోవు చుండె నప్పు డారఘుపుంగ వుని డాయం జని యావృద్ధవిప్రులు సంతప్తాంతఃకరణు లై యిట్లనిరి. 953

సీ. అనఘాత్మ నీమంగళాకృతిఁ జూడక యొకనిమిషం బైన నోర్వలేమిఁ
జేసి నీమృదువాగ్విశేషంబుచే బహూకృతుల మై వనభూమి నతిసుఖాబ్ధి
నలరుచు నుండెద మనునాసపెంపున వచ్చుచు మ్మిటఁ బ్రోచి పుచ్చి నీకుఁ
బోవంగఁ జెల్లునె భూతదయాళుండ వైననీవె దయావిహీనబుద్ధి

తే. ద్విజవరోపేక్షఁ జేసిన వేఱె యొకఁడు, కడఁగి రక్షింపఁ గలవాఁడుగలఁడె జగతి
నకట యాచంప మైన నిన్నధికధర్మ, నిష్ఠుఁ డని సూరిజను లాడనేర్తు రెట్లు

వ మఱియు బ్రహ్మసంబంధిసకలమంత్రతంత్రజ్ఞానోపయోగానుష్ఠానరూపంబులైన యస్మదీయకర్మంబులును బాత్రారణిద్వారంబున ద్విజస్కంధాధిరూఢంబు లైనగార్హపత్యాహవనీయదాక్షిణాగ్నులును గాతుకాతిరేకంబున ననుసరించి వచ్చుచున్నయవి వాజపేయసముత్థితంబు లైనయస్మదీయపాండురచ్ఛత్రంబులు శరన్మేఘంబులభంగి వెలుంగుచు నివియే వెనుకొని యరుగుదెంచు చున్న వీయాతపత్రంబులచేత ననవాప్తచ్ఛత్రుండ వైన నీకు రవికిరణంబుల వేఁడిమి సోఁకకుండ నీడఁ గావించెదము వేదమంత్రానుసారిణి యగు నస్మత్పరమధన భూతంబు లైననస్మద్బుద్ధి భవన్నిమిత్తంబు వనవాసానుసారిణిగా నొనర్పంబడి యె వేదంబులు మాహృదయంబులయంద యున్నవి పాతివ్రత్యరక్షిత లగు నస్మత్పత్నులు గృహంబులయంద నిలువంగలరు భవన్నివర్తనంబునం దస్మద్బు ద్ధి సునిశ్చిత యయ్యె నింక నీవు వనగమననిశ్చయంబు సేయం జనదు ధర్మపరా యణుండ వైననీవ బ్రాహ్మణప్రార్థనాచరణరూపధర్మనిరపేక్షుండ వగుచుండ నింక ధర్మం బెత్తెఱంగునం బవర్తిల్లు నిభృతాచారుండ వైననీవు హంస శుక్లశిరోరుహంబులును మహీపతనరజోహ్యస్తంబులు నగుమాశిరంబులచే యాచితుండ వై మరలు మని పలికి వెండియు నిట్లనిరి. 955

చ. రవికులవర్య రమ్ము నగరంబునకుం జనుదేర వేని భూ
దివిజులు త్వద్వియోగజవితీర్ణమహావ్యసనాభిపన్ను లై
తవిలి ద్విజార్హ్యయాగము లుదంచితభక్తి నొనర్ప రందున
న్నవనవిఘాత దోష మది సంగత మయ్యెడు నీకుఁ జూడఁగన్. 956

క. వినుము చరాచరభూతము, లనఘాత్మక భక్తియుతము లై దైన్యముప
న్నినుఁ బ్రార్థించుచు నున్నవి, సునిశితముగ భక్తులందుఁ జూపుము కరుణన్. 957

—రాముండు తమసాతీరంబుఁ జేరుట.—

వ. మఱియు నఖిలజనహృదయనయనానందకరుండ వైననిన్ను విడువం జాలక నీవెంటం జనుదెంచు చున్నయస్మదాదిపురజనుల భాగ్యంబు నాలోకించితాము

ను వెనువెంటం బోవ గమకించి మూలంబులచేత హతగమనవేగంబులై పురజనులకుం బోలేదమకు రామానుయానభాగ్యంబు లేదయ్యె నని చింతించి వాయువేగంబుచేత నాక్రోశించు చున్నవానియట్ల చూపట్టుచున్నమహోన్నతంబులైన పాదపంబులను నాహారసంచారంబులు మాని చేష్టలు దక్కి వృక్షైకస్థాననిష్ఠితంబులై సర్వభూతానుకంపి వైననిన్నుఁ బ్రార్థించుచున్నఖగంబులను విలోకింపుమని యిట్లుబహుప్రకారంబుల దుఃఖించు చున్నయావిప్రోత్తములదీనాలాపంబు లాలించి కల్యాణగుణాభిరాముం డైనరాముని నివారించుట కడ్డంబు వచ్చెనో యనం దమసానది యాసన్నం బయ్యె నప్పుడు సుమంత్రుండు మార్గపరిశ్రాంతంబు లైనహయంబులఁ దెచ్చి యమ్మహానదీజలంబులఁ గడిగి మృదుమధురఘాసంబు మేపి తద్రక్షణంబునకుం జాలియుండె నిట్లు రమ్యం బగుతమసాతీరంబు నాశ్రయించి రాముండు సీత నవలోకించి లక్ష్మణున కిట్లనియె. 958

క. అనఘ రవి యస్తమించెను, వనవాసంబునకు నొక్కవాసర మయ్యెన్
మునుపటివలె నీవు మనం, బున గృహసౌఖ్యాదివాంఛఁ బొందకు మింకన్.

క. పగ లెల్ల నడవిఁ గ్రుమ్మరి, ఖగమృగములు తమకు వలయు కందువలందుం
దగురీతిఁ జేరినందున, సుగుణాఢ్య వనములు గంటె శూన్యము లయ్యెన్.

క. విను మిప్పు డయోధ్యాపుర, జను లందఱు బాలవృద్ధసహితంబుగ నె
మ్మనమున నడలుచు నుండుదు, రనఘా మనరాకఁ దలఁచి యంధులభంగిన్. 961

క. అనుపమసద్గుణములచే, ననవరతము విషయవాసు లవనిపతికిఁ
మనకు భరతశత్రుఘ్నుల, కనురక్తులు గారె వారి కడలు జనించెన్. 962

క. జననీజనకులు సారెకు, వనగమనముఁ దలఁచి తలఁచి వారక మదిలో
ఘనశోకంబునఁ గుందుదు, రనఘాత్మ తదార్తి కాత్మ నడలెదఁ జుమ్మీ. 963

ఆ. అయిన నేమి భరతుఁ డఖిలధర్మవిదుండు, కరుణ జేసి యేల గావ కుండు
నతనిభక్తిభావ మరసి డెందంబునఁ, గుంద కున్నవాఁడఁ గొంతధృతిని. 964

వ. మఱియు నన్ననుసరించి వనంబునకుం జనుదెంచుటం జేసి నీవుచితం బాచరించితివి వైదేహీరక్షణార్థంబునందు సహాయత సంపాదనీయంబు గదా నేఁడు వనవాసోపక్రమదివసం బీతమసాతీరంబు మహాక్షేత్రంబు గావున నీరాత్రి జలపానంబుఁ జేసి యిచ్చట నుపవాసంబు సేయుద మని పలికి సుమంత్రుం జూచి నీ వశ్వరక్షణంబునం దప్రమత్తుండ వై యుండు మని నియమించిన నతం డయ్యశ్వంబుల బంధించి సమృద్ధఘాసవంతంబులఁ గావించి ప్రత్యాసన్నుండై సంధ్య నుపాసించి మంజుపల్లవంబులఁ దల్పంబుఁ గావించిన నారఘువరుండు కృతానుష్ఠానుం డై సీతాసహితంబుగా సుమంత్రవిరచితపల్లవతల్పంబు నధివసించెఁ బురజనంబులు మార్గాయాసఖేదంబున మైమఱచి నిద్రించు చుండి రంత లక్ష్మణుం డన్నదిక్కుఁ గనుంగొని సూతునితో ననేక

ప్రకారంబులఁ దదీయకల్యాణగుణవిశేషంబులు వక్కాణించుచు నిద్రాసుఖంబులు విడిచి జాగరూకత్వంబున నప్రమత్తుం డై రక్షించుచుండె నిట్లు గోకులాకులతీరం బైనతమసానదితీరంబున నారాత్రి వసియించి యరుణోదయకాలంబున రాముండు మేల్కని నిద్రించు చున్నప్రకృతిజనంబుల నవలోకించి పుణ్యలక్షణుం డైనలక్ష్మణున కిట్లనియె. 965

క. అనఘా చూచితె యీపుర, జను లెంతయు మనల విడువఁజాలక వనికిం జనుదెంచెద మని కుతుకం, బునఁ బడి యున్నారు వృక్షమూలములందున్.

క. ఉడుగుఁ డని యెంతఁ జెప్పిన, నుడుగరు పల దనుచు నింక నొత్తి పలికినం గడువడిఁ దమప్రాణంబులు, విడిచెద మని యున్నవారు వెఱ్ఱితనమునన్. 967

ఆ. వీ రెఱింగి రేని విడువక నునవెంట, నరుగుదెంతు రదియు భరము గానఁ గడఁగి నిద్ర లేచుకంటె ముంగల మన, మరద మెక్కి పోద మతిరయమున.

రాముఁడు నిద్రితు లగుపౌరుల వంచించి వనమున కరుగుట.

వ. మఱియు నీ యిక్ష్వాకుపురవాసులు నాయందనురక్తు లై నన్ను విడువంజాలక వృక్షమూలంబుల నాశ్రయించి నిద్రించు చున్నవారు గావున వీరల వంచించి చను టొప్పు వీ రరణ్యంబునందు సంచరించుచు నిడుమలఁ గుడువం జాల రని పలికిన సాక్షాద్ధర్మస్వరూపుం డైనరామునిం జూచి లక్ష్మణుండు దేవా యిదియే నాకుం జూడ యుక్తం బై తోఁచు చున్న దట్లు గావింపు మనిన నారాముండు సుమంత్రుం జూచి రథంబు రయంబున నాయితంబు గావింపు మనవుడు నతండు జవసత్వసంపన్నంబు లై నహయంబులం బూన్చి సజ్జంబుఁ జేసి తెచ్చిన నారఘుపుంగవుండు సీతాలక్ష్మణసహితంబుగా రథారోహణంబుఁ జేసి యమ్మహానది నుత్తరించి మహామార్గంబు నాశ్రయించి శీఘ్రంబునం బోవుచుఁ బురజనమోహనార్థంబు సుమంత్రు నవలోకించి మనపోయిన తెఱంగు పౌరు లెఱుంగ కుండు విధంబున నీవు కొంతదూరంబు రథం బయోధ్యాపురంబున కభిముఖంబుగాఁ దోలి గ్రమ్మఱ వనమార్గంబునకు మరల్పు మనిన నతం డట్ల కావించి క్రమ్మఱ రథంబుఁ దోలుకొని రామునికడకుం జనుదెంచిన నమ్మహాత్ముండు సీతాలక్ష్మణసహితంబుగా సపరిచ్ఛదం బై నరథం బెక్కిన నాసుమంత్రుండు తపోవనమార్గంబుఁ బట్టి హయంబుల రయంబునం దోలిన నవి వాయుజవంబునం బోవుచుండె నిట్లు రాముండు జానకీలక్ష్మణసహితంబుగా రథారోహణంబుఁ జేసి ప్రయాణానుకూలమంగళసూచకనిమిత్తదర్శనార్థం బొక్కింత రథం బుదఙ్ముఖంబు గావించి నిమిత్తస్వీకారానంతరంబున దక్షిణాభిముఖంబుగా వనమార్గంబుఁ బట్టి చనియె నంతఁ దమసాతీరంబున నిద్రించి యున్న పౌరజనంబులు ప్రభాతకాలంబున మేల్కాంచి రామునిం గానక దిక్కులు గలయం దిలకించుచు శోకోపహతచిత్తు లై కొండొకసేపు చేష్టలు దక్కి యుండి వెండియు

నొక్కింత తెలివిఁ దాల్చి కన్నీరునించుచు విషాదవేదనావిశేషంబునఁ దమలో నిట్లని విలపించిరి. 969

పౌరులు నిద్ర లేచి రాముని గానక విలపించుట.

ఉ. అక్కట రాముఁడు న్మనల నారట పెట్టి దయావిహీనుఁడై
చిక్కక త్రోచి పోయె దరి చేరఁగ రానివిపత్పయోధి నిం
కెక్కడ నీఁదువార మిఁక నెవ్వఁడు రక్షకుఁ డేది దిక్కు నేఁ
డెక్కడ వచ్చె నీనిదుర యెంతటి మోసము వచ్చె నిత్తఱిన్. 970

ఉ. నిర్మలచిత్తుఁ డంచితసునీతినిధుండు దయాపయోధి స
ద్ధర్మవిశారదుం డభయదాయకుఁ డీశ్వరుఁ డంచుఁ జిత్తమం
దర్మిలి నమ్మి యున్నమము నక్కట యిక్కడ నొంటి డించి యే
ధర్మ మటంచుఁ బోయె నిల ధార్మికు లీగతి విన్న మెత్తురే. 971

ఉ. రాముని భానుమత్కులలలాముని గోమలనీలనీరద
శ్యాముని బాసి మేన నిఁకఁ బ్రాణము నిల్వఁగ నేల చిచ్చులో
వేమఱుఁ జొచ్చి యైన నడవి న్విషపాన మొనర్చి యైన నిం
కేమి యొనర్చి యైన మన మిచ్చటఁ జత్తము నిక్కువంబుగన్. 972

క. జాలిం బడి తనసుతులం, బోలె మనల నేఘనుండు భూరికరుణచేఁ
బాలించు నట్టిరాముఁడు, వాలాయము మనల విడిచి వనమున కరిగెన్. 973

క. ఏలాగు బ్రతుకుదము మన, మేలీలఁ జరింత మెచటి కేగుద మకటా
బాళిం దల్లులఁ బాసిన, బాలులగతి నయ్యె నేఁడు పరికింపంగన్. 974

తే. రామభద్రుండు లేనిపురంబు శూన్య,గృహముగతి నుండు దాని నేరీతిఁ జూత
మచటివారలు రాముఁ డెందరిగె ననిన, నేమిచెప్పుద మిఁకఁ దెఱఁగెద్ది మనకు.

వ. అని బహుప్రకారంబుల భుజం బెత్తి రోదనంబు సేయుచు రామరహితం బైన పురంబు సొర నొల్లక రథం బరిగినచొప్పునఁ గొంతద వ్వరిగి మార్గనాశం బగుట విషాదంబు నొందుచుఁ జేయునది లేక మరలి పురమార్గంబుఁ బట్టి వివత్స లయిన మొదవులచందంబున విలపించుచు దైవోపహతుల మైతి మింక నేమి సేయువార మని చింతించుచు నరిగి చంద్రహీనం బైనగగనంబుపోలికఁ దోయహీనం బైనసముద్రంబుభంగి గరుడునిచేత నుద్ధృతపన్నగం బైన హ్రదంబుపోలిక నిరానందం బైనయయోధ్యాపురంబు సొచ్చి దాని శోభాహైన్యంబునకు శోకించుచుఁ గన్నీరు నించుచు విప్రణష్టప్రమోదు లై పుత్రదారగృహక్షేత్రాదులయందు మమత్వంబు మాని యమూల్యంబు లైనస్వగృహంబులు ప్రవేశించియు దుఃఖసహితం బైనస్వజనంబు నిరీక్షించి దుఃఖోపహతు లై స్వపరవేశ్మస్వజనాన్యజనవివేకంబు లేక యొండొకసేపున కతిప్రయత్నంబునం దమవారి నెఱింగి వారలం గూర్చికొని వారికి రాముండు వంచించి

యరిగిన చందం బంతయు వినిపించి బాష్పపిహితముఖు లై కన్నీరు మున్నీరుగా రోదనంబు సేయుచుండి రప్పుడు విషణ్ణరూపులును శోకపీడితులును బాష్పవిప్లుతలోచనులును దుఃఖోపహతచిత్తులును రామపరిత్యక్తులు నగునప్పురవాసులప్రాణంబు లుద్గతంబు లయిన ట్లుండె వణిజు లంతర్బాహ్యసంతోషంబులు విడిచి బేహారంబులు సేయుటుడిగి ఱిచ్చపడి యుండిరి గృహస్థులు మజ్జనపానభోజనశయనాగ్నిహోత్రాదికంబు విడిచి ధనలాభవ్యయంబు లెఱుంగక యేమియుం దోఁచకుండిరి చాతుర్వర్ణ్యంబులవారును దమకు నియతంబు లైనధర్మంబులకుం దప్పి చరించుచుండిరి ప్రథమజు లగుపుత్త్రులం బొంది తల్లులు హర్షింపక పరమదుఃఖాక్రాంత లై యుండిరి యిట్లు గృహంబులకుం జనుదెంచినభర్తలం గూడి పౌరకాంతలు దుఃఖార్త లై తోత్త్రంబులచేత ద్విపంబు లం బోలెఁ దీక్ష్ణవాక్యంబులచేత గృహపతుల గర్హించుచు నిట్లనిరి. 976

పౌరకాంతలు భర్తలతోడ నానాప్రకారంబుల విలపించుట.

చ. కరుణ దలిర్ప లోకములఁ గావ నరాకృతిఁ బుట్టినట్టియా
హరి యగురామభద్రుని మహామహు నెచ్చట నున్న సంభృతా
దరమునఁ జూడ కింట సుత దారలపై రమియించుచుండు న
ప్పురుషులు కల్మషాత్ములయి పోదురు దుర్గతికి న్నిజంబుగన్. 977

క. పరమాత్ముఁ డైనరామునిఁ, బరికింపఁగ లేని నీతిబాహ్యుల కిల మం
దిరసుతభార్యాభోగో, త్కరసుఖములచేత నేమి కార్యము దలఁపన్. 978

చ. రయమునఁ గాననంబునకు రాముని వెన్కొని పోయినట్టిదు
ర్ణయయుతుఁడుం బవిత్రుఁ డయి నవ్యశుభం బడి గాంచు నన్నచోఁ
బ్రియుఁ డగురామునిం బరిచరించుచుఁ గానకు నేగినట్టినీ
తయు నలలక్ష్మణుండు సుకృతం బది గాంతు రనంగఁ జిత్రమే. 979

క. రామునివెంట వనంబున, కామెయిఁ జనినట్టితమ్ముఁ డతఁ డొక్కఁడె పో
ధీమంతుఁడు సత్పురుషుఁడు, శ్రీమంతుం డన్యజనులఁ జెప్పఁగ నేలా. 980

క. సదమలచరితుఁడు రాముఁడు; పదపడి మజ్జన మొనర్చి పానము సేయ
న్మదిఁ దలఁచునట్టికొలఁకులు, నదులు తటాకములు గడుఘనంబులు గావే. 981

క. కడు రమ్యకాననము లగు, నడవు లనూపములు సరసు లద్రులు నదముల్
బడబడ రఘుకులశేఖరు, నుడుగక శోభింపఁ జేయుచుండుం బ్రీతిన్. 982

వ. మఱియు వనంబులం గలవిచిత్రకుసుమాపీడంబు లగునగంబులు రామునిం బరమాత్మగా నెఱింగి స్వనిష్ఠభ్రమరఝంకారమంత్రోచ్చారణపూర్వకంబుగా స్వశాఖాకరధృతమంజరీరూపపుష్పాంజలులచేత నమ్మహాత్ము ననుదినంబును బూజించుచుండుఁ బర్వతంబులు సమాగతుం డైనరాముని జూచి యను క్రోశంబువలన నకాలంబునందును స్వనిష్ఠవృక్షద్వారంబున ముఖ్యంబులయిన

ఫలపుష్పంబు లొసంగుచు బహుధాతుమండితంబు లై ననిర్ఝరంబువలన విమలతోయంబుల నొసంగుచు నిత్యంబును సేవించు చుండుఁ బాదపంబులు స్వమూలావకీర్యమాణకుసుమపల్లవ విరచిత శయ్యాతలంబులం దధివసించిన రాముని రమింపఁ జేయు చుండు మఱియు నెందెందు వసియించు నవి యెల్లఁ బ్రియాతిథిం బోలె రామభద్రుని సత్కరించుచు నుండు నమ్మహాత్ముం డెచ్చట వసియించు నచ్చట నించుక యైన భయంబును బరాభవంబును లే కుండు మహాశూరుండు మహాబాహుండు మహాతేజుం డాపుణ్యాత్ముండు సర్వభూతం బులకు బరమగతియుఁ బరమపరాయణుండును గావున నమ్మహానుభావుని పాదసేవ మాకుఁ బరమసుఖసాధనభూత మై యుండు మన మిప్పుడు వనం బునకుం జని మీరు రాముని సేవించు చుండుఁ డేము సీతను సేవించు చుండెద మరణ్యంబునందు మీకు రాముండును మాకు సీతయు నిత్యంబును యోగక్షేమంబు సేయు చుండుదు రట్టిపరమస్థానంబున నుండక దుఃఖశోకం బుల బడలుచు నిరానందుల మై యమనోజ్ఞంబును నప్రశస్తంబును సోత్కం ఠితజనంబును జిత్తనాశకంబు నై నపురంబున నెట్లుండుద మదియునుం గాక.983

తే. అకట కైకేయి దయ్యె రాజ్యం బధర్మ, కలితమై నాథవంతంబు గాకయుండు
నిచట మనకు వసింపంగ నెట్లు వచ్చు, ధనము జీవిత మది యేల తనయు లేల.

ఆ. రాజ్యకారణమునఁ రమణునిఁ దనయుని, విడిచె నట్టిదుర్వివేక యైన
కైకయిఁక నూరఁ గలవారి నెవ్వారి, విడువ కుండు దాని విడువ వలదె.985

క. జీవించి యున్న కేకయ, భూవరసుత మ్రోల భృత్యభూతల మగుచు
న్జీవించి యుండఁ జాలము, జీవితములు సాక్షిగాఁగఁ జెప్పెద మింకన్. 986

తే. పరఁగ నెవ్వ తె కృపమాలి పార్థివేంద్ర, తనయు రామునిఁ గానకుఁ బనిచె నట్టి
లోకవిద్విష్టమతి యైనకైక మ్రోల,నెగులు దక్కి యెవ్వా రెట్లునిలువఁగలరు.

ఉ. రాముఁడు కానకుం జనియె రాజవరేణ్యుఁడు శోకకర్శితుం
డై మని యుండఁ జాలఁ డతఁ డంతము నొందినవెన్క నీపురం
బీమహి యీాసమస్తజనబృంద మనాయక మై యుపద్రుతం
బై మితి లేనిదుఃఖమున నట్టె వినాశము నొందు నెంతయున్. 988

తే. మీారు పత్నీయుతంబుగ ఘోరవిషము
నర్థిఁ గ్రోలియు మృతి నైన నధిగమింపుఁ
డట్లు గాదేని సుగుణాఢ్యుఁ డైనరాముఁ
డర్థి వసియించువనమున కైనఁ బొండు. 989

తే. అకట మిథ్యావివాసితుం డయ్యె రాముఁ, డూర భరతుని ముంగల నుంటఁజేసి
యుర్విఁ బశుమారకుని మ్రోల నున్నపశువు, లట్ల నిశ్చితమరణుల మైతిమి గద.

శా. రాజీవాక్షుఁడు గూఢజత్రుఁడు మహోరస్కుండు లోకప్రియుం

డాజానుస్థిరబాహుఁ డంచితఘనశ్యాముండునుం బూర్ణిమా
రాజాస్యుండు మహారథుండు ఘనుఁ డౌ రాముండు నానావనీ
రాజి న్శోభిలఁ జేయుచుండు నెపుడు న్రంగత్తనూరోచులన్. 991

తే. మఱియుఁ బూర్వాభిభాషియు మధురభాషి
యైనరాముండు శశిభంగి నడవియందు
సమదదంతియానంబున సంచరింపఁ
గని విపినవాసులు ముదంబుఁ గాంతురు కద. 992

వ. అని యిట్లు నాగరస్త్రీలు బహుప్రకారంబుల భోజనమజ్జనశయనాదు లుడిగి నానావిధదీనాలాపంబుల విలపించుచు మృత్యుభయాగమంబునందుం బోలె నాక్రందనంబు సేయుచుండఁ దదీయదుఃఖంబు సహింప లేనివాఁడు పోలె సూర్యుం డస్తమించెఁ బదంపడి రాత్రి ప్రవర్తించె నప్పుడు సాకేతనగరంబు గాఢసంతమసపరిపూర్ణం బై నష్టజ్వలనసంపాతం బై ప్రశాంతాధ్యయనపుణ్యకథేతిహాసం బై శూన్యవిపణిమార్గం బై ప్రణష్టహర్షం బై నిరాశ్రయం బై నష్టనక్షత్రగ్రహం బైన యంతరిక్షంబు ననుకరించె మఱియు నప్పురస్త్రీలు వినయవివేకప్రియంబులచేతఁ దమసుతులకంటె నధికుం డైన రాముని దలంచి భ్రాతృపుత్రసహితంబుగా రోదనంబు సేయుచుండిరి ప్రశాంతనృత్యోత్సవగీతవాద్యం బై నిరానందం బై యపగతపణ్యవస్తుప్రసారణం బై యయోధ్యానగరంబు సంక్షుభితోదకం బైన మహార్ణవంబుభంగి నయ్యె నిట రాముండు తమసాతీరంబునఁ బురజనుల విడిచి నాఁటిరాత్రి వేఁగునంతకుం జని సూర్యోదయసమయంబున నాహ్నికకృత్యంబులు దీర్చి పితృవాక్యపరిపాలనక్షముం డై దూరంబు చనిచని కోసలదేశాంతంబు డాసి విక్రుష్టసీమాంతంబు లగుగ్రామంబులను బుష్పితకాననంబులును విలోకించుచు సీతాలక్ష్మణసహితుం డై పోవుచుండ నప్పు డచ్చటి గ్రామోపగ్రామనివాసు లగుజనంబులు రామునివనప్రయాణంబుఁ జూచి తమలో నిట్లనిరి. 993

—వనంబునకుఁ బోవురామునిఁ జూచి గ్రామనివాసులు దుఃఖించుట.—

సీ. అక్కట దశరథుఁ డాలిమాటకుఁ బ్రియపుత్త్రు నేగతి వనంబునకుఁ బనిచెఁ
దనవంశధర్మంబు దప్పి కైకేయి మగనికి దుర్నయ మెట్లు గఱపె సీతఁ
డసమానబాహుబలాఢ్యుఁ డయ్యును దానిహితమతిఁ దా నెట్లు నీయకొనియె
నతిసుఖోచిత ముగ్ధ యబల మహాసుకుమారి యీధరణీకుమారి యెట్లు

తే. భయదవనమున నిడుములు వడఁ దలంచె, నెంతయాపద వాటిల్లె నిపుడు వీరి
కేమిసేయంగఁ గలవార మీశ్వరాజ్ఞ, మీఱ నడువంగఁ దరమె యెవ్వారికైన.

క. అని యీగతిఁ గోసలవిష, యనివాసులు దుఃఖతప్తులై విలపింప
న్ఘనుఁ డారఘుపతి వారల, యనూనదీనోక్తి వినుచు నటు చని మ్రోలన్. 995

క. సాదరమునఁ బరిమళశీ, తోదకపరిపూర్ణ మగుచు నొప్పెడిదాని
న్వేదశ్రుతి యనువరనది, నావశరథసుతుఁడు దాఁటి యవ్వలఁ జనుచున్. 996
క. విపులోదక యై కమనీ,యమరాళరుతాభియుక్త యై గోకులయు
క్తమనోజ్ఞానూపక యై, యమరెడుగోమతిని దాఁటి యరుగుచు నవలన్. 997
క. నవరాజీవోత్పలకై, రవగతమకరందలుబ్ధరమ్యభ్రమరీ
రవనాదిత యై యొప్పెడు, నవజల యగుస్యందికాఖ్యనదిని దరించెన్. 998
వ. ఇట్లమ్మహానది నుత్తరించి తొల్లి యిక్ష్వాకునకు మను వొసంగినట్టి స్యందికాఖ్యనదీమర్యాదం బైనదాని నవాంతరజనపదావృత మగుదానిఁ గోసలదేశవిశేషంబు వైదేహికిం జూపుచు నతిత్వరితగమనంబునం బోవుచు సుమంత్రు నవలోకించి మత్తహంసస్వరంబున నిట్లనియె. 999
చ. కడఁగి చతుర్దశాబ్దములు కాననవాస మొనర్చి క్రమ్మఱం
దడయక నేగుదెంచి తలిదండ్రులు కామితము ల్ఘటింపఁగా
నుడుగక రేపుమాపు సరయూతటపుష్పితకాననంబునం
దడరినకౌతుకంబు చెలువారఁగ నెన్నఁడు వేఁట సల్పెదన్. 1000

రాముఁడు జనపదనివాసు లగుజనుల నూఱడించుట.

వ. వేఁట శిష్టాచారం బగునే యని యంటి వేని. 1001
సీ. అనఘాత్మ యీలోకమందు రాజర్షుల కడవిలో వేఁట క్రీడార్థ మగుట
నవసరం బెఱిఁగి సదాచారపరులచే మానక స్వీకృతం బైనదానిఁ
జలవేధనార్థంబు శరచాపధరులచే ననిశ మాకాంక్షితం బైనదాని
సరయూనదీతీరసంజాతవనములో నించుక వేఁటఁ గావించువాఁడ
తే. సరయ రాజుల కీరీతి యవనిలోన, నతుల మై సమ్మతం బయి యలరు చుండు
ననుచు నీభంగి రాఘవుఁడమృతమధుర, భాషణంబులఁ బలుకుచుఁ బ్రాభవమున.
వ. శీఘ్రంబున నగస్త్యదిశాభిముఖుం డై పోవుచు విశాలంబు లగుపురంబు లరణ్యంబులు గ్రామంబులు విలోకించుచుఁ గోసలదేశాంతంబుఁ జేరి యయోధ్యాభిముఖుం డై యారబ్ధవ్రతనిర్విఘ్నపరిసమాప్త్యర్థంబు నిర్గమనసమయంబున శిష్టాచారప్రాప్తపురదేవతానమస్కారంబునకు సంకటంబు చేత • నవకాశంబు లేమిం జేసి యమ్మహాపురివలన ననుజ్ఞఁ గొనువాఁడై కేలుదోయి ఫాలంబునం జేర్చి యిట్లనియె. 1003
ఉ. ఓపురరాజమా సురపురోపమధామమ నీకు నిత్యముం
గాపుగ నున్నదైవతనికాయముతోఁ దగ నాన తిమ్ము మా
కీపనిఁ దీర్చి క్రమ్మఱ నహీనగతిం జనుదెంచి యవ్వలం
జూపులవిందు గాఁగ నినుఁ జూచెద నింత యనుగ్రహింపవే. 1004
వ. అని పలికి భక్తిపూర్వకంబుగా నమస్కరించి పదంపడి దర్శనార్థం బరుగు

దెంచి దుఃఖించు చున్నజానపదుల నవలోకించి వారల దుఃఖనివారణంబు
గొఱకుఁ దానును బాష్పపూర్ణముఖుండై దక్షిణభుజం బెత్తి యిట్లనియె.

సీ. అనఘాత్ములార యథార్థంబుగాఁ దొల్లి నాయందు మీచే నొనర్పఁబడిన
యట్టియనుక్రోశ మనుకంపయును గడుఁ బాపీయ మై ధోఁచెఁ బరఁగ మీకు
బహుకాలదుఃఖానుభవముగొఱకు నిది చేకూడె నే నేమి సేయువాఁడ
నిపుడు మీపదముల కేగుఁ డే మర్థసంసిద్ధికై కాననసీమ కర్థిఁ

తే. బోయివచ్చెద మని యిట్లుపొసఁగ రామ, చంద్రుఁడవతరణప్రయోజనము రావ
ణాసురవధార్థ మని యక్షరార్థమెఱుఁగ, షడ నచించినవారు సంభ్రాంతులగుచు.

ఆ. రమ్యమూర్తి యైన రామున కభివావ, నము ప్రదక్షిణం బొనర్చి బాష్ప
పూర్ణవదను లగుచుఁ బోవ లేకందంద, నిలిచి చూచు చుండి రలఘుమతులు.

వ. ఇట్లు రామచంద్రముఖచంద్రామృతంబు నేత్రచకోరంబులం గ్రోలుచుఁ దనివి
నొందక తదీయగుణంబులచేత నాకర్షింపఁ బడినమనంబును గ్రమ్మఱింపం జాల
క విలపించు చున్నవారల కారఘువల్లభుండు సాయంకాలంబునందు సూర్యుం
డునుం బోలె నగోచరుం డై చక్షుర్విషయం బతిక్రమించి నిజదేహప్రభాపట
లంబుల నద్దేశంబు వెలింగించుచుం జని ధనధాన్యోపేతంబులును దానశీలజనా
కీర్ణంబులును శుభకరంబులును భయరహితంబులును రమ్యంబులును దేవతా
యతనయాగీయపశుబంధనస్తంభసంకులంబులును నుద్యానామ్రవణోపేతంబు
లును సంపన్నసలిలాశయంబులును హృష్టపుష్టజనాకీర్ణంబులును గోపగోకు
లసేవితంబులును నరేంద్రులకు రక్షణీయంబులును వేదఘోషాభినాదితంబులు
ను నగుకోసలదేశస్థగ్రామంబు లన్నియు నతిక్రమించి ముందట. 1008

రాముఁడు గంగానదిఁ జేర నరుగుట.

మ. కనియె న్రాఘవుఁ డభ్రమార్గవిలసత్కల్లోలమాలామిళ
ద్ఘనహంసచ్ఛదజాతవాతనిపతత్సర్వర్తుసూనాళిచే
ననిమేషుల్ త్రిజగత్పవిత్రమహిమవ్యాప్తి న్వితర్కించి గొ
బ్బునఁ బుష్పంబులఁ బూజఁ జేసి రనఁగాఁ బొల్పొందు గంగానదిన్. 1009

వ. మఱియు దేవదానవగంధర్వకిన్నరోరగసేవిత యగుదాని విమలపులినవిహార
మాణ విద్యాధరసుందరీసుందరకబరీసమర్పితనూతనపారిజాతకుసుమ రసా
స్వాదనమత్తమధుకరఝంకారసంకుల యగుదాని నిరంతరహోమధూమ
పటలఘనీభూతపుణ్యాశ్రమాభిరామరమణీయతీర యగుదాని జలక్రీడాకుతూ
హలసమాగత విహరమాణ దివ్యాప్సరోగణజలాశయ యగుదాని సంత
క్లీనదేవోద్యానదేవక్రీడాపర్వతశతాకీర్ణ యగుదాని దేవభోగ్యపద్మిని యగు
దాని దేవప్రయోజనార్థం బాకాశంబున నుద్గమించినదాని దేవసంఘాప్లుత
సలిల యగుదాని సముల్లసితపద్మోత్పలకైరవషండమండలాంతర్గతవిహార

మాణము త్తమరాళచక్రవాకసారసక్రౌంచరుతాభియుత యగుదాని స్మరణమాత్రంబున సకలకల్మషహరణస్వభావ యగుదాని దర్శనమాత్రంబున సమస్తమంగళప్రదశీల యగుదానిఁ ద్రిలోకవిఖ్యాత యగుదాని సకలలోకపావని యగుదాని జలఘాతాట్టహాసోగ్ర యై మణినిర్మలదర్శన యై యాభోగపులిననితంబ యై డిండీరఖండనిర్మలహాస యై శైవాలకేశ యై నానాపుష్పపరాగపటలపటావృతయై వివిధకుసుమాలంకృతయై భూషణోత్తమభూషితయై నయువతిభంగి నలరుదాని దిశాగజవనగజదేవోపవాహ్యగజముహుర్ముహుస్సన్నాదితాంతర యగుదాని శింశుమారచక్రభుజంగనిషేవిత యగుదాని ఫలపుష్పకిసలయద్విజగుల్మలతాశతపరివృత యగుదాని నిష్పాప యగుదాని విష్ణుపాదాంగుష్ఠనఖనిష్ఠ్యూత యగుదాని శంకరజటాభ్రష్ట యగుదాని సముద్రమహిషి యగుదాని మఱియును. 1010

సీ. తిలకింప నొకచోట స్తిమితగంభీరత్వ మొకచోట వేగజలోత్కరంబు
నొకచోట వేణీకృతోదకం బొకచోట రమణీయపులినాభిరంజితంబు
భీషణగంభీరభాషణం బొకచోట నూర్మికాసందోహ మొక్కచోట
సముదంచితావర్తసముదయం బొకచోట నొకచోట ఘనవాలుకోత్కరంబు
తే. నొక్కచోటఁ గైరవపంకజోత్పలంబు, లుభయతీరజతరుజాల మొక్కచోటఁ
గలిగి యద్భుతవైఖరిఁ గ్రాలుదానిఁ, గలితరంగత్తరంగను గంగఁ గనియె. 1011

వ. ఇట్లు జాహ్నవి నవలోకించి రాముండు వనచరణంబుపగిదిఁ బద్మరేఖాలంకృత యై తనహృదయంబుకరణి నిష్పంక యై తనదానగుణంబుకైవడి బహుజీవన యై తనవనప్రయాణంబుభంగి వసుమతీజాతాభిరామ యై యలరుట కానందించుచుఁ దత్తీరంబున శృంగిబేరపురం బనునిషాదపట్టణంబుఁ గని తత్సమీపంబునకుం జని సుమంత్రు నవలోకించి యిట్లనియె. 1012

ఉ. నూతనపుష్పపల్లవమనోహర మై మన కాశ్రయార్హ మై
యీతటినీతటంబుపయి నెంతయు నొప్పెడి నింగుదీమహీ
జాతము చూచితే యిచట సమ్మతి నేఁడు వసించి యాపగా
జాతకళావిశేషములు సర్వముఁ జూతము గాక సారథీ. 1013

మ. అనిన న్సూతుఁడు లక్ష్మణానుమతిచే నచ్చోటికిం దేరుఁ దో
లిన రాముండు రథంబు డిగ్గి యట నోలిన్ సీతయుం దమ్ముఁ డో
య్యన సేవింపఁగ వృక్షమూలమున నధ్యాసీనుఁ డై యుండె భ
క్తినిబద్ధాంజలి యై సుమంత్రుఁ డనురక్తిన్ముందటం గొల్వఁగన్. 1014

శృంగిబేరపురాధీశుం డగుగుహుండు రామునిం జూడవచ్చుట.

వ. అంత. 1015

ఉ. ఆపుర మేలువాఁడు సుగుణాభిరతుండు నిషాదలోకర

త్యాపరతంత్రుఁ డుగ్రబలశాలి గుహుం డనువేరివాఁడు ప్రా
ణోపమమిత్రుఁ డై తగురఘూత్తముఁ రాక యెఱింగి సమ్మదో
ద్దీపితుఁ డై హితాళి చనుదేర భజింపఁగ వచ్చె రామునిన్. 1016

ఉ. ఈగతి నేగుదెంచుగుహు నెంతయు నంతనె చూచి చూపదీ
ర్ఘాగుఁ డై నరాముఁడు ప్రసన్నముఖుం డయి రమ్ము రమ్మన
న్వేగమె డాయ వచ్చి కడు విశ్రుతకీర్తిని రామమూర్తినిం
గౌఁగిటఁ జేర్చి మేనఁ బులకల్పలఁగ న్వినయోక్తి నిట్లనున్. 1017

ఆ. ఓ గుహానుభావ యేమి కారణమున, నీతపస్వివేష మిపుడు గలిగె
సఖుఁడ నైననాకు సర్వంబు దయతోడఁ, జెప్పు మధిప వేఱు సేయ నేల. 1018

క. పాయక మద్భాగ్యంబున, నీయట్టి ప్రియాతిథి న్వినిర్మలచరితు
న్స్త్రీయుతునిఁ జూడఁ గలిగెను, నాయట్టికృతార్థుఁడు భువనంబులఁ గలఁడే.

వ. అని స్వాగతం బడిగి యర్ఘ్యపాద్యాదివిధులం బూజించి వెండియు నిట్లనియె.

మ. ఇనవంశోత్తమ యీధరిత్రికిఁ గరం బీశుండ వీ వేము నీ
కనిశంబుం బని సేయువారము మదీయం బైనరాజ్యంబు గ్ర
ద్దనఁ జేపూని ధరింపు మీపుర ము యోధ్యాపట్టణంబట్ల వే
డ్క నిరీక్షింపుము భక్ష్యభోజ్యములు వే గైకొమ్ము నాపై కృపన్. 1021

మ. అని ప్రార్థించుచు నున్నయాగుహుని రాజాగ్రేసరుం డైనరా
మనరేంద్రుండు దయార్ద్రదృష్టిఁ గని సమ్మానంబుఁ గావించి యి
ట్లనుఁ బుణ్యాత్మక యేము సంతతము ను న్యత్పీతి నీచేత న
ర్హాణముం బొందినవార మింత యిపు డేలా నూత్నసంబంధముల్. 1022

వ. అని మైత్రిం బ్రకటించి మృదుపీనంబు లైనబాహువులం బరిష్వజించి వెండియు
నిట్లనియె. 1023

చ. అనుపమపూర్వజన్మసుకృతాతిశయంబున నిన్ను నేఁడు లో
చనములు చల్లగాఁగఁ గని చాలఁ గృతార్థుఁడ నైతి నీసుతుల్
తనయులు చుట్టము ల్సఖులు దాయలు నైస్వపక్షు ల్కాగు ల్వారుల్
ఘనముగ సంతతంబును సుఖస్థితి నొప్పుదురే సుహృద్వరా. 1024

చ. అనఘవిచార నీ వొసఁగు నట్టిసపర్యలు మాకు వచ్చె మ
జ్జనకునియాజ్ఞ చే నియతి సంధిలఁ దాపసవృత్తిఁ గానలోఁ
బనివడి సద్వ్రతంబు నలుపం జను నే నిట భక్ష్యభోజ్యము
ల్గొనుట యసంగతంబు నయకోవిద యీవినయంబు చాలదే. 1025

వ. ఈతురంగమంబులు మార్గాయాసంబున డస్సి యున్నయవి ఘాసపానీయం
బులచేత వీనికిం దృప్తిఁ గావింపుము నన్నుం బూజించినట్ల కా సంతసించెద
ననిన నట్ల యని తగువారల నశ్వరక్షణంబునకు నియోగించె నంత నారఘు

పుంగవుండు కాలోచితకృత్యంబులు దీర్చి లక్ష్మణదత్తం బైనగంగానదీజలంబుఁ గ్రోలి సుమంత్రవిరచితం బైనపర్ణతల్పంబుఁ బత్నీసమేతంబుగా నధివసించె నప్పుడు లక్ష్మణుం డన్నచరణంబుల గంగోదకంబులం గడిగి తడి యొత్తి కొంత దడవు శుశ్రూషఁ గావించి పదంపడి ధనుర్ధరుం డై కొలిచి యుండె గుహుండును సూతసహితంబుగా సౌమిత్రితోడ సంభాషించుచు ధనుర్ధరుం డై కాచి యుండె నంతఁ గొంతరాత్రి చనిన యనంతరంబ భ్రాతృరక్షణాయత్తచిత్తుం డై యదంభంబున నిద్ర వేఁగించుచున్నలక్ష్మణుం జూచి సంతాపసంతప్తుం డై గుహుం డి ట్లనియె. 1026

గుహుఁడు లక్ష్మణుఁడు నిద్రపోకయుండుటను జూచి పరితపించుట.

చ. అతులితవైభవోన్నతి మహాసుకుమారుఁడ వయ్య నీవు నీ
గతి నడురేయిఁ గా ల్నిలిపి కంటికి నిద్దురఁ గాచి యున్కి నా
మతికి విషాద మయ్యెడి క్షమావరపుత్ర త్వదర్థ మిందుఁ గ
ల్పిత మగుపర్ణతల్పమునఁ బ్రీతి సుఖస్థితిఁ బవ్వళింపవే. 1027

ఆ. అనఘచరిత కష్ట మనుభవింపఁగ నాకుఁ, జెల్లుఁ గాక నీకుఁ జెల్లు నయ్య
ఘనసుఖోచితుఁడవు కడుసుకుమారుఁడ, వతిమృదుండ వవనిపాత్మజుఁడవు.

చ. అనవరతంబు నీదుకృప నందినవారము గాని సజ్జనా
వనగుణధుర్య యేము కడవారము గాము సు మయ్య యీనిశం
బనివడి బంధువు ల్సఖులు భ్రాతలు జ్ఞాతులు గొల్వ నిద్ర మే
ల్కనియెదు నంతదాఁక మిముఁ గాచెదఁ గంటికి ఱెప్ప కైవడిన్. 1029

మ. ధర నెవ్వానికృప న్నితాంతయశము న్ధర్మార్థకామంబులుం
బరమైశ్వర్యము నాకుఁ గల్గె సుఖసంపల్లాభముం గంటి నా
నరవర్యుం డగుజానకీప్రియునకన్న న్బ్రియుం డెవ్వఁ డు
ర్వరలో లేమి యథార్థ మింతయు సుమిత్రాపుత్ర చర్చింపఁగన్. 1030

తే. నరవరాత్మజ గహనగోచరుఁడ నైన, నాకుఁ దెలియని దీవిపినంబునం దొ
కింతయును లేదు బల మోపినంతగలదు, శంకవిడిచి నిద్రింపుము శయ్యయందు.

ఉ. నా విని లక్ష్మణుండు కరుణంబుగ నాగుహుఁ జూచి పల్కు నో
భూవినుతప్రతాప విను ముజ్జగ మేలుట కర్హుఁ డైనయీ
భావజసన్నిభుం డిటులు పర్ణతలంబునఁ బవ్వళింప నా
కేవిధి నిద్ర వచ్చు సుఖ మేటికి జీవిత మేల చెప్పుమా. 1032

లక్ష్మణుఁడు రామునివనవాసమును గుహునితోఁ జెప్పి దుఃఖించుట.

ఆ. అనఘ ధర్మవిదుఁడ వైననీచేత క్షత్రియుల మైనమాకు మది నొకింత
యైన భీతి పుట్ట దన్యుఁడ వీవు గా, వాదరింపఁ బడితి మది యె చాలు. 1033

క. రణమున నేవీరుఁడు సుర, గణమున కైన నెదిరింపఁగా రాక బలో
ల్బణవృత్తి నలరునాయన, తృణములపై బవ్వళించె నిప్పుడు గంటే. 1034

తే. ఘనతపము చేత వివిధయాగముల చేత, దానముల చేత సకలమంత్రముల చేతఁ
బ్రాప్తుఁడైతుల్యగుణుఁడయిపరఁగెఁగాన, జనకునకతిప్రియాత్మజుండనఘుయితఁడు.

ఆ. అట్టి రాఘవాన్వయప్రదీపకుఁ డైన, యితఁడు ఘోరవనికి నేగుచుండఁ
జూచి తండ్రి యైనక్షోణీశ్వరుఁడు నును, ననెడుమాట సందియంబు గాదె.

వ. పితృమరణానంతరంబున మేదిని యనాథ యై యుండఁ గలదు యువతులందఱు
నాక్రందనంబుఁ గావించి యలసి నిరానంద లై యుందు రని పలికి వెండియు
ని ట్లనియె. 1037

చ. నిరుపమవాద్యఘోషముల నృత్యరవంబుల గీతనిస్వనో
త్కరముల భూషణద్యుతులఁ దద్దయు సొంపు వహించురాజమం
దిర మది నేఁడు సంక్షుభితనీరధిమాడ్కి వినష్టతారకాం
బరమువిధంబున న్మిగులఁ బాడఱినట్లుగ నుండునే కదా. 1038

క. మాయయ్యయుఁ గౌసల్యయు, మాయమ్మయు నేఁటిరాత్రి మహనీయగుణ
శ్రీయుతుల మమ్ముఁ గానక, పాయక నేపగిది వీట బ్రతుకుదు రకటా. 1039

తే. అనఘ మాతల్లి శత్రుఘ్ను నాశ్రయించి, యొకవిధంబున ధరమనియుండుఁగాని
యేకసుత యైనకౌసల్య యెట్లు బ్రతుకఁ, గలదుతీర్పంగరానిదుఃఖమునహించి.

క. అనురక్తజనాకీర్ణం, బును లోకసుఖావహంబు భూరిద్యుతి యా
ఘనసాకేతము వ్యసనం, బునఁ గ్రాఁగి నశించు నింకఁ బుణ్యచరిత్రా. 1041

తే. అగ్రతనయుండు ప్రియుఁడు మహాత్ముఁ డైన
రామభద్రుని విడిచిన రాజవరుని
యొడలఁ బ్రాణంబు లెబ్భంగి నుండు నతఁడు
ప్రియకుమారుఁడు వృద్ధుఁడు నయవిదుండు. 1042

తే. విపులయశుఁ డైనరామునివిపినయాత్రఁ
దలఁచి శోకాగ్నిచేఁ గ్రాఁగి తనువు విడుచుఁ
గాక కౌసల్య మని యుండఁ గలదె యింక
నాయమవితాన మాయమ్మ యడలుఁ గాదె. 1043

క. గ్రద్దన భూమీశ్వరుఁ డా, యిద్దఱముద్దియలపాటు హృదయంబునఁ దాఁ
దద్దయుఁ జింతించి ఘనవి, పద్దశచే డస్సి మేనుఁ బాసెడు సుమ్మీ. 1044

ఆ. ఇట్టిమాటఁ దలఁప నెంతయు నాగుండె, యవియుచున్న దట్టియడలు మాని
సమ్మదమున నేఁడు జొమ్మునఁ జేయుడీ, నిద్ర వోవ నెట్లు నేర్తు నయ్య. 1045

ఆ. తనయువిపినయాత్రఁ దలపోసి మృతుఁ డైన, తండ్రి సంస్కరించి ధన్యు లగుచు
వఱలు చుందు రట్టిభరతాదులకుఁ బోలెఁ, గలుగ దొక్కొ భాగ్యగరిమ మాకు.

ఆ. తపము వేర్మి మమ్ము నప్పురూపముగఁ గాంచి, పెంచినట్టిజనకుఁ డంచితముగ
బ్రతికి యుండె నేని ప్రస్తుతిం జనుదెంచి, యప్పుడు గాదె చూచి యలరుటెల్ల.

వ. మఱియు మృతుం డైన దశరథుని సత్కరించి ధన్యులై భరతాదికుమారులు రమ్యచత్వరసంస్థానంబును సువిభక్తసుహాపథంబును హర్మ్యప్రాసాదసంపన్నంబును గణికావరశోభితంబును గజాశ్వరథసంబాధంబును తూర్యనాదవినాదితంబును సర్వకల్యాణసంపూర్ణంబును హృష్టపుష్టజనాకులంబును నారామోద్యానసంపన్నంబును సమాజోత్సవశాలియు నగు సాకేతనగరంబున యథాసుఖంబుగా విహరించెద రేము వనవాసంబు నిర్వర్తించి సత్యప్రతిజ్ఞుల మై క్షేమంబుతో నయోధ్యాపురంబుఁ బ్రవేశించి దశరథుండు జీవించి యుండె నేనియు నమ్మహాత్ముని పాదంబుల కభివందనంబుఁ గావించి సేవించెద మని సత్యంబుగాఁ బలికిన నాసుమిత్రాపుత్రుని వాక్యంబు విని గుహుండు రాముని యందు గురుసౌహృదంబువలన జ్వరాతురుం డై వ్యథాతురం బగుగజంబు పోలిక సంతాపసంతప్తుం డై కన్నీరు నించుచుండె నంతఁ బ్రభాతకాలం బగుటయు రాముండు మేల్కాంచి సౌమిత్రి నాలోకించి యిట్లనియె. 1048

లక్ష్మణునాజ్ఞ గుహుఁడు గంగ దాఁటుట కోడఁ దెప్పించుట.

మ. కృకవాకుల్ మొఱయం దొడంగె శిఖు లుద్గీవంబు లై మ్రోసె విం
పెకపు ల్గూయఁ దొడంగె నల్లదిగొ ప్రాగ్దేశం బినచ్ఛాయచే
నకలంకస్థితి నొప్పె భానుఁ డుదితుం డై రాఁ గలం డింకఁ ద
క్కక నీయాపగ దాఁటి పోద మన నొంగా కంచు నాతం డొగిన్. 1049

ఆ. గుహునిఁ జూచి పల్కె గొబ్బున నీవు సుమంత్రుఁ గూడి నీదుమంత్రివరులఁ
బనిచి గంగ దాఁటి చనుటకు నోడ దెప్పింపు మనిన నతఁడు పెంపుతోడ.

వ. తనమంత్రులం జూచి నిరాదరయంబునం జని సువాహనసంయుక్తయగుదానిఁ గర్ణగ్రాహవతి యగుదాని సుప్రతార యగుదాని దృఢసంధిబంధ యగుదాని శోభనస్వరూప యగుదాని నొక్కనావ నవతరణమార్గంబునం దెం డనినవిని యాగుహామాత్యు లట్టినావ దెచ్చి గుహునకు సమర్పించిన నతండు దాని రామునకుం జూపి ప్రాంజలియై దేవా యిమ్మహానది నుత్తరించుటకు యోగ్యం బైనసాధనం బుపస్థితం బయ్యె దీని నారోహింపుఁ డనిన నారాముండు గుహునిం జూచి నీచేతఁ గృతకాముండ నైతి నట్లు సేయం గలవాఁడ ఖనిత్రపిటకాదిసాధనంబులును వైదేహీవస్త్రాభరణాదికంబును నోడమీఁదం బెట్టింపు మని పలికి సౌమిత్రిసహితంబుగాఁ దనుత్రాణంబులు దొడిగి తూణీరంబులు బిగించి కృపాణంబులు ధరించి కోదండపాణియై రథారోహణంబు సేయక వైదేహిం దోడ్కొని పాదసంచారంబున నోడసమీపంబునకుం జనుసమయంబున సుమంత్రుండు నిటలఘటితాంజలిపుటుం డై దేవా యేమి సేయం గలవాఁడ

నానతిం డని వినయంబునం బల్కిన నారఘువల్లభుండు గజేంద్రహస్తప్రతిమం బైన దక్షిణకరంబున నతని సంస్పృశించి మందమధురవాక్యంబుల నిట్లనియె.

రాముఁడు సుమంత్రు నయోధ్యకుఁ బొమ్మని చెప్పుట

చ. భరతుఁడు వీట లేఁడు నరపాలుఁడు మద్వనయాత్ర కాత్మలోఁ
బరమవిషాద మొందుచు విపద్దశచే నడ లూనుఁ గాన స
త్వరగతి నేగి నీ వొకవిధంబున నాయనఁ దేర్చుచుండు మో
పరమసఖా వనంబునకుఁ బాదగతిం జనువార మెంతయున్. 1052

చ. అనిన నతండు దీనుఁ డయి యాయన కిట్లను దేవ యే మనం
జను వనితాయుతంబుగ నిజంబుగఁ గా నడవిం జరింపు మం
చనయము నీకుఁ బ్రాకృతున కట్లు కృతాంతుఁడు సేయుచుండ న
న్యునకు మనుష్యమాత్రునకు నొక్కనికి న్వశమే మరల్పఁగన్ 1053

తే. అనఘచరిత నీయట్టిమహాత్ముఁ డిట్టి, కష్టదశనొందుచుండఁగఁ గాంచి మార్ద
వార్జవబ్రహ్మచర్యంబులం దధీత, మందును ఫలోదయంబు లేదని తలంతు.

వ. దేవా నీవు పితృవియోగంబున వైదేహీలక్ష్మణసహితంబుగా వనవాసంబు సలుపుటం జేసి ముల్లోకంబుల నతిక్రమించి నిక్కువంబుగాఁ బరమసిద్ధి వడసెదవు తమసాతీరంబున నిద్రాసమయంబునం దవిదితగమనంబునఁ బౌరులును బలాత్కరించి క్రమ్మఱించుటం జేసి యేనును నీచేత వంచితుల మైతి మింకఁ బాపభాగిని యగుకైకేయికడ నెత్తెఱంగున జీవించెద మని దుఃఖార్తుండై రోదనంబు సేయుచుఁ బ్రాణసముండైన యమ్మహానుభావుని విడువం జాలక పరిభ్రమించుచున్న సుమంత్రుం జూచి రోదనజనితాశుచిత్వనివారణార్థంబు జలస్పర్శంబు సేయించి పరిశుద్ధుం గావించి మధురవాక్యంబుల ననూనయించుచు నిట్లనియె. 1055

క. మనువంశజులకు నీతో, నెన యగుసన్మిత్రుఁ డన్యుఁ డింక లేఁ డటుగా
వున దశరథజనపతి వగ, పునకుం జొరకుండునట్లు బోధింపు మటన్. 1056

తే. అనఘ మాయయ్య నన్నుఁ బాసి యడలుచుండు
నమ్మహాత్మునిశోకంబుఁ గ్రమ్మఱింపు
మధికవృద్ధుండు కామభారావసన్నుఁ
డగుట నిట్లార్తి చెప్పంగఁ దగియె నేఁడు. 1057

రాముఁడు సుమంత్రునితో దశరథాదులకుఁ దననమస్కారములఁ దెల్పు మనుట.

వ. మఱియు మహీపతులు స్వతంత్రులు గావున వలయునెడల నిందాస్తుతివిచారంబు దక్కి నిగ్రహానుగ్రహంబులు సలుపుచుండుదు రట్టివారి సేఁతకుం దెగడుట బుద్ధిమంతుల కుచితంబు గాదు దశరథుండు కైకేయిచిత్తంబు వడయ

టకు నెద్ది పంచిన దాసింగా వనక సేయుచుండుము మఱియు మహీరమణుం డేకార్యంబు నుద్దేశించి యప్రియంబును దుఃఖంబును సంతాపంబును బొంద కుండు నట్టికార్యం బట్లు గావింపుము నీవిప్పుడు రయంబునఁ బురంబునకుం జని వృద్ధుండును వ్రతేంద్రియుండును నదృష్టదుఃఖుండును నగుమహీపతిని సముచితంబుగా సందర్శించి యభివాదనంబుఁ గావించి నావచనంబులుగా నిట్లనుము 1058

చ. మిహిరకులేశ నీకుఁ బ్రణమిల్లెద నేనును లక్ష్మణుండు భూ
దుహితయు నీయనుగ్రహము తోడఁగ శోకము దక్కి దండకా
గహనపదంబున న్ననుయకాలముదాఁక వసించి క్రమ్మఱ
న్రహిఁ జనుదెంచి యవ్వలఁ దిరంబుగ నీపద మాశ్రయించెదన్. 1059

తే. రాజ్యహీనులమైతి మరణ్యవాస, మావహిలె నంచు మది నించుకైన వగవ
కధిప యేనును లక్ష్మణుఁ డవనిపుత్రి, సుఖులమై యున్నవార మిచ్చోట నిపుడు.

వ. అనివిన్నవించి పదంపడి మజ్జనని యగుకౌసల్యాదేవి కభయంబుఁ దెలిపి సుమిత్ర ననూనయించి కైకేయిసంతాపంబు మాన్చి తక్కినతల్లుల కారోగ్యంబు దెలిపి విశేషించి మామువ్వరవచనంబులుగా మజ్జననికి మత్కుశలంబుఁ దెలిపి యభివాదనంబుఁ జేసి వెండియు జగతీపతితోఁ గార్యంబు తెఱంగి ట్లని చెప్పుము. 1061

చ. భరతుని వేగ రాఁ బనిచి బంధువులెల్లను సన్నుతింపఁగా
నిరుపమరాజ్యపీఠమున నిల్పు మతండు భవన్మనోవ్యథ
స్ఫురణడఁ దీర్చు నంచు నరపాలునితో వివరింపు మమ్మలం
దఱ సమదృష్టిఁ జూడు మని నాయనుజన్మునితోడ నాడుమీ. 1062

తే. తండ్రిపనుపున రాజ్యంబు తవిలి యేలు
నతఁ డుభయలోకసుఖతంత్రుఁ డగుచు నలరుఁ
గాన దశరథునానతిఁ బూని రాజ్య
మేలు మని కైకకొడుకుతోఁ జాల జెపుమ. 1063

తే. మఱియుఁ దలిదండ్రులందు సమానభక్తి, గలిగి వర్తింపు మనిశంబు కైకయందు
బోలె నిశ్చలభక్తినల్పుము సుమిత్ర, యందు మజ్జనయిత్రియందనుచుఁ జెపుమ.

వ. విశేషించి దూరం బరుగుదెంచితి నింక రథంబుఁ గొని యరుగు మనిన నతండు సంతాపసంతప్తుండై వెండియు స్నేహంబున రాముని విలోకించి యిట్లనియె.

—సుమంత్రుఁడు రామవియోగమును దలంచి దుఃఖించుట.—

క. మునుకొని భక్తిస్నేహం, బున సౌహృదమున నవిక్లబుఁడనై యే నా
డినమాట తప్పుగాఁ గొన, కినవంశశ్రేష్ఠ యేలు హృదయమునందున్. 1066

సే. అనఘ తనయునిఁ బాసినజననిమాడ్కిఁ, ద్వద్వియోగసంభూతదుర్వారదుఃఖ

మున నిరానందమై యున్న పురవరమున, కెట్లు చనువాఁడ నానతి యిమ్మధీశ.

తే. మిహిరకులవర్య మును భవత్సహిత మైన
రథము గ్రమ్మఱ నిటు భవద్రహిత మగుచు
నుండ వీక్షించి వీటిలో నున్నవారు
పద్మదళలగ్నజలములభంగిఁ గారె. 1068

తే. సూతపరిశేష మైన యీశూన్యరథము, నాజిహతవీర మైన సైన్యమునుబోలెఁ
జూచి సాకేతనగరంబు శోకతాప, యుక్త మై కడుదైన్యంబు నొందుఁ గాదె.

తే. జనవరాత్మజ దూరదేశమున నున్న, వాఁడ వైనను నిను వీటివారు మ్రోల
నున్నవానిఁగ మది నెంచి యోగిరంబు, గుడువ నొల్లకయుందురు జడతనొంది.

చ. కడువడి నీవు ప్రోల్వెడలి కాననసీమకు నేగుదెంచున
ప్పుడు నినుఁ బాయ లేక బలముఖ్యులు పౌరు లమాత్యకు ల్సఖు
ల్దడయక దుఃఖశోకమునఁ దద్దయు నాకులపాటు నొందుచు
న్జడత వహించి యుండుటయు సర్వము నీ కది దృష్టమే కదా. 1071

తే. సాధునుతశీల నీప్రవాసనమునందు, నగరజనముచే నెద్ది యొనర్పఁబడియె
నట్టిరోదనశబ్ద మీవట్టితేరుఁ, దేఱి చూచిన శతగుణాధికము గాదె. 1072

తే. ఇనకులోత్తమ యీదుఃఖ మెల్లవారి, కోడ కేనె యొనర్చినవాఁడ నగుదు
నన్నియు న టుండ నిమ్మహిధరాధినాథు, శోకతాపంబు నా కటుచూడ వశమె.

తే. దోషమనియెన్నకిటు నన్ను దుఃఖవార్ధి,లోనఁ బడఁద్రోచి పోవంగఁ బూనితేమ
హాత్మ దయమాలి యస్లైననసువులిపుడె, విడుతుఁ గా కేలపోదు నవ్వీటి కధిప.

సీ. రాజవంశాంభోధిరాజ నిన్నిటఁ బాసి యే నొంటిఁ బురమున కేగ నచట
మీతల్లి కౌసల్య నాతనూభవు నెందు విడిచి వచ్చితి వని యడుగ నామె
కేమని చెప్పుదు నోమహాదేవి నీకొడుకును మాతులకుఁ ముందు
డించి వచ్చితి నూఱడిల్లుము నీ వని చెప్పుదునే దానఁ దప్పు గలుగు

తే. మానితాచారు నీపుత్త్రుఁ డైనరాము, నడవిలో డించి వచ్చితి నంటి నేని
పిడుగునంటియీవాక్యంబునొడివినంతఁ, దడయకప్పుడెయసువులు విడువకున్నె.

క. జననుత యీహయరాజము, లనఘుని నినుఁ బాసి శూన్య మైనరథంబుం
గొని నేఁడు మరలఁ బట్టణ, మున కేగతిఁ బోవ నేర్తుఁ బురుషశ్రేష్ఠా. 1076

—— సుమంత్రుఁడు తానును రామునితోడ వనమునకు వచ్చెద ననుట. ——

వ. దేవా ప్రియదర్శనుండ వైననిన్నుం బాసి నిమిషం బైన జీవింపం జాల నీతోడ
వనంబునకుం జనుదెంచెద ననుగ్రహింపు మట్లీయకొన వేని రథంబుతోఁ గూడ
నగ్నిప్రవేశంబుఁ జేసెద నని పలికి వెండియు నిట్లనియె. 1077

ను. అనఘా దారుణకంటకద్రుమశిలావ్యాప్తంబు లైనట్టియా

వనమార్గంబులయందుఁ బాదగతిఁ బోవం జాల. వీస్యందనం
బనుమానింపక యెక్కుఁ డేను సుఖ మింపారంగ నెచ్చోటికిం
జన నిష్టం బగునట్టి దేశమున కిచ్ఛాభంగిఁ గొంపోయెదన్. 1078

వ. మహాత్మా కాంతారంబున మీకు నెయ్యది తపోవిఘ్నంబుఁ గావించుచుఁ జరించు నట్టిసత్త్వంబుల నెల్ల నేను రథస్థుండనై బాధించుచుండెద రాజ్యాభిషిక్తభవద్రథచర్యాకృతం బైనసుఖంబు భాగ్యహీనుండ నైననాచేత నలబ్ధం బయ్యె నైనను భవత్సాహాయ్యకరణంబుచేత వనవాసకృతసుఖం బైననను భవింప నిశ్చయించితి నరణ్యంబునందు నీ కనుకూలుండ నయ్యెద నీవు నాకుఁ బ్రత్యాసన్నుఁడ వగు మని ప్రీతిపూర్వకంబుగా నీచేతఁ బలుకంబడువాక్యం బేను వినం గోరెద హయంబులు వనవాసి వైననీకుఁ బరిచర్య సేయుచుఁ బరమగతిం బ్రాపింపఁ గలయవి యేను నిన్నుం బాసి యయోధ్యాపురంబునకుం గాదు దేవలోకంబున కైనం బోవ నొల్ల వనంబున నీకు శుశ్రూషఁ గావించుచు సుఖినై యుండెద నని పలికి వెండియు నిట్లనియె. 1079

క. విను మఘుచిత్తుఁడు బలశా, సనునగరంబునకుఁ బోవఁజాలనిమాడ్కి
న్జనవర నినుఁ బాసి పురం, బున కరుగం జాల నన్నుఁ బుచ్చకు మింకన్. 1080

క. వనవాసవత్సరంబులు, చనినవెనుక మిమ్ము నర్థిఁ జారుశతాంగం
బున నిడుకొని క్రమ్మఱఁ బుర, మునకుం గొని పోవువాంఛ పొడమె నధీశా.

తే. ఘోరవనిలోన నీతోడఁ గూడి యున్న
నాకుఁ బదునాలుగబ్దము లన్నయచరిత్ర
నిమిషకాలంబు లై తోఁచు నిన్ను విడిచి
యున్న నవియె నూఱేడు లై యుండు నధిప. 1082

వ. దేవా నీవు పరమదయాళుండవు విశేషించి భృత్యవత్సలుండవు ధర్మాత్ముండ వేను భృత్యుండ నపరాధరహితుండ రాజపుత్రాశ్రితమార్గస్థితుండ నన్ను విడనాడి పోవుట ధర్మంబు గా దని యిట్లు దీనుండై బహుప్రకారంబుల పారె సారెకుఁ బ్రార్థించు చున్నసుమంత్రు నవలోకించి భృత్యానుకంపియగు రాముండు మధురవాక్యంబుల నాశ్వాసించి సుమంత్రా నిన్ను భర్తృవాత్సల్యంబు గల వానిఁ గా నెఱుంగుదుఁ బురంబునకుం జను మనుటకుఁ గారణం బెఱింగించెద విను మని యిట్లనియె. 1083

రాముఁడు సుమంత్రు నయోధ్యకుఁ బో మ్మనుటకుఁ గారణముఁ జెప్పుట.

క. వెచ్చెఱ నగరికిఁ గ్రమ్మఱ, వచ్చిననినుఁ జూచి కైక వదలక రాముం
డచ్చుపడ వనికిఁ జనె నని, యిచ్చ నలరుఁ బ్రత్యయార్థ మేగఁగ వలయున్.

క. అనఘాత్మ యేను గానన, మున కరిగినవార్త విని ప్రమోదాన్విత యై
జనపతి మిథ్యావచనుం, డనియొడిశంక వెస విడుచు నక్కైక మదిన్. 108

క. గురుతరభరతారక్షిత, సురుచిరనుతరాజ్యజన్యసుఖ మయ్యమకుం
దిరముగ దొరకొను టదియే, పరమనఘా నాకు మిగులఁ బ్రథమార్థ మిలన్.

క. నాకును విభునకుఁ బ్రియముగఁ, జేకొని యరదంబు గొనుచు శీఘ్రంబున న
వ్యాకులమతి వై పురి క,స్తోకగతిం బొమ్ము సూత సుగుణవ్రాతా. 1087

—రామలక్ష్మణులు జడలఁ దాల్చుట.—

వ. నాచేతఁ జెప్పం బడినయీవాక్యంబు లన్నియు వారివారికి వేర్వేఱ నెఱిం
గింపు మని యిట్లు పెక్కువిధంబుల సారెసారెకు ననునయించుచు సుమం
త్రుని నిలువం బనిచి గుహునిం జూచి నాకు సజనం బగువనంబునందు నివా
సం బయోగ్యంబు జనపదరహితం బైనవనంబునందు వాసంబును వన్యాహారా
ధర్మయ్యాదికంబును గర్తవ్యంబు గావున నియమంబు పరిగ్రహించి సీతా
లక్ష్మణదశరథులకు హితకాముఁడ నై వనంబునకుం జనియెద నిప్పుడు జటాధార
ణార్థంబు న్యగ్రోధక్షీరంబుఁ దెమ్మని పలికిన నతం డట్ల కావింప రాముండు
లక్ష్మణసహితంబుగా సముచితప్రకారంబున జడలఁ దాల్చె దీర్ఘబాహు లగు
నమ్మహానుభావులు చీరసంపన్నులును జటామండలమండితులు నై తపోనిష్ఠాగరి
ష్ఠు లైనమునులచందంబున నొప్పిరి. యిత్తెఱంగున రాముండు సౌమిత్రిసహితం
బుగా వానప్రస్థమార్గానుసారి యగువ్రతం బంగీకరించి వెండియు గుహు
నవలోకించి. 1088

క. బలకోశదుర్గజనపద, ములయందుఁ బ్రమాద ముడిగి పుణ్యోచిత మ
త్యలఘుతరం బగురాజ్యము, నలయక పాలించు చుండు మయ్య మహాత్మా.

క. అని యిటు నిషాదనాథున, కనుజ్ఞ యిడి రాముఁ డవనిజానుజయుతుఁ డై
పెనుపొంద నోడకడకుం, జని లక్ష్మణుఁ జూచి పలికె నంతరణేచ్ఛన్. 1090

క. జనకసుత యబల గావున, నినకుల తా నెక్కఁ జాల దీయోడపయిం
బనివడి మెల్లన నీసతి, ననఘా యెక్కింపు మనిన నాతఁడు ప్రీతిన్. 1091

క. మానుగ రామునిపనుపున, జానకి నెక్కించి పిదపఁ జక్కఁగ నోడం
దా నెక్కఁ బిదప వీరుఁ డ, హీనపరాక్రముఁడు రాముఁ డెక్కెం గడిమిన్.

—సీతారామలక్ష్మణులు నౌకారోహణముఁ జేయుట.—

వ. ఇట్లు నావ నెక్కి యాత్మహితంబుకొఱకు బ్రాహ్మణక్షత్రియార్హం బైన
నావారోహణమంత్రంబు జపియించి యథాశాస్త్రంబుగా నాచమనంబుఁ జేసి
సీతాలక్ష్మణసహితంబుగా నమ్మహానదికి నమస్కారంబుఁ గావించి ప్రీతిసంప్రా
ప్తసర్వాంగుం డై సుమంత్రుని బలసహితంబుగా గుహుని నిలువ నియమించి
నావికులం జూచి రయంబున నోడ గడపుం డనిన వా రట్లు గావింప నయ్యో
డ కర్ణధారసమాహిత యై మహార్ణవంబునం బనుమందరాఛలంబుచందంబునం

బోవు చుండె నప్పుడు సీతాదేవి యంజలిఁ గీలించి యమ్మహానది నుద్దేశించి
యిట్లనియె. 1093

-:సీతాదేవి గంగానదినిఁ బ్రార్థించుట.:-

క. దేవీ యీయన దశరథ, భూవల్లభసుతుఁడు విపినభూమి కరిగెడి
నీ వచ్చటఁ గృప మెఱయఁగ, వావిరి రక్షించు చుండవలయుం జుమ్మా. 1094

క. ఈరే డబ్దంబులు వన, ధారుణి వసియించి యవలఁ దమ్ముఁడు నేనుం
గోరిక సేవింపఁగఁ జను, దేరఁగలఁడు నిన్నుఁ జూడ దేవీ మరలన్. 1095

తే. త్రిపథగ యనంగ సాగరదేవి యనఁగ, నఖిలవిష్టపపావని యనఁగ బ్రహ్మ
లోకగామిని యనఁగ నస్తోకమహిమ, ధాత్రి విఖ్యాతిఁ గైకొన్నదాన వీవు.

తే. అట్టి నీకు నమస్కార మాచరింతు, సర్వకామప్రసాదిని సపతి నగుచు
మరల వచ్చితి నేని సమ్మద మెలర్ప, వివిధభంగులఁ దృప్తిఁ గావించుదాన.

క. పాయక మద్వల్లభుఁ డగు, నీయనఘుఁడు మరల భూమి కేలిక యైన
న్నీయాన నీకుఁ బ్రియముగ, వేయి మొదవు లిత్తు వేదవిప్రుల కెలమిన్. 1098

వ. మఱియు నరణ్యవాసంబు పరిసమాప్తి నొందించి క్రమ్మఱ నయోధ్యకుం జను
దెంచునప్పుడు సురాఘటసహస్రంబుల మాంసభూతోదనంబున నీకుఁ దృప్తి
నొందించెద మఱియు ననేకసువర్ణవస్త్రాభరణాదులు బ్రాహ్మణుల కొసంగెద
భవదీయతీరనివాసు లై భవదంతర్లీనంబు లైన ప్రయాగాదిపుణ్యతీర్థంబులను
గాశ్యాద్యాయతనంబులను సంతుష్టంబులం జేసెద నని యివ్విధంబున
నపాంసులాశిరోమణి యగు వైదేహి భాగీరథిం బ్రార్థించు చుండ నయ్యోడ త
ద్దక్షిణతీరంబు సేరంజనియె నప్పుడు రాముండు సీతాలక్ష్మణసహితంబుగా నావ
డిగ్గి తటం బెక్కి తమ్మునిం జూచి యిట్లనియె. 1099

క. సజనస్థలమున నైనను, విజనం బగుచోట నైన వేయిగతుల భూ
మిజ నధికయుక్తిఁ గాచుట, గజవిక్రమ మనకువలయు కార్యము సుమ్మీ.

క. కావున ముంగలి వై చను, మీవు నడుమ జనకపుత్త్రి యేతెంచెడి నే
వావిరి మీయిద్దఱకుం, గావలి యై వెనుక ప్రాపుగాఁ జనుదెంతున్. 1101

తే. పురుషశార్దూల యీగోల పుట్టి యెన్నఁ, డిట్టికష్టంబు లెఱుఁగని దిపుడు దారు
ణాటవీవాసపంథవాయాస మొందె, యాత్మ శోకింపఁ గల దింక నకట కంటె.

క. జనరహితము విషమము భయ, జనకం బగుగహనమందుఁ జను చున్నది గా
వున నేమఱ కిప్పుడు మన, మనఘా రక్షింప వలయు నంగన యగుటన్. 1103

వ. అని యాజ్ఞాపించిన నట్ల కాక యని లక్ష్మణుండు మహాధనుర్ధరుం డై యగ్ర
భాగంబునం జనియె వైదేహి ము న్నిడుకొని రాముండు పిఱుంద దెసం
బోవు చుండె నంత సుమంత్రుండు భాగీరథిదక్షిణతీరంబునం బోవు చున్న
రాముని దవ్వులం జూచి కూడ ముట్టుటకు సామర్థ్యంబు లేమిం జేసి కన్నీరు

నించు చుండె నిట్లు రాముండు గంగానది నుత్తరించి శుభసస్యసమృద్ధంబు
లగువత్సదేశంబులు విలోకింపుచు వ్యాఘ్రాదిక్రూరమృగంబులం దోలుచు
నాహారయోగ్యంబు లగువరాహఋశ్యరురుపృషతసంజ్ఞమృగంబుల వధించి
వానిం గొని బుభుక్షితులై ప్రొద్దు గ్రుంకునంతకు నొక్కవనస్పతి డాయం జని
వరుణప్రియ యగుసంధ్య నుపాసించి జానకివల్లభుండు సౌమిత్రి నవలోకించి
యిట్లనియె. 1104

క. ఏనిశ సుమంత్రవిరహిత, మై నేఁ డిట మనకుఁ దోఁచె నారాత్రి బహి
ష్ఠానన నివాసంబున కిది, మానుగ మొదలిటిది గాదె మనుజశరణ్యా. 1105

తే. అనఘ నేఁ డాది గాఁగ నిత్యంబు రాత్రు
లందు సమధిజ్యధన్వుల మై సహస్ర
గతుల నరయుచు నిద్దురఁ గాచి యుండ
వలయు సీతకు భయ మింత గలుగ కుండ. 1106

ఆ. మఱియు నేఁడు మొదలు మనుకులవర్య ని, త్యంబు రాత్రులందు స్వార్జితంబు
లైనపర్ణతృణము లవనిపైఁ బఱచి వ, సింత మొక్కచోటఁ జేరుదనుక. 1107

వ. అని పలికి మహార్హశయనోచితుం డైనకౌసల్యానందనుండు సీతాలక్ష్మణసహి
తంబుగా నవ్వనస్పతిమూలంబున నధ్యాసీనుం డై సౌమిత్రితోఁ బుణ్యకథాప్ర
సంగంబులు సేయుచు నంతకంతకుఁ బ్రసంగవశంబునం బెక్కుతలంపు లూర
వెండియు లక్ష్మణున కిట్లనియె. 1108

రాముఁడు దశరథాదులఁ దలంచుకొని దుఃఖించుట.

మ. అనఘా యీనిశ మేదినీవిభుఁడు శోకాకల్పితస్వాంతుఁ డై
ననుఁ జింతించుచు నేమి దోఁపక నిరానందంబుగా నుండున
ట్లనె కైకేయి సపత్నిపుత్త్రుఁడు మహారణ్యోర్వికిం బోయె నే
ననిశం బింకఁ గృతార్థ నైతి నని యాహ్లాదించు చుండుం గదా. 1109

తే. మఱియు నద్దేవి మాతులమందిరమున, నుండి వచ్చినతనపుత్త్రు నొప్పఁ జూచి
రాజ్యకారణమునమహీరమణుప్రాణ, ములనుసిఁకమీఁదహరియింపఁబూనదుగద.

తే. అకట వృద్ధుఁ డనాథుఁడు నగునృపుండు, కామభారావసన్నుఁడు గాన నేను
లేనిచోఁ దాను కైక కధీనుఁ డగుచు, నేమిసేయంగఁ గలఁ డిప్పు డింకఁ జెపుమ.

తే. కైక యీవాక్యరశ్మిచేఁ గట్టువడిన
మనుజనాథునిమతివిభ్రమంబుఁ జూచి
రాజకులవర్య యర్థధర్మములకంటెఁ
గామము గరీయ మని తోఁచెఁ గాదె నాకు. 1112

తే. కానిచో నుర్వి నెంతదుష్కర్ముఁ డైన, సుతుని సుగుణాభిరతుని సువ్రతుని నృపుని
కరణి నెవ్వాఁడు విడుచు నకారణముగ, లక్ష్మణా యది కామధర్మంబు గాదె.

మ. అనఘాత్మా భరతుం డొకండె పితృదత్తైశ్వర్యము న్సంతతం
బును బాలించుచుఁ బత్నిఁ గూడి సుఖసమ్మోదాత్ముఁడై యుండు న
య్యనఘుం డేను బ్రవాసినై దశరథుం డంతంబు నొందంగఁ దా
ననిశం బేకముఖంబుగా నఖిలరాజ్యశ్రీలఁ బాలింపఁడే. 1114

క. ధర నెవ్వఁ డర్థధర్మ, స్ఫురణ ముడిఁగి ముఖ్యకామమున వర్తిలు న
ప్పురుషుండు దశరథునిక్రియ, భరతానుజ తుదిని గడువిపన్నతఁ బొందున్.

క. అనఘా కేకయపతినం, దని మనయిలు సొచ్చు టెల్ల నావనవాసం
బునకు విభునిమరణమునకుఁ, దనయునిరాజ్యమున కనుచుఁ దలఁచెద బుద్ధిన్.

క. కైకేయి తనసుతుండు ర,సాకాంతుం డగుచు నుండ సౌభాగ్యమద
వ్యాకులత న్మనయమ్మలఁ, జీకాకుం జేయుచుండు సిద్ధము వత్సా. 1117

రాముఁడు లక్ష్మణు నయోధ్యకుఁ బొమ్మని చెప్పుట.

క. నాకతమున మాయమ్మకు, నీకష్టపుఁబాటు గలిగె నిఁక నాపనుపుం
గైకొని క్రమ్మఱఁ బురికి, వ్యాకులమతి వగుచు నరుగు మమ్మలకడకున్. 1118

తే. ఏను వైదేహితోఁ గూడఁ గాననమున, కెల్లి నొక్కఁడ నరిగెద హీనవృత్తి
బడలి దిక్కెవ్వరును లేక నడలుచున్న, మాయమను నీవు దిక్కయి మనుపుమ చట.

వ. మఱియు క్షుద్రకర్మ యగు కైకేయి ద్వేషోచితం బైన యన్యాయ్యం బాచ
రించుం గావున నీవు మజ్జననీరక్షణం బేమఱకుండు మని ధర్మజ్ఞుం డగు భర
తునకుం జెప్పుము. 1120

తే. సాధునుతశీల తొల్లి మజ్జననిచేత, రాజముఖులు పెక్కండ్రు పుత్త్రకులచేత
నిల వియోజితులైరి గావలయు నట్టి, పాప మిప్పు డయ్యమకు సంప్రాప్తమయ్యె.

తే. రాజనందన పెద్దకాలముననుండి, ప్రీతితో బహువిధములఁ బెంచినట్టి
యంబ నాచేత ఫలకాలమందు విడువఁ, బడియెఁ దల్లికి నాయట్టికొడుకు లేల.

తే. మిగులసమ్మోదము నొసంగఁ దగిన యేను, గాఢసంతాన మొసఁగినకారణమునఁ
బరఁగ నాయట్టితనయుఁడు ధరణి నెంత, కలుషచారిణికైనను గలుగవలదు.

తే. శత్రుపాదదంశము సేయు సరగ శుకమ, యనెడు నెద్దానిపల్కు మదంబచేత
వినఁబడియె నట్టిశారిక వీరజనవ, రిష్ఠ నాకంటెఁ బ్రీత్యతిరిక్త మయ్యె. 1124

వ. వత్సామాతృసంవర్ధితతిర్యగ్జాతిసంభూతశారికాకృతప్రియదానమాత్రం బైనను
నాచే నకృతం బయ్యెఁ బుత్త్రకృతప్రయోజనరహితయై శోకించుచున్న యల్ప
భాగ్య యగుకౌసల్య కేను బుత్త్రుండనై జన్మించుటంతయు నిరర్థకంబు గదా
యని మిక్కిలి వగచి వెండియు నిట్లనియె. 1125

తే. అనఘ ననుఁ బాసి ఘోరశోకాభిమగ్న, యై పరమదుఃఖసంతాప మనుభవించు
నకట కౌసల్య దా నెంత యల్పభాగ్య, యయ్యె నయ్యమ కెద్ది దిక్కరయ నింక.

చ. అనఘచరిత్ర యే నొకఁడ నల్క వహించి యయోధ్య నుర్వర

న్సునిశితబాణజాలములఁ జూర్ణముఁ జేసి విభుత్వ మర్థిఁ గై
కొనుటకు ఖేటి నయ్యు నయకోవిదవర్య యధర్మసాధ్వసం
బునఁ బరలోకభీతి నది పోవుట కెంతయు సమ్మతించితిన్. 1127

క. అని యీగతి విలపించుచు, జనకసుతావిభుఁడు శోకసంతాపముచేఁ
గనుఁగొనల నశ్రుకణములు, చనుదేరఁగ నూర కుండె జాలి జనింపన్. 1128

తే. అంత సౌమిత్రి విగతార్చి యైనవహ్ని, కరణి నిర్వేగ మైనసాగరముపగిది
భూరిదుఃఖార్తి విలపించియూరకున్న, యగ్రజుననూనయించుచునపుడు వలికె.

తే. దేవ మీచెప్పినట్టుల నీవు వెడలి, రాఁగ గతపూర్ణశశి యైనరాత్రిభంగి
నిష్ప్రభత్వంబునొందుట నిజ మయోధ్య, తండ్రి పరితాప మింతనితలఁపరాదు.

తే. నరవరోత్తమ సీతను నన్నుఁ గూర్చి, డెందమునఁ బరితాపంబు నొంద వలవ
దీవిచారంబు నినుఁ దపియింపఁ జేయు, ధైర్యవంతున కిది యుచితంబు గాదు.

రాముఁడు లక్ష్మణుఁడు వనమునకు వచ్చుటకు సమ్మతించుట.

క. మనుకులశేఖర యేనును, జనకజయు జలోద్ధృతాంబుచరములభంగి
న్ఘనుని జగదేకపూజ్యుని, నినుఁ బాసి మనంగ లేము నిమిషం బైనన్. 1132

ఆ. అధిప నీవు లేనియలస్వర్గపద మైన, మదికిఁ దోఁచుఁ దృణసమాన మగుచుఁ
దల్లి యనఁగ నెంత దశరథుఁ డన నెంత, తమ్ముఁ డనఁగ నెంత దలఁప నాకు.

వ. అని లక్ష్మణుండు పలికిన నత్యంతశ్రేష్ఠం బైనయతనివచనంబువిని రాముండు కొం డొకసేపు విచారించి ధర్మం బంగీకరించి తమ్మునిరాక కొడంబడి యవ్వనస్పతి మూలంబున లక్ష్మణవిరచితం బైనపర్ణతల్పంబునందు సీతాసమేతంబుగాఁ బవ్వళించెనిట్లంధకారబంధురం బైనరాత్రియందుజనసంచారశూన్యం బైనవనంబున మహాసత్వసంపన్ను లగురామలక్ష్మణులు భయసంభ్రమంబులం జెందక గిరిసానుగోచరంబు లగుకంఠీరవంబులచందంబున నొప్పిరంతఁ బ్రభాతకాలం బగుటయు సాంధ్యాదికంబులు దీర్చి యచ్చోటు వాసి గంగాయమునాసంగమప్రదేశంబునకుం బోవ సమకట్టి మహారణ్యంబుఁ బ్రవేశించి వివిధంబు లగుభూభాగంబులును మనోరమంబు లగువత్సదేశావాంతరదేశంబులును. నదృష్టపూర్వంబు లగువృక్షంబులును నంత నంత విలోకించుచుం జని చని దివసంబు నివృత్తమాత్రం బగు చుండ రాముండు సౌమిత్రి కిట్లనియె. 1134

చ. అనుపమలీలఁ గ్రాలెడు ప్రయాగమునంతట నిండి మ్రోల న
య్యనలుని కేతు వై యలరు నధ్వరధూమము మింటఁ బర్వి నూ
తనఘనత న్వహింప శిఖితాండవనాదము లొప్పెనో యన
న్మునికృతవేదమంత్రరవము ల్విన నయ్యెడు వింటె లక్ష్మణా. 1135

క. ఇం దొకమునిపతి మన కా, నందంబుగ నేఁడు దర్శనం బొసఁగఁ గలం
డిందులకు నీమనంబున, సందియ మందంగ వలదు జననుతశీలా. 1136

సీతారామలక్ష్మణులు భరద్వాజాశ్రమముఁ జేరుట.

క. గంగాయమునాతటినీ, సంగమదేశంబుఁ గంటె శైలతనూజా
ధ్రాంగుఁ డగునృషభరాజతు, రంగునిగాత్రంబుపగిదిఁ గ్రాలెడి వత్సా. 1137

క. సుశ్రీయుత మై బహుతరు, మిశ్రిత మై ప్రశ్రితు లగుమేటిమునులకు
న్విశ్రమ మగుభారద్వా, జాశ్రమ మిది దీనిఁ జూడు మనఘవిచారా. 1138

వ. అని భరద్వాజాశ్రమంబుఁ జూపి యమ్మహానుభావుండు మహాధనుర్ధరుండై మృగపక్షిసంఘంబుల వెఱపించుచు సీతాలక్ష్మణసహితంబుగా ముహూర్తమాత్రంబున నయ్యాశ్రమంబు సేరం బోయి గంగాయమునాసంధిదేశంబున బ్రహ్మస్థానంబుపగిది నొప్పుచున్నయమ్మునియాశ్రమంబుఁ బ్రవేశించి యందు శిష్యగణోపాసితుండును దపోలబ్ధనేత్రుండును సంశితవ్రతుండును నేకాగ్రచిత్తుండును గృతాగ్నిహోత్రుండును మహాత్ముండు నగునమ్మహాముని సముచితప్రకారంబున సందర్శించి సీతాలక్ష్మణసహితంబుగాఁ దదీయచరణంబులకుం బ్రణమిల్లి కేలుదోయి ఫాలంబునం జేర్చి త్రైకాలికాసకలజగద్వృత్తాంతాభిజ్ఞుం డగునమ్మునిగ్రామణి కి ట్లనియె. 1139

తే. సూరినుత యేను దశరథసుతుఁడ రాముఁ, డండ్రు నా పేరు వీఁడు నాయనుజుఁ డితని
లక్ష్మణుం డందు రీగోల రమణి నాకు, జనకపుత్రిక జానకి యనఁగ నొప్పు

సీ. మునినాథ తండ్రిశాసన మాదల ధరించి వనమున విహరింపఁ జనెడు నన్ను
విడువక యీలక్ష్మణుఁడు మహీపుత్రియు నాతోడఁ జనుదెంచినారు వీరిఁ
గూడి వ్రతంబుఁ గైకొని తపోవనముఁ బ్రవేశించి మూలఫలాశనులము
ధర్మమార్గప్రవర్తనులము నై విహరించెద మని విన్నవించు రాజ

తే. వంశవరుమాట విని భరద్వాజుఁ డర్ఘ్య, పాద్యముల గోవుబహువిధపక్వమూల
ఫలముల నొసంగి మృగపక్షికలితుఁ డగుచు, వివిధభంగులఁ బూజఁ గావించి పలికె.

క. వినుము చిరకాలమున కిట, నినుఁ జూడఁగఁ గల్గె నాకు నిష్కారణ మి
ట్లనఘాత్మ నీకు గహనో, ర్వీ నివాసము గలుగు టెల్ల వింటిమి గాదే. 1142

క. ఇది పుణ్యదేశము మహా, నదులు గలయుచోటు పావనము భూరిసుఖా
స్పద మటు గావున నిచ్చట, ముదితుఁడ వై యునికి సేయుము రఘుప్రవరా.

చ. అన విని రాముఁ డి ట్లనియె నాయన కిచ్చట నుంటి నేని యో
మునివర పౌరజానపదముఖ్యులు చాల సుదర్శుఁ డంచు న
న్ననవరతంబుఁ జూచుటకు నర్మిలి వచ్చుచుఁ బోవు చుందు రీ
యనువున నుండఁ బోలదు రహఃపద మొండొక టాన తీఁ గదే. 1144

వ. అని యిట్లు రావణవధార్థంబు గూఢంబుగా నవతరించిననన్నుఁ బ్రకటంబుగాఁ జేసితి రేని సర్వజనంబు నన్ను నారాయణుం డనియును నై దేహి నిందిర యనియుఁ దలంచి మమ్ము సందర్శించుటకు సులభంబుగా వచ్చుచుందురు గావున

నిట్టిప్రకటావస్థానంబు నొల్ల నెచ్చట మత్స్వరూపంబు ప్రకటంబు గా నుండు నెచ్చట వైదేహీ హృద్యంబుగా విహరించు నట్టియేకాంతస్థానంబు నాలోచించి చెప్పుం డనియెడుతాత్పర్యంబునం బలికిన నర్థగ్రాహకం బైనరాముని వచనంబు విని కాలత్రయాభిజ్ఞుం డగుభరద్వాజుండు మహాత్మా యిచ్చటికి దశక్రోశమాత్రంబు దవ్వులం జిత్రకూటం బన నొక్కపర్వతంబు గల దది మహర్షిగణసేవితంబును సమంతతస్సుఖదర్శనంబును ఋక్షవానరగోలాంగూలప్రముఖనిఖిలమృగవ్రాతోపేతంబును బుణ్యంబును గంధమాదనసన్నిభంబు నై యొప్పు చుండు నందుం బెక్కువర్షంబులు నిరాహారు లై తపంబుం జేసి తన్మహిమవిశేషంబునం గపాలావశిష్టశిరంబులతోం గూడి దివంబునకుం జనిన మహాసిద్ధులు పెక్కండ్రు గలరు మఱియు నగ్గిరికూటంబులు విలోకించువారికిం గల్యాణంబు లొదవు వారలచిత్తంబులు వికారంబులం బొరయక నిర్మలంబు లై యుండు నది వివిక్తంబు గావున నీకు నివాసయోగ్యస్థానం బై యుండు నచ్చట నివసింపు మట్లు గాదేని యిచ్చట మత్సహితంబుగా నివసింపుమని పలికి యమ్మునీంద్రుండు ప్రియాతిథి యైనరాముని సర్వకామంబుల సంతుష్టునిం జేసిన నారఘుపుంగవుండు సీతాలక్ష్మణసహితంబుగా మునికృతసపర్యలం బ్రతిగ్రహించి మహర్షికథితంబు లైనపుణ్యకథేతిహాసంబులు వినుచు నారాత్రి యచ్చట వసియించె నుభయమహానదీకల్లోలమాలాసంఘట్టనసంభూతజలకణసిక్తుం డై యాశ్రమస్థవివిధపక్వఫలకుసుమసౌరభంబు సంగ్రహించి మందమారుతంబు మనోహరంబుగా విసరె నంతం బ్రభాతకాలంబున రాముండు మేల్కాంచి కాలోచితకృత్యంబులు నిర్వర్తించి సముచితంబుగా భరద్వాజుని సందర్శించి వినయంబున నిట్లనియె. 1145

తే. అర్కనిభ నేఁటిరాత్రి మీయాశ్రమంబు
నందు సద్గోష్ఠి సుఖ ముంటి మతిహితముగ
నింక భవదుపదిష్టమహీధ్ర రేంద్ర
గమనవాసంబుల కనుజ్ఞ( గరుణ నిమ్ము. 1146

వ. అనిన మునీంద్రుం డి ట్లనియె. 1147

తే. అనఘచారిత్ర చిత్రకూటాచలమున, కరుగు మది మధుమూలఫలాన్వితంబు
కిన్నరవిహగగంధర్వపన్నగేంద్ర, భాసురము నీకు యుక్తనివాస మధిప. 1148

క. పుణ్యము తపస్విలోకశ,రణ్యము బహుతరమృగాభిరాజితరమ్యా
రణ్యము ధృతఫలజలరా, మణ్యక ~ సూధరంబు మనుకులవర్యా. 1149

క. అన్నగవనాంతభూములం, గ్రన్నన మృగయూథములును గరియూథంబు
లున్నగఁ జరించు చుండు జ,గన్నుతగుణ వానిఁ జూడఁ గల వీ వచటన్.

—భరద్వాజుఁడు రామునకుఁ జిత్రకూటమునకుఁ బోవుదారి యెఱింగించుట.—

ఉ. అచ్చటిసానుదేశముల నచ్చటిప్రస్రవణంబులం గరం
బచ్చటిపుణ్యతీర్థముల నచ్చటినిర్ఝరకందరంబుల
న్మెచ్చుగ సీతఁ గూడి తమినిండ రహి న్విహరించువేళ నీ
యిచ్చకు సమ్మదం బొదవు నింత యథార్థము రాజనందనా. 1151

క. పికబర్హిణకోయష్టిక, శుకనాదనినాదితంబు సురుచిరమృగయూ
థకలిత మగునగ్గిరిపై, నకలంకస్థితి వసింపు మతిరమ్యముగన్. 1152

—భరద్వాజవచనప్రకారమున రాముఁడు చిత్రకూటమున కరుగుట.—

వ. అని పలికి ప్రాస్థానికం బగుస్వస్త్యయనంబుఁ బ్రయోగించిన నారాముండు సీతాలక్ష్మణసహితంబుగా నమ్మహర్షి కభివందనంబుఁ గావించి యనుజ్ఞఁ గొని చిత్రకూటశైలనిరీక్షాపేక్షుం డై యరిగె నప్పు డమ్మునీంద్రుండు జనకుండు సుతులవెంట నరిగినభంగి రామలక్ష్మణులవెంట నొక్కింత దూరం బరిగి యారాజనందనులం జూచి మీరు గంగాయమునాసంగమంబు డాసి యచ్చటి నుండి యొక్కింత పశ్చాన్ముఖాశ్రిత యగుకాళిందియుత్తరతీరంబునం జని యమ్మహానది రేవు చేరి గమనాగమనంబులచేత నతిక్షుణ్ణంబును బురాణంబు నగు నయ్యవతరణప్రదేశంబునఁ గాష్ఠసంఘాతవిరచితప్లవంబున నానూర్యనందని నుత్తరించి యవ్వల బహువృక్షనిషేవితంబును హరితచ్ఛందంబును దీర్ఘశాఖాశిఖోల్లసితంబును సిద్ధోపసేవితంబును శ్యామనామకంబు నగునొక్క న్యగ్రోధవృక్షంబు గల దావృక్షంబు డాయం జని యమ్మహాపాదపంబునకు సీతాదేవిని మ్రొక్కించి మాకు శీఘ్రంబునఁ బునరాగమనంబు గలుగుం గాక యని సీతాపురస్సరంబుగాఁ బ్రార్థించి తదాశీర్వాదంబులు గైకొని యచ్చట నివసించి యైన నతిక్రమించి యైన నవ్వలఁ గ్రోశమాత్రంబు దూరంబున యమునాతీరసంభూతవంశవిరాజితంబును బలాశబదరీమిశ్రంబు నగునీలకాననం బవలోకించి యవ్వల రమ్యంబును గంటకపాషాణవర్జితంబును దావపాకరహితంబు నగుమార్గంబుఁ బట్టి చిత్రకూటపర్వతంబుఁ బ్రవేశింపుఁ డే నీమార్గంబున బహువారంబులు చిత్రకూటంబునకుం బోయి వచ్చినవాఁడ నని మార్గక్రమం బెఱింగించి వారిచేత నమస్కృతుం డై దీవించి యనుజ్ఞఁ గొని మరలి యాశ్రమంబునకుం జనుదెంచె నిట్లు భరద్వాజుం డుపావృత్తుం డై నయనంతరంబ రాముండు తదుపదిష్టమార్గంబునం బోవుచు సౌమిత్రి కిట్లనియె. 1153

తే. అనఘ మునినాథకరుణారసానుభూతి, నతికృతార్థులమైతి మయ్యనఘమూర్తి
చెప్పినవితాన నమ్మహాచిత్రకూట, శిఖరిశిఖరాగ్రమున నున్కి సేయ వలదె.

చ. అని యిటు రాజపుత్త్రు లగునయ్యనఘు ల్దమలోఁ దలంచుచున్

జనకజ మ్రోల నుంచికొని సత్వరలీలఁ బవిత్రతోయమా న
య్యినసుత డాయ నేగి మన మేక్రియ దాఁటుద మత్యగాధమై
తనరెడు నీలతోయములఁ దద్దయు శోభిలుచున్న దెంతయున్. 1155

సీ. అని చింతించుచుఁ దీర్ఘదేశ మటు డాయంబోయి సౌమిత్రి గ్ర
ద్ధన నత్యున్నతశుష్కవంశములచేతం దెప్పఁ గావించి లే
నవలం బీట యొనర్చి దానిపయి విన్నాణంబుగా రాముఁ డా
య్యనఁ గూర్చుండఁగఁ బెట్టె జానకిని లజ్జాలోలదృక్పంకజన్. 1156

తే. సీతనిటురాఘవుఁడు సుఖాసీనఁ జేసి, యిగదెసఁ భూషణంబు లందరను లునిచి
కఠినకాజంబులును జాపఖడ్గబాణ, ములుకుదుటుకొల్పి తానుఁదమ్ముఁడును బ్రీతి.

సీతారామలక్ష్మణులు యమునానది ను త్తరించుట.

వ. అమ్మహాప్లవంబుఁబరిగ్రహించియభంగతరంగమాలికాడోలికాచకితచక్రమరా
ళబాలికామధుకరమధురశబ్దాయమానం బైనయమునానదీమధ్యంబునంబోవు
నప్పు డాసీతాదేవి ఘటితాంజలిపుటయై యమ్మహానది నుద్దేశించి యిట్లనియె.

క. దేవీ రాముఁడు దశరథ, భూవల్లభసుతుఁడు విపినభూమి కరిగెడిఁ
నీ వధికకరుణ నచ్చట, వావిరి రక్షించుచుండవలయుం జుమ్మా 1159

క. ఈరే డబ్దంబులు వన, ధారుణిఁ జరియించి పిదపఁ దమ్ముఁడు నేనుం
గోరిక సేవింపఁగఁ జను, దేరఁగలఁడు నిన్నుఁ జూడ దేవీ మరలన్. 1160

క. ఓయమ్మ నీకు మ్రొక్కెద, నీయనఘుఁడు మరలఁ బుడమి కేలికయైనఁ
నీయాన నీకుఁ బ్రియముగ, వేయు మొదవు లిత్తు వేదవిప్రుల కెలమిన్.

వ. అని సవినయంబుగా నక్కాళిందిం బ్రార్థించుచుం బోవుచుండ నయ్యేటిదక్షిణ
తీరం బాసన్నం బగుటయు రాముండు లక్ష్మణుండును సీతాసహితంబుగాఁ
బ్లవంబు డిగ్గి యమునాతీరప్రాంతకాంతారసంతానంబులు విలోకించుచుం జని
చని యవ్వల శ్యామనామకం బైనన్యగ్రోధవృక్షంబు డాయం జని రప్పు డ
వ్వైదేహి రామునియనుజ్ఞ వడసి యవ్వనస్పతికి నమస్కరించి యిట్లనియె.

సీత శ్యామనామకం బైనన్యగ్రోధవృక్షంబునకు నమస్కరించుట.

తే. పాదపోత్తమ నాపతివ్రతము పార, మొందఁజేయుము కౌసల్య నొగి సుమిత్ర
నర్థిఁ గ్రమ్మఱ వీక్షించునట్లొనర్పు, మతిదయాళుఁడవై నమస్కృతి గ్రహించి.

క. అని యీగతిఁ బ్రార్థించుచు, జనకసుత ప్రదక్షిణంబు సలిపె నపుడు రా
మనరేంద్రుఁడు సౌమిత్రిం, గనుఁగొని యిట్లనియెఁ బ్రీతి గడలుకొనంగన్.

క. నీ వీక ముంగలివై చను, మా వెంబడి జనకపుత్రి యరుదెంచెడు నే
వావిరి మీయిద్దఱకుం, గావలివై వెనుకఁ బ్రాపుగాఁ జనుదెంతున్. 1165

తే. త్రోవ నెద్దానియందు నీదేవిమనసు, దగ రమించుచునుండు నెద్దానిఁ గోరు
నది కుసుమమైన ఫలమైన ననఘచరిత, చెచ్చెర మహీకుమారికిఁ దెచ్చి యిమ్ము.

తే. అనిన నతఁడగ్రభాగమం దరుగుచుండె, వెనుక రాముఁ డుచనుచుండె విల్లుఁ బూని
పుడమికన్నె యయ్యిద్దఱి నడుమ నొప్పె, దంతియుగమధ్యగతనాగ కాంతఁ బోలి.

వ. ఇత్తెఱంగునం బోవుచు నమ్మహీపుత్త్రి కుసుమకిసలయ ఫలోపేతంబులై యదృష్ట
పూర్వంబులైన తరులతాగుల్మంబులు విలోకించి తదీయసుషమావిశేషం
బులు నిజనాథునకుం జూపి చెప్పిన నద్దేవి యభిప్రాయం బెఱింగి తత్తత్తరు
లతాగుల్మాధిష్ఠితంబులైన ఫలకుసుమంబులు గోసి తెచ్చి లక్ష్మణుండు సీతా
వచనసంరబ్ధుండై యొసంగినం గైకొని యాహ్లాదించుచుఁ గుముదకైరవనీలో
త్పలపుండరీకషండమండలాంతర్గతమకరంద బిందురసాస్వాదనతుందిలేందిందిర
బృందఝుంకారసంకులంబులైన యమునానదీవరతీరంబులం గ్రీడించుచు
నవ్వలఁ గ్రోశమాత్రంబు దూరం బరిగి యందు. 1168

ఉ. గ్రద్దన విండ్లు నమ్ములును గైకొని, బలిదు లన్నదమ్ము లా
యిద్దఱు శౌర్యవిస్ఫురణ మేర్పడఁ గ్రూరమృగాళిఁ ద్రుంచుచుం
బ్రొద్దటు గ్రుంకునంతకును బొందికతో విహరించి యొక్కచో
నొద్దిక మీఱ నుండి రల యుర్విజకుం గుశలంబుఁ దెల్పుచున్. 1169

వ. అంత మేధ్యంబు లగు పెక్కుమృగంబుల వధించి యాహారంబుగా వించిరిట్లు విచి
త్రవాలుకజలవిహారమాణహంససారసనినాదంబు లాకర్ణించుచు నిర్మలసరో
వరసలిలకణసంవర్ధితపుష్పితైలాలతావాసనావాసిత శీతలానిలంబుపై వివ
ధానరవారణయుతంబైన యమునాతీరవనంబున నారాత్త్రి వసియించి. 1170

ఆ. అంత రాత్త్రి చనిన ననఘుండు రాఘవుఁ, డనుజు మేలుకొల్పి యనియె వింటె
శుకపికాదిపక్షినికరనినాదంబు, ప్రొద్దు పొడిచె నింకఁ బోవ వలదె. 1171

తే. అనుచు లక్ష్మణు బోధించి యతఁడు తాను, సవితృజావారిలోఁ గ్రుంకి సంధ్య వార్చి
చిత్రకూటాద్రి కరుగుచు సీతఁ జూచి, రాముఁ డిట్లని పల్కె గౌరవముతోడ.

—: రాముఁడు సీతకు వనంబులయందలి విచిత్రంబులను దెల్పుట. :—

క. కాంతా పలాశవృక్షము, లంతటఁ జాలుఁ గొని నిజసుమావళిచేతన్
దంతురితములై యొప్పె వ,సంతసమయ మగుటఁ గంటె సంతస మలరన్.

ఉ. కాతరనేత్ర చూచితివె కమ్మనివాసన లుల్లసిల్లు భ
ల్లాతకవృక్షసంతతులు పలాశఫలప్రసవప్రకాండవి
ద్యోతితమూర్తులై కడు భరోద్ధతి నేలకు వీఁగి చిత్రవి
ఖ్యాతిఁ జెలంగుచున్నవి మృగద్విజకోటి కనాశ్రయంబులై. 1174

ఆ. మధురవాణి కంటె మధుమక్షికాభిసం, భృతము లగుచు భరముకతన వ్రేలి
తూలుచున్న వివిగో ద్రోణప్రమాణంబు, లైన తేనెపెరలు మ్రానులందు.

తే. ప్రసవసంస్తరసంకట రమ్యవిపిన
దేశములయందుఁ దనుఁ గాంచి ధీరఫణితి

మ్రోయు దాత్యూహమున కాభిముఖ్య మొంది
నెమలి గూసెడిఁ గంటివె నీరజాక్షి. 1176

వ. అని బహుప్రకారంబుల నవ్వనవిలాసంబు లవ్వైదేహికిం జూపుచుం జని
చని దవ్వులఁ జిత్రకూటంబుఁ జూచి రాముండు లక్ష్మణున కిట్లనియె. 1177

క. కరియూథానుసృతంబై, గురుతరవిహగప్రణాదఘోషితమై సుం
దరశిఖరంబై యొప్పెడు, నరవరసుత చిత్రకూటనగముం గంటే. 1178

క. అతిరమ్యము బహుతరమి, శ్రితము సమతలంబు పుణ్యశేవధి యగు నీ
క్షితిధరకాంతారంబున, జితవైరీ మనము వసతి సేయుదము రహిన్. 1179

మ. వనదంతావళకర్ణచామరలసద్వాతంబులన్ మార్గసం
జనితాయాసముఁ దీర్చుచు న్భుజగభుక్శబ్దంబుల న్సంస్తుతి
ధ్వనిఁ గావింపుచు నిర్ఝరాంబువుల పాద్యం బిచ్చుచున్ లక్ష్మణా
కనుఁగొంటే గిరిరాజు తా మనకు సత్కారంబుఁ గావించెడిన్. 1180

మ. రుచిరామూల్యఫలోపభోగకుతుకప్రోద్యచ్ఛుకశ్యామమై
యచలద్భూరితమాలమేచకఘనంబై ధాతుసంరక్తమై
ప్రచురాబ్జాకరతీరశోభిసితపత్రస్వచ్ఛమై చూడు మీ
యచలోత్తంసము చిత్రకూట మనుట న్సార్థక్య మొందించెడిన్. 1181

శా. నానాపక్షిరుతాన్వితంబు మృగసన్నాదాన్వితం బున్నతా
హీనానోకహపుష్పశోభితలతాహేలాయుతం బుజ్జ్వలా
స్థానాలంకృత మాత్తమూలఫలము న్స్వాదూదకంబు న్ఘనో
ద్యానప్రావృత మైనయీశిఖరిమీఁద న్నిల్వఁగాఁ బోలదే. 1182

క. ఇది మనకు యోగ్యవాసం, బిది రమ్యం బిది మనోజ్ఞ మిచ్చటఁ బుణ్యా
స్పదు లగుమునులు వసింతురు, సిదిరము లే దిచ్చట సుఖజీవన మబ్బున్. 1183

మ. అని చింతించుచు నమ్మహాశిఖరి డాయం బోయి యప్పట్టునన్
మునినాథేరితవేదమంత్రనినదంబు ల్నింగిపైఁ బర్వఁగా
ఘనహోమానలధూమసంకలితమై గన్పట్టు వల్మీకజ
న్మునిపుణ్యాశ్రమముం గనుంగొనిరి తద్భూపాలవంశోత్తముల్. 1184

రాముఁడు వాల్మీకిమహామునియాశ్రమముఁ జేరుట.

వ. ఇట్లు వాల్మీకిపుణ్యాశ్రమంబుఁ జూచి సీతాసహితంబుగా నమ్మహామునికడకుం
జని తదీయచరణంబుల కభివందనంబుఁ గావించిన నమ్మహర్షిశ్రేష్ఠుండు సమా
దరసంభృతాత్ముండై యమ్మువ్వుర నతిథిసత్కారంబుల సంప్రీతులం జేసి స్వా
గతం బడిగిన నమ్మునికి రాముండు నిజవృత్తాంతం బంతయుఁ దెల్లంబుగా విన్న
వించి సౌమిత్రి నవలోకించి యిట్లనియె. 1185

క. భూరిశ్రేష్ఠములగు దృఢ, దారువులం దెచ్చి తగువిధంబున మనకున్

వారక నిలువఁగఁ జిత్రా, కారంబుగఁ బర్ణశాలఁ గావింపు మిటన్. 1186

క. అనవుడు లక్ష్మణుఁ డగుఁ గా, కనుచుఁ గవాటాభిరామ మగునట్లుగఁ జ
య్యన నాకుటిల్లుఁ గట్టిన, ననుజుని నేర్పునకు మెచ్చి యధిపతి వల్కెన్. 1187

సీతారామలక్ష్మణులు పర్ణశాలా ప్రవేశము చేయుట

వ. వత్సా గృహాధిష్ఠిత శిఖిపర్జన్య ప్రముఖపంచచత్వారింశత్సంఖ్యాక వాస్తుదేవతలకు శాస్త్రచోదితవిధిప్రకారంబున బలిహోమనైవేద్యాదిపూజనంబుఁ గావింపవలయుఁ జిరంజీవు లగువారిచేత నీవాస్తుశమనం బవశ్యకర్తవ్యంబు గావున నీవు విధిధర్మంబు సంస్మరించుచుఁ దదర్థంబు కృష్ణమృగంబును వధించి తెమ్మాదివసంబు శుభదివసం బిమ్ముహూర్తంబు శుభముహూర్తంబు మన మిప్పుడే పర్ణశాలకు శాంతిఁ గావింత మనిన నాలక్ష్మణుండు మేధ్యంబైన కృష్ణమృగంబును వధించి యుపరతశోణితనిష్యందం బగుదాని వహ్నియందుఁ బక్వంబుగాఁ దప్తంబుఁ గావించి తెచ్చి రామునకుం జూపి దేవా కృష్ణమృగం బన్యూనాంగంబై యవైకల్యదగ్ధత్వంబువలనఁ గృష్ణవర్ణంబైన మృగంబుచందంబునం జూపట్టుచున్నది యీమైణేయం బగుమాంసంబుచేత వాస్తుదేవతాసంతర్పణంబుఁ గావింపుం డనిన నమ్మహాత్ముండు నిర్మలోదకంబులం గ్రుంకి నియతుండై గృహదేవవినియుక్తంబు లైనమంత్రంబులు సంగ్రహించి సంగ్రహంబుగా వాస్తుశాంత్యాదికంబుఁ గావించి పూర్వోక్తగృహాధిష్ఠితపంచచత్వారింశద్దేవతాగణంబులఁ దృప్తులం గావించి శుచియై సంతుష్టాంతరంగుండై పర్ణశాలఁ బ్రవేశించి వాస్తుదోషశమనీయంబు లైనపుణ్యాహవాచనాదిమంగళకృత్యంబులు నిర్వర్తించి క్రమ్మఱ స్నానపూర్వకంబుగా రౌద్రంబును వైష్ణవంబు నైన వైశ్వదేవబలిఁ గావించి వద్యంబులఁ గ్రుంకి వీర్యవంతంబు లైనమంత్రంబులు జపించి పాపసంశమనీయం బైనయుత్తమబలిఁ గావించి యష్టదిగ్వర్తి బలిహరణ వేదిస్థలంబులును గణపతివిష్ణుప్రముఖదేవతాయతనంబులును నిర్మించి తత్తద్దేవతల కందంద సూక్ష్మమార్గంబున నవస్థానంబులు కల్పించి వన్యంబు లైనఫలమూలమాల్యపక్వమాంసనలిలదర్భసమిద్గణంబులచేత వేదోక్తప్రకారంబున సర్వభూతంబులఁ దృప్తి నొందించి రాముండు సీతాలక్ష్మణసహితంబుగా సుముహూర్తంబున నంతర్బహిఃప్రాకారభిత్తిప్రతిష్ఠిత యగుదాని విశాల యగుపర్ణశాలఁ బ్రవేశించి సుధర్మాభ్యంతరస్థుం డైన దేవేంద్రుని చందంబునం దేజరిల్లుచు. 1188

సీ. కమనీయఫలభరోన్నమితమాకందనింబానోకహవ్యాప్తసానువులను
నేడాకులనఁటుల నెలమావికానలఁ బుష్పితద్రుమకుంజపుంజములను
సామదదంతావళశార్దూలముఖసత్త్వనినదఘూర్ణితమహావనములందు
రమణీయపులినాభిరామమాల్యవతీనదీతీరపుణ్యప్రదేశములను

తే. వేడ్క విహరింపుచునుదానువీరుఁడయ్యు, లక్ష్మణబలాభిగుప్తుఁడై రమణమెఱసి
సీతతోఁ గూడి సుఖలీలఁజెలఁగుచుండెఁ, గరము పురవిప్రవాసదుఃఖంబువిడిచి.

—— సుమంత్రుం డయోధ్య కరుగుట. ——

వ. ఇచ్చట గుహుండు జాహ్నవీతీరంబున రాముండు దృష్టిపథం బతిక్రమించునందాఁక నచ్చటనుండితదీయకల్యాణగుణగణవిశేషంబులుసుమంత్రునితో వక్కాణించుచు నతనిచేత నామంత్రణంబు వడసి నిజనివాసంబునకుం జనియె నంత సుమంత్రుండు గుహునిచారులవలన రాముని భరద్వాజాభిగమనంబును యమునాతీరప్రాంతకాంతారప్రవర్తనంబును జిత్రకూటప్రవేశనంబును సవిస్తరంబుగా నెఱింగినవాఁడై యరదంబుఁ దోలుకొని గాఢదుర్మనస్కుండై సుగంధబంధురంబులైనవనంబులను సరిత్సరోవరంబులను నగరగ్రామంబులును విలోకించుచుం జని మూఁడవనాటిసాయాహ్నసమయంబునకు శీఘ్రవేగంబున నయోధ్యాపట్టణంబు సేరం జని నిరానందంబై నిశ్శబ్దంబై శూన్యాకారంబై యున్నయప్పురంబుఁ గలయం గనుంగొని శోకవేగసమాహతుండై నిజాంతర్గతంబున. 1190

మ. కరులుం దేరులు గుఱ్ఱము ల్సుభటసంఘంబు ల్పురీసుందరుల్
పురసంవాసులు దేశవాసు లెవ్వ డామోదంబుతో నిండియుం
డ రహిం గ్రాలెడుపట్టణం బిపుడు సీతానాథుఁడు న్లేమిఁ బొం
పిరి శోకానలహేతిఁ గాలినక్రియ న్వీక్షింపఁగా నయ్యెడిన్. 1191

క. అని చింతించుచు మెల్లన, జనుచుండఁగఁ బౌరజను లసంఖ్యులు రథముం
వెనుకొని రాఘవు నెచ్చట, ననఘాత్మక విడిచి వచ్చి తని యడుగుటయున్.

క. వారికిఁ గ్రమ్మఱ నిట్లను, శ్రీరాముని జాహ్నవీసరిత్తీరమునం 1193
దూరమున విడిచి యారఘు,వీరునిచే సెలవుఁగొని నివృత్తుఁడ నైతిన్.

తే. అనుచు వినిపింప విని పౌరు లధికశోక, వేగమున వ్రాలి కన్నీరువెడల నూర్పు
సెగలఁగందుచునందంద చిత్తమెరియ, హారఘూత్తమయనిపొక్కి రార్తులగుచు.

క. పున్నమనాఁటికళానిధి, కెన్నిక యగురామచంద్రు నీయరదముపైఁ 1195
గన్నారఁ జూడ దొరకమిఁ, బన్నుగ నేఁ డిట్లు చంపఁబడితిమి గాదే.

తే. దానయజ్ఞవివాహాది ధర్మకర్మ,ములను మహనీయసుసమాజములను రామ
చంద్రుగుణసాంద్రుధార్మికుసత్యనిరతుఁ,డ నెడిభాగ్యంబుమనకింకఁగలుగునెట్లు.

చ. తపములు సల్పి నైన బహుదానము లర్థుల కిచ్చి యైన ని
శ్చపలతఁ బెక్కుజన్మములు సన్మతితో నొనరించి యైన నీ
యపరిమితప్రభావుని ననంతగుణాఢ్యునిఁ బోలునాథునిన్
నిపుణత నన్యునిం బడయ నేర్తుమె యింక జగత్త్రయంబునన్. 1197

తే. రమణ జనకునిచేఁ బోలె రాముచేత, నూరు పరిపాలితం బగుచుండె నేని
యీపురంబునఁ గలవారి కింతకంటెఁ, బ్రియముసుఖముసామర్థ్యంబు పెంపుగలదె.
తే. అనుచుఁ బౌరులు దుఃఖార్తి నాడుమాట, లాలకించుచు సౌధవాతాయనస్థ
పుణ్యపుణ్యాంగనాశోకమున కడలుచు, రాజవరుఁ డున్ననగరు సేరంగఁ జనియె.

-- సుమంత్రుఁడు దశరథుని సందర్శించుట --

వ. ఇట్లు సుమంత్రుండు పిహితాననుండై రాజమార్గంబునం జని చని రాజమందిర ద్వారసమీపంబునం దేరుడిగ్గి మహాజనసమాకులంబు లైనసప్తకక్ష్యాంతరంబు లతిక్రమించి చనునప్పుడు రామరహితుండై హర్మ్యప్రాసాదవిమానమాలిని యగు నయోధ్యఁ బ్రవేశించి వచ్చుచున్నసుమంత్రు నవలోకించి యంతఃపుర కాంతలు రామాదర్శనకర్శితులై బాష్పవేగపరిప్లుతంబులై నవిపులాయతనేత్రంబులచేత నొండొరుల నిరీక్షించుచు హాహాకారంబులఁ గావించుచు రాజసాన్నిధ్యంబువలన మందంబుగా రోదనంబు సేయుచు రామశోకాభితప్తలై గుసగుసలు వోవుచు నీసుమంత్రుండు తొలుత రామసహితం బైనరథంబుఁ గొని చని యిప్పుడు రామరహితం బైనరథంబుఁ గొని యొంటిమెయిం జనుదెంచు చున్నవాఁడు పుత్రశోకాభిపీడిత యైనకౌసల్య కేమి చెప్పఁగలవాఁ డీదేవిపుత్త్రుండు నిర్యాతుం డగుచుండ. సహించి జీవించు ననియెడునది మిక్కిలి దుష్కరజీవనం బెట్టిజీవనంబు సుకరంబు గాదని సత్యంబుగాఁ దలంచెద మని విలపించుచుండఁ బరమార్థభూతం బైనవారలవాక్యం బాలకించుచుం జని యష్టమకక్ష్యం బ్రవేశించి శోకంబుచేతఁ బ్రదీప్తం బైనదానిపగిదిం జూపట్టునట్టి యొక్క పాండర గృహంబునఁ గుమారునిం దలంచికొని కొండొకసేపు కన్నీరు మున్నీరుగా రోదనంబుఁ జేసి యలసి దీనుండై శోకనిద్రాపరవశుండై నేలం బడియున్న దశరథు నుచితభంగి సందర్శించి మేల్కొల్పి నమస్కరించి రామవృత్తాంతం బంతయు నెఱింగించిన నతం డూరక యవ్వాక్యంబు విని యేమియుం దోఁపక విభ్రాంతచేతనుండై శోకమూర్ఛాపారవశ్యంబునఁ గ్రమ్మఱ ధరణిపయిం బడియె నప్పు డంతఃపురజనంబు లెల్ల మహీపతి పాటంతయుం జూచి భుజం బెత్తి యుచ్చైర్నాదంబున రోదనంబు సేయుచుండి రప్పుడు కౌసల్య సుమిత్రయుం దానును మూర్ఛితుండై పడియున్నమగనిం గ్రుచ్చి యెత్తి యాసీనుం గావించి శోకగద్గదస్వరంబున నిట్లనియె. 1200

సీ. లోకేశ నీయాజ్ఞఁ గైకొని రాముని దారుణారణ్యమధ్యమున విడిచి
వచ్చిన సూతునిపంకఁ గన్గొని మన సిచ్చి సంభాషింప వేటి కింత
యనయంబుఁ జేసితి వని సిగ్గు నొందితో యక్కైక వినుము నీ కధికసుకృత
మగుఁ గాక యిటురిత్తవగచినఁ బనియేమి యధిప యెద్దాని భయంబువలన
తే. సుతునివార్త విచారింపఁ జూపవైతి, వట్టి కైకేయి యిచట లే దడలు మాని

కుఁగ్రి భాషింపు మని పల్కి కొండవంటి, శోకభరమున నవశయై సొలసి వ్రాలె.

తే. ఇట్లు మూర్ఛిల్లి పరితాప మెసఁ జెలంగ, నవని వ్రాలినకౌసల్య నట్టె చూచి
యంతిపురమున విలపించుకాంత లెల్ల, సుస్వరంబుల నేడ్చిరి చూడలేక.

తే. అంత నంతఃపురసముత్థితార్తనాద, మాలకించి పురింగల బాలవృద్ధ
జనము తరుణీజనంబు రోదనముఁ జేసె, నారవంబునఁ బురమెల్ల బోరు కలఁగె.

తే. అప్పు డుపచారముల బోధితాత్ముఁ డగుచుఁ
బుడమిఱేఁ డాత్మజునివార్త నడుగఁ దలఁచి
సూతు దిక్కు మొగంబైనఁ జూచి యతఁడు
సాలమునఁ హస్తయుగ్మంబు గీలుకొలిపి. 1204

తే. భూరిశోకాభితప్తుఁడై పొగులు వాని, భుజగపతిభంగి నూర్పులు వుచ్చువాని
ధ్యానశోకపరీతాత్ముఁ డైనవాని, నధికవృద్ధుని నృపుని డాయంగఁ జనియె.

వ. మఱియు నవసూత్రబద్ధం బైనకుంజరంబుభంగి నస్వస్థుం డైనదశరథునిసమీ
పంబున కరిగి యప్పుడు. 1206

దశరథుఁడు సుమంత్రుని రామవృత్తాంతం బడుగుట.

తే. వేఁడి యూర్పులు సెలఁగంగ విన్నవాటు
వదనమునఁ దోఁప ఘనరజోధ్వస్తగాత్రుఁ
డగుచు శోకసంతప్తుఁడై పొగులుచున్న
వాని సూతునిఁ జూచి భూవరుఁడు పల్కె. 1207

క. సూతా తరుమూలాశ్రితుఁ, డై తాపసవృత్తిఁ దాల్చి యాపదలకు వి
ఖ్యాతిగ సహించి యెచ్చట, సీతాపతి యున్నవాఁడు చెప్పుము నాకున్. 1208

మ. అనఘా భూరిసుఖోచితుం డతఁడు కల్యాణాభిజాతుండు నా
తనితమ్ముండును మేటిసౌఖ్యముల నొందం జాలువాఁ డాయశో
ధను లామంజులతూలతల్పములమీఁదం గూర్కువా రావనా
వనిలో నెట్లు వసింప నేర్తు రిపుడీ వైక్లబ్య మె ట్లోఁగుదున్. 1209

చ. అనుదిన మేఘనుండు తమినాటకు సంగడికాండ్రఁ గూడి గ్ర
క్కునఁ జనువేళ నేనుఁగులు ఘోటకముల్ రథముల్ పదాతులున్
వెనుకొని పోవు నట్టిరఘువీరుఁడు నిర్జన మైన ఘోరకా
ననమున నొంటి నేవిధమునం జరియించు సుమంత్ర చెప్పుమా. 12.0

ఉ. క్రూరమృగప్రకాండ మగు ఘోరవనంబున నేఁడు పాదసం
చారమునం బవిత్రకులజాత మహాసుకుమారి యైనయా
ధారుణిపుత్రిఁ గూడి బలుతావుల నాఁకటిబాధ కోర్చి నా
కూరిమిపుత్రు లెట్లు నయకోవిద గ్రుమ్మరువారు చెప్పుమా. 1211

ఉ. ప్రేమ దొలంగి యాలి కటుప్రీతిగఁ గావలె నంచుఁ బుత్రునిం

దా మును కానకుం బనిచి తద్వ్యథ నిప్పుడు కుందిన స్థలం
బేమి సుమంత్ర యైన విను మీ విటు క్రమ్మఱి వచ్చువేళఁ దా
నేమనె రాఘవుం డనుజుఁ డేమనె నేమనె సీత చెప్పుమా. 1212

తే. అశ్వినులభంగి సుందరు లమితతేజు, లైన మన్నందనులు ఘోరకాననమున
కరుగునప్పుడు వీక్షించి సందువలన, సూత నీవు సిద్ధార్థుండ వైతివి కద. 1213

తే. అమరపదతుల్య మైనరాజ్యంబు విడిచి
సాధుగతిఁ బూని యడవికిఁ జనిన సుతుని
విధము వినుపింపు మల్లైన నిలుతుఁ గొంత
దడవు మేనఁ బ్రాణంబులు దాల్చి నిపుడు. 1214

వ. మఱియు స్వర్గపదంబున నుండి సాధుమధ్యంబునం బడినయయాతిరాజర్షి
చందంబున స్వర్గతుల్యరామసాన్నిధ్యవిహీనుండనై నిర్గమించి తదీయానన్నాది
వ్యాపారశ్రవణంబున జీవించి యుండెద నని రామవచనాకర్ణనోత్కంఠుండై
యడిగిన సుమంత్రుం డమ్మహీపతిం జూచి యెలుంగు సవరించికొని కంఠగత
బాష్పనిరుద్ధం బగువాక్యంబున నిట్లనియె. 1215

సుమంత్రుఁడు దశరథునికి రామవాక్యములఁ జెప్పుట.

సీ. వసుధేశ నే నిట వచ్చునప్పుడు రామచంద్రుండు నయధర్మసంహితముగ
మీతోడ నను మని ప్రీతితో నాతోడఁ జెప్పిన వాక్యంబు చిత్తగింపు
మందంద శిరముచే వందనీయుం డగుమాయయ్య కిపుడు నామాఱుగాఁగ
నంజలిఁగావించి యభివాదన మొనర్చి యడుగులఁ బడియొత్తుమనియె మఱియు

తే. నంతిపురమునఁ గలవారి కధికభక్తి
వందన మొనర్చి వేర్వేఱ వరుసతోడ
సేమ మభివాదనంబును జెప్పు మనుచుఁ
బ్రియముతోఁ జెప్పె నాతోడ నృపవరేణ్య. 1216

వ. మఱియు మజ్జనని యగుకౌసల్యకుఁ బ్రణామంబుఁ జేసి నావచనంబులుగా
నద్దేవితోడం జెప్పు మని నాతోఁ జెప్పినతెఱంగు వినుము. 1217

క. ధర్మము వదలక నిత్యము, నిర్మలమతి వగుచు వహ్నినిలయము తఱియం
దర్మిలి సేవించుచు న, త్కర్ముని బతిఁ గొలుచు చునికి దగు నీ కెపుడున్.

క. మానాభిమానముల గతి, మాని సవతులందు నూడు మాని నృపునికై
మానుగఁ గైకేయిని స, న్మానించుచు నుండు మతిసముచితబుద్ధిన్. 1219

వ. తల్లి భరతునియందు రాజ్యత్వప్రయుక్తగౌరవంబుఁ జేర్పుము రాజు లర్థశ్రేష్ఠు
లగుటం జేసి రాజధర్మంబు సంస్మరించి భరతునియెడ వైముఖ్యంబువిడువుమని
పలికి పదంపడి భరతునితోఁ జెప్పు మనినతెఱంగు వినుము. 1220

ఉ. ఏ నిట వచ్చునప్పుడు మహీవరనందన నీవు వీటిలో
లేనికతంబున న్మతులఁ బ్రీతిగఁ జెప్పుట లేక పోయె న
మ్మానవనాథుసానతి సమంచితరాజ్యముఁ బూని ధర్మము
న్మానక తల్లు లందఱ సమస్థితిఁ జూచుచు నుండు మెప్పుడున్. 1221

వ. మఱియు మహీనాథుండు వయోవృద్ధుండు గావున నమ్మహాత్ముని రాజ్యస్థునిం గా భావించి పాలించుచు యౌవరాజ్యపదస్థుండ వై రాజశాసనంబున జీవింపుము మఱియుఁ బుత్త్రాభికాంక్షిణి యైనకౌసల్యను గై కేయినట్ల సన్మానించుచుండుము. 1222

సుమంత్రుఁడు దశరథునికి లక్ష్మణువాక్యంబులఁ జెప్పుట.

క. అని చెప్పు మనుచు నాతో, మనుజేశ్వర రాఘవుండు మాటికి వినయం
బునఁ బల్కి దుఃఖవశమున, కనుఁగవ సాంద్రముగ బాష్పకణముల నించెన్.

ఉ. రాముఁడు పల్కుమాట విని లక్ష్మణుఁ డూర్పులు వుచ్చి క్రుద్ధుఁ డై
నా మొగ మెట్టె చూచి ఘననాదనిభార్భటితోడ ని ట్లనున్
ఈమహనీయమూర్తి యిపు డేయపరాధముచే నిరంతరో
ద్దామపురీసుఖస్థితులు దక్కి వివాసితుఁ డయ్యెఁ జెప్పుమా. 1224

తే. దోస మెంచక కైక యీతుచ్ఛశాస, నంబు శిరమున నిడికొని నరవరుం డ
కార్య మైనను మది నొక్కకార్యబుద్ధిఁ, జేసి పంచిన నప్పని సేయఁ దగవె.

చ. కపటపుధర్మముం దవిలి గ్రక్కున రాముని లచ్చి నెంతయున్
నిపుణత సంగ్రహించుటకు నేఁడు వరద్వయ మంచు నొక్కబ
ల్మెప మిడి కామదారుణ శిలీముఖవిద్ధుఁడు గాన నాలికై
నృపుఁ డిటు కాన కీయనమునిం బనిచె న్నవిచారహీనుఁ డై. 1226

వ. సుమంత్రా దశరథుండు దైవప్రేరితబుద్ధిం జేసి యిమ్ముఁ బరిత్యజించె నని యంటి వేని దైవప్రేరితుం డైన నొకానొకయపరాధంబు నిరూపించి కదా పరిత్యజింపవలయు నీరామునియం దొక్కింత యైన నపరాధంబు లే దిట్టినిరపరాధుఁ డైనరాముని నెట్లు పరిత్యజించె నిది యుక్తంబు గాదు వినుము. 1227

క. అనుచిత మిది యుచితం బిది, యనుచు విచారింప కానృపాగ్రణి రఘువ
ర్యుని లోకవిరుద్ధంబుగ, వనమున కనుచుటఁ దలంచి వగచెద బుద్ధిన్ 1228

చ. సకలజగద్ధితాచరణు సర్వజగత్ప్రియునిం గుమారునిం
గ్రకచముఁ గంటిచిత్తమునఁ గానకుఁ బంచినయట్టిరాజునం
దిఁక గురుబుద్ధిఁ గూర్పఁ దగ దేటికి వే యన నీమహాత్ముఁడే
సకుఁడు గురుండు దైవమును సర్వము నాకుఁ దలంప సారథీ. 1229

తే. పూర్ణిమాచంద్రవదనునిఁ బుణ్యమూర్తి, ననఘు రాముని నిష్కారణముగ విడిచె
నిట్టిదుష్కర్మకారి యైనట్టిమనుజ, విభుని నెబ్భంగి లోకంబు విశ్వసించు.

తే. సకలలోకాభిరాముని సత్యరతుని, రాముని౯ బరిత్యజించి భూరమణలోక
గర్హితుండ వై యింక నేకరణి జగతి, నేలెద వటంచుఁ జెప్పుము నృపునితోడ.

తే. అనుచు మీతోడ భాషింపు మని సుమిత్ర, కొడుకు గనలుచుఁ బలికెఁ దతోఁ గపటవేగ
మేమని వచింపవచ్చు శ్రీరామునందుఁ, గూర్మి పెంపున నతఁ డంతకు పితుఁ డయ్యె.

ఉ. రాముఁడు పల్కుచందమును లక్ష్మణుఁ డన్నవిధంబుఁ జూచి యా
భూమితనూజ యూరుపులు పుచ్చుచుఁ జిత్రసమర్పితాకృతి౯
మోము మఱవాంచి శోకమున మోమున నశ్రులు గ్రమ్ము దేఱఁ దా
నేమియుఁ బల్కకుండె మనుజేశ్వర రాముని మోముఁ జూచుచున్. 1233

తే. సీతయట్టుల రాముఁడు చిన్నవోయి, కనుల నశ్రులు చనుదేఱ ననుజబాహు
పాలితుం డయి నన్ను మీపాలి కరుగు, మనుచుఁ దా నెట్టకేలకుఁ బనిచె నధిప.

వ. ఏను గృతాభ్యనుజ్ఞుండ నయ్యు నమ్మహాత్ముని విడువం జాలక హృదయంబునం బరితపించుచుఁ గొంతసేపు పురోభాగంబునఁ గృతాంజలిపుటుండ నై కొలిచి యుండి యెట్టకేలకుఁ జిత్తంబు గట్టిపఱచుకొని రథంబు దోలుకొని గుహసహితంబుగా శృంగిబేరపురంబునకుం బోయితి నప్పుడు వైదేహి భూతోపహతచిత్త యైనదాని తెఱంగున విస్మృతసర్వప్రయోజన యై విచ్చవడి యభూతపూర్వవ్యసన యై కన్నీరు నించుచు దీనవదన యై సారెసారెకు రామునివదనంబు విలోకించుచు మరలి చనుదెంచుచున్న నన్ను విలోకించుచుండె నంత రామలక్ష్మణులు జటామండలమండితు లై సీతాసహితంబుగా గంగానది నుత్తరించి యేను విలోకించుచుండఁ బ్రయాగాభిముఖు లై చనిరి లక్ష్మణుండు రఘునందనుం బాలించుచు నగ్రంబునం జనియె నట్లు ప్రస్థితు లైనవారలం జూచి యే నవశుండ నై నివృత్తుండ నైతి నప్పుడు శతముఖముఖవిబుధదుర్లభం బైన శ్రీరామసేవాభాగ్యంబు మాచేతఁ బురాకృతసుకృతపరిపాకంబున లబ్ధం బయ్యె నది యిప్పుడు దైవంబుచేతఁ గ్రమ్మఱ విఘటితం బయ్యె నింక నేమి సేయుదము మనకు వ్యర్థజీవనం బేల యని తద్దుఃఖంబున నశ్రువులు నించుచు రాముం బ్రతికరిన హృదయుం డై యరుగుచుండ రథ్యంబులు మరలకున్న నే నతిప్రయత్నంబునఁ గ్రమ్మఱించికొని రామలక్ష్మణుల కంజలి గావించి దుఃఖము నడంచుకొని శృంగిబేరపురంబుఁ జేరి రాముండు నన్ను మరలఁ బిలుచునో యను నాశచేత నచ్చట గుహునితోఁ గూడఁ గొన్నివాసరంబు లుండి క్రమ్మఱఁ బురంబునకుం జనుదెంచునప్పుడు మార్గంబునందు. 1235

సుమంత్రుఁడు దశరథునికిఁ దాను దారిలోఁ గన్న తెఱఁగుఁ జెప్పుట.

సీ. రమణీయపుష్పకోరకశోభితము లైన మ్రాఁకులు మలమల మఱిఁగి పోయె
నదులు పల్వలములు సమలజలతటాకంబులు తప్తోదకంబు లయ్యె
నుద్యానవనములు నుపవనంబులు పరిశుష్కపర్ణంబు లై సొబగు దప్పె

సత్త్వసంఘంబులు సంచారములు మానెఁ గనులాకరంబులు కలుషజలము
తే. లగుచుఁ బద్మాంబుజంబులై హంసముఖర,ఖగవిరావంబులును లేక క్రాఁగుచుండె
రమ్యగుణమండనుం డైన రాఘవుండు, కాననంబున కరిగిన కారణమున.
తే. మఱియు నావచ్చునప్పుడు నిరుపమాన, విపినములయందుఁ గీరాదివివిధవిహగ
రవము లించుకయైనను జెవికి సోఁక, వేమి చెప్పుదు నాచిత్ర మినకులేశ. 1237
వ. ఇట్టివిపర్యాసంబులఁ జూచుచుం జనుదెంచి యయోధ్యాపురంబుఁ బ్రవేశించి రాజమార్గంబునం జనుదెంచునప్పుడు రామరహితం బైనరథంబుఁజూచి నిట్టూర్పు నిగుడించుచుఁ గన్నీరు సించుచు నూరం గలవారిలోన నొక్కండైన న న్నాశ్వాసింపం డయ్యె మఱియుఁ బురంబునం గలపుణ్యాంగనలు ప్రాసాదహర్మ్యవిమానాగ్రంబుల నుండి హాహాకారంబులు సేయుచు బాష్పధారాపూరితముఖు లై యన్యోన్యవదనావలోకనంబు సేయుచు దీర్ఘస్వరంబున విలపించుచుండిరి యేనురామప్రవాసజనితార్తిత్వంబునమిత్రామిత్రోదాసీనజనుల విశేషం బించుకయైన విలోకింపనైతి నీయయోధ్య యప్రహృష్టమనుష్యయు దీననాగతురంగమయు నార్తస్వరపరిమ్లానయు వినిశ్వసితనిస్వనయు. నిరానందయు రామప్రవ్రాజనాతురయు నై పుత్రహీన యైనకౌసల్యకరణిం దోఁచుచున్న దని పలికిన నాసుమంత్రునివాక్యంబు విని యద్దశరథుండు పరమదీనుం డై బాష్పోపహతవాక్యంబున సుమంత్రున కిట్లనియె. 1238

దశరథుఁడు తన్ను దూఱుకొనుచు నానాప్రకారంబుల దుఃఖించుట.

ఉ. మక్కువతోడ నయజ్ఞులగుమంత్రు లనేకులు గల్గి యుండఁగా
నొక్కనితోడ నైన నయ మొప్పఁగ యోచన సేయ కాలికై
గ్రక్కున రాముని గటికికానకుఁ బొమ్మని యంటి నక్కటా
యక్కడి కేల పోయితి మహాగుణభూషణు నేల వాసితిన్. 1239
తే. మోహవశమున నాలికై మోసపోయి, కులమునకుఁ గీడు చేసితిఁ దలఁప నేల
మొదలఁ గావలె నని చేసి పిదప నిట్లు, పరితపించిన నిఁక నేట్లు పాసిపోవు.
తే. ఏమి చెప్పుదు సూత నాకించు కైనఁ, బుణ్యశేషంబు గల దేని భూరికరుణఁ
గూర్పుముల రాఘవుని నన్నుఁ గూర్పకున్న, నొవలఁ బ్రాణంబు లుండవు తథ్యముగను.
చ. అనఘచరిత్ర యిప్పటికి నైన మదాజ్ఞఁ జరించె దేని పు
త్రుని మరలింపు మత్తెఱఁగు దుర్ఘట మేని రథస్థుఁ జేసి గ్ర
బ్బున రఘువర్యుఁ డున్నవనభూమికి నన్ గొని పొమ్ము సూత యా
ఘను నెడఁబాసి యొక్కత్రుటికాల మిల న్మనఁజాల నెంతయున్. 1242
ఉ. చందురువంటి నెమ్మొగము చాఁగెడుకన్నులు వృత్తదంష్ట్రముల్
సుందరపల్లవాధరము సోఁగకురుల్ మణికుండలప్రభా

బంధురకర్ణయుగ్మమును బారెఁడుచేతులు గల్గురాము నిం
పొందఁగఁ జూడ కున్న నిలుపోపఁ దరంబె సుమంత్ర యుత్తటిన్. 1243

చ. గుఱుతుగ రాముఁ డున్నయెడకుం గొని పోవుట యొండెఁ గానిచో
సురుచిరలీల నయ్యనఘు సుందరరూపము నాత్మలోపలం
దిరముగ నిల్పి చూచుచు నతిత్వరితంబుగ ధర్మరాజమం
దిరమున కేగు టొండె నిఁక నిల్వఁగ నేర్తునె యీజగంబునన్. 1244

తే. ఇట్టిదురవస్థ నొందియే నిపుడు రాము, చంద్రు సద్గుణసాంద్రు విశాలయశుని
సూర్యవంశప్రదీపకుఁ జూడ నేని, యింతకంటెను ఘనదుఃఖ మెద్ది నాకు. 1245

వ. అని నిర్వేదించి యంత కంత కగ్గలం బగుశోక వేగంబున. 1246

శా. ఆభూనాయకుఁ డొంటి నన్నిచట దుఃఖాంభోధిలోఁ ద్రోచి మీ
రీభంగి న్వనసీమ కేగఁ దగ వౌనే కావరే రారె శో
కాభీలాంబుధి నుద్ధరింపఁ గదరే హారామ హాలక్ష్మణా
హాభూపుత్రిక యంచు నించుఁ గనుల న్వ్యాలోలబాష్పాంబువుల్. 1247

వ. అని యివ్విధంబునఁ గొండొకసేపు రామునిం బేర్కొని విలపించుచు నద్దశ
రథుండు కౌసల్యదిక్కు మొగంబై దేవి రామశోకమహావేగంబును సీతావిరహ
పారగంబును శ్వసితోర్మిమహావర్తంబును బాష్పఫేనజలావిలంబును బాహు
విక్షేపమీనౌఘంబును విక్రందితమహాస్వనంబును ప్రకీర్ణకేశశైవాలంబును
గై కేయీబడబానలంబును మదశ్రువేగప్రభూతంబును కుబ్జావాక్యమహా
గ్రహంబును నృశంసావరవేలంబును రామప్రవ్రాజనాయతంబు నగునపార
శోకసాగరంబున నిమగ్నుండ నైతి నింకఁ దరణిభూతుం డగురాముండు లేకు
న్న నిమ్మహాసముద్రంబు దాఁటి దరి చేరుట కేయుపాయంబు లే దని పల్కి
శోకాయాసవిశేషంబున దుఃఖసమ్మూర్ఛితచేతనుం డై వివశత్వంబు నొంది శయ
నంబుసం బడియె నప్పు డక్కౌసల్య మహీపతిపాటంతయుం జూచి భయంబుఁ
గొని ద్విగుణీకృతశోకతాప యై భూతావిష్ట యైనదాని తెఱంగున వేపమాన
యై గతప్రాణ యైనదానివగిదిఁ బుడమిం బడి సుమంత్రు నాలోకించి యి
ట్లనియె 1248

ఉ. నాకొడు కున్నచోటి కటు నన్ను రథింం గొని పొమ్ము తన్ముఖా
లోకన మబ్బదేని మహిలోఁ దృటి యైనను నిల్వఁ జాల నం
దాఁక సుమంత్ర వేగ య్యరదంబు మరల్పుము రాఘవుండు నా
కై కొనఁ డేని తత్క్షణమె గ్రక్కున నేగెదఁ గాల్పుప్రోలికిన్. 1249

—:o:— సుమంత్రుఁడు కౌసల్య నూఱడించుట. —:o:—

క. నా విని సుమంత్రుఁ డెంతయు, భావంబునఁ జాల నగచి ప్రాంజలి యగుచుం
దా వెండి వాకు తడఁబడ, దేవికి నిట్లనియె వగపుదీఱఁగ నంతన్. 1250

మ. తుములంబై కుల మెల్ల ఘూర్ణిలఁగ దుఃఖించె దిక్కుల సం
భ్రమము న్శోకము దైన్యము న్విడుచుమా రాముం డరణ్యంబులో
సమితస్నేహము భక్తియు న్వినయ మొప్పారంగ సౌమిత్రి యు
ల్లము రంజిల్లఁగఁ గొల్చుచుండ సుఖలీలం బొల్చి యుండుం జుమీ. 1251

క. ధర్మజ్ఞుఁ డైనలక్ష్మణుఁ, డర్మిలి రాఘవునిపదము లర్చించుచుఁ దా
నిర్మలమతి యై వనమున, శర్మకరాముష్మికంబు సాధించు రహిన్. 1252

క. జనకసుత విజన మగు కా, ననమున కేఁగియును దనమనంబున భయముం
గొన కెప్పటివలె శ్రీరా మునిపయి రమియించుచుండు ముదితహృదయ యై.

క. ఆ నెలఁత నెమ్మొగంబున, దీనత్వం బించు కైనఁ దెలియనికతనం
బూని ప్రవాసము సేయఁగ, మానుగఁ దగు ననుచు నాదు మదికిం దోఁచెన్.

క. జానకి మున్నారామో, ద్యానంబులఁ గ్రీడ సల్పినట్లుగ విజనం
బైనగహనంబునందును, జానుగఁ గ్రీడించు రామసమ్మానిత యై. 1255

తే. పూర్ణచంద్రనిభాస్య యాభూమిపుత్రి, విజన మగుకాననంబున విభునిమనముఁ
బాయ కెప్పుడు రంజిల్లఁ జేయుచుండు, సాధ్వి నారి నుద్దేశించి శంక వలదు.

క. చిత్తము జీవితము తదా, యత్తంబుగఁ జేసి గృహమునందుంబలె న
య్యుత్తమసతి వనమునఁ బతి, చిత్తము రంజిల్లఁ జేయు సేవాక్రియలన్. 1257

ఆ. విపిన మైన వీడు వీ డైన విపిన మా, యుర్విసుతకు రాముఁ డొద్ద యున్న
నెలవు నొద్దలేని నెలవు క్రమంబున, సాధ్వి యిత్తెఱంగు సత్య మరయ.

వ. మఱియు నద్దేవి మార్గంబునం బోవుచు నెడ నెడ గ్రామంబులు నగరంబులు నదీనదంబులు పాదపంబులు విలోకించి తత్తద్విశేషంబు లన్నియు రామలక్ష్మణుల నడిగి వారివలన నెఱుంగుచు నగరోపవనంబునం గ్రీడింపం బోవుచందంబున నుత్సాహోపేత యై సుఖలీలం జనియె నీవై దేహిసంబంధి యైన యీప్రస్తుతవృత్తాంతజాతంబు సంస్మరించెదఁ గైకేయి నుద్దేశించి సీతచేతఁ బలుకం బడినవాక్యంబు సంస్మరించుటకుం జాల నని యిట్లయోధ్యానిర్గమనకాలికం బైనసీతోక్తకైకేయీవిషయకపరుషవచనంబు కౌసల్యకుఁ బ్రియం బని చెప్పుట కుపక్రమించి వృద్ధ లగువారలకు జీవనైరాశ్యహేతుత్వంబు వీక్షించి ప్రమాదంబునం బలికితి నిది గోపనీయంబు దీని నెఱింగింప నర్హంబు గా దని తలంచి పర్యవస్థితం బైనతద్వాక్యంబునుం బ్రచ్ఛాదించి యద్దేవికి సంతోషహేతుభూతం బైనవాక్యంబున వెండియు నిట్లనియె. 1259

తే. దేవి యే మని చెప్పుదుఁ గ్రోశ నేగు, నపుడు వాతాతపోద్ధతి నమ్మహీజ
ఖిన్నత నొంద దా సీతకు ఛాయ యొసగు, నెల్ల వనముల నెండ వాడదు విచిత్ర మో యెఱుఁగరాదు.

క. తమ్మికి నెన యై పున్నమ, తమ్మిపగతుఁ బోలు చాయఁ దనరెడు సతియా
స్యమ్మించుక యైనను మా, యమ్మా వసి వాడ దెంత యాశ్చర్యంబో. 1061

క. ఆరామచరణములు లా, క్షారసవర్జితము లయ్యు సలలితరక్తాం
భోరుహకోశసమప్రభ, నారూఢిం బొల్చు చున్న వమ్మా చూడన్. 1262

వ. మఱియు నద్దేవి వనగమనసమయంబునందు భూషణవిషయస్నేహంబునం జర
ణాద్యవయవసమర్పితసర్వభూషణ యై నూపురాదిశింజితస్వనానుకారిలీలా
యుక్త యైనపగిది సఖేలంబుగాం బోవు చున్న దదియునుం గాక. 1263

ఆ. వారణాదిఘోరవన్యమృగంబులఁ, గాంచి యించు కైన గాసిపడదు
రామబాహుసాలరక్షిత యగుచు క్షు, మాకుమారి విపినమార్గమందు. 1264

వ. దేవి సీతారామలక్ష్మణులు శోచింపం దగినవారు కారు మనమును శోచింపం
దగినవారము గాము దశరథుండును శోచింపం దగినవాఁడు గాఁ డీపితృవచన
పరిపాలనరూపచరిత్రంబు లోకంబునం దాచంద్రార్కంబుగాఁ బ్రతిష్ఠితం బై
యుండు నీవు శోకంబు విడిచి స్వస్థచిత్తవు గమ్ము మహర్షిజుష్టం బైనమార్గం
బునందు సువ్యవస్థితులై కందమూలాశను లై శుభం బైనపితృవాక్యంబు పరి
పాలించుచు వనంబున నివసించెద రని యిట్లు సుమంత్రుండు పలికిన యుక్తవాది
యగునతనిచేత నివార్యమాణ యయ్యు సుతశోకకర్శిత గావున నెంత
చెప్పిన నుడుగక ప్రియపుత్ర రాఘవా యని పేర్కొని బహుప్రకారంబుల
విలపించుచు నిజభర్త నవలోకించి యక్కౌసల్య యి ట్లనియె. 1265

కౌసల్య దశరథుని నిందించుట.

శా. సానుక్రోశుఁడు సత్యవాదియు వదాన్యశ్రేష్ఠుఁ డింద్రాభుఁ డీ
క్ష్మానాథుం డని నీయశం బఖిలలోకస్తుత్య మై యుండు మ
త్సూనుం గానకుఁ బంచి కామపరతన్ దోషంబు నార్జించి ధా
త్రీనాథోత్తమ కాముకుం డనఁగఁ గీర్తిం గాంచి తీ వెంతయున్. 1266

ఉ. పిన్నటనాఁట నుండియును పెక్కు సుఖంబులచేఁ బ్రవృద్ధు లై
యన్నియుఁ గన్నపుత్రు లిటువంటియవస్థల కెట్లు లోర్చువా
రన్ని యటుండని మ్మతిసుఖార్హ మహాసుకుమార సద్గుణా
భ్యున్నత యైనసీతఁ దలపోసిన గుండియ చాలఁ దుల్లెడిన్. 1267

క. చిన్నది పెక్కుసుఖంబులు, గన్నది ము న్నెన్నఁ డిట్టి కష్టంబులు దాఁ
గన్నయది గాదు కానం, బన్నుగ నెట్లోర్చు నాతపమునకుఁ జలికిన్. 1268

శా. సారాన్నంబు భుజించి గీతకలనిస్వానంబుఁ దా వించు వి
స్తారామంజులతూలతల్పములమీఁదం గూర్కువై దేహి నై
వారాహారము మెక్కి కేసరిఘనధ్వానంబుల న్వించుఁ జె
న్నారం గర్కశపర్ణతల్పములపై నాసీన యౌ నెట్లొకో. 1269

క. తమ్మికి నెన యై పున్నమ, తమ్మిపగతుఁ బోలి కమ్మతావిపలుకులం
గ్రమ్ముకొనురాఘవుని వక్త్ర మ్మెన్నఁడు గాంతుఁ గనులతమి దీఱంగన్. 1270

తే. కరికరోపమపరిఘసంకాశ మైన
కరము తలగడ నిడుకొని కఠినభూమి
శయ్యపై నాకుమారుఁ డెచ్చట వసించి
యున్నవాఁడొ యరణ్యమధ్యోర్వియందు. 1271

తే. అధిప యే మందు నాగుండె యశనిపాత, కల్ప మగుభూరిశోకంబు గాఢ మైన
వేయి పఱియలై పోవదు వితతవజ్ర, సారమయము గాఁబోలు నిస్సంశయముగ.

వ. దేవా సుఖార్హు లైనరామలక్ష్మణులు సీతాసహితంబుగా ననాదరింపంబడి నీచేత నిరస్తు లై దారుణారణ్యంబునం జరించుచున్నవారనియెడునక్కర్మంబు శోచనీయంబు గాదె కరుణారాహిత్యంబున నీచేత నిది కృతం బయ్యె నని వగచి వెండియు నిట్లనియె. 1273

క. హృదయేశ్వర రాముఁడు పంచ,దశాబ్దమునందు మరలఁ జనుదెంచిన ను
న్మదుఁ డై రాజ్యము కోశము, పదపడి రాఘవుని కేల భరతుం డిచ్చున్.

క. చెచ్చెర రాముఁడు సనుయం, బిచ్చుపడం దీర్చి మరల నరుదెంచినఁ దా
నిచ్చునె భరతుఁడు రాజ్యం, బిచ్చినఁ గైకొనునె యతఁ డహీనగుణాఢ్యా.

వ. అది యెట్లనిన వినుము. 1276

చ. గుఱుతుగ శ్రాద్ధకర్త లగు కొందఱు విప్రులు బంధుకోటికిన్
స్థిరమతిచే నిమంత్రణముఁ జెప్పినపాఱులకంటె మున్నె య
క్కఱపడి భోజనం బిడినఁ గ్రమ్మఱ వారలయిండ్ల నమ్మహీ
సురవరు లర్థి మైఁ గుడుపఁ జూతురొకో సుధనైన వల్లభా. 1277

వ. మఱియు ననిమంత్రితబ్రాహ్మణులు తృప్తు లగుచుండ గుణవంతులును సురసమానులును బ్రాజ్ఞులును వృద్ధులు నగునిమంత్రితబ్రాహ్మణోత్తములు వృషభంబులు శృంగచ్ఛేదంబునుం బోలె నిజావమానహేతుకం బైనభోజనంబు గ్రహింప నొల్ల రత్తెఱంగున. 1278

క. జగతీశ వృకము భక్షిం, పఁగఁ దక్కినవన్యసత్త్వమాంసము పిదప
న్వగ చెడి యుపయోగింపఁగ, మృగపతి చిత్తమునఁ దలఁచునే హీనమతిన్.

తే. మనుజనాయక యాతయామంబులు హవి, రాజ్యకుశపురోడాశయూపాదికంబు
లన్యమఖమున వినియోగ మాచరింప, నర్హములుగా వటనరె మహర్షివరులు.

క. హృతసార మైనసురక్రియ, గతసోమం బైనమఖము గతిఁ గైకేయీ
సుతభుక్తవర్జితం బగు, క్షితిరాజ్యము రాముఁ డేల చేకొను నధిపా. 1281

క. నిరుపమబలవద్వ్యాఘ్రము, నగనర వాలాభిమర్శనంబును బోలె
న్గురుమతి యిట్టియసత్కృతి, ననుదార సహింపఁ జాలఁ డతిబలుఁ డగుటన్.

చ. మనుజవరేణ్య రాముఁడు సమంచితధర్మవిదుండు గాన దు
ర్జనులను బ్రీతితో నయవిచారులఁ జేయఁగఁ బూని నీదుశా

ననమున దండకాటవికి నమ్మతి మీఱంగ నేగెఁ గాక యా
యనకు సురాసురప్రముఖు లైనను గీ డొనరింప శక్తులే. 1283

చ. అనఘు యముండు భూతముల నట్ల శరార్చులచే నమస్తతో
యనిధుల నైనఁ గాల్పఁ దగు నంతపరాక్రమశాలి యయ్యు న
త్తనయుఁడు తండ్రిచేఁ దనకుఁ దానె సమాహతుఁ డయ్యె నక్కటా
మనమునఁ జూడఁ దగ్గనిన మత్స్యముచేఁ జిఱుమీనుకై వడిన్. 1284

క. తనయుండు సత్యరతుఁ డీ, మ్మనుజవిభుం డనుచుఁ బొగడు పడయఁ దలఁచి ధ
ర్మనిరతుని నయవినీతా, త్ముని రాముని వెడల ననిచితో నృపతిలకా. 1285

తే. అనఘుఁడు సుతుండు వనమున కరుగ నీకు
శాస్త్రదృష్టంబు రాజర్షి చరితమును బ్ర
ధానము సనాతనం బగు ధర్మ మయ్యె
నేని యుక్త మాధర్మంబు గాన నట్లు. 1286

సీ. రాజేంద్ర విను పతివ్రత యగుసాధ్వికి గణుతింపఁ బ్రథమరక్షకుఁడు భర్త
రెండవగతి నందనుండు మూఁడవగతి దాయ లీముువ్వురు దక్క నొండు
శరణంబు లే దని శాస్త్రంబు లెంచఁగింప నదియు నాపుట్టువ కొదవ దయ్యెఁ
గలకాలమును నీవు కైకకు వశుఁడవై యుంచుకయును మది నెంచ వైతి

తే. విపుడు ఫలకాలమున మహావిపులయశుని, సుతునిఁ గానకుఁ బనిచితివితరులైన
చుట్ట లెల్లను జుల్కగాఁ జూచు నట్లు, చేసితివి వేఱె యింక నూఱు చెప్ప నేల.

చ. జనవర క్రూరమన్మథవశంబున నెయ్యము దక్కి పుత్త్రుని
వ్వనవని కంపి యిట్లు వెనుకం బరితాపము నొంది దేల యీ
నిసపులి యాఁకటం దెలియు నేరక పుట్టినచిన్నికూనలం
దనియఁగ మెక్కి యావెనుకఁ దద్వ్యథచేతఁ గృశించుచాడ్పునన్. 128[illegible]

క. జననాయక నీచేఁ బుర, జనులు సఖులు మంత్రివరులు సతులును భృత్యు
ల్తనయులు బాంధవు లాదిగ, జనులు నిహతు లైరి కులము సంక్షోభించెన్.

దశరథుఁడు తాను మున్ను చేసిన మునికుమారవధముఁ దలంచుకొనుట.

వ. అని యిట్లు శోకాతిశయంబునఁ బరమసంక్రుద్ధయై పరుషంబుగాఁ బలికిన దారు
ణశబ్దసంశ్రితం బైనతద్వాక్యం బాలకించి యద్దశరథుండు పరమదుఃఖితుం డై
దురంతచింతాభరంబున నొల్లం బోయి కొండొకసేపునకుం దెలిసి యేతా
దృశదుఃఖంబునకు నిదానభూతం బైనదుఃఖం బెయ్యది పూర్వకృతం బయ్యె
నో యని సంస్మరించి యీదేవిచేతఁ గథితం బైనసర్వంబు సత్యం బిట్టి దురవస్థ
దొరకొనుటకుఁ బూర్వభవంబునం దేమి యకృత్యంబు గావించితినో యని
క్రమ్మఱ విచారించి వెండియు శోకవ్యాకులేంద్రియుం డై మూర్ఛ నొంది దీర్ఘ
కాలంబున కతిప్రయత్నంబునం దేఱి వేఁడినిట్టూర్పు నిగుడించి తనపార్శ్వ

భాగంబునఁ దనయట్లు దుఃఖించు చున్నకౌసల్య నవలోకించి యత్యుత్కటం
బు లైనపుణ్యపాపంబులచేత నిప్పుడే ఫలం బనుభవింపంబడు ననియెడిన్యా
యంబునఁ బ్రియపుత్రవిశ్లేషదుఃఖం బే ననుభవించు చున్నవాఁడ దీనికి హే
తుభూతం బైనకర్మం బెద్ది యని పదంపడి విచారించి తొల్లి శబ్దవేధి యైనతన
చేతనజ్ఞానంబువలనఁ గృతం బైనమునికుమారవధరూపదుష్కృతకర్మంబు ప్ర
తీతం బైననమ్మహీపతి నిజకుమారవియోగజనితశోకానలంబు మునికుమార
వధజనితదోషస్మరణవాతంబునం బ్రజ్వలితం బై శరీరంబు దహింపం దొడం
గిన సహింపం జాలక మొగంబు వాంచి యంజలిఁ గీలించి ప్రసాదంబు వేఁడు
కొనుతలంపున నక్కౌసల్య కి ట్లనియె. 1290

ఆ. దేవి నీగుణంబు దేవాదులకు నైనఁ, బ్రస్తుతింప వచ్చు భర్తృభక్తిఁ
జేసి ఘోరపాపచిత్తుఁడ నగునామొ,గంబు రోయ కిపుడు గాంచుకతన. 1291

దశరథుఁడు నమ్రుఁడై కౌసల్య ననూనయించుట

తే. రిపులయం దైనఁ గినియకకృప యొనర్చు,నంత శాంతియుఁ గలదానవింతయేల
నన్ను విడనాడెదవు నాదువిన్నపంబుఁ,గైకొని యనుగ్రహింపుముకమలనేత్ర.
తే జలజలోచన ధర్మవిచార యైన, సాధ్వి కెంతయు జగతిలో నగుణుఁ డైన
నిర్గుణుం డైన శాస్త్రోక్తనియతిఁ జూడ,దయితుఁ డొక్కఁడె ప్రత్యక్షదైవతంబు.
ఆ. సాధ్వి నీవు దృష్టజనపరాపరవు న, యజ్ఞ వాత్తధర్మ వార్తి నొంది
తూలు చున్ననన్ను దుఃఖిత వయ్యును, దారుణోక్తి నింత దూఱఁ దగదు.
వ. అని యివ్విధంబున దీనుం డై ప్రార్థించు చున్నయమ్మహీపతివాక్యంబు విని
యద్దేవి జలనిర్గమనమార్గంబు నవోదకంబునుం బోలె శోకబాష్పజలంబులు
నించుచు నతనియంజలిపుటంబు పద్మంబునుం బోలె శిరంబునం గదియించి
రోదనంబు సేయుచు శోకసంభ్రమభయంబులు మనంబున ముప్పిరి గొన
ని ట్లనియె. 1295
క, ధరణీశ భూరిశోకము, దరికొన సైరింప లేక తాపము పేర్మిం
బరుషోక్తు లంటిఁ గాకిటు, తర మెఱుఁగక దూఱ నంత ధర్మేతరనే. 1296
క. జనవర నిను యాచించెద, ననుగ్రహింపు మని పలికి తమ్మాటకు నె
మ్మనమున దుఃఖించి రయం, బునఁ బుడమిం బడినదాన మోహవశమునన్.

కౌసల్య దశరథు ననూనయించుట.

వ. దేవా నీచేత యాచిత నగుటవలన హత నైతి నేను హంతవ్యను గానె యుభ
యలోకంబులయందు శ్లాఘనీయుం డైనపతిచేత నేయువతి ప్రసాదింపంబడు
నది యుత్తమయువతి గానేరదు దాని కైహికాముష్మికసుఖంబులు గలుగ
వదియునుంగాక. 1298
సీ. అవనీశ పతిబుద్ధి ననుసరించెడు సాధ్వి కుభయలోకసుఖంబు లొంద వచ్చు

నను ధర్మ మెఱుఁగుదు నిను సత్యవాదిఁగాఁ దలఁపుదుఁ దెలియనిదానఁగాను
పుత్రశోకార్త నై పొగిలి మై మఱచి పల్కినమాట తప్పుగాఁ గొనకుఁ డిపుడు
శోకంబు ధైర్యవివేకాదుల నడంచుఁ బూని శోకసమానుఁడైన రిపుఁడు

తే. మఱి యొకఁడు లేఁడు ధాత్రి నిష్ఠురరిపుప్రహార మైన సహింప శక్యంబుగాని
కటికి కార్చిచ్చు నంటి శోకంబు చాలఁ, గొంచె మైనను సైరింపఁగూడ దధిప.

వ. జితేంద్రియు లైనయతులును శోకంబున మూఢచేతస్కు లై మోహితు
లగుదురు. 1300

క. తనయుఁ డగురామభద్రుఁడు, వనమునకుం జనినపంచవాసర మిది నా
మనమునకుఁ దోఁచె నెంతయు, జననాయక పంచవర్షసదృశం బగుచున్. 1301

క. నరవర పుత్రవియోగజ, నిరుపమశోకంబు నాదు నెమ్మనమున దు
ర్భర మై పెంపగుచున్నది, సరిదురువేగమున జలధిసలిలమునూడ్కిన్. 1302

వ. అని యిట్లు కౌసల్య పతితోడఁ దగిన తెఱంగున మాటలాడుచుండ సూర్యుం
డు పశ్చిమమహీధరకందరాంతర్గతుం డయ్యెఁ బదంపడి గాఢసంతమసపరిపూ
ర్ణం బై రాత్రికాలంబు ప్రవర్తించె నంత దశరథుం డొక్కింత శోకనిద్రాపర
వశుం డై తల్పంబునం బడి యుండి వెండియు ముహూర్తమాత్రంబునకుం
దెలివొందె నప్పుడు శోకోపహతచేతసుం డై నయమ్మహీపతిని రామలక్ష్మణ
వివాసనసంజాతశోకమోహోపద్రవంబు స్వర్భానుండు సూర్యునిం బోలె
ననివార్యం బై యధిగమించె నిట్లు దురంతదుఃఖతాపంబున బడలుపడుచు నిస్తే
జుం డై యద్దశరథుండు పూర్వకృతం బైనమునికుమారవధరూపదుష్కృతం
బంతయుఁ దెల్లంబుగా నెఱింగించువాఁ డై యాఱవనాఁటినిశాసమయంబున
శోకపీడిత యైనకౌసల్య కి ట్లనియె. 1303

తే. ధరణిలోపలఁ బురుషుఁ డెద్దానిఁ జేయు,నది యశుభ మైన మఱిశుభ మైనఁగాని
సందియము లేదు తత్కర్మజాతఫలము, నిక్కువంబుగఁ బ్రాపించు నీరజాక్షి.

తే. కర్మములు సేయఁ దలకొను కాలమందె
కొసరి గురులాఘవంబులు గుణము దోష
మరయ కుర్వి నెవ్వాఁడు కార్యంబు నడుపు
నట్టిమనుజుఁడు బాలిశుం డనఁగఁ బరఁగు. 1305

వ. అది యె ట్లనిన వినుము సూక్ష్మతరపుష్పం బై నయామ్రవణంబు సూక్ష్మతరఫలం
బుం బుట్టించు నను మోహంబున దాని ఛేదించి వర్ణంబుచేత నాపాతరమ
ణీయంబు లగుపృథుపుష్పంబుల నొప్పుపలాశవనంబు విలోకించి పుష్పం
బున కనురూపం బైనపృథుఫలంబు గలుగు నని ఫలంబునం దాసక్తుం డై తత్ప
లాశారోపణంబుఁ జేసి జలసేచనంబుఁ గావించు నతం డనుభోగప్రాప్తిసమయం
బున స్వోత్ప్రేక్షితఫలాభావంబువలనఁ బరితపించు నెవ్వండు భావిఫలంబు.

విచారింపక కర్మంబు సేయు నతండు ఫలకాలంబునందుఁ గింశుకసేచకుని పగిది దుఃఖించుచుండు నట్టిచందంబున నేనును రామాభిషేకరూపం బైనశుభ కర్మంబుఁ బరిత్యజించి దుఃఖరూపం బైనయాగామిఫలంబ పేక్షించి కైకేయీ ప్రియరూపం బైనయశుభకర్మం బాచరించి కర్మఫలానుభవకాలంబున నశుభ కర్మఫలం బగురామవియోగంబు నొంది రామత్యాగరూపఫల మనుభవించుచు దుఃఖించుచున్నవాఁడఁ గుమారుండును ధనుష్మంతుండును శబ్దవేధిశబ్దప్రాప్తవిఖ్యాతి నైననాచేత నీవక్ష్యమాణమునికుమారవధరూపపాపకర్మంబు కృతం బయ్యె స్వయంకృతతన్మహాపాపకర్మఫలం బేతాదృశదుఃఖరూపం బైయజ్ఞానంబుచేత భక్షితం బైనగరళంబుభంగి సంప్రాప్తం బయ్యె నొకానొక పురుషుండు కింశుకపుష్పంబులు విలోకించి పుష్పం బెట్టి దట్టిఫలం బగు నని యెట్లు మోహితుం డయ్యె నట్లేనును శబ్దవేధ్యహేతుకం బైనఫలంబు నెఱుంగ నైతి నిట్లు శబ్దవేధనం బెట్లు ప్రాప్తించె నంటి వేని యే నకృతవివాహుండ నై యౌవరాజ్యంబు సేయుచున్నసమయంబున. 1306

శా. హర్షం బొప్పఁగ యౌవరాజ్యకటకాధ్యక్షుండ నై వైభవో
త్కర్షం బేర్పడ నేను భూప్రజల నందం బొప్పఁ బాలింప ను
ద్వర్షన్నీలమహాపయోధరలసద్గర్జాసముజ్జృంభ మై
వర్షాకాలము దోఁచె సస్యములకు న్వైదగ్ధ్య మేపారఁగన్. 1307

—దశరథుండు కౌసల్యకు మున్ను తాను జేసినమునికుమారవధముఁ దెల్పుట.—

క. ఖగుఁడు నిజతిగ్మకరముల, జగతిం దపియింపఁ జేసి సర్వరసములం
దిగిచికొని మందకరుఁ డై, యగస్త్యచరిత యగుదక్షిణాశఁ జరించెన్. 1308

క. ఘనములు స్నిగ్ధము లయ్యెను, వనముల దవశిఖి శమించె వలిగా డ్పొసఁగెన్
వనముల మండూకంబులు, వనముల సారంగశిఖులు వారక మ్రోసెన్. 1309

తే. సిక్తపక్షోత్తరము లొరటఁ జేసి ఖగచ,యములు సలిలసుస్నాతంబు లైనమాడ్కి
వృష్టివాతావధూతాగ్రవృక్షసమితి,యం దధివసించెఁ గవగూడి యత్నమలర.

తే. పతితపతదంబుసంఛన్నభద్రదంతి
యచల మగుతోయరాశియ ట్లలరెఁ బొందు
రారుణచ్ఛాయములు సెలయేఱు లహుల
భంగి గిరిధాతువులఁ జేసి పాఱఁ దొడఁగె. 1311

వ. మఱియు నవరసాభిరామం బై యలంకారశాస్త్రంబుపగిది సమున్నతపయోధర మండలం బై యౌవనవద్వనితారూపంబుకై వడి సుప్రసారితవాహినీసందోహం బై జయశీలునిదండప్రయాణంబువై ఖరి సమంతతోవ్యాప్తచపలం బై కాముకునిచిత్తంబుభంగి సహస్రాక్షశరాసనవిభాసితం బై దేవాసురసంగ్రా

మంబుచాడ్పున నిరంతరామృతధారాపూర్ణం బై నాకలోకంబుకరణి నొప్పు నకాలంబునందు. 1312

ఉ. ఏ నొకనాఁటిరేయి రథ మెక్కి శరాసన ముగ్రకాండముల్
మానుగఁ దాల్చి మైఁదుఱుపు మక్కువతోఁ ధరియించి యాత్మలో
నూనినవేడ్కతోడ సరయూతటపుష్పితకాననంబులోఁ
బూని మెకంబులం దునుమఁ బోయితి సాహసరేఖ దోఁపఁగన్. 1313

ఉ. ఈకరణి న్వనావనికి నేగి యనేకమృగవ్రజంబులన్
వీఁక నమోఘబాణముల వేమఱు సోనురునట్లు చేసి యా
చీఁకటిప్రొద్దునం దటిని చేరువ నొక్కెడఁ బొంచి యుంటి న
వ్యాకులమానసుండ నయి వాఁడిమెకంబులఁ ద్రుంచు వేడుకన్. 1314

ఉ. అప్పుడు తన్మహాతటిని యం దొకభూరిగభీరనిస్వనం
బప్పులలో వినంబడిన నప్పుడు దంతి జలంబుఁ గ్రోలఁగా
నొప్పినచప్పు డంచు మది నూహ యొనర్చి శరంబు మౌర్వితోఁ
దప్పక గూర్చి యేసితిని దద్ధ్వని లక్ష్యముగాఁగ నుద్ధతిన్. 1315

సీ. ఆసమయంబున నక్కటా నడురేయి సలిలముఁ గొని పోవ సత్వరముగ
నేగుదెంచితిని న న్నెవ్వాఁడు కరుణ లేకమ్మునఁ గ్రుమ్మెఁ జీరాజినములఁ
దాల్చి వన్యంబులఁ దక్క క మెసవుచు దంశనబాధకుఁ దప్పి యున్న
నాయట్టితపసి కన్యాయంబుగా నిట్టిపాటు వాటిల్లె నేపాటి గలదు

తే. తల్లిదండ్రులు వృద్ధులు తపసు లట్టి, వారి కింక ది క్కెవ్వఁడు బాల్య మాది
గాఁగఁ బెక్కువిధంబుల గాఢభక్తిఁ, గొలిచి నేఁ డిట్లు వాసి పోవలసె నాకు.

వ. ఏ నెవ్వని కేమి పాపంబుఁ జేసితి నాయట్టియజాతశత్రునియందు శస్త్రం బెట్లు ప్రయుక్తం బయ్యె న్యస్తపరపీడనుండ నైననాయట్టిఋషికి శస్త్రంబుచే వధం బెట్లు విధింపఁబడియెఁ గేవలానర్థసంహితం బంతియె కాని మద్వధంబువలన దాని కయ్యెడుఫలం బేమి గురుతల్పగమనునకుం బోలె నాకిట్టిదుర్మరణం బేల కలిగె మద్వధంబునకు దుఃఖింప నింక నాతల్లిదండ్రు లెట్లు జీవించెదరో యని వగచెద వృద్ధు లగునాజననీజనకులు చిరకాలమునుండి నాచేఁ బోషింపఁ బడుచుండి రేను బంచత్వము నొందిన నీక వారల కేమిగతి నన్నునువృద్ధులగు మజ్జననీజనకులను మువ్వుర నొక్కబాణంబుచే బుద్ధిహీనుఁడు వధియించె.

క. అని పలుకుదీనవచనము, విన వచ్చిన నదరి పడి వివేకిత నయ్యో
మునిసుతుఁ డొక్కఁడు నాచే, వినిహతుఁ డయ్యె నని యేనువెఱఁగుజనింపన్.

తే. శరముతోఁ గూర్చినట్టిప్రచండచాప, మవనిఁ బడ వైచి పాపభయంబువలన
మేను కంపింప నయ్యేటి పానయోగ్య, దేశ మటు చేరఁ బోయితి దీనమతిని.

వ. ఇ ట్లరిగి. 1320

క. అవకీర్ణజటాధారునిఁ, బ్రవిద్ధకలశోదకునిఁ బరాగక్షతజ
ప్రవిలిప్తగాత్రు మద్విశిఖవిభిన్నాంగు మునిపుత్త్రుఁ గనుఁగొని భీతిన్. 1321

తే. ఏను మెల్లనడాయంగ నేగనపుడు, పుడమిఁ బడియున్నయమ్మహామునిసుతుండు
గాఢకోపాగ్ని హేతులఁగాల్చుచున్న, వాఁడు పోలె నన్గాంచి కంపమునఁ బలికె.

సీ. అవనీశ వన్యమాహారంబుగాఁ గొని ఘనతపోవృత్తిచేఁ గాన నున్న
యేను నీ కపకార మేమి గావించితిఁ దల్లిదండ్రులకును దప్పిఁ దీర్ప
నంబువుల్గొని పోవ నరుగుదెంచిననన్ను నిష్కారణంబుగ నిశితబాణ
విద్ధుఁ జేసితి వేల వృద్ధు లంధకులు దుర్బలులు నాతల్లిదండ్రులు పిపాసఁ

తే. గొని మదాగమనంబును గోరుచుండు, రట్టి నా రేను బోకున్న నధికతృష్ణ
నలసి యసువులు విడువంగఁగలరు తెలియ, కెంత పాపంబు చేసితి వేమి గలదు.

తే. ఇనకులేంద్ర మాతండ్రి యే నిచట నిపుడు, దారుణశరాభిహతుఁడనై [illegible]ఁగూలి
యున్నచందం బెఱుంగక యున్నకతన, శ్రుతతపఃఫలయోగమి[illegible] లేదు.

క. ఎఱుఁగఁ డని వగవ నేటికి, నెఱిఁగిన మజ్జనకుఁ డిచట నేమి యొనర్చుం
బరిసంచారాక్షము లిద్ధరలో గిరికి గిరిఁ బ్రోవ దక్షత గలదే. 1325

చ. జనవర నీవు వేగ చని సర్వము మన్నిధనప్రవృత్తి మ
జ్జనకునితోడఁ జెప్పుము ప్రశాంతి వహించి యతండు నిన్ను గో
బ్బున శపియింప కుండు నటు పోక యుపేక్ష యొనర్చితేని చ
య్యన ననలుండు గాఱడవి నట్ల వడి న్నిను నీఱు చేసెడిన్. 1326

క. లోకేశ తదాశ్రమమున, కేకపదీ దీన నేగు మిట్లరిగి కృపా
లోకనుఁ డగుమజ్జనకునిఁ, గైకొని ప్రార్థింపు మీవు కడు దీనుఁడవై. 1327

తే. సలిలవేగ మత్యున్నతి సహితమృదున, దీతటంబును బోలె నిశాతశరము
కరము నాదుమర్మంబును గలఁచుచున్న, యది విశల్యునిఁ గావింపు మవనినాథ.

వ. అనిన విని యే న మ్మునిసుతుండు సశల్యుండై బాణక్షతవేదన సహింపంజాలక కంపించుచున్నవాఁడు విశల్యునిం జేసితినేని ప్రాణంబు విడువంగలవాఁ డేమి సేయుదు నని దుఃఖితుండ నై దైన్యంబు నొంది శోకాతురత్వంబున నేమియుం జేయఁ జేతు లాడక యున్న మచ్చింతాప్రకారం బెఱింగి యమ్మునినందనుండు పరమార్తియుక్తుండై యతిప్రయత్నంబున నా కిట్లనియె. 1329

సీ. మానవనాయక కానక చేసినపనికి దుఃఖించిన ఫలము గలదె
ధైర్యంబుచే శోకతాపంబు నణఁగించి స్థిరచిత్తుఁడవు గమ్ము చిత్తమోహ
మింతయు నాకు లేదేను శూద్రకు వైశ్యవలన జనించినవాఁడఁ గాన
బ్రహ్మహత్యాప్రాప్తపాపంబు నీకు లేదని పల్కి బాణవేదన సహింపఁ

తే. జాలక విఘూర్ణితాత్ముఁడై జగతివేష్టి, తాంగుఁడై మాటలుడిగి బిట్టలసియున్న
యమ్మునికుమారుఁ గాంచి యేనుమ్మలించి, కడుభయంబున నడలుచుఁ గదియ నేగి.

వ. మహావ్యథచేత సంకుచితాంగుండ నై పుడమిం బడి యున్నమునికుమారుని శరీరంబున నాటి యున్నశరంబుఁ బెఱికిన నతండు తత్క్షణంబ సంప్రాప్తమరణుం డయ్యె నని పలికి యద్దశరథుండు శోకవేగంబునఁ గన్నీరు నించి వెండియుఁ గౌసల్య కిట్లనియె. 1331

తే. బుద్ధి నరయక చేసిన పుణ్యపాప, ఫలము గుడువక తీఱ దత్యల్పఘుతరము
చిన్ననాఁ డేను గానక చేసినట్టి, పాపఫలము నేఁ డనుభవింపంగ వలసె. 1332

వ. అంత దీని సమీకరింప నెద్ది యుపాయం బని చింతించి యేను. 1333

క. మునిసుతుఁడు సనినపిమ్మట, వనితా జలఘటముఁ గొనుచు వారనివేగం
బునఁ దదుపదిష్టమార్గం,బున నయ్యాశ్రమము సేరఁబోయితి నంతన్. 1234

క. పెనుముదుసళ్లై కన్నులు, గన రాక విలూనపక్షఖగములమాడ్కిం
గన రెడువాదంపతులను, గని యేను గడిందినివ్వెగ న్మనఁగి వెసన్. 1335.

వ మఱియు సంచారాక్షములును సంచారసహాయభూతుం డగుపుత్త్రుం డొద్ద లేమిం జేసి వానికథలనే చెప్పుకొనుచుఁ బ్రయత్నశూన్యు లై పుత్త్రునిరాక కెదురుచూచుచు మరల మున్నిమిత్తంబునఁ బుత్త్రాశారహితు లైనవారు నగుముని దంపతుల నవలోకించి శోకోపహతచిత్తుండను భయసంత్రస్తచేతనుండను నై.

ఆ. వారిఁ గొనుచు నేను వారి డాయఁగఁ బోవు, నంతఁ జరణశబ్ద మాలకించి
యధికతృష్ణఁ బుత్త్రుఁ డనుతలంపున నమ్మ,హామునీంద్రుఁ డిట్టులనియె నపుడు.

తే. పుత్త్ర తడవేల చేసితంబువులు దెమ్ము, సరవి నిందాఁక జలకేళి సలిపితొక్కొ
దప్పికొని యున్న దదిగో మీతల్లి వేగ,యాశ్రమంబుఁ బ్రవేశింపు మనఘచరిత.

క. ఏనును మీతల్లియు మదిఁ, గానక యపరాధ మేమి గావించిన నీ
మానసమున నది యంతయు, మానుగ క్షమియింప వలదె మాన్యచరిత్రా.

తే. హీననేత్రుల మై గతి యింత లేక, యున్నమే మీవె గతి యని కన్ను లనుచు
నమ్మి నీమీఁద మనసుప్రాణములఁ జేర్చి,యుంటిమీలాగు పేక్షింప నుచితమగునె.

వ. అని పుత్త్రుండు మసలుటకు వేగిరపడి కరుణంబుగాఁ బలుకు చున్నయమ్మునివాక్యంబు విని యేను శోకవ్యాకులచిత్తుండ నై పుత్త్రమరణం బెఱింగించుటకు భయంబుఁ గొని యాకంపించుచు మానసవ్యాపారంబును శరీరవ్యాపారంబులను వాగ్బలంబును సంస్తంభించి యిట్లు నియమితకరణత్రయుండ నై పుత్త్రవ్యసనజం బైనభయంబు నెఱింగింప నెట్టకేలకు సాహసించి సజ్జమానంబును నస్పష్టాక్షరయుక్తంబు నవ్యక్తంబును నగువాక్యంబున మెల్లన నిట్లంటి. 1341

సీ. అనఘాత్మ యేను నీతనయుఁడఁ గాను మిత్రకులసంజాతుండ దశరథాభి
ధానుండ విను ధనుర్ధరుఁడనై నడురేయి సరయూతటంబున సలిలపాన
యోగ్యస్థలంబున నురుమృగంబులఁ జంప నేఁ గాచి యుండ నస్నీటిమధ్యమునఁ గుంభమున కంబుఁ బూరించుచప్పుడు విన నైన నది మదద్విరద మొకటి

తే. నీకుఁ గ్రోలెడునప్పటినినద మనుచు, నదియె లక్ష్యముగా విమప్రవర మొకటి
దాఁక నేసిన దానిచే నీకుమారుఁ, డార్తరవమున నిహతుఁడై యవనిఁ బడియె.

క. ఏ నారవంబు విని యను, మానించుచు నదటి కడకి నుద్బాణహతుం
డై నేలం గూలిన నీ, సూనునిఁ గని తీవ్రశోకశోషితమతి నై. 343

క. ఒక్కింత సేపు చింతిలి, గ్రక్కునఁ దద్విదనసరణిఁ గాండముఁ బెఱికిన్
మిక్కిలి కృపచే నను మీ, చక్కటి కేగు మని చెప్పి చనియె మహాత్మా 1344

తే. అధికవృద్ధు లంధు లతిదీను లమితత, పోనుషక్తచిత్తు లైనమీకు
వేచి యింత పాప మాచరించిన నన్నుఁ, దాల్మిఁ జేసి ప్రోవఁ దగు మహాత్మ.

వ. ఇంకఁ జిత్తంబుకొలంది నవధరింతువు గాక యని విన్నవించిన యశనిపాతకల్పం బైననావచనంబు విని భగవంతుండై నయత్తాపసోత్తముండు శోకానలజ్వాలాజాలదందహ్యమానమానసుండై బాష్పంబులు నించుచుఁ దీవ్రాయాసంబు నడంపనశక్తుండై బహువిధంబుల సంతపించుచుఁ గృతాంజలిపుటుండ నై యున్ననా కిట్లనియె. 1436

సీ. మనుజేంద్ర నీ వొనర్చిన యీమహాఘంబు నేఁ జెప్పన నీయంత నీవె వచ్చి
చెప్పుటవలన నీశీర్షంబు పదివేలవ్రక్క లై పోవక తక్కె నేఁడు
నరపతిచేత వానప్రస్థసంయమివధ మనజ్ఞానపూర్వముగఁ జేయఁ
బడె నేని హరి నైనఁ బదఁగ బదభ్రష్టుఁ గావించు బ్రహ్మనిష్ఠావిధిజ్ఞుఁ

తే. డై తపము సల్పుమునివరునందు శస్త్ర, మెఱిఁగి విడిచినఁ దన్మూర్ధ మేడువ్రక్క
లై చనదె కనిసేయునిదగుట నుంటి, వెఱిఁగి చేసినఁ గుల మెల్ల నుఱిఁగిపోదె.

చ. జనవర మత్సుతుండు శరసంహతుఁడై పడి యున్నచోటికిన్
ననుఁ గొని పొమ్ము వేగ పితృనాథవశంగతుఁడై విసంజ్ఞుఁడై
పనుపన నెత్తుటం దడిసి పశ్చిమదర్శనుఁడై ధరిత్రిమీఁ
ద నొరగి యున్నవాని గుణధన్యునిఁ బుత్రునిఁ జూడఁ గోరెదన్. 1348

తే. అనుచు మునిపతి పల్క నేనాత వదలు, గూరన చటికి వారిదోడ్కొనిరయమునఁ
జని కుమారునిఁ జూపినఁ దనువుమీఁద, వ్రాలి శోకంబుచే మానివరుఁడు పలికె.

ఉ. ఓయి కుమారవర్య మము నొంటిగ నిచ్చట డించి పోవఁగా
న్యాయమె నీకుఁ దల్లివగపాఱఁ బ్రియోక్తులు పల్క వేల తం
డ్రీ యని మ్రొక్క వేల నయ మేర్పడఁ గౌఁగిటఁ జేర్ప వేల యే
లా యిలపై వసింపఁ గుపితాత్ముఁడ వైతి వదేల చెప్పుమా. 1350

క. ఇఁక నపరరాత్రమందును, సకలామ్నాయములు సకలసద్వృత్తంబుల్
సకలాధ్యాత్మకథలనుం, బ్రకటంబుగఁ జదువు చుండువాఁ డెవ్వఁడిఁకన్. 1351

క. శీలంబు భక్తి నియమము, గ్రాలఁ బవిత్రాగ్ని వేల్చి గారవ మొసఁగన్

గాలంబు దప్పక సను , వాలాయము గొలుచుచుండువాఁ డెవ్వఁ డిఁకన్.

వ. పుత్రా, సంచారాక్షముండ ననుష్ఠానాశక్తుండ నీవారాదిసంగ్రహరహితుండ ననాయకుండ నైననన్నుఁ బ్రియాతిథినట్లు నిత్యంబును గందమూలాదికంబులచేత నెవ్వాఁడు సంతుష్టునిం జేయు లోచనహీన యై జరాభారంబున డస్సి పుత్రశోకంబునం గాఁగిలెడిభవజ్జనని నెవ్విధంబున భరింతు మహాగుణమండనుండ వైననిన్నుం బాసి యనాథుల మై కన్నులు గానక యివ్వనంబున నెట్లు జీవింపం గలవార మెల్లి తెల్లవాఱిన నేము నీతోడ యమక్షయంబునకుం జను దెంచెద మందాఁక నీకుం బోక యెప్పుడు నీమసలుటకు యముండు గినిసె నేని తల్లిదండ్రుల మైనమమ్ముం దోడ్కొని వచ్చుటకు మసలె ననుగ్రహింపవలయు నని యతనితోడం జెప్పెదము ధర్మాత్ముం డగుయముండు మాయట్టి యనాథుల కభయదానం బొసంగఁడే యని యి ట్లెలుంగున విలపించుచుఁ బాపకర్ముం డగునృపునిచేత నిహతుండ వైతివి గావున నప్పాపంబున నిరయగతికిం బోక యపాపుండ వై సగరశైబ్యదిలీపజనమేజయదుందుమారాదులు చనినలోకంబులకుం జనుము మఱియు శస్త్రయోధులును శూరులును సాధులును స్వాధ్యాయసంపన్నులును దపోనిష్ఠులును భూదానపరులును నాహితాగ్నులును నేకపత్నీవ్రతులును గోసహస్రప్రదాతలును గురుసేవారతులును బరలోకప్రాప్తిసాధనార్థంబు గంగాయమునాసంగమాదియందుం గాని జలంబులందుం గాని వహ్నియందుం గాని తనుత్యాగంబుఁ గావించినవారు నగుపుణ్యాత్ముల లోకంబులు నీకుం గలుగుఁ దపోనిష్ఠుల మైనమాకులంబునం బుట్టినవారికి నిరయగతి లేదెవ్వనిచేత నీవు నిహతుండ వైతి వట్టినృపుండే దుర్గతికిం జనుఁగాక యని పలికి యక్కుమారున కుదకప్రదానంబుఁ గావించిన నప్పు డమ్మునిపుత్రుండు దివ్యదేహధారి యై శక్రసహితంబుగాఁ దల్లిదండ్రుల నాశ్వాసించి మీ కటాక్షంబున నేను బరమస్థానంబు నొందితి మీరును శీఘ్రంబున నాయొద్దకుం జనుదెంచెద రనిపలికి దివ్యతేజోజాలంబు దిక్కులం బిక్కటిల్ల దివ్యవిమానాధిరూఢుం డై యింద్రసహితంబుగా సురలోకంబునకుం జనియెఁ దదనంతరంబ యమ్మునివరుండు కృతాంజలిపుటుండ నై కొలిచి యున్ననన్నుం జూచి యిట్లనియె. 1353

సీ. క్రూరాత్మ, యేకపుత్రుండ నై నననుఁ బుత్రహీనునిఁ జేసితి వింక నిధన
మందు నాకించుకయైన దుఃఖము లేదు హింసింపు మదయత నిపుడె నన్ను
మునుకొని యజ్ఞానమున మత్కుమారునిఁ జంపితి గాన నాచందమునను
బోడిమి సెడి నీవు పుత్రశోకంబునఁ జచ్చెద వజ్ఞానజనిత మగుట

ఆ. వలన బ్రహ్మహత్య వావిరి నినుఁ జెంద, దని యనుగ్రహించి యపుడె తపసి
పత్నితోడఁ గూడి పావకశిఖలందు, నపగతాసుఁ డగుచు నరిగె దివికి. 1354

వ. దేవి యిత్తెఱంగునం దొల్లి శబ్దవేధ్యాభ్యాసి నైననాచేత మౌఢ్యంబువలనఁ
గృతం బైనయిమ్మహాపాతకం బిప్పుడు స్మృతివిషయం బయ్యె నమ్మహాపాప
కర్మఫలం బిప్పు డపథ్యవ్యంజనంబులతో నన్నరసంబు భుక్తంబగుచుండ రోగం
బుపస్థితం బైనమాడ్కి సముపస్థితం బయ్యె నమ్మహాత్మునివచనప్రకారంబున
మరణపర్యవసాయిపుత్త్రశోకంబు సంప్రాప్తం బయ్యె నని రోదనంబు సేయుచు
వెండియు నమ్మహీరమణుండు కౌసల్య నవలోకించి దేవి పుత్త్రుండు దుర్వృత్తుం
డైనను వాని విచక్షణుం డగువాఁ డెవ్వాఁడు పరిత్యజించుఁ బ్రవ్రాజ్యమానుం
డయ్యును సుతుం డెవ్వాఁ డట్టితండ్రియం దసూయ సేయకుండు రాముని
యందు నాచేత నెయ్యది కృతం బయ్యె నది నాకు సదృశం బై యున్నది
నాయందు రామునిచేత నెయ్యది కృతం బయ్యె నది రామునకు సదృశం బై
యున్నది రాముం డిప్పు డొక్కసారి యైనమదీయనేత్రంబులకుం జూపట్టిన
మదీయగాత్రంబు సంస్పృశించిన సప్రాణుండ నై యుండుట శక్యం బై
యుండు నది పరమదుర్ఘటంబు గావున నింక జీవింపం జాల యమక్షయంబు
నకుం జనియెద జీవితంబు మేనిలోఁ జలించుచున్నయది నేత్రంబులు గాన
రా వయ్యె శమనకింకరులు వేగిరపడుచున్నారు కల్యాణగుణాభిరాముఁ డగు
రాముఁ డరణ్యంబునకుం జనిననాఁటనుండి తద్విరహసంజాతశోకంబు ఘనా
తపం బల్పజలంబులం బోలె మత్ప్రాణంబుల శోషింపం జేయుచున్న దింద్రి
యంబులు విషయంబులకుం దప్పెఁ జిత్తమోహంబు పైకొనియె నింక నీతోడ
సంభాషింపుటకుం జాల క్షీణస్నేహదీపసంసక్తరశ్ములుం బోలెఁ జిత్తనా
శంబువలన సర్వేంద్రియంబులు శోషించుచున్నయవి జీవితక్షయకాలంబు
నందు సత్యపరాక్రముండును ధర్మజ్ఞుండు నగురామునిం జూడ కున్నవాఁడ
నింతకంటె నాకు దుఃఖకరం బెద్ది కనకకుండలవిరాజితంబును బద్మపత్త్రనిభే
క్షణంబును శరాసనసౌందర్యగర్వనిర్వాపణచాతురీవిశిష్టభ్రూయుగసంశోభితం
బును సుదంష్ట్రంబును జారునాసికంబును శరత్కాల రాకానిశాకరమండల
ప్రియదర్శనంబును సుగంధినిశ్వాససంయుక్తంబు నైనరాముని వదనంబు
నెవ్వారు విలోకింతు రట్టివా రెల్ల ధన్యు లయ్యెదరు మఱియు నివృత్తవన
వాసుం డై పంచదశవర్షంబునఁ గ్రమ్మఱ నయోధ్యాపురంబునకుం జను
దెంచినరామచంద్రుని మౌఢ్యంబు విడిచి స్వేచ్ఛామార్గగతుం డైనశుక్రునిం
బలె వీక్షించి సకలజనంబులు సుఖు లయ్యెద రిప్పు డాత్మభవం బైనశోకంబు
నదీరయంబు కూలంబుం బోలె నచేతనుండ నై నన్ను శోషిల్లం జేయుచున్న
దని పలికి వెండియు నద్దశరథుండు. 1355

దశరథుండు పుత్త్రశోకమున మృతుఁ డగుట.

శా. హా కాకుత్స్థకులాగ్రణీ గుణమణీ హా రామచంద్రా నినుం

గ్గై కేయీకృతపాపబోధనకథాక్రాంతుండ నై పాసితిన్
శోకం బేర్వఁ దొడంగె నింకఁ బితృరాజుం గొల్వఁగా నేగెదన్
హా కౌసల్య సుమిత్ర హా జనకకన్యా హా సుమిత్రాసుతా. 1356

క. అని విలపింపుచు దశరథ, జననాథుఁడు రామజననిసన్నిధియందుం
దనయునిఁ జింతించుచుఁ జ, య్యన నడురేయిఁ బరమార్తి నసువులు విడిచెన్.

వ. అంతఁ బ్రభాతకాలం బగుటయుఁ బరమసంస్కారు లగుసూతులును నుత్తమశ్రుతు లగుమంగళపాఠకులును స్తుతిశీలు రగుగాయకులును వేర్వేఱ రాజవేశ్మంబునకుం జనుదెంచి స్తుతినాదంబులు గావించిన నుదాత్తాభిహితాశీర్వాదు లగువారల స్తుతిశబ్దంబు ప్రాసాదాభోగవిస్తీర్ణం బై మ్రోసెఁ బదంపడి పాణివాదకులు వృత్తాద్భుతకర్మంబు లుదాహరించి పాణివాదంబులు గావించి రమ్మహాశబ్దంబు విని గృహారామవృక్షశాఖాపంజరస్థితపారావతాదిపతత్త్రిప్రకరంబు మేల్కాని సకలంబుగాఁ గలకలధ్వని గావించె నంత వ్యాహృతంబు లైనహరినారాయణాది పుణ్యశబ్దంబులును బుణ్యశ్లోకపురుషకీర్తనంబును వీణానిస్వనంబును నాశీర్వాదరూపగానంబును రాజచరిత్రపాఠకశ్లోకశబ్దంబులును మృదంగభేరీశంఖకాహళాదివాద్యరవంబులును సాంద్రం బై రాజమందిరాభ్యంతరంబు నిండి చెలంగె నప్పుడు కాలోచితపరిచర్యావిచక్షణులును శుచిసమాచారులు నగుపరిచారకు లంతఃపురసంచారార్హస్త్రీజనవర్షధరసహితు లై హరిచందనసంపృక్తపరిమళోదకంబు కాంచనఘటంబుల సంగ్రహించుకొని స్నానార్థం బవసరం బెఱింగి కాచికొని యుండఁ గొందఱు యువతులు మంగళరూపానులేపనలై లోద్వర్తనంబులును ప్రాశనీయంబు లైనసంపిష్టతిలనారికేళజీరకాది ద్రవ్యవిశేషంబులును దర్పణవస్త్రాభరణాద్యుపస్కారంబులునుం జేకొని వచ్చి యనేకకన్యాయుతలై కాచికొని యుండిరి యిట్లు సర్వపరిజనజాతంబును సర్వలక్షణసంపన్నం బై యథాయోగ్యంబుగా బహూకృతం బై రాజస్వీకారయోగ్యం బై సుగుణవంతం బై లక్ష్మీవంతం బై సముత్సుకం బై నిండి సూర్యోదయసమయం బయ్యె మహీరమణుం డేలకో మేల్కాన కున్నవాఁ డని శంకించుచుండె నాసమయంబున 1358

సీ. మానవనాథునిమరణం బెఱుంగక యవరోధ మచ్చటి కరుగుదెంచి
క్షితినాథబోధనోచితమృదువినయవాక్యంబుల బోధించి యతనిమేను
పరికించి ముకుఁగ్రోళ్లఁ బ్రాణసమీరసంచారంబు లేకున్నశంక నొంది
గాత్రంబు నిట్టట్టు గదిలించి ఱొమ్మునఁ జేయిడి ధాతువిశేష మరసి
తే. ప్రాణలక్షణ మేమి చూపట్టకున్న, నృపుఁడు మృతుఁడయ్యెనని మదినిశ్చయించి
యేటివెల్లువ కెదురైనతృణముఖముల, కరణిఁ గంపించి రారాజకాంత లపుడు

—మృతుండగు దశరథునిఁ జూచి యంతఃపుర స్త్రీ లందఱు విలపించుట.—

సీ. జనపతిచెంతఁ గౌసల్యయుఁ దత్సమీపమున సుమిత్రయు బాధపుత్ర
శోకపరాజితలై కాలయుతలై నచందాన ఘననిద్రఁ జెంది మేని
కాంతియంతయుమాయఁ గడువివర్ణతనొంది తిమిరసమావృతర్క్షములమాడ్కిఁ
గనుపట్టుచు దృగశ్రుకణలుళితాస్యలై పడియుండుటయు వారిపాటుఁ జూచి
తే. విగతజీవితుఁడై నభూవిభునిఁ గాంచి, యంతిపుర మెల్లఁ గెడసినయట్లు తోఁచె
నడవి విభ్రష్టయూథపలైన దంతి, సతులగతి విలపించి రాచారుముఖులు.
తే. వారియా ర్తనినాదంబు ఘోరభంగి, వీనులకు సోఁక విని లేచివెఱఁగు గదురఁ
గలరికౌసల్యయునుసుమిత్రయుగతాసుఁ,డై నపతిఁగాంచివిలపించిరా ర్తలగుచు.
వ. అప్పు డక్కౌసల్య మగనిమరణం బెఱింగి శోకావేశంబున. 1362
చ. మును తనమానసంబున సముత్థితమై పొగ లెత్తి యున్ననం
దనవిపినప్రయాణజనితం బగుదారుణశోకవహ్ని య
మ్మనుజవరేణ్యుపాటుఁ గనినంతనె మండినయట్లయై దహిం
చినఁ గడు సైఁప లేక ధృతి చేడ్పడ నేడ్చుచు వ్రాలె నేలకున్. 1363
మ. గగనప్రచ్యుతమైనతారపగిదిం గ్రవ్యాదవిద్వేషిలో
కగళత్కిన్నరకాంతరీతి విషదిగ్ధక్రూరఖడ్గప్రహా
రగతై రావణియట్ల నిష్ఠురకుఠారచ్ఛిన్నమూలక్షమా
జగతి న్వ్రాలి కలంగె వాతహతచంచద్వల్లిచందంబునన్. 1364
శా. ఈరీతి న్మహి వ్రాలి శోకదహనుం డేఁచ న్వరు ల్వెన్నరుల్
జారన్ జోరున నేడ్చు చున్నయలకౌసల్య న్విలోకించి శో
కారావంబునఁ గైకయీప్రముఖసర్వాంతఃపురస్త్రీజనం
బారూఢి న్విలపించెఁ దత్సదనకుడ్యంబు ల్బదు ల్మ్రోయఁగన్. 1365
వ. ఇట్లు రాజాంతఃపురం బేనాదంబున మొదలఁ బూరితం బయ్యె నమ్మహానాదం
బనంతరప్రవిష్టకైకేయ్యాదులచేత నభివర్ధితం బై వెండియు మిక్కిలి నాద
వంతంబుం గావించె మఱియుఁ బర్యుత్సుకజనాకులం బగుతన్మందిరంబు దశర
థమరణంబున సంత్రస్తసంభ్రాంతం బై తుములాక్రందం బై పరితాపార్తబాం
ధవం బై సద్యోనిపతితానందం బై దీనవిక్లబదర్శనంబై సొబగు దక్కి యుం
డె మృతుం డై నదశరథుం గౌఁగిలించికొని తత్పత్ను లంద ఱొండొరులకరంబు
లు పట్టుకొని యుచ్చైస్స్వనంబున రోదనంబు సేయుచు దీనస్వరంబున విలపిం
చుచుండి రాసమయంబున. 1366

—కౌసల్య కైకేయిని దూఱుట—

మ. హతభానుం డగుభానురీతి గతతోయాంభోధిభంగి న్విని
ర్గతతేజుం డగువహ్నికై వడి గతప్రాణానిలుం డై నభూ

పతి నీక్షించి కడింది శోకమునఁ గంపం బొంది కౌసల్య యు
ద్గతశోకంబునఁ దచ్ఛిరంబు గొనుచుం గైకేయితో ని ట్లనున్. 1367

క. నీకోర్కికిఁ దగునట్లు మ, హీకాంతుఁడు దివికిఁ జనియె నింకవిధవ వై
లోకం బకంటకముగాఁ, జేకొని పాలింపు మొంటిఁ జిక్కి నృశంసా. 1368

చ. నను విడనాడి ఘోరవిపినంబునకుం జనియెం గుమారుఁ డా
తని నెడఁబాసి శోకమున ధారుణినాథుఁడు దీఱెఁ గానలోఁ
జనియెడుసార్థహీన యగునాతిక్రియం బతిహీన నై మహిం
మనుటకుఁ జాల నమ్మనుజనాథుగతిం జనుదాన నెంతయున్. 1369

క. తన కేడుగడయు నై తగు, మనోవిభుఁడు చనినపిదప మన నేసతి నె
మ్మనమునఁ దలంచు సంతృ, ప్తనిజాచార వగు నీ వొకర్తెవు దక్కన్. 1370

తే. పరఁగ లుబ్ధుండు విషమిశ్రపాక మాహ, రించి దోషం బెఱుంగనిరీతిఁ గైక
చేరి కుబ్జానిమిత్తంబు శీలయుక్త, మైనరఘువంశ మది నేఁడు హత మొనర్చె.

మ. అనియోగంబున ధారుణీవిభుఁడు భార్యాప్రేరితుం డై సుపు
త్రుని నిష్కారణ మంగనాయుతముగా దూరస్థునిం జేసినాఁ
డని విన్నంతనె పుత్రహీన యగునాయట్ల మ్మహోదారుఁ డా
జనకక్ష్మాపతి నెవ్వగ న్మనుఁగఁడే సంతాపసంతప్తుఁ డై. 1372

మ. ధరణీనాథునిజీవనాశనము మద్వైధవ్యము న్విన్న వి
స్ఫురదంభోరుహతామ్రనేత్రుఁ డగునాపుత్రుండు రాముండు దు
స్తరశోకంబునఁ గుంద కున్నె పతిచందాన న్మహీపుత్రి దు
ర్భరసంతాపమున న్మలంగుచు విపత్త్రిస్తాత్మ గాకుండునే. 1373

క. రే లధికభీమఘోష, వ్యాలోలమృగద్విజారవాకర్ణనసం
కీలితసాధ్వస యై సతి, జాలిం గొని మగనిచెంత సంకటపడ దే. 1374

క. తనకూఁతుపాటు నెమ్మన, మునఁ బలుమఱుఁ దలఁచి యల్పపుత్రుఁడు వృద్ధుం
డనఘుఁడు వత్సలుఁ డగున, జ్జనకుఁడు పెను వగలఁ దగిలి చావక యున్నే.

ఉ. ఈనరనాథమౌళి తను వెంతయుఁ గౌఁగిటఁ జేర్చి చిచ్చులో
మానక సొచ్చి ప్రాణ మనుమానము లేక త్యజించుదాన నం
చానృపపత్ని బోరునఁ గరాంబుజము ల్వెస నెత్తి రోదన
ధ్వాన మొనర్చె యంతిపురివారు మృదూక్తి ననూనయింపఁగన్. 1376

వ. అంత నమాత్యులు వసిష్ఠాదులచేత నాజ్ఞప్తు లై పుత్రుం డొక్కరుం డైన సమీ
పంబున లేకుండుటవలన దహనాదిక్రియలు గావింపక యమ్మహారాజకళేబరం
బు తైలద్రోణియందు నిక్షేపించి సర్వప్రయత్నంబులం గాచికొని యుండం
దగువారల నియమించి దుఃఖాపనోదకంబులు గావించి రనంతరంబ యంతః

పురకాంతలు పరమదుఃఖాక్రాంతలై కన్నీరు నించుచు బాహువు లెత్తి దీనస్వ
రంబున నిట్లని విలపించిరి. 1377

ఉ. హా మనువంశతోయధి శశాంక సదాప్రియవాది యైనశ్రీ
రాముని బాసి చాలవగల న్మిగులం బొగ లొంది యున్నమ
మ్మామహి నొంటి డించి చననేగతిఁ జిత్తము వచ్చె మీకు న
య్యో మము నింక నెవ్వరు నృపోత్తమ దేర్చెడువారు సెప్పుమా. 1378

క. అస్తోకశోకభరమున, దుస్తామసి యైనకైకతోఁ గూడి యిటన్
స్వస్తి గలిగి మనియుండుట, దుస్తర మగుఁ గాదె మాకు దుర్జనదూరా.

మ. మముఁ గావం దగునంతధీశరథి రామస్వామి రాజ్యేందిరన్
సమతం బాసి యరణ్యసీమ కలయోపాయుక్తుఁడై యేగె నీ
వమరస్థానగతుండ వైతి వీక దుష్టాచారపాపాతిరే
కమునం గ్రాలెడుకైకచెంగట మనంగా నేర్తుమే వల్లభా. 1380

తే. ప్రాణవల్లభ నీవును రాఘవుండు, జానకియు లక్ష్మణుండు నెద్దానిచేతఁ
గరము విడువంగఁ బడితి రాకైకయింకఁ,బుడమిలోనన్య నెవ్వాని విడువకుండు.

క. అని పెక్కుచందముల న, జ్జనపాలపురంధ్రు లధికసంతాపమునం
గనుఁగొనల బాష్పకణములు, చినుకఁగ విలపించి రతనిచెంగట గుములై.

క. ఉడుహీన యైనయామిని, నడువునఁ బతిహీనయైన వనితపగిది న
ప్పుడు రాజహీన యై దెస, చెడి యప్పురి కంటికింపు సేయక యుండెన్.

వ. మఱియు నప్పురవరంబు బాష్పపర్యాకులజనంబై హాహాభూతకులాంగనాసందో
హంబై శూన్యచత్వరవేశ్మాంతంబై నష్టప్రకంతాకులమార్గచత్వరంబై యాక్రం
దితనిరానందంబై పాడఱి నట్లుండె నప్పుడు మిహిరకులనాథుండు పుత్త్రశోకం
బున మృతుం డగుటయు నృపాంగనలు మహీతలగత లగుటయు నివృత్తకిరణ
సంచారుం డై సూర్యుం డపరశిఖరిశిఖరాంతర్గతుం డయ్యెఁ దోడనె కైకే
యీకృతం బగుపాపంబు వెల్లి విరిసినచందంబున గాఢసంతమసంబు రోదసీ
కుహరంబు నిండి యుండె నప్పురంబునం గలనరనారీజనంబులు గుంపులు
గట్టి యార్తనాదంబులు సేయుచుఁ గైకేయి నిందించుచు గాఢదుర్మనస్కులై
యుండి రారాత్రి దుఃఖవశంబున దీర్ఘభూత యై తోఁచె నంతఁ బ్రభాతకాలం
బగుటయుఁ బూర్వమహీధరమండలంబునకు మండనం బై పుండరీకవనబంధుం
డుదయించిన యనంతరంబ. 1384

గౌతమాదిమునులు వసిష్ఠునితో రాజ్యమునకు రాజు నేర్పఱుపవలయు ననుట

చ. విదితవివేకశీలు రగు విప్రులు గౌతమకణ్వకాశ్యపు
ల్మొదలుగ రాజకర్తలగు ముఖ్యు లమాత్యులతోడఁ దత్సభా
సదనముఁ జేరి చక్కఁగ విచారము సేయుచు నక్తులై సభా

సదులు వినంగ నిట్లనిరి సమ్మతి మీఱ వసిష్ఠమౌనికిన్. 1385

క. ఈరాజు పుత్త్రశోకము, చే రాయిడి నొంది విగతజీవితుఁ డగుచో
నూఱేడు లయ్యెఁ గద మన, కీరాత్రి తెల్లవాఱు టెంతయు ననఘా. 1386

చ. జనపతి పుత్త్రశోకమున స్వర్గతుఁ డయ్యెను రామలక్ష్మణు
ల్వనమున కేగి రా భరత లక్ష్మణసోదరు లశ్వరాణ్ణికే
తనమున నున్నవారు వసుధాభర మొక్కటఁ దాల్చి రాజ్యపా
లన మొనరింపఁగాఁ దగినరా జొకని న్నియమింపవల్వదే. 1387

ఆ. రాజు లేనిపురము రాజు లేనిసభంబు, పగిదిఁ గాంతిహీన మగుచు నుండు
రాజహీన మైన రాష్ట్రంబునకుఁ గీడు, పౌరయు జనులు మేలు పొంద రకట.

క. గర్జితము లెసఁగ జపలా, స్ఫూర్జితుఁ డై విసుఁ వారి భువి నెల్లెడలం
బర్జన్యుఁడు గురియఁడు సుగు, ణార్ణవుఁ డగురాజు లేని యా దేశమునన్. 1389

క. మునివర యరాజకం బగు, జనపదమున బీజముష్టి చల్లరు తగ నం
దనులు గురుని మన్నింపరు, వనితలు పతివశత నొంది వర్తింప రిలన్. 1390

క. పెరుఁగవు శుభములు వ్యాధులు, దొఱఁగవు జనములకు వృద్ధి దొరకొనదు నిరం
తరము నరాజక మగున, ప్పురమున ధనధాన్యవస్తుపుంజము లధిపా. 1391

క. అత్యాహితంబు గలుగును, నిత్యానందంబు యశము నిరతిశయసుఖం
బత్యంతహితము గలుగదు, ప్రత్యహమును రాజు లేనిరాష్ట్రమునందున్. 1392

క. మానిగ్రామణి రాజవి, హీనం బగురాష్ట్రమందు హ్రాస్యము లగును
ద్యానంబులు ఫలపల్లవ, సూనసమృద్ధంబు లగుచుఁ జూపట్ట విలన్. 1393

వ. మఱియు నరాజకం బగు దేశంబున నరులు మనస్స్వాస్థ్యాభావంబున సభ గావిం
పరు యజ్ఞశీలు రగువిప్రులు సంశ్రితవ్రతులై దీర్ఘసత్త్రంబులు గావింపక యథోక్త
దక్షిణ లొసంగక పరిత్యక్తవిధికలాపు లై యుందురు మహోద్యానంబులు పుణ్య
సంపాదకగృహంబులు రమ్యంబులు గాకుండుఁ బ్రభూతనటనర్తకు లుల్లాసంబు
నొందరు రాష్ట్రవర్ధనంబు లగునుత్సవంబులు సమాజంబులు వృద్ధి నొందవు వ్యవహా
రులు పరస్పరంబు కుతర్కవాదంబు సేయుచు నిర్ణీతార్థులు గాకుందురు వణిగ్జనం
బులు క్రయవిక్రయాదివ్యాపారంబులం దనిష్పన్నప్రయోజను లగుదు రితిహాస
పురాణాదికథాకథనశీలురు కథాప్రియజనంబులచేత ననురంజితులు గాకుందురు
మఱియు హేమభూషితలై కుమారికలు సాయాహ్నకాలంబున సఖీజనంబులం
గూడి క్రీడార్థం బుద్యానంబునకుం బోవరు సకాము లగుయువపురుషులు విలాస
వతులం గూడి జవయుక్తంబులై నవాహనంబు లెక్కి విహారార్థం బుపవనంబులకుం
బోవకుందురు కృషిగోరక్షజీవు లగుధనవంతులు వివృతద్వారు లై సురక్షితులు
గాక బద్ధకవాటులై యుందురు విషాణవంతంబు లై షష్టిహాయనకుంజరంబులు
బద్ధఘంటాకలాపంబు లై రాజమార్గంబులందుఁ జరింపకుండు నిష్వస్త్రాభ్యాసం

బునందు జనించుశింజినీరవంబు వినంబడకుండు దూరగాము లగువణిజులు బహుప్రియార్హవస్తుసహితులై క్షేమమార్గంబునం జనరు జితేంద్రియుం డగు యతీంద్రుండు శుచియై యెచ్చట సాయంకాలంబగు నట్టిచోట నివసించి స్వస్వరూపావలోకనంబు సేయుచుం జరింపకుండుఁ జతురంగసమృద్ధం బగుసైన్యంబు పగతులం బరిమార్చి విజయంబు నొంపకుండు జనంబులకు యోగక్షేమంబు గలుగ నేరదు రథవాజివారణంబు లారోహించి పురుషులు మృగయార్థంబు వనంబునకుం జనరు శాస్త్రవిశారదు లగునరులు వనోపవనంబులందు హేతువాదంబు గావింపరు నియతియుక్తు లగుజనంబులచేత దేవతాభ్యర్చనార్థంబు మాల్యమోదకాదిపదార్థంబులు కల్పితంబులు గాకుండు రాజకుమారులు చందనాగరుభూషితులై వసంతసమయవృక్షంబులమాడ్కిఁ జూడ్కికి వేడ్క సేయకుండు రదియునుం గాక. 1394

ఆ. కసవు లేనివనము కైవడి సదమల, జలము లేనినదుల చందమునను
గోపహీనలైన గోవులకైవడి, రాజహీనమైన రాష్ట్ర మొప్పు. 1395

తే. అనలునకు ధూమములరథంబునకు ధ్వజము, జ్ఞాపకంబైనభంగి నేఘనుఁడు మనకు
నిత్యమును కేతుభూతుఁడై నెగడె నట్టి, వనజసఖవంశవరుఁడు దేవత్వ మొందె.

తే. విను మనాయక మైనట్టివిషయమందు, మనుజు లన్యోన్యపశుదారధనగృహాప
హారులై యొండొరులఁబట్టిదారుణముగ, మ్రింగుదురుజలచరములభంగిననఘ.

తే. వసుధ నాస్తికు లెవ్వలెవ్వరు వివేక, రహితు లెవ్వారు భిన్నమర్యాదు లట్టి
వారు నృపతిదండప్రభావమున సాధు, భావమువహింత్రుగాదె యోబ్రహ్మపుత్ర.

తే. మేని కక్షి ప్రవర్తక మైనభంగి, రాజు రాష్ట్రంబునకుఁ బ్రవర్తకుఁడు గాన
నట్టి నరపతి లేనిరాజ్యంబునందు, నశుభయోపద్రవము బ్రవర్తకుఁడు గాన.

తే. నృపుఁడె సత్యధర్మములకు నిలయమతఁడె, జగతిఁ గులవంతులకుఁ గులాచారసరణి
యతఁడె తల్లియుఁ దండ్రియు నతఁడె ప్రజకు, హితకరుఁడు సంతతంబు మునీంద్రతిలక.

క. వరుణయమపాకరిపుకి, న్నరనాథప్రభృతిదిగధినాథులు నవ్వి
త్తిరతుం డగునరపతిచేఁ, గరము నధఃకృతులు గారె ఘనగుణశాలీ. 1401

క. తగవును దగమియుఁ దలిపెడు, జగతీపతి లేకయున్నసంయమివర యీ
జగ మినుఁడు లేనిదివసము, పగిదిఁ దమోభూత మగుచుఁ బస చెడియుండున్.

వ. మునీంద్రా మహీపతి మని యున్నయపుడె సముద్రంబు చెలియలికట్ట నతిక్రమింపం జాలనికైవడి నే మందఱము భవద్వచనంబు నతిక్రమింపం జాలక యుందు మిప్పుడె త్తెఱింగున నతిక్రమింపం గలవార మీవు మాస్థితియును మహీపతి లేమిం జేసి యరణ్యభూతంబైనరాష్ట్రంబుం బరికించి వదాన్యుండైన యిక్ష్వాకుపుత్రునిఁ గుమారు నొక్కనిఁ బూజ్యంబైనసామ్రాజ్యంబునకభిషిక్తునిఁగావింపు మనిన నట్ల కాక యని యమ్మునివరుండు జయంతాదిమంత్రుల నవలోకించి.

ఉ. ఆమునిరాజు వల్కు వినయాన్వితుఁ డాభరతుండు నేఁడు మా
తామహునింటఁ దమ్ముఁడును దాను సుఖస్థితి నున్నవాఁడు శ్రీ
రామునితమ్ముఁ డాతనిఁ దిరంబుగఁ దోడ్కొనిరండు విస్ఫుర
త్కామగమంబు లైనతురగంబుల నెక్కి చనుండు గ్రక్కునన్. 1404

— వసిష్ఠుఁడు భరతశత్రుఘ్నులఁ దోడ్కొని రమ్మని మంత్రుల నియోగించుట. —

క. రామునివివాసనంబును, భూమీశ్వరుమృతియుఁ గైకబూమె లతనితో
నేమియుఁ జెప్పక యూరక, నామాటగఁ దోడి తెండు నయ మలరారన్.

ఆ. ఎల్లవారు కుశల మిచ్చుట నని పల్కి, పటవిభూషణము లుపాయనములు
వారివారి కెల్ల వేలువేలు నొసంగి, భరతుఁ దోడి తెండు ప్రాభవమున. 1406

క. అని పయనముఁ జేసిన నమ్మునినాథుని యాజ్ఞ మౌళిఁ బూని మనమునం
బెనువగలు పొగలుకొనఁ జయ్యనఁ జనిరి హయాధిరూఢు లై శీఘ్రగతిన్.

— వసిష్ఠనియుక్తు లగుచారులు గిరివ్రజపురంబుఁ జేరుట. —

వ. ఇత్తెఱంగున నచ్చారులు పుష్కలంబుగాఁ బాథేయంబుఁ గొని చని మొదలఁ బశ్చిమాభిముఖంబుగా నిర్గమించి దక్షిణోత్తరభాగాయతంబు లైన యపరతాలప్రలంబనామగిరిద్వయమధ్యంబుఁ బ్రవేశించి మాలినీనదీతీరమార్గంబున నుత్తరాభిముఖు లై యొక్కింతదూరం బరిగి యవ్వలఁ బ్రలంబపర్వతోత్తరభాగంబు నధిగమించి హస్తినపురసమీపంబునందు గంగానది నుత్తరించి యంతట నుండి ప్రత్యఙ్ముఖు లై కురుజాంగలదేశమధ్యమార్గంబునం జని పాంచాలదేశంబుఁ బ్రవేశించి సంఫుల్లకమలసుగంధబంధురంబు లైనసరోవరంబులును విమలోదకంబు లైననదీసంఘంబులును విలోకించుచుఁ బ్రసన్నసలిలోపరివిహారిహంససారసాదినానావిహంగయుతాభిరామ యై జనాకుల యగుశరదండ యనుదివ్యనది నుత్తరించి యమ్మహానదిపశ్చిమతీరంబున నున్న సత్యోపయాచనం బైనపుణ్యవృక్షంబుకడకుం జని దానికిఁ బ్రదక్షిణంబును బ్రణామంబునుం గావించి యవ్వలఁ గులింగాఖ్యపురంబు దాఁటి యభికాలాఖ్యగ్రామంబు గడచి బోధిభవనాఖ్యపర్వతంబు డాసి దశరథవంశానుభూత యైనయిక్షుమతి యనుపుణ్యనది నుత్తరించి యంజలిప్రమాణజలమాత్రాహారుల బ్రాహ్మణుల వేదపారగుల నిక్షుమతీతీరవాసుల విలోకించుచు బాహ్లీకదేశమధ్యంబునం జని సుదామాఖ్యపర్వతం బతిక్రమించి యచట విష్ణుచరణాంకితస్థానంబు విలోకించుచు విపాశానామనది నుత్తరించి తత్తీరవర్తిశాల్మలీవృక్షంబు విలోకించి యవ్వలసరిత్సరోవరతటాకవాపీకూపానూపంబులు నిరీక్షించుచు సింహవ్యాళమృగద్వీపిసంపూర్ణంబు లైనమహారణ్యంబు లుత్తరించి మహామార్గంబు బట్టి చని శ్రాంతవాహను లై కులరక్షణంబుకొఱకును నృపతిప్రియంబుకొఱకును భర్తృవంశపరిగ్రహంబుకొఱకును బహు

ప్రయత్నంబున రాత్రిసమయంబున గిరివ్రజపురంబుఁ బ్రవేశించియొక్కచోట విశ్రమించి యున్నంత. 1408

భరతునికి దుస్స్వప్న మగుట.

చ. భరతుఁడు నాటిరేయి యొకభంగిని నిద్దుర వోవుచుండి దు
ష్కరమగు నొక్కకీడుకలఁ గాంచి దిగుల్గొని నిద్రలేచి ని
వ్వెఱపడి వేగునంతకును వేగుచు వేగిరపాటుతో నిజం
డఱిముఱిఁ దోఁచినంతనె సభాంతరసీమకు వచ్చి యచ్చటన్. 1409

క. అక్కఱపడి చనుదెంచిన, మక్కువచెలికాండ్రతోడ మాటాడక యే
దిక్కును జూడక గ్రక్కున, చెక్కుటఁ జెయిఁ జేర్చి చింతసేయుచు నుండెన్.

తే. అప్పుడు విషణ్ణవదనుఁడై నట్టిభరతుఁ,జూచిప్రియవాదులగువయస్యులుతదీయ
చిత్తఖేదంబుఁ బాయ విచిత్రపుణ్య,కథలఁ జెప్పిరి కొందఱు కౌతుకమున.

క. మఱియుం గొందఱు మురళీ, కరతాళమృదంగములును ఘనముగ వాయిం
చిరి వారయునతు లెంతయు, సరసత నాట్యములు మ్రోల సల్పిరి వరుసన్.

తే. మఱియు సంస్కృతప్రాకృతమాగధాది, గద్యపద్యాత్మకములైన కావ్యనాట
కములు చదివిరి కొందఱు కరము హాస్య,ములు నచించిరి పరిహాసకులుచెలంగి.

తే. ఇవ్విధంబున హితనుతి సెవ్వ రెన్ని, ప్రమదజనకంబు లగువినోదము లనేక
గతుల సలిపిన నమ్మహీపతిసుతుండు, చిత్తమున నించుకయు సంతసింప కుండె.

భరతుఁడు తనప్రియసఖునికి స్వప్నప్రకారముఁ దెల్పుట.

వ. అప్పు డొక్క ప్రియసఖుండు దీనుండై మొగంబు వాంచి యున్నభరతు నుపలక్షించి యేమికారణంబున నిట్లున్నవాఁడ వని యడిగిన నతం డతని కిట్లనియె. 1415

క. ఇష్టసఖా యే నుందు న, రిష్టం బగుస్వప్న మొకటి రే యాత్మకు సం
దృష్టం బైనకతంబున, నష్టనుహృదయుఁడ నైతి నెమ్మనంబు గలంగెన్. 1416

వ. అత్తెఱం గెఱింగించెద వినుము. 1417

సీ. అచలాగ్ర మెక్కి మా యయ్య క్రొమ్ముడి వీడ గోమయహ్రదములోఁ గూలినట్లు
గోమయహ్రదములోఁ గూలి తైలముఁ గ్రోలి ఘనతైలవాపిలో మునిఁగినట్లు
తైలంబు తల నంటి తైలాన్నము భుజించి నగము బ్రద్దలు వాఱ నవ్వినట్లు
రక్తగంధముఁ బూసి రాసభస్యందన మెక్కి దక్షిణదిశ కేగినట్లు
ఆ వికృతవేష యైన యొకరాక్షసాంగన, రక్తపటముఁ దాల్చి రాజవరుని
నెలమిఁ ద్రాటఁ గట్టి యీడ్చినట్లుగ స్వప్న, మందుఁ గానఁబడియె నాప్తవర్య.

క. అసితాంబరధరుఁ డై యా, యసపీఠంబున విషణ్ణుఁ డగుదశరథు న
త్యసితపిశంగప్రమదలు, వెసఁ జూచుచు నవ్వినట్లు వీక్షింపఁబడెన్. 1419

ఉ. వారిధు లింకినట్లు శశివార కిలం బడినట్లు చిచ్చు చ

ల్లాఱినయట్లు భూమి నిబిడాంధతమోవృత యైనయట్లు రా
డ్వారణశృంగము ల్విఱిగి వ్రాలినయట్లు కుజంబు లెండిన
ట్లుర్వరక కొండలందుఁ బొగలూరిన యట్లుగఁ దోఁచె నంతయున్. 1420

తే. ఇట్టిదుస్స్వప్న మొకటిచూపట్టె నాకు,నదియు మొదలేమియును దోపదయ్యె నట్టి
మాట వినఁబడునో యని మనుజనాథుఁ, డన్నదమ్ములు వీట నెట్లున్నవారొ.

తే. రాసభంబులుఁ బూన్చినరథము నెక్కి, యేనరుం డేని స్వప్నమం దేగినట్లు
దోఁచునట్టిమనుష్యునిధూమము చిత,యం దచిరకాలమునఁ దోఁచునదినిజంబు.

క. కావున నదికారణముగ, భావంబు గలంగి యొక్కభంగిగ నుండె
న్నావిరి విషణ్ణవదనుఁడ, నై వగచెద నృపతి కేమియగునో యనుచున్. 1423

క. ఏమిట భయ మెఱుఁగని నా, కేమో దిగు లగుచుఁ జిత్తమెరియఁగఁ జొచ్చెన్
రామునకు లక్ష్మణునకును, భూమివిభున కేమి కీడుపుట్టునొ యనుచున్. 1424

తే. ఏమిహేతువొ తెలియదు హృదయమునకు
మందత ఘటిల్లెఁ దనుకాంతి మాసె నాన్య
మునకు దైన్యంబు వాటిల్లెఁ బుట్టె నెన్నఁ
డిట్టి వైక్లబ్య మెఱుఁగ నే నించుకైన. 1425

క. మున్నెన్నఁ డిట్టి కల నేఁ, గన్నది లే దేమి చెప్పఁగల నీక ధాత్రీ
భృన్నుతుఁ డగుమజ్జనకు గు, ణోన్నతుఁ జింతింప భీతినొందితి ననఘా. 1426

క. అని సచివునితో రాతిరి, గనుపట్టినయట్టికీడుకల యంతయుఁ దా
వినిపించి వెఱఁగుపడి నె, మ్మనమునఁ దలపోసి వెగడుపడు చున్నంతన్. 1427

ఆయోధ్యనుండి వచ్చినదూతలు భరతుని సందర్శించుట.

క. పురినుండి యరుగుదెంచిన, పరమహితులు దూత లతనిపాలికిఁ జని త
చ్చరణములకు నతు లిడి యక్కఱపడి యి ట్లనిరి వగపు గన్పడ కుండన్.

క. అనఘ పురోహితుఁడు నమాత్యనికరము శుభంబు దెలిపితడయక మిముఁ దో
డ్కొని రమ్మని మముఁ బనిచినఁ, జనుదెంచితి మచటిపనులునమకూర్పుటకున్.

క. మా తెచ్చిన మణిభూషణ, ధౌతాంబరములు గ్రహించి తడయక యుష్మ
న్మాతామహునకు సఖులకు, మాతులున కొసంగు మతిసమంచితబుద్ధిన్. 1430

వ. మఱియు మాతామహునకు వింశతికోటిమూల్యంబులును మాతులునకు దశ
కోటిమూల్యంబులును వేర్వేఱ నొసంగు మని సమర్పించినం గైకొని వారి
నభిమతకామంబుల సంతుష్టులం జేసి యిట్లనియె. 1431

భరతుఁడు తనమాతామహుని నయోధ్య కరుగుటకు సెల వడుగుట.

సీ. మాతండ్రి దశరథోర్వీతలనాథుండు నేమమె మాయన్న రామభద్రుఁ
డానందభరితాత్ముఁ డై యున్నవాఁడె లక్ష్మణునకు మేలె ధర్మజ్ఞ ధర్మ
దర్శిని ధర్మాఢ్య ధర్మవిచారిణి లక్షణలక్షిత రామజనని

కౌసల్య కుశలమె కమనీయగుణశీల యగుసుమిత్రకు భద్రమగునె క్రూర
తే. చిత్త నిజకార్యతత్పరోద్వృత్తశీల, యైనమాతల్లి సుఖయుక్తయగునె మఱియు
దక్షిణనృపాంగనలకు భద్రం బెయారొ, యున్నవా రెల్లఁ గుశలులై యున్నవారె.
క. అని యడిగిన నచ్చారులు, విని భరతునితోడ ననిరి వెండియు దేవా
విను మీ రిపు డడిగినవా, రనువుగ నున్నారు సమ్మదాత్మకు లగుచున్. 1433
క. ఆవంతలేదు భయము సు,ధీవర పద్మకర లక్ష్మి దేవరవారిం
గావలె నని వరియించుచుం, గావున విచ్చేయవలయు గ్రక్కునఁ బురికిన్. 1434
వ. అని వేగిరపడి పలుకు చున్నచారులవాక్యంబు విని భరతుండు శంకాకళంకిత
స్వాంతుండై మాతామహున కిట్లనియె. 1435
క. అనఘా సాకేతపురం,బున కరిగెదఁ దండ్రిఁ జూడ మును గొని మీర
ల్మనమునఁ దలంచినప్పుడె, చనుదెంచెద నాకు సెల వొసంగఁగ వలయున్.

మాతామహమాతులులు భరతునకుఁ గానుక లొసఁగుట

చ. అనుటయుఁ గేకయక్షితితలాధిపుఁ డెంతయుఁ జిత్రకంబళా
జినములు వారణాశ్వములు చీర లనేకధనంబుఁ బ్రీతితో
మనుమని కిచ్చి తచ్చిరము మక్కువ మూర్కొని సత్కరించి మిం
చినయనురక్తి నంపకము చేసి ముదం బిగురొత్త వెండియున్. 1437
మ. అనఘా వీటికిఁ బోయి రమ్ము చటివృత్తాంతంబు సర్వంబు మా
కనుమానింపక చెప్పి పంపు మని సయ్యాటంబుగాఁ బల్కి నూ
తనహారంబులు ధౌతచేలము లమాత్యశ్రేణి కర్పించి సం
జనితానందముతోడ వీడ్కొనియె వాత్సల్యంబు దీపింపఁగన్. 1438

భరతుం డయోధ్య కరుగుట.

వ. ఇట్లు మాతామహుండు ద్విసహస్రవక్షోభూషణంబులును షోడశాశ్వశతం
బులును నపరిమితధనంబును భరతున కొసంగి గుణవంతు లగువారిఁ గొందఱ
మంత్రుల నిచ్చి సముచితంబుగా వీడుకొల్పిన నతనిమాతులుండును రూపసం
పన్నంబులు నిరావదింద్రశిరాఖ్యపర్వతోత్పన్నంబులు నై నగజంబులను వాయు
వేగంబు లైన సైంధవంబులను సుసంయుక్తంబు లైన ఖరంబులను నంతఃపుర
సంవృద్ధంబులును వ్యాఘ్రవీర్యబలాన్వితంబులును దంష్ట్రాయుధంబులును
మహాకాయంబులు నగు శునకంబుల నొసంగి యనంతధనం బిచ్చి యనిచె
నిట్లు కృతప్రయాణుండై భరతుండు మాతామహమాతులదత్తధనాదుల నభి
నందింపక స్వప్నదర్శన భయంబువలనను దూతప్రేరణంబువలనను ద్వరమా
ణుండై మాతామహునకు మాతులునకుం జెప్పి గమనసంవిధానంబుఁ గావించి
శత్రుఘ్నసహితంబుగా రథారోహణంబుఁ జేసి రాజగృహంబు వెలువడి
యింద్రలోకంబు వెలువడినపరమసిద్ధుండుంబోలెఁ దేజరిల్లుచు రాజమార్గం

బునం జనియె నప్పుడు భృత్యులు మండలాకారచక్రంబు లగు పరిష్కృత రథంబులను గోహాయ ఖరోష్ట్రంబులనుం గొని వెంటం జనిరి యిట్లు భరతుండు మాతామహబలాభిగుప్తుం డై ప్రాణసఖు లైనయమాత్యులంగూడి ప్రాఙ్ముఖంబుగాఁ బోవుచు మార్గంబున సుదామాఖ్యనది నుత్తరించి దూరపార యగుహ్లాదినీనది దాఁటి యేలాధాననగరసమీపంబునఁ బశ్చిమాభిముఖప్రవాహతరంగయుక్త యైనశతద్రూతరంగిణిం దాఁటి యపరపర్పటాఖ్యదేశవిశేషంబు లతిక్రమించి శిలాపకర్షణస్వభావ యగుకల్లోలిని దాఁటి యాగ్నేయశల్యకర్తన సంయజ్ఞకం బైనగ్రామద్వయం బతిక్రమించి శిలావహానది నవలోకించుచుఁ జైత్రరథం బనువనంబును లక్ష్యంబుఁ జేసి మహాశైలంబుల నతిక్రమించి పార్శ్వద్వయంబునఁ బ్రవహించు గంగాసరస్వతీనదుల విలోకించుచు వీరమత్స్యోత్తరదేశంబు లతిక్రమించి తదుత్తరంబున భారుండాఖ్యవనంబుఁ బ్రవేశించి పర్వతాభిసంవృత యైనకుళింగాఖ్యనదిని యమునాసమీపంబున దాఁటి యమునానది డాయం జని యమ్మహానదియందు సుస్నాతుం డై తజ్జలపానంబుఁ జేసి జలావగాహనాదికంబునఁ గ్లాంతంబు లైనహయంబుల గాత్రంబులు శీతీకరించి యాశ్వాసించి నిర్మలజలంబులు సంగ్రహించికొని యన్నది నుత్తరించి భద్రజాతీయగజంబు నారోహించి గంధవాహుం డాకాశంబుం బోలె రయంబున నిర్జనం బైనమహారణ్యం బతిక్రమించి యంశుధానాఖ్యపురంబు దాఁటి ప్రాగ్వటాఖ్యపుణ్యపురతీర్థంబున భాగీరథి నుత్తరించి యవ్వలఁ గుటికోష్ఠికాఖ్యనిమ్నగ దాఁటి ధర్మవర్ధనగ్రామంబు గడచి యవ్వలఁ దోరణగ్రామంబునకుదక్షిణభాగంబునం బొల్చుజంబూప్రస్థాఖ్యంబగుగ్రామంబుఁ బ్రవేశించి యచ్చటం గదలి రమ్యం బైనవరూథగ్రామంబునకుం జని తత్సమీపవనంబున నారాత్రి నివసించి యవ్వలఁ బ్రాఙ్ముఖుం డై యరిగి యవ్వల నుజ్జిహానాఖ్యపురసమీపంబునఁ గదంబవృక్షశోభితం బైనమహోద్యానంబుఁ బ్రవేశించి యచ్చటి మహోన్నతప్రియకంబులు విలోకించుచు రయంబున నవ్వనంబు దాఁటి సర్వతీర్థగ్రామంబున నొక్కరాత్రి నివసించి యవ్వల వెనుకొని రమ్మని సేనల కనుజ్ఞ యొసంగి తాను రథారూఢుండై చని యుత్తానికా ప్రభృతి పుణ్యనదు లన్నియు నుత్తరించి హస్తిపృష్ఠకగ్రామసమీపంబునఁ గుటికాఖ్యనదిం గడచి యవ్వల లౌహిత్యాఖ్యనగరసమీపంబునఁ గపీవతీతటిని దాఁటి యేకసాలగ్రామంబున స్థాణుమతి నుత్తరించి వినతాఖ్యనగరంబున గోమతీనది దాఁటి కళింగనగరప్రాంతసాలవనంబుఁ బ్రవేశించి యచ్చట నొక్కింత సేపు విశ్రమించి యవ్వనంబు దాఁటి యవ్వలం జని చని యేనిమిదవనాఁటిసూర్యోదయంబున మనునిర్మితం బైనయయోధ్యాపురంబుఁ గనుంగొని భరతుండు సారథి నవలోకించి యిట్లనియె. 1139

ఉ. సారథికం జెప్పె దవ్వుల విశాలరసాలమహీరుహాళిచే
భూరిగభీరమై పొలుచు పుణ్యవనోపవనంబుల న్శర
న్నీరదపఙ్క్తిఁ బోలు మణినిర్మితశర్మద హర్మ్యపాళిఁ జె
న్నారెడు రాజమార్గముల నద్భుతభంగి వెలుంగు మత్పురిన్. 1440

చ. మఱియు సమాహితాగ్నుల సమానగుణాకరులైన భూసురు
ల్గర మనురక్తి సేయు సకలశ్రుతిమంత్రరవంబు లొక్కటం
దఱుచుగ నిండి మ్రోయు వితతద్యుతి నొప్పెడుదాని రాజశే
ఖరపరిపాలితం బగుచుఁ గ్రాలెడుదాని నయోధ్యఁ గంటివే. 1441

శా. ము న్నీపట్టణరాజమందు సతతంబుం బౌరనారీనరో
త్పన్నంబైన రవంబు మానసరుజ ల్పాయంగ వీతెంచుచుం
డు న్నేఁడేల వినంగరాదు పురిచుట్టుం బొల్చునుద్యానపా
ళి న్నారీయుతులై విలాసపురుషు ల్క్రీడింప రా రేలకో. 1442

భరతుం డయోధ్యను జూచి యందలిదుఃఖనిమిత్తముల సారథికిఁ జూపుట.

తే. అనుదినంబును సాయాహ్నమందుఁ గ్రీడ, సలిపి యుపరతి నొందినజనులచేత
నలరునట్టియుద్యానంబులరయఁ జాల, నిష్ప్రభత నొంది యున్నవి నేఁ డిదేల.

క. వారణతురంగశకటర, థారోహకు లర్థి నీవ లావలి కిపు డే
లా రారు పోరు సారథి, యూ రడవిం బోలెఁ దోఁచు చున్నది మదికిన్. 1444

వ. మఱియు ఫలపల్లవకుసుమమకరందరసాస్వాదమత్తశుకపికశారికాభ్రమరమరాళ విహంగమకూజితస్వనసంకులంబులును నాలవాలకరణదోహనసేచనకందళితంబులును వివిధకుసుమలతాగృహదీర్ఘికాక్రీడాపర్వతాదిశోభితంబులును రమ్యంబులు నగుమహోద్యానంబులు న్రస్తపర్ణద్రుమసంయుతంబు లగుటంజేసి నిరానందంబులై సొబగు దప్పి యున్న వదియునుం గాక. 1445

ఉ కోకిలశారికామధురకూజితము ల్వినరావు వేణువీ
ణాకలనిస్వనంబులు వినంబడ వేలకొ కుందచందనా
నోకహసౌరభాంచితమనోహరసుందరగంధవాహుఁ డే
లా కలయంగ వీవఁడు సఖా వినఁ గానము వాద్యఘోషముల్. 1446

క. ఈకష్టనిమిత్తంబు ల, నేకంబులు దోఁచుకతన హృదయంబున క
స్తోకపరితాప మొదవెను, దేఁకువ సెడి బుద్ధి చాల భ్రిమ్మటగొనియెన్. 1547

తే. ఎల్లభంగుల మావారి కెల్ల మేలు, దుర్లభం బని యాత్మకుఁ దోఁచు చున్న
దనుచు వెలవెలఁ బోవుచు మనసు గలఁగ, భరతుఁ డల్లన నప్పురీవరము సొచ్చె

క. ఈరీతి వైజయంత, ద్వారంబునఁ బురము సొచ్చి త్వరితంబునఁ ద
ద్ద్వారపరిపాలకులు త, న్నోర మొగముఁ బెట్టి సూచుచుండఁగ నరిగెన్. 1448

వ. ఇవ్విధంబున భరతుండు విషణ్ణశ్రాంతానేకాగ్రహృదయుండును లులితేంద్రి

యుండును శ్రాంతవాహనుండు నై రయంబునఁ బురంబు సొచ్చి రాజమార్గంబు
నం బోవుచుఁ బథిశ్రమక్లాంతుం డైనసూతు నవలోకించి వెండియు నిట్లనియె.

క. సూతా నిష్కారణముగ, మాతామహు విడిచి మాని మాటకు దూఁతా
నీతుఁడ నై యే నేలా, యే తెంచితి నిట్టియశుభ మేఁటికిఁ దోఁచెన్. 1551

క. నృపనాశమ్మున నేయే, నెపములు మును చెప్పఁ బడియె నేఁ డవి యెల్ల
న్విపులతరంబుగఁ గనుఁగవ, కిపు డెల్లెడఁ దోఁచుచున్న వెంతయు వీటన్. 1452

వ. మఱియుఁ గుటుంబిభవనంబులు సమ్మార్జనవిహీనంబు లై యసంయతకవాటం
బు లై ప్రభాహీనంబు లై బలికర్మరహితంబు లై ధూపసమ్మోదనశూన్యంబు
లై యభోజితకుటుంబంబు లై శోభాహీనజనాకులంబు లై యలక్ష్మీకంబు లై
సొబగు దక్కి యున్నవి మఱియు దేవాగారంబులు వ్యపేతమాల్యశోభంబు లై
యసమ్మృష్టాంగణంబు లై ప్రవిద్ధంబు లై శూన్యంబు లై యున్నవి యజ్ఞగోష్ఠు
లు పాడఱి యున్నయవి మాల్యాపణంబులందుఁ బణ్యంబులు ప్రకాశితంబులు
గా కున్న వదియునుం గాక. 1453

ఆ. ఎవ్వ రేమి చెప్ప రేలకో పాడఱి, నట్లు దోఁచుచున్న దకట పురము
వణిజు లెల్ల సర్వవస్తువిక్రయవృత్తి, యుతులు గాని వగిది నున్నవారు. 1454

క. సౌరాలయచైత్యంబులఁ, బారావతశుకపికాదిపక్షిగణము సం
చారంబు దక్కె యేలకొ, యూరక కన్నీరు నించుచున్నది కంటే. 1455

తే. ఆననమునందు వైవర్ణ్యమడర నశ్రు, కణము లురలఁగ ధ్యానమూకత వహించి
విక్లబత నొంది యున్నదీ వీట నున్న, నరసమూహంబు కంటివె నర్మసచివ.

క. అని భరతుఁడు సారథితో, ననిష్టశకునంబు లన్ని యాటు వేగ్కొనుచు
న్మనమున దైన్యం బడరఁగఁ, జనియెం దొలుతొ త్త రాజసదనంబునకున్.

భరతుఁడు కైకేయిని సందర్శించుట.

వ. ఇట్లు శూన్యశృంగాటకమందిరరథ్యంబును రజోరుణద్వారకవాటయంత్రంబును
నగుపితృమందిరంబు విలోకించి యందు దశరథుం గానక యప్రియంబు లైన
దుర్నిమిత్తంబు లనేకంబులు గనుంగొనుచు దీనమానసుం డై భయకంపితశరీ
రుం డై మాతృమందిరంబునకుం జని సముచితంబుగా నిజజనని సందర్శించి తచ్చ
రణంబుల కభివందనంబుఁ గావించె నప్పు డక్కైకేయి సంప్రాప్తుం డై [illegible]మా
రునవలోకించి రయంబునఁ గనకాసనంబు డిగ్గి యెక్కింతసేపు పుత్ర[illegible]ం
బునగాఢంబుగాఁ బరిష్వజించి నిజోత్సంగంబున సుఖాసీనుం గావించి [illegible]కం
బు వుణికి శిరంబు మూర్కొని చెక్కిలి ముద్దుగొని చిరకాలంబునకు సమాగ
తుం డగుటవలన నానందపరిపూరితాంతఃకరణ యై ప్రేమగద్గదస్వరంబున నిట్లనియె.

ఆ. అనఘ యెన్నిదినములయ్యె మాతామహు, మందిరంబు విడిచి మమత మాని
నిన్ను విడువఁ జాలెనే యతండు పథిశ్ర, మంబు దీర్చికొనుము మాన్యచరిత

మ. తనయా వచ్చితె మామయిల్వీడిచి యెన్నాళ్లయ్యె మాయయ్య తా
ననునిత్యంబు మనంబునం దలఁచునే నాయన్న సంతోషియై
నినుఁ దా నంపెడువేళ నేమనియె రాజశ్రేష్ఠ మాతల్లి నా
యన నిన్బాసిననాఁటనుండి కను చీఁకట్లయ్యె నా కెంతయున్. 1460

చ. అని ప్రియమారఁ బల్కు తనయమ్మను గన్గొని యాతఁ డిట్లనున్
జననిరొ తాత నిత్యము మనంబున నిన్నుఁ దలంచుచుండు న
య్యనఘుఁడు మాతులుండు సుఖ మై సదనంబున నున్నవాఁడు న
న్ననుపమలీల నేఁగు మని యంపె బహూకృతి జేసి వేడుకన్. 1461

తే. మామ యొసఁగినగజవాజి మణిధనంబు
లధ్వమునఁ జిక్కె నేను రయమున నేఁగు
దెంచితి నృపాలదూతచోదితుఁడ నగుచుఁ
దద్గృహముఁ బాసి సప్తరాత్రంబు కడచె. 1462

సీ. పగడంపుఁగోళ్ల సొంపగునీదుశయనీయపర్యంక మేలకో పాడుదోఁచె
మాయయ్య దశరథక్ష్మాభర్త కుశలి యై యున్నచందము దోఁపకున్న దేమి
యెప్పుడు నీయిల్లు నెడఁబాయఁ జాలని తండ్రి నేఁ డెచటికేఁ దలఁగిపోయెఁ
గృతకాముఁ డై యగ్రసతి యగుకౌసల్యయున్నతాలయమున నున్నవాఁడొ
తే. యమ్మహాత్మునిపాదపద్మమ్ముఁ గొలువ,వలయు నెచ్చటయున్నాఁడొ తెలియఁ జెప్పు
మనిన నక్కైక భరతునాననముఁ జూచి,యిట్లనుచుఁ బల్కె సందియ మింత లేక.

భరతుఁడు పితృమరణం బెఱింగి దుఃఖించుట.

క. చతురుండు యాయజూకుఁడు, జితేంద్రియుఁడు సత్యరతుఁడు క్షితివల్లభుఁడో
సుత భూతంబుల కెయ్యది, గతి యై తగు నట్టిచరమగతికిం జనియెన్. 1464

క. నావుడు భరతుఁడు జనయిత్రీవాక్యం బాలకించి పృథుపరశుహతం
బై వసుధఁ బడినవిటపము, కై వడి మహి వ్రాలె శోకకంపితుఁ డగుచున్.

శా. ఈరీతి న్మహి వ్రాలి శోకదహనుం డేఁచ న్భుజం బెత్తి దీ
నారావంబున నేడ్చెఁ గన్నుఁగవ బాష్పాంబుల్ జడిం గాఱఁగా
హా రాజోత్తమ హా మహాగుణమణీ హా తండ్రి మ మ్మొంటి ని
ష్కారుణ్యంబునఁ బాసి పోవఁ దగవే క్ష్మానాథ యంచున్ రహిన్. 1466

క. అని యీగతి భరతుం డాననమునఁ బట మొత్తి ఘోరనాదమునఁ బ్రతి
ధ్వనులు లీనఁగ నేడ్చుచు మేదినిఁ బడి విలపించెఁ జాల ధృతి వాయంగన్.

ఉ. శారదపూర్ణిమారజనిచంద్రవిరాజిత మైనవారిద
ద్వారముభంగిఁ బొల్పు నృపతల్పము భూపతి లేమిఁ జేసి నేఁ
డారయఁ జంద్రహీన మగు నాకసముం బలె శుష్కతోయ మౌ
వారినిధానముం బలెను భాసిలి యున్నది కాంతిహీన మై. 1468

చ. అని బహుభంగుల న్సముదితార్తరవం బడరంగ నిష్ఠురా
వనిఁ బడి యేడ్చు చున్నహరివారణసన్నిభు నిందుతుల్యుని
న్వనరుహబాంధవప్రతిము వారణవైరినిభుం గుమారునిం
గనుఁగొని లెమ్ములెమ్మనుచుఁ గైకయి కౌఁగిటఁ బట్టి యిట్లనున్. 1469
మ. అమలాత్మా నినుబోఁటిప్రాజ్ఞు లిటు శోకాక్రాంతులై విక్లబ
త్వమునం బ్రాకృతులట్ల దైన్యమున సంతాపింతురే యిట్లు దుః
ఖమునం గూలినఁ జన్నవారు మరలం గాంక్షించి యేతెంతురే
క్షమలోఁ దొల్లిఁటిరాజు లందఱును బంచత్వంబుఁ బ్రాపింపరే. 1470
తే. అనఘచారిత్ర నీబుద్ధి యనవరతము, సవనదానతపశ్శ్రుతిసత్యశౌచ
శీలములయందు మిక్కిలి చేరి యుండు, నర్కరుచి మందరనగంబునందుఁబోలె.
క. అనవుడుఁ గొండొకసేప, య్యనఘుఁడు కఠినోర్వి నొరిగి యారాటమునం
బెనువగలఁ బొగిలి క్రమ్మఱ, జననిం గని యిట్టు లనియె సంతాపమునన్.
ఉ ఉల్లమునందుఁ బ్రేమ దళుకొత్తఁగ రాముని రాజ్యలక్ష్మికి
న్వల్లభుఁ జేయుఁ దా నొకహవం బొనరింపఁ గలండు తండ్రి యం
చుల్లమునందు నమ్మి రయ మొప్పఁగ వచ్చితిఁ గాని యిట్లు మా
కెల్ల దురంతదుఃఖ మిడి యీగతిఁ బోవు టెఱుంగ నక్కటా. 1473
ఉ. సాధుచరిత్రుఁ డార్జవవిచారుఁడు సూనృతవాది యైనభూ
నాథుఁ డమేయధైర్యగిరినాథుఁడు నాచనుదెంచునంతలో
వ్యాధి నశించెనో తెలియ నాడుము నాయన సంస్కరించి రా
మాదికుమారు లెంతయుఁ గృతార్థకులైరికదా తలంపఁగన్. 1474
ఉ. మాతులునింట నుండి గరిమం జనుదెంచిననన్ను మున్ను వి
ఖ్యాతకృపానురాగములఁ గౌఁగిటఁ జేర్చి రజంబు నూడ్చి సం
భూతముదంబున న్శిరము మూర్కొని వేడ్కలు సేయుచుండు నేఁ
డాతనియంగసంగమమహాసుఖముం గన నైతి నక్కటా 1475
ఉ. ఎవ్వఁడు భ్రాత తండ్రిసముఁ డెవ్వఁడు రక్షకుఁ డెవ్వఁ డింక నా
కెవ్వని కేను దాసుఁడ మహీస్థలి నారఘురాముతోడ నా
నెవ్వగ లెల్లఁ దెల్పి జననీ రయ మారఁగఁ బిల్వ నంపు దా
దవ్వులఁ జూచి తచ్చరణతామరసంబులమీఁద వ్రాలెదన్. 1476
క. ధర్మవిదుఁడు ధర్మాత్ముఁడు, ధర్మపథగరిష్ఠుఁ డైన ధరణీనాథుం
డర్మిలిఁ గడచనుచో నయ, ధర్మా సందేశ మేమి దడవెం జెపుమా. 1477
వ. అనిన నక్కైకేయి యిట్లనియె. 1478
శా. ఆభూనాథకులోత్తముం డలసతన్ హా రామ హా లక్ష్మణా
హా భూపుత్త్రిక యంచుఁ జేర్కొని తదీయానూనరమ్యాకృతు

ల్దా భావంబున నిల్పి తద్గుణగణధ్యానంబుఁ గావించుచు
న్శోభాహీనత నొంది మేను విడిచెన్ క్షోభంబు వాటిల్లఁగన్. 1479

తే. జానకీలక్ష్మణులఁ గూడి సంభ్రమమున, విపినమున నుండి క్రమ్మఱ వీటి కరుగు
దెంచినరఘూత్తమునివిలోకించి యెల్ల,జనులు సిద్ధార్థు లయ్యెద రనుచుఁబలికె.

వ. అని పలికిన నద్దేవివచనంబు విని ద్వితీయాప్రియశంసనంబువలన మిక్కిలి విష
ణ్ణవదనుం డై వెండియు నద్దేవి కిట్లనియె. 1481

—భరతుఁడు కైకేయిని రామవివాసనంబునకుఁ గారణం బడుగుట.—

క. జననీ కౌసల్యానం, దనుఁ డవనీపుత్త్రిఁ గూడి తమ్ముఁడు గొలువ
న్దనపురము విడిచి యెచ్చట, నునికిం గావించె దాని నొయ్యనఁ జెపుమా.

చ. అన విని వేడ్కఁ గ్రాలుహృదయంబున నజ్జగఱాఁగ కూర్మి ని
ట్లను నిసుమంత గొంకక జటాజినము ల్ధరియించి భూమినం
దనియు సుమిత్త్రపట్టియు ముదంబునఁ దోఁ జను దేర దండకా
వనమున కేగె రాముఁడు ధ్రువంబుగ రాజ్యముఁ బాసి పుత్త్రకా. 1483

ఉ. నా విని విన్నవాటు వదనంబునఁ దోఁప నతండు బాష్పము
ల్వావిరిఁ గ్రమ్ముదేర బలువంతలఁ గుందుచుఁ ద్రస్తచిత్తుఁ డై
భూ వియదంతరాళపరిపూరితకీర్తిని రామమూర్తినిన్
భావమునందు నిల్పి నిజవంశసమంచితసూక్తి నిట్లనున్. 1484

ఉ. ఎన్నఁడు విప్రసొమ్ము భుజియింపఁ డధర్మము త్రోవఁ బోఁడు తా
నెన్నఁడు నన్యకాంతపయి నించుకయైన మనంబు సేర్పఁ డా
పన్నశరణ్యుఁ డంచితకృపాలుఁడు ధర్మవిధిజ్ఞుఁ డై నమా
యన్న యదేల భ్రూణహునియట్ల వనంబున కేగెఁ జెప్పుమా. 1485

చ. అన విని యానృశంసిని నిజాత్మజునిం బరికించి తా నొన
ర్చినకొఱగానికార్యములఁ జెప్పినఁ జాలఁ గృశించునే కదా
యని జగఱాఁగ యాట హృదయంబున నించుక శంక నొందకా
యనువున స్త్రీస్వభావమున నాతనితో ముద మంది యిట్లనున్. 1486

—కైకేయి భరతునకు రామవివాసంబునకుఁ గారణంబుఁ దెల్పుట.—

ఉ. ధర్మము దప్పి కాదు పరదారధనాదులఁ గోరి కాదు దు
ష్కర్మ మొనర్చి కాదు ద్విజసత్తముని న్వధియించి కాదు స
ద్ధర్మవిశారదుండు నృపధర్మవిధిజ్ఞుఁడు నై నరాఘవుం
డర్మిలిఁ గానకుం జనుట కైన తెఱం గెఱిఁగింతుఁ బుత్త్రకా. 1487

చ. అఱమఱ యింతలేక వినుమా మును మీజనకుండు నాకుఁ దా
వరములు రెండొసంగె నవి వాఁగొని నీకు నరాధిపత్యముం

బరువడి రామభక్తకుఁ బ్రవాసముఁ గోరితిఁ గోరిన న్మహీం
వరుఁ డగుఁ గాక యం చతని వారక పొమ్మని పంచెఁ గానకున్. 1488

ఉ. పంచిన నంచి దంచు నరపాలశిఖామణి యైనరాముఁ డ
భ్యంచితలీల వల్కలజటాజినము ల్ధరియించి యాత్మలో
నించుక యైన న్బ్రక్కక మహీజయు లక్ష్మణుఁ డంటి వెంట రా
వంచన యింత లేక వనవాటికిఁ బోయెఁ బితౄణ మీఁగఁగన్. 1489

ఉ. ఈగతి రాఘవుం డడవి కేగిన పిమ్మటఁ దాల్మి వీడి లో
రాగము గూర నివ్వటిలు రాసువియోగజతాపవహ్నిచేఁ
గ్రాఁగుచు రేపవ ల్వగలఁ గంటికిఁ గూరుకు రాక వంతల
న్వేఁగుచు మేదినీవిభుఁడు వే చనియె న్సురరాజువీటికిన్. 1490

ఉ. రాముఁడు దాల్పఁగాఁ దగినరాజ్యము నేర్పునఁ జేసి నీకుఁ గా
భూమివరేణ్యుచేతఁ బలుపోకల వంచనఁ జేసి తెచ్చితి
న్నామది చల్లసేయుచు జనంబులు సన్నుతి సేయఁ జట్టము
ల్మాములు వీడ నింక నరపాలనశీలివి గమ్ము పుత్త్రకా. 1491

ఉ. ఈపుర మీయనామయమహీతల మీమణిరత్నకాంచనం
బీపలుమూఁక లీధనము లెంతయు నీయది గాన నాత్మలో
భూపతిపోకకు న్వగలఁ బొందక ధైర్యము నూఁదు మింక ని
న్నేఁపున సర్వరాజ్యమున కేలికఁ జేసెద రెల్లి సద్విజుల్. 1492

క. అని పితృమరణము భ్రాతల, వనగమనముఁ జెప్ప విని యవార్యచరితుఁ డా
యన పిడుగు వడినవానిం, బెనుగొఱవిం గాల్చి నట్లు బిమ్మిటి గొనుచున్.

వ. కొండొకసే పొల్లం బోయి మెల్లనఁ దెలిసి నిజజనని నవలోకించి యిట్లనియె.

భరతుండు కైకేయిని దూఱుట.

ఆ. అకట తండ్రిచేత నల తండ్రికైన నైన, భ్రాతచేత విడువఁబడి స్వధర్మ
హతుఁడ నై కృశించునట్టినాకీరాజ్య, మీధనంబు నగరి మేలుచెపుమ. 1495

క. భూరమణుఁ జంపి రాముని, వారక తాపసునిఁ జేసి వ్రణమందు ఘన
క్షారము బలె దుఃఖము నం, దారయ దుఃఖంబు బొనర్చి తతికఠినమతిన్. 1496

క. మావంశము నిర్మూలముఁ, గావింపఁగఁ గాళరాత్రిగతి వచ్చితి వా
భూవిభుఁడు నిన్ను భస్మ, వ్యావృతశిఖికణమ వనుచు నరయక చెడియెన్.

క. జనపతి నీచే గతచేఁ, తనుఁ డై దివి కనుపఁ బడియె దాన రఘుకులం
బునఁ గలధర్మంబు నయం, బును వృత్తము సుఖముయశముఁబొలిసెఁ గులఘ్నీ.

తే. నీకరగ్రహ మొనరించి నిత్యసత్య, ధర్మరతుఁ డైనమాయయ్య దశరథుండు
తీవ్రదుఃఖాభితప్తుఁ డై తీఱి పోయె, ఫణినిఁ జేనంటి యజ్ఞుఁడు పడినపగిది.

చ. అనుపమసత్యధర్మరతుఁ డైనరఘూత్తము నుగ్రకాననం

బున కనుపంగ నేల తనపుత్త్రునివైభవ మక్షి కింపుగాఁ
గనుఁగొనువేడ్క నున్నమహీకాంతునిఁ జంపఁగ నేల యక్కటా
కని కని దీన నేమి యొడిగట్టఁ దలంచితివే నరాదనీ. 1500

మ. చిరకాలం బనపత్యతాఘమునఁ గాసిం జెంది నేఁ డింతక
క్కఱతో నమ్మహనీయులం గని యభంగప్రీతితో నున్న ని
త్తఱిఁ గౌసల్యకు నాసుమిత్త్రకు ననంతక్షోభ మిట్లీవు మ
త్సరితం జేసితి వింకఁ దన్ముఖము లేచందంబునం జూచెదన్. 1501

క. గురువృత్తివిదుఁడు ధర్మో,త్తరుఁ డగురఘునాయకుండు తనతల్లిపయిం
గుఱిఁ జేయుభక్తి నిన్నుం, బరికించుం గాదె యతనిఁ బాపుట తగవే. 1502

మ. కరుణం జెల్లెలిఁ జూచుకైవడి నినుం గౌసల్య దా సంతతం
బరుదారం బరికించు నాయనుసుతుం డైశ్వర్యభోగార్హుఁ డి
త్తఱిఁ జీరాజినముల్ధరించి మునిచందాన న్వనక్షోణి క
ట్లరుగం జూడఁగ నెట్లు సైఁచితివి వంశాచారవిద్వేషిణీ. 1503

ఉ. శూరుఁ డపాపచిత్తుఁడు విశుద్ధచరిత్రుఁడు కీర్తిమంతుఁ డం
భోరుహతామ్రలోచనుఁడు పుణ్యుఁడు సర్వశరణ్యుఁ డంచితా
కారుఁడు నైనరాముని జగన్నుతశీలు నకారణంబుఁగా
దారుణకాననంబునకుఁ దప్పక పంచితి వేల చెప్పుమా. 1504

తే. కరము రాజ్యార్థ మన్యాయగతి ననర్థ, మరయ నీచేత నానీత మగుటవలన
నన్న కేఁ జేయుభక్తిలౌభ్యమునఁ జేసి, నీకు విదితంబుగా దని నేఁ దలంతు.

క. లలితయశోధను లినకుల, లలాము లుత్తములు రామలక్ష్మణు లటవీ
స్థలి కేగి రింక నే నే, బలమున సామ్రాజ్య మెల్లఁ బరిపాలింతున్. 1506

తే. మేరుధాత్త్రీధరంబు సమీపవనము, నట్ల బలవంతుఁ డైనసీతాధినాథు
నాశ్రయించి బలోన్నతుం డయ్యె దశర,థాధిపుఁడు సేమమునరాజ్యమర్థి నేలె.

వ. అట్టిమహాత్ముం డగుదశరథునిచేతఁ దాల్పం బడినమహీసామ్రాజ్యభారం బే బలంబునం దాల్చువాఁడ మహాబలీవర్దంబుచేత సముద్ధృతం బైనభారంబు వత్సతరంబు మోవం జాలునె యదియ ట్లుండని మ్ముపాయబలంబునఁ గాని బుద్ధిబలంబునఁ గాని యొక్కింత రాజ్యభారధారణంబునందు సామర్థ్యంబు నాకుఁ గలిగి యున్నను బుత్త్రగర్ధిని వగు నిన్నుఁ గామితసిద్ధిచేత వెలయింపం జాల రామునకుఁ గౌసల్యయందుం బోలె నీయందు సంతతంబు మాతృత్వప్రయుక్తగౌరవంబు గలుగ కుండె నేని నిన్నుం బరిత్యజింప వచ్చు నతం డంతకంటె నీయెడ వినయగౌరవంబులఁ బాటించుం గావున నత్తెఱం గవలంబించుట కయుక్తంబై యున్న దని పలికి భరతుండు వెండియు నిట్లనియె. 1508

తే. సాధుచారిత్రవిభ్రష్టసత్యరహిత, కులవినాశని పాపసంకలితచిత్త

మూఢ పండితమానినిపూర్వరాజ, గర్హితం బైనమత మెట్లు గలిగె నీకు. 1509

తే. వంశపాంసని యిారఘువంశమందుఁ, బూర్వకులలోన జ్యేష్ఠుండుభూమి కధిపుఁ
డగుచు నుండఁ గనిష్ఠులయ్యనఘు లనుస, రించి వర్తించు టది ధర్మవృత్తిసరణి.

తే. స్వప్రయోజనపరవు నృశంస వగుట, నీవు శాశ్వతమైనట్టి నృపతిధర్మ
మును నృపాచారపద్ధతి యనుపమాన, సాధువృత్త మెఱుంగవు సత్య మింత.

తే. వంశపాంసని జ్యేష్ఠానువర్తనంబు, వివిధపార్థివవంశసంభవుల కెల్ల
ధరణి సాధారణం బైనధర్మ మందు, రాఘవులకు విశేషధర్మంబు దలఁప.

తే. అట్టికులశీలయుతులు ధర్మైకరతులు, లైనయిక్ష్వాకుకులజధరాధిపతుల
ధర్మచారిత్రగర్వితత్వంబు నిన్నుఁ, బొంది సర్వంబు శిథిల మై పోయె నేడు.

క. మునుకొని మీమాతృకులం, బునఁ బుట్టినవారు రాజముఖ్యులు జ్యేష్ఠుఁ
జనపతిఁ జేయరె నీ కీ, యనర్థమతి యెట్లు గలిగె నన్వయహారిణీ. 1514

తే. యశము కులమును జెఱిచితి వట్టినీకుఁ, గామమునఁ దృప్తి సేయక రామభద్రు
నిపుడె దోడ్తెచ్చి పుడమి కధిపునిఁ జేసి, యతని కతిభక్తి దాసుండనై చరింతు.

క. అని యిట్లు విప్రియము లగు, సునిశితవాక్యములు పల్కి శోకంబున రో
దన మొనరించుచుఁ గ్రమ్మఱ, జననిం గని యిట్టు లనియె సక్రోధుం డై. 1516

తే. పాపచారిణి రాజ్యలోభమునఁ జేసి, ధర్మ మంతయు విడిచినదాన వైతి
వింక నిన్నన నేల నిశ్శంక నన్ను, మృతునిఁగా నెంచి రోదనయుతవు గమ్మ.

క. పతి దివమున కలసీతా, పతి కాననమునకు నీదుపంపునఁ జనుచు
న్మతిలోన నిను సతీగుణ, యుత వని నిక్కము దలంచి యుందురె చెపుమా.

క. కులమును నశింపఁ జేయుట, వలనం దగ భ్రూణహత్యఁ బ్రాపించితి వా
కలుషమునఁ బతిసలోకత, నలరారక నిరయగతికి నరిగెద వింకన్. 1519

తే. సకలలోకప్రియుని రామచంద్రు నడవి, కనిచి విభుని నాకమునకుఁబనిచి నాకు
నెల్లవారికి భయ మావహిల్లఁ జేసి, పాపభాగిని వై నిల్వఁబడితి వీవు. 1520

క. నీచేత ఘోరకర్మ, ప్రాచుర్యముచేత నెద్దిపాప మిటులు నేఁ
డాచరిత మయ్యె నది న, న్నేఁచుటయే కాదు జగము నేఁచఁ దొడంగెన్. 1521

వ. మఱియు దుష్టచారిణి వైననీకతంబున మహీరమణుండు లోకాంతరగతుం డయ్యె రామభద్రుండు వనంబునకుం జనియె నేను వంశపాంసని వగునీకుం బుట్టినకతంబున లోకంబునం దుపక్రోశమలీమసుండ నైతి మాతృరూపంబునం జూపట్టుమృత్యువ కా నిన్నుఁ దలంచెద దురాచారసంపన్న వగుని న్నవలోకించుటయు నీతోడ సంభాషించుటయు మహాపాతకంబని తోఁచుచున్నది పతిఘాతిని వైన నీవలన సుశీల లగుకౌసల్యయు సుమిత్రయుఁ దక్కిన యంతఃపురకాంతలు దుస్సహం బైన దుఃఖంబు నొందవలసె నిరయగామిని వగునీవు ధర్మాత్ముం డగునశ్వపతివంశవినాశనార్థంబు పుట్టినరాక్షసివి గాని యమ్మహా

త్మునకుం బుత్రికవు గావు పరమ ధార్మికుండును నిత్యసత్యపరాయణుండు నగు రాముని వనంబునకుం బనిచి పుత్రవత్సలుం డగుమజ్జనకుని దివంబునకుం బంచి యేపాపకర్మం బాచరించితి వాపాపకర్మంబు పితృభ్రాతృపరిత్యక్తుం డగు టవలన లోకవిద్వేష్యుండ నైననాయందు సమారోపితం బయ్యెఁ గట్టిడితనం బున రట్టున కొడిగట్టితివి ధర్మసంయుక్త యైనకౌసల్యాదేవినిఁ బుత్రహీనం జేసి యేలోకంబుఁ బడయం గోరితివి బంధుసంశ్రయుండును నియతుండును జ్యేష్ఠుండును బితృసముండు నగుకౌసల్యానందనునియందు నాకుం గలభక్తి స్నేహంబులు మూఢచిత్త వగుటం జేసి పరామర్శింప నైతి వని పలికి పుత్రవిశ్లేషంబు దల్లి కసహ్యతరం బని యెఱింగించువాఁడై యంగాదంగా దని యెడు శ్రుతియర్థంబు మనంబున నిడికొని వెండియు నిట్లనియె. 1522

—భరతుఁడు కైకేయికిం బుత్రశోకము దుస్సహమని యెఱింగించుట.—

క. విను మంగప్రత్యంగజుఁ, డనురాగస్థానభూత మగుహృదయమునన్
జనియించెఁ గాన నౌరసుఁ, డనఁ దగె నతఁ డమ్మ కెక్కు డార్వురిలోనన్. 1523

వ. అని పలికి పుత్రశోకంబు దుస్సహదుఃఖకారణం బని సూచింపం జేయువాఁడై యొక్కయితిహాసంబు నిట్లనియె. 1524

సీ. వినుము నృశంస త్రివిష్టపంబున వన్నె కెక్కిన సురభి దా నొక్కనాఁడు
పుడమిపై నాఁగలిఁ బూని యామద్వయపర్యంతమును దున్ని బడలి దారు
ణాతపంబున డస్సి యడుగులు తడఁబడఁ దూఁగాడు చున్నయుత్తుంగవృషభ
ముల రెంటిఁ గని తనకులమునఁ బుట్టిన వాట నందనుల కానాత్మఁ దలఁచి

తే. పుత్రశోకంబుచేఁ జాలఁ బొక్కి యేడ్వ
దానికన్నీటి చినుకు లధఃప్రచారి
యగును రేంద్రునిపైఁ బడ్డ నతఁడు చూచి
హెూడ్పుఁ గే లొప్పఁ బలికె నమ్మొదవుతోడ. 1525

క. దేవతతికి భయ మయ్యెనె, భావంబునఁ గలఁగి యేల పరితాపింప
న్నావుడు నిర్జరధేనువు, దేవపతిం జూచి పలికె దీనత వెలయన్. 1526

వ. సురేంద్రా యుష్మద్భయాగమనశంకాహేతుభూతం బైనపాపంబు లేదు కర్షకునిచేత దండితు లై యెండం బడి కృశించుచు మొగంబుల దైన్యంబు దోఁప భూరిభారపీడితు లౌటకతంబున దుఃఖించుచు మహీతలంబున విషమస్థలంబు నం జరించు చున్నమత్పుత్రులం జూచి పుత్రునిం బోలినప్రియవస్తు వన్యం బెద్దియు లేమింజేసి శోకించు చున్నదాన నని పలికిన నయ్యమరవిభుం డెద్దాని పుత్రసహస్రంబులచేత లోకంబు వ్యాప్తం బయ్యె నట్టిదాని రోదనంబుఁ గావించుదానిఁ గామధేనువు నవలోకించి పుత్రునకంటెఁ బ్రియుం డన్యుండు లేఁ డని తలంచి పరిమళోపేతంబు లైనతదీయాశ్రుకణంబులు గొనగోటమీటుచు

మృదుమధురవాక్యంబుల ననూనయించె నిత్యం బప్రతిమవృత్తయు లోక సంరక్షణేచ్ఛయు గుణనిత్యయు సంపత్ప్రదయు శీలపరిపూర్ణయు బహుపుత్త్రయు నైనకామధేను వొక్కనికిఁ గా శోకించె నని శాస్త్రంబు లెఱింగించు చుండ నేకపుత్త్ర యగుకౌసల్య యతం డొక్కరుండును వనంబునకుం బోవు చుండ దుఃఖంబునం బరితపించు చున్న దనుట కేమి సందియం బని పలికి వెండియు నిట్లనియె. 1527

మ. చిరకాలం బనపత్యతాఘమున గాసిం జెంది నేఁ డింత కీ
కరుణోదారునిఁ గాంచి కాంచితిఁ గదా కల్యాణమం చుండ ని
త్తఱిఁ గౌసల్యకు దుస్సహం బయినసంతాపంబుఁ గావించి తీ
దురితం బుద్ధతిఁ గాల్పు కున్నె నిను నెందు జ్జన్మజన్మంబునన్. 1528

తే. పాపదర్శిని సుగుణసంపన్న యైన, పుణ్యసాధ్వి కౌసల్యకు భూరిశోక
మాత్మ నరయక కావించినందువలన, నిరయగతి కేఁగఁ గల వీవు నిక్కువముగ.

తే. అఖిలరాజవిగర్హిత యైననీదు, బుద్ధిఁ గైకొన కేను సంపూర్ణకీర్తి
వర్ధనం బైనజానకీవల్లభాంఘ్రి, పూజనం బర్థి నలిపెద బొంకు గాదు. 1530

ను. నిను వేభంగుల దూఱ నేటికిఁ గులఘ్నీ యిప్పుడే పోయి రా
మునిఁ గల్యాణగుణాభిరాము నిటకుం బొల్పొందఁ దోడ్తెచ్చి గ్ర
క్కున సామ్రాజ్యమునందు వేడ్క నభిషిక్తుం జేసి యప్పూన్కిఁ గై
కొని యే నేగెద దండకాఖ్యగహనక్షోణీస్థలిం ద్రిమ్మగన్. 1531

ఆ. బొమ్మకంతు లైన పౌరులచే నిరీ, క్షితుఁడ నగుచు నీవు చేసినట్టి
యీదురంతపాప మించుక యైన స,హించి యుండఁ జాల నిచట నిపుడు.

—భరతుం డమాత్యమధ్యమునఁ బ్రమాణము సేయుట.—

వ. మహాత్ముం డగురాముసకును బుణ్యసాధ్వి యైనకౌసల్యకు బుద్ధిపూర్వకంబుగా మహాపకారంబుఁ గావించితి వీపాపంబునకు మరణంబు దక్క నొండు ప్రాయశ్చిత్తంబు లేదు చిచ్చులో నుఱికి యైన గరళంబుఁ గ్రోలి యైన దండకారణ్యంబున కరిగి యైనఁ బాశంబున నురిగొని యైన నెట్లయినఁ గళేబరత్యాగంబుఁ జేసి యీదుష్కృతంబుఁ బాపికొను మేను సత్యపరాక్రముం డగురామునిఁ గోసల రాజ్యపట్టాభిషిక్తునిం జేసి యపనీతకల్మషుండ నై కృతకృత్యుండ నయ్యెద నని పలికి భరతుండు సంక్రుద్ధం బైనపన్నగంబుభంగి రోఁజుచుఁ గాంతారమధ్యస్థితగర్తంబునందుఁదోమరాంకుశవిద్ధం బైనమహాగజంబుపగిదినాకంపించుచురోషరోదనతామ్రాక్షుండునుశిథిలాంబరుండునువిధూతసర్వాభరణుండునై యుత్సవాంతంబునందుఁ బుడమిం బడినశక్రధ్వజంబుపోలిక ధరణిపయిం బడి కొంతొకసేపునకు లబ్ధసంజ్ఞుండై లేచి నేత్రంబులనశ్రుకణంబులుదొరుఁగ రక్తాంత

వీక్షణంబులఁ గైకేయి నిరీక్షించి గర్హించుచుఁ దత్కాలసమాగతులైన య
మాత్యులనుమధ్యంబున నిలువం బడి భుజం బెత్తి రామోపభోజ్యం బైనసామ్రా
జ్యం బేను గాంక్షింప లేదు కపటంబున రాజ్యగ్రహణార్థంబు కైకేయిం బ్రేరే
పించి యెఱుంగ రాజుచేత మదర్థం బే యభిషేకంబు సమీహితం బయ్యె నయ్యా
భిషేకంబు నెఱుంగ శత్రుఘ్నసహితుండ నై దూరదేశంబున నుండుటవలన రా
మలక్ష్మణులవివాసనం బెఱుంగ నని ప్రామాణ్యంబుగాఁ బల్కి దీర్ఘస్వరంబున
రోదనంబుఁ గావించిన నతనికంఠశబ్దం బాకర్ణించి కౌసల్య సుమిత్ర నవ
లోకించి యిట్లనియె. 1533

ఆ. కలుషచిత్తయైనకైకేయితనయుండు, వచ్చి యుండెఁ బోలు వాఁడు దీర్ఘ
దర్శి గాన వానిఁ దడయక వీక్షింపఁ, బోద మనుచు వేగపోయె నటకు. 1554

క. ఆభరతుఁడు మనమున సం, క్షోభించుచు సుతవియోగశోకముచే సం
క్షోభించు చున్నకోసల, భూభృత్సుత యున్నయెడకుఁ బోయె రయమునన్.

కౌసల్య శోకావేశంబున భరతుని దూఱుట

క. ఈగతి నేగి కుమారవి, యోగజశోకశిఖఁ గ్రాఁగి యుడికెడుతల్లి
న్వేగంబె కాంచి యాప, త్సాగరమున మునిఁగి భరతశత్రుఘ్ను లొగిన్. 1536

క. పరశునికృత్తం బగుసుర, తరువుం బలె నేలఁ బడిన తల్లిని వంతం
బరిరంభించుచు నడలిరి, మరుచ్చలితకచ్ఛరుహాలమాడ్కిం బెలుచన్. 1537

వ. ఇత్తెఱంగున నాకంపించుచుండ నప్పుడు కౌసల్య శోకావేశంబున. 1538

ఉ. కన్నుల నశ్రువు ల్దొరుఁగ గన్నుల నశ్రుల నించువాని నా
పన్నత నొందుచుం గడు విపన్నత నొందెడువాని మోమున
న్విన్నఁదనంబు దోఁపఁ గడు విన్నఁదనంబున నొప్పువాని నా
చిన్నికుమారుని న్భరతుఁ జిచ్చురలం బరికించి యిట్లనున్. 1539

క. దుర్మతి కైకేయాదు, ష్కర్మంబున రామరాజ్యకాముఁడ వగునీ
కర్మిలి నకంటకం బతి, శర్మద మగురాజ్యపదము సమకూడెఁ గదా. 1540

ఆ. నారచీర లిచ్చి నాపుత్త్రు మీయన్న, ఘోరకాననంబుఁ జేరఁ బనిచెఁ
దనకు దీన నేమి ఘనత వాటిల్లునో, తెలియ దింతపనికిఁ దెగియె నపుడు.

తే. దారుణప్రజ్ఞ యైన మీతల్లి కైక, భూవిభునిఁ జంపుటయును మత్పుత్త్రుఁ డైన
రామభద్రుని దారుణారణ్యసీను, కనుచుటయు నిన్ని నీకొఱ కాచరించె. 1542

క. ఆలస్య మేల చేకొని, పాలింపుము రామరాజ్యపదము సభల నీ
శీలము మీయనుశీలము, వాలాయముఁ బెద్ద లైనవారు నుతింపన్. 1543

ఉ. రామహిరణ్యనాభుఁడు విశాలయశుండు ప్రశాంతచిత్తుఁ డ
బ్జారిసమానతేజుఁడు గుణాఢ్యుఁడు మత్ప్రియపుత్త్రుఁ డెచ్చటం
గోరి వసించె నచ్చటికి గొబ్బునఁ గైకకుఁ జెప్పి నన్ను పో

ల్పారఁగఁ బరపు మయ్యనఘు నాస్యముఁ జూడక యుండ నేర్తునే. 1544

ఆ. అట్లు సేయ వేని యగ్నిహోత్రంబు పు, రస్కరించుకొని కరంబు భయము
దొలఁగ నిడి సుమిత్రతోఁ గూడి యిప్పుడే, పుత్త్రుఁ డున్నయెడకుఁ బోవుదాన.

ఉ. నాయెడ నీకు భక్తియు వినమ్రతయుం గృప గల్గె నేని సు
శ్రీయుతుఁ డైన రాఘవుని చేరువకు న్నను నీవ పంచి భ
ద్రాయతమూర్తి వై సఖుల కమ్మకు సంతస మంకురింప న
న్యాయవిధార్జితం బగునవామయరాజ్యము నేలు మిత్త్రజిన్. 1546

భరతుఁడు కౌసల్యముందర తాను రాజ్యరామవివాసనములఁ గోరలేదని శపథము సేయుట.

వ. అని యివ్విధంబున దారుణంబు లైనబహువిధవాక్యంబుల గర్హించుటయు నవ్వాక్యంబులు తీవ్రవ్రణంబునందు వాఁడిసూదులఁ జొనిపిన ట్లయిన నతండు తీక్ష్ణవ్యథాబాధితుం డై శోకమూర్ఛాపారవశ్యంబునఁ దదీయచరణంబుల పయిం బడి కొండొకసేపునకు లబ్ధసంజ్ఞుం డై బహుప్రకారంబుల విలపించుచుఁ గేలుదోయి ఫాలంబునంగీలించి దుస్సహపుత్త్రశోకబలాక్రాంతయై విలపించుచున్న కౌసల్యచేతఁ దనయందు సమారోపితం బైనదోషంబు పరిహరించుటకు శపథవాక్యంబుల నిట్లనియె. 1547

క. జననీ యకల్మషుఁడ నగు, నను గర్హించెద వి దేల నా కారఘునా
థునిమీఁదం గలభక్తియు, వినమ్రతయు మున్న నీకు విదితము గాదే. 1548

క. ఏపాప మెఱుంగనిన, న్నీపగిదిం దూఱ నేటి కింతకు మును సీ
తాపతి పదారవిందా, రోపిత యగుభక్తి నీ వెఱుంగవె తల్లీ. 1549

క. జననీ రాఘవుఁ డెవ్వని, యనుమతమున నడవి కరిగె నాతని కాచా
ర్యనిగదితశాస్త్రశిక్షిత, ఘనబుద్ధియుఁ గలుగ కుండుఁ గాక గుణాఢ్యా. 1550

సీ. వృజినాత్మునకుఁ బ్రేష్యవృత్తిఁ బూనినవానియఘముమార్తాండునకభిముఖముగ
మూత్రంబు విడిచినమూఘునిదురితంబు పడి యున్న మొదవును బాదనిహతిఁ
దన్నినవానిపాతకము భృత్యునిచేతఁ బని గొని కుడువనియ్యని నృపాలు
పాపంబు పుత్త్రులపగిది భూతంబుల నరయుభూపతికి ద్రోహంబు సేయు

తే. వానికలుషంబు రాముఁ డెవ్వాని యనుమ
తమున రాజ్యంబు విడిచి సీతాయుతముగ
దారుణారణ్యదేశమధ్యమున కరిగె
నతని కగుఁ గాక భూతసంతతులు గుఱిగ. 1551

క. కరషడ్భాగముఁ గైకొని, కర మనురాగమునఁ బ్రజలఁ గావనిధాత్రీ
వరుని మహాకలుషము నీ, వరసుతునకుఁ గీడుఁ దలఁచు వానిది గాదే. 1552

సీ. విను మిత్త్రు ననియు ఋత్విజుల కధ్వరమందు యజ్ఞదక్షిణ యీనియతనిదురిత
మశ్వగజస్యందనాకులం బగుయుద్ధమందుఁ బాఱినవానియఘఫలంబు

సుగురూపదిష్టమా సూత్రార్థశాస్త్రంబు విస్మరించినదుష్టవృజినఫలము
గురువుల కిడక కృసరము ఛాగము పాయసము దిన్న నిర్ఘృణస్వాంతుగతియు

ఆ. గురుజనావమాన మరయక కావించి, నట్టిపాపచిత్తు నతులపాప
మొందుఁగాక రఘుకులేందుకాననవాస, మాత్మఁ గోరినట్టియతని కంబ. 1553

తే. వ్యూఢబాహ్వంసుఁ బుష్పవద్గాఢతేజు, రాజ్యసింహాసనాసీను రామవిభునిఁ
గాంచుభాగ్యము మేదినిఁ గలుగకుండుఁ, గాక రామవివాసనకాంక్షి కింక.

క. గురువులఁ దిట్టుట గోవులఁ, జరణహతిం దన్నుటయును సఖునకు ద్రోహం
బరయక సేయుట రాముని, కురుదుర్మతిఁ గీడొనర్చు టొక్కటి గాదే. 1555

క. అకటా రహస్యమును దాఁ, పక మైత్రిం జెప్పినట్టి పరివాదముఁ దాఁ
బ్రకటముఁ జేసిననరుపా, తక మార్యద్వేషి కవితథంబుగ రాదే. 1556

క. శ్రీరాముని కపకృతి ని, ష్కారణముగఁ జేసినట్టికష్టుఁడు శిష్టా
చారద్వేష్యుఁడు జగదప, కారి యగుచు నాత్మహంతగతికిఁ జనియెడిన్. 1557

తే. ఆర్యునకుఁ జాలఁ గీడెవ్వఁ డాచరించె
నతఁడు పుత్రకళత్రభృత్యాదికపరి
వారితుం డయ్యు నొక్కండె స్వగృహమందు
మృష్టము భుజించునట్టినికృష్టుఁ డగును. 1558

క. అకృతోపకారుఁ డగుణుం, డకృతజ్ఞుం డాత్మహంత యపగతలజ్జుం
డకృతార్థుం డగుభ్రాత క, పకృతిం గావించునట్టిపాపాత్ముఁ డిలన్. 1559

తే. సత్యసంధుండు శ్రీరామచంద్రుఁ డతని, కెగ్గుఁ జేసిననీచాత్ముఁ డిజ్జగమునఁ
బుత్రదారగృహక్షేత్రభూరిధర్మ, హీనుఁ డై దుఃఖమరణంబుఁ బూనుఁగాదె.

వ. మఱియు రాజస్త్రీవృద్ధబాలకులం జంపినదురితంబును భృత్యత్యాగదోషంబును లాక్షామధుమాంసలోహవిషవిక్రయంబులచేత నిత్యంబును గుటుంబముం బం చినపాపంబును శత్రుపక్షభయంకరం బైనసంగ్రామంబున నిరాయుధుం డై బెదరి పాఱువాని వధించినవృజినంబు నుభయసంధ్యాకాలంబులందు నిద్రవో యినవానికల్మషంబును వహ్నిదాయకుకిల్బిషంబును గురుతల్పగమనునిపంకం బును మిత్రద్రోహం బాచరించినవానిపాతకంబును బితృమాతృశుశ్రూషఁ గావింపనివానిదుష్కృతియును దేవతాపితృపూజనంబు సేయనివానికలుషం బును నాశంసమానులును దీనులును నూర్ధ్వలోచనులు నగుయాచకుల కామి తంబు విఫలంబుఁ జేసినవానియఘంబును సకలలోకపవిత్రచరిత్రుం డగుభవ త్పుత్రున కెగ్గుఁ జేసిన దుష్టాత్మున కగుం గాక యెవ్వానియనుమతంబున రాముండు వనంబునకుం జనియె నట్టిపాపాత్ముండు బహుపుత్రుండును దరిద్రుం డును జ్వరరోగసమన్వితుండును సురాపానరతుండును నపాత్రవర్షియుఁ గామ క్రోధాభిభూతుండును నున్మత్తుండును సంత్యక్తకులధర్ముండును మూఢుండును

ధర్మదారపరిత్యాగియును బరదారాపహారణుండును మాయావాదియుఁ గప టాత్ముండు నై సత్పురుషులలోకంబువలనను సజ్జనులకీర్తివలనను సదాచారు లకర్మంబువలనను విడువఁబడి కపాలపాణి యై యమంగళుం డై భిక్షాచర ణంబు సేయుచు మహీచక్రంబునఁ బరిభ్రమించు చుండుఁగాక మఱియు నత నినానావిధసంపాదితవిత్తం బంతయు దస్యులచేత నపహరింపం బడుఁ గాక మఱియు నతనికి స్వపత్నులయందుఁ బుత్రోదయంబు లేకుండుం గాక మాతృ శుశ్రూషాపరుండు గాక స్వల్పాయు వై దుర్గతికిం జనుఁగాకయని పలికి వెండియు భరతుండు. 1561

తే. విప్రులు ప్తసంతతి యగువిప్రపాత, కంబు పానీయదూషకుకల్మషంబు
గరగునియఘంబు రాముఁ డేకతినచిత్తు,ననుమతంబునఁ జనియె నాతనిది గాదె.

క. పాఱున కొసఁగుసపర్యను, వారించినయఘము బాలవత్స యగుగవిం
గోరికఁ బిదికినదురితము, శ్రీరాముని కెగ్గు సేయుచెనఁటిది గాదే. 1563

క. దప్పిం బడి గ్రోలుటకై, యప్పు లడుగ నతని కిడక యతిలోభమునం
దప్పించినక్రూరునిగతి, కిప్పుడె చనువాఁడ నన్న కెగ్గుఁ దలఁచినన్. 1564

వ. వాదిప్రతివాదులు వివాదంబుఁ గావించు చుండ నొక్కనియందు స్నేహంబు చేతఁ బక్షపాతంబున జయోపాయంబు నుడువు కలుషాత్మునకుం గలదురితంబు రామవిద్వేషి కగుం గాక యని యేతాదృశంబు లగుదారుణశపథంబులఁ బలికి నిట్టూర్పులు వుచ్చుచుఁ బతిపుత్రవిహీన యై దుఃఖించు చున్నకౌసల్యచరణం బులపయిం బడి యుచ్చైర్నాదంబున రోదనంబు సేయు చున్నభరతు నవలో కించి యద్దేవి యి ట్లనియె. 1565

కౌసల్య దుఃఖసంతప్తం డగుభరతు నాశ్వాసించుట.

మ. భరతా నీశపథోక్తినంజనితశుంభద్దుఃఖతాపాగ్ని న
న్మరలం గాల్పఁ దొడంగె నీమదికి సమ్యగ్భాతృధర్మంబు సు
స్థిర మై యున్నది నీయెడ న్దురితసందేహంబు లే దింతయుం
గరణం బేటికి లెమ్ము సజ్జనుల లోకం బింక నీ కయ్యెడిన్. 1566

క. అని యూఱడించి వెన నా, తని భుజములఁ గ్రుచ్చి యెత్తి తనయుత్సంగం
బునఁ జేర్చి తమవు నివురుచు, జనపతిమృతి నొడివి చాల సంతాపించెన్.

తే. మాతృరోదనరూపకమారుతమున, నిజమనోగతశోకాగ్ని నివ్వటిల్లి
యేర్చుఁ జొచ్చిననతఁడు సహింపలేక, లులితచేతస్కుఁ డై చాలమలఁగుచుండె.

వ. ఇట్లు లాలప్యమానుండును విచేతనుండును బ్రణష్టబుద్ధియు దీర్ఘనిశ్వాసమారుత మ్లానవదనుండును మేదినీపరిపతితగాత్రుండు నై బహుప్రకారంబుల దుఃఖించు చున్నయమ్మహారాజనందనున కవ్విభావరి యొక్కచందంబున నతిక్రమించె

నంత సూర్యోదయానంతరంబున మునిశ్రేష్ఠుం డగువసిష్ఠుండు శోకతప్తుం డైన
భరతున కిట్లనియె. 1569

క. ఆలింపుము నామాటలు, చాలింపుము వేఱె యొకవిచారము ధరణీ
పాలకునకు సంయానము, కాలం బది దప్పకుండఁ గావింపు మికన్. 1570

తే. అనవుడు వసిష్ఠవాక్యంబులాలకించి, భరతుఁ డెంతయు స్వస్థస్వభావుఁ డగుచు
ధర్మపద్ధతిఁ బ్రేతకృత్యంబు లన్ని, శిష్టసమ్మతి నృపునకుఁ జేయఁ గడఁగి. 1571

ఆ. నూనెచేతఁ బక్వ మైనది గాన నా, పీతవర్ణవదన మై తనర్చు
నృపునిమేను రత్ననిర్మిత మగుశయ్య, యందుఁ జేర్చి యిట్టు లనుచు వగచె.

మ. అనఘా రాముని లక్ష్మణు న్విపినదేశావాసులం జేసి చ
య్యన నే వీటికి రాకము న్నె ఘను నత్యక్లిష్టకష్ట వ్యశో
ధనుని న్రామునిఁ బాసి ఘోరతరసంతాపంబునం బొక్కుచీ
జనముం బాసి సుపర్వలోకమునకుం జన్నాథ యిట్లేగితే. 1573

-భరతుండు దశరథునికి దహనసంస్కారముఁ గావించుట.-

క. రాముఁడు కాననసీమకు, భూమీశ్వర నీవు దివికిఁ బోయిన నింక నీ
భూమికి నెవ్వఁడు యోగ, క్షేమముఁ గావించువాఁడు చెప్పు మహీశా. 1574

ఆ. తండ్రి నీవు లేనిధర విధవాంగన, భంగి నున్నయది భవద్విహీన
యైననగరి చంద్రహీన యై చూపట్టు, రాత్రిభంగిఁగాంతిరహిత మయ్యె. 1575

క. అని బహుభంగుల శోకం, బున సంక్లేశించురాజపుత్త్రుం గని య
మ్ముని యింత వగవ నగునే, జనకున కొనరింపు ముచితసంస్కారవిధుల్. 1576

వ. అని యుపదేశించిన నవ్వసిష్ఠువచనంబులం దేఱి భరతుండు ఋత్విక్పురో
హితాచార్యులను దక్షిణపరిచారకుల నయ్యైకృత్యంబులయందు యథార్థం
బుగా నియోగించినఁ దక్షిణంబ యాజనకులు నుపద్రష్టలును హవిరాజ్యహో
మపవిత్రం బైనగార్హపత్యాద్యగ్నిహోత్రంబులు సంగ్రహించుకొని పురో
భాగంబునం బోవుచుండఁ గొందఱు పరిచారకులు విగతచేతనుం డయినమహీ
పతికళేబరంబు శిబికయం దిడి తదీయదీర్ఘదండంబులు భుజంబులపై నిడికొని
విమనస్కులై కన్నీరు నించుచుం జనుచుండిరి. సువర్ణంబును రజతంబును
రత్నంబులును నానావిధవస్త్రంబులును రాజమార్గంబున వెదచల్లుచుఁ
గొందఱు ముంగలి యై నడువ నివ్విధంబునఁ బురంబు వెలువడి యుత్తర
దిగ్భాగంబునఁ జందనాగరునిర్యాసనరళపద్మకదేవదారుదారువినిర్మితం బైనచి
తామధ్యంబున విగతప్రాణుం డైనమహీపతి నునిచి యుచ్చావచంబు లైన
గంధంబు లొసంగి ఋత్విజులు వహ్నియందు హోమంబుఁ గావించి
ఋగ్యజుస్సామమంత్రంబులు జపియించి యనలు దరికొల్పి సవ్యాపసవ్యప్రద
క్షిణంబుఁ గావించి రాసమయంబున దురంతచింతాభరంబునఁ గౌసల్యాది

సర్వాంతఃపురకాంతలు వృద్ధకాంతాసమేతంబుగా యథార్హంబు లగుశిబికా
యానంబు లారోహించి పురంబు వెలువడి చితామధ్యంబున వహ్నిశిఖాపరం
పరాదంద హ్యమానదేహుం డైననిజవల్లభు నశ్వమేధాదియజ్ఞకర్త నాలో
కించి శోకసంతప్తచిత్తలై గుంపులు గూడి యొండొరులం బట్టుకొని క్రౌంచాం
గనలచందంబున నుచ్చైస్స్వరనాదంబులఁ గొండొకసేపు దుఃఖాయాసభరంబునఁ
గన్నీరు మున్నీరుగా రోదనంబుఁ జేసి యనంతరంబ భరతునితోఁ గూడి సరయూ
జలంబుల నమ్మహీపతి కుదకక్రియలు నిర్వర్తించి భరతశత్రుఘ్నమంత్రిపురోహి
తసహితంబుగాఁ గ్రమ్మఱఁ బురంబుఁ బ్రవేశించి బాష్పపరీతనేత్ర లై దశరాత్రం
బు విశేషశాస్త్రానుసారంబున నాశౌచం బంగీకరించి రంత దశరాత్రంబు లతి
క్రమించినయనంతరంబు భరతుండు కృతశౌచుం డై ద్వాదశదివసంబున నేకా
దశదివసకర్తవ్యశ్రాద్ధకరణపూర్వకంబుగా శ్రాద్ధకర్మంబు లన్నియు నిర్వర్తించి
పరలోకక్రియ నుద్దేశించి రత్నంబులును ధనంబును బుష్కలం బైనయన్నం
బును దానార్హం బైనఛాగసమూహంబును వస్త్రంబులును గోసహస్రంబు
లును గృహంబులును దాసదాసీజనంబులును శయ్యాశకటాద్యుపకరణంబులును
బ్రాహ్మణుల కొసంగి పదుమూఁడవనాఁడు భరతుండు శోకవిశేషంబున రోదన
శబ్దాపిహితకంఠుం డై విలపించుచు నస్థిసంచయనార్థంబు చితామూలంబున
కుం జని యందు పితృమరణసంజాతమహాశోకక్షుభితాంతఃకరణుం డై యిట్ల
ని విలపించె. 1577

—దగ్ధం బగుదశరథునిశరీరంబుఁ జూచి భరతశత్రుఘ్నులు విలపించుట.—

తే. దేవ యెవనికి నన్ను నధీనుఁగాఁగ, నొసఁగి తా జ్యేష్ఠు రాఘవు వెస నడవికిఁ
బంపి యిచ్చట దిక్కఱి వనరుచుండు, నన్ను విడిచితి వకట శూన్యంబునందు
క. తనకూర్మిపట్టి రాముని, వనగమనముఁ దలఁచి వగపు వదలక తాపం
బునఁ గ్రాఁగుచున్నకౌస, ల్యను విడిచి త్రివిష్టపమున కరిగితె తండ్రీ. 1579
వ. అని యిట్లు బహుప్రకారంబుల దుఃఖించుచు భస్మారుణంబును పితృశరీర
నిర్వాణంబును దగ్ధాస్థియు నైనచితాస్థానమండలం బవలోకించి రోదనంబు
సేయుచు రజ్జువులచేత నుత్థాప్యమానం బై పరిచ్యుతం బైనమహేంద్రుని
యంత్రబద్ధధ్వజంబుచందంబున ధరణిపయిం బడియె నప్పుడు మహర్షులు పుణ్య
క్షయకాలంబునందు స్వర్గచ్యుతుం డైనయయాతినిం బలె నమాత్యులు
శుచివ్రతుం డైనభరతునిం గ్రుచ్చి యెత్తి తత్కాలోచితవాక్యంబుల ననూన
యించుచుండి రాసమయంబున. 1580
శా. కైకేయీసుతుపాటుఁ జూచి యొడ లాకంపింప శత్రుఘ్నుఁ డ
స్తోకవ్యాకులచిత్తుఁ డై వివశుఁ డై క్షోణీస్థలి న్వ్రాలి గో
త్రాక్రాంతుం దలపోసి తద్గుణగణధ్యానంబుఁ గావించుచు

న్నోకం బెంతయు నంతకంతకు మనఃక్షోభంబుఁ గావింపఁగన్. 1581

వ. ఇట్లని విలపించె. 1582

సీ. రాజేంద్ర మంథరాప్రభవంబు కైకయీగ్రాహసంకులము దుర్వారఘోర
వరదానమయ మైననిరుపమశోకసాగర మిట్లు మము దీవికరణి ముంచెఁ
జాల నీచే నుపలాలితుం డగుసుకుమారుండు బాలుండు మానధనుఁడు
గురుభక్తియుతుఁ డగుభరతుని విడనాడి యెక్కడఁ జనితి నరేంద్ర శయన

తే. పానభోజనమజ్జనాభరణవస్త్ర, ధారణంబులయెడ మమ్ముఁ దగినభంగి
నరయుచుండుదువింకసత్కరుణఁబూర్వ,భంగినెవ్వాఁడురక్షించువాఁడుతండ్రి.

తే. సకలధర్మవిదుండవు సౌఖ్యకారి, వైననినుఁ బాసినప్పుడే యవని వేయి
పఱియలై పోవకున్నది ప్రళయవేళ, వచ్చినపుడైనఁ గ్రుంగిపోవదు నిజంబు.

క. క్షితినాథుఁడు లోకాంతర,గతుఁ డయ్యె రఘూత్తముండు కాననమునకు
న్వ్రతియై చనె నిఁక నాకుఁ, బ్రతు కేటికి నగర మేల పడియెద నగ్నిన్.

వ. ఏను బితృభ్రాతృవిహీనుండ నై శూన్యం బైనపురంబు సొర నొల్ల నిచ్చట
నుండి వనంబున కరిగెద నని యిట్లు భరతశత్రుఘ్ను లేకప్రకారంబునఁ గవ
గూడి దుఃఖించు చుండఁ దదీయరోదనశ్రవణసంజాతశోకవిశేషంబున నచ్చటి
జనంబు లెల్ల హాహాకారంబులు సేయు చుండి రప్పుడు భగ్నశృంగంబు లైనమ
హోక్షంబులకై వడి నేలం బడి పరితపించు చున్నయక్కుమారులం జూచి
వంశగురుండును సర్వజ్ఞుండును బ్రశస్తస్వభావుండును దీర్ఘదర్శియు నగువసి
ష్ఠుండు భరతునిఁ గ్రుచ్చి యెత్తి యాసీనుం గావించి తత్కాలసదృశంబు లగు
వాక్యంబుల ననూనయించుచు నిట్లనియె. 1586

తే. అనఘ యీయయ్య దశరథుం డమరపదవి
కరిగి దినములు పదియు మూఁ డయ్యె నిపుడు
సావశేషాస్థిసంచయమందు నీవు
కడఁగి యాలస్య మిటు సేయఁ గార్య మగునె. 1587

క. జనులకు జన్మము మరణం, బును లాభాలాభములును మోదము ఖేదం
బనుభావ్యము లని యెఱిఁగియు, ననఘా నేఁ డిట్లు వగవ నగునే నీకున్. 1588

క. అని మునిపతి యీగతి న, మ్మనుకులునిం దేర్చు నెడ సుమంత్రుఁడు శత్రు
ఘ్నుని గ్రుచ్చియెత్తి యట్లనె, జనులభవాభవముఁ దెల్పి సమ్మతిఁ దేర్చెన్.

వ. ఇట్లు వసిష్ఠసుమంత్రబోధానుసముత్థితు లై యున్నరకంఠీరవులు వర్షాతపపరి
మ్లానంబు లగుశక్రధ్వజంబులపోలిక వేర్వేఱఁ బ్రకాశించి రప్పు డమాత్యు
లు పరమార్తులును బరిమార్జితబాష్పులును రక్తాక్షులును నైనయమ్మహా
రాజనందనులం జూచి యపరక్రియ నుద్దేశించి వేగిరపడి పలికినఁ దద్వచ
నానురూపంబుగాఁ గ్రియాశేషం బంతయు నిర్వర్తించి గృహంబుఁ బ్రవేశించి

రంత లక్ష్మణానుజుం డగుశత్రుఘ్నుండు రామానయనవిచారడోలాందోళిత
చిత్తుం డై నభరతున కిట్లనియె. 1590

శత్రుఘ్నుఁడు మంథరాకైకేయులఁ బట్టుకొని బెదరించుట.

సీ. సకలభూతములకు సంకటం బరుదెంచి నపు డేమహామహుం డరసి ప్రోచు
నట్టిరాఘవుఁ డొక్క కట్టిడిమగువచే వనవివాసితుఁ డయ్యెఁ దనకు నింత
చెల్లునే జనకవాక్యోల్లంఘనముఁ జేసెఁ గాసలేయుఁడు రాజ్యకాంక్షఁ జేసి
యని దుష్టజను లాడుకొనుసన్నసడి కోడి యతఁ డీయకొనియెఁ బో వితతవీర్య
తే. నిరతుఁ డగులక్ష్మణుఁడు తండ్రి నిగ్రహించి, యున్న నేటికి వారింపఁడయ్యె భరత
యాలిమాటలు విని నీతిమాలి తిరుగు, నవనిపతి నిగ్రహించుట యంతతప్పె.

మ. అని యిబ్భంగి సుమిత్రపట్టి ఘనవీరాలాపముల్ గైకయీ
తనయాదు ల్వీన నాడుచుండ మయిపూఁతల్ బుష్పహారంబులల్
ఘనవస్త్రంబుల నవ్యభూషణముల్ గైసేసి యాళీజను
ల్దను సేవింపఁగఁ గుబ్జ యన్నగరిప్రాగ్ద్వారంబునం దోఁచినన్. 1592

క. అచ్చటికావలివారలు, గ్రచ్చఱ నప్పాపురాలిఁ గట్టికొని వెసం
దెచ్చి సుమిత్రాసుతుతో, హెచ్చినకోపమునఁ బల్కి రిట్లనుచుఁ దగన్. 1593

క. రామునివనవాసమునకు, భూమీశ్వరుమరణమునకుఁ బుట్టినమూలం
బీమంథర దీనిం దగ, నీమదికిం దోఁచినట్లు నెఱపుము శిక్షన్. 1594

ఉ. నా విని కెంపుడాలు నయనంబులఁ గన్పడఁ గ్రుద్ధుఁ డై సుమి
త్రావరపుత్రుఁ డెల్లరను దాఁ బరికించి సుఖార్హుఁ డైన సీ
తావిభుఁ డేదురాత్మికకతంబునఁ గానకు నేగె దాని నేఁ
డీవిధిఁ దత్ఫలంబు భుజయింపఁగఁ జేసెదఁ జూడుఁ డిందఱున్. 1595

చ. అని యిట్లుద్ధతి లక్ష్మణానుజుఁడు క్రూరాలాపము ల్పల్కి గ్ర
క్కున నమ్మంథరఁ బట్టెఁ బట్టుటయు నాక్రోశించుచుం దత్సఖీ
జన మత్యంతభయంబునం బఱచి కౌసల్యామహాదేవి నా
య్యన భక్తిస్మరణంబు నొందె ననుకంపాయత్త యౌఁ గావునన్. 1596

సీ. అప్పుడు శత్రుఘ్నుఁ డధికరోషంబున నారక్తనేత్రుఁ డై ఘోరభంగిఁ
గుబ్జ నాకర్షించి కుంభిని వ్రేసి కేల్మోడ్చి కావవె యని యేడ్చుచుండ
నీడ్చుటయును దానిఁ బృథుచిత్రభూషణమణు లుర్విఁ బడిన నమ్మందిరంబు
శారదగగనంబుచందాన నొప్పె నిక్కరణిఁ గుబ్జను బట్టి మరలఁ గ్రోధ
తే. బలము పెంపునఁ గైకేయిఁ బట్టుకొనఁగ, దారుణోక్తుల బదరినఁ దనువు వడకఁ
బ్రాణభయమున నేడ్చుచుఁ బరువు వీడె, సత్వరంబుగ భరతుని శరణ మొందె.

క. భరతుం డీగతి భయమున, శరణాగత యైనయాత్మజననిం గని యి
ద్ధర సర్వభూతములలోఁ, దెఱప యవధ్య యది దీనిఁ దెగఁ జూడకుమీ. 1598

క. అని క్రుద్ధుఁ డైనతమ్మునిఁ, దనధర్మసమగ్రవాక్సుధాధారాసే
చనమునఁ బ్రశాంతుఁ జేయుచు, నినసంతతినముచితోక్తి ని ట్లని పలికెన్.

క. మన మీకై కను గుబ్జను, జనదూషితవృత్త లనుచుఁ జంపితి మేని
న్ఘనధార్మికుఁ డగురాముఁడు, గని విడువఁడె మనల మాతృఘాతుకు లనుచున్.

క. అనవుడు భరతునివాక్యము, విని శత్రుఘ్నుండు ఘనవివేకముతో గ్ర
క్కునఁ గైకేయిని గుబ్జను, దనవంశోచితనయంబుఁ దలఁచుచు విడిచెన్. 1601

క. విడిచిన నప్పుడఁతుక వగ, పడరఁగ నశ్వపతిపుత్రియం ఘ్రిద్వయిపైఁ
బడి నిట్టూర్పులు పుచ్చుచుఁ, గడువడి విలపించె శోకకంపితమతి యై. 1602

భరతుఁడు రాజాభిషేకకర్తలతో రామునకే యభిషేకముఁ గావించెద ననుట.

వ. ఇట్లు శత్రుఘ్నవిక్షేపమూఢసంజ్ఞ యై భయత్రస్త యైనక్రౌంచాంగనభంగి నార్తరూప యై దీనస్వరంబున దుఃఖించు చున్నమంథరం జూచి కైకేయి బహుప్రకారంబుల నాశ్వాసించె నంత బదునాలవనాఁడు సూర్యోదయసమయంబున రాజాభిషేకకర్తలు భరతునొద్దకుం జనుదెంచి యిట్లనిరి. 1603

ఉ. భూపతి రాముని న్విపినభూమికిఁ బంచి తదీయశోకసం
తాపమహావ్యథం బిదపఁ దాఁ ద్రిదివంబున కేగె నింక గో
త్రాపరిపాలనవ్రతముఁ దాల్పు మనాయక మయ్యె రాజ్య మి
ట్లేపున నింతదాఁక నశియింపకయున్నది దైవికంబునన్. 1604

ఉ. ఎప్పుడు వచ్చుఁ గైకకొడు కెప్పుడు మాకు విభుండు గల్గు నం
చెప్పుడు నీదురాక పురి నెల్ల జనంబులు గోరుచున్నవా
రిప్పుడె సర్వరాజ్యపద మింపుగఁ గైకొని పూర్వవృత్తముం
దప్పక యుండ నింక మము దాశరథీ కృప నేలు మిత్తతిన్. 1605

వ. అనిన దృఢవ్రతుం డగుభరతుండు పట్టాభిషేకోపయుక్త మంగళద్రవ్యజాతంబు వలగొని వారల కిట్లనియె. 1606

క. రాజకులమునకు జ్యేష్ఠుని, రాజత్వం బుచిత మని తిరంబుగ మీర
ల్రాజచరిత్రం బెఱిఁగియు, రాజితఁ డని నన్ను మదిఁ దలంచుట తగవే.

ఆ. రాజసమ్మతుండు రఘుకులతిలకుండు, రాముఁ డన్న యగుట రాజు ధరణి
కతనిపూన్కిఁ బూని యడవిలో నొక్కెడ, నధివసించువాఁడ నన్ని యేండ్లు.

భరతుఁడు వనమార్గాదికంబులఁ బరిష్కరింపఁ బ్రజల కాజ్ఞాపించుట.

చ. అఱమఱ యింతలేక చతురంగబలంబులఁ గూర్పుఁ డెల్లి త
త్పరత ఘనాభిషేచనికభాండముఁ గైకొని కాన కేగి ను
స్థిరమతి నందె రాము నభిషిక్తునిఁ జేసి కడంగి వీటి క
ధ్వరముననుండి పావకు ధ్రువంబుగఁ దెచ్చినభంగిఁ దెచ్చెదన్. 1609

తే. రాము నీరీతిఁ బుడమికి రాజుఁ జేసి, యేను వనదుర్గమున వసియింతు నింక

మీఁదఁ గైకను గామసమేతఁ గాఁగఁ, బూని కావించుకోరిక లేనికతన. 1610

క. తెరువులు సుకరంబులు గాఁ, దరంగిణీగణము సుప్రతరముగ వనము
ల్గరము ప్రకాశములుగ సత్వరముగఁ గావింపుఁ డిపుడు తడ వేమిటికిన్. 1611

క. అని శ్రీమంతము హృద్యం, బనుత్తమము సుప్రసన్న మగుభాషిత మీ
యనువునఁ బలికిన భరతున, కనియె నచటిజనము సంభృతానందమునన్.

క. అనఘా జ్యేష్ఠుం డగునృప, తనయునకు ధరిత్రి నొసఁగఁ దలఁచినకతనన్
నినుఁ బొందు నిక్కువంబుగ, వనరుహపాణి యగులక్ష్మి వారనికరుణన్. 1613

క. అని యిట్లు పూర్ణసమ్మద, జనితము లగు బాష్పబిందుసందోహము లా
తనిపైఁ గురియఁగఁ గౌతుక, మున నగ్గించెం దదీయముఖ్యగుణంబుల్. 1614

భరతనియుక్తు లగుకర్మకారులు వనంబున రాజమార్గంబుఁ గావించుట.

వ. అంత భరతునిశాసనంబున నమాత్యప్రచోదితులై సర్వంబును. సమకట్టి భూమిప్రదేశజ్ఞులును శిబికాదినిర్మాణంబునందు సూత్రగ్రహణకుశలురును పంతొనాయులును స్వకర్మాభిరతు లగుఖననోపజీవులును మృగపక్షిసాధన యంత్రకర్తలును భృతిజీవులును స్థపతులును రాజపురుషులును క్షేపణీయాది యంత్రకరణాభిజ్ఞులును జలయంత్రాదినిర్మాణచతురులును వర్ధకులును మార్గసమీకరణసమర్థులును మార్గనిరోధకవృక్షచ్ఛేదకులును సూపకారులును సుధాకారులును వంశకర్మకారులును మార్గప్రదర్శకులును మొదలుగాఁగల సకలజనంబులు రామసందర్శనకుతూహలత్వంబువలనఁ బర్వకాలంబునందలి సముద్రునిమహావేగంబుకరణి శోభిల్లుచుఁ దమవారిం గూడికొని వివిధపిటక ఖనిత్రకుఠారాదిసాధనంబులు పరిగ్రహించుకొని రామాధిష్ఠితప్రదేశంబు నుద్దేశించి ముంగలం జని రందుఁ గొందఱు మార్గనిరోధకంబు లగుశాఖాలతాగుల్మస్థాణువృక్షంబులు కుఠారటంకదాత్రంబుల నఱకుచు వృక్షరహిత ప్రదేశంబుల వృక్షంబులఁ బ్రతిష్ఠించుచుఁ గొందఱు బలవంతులు విషమ భూప్రదేశంబులకుం జని తత్రత్యరూఢమూలవీరణస్తంబంబుల ఛేదించుచుఁ గొందఱు మిట్టపల్లంబు సమతలంబు సేయుచుఁ గొందఱు వాపీకూపంబులు పూడ్చుచుఁ గొందఱు బంధనీయంబులైనక్షుద్రనదీదుర్గమప్రదేశంబుల సేతువుల బంధించుచు క్షోద్యంబులైనక్షుద్రశిలాభూయిష్ఠప్రదేశంబులు చూర్ణంబులు సేయుచు భేదనీయంబులైననదీతటాకాదిజలప్రదేశంబుల జలదుర్గమార్గంబు భేదించుచుఁ గొందఱు స్వల్పప్రవాహంబుల బంధనంబులచేత బహుసలిలంబులం గావించుచుఁ గొందఱు నిర్జలప్రదేశంబులయందు బహువిధవేదికాపరిమండితకూపంబులు ద్రవ్వుచు నిట్లనేకప్రకారంబులనయ్యెప్రదేశంబులు రమ్యంబులు గావించిన నాసేనామార్గంబు సుధాలిప్తనిబద్ధ భూప్రదేశంబును బుష్పితమహీరుహంబును మత్తోద్ఘుష్టద్విజగణంబును ధ్వజ

పతాకాలంకృతంబును జందనోదకసంసిక్తంబును నానాకుసుమభూషితంబు నై స్వర్గపథంబుచందంబున నొప్పె నంత భరతునిశాసనంబున శిబిరాదికరణనియుక్తులు పరస్పరసంగతు లై బహుస్వాదుఫలోపేతంబు లై నరమణీయప్రదేశంబులయందు మహాత్ముం డగుభరతుండు నివసించుటకు శుభనక్షత్రముహూర్తంబులయందు శిబిరంబులు నిర్మించిన నవి భూషణసదృశంబు లయ్యును వితానకలశధ్వజాదులచేత మిక్కిలి భూషితంబులై దృష్టిచిత్రహారంబు లై పాంసుసదృశసికతామయపరిఖాలంకృతంబు లై యింద్రకీలాద్రిప్రతిమంబు లై ప్రతోళీపరిశోభితంబు లై ప్రాసాదమాలాసంసక్తంబు లై సౌధప్రాకారసంవృతంబు లై పతాకాధ్వజశోభితంబు లై సునిర్మితమహాపథంబు లై గృహాకపోతపాలికోపరివినిర్మితమహోన్నత శిరోగృహాలంకృతంబు లై యొప్పె నివ్విధంబున వివిధద్రుమకాననశీతనిర్మలపానీయమహామీనసమాకుల యైనజాహ్నవీనదిపర్యంతంబు శుభశిల్పినిర్మితం బైనరాజమార్గంబు చంద్రతారాగణమండితం బైనరజనీనభంబుభంగి నతిరమ్యం బై ప్రకాశించె నంత. 1615

క. నాందీముఖి యగుయామిని, యందు రహి న్సూతమాగధాదులు పరమా
నందమున భరతునిఁ బొగడి, రందంద శుభస్తవముల నతివైచిత్రిన్. 1616

తే. స్వర్ణదండాభిహతము లై చటులయామ
దుందుభులు మ్రోసె మఱి రొద ల్గ్రిందుకొనియె
మఱియు నుచ్చావచస్వనోత్కరము లైన
వాద్యములబోరు కలఁగె నవ్యక్తఫణితి. 1617

క. ఆతూర్యరవము సకలా, శాతలముల నిండి శోకసంతాపముచే
వీతధృతి యైనభరతుని, నాతతదుఃఖమున మరల నారట పెట్టెన్. 1618

తే. అంత భరతుండు నేను మీకధివిభుండఁ,గాను మీ రేల నన్నింతగలఁచెద రని
వారి వారించి శ్రుతకీర్తివరునిఁ గాంచి, కనుల నశ్రులు గాఱ నిట్లనుచుఁ బలికె.

క. పాపపుఁ గైకయి చేసిన, పాపంబున వ్యథయు మహదుపక్రోశంబు
న్నాపై నిడి తా నక్కట, భూపాలుఁడు నాకమునకుఁ బోయెం గంటే. 1620

క. సుగుణుండు ధర్మరతుఁ డగు, జగతీపతి రాజ్యలక్ష్మి జలమధ్యమునం
దగఁ గర్ణధారహీనం, బగుపోతముకరణి నిట్లహో సుడి వడియెన్. 1621

క. మన కెవ్వాఁడు విభుం డ, య్యనఘుం డగురామభద్రుఁ డాకైకయిచేఁ
దనకుం దానె వనంబున, కనుపం బడియెఁ గద యపగతైశ్వర్యుం డై. 1622

—వసిష్ఠుఁడు భరతునితో రాజ్యం బంగీకరింపుమని చెప్పుట.—

వ. అని బహుప్రకారంబుల విలపించుచు మూర్ఛితుం డైనభరతునిం గని యంతఃపురకాంతలు సుస్వరంబుగా రోదనంబు చేసి రంత రాజధర్మవిశారదుం డగు వసిష్ఠుండు శాతకుంభమయంబును రమ్యంబును మణిరత్నసమాకులంబు నగు

నిక్ష్వాకునాథునిసభామండపంబునకు శిష్యసహితంబుగాఁ జనుదెంచి యందుఁ బరార్ధ్యాస్తరణసంవృతం బైనకాంచనపీఠంబున నధివసించి బ్రాహ్మణక్షత్రియ వైశ్యులను మంత్రిసేనానాయకులను భరతశత్రుఘ్నసుమంత్రులను దోడ్తెచ్చి రమ్మని దూతలం బంచిన వా రట్ల కావింప గజాశ్వరథసంఘటనసంజాతమహా ఘోషంబు భూనభోంతరాళంబు నిండి చెలంగె నప్పుడు ప్రకృతిజనంబులు సభామండపంబునకుం జనుదెంచు చున్నభరతునిం జూచి దేవతలు శతమఖునిం బోలె నభినందించి రాసమయంబునఁ దిమినాగసంవృతంబును స్తిమిత జలంబును మణిశంఖశర్కరంబును నగుహ్రదంబుచందంబున నంసం బై తత్స భాసదనంబు దశరథసుతశోభితం బై తొల్లి దశరథశోభితం బైనయట్ల ప్రకా శించు చుండె నంత భరతుం డార్యగణసంపూర్ణ యగుసభను బూర్ణచంద్రుం డు శుక్రబృహస్పతిప్రముఖప్రకృష్టగ్రహాయుక్త యైనశర్వరిం బోలె వెలింగిం చె నిట్లు రుచిరాసనాసీనులగునార్యులవస్త్రాంగరాగప్రభాజాలంబులం బ్రద్యోతి త యై యాసభ ఘనాపాయంబునందుఁ బూర్ణచంద్రప్రద్యోతిత యైనరాత్రి చందంబునం దేజరిల్లె నప్పుడు మునిశ్రేష్ఠుం డగువసిష్ఠుండు సభాసదు లందఱు విను చుండ భరతున కి ట్లనియె. 1623

సీ. ధరణీశనందన ధనధాన్యవతి యైనధారుణి నీ కిచ్చి దశరథుండు.
విఖ్యాత మగుశక్రవిష్టపంబున కేగె రాముండు రాజధర్మజ్ఞుఁ డతని
యానతి వనమున కరిగె నీవిఁకఁ బితృభ్రాతృదత్తం బైనరాజ్య మిప్డు
గైకొని వినిహతకంటకంబుగ నేలు మనఘ ప్రత్యేకసింహాసనాధి
తే. నాథు లగుప్రాచ్యులును దాక్షిణాత్యులును బ్ర
దీచ్యులు నుదీచ్యులు సముద్రదేశవాసు
లమితధనరత్నరాసుల నధికభక్తిఁ
గరము లర్పించి గొల్చు చుందురు మహాత్మ. 624

ఉ. నావుడు ధర్మవిత్తముఁ డనం బొగడం దగుకైకయీసుతుం
డావచనంబు కర్ణపుట మంటిన యంతనె శోకమూర్ఛితుం
డై వెనఁ దెల్విఁ దాల్చి గురు నర్మిలి దూఱుచు ధర్మకాంక్షు సీ
తావిభునిం దలంచుచుఁ బదంపడి కన్నుల నీరు నించుచున్. 1625

వ. శోకగద్గదకంఠుం డై కలహంసస్వరంబునఁ గొండొకసేపు విలపించి పురోహితు నుద్దేశించి. 1626

సీ. అనఘ విద్యాస్నాతుఁ డాచరితబ్రహ్మచర్యుండు ధీమంతుఁ డార్యవినుతుఁ
డర్హధర్మవిచారుఁ డగురామవిభునిరాజ్యంబు మాదృశుఁ డెవ్వఁ డపహరించు
దశరథునకుఁ బుట్టి ధర్మంబునకుఁ దప్పి భ్రాతృరాజ్యంబు నేభంగిఁ గొందు
రాజ్య మేనును లచ్చి రాముని సొమ్ముగా భావించి ధర్మంబుఁ బలుక వైతి

తే. జ్యేష్ఠుఁడును ధర్మసంవేదిశ్రేష్ఠుఁ డాది, రాజసహాయపోషముం డగురాఘవుండు
దశరథునియట్ల యాధిపత్యంబు సేయు, వలవదే శాశ్వతంబుగ వసుధకెల్ల. 1627

ఆ. విను మనార్యజుష్ట మనుచితం బగుపాప, మేను జేయ నోప నీయకొనిన
రఘుకులప్రభూతరాజులలో వంశ, పాంసనుండఁ గానె పలుకు లేల. 1628

తే. కైక చేసిన యపరాధకార్యమునకు, నీయకొనఁ జాల నిప్పుడె యిచటనుండి
దారుణారణ్యగతుఁ డగుదాశరథికిఁ, జాఁగిలి నమస్కరింతుహస్తములు మోడ్చి.

క. రాముని దోడ్కొని వచ్చుట, కీమెయిఁ జనువాఁడ నతఁ డహీనగుణాఢ్యుం
డీముల్లోకము లైన న, సామాన్యప్రౌఢి నేలఁ జాలు మహాత్మా. 1630

—భరతుఁడు వసిష్ఠునితో శ్రీరాముఁడే రాజ్యాధిపతి కావలయు ననుట.—

క. అని ధర్మమూఁది పలుకుచుఁ, దనవాక్యము లాలకించి తద్దయుఁ బరిష
జ్జనము పులకించుచుండఁగ, మునిపతి కనియెం బ్రసన్నముఖుఁ డై మరలన్.

ఉ. వర్ధితధర్మకీర్తి రఘువర్యుని రాముని సాధుసన్నిధిం
బ్రార్థన సేసి క్రమ్మఱఁ బురంబునకు న్వెసఁ దోడితెత్తు న
య్యర్థము గాక తక్కిన జటాజినము ల్ధరియించి కానలో
సార్థకవృత్తి లక్ష్మణునిచాడ్పున రామునిఁ గొల్చి యుండెదన్. 1632

వ. పురోహితామాత్యబాంధవు లందఱు విను చుండ నానేర్చువిధంబున సర్వో
పాయంబుల బలాత్కరించి రామునిఁ బురంబునకుం దోడ్కొని వచ్చెద. 1633

క. ఇంతకు మును ఖనికులు క, ర్మాంతికులును మార్గశోధకాదులు నాచే
నెంతయుఁ బ్రయుక్తులై చను, టంతయు మీ రెఱుఁగరయ్య యాత్రాభిరతిన్.

వ. అని యిట్లు వసిష్ఠునితోఁ దగిన తెఱంగునఁ బ్రత్యుత్తరం బిచ్చి సమీపం
బున నున్నమంత్రకోవిదుం డగుసుమంత్రు నవలోకించి నీవు మదీయశాస
నంబునఁ బురంబులోన యాత్ర సాటించి బలంబుల నాయితంబు గావింపు
మనిన నతం డట్ల కావించినఁ దత్క్షణంబ బలాధ్యక్షులును బౌరులును సమా
జ్ఞప్త యైనబలయాత్ర నాకర్ణించి సంప్రహృష్టచిత్తు లై రప్పుడు యోధాంగన
లందఱు యాత్రాగమనంబు విని పరమానందభరితాంతఃకరణ లై సత్వరం
బుగఁ దమతమవల్లభులం బ్రయాణంబున కుద్యుక్తులం జేసిరి బలాధ్యక్షులు
హయగోరథస్యందనశకటమాతంగంబులచేత సజ్జం బై నచమూసమూహంబు
నుం బ్రచోదించి రంత భరతుండు గురుసన్నిధియందు సుమంత్రుం జూచి రథం
బాయత్తంబుఁ జేసి తె మ్మనిన నతండు తద్వచనానురూపంబుగా జవసత్వసంప
న్నంబు లైనహయంబులం బూన్చి సజ్జంబుఁ జేసి తెచ్చిన దానిం బ్రదక్షిణ
పూర్వకంబుగా నారోహించి రామదర్శనలాలసుం డై సైన్యసమేతంబుగా
వెడలె నప్పుడు సుమంత్రచోదితు లై పురంబునం గలబ్రాహ్మణక్షత్రియవైశ్య
శూద్రులును బుత్రమిత్రకళత్రభ్రాతృసమేతంబుగా యథార్హయానంబు లెక్కి

యతనిపిఱుందం జనిరి మంత్రిపురోహితసామంతబంధుసుహృజ్జనంబు లనేకశతాంగమాతంగతురంగంబు లెక్కి భరతునియగ్రభాగంబునం బోవుచుండిరి కౌసల్యయు సుమిత్రయుఁ గైకయుఁ దక్కినయంతఃపురకాంతలు రామానయనసంహృష్ట లై భరతనియోగంబునం జను చుండి రివ్విధంబున. 1635

భరతుఁడు సైన్యసమేతంబుగఁ బయనంబై వెడలుట.

తే. భరతశాసనమున రామభద్రుఁ జూడఁ, గలిగె నని మేనఁ బులకలు గ్రమ్ము దేర
వేయిభంగుల భరతునివెంటఁ జనిరి, వీరు వా రన కమ్మేటిపీటివారు. 1636

సీ. సకలనీలాంబుదశ్యామలకోమలగాత్రు రాకాసుధాకరోల్లాసివదను
రవికరోద్దీపితరాజీవతామ్రాక్షు నాజానుబాహు మహానుభావు
రమణీయగళు మహోరస్కు మహేష్వాసు సుకపోలు సులలాటు సుగుణజాలు
స్థిరసత్త్వుఁ జారునాసికు దృఢవ్రతు గూఢజత్రు సుదంష్ట్రుఁ బ్రసన్నతేజుఁ
తే. గౌసలేయుని నెప్పుడు గాంచఁగలుగు, నెపుడు భాషింపఁగలుగు నవ్విపులయశునిఁ
జూచినంతనె చనుఁగాదె శోక మినునిఁ, గాంచినంతనె విరియు చీఁకటులకరణి.

భరతుఁడు గంగానదిఁ జేరుట.

వ. అని బహుప్రకారంబుల రామునిమహిమంబులు వక్కాణించుచుఁ దద్దర్శనలాలసు లై హర్షవిశేషంబున నన్యోన్యాలింగనంబుఁ గావించుచుఁ బెన్నిధి కడకుం జనుపేదలచందంబునం జని రప్పుడు పురంబునం గలగజంబులలోనఁ దొమ్మిదివేలగజంబులు నఱువదివేలరథంబులును లక్షగుఱ్ఱంబులును భరతుని పిఱుందం జనియె ముక్తాపద్మరాగాదిమణిసంస్కారకులును గుంభకారులును సూత్రకర్మకారులును శస్త్రనిర్మాణోపజీవులును మయూరపింఛచ్ఛత్రవ్యజనాదికారులును గరపత్త్రోపజీవులును దంతికుడ్యవేదికాదికాంత్యుత్పాదకులును దారురత్నాదిరంధ్రకారులును దంతమయపుత్రికాపీఠశిబికాదికారులును సుధాలేపనకర్మకారులును జందనకస్తూరికాదిసుగంధిద్రవ్యోపజీవులును దైలాభ్యంగాదిస్నానకారులును గంబళధావకులును సువర్తనకారులును వైద్యులును ధూపాదివాసకులును మద్యకారులును రజకులును గ్రామప్రధానులును ఘోషప్రధానులును శైలూషులును గైవర్తకులును వేదవిదు లైనబ్రాహ్మణులును మొదలుగాఁ గలనాగరు లందఱుఁ దామ్రమృష్టానులేపనులును శుద్ధవస్త్రధారులును సువేషాఢ్యులు నై పుత్త్రదారాదులం గూడికొని గోరథాదియథార్హయానంబు లెక్కి సుందరగమనంబున భరతునివెనుకం బోవుచుండిరి యిత్తెఱంగునం జని చని యెచ్చట రామసఖుం డగుగుహుండు బంధుసహితంబుగా నివసించి యుండు నట్టిశృంగిబేరపురసమీపంబునకుం జని యందుఁ జక్రవాకోపశోభితం బగుగంగానదీసమీపంబున సైన్యంబు విడిసె నప్పుడు గంగానది విలోకించి భరతుండు సచివుల కిట్లనియె. 1638

చ. బలముల నిచ్చటన్ విడియఁ బంపుఁడు నేఁ డిట విశ్రమించి స
ల్లలితజలంబులం దగ నిలాపతి కౌర్ధ్వ్వదైహిక మాచరించి ని
శ్చలమతి నెల్లి వేకువనె చయ్యన నీనది దాఁటి పోద మ
త్యలఘుపరాక్రమక్రము ననర్ఘశిలీముఖు రాముఁ జూడఁగన్. 1639

చ. అన విని యట్లకాక యని యందఱుఁ బావనజాహ్నవీతటం
బునఁ జతురంగసైన్యముల మోదముతో విడియించి మించి భా
రనిరతులై యథార్హశిబిరంబుల నుండిరి కార్యచింత న
మ్మనుకులవర్ధనుం డుచితమందిరమందు వసించె నెంతయున్. 1640

వ. అంత భరతునిరాక యెఱింగి నిషాదనాథుం డగుగుహుండు తనవారి నందఱ రావించి గంగాతీరంబున సైన్యంబు సాగరసంకాశం బై యనంతం బై మనంబున కైన నచింత్యం బై యున్నది రథంబునందుఁ గోవిదారధ్వజంబు గనుపట్టుచున్నది గావున. 1641

—గుహుఁడు భరతునిఁగూర్చి శంకించి తనవారితో నాలోచించుట.—

మ. ధనకోశంబును దుర్గము ల్బలము హృద్యం బైనసామ్రాజ్యముం
దనపా ల్చేసి పితృత్రాణ మీఁగుటకుఁ గాంతారోర్వి వర్తింపఁ బో
యిననామిత్త్రుని రామభద్రు మరల న్హింసింప సాటోపుఁ డై
పనిగా నేగెడు సేనతో భరతుఁ డీపాపాత్ముఁ డిం గంటిరే. 1642

చ. ఇతఁడు దురంతవిక్రముఁ డహీనభుజాబలశాలి వీని ను
ద్ధతభుజసత్త్వయుక్తి నరికట్టఁ దలంచితి మేని క్రుద్ధుఁ డై
యతులశరోద్ధతి న్మనల నందఱఁ గాఱియపెట్టుఁ గాన మీ
రతిశయయుక్తి నొక్కుమ్మగి నడ్డము కట్టుఁడు గంగ రేవులన్. 1643

చ. అనఘుఁడు సత్యవాది చరితార్థుఁ డు రాఘవుఁ డెల్లభంగుల
న్మనకు విభుండు మిత్త్రుఁ డతిమాన్యుఁడు గావున నాత్రిలోకపూ
జ్యున కొకహానియుం బొరయ కుండువిధంబునఁ గావఁ బోలు మీ
రనుపమబుద్ధి నాకఱిపినట్ల యొనర్పుఁడు కర్ణధారకుల్. 1644

వ. మఱియు మాంసమూలఫలాశను లగునదీరక్షకులు బలవంతులు గూడికొని యేనూఱోడలయం దొక్కొక్క యోడకుఁ బ్రత్యేకంబుగాఁ గైవర్తకశతంబు నిలుచునట్లుగా సంఘటించి స్వబలంబులం గూడి పోతారోపితమధుమూలఫలాదికు లై తీర్థప్రదేశంబుల రక్షించుచుండుఁడు భరతుండు రామునియెడ నదుష్టుం డగునేని యిప్పుడ యీసేన క్షేమంబున గంగానదిం దరింప నిత్తును.

—గుహుండు భరతునిఁ జూడ నరుగుట.—

క. అని వారి వారి నయ్యై, పనులకు నియమించి రుచ్యఫలములు మధుపుర్క
ఘనమాంసముఁ గానుకఁ గొని, పనివడి తారరిగె గుహుఁడు భరతునిఁ జూడన్.

తే. ఇత్తెఱంగునఁ దమకడ కేగుదెంచు, గుహుని నల్లంతటనె చూచి గురుసమీప
నంజలి ఘటించి నయవినయజ్ఞుఁడైన, సూతపుత్త్రుండు భరతునిఁ జూచి పలికె.

క. అనఘా యీవచ్చునిషా,దనాయకుఁడు రామసఖుఁడు తడయక కుశుఁ గ
న్గొన వచ్చుచున్నవాఁడీ, యనచేఁ బతి యున్నకందు వది దెలియ నగున్.

క. నా విని భరతుఁడు సంతో,షావిష్కృతచిత్తుఁ డగుచు నతని రయమునఁ
రావింపు మనవుడుఁ దదా, జ్ఞావిధి సూతుండు సమ్ముఖంబు ఘటించెన్. 1649

వ. ఇవ్విధంబున ననుజ్ఞాతుండై గుహుండు జ్ఞాతిసమేతంబుగా భరతునొద్దకుం
జనుదెంచి నమస్కరించి దేవా యీదేశంబు మీకు గృహారామభూతంబు
భవద్గమనానివేదనంబున వంచితుల మైతి మే మందఱము భవదధీనులము
గావున స్వకీయంబైన దాసకులంబునందు నివసింపు మని విన్నవించెద మనిపలికి
వెండియు నిట్లనియె. 1630

తే. ఆర్ద్రశుష్కముచ్చావచం బగుఫలములు, మృష్టఫలములమధువుఁ బరిగ్రహించి
యిచటనేఁడెల్ల వసియించి యెల్లి తెల్ల,వాఱినంత నేయరుగుముబలయుతముగ.

క. అని సౌహార్దవిశేషం, బునఁ బలికెడుగుహునివచనములు విని వదనం
బున దైన్యము దోఁపఁగ నా, తనితో హేత్వర్థసంహితంబుగఁ బలికెన్. 1652

వ. పరమసఖా నీ వొక్కండవె యీదృశం బగుసైన్యంబు నభ్యర్చింప నిశ్చ
యించితివి గావున రామునియందు నీకుం గలభక్తిస్నేహంబు లెల్లవారికిఁ
దెల్లం బయ్యె నీయాదరణంబుచేతనే యే మందఱము నీచేత నర్చితులైన
వార మైతి మిది దురత్యయం బగుగంగానూపం బీదేశంబు దుష్ప్రవేశం బే
మార్గంబున భరద్వాజాశ్రమంబునకుం జనియెద మనిన విని గహనగోచరుం
డగుగుహుండు కృతాంజలిపుటుండైన రేంద్రా యేను ధనుష్మంతులైనమదీ
యజ్ఞాతులం గూడి నీపిఱుంద నరుగుదెంచెద నీవు సేనాసమేతుండవై చను
టకుఁ గారణం బేమి మహాత్ముండైన రాముని కపకృతి సేయుటకుం బోవు
చున్నవాఁడ వని సందియంబు వొడము చున్నయది యనవుడు గగనంబు
మాడ్కి నిర్మలుండగుభరతుండు వెండియు గుహునిం జూచి శ్లక్ష్ణవాక్యంబుల
నిట్లనియె. 1653

భరతుఁడు గుహునకు నిజాగమనకారణముఁ దెల్పుట.

సీ. అనఘ రాఘవుఁడు నాకన్నయుఁ బితృతుల్యుఁ డాచార్యవరుఁడు నియామకుండు
వందనీయుఁడు సదావర్ణనీయుఁడు గురుం డమ్మహాత్ముని చరణాబ్జములకు
భక్తితోఁ బ్రణమిల్లి ప్రార్థనఁ గావించి దండకారణ్యమధ్యముననుండి
మరలఁ దోడ్కొని వచ్చి మహితరాజ్యపదస్థుఁ జేయంగఁ గోరి యీసేనఁగూడి

ఆ. పోవుచున్నవాఁడ బొంకు గా దీమాట, నమ్ము మదికి సందియమ్ము వలదు
కలియుగంబు గాదు కల్లలాడుటకు నీ, డెందమందు శంక నొంద వలదు.

వ. అని పలికిన సంహృష్టచిత్తుం డై భరతున కిట్లనియె. 1655

ఆ. అప్రయత్నలబ్ధమై నసామ్రాజ్యంబు, నవల ద్రోచి పుచ్చి నందువలన
దశరథేంద్రతనయ ధన్యుండ వైతివి, త్వత్సమానుఁ డొరుఁడు ధరణి లేఁడు.

తే. గహనమునఁ గృచ్ఛ్రగతుఁ డైనకౌసలేయు
మరలఁ దోడ్కొని వచ్చుట కరుగు చున్న
వాఁడ వని పల్కితివి గాన వసుధలోన
నీయశము శాశ్వతం బయి నెగడు నధిప. 1657

ఆ. అని బహూకరించెనంతసూర్యుఁడుగ్రుంకె, రాత్రిదోఁచెఁదమముగ్రమ్మెభరతుఁ
డచట సంధ్య వార్చి యనుజయుతంబుగాఁ, బర్ణతల్పమందుఁ బవ్వళించె 1658

వ. అప్పుడు శోకానర్హుండును శోకమూలపాపశూన్యుండును మహాత్ముండు నగు భరతునకు వాగగోచరం బైనరామచింతామయశోకంబు సముపస్థితం బయ్యెఁ బదంపడి కోటరసంసక్తవహ్ని వనదావాభితప్తం బైనపాదపంబుం బోలె శోకాగ్ని యంతర్దాహంబున భరతునిఁ దపింపఁ జేయుచుండె నిట్లు భరతుండు సూర్యాంశుసంతప్తం డైనహిమవంతుండు హిమంబుం బోలె శోకాగ్నిసంభవం బైన స్వేదోదకంబును సర్వగాత్రంబులవలన నించుచు ధ్యాననిర్దరశిలాసమూహంబును వినిశ్శ్వసితధాతుసంకులంబును దైన్యపాదపసంఘంబును శోకాయాసాధిశృంగంబును బ్రమోహానంతసత్త్వంబును సంతాపౌషధివేణువు నగుశోకశైలంబుచేత నాక్రాంతుం డై నిట్టూర్పులు పుచ్చుచు లోకాపవాదంబునకుఁ దలంకుచుఁ గైకేయి చేసినదుర్మంత్రంబునకు నిందించుచు దశరథునిం దలంచి కన్నీరు నించుచు రామభద్రు నెవ్విధంబునం జూతు నని తనలోనఁ దాను లజ్జించుచు నతనిచిత్తంబు నడయుటకుఁ దగినయుపాయం బూహించుచు హతయూథం బైనవృషభంబుభంగి నా ంపించుచు హృదయజ్వరార్దితుండై సుఖం బెఱుంగక యేకాగ్రచిత్తుం డై గృహపరివారసహితంబుగా దుఃఖించుచు నిట్లనేకప్రకారంబుల విలపించు చున్నసమయంబున గహనగోచరుం డగు గుహుండు భరతునిఁ దగినతెఱంగున నాశ్వాసించుచు రామునిమహానుభావత్వంబుఁ బ్రశంసించుచు నంతకంతకుఁ బ్రసంగవశంబున లక్ష్మణుని సుహృద్భావంబు వక్కాణించుతలంపున నిట్లనియె. 1659

గుహుఁడు భరతునికి లక్ష్మణుని సౌహార్దం బభివర్ణించి చెప్పుట.

మ. అనఘా రాముఁడు పర్ణతల్పమున భార్యాయుక్తుఁ డై పవ్వళిం
చినఁ దద్రక్షణ మాచరించుటకుఁ బ్రస్ఫీతాంబకాసు ల్శరా
సనముం గైకొని కన్ను మూయక మహాసంరంభి యై యున్నస
జ్జనసన్మాన్యు సుమిత్రపట్టిఁ గని నే సంతాపతప్తుండ నై. 1660

వ. ఇట్లంటి. 1661

తే. భానుకులవర్యచూడు మీపర్ణతల్ప, మింపుమెఱయనీకొఱకుఁ గల్పింపఁబడియె
నిందుసుఖనిద్ర సేయుము సందియంబు, వలదుసుకుమారుఁడవు పిన్నవాఁడవీవు.

చ. అనఘచరిత్ర నీదుకృప నందినవాఁడను గాని సజ్జనా
వనగుణధుర్య యేను గడవాఁడను గాను సుమయ్య యీనిశం
బనివడి బంధువుల్సఖులు భ్రాతలు సైన్యము గొల్వ నిద్ర మే
ల్కనియెదునంతదాఁక మిముఁ గాచెదఁ గంటికి ఱెప్పకైవడిన్. 1663

తే. నాకు రామునకంటె మనఃప్రియుండు
వసుధలోపల నన్యుఁ డెవ్వాఁడు లేఁడు
దేవ యీ యర్థమందు సందియము వలదు
పరఁగ నీమ్రోల బొంకులు పలుకఁ గలనె. 1664

క. రామునియనుగ్రహంబున, నీమహిలో యశము సౌఖ్య మీసంపదయు
న్నేమంబు గలిగెఁ బ్రియసఖ, భూమాయుతు నిమ్మహాత్ముఁ బరిపాలింతున్.

తే. గహనసంచారకుశలుండ గాన నాకుఁ, దెలియని దొకింత లే దిందు ధీరవర్య
భండనంబునఁ జతురంగబలము నైన, సరకుగొనక వారించెద సత్య మింత.

ఉ. నా విని యాకకుత్స్థకులనాథుఁడు నెన్బరికించి పల్కె నో
భూవినుతప్రతాప విను ముజ్జగ మేలఁగఁ జాలునట్టియీ
భావజసన్నిభుం డిటఁ బర్ణతలంబునఁ గూర్కుచుండ నా
కేవిధి నిద్ర వచ్చు సుఖ మేటికి జీవిత మేల చెప్పుమా. 1667

తే. సంగరంబుల నెవ్వాఁడు సకలనిర్జ
రాసురుల కైన రక్షింప నలవి గాక
యలరు నారామవిభుఁడు సీతాన్వితముగ
నేఁడు తృణతల్పములఁ గూర్కినాఁడు కంటె. 1668

తే. ఘనతపముచేత వివిధయాగములచేత
దానములచేత సకలమంత్రములచేతఁ
బ్రాప్తుఁ డై తుల్యగుణుఁ డయి పరఁగెఁ గాన
జనకున కతిప్రియాత్మజుం డనఘ యితఁడు. 1669

ఆ. అట్టిరాఘవాన్వయప్రదీపకుఁ డైన, యితఁడు ఘోరవనికి నేగుచుండఁ
గాంచి తండ్రి యైన గహ్వరీపతి మను, ననెడుమాట సందియంబు గాదె. 1670

వ. పితృమరణానంతరంబున మేదిని యనాథ యై యుండఁ గలదు. 1671

తే. సాంద్రభంగి నంతఃపురసతులు ఘోర, శోకరోదన మొనరించి సొలసి యూర
కున్న నుపరతనాద మై యుండు రాజ, సదన మిఁపు డని తలఁచెద సచివవర్య.

క. మాయయ్యయుఁ గౌసల్యయు, మాయమ్మయు నేఁటిరాత్రి మహనీయగుణ
శ్రీయుతుల మమ్ముఁ గానక, పాయక యేపగిది వీట బ్రదుకుదు రకటా, 1673

తే. వీరవరుఁ డైనతనయుని విపినయాత్రఁ
దలఁచి శోకాగ్నిచేఁ గ్రాఁగి తనువు విడుచుఁ
గాని కౌసల్య మని యుండఁ గలదె యింక
నాయమవితాన మాయమ్మ యడలుఁ గాదె. 1674

క. గ్రద్దన భూమీశ్వరుఁ డా, యిద్దఱముద్దియలపాటు హృదయంబునఁ దాఁ
బెద్దయుఁ జింతించి ఘనవి, పద్దశఁ బ్రాపించి మేనుఁ బాయు నిజముగాన్. 1675

ఆ. ఇట్టిమాట దలఁప నెంతయు నాగుండె, యవియు చున్న దట్టియడలు మాని
సమ్మదమున నేఁడు జొమ్మనఁ జె యియ్యెడి, నిద్రవోవ నెట్లు నేర్తు నయ్య. 1676

తే. ఏను లేకున్న మజ్జనయిత్రి పిన్న, కొడుకు నీక్షించి జీవించు నడలు దక్కి
యీమహాత్ముఁడు లేకున్న హితవరేణ్య, యేకసుతయైనకౌసల్య యెట్లుబ్రతుకు.

తే. రామభద్రునిఁ గోసలరాజ్యపట్ట, భద్రుఁ జేసి మనోరథప్రాప్తి గాక
మున్నె భూపతి పరలోకమునకుఁ బోవుఁ, గార్యమంతయు వ్యర్థమైకడచె నకట.

వ. అమ్మహాత్ముండు మావచ్చునందాఁక మని యుండఁ డేని యతని సంస్కరించి భరతాదులు సిద్ధార్థులై రమ్యచత్వరసంస్థానంబును సువిభక్తమహాపథంబును రమ్యప్రాసాదసంపన్నంబును సర్వరత్నవిభూషితంబును గజాశ్వరథసంబాధంబును దూర్యనాదవినాదితంబును సర్వకల్యాణసంపూర్ణంబును హృష్టపుష్టజనాన్వితంబును నారామోద్యానసంపన్నంబును సమాజోత్సవసంకులంబు నగుసాకేతనగరంబున సుఖంబు లనుభవించు చుండుదు రేను సమయకాలంబతీతం బగుచుండఁ గృతప్రతిజ్ఞుండై సేమంబున నున్నరామునిం గూడి మరలఁ బురంబుఁ బ్రవేశించుభాగ్యంబుఁ గాంతునా యని యేతాదృశంబు లగు దుఃఖాలాపంబులు నాతో నాడు చుండ నంతలోనఁ బ్రభాతకాలంబయ్యె నంత రాముండు మేల్కాంచి తానును లక్ష్మణుండును నిమ్మహానదీతీరంబున జటావల్కలంబులు ధరించి బాణబాణాసనకృపాణంబులు ధరించి వ్యపేక్షమాణులై సీతాసహితంబుగా నిమ్మహానది నుత్తరించి గజయూథపులచందంబున సుఖలీలం జని రని యిట్లు గుహుండు రామవృత్తాంతంబును లక్ష్మణుని పరిదేవనంబును సవిస్తరంబుగా నెఱింగించిన విని సుకుమారుండును మహాసత్త్వుండును సింహస్కంధుండును మహాభుజుండును బుండరీకవిశాలాక్షుండును దరుణుండును బ్రియదర్శనుండు నగుభరతుండు స్వాభిలషితకార్యసంకటంబు సంజాతంబయ్యె నని చింత నొంది ముహూర్తమాత్రంబు పరమదుర్మనస్కుండై పదంపడి తోత్రవిద్ధం బైనమహాద్విపంబుకైవడిఁ బుడమిపయిం బడియె నతని దురవస్థఁ జూచి యాసన్నస్థితుం డైనశత్రుఘ్నుండు శోకకర్శితుం డై యతనిం గౌఁగిలించికొని యుచ్చైర్నాదంబున రోదనంబుఁ జేయుచుండె నయ్యిద్దఱం బరికించి భర్తృవ్యసనకర్శిత లగురాజకాంతలు హాహాకారంబులు సేయుచు

ధరణిపయిం బడి దీర్ఘస్వరంబున విలపించుచుండి రప్పుడు తపస్విని యగుకౌస
ల్య శోకలాలసుం డైనభరతు ననుసరించి యుపగూహనంబుఁ జేసి శోకా
యాసవిశేషంబున విలపించుచు ని ట్లనియె. 1679

కౌసల్య భరతు నూఱడించుట.

చ. అనఘచరిత్ర నీతనువు నంటవు రోగము లిక్ష్వాకుకులం
బునకు విభుండు నీవు తలపోయఁగఁ బ్రాణము నీయధీన మా
మనుజవిభుండు పోయినఁ గుమారుఁడు కానకు నేగిన న్రహి
న్నినుఁ గని యింక మాకు గతి నీవె యటంచుఁ దలంచి నెమ్మదిన్. 1680

తే. ఒడలఁ బ్రాణంబులు ధరించియున్నదాన, నట్టిధీరుండ వీవె ధైర్యంబు విడిచి
యివ్విధంబున దుఃఖింప నేమి గలుగు, నిచట మమ్మాదరించువా రెవ్వ రింక.

ఆ. అనఘచరిత లక్ష్మణునకుఁ గీడేమేని, వినఁగఁ బడెనె యేకతనుజ నైన
నాదుపుత్త్రకునకు నాతిసీతకుఁ గాని, కష్ట మేమి వింటి కాననమున. 1682

క. అనియిట్లు పెక్కువిధముల, జననులు పలవింప నాశ్వసన మించుక పొం
ది నితాంతశోకుఁ డై గుహుఁ, గనుఁగొని యిట్లనియె నతఁడు గద్గదఫణితిన్.

ఉ. ఓయి నిషాదనాయక సమున్నతవిక్రమ నాఁటి రేయి తా
నేయెడ నుండె రామవిభుఁ డెచ్చట నుండె మహీజ లక్ష్మణుం
డేయెడ నుండె నేమి భుజియించిరి యెట్లు వసించి రెంతయు
న్నా యెడఁ గూర్మిఁ జేసి కరుణ న్వివరింపఁ గదయ్య నావుడున్. 1684

ఆ. గుహుఁడు హృష్టుఁ డగుచు క్షోణీశసుతుఁ జూచి, యో మహానుభావ రాముఁ డిచట
కరుగుదేర నతని కాహార మిడుటకు, నన్నమును ఫలంబు లర్థిఁ గొనుచు.

తే. సఖులతోఁ గూడి యేనట్లు చని ముదంబు, వెలయ నా తెచ్చినపదార్థవిసర మెల్ల
భక్తి నర్పించుటయు ధర్మయుక్తి నన్నుఁ, గరిమ మన్నించి యవియన్ని పరిహరించి.

వ. మేము దానంబు సేయవలయుంగాని ప్రతిగ్రహింపరాదని నన్ననునయించి.

గుహుండు భరతున కింగుదీతరుమూలంబున నుండు రామశయ్యఁ జూపుట

తే. లక్ష్మణుఁడు తెచ్చి యిచ్చినరమ్యగాంగ, తోయ మింపారఁ గ్రోలి సీతాయుతముగ
నోపవాస్యంబు సలిపి తమోఽగ్రుంకు, నపుడు సంధ్య నుపాసించి యంతమీఁద.

వ. సౌమిత్త్రివిరచితకుశతల్పంబుమీఁద సీతాసమేతంబుగా నధివసించె నంత
లక్ష్మణుండు విమలజలంబులఁ దదీయచరణంబులు గడిగి తడి యొత్తి కొండొక
సేపు నానావిధశుశ్రూషలు గావించి పదంపడి జ్యాఘాతవారణాంగుళిత్రాణ
వంతుండై శరసంపూర్ణంబు లైనతూణీరంబులు ధరించి సజ్యంబైనకార్ముకంబు
కేలం దాల్చి శయననిద్రాహారంబులు వర్జించి రామునిసమీపంబునం గొలిచి
యుండె నేనును జాపబాణధరుండనై యతంద్రితుండనై యాత్తకార్ముకు లైన
జ్ఞాతులం గూడి మహేంద్రకల్పుం డగురామునిఁ బరిపాలించుచుఁ దదంతికం

బునం గొలిచి యుండిరి రాముండు పవ్వళించుటకు రచించినతృణతల్పం బిదె-
యింగుదీతరుమూలంబున నొప్పుచున్నది విలోకింపు మని భరతునకుం జూపిన
నతండు మంత్రిసహితంబుగా నమ్మహీరుహమూలంబునకుం జని యచ్చటనున్న
తృణశయ్య నవలోకించి కన్నీరు నించుచు జనయిత్రుల కిట్లనియె. 1689

చ. గుఱుతుగఁ దల్లులార కనుఁగొంటిరె రాముఁడు నాఁటిరేయి తా
నిరుపమధర్మయుక్తి శయనించిన కర్కశపర్ణతల్ప ము
ప్పరమసుఖార్హుఁ డంచితకృపాలుఁడు పఙ్క్తిరథాత్మజుండు సుం
దరసుకుమారుఁ డిట్టికఠినక్షితిపైఁ బవళింప నర్హుఁడే. 1690

భరతుఁడు శ్రీరాముఁడు శయనించినతృణతల్పంబుఁ జూచి దుఃఖించుట.

చ. సరసపదార్థము ల్గుడిచి సన్నపుటొల్లియఁ గట్టి దీప్తహే
మరచితసౌధభాగముల మంజులశయ్యలఁ బవ్వళించు న
ప్పరమసుఖోచితుండు జలపానముఁ జేసి మహీజమూలనుం
దిర వగుపర్ణతల్పమున నేకరణి న్వసియించె నక్కటా. 1691

సీ. పుష్పసంచయచిత్రములు చందనాగరుపరిమళయుతములు పాండరాభ్ర
సందీప్తములు శుకసంఘరుతంబులు మంజులాస్తరణసముంచితములు
కృతహేమకుడ్యంబు లతిగీతవంతము ల్హైమరాజత రమ్యభూము లద్రి
కల్పంబు లగునవ్యకాంచనప్రాసాదసౌధవిమానరాజములయందుఁ

తే. గాహళవిచిత్రరవమృదంగస్వనముల, సూతమాగధగాయకస్తుతిరవముల
సంప్రబోధితుఁ డగురామచంద్రుఁ డిట్టి, కఠినధారుణిపై నెట్లుగా వసించె.

తే. లలితసుకుమారతనుఁ డైనరాముఁ డేడ, రేయిఁ గఠినోర్విపైఁ బవ్వళించు టేడ
నుదకములఁ గ్రోలి యుపవాసముండు టేడ, నకటస్వప్నంబుగాక యథార్థమగునె.

తే. మూఁడులోకంబులు భుజాగ్రమున ధరింపఁ, జాలినట్టియినాన్వయస్వామి కిట్లు
కఠినమేదిని వసియింపఁ గలిగె నకట, కాలము దురత్యయం బెంతఘనున కైన.

వ. ఇది మహాత్ముం డగురాముండు పవ్వళించినతృణతల్పంబు కఠినస్థండిలంబుమీఁ
ద రచింపంబడియున్న దిచ్చటితృణం బంతయుఁ దదీయగాత్రంబులచేత విమర్ది
తం బై యున్న దని పలికి వెండియు నిట్లనియె. 1695

ఉ. పోఁడిమితో విదేహపతిపుత్రిక నై యజరాజసూతికి
న్గోడలి నై జగజ్జనమనోహరు రామునిఁ బెట్టఁ బట్టియు
న్నేఁ డిటు కష్టముల్ పడితి నే నని జానకి యేడ్వఁ బోలు నీ
జాడనె యంత నంతఁ గనుపట్టెఁ దదంజనమిశ్రితాశ్రువుల్. 1696

క. ఆభూసుత యిచ్చట ది, వ్యాభరణోపేత యగుచు నటు నిద్రింపం
గాఁ బోలు నంత నంతన, శోభిల్లెడుఁ దత్సువర్ణసుందరబిందుల్. 1697

తే. మఱియు నిచ్చోట భూపుత్రిమగనిఁగూడి, ధౌతకౌశేయపరిధానధారుణిపయిఁ

బవ్వళింపఁగఁ బోలు తత్పటనివిష్ట, తంతుసంతాన మంతంతఁ దఱచు దోఁచె.
ఆ. చాల గోల ముద్దరాలు సహోసుకు, మారి మేదినీకుమారి యిట్టి
కఠినభూమియందు గాత్రంబు వైచిన, గండుశిలలు దాఁకి గందకున్నె. 1699
క. పుట్టినది మొదలు బంగరు, తొట్టియలో నూఁగుసతికి దుస్తరముగ నేఁ
డిట్టి దురవస్థ దొరకొనెఁ, గట్టా దుశ్చిత్త యైనకైకకతమునన్. 1700
తే. సతియు సుకుమారియును సుఖోచితయు నైన
జనకనందని నిజనాథసహిత యగుచు
బరఁగ నీతృణశయ్యపైఁ బవ్వళించెఁ
గాంతలకు భర్తృశయ్య సుఖంబు గాదె. 1701
క. ఆరాముఁడు సత్కృతమున, దారయుతుం డగుచు నిట్టితల్పముమీఁదం
గూరికెఁ గావున హా యీ, కారణమునఁ గడునృశంసకర్ముఁడ నైతిన్. 1702
చ. సరసుఁడు సార్వభౌమకులజాతుఁడు సర్వజగత్ప్రియుండు పు
ణ్యరతుఁడు పద్మనేత్రుఁడు సుఖార్హుఁడు సత్ప్రియదర్శనుండు సుం
దరతనుఁ డైనరాఘవుఁ డనామయరాజ్యసుఖంబు మాని తా
నఱమఱ యింత లేక కఠినావని నెట్లు వసించె నక్కటా. 1703
వ. మఱియు విపినకాలంబున నన్న యగు రామభద్రు ననువర్తించి ప్రియదర్శనుం
డును మహాభాగుండు నగు లక్ష్మణుండు ధన్యుం డయ్యెఁ బత్యనుసరణంబున
వైదేహి కృతార్థ యయ్యె మేము రామవిహీనుల మై లోకవిద్వేష్యుల మైతిమి
రాఘవుం డరణ్యగతుం డగుచుండ విశ్వంభర కర్ణధారహీన యైన నావచందంబు
న నాయకరహిత యై తోఁచుచున్నది దశరథుండు స్వర్గగతుం డగుచుండ రాముం
డు కానకుం బోవుచుండ నివ్వసుంధరాధిపత్యంబు సేయుట కే పాపాత్ముండ సమ్మతిం
చు రాముండు వనవాసగతుం డయ్యును విశ్వంభర తదీయభుజవీర్యాభిరక్షిత
గాఁ దలంచెద విహీనప్రాకారరక్షయు ససన్నద్ధాశ్వమాతంగయు నపావృతపుర
ద్వారయు సరక్షితయు నప్రహృష్టబలోపేతయు సాధనవిహీనయు దుర్గశాపనయు
ననావృత్తయు నైన రాజధాని శత్రువు లైన విషకృతం బైనభక్ష్యంబుం బోలెఁ
బరిహరింతురు గాక గైకొనం దలంతురే యవి యన్నియు నట్లుండనిండు నేఁడు
మొదలుగ నేను జటావల్కలధరుండ నై నిత్యంబును ఫలమూలంబు లుప
యోగించుచుఁ దృణశయ్యమీఁదం బవ్వళించుచు రామకృతవనవాసప్రతిజ్ఞను
నాయం దారోపించుకొని రామార్థంబుగాఁ జతుర్దశవర్షాత్మకకాలంబున రా
మానుష్ఠితవ్యతిరిక్తోత్తరకాలంబు వనంబున వసించెద నందువలన నారఘుపుంగ
వునిప్రతిశ్రవంబు మిథ్యాభూతంబు గాకుండు శత్రుఘ్నుండు నాయట్ల వ్రతం
బంగీకరించి యనువర్తించి యుండు రాముండు లక్ష్మణసహితంబుగా ద్విజశ్రేష్ఠుల
చేత సామ్రాజ్యంబునం దభిషిక్తుం డై యయోధ్యాపురంబుఁ బరిపాలింపంగలం

డేతాదృశం బైనమన్మనోరథంబు దేవత లందఱు సఫలంబుఁ గావింతురుగాక రాముండు నాచేత బహుప్రకారంబులఁ బ్రసాద్యమానుం డయ్యును మత్ప్రార్థన నంగీకరింపఁడేని యమ్మహాత్మునితోఁ గూడ వనంబునఁ జిరకాలంబు వసించి యుండెద నద్దయాళుండు నన్నేల యుపేక్షించునని యీదృశంబు లగుశపథంబులఁ బల్కుచు నంతలోనఁ బ్రభాతకాలం బగుటయుఁ గాల్యకరణీయంబులు దీర్చి శత్రుఘ్ను నవలోకించి యి ట్లనియె. 1704

మ. కమలాప్తుం డుదయించె నింక మసలంగా నేటి కిచ్చోటు వే
గమె యివ్వాహిని దాఁటి పుణ్యరతునిం గాకుత్స్థునిం గానఁ బో
దము ప్రాణోపమమిత్రుఁ డైనగుహు నందం బొప్పఁ దోడ్తెమ్ము ని
క్కము నా కీనిశ నిద్ర లేదు మిగులం గార్యాతురత్వంబునన్. 1705

వ. అని యిట్లు భరతునిచేతఁ బ్రచోదితుం డై శత్రుఘ్నుండు నదీసంతరణార్థంబు వేగిరపడు చుండె నట్టిసమయంబున. 1706

క. ప్రాంజలి యై గుహుఁ డారఘు, కుంజరుకడ కరుగుదెంచి గుణరత్ననిధీ
కొంజక నీచే నిచ్చట, రంజితు లై యొప్పెఁ గాదె రాత్రి సుఖద యై. 1707

క. నా విని భరతుఁ డతనితో, నీవాడినయట్ల యయ్యె నిఁక నన్నఁ గనం
బోవఁగవలె సత్వరముగ, నావికులం బిలువ సంపు నది దాఁటుటకున్. 1708

క. అన విని గుహుఁ డాతనిశా, సనమునఁ బురమునకుఁ బోయి జ్ఞాతుల వెస న
ప్పనికి నియమించుటయు వా, రనుపమచాతుర్యమహిమ నందఱుఁ బెలుచన్.

భరతుఁడు సేనాసమేతంబుగ నోడలెక్కి గంగానది దాఁటుట.

వ. గుహువచనప్రకారంబునఁ దొల్లింటియేనూఱు క్షుద్రనావలను మఱియు విచిత్రపటసందీపితధ్వజాలంకృతదృఢసంధిబంధపర్యాప్తకర్ణధారయుక్తచారుఫలకభిత్తిసమావరణపరిమితవాతమహాఘంటాధరవరాస్తరణోపేత స్వస్తికాఖ్యనౌశతంబును సన్నద్ధంబుఁ జేసి తెచ్చి రంత గుహుం డయ్యోడలలోనఁ బాండుకంబళసంవృతయు హర్షజనకకింకిణీఘోషయుక్తయుఁ గల్యాణియు నైన స్వస్తికవిజ్ఞేయనావ నాకర్షించి తెచ్చిన భరతుండుశత్రుఘ్నసహితంబుగా దాని నారోహించె నంతకు మున్న సమాగతు లైనపురోహితులును గురువులును బ్రాహ్మణులు నారోహించిరి పదంపడి కౌసల్యాప్రముఖరాజకాంత లారోహించి రనంతరంబ శకటంబులు నాపణస్థపదార్థంబులునుందగినయోడలయం దునిచి రప్పుడు సేనాసన్నివేశంబుగావించువారికలకలంబులును నవతరణప్రదేశంబున డిగ్గువారిఘనారావంబులును నుపకరణంబు లందుకొనువారిమహానాదంబులును నింగి ముట్టి చెలంగె ని ట్లయ్యోడలు కొన్నినారీజనంబును గొన్ని హయంబులను గొన్ని మహామూల్యంబు లగురథశకటాదియానంబులను గొన్ని యుష్ట్రాశ్వతరాదియుగ్యంబులను గొన్ని నానావిధజనంబులను గొన్ని

రాజనందనపురోహితాంతఃపురకాంతలను వహించి పతాకావంతంబు లై స్వ
స్వదాశాధిష్ఠితంబు లై మహావేగంబున నమ్మహానది నుత్తరించి యవ్వలితీరం
బున నందఱ డించి నివృత్తంబు లయ్యె నప్పుడు దాశశ్రేష్ఠులు నివృత్తిసమయ
భారావరోపణలఘుత్వజనితసౌకర్యంబున జలంబులందు నౌకలం జిత్రగమనం
బుల నడపించుచు మరలించిరి సపతాకంబు లైనగజంబులు గజారోహకులచే
తం బ్రచోదితంబు లై సధ్వజంబు లైనజంగమపర్వతంబులచందంబున నందం
బగుచు నమ్మహానది నుత్తరించి చనియె నప్పుడు కొంద ఱోడలచేతను గొం
దఱు ప్లవంబులచేతను గొందఱు కుంభఘటంబులచేతను గొందఱు బాహు

### భరతుండు వసిష్ఠఋత్విగ్జనమాత్రసహితుండై భరద్వాజమహర్షిని సందర్శించుట

వులచేతను గంగానదిని దాఁటి రిట్లందఱు సుఖంబుగా నమ్మహానది నుత్తరించి
మైత్రముహూర్తంబున కనుత్తమం బైనప్రయాగవనంబునకుం జని రంతమహా
త్ముం డగుభరతుండు బలంబుల నాశ్వాసించి యథాసుఖంబుగా నొక్కచోట
నిలువ నియమించి రమ్యోటజవృక్షషండం బైనభరద్వాజాశ్రమంబు దవ్వు
లంజూచి ధర్మజ్ఞుండు గావునఁ గ్రోశమాత్రదూరంబున రథంబు డిగ్గి న్యస్తశస్త్ర
పరిచ్ఛదుం డై క్షౌమపరిధానసంవీతుం డై పురోహితు ముందిడికొని ఋత్వి
గ్జనపరివృతుం డై పాదసంచారంబున నమ్మహామునిసమీపంబునకుం జనియె
నప్పుడు బృహస్పతినందనుం డగుటవలన దేవపురోహితుం డగుభరద్వాజుండు
వసిష్ఠుని దవ్వులంజూచి శీఘ్రంబున దర్భాసనంబు డిగ్గి శిష్యు లర్ఘ్యంబుఁ గొ
ని వెంట నరుగుదేర సంభ్రమంబున నెదురుగాఁ జని వసిష్ఠునితోడ సుహృత్స
ల్లాపంబుఁ గావించి భరతునిచేత నభివాదితుం డై యతని దశరథపుత్త్రునిఁగా
నెఱింగి యయ్యిద్దఱ కర్ఘ్యపాద్యంబు లొసంగి ఫలంబులిచ్చి దశరథునివృత్తం
బెఱింగినవాఁ డగుటవలన నతనికుశలం బడుగక కులబలపురకోశమంత్రిమిత్త్ర
బాంధవులయందుఁ గుశలం బడిగిన నవ్వసిష్ఠుండును భరతుండు నందఱుఁ
గుశలం బని పలికి వెండియు శరీరాగ్నిశిష్యవృక్షపక్షిమృగంబులయందుఁ
గుశలం బడిగిన నమ్మహాత్ముండు సర్వంబును గుశలం బనిపలికి రామవిషయస్నే
హబంధంబున భరతున కిట్లనియె. 1710

### భరద్వాజమహర్షి భరతుని దూఱుట.

ఉ. అగ్రజుఁ డైనరాముని యనామయరాజ్య మధర్మయుక్తిచే
వ్యగ్రతఁ జేసి పుచ్చుకొని యంతటఁ బోవఁగ నీక ఘోరస
త్వోగ్రవనంబులోఁ దిరుగుచుండెడియమ్మహనీయమూర్తిపై
నాగ్రహవృత్తిఁ బోవఁ దగునా నినుఁ జూచిన శంక దోఁచెడిన్. 1711

క. పుడమియు రాష్ట్రము నగరముఁ, గడువడి మీయన్న మున్నె కైకొనియెఁ బదం
పడి యాతనిజీవితమును, గడిమి న్నీ వపహరింపఁగా వచ్చితివో. 1712

క. కాంతానియుక్తుఁడై భూ, కాంతుఁడు కాంతారమునకుఁ గతినతఁ జను మ
న్నంతనె వచ్చినసీతా, కాంతునిదే కాక తప్పు కైకది చెపుమా. 1713

క. అని పెనుగొలవిం గాల్చిన, యనువున నిట్లాడ భరతుఁ డారాటమునం
గనుఁగొనల నశ్రుకణములు, చినుకఁగ నిట్లనియెఁ దల్లి సేఁత కడలుచున్.

చ. అనఘ కృతఘ్నునట్ల యకటా నను దూఱఁగ నేల నాతెఱం
గనిశము మీరెఱుంగరె మహాత్ముఁడు పుణ్యచరిత్రుఁడైన నా
మునివనయాత్ర నించుకయు భ్రాతతతు ల్గుఱిగా నెఱుంగఁ గా
దని మది నమ్మవేని భవదంఘ్రిసరోజము ముట్టి చెప్పెదన్. 1715

చ. అనిశము సత్యధర్మములయం దనురక్తుఁడ నయ్యు నాజికిం
దనయుఁడ నయ్యు రామునకుఁ దమ్ముఁడ నయ్యు వసిష్ఠమౌనిచే
ననవరతంబు శిక్షితుఁడ నయ్యును గైకకుఁ బుట్టినందునం
బనివడి యిట్టినిందలకుఁ బాత్రమనైతి నిఁ కేమి సేయుదున్. 1716

భరతుఁడు భరద్వాజమహర్షికిఁ దనయనపరాధత్వముఁ దెల్పుట.

క. వగ వేల లోకనింద్యకు, జగతీపతిమౌళిరత్నచారుపదాబ్జుం
డగునన్న కిగ్గుఁ జేసిన, భగవంతుఁడె యెఱిఁగి యుండు భవ్యగుణాఢ్యా.

వ. మహాత్మా నీవు త్రికాలజ్ఞుండ వయ్యును నన్నిట్టివానిఁగాఁ దలంచుటవలన నేను వ్యర్థజీవితుండ నైతి నాయందు దోషగంధం బించుకయైన లేదు మీ రిట్లు కర్ణకఠోరంబుగాఁ బలికితిరి దీనికై నేమి మాఱు వల్కువాఁడ మద సాన్నిధ్యంబునందు మదంబ యగుకైకేయిచేతఁ బలుకంబడినవాక్యంబు నాకిష్టంబైనయది గాదు దాని నంగీకరించినయదియు లేదే నిక్కార్యంబుచేత సంతుష్టుండ నైనవాఁడఁ గా నని యాదృశంబులైనశపథవాక్యంబులచేత స్వారోపితదోషం బపనయించికొని స్వాగమనకారణం బెఱింగించు తలంపున వెండియు భరతుండు భరద్వాజున కిట్లనియె. 1718

చ. అఱమఱ యింత లేదు విను మయ్య మునీంద్ర వనస్థుఁడైనభా
స్కరనిభతేజు రామునిఁ బ్రసన్నునిఁ జేసి యయోధ్య కమ్మహా
పురుషుని వెండి దోడుకొని పోవుతలంపున వచ్చినాఁడ న
త్తెఱఁగు సమస్తముం గరుణఁ దెల్పి ప్రసాద మొసంగు మిత్తఱిన్. 1719

భరద్వాజమహర్షి భరతునిం గొనియాడుట.

వ. అని యిట్లు భరతుండు వసిష్ఠాదిమహామునిసహితంబుగా రామవృత్తాంతం బడిగిన. 1720

చ. మునిపతి సంతసిల్లి కృపమోమున నింపెసలారఁ గైకయీ
తనయునిఁ జూచి పల్కె నృపధర్మవిశారద రాఘవాన్వయం
బున సవనప్రసాదమునఁ బుట్టిననీ కిది యుక్త మివ్విధం

బున గురువృత్తియుక్తి దమము పుణ్యున కాచరణీయమే కదా. 1721

చ. రవికులవర్య నీ విపుడు రామునిపైఁ గలభక్తి పెంపున
న్నవినయబుద్ధి వచ్చు టది సర్వ మెఱింగియు నీదుకీర్తి యీ
భువనములందు నిత్యపరిపూర్ణము సేయఁ దలంచి యీగతిం
బవినిభతీక్ష్ణవాక్యములు పల్కితి నింతియె గాక వెఱ్ఱినే. 1722

చ. ఎఱుఁగుదు రాఘవుం డడవి కేగినచందము సర్వ మమ్మహా
పురుషుఁడు చిత్రకూట మను భూధరమం దనుజన్మయుక్తుఁ డై
యిరవుగ నున్నవాఁ డతని నెల్లి గనం జనఁ బోలు నేఁ డిట
న్నిరుపమలీల నుండుము గుణిప్రవరా సపురోహితుండ వై. 1723

భరతుఁడు భరద్వాజానుమతంబునఁ దదాశ్రమమునకు సైన్యములను రావించుట.

వ. రాజనందనా నీవు వాంఛితార్థప్రదానదక్షుండవు మదీయాభిమతంబు సిద్ధింపఁ జేయు మని యిట్లు ప్రార్థించిన నుదారదర్శనుండును బ్రశస్తకీర్తియు నగు భరతుం డారాత్రి యచ్చట నివసించుట కియ్యకొనియె నిట్లు భరద్వాజుండు భరతుని నిలువ నియమించి పదంపడి భోజనపర్యంతాతిథిసత్కారంబుకొఱకుఁ బ్రార్థించిన నాభరతుండు వెండియు నమ్మునిశేఖరుం జూచి తాపసేంద్ర యర్ఘ్యపాద్యంబులును వనంబునం గలకందమూలాదికంబులు మీ రొసంగితిరి మాకు సంతోషంబుఁ గావించుట కవియె చాలు నని పలికిన నమ్మహర్షివల్లభుం డింతకంటె విశేషం బేమి యొసంగెద నని యెడుభరతాశయం బెఱింగి ప్రహాసావేశకానుభావయుక్తుం డై మద్విషయంబునందుఁ బ్రీతిసంయుక్తుం డైనవానిఁగా నిన్నెఱుంగుదు నీ కొక్కనికె కాదు భవదీయసైన్యంబున కెల్ల భోజనం బొసంగఁ దలంచితి మదాశయం బంగీకరింపవలయు నీవు సబలుండ వై రాక బలంబుల దూరంబున విడియించి యొక్కరుండ వై యేల వచ్చితి వనిన నక్కైకేయీనందనుండు కృతాంజలి యై తపోధనా చతురంగసహితం బైనమదీయసైన్యంబు ధరిత్రి నాచ్ఛాదించి వచ్చుచున్నది యందలిగజవాజిరథపదాతు లిచ్చటికిం జనుదెంచె నేని పావనం బైనభవదీయతపోవనంబునకు సంకటంబు వాటిల్లు ననియును రాజుగాని రాజపుత్త్రుఁడుగాని విషయంబులందలి తపోధనులకడకు సేనాసహితంబుగా బోరా దనియును వనభంగంబువలన భవదీయచిత్తంబున కేమికినుక వొడమునో యనియును శంకించి దూరంబున విడియించి యే నొక్కరుండ చనుదెంచితి నిప్పుడు భవదీయశాసనంబున నిచ్చటికి రావించెద ననిన నట్ల కావింపు మని పలికిన నతం డట్ల కావించె నంత నమ్మునివరుండు ప్రక్షాళితపాణిపాదుం డై యగ్నిశాలఁ బ్రవేశించి ముమ్మా ఱాచమనంబు రెండుమార్లు ముఖంబు పరిమార్జించి యొక్కసారి శిరశ్చక్షుశ్శ్రోత్రనాసికాహృదయంబులు

సంస్పృశించి యాతిథ్యక్రియార్థంబు స్థిరసమాధినియుక్తుం డై భరతున కా
తిథ్యంబొసంగఁ దలంచితిఁ గావున మచ్ఛాసనంబున విశ్వకర్మయుఁ ద్వష్టయు

—భరద్వాజమహర్షి సైన్యసమేతుం డగుభరతునికి విందు సేయుట.—

గృహాదిసంవిధానంబుఁ గావింతురు గాక యింద్రాదిదిక్పాలకులును వహ్నిపురోగము లైనదేవతలును సన్నిహితు లై యన్నపానాదికంబును రక్షింతురు గాక భూమ్యంతరిక్షదివంబులం బూర్వపశ్చిమవాహిను లగు నదు లన్నియు నిక్షుకాండరసోపమంబు లైనశీతసలిలంబులును ఖర్జూరతాళాదిహేతుకం బైనమద్యవిశేషంబును గౌడీప్రముఖత్రివిధసురలను స్రవించుచు సన్నిహితంబు లగుంగాక మఱియు హాహాహూహూవిశ్వావసుప్రముఖదేవగంధర్వులును ఘృతాచియు విశ్వాచియు నాగదంతయు మిశ్రకేశియు నలంబుసయు హేమయు మహేంద్రపర్వతకృతస్వయంప్రభాబిలస్థహేమయు మొదలుగాఁ గలదేవజాతిగంధర్వజాత్యప్సరసలును నింద్రలోకంబునం గలరంభోర్వశీమేనకాదులును బ్రహ్మలోకంబునం గలదివ్యాప్సరసలును స్వలంకృత లై నృత్తగీతాద్యుపకరణసహిత లై గానశిక్షకుం డగుతుంబురునిం గూడి చనుదెంచి నృత్తగీతాదికంబులు గావింతురు గాక వాసోభూషణపత్త్రవంతం బై దివ్యనారీఫలం బై దేవభోగస్థానం బై యుత్తరకురుదేశంబునం గలకౌబేరం బైనచైత్రరథవనం బిచ్చట సన్నిహితం బగుం గాక మఱియు భగవంతుం డైనసోముండు శాల్యోదనంబును భక్ష్యభోజ్యచోష్యలేహ్యంబులును సురాప్రముఖపానీయంబులును నానావిధమాంసంబులును బాదపప్రచ్యుతంబు లైనవిచిత్రమాల్యంబులును సృజించుం గాక యని యివ్విధంబున నప్రతిమతపోలబ్ధమహిమవిశేషంబునఁ బ్రాఙ్ముఖుం డై యాహ్వానార్థంబు శిక్షాస్వరసంహితం బైనమంత్రంబు జపించినఁ దత్క్షణంబ యామునివచనప్రకారంబున దేవత లందఱు వేర్వేఱ నచ్చటం బొడసూపి రప్పుడు. 1724

సీ. హారి యై ఘనతాపహారి యై సంతోషకారి యై పవనుండు గలయ విసరె
హృష్ట యై యుపగతారిష్ట యై పరిపుల్లోత్కృష్ట యై సురపుష్పవృష్టి గురిసె
నంద మై శ్రుతిపుటానంద మై సంతతాస్పంద మై వాద్యము ల్గ్రిందుకొనియె
నిత్య మై యభినయార్థత్య మై సజ్జనస్తుత్య మై యప్సరోనృత్య మొప్పె
తే. వల్లకీదండములఁ బూని స్వరయుతముగ, నేర్పు మీఱంగ రాగంబు లేర్పఱించి
లయగుణాన్విత మగునట్లు రాలుగరఁగఁ, బాడి రవ్వేళ గంధర్వభామ లచట.

క. ఆనినదము మధురం బై, మానసహారి యై లయప్రమాణయుతం బై
వీనులవిం దై యమృతపు, సోనలపొం దై సభంబు తోషియించెన్. 1726

తే. నారచందనోత్పత్తిబీజంబు లైన, మలయదుర్దురపర్వతంబులు స్పృశించి
వివిధగతుల యథోచితవృత్తిచేత, సుఖకరంబుగఁ బవనుండు సుడిసె నపుడు.

ఉ. అప్పుడు రాజసైన్యములు హర్షము నద్భుతముం బెనంగఁగాఁ
దప్పక విశ్వకర్మనివిధానము నంతయుఁ జూచె నంతలో
నొప్పుగఁ బంచయోజనము లుర్వి సమత్వమునొందె దానిపైఁ
జొప్పులు దోఁచె నీలతృణశోభితశాద్వలసంయుతంబుగన్. 1728

ఆ. అంతలోనఁ దోఁచె నట ఫలభూషణ, పనసబిల్వచూతబదరినారి
కేళపూగవరరసాలకపిత్థజం, బీరముఖ్యవివిధభూరుహములు. 1729

క. కమనీయోత్తరకురుదే, శములం గలదివ్యభోగసంయుతకాంతా
ర మొకింతలోన నచ్చట, సముచితగతిఁ దోఁచె నతివిశాలం బగుచున్. 1730

ఆ. మఱియు నంతలోనఁ బరికింపఁ గానయ్యె, నచటఁ దటజబహువిధావనీజ
సురుచిరప్రసూనశోభితపులినసం, యోగమైననిమ్నగాగణంబు. 1731

చ. ఒకనిమిషంబులో నచట నున్నతవైఖరిఁ దోఁచె సౌధము
ల్ప్రకటితహర్మ్యము ల్మణివిరాజితసద్మములు న్విమానము
ల్వికసితపద్మశోభితనవీనసరోవరము ల్సువర్ణవే
దికలును మంటపంబులును దివ్యసభాసదనంబు లొక్కటన్. 1732

క. ఆలోఁ గనుపట్టెఁ జతు, శ్శాలములు రథహయహస్తిశాలలును ధను
శ్శాలలును జంద్రశాలలు, నాలంబులు తోరణములు సముచితభంగిన్.

సీ. వెండియుఁ గనుపట్టె వేయుకంటిలోన నద్భుతభంగిఁ దదంతరమున
సితమేఘతుల్యమై వితతమై సుందరంబై సుతోరణయుక్తమై మనోజ్ఞ
దివ్యగంధాఢ్యమై దివ్యరసోపేతమై దివ్యభోజనాచ్ఛాదనాన్న
శయనయానాసనచ్ఛత్రచామరవంతమై చతురశ్రమై యతివిశాల

తే. మై వినిర్మలభాజనమై సమస్త, వస్తువిస్తారపూర్ణమై వైజయంత
సన్నిభం బగునొకరాజసదన మచటఁ, గన్నులకు విందొనర్చుచుఁ గాననయ్యె.

వ. అంత మహానుభావుం డగుభరతుండు భరద్వాజునిచేత ననుజ్ఞాతుండై రత్న
సంపూర్ణం బైనయమ్మహనీయమందిరంబుఁ బ్రవేశించి తదీయసంవిధానం
బున కిచ్చ మెచ్చుచు నందొక్కదివ్యం బైనరాజాసనంబును వాలవ్యజనంబును
ఛత్రంబును విలోకించి యమ్మూఁటికిం బ్రదక్షిణంబుఁ గావించి పూజించి
మనంబున రామునిం దలంచి నమస్కరించి వాలవ్యజనంబుఁ గైకొని యొ
క్కసచివాసనంబుమీఁదం గూర్చుండె నంత మంత్రులునుబురోహితులును గూ
ర్చుండి రటమీఁద సేనానాయకుండు నావెనుక శిబిరాధికృతుండును గూర్చుండి
రిట్లందఱు నానుపూర్విని భరతునిం బరివేష్టించి యుచితపీఠంబుల నాసీనులై
యున్నంత ముహూర్తమాత్రంబునకుఁ బాయసకర్దమంబు లగునదులు భర
ద్వాజునిశాసనంబున భరతునిసమీపంబునం బ్రవహించెఁ దదుభయతీరంబు

లందు మునిప్రసాదంబువలనఁ బాండుమృత్తికాలేపనంబు లైనరమ్యావసథం
బులు దోఁచె నప్పుడు. 1735

తే. వాసవుని నందనోద్యానవాటి నుండి, పరఁగ నిరువదివేలయచ్చరలు దివ్య
గంధమాల్యవిభూషణకలిత లగుచు, నచటికొయ్యనఁ జనుదెంచి రద్భుతముగ.

క. కనకమణివిద్రుమంబుల, ఘనతరనవమౌక్తికములఁ గై సేసి వెసం
జనుదెంచి రజునిశాసన, మున నిరువదివేలదివిజమోహనగాత్రుల్. 1737

తే. చెలువుమీఱంగ నెవ్వారిచేగృహీతుఁడైనపురుషుఁడుసోన్మాదుఁడనఁగఁబరఁగు
నట్టివారు యక్షేశ్వరుననుమతమున, వచ్చి రటువింశతిసహస్రవనజముఖులు.

తే. ప్రమదమెనఁగ విశ్వావసుప్రముఖనిఖిల, విబుధగంధర్వపతులు వేర్వేఱ నార
దుండుతుంబురుఁడునుభరతునిసమీపమునమధురభంగిఁ బాడిరిఘనత మెఱసి.

తే. పుండరీకయు నయ్యలంబుసయుమఱియు, వామనయు మిశ్రకేశియు వసుమతీశ
నందనునిమ్రోల సంభృతానంద లగుచు, సరసగతి నాడి రమ్మునిశాసనమున.

క. మునిపతిశాసనమున నం, దనవనమునఁ జైత్రరథవనంబునఁ గలశో
భనకరమాల్యంబులు నూ తనరుచిఁ గనుపట్టె నపుడు తద్విపినమునన్ 1741

తే. బిల్వకలివృక్షకాశ్వత్థప్లక్షచయము, లపుడు మార్దంగికులును శమ్యాఖ్యతాళ
ధరులు నర్తకశ్రేష్ఠులై వరుసఁ దోఁచి, రమ్మునీంద్రుశాసనమున నద్భుతముగ.

క. తిలకములు సరళతరువులు, కలగొట్టులు నక్తమాలకంబులు వరుసం
దిలకింపఁగ వామన లై, కలయం గుబ్జ లయి యకట కనుపట్టె రహిన్.

తే. శింశుపామలకీవంశకింశుకములు, మఱియుఁ బక్కివనజాతమల్లికాది
లతలు స్త్రీరూపములఁదాల్చిలలితఫణితి, నపుడుకనుపట్టె భరతునియంతికమున.

వ. ఇట్లు కనుపట్టి. 1745

క. తమి దీఱ మధువుఁ గ్రోలుఁడు, ప్రమదంబునఁ బాయసంబు భక్షింపుఁడు మే
ధ్యము లైనమాంసములు వెస,నములుఁడనెడుపలుకు లతిఘనంబుగఁబలికెన్.

వ. అంత సౌందర్యవ్రతు లగునయ్యువతులు పెక్కండ్రొక్కొకపురుషుం బరిగ్ర
హించి వల్గునదీతీరంబుల నుద్వర్తనంబుఁ గావించి విమలనదీజలంబుల మజ్జనం
బాడించి చతుర్విధాలంకారంబులఁ గైసేసి పాదసంవాహనంబు సేయుచు జలా
ర్ద్రాంగంబును వస్త్రాదికంబులచేతఁ దుడిచి యలంకరించి మధ్వాదికపానంబు
సేయించుచు యథాసుఖంబుగా సేవించు చుండిరి మహాబలు లగుమునిప్రభావ
సిద్ధవాహనపాలకులు భరతవాహనపాలకులకు గజోష్ట్రహయఖరంబులకుయథే
ష్టంబుగా నిక్షుమధులాజప్రముఖభోజ్యపదార్థంబులు గుడుపం బెట్టి రాభరతసై
నికులు సర్వకామంబులచేతఁ దర్పితులై మదకరద్రవ్యసేవచేత మత్తులును మధు
పానంబునఁ బ్రమత్తులును స్రక్చందనాదిభోగాతిశయంబునఁ బ్రముదితులు నై
తమతమవాహనంబు లెఱుంగక యప్సరోగణంబులం గూడి సరససల్లాపంబులు

సేయుచు యమునాతీరప్రాంతకాంతారంబులం ద్రిమ్మరుచుం బద్మోత్పలగంధియై మందానిలంబు పై వీవ శీతలసికతాతలంబులం గ్రీడించుచు భరద్వాజుం డెంత మహానుభావుం డనువారును నింక సాకేతపురంబునకును దండకారణ్యంబునకును బోవ వల దిచ్చట సుఖంబుగాం గాపురంబు సేయుద మనువారును భరతునకు శుభంబు గలుగుం గాక రాముండు సుఖి యై యుండుంగాక యనిదీవించువారును నీతపోవనంబు స్వర్గతుల్యం బై యున్న దనువారు నై విహరించుచుండిరి తక్కిన సమస్తజనంబులు నేతాదృశసత్కారవిధి నధిగమించి సంప్రహృష్టచిత్తు లై స్వతంత్రు లై శుభసల్లాపంబులు సేయుచు హర్షనాదంబులు గావించుచు మాల్యోపేతు లై కార్యాకార్యవిచారశూన్యు లై నృత్యంబు సేయుచు గానంబుం గావించుచు హాసం బొనరించుచుం బరుగులెత్తుచుం బరస్పరాలింగనంబు సేయుచు లతాగృహంబులు దూఱుచుం బన్నీటియేటికాల్వల నీఁదుచు బహుప్రకారంబుల విహరించుచు నమృతోపమానం బైన తదన్నంబు యథేష్టంబుగా భుజించినవారయ్యును దివ్యంబులైనపక్వపదార్థంబులు విలోకించి భక్షించుటకు సామర్థ్యంబు లేమిం జేసి నోరూరం జూచుచుండి రొండొకసేపునకు నాసపెంపున వెండియుం గుడువ నుద్యోగించి యోపినంత గుడిచి వెక్కసం బైనం బరిహరించుటకుం జాలక గుడువ నోపక ఱిచ్చవడి చూచుచుండి రిట్లు సర్వజనంబులు సంతుష్టమానసు లై యఖండకౌశేయచేలంబులు ధరించి యీదృశం బైనసుఖం బెన్నం డేనియుం గంటిమే యని మనంబున మెచ్చుచుండిరి పరిచారికలును దాసీజనంబులును యోధాంగనలును మఱియు సైన్యంబునం గలవారందఱును దృపులగుటవలనదృప్తు లైనూతనచేలధరు లై యథాసుఖంబుగా విహరించుచుండిరి పంజరోష్ట్రహయఖరగోవృషభమృగపక్షిగణంబులు యథార్హపదార్థంబులు భుజించి మదవిశేషంబున మాఱునుసలుచుండె నప్పు డాభరతసైనికులలోన నశుక్లచేలుండును క్షుధితుండును మలినుండును రజోధ్వస్తకేశుండు నైనవరుం డొక్కరుండును లేఁడయ్యె మఱియు భరద్వాజునిమహిమాతిశయంబున నజవరాహమాంసంబులచేతను సమ్యఙ్నిష్పన్నఫలయుక్తశర్కరాదిక్వాథరసంబులచేతను సుగంధిరసాన్వితంబులైనసూపంబులచేతను శాల్యోదనంబుచేతను బరిపూర్ణంబు లై యలంకారార్థపరికల్పితపుష్పధ్వజయుక్తంబు లైనసువర్ణపాత్రసహస్రంబు లద్భుతప్రకారంబునం గనుపట్టె నత్తపోవనపార్శ్వంబులం బాయసకర్దమంబు లైనకూపంబులును సర్వకామంబులం బితుకుధేనువులును మధువులం గురియువృక్షంబులును బ్రతప్తపిఠరమ్మృగమయూరకుక్కుటసంబంధిమృష్టమాంససంచయంబులచేతం బరివృతంబు లై మైరేయపూర్ణంబు లైనవాపీశతంబులును మఱియు శాతకుంభమయంబు లైన పాత్రసహస్రంబులును స్థాలీనియుతంబులును భోజనభాజనన్యర్బుదంబులును

దధిపూర్ణంబు లైన స్థాలీసహస్రంబులును గుంభీకరంభీసహస్రంబులును రసాలఫలరసోపేతంబు లై నయ్యనతినూతనానతిపురాణ గౌరకపిత్థపరిమళయుక్త శుంఠీమరిచలవంగైలానాగపుష్పఖండశర్కరాశృంగిబేరజీరక మిశ్రిత తక్రపూర్ణంబు లైన హ్రదంబులును శ్వేతదధిపూర్ణంబు లైన తటాకకూపంబులును బాయసనదులును శర్కరాయావసంచయంబులును సరిత్తీర్థంబులందు భాజనంబులం దిడిన నామలకీప్రభృతికల్కంబులును జూర్ణకషాయంబులును నానావిధస్నానీయద్రవ్యంబులును స్నిగ్ధదంతధావనసంచయంబులును సంపుటంబులందుంచిన శుక్లచందనపంకంబులును బరిమృష్టంబు లైన దర్పణంబులును వాసస్సంచయంబులును బాదుకోపానద్యుగ్మసహస్రంబులును నంజనయుక్తకరండికలును గేశమార్జనంబులును శ్మశ్రుప్రసాదకంబులును శస్త్రంబులును ధనువులును విచిత్రతనుత్రాణంబులును శయనాసనంబులును ఖరోష్ట్రగజహయంబులచేత భుక్తం బైన పదార్థంబు జీర్ణించుటకు నెయ్యది త్రావంబడు నట్టి ప్రతిపానంబుచేత సంపూర్ణంబు లైన హ్రదంబులును నవగాహనయోగ్యశోభనజలావతరణప్రదేశంబు లై కమలకుముదకైరవమండితంబు లై యాకాశవర్ణప్రతిమంబు లై స్వచ్ఛతోయంబు లై సుఖప్లవంబు లై యలరు జలాశయంబులును నీలవైడూర్యవర్ణంబు లైన మృదుతృణసంచయంబులును విచిత్రప్రకారంబునం జూడ నయ్యె నప్పు డచ్చటిజనంబు లందఱు మహర్షిచేత భరతునకుం గావింపంబడిన తాదృశాతిథ్యకర్మంబు విలోకించి యదృష్టపూర్వత్వంబువలన నయత్నసిద్ధత్వంబువలన నాశ్చర్యస్థానత్వంబువలన స్వప్నకల్పంబని తలంచుచు మహాద్భుతంబు నొందుచుండి రిత్తెఱంగున నందనోద్యానంబున విహరించు దేవతలమాడ్కి రమ్యం బైన భరద్వాజాశ్రమంబున విహరించు భరతసైనికుల కారాత్రి సుఖతరంబుగా నతిక్రమించె నంతఁ బ్రభాతకాలం బగుటయు నమ్మహర్షిచేత ననుజ్ఞ వడసి గంధర్వులును దిక్పాలకులును సర్వదేవతలును నప్సరసలును నదులును దివ్యచందనంబులును దివ్యమాల్యంబులును మఱియుఁ దక్కినతపస్సంప్రాప్తపదార్థంబు లన్నియు యథాస్థానంబులకుం జనియెఁ బదంబడి సూర్యోదయం బయ్యె సర్వజనంబులు పూర్వప్రకారంబున భోగంబులచేతఁ దృప్తు లై మదిరాపానమత్తు లై దివ్యాగరుచందనోక్షితు లై రాత్రికాలవ్యాపారం బంతయు సత్యంబని సూచింపం జేయుచుండిరి నానావిధదివ్యపుష్పమాల్యంబులు మనుజప్రమర్దితంబు లై పృథక్ప్రకీర్ణంబు లై యుండె నంత భరతుండు సపరివారుం డై రామదర్శనకామంబున భరద్వాజునిం గానంబోయిన నతండు తనకడకుం జనుదెంచి ప్రాంజలి యై యున్న యారాజకుమారు నవలోకించి హుతాగ్నిహోత్రుం డై సాదరంబుగా నిట్లనియె. 1747

ఆతిథ్యాంతమున భరతుఁడు భరద్వాజుని సందర్శించుట.

క. భూమీశతనయ నీకీ, యామిని మాయొద్ద సుఖదయై యొప్పెనె భృ
త్యామాత్యులు సైనికులును, సేనమున మెలంగిరే విసృష్టశ్రము లై. 1748
క. అన విని భరతుఁడు వినయం, బున నమ్మునిపాదములకు మ్రొక్కి కరపుటం
బనువుగ శిరమున నిడికొని, తనవాక్పథ్య మలరఁ దగ నిట్లనియెన్. 1749
తే. తాపసోత్తమ మీప్రసాదమునఁ జేసి, విమలభంగి సమస్తకామములచేతఁ
దర్పితుండనై మంత్రిబాంధవచమూస,హితముగా నేఁడు కడు సుఖోషితుఁడనైతి
తే. అప్రతిమశోభనస్థాను లై సుభటులు, లై యుపేతపరిశ్రము లై యనంత
భోగులై ప్రేష్యయుతముగఁ బొలుపుమీఱ,నఖిలజనులు సుఖోషితు లైరి నేఁడు.
చ. పరమతపోధనా సుజనబంధుని రాముని గానఁ బోవలెన్
స్థిరమతి నిచ్చటం దడవు సేయఁగఁ బోల దపాపుఁ డామహా
పురుషుఁడు సంవసించినతపోవన మిచ్చటి కెంత దూర మె
త్తెఱఁగునఁ బోవు టొప్పగు సుధీవర నా కెఱిఁగింపు మింతయున్. 1752
వ. అనిన విని. 1753
సీ. మునినాథుఁ డతని కిట్లనియె నిచ్చోటికి రాజనందన సార్ధయోజనద్వ
యంబు దవ్వుల రమ్యమై పుణ్యవిపినమై చిత్రకూటం బనుక్షితిధరంబు
తనరు నగ్గిరికి నుత్తరభాగమునందు మందాకినీనామనిమ్నగ చెలంగు
నారెంటినడుమఁ జెల్వగుపర్ణకుటియందు రాముఁ డున్నాఁడు శీఘ్రమున నీవు
తే. సవ్యదక్షిణపథమునఁ జని బలముల
భూధరప్రాంతకాంతారభూమి నిలిపి
యవలఁ దగువారిఁ దోడ్కొని యరిగి తేని
కౌసలేయుని నచ్చటఁ గాంచ వచ్చు. 1754
క. అని మునిపతి వలికిన విని, జననాథపురంధ్రు లెల్ల సవినయమున న
య్యనఘాత్మునికడకుం జని, మునుకొని తచ్చరణములకు మ్రొక్కిరి వరుసన్.
తే. అంతఁ బుత్రవియోగశోకానలార్చిఁ, జాల సంతప్తయైనకౌసల్య యలసు
మిత్రతోఁ గూడి పరమపవిత్రుఁ డైన, జటిపదంబులు కరముల సంస్పృశించె.
క. పదపడి మోమున నూతన, విధవాత్వము గానుపింప వృజినంబుల కా
స్పద మగు కైకయి యమ్ముని, పదములు తగ సంస్పృశించెఁ బాణిద్వయిచేన్.
వ. అట్లు కైకేయి యమ్మహామునికి నమస్కరించి యతని మ్రోలఁ గౌసల్యా
సహితంబుగా నిలుచుటకు సిగ్గు వడి ప్రదక్షిణవ్యాజంబున నవ్వలికిం జని
భరతునిసమీపంబున దీనవదనయై యుండెఁ గౌసల్యాద్యంతఃపురకాంతల
నందఱ విలోకించుటకుఁ దపోవనబహిఃప్రదేశంబునకుం జనుదెంచి యున్న
వాఁ డగుటం జేసి యమ్మునిశ్రేష్ఠుఁ డప్పుడు వారల నందఱఁ గలయ విలోకించి

భరతునిం జేరి రాజనందనా భవజ్జనయిత్రులలోన విశేషం బెఱింగింపుము.

భరతుఁడు భరద్వాజునికిఁ దల్లుల నందఱ నిరూపించి చెప్పుట.

మ. అనినం బ్రాంజలి యై యతండు మునివంశాగ్రేసరుం జూచి యి
ట్లనుఁ బూతాత్మక పుణ్యశీల నిజవంశాచారసంసక్తచి
త్తనృపాలాగ్రణి కగ్రపత్ని యలసంధ్యాదేవికి న్సాటి యా
ఘనదాక్షిణ్యగుణాఢ్య ధర్మరత యీకౌసల్య వీక్షించితే. 1759

మ. అనఘా యీయమ పుణ్యశీలు మనువంశాగ్రేసరు న్సజ్జనా
వనధుర్యు న్సుగుణాలవాలు విగతవ్యాపాదుని న్సింహసం
హనను న్రాజకులైకభూషణు మనోజ్ఞాకారు ధీరు న్యశో
ధనుని న్రాముని( గాంచె నయ్యదితి ధాతన్గన్నచందంబునన్. 1760

తే. గహనమున శీర్ణనవకర్ణికారశాఖ, కరణిఁ గౌసల్య వామభాగంబు నఱిమి
యతులశోకరసాధిదేవతయుఁ బోలె, మెలఁగుచున్నయీదేవి సుమిత్ర సుమ్మి.

తే. ఇమ్మహాసాధ్వితనయు లహీనసయులు, సత్యవిక్రమరతులు ప్రసన్నమతులు
వ్యాఘ్రవిక్రాంతగమనులు నరివమనులు, ఘనులు లక్ష్మణశత్రుఘ్ను లనఘచరిత.

సీ. తాపసవర్య యెద్దానికృతంబునఁ గౌసలేయుఁడు వనవాసి యయ్యెఁ
బుత్రవిహీనుఁ డై భూవిభుఁ డెద్దానికలుషంబుకతన స్వర్గస్థుఁ డయ్యె
నట్టిదుశ్చిత్త ననార్యరూపిణి దృప్త నైశ్వర్యకామ నన్యాయ్యమతిని
గ్రోధన నతిసతీలోకవినిందితఁ గైకను మాయమ్మగా నెఱుంగు

తే. మెల్లపాపంబులకు మూల మిదియె దేవ, యనుచు నీరీతి గాద్గద్యమడరఁ బలికి
క్రోధమునఫణిభంగి నూర్పులునిగిడ్చి, దీప్తముఖుఁడయ్యెఁగనులరక్తిమచెలంగ.

కైకయీస్మరణకుపితుం డగుభరతుని భరద్వాజుఁ డూఱడించుట.

వ. ఇట్లు మాతృనామస్మరణసంజాతక్రోధవిశేషంబున దుర్నిరీక్షుం డైనభరతుం
జూచి భరద్వాజుం డర్థవంతం బైనవాక్యంబున నిట్లనియె. 1764

క. ఊరక కైకయిపై దోషారోపణ మాచరించి యలుగఁ దగదు నీ
కారామనివాసనమున, నారయ జనములకు సౌఖ్య మయ్యెడిఁ జుమ్మీ. 1765

భరతుఁడు సైన్యసమేతుఁడై చిత్రకూటపర్వతంబున కేగుట.

వ. వత్సా యీరామప్రవ్రాజనంబువలన దేవదానవమహర్షులకు మిక్కిలి హితంబు
గాఁగల దని పలికిన నాభరతుండు మునివచనశమితక్రోధుండై యత్తాపసశ్రేష్ఠు
నకుఁ బ్రదక్షిణపూర్వకంబుగా నమస్కారంబుఁ గావించి తదాశీర్వాదంబులు
గైకొని యామంత్రణంబు వడసి మంత్రులం జూచి ప్రయాణం బాజ్ఞాపించిన
వారు తద్వచనప్రకారంబున నెల్లవారికిఁ బ్రయాణంబు చాటించిన యనంతరం
బ నానావిధజనంబు ప్రయాణార్థులై హేమపరిష్కృతయుక్తవాజిరథంబు లారో

హించి చనియె హేమకక్ష్యంబులును బతాకావంతంబులు నై కరిణీగజంబులు ఘర్మాంతంబునందలి ఘోషవంతంబులైన జీమూతంబుల భంగి నలరుచుం జనియె మహార్హంబులైన నానావిధగురులఘుయానంబు లెక్కి తక్కిన జనంబు చనియెఁ బదాతులు పాదగమనంబునం జనిరి యానప్రవేకంబు లారోహించి రామదర్శనలాలస లై కౌసల్యాప్రభృతి రాజకాంత లరిగిరి తరుణచంద్రార్కసదృశ శిబిక నారోహించి సపరిచ్ఛదుం డై భరతుండు చనియె నిట్లు గజవాజిరథాకులం బైన యమ్మహాసైన్యంబు మహామేఘంబుచందంబున నాగస్త్వం బగు దిగ్భాగంబు నావరించి మృగపక్షిజుష్టంబు లైన గిరినదీతీరంబులం గలవిపినంబు లతిక్రమించి రయంబునం బోవుచుండె నప్పుడు. 1766

చ. లలితవినీలశాడ్వలచరన్మృగపఙ్క్తి దవాగ్నిధూమ మం
చలఘుభయంబునం బరువ నంచలు వార్షికమేఘ మంచు భీ
తిలఁగ వనాటకోటి పటుతీవ్రతమం బని యిక్కువ ల్సొరం
బలుగతులం జెలంగె నలభారతసైనికపాంసుజాలముల్. 1767

క. ఆలో సైన్యము కుతుక, వ్యాలోలం బై ధరిత్రి నాచ్ఛాదించెన్
హాలాయము ఘనవర్షా, కాలాంబుద మాకసంబు గప్పినమాడ్కిన్. 1768

క. హరిసామజోష్ట్రగోరథ, ఖురములచే సాంద్రభంగిఁ గప్పఁబడి వసుం
ధర చిరకాలము జనులకుఁ, గర మద్భుతభంగి నపుడు కనఁబడ కుండెన్. 1769

క. ఏతాదృశఘనసైన్యో, పేతుం డై భరతుఁ డిట్లు పృథుసంరంభ
స్ఫీతుఁ డగుచు దూరము చని, పేతశ్ఖేదమున నవ్వసిష్ఠున కనియెన్. 1770

క. సదయుం డగుముని చెప్పిన, ప్రదేశ మిదె చిత్రకూటపర్వతరాజం
బదె మందాకిని యది య, ల్లదె యదె యసితాభ్రతుల్య మగువన మనఘా.

క. గిరితుల్యము త్తమామక, కరటిఘటాదంతకాండ ఘట్టనమున నీ
వరచిత్రకూటసానువు, లతిముతిఁ ద్రుటితాశ్మసఙ్కు లయ్యెడిఁ గంటే. 1772

క. జలధరము లగుఘనంబులు, జలములఁ దొనలందుఁ గురియుచందంబున ని
ట్టలముగ నగములు చగులం, దలరులు నడిఁ గురియు చున్న వల్లదె కంటే.

క. అంబుధి మకరవితతిచే, తం బోలె నితాంతమృగవితతిచే వ్యాకీ
ర్ణం బగుచుఁ జిత్రకూట న,గం బొప్పెడుఁ గంటె దేవకాంతాలయ మై.

భరతుఁడు శత్రుఘ్నునితోఁ జిత్రకూటపర్వతము నభివర్ణించి చెప్పుట.

వ. అని పలికి శత్రుఘ్ను నవలోకించి. 1775

క. వాతప్రవృద్ధఘనసం, ఘాతంబు ఘనాత్యయమున గగనమునందుఁ
బోతిరుగుకై వడి మృగ, వ్రాతము చెలు వారె వేగవంతం బగుచున్. 1776

క. జలదప్రకాశఫలకం, బుల చేతన్ దాక్షిణాత్యపురుషులక్రియ నా
దలలందు భటులు తమ భా,సిలఁ గుసుమాపీడములను జేసెడుఁ గంటే. 1777

వ. మఱియు నమ్మహాఘోరకాంతారంబు తొల్లి విజనం బైన నిప్పుడు జనాకీర్ణం బైనసాకేతపురంబుభంగి సౌమ్యదర్శనం బై యున్నది విలోకింపుము. 1778

తే. హరిఖురోద్ధూతపటుసాంద్ర ధరణిరజము,దావమును వ్యోమభాగంబునావరింప గాడ్పుమనకుఁ బ్రియముసేయుకరణి దాని, విరియఁదట్టెడుఁగంటివేవినుతచర్య.

క. తురగోపేతము లగుసుం, దరరథములు సూతచోదితము లయ్యును స త్వరగతిఁ జన నేరక కడు, భరమున విపినమునఁ జిక్కువడియెడుఁ గంటే. 1780

చ. హరిపదవీథిపైఁ బొలుచు నస్మదనీకపరాగజాల మి
త్తఱిఁ బరికించి వారిదకదంబ మటం చలచిత్రకూటభూ
ధరశిఖరాగ్రభాగమునఁ దద్దయుఁ జిత్రకలాపజాలము
ల్విరివిగఁ బాయ విచ్చి నరవి న్నిఖు లాడెడుఁ గంటె ముంగలన్. 1781

తే. పద్మగర్భున కెన మైనపరమమునుల, కాశ్రయం బిది గావున ననఘ యీప్ర దేశము త్రివిష్టపముఁ బోలెదివ్యమై యు,నామయంబయితోఁచెడి ననఘకంటె.

తే. భాను తేజ మంజులబిందుభాస్వరములు
మృగములు మృగీయుతంబు లై యివ్వనమున
ధవళసుమములచేఁ జిత్రితంబు లైన
చందమున నొప్పు చున్నవి చాలఁ గంటె. 1783

తే. అతులితపరాక్రములు ధీరు లతిగభీరు, లసదృశులు రామలక్ష్మణు లధికబలులు మనకుఁ జూపట్టునందాఁకవనములోన,వీరభటపుంగవులు చొచ్చి వెదకవలయు.

వ. అని భరతుం డాజ్ఞాపించినఁ దత్క్షణంబ కొందఱు యోధులు శస్త్రాస్త్రపాణు లై యవ్వనంబుఁ బ్రవేశించి పురోభాగంబున వర్షాకాలమేఘంబుకరణి శ్యామం బై యొప్పు చున్నధూమాగ్రంబు దవ్వులం గాంచి క్రమ్మఱ భరతు నొద్దకుం జనుదెంచి దేవా యగ్రభాగంబున దవ్వుల ధూమాగ్రం బొప్పుచు న్నది కృశానుండు లేనిచోట ధూమం బుండదు నిర్జనం బైనస్థానంబునఁ గృశానుం డుండఁడు నిక్కంబుగా నచ్చట రామలక్ష్మణులు వసించి యుండఁ బోలు నట్లు గాదేని తాపసమాను లయినమునులు నివసించి యుండఁ బోలు నని యూహించెద మని పలికిన సాధుసమ్మతంబు లైనవారలపలుకులు విని యమిత్రబలమర్దనుం డైనభరతుండు సర్వసైనికుల విలోకించి మీ రిచ్చటనె నిశ్శబ్దులై యుండుఁడు వసిష్ఠుండును సుమంత్రుండును నేనునుం జనియెదమని పలి కిన వారు తద్వచనప్రకారంబునఁ జిరకాలంబునకు రామసమాగమంబు దొర కొనియెఁ గదా యని సంతసించుచు ధూమాగ్రగతవీక్షణు లై నిలిచియుండిరి భరతుండును ధూమాగ్రంబు విలోకించుచుం బోవు చుండె నంతకు మున్ను గిరి వనప్రియుం డగురామభద్రుండు తచ్ఛైలంబునందు దీర్ఘకాలోషితుండై పురం దరుండు పులోమజం బోలె వైదేహి నవలోకించి యద్దేవికిఁ బ్రియంబు సంపా

దించువాఁడై వనవాసపరిశ్రాంతం బైన తనమనంబున కభిమతవిషయాంతరవ్యా
సంగంబున నానందంబు సంపాదించుచు నమ్మైథిలి కి ట్లనియె. 1785

-ఞఞ రాముఁడు సీతకుఁ జిత్రకూటమునందలి విశేషములను జెప్పుట. ఞఞ-

క. గతసామ్రాజ్యుఁడ నయ్యును, హితజనరహితుండ నయ్యు నీరమణీయ
క్షితిధరముఁ గాంచి మది నప్రతిమామోదమున నున్నవాఁడ నతాంగీ 1786

క. నానాకూటవిరాజిత, మై నానాధాతుకలిత మై సాంద్రగతిన్
నానాఖగమృగయుత మై, యీనగ మలరారెడి న్మృగేక్షణ కంటే. 1787

వ. మఱియు ధాతుభూషితంబు లై నయీశైలదేశంబులు గొన్ని రజతసంకాశం
బులు గొన్ని క్షతజసన్నిభంబులు గొన్ని పీతమాంజిష్ఠవర్ణంబులు గొన్ని మణి
వరప్రభంబులు గొన్ని పుష్యరాగస్ఫటికకేతకీపుష్పవర్ణంబులు గొన్ని నక్షత్ర
పాదరసప్రభంబు లీశైలం బదుష్టనానామృగగణసింహవ్యాఘ్రభల్లూకసమూ
హంబులు గలిగి విచిత్రపక్షిసమాకులం బై ప్రకాశించుచున్నది మఱి
యు నామ్రాసనలోధ్రప్రియాళుపనసధవతిమిశాంకోలబిల్వతిందుకారిష్టవరుణ
మధూకతిలకబదర్యామలకీనీపవేత్రధన్వనబీజకాదినిఖిలతరువ్రాతంబులు పుష్ప
వంతంబు లై ఫలోపేతంబు లై ఛాయాయుక్తంబు లై మనోరమంబు లై
యొప్పుచున్నవి విలోకింపుము. 1788

క. రమణీయపర్వతప్ర, స్థములందు విరాళిఁ గామసమ్మోహితు లై
రమియించుచున్న కిన్నర, రమణీరమణులను గంటె రాజీవాక్షీ. 1789

క. అంబుజముఖి కనుఁగొనుము ఘ,నంబుగ విద్యాధరాంగనాక్రీడోద్దే
శంబులు మిక్కిలి నాహృద, యంబున కానందకరము లై యున్న విటన్. 1790

క. తరువిటపంబుల వ్రేలెడు, వరమణిమయభూషణములు వస్త్రంబులు సుం
దరమాల్యంబులు ధనువులు, సురుచిరఖడ్గములు వ్రేలఁ జూడుము తన్వీ.

తే. జలజముఖి యున్నతప్రదేశమున నుండి, దుమికెడువిశాలగిరినిర్ఝరములచేత
నల్పనిర్ఝరములచేత నద్రి చాలఁ, గ్రాలెడు స్రవన్మదం బైనగజముకరణి.

క. ఫలకుసుమసంభృతం బగు, విలసద్గంధము గ్రహించి విసువక గుహాలం
బలుగతుల విసరుకరువలి, చెలియా యెవ్వరికి సుఖము సేయక యుండున్.

క. నీవును రాజాన్వయనయ,కోవిదుఁ డగులక్ష్మణుం డకుంఠితభక్తిన్
సేవించుచుండ నిచ్చట, వావిరి నిలువంగరాదె వర్షశతంబున్. 1794

క. అతులితఫలకిసలయసం,గతము సురమ్యంబు పక్షిగణయుత మగునీ
క్షితిధరశిఖరాగ్రమునన్, రతిమంతుఁడ నైతిఁ జుమ్మి రాజీవాక్షీ 1795

క. జనకునిబుణమీఁగుటయును,గొనకొనిభరతునకుఁ బ్రియముఁగూర్చుటయునుగా
వనవాసముచే నాకిటు, వనజాక్షి ఫలద్వయంబు వచ్చెం జుమ్మీ. 1796

తే. నెలఁతమానసవాక్కాయనియతవగుచు,వివిధభావముల్ చూచుచు వేయిగతుల

నన్నుఁగూడి యీరమ్యకాననములందు,నీనగంబునఁ గ్రీడింతె యింపు మెఱయ.

తే. రమణి యన్యరాజన్యు లరణ్యవాస, మమృత మని పల్కి రస్మదీయాన్వవాయ
రాజు లెల్ల దేవత్వసంప్రాప్తికొఱకుఁ, గాననినివాస మని రర్థి ఘనత మెఱసి.

క. శైలోపరిభాగంబున, నీలారుణపీతధవళనిర్మలరుచుల
న్వాలాయముఁ జూపట్టు వి, శాలశిలాపటలిఁ గంటె చంచలనయనా. 1799

తే. చారువదన యెద్దాని కేసరము విరుల, వృద్ధి నొందినకైవడి వెలసె నట్టి
యీశిలాపట్ట మీక్షింపు మిదిగొ యుష్మ, దర్థమిడినట్లు పరికింపన య్యె నహహ.

వ. మఱియు నిమ్మహీధరంబునం గలదివ్యౌషధులు సహస్రప్రకారంబుల స్వకాంతి సంపదలచేత భ్రాజమానంబులై రాత్రియందు హుతాశనజ్వాలలభంగి వెలుంగుచున్నవి కొన్నిదేశంబులు సదనసదృశంబులై కొన్నియెడ లుద్యానసన్నిభంబులై కొన్ని నెలవు లేకశిలారూపంబు లయి యద్భుతప్రకారంబునం జూపట్టుచున్నవి మఱియు నీచిత్రకూటపర్వతంబు ధరిత్రిని భేదించిసముత్థితంబయినమాడ్కి నలరుచున్నది యేతత్పర్వతశిఖరంబు శుభదర్శనంబై యున్నది మఱియుఁ గుష్ఠపున్నాగసరళభూర్జపత్త్రోత్తరచ్ఛదంబు లయి కుశేశయదళయుతంబులై కాముకులయాస్తరణంబులు శోభిల్లుచున్నవి తత్పరిసరంబునఁ బరిమ్లానంబులై మృదితంబులై పుష్పమాలికాసందోహంబులు వ్రాలి యున్నయవి చిత్రకూటనగంబు బహుమూల్యఫలోదకంబై యమరావత్యలకాపురంబులను మానససరోవరసౌగంధికాఖ్యసరోవరంబుల నుత్తరకురుదేశంబుల నతిరమణీయత్వంబున నతిక్రమించిన ట్లొప్పుచున్న దిచ్చటఁ జతుర్దశవర్షవ్యతిరిక్తపురుషాయుగకాలంబంతయు రాజర్షిసమాచరితంబులైనస్వనియమంబుల ననుసరించి లక్ష్మణునితోడ సీతతోడం గూడి విహరించినం గొఱంతయేమివనవాసవత్సరంబులిచ్చటఁ గడపి యవ్వల రాజ్యసుఖం బనుభవించెద నని యీదృశంబులైనశుభవాక్యంబులు సీతకుం జెప్పుచు నప్పర్వతంబు డిగ్గి తత్కటకంబున రమ్యజలాకీర్ణయగు మందాకినీనది నవలోకించి రాజీవలోచనుం డగురాముండు చారుచంద్రనిభానన యగుజానకి నవలోకించి వెండియు నిట్లనియె. 1801

శా. రాజీవేక్షణ రమ్యచిత్రపులిన న్రమ్యైక జగత్పావని
న్రాజత్కైరవషండమండలయుత న్స్నానాతటోద్భూతధా
త్రీజాతావృతఁ జక్రహంసముఖపత్త్రివ్యాకుల న్యక్షరా
డ్రాజీవాకరతుల్య నచ్ఛజలపూర్ణ న్నిమ్నగం జూచితే. 1802

సీ. ఒకసంక నవకైరవోత్పలాంబుజవనాలంకృతంబు మదాళిఝంకృతంబు
ఒకచోట దివ్యగంధోపేతపవనవిరాజితంబు మరాళకూజితంబు
ఒకదెస గగనచుంబ్యుత్తుంగకల్లోలభావితంబు కుళింగసేవితంబు
ఒకయోర వనదేవయువతిసంగీతసన్నాదితం బలసారసోదితంబు

తే. ఒక్కయెడ నిమ్నగావర్తమొక్కచ్రైవ, స్తనితగంభీర మొకచాయఁ జక్రవాక
శోభితం బయి యెల్లెడఁ జూడ నొప్పె, నబ్జలోచన యిచటిశోభాతిశయము.
సీ. అలివేణి కంటె దివ్యారణ్యఫలపల్లవోద్దీపితారణ్య మొక్కచోటు
కలకంఠి కంటె మా కందపల్లవభావనోన్మత్తపికనాద మొక్కచోటు
పూఁబోఁడి కంటె సంపుల్లకలాపమయూరనాట్యవిశాల మొక్కచోటు
రాజీవముఖి కంటె రమణీయతరమృగయూథకోలాహలం బొక్కచోటు
తే. చెలువ యొకచోటు సిద్ధనిషేవ్యమాన, మతివ యొకచోటు దేవవిహారయోగ్య
మింతి యొకచోటు వనదంతిదంతయుతము, దేవి చూచితె యీనదీతీరమందు.
తే. తామరసనేత్రి మృగనిపీతంబు లగుట, వలనఁ గలుషోదకంబు లై యలరునట్టి
యీమనోజ్ఞతీర్థంబు లింపెసఁగ నాకు, వేడ్కఁ బుట్టించుచున్న వీవేళఁ గంటె.
క. ఘనవల్కలంబులు జటా, జినములు ధరియించి మౌనిశేఖరులు ముదం
బున నీనదిలో మజ్జన, మొనరించుచు నున్నవారు యువతీ కంటే. 1806
క. రమణీ మఱికొందఱు సం,యము లిచ్చట నూర్ధ్వబాహు లై నియమమునం
గ్రమమున నాదిత్యుని సర్వమయు నుపాసించుచున్నవారలు కంటే. 1807
తే. పత్రపుష్పంబు లిన్నదిపై సృజించు, మారుతోద్ధూతశిఖరద్రుమముల చేతఁ
బరఁగ నృత్యం బొనర్ప నుపక్రమించు, పగిది జూపట్టుచున్నది పర్వతంబు.
తే. వారిజేక్షణ నీరమ్య వదనజనిత, కాంతి నీక్షించి తమ కట్టి కాంతి లేమి
వనరుహంబులు సిగ్గుచే మునిఁగెననఁగ, జలములమునుంగుచున్నవి చెలువ కంటె.
క. ఒకచోట మణిసికాశో,దక మొకయెడ విపులసైకతం బొకచో న
త్యకలంకసలిల మొకయెడ, వికచసరోజములు గలిగి వెలసెడుఁ గంటే. 1810
క. శ్వసనాహతనవవికచ, ప్రసూనములు పాదపములపై నుండి రహి
న్వసన వ్రాలి పఱచినట్లుగఁ, బొసఁగఁ బ్రవాహంబు వెంటఁబోయెడుఁ గంటే.
క. వనజాతపత్ర చూచితె, పనివడి జక్కవలు మధురఫణితి నినాదం
బొనరించుచుఁ గమలోత్పల, వనమండములందు వ్రాలి వరలెడు ప్రోలన్.
తే. ఇన్నదీసైకతములందు నిన్నుఁ గూడి, వలసినట్లు క్రీడించుచు లలితఫణితి
నిమ్మహాగిరిపై వసియించుకంటె, నతివ పురవాస మధికోదయంబె నాకు. 1813
క. అతులితతపోదమశమా, న్వితు లగుతాపసులచేత నిత్యము విక్షో
భితజల యగునీనది సం, చితభక్తి న్నన్నుఁ గూడి సేవింపు మికన్. 1814
వ. కల్యాణి నీ విమ్మహానదియందు మత్సమేతంబుగా నవగాహనంబు సేయుము భవజ్జఘనకుచాఘాతజనితతరంగంబులచేతఁ గమలోత్పలంబులు నటనంబుఁ గావింపం గలవు 1815
క. ఆమందాకిని శత్రుని, కోమలి కనిశంబుఁ బ్రియముఁ గూర్చినక్రియ నేఁ
డీమందాకిని నీకును, లేమా యొడఁగూర్చు హితము బ్రియమును సుఖమున్.

క. ఈపర్వతరాజ మయో, ధ్యాపట్టణమట్ల యిమ్మహానది సరయూ
దీవ్పపతియట్ల యరయుచు, భూపుత్త్రీ నన్నుఁ గూడి పొందుము సుఖముల్.

తే. బాలశశిఫాల నీ వనుకూల వగుచు, హితముఁ గావింప లక్ష్మణుఁ డధికభక్తి
నస్మదాజ్ఞావ్యవస్థితుండగుచునుండ,ముదమునాకబ్బుటకు నింకఁగొదవయేమి.

క. క్రమయుక్తిఁ ద్రిషవణస్నా,న మొనర్చుచు వన్య మనుదినంబు మెసవుచు
న్నిమ్ముఁ గూడి నామనంబున, రమణీ కాంక్షింప నింక రాజ్యమును బురిన్.

చ. తతమృగయూథశాలినియుఁ దామరసావృతయు న్మహామృగ
ప్రతతినిపీతతోయయును బాదపసేవితయు న్మహోర్మికో
న్నతయగు నిమ్మహాతటిని స్నాన మొనర్చి గతక్లముం డనా
హతకుశలుండు గానినరుఁ డంగన యెవ్వఁడు లేఁడు చూడఁగన్. 1820

వ. అని యివ్విధంబున రాముండు ప్రియాసహాయుండై బహుసంగతు లగువచ
నంబులు పలుకుచుఁ గొండొకసేపునయనాంజనప్రభం బైనచిత్రకూటపర్వతం
బున విహరించి యనంతరంబ నిజాశ్రమసమీపంబుననొక్కరమణీయగిరిప్రస్థం
బునందు సీతాసమేతంబుగా సుఖాసీనుండై యిదిమేధ్యం బిదిస్వాదు విది వహ్ని
నిష్టప్తం బని వచించుచు మృగమాంసప్రదానంబున నద్దేవిని రంజిల్లం జేయు
చుండె నప్పుడు సమీపంబునం జనుదెంచు చున్నభరతుని సైన్యశబ్దంబును
జమూచరణోత్థితపరాగంబును నింగి ముట్టి చెలంగె నమ్మహాధ్వని విని వార
ణాదిమృగంబులు సయూథంబులై భయంబుఁ గొని పెక్కుతెఱంగులం బరు
వెత్తుచుండె నంత రాముండు సైన్యసముద్భూతశబ్దంబు విని శబ్దసంశ్రవణసం
జాతసాధ్వసంబునం బఱచుమృగంబుల నవలోకించి దీప్తతేజుండై నసౌమిత్త్రి
కిట్లనియె. 1821

చ. జలనిధిఘోషమట్లు ఘనశబ్దముకై వడి నొక్కనాద మ
త్యలఘుగతి న్స్వనం బడియె నద్భుతపాంసువు లెల్లదిక్కులం
గలయఁగ నాక్రమించె గజఖడ్గమృగేంద్రవరాహయూథము
ల్పలుగతుల న్భయంబుఁ గొని పాఱఁ దొడంగెఁ గుమార చూచితే. 1822

తే జనవిభుఁడో తత్సముండో యీవనమునందు
వేఁట సలుపంగ వచ్చె నవ్విధము గాక
శ్వాపదం బరుదెంచెనో సత్వరముగఁ
గల తెఱం గంతయును నీవు తెలిసికొమ్ము. 1823

క. ఈనగము పక్షిగణముల, కైన సుదుశ్చరము లక్ష్మణా యీపగిదిం
బూనికిఁ జనుదెంచెడువాఁ, డేనరుఁడో వేగ తెలియు మెంతటిఘనుఁడో.

చ. అన విని లక్ష్మణుండు రయ మారఁగఁ బుష్పితసాల మెక్కి యా
యనువున దిక్కు లన్ని గలయం బరికించి యుదఙ్ముఖంబుగాఁ

గనుఁగొనియె న్సతాంగతురగద్విపసంకులము న్మృగాధిరా
జనిభపదాతిసంయుతము సాగరతుల్యము భూరిసైన్యమున్. 1825

క. ఈరీతిఁ గాంచి యారఘు, వీరుఁడు సాలమున నుండి వెసఁ బ్రాంజలి యై
యారామునితో సైన్య, ప్రారంభం బెఱుకపఱచి పలికె న్మరలన్. 1826

క. వీరోత్తమ వహ్ని నర, ణ్యారోపితుఁ జేసి సీత నద్రిబిలమునం
జేరిచి గ్రక్కునఁ జేయుము, దారుణశరచాపకవచధారణ మనఘా 1827

క. అని వేగిరపడి పలికెను, ననుజన్మునిఁ జూచి పలికె నారామవిభుం
డనఘా యెవ్వని బలమో, గనుఁగొనుము సవిస్తరంబుగా సర్వంబున్. 1828

లక్ష్మణుండు శ్రీరామచంద్రునకు భరతాగమనం బెఱిఁగించుట.

ఉ. నా విని లక్ష్మణుండు వదనంబునఁ గోపము చెంగలింపఁ గాఁ
బావకుకై వడిం గెరలి ప్రాంజలి యై తనయన్న కిట్లను
న్దేవ కృతాభిషేకుఁ డయి ధీరత నిన్ను జయింపఁ గోరి యా
త్రోవ బలంబు గొల్వ భరతుం డరుదెంచుచు నున్నవాఁ డొగిన్. 1829

ఆ. మింటిపొడువు గలిగి ఘంటాఘణంఘణ, నినద మెల్లదెసల నిండఁ దద్ర
థంబుమీఁద నుద్ధతస్కంధ మగుకోవి, దార కేతు వలరు ధర్మనిరత. 1830

తే. చటులగతి గల్గునారట్టజంబు లెక్కి, విచ్చుకత్తులతళతళ ల్గ్రిచ్చుకొనఁగ
సాదు లరుదెంచుచున్నారుసాహసమున, వారణారోహకులుఁ గంటె వాఁడిగలిగి.

క. మన మాయుధములు గొని గ్ర, ద్దన గిరిశిఖరంబుపైకి దాఁటుదమో లే
కనఘా సన్నద్ధుల మై, మునుకొని యిచ్చటనె యుందమో తెల్పు మొగిన్.

క. క్రొవ్వున మనలం దాఁకిన, నెవ్వనికృతమందు మనకు నీగతి నిడుమ
ల్నివ్వటిలె నట్టిభరతునిఁ, జివ్వకు రాఁ దిగిచి కృపణుఁ జేసెదఁ గడిమిన్.

తే. మిహిరకులవర్య యెవనినిమిత్త మీవు, నేను సీతయు దారుణ మైనవ్యసన
మొందినార మాకై కయినందనుండు. నాడుకంటను బడు నికఁ గాదు విడువ.

తే. శాశ్వతం బైననీదురాజ్యం బధర్మ, వృత్తిఁ గైకొన్నదుష్టాత్ముఁ డీభరతుఁడు
భాగ్యవశమున నేఁడు సంప్రాప్తుఁ డయ్యె, వీని వధియించి పుచ్చెద విమలచరిత.

క. వీరోత్తమ యీభరతుఁడు, వారనిపరిపంథి గాన వధ్యుఁడు నాకీ
దారుణచిత్తుని వధమం, దారయఁ గా దోస మించుకైనం గలదే. 1836

తే. అధిప యపగతనిజధర్ముఁ డైనభరతుఁ, డార్యగణగర్హితుండు పూర్వాపకారి
సహజశత్రుండు స్వప్రయోజనరతుండు, తత్పరిత్యాగమున నీకుఁ దప్పు లేదు.

వ. మహాత్మా యేనునీచేతఁ గృతాభ్యనుజ్ఞుండనై యీక్షణంబు భవద్రాజ్యాపహారి
యైనభరతుని వధించెద నాచేత నిహతుండైనపుత్రుని హస్తిభగ్నద్రుమంబునుం
బోలె నిరీక్షించి రాజ్యకాముక యైనకైకేయి దుఃఖార్తయై విలపించుచుండఁ
బదంపడి దానింబట్టి బంధుసహితంబుగావధించిశుష్కారణ్యంబునందు పాంతా

శనుంబోలె సైన్యంబునందు మత్క్రోధంబు నసత్కారంబును బ్రయోగించి
కరితురంగరథికపదాతుల నిశితశరంబులం గీటడంచి చిత్రకూటకాననంబు నెల్ల
రుధిరోక్షితంబుఁ గావించెద మఱియు నాచేత నిహతంబులైన గజహయపదాతి
కళేబరంబుల శ్వాపదంబులు భక్షించుం గాక యేనిట్లు పగతురం బరిమార్చి శర
చాపంబుల ఋణంబుఁ దీర్చికొని కైకేయీకరగతం బైనసామ్రాజ్యంబునుం
దెచ్చి నీ కొసంగి కృతార్థుండ నయ్యెద నీవు పట్టాభిషిక్తుండవై వసుంధరఁ బరి
పాలింపుమని యివ్విధంబున నాగ్రహోదగ్రవ్యగ్రాయమానమానసుండై సమగ్ర
బాహుబలంబున భరతునితో విగ్రహించి నిగ్రహించుటకుం దివురుచున్న లక్ష్మ
ణుం జూచి రాముండు సాంత్వవాక్యంబుల ననూనయించుచు నిట్లనియె. 1838

క. గురువృత్తివిదుఁడు ధర్మో, త్తరుఁడు మహాప్రాజ్ఞుఁ డధికధైర్యుఁడు భరతుం
డరుదెంచుచుండ నసిభీ, కరశరచాపముల నేమి కార్యము చెపుమా. 1839

క. నరపతికి సత్య మాడియు, వరమతిఁ జనుదెంచినట్టిభరతు న్సుగుణా
భిరతు న్వధించి యీ తుచ్ఛరాజ్యమున నేమి యశము సంపాదింతున్. 1840

తే. తలఁప నెయ్యది బంధుమిత్రక్షయంబు, నందుఁ బ్రాప్తించు నది సుధయైన నేమి
గరళమిశ్రితభక్ష్యంబుగతిఁ బరిత్య, జింతుఁ గా కాత్మలోనఁ గాంక్షింప నయ్య.

తే. ధర్మమర్థంబు కామంబు ధరణిసిరియుఁ, గోరుటంతయు మీ మేలుకొఱకుఁ గాదె
బాల్యమాదిగ నాబుద్ధి భ్రాతృవత్సలతఁ బరిణమించు టెఱుఁగవే రాట్కుమార.

చ. ఘనమతి నాకు దుర్లభము గాదు ధరిత్రి యధర్మమందు నా
కనిమిషలోకరాజ్యపద మబ్బిన నైనఁ దృణీకరింతు నే
ర్పున నసిచాపబాణములఁ బూనుట రాజ్యముఁ గోరు టెంతయు
న్మనుకొని మీకు నిచ్చలు ప్రమోద మొనర్చుట కంచుఁ జూడుమీ. 1843

క. ఈమాట నిజముఁ బల్కితి, సౌమిత్రీ నమ్ము మీవు నమ్మవె యేని
న్నీమనసమున నాయుధములు, చే ముట్టి నిజంబు బాసఁ జేసెద ననఘా. 1844

క. అసదృశచరితుని భరతునిఁ, బస చెడి దునుమాడి బృహదుపక్రోశమలీ
మసుఁడ నయి తుచ్ఛమహీ మా, నసమున గణియింతునే వినయగుణశాలీ.

తే. నీవు శత్రుఘ్నుఁడును బుణ్యనిరతుఁడైన
భరతుఁడును లేనియెడ నాకుఁ బరఁగ నెద్ది
యేనియు నొకింత సుఖ మబ్బెనేని దాని
వీతిహోత్రుండు నీఱు గావించుఁ గాక. 1846

క. కారణము లేక నా కప, కారముఁ జేయుటను జేసి కైకను సుజను
ల్దూఱిరి నృశంస యని నను, దూఱరె యిఁక నామె నొడిసి ద్రుంచిన యంతన్.

తే. కైక చేసినయపరాధకార్యమునకు, సత్యసంధుని భ్రాతృవత్సలుని ఋజునిఁ
బ్రాణములకంటెఁ బ్రియుఁడగుభరతు నెట్లు, నిష్ఠురాత్ముఁడనై త్రుంప నేర్తునయ్య

సీ. పుడమియు సిరిఁ బాసి జడలు చీరలు దాల్చి జానకీలక్ష్మణసంయుతముగ
వనికి నేతెంచిన నను విని శోకసంక్షోభితకరణుఁడై క్రూరచిత్త
యగుతనయమ్మకు నవమతిఁ గావింపఁ దలఁచి భూపతిప్రసాదంబు వడసి
భ్రాతృవత్సలత సామ్రాజ్యంబు నాకు సమర్పించుటకు భక్తి నరుగుదెంచు
తే. చున్నవాఁ డిమ్మహామహుఁ డొండువిధము,పూనిగాదెన్నఁ డేనియుమున్ను భరతుఁ
డెగ్గుఁ గావించెనే మన కించు కైన, నట్టిపుణ్యునిపై నేల వట్టిశంక. 1849
క. భరతుఁడు మనలం జూచుట, కరుదెంచుట కాలయోగ్య మనఘుఁడు మనయం
దరయంగ నించు కైనను, దురితము గావింపఁ డితఁడు దుర్జనదూరా. 1850
తే. అనఘ భరతుఁడు కల నైన నప్రియంబుఁ
దలఁపఁ డెన్నఁడుఁ బరుషోక్తిఁ బలుకఁ డెపుడు
సకలనృపధర్మసంవేది శ్లక్ష్ణవాది
మన మెఱుంగనిదే వానిమానసంబు. 1851
తే. కెరలి భరతునిఁ గూర్చి శంకించె దేటి, కమ్మహాత్మునిచే ము న్నొకప్పు డైన
నిట్టిసంతాపజనకోక్తి యించు కైనఁ,బలుకఁబడియెనె యేల యీతలఁపు నీకు.
తే. అనఘచరిత క్రౌర్యంబున నప్రియోక్తు, లాకుమారు నుద్దేశించి యాడఁ దగదు
వానియం దొకదుష్టభావత్వశంక, గలిగి యుండిన నే నైనఁ గనల వచ్చు.
వ. వత్స భరతుండు నీచేత నప్రియంబును నిష్ఠురంబు నగువాక్యంబు పలుకం
దగినవాఁడు గాఁ డతని నుద్దేశించి నీచేతఁ బలుకం బడియెడునప్రియోక్తులు
నన్ను నుద్దేశించి పలుకంబడినయవి గాఁ దలంచెదఁ దన కొకానొకయాపద
వచ్చినప్పుడైనను వందనీయుం డగుతండ్రిని బ్రాణభూతుం డైనభ్రాత నెవ్వి
ధంబున వధియింప వచ్చు నని పలికి వెండియు నిట్లనియె. 1854
తే. అనఘ దైవకృతంబున నైనపనికి, ధర్మమార్గంబు విడిచి సత్కర్ము లైన
తల్లిదండ్రుల భ్రాతల దారుణముగఁ,దునిమి జననిందలను బొంది మనుట మేలె.
తే. కడఁగి రాజ్యంబుఁ గోరి యీగతి ననర్థ, మివ్విధంబున బోధింతువేని నీకు
సుగుణవంతుని భరతునిఁజూచినంత, నంతయును రాజ్యమితని కిమ్మనెదనయ్య.
చ. అనుపమలీల నేలు మిలయంతయుఁ దమ్ముఁడ యంచుఁ బ్రీతి న
య్యనఘుఁడు గ్రమ్మఱ న్భరతుఁ డంఘ్రులపైఁ బడి రామభద్ర మా
కనిశము రాజు వీఁడె సిరి యంతయుఁ గైకొనుఁగాక యంచుఁ దాఁ
బనివడి పెక్కుచందములఁ బల్కునొ పల్కఁడొ చూచు చుండుమీ. 1857
వ. అని యిట్లు ధర్మశీలుం డగురాముండు పలికిన విని లక్ష్మణుండు లజ్జాతిశయం
బువలన నత్యంతసంకుచితగాత్రుం డై భ్రాతృవత్సలుండు గావునఁ గేలుదోయి
ఫాలంబునం గీలించి దేవా భవదీయచిత్తంబుకొలంది నవధరింతువు గాక
భరతుం డొక్కరుండె గాఁడు మజ్జనకుండైన దశరథుండును జనుదెంచు చున్న

వాఁ డని తోఁచు చున్న దనినఁ గౌసల్యానందనుండు వెండియు సౌమిత్రిం
జూచి పరభావజ్ఞుండు గావున నితండు ప్రీణితుం డై ప్రసంగాంతరంబుఁ బ్రస్తా
వించు చున్నవాఁ డని నిశ్చయించి యౌచిత్యంబున లక్ష్మణకృతప్రస్తావంబు నె
వి స్తరించుచు ని ట్లనియె. 1858

సీ. అనఘాత్మ జనకసమాగమం బది మన కరయ నత్యానందకరము గాదె
మనల వీక్షింపనో మనకష్టముఁ దలంచి మరల నయోధ్యకు మనలఁ దోడు
కొని పోవుటకొ లేక కోడలిదురవస్థ చింతించి కడు సుఖసేవిని యని
ప్రోలికిఁ దోడ్కొని పోవుటకో వచ్చు చున్నవాఁ డవిగో మహోన్నతములు

తే. పవనతుల్యవేగంబులు జవయుతములు, గోత్రవంతంబు లై నట్టిఘోటకములు
రెండు శత్రుంజయాఖ్యవేదండ మొకటి, మ్రోలఁ జూపట్టుచున్నది పోలఁ గంటె.

తే. మూఁగి చనుదెంచు చున్న యామూఁకనడుమ
భూతసత్కృత మగుపాండురాతపత్ర
మిపుడు తోఁపనికతమున నృపునిరాక
యందు సందియ మయ్యెడి ననఘచరిత. 1860

వ. అని పలికి రాముండు శంకాకళంకితస్వాంతుం డై నిరీక్షించు చుండ భ్రాతృ
సేవాయత్తచిత్తుం డై నలక్ష్మణుండు రామునిచేత నాజ్ఞప్తుం డై సాలంబు డిగ్గి
కృతాంజలిపుటుం డై పార్శ్వభాగంబునం గొలిచి యుండె నంత భరతుండు
సైన్యంబుల నమ్మహీధరపార్శ్వంబుల విడియ నియమించిన గజవాజిరథా
కులం బై నతత్సైన్యం బప్పర్వతప్రాంతంబున సార్ధయోజనమాత్రప్రదేశం బా
క్రమించి నివాసంబుఁ గావించె నిట్లు నీతిమంతుం డై నభరతుండు రఘునందన
ప్రసాదనార్థం బరుగుదెంచి ధర్మంబు పురస్కరించి సేనాసన్నివేశంబుఁ గావించి
దర్పంబు పరిహరించి పాదచారి యై యరిగి గురువచనానుష్ఠానపరుం డైన
రాముని సందర్శింతుం గాక యని నిశ్చయించి శత్రుఘ్ను నవలోకించి యి
ట్లనియె. 1861

శా. నీ వాలుబ్ధులఁ గూడి రామవిభు నన్వేషింపఁగా నేగు మీ
త్రోవ న్వెంట గుహుండు జ్ఞాతియుతుఁ డై తోడ్తోడ నేతెంచెడుం
బ్రావీణ్యంబున మంత్రిభృత్యగురుపౌరవ్రాతముం గూడి యే
నీవంక న్జనుదెంతు రామచరణప్రేక్షాసమాపేక్షతన్. 1862

ఆ. ఎంతలోన రాము నెంతలో లక్ష్మణు, నెంతలోన సీత నిపుడు కనుల
కఱవు దీఱఁ జూడఁగాఁ జాల నంతలోఁ, జిత్తమునకు శాంతి చెల్ల దనఘ.

తే. ఇందుసంకాశ మరుణారవిందనేత్ర, మగురఘూత్తముఘనసుందరాస్య మెంత
లో విలోకింపలే నంతలోన నామ,నంబునకు శాంతి గలుగ దనర్ఘశీల 1864

తే. అనఘ రామునిపార్థివవ్యంజనాన్వి, తము లగుపదంబు లెంతలో విమలభక్తి

నొదల ఘటింపఁగాఁజాలనంతలోనఁ, గలుషచిత్తంబునకుశాంతిగలుగ దిపుడు.

తే. ఇష్టరాజ్యార్హుఁడగురాముఁడెంతలోన, రుచిరసింహాసనమునఁ గూర్చుండి సదభి
షేకపుమ్మక్కరక్లిన్నుండు గాకయుండు,నంతలో శాంతి గలుగునే యనఘ నాకు.

ఉ. తామరసేక్షణంబు శుభదంష్ట్రము సుందరనాసము న్సుధా
ధామనిభంబు హాసకలితంబు కృపారసయుక్తమైన శ్రీ
రాముని నెమ్మొగంబు మది రంజిల నిచ్చలు చూచుచు న్యశో
ధాముఁడు లక్ష్మణుండు సుకృతవ్రతుఁ డయ్యెఁ గ దయ్య తమ్ముఁడా. 1867

క. జలనిధిముద్రితధాత్రీ, తలమున కధినాథుఁ డనఁగఁ దగు నిజభర్త్రం
బలుదెఱఁగుల సేవించుచు, నలజనకకుమారి ధన్య యయ్యెం గాదే. 1868

క. నందనమునందు ధనదుని, చందంబున నెందు రామచంద్రుఁ డమందా
నందమున నుండు నగ్గిరి, మందరగిరికంటె నుత్తమం బగుఁ గాదే. 1869

ఆ. శస్త్రభృద్వరుండు సవితృప్రతాపుండు, రాముఁ డేవనమున రమణిఁ గూడి
సంతతంబుఁ గ్రీడ సల్పుచు నివసించె, నదియు నతిపవిత్ర మయ్యెఁ గాదె.

భరతుండు పాదచారి యై శ్రీరామాశ్రమంబుఁ గనుంగొనఁ బోవుట.

వ. అని యివ్విధంబున బహువిధాలాపంబులు పలుకుచు మహాతేజుం డగుభర తుండు మహారణ్యంబుఁ బ్రవేశించి పుష్పితాగ్రంబు లైనగిరిసానుసంజాత ద్రుమమండంబు లవలోకించుచుఁ దన్మధ్యంబునం జని చని పుష్పితం బైనచిత్ర కూటసాలంబు డగ్గఱి తత్సమీపంబునం బొల్చురామాశ్రమగతం బైన వహ్నిధ్వజంబు విలోకించి యచ్చట రాముండు వసియించి యున్నవాఁ డని యెఱింగి జలపారంబు నొందినవాని తెఱంగున సంతోషవిశేషంబునం బొద లుచు శత్రుఘ్నునిం జూచి పుణ్యజనోపపన్నం బైనరామాశ్రమం బల్లదే యని శత్రుఘ్నునకుం జూపుచు మాతృవర్గంబునుం దోడ్కొని రమ్మని వసిష్ఠు నకుం జెప్పి తాను గుహసహితంబుగాఁ బురోభాగంబున శీఘ్రంబునం బోవు చుండె సుమంత్రుండు రామదర్శనకృతాభిలాషుం డై శత్రుఘ్నసహితంబుగా నరుగు చుండె నిట్లు ద్యుతిమంతుం డగుభరతుండు సత్వరంబుగాఁ బోవుచుఁ బురోభాగంబున నాశ్రమసమీపవర్తిచిహ్నంబులు విలోకించి శత్రుఘ్నున కి ట్లనియె. 1871

క. ముదితుఁ డయి భరద్వాజుఁడు, సదయత నెఱిఁగించినట్టి శైలోత్తమం
బిదె దీని డాసితిమి కద, యదె సుమి మందాకినీమహానది వత్సా. 1872

వ. అని శత్రుఘ్నున కచ్చటివిశేషంబు లెఱింగించుచుం జని చని యవ్వల నొక్కింత దూరంబునఁ దాపసాలయసదృశం బైనవహ్న్యగారభూతపర్ణ శాలయు బహిస్సుఖావస్థానార్థం బుపకల్పితం బైనయాశ్రమంబును విలో

కించి తత్పరిసరంబున నవభగ్నంబు లైనకాష్ఠంబును సంపాదితంబు లైన
పుష్పంబులు నందంద మార్గపరిజ్ఞానార్థంబు కుశవల్కలంబులచేత రచింపం
బడినయజ్ఞానంబును సీతకారణంబువలన మృగమహిషకరీషంబులచేత నిర్మిం
పంబడినబహుసంచయంబులును సర్వంబునుం జూచి వెండియు శత్రుఘ్నున
కి ట్లనియె. 1873.

చ. ముదమున లక్ష్మణుండు ఫలము ల్గొని కాననసీమ నుండి తాఁ
బదపడి యాశ్రమంబునకుఁ బాయక వచ్చుటకై పథంబునన్
సిదిలముగాక యుండ విరచించినగుర్తుల గంటె నీతికో
విద జగతీరుహాగ్రముల వ్రేలఁగఁ గట్టిననారచీరలన్. 1874

చ. మొనసి నగంబుక్రేవఁ జలము న్బలముం జెలువార ఘోరకా
ననగజము ల్మదంబున ఘనంబులకై వడి నింగి బృంహిత
ధ్వనులు సెలంగ నొండొకటిఁ దాఁకి సముద్ధతిఁ బోరిపోరి న
ల్లనిమలలట్లు బిట్టలసి క్రాలుచు నున్నవి కంటె ముంగలన్. 1875

ఉ. కాననమందుఁ దాపసు లకల్మషభక్తి ననారతంబు నె
ద్దాని భజించి బ్రహ్మగతిఁ దారు దగం జరియింతు రాబృహ
ద్భానుని ధూమరాజి యదె భాసిలుచున్నది యందు జానకీ
జానిని బుణ్యమూర్తి నలసంయమినిం బలె నేఁడు చూచెదన్. 1876

వ. అని పలికి ముహూర్తమాత్రంబునకు మందాకినీనదిం గడచి యనుచరులం
జూచి యిట్లనియె. 1877

మ. క్షితి నెవ్వాఁడు సమస్తరాజ్యపదవీసింహాసనాధ్యక్షుఁడై
సతతం బేలఁగఁ జాలు నట్టివిభుఁ డీసౌమ్యుండు రాముండు మ
త్కృతమం దీదురవస్థ నొంది సుఖముం గ్రేడించి ఘోరాటవీ
క్షితిలో నొంటిగ నున్నవాఁ డకట ఛీ జీవంబు నా కేటికిన్. 1878

క. పలుగతుల నిపుడు తత్పదములకు న్సీతాంఘ్రియుగ్మమునకుం బడి త
ద్విలసత్కృప నొందెదఁ గొం, దలపడక పునఃపునఃప్రణామంబులచేన్. 1879

భరతుండు రామాశ్రమంబుఁ గనుంగొనుట.

వ. అని యిట్లు విలపించుచుఁ గైకేయీనందనుండు నిజాగ్రభాగంబున సాలతా
లాశ్వకర్ణపర్ణసమాచ్ఛాది యగుదాని శక్రాయుధనీకాశభారసాధనమహాకార్ము
కంబులచేత సమాకీర్ణ యగుదాని శత్రుబాధకమహాసారరుక్మపృష్ఠదీప్తవదన
భానురశ్మిప్రతీకాశతూణీరగతఘోరసాయకాలంకృత యగుదాని సువర్ణనిర్మి
తకోశశోభిత యగుదాని రుక్మబిందువిచిత్రఫలకరాజిత యగుదానిఁ గాంచన
భూషణవిచిత్రగోధాంగుళిత్రమండిత యగుదాని సింహాధిష్ఠిత యైన పర్వత
గుహ మృగంబులచేతం బోలె నరాతులచేత నప్రధృష్య యగుదానిఁ గాఢోద

రంబులచేత భోగవతియుం బోలె నిశితనారాచంబులచేత నభిరామ యగుదాని మృదుకుశంబులచేత యజ్ఞాయతనంబునుం బోలె నావృత యగుదాని విశాల యగుదాని మనోరమ యగుదానిఁ బర్ణశాలం జూచి యందు నీశాన్యభాగ క్రమనిమ్నయై దీప్తపావక యగు వెదిక నవలోకించి తన్మధ్య దేశంబున. 1880

భరతుండు దూరమున రామునిం గనుంగొనుట.

క. నిరుపమగుణనిధి భరతుం, డురువిక్రమధనుని ఘనుని నుటజాసీనున్
గురుని జటాధరుని జితా, సురుని రఘూత్తమునిఁ గాంచెసుముహూర్తమునన్.

సీ. ఇందీవరశ్యాము నందితసుత్రాము ధవళాంశువదను సౌందర్యసదను
దీప్తతేజోలాభు దేవాధిరాజాభు సరసీరుహాక్షు విశాలవక్షు
వల్కలాజినవాసు వరసుగుణోల్లాసుఁ గాంచనాచలధీరు ఘనగభీరుఁ
జటులసింహస్కంధు శౌర్యజితస్కందు మాసినదేహు నాజానుబాహు

తే. లక్ష్మణోపేతు సీతాభిరాముఁ బద్మ, యోనిచందాన నాసీనుఁ డైనవాని
రాము నీక్షించి భరతుఁ డలంఘనీయ, శోకవార్ధిమునింగిసంక్షుభితుఁ డగుచు.

క. పలుగతుల నార్తరవమున, విలపించుచు భ్రాతృమోహవివశుం డై క
న్నుల నశ్రు లొలుక మనమునఁ,దలఁకుచు నిట్లనియెఁ జాలధైర్యము వాయన్.

తే. అనుదినము ప్రజచే నెవ్వఁ డభినుతింపఁ
బడియె నట్టి శ్రీరాముఁడు భయదవన్య
దుష్టమృగములచేఁ జాల దుష్ప్రవేశ
వని నుపాసితుఁ డై యున్నవాఁడు నేఁడు. 1884

సీ. రమణీయచీనాంబరములు ధరించువాఁ డీచీరవల్కల మెట్లు దాల్చె
విమలవిచిత్రమాల్యములు వహించువాఁ డీజటామండల మెట్లు దాల్చె
మహితచందనకర్దమంబు మై మెత్తువాఁ డీధరిత్రీరజ మెట్లు మెత్తె
నెండ కన్నెఱుఁగక యింట వసించువాఁ డీఘోరవనవాస మెట్లొనర్చె

తే. సతిసుఖోచితుఁ డగురాముఁడకట మన్నిమిత్తమున నిట్లు దురవస్థ మెలఁగవలసె
నీచమతి నైననాకు నిందితము లైన, జీవితము లేల ఛీ యెంత చెట్ట నైతి.

తే. జగతి నెవనికి ధర్మసంచయము సముచి, తాధ్వరంబులచే యుక్తమయ్యె నట్టి
పుణ్యుఁడు శరీరదుఃఖసంభూత మైన, ధర్మమొనరించుచున్నాఁడుధైర్యమూఁది.

భరతశత్రుఘ్నులు రామునిపాదములపైఁ బడుట.

క. అని యీగతి విలపించుచుఁ, గనుఁగవలను దుఃఖబాష్పకణము లొలుక రో
దన మొనరించుచుఁ దగ రా, ముని దివ్యాంఘ్రులసమీపమునవ్రాలె వెసన్.

క. ఈరీతి వ్రాలి భరతుం, డారామునిఁ జూచి యార్య యని యొకమాటు
చ్చారణముఁ జేసి శోకవి, చారంబున మరలఁ బలుకఁజాలక యుండెన్. 1888

క. పదపడి శత్రుఘ్నుఁడు ద, త్పదముల కెఱఁగుటయుఁ జూచి దారుణశోకం
బెద నెదుగ రాఘవుఁడు వా,రి దయామతి నాదరించి ప్రియ మలరారన్.

వ. శీఘ్రంబునం గ్రుచ్చి యెత్తి గాఢాలింగనంబు గావించి కన్నీరు నించె నంత సుమంత్రుండును గుహుండును పొడసూపిన నారామలక్ష్మణులు వారలంగూడి గగనంబునందు శుక్రబృహస్పతులతోడం గూడినదివాకరనిశాకరులచందంబునం దేజరిల్లె నిత్తెఱంగునం గూడుకొనినవారణయూథపసన్నిభు లయిన యారాజనందనుల నల్వురం జూచి యచ్చటివనచరు లందఱు హర్షంబువిడిచి కన్నీరు నించు చుండి రనంతరంబ యుగాంతకాలంబున ధరణిపయిం బడిన భాస్కరునిచందంబునఁ దనచరణంబులపయిం బడి బద్ధాంజలి యై బహువిధ శోకాలాపంబుల విలపించు చున్నవాని జటాజినవల్కలధరుం డగువాని నుపవాసకృశుం డగువాని వివర్ణవదనుం డగువాని భరతునిం జూచి యతని నతిప్రయత్నంబున భరతునిఁ గా నెఱింగి రామభద్రుండు నిజకరంబుల నతనిం గ్రుచ్చి యెత్తి శిరంబు మూర్కొని కొండొకసేపు గాఢంబుగాఁ బరిష్వజించి పదంపడి నిజోత్సంగంబున నునిచికొని యతిదుఃఖితుం డై నయతనిదుఃఖం బపనయించుటకుఁ బ్రశ్నవ్యాజంబున ధర్మంబు లుపదేశించుచు నిట్లనియె. 1890

రాముఁడు భరతునిఁ గూర్చి ధర్మప్రశ్నములు సేయుట.

ఉ. ఎచ్చట నున్నవాఁడు కడు వృద్ధుఁడు మజ్జనకుండు నేఁడు నీ
విచ్చటి కేల వచ్చితి వహీనగుణాఢ్య నృపాలు నొంటిగా
నచ్చట డించి మీ రిరువు రక్కట యీగతి రాఁ బొసంగునే
యచ్చట నెవ్వ రింకఁ గల రవ్విభుఁ బ్రోచెడువారు చెప్పుమా. 1891

తే. దూరమున నుండి వచ్చినవారి మిమ్ముఁ
గార్శ్యమాలిన్యవైవర్ణ్యకములచేతఁ
బరమదుర్జ్ఞేయగాత్రులఁ బరఁగఁ బెద్ద
కాలమున కిందుఁ బొడగంటిఁ జాల నరిది. 1892

క. విను మీ విచటికి వచ్చినఁ, దనువునఁ బ్రాణంబు లెట్లు తాల్పఁ గలం డా
జనపతి కడు దీనుం డై, మునుకొని తత్క్షణమె నాకమునకుం జనఁడే. 1893

క. నరసాత్త్విక మజ్జనకుఁ డ,మరపతిసదృశుండు వీట మని యున్నాఁడో
పరువడి లోకాంతరమున, కరిగెనొ నీ వేల వచ్చి తడవికిఁ జెపుమా. 1894

తే. అనఘచారిత్ర బాలుండ వౌట నీదు
శాశ్వతం బైనరాజ్యంబు జనపదంబు
సర్వము నశింప కున్నదె సత్యరతునిఁ
దండ్రి సేవింతువే నీవు ధర్మయుక్తి. 1895

ఆ. రాజధర్మవిదుఁడు రాజసూయాశ్వమే,ధాదియాగకర్త యనఘమూర్తి

సత్యసంగరుండు జనకుండు కుశలియై, యున్నవాఁడె సుఖముఁ గన్నవాఁ

క. జనకుని సేవింతువె నీ, వనిశముఁ గులగురునిఁ బుణ్యు హరినిభ తేజు
ష్షనకీర్తిని విద్వాంసుని, మునినాథు వసిష్ఠు నెపుడుఁ బూజింపుదువే.

తే. అనఘ కౌసల్య సుఖినియె యలసుమిత్ర
సేమమున నున్నదే పుణ్యశీల సాధ్వి
కైక యానందభరితయే కడమతల్లు
లొప్పు మీఱఁ గుశలినులై యున్నవారె.

క. అనసూయుఁ డనుద్రష్టయు, ననయుఁడు గులసుతుఁడు వినయసంపన్నుండు
ఘనుఁడు బహుశ్రుతుఁడు ఋజుం, డనఘ సుయజ్ఞుండు సత్కృతాత్ముం డగ

క. అతఁడు మతిమంతుఁ డయి సం, తతమును వేదోక్తఘనశితిఁ దప్పక వహ్ని
త్రితయమున హోష్యమాణము, హుతమును గాలమున నీకు నురుమతిఁ జెప్ప

క. దేవబ్రాహ్మణవృద్ధుల, వావిరిఁ బితృభృత్యమంత్రివైద్యుల గురుల
న్భావించుచు భయభక్తుల, సేవింతువె సంతతంబుఁ జిరశుభలీలన్. 1

తే. అనఘ యిష్వస్త్రసంపన్ను నర్థశాస్త్ర
కోవిదుని హితకరుఁ గృతజ్ఞుని సుధన్వుఁ
గాస్మకాచార్యు సవినయగౌరవమున
నమితభయభక్తిఁ బూజింతె యనుదినంబు. 19

క. శ్రుతవంతు లాత్మసము లిం, గితజ్ఞులును శూరులును సుశ్రుతులు కులీనుల్
జితకరణులు నగుమంత్రుల, సతతము మన్నింతె నీవు సజ్జనతిలకా. 19

వ. మఱియు నీతిశాస్త్రనిపుణులును మంత్రధరులు నగుమంత్రులచేత సుస
వృతం బైనమంత్రంబు రాజులకు విజయమూలంబు గదా యని పలికి వెండియ
ని ట్లనియె. 19

క. కాలంబున నిద్రించుచుఁ, గాలంబున మేలుకొనుచు ఘనబుద్ధి నిశా
కాలంబునందు నిత్యం, బాలోచింపుదువె నిశ్చలార్థనిపుణతన్. 19

క. నిక్కము మంత్రితమంత్రం, బక్కజముగ గుప్త మగునె యమ్మంత్రంబుల్
బెక్కండ్రతోడ మఱి నీ, వొక్కండవు సేయఁ దగ దయుక్తం బనఘా. 190

క. హితమతు లగుమితజనసం, యుతముగ లఘుమూలమును మహోదయమునుగా
మతి నిశ్చయించి కార్యం, బతిరయమునఁ జేయుదే మహాగుణశాలీ. 190

వ. మఱియు సామంతమహీపతులు శీఘ్రంబున ఫలోన్ముఖంబులయిన కార్యంబులున
జేయం దలంచిన కార్యంబులు నెఱుంగక నిష్పన్నంబు లైన కార్యంబు లె ఱె
ఱుంగునట్లుగా మంత్రగోపనంబు గావించి సర్వకార్యంబులు నడుపుదువే మంత్రు
లచేతం గాని నీచేతం గాని సుమంత్రితం బైనమంత్రంబులను బరులు తర్కయుక్తు
చేత నింగితాదులచేత నెఱుంగకుందురు గదా మూర్ఖజనసహస్రంబుకంటె

బండితుండైనవాని నొక్కనిం బరిగ్రహించిన నతండు మహీపతి కర్థసంకటంబులయందు మహైశ్వర్యంబు గావించు మూర్ఖు లగువారిం బదివేలజనంబుల నుపాసించిన నించుక యైనసాహాయ్యంబు లేదు మేధావియు శూరుండును దక్షుండును నీతిశాస్త్రవిచక్షణుం డగునమాత్యుం డొక్కరుం డైనమహీపతిని గాని దత్సమానునిగాని లక్ష్మీసంపన్నుం జేయు నన్నికార్యంబులందు నట్టియుత్తమగుణసంపన్నునిం జేర్పం దగ దుత్తమకర్మంబులం దుత్తముని మధ్యమకర్మంబులయందు మధ్యముని జఘన్యకర్మంబునందు జఘన్యుని నియోగింప వలయు మఱియు సుపరీక్షితు లగువారి నమాత్యులం గులక్రమాగతులం గరణత్రయశుద్ధియుక్తుల గుణశ్రేష్ఠుల శ్రేష్ఠకర్మంబులందు నియోగింపవలయు నిట్లుక్తప్రకారంబునం గావింపుదువె యని పలికి వెండియు ని ట్లనియె. 1908

తే. అనఘ మంత్రులు ప్రీతి ని న్ననుదినంబు
తీవ్రదండంబుచే సము ద్వేజితప్ర
జంబు గాకుండఁ బూజ్యరాజ్యంబుఁ బ్రోచు
వానిఁ గాఁ జేయుదురె నీతివరునఁ దెలిపి. 1909

వ. మఱియు దుర్దానంబున ధనం బుపార్జించి యాగంబు సేయ నుపక్రమించిన పతితుని యాజకులు వర్జించినచందంబున బలాత్కారంబునం బరిగ్రహింపం దలంచినకాముకునిం గాంతలు పరిత్యజించినక్రైవడి నుగ్రదండోపాయంబున నదండ్యు లగువారివలన ధనగ్రహణంబు సేయునిన్ను విలోకించి ప్రజలు పరిత్యజింపక యనురక్తు లై యుందురు గదా యని పలికి క్రమ్మఱ ని ట్లనియె.

తే. పార్థివనయజ్ఞు సామాద్యుపాయకుశలు
వైద్యుని గృతఘ్ను శూరు నైశ్వర్యకాము
నాప్తవిఘటనరతు నేధరాధిపతి వ
ధింపఁ డాతని కాపదఁ దెచ్చు నతఁడు. 1911

క. యుక్తుని భృశానురక్తుని, శక్తుని శూరునిఁ గులీను సదుపాయసమా
యుక్తుని మతిమంతుని వర, భక్తునిఁ గావింతె నీవు బలపతి గాఁగన్. 1912

క. బలవంతులు ముఖ్యులు పర, బలార్దనులు జన్యవిదులు భక్తులు విక్రాం
తులు నైనదండనాథుల, నలఘుగుణా సత్కరించి యలరుదె ప్రీతిన్. 1913

సీ. తఱి వచ్చినపుడు భూవరుఁడు బలంబున కన్నంబు వేతన మర్హభంగిఁ
బుష్కలంబుగ నిడఁబోలు లోభంబున నొసఁగక మత్తుఁ డై యుండెనేని
వానిపైఁ గోపించి వారు దూషింతురు దాన భూపతి కనర్థంబు గలుగుఁ
గాలయాపన మీవు గావింప కిడుదువే వీరుల కన్నంబు వేతనంబు
తే. జ్ఞాతులు ప్రధానులును భృత్యజనులు దండ,నాథు లనురక్తులై ప్రధనంబులందు
వీఁక భవదర్థమందు జీవితము నైన, విడువఁ దలకొని యుందురే వీరవర్య.

తే. శక్తుఁడు విచక్షణుండు యథోక్తకారి
పండితుఁడు బుద్ధినిధి జనపదభవుండు
ఘనుఁడు ప్రతిభానవంతుం డకల్మషుండు
నైనచారుండు సత్కృతుం డగునె యయ్య. 1915

వ. మఱియుఁ బరపక్షంబులందు మంత్రియువరాజపురోహితసేనాపతిదౌవారికాంతర్వంశికకారాగారాధికృతార్థసంచయకృత్కార్యాకార్యనియోజకప్రాడ్వివాకసేనానాయకనగరాధ్యక్షకర్మాంతికసభ్యధర్మాధ్యక్షదండపాలదుర్గపాలరాష్ట్రాంతపాలకాఖ్యలం గలయష్టాదశతీర్థంబులను స్వపక్షంబునందు మంత్రిపురోహితయువరాజులుం దక్కఁ దక్కినపంచదశతీర్థంబులను బరస్పరావిజ్ఞాతులైనమువ్వురు మువ్వురు చారకులచేత వేర్వేఱ నెఱుంగవలయు మఱియు వ్యపాస్తపునరాగతు లయినశత్రువుల దుర్బలులఁ గా నెంచకవర్తింపవలయుఁ జార్వాకులగుబ్రాహ్మణుల సేవింపం దగదు వారు బాలిశులై పండితాభిమానులై యనర్థసంపాదనచతురులై వేదమార్గవిపరీతబుద్ధులై శుష్కతర్కవిషయబుద్ధి నధిగమించి నిరర్థకంబులైనపూర్వపక్షయుక్తులను సిద్ధాంతోక్తులఁ గా నుపన్యసించుచుందు రట్టివారి నేర్పఱించి పరిత్యజింపవలయు నని పలికి వెండియు ని ట్లనియె. 1916

సీ. రవితేజ మత్కులోద్భవపూర్వనృపులచే ననిశంబు రక్షితం బైనదాని
ఘనవీరభటశతాంగకదంబగంధేభహయసంకులద్వార మైనదాని
నిజకర్మనిరతావనీసురక్షత్రియవైశ్యశూద్రులచేత వఱలుదాని
బహువిధకాంచనప్రాకారహర్మ్యవిమానవిరాజితం బైనదాని
తే. ననవరత మార్యసేవితం బైనదాని
ధన్య మగుదాని మనయయోధ్యాపురమును
సత్యనామంబుగాఁ జేసి సంతతంబుఁ
బ్రీతిఁ బాలింపుదువె నీవు నీతిశీల. 1917

వ. మఱియుఁ జైత్యశతజుష్టంబును సుఖోపనివిష్టజనాకులంబును దేవస్థానపానీయశాలాతటాకోపశోభితంబును బ్రహృష్టనరనారీసంయుతంబును సమాజోత్సవశోభితంబును సుకృష్టసీమాంతంబును బశుమంతంబును హింసాభివర్జితంబును నదీమాతృకంబును రమ్యంబును శ్వాపదపరివర్జితంబునుసర్వభయపరిత్యక్తంబును రత్నసువర్ణరజతాద్యాకరసంపన్నంబును బాపనరవిహీనంబును బూర్వరాజాభిరక్షితంబును నగుజనపదంబు సుఖం బున్నదె కృషివాణిజ్యగోరక్షజీవులగువైశ్యాదులు సకలార్థసంపాదనంబుననభిమతులై క్రయవిక్రయాత్మకవాణిజ్యరతు లగుచు నుండ నాశ్రితలోకం బంతయు సుఖంబు

నొందు చున్నదె మఱియు నావణిజుల కిష్టప్రాపణానిష్టనివారణంబులచేత భర
ణంబుఁ గావింపుదువే యని పలికి వెండియు ని ట్లనియె. 1918

క. రక్షకులు లేనివారల, రక్షింతువె నృపతి నాత్మరాష్ట్రనిలయులన్
రక్షింప వలయు నెప్పుడు, దక్షత నిజవంశయోగ్యధర్మముకలిమిన్. 1919

వ. వత్సా నీవు స్వస్త్రీలయం దనుకూలుండ వై వారల కన్యపురుషసంభాషణాది
దోషంబులు లేకుండ రక్షించుచు వారలవచనంబు యథార్థబుద్ధి నాకర్ణింపక
వారితోడ రహస్యంబు లాడక వర్తింపుదువే యని పలికి వెండియు ని ట్లనియె.

క. అనఘా గజములు వొడమెడు, వనములఁ బ్రోతువె కరేణు వాజిగజములన్
మునుకొని రక్షింపుదువే, యనవరత ముపార్జనంబునందుఁ దనియకన్. 1921

ఉ. ప్రొద్దున లేచి దివ్యమణిభూషణము ల్త్రయినింపఁ దాల్చి బ
ల్లద్దియమీఁద నుండుచు జగజ్జనలోచనపూర్ణపర్వ మై
తద్దయు నీప్రజాతతికి దర్శన మిత్తువె నాదు భక్తితోఁ
బెద్దయుఁ బ్రొద్దు నిన్గొలిచి పిమ్మటఁ బోదురె నిత్య మింద్రకున్. 1922

వ. మఱియు విష్టిప్రభృతినీచకర్మకరులు నిశ్శంకు లై మహీపతియొద్దకుఁ బ్రత్య
క్షంబుగాఁ జనుదెంచి రేని యవజ్ఞాధిక్యంబు సంభవించు దర్శనాభావంబువలనఁ
గార్యహాని యగు నీమార్గంబునందు యథోచితసమయనిరీక్షణప్రదానంబు
ప్రయోజకం బై యుండు నట్లు గావించెదవే యని పలికి వెండియు. 1923

తే. రాజనందన సర్వదుర్గములు రత్న, ధాన్యధనయంత్రసలిలాయుధములచేత
శిల్పికార్ముకపాణులచేత సంతతంబును బరిపూర్ణంబు లై తనరు నయ్య.

తే. అనఘ విస్తార మగునె ధనాగమంబు
వ్యయము కడుఁ గొంచె మగునె యపాత్రభూత
జనుల కెంతయు నీదుకోశంబు చేర
కుండునే భృత్యులు సుఖు లై యున్నవారె. 1925

తే. వీరవర్య యభ్యాగతవిప్రులందు
దేవతాపితృదేవతాతిథులయందు
సాధుజనులందు సఖులందు యోధులందు
ద్రవిణవినియోగ మొనరింతె ధర్మఫణితి 1926

వ. మఱియు విశుద్ధస్వభావుండును గరణత్రయశుద్ధియుక్తుండును సజ్జనుండు యదృ
చ్ఛచేతఁ జోరుం డని పట్టువడి శాస్త్రజ్ఞులచే నశోధితుం డై ధనలౌల్యంబున
వధింపంబడ కుండునె మఱియుఁ గాలంబున సందృష్టుఁ డై గృహీతుం డై పృ
ష్టుం డై చౌర్యలబ్ధద్రవ్యసహితుం డైనచోరుండు ధనలోభంబున విముక్తుం
డు గాకుండుఁ గదా యని పలికి వెండియు. 1927

తే. అనఘ ధనవంతునకు దరిద్రునకు నొకవివాదరూపసంకట మది వచ్చినపుడు

వీతధనలోభు లై పక్షపాత ముడిగి, సత్యమాడుదు రే నీదుసచివు లనఘ.

తే. అనఘ మిథ్యాభిశస్తులయశ్రుకణము, లవని రాలిన నవియు భోగార్థ ముర్వి
పాలనము సేయునరపతిపశుకళత్ర, మిత్రపుత్రుల హింసించు మిథ్య గాదు.

సీ. అలబాలవృద్ధవైద్యులను బూజింతువె తపముక వాఙ్మనోదానములను
గురువుల వృద్ధుల సురలఁ జైత్యంబుల నతిథుల సిద్ధార్థు లైనవిప్ర
వరులను మానులఁ బరికించి నిత్యంబు గురుతరభక్తి మ్రొక్కుదువె నీవు
ధర్మ మర్థంబుచే ధర్మంబుచే నర్థ మవి రెండు నిఖిలభోగాభికాంక్షఁ

తే. గామమునఁ జాలఁ జెడ్పాటుగాక యుండఁ, గాతువే మఱి ధర్మార్థకామములన
వేఱు వేఱ విభాగించి వీరవర్య, కడమ పడకుండ సేవింతె కాలమందు. 193(

తే. అఖిలశాస్త్రార్థకోవిదు లైనద్విజులు, పాడి దప్పక నిత్యంబుఁ బౌరజాన
పదులతోఁ గూడి నీకు శుభంబు గలుగు, నట్లు ప్రార్థింతు రే నిత్య మనఘచరిత.

వ. మఱియు నాస్తిక్యంబును ననృతంబును గ్రోధంబును ననవధానత్వంబును దీర్ఘసూత్రత్వంబునుసాధుజనాదర్శనంబును నాలస్యంబును బంచేంద్రియపరవశత్వంబును బ్రయోజనంబుల నేకచింతనంబును విపరీతార్థబోధకులతోడ మంత్రణంబును నిశ్చితార్థంబులం దనారంభంబును మంత్రంబు రక్షింపకుండుటయు మంగళంబు లనుష్ఠింప కుండుటయు సర్వదిగవస్థితశత్రురాజుల నుద్దేశించి యేకకాలంబున దండయాత్ర సలుపుటయు నివి పదునాల్గు రాజదోషంబులు మహీపతి వీని నన్నిటిని వర్జింప వలయు మఱియు లోభ క్రోధాలస్యానత్య ప్రమాద భీరుత్వాస్థిరత్వ మూఢత్వావ యావమంతృత్వ రూపదశవర్గంబును మృగయా ద్యూత దివాస్వప్నపరివాద స్త్రీ మద నృత్తగీత వాద్య వృథాపర్యటనంబు లనియెడుదశకామజగుణంబులును సాపత్న్యవస్తుజస్త్రీజ వాగ్జా తాపరాధజంబు లనియెడుపంచవిధవైరంబులును నౌదకపార్వతవార్క్షైరిణ ధాన్వనంబు లనియెడుపంచవిధదుర్గంబులును సామ దాన భేద దండంబు లనియెడుచతురుపాయంబులును నౌరసతంతుసంబంధ వంశక్రమాగత వ్యసనరక్షితు లనియెడుచతుర్విధమిత్రంబులును న్యాయధనార్జన రక్షణ వర్ధన సత్పాత్రప్రతిపత్తు లనెడుచతుర్విధరాజవృత్తంబులును స్వామ్యమాత్యరాష్ట్రదుర్గకోశబలసుహృత్సంజ్ఞలం గలపరస్పరోపకారిసప్తాంగంబులును నిజ మైత్ర సమాశ్రిత సుబంధుజ కార్యసముద్భవ భృత్య గృహీత నామకంబు లగు సప్తవిధపక్షంబులును శ్యేన సూచి గరుడ శకట మకర క్రౌంచ పద్మంబు లనియెడుసప్తవిధప్రధానవ్యూహంబులును గృషి వాణిజ్య దుర్గ సేతు కుంజర బంధన ఖన్యాకర కరాదాన శూన్యనివేశనంబు లనియెడునష్టవర్గంబులును పైశున్య సాహసద్రోహేర్ష్యాసూయార్థదూషణవాక్పారుష్యదండపారుష్యం

బు లనియెడి క్రోధజనితాష్టగుణంబులునునసాధ్యవస్తువులయందుసముద్యమంబును సాధ్యవస్తువులయం దసముద్యమంబును శక్యవస్తువిషయంబునం దకాలసముద్యమంబు ననియెడివ్యసనత్రయంబును ధర్మార్థకామంబు లనియెడిత్రివర్గంబును బ్రభుత్వమంత్రోత్సాహనామకశక్తిత్రయంబునుశత్రుక్షయస్థానవృద్ధు లనియెడిత్రివర్గంబును ద్రయీవార్తాదండనీతిసంజ్ఞకవిద్యాత్రయంబును బ్రజాపాలనమూలంబైనయింద్రియజయంబును సంధి విగ్రహ యానా సన ద్వైధీభావ సమాశ్రయ సంజ్ఞకం బైనషాడ్గుణ్యంబును హుతాశన జల వ్యాధి దుర్భిక్ష మరణంబు లనియెడిపంచవిధదైవవ్యసనంబులును నాయుక్తక చోర పర రాజవల్లభ పృథివీపతిలోభంబులవలన నయ్యెడుపంచవిధమానుషవ్యసనంబులును నలబ్ధవేత నావమానిత కోపిత భీషితంబు లగుశత్రుసంబంధివర్గంబుల నభిమతవస్తుప్రదానంబున భేదించుటయు ను బాలవృద్ధదీర్ఘరోగిజ్ఞాతిబహిష్కృత భీరుక భీరుజనక లుబ్ధ లుబ్ధజనకవిరక్తప్రకృతికవిషయాసక్తానేకచిత్తమంత్ర దేవబ్రాహ్మణనిందక దైవోపహతక దైవచింతక దుర్భిక్షవ్యసనోపేత బలవ్యసన సంకులాదేశస్థాకాలయుక్త బహురిపు సత్యధర్మవ్యపేతసంజ్ఞకులను సంధికయోగ్యులై కేవలనిగ్రహార్హు లగుపురుషులను రాజ్యాపహరణంబును భార్యాపహరణంబునుస్థానాపహరణంబును దేశాపహరణంబును జ్ఞాతిజనాపహరణంబును ధనాపహరణంబును మదంబును మానంబును విషయపారవశ్యంబును జ్ఞానవిఘాతంబును నర్థవిఘాతంబును శక్తివిఘాతంబును ధర్మవిఘాతంబును దేవతాతిరస్కరణంబును మిత్రతద్ధనావమానంబులునుబంధువినాశనంబునులోకానుగ్రహరాహిత్యంబునుస్వామ్యమాత్యాదిమండలదూషణంబునుస్వాభిమతవిషయాభిలాషిత్వంబు ననియెడువింశతి విగ్రహకారణంబులను నమాత్యరాష్ట్రదుర్గకోశదండంబులనియెడుపంచవిధప్రకృతులను బురోవర్తులైనశత్రు మిత్ర శత్రుమిత్ర మిత్రమిత్ర శత్రుమిత్రమిత్రు లనియెడువారేవురునుబృష్టభాగస్థులైనపార్ష్ణిగ్రాహాక్రందపార్ష్ణిగ్రాహాసారాక్రందాసారు లనియెడువారునలువురును మధ్యవర్తి యగువిజిగీషుండును పార్శ్వభాగవర్తి యగుమధ్యముండును వీరల కందఱకు బహిస్స్థానావస్థితుం డైనవాఁ డుదాసీనుండు ననునీద్వాదశరాజాత్మకమండలంబును విగృహ్యయాన సంధాయయాన సంభూయయాన ప్రసంగతోయా నోపేక్ష్యయానంబు లనియెడుపంచవిధయానంబులను యానాసనాత్మకం బైన సంధిని ద్వైధీభావ సమాశ్రయాత్మకం బైనవిగ్రహంబును వీని నన్నింటిని నీతిశాస్త్రోక్తప్రకారంబున నెఱింగి హేయంబులఁ బరిత్యజించి యుపాదేయంబులఁ బరిగ్రహింతువే మఱియుఁ బెక్కండ్రు మంత్రులం గూడి కావించినమంత్రంబునకు భిన్నత్వసంభవంబువలన నైకమత్యాభావంబువలనను సార్థక్యంబుగలు

గదు గావున శాస్త్రోక్తమంత్రిలక్షణలక్షితు లగుమంత్రుల నల్వురం గాని
మువ్వురం గాని గూడి వారియందఱలోను నొక్కొకరితోను రహస్యంబుగా
మంత్రంబు గావింపుదువే యని పలికి వెండియు ని ట్లనియె. 1932

సీ. సవనతంత్రాద్యనుష్ఠానంబుచేత వేదంబులు సఫలీకృతంబు లగునె
దానభోగంబుల ధనధాన్యరత్నాదికంబులు సఫలీకృతంబు లగునె
శాస్త్రసంశ్రవణంబు సఫలీకృతం బగునే శీలసద్వృత్తనియతివలన
దాక్షిణ్యరతి సుతోత్పాదనంబునఁ గళత్రంబులు సఫలీకృతంబు లగునె
తే. రవికులోత్తమ నీ వొక్కఁడవె భుజింప, కష్టమృష్టాన్నమును బరితుష్టి గాఁగ
మానితాచారు లాశంసమాను లైన, మిత్రులకుఁ బెట్టుదువె నీవుపాత్రమెఱిఁగి.

క. ధర్మార్థకామయుక్తము, నిర్మలసువివేకదంబు నిత్యము శుభముక్
శర్మద మగునాచెప్పిన, ధర్మము మది నిలుపుదువయ్య దశరథతనయా. 1934

తే. ఎయ్యది శుభంబు సుజనుల కిష్ట మెద్ది, తవిలి మనతండ్రితాత ముత్తాత లెల్ల
నర్థి నెద్దాని సేవించి రనుదినంబు, నట్టివృత్తిని సేవింతె యనఘ నీవు. 1935

తే. యుక్తదండుఁ డై ధర్మసంయుక్తబుద్ధి, నెవ్వఁ డిల యేలు నట్టిమహీవరుండు
పుణ్యజనపుంగవులచేతఁబొగడువడసి, యైహికాముష్మికసుఖంబులనుభవించు.

వ. అని యివ్విధంబున రాజధర్మంబు లుపదేశించు చున్నయన్నం జూచి భరతుం
డి ట్లనియె. 1937

క. కూర్మి మెఱయ మీ రిప్పుడు, నిర్మలమతిఁ జెప్పినట్టి నృపధర్మంబుల్
ధార్మికులకుఁ గాక రహిఁ, ధర్మవిహీనుండ నైన నా కేమిటికిన్. 1938

—భరతుఁడు రామునికి దశరథమరణం బెఱింగించుట.—

సీ. అనఘాత్మ మనవంశమున జ్యేష్ఠునకు రాజ్య మవలికనిష్ఠుల కతనిసేవ
యుచితధర్మం బగుచుండ నీవు భరింపఁ దగినసామ్రాజ్య మధర్మయుక్తి
నా కిచ్చినందుకు నన్నుఁ బాత్రముఁ జేసి యీఘోరవనమున కిట్లు నీకు
రాఁ జెల్లునే దేవరాజ్యపదం బైన నీకుఁ గాని దిది దాల్ప నాకు వశమె
తే. దేవ మా కెల్ల నధిపతి నీవు నన్నుఁ, గరుణఁ జూచి యయోధ్యానగరికి రమ్ము
రాజసన్నిధిఁ బూజ్యసామ్రాజ్యపట్ట, భద్రుఁడవుగమ్ము నృపసభాభవనమందు.

తే. అధిప ధర్మార్థసహిత మైనట్టిదేవ, లోకసంపాదనీయకాస్త్రోకవృత్త
మెవ్వనికిఁగల్గు నట్టిమహీశుఁ డుర్వి, మానుషుండైన దేవత్వమహిమఁ గాంచు.

తే. లక్ష్మణుఁడు సీతయును వెంటరాఁగ నీవు, ప్రోలు వెడలినమాత్రాన భూవరుండు
పురికి నావచ్చుకంటెమున్నరిగెదివికిఁ, దద్వియోగాగ్నిహేతిసంతప్తుఁ డగుచు.

మ. నినుఁ జింతించుచు నిన్నె పేరుకొనుచు న్నీయందుఁ జిత్తంబుఁ జే
ర్చి నినుం గూర్చి బహుప్రకారముల విశ్లేషించుచు న్నీముఖా
బ్జనిరీక్షాస్పృహుఁ డై భవద్విరహసంజాతాగ్నిచేఁ గ్రాఁగి నీ

జనకుం డెంతయు నస్తమించె జననీసంఘంబు శోకింపఁగన్. 1942
చ. ప్రియతనయుండు ప్రీతి నిడుపిండము దత్పితృలోకమందు న
క్షయ మగు నంచు శాస్త్రములు చాటి వచించెను నీవు తండ్రికిం
బ్రియుఁడవు గాన నాయనకుఁ బ్రీతిగఁ బిండ మొసంగు మిప్పు డే
రయమున మున్నె చేసితిని లక్ష్మణసోదరసంయుతంబుగన్. 1943

రాముఁడు పితృమరణమును విని దుఃఖించుట.

క. అని యీగతిఁ బితృమరణము, వినిపించిన నతనిమాట వీనుల కనిలో
దనుజరిపూత్మ భ్రష్టం బగు, ఘనదారుణవజ్రహేతిగతి సోఁకుటయున్. 1944
క. పరశునికృత్తం బగుసుర, తరువుకరణి రాఘవుండు దద్దయు శోకం
బెరియఁగఁ బరవశుఁడై యా, త్రటి ధరణిం బడియెఁ జాల ధైర్యము వాయన్.
మ. విపులాధీశునిఁ గూర్చి యీపగిది నిర్వేదించుచుం గూలఘా
తపరిశ్రాంతసుషుప్తదంతికరణి ధాత్రీస్థలి న్వ్రాలి యు
న్నపృథూరస్కుని రాముఁ గాంచి వెస నంతత్ భ్రాత లుద్విగ్నులై
యుపచారంబుల సేసి దేర్చి రపు డయ్యుర్వీసుతాయుక్తులై. 1946
ఆ. అంతఁ గొంతవడికి నమ్మహాపురుషుండు, తెలివి నొంది కనులజలము లొలుకఁ
దండ్రిమరణమునకుఁ దలఁకి దుఃఖించుచు, నిట్టు లనియెఁ గైకపట్టితోడ.
ఉ. భానువరుండు సద్గతికిఁ బోయినవెన్క నయోధ్యయందు నే
నేమియొనర్పువాఁడ జగతీశ్వరపాలిత మైనయప్పురం
బీమహి నింక నేపురుషుఁ డేలఁగఁ జాలు దురంత మీ యగా
ధామితశోకరూపమకరాలయ మెట్లు తరింతుఁ దమ్ముఁడా. 1948
ఉ. ఆతతమద్వియోగజనితార్తిఁ దపించుచు మృత్యు వొంది నా
చేత నసంస్కృతుం డగుచు శీఘ్రమున న్దివి కేగెఁ గాన వి
ఖ్యాతగుణాబ్ధికి న్దశరథావనిభర్తకుఁ బట్టినై సుదు
ర్జాతుఁడనై ననేను వరుస న్జనియించుట వ్యర్థమే కదా. 1949
క. శ్రుతిచోదితగతి నీచే, క్షితినాథుఁడు మున్నె ప్రేతకృత్యంబుల స
త్కృతుఁ డయ్యెఁ గాన నీవివు, డతులితచరితార్థకుండ వైతివి గాదే. 1950
చ. ఇనకులనాయకుండు దివి కేగినవెన్కఁ గృతవ్రతుండనై
ననుఁ బురంబునం దిఁక ఘనంబుగ నెవ్వఁడు ప్రోచువాఁడు పా
వనగతి సన్నివృత్తవనవాసుఁడ నయ్యును గ్రమ్మఱం బురం
బునకుఁ జనంగ నోపఁ గృతపుణ్య యనాయక మట్లు గావునన్. 1951
క. ననుఁ జూచి సువృత్తుం డం,చు నృపతి యేయేనుడుగులు శ్రుతిసుఖములు గా
మును పలుకు నట్టిమాటలు, వినుతగుణా యింక నెట్లు విన నగు నాకున్.
చ. అని యిటు రామభద్రుఁడు మహావ్యసనంబునఁ గైకపట్టితో

నని మఱువా భవచ్ఛ్వశురుఁ డంతము నొందెఁ గదా యటంచుఁ ద
జ్జనకజతోడ నాఁడి యనుజా పితృహీనుఁడ వైతె యంచుఁ ద
మ్మునిఁ గని పల్కి నెవ్వగలు ముంపఁగ నశ్రులు నించెఁ గ్రమ్మఱన్. 1953

ఉ. అన్న తెఱంగుఁ జూచి భరతాదులు శోకపరీతచిత్తులై
కన్నుల బాష్పము ల్గురియఁగా విలపించుచు సాంత్వవాక్యసం
పన్నత నాదరించి నరపాలున కౌర్ధ్వ్వక మాచరింప కా
పన్నత నొంది కుంద నిటు పాడియె రాఘవ యంచుఁ బల్కినన్. 1954

తే. జానకియు స్వర్గతుఁ డైన శ్వశురుని విని, కనుల నశ్రులు గార రోదనముఁ జేసె
నామహాదేవిసూశార్చి రాముఁడపుడు, శోకమునఁ గుందుసౌమిత్రిఁ జూచిపలికె.

క. విదితాత్ముం డగుతండ్రికి, నుదకక్రియ సలుపవలయు నుచితంబుగ నిం
గుదిపిణ్యాకము చీరయు, గొదువపడక యుండ వేగ గొని తెమ్మనఘా. 1956

—రాముఁడు దశరథునకు పిండప్రదానంబు సేయుట.—

క. జనకకుమారిం దోడ్కొని, యనఘా మందాకినీమహానదికడకుం
జను మీవు వెంట నేనును, జనుదెంచెదఁ దండ్రి కర్థిజల మొసఁగుటకున్.

వ. అని పలుకునాసమయంబున విదితాత్ముండును మహామతియు మృదుండును శాంతుండును దాంతుండును భృశానురక్తుండును దృఢభక్తిమంతుండును నిత్యానుగుండు నగుసుమంత్రుండు రాజకుమారులం గూడి రామభద్రు నాశ్వాసించి తదీయకరం బవలంబించి మందాకినీనదికడకుం దోడ్కొని చనియె నప్పు డక్కుమారచతుష్టయంబు సదాపుష్పితకాననం బైనమందాకినీనదీతీరంబునకుం జని యకర్దమం బైనయవతరణప్రదేశంబున కతిప్రయత్నంబున డిగ్గి తదీయపుణ్యసలిలంబులం గ్రుంకె నంత రాముండు జలంబులు దోయిట సంగ్రహించి యామ్యదిశాభిముఖుం డై రోదనంబు సేయుచు దశరథు నుద్దేశించి.

తే. క్షితివరోత్తమ పితృలోకగతుఁడ వైన, నీకు మద్దత్త మైనయీలోకపావ
నోదకం బక్షయం బయియొప్పుఁగాక, యనుచు నంజలి జలవిసర్జన మొనర్చె.

వ. ఇట్లు సలిలక్రియఁ గావించి దర్భసంస్తరంబునందు బదరీమిశ్రితం బైనయింగుదీపిణ్యాకం బిడి వెండియు దశరథు నుద్దేశించి దుఃఖపూర్వకంబుగా ని ట్లనియె.

ఆ. పృథివిలోనఁ బురుషుఁ డేయన్నము భుజించు, నతని దేవతలు తదన్న లగుదు
రధిప నాయొసంగినట్టియీ పిణ్యాక, మింపుతో భుజింపు మిపుడు నీవు. 1961

—భరతసైనికు లందఱు రామునిం జూడ వచ్చుట—

వ. అని పలికి విధిప్రకారంబునఁ బిండదానంబుఁ గావించి యారఘువల్లభుండు తమ్ములుం దానును సీతాసమేతంబుగా వెండియుఁ బూర్వమార్గంబున నప్పర్వతం బారోహించి పర్ణకుటీరద్వారంబు డగ్గఱి నిజబాహుదండంబులు సాఁచి భరతలక్ష్మణులం గౌఁగిలించికొని దీర్ఘస్వరంబున రోదనంబుఁ జేసిన వారును సీతా

సమేతంబుగాఁ బితృమరణభ్రాతృప్రవ్రాజనసంజాత శోకవిశేషంబున దుఃఖించి రంత నయ్యాక్రందనశబ్దంబు గిరిగుహాముఖంబులం బ్రతిధ్వనులు సెలంగఁ దుములం బై యొప్పె నప్పు డమ్మహాశబ్దంబు విని భరతసైనికులు భయోద్విగ్నులై భరతుండు రామునిం జేరె వారిద యీరోదనధ్వని యని నివాసంబులు విడిచి వారి కభిముఖంబుగా నచిరప్రోషితుం డైన రామునిఁ జిరప్రోషితునిం గాఁ దలంచుచు ద్రష్టుకాము లై రథహయగజశకటంబు లెక్కి సత్వరంబుగం జనిరి కొందఱు తేవనంబునఁ దదీయాశ్రమంబుఁ గరిగి రాసమయంబున ఖురనేమి సమాహతం బైన యయ్యరణ్యభూమి యభ్రసమాగమంబున నాకాశముం బోలెఁ దుములంబుగా మ్రోసె నాదారుణధ్వని విని విత్రస్తంబు లై వనగజంబులు గరేణుపరివారితంబు లై మదగంధంబున దెసల వాసించుచు నొండువనంబునకుం జనియె సింహ వ్యాఘ్ర వరాహ భల్లూక మహిష సర్ప వానర గోకర్ణ గవయపృషతాది మృగంబులును విత్రాసితంబు లయ్యె రథాంగహంస కారండవ బక క్రౌంచ శుక పిక శారికాది పతత్త్రిగణంబులు దీనారావంబులు సేయుచుఁ బఱవందొడంగె నప్పుడు విత్రస్తపక్షిసంకులం బైన నభంబును విత్రస్తజనసంకులం బైన భూతలంబు నుభయంబు నేకప్రకారంబునం బొల్చి యుండె నంత సర్వజనంబులు పురుషవ్యాఘ్రుండు నకల్మషుండును స్థండిలాసీనుండును యశస్వియు నగురామునిం జూచి కైకేయిని మంథరను నిందించుచు బాష్పపూర్ణముఖు లై శోకించుచుండ వారిం జూచి ధర్మజ్ఞుం డైన రాముండు తల్లిదండ్రులం బోలె సంభావించి యథార్హంబుగాఁ బ్రణామాలింగనవచోగౌరవాదుల సంప్రీతులం జేసిన వారు యథార్హస్థానంబుల నధివసించి పెక్కుచందంబుల నతనిదురవస్థం జూచి యాక్రందించుచుండఁ దదీయశబ్దంబు భూనభోంతరంబు నిండి మహీధరగుహావివరంబులు మాఱుమ్రోయ మృదంగస్వనంబుభంగి జెలంగెఁ దదనంతరంబ.

క. జనపతిభార్యల నందఱ, మునివిభుఁడు వసిష్ఠుఁ డపుడు మున్నిడుకొని గ్ర
క్కున నద్దేశంబునకుం, జనియె న్రాఘవునిఁ జూచు సంభ్రమ మెసఁగన్.

తే. అమ్మహారాజపత్నులి ట్లరిగి జనక, కన్యకాస్నానపుణ్యోదకయును రామ
లక్ష్మణనిషేవితయు నై సులక్ష్య మగుచుఁ, గ్రాలుమందాకినీనదిఁ గాంచి రచట

క. అప్పుడు కౌసల్యయుఁ గను, ఱెప్పల బాష్పంబు లాని ప్రియతనయునిపై
నొప్పినయనురాగము తనుఁ, గప్పికొనఁగ నలసుమిత్రఁ గని యిట్లనియెన్.

తే. అకట నిర్విషయీకృతు లైన రామ, లక్ష్మణు లనాథు లై త్రికాలంబులందు
స్నాన మొనరించుటకు నజస్రంబు డిగ్గు, నట్టితీర్థదేశం బిది యబల కంటె.

క. అతివ యతంద్రితుఁ డై నీ, సుతుఁ డీతీర్థమున నుండి సుమచిరముగ మ
త్సుతునకు నర్పించుటకై, సతతము సలిలము గ్రహించి చను చుండుఁ గదా.

సీ. అతివ నీసుతుఁడు జలాహరణాదిజఘన్యకర్మం బిట్లు కడఁకతోడఁ

జేసినవాఁ డయ్యె శిష్టజనంబుచే నిల గర్హితుఁడు గాఁ డ దెట్టు లన్న
నన్నకుఁ గైంకర్య మర్థిఁ జేసిన నది యంతయు గుణయుక్త మనిరి గాదె
భరతుఁ డంజలిఁ జేసి ప్రార్థనఁ గావింప రాముండు ప్రీతి సామ్రాజ్యపదవిఁ
తే. జేకొనియె నేని ఘనసుఖోచితుఁడు నీకు
మారుఁ డతిదుఃఖశోకవిస్తార మయిన
యీనికృష్టకర్మంబు తా నిందె విడిచి
యిపుడె సుఖియించు గృహమున నింపు మెఱయ. 1968

-౦౦- కౌసల్య యింగుదీపిణ్యాకపిండములను జూచి దుఃఖించుట -౦౦-

వ. అని యిట్లు లక్ష్మణునిసుహృద్వాక్యంబు బహుప్రకారంబుల వక్కాణించుచుఁ
దత్సమీపంబున దక్షిణాగ్రదర్భసంస్తరంబునందుఁ బితృప్రీత్యర్థంబుగా రాము
నిచేత విన్యస్తం బైనయింగుదీపిణ్యాకంబుఁ జూచి యద్దేవి వెండియు నంతః
పురకాంతల నవలోకించి యిట్లనియె. 1969

సీ. ఇనకులదీపకుం డిక్ష్వాకునాయకుం డతిసుఖోచితుఁడు మహాత్ముఁ డమర
సముఁ డైనదశరథక్ష్మాభర్తకిచట మత్సూనునిచే దత్త మైనదాని
నింగుదీపిణ్యాక మిది గనుఁగొంటిరే భుక్తభోగుం డైన భూవరుండు
చతురంతమేదినీచక్రంబు గుడుచు వాఁ డిటువంటిభోజనం బెటు భుజించె
తే. దాశరథిచేతఁ దండ్రికి దత్త మైన, దీని వీక్షించినంత నామానసంబు
వేయి వ్రయ్యలై పోవదు వితతవజ్రసారమయము గాఁబోలు నిస్సంశయముగ.

వ. అని యివ్విధంబున నార్త యై విలపించు చున్నకౌసల్య నూఱార్చి సపత్ను
లద్దేవిం దోడ్కొని శీఘ్రంబునం జని స్వర్గచ్యుతుం డైన దేవేంద్రునిచందంబున
సర్వభోగపరిత్యక్తుం డై స్థండిలంబునం గూర్చున్నరామునిం జూచి శోకకర్శితు
లయి కన్నీరు నించుచు సుస్వరంబుగా రోదనంబు చేసి రప్పుడు రాముండు
తల్లులం జూచి శీఘ్రంబున దర్భాసనంబున నుండి లేచి తదీయచరణంబులకుఁ
బ్రణామంబుఁ గావించిన వారు సుఖస్పర్శంబులును మృద్వంగుళీతలంబులు
నైనకరంబుల నమ్మహాత్మునినెమ్మేనిరజంబు పరిమార్జించి రంత లక్ష్మణుం
డునుం బ్రణమిల్లిన నక్కుమారుని రామునిం బోలె నాదరించిరి పదంపడి
వైదేహి భక్తిపూర్వకంబుగా నమస్కరించి బాష్పపూర్ణముఖి యయి దుఃఖిం
చుచు మరుచ్చలితవల్లియుం బోలె నడలుచు నుపవాసకృశాంగి యై తూలుచు
దైన్యంబుతోఁ బురోభాగంబున నుండె నప్పు డద్దేవిం జూచి కౌసల్య బద్ధ
స్నేహ యై తల్లి కూఁతునిం బలె గవుంగిలించి వాత్సల్యంబు నెఱపుచు
ని ట్లనియె. 1971

-౦౦- కౌసల్య సీతాదేవిని జూచి దుఃఖించుట. -౦౦-

క. జనకునికూఁతురు దశరథ, జనపతి కోడలును రామచంద్రునిసతి భూ

తనయ యగుసీత కిటు విధి, వని నిడుములు గుడువు మనుచు వ్రాసె నదయుఁడై.

మ. దిననాథాతపతప్తపంకజమురీతి న్వారిదచ్ఛన్నచం
ద్రునిభంగి న్విరసోత్పలంబుగతి రేణుధ్వస్తభర్మంబుచా
డ్పున వీతద్యుతి నున్నసీతవదనంబుం జూచుచో నన్నుఁ ద
ద్ఘనశోకానల మాశ్రయంబుకరణిం గాల్పం దొడంగెన్ గ్రహీన్. 1973

వ. అని బహుప్రకారంబుల దుఃఖించుచున్నతల్లి ననూనయించి రాముండు సురాధిపుం డగుశక్రుండు బృహస్పతికిం బోలె హుతాశనసమప్రభుం డైనవసిష్ఠునకుఁ బ్రణామం బాచరించి యమ్మునిపుంగవునితోఁ గూడ దర్భాసనంబున నాసీనుం డయ్యెఁ దదనంతరంబ భరతుండు కృతాంజలిపుటుం డై సామంతపురోహితసేనానాథసహితంబుగా నిజతనుచ్ఛాయావిశేషంబున నక్కాననంబునకు గారుత్మతచ్ఛాయ నొసంగుచుఁ బ్రజాపతి కభిముఖుం డై కూర్చున్నపురుహూతుండుం బోలె మునివేషధరుం డైనరామున కభిముఖుం డై కూర్చుండె నప్పు డచ్చటివా రందఱు రామునకుం బ్రణమిల్లి సత్కారపూర్వకంబుగా భరతుం డతనితో నేమిసంభాషించునో యని తద్వాక్యశ్రవణకుతూహలంబున యథార్హస్థానంబుల నాసీను లై యుండి రిట్లు గూడుకొనినసత్యధృతి యగురాముండును మహాత్ముం డగులక్ష్మణుండును ధార్మికుం డైనభరతుండును సుహృత్సమేతు లై యధ్వరవేదియందు సదస్యులతోడం గూడిన త్రేతాగ్నులచందంబునం దేజరిల్లుచుండి రంతఁ గొంతసేపునకు రాముండు గురువత్సలుం డగుభరతునింజూచి ప్రియవచనంబుల నాశ్వాసించి లక్ష్మణసహితంబుగా నిట్లనియె. 1974

—రాముండు భరతునిజటాధారణవనాగమనకారణం బడుగుట.—

చ. నిరుపమరాజ్యము న్విడిచి నిత్యముఁ బార్థివరక్ష్య మైనమ
త్పురమును బాడు చేసి నరపుంగవ తాపసవేషధారి వై
యఱపుర లేక పత్తులకు నైన గమింపఁగ రానియట్టియీ
గురుతరచిత్రకూటమునకుం జనుదెంచితి వేల చెప్పుమా. 1975

క. నా విని భరతుం డాసీ, తావల్లభుచరణములకు దండప్రణతు
ల్గావించి మధురభాషా, ప్రావీణ్యము దోఁపఁ బలికెఁ బ్రాంజలి యగుచున్.

క. నరపతి నినుఁ బాసి సుదు, ష్కర మగుకర్మం బొనర్చి కడపట సుతశో
కరసాబ్ధిమగ్నుఁ డై య, ప్పురుషవరుఁడు మేను విడిచి పోయెఁ దివికిన్. 1977

క. రయమున మాయమ యగుకై, కయి చే వినియుక్తుఁ డగుచు క్ష్మానాయకుఁ డ
ట్లు యశోహర మగునీదు, ర్నయకార్యం బాచరించె రాజకులేశా. 1978

క. లోకనుత విధవ యగుచ, కైకయి బహుదుఃఖశోకకర్శిత యై య
స్తోకతరరాజ్యపదమును, గైకొనక దురంతనిరయగతికిఁ జనియెడిన్. 1979

భరతుఁడు రాముని రాజ్యం బంగీకరింపు మని ప్రార్థించుట.

క. తడయక యిప్పుడె శత్రుని, వడువున సామ్రాజ్యమందు వారక యభిషి
క్తుఁడ వై దాసుఁడ నగు నా, కిడుము మహానుగ్రహం బహీనగుణాఢ్యా.
క. అనఘా పురజనులు మహీ, జనులు సఖులు హితులు మాతృసంఘ మిచటికిం
జనుదెంచి యున్నవారలు, జనవర్య యనుగ్రహం బొసంగుము కరుణన్. 1981
క. వ్యక్తంబు నానుపూర్వీ,యుక్తము నీ వనుభవింప నుచితము నీకే
యుక్తం బగు రాజ్యం బను, రక్తిం జేకొని హితాప్తులం బ్రోవు మిఁకన్. 1982
క. భూరికళానిధి యగుశశి, చే రాకారజనిభంగి శిష్టాచారో
దారవిచారుఁడ వగునీ, చే రస నాథవతి యగుచుఁ జెలఁగెడుఁ గాతన్. 1983
తే. అధిప యీయిష్టసచివసమన్వితముగ
నర్థి నాచేత శిరముచే యాచితుండ
వగుచు శిష్యుఁడ దాసుఁడ ననుజుఁడ నగు
నాకు సమ్యక్ప్రసాదం బొనర్పు మిపుడు. 1984
క. విమలాత్మ పూజితము పి, త్ర్యము శాశ్వతము న్సమాహితము నిత్యంబుఁ
సుమహితచరితం బీప్రకృ,తిమండలము గడవఁ దగదు దీనిని నీకున్. 1985
క. అని యిట్లు పలికి యశ్రులు, కనుఁగొనలం గ్రమ్ముదేఱఁగాఁ గైకేయీ
తనయుఁడు గ్రమ్మఱఁ దత్పద, వనజంబులమీఁద భక్తి వ్రాలెం బెలుచన్.
తే. అంత రఘుపుంగవుఁడు దుఃఖితాత్ముఁ డగుచు
సముదదంతావళముభంగి సారె సారె
కూరుపులు పుచ్చుచుఁ గలంగి యున్నభరతు
నట్టె కౌఁగిటఁ గదియించి యిట్టు లనియె. 1987
మ. అనఘాత్మా చరితవ్రతుండు నిజవంశాచారసంరక్షణుం
డును దేజస్వి కులీనుఁ డంచితగుణుండు న్సత్త్వసంపన్నుఁడు
న్వినయోదారుఁడు రాజధర్మవిదుఁ డౌ నీయట్టివాఁ డివ్విధం
బున పాపంబును రాజ్యకారణమునం బొందింపఁగాఁ జెల్లునే. 1988
క. మానుగ నీయం దించుక, యైనను దోషంబుఁ గాన మన్వయనయము
న్మాని భవదంబ ని ట్లజ్ఞానంబున దూఱ నగునె సౌజన్యనిధీ. 1999

రాముఁడు భరతునితో దశరథాజ్ఞకు లోఁబడవలయు ననుట.

వ. వత్సా గురువు లగువారికి పుత్రకళత్రశిష్యదాసాదులయందు స్వచ్ఛందకరణంబు విధింపఁబడి యున్నది లోకంబులయందు సాధువులచేత గురువులకు నియామ్యులుగాఁ బుత్రకళత్రశిష్యాదులు పరిగణితులై రి కావున మనము దశరథునకు నియామ్యుల మని నీ వెఱింగికొనుము చీరకృష్ణాజినాంబరుండ నై వనంబున నుండను బట్టాభిషిక్తుండవై పురంబున నుండను నా కమ్మహానుభావుండే

నియామకుం డతనివాక్యం బలంఘనీయంబు. 1990

తే. ధర్మభృచ్ఛ్రేష్ఠ వినుమెంత దండ్రియందు
లోకసత్కృత మయినయస్తోకగౌర
వం బనుష్ఠించు నంతయు వరుసతోడ
నంబయందు ననుష్ఠించు టది హితంబు. 1991

ఆ. అట్టిధర్మశీలు రగుతలిదండ్రుల, చేత రామ వని వసింపు మనుచుఁ
బలుకఁబడిననేను బదపడి వేఱొక్క, చంద మెవ్విధమున సలుపువాఁడ. 1992

సీ. అనఘాత్మ విను మయోధ్యాపట్టణమున నేకచ్ఛత్ర మైనజగత్ప్రభుత్వ
మింపారఁగాఁ గైకొని యీకుమారుం డుండుఁ గాక రాముండు వల్కలజటాజి
నంబులు దాల్చి ఘోరం బగుదండకాకాననంబున నుండుఁగాక యనుచు
భూమీశుఁ డిట్లు సభామధ్య మందు విభాగించి పలికి సుపర్వగతికి

తే. నరిగె నాయన గురుఁడు సత్యప్రతిజ్ఞుఁ
డధిపభుఁడు తండ్రి ధర్మాత్ముఁ డట్లు గాన
నతనిచే దత్త మయినమహార్హభాగ
మనుభవింపుము తగ సందియంబు వదలి. 1993

ఉ. ఏనును వల్కలాజినము లెంతయుఁ దాల్చి చతుర్దశాబ్దము
ల్పూనికి మాని నై గహనభూమి నివాస మొనర్చి తండ్రిచే
మానుగ దత్త మైనయసమానయశస్కరభాగ మాత్మలో
నూనినవేడ్కతోఁ గుడుచు చుండెద మూలఫలాశనుండ నై. 1994

వ. మఱియు దశరథుండు ధర్మాత్ముఁడును సత్యసంధుండును మహేంద్రసముండును లోకసత్కృతుండును గావున నతనిచేత నేభాగంబు దత్తం బయ్యె నదియె యమృతం బని తలంచెదం గాని తద్వ్యతిరిక్తంబుగా సంప్రాప్తం బైనసర్వలోకేశ్వరత్వం బైనఁ దుచ్ఛంబుగాఁ దలంచెద నని యివ్విధంబున రాముండు పలుకుచుండ సుహృద్గణపరివృతు లయి శోకించు చున్నయప్పురుషసింహుల కవ్విభావరి యొక్కచందంబున నతిక్రమించె నంతఁ బ్రభాతకాలంబున నారాజకుమారులు సుహృత్సమేతంబుగా మందాకినీనదికిం జని యందు సుస్నాతు లై కాల్యకరణీయంబులు దీర్చి క్రమ్మఱ పర్ణశాలకుం జని రామునిం బరివేష్టించి యందఱు సుఖాసీను లయి యూరకుండి రంతఁ గొంతసేపునకు సుహృన్మధ్యంబున భరతుండు రామభద్రు నవలోకించి యెల్లవారును విన నిట్లనియె. 1995

భరతుండు నానావిధంబుల రాముని రాజ్యం బంగీకరింపు మని వేఁడుట.

చ. అనఘచరిత్ర మజ్జనని యానరనాథు బలాత్కరించి గై
కొని వెస నా కొసంగినయకుంఠితరాజ్యము ధర్మయుక్తి నా
యనువున నీ కొసంగెద మహాత్మ పరిగ్రహణం బొనర్చి నా

మనము వికాస మొందఁగ నమాత్యుల భృత్యుల నేలు మిత్త్రజిన్. 1996

తే. ఘనసముద్రనూతనాంబువేగంబుచేత, సేతువును బోలె నీసుప్రసిద్ధ మైన
భరతఖండంబు నీకంటెఁ బరునిచేత, శీర్ణ మగుఁ గాక రక్షణోద్దీర్ణమగునె. 1997

ఆ. హరిగతిని ఖరంబు గరుడగతిని గాక, ననుసరింప లేనియట్లు పరమ
ధర్మమూర్తి వగుచుఁ దనరెడునీగతి, ననుసరింపఁ జాల నధిప యేను. 1998

తే. చెలఁగి యన్యులచేతఁ బోషింపఁ బడెడు, వానిజీవంబు కడు సుజీవంబు కాదు
చెలువు మీఱంగఁ బరుల రక్షించునట్టి, వానిజీవంబె కడు సుజీవం బధీశ.

వ. మహాత్మా పురుషునిచేత రోపితం బైనవృక్షంబు పరివర్ధితం బై యంతకంతకు వామనునిచేత దురారోహంబగునట్లు మహాస్కంధం బై మహాద్రుమం బై పుష్పించిన దై ఫలంబులం జూపకుండె నేని యప్పురుషుం డెట్లు ఫలాభావహేతువు వలనఁ దత్ఫలవిషయప్రీతి ననుభవింపకుండు నట్లు నీవు భర్తవై భృత్యులమైన మమ్ముఁ బాలింప వేని యీయుపమానార్థంబున కనుగుణం బగుంగావున నస్మత్పరిపాలనరూపార్థం బెఱుంగ నర్హుండ విప్పుడు సామ్రాజ్యదీక్షితుండ వై ననిన్నుఁ బ్రతాపవంతుం డైనసూర్యునిం బోలెఁ గన్నులారం గనుంగొన నీ పౌరశ్రేణులమాత్యులం బెఱుఁ బరమాసక్తులై యున్నవారు తురంగమాతంగంబులు రాజ్యాభిషిక్తుం డై ననిన్ను వెనుకొని హేషాబృంహితధ్వనులు సెలంగ నరుదేరం గల నంతఃపురకాంతలెల్ల సమాహిత లై సంతోషంబునం బొదలుచు నీపిఱుందం జనుదెంచెదరు నాయంజలిం గైకొని పురంబునకు విచ్చేయు మని పలికిన నతనివచనంబుల కలరి యచ్చటివార లందఱు సాధువాక్యంబుల నభినందించిరి యిత్తెఱంగునఁ గృతాంజలిమస్తకుం డై దైన్యంబునం బ్రార్థించుచున్న భరతునిం జూచి సుశిక్షితమనస్కుండును ధైర్యవంతుండు నగు రాముండు మంద మధురాలాపంబుల నాశ్వాసించుచు నిట్లనియె. 2000

ఆ. అనఘచరిత యాత్మ కైచ్ఛికవ్యాపార, మరయ లేదు పురుషుఁ డస్వతంత్రుఁ
డతనిఁ బట్టి దైన మట్టిట్టు నుడి వెట్టుఁ, గడఁగి పూర్వకర్మకారణమున. 2001

రాముఁడు భరతునికి ధర్మోపదేశము సేయుట.

తే. జగతి జీవితమునకు సంచయములకు స
ముచ్ఛ్రయములకు మఱియు సంయోగములకు
మరణము క్షయంబు పతనంబు మఱి వియోగ
మంత మని పల్కి రార్యు లనర్ఘశీల. 2002

కం. ఇలపైఁ బక్వఫలంబుల, కలయక పతనమునకంటె నన్యభయంబు
ల్గలుగని క్రియఁ గలుగదు మర్త్యులకు మరణమునకంటె నొండు భయంబున్.

తే. అనఘచరిత దృఢస్థూణ మైనగృహము, సిదిర మై చూడఁ జూడ నశించునట్లు
ముదిమి నొంది నానాఁటికిఁ బుడమిజనులు, మృత్యువశగతులై నశియింతు రెపుడు.

క. ఇననందనీప్రవాహము, వనధిఁ గలసి మరల రాని వైఖరి ధరలోఁ
జనినదినంబులు రాత్రులు, చనుదేరవు మరలఁ గాలసంగతి ననఘా. 2005

వ. చను చున్నయహోరాత్రంబులు నిదాఘంబునందు సూర్యునికిరణంబులు జలంబుం బోలె నీజగంబునందు సర్వప్రాణులయాయువును హరించు చుండు నశ్వరఫలసాధనంబులయందు వ్యాపృతుండ వైననీవు నిన్నే యుద్దేశించి శోకింపుము పరుల నుద్దేశించి యేల వగచెద వేకారణంబున భవదీయం బైనజీవితకాలంబు క్షయించు చుండు నక్కారణంబునఁ బరలోకచింత గావింపుము మృత్యువు శరీరితోఁ గూడం జను శరీరితోడం గూడి యుండు సుదూరమార్గం బరిగినను శరీరితోఁ గూడ మరల వచ్చుఁ బురుషునిదేహంబునందు నానాఁటికి వళులును శ్వేతశిరోరుహంబులును సంప్రాప్తంబు లగు జరచేత జీర్ణుం డైనపురుషుం డేయుపాయంబు గావింప సమర్థుం డగు సూర్యుం డుదయించు చుండ నర్థార్జనకాలంబు సమాగతం బయ్యె సూర్యుం డస్తమించుచుండఁ గామోపభోగకాలంబు సమాగతం బయ్యె నని యిట్లు మనుష్యు లానందింపుదురు గాని ఛిద్రఘటంబునందు గ్రహింపంబడినజలంబుకరణిఁ బ్రతిక్షణంబు తమజీవితకాలంబు క్షయించు చున్న దని యెఱుంగరు మఱియు వసంతాదిఋతుసమాగమంబు విలోకించి తత్తద్భోగకాలంబు సంప్రాప్తం బయ్యె నని హర్షింతురు గాని ఋతుపరివర్తనంబున జీవితక్షయం బగు చున్నదని యించుక యైన నెఱుంగఁజాల రదియునుం గాక. 2006

చ. కడువడి వార్ధిమధ్యమునఁ గాష్ఠము కాష్ఠముఁ గూడి మారుతం
బడర వియోగ మొంది చనినట్లు కళత్రసుతాదు లొక్కచో
నుడుగక కూడి పెక్కుహాము లుండి పదంపడి పూర్వసంస్కృతిం
గడచి వియోగ మొందుదురు కాలవశంబునఁ జేసి మానదా. 2007

తే. అవని నొకఁ డైన వలసినట్లాప్తజనులఁ, గలసి యుండఁగఁజాలఁ డక్కారణమునఁ
బరఁగ మృతుని నుద్దేశించి వగచువాని, కరయ లేదు తన్నిరసనమందు శక్తి.

సీ. రాజనందన శరీరప్రవర్తన మది యంతలోఁ గలుగు తా నంతలోన
గుణదోషము లెఱింగి కుత్సితకర్మంబు వర్జించి దేహి కేవలత ధర్మ
మాచరింపఁగఁ బోలు నంగనాపుత్రగేహారామవిత్తాదు లతనివెంటఁ
బోవు తాఁ జేసిన పుణ్యపాపంబులు దప్పక తనవెంటఁ దగిలి వచ్చు

ఆ. ఎఱుక గలమహాత్ము లీయర్థము గ్రహించి, పోవరానిత్రోవఁ బోవ నీక
మనసు నాఁగి పట్టి మహితధర్మమునందె, సంచరింతు రెపుడు సత్య మింత.

వ. మఱియు మార్గగతుం డైనపురుషుండు సహచరు లైనపథికులం జూచి యేనును మీవెంట నరుదెంచెద నని పలికి యనుసరించి చనిన ట్లిది తొల్లింటిపూర్వపితృపితామహాదులు చనినమహామార్గంబు దీని ననుసరింపక తప్ప దెద్దానికి

వ్యతిక్రమంబు లేదట్టిదాని నుద్దేశించి యాపన్నుండవై శోకింప నేమి యగు నని వర్తియైనప్రవాహంబుకరణి నాయుఃకాలం బరుగుచుండఁ బ్రజలు ధర్మసాధ్యసుఖాసక్తులు గావునఁ బరలోకహితచింతచేత సుఖహేతు వగుధర్మంబునం దాత్మ నియోగింపఁ దగినయది తండ్రి యగుదశరథుండు పుష్కలంబు లైన భోగంబు లనుభవించి ధర్మంబు దప్పకుండ నర్థాదానంబువలన భృత్యరక్షణపూర్వకంబుగాఁ బ్రజలఁ బాలించి దక్షిణాపూర్ణంబు లైనక్రతుశతంబులచేత దేవతలఁ దృప్తి నొందించి విధూతకల్మషుండై చిరకాలంబు పాపసంగరహితంబుగా జీవించి జీర్ణం బైనమానుషదేహంబు విడిచి బ్రహ్మలోకవిహారిణి యైనతనువు ధరించి దేవసంబంధిసంపద ననుభవింపం జనియె నమ్మహాత్ము నుద్దేశించి శ్రుతవంతుండవు బుద్ధిమత్తరుండవై ననీవు ప్రాకృతునియట్ల శోకింపం దగదు దశరథమరణమద్వివాసనాదివిషయభేదంబున బహుప్రకారంబు లైన యీశోకంబులు వ్యర్థంబులు ప్రలాపాశ్రువిమోచనంబునందుఁ గార్యంబు లేదు ధీరుం డగువానిచేత సర్వావస్థలయందు నేతాదృశవ్యసనంబులు వర్జనీయంబు లై యుండు నదియునుం గాక. 2010

సీ. అనఘాత్మ మనతండ్రి యగుదశరథుఁడు నిన్నవని సంరక్షింపు మనుచుఁ బలికె
నను ఘోరకాననంబున కేగు మని పంచె నమ్మహాత్ముఁడు చెప్పినట్ల నీవు
స్వస్థచిత్తుండవై సాకేతపురి కేగు మేను గాననమున కేగువాఁడ
నీకు నాకును బోలె నృపశాసన మలంఘ్య మట్లు గావునఁ జేయుటది హితంబు

తే. మనకుఁ దండ్రియు దైవంబు మాన్యుఁ డఖిల, ధర్మసంవేది యమ్మహోదారుపలుకు
ధర్మగతి నేను వనవాసకర్మమున స, నుంచితంబుగ నింకఁ బాలించువాఁడ.

చ. వరమతి ధార్మికుండు గురువర్తి మృదుం డనృశంసుఁ డైనవాఁ
డరయఁగ ధర్మమార్గరతుఁ డై పరలోకజిగీషచే నతి
స్థిరముగఁ దండ్రిమాట విని చేయఁగఁ బోలుఁ గుమార నీవు న
గ్గురువచనంబు నార్థముగఁ గోరి యొనర్పుము రాజనందనా. 2012

క. మనతండ్రి యైనదశరథ, జనపతిశుభవృత్త మెఱిఁగి సజ్జనవర నీ
వనిశంబు తత్స్వభావము, ననుపమసుతిఁ బొందు మయ్య యవితథభంగిన్.

వ. అని యిత్తెఱంగున రాముండు పితృనిదేశపరిపాలనంబుకొఱకు నర్థవంతం బైన వాక్యంబునఁ దమ్మునికి ధర్మరహస్యం బుపదేశించి యూర కున్న నారఘునందనుం డగుభరతుండు ప్రకృతివత్సలుం డగురాముని వీక్షించి ధార్మికంబును జిత్రంబు నగువాక్యంబున ని ట్లనియె. 2014

భరతుఁడు యుక్తియుక్తంబుగా రామునిఁ బ్రార్థించుట

ఆ. అధిప నిన్ను దుఃఖ మది బాధితునిఁ జేయఁ, జాల దలముదంబు సంప్రమోద

సహితుఁగాఁగఁ జేయఁజాలదు నీయంత,ఘనుఁడులోకమందుఁ గలఁడెయొరుఁడు.
తే. విమలచారిత్ర త్రైవిద్యవృద్ధు లయిన, వారి కీవు సర్వజ్ఞతావైభవమున
సమ్మతుఁడవయ్యు ధర్మసంశయముకలుగు, చోట వారలనడిగెదు సురుచిరముగ.

సీ. మృతుఁడైనపురుషుఁడేగతి ద్వేషవిషయుండుగాఁడట్లుసనియున్నవాఁడు ద్వేష
విషయుఁడు గాఁడు బల్విడి లేనిదానిపై నెట్లు రాగము పుట్టదట్లు యున్న
దానిపై రాగ మింతయుఁ బుట్ట దిటుసంటిబుద్ధిలాభము గల పురుషుఁ డేల
పరితాప మొందు నెవ్వఁడు పరావరవిదుఁ డతఁ డిట్టివ్యసనంబు నధిగమించి
తే. యును బరితపింపఁ డట్లీవు జనవరేణ్య, యట్టివాఁడవు నినుఁ గొనియాడఁదరమె
సకలలోకైకకర్తవు సాధువినుత, సద్గుణుండవు శాస్త్రవిశారదుఁడవు. 2017

వ. మహాత్మా నీవు సత్త్వగుణప్రధానుండ వమరతుల్యుఁడవు మహానుభావుండవు సత్యసంగరుండవు సర్వజ్ఞుండవు సర్వదర్శివి బుద్ధిమంతుండవు భూతప్రభవవినాశకోవిదుండ విట్టిసద్గుణయుక్తుండ వైననీవు మాదృశుల కవిషహ్యాతమం బైన వ్యసనంబు నొందియు విషణ్ణుండవు కా వని పలికి వెండియు నిట్లనియె. 2018

క. సరసుఁడవు సత్యసంధుఁడ, వరయఁగఁ బుణ్యాత్ముఁడవు మహాత్ముఁడ వీ వి
ప్పురుసునఁ బలికిన మముబోం, ట్లరిమథనా యేమి సేయ నర్హులు ధాత్రిన్.

ఆ. ఏను బ్రోషితుండ నైనచో మాతల్లి, క్షుద్రశీల యగుట సారిది నాకుఁ
బ్రీతి సేయ నిట్టి పాతకం బొనరించె, నేను నొల్ల నది సహింపు మధిప. 2020

ఉ. ఇట్టియఘం బొనర్చిననయేతర నుద్ధతశీలఁ గైకయిం
బట్టి వధించు టర్హ మిటు పాపవిచారిణిఁ జంపఁ బాతకం
బెట్టును గల్గ దైనను నరేంద్రకులీనుఁడ నై యకార్య మే
ని ట్టొనరింతునా యని సహించి వధింపఁగ నైతి నత్తఱిన్. 2021

ఉ. కా దని తెంపుసేసి యలకైకను జంపితి నేని దేవ నీ
వే దయమాలి యాజి కతివృద్ధునకు న్ఘనరాజధర్మసం
వేదికిఁ బుట్టి పుణ్యుఁ డన విశ్రుతిఁ గాంచి కుమార తల్లి నే
లా దునుమాడి తెంత కలుషాత్ముఁడ వైతి వటంచు దూఱవే. 2022

తే. అధిప శుద్ధాభిజనకర్ముఁ డైనదశర,థునకుఁ బుత్త్రుఁడ నై పుట్టి దురిత మనక
కడు నధర్మిష్ఠ మైనయీధర్మ మెట్లు, సేయువాఁడ సాధుల కిది చెల్ల దయ్య.

మ. గురుఁడు న్వృద్ధుఁడు తండ్రి దైవత మరాగుండుం గ్రియావంతుఁడు
న్ధరణీభర్తయుఁ బుణ్యమూర్తి యగుటం దండ్రి న్విగర్హింప నా
కరయం జెల్లదు గాని యెవ్వఁడు ప్రియాహార్థి యై యిట్టిని
ష్ఠురకర్మం బొనరించుఁ బుణ్యు లగురాజు ల్మెత్తురే యిప్పునిన్. 2024

తే. రాజవర్య వినాశకాలంబునందు, భూతకోటికి విపరీతబుద్ధి యనెడు
విశ్రుతం బైనమాట పృథ్వీతలేంద్రు, చేతఁ బ్రత్యక్షముగ నేఁడు చేయఁబడియె.

వ. మహాత్మా క్రోధమోహసాహసంబులవలన దశరథునిచేత నాచరింపఁబడిన ధర్మాతిక్రమణంబును సమీచీనార్థం బనుసంధించి నీవు ప్రమార్జింపుము తండ్రి వలనం బొడమిన ధర్మాతిక్రమణంబు సత్పుత్రుండు ప్రమార్జించు నతం డపత్యం బనఁ బ్రసిద్ధి వహించు నట్లు గావింపఁ డేని విపరీతుం డగు నీ వట్టియపత్యంబవు గమ్ము ధీరవిగర్హితం బైనజనకునిదుష్కృతకర్మంబు నవలంబింపం దగదు కైకేయి రాజ్యలోభంబున ధర్మవిరోధంబుగా మహీనాథుని నిర్బంధించి మదర్థంబుగా రాజ్యంబుఁ గైకొని దురంతం బైనపాపం బాచరించె నద్దశరథుండును మోహంబునఁ గైకేయీవాక్యం బెంతని నిగ్రహింపం జాలక సాహసంబున సుగుణసంపన్నుండ వైననిన్ను వనంబునకుం బనిచి పాపకారి యయ్యె నిట్లు తల్లిదండ్రులు దురితాత్ములై నిరయగతికిం బోవుచుండ మహానుభావుం డైన నీయట్టిసత్పుత్రుం డుపేక్షించుట యుక్తంబు గాదు లోభమోహంబుల మై మఱచి పలికినజననీజనకులశాసనంబు నిగ్రహించి రాజధర్మం బెఱింగి పితృపైతామహం బైనరాజ్యంబుఁ గైకొని తల్లిదండ్రులను నన్నునుసుహృజ్జనంబులను బాంధవులను పౌరజానపదులను ధర్మంబున నుద్ధరింపు మని పలికి శోకావేశంబున వెండియు నిట్లనియె. 2026

ఆ. గహనవాస మేడ క్షత్రధర్మం బేడ, జడలు దాల్చు టేడ జగతిఁ బ్రోచు
టేడ రఘువరేణ్య యిట్టివిరుద్ధధర్మంబు నాచరింపరాదు నీకు. 2027

ఉ ఉక్కున రాజ్య మేలుటకు నోపినవానికిఁ బట్టబంధనం
బొక్కట రాజధర్మ మగుచుండఁగ నీ కిటు చేయఁ జెల్లునే
యెక్కడ క్షత్రధర్మ మది యెక్కడ భూపరిపాలనంబు నేఁ
డెక్కడఁ గాననంబు మఱి యెక్కడఁ దాపసవేష మారయన్. 2028

సీ. మనుజేంద్ర పరిదృశ్యమాన మైనట్టియీత్యాగభోగాభియుక్తప్రజాది
పాలనధర్మంబు పరఁగ నవ్వలఁ ద్రోచి సంశయస్థంబు లక్షణవిహీన
మాయతిఫలము ధరాధీశుచే నిది యాదిభాగంబున నాచరింప
నెంతయు హిత మని యేప్రమాణంబునఁ దగ ననిశ్చిత మైనధర్మ మెవ్వఁ

ఆ. డవని క్షత్రబంధుఁ డాచరింపఁ దలంచు, నకట విధినిషిద్ధ మైనవృత్తి
మూఁడ నేల ధర్మ మొప్పార నాల్గువర్ణములవారిఁ బ్రోవు మమలచరిత.

తే. మనుకులోత్తమ చతురాశ్రమములలోన, నవనిగార్హస్థ్యముత్తమం బనిరిధర్మ
విదు లకారణముగ దాని వృథ యొనర్ప, నేల పూనితి వీధర్మ మెవ్వఁ డనియె.

ఉ బాలుఁడ జ్ఞానహీనుఁడ నపండితుఁడం గడు దుర్బలుండ భూ
పాలకిరీటరత్నరుచిభాసితపాదయుగుండ వైననీ
వేలఁగ నర్హ మైనధర నేలఁగ నే నెటు లోపువాఁడ నీ
శీలము నచ్చి భద్రములఁ జెందెద రిందఱు గమ్ము వీటికిన్. 2031

సీ. మంత్రకోవిదు లైనమంత్రులు ఋత్విజు ల్ఘనులు వసిష్ఠాదిమునులు ప్రకృతి
మండలం బాప్తసామంతులు ననుఁ గూడి కోర్కితో నీచిత్రకూటమందె
సంప్రీతితో నిన్ను సామ్రాజ్యపట్టాభిషిక్తునిఁ జేసెద రుక్తభంగి
వీటికిఁ జనుదెంచి వేడ్కతో బాంధవు లలర నిష్కంటకం బైనపూజ్య

తే. రాజ్యమును ధర్మపద్ధతి రమణతోడ, నేలుచు విశేషయుక్తిచే నెల్లవారిఁ
దవిలి వర్ణాశ్రమస్థితు ల్దప్ప కుండ, నరసి పాలింపు మయ్య మహాత్మ నీవు.

వ దేవా యేను సద్గుణబుద్ధిరహితుండ బాలుండ స్థానహీనుండ నీమఱుంగున
దాసభూతుండనై జీవింప నర్హుండ నిన్నుంబాసియొక్కముహూర్తంబైనజీవింప
నర్హుండు కానివాఁడ నట్టియేను భవద్విహీనుండనై రాజ్యం బెత్తెఱంగునం
బాలింప నేర్తు నీ వయోధ్యాపట్టణసింహాసనాధ్యక్షుండవై విబుధులచేతవాస
వుండుం బోలెఁ బ్రకృతులచేత నుపాస్యమానుండవై భుజాబలంబున లోకం
బుల జయించి ఋణత్రయంబువలన విముక్తుండవై వైరుల నందఱ నిర్జించి
సుహృజ్జనంబుల సర్వకామంబులచేత సంతుష్టులం జేయుచు సాధులకెల్ల సంతో
షంబుఁ గావించుచుఁ గోసలరాజ్యంబుఁ బరిపాలింపు మని పలికి వెండియు
ని ట్లనియె. 2033

ఉ. అంకముగా శిరంబు భవదంఘ్రులు సోఁకఁగ మ్రొక్కి వేఁడెదం
బొందుగ వేల్పులం దజుఁడుఁ బోలె సుహృజ్జనకోటియందు నా
యందును బ్రీతి సేర్చి నయ మార నుదంబవివేకహీనవృ
త్తిం దగ నోర్చి యిప్డు కుగతిం బడ కుండఁగఁ దండ్రిఁ గావుమీ. 2034

క. నామాటఁ గైకొనక వన, సీమకుఁ జని తేని రాజశేఖర యేను
న్నీమాడ్కి దాపసుఁడనై, సౌమిత్రియుఁ బోలె వెంటఁ జనుదెంతు రహిన్.

చ. అని యిటు కైకయీతనయుఁ డంజలిఁ జేసి యనేకభంగుల
న్వినయ మెలర్పఁ దన్నుఁ దగ వేఁడిన రాముఁడు తండ్రిమాట నె
మ్మనమున గట్టి చేసి నయ మాలి పురంబు సొరంగ రాదు నా
కనఘ చతుర్దశాబ్దముల కవ్వల వచ్చెద నంచుఁ బల్కినన్. 2036

తే. అద్భుతం బైనయతనిస్థైర్యంబుఁ జూచి, దుఃఖితం బైనజనము సంతోషమొందె
వీటి కిప్పుడె రా నను మాట విని ప్ర,హర్షితం బైనజనము శోకార్తి నొందె.

ఉ. ఆ తెఱఁ గంతఁ జూచి సఖు లమ్మలు మంత్రులు చుట్లు నున్నవా
రాతతదుఃఖశోకమున నశ్రులు నించుచుఁ గైకపట్టి వి
ఖ్యాతచరిత్రుఁ జాలఁ గొనియాడుచు నాతనిఁ గూడి నమ్రులై
భూతనయామనోహరునిఁ బుణ్యచరిత్రుని వేఁడి రత్తఱిన్. 2038

తే. అద్భుతం బైనయతనిస్థైర్యంబుఁ జూచి

యక్కటా యింత కఠినాత్ముఁ డగునె రాముఁ
డనుచుఁ గ్రమ్మఱఁ దత్పదంబునకు వ్రాలి
భరతుఁ డెంతయు శోకంబు ప్రబ్బికొనఁగ. 2039

క. సమ్మతితోడ నయోధ్యకు, రమ్ము ననుం గరుణఁ జూచి రాజ్యం బిదె గై
కొమ్ము నృపాలనశీలివి, కన్నని ప్రార్థించుచుండెఁ గడుభక్తిమెయిన్. 2040

క. క్రమ్మఱ నీక్రియఁ బలికెడు, తమ్ముని వీక్షించి సుగుణధాముఁడు రాముం
డిమ్మెయి ననూనమృదువా, క్యమ్మున నిట్లనుచుఁ బలికె నందఱు వినఁగన్.

చ. అనఘచరిత్ర యాదశరథావనిభర్తకుఁ గైకయందు స
త్తనయుఁడవై జనించి యిటు ధర్మవిరోధము లాడఁ జెల్లునే
పనివడి భ్రాతృవత్సలతఁ బల్కితి దీనఁ గొఱంతలేదు నీ
వినయవివేకశీలములు వేయివిధంబుల నే నెఱుంగనే. 2042

వ. వత్స మనతండ్రి యగుదశరథుండు తొల్లి భవజ్జననిం బెండ్లియాడు నప్పు డీ కైకేయికిం బుట్టినకుమారునకు రాజ్యం బొసంగెద నని కేకయునితోఁ బ్రతిజ్ఞ గావించి వివాహం బయ్యె నాఁటంగోలె నద్దేవి రాజ్యశుల్క యనంబడియె నదియునుం గాక దేవాసురసంగ్రామంబునందు దశరథుం డద్దేవిచేత నారాధితుండై సమర్థుం డగుటను సంతోషవిశేషంబున వరద్వయం బొసంగెనయ్యవ ప్రతిజ్ఞఁ జేసి నీకు రాజ్యాభిషేకంబును నాకు వనవాసంబునుం గా వరంబులు రెండును యాచించె నమ్మహీరమణుండు సత్యవాది గావున ధర్మంబునకు హాని లేకుండ నన్ను వనంబునకుం బొమ్మనియె నిట్లు తండ్రిచేత నియుక్తుండనై పదునాల్గువత్సరంబులు దండకారణ్యంబున నివసింపం బూని సీతాలక్ష్మణసహితుండనై నిర్జనం బైనవనంబునకుం జనుదెంచితి మదీయాభిమతం బనివార్యంబు నీవును బితృనిదేశవ్యవస్థితుండవై రాజ్యంబుఁ గైకొని భవజ్జననికి సంతోషం బొసంగి జనకుని సత్యవాదినిం జేసి కైకేయీఋణంబువలన విముక్తునిం గావించి రక్షింపుము తొల్లి యశస్వి యగుగయునిచే గయాఖ్యప్రదేశంబులయందుఁ బితరుల నుద్దేశించి కొన్నిశ్లోకంబులు గీతంబు లయ్యె వాని తెఱంగెఱింగించెద వినుము. 2043

తే. తలఁపఁ బున్నామనరకంబువలన జనకుఁ
బ్రోచుఁ గావునఁ దనయుండు పుత్త్రుఁ డొండె
గరిమఁ దండ్రిని నాకలోకస్థుఁ జేసి
మనుచుఁ గావునఁ బుత్త్రుఁడు ఘనగుణాఢ్య. 2044

*తే. మఱియుఁ బెక్కురఁ బుత్త్రుల మాన్యగుణుల
ననఘులను బహుశ్రుతులను గనఁగవలయు
నింద ఉండిన వారిలో నెవ్వఁ డేని

గయకుఁ బోవఁడె జనకునిఁ గాచుపొంటె. 2045

చ. అని యిటు ధర్మయుక్తి గయుఁ డాడిన నాతనిమాటఁ బట్టి ము
న్ననఘవిచారు లైననృపు లందఱు నవ్విధ మాచరించి రీ
వనుపమధర్మశీలుఁడవు సర్వగుణుండవు పుణ్యుఁ డైనమ
జ్జనకునిఁ బ్రోవు మాయన కసత్యజదోషము గల్గ కుండఁగన్. 2046

వ. వత్సా నీవు శత్రుఘ్నసహితంబుగా నయోధ్యకుం జని ద్విజాతిసహితుండ వై ప్రజలఁ బాలించుచు శ్వేతాతపత్రచ్ఛాయలం జరించుచు సౌధప్రాసాదహర్మ్యవిమానాగ్రభాగంబుల వసియించి శత్రుఘ్నుండు హితం బాచరించు చుండ సుఖం బుండు మేను సీతాలక్ష్మణసహితంబుగా దండకారణ్యంబుఁ బ్రవేశించి మునివేషంబున మునిసహితుండ నై మృగంబులం బాలించుచు సాంద్రశీతలతరుచ్ఛాయలం జరించుచుఁ బర్ణశాలలయం దధివసించి లక్ష్మణుండు హితం బాచరించు చుండ సుఖం బుండెదఁ బుత్రుల మైనమనము నల్వురము నరేంద్రుని సత్యస్థునిం జేసి విషాదంబు దక్కి వర్తింపుద మని పలికిన నప్పుడు రామభరతుల సంవాదంబు విని జాబాలి యనుబ్రాహ్మణోత్తముండు ధర్మజ్ఞుం డైన రామభద్రునిం జూచి వైదికధర్మరహితం బైనవాక్యంబున ని ట్లనియె. 2047

జాబాలి యను బ్రాహ్మణుఁడు రామున కధర్మ ముపదేశించుట.

ఉ. భూవర జ్ఞానహీనునకుఁ బోలె నిరర్థకబుద్ధి నేఁడు నీ
కేవిధిఁ గల్గె సాధుజను లీగతిఁ జూచిన యుక్త మందు రే
నీవు సమస్తముం దెలియ నేర్తువు నీకొకఁ డర్థధర్మము
ల్లావిరిఁ జెప్పఁగా వలెనె వాసవసన్నిభ పొమ్ము వీటికిన్. 2048

ఉ. ఎక్కడితండ్రి యెవ్వనికి నెవ్వఁడు బాంధవుఁ డేటిధర్మ మిం
దొక్కఁడు పుట్టు చుండ మఱియొక్కఁడె చచ్చుచు నుండుఁ గావునం
దక్కక తల్లి దండ్రి యని ధర్మముఁ బల్కెడువాఁడు బాలిశుం
డెక్కడిమాట నిక్కముగ నెవ్వని కెవ్వఁడు లేఁడు చూడఁగన్. 2049

మ. అరయంగా నొకవీటి కేగి పురుషుం డారేయి వర్తించి తా
మఱునాఁ డొండొకవీటి కేగినక్రియ న్మర్త్యాలికి న్సంతతం
బరుదారం దలిదండ్రు లిల్లును ధనం బావాసమాత్రంబు భూ
వర సుజ్ఞానులు దీనిఁ గైకొనరు సర్వమ్మిథ్య యంచు న్రహిన్. 2050

వ. మహాత్మా పిత్ర్యం బగురాజ్యంబు పరిత్యజించి కుత్సితమార్గంబును దుఃఖప్రదంబును విషమంబును బహుకంటకంబు నగుకాపథంబు నంగీకరించుట కర్తవ్యంబు కాదు పుణ్యసమృద్ధ యగునయోధ్యయందుసామ్రాజ్యదీక్షితుండవై కోసలరాజ్యంబు పరిపాలించుచు మహార్హంబు లైనరాజభోగంబు లనుభవించుచు శక్రుండు త్రివిష్టపంబునందుం బోలె హర్మ్యవిమానప్రాసాదాగ్రమహో

ద్యానంబులందు సుఖలీల విహరించు చుండు మని పలికి వెండియు నిట్లని

తే. దేవ దశరథజనపతి కీవు లేవు, నిర్మలాత్ముఁ డాజనపతి నీకు లేఁడు
ఒక్కరా జతఁ డీవు వే ఱొక్కరాజ, వాతనికి నీకు సంబంధ మరయ లేద

తే. జనకుఁ డన బీజమాత్రంబు జంతువులకుఁ, బరఁగ శుక్లశోణితములు కరుడు
తల్లియుదరంబునందు వర్ధిల్లి పిదప, నిర్మలాత్మకరూప మై నిర్గమించు. 2

క. జనకుం డెచ్చట నున్నాఁ, డనఘా నీవెచట నుంటి వతనికి నీకుం
దనుసంబంధం బెయ్యది, జనకుఁ డనుచు వానితోడఁ జని రే తనయుల్. 2

తే. అనఘచరిత యేభూతంబులందుఁగలియ,నర్హమగునట్టిభూతంబులందుఁ గ
దశరథునకు నీమర్త్యసంతతుల కెల్ల, వసుధలోపల నిది స్వభావంబు చు

క. జనకుం డనఁ దనయుం డన, విను మంతయు భ్రాంతి గాక విశ్రుత మగునే
తనవార లనుచు వగవరు, చనినపరులఁ గూర్చి తత్త్వసంగతు లుర్విన్. 2

వ. మహాత్మా ప్రత్యక్షం బయినసౌఖ్యంబు విడిచి కేవలార్థధర్మసంపాదన
లెవ్వరు గల రట్టివారలంగూర్చి వగచెద వా రీజగంబునఁ గలకాలంబు దు
బనుభవించి తుది వినాశంబు నొందుదురు కేవలప్రత్యక్షసుఖానుభవపరాయ
లగువారి నవలోకించి సంతసించెద నదియునుం గాక. 2

తే. జనకులకు నందనులు పెట్టుశ్రాద్ధ మదియు,వ్యర్థ మగుఁగాక కుడిచి రె వారువ
తనకుఁ దా నెస్వతంత్రుండుతత్త్వవిదుఁడు, చెలఁగిమిథ్యాభివాదంబుఁ జేసె

వ. మహాత్మా యొకనిచేత భుక్తం బైనయన్నంబు వేఱొకని దేహంబుఁ బ్ర
చెనేని మార్గంబునం జనువాని నుద్దేశించి యన్నం బొసంగ వచ్చుఁ దద్
న్నంబు పథికునకుఁ బాథేయం బగు నిట్లు గానం బడ లేదు గావున మృతుఁ
జనకు నుద్దేశించి చేసినశ్రాద్ధం బతనికిఁ జరితార్థంబు గానేరదు జనం బ
శ్రాద్ధం బనియుఁ బ్రతిసాంవత్సరికం బనియు నెయ్యది పితరుల నుద్దేశించిచే
నది యంతయు నన్నంబున కుపద్రవం బంతియె కాని ప్రయోజనం బేమిఁ
లేదు ద్రవ్యగ్రహణకుశలబుద్ధు లగువారిచేత దేవతారాధనంబు గా
వుము యాగదీక్షితుఁడవు గమ్ము తపంబుఁ గావింపు మర్థాదికంబుఁ బరి
జింపు మని దానవశీకరణోపాయంబు లయినగ్రంథంబులు విరచితంబు ల
నని వర్జనీయంబులు తత్త్వదృష్టి విలోకించిన భవం బనాదిసిద్ధంబు తనం
దాన పొడమి తనంతం దాన నశించు దానియుత్పత్తిలయంబులకుఁ బ్ర
షోకఁడు లేఁడు బ్రహ్మావిష్ణురుద్రాదుల బ్రతుకులు మనబ్రతుకులట్ల వారి దేవ
బులు మనదేహంబులుం బోలెఁ గాలవశగతం బెందుచుండు దేహికి సుఖదు
శరీరత్యాగంబులె స్వర్గనరకమోక్షంబులై యుండుఁ బరమధర్మనిరూపణం
లగునానాశాస్త్రసిద్ధాంతంబు లాలోకించి నిశ్చయార్థం బెఱుంగక జనంబు
వలసినచందంబున వాదించుచుండుదు రివియన్నియు ననుమానోపమానా

ప్రతిజ్ఞానంబులై యుండు వ్యవసాయాత్మకంబైనజ్ఞానంబు ప్రత్యక్షంబుప్రత్యక్షజ్ఞానం బెల్లవారికిఁ దెల్లంబై యుండుఁ గావున నీవు పరంబు లేదని నిశ్చయించి ప్రత్యక్షసిద్ధం బైనరాజ్యభోగాదికంబు ప్రతిగ్రహించి పరోక్షంబు పిఱిందికిం ద్రోచి స్వజనసమ్మతం బైనమద్బుద్ధిఁ బురస్కరించుకొని భరతునిచేతఁ బ్రసాదితుండ వై రాజ్యంబుఁ బ్రతిగ్రహించి సుఖంబు లనుభవింపు మని పలికిన విని సత్యప్రవణస్వభావులలో శ్రేష్ఠుండైనరాముండు ధర్మాచలితబుద్ధియై యుక్తియుక్తం బగువాక్యంబున జాబాలి కిట్లనియె. 2059

—రాముఁడు జాబాలిమాటల నిరసించుట.—

తే. అనఘ నుత్ప్రియకామార్థ మరయనెద్ది, పరమయుక్తియుక్తంబుగాఁ బలికితివది
కార్యసంకాశ మైనయకార్య మయ్యె, పథ్యసమ్మిత మైనయపథ్య మయ్యె 2060

తే. అనఘచరిత నిర్మర్యాదుఁ డైనపురుషుఁ, డవని నెవ్వాఁడు వాఁ డనుదినంబు
వృజనయుక్తుండు భిన్నచారిత్రదర్శ, నుండగుచు నపచితి నొందకుండు సభల.

క. ధీరునిఁ బండితమానిని, సూరిని బాలిశుసిఁ బరమశుద్ధుని మలిను
న్సారగ్రాహినిఁ గుత్సితుఁ, జారిత్రమె చెప్పుచుండు సంయమివర్యా. 2062

సీ. శిష్టసమ్మతుఁ డనుశీలవంతుఁడ లక్షణాఢ్యుఁడ నతిశుచి నైనయేను
శిష్టగర్హితుఁడు దుశ్శీలుఁడు లక్షణహీనుఁడు మలినాత్ముఁ డైనవాని
వైఖరి శుభహేతువైదికకర్మంబు విడిచి క్రియావిధివిరహితంబు
భువనసంకర మగుభవదీరితాధర్మ మనిశము ధర్మత్వమునఁ గడంగి

తే. మాన కంగీకరించితినేని ధాత్రి, శఠుని దుర్వృత్తు లోకదూషణుని నన్నుఁ
గాంచి తత్త్వవిదుండు సుకర్మరతుఁడు,యుక్తకార్యుఁడెవ్వాఁడుబహూకరించు.

తే. అనఘ హీనప్రతిజ్ఞ మైనట్టివృత్తి, నలమి తిరుగుచు భవదీరితాచరణము
నెవ్వనికి నుపదేశింతు నిట్టిసాధ, నమున నెబ్భంగిఁ బడయుదు నాకసుఖము.

తే. తాపసోత్తమ లోక మంతయును గామ,వృత్తమై సంతతంబు వర్తించుచుండు
నృపతు లేవృత్తిఁ దాల్చి వర్తింతు రతని,జనము లావృత్తి వర్తింతురనుదినంబు.

తే. అనిశ మనృశంసమును సనాతనము నైన,రాజవృత్తంబు సత్యమై రహివహించు
నట్లు గాన సత్యాత్మకంబయ్యె రాజ్య,మఖిలలోకంబు సత్యంబునందు నిలుచు.

సీ. ఈశ్వరుండును సత్యమే పారఁగాఁ బద్మ యెప్పుడు సత్యము నాశ్రయించి యుండు
సత్యధర్మంబులు స్వర్గమూలంబులు సత్యమూలంబులు సర్వములును
వేదంబులును శాస్త్రవితతులు హుతమును దపములు సత్యమై తనరుచుండు
నమరులు ఋషులు సత్యము సత్యమునకంటెఁ దలపోయఁ బరమపదంబు లేదు

తే. సత్యవాది లోకంబునఁ జతురుఁ డగుచు,నాస్తి యనుచు వాదించెడునరుల నెల్లఁ
గ్రూరసర్పంబులను బోలె నేఱివైచి,ధన్యుఁడై తుది పరమపదంబుఁ గాంచు.

తే. ఒకఁడు లోకంబుఁ బాలించు నొకఁడు కులముఁ

బ్రోచు నొకఁడు దుర్గతికిని బోవు నొకఁడు
స్వర్గమున నుండు నిందఱు వరుసతోడ
నేకభంగిఁ బ్రవర్తించిరే మునీంద్ర. 2068

చ. మునివర సత్యసంధుఁ డగుభూపతి నన్నిటు కాననోర్వికిం
జను మని పల్కె నేనును బ్రసన్నమతి న్సభ యాలకింపఁగాఁ
జనియెద నంచు నీయకొని సమ్మతి వచ్చితి సత్య మూఁది య
జ్జనకునిశాసనంబు కడుసత్య మొనర్పక రిత్తవుత్తునే. 2069

ఆ. వేయి పలుకు లేల వినుము తాపసవర్య, చెలఁగి తండ్రి పంపు సేయువాఁడ
మోహలోభకామముల నైనఁ దగ సత్య, సేతువునకు హానిసేయ నయ్య.

ఆ. విను మసత్యసంధు ననభిజ్ఞు నస్థిర, చిత్తు మలిను సాధువృత్తిశూన్యుఁ
జూచి పితరు లఖిలసురులును వర్జింప, రనుచుఁ బలికి రార్యు లదియు వినమె.

వ. మునీంద్రా యేను సత్యరూపం బైనయీధర్మంబు నాత్మయం దవినాభూతంబుగా నవలోకించెద సత్పురుషాచరితం బైనజటావల్కలాదిభారంబు సత్యరూపధర్మార్థం బభినందించు చుండు భవదుక్తధర్మంబు క్షుద్రనృశంసలుబ్ధపాపకర్ములచేత సేవింపందగినయది గాని యస్మదాదుల కంగీకార్యంబుగా దధర్మప్రచురధర్మలేశయుక్తక్షత్రియధర్మంబుఁ బరిత్యజించెద మనోవాక్కాయజం బైనత్రివిధపాతకకర్మంబు నవ్వలం ద్రోచి పుచ్చి త్రివిధసుకృతకర్మంబు నంగీకరించి సత్యంబునం బ్రవర్తింప వలయు భూకీర్తియశోలక్ష్ములు సత్యవాది యగుపురుషునిం బ్రార్థించుచు నతని స్వర్గగతునిఁ గాఁ దలంచు చుండు నీవు నిశ్చయించి యిది భద్రంబు దీనిం గావింపు మని యుక్తికరంబు లైనవాక్యంబులచేత నన్ను నియోగించితి వది యనార్యంబు దాని నంగీకరింపం దగ దేను గురుసన్నిధి యందుఁ బదునాల్గువత్సరంబులు వనవాసంబుసలిపెద నని ప్రతిజ్ఞఁ జేసి వచ్చితి నప్పుడు మద్వాక్యంబు విని కైకేయి సంప్రహృష్టచిత్త యయ్యె నిప్పుడు గురువచనోల్లంఘనంబుఁ జేసి భరతునివచనం బెట్లు గావింతు గురువాక్యప్రకారంబున వనవాసంబు సేయుచు నియతవన్యాహారుండ నై శుచి నై పుణ్యంబు లైనమూలపుష్పఫలంబులచేత దేవతలఁ బితృదేవతలఁ దృప్తి నొందించుచు సంతుష్టేంద్రియవర్గుండ నై శ్రద్ధధానుండ నై కార్యాకార్యవిచక్షణుండ నై యకృత్రిముఁడ నై పితృవచనపరిపాలనరూపం బైనలోకవర్తనంబు ననుసరించి ప్రవర్తించెద నని పలికి వెండియు నిట్లనియె. 2072

క. కర్మమునఁ గలుగు భద్రము, శర్మదహితకర్మభూమిసంజాతనరు
ల్కర్మములు సేయఁగాఁ దగుఁ, గర్మంబునఁ గాని లేవు జ్ఞానసుఖంబుల్. 2073

చ. అనఘ ధనంజయానిలశశాంకులు కర్మముచేఁ బ్రదీప్తు లై
తనరిరి గాదె శక్రుఁడు శతక్రతువు ల్దగఁ జేసి తా దివం

బున కధినాథుఁ డయ్యె మునిపుంగవు లుగ్రతపంబుఁ జేసి బ్ర
హ్మనిరతు లైరి కర్మమున నందఁగ రా నిది యేది చెప్పుమా. 2074

వ. అని పలికి వెండియు నుగ్రతేజుం డగు రాముండు తన్నాస్తికతర్కరూపవాక్యంబు
విని యమృష్యమాణుండై యతనివాక్యంబులు గర్హించుచు నిట్లనియె. 2075

క. సురవిప్రాతిథిసేవయుఁ, బరాక్రమము భూతదయయుఁ బరహితశీలం
బరుదార సత్యధర్మము, లరయఁగ సురలోకమార్గ మనిరి మునీంద్రుల్. 2076

చ. పరహితబుద్ధి సత్యమును బాడియుఁ దప్పక యుండునట్టి సు
స్థిరతరధర్మబోధనము సేయుచు రాజుల నుద్ధరింప నే
ర్పరి వగునీవె ప్రాకృతునిభంగి ననర్థకనాస్తివాద మి
ప్పురుసునఁ జేసె దింక నల బాలిశు లాడి రనంగఁ జోద్యమే. 2077

చ. అనిమిషలోకమార్గ మని యాప్యులు పల్కఁ బల్కినందునం
దనుమతి విప్రు లట్లు పరతత్త్వముఁ గన్గొని యేకచిత్తులై
మునుకొని ధర్మము న్సకలము న్బచరించుచు జాగరూకులై
యనిశము నాకవాససుఖ మందఁగఁ గోరుచు నుందు రెంతయున్. 2078

ఆ. తా నెఱింగినంత ధర్మంబుఁ దప్పక, నడవ నలయు నొరుల నడప వలయు
నార్యజనులయొద్ద నాడెడుమాటలే, చాలుఁ జాలు ధర్మసంగతంబు. 2079

తే. చూడఁ బడనియర్థంబును జూపుకొఱకుఁ,గాదె సకలశాస్త్రంబులు గలుగు నెల్ల
ధాత్రిఁ బ్రత్యక్ష మగునట్టిధర్మమునకు, సంయమీశ్వర వేఱె శాస్త్రంబు లేల.

వ. మఱియుఁ బరోక్షధర్మంబు మిథ్య యని పరిహరించి ప్రత్యక్షధర్మం బంగీకరిం
చిన శాస్త్రంబు లప్రమాణంబు లగుఁ బ్రత్యక్షధర్మం బెల్లవారికిఁ దెల్లంబై
యుండుఁ గావున నదియె పరమార్థం బయ్యె నేని సర్వజనంబులకు సామా
న్యంబు గలుగు దానం జేసి జ్ఞానాజ్ఞానంబులు లేక వర్ణాశ్రమాచారంబులు
విడిచి జనంబు లిచ్ఛాప్రకారంబున వర్తింతు రక్కారణంబున లోకం బంతయు
సంకరం బై చెడు వైదికమార్గనిష్ఠారహితుండవు చార్వాకమతానుసారిబుద్ధి
ప్రవర్తకుండవు వీతధర్మమార్గుండవు నాస్తికుండ వైననిన్ను సమ్మానించిన
యస్మజ్జనకుండును నిందనీయుం డగుఁ జోరుం డెట్లు నిరాకరణీయుం డగు
నట్లు వేదబాహ్యత్వంబునం బ్రసిద్ధుం డైనబుద్ధుండును నిరాకరణీయుం డై
యుండు నీలోకంబునఁ జార్వాకుని సుగతతుల్యునింగా నెఱుంగం దగుఁగావున
నతండు బహిష్కరించుటకు యోగ్యుండు బుధుం డగువాఁడు నాస్తికవాద
శీలున కాభిముఖ్యం బొసంగం దగదు నీకంటెఁ బురాతను లగునట్టిజ్ఞానాధికు
లగుజనంబులు శుభకర్మంబు లనేకంబులు గావించి యిహపరలోకంబులు
జయించి సంతతంబును గ్రహనక్షత్రాదిరూపంబులం బరిదృశ్యమాను లై
వర్తించు చున్నవారు గావున నది ప్రమాణంబుగాఁ గొని విప్రులు మంగళా

త్మకంబైనకర్మంబును యజ్ఞదానాదికంబునుం గావించుచున్నవారు దానశీలప్రధానులైనవారును ధర్మరతులైనవారును సహింపకులైనవారును వీతమలులై తేజోమయులై మునులై సత్పురుష సమేతులై లోకపూజ్యులై ప్రకాశించుచున్నవా రని పలికినఁ గ్రుద్ధుం డైనరామునిం జూచి యవ్విప్రుండు ప్రీతుండై యనాస్తికంబును దథ్యంబును సత్యంబు నగువచనంబునఁ గోపోపశమనంబు సేయుచు ని ట్లనియె. 2081

చ. కనలకు మేను నాస్తికుఁడఁ గా నిటు నాస్తికవాక్య మేను బ
ల్కినయది గాదు ధర్మ మన లేనిది గా దిది రామ నిక్కమో
దినకరతేజ యీభరతుదీనతఁ జూచి భవన్నివర్తనం
బున కిటు లంటిఁ ద ప్పనక పుణ్యచరిత్ర సహింపు మి త్తఱిన్. 2082

వ. మహాత్మా యేను నాస్తికమతం బవలంబించి నీచేతఁ దిరస్కృతుండనై వెండియుఁ దన్నాస్తికవాదంబుఁ బరిహరించి ప్రకృతిగతుండ నైతి మదీరితం బైనయీనాస్తికవాదంబు ధర్మసంకటకాలప్రయుక్తం బని యెఱుంగుము నాచేత నాస్తికవాదం బెట్లు సముదీరితం బయ్యె నట్టిధర్మసంకటకాలం బిప్పుడు సమాగతం బయ్యె భవన్నివర్తనంబుకొఱకు భరతముఖోల్లాసనంబుకొఱకుఁ గాలానుసరణంబుగా నిట్టి వాదంబు వాదించితి నిది తప్పుగాఁ గొనకు మని యిట్లు సాంత్వవాక్యంబుల ననూనయించుచున్న జాబాలిని వారించి క్రుద్ధుండై యున్న రామునిం జూచి మునిశ్రేష్ఠుం డైనవసిష్ఠుం డిట్లనియె. 2083

చ. అనఘచరిత్ర యేపగిది నైన సుఖార్థ్యుఁడ వైనని న్నవా
రణవనసీమనుండి నగరంబునకు న్మరలింపఁ గోరి యీ
యనువునఁ బల్కెఁ గాక వినయజ్ఞుఁడు లోకగతాగతజ్ఞుఁడు
సజ్జననుతుఁ డైనయీతపసి సత్య మెఱుంగనివాఁడె చెప్పుమా. 2084

క. లోకేశపుత్ర విను మీ, లోకసముత్పత్తివిధ మలుప్తంబుగ న
స్తోకమనీషాప్రౌఢిమఁ, జేకొని బోధింతు నఖిలశిష్టులు వినఁగన్. 2085

వసిష్ఠమహర్షి రామునికి రఘువంశక్రమం బెఱింగించుట.

మ. విను మేకార్ణవ మైనకాలమునఁ బృథ్వీభాగ మెచ్చోట వి
ష్ణునిచే నిర్మిత మయ్యె నచ్చట సురస్తోమంబుతోఁ గూడఁ జ
య్యనఁ బద్మాసనుఁ డుద్భవించె ఘనుఁ డై యయ్యుర్వి మున్నీటిలో
మునుఁగం గేశవుఁ డుద్ధరించెఁ గడిమి న్భూదారవేషంబునన్. 2086

తే. అంత నాకాశసంభవుం డవ్యయాత్ముఁ
డజితుఁ డక్షరుఁ డనఘుఁ డనామయుం డ
నంతుఁ డా బ్రహ్మ పుత్రసహాయుఁ డగుచు
ఘనత నిర్మించె సకలలోకంబు లనఘ. 2087

తే. అట్టిపరమేష్ఠికిఁ గుమారుఁ డై మరీచి
పుట్టె నాతని కలకశ్యపుఁడు జనించె
నమ్మహాత్మున కుదయించె నంశుమంతుఁ
డతనికి జనించె వైవస్వతాఖ్యమనువు. 2088

క. అతనికిఁ బుత్త్రుఁడు త్రిజగ, ద్ధితుఁడు ఋజుఁడు కీర్తిమంతుఁ డిక్ష్వాకు వనా
జితవైరి గలిగె లక్ష్మీ, పతికి విరించుఁడు బోలె భవ్యగుణాఢ్యా. 2089

తే. మొదల నెవ్వాని కమ్మనుముఖ్యుఁ డిచ్చె
వసుంధర నొసంగె నట్టివిశుద్ధచరితు
ననఘు నిక్ష్వాకునృపు నయోధ్యాపురమున
కాదిరాజును గాఁ జూడు మనఘచరిత. 2090

క. ఆయతతేజోనిధి యగు, నాయిక్ష్వాకునకుఁ గుక్షి యనువాఁడు సుతుం
డాయనకుఁ గుమారుఁడు భ, ద్రాయతశౌర్యుఁడు వికుక్షి యనువాఁ డనఘా.

తే. ఆవికుక్షికి నందనుం డయ్యె బాణుఁ, డాతఁ డనరణ్యుఁ గనియె విఖ్యాతకీర్తి
నతఁ డనావృష్టి చోరరోగాద్యుపద్ర, వంబు లేవియు లేకుండ వసుధ నేలె.

క. ఆయనరణ్యునకు సుతుం, డై యనఘుఁడు పృథుఁడు పుట్టె నతఁడు త్రిశంకు
స్థీయుతునిఁ గనియె నాతఁడు, కాయముతోఁ గూడ నాకగతికిం జనియెన్.

క. అట్టిత్రిశంకు జనపతికిఁ, బుట్టె ఘనుఁడు దుంధుమారభూపుఁ డతనికిం
బుట్టె యువనాశ్వుఁ డతనికిఁ, బుట్టె న్మాంధాతృనృపతి పూర్ణేందుఁ డనన్.

శా. ఆరాజేంద్రునకుం గుమారుఁడు సుసంధ్యాఖ్యుండు జన్మించె నా
ధీరుం డంతఁ బ్రసేనజిత్తు ధ్రువసంధిం గాంచె నాపుణ్యుఁ డా
శూరోత్తంసు మహానుభావు భరతుఁ శుద్ధాత్మునిం గాంచె న
వ్వీరశ్రేష్ఠునకు జ్జనించె నసితోర్వీభర్త రమ్యాకృతిన్. 2095

సీ. ఆయసితుండు రాజ్యం బేలుచుండ హైహయతాలజంఘాదు లధికశక్తిఁ
బయి నెత్తి వచ్చిన భండనంబున నోడిపాఱి పర్వతగుహాపజ్జ డాఁగె
నతనికి గర్భిణు లగుపత్ను లిరువురు గల రం దొకర్తె యొకర్తెచూలు
చెఱుపంగఁ దలఁకొని గరముఁ బెట్టిన నది ప్రాలేయగిరి కేగి పరఁగ చ్యవనుఁ

తే. గాంచి మ్రొక్కిన నమ్ముని గరళవహ్ని, నతిదయామృతధారఁ జల్లార్చి దేవి
లోకవిశ్రుతుఁ డైన పుత్త్రుండు నీకుఁ, గలుగు నిదినిక్క మనియనుగ్రహముఁ జేసె.

తే. అంత నక్కాంత సంమదస్వాంత యగుచు
మునికిఁ బ్రణమిల్లి తనగృహంబునకు వచ్చి
యొక్కసుముహూర్తమునఁ బుత్త్రు నుగ్రతేజు
సరసిజదళాక్షుఁ బరమేష్ఠిసమునిఁ గనియె. 2097

తే. గరముతోఁ గూడఁ బుట్టిన కారణమున, సగరుఁ డనుపేర నొప్పి యాచక్రవర్తి

పెక్కుహయమేధములఁ జేసి పెంపు వఱసి, ప్రజల నందఱిఁ బుత్త్రులపగిదిఁ బ్రోచె.

వ. మఱియు నమ్మహీరమణుండు యాగదీక్షితుం డై పర్వకాలంబునందు సలిలవేగం
బున నీప్రజల నందఱ భయంబు నొందించు నట్టిసముద్రంబుఁ దనపుత్త్రులచేత
నద్భుతంబుగాఁ ద్రవ్వించె. 2099

క. అతనికి నసమంజుండను, సుతుఁ డొక్కఁడు పుట్టి ప్రజల నుడిపెట్టుచు దు
ర్మతి యై కడపట జనహిత, రతుఁ డగుతనతండ్రిచే నిరస్తుం డయ్యెన్. 2100

క. ఆయసమంజునకుఁ గుమా, రాయతబలశాలి పుట్టె నంశుమదాఖ్యుం
డాయనఘునకు దిలీపుం, డాయనకు భగీరదాఖ్యుఁ డాత్మజుఁ డయ్యెన్. 2101

తే. ఆభగీరథునకుఁ బుట్టె నల కకుత్థ్సుఁ, డతని కుదయించె రఘువు తదన్వయమునఁ
గొమరుఁ గాంచిన వారు కాకుత్థ్సులనఁగ, రాఘవులనంగ వెలసిరి రామచంద్ర.

క. ఆరఘుపుత్త్రుఁడు సత్యవి, చారుండు ప్రవృద్ధుఁ డతఁడె సౌదాసుఁ డన
న్థీరుఁడు పురుషాదకుఁ డన, నారయఁ గల్మాషపాదుఁ డనఁ దగె నుర్విన్. 2103

వ. ఆకల్మాషపాదునకు శంఖణుండు పుట్టె నతండు వసిష్ఠశాపంబువలన రాక్షసత్వంబు
నొందినకల్మాషపాదునిచేత సైన్యసమేతంబుగా భక్షితుం డయ్యె నాశంఖ
ణునిపుత్త్రుం డైన సుదర్శనునకు నగ్నివర్ణుండు పుట్టె నతనికి శీఘ్రగుండు పుట్టె నత
నికి మరువు పుట్టె మరునకుఁ బ్రశుశ్రుకుండు పుట్టె నతని కంబరీషుండు పుట్టె నత
నికి నహుషుండు పుట్టె నహుషునకు నాభాగుండు పుట్టె నాభాగున కజుండును
సువ్రతుండు నన నిద్దఱు కొడుకులు గలిగి రయ్యజునకు దశరథుండు జన్మించె
నాదశరథునకు నీవు జ్యేష్ఠపుత్త్రుండవై జన్మించితివి పరమపవిత్రం బైన యిక్ష్వాకు
వంశంబునం బుట్టినరాజులలోనఁ బూర్వజునకు రాజ్యాభిషేకంబును గనిష్ఠున
కతనిసేవయు నుచితం బై యుండు నట్టిసనాతనం బైనవంశక్రమాగతధర్మంబు
నిరాకరింపక స్వకీయం బైనరాజ్యం బంగీకరించి ప్రభూతరత్న యగు నిమ్మహి
నెల్లఁ దండ్రియుం బోలెఁ బరిపాలింపు మని యివ్విధంబునం బలికి రాజపురో
హితుం డగు వసిష్ఠుండు వెండియు ధర్మయుక్తం బగువాక్యంబున నిట్లనియె.

వసిష్ఠమహర్షి రామునితో రాజ్యం బంగీకరింపు మని చెప్పుట.

క. నరనాథశిరోమణి విధి, నరసిన జనకుం డనంగ జనయిత్రి యనం
గర మాచార్యుం డనఁగాఁ, బురుషున కీలోకమందు మువ్వురు గురువుల్.

క. కని పెంచుఁ దల్లి జన్మం, బునకుం గారణము తండ్రి బుద్ధిప్రదుఁ డో
ఘనుఁ డాచార్యుఁడు గావున, ననఘా యాచార్యుఁ డెక్కు డామువ్వురిలోన్.

తే. అట్టియేను గకుత్థ్సవంశాబ్ధిచంద్ర, చెలఁగి యిక్ష్వాకులకు క్షేమమిచ్చుచుండ
నైనయాచార్యకుఁడ నైతి నట్లుగాన, నాదువాక్యంబు మీఱంగ రాదు నీకు

తే. ఈసభాసదు లైనమహీదివిజులు, పౌరులును జానపదులును బంధుజనము
లర్థి యాచించుచున్నవా రనఘచరిత, వీరికోరిక వ్యర్థ సేయ మేర గాదు.

తే. ధర్మశీలయు వృద్ధయు నిర్మలమతి,యును గులాచారసంసక్తయును జననియు
నైనకౌసల్యనెమ్మన మలరఁ జేసి, పూర్వరాజులసత్కీర్తిఁ బొందు మనఘ.

చ. అరయ గుణాకరుండు నిఖిలార్థవిదుండు మహానుభావుఁ డీ
భరతుఁడు భ్రాతృవత్సలుఁడు భవ్యచరిత్రుఁడు రాజధర్మమా
ర్గరతుఁడు దానభూతుఁ డటు గావున రాఘవ వీనియంజలిం
గర మనురక్తిఁ గైకొని యఖర్వదయారతిఁ బ్రోవు మిత్తఱిన్. 2110

వ. అని యివ్విధంబున మధురంబుగాఁ బలికిన వసిష్ఠునివాక్యంబు విని పురుష
శ్రేష్ఠుం డగురాముం డిట్లనియె. 2111

రాముఁడు వసిష్ఠుని సమ్మతింపఁ జేయుట.

సీ. తాపసోత్తమ తల్లిదండ్రులు తపములు వ్రతములు దేవతారాధనంబు
లుపవాసములుసల్పి యపురూపముగఁ బుత్త్రుఁగాంచి పుట్టినవెన్కఁ గరముప్రీతి
నన్నవస్త్రాభరణాదిదానమున సంవర్ధనంబునఁ బ్రియవాదనమున
గారవంబునఁ బెంచి కడుఁ బెద్దవానిఁగాఁ జేసిరి వారలసేఁత కేమి

తే. ప్రతికృతి యొనర్పఁగానగుఁ బరమగురుఁడు,జనకుఁడగుదశరథుఁ డెద్దిసంతతంబు
పలుపు మనిపంచె దాని నొదలథరించి, సేయుదునుగాక యది రిత్తసేయనయ్య.

సీ. మునివంశశేఖర మున్ను యావజ్జీవపర్యంతమును వాక్యపాలనమునఁ
బొసఁగఁ బ్రత్యబ్దంబు భూరిభోజనమునఁ బ్రీతితో గయయందుఁ బిండదాన
మున మూఁటిచేతఁ బుత్త్రునకుఁ బుత్త్రత్వంబు ప్రాప్తించునని మీరె పలికి యిప్పు
డన్యధర్మం బిటు లాన తీఁదగునె మహాత్ముఁడు దశరథుం డధివిభుండు

తే. తండ్రి గావున నానృపోత్తమునిమాట, యనృత మేరీతి నగును సత్యంబె కాక
తల్లిదండ్రులు పంచిన దానిఁ జేయ,కొండు తెఱఁగూని యపకీర్తి నొందఁ జాల.

వ. అని యివ్విధంబునం బలికిన రాముని నిశ్చయం బెఱింగి యతనిచిత్తంబు
ప్రసాదాయత్తంబు గాకుండుటకు దుఃఖించుచుఁ బరమోదారుం డగుభర
తుండు పరమదుర్మనస్కుండై సమీపవర్తి యైనసూతుం జూచి కరుణోదారుం
డగురాముండు ప్రసన్నుం డగునందాఁక నిరాహారుం డనై యచగుంటితాన
నుండ నై ధనహీనుం డైన ద్విజునిచందంబున నిప్పర్ణశాలాగ్రభాగంబునఁ
బ్రత్యుపవేశంబుఁ జేసెద నీస్థండిలంబునందుఁ గుశాస్తరణంబు సంఘటింపు
మని పలికిన నాసుమంత్రుండు నివ్వెఱపడి యేమియుం దోఁపక రాముని
వదనంబు విలోకించుచు నూర కున్న నతనిం జూచి భరతుండు తనకుఁ దానె
ధరణిపయిం గుశాస్తరణంబుఁ బఱచికొని దాని నధివసించిన నతనిం జూచి
రాజర్షిసత్తముం డగురాముండు కరుణారసపూరితాంతఃకరణుండై యిట్లనియె.

మ. అనఘా యీదురవస్థ పాలునకుఁ గా కయ్యారె మూర్ధాభిషి
క్తునకుం జెల్లునె లెమ్ము నావచన మెంతో ప్రీతిఁ గైకొ మ్మికన్

జనసీవర్గముతోడఁ గూడి మరలన్ స్థానీయముం జేరి నా
యనవాక్యంబు తొలంగకుండ ఘనరాజ్యశ్రీలఁ బాలింపుమా. 2115

క. అన విని భరతుం డచ్చటి, జనములఁ బరికించి సత్యసంధుం డగురా
మునిమాటచొప్పు వింటిరె,నను దూష్యునిఁ జేయఁ దలఁచినాఁడు మనీషన్.

క. నా విని వారలు కైకే,యీవరనందనునిఁ జూచి యిట్లని రనఘా
దేవరవారికి దయ రా, దేవిధి బోధించువార మింకఁ గృపణతన్. 2117

క. ఈరఘువీరుఁడు సత్యవి, చారుఁడు పితృవాక్యమందు సంస్థితుఁడై యొ
ప్పారెడుఁ గావున ధర్మవి, చారా మరలింప మా కశక్యం బయ్యెన్. 2118

క. అని పలుక నపుడు వారివ,చనములు విని మరల రామచంద్రుఁడు భరతుం
గనుఁగొని వింటివె వీరివ, చనములరెడి సత్యధర్మసంహిత మగుచున్. 2119

క. లెమ్మా యీవ్రత మేటికిఁ, బొమ్మా నామతి గ్రహించి పురమున కటు గై
కొమ్మా కోసలరాజ్యము, గమ్మా ధన్యాత్మకుఁడ వకల్మషధిషణా. 2120

తే. మానితాచార యీపౌరజానపదుల, వచనమును మత్సమీరితవచనము విని
శీఘ్రమున లేచి నన్నును జీవనమును, సంస్పృశింపుము నీ విట్లు సలుపవలదు.

వ. అని పలికి భుజంబులం గ్రుచ్చి యెత్తిన నాభరతుండు ప్రత్యుపవేశంబుఁ
జాలించి శీఘ్రంబున లేచి క్షత్రియానర్హప్రత్యుపవేశనప్రాయశ్చిత్తార్థంబు
జలంబు లుపస్పృశించి యెల్లవారును విన నిట్లనియె. 2122

సీ. ఈసభాసదులు మహీసురప్రవరులు మంత్రు లంద ఱాకర్ణింప నాఁడువాఁడ
రాజ్య మిమ్మని దశరథుని వేఁడఁగ లేదు జనయిత్రి దుర్మంత్రమునకు నీయ
కొనుట లేదు జగద్ధితుని సత్యరతుని నిన్నడవికిఁ బుచ్చుట యది యెఱుంగ
జనకునివాక్యంబు సమకూర్పఁ గర్తవ్య మేని యీరేడేండ్లు కాననమునఁ

తే. దత్ప్రతినిధిత్వమున నేనె తగ వసించు,వాఁడ నీవు మత్ప్రతినిధిత్వమున రాజ్య
మేలు మట్లైన నీరెంట నృపునిమాట, సార్థకత్వంబు నొందు మహానుభావ.

వ. అని పలికిన ధర్మాత్ముం డగు రాముండు తథ్యం బైనతమ్మునివచనంబు విని విస్మి
తుండై పౌరజానపదుల నందఱ విలోకించి యిట్లనియె. 2124

క. పని యుండి మాకు నెయ్యది, మనుజేంద్రుఁ డొసంగె దాని మాఱిచికొనఁగాఁ
జన దిపుడు నాకు భరతున, కనఘాత్మకులార సత్య మది యెట్లయ్యెన్. 2125

వ. మఱియు వనవాసకరణశక్తిమంతుఁడ నైననాచేత వనవాసవిషయంబునందు
జుగుప్సితం బైనప్రతినిధిత్వం బకార్యం బై యుండుఁ గైకేయి యుక్తవాక్యంబె
పలికె దశరథుండు యుక్తధర్మంబె యాచరించె దశరథోద్దిష్టం బైనకార్యం
బవశ్యం బేనును భరతుండును శిరంబునం బూని నడుప వలయు భరతుని
గురుసత్కారశీలునిఁగా జితేంద్రియునిఁగా నెఱుంగుదు మహాత్ముం డైనజన
కుండుసత్యసంధుండగుచుండ భరతునివిషయంబునందు సర్వంబునుంగల్యాణం

బగు నేను బదునాల్గువత్సరంబులు వనవాసంబు సలిపి క్రమ్మఱ నయోధ్యకుం జనుదెంచి ధర్మశీలుం డైనయీభరతునితోఁ గూడ సామ్రాజ్యదీక్షితుండ నయ్యెద నని పలికి వెండియు భరతున కిట్లనియె. 2126

తే. అచలసమధీర జనకునివచన మేను, సార్థకంబుగఁ జేసితి సత్యమూఁది
నీవు నావచనంబున నృపవరేణ్య, సత్యమున నుద్ధరింపుమీ జాలి విడిచి. 2127

వ. అని పలికె నప్పు డప్రతిమతేజు లైనరామభరతులపరస్పరాతిశయితసౌహార్దకృతం బైనసంగమంబుఁ జూచి విస్మితు లై యచ్చటిసిద్ధులును బ్రహ్మర్షిదేవర్షులును గుంపులు గట్టి యెవ్వాని కిట్టి ధర్మజ్ఞులును ధర్మమార్గప్రవర్తకులు నగువీ రిరువురు పుత్త్రు లయి రట్టిదశరథుండు ధన్యుం డయ్యె నని మహాత్ము లగువారిం బ్రశంసించి రందు రావణవధార్థు లగుకొందఱు మహర్షులు రఘుశార్దూలుం డగుభరతుని కిట్లనిరి. 2128

క. ప్రవిమలచిత్త కులీనుం, డవు సువ్రతుఁడవు మహాత్ముఁడవు భూరియశుం
డవు రామునివాక్యము జన, కవాక్యమును బోలె నీవు గైకొనవలయున్.

వ. మహాత్మా యీరఘూత్తమునిఁ బిత్ర్యాణవిముక్తుం గాఁ దలంచెదము కైకేయి ఋణంబువలన విముక్తుం డయి దశరథుండు నాకంబునకుం జనియె నని పలికి యమ్మహర్షులును రాజర్షులును శుభదర్శనుం డగురామునిచేతఁ బూజితు లయి యామంత్రణంబు వడసి గంధర్వసహితంబుగాఁ దమతమనివాసంబులకుం జని రంత భ్రాతృవత్సలుం డైనభరతుండు త్రస్తగాత్రుం డై కేలుదోయిఫాలంబునం గీలించి వెండియు గాద్గదికోక్తి నిట్లనియె. 2130

క. అనఘాత్మ రాజధర్మం, బును గులధర్మక్రమంబు పొలుపుగ మతిఁ గై
కొని మద్వాంఛితము భవ, జ్జననీవాంఛితము కరుణ సమకూర్పవలెన్. 2131

క. పనివడి యే నొక్కరుఁడను, ఘనమతి రాజ్యంబు నేలఁ గా లే ననిశం
బనురక్తు లైనజనముల, ననఘా రంజింపఁ జాల ననుపమశక్తిన్. 2132

క. మునుకొని హాలికులు పర్జ, న్యునిఁ బోలె సుహృజ్జనములు యోధులు మంత్రుల్
ఘనబుద్ధి నిన్నె కులపా, వన మదిఁ గాంక్షించుచున్నవా రనిశంబున్. 2133

క. అలఘుతరధర్మకౌశల, బలమున ఘనబుద్ధియోగబలమునఁ గడు దో
ర్బలమున లోకజనంబుల, నలరింప సమర్థకుండ వైతి మహాత్మా. 2134

వ. అని యిట్లు భరతుండు పరమార్తుం డై రామునిచరణంబులపైఁబడి ప్రాంజలి యై బహుప్రకారంబులం బ్రార్థించిన నారఘుపుంగవుం డతనిసద్భావంబుఁ జూచి కరుణాతరంగితాపాంగుం డై యతని నిజోత్సంగంబున నిడికొని యెల్లవారును విన మత్తహంసస్వరంబున నిట్లనియె. 2135

ఉ. ఎంత నయంబు దెల్పిన మహీవరనందన సారెసారె కి
ట్లింత కృశించె దేటికి నహీనమహీపరిపాలనంబునం

డెంతయు నుత్సహింపుము మహీసురభక్తియు దేవపూజయు
న్స్వాంతమునందు నేమఱక నిల్పుము భూజనరంజనుండ వై. 2136

ఆ. బుద్ధిమంతు లైన భూసురాచార్యుల, సుప్రసిద్ధభృత్య సుహృదమాత్య
మంత్రివరులఁ గూడి మంత్రంబుఁ గావించి, కార్యతంత్రములకుఁ గడఁగు మనఘ.

తే. పార్థివాత్మజ నీవు స్వభావముననె, గుణగరిష్ఠుఁడ వది గాక గురువినీత
బుద్ధినిముఁ బొందెఁ గావునఁ బుడమిఁ బ్రోవఁ, గడుసమర్థుఁడ వైతివి కడఁక యేల.

క. కమలారి కాంతి వీడిన, హిమవంతుం డాత్మనిష్ఠ హిమము విడిచిన
న్గమలనిధి వేల దాఁటినఁ, గ్రమమునఁ బితృశాసనంబు గడతునె యనఘా.

క. అనఘవిచారక కామం, బున నైనను రాజ్యలోభమున నైన భవ
జ్జనయిత్రి నీకుఁ గా నిది, కనికని గావించె నింకఁ గడవఁగ నగునే. 2140

వ. అది చింతింపక కేకయరాజపుత్త్రికయందు మాతృభక్తి విడువక వర్తింపవల
యు నని బహుప్రకారంబుల ననూనయించుచున్న విని భరతుం డెట్టకేలకు
నియ్యకొని పదంపడి తచ్చరణంబులు శిరంబు సోఁకం బ్రణమిల్లి యాదిత్యసమ
తేజుండును బ్రతిపచ్చంద్రదర్శనుండు నగురామున కిట్లనియె. 2141

రాముఁడు తనపాదుకలను భరతున కొసంగుట.

సీ. తరణివంశోత్తమ ధర్మసంహిత మైన భవదీయచిత్త మెబ్భంగి నైన
మరలింప లే నైతి వెరవులు వే యేల హలకులిశాంకుశాద్యఖిలదివ్య
లక్షణభూషిత లలితకాంచనపాదుకాద్వయంబు ధరించి కరుణ నొసఁగు
మక్షీణరాజ్యయోగక్షేమ మనిశముం దత్పాదుకలకు విన్నపముఁ జేయు

ఆ. చుండువాఁడ ననినఁ బుండరీకదళాయ, తాక్షుఁ డైనరాముఁ డలరి యతని
కతిదయాసముద్రుఁ డై ధరించి యొసంగె, భర్మరచితరత్నపాదుకలను. 2142

క. ఇచ్చినఁ గైకొని భరతుం, డిచ్చ నలరి కౌతుకంబు హెచ్చఁగ భక్తిం
జెచ్చెరఁ బ్రణతుం డై నయ, మచ్చుపడఁగ నిట్టు లనియె నన్నకు మరలన్.

సీ. అనఘాత్మ నీకు మాఱాడ రా దని దీని కిప్పుడు భయమున నియ్యకొంటిఁ
బదునాలు గబ్దము ల్పాదుకార్పితరాజ్యకార్యుండ నగుచు వల్కలము లజిన
ములు దాల్చి ఫలమూలములు వేడ్క మెసవుచు నిండినపురిఁ బాసి యొండుచోట
మనమున భవదాగమనముఁ గోరుచుఁ గాల మొకరీతిఁ గడపుచు నుండువాఁడ

తే. వాసవోపమ సమయాంతవాసరమునఁ, గనులపండువుగా నిన్నుఁ గాంచ నేని
సొరిది మండెడిచిచ్చులో నుఱుకువాఁడఁ, జంద్రసూర్యాగ్నులొక్కటసాక్షి గాఁగ.

తే. అనినఁ దమ్ముని దృఢభక్తి కలరి రాముఁ, డతని ప్రతిన కొడంబడి సాదరముగ
నవుడు కౌఁగిటఁ జేర్చి మహానురాగ, భరితహృదయుఁ డై యిట్లనిపలికె మరల.

తే. అనఘచరిత కైకేయి నత్యంతభక్తిఁ, బ్రోవు మనిశంబు నటుగాక రోష మూఁది
కనలి దూషించితేని భూతనయచేత, నరయ నాచేత శప్తుఁడ వౌదు వింక.

—భరతుఁడు శత్రుఘ్నసహితుం డై చిత్రకూటంబునుండి వెడలుట.—

వ. అని పలికి బాష్పపరీతలోచనుం డై యాలింగనంబుఁ జేసి భరతుని సముచితంబుగా వీడ్కొనిన నతండు స్వలంకృతం బైనతదీయపాదుకాద్వయంబు ప్రతిగ్రహించి ధర్మవిదుండు కావునఁ బ్రదక్షిణంబు గావించి శత్రుంజయనాగశీర్షంబునం బెట్టిపదంపడి నిజశీర్షంబున నిడికొని రథారూఢుం డయ్యె నంత నారఘువంశవర్ధనుం డగురాముండు శత్రుఘ్నునిం గౌఁగిలించికొని సాదరంబుగా వీడ్కొని పదంపడి గురువృద్ధమంత్రిభృత్యప్రభృతుల నందఱ నానుపూర్విమెయి సముచితప్రకారంబున సంభాషించి వీడ్కొనియె నప్పుడు బాష్పగృహీతకంఠు లై తల్లు లందఱు దుఃఖంబున నతని విడిచి పోనం జాల కున్న నమ్మహానుభావుండు వారి నందఱ నభినందించి ప్రయాణంబున కొడంబఱిచి రోదనంబు సేయుచు సీతాలక్ష్మణసహితంబుగాఁ బర్ణశాలఁ బ్రవేశించె నంత. 2147

క. భరతుఁడు తత్పాదుకలను, బరువడి తనశిరముఁ జేర్చి భక్తి యలరఁగా
నరదం బెక్కి సుమిత్రా, వరసుతసహితముగ నరిగె బలములు గొలువన్. 2148

వ. పదంపడి వసిష్ఠుండును వామదేవుండును జాబాలియు నమోఘకార్యవిచారనైపుణ్యంబునఁ బూజితు లైనమంత్రులును యథార్హయానంబు లెక్కి మందాకినీనది నుద్దేశించి ప్రాఙ్ముఖు లై చిత్రకూటపర్వతంబునకుఁ బ్రదక్షిణంబుగాఁ దిరిగి యగ్రభాగంబునం జనిరి యిత్తెఱంగున భరతుండు ససైన్యుం డై నానావిధ మనోహరధాతుసహస్రంబు లవలోకించుచుఁ జిత్రకూటనగపార్శ్వంబునం జని చని మహాత్ముండు భరద్వాజుం డెచ్చట నివసించి యుండు నట్టిపుణ్యాశ్రమంబు సేరం జని యందు రథంబు డిగ్గి పాదచారి యై యమ్మునికడకుం జని నమస్కరించిన నతండు సంతుష్టాంతరంగుం డై భరతున కిట్లనియె. 2149

క. అనఘాత్మ పోయి వచ్చితె, ప్రణుతగుణుం డైనరామభద్రుసకాశం
బున కచ్చటివృత్తాంతము, వినిపింపఁ గదయ్య మాకు విన నగు నేనిన్ 2150

—భరతుఁడు రామానుమతంబు భరద్వాజున కెఱింగించుట.—

ఉ. నా విని యత్తపస్వికులనాథునితో భరతుండు పల్కె నో
పావనశీల యేనును నృపాలపురోహితుఁ డివసిష్ఠుఁడు
న్వేవిధుల న్రఘూత్తముని వేఁడిన నానృపధర్మవేది సం
భావనఁ జేసి యిట్లనియె మక్కువతోడ వసిష్ఠమౌనికిన్. 2151

క. గురువర్య యెందుఁగాథలు, గఱపెద రిట్లేల తండ్రి గఱపినకరణి
న్దిరముగఁ బదునా ల్గబ్దము, లరణ్యమున నుండువాఁడ నతిథియుక్తిన్ 2152

వ. అనిన వసిష్ఠుండు వాక్యజ్ఞుండు గావున యుక్తియుక్తం బగువాక్యంబున మహాప్రాజ్ఞుం డగురామున కిట్లనియె. 2153

క. అటు లైన సకలరాజను, కుటఖచితమహార్హరత్నకోటిమయూఖో
ద్ఘటితమణిహేమపాదుక, లిటు దయసేయుము మహాత్మ కృప గలదేనిన్.

ఆ. అనిన నట్ల కాక యని ప్రాఙ్ముఖుం డై ధ,రించి రాఘవుండు సముచితమణి
పాదుకల నొసంగె నాదు రాజ్యార్థంబు, కన్నుఁగొనలఁ గరుణ గడలుకొనఁగ.

వ. ఇవ్విధంబున నద్దివ్యపాదుక లొసంగినం బ్రతిగ్రహించి యమ్మహాత్మునిచేత ననుజ్ఞాతుండనై క్రమ్మఱ నయోధ్యకుం బోవుచున్నవాఁడ నని సర్వంబు నెఱింగించిన శుభం బైన భరతునివాక్యంబు విని యమ్మునిపుంగవుండు సంతుష్టాంతరంగుం డై వెండియు ని ట్లనియె. 2156

తే. పరఁగ సలిలంబు నిమ్నభూభాగమునకు, నోడిగిల్లినపగిది గుణోన్నతత్వ
మనఘ నీయందుఁ జేరు నీయట్టి శీల, ధర్మవంతుల కిది విచిత్రంబు గాదు.

తే. అనఘ యెవ్వాని కిట్టిధన్యాత్మకుఁడవు, ధర్మశీలుఁడ వీవు పుత్రకుఁడ వైతి
వట్టిమీయయ్య దశరథక్ష్మాధిపుండు,వసుధఁ జచ్చియు మనియున్నవాఁడుగాదె.

వ. అని బహుప్రకారంబుల సాదరంబుగా నభినందించి యుక్తవాక్యంబుల దీవించి యనిచిన భరతుం డమ్మహామునికిఁ బ్రదక్షిణంబు సారెసారెకుఁ దదీయ చరణంబులకుం బ్రణతుం డై సముచితంబుగా నామంత్రణంబు వడసి చతురంగ బలంబును మంత్రులును దనవెంట నరుగుదేరం గదలి రయంబునం బోవుచుఁ గల్లోలమాలిని యగుయమునానది నుత్తరించి యవ్వలఁ బావనజలసంపూర్ణ యగుగంగానది దాఁటి శృంగిబేరపురంబు నతిక్రమించి యవ్వల బహుదూరం బరిగి పురోభాగంబున. 2159

తే. దశరథునిచేత జానకీధవునిచేత, విడువఁబడినకారణమున విప్రణష్ట
నాథ యై దీన యై నిరానంద యై వి,పన్న యై శూన్యగేహ యై యున్నదాని.

తే. శ్వానమార్జాలఘూకసంచలిత యైన, దాని నాలీనవరగజ యైనదాని
సాంద్రతిమిరపటలపరిచ్ఛన్నకృష్ణ, పక్షయామినికరణిఁ జూపట్టుదాని. 2161

తే. భీషణాంగారకగ్రహపీడిత యగు, రోహిణీదేవిభంగి నుత్సాహ ముడిగి
కంపమొంది నిష్కాంతి యై సొంపుదక్కి, యున్నదాని దైన్యంబుఁ గైకొన్నదాని.

వ. మఱియు రాహుగ్రస్త యైనచంద్రచంద్రికకైవడి యల్పోష్ణక్షుబ్ధసలిల యై ఘర్మోత్తప్తవిహంగమ యై లీనమీనఝషగ్రాహ యై కృశించి యున్న గిరినదిపగిదిం గనుపట్టుచున్నదాని మఱియును. 2163

తే. తొలుతఁదప్తహేమముభంగి వెలుఁగుచుండి, వెనుకదధ్యాదికంబుచేవేల్వఁబడిల
యంబు నొందినఘనసవనాగ్నిజనిత- కీలకైవడిఁ జెడువడి క్రాలుదాని.

తే. వినిహతాయుధకవచ కేతనపదాతి, యై వినాశితనాయక యై విరుగ్ణ
వాజివారణరథ యై ఘనాజిభూమి, నొప్పు సెడినవాహినిభంగి నున్నదాని.

తే. మొదలరవఫేనయుక్త యై పిదప శాంత,మారుతోద్ధూత యై సొంపుమాలిరయము

మాలి యపగతనిస్వన మైనసాగ, రోత్థితోర్మిచందంబున నున్నదాని. 2166

భరతుఁడు దవ్వులనుండి యయోధ్యం గనుంగొనుట.

వ. మఱియు సుత్యాకాలంబు నివృత్తం బగు చుండ నభిరూపకు లైనయాజకుల
చేత యజ్ఞాయుధంబులచేతఁ బరిత్యక్తం బగుటవలన నిశ్శబ్దం బై యున్న
యాగవేదికచందంబున గోవృషంబును బాసి తృణంబు మెసవక గోష్ఠమధ్యం
బునం బరిభ్రమించు చున్నగోపంక్తి చాడ్పున నుస్నిగ్ధంబు లయి పద్మరాగాది
జాతిరత్నంబులచేత వియుక్త యయినసూతనముక్తావళిలాగునఁ బుణ్యక్షయంబు
వలన స్థానచలిత యై దివంబున నుండి పుడమిం బడి సంహృతద్యుతివిస్తార
యైనతారపగిది వసంతకాలాంతంబునఁ బుష్పోపేత యై మత్తభ్రమరశాలిని
యై యుండి వేగవంతం బయినదావాగ్నిచేత నీషద్దగ్ధ యై వాడి యున్నవన
లతకై వడిఁ బ్రచ్ఛన్నశశినక్షత్ర యై మేఘంబులచేత నావరింపంబడి యున్న
దివంబుకరణిఁ బరిక్షీణమదోద్యత్తమంబు లైనభిన్నశరావంబులచేత నభిసంవృత
యై సమాహతమత్తజన యై యసంస్కృత యై యనావృతప్రదేశంబునం దున్న
పానభూమిమాడ్కి భిన్నపాత్రసమావృత యై భిన్నభూమితల యయి యుపయు
క్తోదక యై భగ్న యై పుడమిం గూలి యున్నపానీయశాలభంగిఁ జాపంబునందు
సమారోపిత యై బద్ధకోటిద్వయపాశ యై యుండి రణమధ్యంబునఁ బ్రతివీరుల
బాణంబులచేతఁ బరిచ్ఛిన్న యై వింట నుండి జాఱి పుడమిం బడినమౌర్వీరీతి
యుద్ధశౌండుం డగుహయారోహకుని వేగంబున వహించి యలసి యవరోపితా
శ్వభూషణ యై విడువంబడినబాలబడబయట్లు శుష్కతోయయు భిన్నతటయు
హృతోత్పలయు నై బహుమత్స్యకూర్మసంవృత యగువాపిభాతి నప్రహృష్టుం
డై శోకసంతప్తుం డై భూషణానులేపనవర్జితుం డైనపురుషునిగాత్రయష్టివిధం
బున నిబిడం బయినప్రావృట్కాలంబునందు నీలజీమూతంబులచేతం గప్పఁబడిన
భాస్కరరశ్మిపోలువున సొంపు సెడి యున్నదాని నయోధ్య నవలోకించి భర
తుండు పరమదుఃఖితుం డై యప్పురంబుఁ బ్రవేశించి రాజమార్గంబునం బోవుచు
సారథి కిట్లనియె. 2167

భరతుఁ డయోధ్యం బ్రవేశించి యందలిదుఃఖనిమిత్తంబుల సారథికిం జెప్పుట.

క. అనఘా యీనగరంబున, మనుపటివలెఁ బణవపటహమురజాద్యసువా
ద్యనినాదంబులు గీత, స్వనములు వినరావు కర్ణశర్మకరము లై. 2168

తే. వారుణీమదగంధంబు భూరిమాల్య, సౌరభము చందనాగరుచారుధూప
వాసనలు నవ్యకస్తూరివరపరిమళ, మింపు సొంపార నేఁడు వాసింప దకట.

క. అనఘా రథనేమిఘన, స్వనములు హయహేషితములు వరవారణస
న్నినదంబు లిప్పు డిప్పురి, వినరావు సఖా రఘుప్రవీరుఁడు లేమిన్. 2170

తే. చందన మలంది క్రొవ్విరిసరులుదుఱిమి, పురుషులనురూప లైనసుందరులఁగూడి

యుపవనంబులఁ గ్రీడింప నుత్సహింప, హార రఘుపుంగవుఁడు లేనికారణమున.

తే. అకట యీపీటిసొబగు మహానుభావుఁ, డైన రామునిచే హతమయ్యె నేఁడు
వృష్టిధారానమన్వితవిశదవక్షు, రాత్రికై వడి నున్నది రమణ దక్కి. 2172

వ. మఱియు నపురూపంబుగా సమాగతం బైనమహోత్సవంబుకరణి మధ్యాశ్రిత యగురాముండు నిదాఘకాలంబునందలిమేఘుంబుకై వడి నీనగరంబునం దెన్నఁడు హర్షంబుఁ బుట్టించు నీరాజమార్గంబులు చారువేషధరు లగుపుడు షులమందాంచితగమనంబులచేత శోభితంబులు గా కున్నవి యని యిత్తెఱం గున బహువిధదుఃఖాలాపంబు లాడుచు సింహహీనం బైనపర్వతకందరంబు చాడ్పున రాజహీనం బై పాడఱి యున్నపితృమందిరంబుఁ బ్రవేశించి తొల్లి దేవాసురసంగ్రామంబునందు స్వర్భానునిచేత భానుండు పరాజితుం డగుచుండ నభాస్కరం బైనదినంబుభంగి నుజ్ఝితప్రభం బైయున్న యంతఃపురంబు విలోకించి కన్నీరు నించి తల్లుల నందఱ స్వగృహంబులకుం బంచి మనంబున దుఃఖించి వసిష్ఠాదిగురువుల నవలోకించి యిట్లనియె. 2173

భరతుఁడు వసిష్ఠాదులతో నయోధ్యలో వాసముఁ జేయఁజాల ననుట.

చ. నృపతి త్రివిష్టపంబునకు నేగుచు నుండఁగఁ గానలేయుఁడుం
వవసివిధంబున న్వనపదంబునకుం జను చుండ నిత్యము
న్వ్యపగతకాంతి యై భయద మై గహనాకృతి నున్నపీటియం
దిపుడు నసింపఁజాలఁ బరిహీనవిశాలమనోరథుండ నై. 2174

క. రామాగమనముఁ గోరుచుఁ, గామితములు మాని విహితగతి మునివృత్తి
న్నేమంబున నలనంది, గ్రామంబున నుండువాఁడఁ గాతుక మలరన్. 2175

క. అని పలికినఁ గైకేయీ, తనయునికుశలోక్తి విని ప్రధానులు సచివుల్
మునివిభుఁడు వసిష్ఠుండును, వినయంబున నిట్టు లనిరి వెండియుఁ బ్రీతిన్. 2176

తే. భ్రాతృవాత్సల్యమున నీవు పలికి నట్టి, లపిత మది శ్లాఘనీయమై విపులమోద
కారియయియున్నదంతయు ఘనవివేకి, వైననీకిది యనురూప మగుట యరుదె

తే. భ్రాతృసౌహార్దస్థితుఁడవు పండితుఁడవు, బంధులుబ్ధుఁడ వధికసత్పథగతుండ
వైననీవచనంబు ధరాధినాథ, పుత్ర యెవ్వాని కైనను బొగడఁ దగదె. 2178

భరతుండు సైన్యసమేతముగా నందిగ్రామముఁ జేరుట.

వ. అని పలికిన యథాభిలషితం బైననారలప్రియవాక్యం బాకర్ణించి ప్రహృష్టవదనుం డై తల్లుల కందఱ కభివాదనంబుఁ జేసి శత్రుఘ్నసహితంబుగా రథం బెక్కి మంత్రిపురోహితసహితుం డై రామపాదుకలు శిరంబున నిడికొని ప్రాఙ్ముఖంబుగా నందిగ్రామంబునకుం జనియె నతనియగ్రభాగంబున వసిష్ఠాదిమహామునులును మంత్రులును యథార్హయానంబులం జనిరి గజాశ్వరథపదాతులును బురవాసులు నతనివెనుకం జని రిట్లు భరతుండు నందిగ్రామంబు

ప్రవేశించి రథంబు డిగ్గి వసిష్ఠాదిగురువుల నవలోకించి యీరాజ్యంబు సమ్య
ఙ్నిక్షిప్తద్రవ్యంబుకరణి రామునిచేత నాకు దత్తం బయ్యె హేమభూషితంబు
లయినయీపాదుకలు యోగక్షేమంబు వహింపఁగలయవి యని పలికి దుఃఖి
తుండై వెండియుఁ బాదుకలు శిరంబున నిడికొని ప్రకృతిమండలంబు నవ
లోకించి యిట్లనియె. 2179

సీ. రమణీయతరచామరంబులు వీవుఁడు పట్టుఁడు ఛత్రంబు పాదుకలకు
ననిశంబు మద్గురుం డైనరామునిపాదకమలరజస్స్నిక్తకమ్రహేమ
పాదుకాయుగళిప్రభావంబుచే రాజ్యమందు ధర్మంబు నిరంతరముగ
వర్ధిల్లుచుండు నీవరపాదుకాప్రతినిధి రాఘవునిచేత నిరుపమకృప

తే. వెలయ నిక్షిప్త మయ్యె నేనలఘుభక్తి, రాఘవునిరాకఁ గోరుచు రమణతోడ
దీనిఁ బాలించుచుండెద మానితముగ, భక్తి గొలువుఁడు మీర లీపాదుకలను.

చ. కడువడి రామపాదములఁ గ్రమ్మఱ నీకమనీయపాదుకల్
దొడిగి తదంఘ్రిమూలములు తోడనె యాదల సోఁక మ్రొక్కి సొం
పడరఁగ రాజ్యభారము రయంబున నమ్మహనీయమూర్తిపై
నిడి శ్రమ మెల్ల వీడి గురువృత్తిత నున్నతిమై భజించెదన్. 2181

తే. అడవినుండి యేతెంచిన యగ్రజునకు, నీయయోధ్య నీసామ్రాజ్య మీసువర్ణ
పాదుకాద్వయ మర్పించి పరమభక్తి, యలరఁ గొల్చెద ధూతపాపాలి నగుచు.

-ఇఇ భరతుఁడు రామపాదుకలకు రాజ్యాభిషేకముఁ గావించుట. ఇఇ-

తే. ఆప్తులెల్ల ముదంబున నలరుచుండ, రామచంద్రుఁడు పూజ్యసామ్రాజ్యపదవి
చేకొని సమస్తజనుల రక్షించుచుండు, నాఁడుగా ఫలియించుట నాతపంబు.

తే. గరిమనభిషిక్తుఁడైనరాఘవునిఁగాంచి, చెలఁగి ప్రజలెల్లఁ గడుసంతసించుచుంద
రపుడు నీరాజ్యమునకంటెవిపులయశము,హర్షము చతుర్గుణాధికం బగునిజంబు.

-ఇఇ మునులు శ్రీరామునిఁ జూచి గుసగుస లాడుకొనుట. ఇఇ-

వ. అని బహుప్రకారంబుల దీనుండై విలపించుచు మహాయశుండును భ్రాతృ
వత్సలుండును బ్రతిజ్ఞాతత్పరుండు నగుభరతుండు వల్కలజటాధారియై ముని
వేషధరుండై సైన్యసమేతంబుగా నందిగ్రామంబున నివసించి రామపాదు
కలకు రాజ్యాభిషేకంబుఁ గావించి పాదుకాపరతంత్రుం డై సర్వకృత్యంబు
పాదుకలకు విన్నవించుచు నెద్ది యేని రాజ్యపరిపాలనరూపకృత్యంబును వస్త్ర
పుష్పఫలాదికోపాయనంబును మొదల పాదుకలకు నివేదించి పదంపడి
సమస్తకృత్యంబును యుక్తప్రకారంబునం గావించుచు రామాగమనకాంక్షి
యై రాజ్యంబు సేయుచుండె నిక్కడఁ జిత్రకూటంబున భరతుం డయో
ధ్యకుం జనిన యనంతరంబ రాముండు సీతాలక్ష్మణసహితంబుగా సుఖాసీ
నుండై యుండె నప్పుడు తదాశ్రమనివాసు లగుతాపసులు రాముని నుద్దేశించి

నయనభ్రూకుటివిక్షేపణంబులును బరస్పరముఖావలోకనంబులును నితరేతర
రహస్యకథలుం గావించిన నారఘుపుంగవుం డింగితాకారాదులచేత వారల
సభయోత్సుకత్వంబు వీక్షించి చిత్తంబున సంజాతశంకుండై యంజలిఁగీలించి
కులపతి యగుమునిపతి కిట్లనియె. 2185

సీ. మునినాథ యిమ్మహామునుల మోములఁ జూడ నొక్కచందంబున నున్న వేల
పూని నావలన నేమైన నేరము గల్గెనే ప్రమాదంబున నీప్రబుద్ధుఁ
డైన సౌమిత్రి యన్యాయంబుఁ జేసెనే సేవఁ గావించెడు సీతయందు
దోష మొక్కింతైనఁ దోఁచెనే సందియ మగుచున్న దానతి మ్మనుచుఁ బలుక

తే. విని తపోవృద్ధుఁడును వయోవృద్ధుఁ డధిక, తేజుఁ డగుసమ్మహామునితిలకుఁ డపుడు
వార్ధకంబున నెమ్మేనువడఁక రాముఁ, జూచి యిట్లని పలికె నుత్సుకత మెఱయ.

తే. అనఘ కల్యాణసత్త్వయు ననుపమాన, ధర్మశీలయుఁ బుణ్యతత్పరయు వంశ
శీలపరిపాలినియు నైన సీతయందు, దుష్టమతి కైనఁ బొడమునె దోషశంక.

కులపతి యగుమహర్షి రామునకు ఖరాసురబాధ నెఱింగించుట.

క. జడదారులకు వికారము, కడువడి భవదర్థమందుఁ గలిగె నిశాటుల్
విడువక యొనర్చుబాధల, కుడుకుచు గుసగుసలు వోవుచున్నా రనఘా. 2188

క. ఈవనమున ఖరుఁ డనఁగా, రావణతమ్ముం డొకండు రాక్షసుఁ డతిరో
షావిష్టుఁ డై జనస్థా, నావాసుల మునుల ననిశ మారట పెట్టున్. 2189

క. జితకాశియుఁ బురుషాదకుఁ, డతిదుష్టుఁడు క్రూరచిత్తుఁ డవలిప్తుఁడు దు
ర్మతి యైనయన్నిశాటుఁడు, చతురత నిన్నుఁ గని సహింపఁ జాలఁ డధీశా. 2190

మును లందఱుఁ జిత్రకూటమును వదలి యొండు స్థలమునకుఁ బోవుట.

వ. మఱియు మహానుభావుండ వైన నీవిచ్చటికిం జనుదెంచిన నాఁటనుండి విశేషించి
విరూపు లగురాక్షసులు తాపసులకు విప్రకారంబు సేయుచు జుగుప్సితంబులును
దూషితంబులును నానారూపంబులును వికృతదర్శనంబులు నగురూపంబులచేత
భయంబులు పుట్టించుచు మ్రోల నిలిచి యప్రశస్తంబు లగునశుచిద్రవ్యంబులు
ప్రయోగించి మఱి కొందఱ మునుల వధించుచు నయ్యయాశ్రమస్థానంబుల
యందు విదితంబు గాకుండ దాఁగియుండి యవసరం బెఱింగి తాపసులవినాశంబు
నొందించి విహరించుచు హోమంబుగావించునప్పుడు కలశంబులువోనడుచుచు
వహ్నికుండంబులలోన సలిలంబునించుచు స్రువాదిసాధనంబులునిర్మూలంబులు
సేయుచు నిట్లనేకప్రకారంబుల దురాత్ములగురాక్షసులు బాధించుచున్నవా
రద్దానవులచేత నపవిత్రితంబు లైనయాశ్రమంబులు విడిచి యొండుదేశంబు
నకుం బోవ సమకట్టి మహర్షు లందఱు నన్నుఁ బ్రేరించుచున్నవా రద్దురాత్ము
లచేతఁ దాపసులశరీరంబు లన్నియు హింసితంబు లయ్యె నింక నిచ్చట నిలు
వం జాల మీయాశ్రమంబునకుఁ గొండొకదూరంబున బహుమూలఫలోద

కం బైనకణ్వమహామునిపుణ్యాశ్రమం బొప్పుచున్న దచ్చటికిం జని శిష్యగణసమేతంబుగా నివసించెదము ఖరుండు మీయందును విప్రకారంబుఁ గావించుఁ గావున నీ విచ్చట నుండవలదు సమాధానం బగు నేని మాతోడం జనుదెమ్ము సమర్థున కైనను గళత్రసహితునకు నిచ్చటినివాసంబు సందేహజనకంబును దుఃఖకారణంబు నై యుండు ననిన నమ్మునిపతివచనంబు విని రాఘవుం డే నుండ మీకు భయం బేమి యేను రక్షించెద నని యుత్తరవాక్యంబులచేత నిరోధించిన నమ్మతింపక యత్తాపసోత్తముండు రాము నభినందించి యామంత్రణంబు వడసి యయ్యాశ్రమంబు విడిచి ఋషిసంఘాతసమన్వితంబుగా నరిగె నంత రాముండు ఋషిగణంబుల నొండుదేశంబున కనిచి కులపతి కభివాదనంబుఁ జేసి యమ్మహాత్మునిచేత నుపదిష్టప్రయోజనుం డై క్రమ్మఱ నిజాశ్రమంబు ప్రవేశించి యయ్యాశ్రమంబు మునిశూన్యత్వంబునఁ బరిత్యాజ్యం బైనను మునివిషయప్రేమాతిశయంబున కొంతకాలంబు పరిత్యజింప కుండి పదంపడి మునిసందిష్టభావిప్రయోజనం బాలోచించి బహుకారణంబులచేత మునిరహితం బైనతదాశ్రమంబున నుండుటకు సహింపక తనమనంబున. 2191

ఆ. ఇచటనాకుభరతుఁడిపుడుదృష్టుండయ్యె, మంత్రిభృత్యసుహృదమాత్యమాతృ
నగరవాసు లెల్ల నాయున్నకందువ, దెలిసి రింక నిచట నిలువఁ దగదు. 2192

క. భారతభూరిస్కంధా, వారనివేశంబుచేత వరహస్త్యశ్వో
దారకరీషంబులచే, నీరమ్యాచలము మిగుల మృదితం బయ్యెన్. 2193

క. కావున వేఱొకచోటికిఁ, బోవలె నని నిశ్చయించి భూమిజయు సుమి
త్రావరపుత్త్రుఁడు తోడన, వావిరిఁ జనుదేర నచటు వాసి రయమునన్. 2194

-ఃః రాముఁడు సీతాలక్ష్మణసహితముగా నత్రిమహర్షియాశ్రమమునకుఁ బోవుట. ఃః-

ఆ. అమ్మహానుభావుఁ డత్రిమహాముని, యాశ్రమమున కరిగి యమ్మహాత్ము
చరణపంకజముల కెఱఁగిన నమ్మౌని, కన్నకొడుకునట్ల గారవించి 2195

ఆ. సాదరంబు గాఁగ నాతిథ్య మొసఁగి సౌ, మిత్రి నాదరించి మిత్రవంశ
రాజ్యలక్ష్మిఁ బోలె రాజిల్లుచున్నయు, ర్వీకుమారి గారవించి మఱియు. 2196

ఉ. వృద్ధను బుణ్యశీలను బవిత్రచరిత్రను ధర్మచారిణిన్
శుద్ధవివేకయుక్త ననసూయను దాపసి నమ్మహాతప
స్సిద్ధను లోకసత్కృతను జీరి రఘూత్తముఁ జూచి మౌనస
ద్బద్ధనవప్రమోదుఁ డయి భవ్యచరిత్రుఁడు మౌని యిట్లనున్. 2197

సీ. రఘువర్య దశవత్సరం బనావృష్టిచేఁ దగిలి లోకము దగ్ధ మగుచు నుండఁ
గడువడి నేసాధ్వి ఘనతపోమహిమచే ఫలమూలములు జలంబులు సృజించె
దశసహస్రాబ్దము ల్దారుణగతి నేతపస్విని యుగ్రతపంబు సలిపెఁ
దగ ననసూయావ్రతంబుల నేసతి యంతరాయంబుల నవలఁ ద్రోచె

తే. దేవకార్యనిమిత్త మే దేవి మొనసి, తవిలి దశరాత్ర మేకరాత్రముగఁ జేసె
నట్టియీపుణ్యశీల నీ కనవరతము, జననిగతిఁ బూజనీయ యై తనరు చుండు.
తే. అఖిలభూతనమస్కార్య యైనయీతపస్విని స్వకీయకర్మసంపదలచేత
వసుధ ననసూయయనఁ బేరువడసెఁ బ్రీతి, జనకపుత్రి మ్రొక్కుమీసాధ్వికిపుడు.

సీతాదేవి యనసూయాదేవికి నమస్కరించుట

వ. అని పలికిన నారఘువల్లభుం డమ్మహామునిపలుకుల కలరి సీత నవలోకించి దేవి మునిముఖేరితం బైనవాక్యంబు వింటివే శ్రేయస్కరం బై యున్న దట్లు గావింపు మనిన నమ్మహీపుత్రి రామవచనప్రకారంబున నమ్మునిపత్నికడకుం జని శ్లథసంధి బంధావయవసన్నివేశయు సంజాతవలితాంగియు జరాపాండురమూర్ధజయు నక్రోధనయు ననిందితయు మహాభాగయుఁ బరమవృద్ధయు వేపమానకృశాంగియు నైనయమ్మహాసాధ్వికి నిజాభిధానంబు నొడివి నమస్కరించి బద్ధాంజలిపుటయై యారోగ్యం బడిగిన నయ్యనసూయ ధర్మచారిణి యైనసీత నవలోకించి మధురవాక్యంబున గారవించుచు నిట్లనియె. 2200

చ. తరుణిరో దైవయోగమునఁ దద్దయు ధర్మగతాగతజ్ఞ వై
వరగుణశాలి యైనరఘువర్యునివెంబడి ఘోరకానన
స్థిర కిటు భర్తృభక్తి నరుదెంచుటఁ జేసి కృతార్థ వైతి వే
నఱమఱ లేక నిన్నుఁ గనినంతనె సువ్రత నైతి నెంతయున్. 2201

క. బహుసుఖముల హితజనముల, నహంకృతియు విడిచి ధర్మ మరసికొని రహిం
గహనావరుద్ధుఁ డగుపతి, నహహా సేవింప వచ్చి తతిధన్యవు గా. 2202

తే. వనిత నగరస్థుఁ డైన దావస్థుఁ డైనఁ, బుణ్యుఁ డైనను గుజనాగ్రగణ్యుఁ డైన
ధాత్రి నెవ్వారికి విభుండు దైవమట్టి, యువతులకులోకయుగముమహోదయంబు.

అనసూయాదేవి సీతయొక్క పాతివ్రత్యంబుఁ గొనియాడుట.

క. ధనవంతుం డైనను నిర్ధనుఁ డైనను శీలవృత్తరహితుం డైనం
ఘనకామవృత్తుఁ డైనను, వనితకు గతి పతియె సుమ్మి వారిజనేత్రా. 2204

తే. సతికిఁ బతికంటె వేఱొకగతియు లేదు, పతికి సతికంటె నొండొకఫలము లేదు
తరుణి యిరువురు పుష్పంబుతావికరణి, నింపు సొంపార నేకీభవింపవలయు.

ఉ. కొందఱు దుర్వివేకమునఁ గోరినవారల కెల్లఁ జిత్తముం
బొందుగ నిచ్చి భర్తయెడఁ బోడిమి సేయక నీతిబాహ్య లై
యుందురు చుట్ట లెల్లఁ దము నొక్కట ఛీ యని రోయు చుండ వా
రందఱు దుర్యశంబున మహానిరయస్థిత లౌదు రంగనా. 2206

ఆ. లోకమందు దృష్టలోకపరావర, లమితసుగుణవతులు విమలమతులు
సీతశీల లైననీయట్టిసాధ్వులు, సురపదంబు నొందుదురు మృగాక్షి. 2207

వ. దేవి నీవు పతివ్రతాచరణీయం బైనధర్మంబు ననుసరించి రామునకు సహధర్మ

చారిణి వై శాశ్వతం బైనయశంబును ధర్మంబును సంపాదించితి వని బోధించిన
నమ్మునిపత్నిపల్కుల కలరి వైదేహి క్రమ్మఱ నద్దేవికి నమస్కరించి మృదు
మధురభాషణంబుల వినయంబుగా నిట్లనియె. 2208

శా. తల్లీ నీ విపు డన్నచంద మది తథ్యం బింతయు న్సాధ్వికిం
జెల్లుం జిత్రము గాదు నాకును సతీశీలంబు మాతల్లి ముం
దెల్లం జౌనటు లానతిచ్చెఁ గరుణోద్రేకంబు సంధిల్ల నా
యుల్లంబందును జిక్కి యున్నయది తద్యోగంబు రూఢంబుగన్. 2209

మ. మును మాతల్లి సతీగుణంబులు మహామోదంబునం జెప్పె మ
జ్జనకుం డవ్వల నాన తిచ్చెఁ గృపతో సాధ్వీగుణం బంతయున్
వనవాసంబున కేగుదెంచునపుడున్ వర్ణించె మాయత్త దా
ననురూపంబుగఁ గ్రొత్తఁ జేసితివి నీ వాయర్థముం గ్రమ్మఱన్. 2210

క. కావున విధిదృష్టవిధిన్, వేవిధములఁ జూడ సతికి విభుఁ డొక్కండే
దైవత మనియెడువచనము, దేవీ నాహృదయమందుఁ దిర మై యుండున్.

సీతాదేవి శ్రీరామునిగుణంబులఁ బ్రస్తుతించుట.

మ. జగతి న్నీచచరిత్రుఁ డైనవిభుఁ డెంచ న్సాధ్వికిన్ దైవతం
బగు చుండ న్గరుణాపరుండు నిజవంశాచారధర్మజ్ఞుఁడున్
సుగుణోదారుఁడు మంజువాది ప్రియుఁడు న్సారుండు శుద్ధాత్ముఁ డౌ
మగనిన్ దైవత మంచుఁ జిత్తమున సంభావించు టాశ్చర్యమే. 2212

శా. అక్రూరుండు దయాసముద్రుఁ డతివిఖ్యాతుండు ధన్యాత్ముఁడున్
శక్రాభుండును గన్నపుత్రులగతి న్సర్వప్రజ న్ధరిని
ర్వక్రప్రౌఢిమ నేలువాఁడు ఘనుఁడు న్వంశోచితాచారధ
ర్మక్రీడారతుఁ డుత్తమోత్తముఁడు మత్ప్రాణేశ్వరుం డంబికా. 2213

మ. ధర నెవ్వాఁడు జితేంద్రియుండు సుగుణోదారుండు శాంతుండు సిం
ధురయానుండు దృఢానురాగుఁడును సానుక్రోశుఁ డై యొప్పు న
క్కరుణోదారుఁడు రాముఁ డేగురుత నక్కౌసల్యపైఁ జేర్చు నా
గురుతం దక్కిన మాతృవర్గముపయిం గూర్చు న్సమగ్రంబుగన్. 221

క. క్షితిపతి యొకపరి యైనను, మతి నెంచినకాంతలందు మానము విడి తాఁ
బితృభక్తిరతుఁడు రాముఁడు, సతతంబును మాతృవృత్తిఁ జరియించు రహిన్.

సీ. పరకాంత నేత్రగోచర మైనచో దానిఁ దల్లినిబలె నాత్మఁ దలఁచువాఁడు
పరులసంతోషవిస్ఫురణంబునకుఁ దాను నంచితంబుగఁ బ్రమోదించువాఁడు
ప్రజలదుఃఖమునకుఁ బరమాప్తుఁడునుబోలెఁ గొంచక తాను దుఃఖించువాఁడు
దీనులు రక్షార్థు లైనచో జనకునిరీతి సత్కృప నాదరించువాఁడు
తే. వరమునీంద్రులఁ గన్నసేవకునిభంగి, వరుసఁ బరిచర్యఁ గావించువాఁడు వినయ

శీల కారుణ్యగుణములఁ జెలఁగువాఁడు, రమ్యగుణమండనుం డైన రాఘవుండు.
తే. అట్టిరాజలలామున కెట్టిదుష్ట, కాంత యైనను వశవర్తి గాక యున్నె
జనకుఁ డనిశంబు సహధర్మచారిణిఁగను, గౌసలేయున కర్పించెఁ గాదె నన్ను

సీతాదేవి యనసూయాదేవిని బ్రస్తుతించుట.

తే. నిరుపమసంపత్కరమును, బరమసుఖాస్పదము భూరిభద్రప్రదము
న్గురుతరకీర్తివిశాలము, తరుణికిఁ బతిసేవకంటెఁ దపములు గలవే. 2218
తే. స్వవ్రతంబునఁ బతికి శుశ్రూషఁ జేసి, మున్ను సావిత్రి దేవతాముఖ్య యయ్యె
నట్ల నీవును బతిసపర్యవిశేష, జాతమహిమను ధన్యాత్మ వైతి గాదె. 2219
తే. ధర్మచారిణి సర్వసుందరులలోన, నుత్తమయు దేవతాప్రమదోత్తమాంగ
మండనయు నైన రోహిణి మగని విడిచి, నిమిష మైనను జీవింప నేర్చె నమ్మ.
క. జగతి న్భర్తృపృథవ్రత, లగుయువతులు దేవలోకమందు స్వకీయం
బగుపుణ్యకర్మమున సౌ, భగభాజన లగుచు యశముఁ బడసెద రెపుడున్.
క. అని యిట్లు పలుక సీతా, వనితావాక్యముల కలరి వారనికృప న
య్యనసూయ శిరము మూర్కొని, యనురాగ మెలర్ప మరల నవనిజ కనియెన్.
క. నానావిధనియమంబుల, మానుగ సంభూత మైన మహనీయతపో
నూనబల మాశ్రయించి వ, రానన యాశీర్వదింతు నడుగుము వరమున్.

అనసూయ సీతకు దివ్యవస్త్రమాల్యాభరణాంగరాగానులేపనంబుల నొసంగుట.

వ. దేవి మనోజ్ఞం బైనభవదీయవాక్యంబు విని యానందించితి నింకఁ బ్రీతిదా నంబు గావించెదఁ గైకొను మనిన నవ్వైదేహి జాతవిస్మయ యై భవదీయ చిత్తంబుకొలంది నవధరింపు మనిన నమ్మునిపత్ని సంతసిల్లి భవదీయ హర్షంబు సఫలంబుఁ గావించెద నని పలికి దివ్యంబు లైనవస్త్రమాల్యాభరణం బులును మహార్హం బైనయంగరాగంబును మహాపరిమళద్రవ్యసహితం బైన యనులేపనంబు నొసంగి యి ట్లనియె. 2224
తే. అతివ యీదివ్యవస్త్రమాల్యాభరణము, లింపు సొంపార మేన ధరింపు మిపుడు
మహితమణిమండలప్రభామండితంబు, లగుచునిత్యంబులై యుండుననుదినంబు.
తే. దేవి మద్దత్త మైనయీదివ్యలేప, నాంగరాగంబుచే విలిప్తాంగి వగుచు
నబ్జవాసిని పుండరీకాక్షునట్ల, కౌసలేయుని రంజింపఁ గలవు నీవు. 2226
క. అని సాదరంబుగా ని, చ్చినఁ గైకొని మేనఁ దాల్చి చెలువుగ వసుధా
తనయ ఫలకుసుమకిసలయ, ఘనశోభిత యైనవల్లికై వడి నలరెన్. 2227
వ. ఇవ్విధంబున నభూతపూర్వశోభావిశేషంబున నలంకృత యై యవ్వైదేహి మునిపత్ని నుపాసించుచు నభిముఖంబుగా నాసీన యయ్యె నంత నయ్యన సూయ తత్పరిణయకథావృత్తాంతం బంతయుఁ దెల్లంబుగా నాకర్ణించుతలం పునఁ బ్రమ్మణి నమ్మహీసుత కి ట్లనియె. 2228

క. వైదేహీ నిన్ను రాఘవుఁ, డాదరమున మున్ను పెండ్లి యాడినవిధము
న్మోదముతో నెఱిఁగింపుము, నాదుమదికి సమ్మదము ఘనం బై యుండన్. 2229

—సీత తనవివాహవృత్తాంతము ననసూయాదేవికిఁ జెప్పుట.—

ఉ. నా విని సంతసంబు వదనంబునఁ గన్పడ నమ్మహీజ వా
గ్దేవికి సాటి వచ్చుముని దేవిని గన్గొని ప్రీతి నిట్లను
న్దేవి రఘూత్తముండు నను ధీరతఁ జేకొనినట్టిచొప్పు సొం
పావహిలంగఁ జెప్పెద ననన్యమతి న్వినుమయ్యదంతమున్. 2230

చ. కలఁడు సమస్తభూవరనికాయకిరీటమణీమరీచికా
విలసితపాదపీఠుఁడు వివేకవిశారదుఁ డప్రమాదుఁడు
న్సలలితకీర్తిసాంద్రుఁడు విశాలగుణాఢ్యుఁడు ధర్మపారగుం
డలఘుభుజాబలుండు జనకావనిపాలుఁ డుదారశీలుఁ డై. 2231

తే. అతఁడు పుత్త్రార్థ మధ్వర మాచరింపఁ
దలఁచి క్షేత్రంబు దున్నింప హలముఖమునఁ
బుడమి భేదించి యేను సంభూత నై తిఁ
బొడుపుమలనుండి శశిరేఖ పుట్టినట్లు. 2232

తే. రమణ నిట్లు జన్మించి పరాగరూషి, తాంగి నై యున్ననన్నుఁ జోలంగఁ జూచి
త్వరితముగ ముష్టివిక్షేపతత్పరుఁడగు, జనకుఁడచ్చెవిస్మితాత్ముఁడై సంభ్రమమున.

క. నను నుత్సంగంబున నిడి, కొని నా కీకన్నె చిన్నికూఁతు రనుచు వా
కొను నెడ నిక్కము నీకుం, దనయ యనుచు గగనవాణి తప్పక ప్రోసెన్.

ఉ. అంతఁ బ్రమోది యై జనకుఁ డాదృతుఁ డై ననుఁ గొంచు మందిరా
భ్యంతరసీను కేగి తనయగ్రపురంధ్రికి న న్నొసంగిన
న్సంతస మంకురింపఁ గొని చయ్యన నయ్యమ మాతృసౌహృదం
బెంతయు నివ్వటిల్ల సకలేప్సితము ల్ఘటియించి పెంపఁగన్. 2235

తే. ఈకరణి నాఁటినాఁటికి వృద్ధిఁ బొంది, యున్న నా కిల జవ్వనం బొదవి యొప్పెఁ
గాంచనమునకు వాసన గలిగినట్లు, యిక్షుకాండంబునకు ఫల మొసఁగినట్లు. 2236

వ. ఇట్లు పాణిగ్రహణమహోత్సవయోగ్య నై యున్ననన్ను విలోకించి మజ్జనకుం డై నజనకుండు తనమనంబునఁ గన్యాజనకుండు శక్రతుల్యుం డై నను గన్యాగ్రహీతృతత్సంబంధిజనంబు సదృశం బైన నీచం బైన వారివలనఁదిరస్కారంబు నొందు నట్ల నాకును గన్యానిమిత్తంబునఁ దిరస్కారంబు వాటిల్లు నని చింతించి నన్న యోనిజఁగా నెఱింగి నిర్ధనుండు విత్తనాశంబువలన దీనుండై నపగిది నతిదీనుండై యభిజనవృత్తాదికంబుల వయస్సౌందర్యాదికంబున నాకనురూపుం డగుపతి యెవ్వం డొకో యని విచారించుచు నెందునుం గానక నానాప్రకా

రంబులఁ జింతించి మత్కుమారికి స్వయంవరంబు సేయుదుఁ గాక యని నిశ్చయించి. 2237

సీ. అఖిలజగంబుల కాధార మైనట్టికనకాద్రిచందానఁ గ్రాలుదాని
యాగసంతుష్టుఁడై యనుపమకరుణతో నబ్ధినాయకుఁ డిచ్చినట్టిదాని
మానవేంద్రులు కలలో నైన గుణ మెక్కు పెట్టఁ జింతింప లేనట్టిదాని
ననుదినంబును గుసుమాదికంబులచేత నతిభక్తిఁ బూజితం బైనదాని

తే. మఱియు బహుకాలముననుండి మందిరమున
నలరుదాని మాహేశ్వరం బైనదానిఁ
జాపము నొకటిఁ దెప్పించి సంభ్రమమున
నృపుల నందఱ రావించి యిట్టు లనియె. 2238

క. ఈనగపతిధను వెవ్వం, డేనియు నజ్యంబుఁ జేసెనేని ముదముతో
మానక యవ్వీరునకు న, హీనమతి న్నాకుమారి నిత్తు నిజముగాన్. 2239

క. అనిన విని వారు గౌరవ, మున గిరి కెన యైనచాపము న్గని సత్త్వం
బున సజ్యము గావింపం, జని సామర్థ్యంబు లేక చని రటు లజ్జన్. 2240

ఆ. అంతఁ గొంత కాల మరిగిన పిమ్మట, నీమహామహుండు రాముఁ డనుజ
గాధిపుత్త్రయుతముగా మిథిలేశుయాగంబుఁ జూడ వచ్చెఁ గౌతుకమున.

క. ఘనుఁ డావిశ్వామిత్రుఁడు, జనకమహీవిభునిచేత సత్కృతుఁ డై య
య్యనఘుని నుతించి కుతుకం, బున నిట్లని పలికె వాక్సమున్నతి మెఱయన్.

ఉ. వీరలు రామలక్ష్మణులు వీరులు పంక్తిరథాత్మజుల్ మహా
శూరులు చంద్రమౌళివిల్లుఁ జూడఁగ వచ్చినవారు దాని సొం
పారఁగఁ జూపుమా యనిన నాజననాథుఁడు తత్క్షణంబ త
ద్భూరిశరాసనంబును సముద్ధతిఁ దేరఁగఁ బంచె వేడుకన్. 2243

వ. ఇవ్విధంబున నమ్మహనీయకార్ముకంబుఁ దెప్పించి రామునకుం జూపిన నమ్మహానుభావుండు. 2244

క. గుణ మెక్కు పెట్టి గ్రక్కునఁ, దృణముగతి బలంబుకొలఁదిఁ దెగఁ దీసిన భీ
షణరవము దిశలు నిండఁగ, క్షణమాత్రములోన శంభుచాపము విఱిగెన్.

వ. అంత సత్యాభిసంధి యగుమజ్జనకుం డనుత్తమం బైనజలభాజనంబు గైకొని రామునకు న న్నొసంగ నిశ్చయించిన నప్పురుషశార్దూలుండు తనతండ్రి యగు దశరథునియభిప్రాయంబు దెలియక పెండ్లి యాడుట యుక్తంబు గా దని నన్నుఁ బరిగ్రహింప కుండె. 2246

ఆ. అంత సత్యవాది యైనమజ్జనకుండు, రాఘవునకు నన్ను రమణ నొసఁగఁ
దలఁచి సత్వరముగ దశరథు రావించి, మంచిలగ్న మేర్పరించి తమిని. 2247

క. మంగళతూర్యరవంబులు, సంగతిగా మ్రోయుచుండ జనకమహీశుం
డంగము సమ్మదమున నుప్పొంగఁగ రామునకు నన్నుఁ బొలుపుగ నిచ్చెన్.

క. నాయనుజ నూర్మిళను బద్రాయతలోచన నొసంగె సజ్జనకుఁడు భ
ద్రాయతమూర్తికి సుజనవిధేయున కీలక్ష్మణునకుఁ దేజం బెసఁగన్. 2249

వ. తల్లీ యిది మదీయపరిణయవృత్తాంతంబు తెల్లంబుగా వినిపించితి నని సీతా
దేవి విన్నవించిన నయ్యనసూయ వ్యక్తాక్షరపదంబును జిత్రంబును మధు
రంబు నగుతదీయభాషితంబు విని పరమసంతోషస్వాంత యై సీతం గౌఁగిలిం
చుకొని శిరంబు మూర్కొని చెక్కిలి ముద్దుగొని మందమధురాలాపంబుల
ని ట్లనియె. 2250

క. కాంతా నీపరిణయవృత్తాంతం బంతయును నాకుఁ దత్పరమతిచే
నెంతయుఁ దెల్పితి గావున, స్వాంతమున కభూతపూర్వసమ్మద మొదవెన్.

క. సూరుండు గ్రుంకె దినమా, హోరార్ధము దిరిగి తిరిగి యస్తమయమునన్
భూరుహములు నిద్రార్థము, చేరి విహంగములు రుతముఁ జేసెడు వింటే

క. సలిలాప్లుతవల్కలు లై, కలశోద్యతు లై పవిత్రగతి నభిషేకా
ర్ద్రీలసచ్ఛరీరు లై మును, లలరుచు నున్నారు కంటె యంగన యిచటన్.

తే. సీతచూచితె తాపసుల్సేయుహోమ, కార్యముల నుజ్జ్వలితములై గ్రాలువహ్ను
లందు వాతసముత్థిత మై కపోత, గాత్రరక్తధూమంబు వికాస మొందె. 2254

మ. వికలాల్పచ్ఛదవృక్షముల్ ఘనము లై స్ఫీతంబు లయ్యె న్నవిన్
వికసించెన్ గ్రహతారక ల్దెసల నుర్విం జీఁకటు ల్పర్వెఁ ద
ప్పక రాత్రించరసత్త్వము ల్దిరిగెడి న్నాభస్వన్మృగశ్రేణి కొం
చక చేరెన్ వరవేదికాతలములం జంద్రుండు దోఁచెన్ దివిన్. 2255

ఆ. గగనలక్ష్మిమేనఁ గప్పురంబు మెత్తిన, కరణిఁ బర్వెఁ జంద్రికాచయంబు
రాత్రి యయ్యె నింక రాముని సేవింపఁ, జనుము ధర్మ మిదియ సతుల కబల.

చ. వదలక మంజులోక్తుల వివాహకథ న్వినిపించి నీవు నా
మదికి ముదం బొసంగితివి మానక యింక మదర్పితస్ఫుర
న్మృదువసనాంగరాగములు మేన ధరించి సతీ విశేషస
మ్మద మొనగూర్పు మీ వనిన మైథిలి తద్దయు సంతసంబునన్. 2257

క. అనసూయాదత్తము లగు, ఘనపటభూషాదికములఁ గైసేసి నయం
బున మ్రొక్కి జనకనందిని, చనియెం గడుఁ బ్రీతి రామచంద్రునికడకున్.

శ్రీరాముఁడు మునులయనుమతంబున దండకారణ్యంబు ప్రవేశించుట.

వ. ఇట్లు మానుషలసదలంకారాలంకృత యై శ్రీరామునియొద్దకుం జనుదెంచి తన
కమ్మునిపత్ని యొసంగిన పరాభరణ వస్త్రమాల్యాంగరాగనూపకం బైన ప్రీతి

దానంబు సర్వంబును విన్నవించిన నారఘువల్లభుండు లక్ష్మణసహితంబుగా సంతసించి యనసూయాప్రభావంబు బహువారంబులుకై వారంబులు సేయుచు సిద్ధు లగుతాపసులచేత నర్చితుం డై యారాత్రి తదాశ్రమంబున నివసించి ప్రభాతకాలంబున మేల్కాంచి పుణ్యతీర్థజలావగాహనంబుఁ జేసి యాహ్నికంబుఁ దీర్చి కృతాగ్నిహోత్రు లగుమునులకుం జెప్పి గమనోన్ముఖుం డైన నవ్వీరోత్తముని విలోకించి ధర్మాత్ము లగుతాపసు లి ట్లనిరి. 2259

మ. అనఘా యీవిపినంబునం దసురు లుగ్రాకారు లుద్యన్మదం
బున నానాకృతుల న్జరింతు రనిశంబు న్మాంసాదు లై
యనుమానింపక వారి నెల్ల బల మేపారంగ వారించి యి
మ్మునిమార్గంబున నేగు మచ్చట ఫలంబు ల్మాలము ల్గల్గెడిన్. 2260

వ. అని పలికి దీవించి సముచితంబుగా వీడ్కొల్పిన నారఘుశార్దూలుండు పూర్వోక్తమార్గోపదేశప్రకారంబునఁ గృతాంజలు లగుమునులచేతఁ గృతమంగళాశీర్వాదుం డై సూర్యుండు మహాభ్రపటలంబుంబోలె సీతాలక్ష్మణసహితంబుగా మహారణ్యంబుఁ బ్రవేశించె నని వ్యక్తాక్షరపదంబుగా నయోధ్యాకాండకథ యంతయు వినిపించిన నారాముండు భ్రాతృసహితుం డై యటమీఁదికథావృత్తాంతంబు వినిపింపుం డని యడుగుటయును. 2261

చక్రబంధము.

చ. ధరణిప శ్రీవరా కనకదామ యదుప్రవరా మనోజ్ఞకం
ధర హరి మాధవా సకలదా దవభక్షక వైనతేయసుం
దరరథ దేవముక్తిఫలదా నరమిత్రక హీరహార మం
దరధర నాథ మంజుళయ దానధురీణ విధాతృవందితా. 2262

క. బృందారకనుత నతజన, మందార దురంతయోగమాయాశ్రయసం
క్రందనవందిత పరమా, నందాత్మక యోగిరాజ నందతనూజా. 2263

స్వాగతావృత్తము:—

రాజరాజనుత రాజనిభాస్యా, భోజ రాజకుల పుణ్యచరిత్రా
రాజమండలవిరాజితకీర్తీ, భ్రాజమానశతభాస్కరతేజా. 2264

గద్యము. ఇది శ్రీరామచంద్ర చరణారవిందమకరందరసాస్వాదతుందిలేందిందిరాయమాణమానస కులపవిత్ర కౌండిన్యసగోత్ర పద్మనాభసూరిపుత్ర విద్యాసాంద్ర వేంకటకవీంద్రప్రణీతం బైన శ్రీమద్రామాయణం బనునాదికావ్యంబునందు రామగుణానుకీర్తనంబు నభిషేకసమారంభంబును మంథరాదుర్మంత్రంబును గైకేయీదుష్టభావత్వంబు నభిషేకవిఘాతంబును గౌసల్యాపరిదేవనంబును రామవనవాసగమనంబును బ్రకృతిజనవిషాదంబును బ్రకృతిజనవిసర్జ

నంబును గుహసంవాదంబునుసుమంత్రోపావర్తనంబును గంగానదీతరణంబును భరద్వాజదర్శనంబును జిత్రకూటప్రవేశంబును బర్ణశాలావస్థానంబును దశరథుశోకవిలాపంబును దశరథునిపరలోకగమనంబును భరతసమాగమనంబును రాజధర్మోపదేశంబును రామప్రసాదనంబును దశరథునకు సలిలప్రదానంబును బాదుకాప్రదానంబును భరతోపావర్తనంబును నందిగ్రామనివాసంబును బాదుకాస్థాపనంబు నను కథలుం గల యయోధ్యాకాండము సంపూర్ణము.

శా. ఈకావ్యప్రతిపాదితుం డయినసీతేశుండు రామప్రభుం
డీకల్యాణకృతీశ్వరుం డయినశ్రీకృష్ణుండు సంప్రీతితో
సాకల్యంబుగ నిష్టసిద్ధికరులై చంచత్కృపాపూర్ణతన్
లోకస్తుత్యకుమారయాచధరణీంద్రుం బ్రోతు రెల్లప్పుడున్.

---

శ్రీరస్తు.

శ్రీరామచంద్రపరబ్రహ్మణేనమః.

# గోపీనాథ రామాయణము

## ఆరణ్యకాండము.

---



మానినీమనోహర
సోమాన్వయజలధిపూర్ణసోమ జితారి
స్తోమ సమిద్ధభీమ పరం
ధామ సుగుణజాల శ్రీమదనగోపాలా. 1

వ. దేవా యవధరింపుము రాజనందను లగుకుశలవు లవ్వలికథ యిట్లని చదువం దొడంగిరి యివ్విధంబున ధృతిమంతుండును ధర్మజ్ఞుండు నగురాముండు మహారణ్యం బగుదండకారణ్యంబుఁ బ్రవేశించి తాపసాశ్రమమండలంబు విలోకించె నదియును. 2

### శ్రీరాముఁడు ఋష్యాశ్రమములకుఁ బోవుట.

క. వితతబ్రాహ్మశ్రీవృత, మతులితకుశచీరయుక్త మై నభమున ను
న్నతి వెలయుతపనమండల, గతి నతిదుర్ధర్శ మగుచుఁ గ్రాలుచు నుండున్. 3

తే. సర్వభూతశరణ్యంబు సకలవన్య, మృగకదంబజుష్టంబును ఖగనిషేవి
తంబు సతతసమ్మృష్టాంగణంబు నగుచు, నతివిచిత్రక్రమంబున నలరుచుండు.

సీ. చెలువొప్పు నప్సరస్త్రీనర్తనంబులు పావకశాలలు వరసమిత్కు
శాజినస్రుక్స్రువాద్యనుపమయాగోపకరణంబులు సుగంధిఘనసుమములు
ఫలమూలములు పూర్ణజలకలశంబులు స్వాదుఫలోపేతపాదపములు
వన్యపుష్పంబులు పద్మోత్పలవినిర్మలాంబుయుక్తజలాశయములు గలిగి

తే. పుణ్య మై వేదఘోషసంపూర్ణ మై స,మగ్రబలిహోమపూజితం బై నితాంత
హోమమంత్రనినాదిత మై మనోజ్ఞ, జలజభవమందిరముభంగి నలరుచుండు. 5

మ. అనఘు ల్పుణ్యులు బ్రహ్మకల్పులు ఫలాహారు ల్తపోలబ్ధని
త్యనితాంతద్యుతు లర్కపావకనిభు ల్దాంతు ల్పురాణు ల్జటా
జినధారుల్ ద్రుమచీరయుక్తులు తపస్సిద్ధ ల్పరబ్రహ్మత
త్త్వనిబద్ధాత్ములు తాపసుల్ గలిగి నిత్యశ్రీల నొప్పుఁ రహిన్. 6

తాపసులు పరమానందంబున సీతారామలక్ష్మణుల నెదుర్కొనుట.

వ. అట్టి తాపసాశ్రమసమూహంబుఁ బ్రవేశించి శ్రీమంతుం డగు రాముండు తపోవనవర్తిమృగపక్షిత్రాసనివృత్తికొఱకుఁ జాపంబు నవరోపితగుణంబుఁ గావించి నిజతేజంబున నమ్మహారణ్యంబు వెలుంగం జేయుచు మందాంచితగమనంబున నజను చుండ నప్పుడు ధర్మచారులును దివ్యజ్ఞానోపసంపన్నులు నైన యచ్చటి మహర్షులు రామలక్ష్మణులను యశస్విని యగు వైదేహి నవలోకించి ప్రీతిసంహృష్టసర్వాంగులై వారల కభిముఖంబుగా నరిగి సంపూర్ణచంద్రుండునుంబోలె సకలజనానందకరుఁ డైన రామచంద్రునిఁ గన్నులారం గనుంగొని మంగళాశీర్వాదంబులు గావించుచు స్వేష్టదేవతాత్వంబున స్వీకరించి తదీయరూపవిశేషంబును సర్వావయవశ్లిష్టసంధిబంధంబును లావణ్యంబును సౌకుమార్యంబును సముచితశృంగారసంపన్నత్వంబును విలోకించి విస్మితాకారు లైరి యచ్చటిపశుపక్షిమృగాదితిర్యగ్జంతువులు వైదేహీలక్ష్మణసహితుం డైన రాము నవలోకించి పద్మభవాదుల కగోచరుం డగు భగవంతుండు పంగూపరి గంగాప్రవాహంబుకరణి మనముంగలఁ బ్రాదుర్భవించె నని జగన్మోహనదివ్యమంగళవిగ్రహదర్శనానందవిచ్ఛేదభయంబున నిమేషరహితంబు లైన నేత్రంబులచేతఁ బరమాశ్చర్యవంతంబు లై విలోకించుచుండె నప్పు డమ్మహర్షులు సర్వభూతహితరతుం డైన రామునిఁ బ్రియాతిథినింబలెఁ బర్ణశాలకుం దోడ్కొని చని నివాసస్థానంబు నివేదించి పరమపురుషుండ వైన నీసందర్శనంబున నేము ధన్యుల మైతి మని ప్రియవచనంబుల సత్కరించి సలిలాదిపూజాద్రవ్యంబుఁ గొని తెచ్చి సలక్ష్మణుం డైన రాముని విధ్యుక్తప్రకారంబునం బూజించి వన్యంబు లైన పుష్పంబు లర్పించి యీవస్తువు లన్ని భవదీయంబు లని పలికి రాముండు పరమపురుషుం డైన నారాయణుం డను నిశ్చయబుద్ధిచేత సముద్భూతభక్తిరసంబున బద్ధాంజలు లై యిట్లనిరి. 7

ఋషులు రాముని నానావిధంబుల స్తుతించుట.

సీ. అనఘాత్మ నీవు మా కందఱకును శరణ్యుండవు భూరియశుండ వఖిల
వర్ణాశ్రమాచారనిర్ణయవిదుఁడవు ఖలజననిగ్రహకర్త వాది
నారాయణునియవతారరూపంబున గురుఁడవు సకలార్థకోవిదుఁడవు
పూజనీయుండవు రాజరూపంబున మాన్యుఁడ వార్యసమ్మతుఁడ వైతి
తే. పుడమి నింద్రచతుర్థాంశభూతుఁ డైన, రాజు మునుకొని ప్రజలధర్మంబు దప్ప
కుండ రక్షించుఁ గావున నొప్పు మీఱ, నఖిలలోకనమస్కృతుం డై వెలుంగు.
తే. విపులవిక్రమసామాన్యనృపున కిట్టి, మహిమ గలుగుచు నుండ సమస్తలోక
పాలనార్థంబు పుట్టినపరమపురుష, నామునకు నీకుఁ గల్గుట కేమి యరిది. 9
వ. దేవా నీవు వనంబున నున్న నగరంబున నున్న మా కధినాథుండవు గావున భవ

దీయ మూర్తి ధ్యానానందానుభవాంతరాయరూప రాక్షసనివారణపూర్వకం
బుగా రక్షింపం దగుదు మితరరాజులు బుద్ధిబలంబున స్వరాజ్యమాత్రరక్ష
ణంబునందు శక్తు లగుదురు సకలలోకరక్షణధురంధరాసహాయశూరుండ వైన
నీకు నగరవాసంబునం దేమి బలవృద్ధి యు స్వాభావికనిత్యనిరతిశయజ్ఞానశక్తిసంప
న్నుండ వైననీకు వనవాసంబునం దేమి బలహానియుఁ గలుగు నేము నీయందు
విన్యస్తసకలరాక్షసశిక్షాభారుల మై పరిత్యక్తశాపాదిశాసనుల మై జితక్రోధుల
మై జితేంద్రియుల మై తపోధనుల మై యున్నవారము మమ్ముఁ దల్లి గర్భం
బునం బోలె నతిప్రయత్నంబున రక్షింపు మని పలికి ఫలమూలపుష్పనీవార
దర్భాదులచేత సలక్ష్మణుం డైనరాముని బూజించి మంగళస్తుతివచనంబుల
నభినందించి సకలజగత్స్వామి యగుటవలన యథావిధిఁ దృప్తి నొందించిరి
యి ట్లమ్మహాత్ముండు తాపసులచేతఁ గృతాతిథ్యుం డై యిష్టకథావినోదంబుల
నారాత్రి యచ్చట వసియించి మఱునాఁ డరుణోదయంబునఁ గాల్యకరణీ
యంబులు దీర్చి సాదరంబుగా నమ్మునిపుంగవులచేత నామంత్రణంబు వడసి
సీతాలక్ష్మణసహితుం డై. 10

రామునకు విరాధుండు గనఁబడుట.

శా. నానాఘోరమృగప్రకాండయుతము న్నానాఖగవ్రాతము
న్నానాధ్వస్తలతాంతకుంజమును నానాజంతునిశ్శబ్దము
న్నానాగాధజలాశయావృతము నానాక్రూరఝిల్లీగణ
ధ్వానం బైనయరణ్యమధ్యమునఁ బోవం బోవఁ గా నొక్కెడన్. 11

శా. ఘోరాకారుఁడు దీర్ఘజిహ్వుఁడు మహాక్రూరుండు శూరుండు గం
భీరాత్ముండు మహోదరుండు వికటాభీలాస్యుఁ డుగ్రస్వన
స్ఫారుండు న్విషముండు రాక్షసుఁడు బీభత్సుండు మాంసాసృగా
హారుం డద్రినిభుండు మత్తుఁడు విరాధాఖ్యుండు దోఁచె న్రహిన్. 12

విరాధుఁడు సీత నెత్తికొనుట.

వ. మఱియు నన్నిశాచరుండు సింహత్రయంబును వ్యాఘ్రచతుష్టయంబును వృక
ద్వయంబును బృషద్దశకంబును వసాదిగ్ధం బై విషాణసహితం బైనదాని నొక్క
గజశిరంబును నిశాతశూలాగ్రంబునం గ్రుచ్చికొని వసార్ద్రం బైనవ్యాఘ్ర
చర్మంబు గప్పికొని రుధిరోక్షితశరీరుం డై సర్వభూతభయంకరుం డై బ్రహ్మాం
డంబు బ్రద్దలు వాఱ నార్చుచుఁ బాతాళసదృశం బైనవక్త్రంబు విచ్చికొని
ప్రళయకాలంబునందు సంక్రుద్ధుం డై యంతకుం డెట్లు ప్రజల నుద్దేశించి పరు
వెత్తు నట్లు మహీతలంబు కంపింప నతిశీఘ్రంబునం బఱతెంచి వైదేహి నాక్ర
మించి కటిప్రదేశంబున నిడికొని ప్రళయకాలమేఘస్వనంబున రామలక్ష్మణుల
నాక్షేపించుచు ని ట్లనియె. 13

శా. మీ రెవ్వారు జటాజినంబు లిటు నెమ్మిం దాల్చి యీదుష్ప్రవే
శారణ్యంబున సంచరించెదరు చాపాస్త్రంబకంబు ల్మునుల్
ధీరత్వంబునఁ దాల్ప నేర్తురె భవద్వేషంబులం జూడఁగా
వేఱై యున్నది మౌనిరూపకులు మీవృత్తంబుఁ దెల్పం దగున్. 14

క. దారుణవన మిది దుర్గం, బౌహూఢి విరాధుఁ డనుమహాసురవరుఁడ
న్వారక తాపసమాంసా, హారుఁడ నై సంచరింతు ననిశం బిచటన్. 15

క. దురితాత్ము లైనమీయి, ద్దఱ శూలాగ్రమునఁ దునిమి తడయక రుధిరం
బఱ లేక గ్రోలి వెస నీ, గఱితం గైకొందు భార్యగా నిపుడు తగన్. 16

వ. అని పలుకు చున్నదురాత్ముం డగువిరాధునిసగర్వితం బైనదుష్టవాక్యంబు విని వైదేహి సంభ్రాంతచిత్త యై ప్రవాతంబునందుఁ గదళియుం బోలె భయశోక వేగంబున నాకంపించె నప్పు డారఘువల్లభుండు విరాధాంకగతయై భయంబున వడఁకు చున్నసీత నవలోకించి దీనవదనుం డై లక్ష్మణున కిట్లనియె. 17

రాముఁడు కైకేయీకృత్యమును దలంచి దుఃఖించుట

ఉ. భూరిసుఖార్హపుణ్యముల ప్రోవు మనస్విని నిత్యమంగళా
చార విదేహరాజసుత సర్వసతీమణి మత్పురంధ్రి యీ
ధారుణిపుత్త్రి భీతిఁ గొని దైన్యము మీఱఁగఁ గంపితాంగి యై
ఘోరనిశాటునంకమునఁ గుందుచు నున్నది కంటె లక్ష్మణా. 18

తే. అకట కైకేయిమన కేదురంతదుఃఖ, మటని నొనగూర్పుటకునింత యాచరించె
నది రయంబున నిపుడె సంప్రాప్తమయ్యెఁ, గాలముదురత్యయం బెంతఘనున కైన.

సీ. కేవలజడత నేదేవి సుతార్థంబు రాజ్యాభిషేకమాత్రమునఁ దనివి
సనక సమస్తభూతనివహంబున కనారతమును మిక్కిలి హితుఁడ నైన
యనుపమచిత్తుని వినయవిధేయునిఁ దనయు రాజ్యస్థిరత్వంబుకొఱకుఁ
దాపసుఁ జేసి బాంధవు లెల్ల దుఃఖింపఁ గట్టిఁడితనమునఁ గాన కనిచె

తే. నట్టి మధ్యమజనయిత్రి యైనకైక, సీత దనుజాధమునిచేతఁ జిక్కుచుండ
నేఁడుచాల సకామ యై నెగడుఁగాదె, ముదితసంకల్పమెంత యమోఘమయ్యె.

తే. అకట మనయయ్య దశరథుఁ డన్యలోక, గతికిఁ బోవుటకంటె నఖండరాజ్య
హారణమునకంటె సీతయీపరునిచేతఁ, జిక్కుటకుఁజాల మనమునఁ జింతవొడమె.

లక్ష్మణుఁడు రాముని నూరార్చుట

వ. అని పలికి కన్నీరు నించిన నారఘుపుంగవునిం జూచి లక్ష్మణుండు కైకేయి నుద్దేశించి సంక్రుద్ధుం డై మహానాగంబుకరణి నూర్పులు వుచ్చుచు నిట్లనియె. 22

ఆ. సాధుచరిత నీవు సర్వభూతములకు, నాథుఁడవు సురేంద్రునకు సముఁడవు
వినుతబాహువీర్యఘనుఁడ వనాథుని, పగిదిఁ బరితపింప నగునె యధిప. 23

ఉ. క్రచ్చఱఁ జాప మెక్కిడి యఖండశరంబుల వీనిగుండియల్

ప్రచ్ఛేద నుత్తమాంగ మటు వ్రయ్యలు చేసెదఁ గాలుప్రోలికి
న్బుచ్చెదఁ గైకపట్టిపయిఁ బుట్టినకిన్కకు నీదురాత్మపై
నొచ్చెము లేక నేఁడు వినియోగ మొనర్చెద నీవు మెచ్చఁగన్. 24

ఆ. అధిప యీదురాత్ముఁ డస్మచ్ఛరాహతి, వజ్రివజ్రనిహతి వ్రాలునగము
భంగిఁ గూలుచుండఁ బదపడి వీనిర, క్తంబు నిపుడు పుడమి ద్రావుఁ గాక. 25

తే. అనుచు లక్ష్మణుఁ డన్నతో నాడుచుండ, నవ్విరాధుఁడు భయదాట్టహాసమెసఁగ
వారినీక్షించి మీరలెవ్వార లెచటి, కేగెదరు చెప్పుఁడన రాముఁడిట్టు లనియె.

ఆ. క్షత్త్రియులము వృత్తసంపన్నులము మను, కులుల ముగ్రగహనగోచరులము
క్రూరులైనదైత్యవీరుల దండింప, మీఱితిరుగుచున్నవార మిపుడు. 27

క. నీ వెవ్వఁడ వొంటిగ నీ, దావంబున నేల దిరిగెదవు నీచరితం
బేవిధము నామ మెయ్యది, లా వెంత యెఱుంగఁ జెప్పు లలిఁ బాపాత్మా. 28

క. అన విని వాఁ డిట్లను మ, జ్జనకుఁడు జయుఁ డనెడువాఁడు సత్యరతుఁడు మ
జ్జనని శతహ్రద నాపే, రనుపమవైఖరి విరాధుఁ డండ్రు నిశాటుల్. 29

క. ఘనతపమున మును వనజా, సనునకుఁ బ్రమదం బొనర్చి శస్త్రహతిం జా
వనివరము వడసి విక్రమమునఁ ద్రిమ్మరుచున్నవాఁడ ముల్లోకములన్. 30

వ. మఱియు నవ్విరించివలనఁ బ్రాణవియోజనకారణఖండన విదారణానర్హత్వంబు
నొందినవాఁడ నాబారిం బడి తొలంగి పోవుటకు నిలింపపతి యైన సమర్థుండు
గాఁడు మీకుఁ బ్రాణంబులదెస నాసగలదేని యివ్వెలంది నిచ్చటం బరిత్య
జించి యథేచ్ఛం జనుం డని పలికిన నారామభద్రుండు రౌద్రరసోల్లాసమూర్తి
యై నేత్రకోణంబులం దామ్రదీధితులు నిగుడ నవ్విరాధు నీక్షించి మేఘగంభీర
భాషణంబుల నిట్లనియె. 31

రామలక్ష్మణులు విరాధునిపై నానావిధశరంబులు ప్రయోగించుట.

తే. నీకు ధిక్కార మొనరింతు నీచచరిత, తవిలి మిత్తి నన్వేషించెదవు నిజంబు
తలఁప నాజికి డాసితి నిలువు మింక, జగతి నామ్రోల బ్రతికి పోఁజాల వీవు.

క. అలవి యెఱుంగక రజ్జులు, వలికిన నది నీకు బంటుపంతమె నాతోఁ
గలసి పెనంగెడునప్పుడు, దెలిసెదవు మదీయబాణతీవ్రస్ఫూర్తిన్. 33

క. అని పల్కి వైరిసంత్రా, సన మగుబాణాసనంబు చక్కఁగ సజ్యం
బొనరించి నిశితశరములు, దనుజునిపై గాఁడ నేసె దారుణభంగిన్. 34

ఉ. అంత రఘూద్వహుండు ప్రళయాంతకుకైవడిఁ బేర్చి వింట న
త్యంతగుణప్రణాద మొలయం బటుకాంచనపుంఖ ముగ్రస
ర్వాంతకవాతవేగ మగుసంబకసప్తక మేసె వాని మే
నంతయుఁ జించి తీవ్రరుధిరాప్లుత మై వెస భూమి గాఁడఁగన్. 35

ఉ. అంతట వాఁడు భూమిసుత నక్కడ డించి మహోగ్రరూపక

ల్పాంతకుఁడో యనంగ భయదాకృతిఁ గైకొని ఘోరభంగి రో
దోంతర మెల్ల నిండ వడి నార్చుచు శూలముఁ గేలఁ దాల్చి య
త్యంతరయంబునం గవిసె నారఘువీరులమీఁది కుగ్రతన్. 36
వ. ఇట్లడరినం జూచి. 37

## రాముఁడు విరాధునిశూలమును ఖండించుట.

శా. జంట న్రాముఁడు లక్ష్మణుండు మది నిశ్శంక న్రణారంభులై
వింటన్ ఘంటలు మ్రోయ నిష్ఠుర రయావిర్భూతవాతాహతి
న్మింట న్మబ్బులు విచ్చి పాఱ విశిఖానీకంబుల న్వేఁకతో
వెంట న్వెంట నిగిడ్చి రా దివిజవిద్వేష్యంగము ల్గూలఁగన్. 38
వ. ఇట్లఖండకోదండపాండిత్యంబుఁ జూపుటయు నక్కాండంబులు తండోపతండంబులై కాలవ్యాళంబులకరణి నవ్విరాధునిమర్మంబులం గలంచిన నతండు వరదానబలంబున బలవృద్ధిఁ గొఱకు హృదయంబునం బ్రాణంబులు నిరోధించుకొని.
శా. విద్యుద్వల్లికభంగిఁ గ్రాలుచటులస్ఫీతోగ్రశూలంబు వాఁ
డుద్యత్క్రూరతఁ బూన్చి వ్రేయ నది ధూర్యోగంబున న్మింట సూ
ర్యద్యుత్యాకృతి రాఁగఁజూచి కడిమి న్రాముండు సంక్రుద్ధుఁడై
సద్యోనాశము నొందఁ జేసె దృఢచంచత్కాండయుగ్మాహతిన్. 40
చ. ఇటు రఘువీరబాణహతి నెంతయుఁ జూర్ణితమైనశూల మ
క్కుటిలనిశాటుచేవ యనఁ గూలె రయంబున భూతలంబునం
బటుతర దేవరాడ్భిదురపాతమున న్బ్రిడియై శిలాతలం
బటు కనకాద్రినుండి సరయూహతి వ్రాలినచంద మేర్పడన్. 41

## విరాధుఁడు రామలక్ష్మణులఁ దనభుజంబుల నెత్తికొనిపోవుట.

ఉ. క్రమ్మఱ నమ్మహాభుజులు కాలభుజంగములట్ల గ్రాలుఖ
డ్గమ్ములఁ బూని వాని నెసకంబున వ్రేయఁ గడంగునంతలో
నమ్మనుజాశి బాహువుల నారఘువీరులఁ జిక్కఁ బట్టి శీ
ఘ్రమ్మునఁ గానలోని కలుకం జులుకం గొని పోవఁ జూచినన్. 42
ఉ. వానితలం బెఱింగి రఘువర్యుఁడు లక్ష్మణుఁ జూచి పల్కు నో
మానితబాహుశౌర్య వినుమా మనలం గొని పోవఁ జూచె నీ
దానవుఁడు డంతకు నుదగ్రతఁ జాలినవాఁడు వీనిచే
మానక చిక్కకుండ ననమానబలస్థితి నూఁది యుండుమీ. 43
వ. మఱియు నీదురాత్ముం డగురాక్షసుండె తెరువునంబోవు నదియె మనకు మార్గంబు గావున నితండు మనల నెత్తుకొని మన మరుగం దలంచినమార్గంబునం గాని తా నరుగం దలంచినమార్గంబునం గాని యేమార్గంబునం జనినను మన కది సమ్మతంబై యుండు. 44

చ. అనునయంబున న్భుజబలాఢ్యుల రాఘవవంశవర్యులం
బ్రణుతబలుండు వాఁడు పసిబాలుర నట్ల నిజాంసభాగమం
దనువుగఁ జిక్కఁ బట్టి భయదార్భటి దిక్కులఁ బిక్కటిల్ల ధా
వనమున దారుణాటవి కవార్యగతి న్వెసఁ బోవు చుండఁగన్. 45

ఉ. ఆవిధ మంత చూచి జనకాత్మజ తాల్మి వహింప లేక శో
కావిలచిత్త యై సముదితార్తరవంబున సర్వలోకసం
భావితుఁ డీరఘూత్తముఁ డమందపరాక్రమశాలి శేముషీ
శేవధి దుష్టదైత్యునకుఁ జిక్కె సహోదరసంయుతంబుగన్. 46

క. నను శార్దూలవృకాదులు, తనియఁగ భక్షింప నేల దశరథనృపనం
దనులను విడిచి ననుం గొని, మునుకొని చను మనురనాథ మ్రొక్కెద నీకున్.

—రామలక్ష్మణులు విరాధుని బాహువులు రెండును నఱకుట.—

క. అని యీగతి విలపించిన, విని రాముఁడు లక్ష్మణుండు వేగంబున న
ద్దనుజుని వధింపఁ దలఁకొని, యనుపమనిశితాసియుగ్మ మంకించి రహిన్. 48

తే. బలిమి సౌమిత్రి వానిడాపలికరంబు, నఱకె రాముఁడు వలపటికరము నఱకె
భగ్నకరుఁ డై విరాధుండుపవివిలూన, ధారుణీధ్రంబుచందాన ధరణిఁ గూలె.

వ. ఇత్తెఱంగునం బడినయన్నిశాచరు నాక్రమించి యవక్రపరాక్రమంబున జానుకూర్పరముష్టిఘాతంబుల మర్దించుచు సారెసారెకు మీఁది కెత్తి శిలాతలంబుమీఁదం గూలవైచుచు ఖడ్గంబుల నఱకుచు నిట్లనేకప్రకారంబులఁ జిత్రవధక్రమం బాపాదించిన నవ్విరాధుండు నానావిధప్రహారణవిద్ధుండై పుడమిం బడియును సజీవితుం డై యున్నవాని యవధ్యత్వంబు విలోకించి నిజశ్రవణకీర్తనధ్యాననిష్ఠపురుషసకలభయాపహారి యగురాముండు లక్ష్మణున కిట్లనియె.

తే. వరతపంబున దైత్యుఁ డవధ్యుఁ డయ్యె, శస్త్రహతి సంగరంబునఁ జంపఁ గూడ
దనఘ వీని నిక్షేపింత మవనిలోన, ననుచుఁ బలికిన నవ్వాక్య మాలకించి. 51

—విరాధుఁడు రామునితోఁ దనపూర్వవృత్తాంతంబుఁ జెప్పుట.—

వ. విరాధుం డిట్లనియె దేవా శక్రతుల్యబలుండ వై ననీచేత నేను నిహతుండ నైతి భవదీయసచ్చిదానందఘటనజగన్మోహనశ్రీమూర్తిసంస్పర్శభాగధేయంబు కంటె మున్ను నిరవధికకరుణచేత మదీయశాపవిమోచనార్థం బావిర్భూతుండ వైన శ్రీరాముండవు నీ వని యజ్ఞానంబువలన నాచేత నజ్ఞాతుండ వైతి వట్టి పరమేశ్వరుండ వైన నీ విప్పుడు రామరూపంబున నవతీర్ణుండ వైతి వని నాచేత విదితుండ వైతివి గావున. 52

క. జననుత నినుఁ గౌసల్యా, తనయునిఁ గా లక్ష్మణునిఁ బ్రతాపనిధిని నీ
యనుజన్మునిఁ గా సీతను, జనకజఁ గా నివుడు తెలియఁ జాలితి బుద్ధిన్. 53

క. అనఘా మున్నే తుంబురుఁ, డనుగంధర్వుండఁ గిన్నరాధిపుశాపం
బున నీయసహ్యరాక్షస, తనువుం గైకొనినవాఁడ దారుణభంగిన్. 54

వ. ఇట్లు రంభాసక్తుండ నైనయేను వైశ్రవణునిచేత నభిశప్తుండనై పదంపడి యమ్మహాత్మునిం బ్రార్థించిన నతండు ప్రసన్నవదనుం డై. 55

ఉ. ఓరి దురాత్మ యెన్నఁడు రఘూత్తముఁ డుగ్రత నిన్నుఁ బట్టి బల్
దారుణసంగరంబున శితప్రదరాహతిఁ ద్రుంచునప్పు డీ
ఘోరనిశాటరూప మది గోల్పడి తొంటిమనోజ్ఞరూప మిం
పారఁగ నొందె దింకఁ జను మంచుఁ బ్రసాద మొసంగె నాకొగిన్. 56

రామలక్ష్మణులు విరాధుని గుంటఁద్రవ్వి పూడ్చి వేయుట.

వ. మహాత్మా కుబేరుం డానతిచ్చినచందంబున నింతకాలంబునకు నీచేత నాకు శాపమోక్షణంబు సిద్ధించెఁ గృతార్థుండ నైతి నింక స్వర్గంబునకుం జనియెద నిచ్చటికిసార్ధయోజనమాత్రంబునవ్వల బ్రహ్మజ్ఞాననిబిడీకృతాంతరంగుండగు శరభంగుం డనుమునిపుంగవుండు వసియించి యున్నవాఁ డమ్మహాత్మునిఁ గానం జను మట్లైన నీకు స్వస్తి యయ్యెడు నన్నవటంబున నిక్షేపించి కుశలివై యరుగుము గతసత్త్వులైనరాక్షసుల కిది సనాతనధర్మంబు బిలనిక్షిప్తులగురాక్షసులకు సనాతనంబులైనయుత్తమలోకంబులు సన్నిహితంబులై యుండు నని పలికి తత్క్షణంబ యవ్విరాధుండు బాణక్షతవేదన సహింపం జాలక సన్నశ్వస్తదేహుం డై దివంబునకుం జనుట కుద్యుక్తుం డయ్యె నంత రాముండు విరాధువచనంబు విని లక్ష్మణు నవలోకించి వత్సా రౌద్రకర్ముం డైనయీ రాక్షసునకుఁ గుంజరంబునకుం బోలె యిప్పనంబున నొక్కమహాగర్తంబు ద్రవ్వు మని పలికి గర్తంబు ద్రవ్వునందాఁక విరాధుని కంఠంబుఁ బాదంబునం ద్రొక్కి పట్టి యుండె నంత లక్ష్మణుండు ఖనిత్రంబుఁ గొని విరాధుని పార్శ్వభాగంబున నొక్క ప్రదరంబు ద్రవ్విన నారఘుపుంగవుండు విరాధుని చరణపీడనంబున శిథిలీకృతకంఠుం గావించి బిలప్రక్షేపంబుకొఱకు శస్త్రవధంబు నిషేధించి బిలప్రక్షేపవిధంబు వానిచేత నివేదితుం డై మిక్కిలి కార్యవిశారదుం డగుటను వానియవధ్యత్వంబుఁ జూచి బిలనిక్షేపవధంబుకంటె నితరోపాయంబున విరాధునకు మరణంబు లేదని నిశ్చయించి పరమేశ్వరుం డైన రామునిచేత వధంబు సంప్రాప్తం బయ్యె నతిధన్యుండ నైతి నని హర్షంబున నాదంబుఁ గావించువాని సంగరనిర్జితుం డగువాని శంకుకర్ణుం డగువాని నవ్విరాధుని భుజబలంబునం బట్టి యెత్తి బిలంబులోఁ బడవైచి శిలలచేత నమ్మహాబిలంబుఁ బూడ్చి మహాపరాక్రముం డగురాముండు లక్ష్మణసహితంబుగా వీతభయుం డై పరమానందభరితాంతఃకరణుం డై చంద్రుండునుం

బోలెఁ గళాసంపన్నుండై సూర్యుండునుం బోలెఁ బ్రతాపవంతుం డై విరాధు వలనిభయంబునఁ బరితపించు చున్నజానకిం గౌఁగిలించుకొని మృదుమధుర భాషణంబుల నాశ్వాసించి దీప్తతేజుం డగులక్ష్మణున కిట్లనియె. 57

క. అనఘా ఘోరవనం బిది, మన కిచ్చట నింక నొంటి మసలఁ దగదు గ్ర
క్కున శరభంగమునీంద్రునిఁ, గనఁ బోవలె ననుచుఁ బలికె గాఢప్రీతిన్. 58

తే. అతనియనుమతిఁ గొని రాముఁ డతిరయమున
భావితాత్ముఁడు దేవప్రభావయుతుఁడు
నై నశరభంగమునియాశ్రమాంతికంబుఁ
జేరఁ జని కాంచె నందు విచిత్ర మొకటి. 59

వ. అది యెయ్యది యన. 60

—రాముండు దేవేంద్రునిరథంబుఁ జూచుట.—

సీ. తపనీయకేతనదండాగ్రపటవాతఘూర్ణంబు మబ్బులఁ గడలి కొత్త
రణితఘంటాఘణంఘణితనినాదంబు లవ్యక్తమధురంబు లై చెలంగ
మణిరథాంగసహస్రఘృణిపరంపరలు నభంబున నరుణాతపంబు నింపఁ
జంద్రమండలనిభస్వచ్ఛాతపత్రంబు పాండరాభ్రఖ్యాతిఁ బరిఢవిల్ల
తే. హరితసత్తమవాజిసహస్రకంబు, మహితముక్తావళిప్రభామండితంబు
నిరుపమానవిచిత్రమణీశతాంగ, మల్ల మొక్కటిగనె నభోమండలమున. 61

వ. మఱియు నవ్విమానమధ్యంబున. 62

సీ. మాళిఁ జుట్టినదివ్యమాలికాసౌరభం బళికులంబునకుఁ బేరాసఁ గొలుప
తెప్పప్రేయక చూచు దృక్సహస్రవిభూతి సర్వతోముఖవిచక్షణతఁ దెలుప
నరుణకటాక్షవీక్షారూఢి గొంపలఁ బిండిఁ జేసిననాఁటి బిఱుసుఁ జూప
వృత్రజంభకులఁ జంపిననాఁటిశౌర్యంబు చారణు లొకట జోహారు సేయఁ
తే. దనకు సము లైనదివిజులు తన్నుఁ గొల్వ, నమరనారీకరాందోళితాచ్ఛదండ
చామరవ్యజనానిలచలితచూర్ణ, కుంతలుం డైన యబళచీ కాంతుఁ గనియె. 63

వ. అప్పు డయ్యింద్రుండు రథావతరణంబుఁ గావించి శరభంగునిపాలికిం జను దెంచి మహీతలంబు సంస్పృశింపక కొండొకపొడువున నుండి యమ్మునిపుంగ వునితోడ సంభాషణంబుఁ గావించి రామాగమనం బెఱింగి క్రమ్మఱ రథా రూఢుం డయ్యె నప్పు డారఘువల్లభుండు శరభంగునితోడ సంభాషించి మరల రథారూఢుం డైనయింద్రునిం జూచి తదీయదివ్యరథంబు నంగుళీనిర్దేశంబున లక్ష్మణునకుం జూపి యిట్లనియె. 64

క. సౌమిత్రి కంటె దవ్వులఁ, గామగ మైనట్టి దివ్యకాంచనరథము
నోవ్యోమంబునఁ గార్యానవ, ధామముక్రియ భూరికాంతిఁ దనరెడుదానిన్. 65

క. అనఘా యాదివ్యరథం,బునకుం బూన్చినతురంగములసొబగు సురేం

ద్రునిహాయములకుం గల దని, మును వింటిమి గా తదీయములె గాఁబోలున్.

వ. మఱియు నిమ్మహనీయరథంబుచుట్టునుం బరివేష్టించి ఖడ్గపాణు లై విస్తీర్ణవిపు
లోరస్కు లై పరిఘాయతబాహు లై పద్మరాగసదృశవసను లై వ్యాఘ్రంబులుం
బోలె దురాసదు లై పంచవింశతివార్షికవయస్కు లై జ్వలనార్కప్రతీకాశహార
శోభితవక్షు లై ప్రియదర్శను లై కుండలాలంకృతకపోలభాగు లై ప్రకాశించు
చున్నవారు సుపర్వు లిప్పుడు యాదృగ్వయస్కు లై చూపట్టుచున్నవా రిది యె
వారలకు నిత్యం బై యుండు నని పలికి వెండియు నిట్లనియె. 67

ఉ. చందురువంటి నెమ్మొగము చల్లనిచూపుల మేటి యెవ్వఁడో
యిందఱిలోన భాసిలెడు నీతనిచంద మెఱుంగఁబో యెదన్
బొందుగ నీవు మైథిలియు మూఁకత మిచ్చటఁ దామసించి యుం
డం దగు నంచుఁ బల్కఁగ నొడంబడె లక్ష్మణుఁ డన్నమాటకున్. 68

తే. అంత శరభంగమునియాశ్రమాంతికమున, కేగుదెంచుచు నున్నసీతేశుఁ జూచి
శక్రుఁ డమ్మునిచే ననుజ్ఞాతుఁ డగుచు, నింపు సొంపార మెల్లన నిట్టు లనియె. 69

ఉ. వేడుకతోడ రాముఁ డతివేగమున న్నినుఁ జూడ వచ్చుచు
న్నాఁ డిట కమ్మహాత్ముఁడు ఘనం బగుకార్య మొనర్పఁ బూని యు
న్నాఁ డిఁకమీఁద నప్పని యొనర్చినపిమ్మటఁ గంటి కింపుగాఁ
జూడఁగఁ బోలు నా కిపుడు చూచుట కార్యము గా దనిందిరా. 70

వ. మదభిభాషణంబునకంటె ముందఱ నీరామునిచేత రావణవధరూపం బైన
కర్మంబు కర్తవ్యం బనంతరంబ యన్ను విలోకింపం గలండు రావణవధానంతరం
బున విజయలక్ష్మీవిరాజమానుం డై కృతదేవప్రయోజనుండై యున్నయీమహా
త్ముని విలోకించి కృతార్థుండ నయ్యెద. 71

సీతారామలక్ష్మణులు శరభంగమహర్షి ని సందర్శించుట.

క. అని పలికి వజ్రధరుఁ డమ్ముని నామంత్రణముఁ జేసి మును లనిమేషు
ల్దను సేవింపఁగ శీఘ్రం, బున దివ్యవరూథి నెక్కి పోయెం దివికిన్. 72

తే. అంత రఘువంశనేత కృతాగ్నిహోత్రు, ననఘు శరభంగమౌని డాయంగ నేగి
యవనిజాలక్ష్మణోపేతుఁ డై తదీయ, పాదపద్మంబులకు భక్తిఁ బ్రణతిఁ జేసి.

తే. అతనియనుమతి నొక్కదర్భాసనమునఁ, బరఁగఁగూర్చుండి తనకుఁగన్పడినపురుషు
చంద మేర్పడ నడిగిన సర్వ మతని, కెఱుకపడఁ జెప్పి వెండియు నిట్టు లనియె.

వ. మహాత్మా యద్దివ్యపురుషుండు శక్రుండు వరదుం డై తపోబలసముపార్జితం బైన
బ్రహ్మలోకంబునకు బ్రహ్మచేత ననుజ్ఞాతుం డై నన్నుం దోడ్కొని పోవుటకు
వచ్చినవాఁ డేను దపోబలవిశేషంబునం ద్రైకాలికసకలజగద్వృత్తాంతాభి
జ్ఞుండఁ గావునఁ జిరకాలంబు మనోమార్గంబున వెదుకంబడి యిప్పుడు నాభాగ్య
వశంబున బాహ్యంబున సమీపంబునందు వర్తించుచున్నప్రియాతిథి వైన

నిన్ను సందర్శింపక నిత్యనిరతిశయనిర్మలానందస్వరూపుండవు భక్తమందా
రుండ వైన నీ సందర్శనానందంబు విడిచి బ్రహ్మలోకంబునకుం బోవుట
యుక్తంబుగా దని యున్నవాఁడ భక్తసంరక్షణధర్మశీలుండవు మహాత్ముండవు
పరమపురుషుండవు నైన నీతోడ సమాగమంబుఁ జేసి బ్రహ్మలోకంబునకుం
జనియెద నాచేత జయింపంబడి యక్షయంబు లై బ్రహ్మలోకస్వర్గలోకసంభవ
భోగప్రదేశవిశేషంబులు సమృద్ధంబు లై యున్నవి మామకంబు లైనవానిం
బ్రతిగ్రహింపు మని సర్వేశ్వరుం డైన శ్రీరామునియందు సమర్పణాభిప్రాయం
బునం బలికిన సర్వశాస్త్రవిశారదుం డగురాముండు మునీంద్రా యేనె సర్వ
లోకంబు లాహరించు చున్నా నని సమర్పితఫలస్వీకరణాభిప్రాయంబును క్షత్రి
యునకుఁ బ్రతిగ్రహానర్హత్వాభిప్రాయంబును దేటపడం బలికి యివ్వనంబున
నాకు నివాసయోగ్యం బైనప్రదేశం బానతిం డనిన నమ్మునిపుంగవుం డట్లని
యిచ్చటికి సమీపంబున ధార్మికుం డైనసుతీక్ష్ణుం డనుమునీంద్రునియాశ్రమం
బు గల దమ్మహాత్మునిఁ గానం జను మతండు మీకు శ్రేయం బొనగూర్చు
నిమ్మందాకినీనది ననుసరించి పశ్చిమాభిముఖంబుగాఁ జను మీయాపగ పుష్ప
పల్లవోడుపంబుల వహించి యుండు నిది మార్గక్రమం బిక్కడ నొక్కముహూ
ర్తంబు నిల్చి యితండు కృతార్థుం డగుఁగాక యని కరుణాకటాక్షవీక్షణంబున
నన్ను విలోకింపు మురగంబు జీర్ణం బైనచర్మంబునుంబోలె సర్వావయవం

—శరభంగుఁ డగ్నిప్రవేశముఁ జేసి బ్రహ్మలోకమున కరుగుట.—

బులు పరిత్యజించెద నని పల్కి తత్క్షణంబ గార్హపత్యవహ్నిం బ్రణయించి
మంత్రపూర్వకంబుగా నాజ్యహోమంబుఁ గావించి మహాతేజుం డగుశరభంగుం
డప్పావకమధ్యంబునం బ్రవేశించిన నయ్యగ్నిదేవుం డామహర్షిముఖ్యునిరో
మంబులును జీర్ణం బైనచర్మంబును సశోణితం బైనమాంసంబును శల్యంబు
లును దిగ్మశిఖాపరంపరల దగ్ధంబులు గావించె నంత నారఘుపుంగవుం డచ్చెరు
వడి సూచు చుండ నమ్మునిపుంగవుండు దివ్యదేహంబు ధరియించి పంచవింశతి
వత్సరవయస్కుం డై యయ్యనలుని తేజంబుఁ దస్కరించెనో యనం బోలు
పొందుదివ్యతేజంబుఁ దాల్చి యక్కుండంబువలన నిర్గమించి దివ్యయానం
బెక్కి స్వర్గలోకాదిసర్వలోకంబు లతిక్రమించి శాశ్వతం బైనబ్రహ్మలోకంబున
కుం జని సానుచరుం డగుపితామహుని సముచితప్రకారంబున సందర్శించి పరి
తుష్టుం డై యవ్విరించిచేత స్వాగతం బడుగం బడినవాఁడై యమ్మహానీయ
మూర్తిం గొల్చి యుండె నిట్లు శరభంగుండు దివంబునకుం జనిన యనంతరంబ.

—వాలఖిల్యాదిమహర్షులు శ్రీరాముని జూడవచ్చుట.—

సీ. అనుదినంబును ఫలాహారు లై పెక్కేండ్లు తప మాచరించిన ధన్యమతులు
సలిలపాన మొనర్చి శాఖావలంబు లై పెక్కేండ్లు నిష్ఠ సల్పినమహాత్ము

లతిజీర్ణ పర్ణాశు లై బహుకాలంబు వినుతసమాధిఁ గైకొనినతపసు
లొడలు పుట్టలు గట్ట నిడుదకాలము గాడ్పు మెసవి తపోనిష్ఠ నెసఁగుమౌని

ఆ. వరులు వాలఖిల్య వైఖానసాత్రేయ, భార్గవాదిసకలపరమమునులు
దేవనుతులు దండకావనవాసులు, వరుస రాముఁ జూడ వచ్చి రపుడు. 76

వ. మఱియు భగవత్ప్రసాదప్రసాదలబ్ధజాతమహర్షులును బ్రతిదినంబును జీవసాధనం బు సంపాదించి సర్వంబునకును వినియోగంబు సేయునట్టివారును జంద్రికాపా యులును భక్షణార్థంబు ప్రియంగుప్రముఖంబుల కళ్ళంబునందుఁ గుట్టనం బుఁ గావించునట్టివారును శీర్ణపర్ణాశనులును వ్రీహ్యాదికంబు దంతంబులచేత ఖండించి భక్షించునట్టి దంతోలూఖలులును గంఠదఘ్నజలంబునందు నిలువం బడి తపంబుఁ గావించునట్టియున్మజ్జకులును నసంస్కృతమేదినియందు శయ నించునట్టిగాత్రశయ్యులును నొకానొకప్పుడైన శయనం బెఱుంగనియశ య్యులును వాతాతపవర్షంబులందు మిక్కిలి యనావరణదేశంబునందుఁ దపం బుఁ గావించు నట్టియభ్రావకాశులును సలిలాహారులును వాయుభక్షులును వాయుధారణబలంబున గగనంబునందు విలీనులగునట్టియాకాశనిలయులును గుశాద్యాస్తృతభూతలంబునందు శయనించునట్టిస్థండిలశాయులును వ్రతో పవాసనిష్ఠులును నార్ద్రపటవాసులును సంతతాధ్యయననిష్ఠులును నిరంతరజప పరాయణులును బంచాగ్నిమధ్యసమాచరితతపశ్శాలులును మొదలుగాఁగల మహర్షు లందఱు బ్రహ్మతేజోనిష్ఠులై స్వప్రకాశపరబ్రహ్మంబు రఘువంశంబునం దవతీర్ణం బై యస్మద్భాగ్యవశంబున మనకు దృష్టిగోచరం బయ్యె నేఁ డస్మ త్తపోదానాదికంబు ఫలితం బయ్యె నని దర్శనానందంబునఁ గృతార్థు లగుటకు నిర్ధనుండు ధనలాభంబు నొందినచందంబునఁ బరమానందనిర్భరులై నానా దేశంబులనుండి చనుదెంచి రక్షఃపీడితులై నతమ కనన్యగతికత్వంబునుజగద్రక్ష ణార్థంబవతీర్ణుం డై నరాముని సర్వలోకశరణ్యత్వంబును నిశ్చయించి స్వరక్ష ణంబునొఱకు దయోత్పాదకంబు లగువాక్యంబుల ని ట్లనిరి. 77

మునులందఱు రాముని నభయంబుఁ గోరుట.

సీ. అనఘాత్మ వేల్పుల కలశచిపతివోలె యిక్ష్వాకుకులమున కీర్తరాత్రి
కధినాథుఁడవు మహారథుఁడవు యశమున విక్రమంబున జగద్విశ్రుతుఁడవు
పితృభక్తియును సత్యవితరణంబులు సత్వ మధికధర్మంబు నీయంద యుండు
ధర్మవత్సలుఁడవు ధర్మజ్ఞుఁడవు మహాత్ముఁడ వైననినుఁ జేరి మునుల మెల్లఁ

తే. జాల నర్థిత్వబుద్ధి విజ్ఞాపనంబుఁ, జేసెదము మా ప్రయత్నంబు చిత్తగించి
సాధుసంరక్షణంబు ప్రశస్తధర్మ, మని తలంచి రక్షింపుము వినుతశీల. 78

వ. అని పరమార్థంబుగా విన్నవించి వెండియు లోకరీత్యనుసారంబున రాజధర్మం బు తేటపడ ని ట్లనిరి. 79

శా. షష్ఠాంశంబు కరంబుఁ బుచ్చుకొని యేతద్భర్త దేశప్రజ
న్నష్టస్వాంతముఁ జేయఁ డా నృపతి యూహింప న్గతశ్రేయుఁ డై
కష్టాత్ముం డగుఁ దండ్రి వోలెఁ బ్రజ సత్కారుణ్యుఁ డై ప్రోచువాఁ
డిష్టావాప్తి వహించి శాశ్వతయశం బేపార లోకంబునన్. 80

క. యతచిత్తుఁ డై సదావన, హితుఁ డై భూప్రజల నధిపుఁ డిష్టతనయజీ
వితములకైవడిఁ బ్రోచిన, నతనికిఁ జిరకాల మబ్బు నాయువు యశమున్. 81

మ. అనఘా యెవ్వఁడు రాజధర్మవిహితవ్యాపారధౌరేయుఁ డై
యనుమానింపక ప్రోచు నాతఁడు తదీయం బైనపుణ్యంబులో
ఘనత న్నాలవపాలు గైకొని సమగ్రశ్రేయుఁ డై సంతతం
బును లోకేశ్వరలోకనిష్ఠసుఖతం బొల్పొందు నిత్యోన్నతిన్. 82

వ. బ్రాహ్మణభూయిష్ఠం బైన యీ వానప్రస్థగణంబు భవన్నాథం బయ్యు ననాథం బైనచందంబున మిక్కిలి రాక్షసులచేత వధియింపం బడు చున్నది భవదధీనచిత్తుల మై యున్న మచ్ఛరీరంబులు బహుప్రకారంబుల రాక్షసపీడితంబు లై యున్నవి విలోకింపుము మహాత్మా పంపానదీతీరంబునఁ జిత్రకూటపర్వతంబున మందాకినీనదీప్రాంతకాంతారంబులఁ జిరకాలంబుననుండి నివసించి యున్న పరమర్షుల దురవస్థ కొలంది వెట్ట నలవి గాదు బహుప్రకారంబుల భీమకర్ము లగు రాక్షసులచేతఁ గ్రియమాణం బైన విప్రకారంబు సహింపం జాలక సర్వలోకరక్షణసమర్థుండ వైన నిన్ను శరణంబు నొందుటకుం జనుదెంచితిమి సర్వలోకంబులయందు నీకంటె నైహికాముష్మికసాధన దేవతాంతరం బన్యం బెద్దియు లేదు గావున ననన్యశరణ్యుల మైన నమ్ము రాక్షసబాధవలన విముక్తులం జేసి కృపాళుండ వై రక్షింపుమని బహుప్రకారంబుల దీను లై ప్రార్థించు చున్న యత్తపోధనులవాక్యంబు లాకర్ణించి ప్రసాదసుందరవదనారవిందుం డై కౌసల్యానందనుం డిట్లనియె. 83

రాముఁడు మునుల కభయం బొసంగుట.

ఉ. ఓజటివర్యులార వినుఁ డున్నతవైఖరిఁ గైకయీవర
వ్యాజమున న్నిశాచరుల నందఱఁ ద్రుంచి మిముం గృపాగుణ
భ్రాజితశక్తిఁ గాచుట కరణ్యపదంబున కేగుదెంచితి
న్రాజితకీర్తులార యిటు ప్రార్థన సేయుట యింత యేటికిన్. 84

ఉ. మంచిది మీరు నన్ను బహుమానపురస్సరదృష్టిఁ జూచి ప్రా
ర్థించితి రట్లు గాన నిఁక దేవవిరోధులబాహుశక్తి మ
ర్దించెద నీవనంబు కడుఁ బ్రీతి దలిర్ప నరాక్షసంబు గా
వించెద మీకు హర్ష మొదవించెద నించెదఁ గీర్తి దిక్కులన్. 85

ఉ. చెచ్చెరఁ జాప మెక్కిడి ప్రసిద్ధశరంబుల రాక్షసావళిఁ

ప్రచ్చిన వేళ నాటుశరబాధకు నోర్వక దైత్యు లాజిలోఁ
జచ్చిన వేళ నాదుబలసంపద లక్ష్మణు బాహువిక్రముం
బచ్చువశంగఁ జూచి సుదినచ్చెరు వందెడి కింత యేటికిన్. 86

వ. అని పలికి సాదరంబుగాఁ దపోధనుల శరభంగాశ్రమంబునం బోసంగి వారు తనవెంటం జనుదేర సీతాలక్ష్మణసహితుం డై సుతీక్ష్ణమునీంద్రునాశ్రమంబునకుం బోవ ననుకట్టి యచ్చోటు వాసి కొండొకదూరంబు బరిగి యంతయంత బహూదకంబు లైన నదులు పెక్కులు గడచి యొక్కచోట గగనోల్లిఖితశిఖరంబై నయొక్క శైలంబు పొడగని తత్ప్రాంతంబునఁ బహుఫలపుష్పద్రుమశోభితం బైనయొక కాంతారంబుఁ బ్రవేశించి తన్మధ్యభాగంబునఁ జీరమాలాపరిష్కృతం బైన యొక్క మహానీయాశ్రమంబు నిరీక్షించి యందు శాశ్వతుం డై పద్మాసనంబున సుఖాసీనుం డై మలపంకజటాధరుం డై యున్న సుతీక్ష్ణుని సముచితంబుగా సందర్శించి తచ్చరణంబులకు వందనం బాచరించి వినయపూర్వకంబుగా నిట్లనియె.

శ్రీరాముఁడు సుతీక్ష్ణమహాముని సందర్శించుట.

క. అనఘాత్మ యేను దశరథ, తనయుండ రామాహ్వయుండఁ దగ మిముఁ జూడం
జనుదెంచితి మ్రొక్కెద నె, మ్మనమున నాశీర్వదించి మన్నింపఁ దగున్. 88

క. నా విని మునినాథుండు న, తానల్లఁ జూచి కరుణ దళుకొత్తఁగ సం
భావించి యిట్టు లనియెను, బ్రావీణ్య మెలర్ప మధురభాషాప్రౌఢిన్. 89

క. సురపతి కెన యగునీ విపు, డరుదెంచుటకతన నిస్మహాసని సుశుభో
త్కర మై పావన మై యజుగుఱి లేకిలు నాథ నత్తపసం బయ్యెఁ గదా. 90

ఉ. రట్టడి కైకచెప్పుడుముల రాజ్యము గోల్పడి భూమిపుత్త్రితోఁ
బుట్టువు వెంట రాఁ దపసిభూమికిఁ దైకొని చిత్రకూట మ
న్గట్టున నున్నవాఁడ వనఁగా విని యెన్నఁడు చూతు నంచు ని
ప్పట్టున నున్నవాఁడ ననపాయకుతూహలి యుల్లసిల్లఁగన్. 91

వ. మహాత్మా యింతకు మున్నిచటికి సురేంద్రుండు చనుదెంచి మీరాక యెఱింగించి చనియె నేను భవద్దర్శనాకాంక్షి నై దేహంబుఁ బరిత్యజించి దేవలోకంబునకుం బోనకున్నవాఁడఁ దపోబలవిశేషంబునఁ బుణ్యలోకంబుల నన్నింటిని జయించితి దేవర్షిజుష్టంబు లైన తల్లోకంబులందు జానకీలక్ష్మణసహితుండ వై మత్ప్రసాదంబున విహరింపు మనిన నారఘువల్లభుండు మునీంద్రా యేనును సమస్తలోకంబు లాహరించెద నిక్కాననంబున నాకు వసియించుటకుం దగిన యాశ్రమంబు వానతిమ్ము సర్వభూతహితుండవు మహాత్ముండ వై ననీకుశలంబుగాతముం డై శరభంగునిచేత నాఖ్యాతం బయ్యె ననిన విని లోకవిశ్రుతుం డైన యమ్మునిపుంగవుండు పరమానందభరితాంతరకరణుం డై మంజుభాషణంబుల నిట్లనియె. 92

చ. అనుపమరమ్యమూలఫలమై సుకృతంబులకున్నివాసమై
మునులకు నాటపట్టయి సముస్నతి నొప్పెడునీవనంబు నీ
కనఘ నివాసయోగ్య మగు నైనను వన్యమృగంబు లెల్లెడన్
బనివడి నీతపంబునకు భంగము సేయుచు నుండు నిచ్చటన్. 93.

వ. మహాత్మా యివ్వనంబునకు మృగసంఘంబులు చనుదెంచి యకుతోభయం బులై యథేష్టంబుగా సంచరించి నానావిచిత్ర వేషంబులఁ దపోభంగంబుఁ గావించి గ్రక్కున జను చుండు నిచ్చట మృగప్రలోభనమహాపదోషంబుకంటె నన్యదోషం బేమియు లే దని పలికిన విని రామభద్రుం డమ్మునికి ట్లనియె. 94

చ. ఇనసమతేజ యేను ధను వెక్కిడి ఘోరమృగావళి న్మహా
శనినిభశాతబాణములఁ జంపితి నేని తదగ్గనుండు నీ
మనమునకు న్విషాద మగు మా కది యిక్కలి పీడ సేయు ని
వ్వనమున దీర్ఘకాలము నివాస మొనర్పఁగఁ జాల నెంతయున్. 95

వ. అని పలికి రాముండు సీతాలక్ష్మణసహితుం డై యమ్మునీంద్రునాశ్రమంబున నివాసంబుఁ గల్పించుకొని పశ్చిమసంధ్య నుపాసించి మునిపతి యొసంగిన తాపసభోజ్యం బైనయన్నంబు భుజించి యతనిచేత సత్కారంబు వడసి మునులతోడ నిష్టకథావినోదంబుల నారాత్రి పుచ్చి మఱునాఁ డరుణోదయంబున సీతాసహితంబుగాఁ బద్మకైరవసౌరభోల్లసితం బైనశీతసలిలంబున మజ్జనంబుఁ గావించి యగ్ని దేవు నారాధించి సురలం బూజించి మహర్షుల సత్కరించి సుతీక్ష్ణమునీంద్రునకు వందనంబుఁ గావించి సవినయవాక్యంబుల ని ట్లనియె. 96

రాముఁడు సుతీక్ష్ణమహర్షిని మును లాశ్రమంబుఁ జూడ ననుజ్ఞ నడుగుట.

ఉ. ఓమునివర్య నేఁడు సుఖ ముంటిమి నీకడ నీతపోధన
గ్రాముఁడు లోకరీతి నను రమ్మని పిల్చుచు నున్నవార లేఁ
తో ముద మొప్ప వారిఁ బరితుష్టులఁ జేయుట మేలు గాన నా
నామహనీయతాపసవనంబులు గన్గొనఁ బోయి వచ్చెదన్. 97

చ. అనఘచరిత్ర దుర్నయసమాగతసంపద నొందినట్టిదు
ర్జనుఁ డగురాజుభంగి నవిషహ్యఘనాతపుఁ డై నతఁడాత్రయీ
తనుఁడు నభంబునం గడుఁ బ్రతాపము నొందకమున్నె లక్ష్మణు
జ్జనకజఁ గూడి తాపసవనంబులకుం జనువాఁడ నెంతయున్. 98

క. అని పలికి సుమిత్రానందన సీతాసహితుఁ డగుచుఁ దత్పదములకున్
వినతి యొనరింప నతఁ డక్కునఁ జేర్చి ముదం బెలర్ప గురుమతి ననియెన్ 99

ఉ. తమ్మునిఁ గూడి నీవు సుపథంబున నేగుము భూమిపుత్రి యం
దమ్మున వెంట రాఁగ విపినంబున నున్కి యొనర్చి యున్నపు
ణ్యమ్ములప్రోవు లైనమునినాథుల రమ్యతరాశ్రమప్రదే

శమ్ములు వేడ్కతోడ నరసం దగఁ గన్గొని రమ్ము రాఘవా. 100

వ. మఱియు ఫుల్లపంకజమండితప్రసన్నసలిలయుతహంసకారండవాకీర్ణంబు లగు సరోవరతటాకంబులు గలిగి దృష్టిరమ్యంబు లగుగిరిప్రస్రవణంబులచేత నావృతంబులై పరస్పరవైరవిహీనప్రశాంతమృగపక్షిగణంబులై మునియూథాభిసేవితంబులై యొప్పురమణీయారణ్యంబులు విలోకించుచు దండకారణ్యనివాసు లగు మహర్షులచేత సత్కృతుండవై క్రమ్మఱ మదీయాశ్రమంబునకుం జనుదెమ్మని పలికిన నట్లకాక యని రాముండు లక్ష్మణసహితంబుగా నమ్మహర్షిచరణంబులకుఁ బ్రణామంబుఁ గావించి యపాంసులాశిరోమణి యగువైదేహి యొసంగిన శుభతరతూణీరంబులును దీర్ఘంబు లగుచాపంబులును గనకత్సరుఖడ్గంబులును దమ్ముండును దానును సముచితంబుగా ధరించి నిజదేహప్రభాపటలం బక్కాంతారంబునకుం గాంచనచ్ఛాయ సంపాదింప శీఘ్రంబునఁ బ్రయాణంబున కభిముఖుం డయ్యె నాసమయంబునఁ దదీయసహధర్మచారిణియు నిత్యానపాయినియు దివ్యమంగళస్వరూపిణియు నగుసీతాదేవి నిజభర్త నవలోకించి హృద్యంబగుస్నిగ్ధవాక్యంబున నిట్లనియె. 101

సీత రాముని సత్యసంధత్వపరదారపరాఙ్ముఖత్వాదుల నభినుతించుట.

సీ. ప్రాణేశ శాస్త్రోక్తభంగి నేయుత్కృష్టధర్మ మీమునికులోత్తమునిచేతఁ
దప్పక ప్రాప్తించెఁ దద్ధర్మ మీలోకమందుఁ గామోద్భవం బైనయట్టి
వ్యసనంబువలనఁ జయ్యన నివృత్తుండ వై నసీచేత నిత్యంబు నేర్పుచలన
నాచరింపఁగ శక్య మై యుండు మిథ్యాభివాదంబు పరసతీవర్తనంబు

తే. ధాత్రివైరంబు లేనిరౌద్రత్వ మనఁగఁ, బొసఁగనిమ్మూఁడు కామజవ్యసనములగు
నరయ మొదలిమిథ్యాభివాక్యంబుకంటెఁ, దక్కినవి రెండునతిగుమత్త్వమువహిం

చ. పరవనితాభిలాషయును బల్కులబొంకును ధర్మనాశమం [చు
ద్ధరయఁగ నీకు లేవు పురుషాధిప మున్నవి రెండు మీఁదటన్
దొరకొనఁ బోవు నేఁ డిచటఁ దోడ్పడె నంచు వచింప నెట్లగుం
గర మురుధర్మశీలికిఁ ద్రికాలమునందును గల్ల నేర్చునే. 103

వ. అని పలికి మూఁడింటిలోనఁ బరదారాభిగమనాభావంబునం దతిశయం బెఱింగించుతలంపున వెండియు నిట్లనియె. 104

తే. భావమున నైనఁ గల నైన భ్రమసి యైన
నన్యకాంతాభిగమన మావంత యైన
నధిప కాలత్రయంబునం దరయ నీకు
లే దనుట కించుకయు శంక లేదు నాకు. 105

వ. అని పలికి పరదారాభిగమనమిథ్యావచనాభావంబులందుఁ గ్రమంబున హేతుద్వయం బుపన్యసించుతాత్పర్యంబున నిట్లనియె. 106

తే. అనఘచరిత ధర్మిష్ఠుండ వగుచుఁ బ్రీతి, ననిశము స్వదారనిరతుండ వైతి నీవు
సత్యసంధుండ వగుచు నాజనకవాక్య, కారకుఁడ వైతి పింత నిక్కంబు సువ్వె.

క. సత్యము ధర్మము సర్వము, నిత్యము నీయందు నిలిచి నెగడుచు నుండున్
సత్య మజితేంద్రియుల కివి, యత్యంతభరంబు లగు మహాగుణశాలీ. 108

సీత రామునితో జీవహింస చేయఁ దగ దని చెప్పుట.

వ. మహాత్మా నీకు మిథ్యావాక్యపరదారాభిగమనరూపవ్యసనద్వయప్రసక్తి లేదు భవదీయవశ్యేంద్రియత్వం బెఱుంగుదు నెయ్యది మూఁడవది యగు నిర్వైరపరప్రాణాభిహింసనరూపవ్యసనంబు గల దది మోహంబువలన రౌద్రత్వరూపాధర్మాంతరంబు సంపాదించు నది యిప్పుడు నీకు సముపస్థితం బయ్యె దండకారణ్యనివాసిమహర్షిరక్షణార్థం బిప్పుడు రాక్షసవధంబు నీచేతఁ బ్రతిజ్ఞాతం బయ్యెఁ గైకేయీవరవ్యాజంబున రక్షోవధార్థంబు శరచాపంబులు గైకొని భ్రాతృసహితంబుగా దండకావనంబునకుం జనుదెంచితి వని యూహించెద రాక్షసవధార్థంబు ప్రస్థితుండ వైన నిన్ను విలోకించి భవదీయసత్యప్రతిజ్ఞత్వస్వదారైకనిరతత్వాది సద్వృత్తంబు విచారించి యుభయలోకసుఖకాంక్షిణి నైన నాకు మనఃఖేదం బగు చున్న దని పలికి వెండియు నిట్లనియె. 109

తే. రఘుకులోత్తమ దండకారణ్యగమన, మరయ నీకు హితంబుగా దని తలఁచెదఁ
గరము నీయర్థమం దొక్క కారణంబు, గలదు వినిపింతు వినుము నిశ్చలత మించి.

క. ధనువును శరములుఁ గైకొని, జననాయక నీవు భ్రాతృసహితుఁడ వై య
వ్వనమునకుఁ జనితి వేనియు, దనుజులఁ గని శరము విడువఁ దలఁపు వొడమదే.

సీత రామునకు ధనుర్ధారణము వికారహేతు వని నిరూపించుట.

తే. అధిప ముంగల నున్నశరాసనంబు, వినుము నృపులకుఁ దేజోభివృద్ధి నొసఁగు
నెంతయు సమీపమున నున్న యింధనములు, శ్వసనసఖునకుఁ దేజంబొసంగినట్లు.

వ ఇందులకు నొక్క యితిహాసంబు గల దెఱింగించెద వినుము. i13

శా. దేవా మున్నొకపుణ్యకాననమునన్ ధీరోత్తముం డాత్మవి
ద్యావర్ధిష్ణుఁడు విప్రుఁ డొక్కఁడు తపం బారూఢిఁ గావింపఁగా
దేవాధీశుఁడు తత్తపంబుఁ జెఱుపన్ దీపించు ఖడ్గంబుఁ గొం
చా విప్రోత్తముఁ డున్నచోటికి భటుం డై వచ్చె దంభాకృతిన్. 114

తే. శక్రుఁ డిభ్భంగి నతనియాశ్రమపదంబుఁ, జేరి తన చేతిఖడ్గ మప్పాఱు చేతి
కిచ్చి మునివర్య దీని నా వచ్చునంత, దాఁక రక్షింపు మని చెప్పి తడయ కరిగె.

వ. అంత నవ్విప్రుండు శక్రదత్తశస్త్రంబు పరిగ్రహించి న్యాసరక్షణతత్పరుం డై స్థాపితవస్తువిషయవిశ్వాసంబువలన నేమఱక ఫలమూలహరణార్థం బరుగు నప్పుడును ఖడ్గంబుఁ గొనిపోవుచు నతిప్రయత్నంబున దాని రక్షించుచు వనంబునం జరించుచు నంతకంతకుఁ గ్రమంబున నత్తపోధనుండు శస్త్రసంవాసంబు

వలనఁ దపంబు విడిచి క్రూరబుద్ధి నధిగమించి ప్రమత్తుండై యధర్మకర్శితుండై రౌద్రాభిరతుండై నిరయగతికిం జనియెనిది శస్త్రసంయోగకారణంబైనపురావృత్తాంతంబు వహ్నిసంయోగం బెట్లు వస్తువునకు వికారహేతు వగు నట్లు శస్త్రసంయోగంబును శస్త్రధారికి వికారహేతు వగు నని పలికి వెండియు నిట్లనియె.

చ. ఘనుఁడవు నీవు నీమతము గా దని పల్కఁగఁ జాల నైన బ
ల్చినవున స్నేహదర్శితబలంబున నాడితి దీనిఁ దప్పు గాఁ
గొన కిది యెంత యంచు మదిఁ గ్రుక్కక నావచనంబుఁ బట్టి నే
ర్పునఁ బలలాశికోటిపయిఁ బుట్టినరౌద్రత నుజ్జగింపుమీ. 117

క. పగఁ గొనినవారిఁ జంపం, దగుఁ గాక నృపాలచంద్ర తడయక నీకుఁ
బగఁ గొనని వారి దైత్యులఁ, దెగఁ జూడం దగదు గలవె దీన శుభంబుల్. 118

తే. అధిప దైత్యవధారంభ మంతకంత, కఖిలలోకహింసాబుద్ధి నవలఁ గలుగఁ
జేయు నేయపరాధంబుఁ జేయనట్టి, సర్వజనుల హింసించుట కోర్వఁ జాల.

—☙ సీత రామునికి వనవాసులకుఁ బరహింస దగ దని చెప్పుట. ❧—

సీ. క్షత్రధర్మోచిత సాధురక్షణవృత్తులైనవీరుల కరణ్యప్రవాసి
మానిసంరక్షణమాత్రంబు ధనువుచేఁ గార్యంబు సర్వరాక్షసులఁ జంపి
మునుల రక్షించుట మనకుఁ గార్యము గాదు రాజ్యపాలనశీల రాజధార్య
మైన శస్త్రం బేడ ఘోనితరాజ్యంబు విడిచి యిప్పుడు మునివృత్తిఁ బూని
తే. వచ్చి సొచ్చినవన మేడ వసుమతీశ, కార్యహింసాభిలక్షణకర్మ మేడ
మఱియు హింసారహితతపశ్చరణ మేడ, బుద్ధి నరయ పరస్పరవిరుద్ధ మయ్యె.

తే. దేవ మనచేత నిప్పుడు దేశధర్మ, మాచరింపంగఁ దగుఁగాక యన్య మేల
శస్త్రసేవనమునఁ గలుషంబు గలుగు, క్షత్రధర్మం బయోధ్యలోఁ జలుపవచ్చు.

తే. రాజ్యముఁ బరిత్యజించి యరణ్యమునకు, వచ్చినందుకుఁ బరహింసపడలి మాని
వృత్తిఁ బూని వర్తించెదమేని దేవ, తల్లిదండ్రుల కధికముదంబు గలుగు. 122

క. ధర్మమున ధనము దొరకొను, ధర్మంబునఁ బరమసుఖము దనరుచు నుండుఁ
ధర్మమునఁ గలుగు సర్వము, శర్మద యీజగము ధర్మసారము సుమ్మీ. 123

వ. మహాత్మా కృచ్ఛ్రచాంద్రాయణాదికంబులైననియమంబులచేతశరీరంబు కృశింపం జేసి నిపుణు లగువారిచేత ధర్మంబు ప్రాపింపం బడు సుఖాధిష్ఠానానువర్తనంబున సుఖంబు గలుగదు గావున రాక్షససంహారోద్యోగంబు కర్తవ్యంబు గాదు నీవును నిత్యంబును శుచిమతివై తపోవనంబున నేతత్కాలసదృశంబైన ధర్మంబు ననుసరించి వర్తింపుము త్రిలోకాంతర్వర్తిజనధర్మాధర్మాత్మకంబైన సర్వంబును మీకు విదితంబై యుండు మీకు ధర్మం బుపదేశించుట కెవ్వండు సమర్థుండు స్త్రీచాపలంబున నిది నాచేత సముదాహృతం బయ్యె భ్రాతృసహి

తుండవై బుద్ధిచేత విచారించి చిత్తంబునకుం దోఁచినభంగి నవధరింతువు
గాక యని పలికిన భర్తృభక్తయగు నా దేవివాక్యంబు విని రాముండు ముని
పరిపాలనాత్మకధర్మసంస్థితుండై యద్దేవి కిట్లనియె. 124

రాముఁడు సీతతో రాజులకు సాధురక్షణం బావశ్యకం బని చెప్పుట.

చ. చకితమృగాక్షి నీపలుకు సత్యము క్షత్త్రియవీరధర్మదీ
పకము హితంబు పథ్యము శుభంబు వరంబు మనోహరంబునై
ప్రకటిత మయ్యెఁ గార్ముకముఁ బట్టినభూపతి కార్తరక్ష త
ప్పక దగు నంచు నీవె యిటు పల్కితి వే యిఁకఁ జెప్ప నేటికిన్. 125

ఉ. వారిజగర్భతుల్యు లగువారు మహర్షులు సంతతంబు దు
ర్వారపటుప్రతాపబలవద్రజనీచరబాధితాంగులై
వారక యేగుదెంచి జితవైరిని నన్శరణంబు నొంది రం
భోరుహగంధి యమ్మునులఁ బ్రోవనినాకు యశంబు గల్గునే. 126

చ. నరపిశితోపజీవులు ఘనాఘనదేహులు క్షుద్రయామినీ
చరు లతిఘోరభంగిఁ దమ సారెకుఁ గాఱియపెట్టి సంతతాం
తరితమఖాదికార్యకలన న్ననుదోయికిఁ గూర్కు లేక ది
క్కఱి మునిపుంగవు ల్గడు సుఖస్థితిఁ గానక యున్నవా రొగిన్. 127

తే. నిత్య మీదండకారణ్యనిలయులైన, మునులు రాక్షసపీడితమూర్తు లగుచుఁ
దపము లన్నియుఁ జాలించి తమదురంత, చింత లన్నియు నాతోడఁ జెప్పుకొనిరి.

తే. ఏను నత్తాపసేంద్రముఖేరితోక్తి, విని తదంఘ్రుల కెఱఁగి యోవిప్రులార
యింత వగ పేల నాకు మీచింత లెల్లఁ, జెప్పుఁ డెంతటిపనియైనఁ జేయువాఁడ.

క. అని యేను బలుక విని యి, ట్లనిరి రఘూత్తంస దండకారణ్యమునన్
దనుజులు మము బాధించుచుఁ, గనారిలుచు నున్నవారు గావుము కరుణన్.

క. ఎచ్చోట నుండి వత్తురొ, విచ్చలవిడి పర్వహోమవేళల జొలల్
చొచ్చి శుచికుండముల బలు, మచ్చరమున నింతు రస్థిమాంసంబు లొగిన్.

క. దనుజులరాయిడి కోర్వక, దినకరకులవర్య నీవె దిక్కని దైన్యం
బున శరణ మొందినారము, ఘనకృప రాక్షసులఁ ద్రుంచి కావుము మమ్మున్.

సీ. భూరితపోబలంబున దైత్యుల వధింప శక్తుల మైనను జనవరేణ్య
బహుకాలమున నుండి పడసినఘనతపంబునకు హాని జనించు ననుచు ఘోర
దనుజబాధితుల మయ్యును వారి శపియింప నోడి యున్నాము తదుగ్రబాధ
నడఁచి ప్రోవుము కరుణాంభోనిధియటంచు గురుదైన్యమున వేఁడుకొనిరి గాన

ఆ. దీనులైనమునులదినత్వ ముడుపుట, కంటె వేఱె ఫలము గలదె నాకుఁ
గ్రూరులైనదైత్యవీరులఁ జంపినఁ, బాప మేల గలుగు పంకజాక్షి. 133

వ. దేవి రాజత్వం బంగీకరించుటకు సాధుసంరక్షణంబు ఫలంబు గదా మునిరక్షణా

ర్థంబు ప్రాణంబు లొసంగినం గొఱంత లే దేను గై కేయీవరవ్యాజంబున వనంబునకుం జనుదెంచుటయు దండకారణ్యనివాసిమునిరక్షణార్థం బని యెఱుంగుము నాయందు సౌహార్ద్రస్నేహవిశేషంబున హితంబుఁ జెప్పితివి దానం దప్పు లేదు ప్రాణంబులకంటె గరీయసివి గావున నీపలుకులకు సంతోషించితి నిది మొదలు సాధుసంరక్షణార్థంబు రాక్షసవధంబున కుపక్రమించెదనని నానావిధ ప్రియాలాపంబుల నమ్మైథిలరాజనందిని గారవించి యద్దేవి నడుమ నిడుకొని లక్ష్మణుండు పిఱుందదెసం జనుదేరఁ దాను ముంగలి యై యచ్చోటు వాసి మహారణ్యమార్గంబుఁ బట్టి పోవుచు. 134

చ. అటఁ జని కాంచె రామవిభుఁ డంబరచుంబిరసాలభూర్జరీ
కుటజతమాలతాలవటకుందకురంటకకోవిదారవి
స్ఫుటకరవీరలోధ్రతరుచూతమధూకవిశాలశింశుపా
పటలవిరాజితం బయినభాసురదావము భూరిశావమున్. 135

వ. మఱియు నమ్మహాగహనంబునందు. 136

సీ. పల్వలోత్తీర్ణశుంభద్వరాహంబులు గుంపు లై సెలయేళ్లు రొంపి సేయ
సెలయేటియసుకతిన్నెలసింహపోతంబు లురుసామజములపై నురువడింప
సెలవుల రురుడింభపలలసారము గాఱఁ గ్రోల్పులు ల్పొదరిండ్ల గుఱక లిడఁగ
సలలితఘనశాడ్వలచరన్మృగపంక్తి భిల్లాగమనభీతిఁ గ్రేళ్లు దాఁటఁ

తే. జండగండకవేదండశరభభల్ల, శల్యసారంగచమరికాశశకఖడ్గ
భూరికాసరమహిషదుర్వార మైన, యమ్మహారణ్యమధ్యమం దరిగి యరిగి. 137

—రాముఁ డొకానొకతటాకంబునం గల వాద్యధ్వనుల వినుట.—

మ. ఒకచో రాముఁడు కాంచె నభ్రపదసంయుక్తోర్మిసంచారము
న్వికసత్సారసచక్రవాకబిసభుగ్వేదండరాడ్వారముం
బ్రకటామోదమరాళసేవితలసత్పంకేరుహోదారముఁ
బకుళాబ్జాకరతీరముఁ సుఖిలసద్ద్వారంబుఁ గాసారమున్. 138

వ. మఱియు నాసరోవరంబు యోజనాయతంబును వనవారణాలంకృతంబును గమఠమీనగ్రాహపాఠీనాభియుతంబును నై యొప్పె నందు. 139

క. హృద్యం బై శ్రోత్రములకు, వేద్యం బై నీటిలోనఁ బృథుసుందర మై
సద్యస్సుఖసూచక మై, వాద్యధ్వని దోఁచె దుర్నివారస్ఫూర్తిన్. 140

క. విని రామభద్రుఁ డిచ్చట, జను లెవ్వరు లేరు వాద్యశబ్దము నీటన్
వినఁబడుట కేమిహేతువొ, యని యచ్చెరు వడరఁ గౌతుకాన్వితమతి యై.

క. అచ్చెరువడ గాఢతపం, బచ్చుపడం జేయుచున్నయనఘుఁ దపస్వి
న్నచ్చరితు ధర్మభృతుని, న్మెచ్చిన కుతుకమునఁ జూచి యిట్లని పలికెన్. 142

శా. ధ్వానం బొక్కటి పుట్టె నిమ్మడువులో వర్ణింపఁ జేత స్సమా

ధానం బై విన నయ్యెడిం జెవుల కద్దా నిర్జనం బైనచో
స్వానం బేల జనించెఁ గౌతుకము దైవాఱంగ నీచందము
న్మౌని గ్రామణి తెల్పు నా నతఁడు సమ్మానించి తా నిట్లనున్. 143

—ధర్మభృతుండు రామునకుఁ దటాకమందలివాద్యధ్వనులకుఁ గారణం బెఱింగించుట.—

సీ. అనఘాత్మ వినుము పంచాప్సరం బనుతటాకం బిది ముని మాండకర్ణి యనెడు
మునిపతి తపముపెంపున దీని నిర్మించెఁ బదివేలవర్షము ల్పరమనిష్ఠఁ
గరువలి భుజియించి ఘనతపం బొనరింపఁ దత్తపోవహ్నిసంతప్తు లగుచు
వేల్పులు దలపోసి విఘ్నంబుఁ గావింప వంచించి యప్సరఃపంచకంబు
తే. ననుప వారలు వలపుల నతనిధైర్య, మహిమ లోఁగొన నమ్ముని మదనవశత
దేవకాంతలఁ బత్నులఁ గా వరించి, యింపు దళుకొత్తఁ జాలఁ గ్రీడింపఁదలఁచి.

వ. ఈతటాకంబునం దంతర్హితగృహంబు నిర్మించి యిందు నిత్యంబు నవ్వేలందులం
గూడి యథేచ్ఛావిహారంబునం గ్రీడించుచుండు నీనిస్వనంబు సంక్రీడమానలై
న యత్తలోదరుల భూషణస్వనోన్మిశ్రం బైనగీతవాదిత్రశబ్దం బిచ్చట వర్తించు
వారికి మనోహరంబుగా వీతెంచుచుండు ననిపలికిన రాముండు పరమాద్భుతంబు
నొంది యమ్మునిమహత్త్వంబు కొండొకసేపు వక్కాణించి సీతాలక్ష్మణసహితం
బుగా నచ్చోటువాసి కుశచీరపరిక్షిప్తంబును నానావృక్షసమావృతంబు నైయ
మ్మహారణ్యంబునం జెలువొందు తాపసాశ్రమమండలంబుఁ బ్రవేశించి. 145

చ. దిన మొకయాశ్రమంబున నతిప్రమదంబున నున్కి సేయుచున్
మునికృతహోమమంత్రరవము ల్వినుచుం బ్రతిపూజనంబుఁ గై
కొనుచుఁ గుశాస్తరంబుపయిఁ గూర్కుచు మూలము లారగించుచున్
మునులకు విందయై రఘువిభుండు చరించెను దండకాటవిన్. 146

చ. ప్రమదముతో నెదుర్కొని తపఃఫలముం బడెఁ రాముని న్మునుల్
దమతమయాశ్రమంబులకుఁ దప్పక దోడ్కొని పోయి వేడ్క న
క్లమముగఁ బాద్య మర్ఘ్యము ఫలంబు కుశాస్తరణం బొసంగి ని
త్యము మముఁ గావు మోరఘువతంస యటంచు నుతించి రెంతయున్ 147

క. చెలువుగ నీగతి రాఘవుఁ, డలయక దినదినము దండకారణ్యమునం
గలతాపసాశ్రమంబులు, గలయఁగఁ జరియించె ననుజకాంతాయుతుఁ డై.

క. ఈరీతి ఘోర మగుకాం,తారంబునఁ దిరుగు చుండ దాశరథికి సొం
పార సమయాబ్దములలో, నారూఢిగ వర్షదశక మయ్యెం బెలుచన్. 149

వ. ఇట్లు రాముండు వనంబున నొక్కచోట నిరువదిరెండునెలలును నొక్క
చోటఁ బదునాల్గునెలలును నొక్కచోటఁ బదియేనునెలలును నొక్కచోటఁ
బదియాఱు మాసంబులును నొక్కయెడ నర్ధాధికదశమాసంబులును నొక్క
యెడ నర్ధాధికైకాదశమాసంబులును నొక్కయెడఁ బదుమూఁడుమాసంబు

లును నొక్కయేఁడు బదునెనిమిదిమాసంబులును గా నిట్లు దశవర్షంబులు
గడపె నంత నారఘువల్లభుండు సీతాలక్ష్మణసహితుండై వెండియు నెప్పటి
సుతీక్ష్ణమునియాశ్రమంబునకుం జనుదెంచి యతనిచేతం బ్రతిపూజితుం డై
యచ్చటం గొన్నిదినంబు లుండి యొక్కనాఁ డమ్మునిం జేరి యిట్లనియె. 150

సుతీక్ష్ణమహర్షి రామున కగస్త్యాశ్రమమునకు దారిఁ దెల్పుట

సీ. మునినాథ యీకాననంబున భగవంతుండు కనకగర్భాభుం డగస్త్యమౌని
యున్నవాఁ డని వింటి మున్నె మునిశ్రేష్ఠుఁ డెచ్చట నున్నవాఁ డెఱుఁగఁ జెప్పు
మమ్మహాత్మునిప్రసాదమ్ముఁ గైకొనుపట్టితలఁపు జనించెఁ దత్పాదములకు
నెప్పుడు మ్రొక్కుదు నెపుడు భావింపుదునో యని తమిఁ బూనియున్నవాఁడ

తే. ననిన నమ్మౌనినాయకుఁ డనఘ యేను, గఱపఁ బూనినదాని నాకంటె మున్న
నీవె నొడివితి వామునినెలవు తెఱఁగుఁ, దెలియఁ జెప్పెద వినుము సందేహ ముడిగి.

వ. మహాత్మా యిచ్చటికి యోజనచతుష్టయమాత్రదూరంబున నగస్త్యభ్రాతయగు
సుదర్శనముని తపోవనంబు గల దయ్యాశ్రమంబు పిప్పలీవనశోభితంబును
బహుపుష్పఫలోపేతంబును రమ్యంబును నానాశకునినాదితంబును స్థలప్రాయం
బును హంసకారండవచక్రవాకోపశోభితప్రసన్న సలిలభాసుర సరోవరతీరవిక
సత్పద్మకైరవకుముదషండమండలాంతర్గతమకరందపానమత్తమధుకరఝంకార
సంకులంబు నై యొప్పుచుండు దక్షిణాపథంబున నయ్యాశ్రమంబునకుం జని
యందు నారేయిగడపి మఱునాఁ డరుణోదయంబునఁ గదలి దక్షిణదిశాభి
ముఖుండ వై యొక్కయోజనం బరిగిన నచ్చటఁ గుంభసంభవాశ్రమంబు
బహుపాదపసంవృతం బై రమణీయం బై యుండు నందు వైదేహీ హృద్యం
బగునట్లుగా భవత్సహిత వై విహరించు నట్లు గావున. 152

క. ఇనవంశశేఖర యగస్త్యునిఁ జూడఁ దలంచితేని సుముహూర్తమునం
జను మిప్పు డనుచుఁ బలికిన, విని రాముఁడు మ్రొక్కి యతనివీడ్కొని పెలుచన్.

వ. సీతాలక్ష్మణసహితంబుగా నచ్చోటు గదలి రమ్యంబు లగువనంబులును మేఘ
సంకాశంబు లగుపర్వతంబులును నిమ్నంబు లగుసరోవరంబులును దీర్ఘప్రవా
హంబు లగునదీనదంబులు నెడనెడ నవలోకించుచు సుతీక్ష్ణోపదిష్టమార్గంబున
దూరంబు చని సంహృష్టహృదయుం డై లక్ష్మణున కిట్లనియె. 154

రాముఁ డగస్త్యుతమ్ముఁ డగుసుదర్శనునాశ్రమముఁ జేర నరుగుట.

ఉ. తమ్ముఁడ కుంభసంభవునితమ్మునియాశ్రమభూమి కంటె యం
ద మ్మగుచున్న దెంతయు నుదగ్రఫలప్రసవప్రకాండభా
రమ్మున సన్నతంబు లగుమ్రాఁకులు వ్యోమము నంటి చాల మా
ర్గమ్మున నెల్లెడ న్దఱచుగా బహుభంగుల నిండి యుండఁగన్. 155

చ. విరిసినపిప్పలీఫలనివిష్టమనోహరభూరిసౌరభం

బురుగతి గాడ్పు రేపఁ గటుకోదయ మై వనభూమి నిండ బ
ల్లిరముగ నెల్లెడం బరిమళించుచు నున్నది కంటె యమ్మునీ
శ్వరుగుణసౌరభోత్కరము చారుతరంబుగ వీచెనో యనన్. 156

తే. నరవరాత్మజ కంటె లూనంబులైన, లలితవైడూర్యవర్ణ దర్భలు నవాంబు
జములు సంక్షిప్తకాష్ఠసంచయములంత, నంతఁజూపట్టుచున్నవి యాశ్రమమున.

క. శ్యామాభ్రశిఖరనిభమై, ధూమాగ్రం బివ్వనమునఁ దోఁచెడిఁ గంటే
యీమునితపోగ్నిసంభవ, ధూమం బీపగిది నున్నదో యన దళమై 158

క. రమణీయము లగుఘనతీ, ర్థములఁ గృతస్నాను లగుచు ధరణీదివిజో
త్తములు సమార్జితసుమముల, సుమోపహారం బొనర్పఁ జొచ్చిరి కంటే. 159

తే. నిత్యతపమున మిత్తిని నిగ్రహించి, భువనహితకాంక్ష నేమహాపుణ్యుభ్రాత
చేత నీదిక్కు లోకప్రసిద్ధికెక్కె, నట్టి మునియాశ్రమం బిది యనఘచరిత. 160

రాముఁడు లక్ష్మణున కగస్త్యకృతవాతాపీల్వలసంహారప్రకారంబుఁ జెల్పుట.

క. అనఘా మున్నీవనమున, ననిశము వసియించి యుండు రతిపాపమతుల్
దనుజులు వాతాపీల్వలు, లను వారలు దేవభూసురాంతకు లగుచున్. 161

తే. వారిలో నిల్వలుం డనువాఁడు మిగులఁ, గృత్రిమమహీసురత్వ మంగీకరించి
వేదభాష భాషించుచు సాదరముగఁ, దాపసులఁశ్రాద్ధమని నిమంత్రణము చేసి.

ఆ. పూని మేషరూపుఁ డైనవాతాపిని, నడిచిచంపి వండి కుడువఁబెట్టి
వారు దిన్నపిదప వాతాపి రమ్మని, ప్రీతి నిల్వలుండు పిలుచు నంత. 163

క. భీషణరవమున బెట్టుగ, ఘోషించుచుఁ గడుపు సించికొని శీఘ్రమునన్
మేషాకృతితో నప్పుడు, దోషాటుఁడు వెడలి వచ్చుఁ దోరపుబలిమిన్. 164

క. అంత మృతు లైనవిప్రుల, నెంతయు గృధ్రములపగిది నిద్దఱు దనుజుల్
వంతుల బడి భక్షించుచు, సంతోషింపుదురు దుర్విచారస్ఫూర్తిన్. 165

ఉ. ఇంపుగఁ దారకానికర మెన్నఁగ వచ్చు మహీరజంబు లె
క్కింపఁగ వచ్చు నీరనిధికిం గలయూర్ముల నెంచ వచ్చు నా
కంపము లేక నిల్వలుఁడు గాఱియపెట్టి నికృష్టవృత్తిచేఁ
జంపిన తాపసోత్తములసంఖ్య యొనర్పఁగ రాదు యేరికిన్. 166

రాముఁడు సుదర్శనమహర్షిని సందర్శించుట.

వ. ఇట్లు దుర్వారగర్వాతిరేకంబున నప్పూర్వగీర్వాణులు ధరణీసురవర్గంబులవధించు
చుండు నంతఁ గొంతకాలంబునకు దేవమునిప్రార్థితుం డై యగస్త్యమునీం
ద్రుం డిచ్చోటికిం జనుదెంచుటయు నెప్పటియట్ల నయ్యిల్వలుం డమ్మహాత్ముని
బ్రాహ్మణార్థంబు నియమించి మేషరూపుం డై నవాతాపిం జంపి తన్మాంసంబుఁ
బక్వంబుఁ జేసి పెట్టి యతండు గుడుచు నంతఁ దొల్లింటిచందంబున వాతాపిం
జీరిన నమ్మునీంద్రుండు ప్రహసించుచు నిల్వలుంజూచి యెక్కడ వాతాపి మదీయ

జాతరానిలశిఖాపరంపరల భస్మీభూతుం డై బహుకాలసంచితదురితవిశేషం
బున యమక్షయంబునకుం జనియెనని పలికిన నన్నిశాచరుండు క్రుద్ధుండై యగ
స్త్యునిం బ్రధర్షించిన నమ్మహానుభావుండు రూక్షప్రేక్షణంబుల నిరీక్షించుటయుఁ
దక్షిణం బారాక్షసుండు శుష్కతృణంబుపగిది దందహ్యమాన దేహుండై
నిధనంబునొందె నివ్విధంబున లోకహితార్థంబు దుష్కరం బైనకర్మంబుఁ జేసి
నట్టిమహానుభావుం డగస్త్యుం డమ్మహామునిభ్రాతపుణ్యాశ్రమం బిది యని
పెక్కువిధంబుల నమ్మహర్షి ప్రభావంబు వక్కాణించుచు సూర్యుండు గ్రుంకిన
పశ్చిమసంధ్య నుపాసించి సీతాలక్ష్మణసహితుండై రాముండు రమ్యం
బగుతదీయాశ్రమంబుఁ బ్రవేశించి సముచితంబుగా నమ్మహర్షి సందర్శించి
తచ్చరణంబులకు నమస్కరించి యతనిచేతం బ్రతిపూజితుం డై ఫలమూ
లంబు లుపయోగించి యారాత్రి యచ్చట వసియించి మఱునాఁడు సూ
ర్యోదయసమయంబునఁ గాల్యకరణీయంబులు దీర్చి తగినతెఱంగున నమ్మునీం
ద్రునిచేత నామంత్రణంబు వడసి సుతీక్ష్ణోపదిష్టమార్గంబుఁ బట్టి జానకీలక్ష్మణో
పేతంబుగాఁ బరమానందంబునం జని చని. 167

రాముం డగస్త్యాశ్రమముఁ జేరుట.

చ. ఇనకిరణాలికిం జొరవ యీని మహాగహనంబున న్రయం
బునఁ జనుచు న్రఘూత్తముఁడు పొల్పుగఁ గాంచె మదద్విపేంద్రహ
స్తనిహతసాలసంగతపతంగవిరావవిరాజితంబుఁ బా
వనకపిశోభితంబు ఫలవంతము నైన తరుప్రతానమున్. 168

వ. అప్పుడు. 169

చ. మిహిరసమానతేజుఁడు సమీపగతుండును బూజనీయుఁ డౌ
మిహిరకులావతంసుపయి మేడలనుండి పురాంగన ల్ప్రహృ
ష్టహృదయ లై ప్రసూనములఁ జల్లినభంగి మరుత్ప్రయుక్తభూ
రుహాగతనూత్నవల్లికలు రూఢిని జల్లె లసత్సుమంబులన్. 170

చ. అనుపమదీర్ఘచాపధరుఁ డై సను దత్కరుణార్ద్రభావసూ
చనమగు స్నిగ్ధగాత్రము నశంక మనంబునఁ జూచుచు న్మదం
బనుపమరాగముం జెలఁగ నవ్వలఁ బోవక నిల్చి శంబరాం
గనలు విశాలనేత్రములు గల్గుటకు న్ఫల మొందె నెంతయున్. 171

క. ఈవిధమున రఘుపుంగవుఁ, డావనసౌభాగ్యగరిమ లటుబహుగతుల
న్భావమునకు నమ్మోదముఁ, గావింప సుమిత్రపట్టిఁ గని యిట్లనియెన్. 172

రాముఁడు లక్ష్మణున కగస్త్యాశ్రమవిశేషముల వభివర్ణించి చెప్పుట.

క. కనుఁగొంటె కుంభభవహా, వనపుణ్యాశ్రమముఁ జేర వచ్చితి మిచట
న్ఘనమృగఖగములు దిరిగెడి, వనవీథుల విగతజాతివైరము లగుచున్. 173

క. తరుణులతోడఁ బెనంగెడు, పురుషులచందాన నిచట భూరుహచయము
ల్తరుణలతలతోఁ బెనఁగొని, కర మొప్పుచు నున్న వీవు కంటె కుమారా. 174

తే. చారుపత్త్రంబు లైనవృక్షములు శాంత, ఖగమృగంబులు గలిగి శృంగారఫణితిఁ
దనరుచున్నవి గాన నివ్వన మగస్త్య,మునివరాశ్రమ మగు నిక్క మనఘచరిత

తే. అనఘ యెవ్వాఁడు లోకంబులందు నైజ, కర్మమునఖ్యాతివడసె నగస్త్యుఁ డనఁగ
నట్టిపుణ్యులయాశ్రమ మదిగోఁ గంటె,కన్నులకు విందుసేయుచు నున్నదిపుడు.

చ. కమలభవప్రభుం డగు నగస్త్యమహామునినాథుపావనా
శ్రమ మిదె రమ్మటంచు విలసత్కిసలాంగులిసాలహస్తముల్
క్రమమున నెత్తి యున్నదఖగధ్వనుల న్ననుఁ బిల్చుచున్న చం
దమునఁ జెలంగుచున్నయవి తమ్ముఁడ కంటివె యివ్వనావళుల్. 177

వ. మఱియు నిమ్మహనీయాశ్రమంబు ప్రాజ్యధూమాకులవనంబును జీరమాలాపరిష్కృతంబును బ్రశాంతమృగయూథంబును నానాశకునినాదితంబు నై యొప్పుచున్నది విలోకింపుము. 178

తే. నిత్యతపమున మిత్తిని నిగ్రహించి, యఖిలహితకాంక్ష నెవ్వఁడీ యామ్యదేశ
మనుదినంబును మునిశరణ్యముగఁ జేసె, నయ్యగస్త్యునియాశ్రమ మదిగోఁ గంటె.

క. మేరుముఖభూమిధరభూ, దారకమత శేషదిగిభతతులకు నెనయై
యీరమ్యాశ్రమ మతితే, జోరాజిత మగుచుఁ బొల్చుఁ జూచితె యనఘా. 180

తే. అనఘ యిమ్మౌనివర్యుఁ డీయామ్యదిక్కు, నాటపట్టుగఁ గైకొన్న నాఁటనుండి
యిచట దనుజులు వర్తింతు రెల్లప్రొద్దు, వరమునీంద్రులభంగి నిర్వైరు లగుచు.

సీ. స్వారాజ్యగర్వధూర్వహనహుషైశ్వర్యశోషణం బెవ్వానిభాషణంబు
భృతమహోర్మివ్యాప్తవితతపాథోరాశివరజలం బెవ్వానికరతలంబు
చటులమేషాకారకుటిలవాతాపిభక్షణశాలి యెవ్వానిజఠరకీలి
భూరివింధ్యాద్రిదుర్వారమహోత్సేధనాశనం బెవ్వానిశాసనంబు

తే. అట్టిపరమేష్ఠిసన్నిభుఁ డైనకుంభ, సంభవునియాశ్రమం బిదె స్వర్గతుల్య
మగుచు రాజిల్లుచున్నది విగతజాతి, వైరమృగపక్షిరాక్షసోదార మగుచు.

వ. మఱియు భగవంతుం డైనయగస్త్యమహామునినామగ్రహణంబున నీదక్షిణదిశ క్రూరకర్ము లగురాక్షసులచేత ధర్షించుట కశక్యం బనియు సజ్జనాభిగమ్యం బనియు ముల్లోకంబులం బ్రసిద్ధి వహించెఁ జిరజీవి యైనయీయగస్త్యునియాశ్రమంబు శ్రీమంతం బై వినీతజనసేవితం బై యొప్పు నీలోపాముద్రాకాంతుండు విశ్రుతకర్ముండును లోకార్చితుండును సాధుజనహితరతుండును గావున సమాగతుల మైనమనకు శ్రేయం బొసంగు నట్లగుటం జేసి. 183

ఉ. ఇల్వలభంజనుం డయిన యీమునియంఘ్రుల కుత్సుకాత్ము లై
చెల్వఁగ నిత్య మర్చనము సేయుచుఁ బుణ్యకథేతిహాసము

ల్బలిమిడిఁ బ్రీతితో వినుచుఁ బాయక తత్కృప నొంది యిందు ని
చ్చ ల్వనవాసశేషదివసంబులు వుచ్చఁగ రాదె లక్ష్మణా 184

ఉ. నిచ్చలు దేవదానవమునిప్రభుచారణసాధ్యు లాది గా
నిచ్చట నెవ్వనిం గుతుక మేర్పడ వేడ్క భజించు చుందు రా
సచ్చరితు న్సమస్తమునిసత్తమునిన్ సుగుణాలవాలుని
న్మచ్చట దీరఁగా మనము మోదమునం గొనియాడు టొప్పదే. 185

చ. నరమరయక్షకింపురుషనాగనభశ్చరసిద్ధసాధ్యకి
న్నరగరుడాదు లెంతయు ననారత మిమ్మునినాథుఁ గొల్చుచుం
బరమమునీంద్రుల న్వరవిమానరథస్థులఁ జేసి సమ్ముదో
త్కరమున వెంటఁ దోడుకొని గ్రక్కునఁ బోదురు శక్రువీటికిన్. 186

తే. కామవృత్తుండు క్రూరుండు ఘాతుకుండు
పండితుఁడు గానివాఁడు శఠుండు ఖలుఁడు
గూఢవిప్రియకారియు క్షుద్రుఁ డిచట
నిలిచి జీవింపఁగాఁ జాలఁ డలఘుచరిత. 187

తే. మును లనేకు లివ్వనమున ఘనతపోవి, శేషనిష్ఠలు సల్పి సంసిద్ధు లగుచు
దివ్యదేహులై రవినిభదేవయాన, మెక్కి చనుదురు హరిపురి కక్కజముగ. 188

తే. దశరథాత్మజ యిచట భూతముల చేత, సురలు ప్రార్థితు లయి మెచ్చి పరమకరుణ
వెలయ యక్షత్వమమరత్వమలఘురాజ్య, మిత్తురీయాశ్రమమహత్త్వమిట్టిదరయ.

-ఇ- లక్ష్మణుఁ డగస్త్యమహర్షికి రామునిరాక యెఱింగించుట. -ఇ-

తే. అనఘ లక్ష్మణ నీవు మున్నరిగి నాదు, రాక యెఱిఁగించి పుచ్చుము రవిసమాన
తేజుఁ డగుకుంభసంభవదివ్యమౌని, కనవుడు నతండు తత్తపోవనముఁ జేరి.

క. అచ్చట నొకమునిశిష్యుని, నచ్చుపడం జూచి దశరథాగ్రతనయుఁడుఁ
సచ్చరితుం డగురాముఁడు, వచ్చినవాఁ డిత్తపస్వివర్యునిఁ జూడన్. 191

వ. ఏ నమ్మహాత్ముని యనుజన్ముండ లక్ష్మణుం డనువాఁడ నిత్యంబును భృత్యమాత్రుం
డ నై పరిచర్యాభక్తియోగంబులం గొల్చి యుండుదు నట్టియేనును సీతయుఁ
దనపిఱుందం జనుదేరఁ బితృశాసనంబున దండకారణ్యంబునం జరియింపఁ జను
దెంచినవాఁ డనవుడు నమ్మునిశిష్యుండు శీఘ్రంబున నగ్నిశాలకుం జని య
గస్త్యుని సందర్శించి కృతాంజలి యై దేవా దశరథనందనుం డగురాముండు
సీతాలక్ష్మణసహితుం డై మిమ్ము సందర్శించి మీకు శుశ్రూషఁ గావింపం
జనుదెంచి యున్నవాఁ డని విన్నవించిన నమ్మహర్షిశ్రేష్ఠుం డస్మత్కులదైవతం
బైన శ్రీరాముండు సీతాలక్ష్మణోపేతుం డై వచ్చి యున్నవాఁ డని శిష్యుని
వలన విని శ్రవణానందం బనుభవించి శిష్యు నవలోకించి మద్భాగ్యవశంబున

రాముండు చిరకాలంబున కిప్పుడు నన్ను విలోకించుటకుం జనుదెంచె నమ్మహా
త్మునిసమాగమంబు నాచేతఁ బెద్దకాలంబున నుండి కాంక్షితం బైనయదియె
కదా కల్యాణగుణసాంద్రుఁ డైనయారామచంద్రునిం గన్నులారం గనుంగొని
యమ్మహానుభావున కతిథిసత్కారంబుఁ గావించి కృతార్థుండ నయ్యెద సీతా
లక్ష్మణసహితంబుగాఁ దోడ్కొని వచ్చినను నతండు రయంబునం జనుదెంచి
లక్ష్మణుం గాంచి రాముం డెచ్చట నున్నవాఁడు మునీంద్రునిం జూడ నవశ్యంబు
చనుదెంచుంగాక యని పలికిన నాలక్ష్మణుం డమ్మునిశిష్యునిం దోడ్కొని చని
సీతారాములం జూపిన నతండు మునివచనం బారామునకుం జెప్పి వారలం
దోడ్కొని యాశ్రమంబుఁ బ్రవేశించె నట్లు రఘువల్లభుండు సీతాలక్ష్మణ
సమేతంబుగాఁ బ్రశాంతహరిణాకీర్ణం బైనతపోవనంబుఁ బ్రవేశించి యందు
బ్రహ్మస్థానంబును వహ్నిస్థానంబును విష్ణుస్థానంబును మహేంద్రస్థానంబును
సూర్యస్థానంబును సోమస్థానంబును భగస్థానంబును గుబేరస్థానంబును ధాతృ
విధాతృస్థానంబులును వాయుస్థానంబును శేషస్థానంబును గాయత్రీస్థానం
బును వసుస్థానంబును వరుణస్థానంబును గార్తికేయస్థానంబును ధర్మస్థానంబును
మొదలుగాఁ గలదేవస్థానంబు లన్నియు విలోకించుచుఁ బరమాద్భుతంబు
నొందుచుం జని చని యొక్కచోట శిష్యగణపరివృతుం డై దీప్తతేజుం డైన
మహర్షులనడుమ శాశ్వతుం డైనపరమేష్ఠిచందంబున సుఖాసీనుం డై తేజ
రిల్లుచున్న యక్కుంభసంభవమహర్షిశ్రేష్ఠుని నవ్వీరులం జూచి వినయవినమిత
గాత్రుం డై యరుగుచుండె నమ్మహర్షిముఖ్యుండును సీతాలక్ష్మణసహితుం డై
వచ్చుచున్న రామచంద్రు నల్లంతనె విలోకించి దిగ్గునఁ బరమాసనంబు డిగ్గి
రయంబున నెదురుగాఁ జనుదెంచుచుండె నప్పుడు రఘువల్లభుండు లక్ష్మణున
కిట్లనియె. 192

క. ఇమ్ముని యదె యెదురుగ నేఁ, బ్రేమ్మునఁ జనుదెంచెడు న్తపమ్ములకు నిధా
న మ్మగునీయన నౌదా,ర్యమ్మునఁ గుంభజుఁ డటంచు నాత్మ నెఱిఁగితిన్. 193

—రాముఁ డగస్త్యమహర్షిని సందర్శించుట—

క. అని లక్ష్మణుతో నాడుచు, జననాయకుఁ డతఁడు తాను సంభ్రమమున భూ
తనయాయుతముగఁ జని య,మ్మునిపదపద్మముల కెఱఁగె మోదం బెసఁగన్.

క. పదపడి లక్ష్మణుఁ డమ్ముని, పదములకుం బ్రణతిఁ జేసె భక్తియుతుం డై
సుదతీరత్నము జానకి, ముద మలరఁగ మ్రొక్కెఁ బిదప మునిపదములకున్.

తే. అంత నమ్మునిశేఖరుం డమ్మహాను, భావు నాలింగనముఁ జేసి బహువిధములఁ
బ్రేమ నభినుతిఁ గావించి సేమ మరసి, హర్ష మిగురొత్త గూర్చుండు మనుచుఁ బలికె.

వ. శీఘ్రంబున వైశ్వదేవంబుఁ గావించి మొదల బ్రాహ్మణాతిథుల సర్వదానం
బున నర్చించి వానప్రస్థధర్మంబున వారికి భోజనం బొసంగి తానును సుఖా

సీనుండై తన కభిముఖంబుగా రాముని సుఖాసీనుం గావించి రఘువరా తపస్వి యగువాఁడు పూజ్యపూజాతిక్రమణంబుఁ గావించె నేనికూటసాక్షియుంబోలెఁ బరలోకంబునందు స్వమాంసభక్షకుం డగుఁ గావునఁ బ్రత్యవాయపరిహారార్థంబు నిన్నుం బూజించెద నని పలికి వెండియు నిట్లనియె. 197

సీ. కనకాసనాగ్రభాగమున నుండెడునీకు నీకుశవిష్టర మిచ్చు టెంత
రమణీయదానధారా శాలి వగునీకు నాయిచ్చు విమలార్ఘ్యతోయ మెంత
యనుదినశాల్యోదనాహారునకునీకు నీమూలఫలము లే నిచ్చు టెంత
నిరుపమకాంచనాంబరధారి వగునీకు నీవల్కలాజిన మిచ్చు టెంత
తే. భక్తి నేనిచ్చుపుష్కరపత్త్రపుష్ప, మాత్రమును గైకొనుట కాక మనుజవర్య
తరమెతెఁగినిన్నుఁ బూజింపఁదరమె నాకు, మిమ్ముఁగనుఁగొనుటంతియె మేలుగాక.

వ. మహాత్మా నీవు సర్వలోకాధిపుండవు ధర్మచారివి మాన్యుండవు పూజనీయుం డవు ప్రియాతిథి వై చనుదెంచుటవలనఁ గృతకృత్యుండ నైతి నని పలికి ఫల మూలపుష్పంబుల యథేష్టంబుగాఁ బూజించి క్రమ్మఱ నిట్లనియె. 199

—అగస్త్యమహర్షి రామునకు దివ్యంబులగు ఖడ్గబాణతూణీరకోదండంబు లొసంగుట—

సీ. తతహేమకనకభూషితవిశ్వకర్మనిర్మితదివ్యవైష్ణవపితతధనువు
పద్మసంభవదత్తపరమభాస్కరకిరణోపమామోఘశరోత్తమంబు
శక్రవిశ్రాణితాక్షయసాయకాంబకసంపూర్ణదీర్ఘనిషంగములును
రమణీయతరమహారజతకోశప్రశస్తసువర్ణభూషితశాతఖడ్గ
తే. మర్థి నొసఁగెద విజయార్థ మమరవిభుఁడు
కులిశమును బోలెఁ గైకొను మలరథాంగ
పాణి యీసాధనంబుచేఁ బగఱ గెలిచి
శతమఖునకుఁ దైత్యలోకరాజ్యం బొసంగె. 200

క. అని పలికి మహాతేజుఁడు, మునిపతి సత్కరుణ మీఱ మోదం బలరన్
ధనురాదిసాధనంబులు, ఘనమతి రాఘవున కొసఁగి క్రమ్మఱఁ బలికెన్. 201

క. నరనాథ నీకు శుభ మగు, ధరణిసుతాలక్ష్మణాన్వితంబుగ నన్నుం
బరికింప వచ్చినందునఁ, జరితార్థుండ నైతిఁ దపము ఫలియించె రహిన్. 202

ఉ. చిన్నటనాఁటయుండియును జెక్కసుఖంబుల వర్తమాన యై
వన్నియఁ గన్న దాట నిటువంటియవస్థల కోర్వ లేక యా
పన్నత నొంది యున్నది నృపాలక జానకి కంటె భక్తిసం
పన్నతయు న్సుచిత్వ మసమానసతీత్వము మాకుఁ దెల్పుచున్. 203

చ. పరవర సద్మసౌఖ్యము మనంబున నెంచక యీవధూటి దు
ర్భరవనవాససంజనితబాధఁ దలంపక భర్తృభక్తిచే
వసన నరణ్యసీమ కిటు వచ్చుటఁ జేసి యపాంసులాశిరో

వరమణి యయ్యెఁ గాదె తనవారికి నిత్యయశంబు గల్గఁగన్. 204

క. వైదేహపుత్త్రి బాల్యం, బాదిగ సుఖశీలఁ బెరిఁగె నటు గాన సునః
ఖేదంబు గలుగ కుండఁగ, నాదరమున నరసి ప్రోవు మనఘవిచారా. 205

క. ఈలోకంబునఁ బ్రకృతిన్, స్త్రీలు పతి నసుస్థుఁ డైన సేవింతు రతం
డోలి విషమస్థుఁ డగునపు, డాలస్యముఁ జేసి విడుతు రవహితబుద్ధిన్ 206

క. విద్యుచ్చపలత్వము శస్త్రోద్యత్తీక్ష్ణతయు మారుతోరగరిపువే
గోద్యోగతయుం గైకొని, విద్యుద్గాత్రలు యథేచ్ఛ విహరింతు రిలన్. 207

క. ఏతాదృశదుర్దోష, వ్రాతపరిత్యక్త యైన వసుధాసుత వి
ఖ్యాతిఁ బొలు పొందు ననసూ, యాతరుణీపార్వతీరమాదుల కెన యై. 208

క. జనవర యెచ్చట లక్ష్మణ, జనకసుతలు గొలువ నీవు చరియించితి వా
ఘనదేశ మలంకృత మై, యనవరతం బతిపవిత్ర మై యొప్పుఁ గదా. 209

వ. మహాత్మా సూర్యుం డస్తమించుచున్నవాఁ డీరాత్రి యిచ్చట సుఖంబుండుమని పలికిన నారఘూత్తముండు మునివచనప్రకారంబునఁ బశ్చిమసంధ్య నుపాసించి యమ్మునిగ్రామణిచేతఁ బూజితుం డై పుణ్యకథేతిహాసంబు లాకర్ణించుచు సీతాలక్ష్మణసహితంబుగా నచ్చోట వసియించి మఱునాఁడు సూర్యోదయంబున సానుజుం డై కాలోచితకృత్యంబులు నిర్వర్తించి సముచితంబుగా నమ్మునివల్లభు సందర్శించి నమస్కరించి యతనిచేతం బ్రతిపూజితుం డై యంజలిఁ గీలించి యిట్లనియె. 210

చ. అనఘ భవత్తపోవనమునందు సుఖించితి నేఁటిరాత్రి భూ
తనయయుఁ దమ్ముఁడుం గొలువఁ దద్దయుఁ బుణ్యఘనుండ వైన నిన్
గనుఁగొని ప్రీతిఁ బూజనముఁ గైకొనిసందున రాజకోటిలో
వినుతికి నెక్కితిన్ భువనవిశ్రుతభూరియశంబుఁ గాంచితిన్. 211

—అగస్త్యుని శ్రీరాముఁడు తాము వసియింపఁ దగినప్రదేశంబు దెలియఁజెప్పఁగోరుట.—

వ. మునీంద్రా సీతాలక్ష్మణసహితంబుగా నాకు వసియింపం దగినరమ్యప్రదేశం బొక్కటి యానతిమ్ము నీవు త్రైకాలికసకలజగద్వృత్తాంతాభిజ్ఞుండవు నీకు గోచరింపనియర్థంబు లేదని పలికిన నమ్మునిశ్రేష్ఠుం డొక్కముహూర్తంబు చింతించి విజ్ఞానవిలోచనంబున భావికాలవృత్తాంతం బెఱింగి ధీరుం డై రాజేంద్రా యిచ్చటికి యోజనద్వయమాత్రంబుదవ్వుల గోదావరీతీరంబున బహుమూలఫలోదకం బైనపంచవటియనం బరఁగునొక్కపుణ్యదేశంబు గలదచ్చోట రమ్యంబుగా నాశ్రమంబు నిర్మించుకొని యందు సీతాలక్ష్మణసహితుండ వై విహరించుచు వనవాసశేషదివసంబులు పుచ్చుము తండ్రిచేత దత్తం బైనసమయకాలంబు డగ్గఱియెఁ గావున దీర్ణప్రతిజ్ఞుండ వై సుఖంబుగా రాజ్యంబు నధిగమించెద వెవ్వండు జ్యేష్ఠపుత్త్రుండ వైన నీచేత యయాతియుం బోలెఁ దారితుం

డయ్యె నట్టిదశరథుండు ధన్యుం డయ్యె నేను గైకేయి దుర్మంత్రంబును దశరథునిప్రలాపంబును భవదాగమనంబును భావికాలవృత్తాంతంబును సర్వంబును దపఃప్రభావవిశేషంబున నెఱింగి యున్నవాఁడఁ గావున మత్సమేతంబుగా నుదీయాశ్రమనివాసంబునం దభీష్టంబు గలవాఁడ వయ్యును బంచవటికిం జొమ్మని దీనితరంబుగాఁ బలికితి నప్పంచవటీదేశంబు ప్రాజ్యమూలఫలంబై నానాద్విజగణయుతం బై వివిక్తం బై పుణ్యంబై రమ్యంబై శ్లాఘ్యం బై యుండు నచ్చట నై దేహి మనోహరంబుగా విహరింపం గలదు నీ వచ్చట యథాసుఖంబుగా వసియించి తాపసుల రక్షించుచుండు మట్లైన నీకుఁ గార్యసిద్ధి యగు నని పలికి వెండియు నిట్లనియె. 212

అగస్త్యమహాముని రామునికిఁ బంచవటి వాసయోగ్య మని యానతిచ్చుట

సీ. జననాథ యిచ్చటి కనతిదూరంబునఁ గలదు సాంద్రమధూకకాననంబు
పరఁగ నవ్వనికి నుత్తరభాగమున నేగఁ గనుపట్టు నొకవటక్ష్మారుహంబు
దాని కవ్వల నొక్క ధరణీధరం బొప్పుఁ దత్సమీపంబునఁ దనరు నొక్క
సమతలం బైన దేశం బదె యలపంచవటి యనువిఖ్యాతి వఱలు దేశ
తే. మనవరతపుష్పితద్రుమమై చెలంగు, నచటి కేగు మటన్న నయ్యర్కకులుఁడు
మౌనిపతి సత్కరించి నమస్కరించి, నమ్రుఁ డై ప్రీతి నామంత్రణంబు వడసి.
ఉ. తానును లక్ష్మణుండు వితతస్ఫుటచాపశరాసితూణముల్
మానుగఁ దాల్చి మిక్కిలి సమాహితు లై రణరంగధీరు లై
మానుగ సీతఁ దోడ్కొని సముంచితతేజము పిక్కటిల్ల న
మ్మౌనివరోపదిష్ట మగుమార్గమునం జని రవ్వనంబునన్. 214

రామలక్ష్మణులు జటాయువుం గాంచుట.

క. ఇత్తెఱఁగున నేగుచు రఘు,సత్తము లొకచోటఁ గనిరి శైలనిభున్ గృ
ధ్రోత్తముని భీమకాయు ను,దాత్తబలు వటస్థుఁ బుణ్యతము నతివృద్ధున్. 215
తే. గాంచి వాని నిశాటునిఁ గాఁ దలంచి, ధీరు లై యెవ్వఁడవు నీవు దెల్పు మనిన
నావిహంగమనాథుఁ డత్యాదరమున, నినకులులఁ జూచి మధురోక్తి నిట్టులనియె.
క. అనఘాత్ములార నను మీ, జనకుం డగుదశరథునకు సచివునిఁగ మనం
బున నెఱుఁగుఁ డనినఁ బితృసఖుఁ, డని యతనికిఁ బూజ చేసి రధికప్రీతిన్.
క. వానికులం బాతనియభి,ధానముఁ దెలియంగ నడుగఁ దడయక యతఁడున్
మానుగఁ దనవృత్తాంతము, ధీనిధి రాఘవునితోడఁ దెలియఁగ ననియెన్. 218

జటాయువు తనవృత్తాంతంబు శ్రీరామున కెఱింగించుట

వ. మహాత్మా తొల్లి విరించికిఁ బుత్రు లై కర్దముండును విక్రీతుండును శేషుండును సంశ్రయుండును స్థాణుండును మరీచియు నత్రియుఁ గ్రతుండును బులస్త్యుండును నంగిరసుండును బ్రచేతసుండును బులహుండు నను వారలు సృష్టికారణులై

జన్మించి రందు మరీచికిఁ గశ్యపాహ్వయుండు పుట్టె మఱియు బ్రహ్మదక్షిణాంగుష్ఠసంభవుం డైన దక్షునకు నఱువదిమందికూఁతులు జన్మించి రందు నదితియు దితియు దనువుఁ గాళికయుఁ దామ్రయుఁ గ్రోధవశయు మనువు ననలయు నను వారి నెనమండ్రఁ గన్యకలఁ గశ్యపుండు వివాహంబై మీరు ముల్లోకంబులం బాలింపం గలవారి మత్సమానులఁ బుత్త్రులఁ బడయుం డనిన నం దదితియు దితియుఁ గాళియు నీమువ్వురు పతివాక్యంబున కియకొనిరి తక్కినభార్యలు పతివాక్యం బంగీకరింప కుండి రామువ్వురిలోనఁ బతివిశ్వాసతారతమ్యంబువలన నదితి త్రయస్త్రింశత్కోటిదేవతలను ద్వాదశాదిత్యులను వసువుల నేకాదశరుద్రుల నశ్వినీదేవతలం బడసె దితికి బలవంతు లైన రాక్షసులు పుట్టిరి తొల్లి యావసుంధర వారలయధీనం బని వినం బడు దను వను దానికి హయగ్రీవుం డను దానవుండు పుట్టెఁ గాళిక యనుదానికి నరకుండును గాళకుండు నను వారిద్దఱు గలిగిరి తామ్ర యనునది క్రౌంచియు భాసియు ధృతరాష్ట్రియు శుకియు నను నేవురఁ గూఁతులం గనియె నందుఁ గ్రౌంచి యనుదానికి నులూకంబులు పుట్టె భాసి యనుదానికి భాసంబులు పుట్టె శ్యేని యనుదానికి శ్యేనగృధ్రంబులు పుట్టె ధృతరాష్ట్రి యనుదానికి హంసకలహంసచక్రవాకంబులు పుట్టె మఱియును దానికి నత పుట్టె నతకు వినత జన్మించెఁ గ్రోధవశ యనుదానికి మృగియు మృగమందయు హరియు భద్రమదయు మాతంగియు శార్దూలియు శ్వేతయు సురభియు సర్వలక్షణసంపన్న యగుసురసయుఁ గద్రువు నను పదుగురుకూఁతు లుద్భవించి రందు మృగి యనుదానికి మృగంబులును మృగమంద యనుదానికి భల్లూకంబును నీలవాలంబు లైన సృమరంబులును శ్వేతవాలంబు లైనచమరంబులును హరి యనుదానికి సింహంబులును వానరంబులును బుట్టె భద్రమద యనుదాని కిరావతి యనుకూఁతురు గలిగె నయ్యిరావతి కైరావతం బనుమహాగజంబు పుట్టె మాతంగి యనుదానికి మాతంగంబులు పుట్టె శార్దూలి యనుదానికి వ్యాఘ్రంబులును గోలాంగూలంబులును బుట్టె శ్వేత యనుదానికి దిగ్గజంబులు పుట్టె సురభి యనుదానికి రోహిణియు గంధర్వియు ననుకూఁతు లిద్దఱు జన్మించి రందు రోహిణి యనుదానికి గోవులును గంధర్వి యనుదానికి హయంబులును గలిగెసురస యనుదానికి బహుఫణంబు లైనసర్పంబులు పుట్టెఁ గద్రువ యనుదానికి బన్నగంబులు పుట్టె మను వనుదానికి బ్రహ్మక్షత్త్రియవైశ్యశూద్రులు నై నమనుష్యులు జన్మించి రనల యనుదానికిఁ బిండఖర్జూరఫలంబు లైనవృక్షంబులు పుట్టె మఱియు సురసచెలియ లగుక్రోధవశ శేషవాసుకితక్షకాదు లైననాగసహస్రంబులు పుట్టె నందు సహస్రశిరుం డైనశేషుండు ధరణీధరుం డయ్యె శుకీపౌత్త్రి యైనవినత కరుణుండును గరుడుం డను నిద్దఱు కొడుకులు గలిగి రం దరుణునకు మాయన్న యగుసంపాతియు నేనును జన్మించి

తిమిమదుత్పత్తికథనార్థంబు సృష్టిక్రమం బంతయు నెఱింగించితి నరుణునిభార్య యేనాక్కశ్యేని యనియెఱుంగుము శ్యేనిపుత్త్రుండ నైన నన్ను జటాయువునుగా నెఱుంగు మేను మహాబలుండ దశరథునకు సచివుండ నీ విచ్చట వసించితి వేని భవత్కామితంబులు దీర్చుచు ఫలార్థులై యెందుచోటికిం బోయినప్పుడు జానకిం బరివేష్టించి రక్షించుచుండెద నిది దుర్గమం బగు కాంతారంబు మృగరాక్షససేవితం బై యుండు నిమ్మహాగహనంబున మదీయసాహాయ్యం బంగీకరించుట నీ కవశ్యకర్తవ్యం బని పలికిన నతనిపలుకుల కలరి రాముండు వానిం బితృసఖునింగా నెఱింగి పూజించి సంతోషించి యతనిం గౌంగిటం జేర్చి యతనితోడ సఖ్యంబుం జేసి సారెసారెకు నతనివలనం బితృసఖత్వవృత్తాంతంబు ముదంబున నాకర్ణించుచు నతనిం దోడ్కొని సీతాలక్ష్మణసహితుం డై యనలుండు శలభంబులం బోలె శాత్త్రవుల దహించుచుం గొంతదూరం బరిగి నానావ్యాళసమాకీర్ణం బైన పంచవటీదేశంబుం బ్రవేశించి దీప్తతేజుం డైన సౌమిత్త్రి నవలోకించి యిట్లనియె.

శ్రీరాముండు సీతాలక్ష్మణసహితుం డై పంచవటిం జేరుట

క. అగణితమహిమాస్పదుం డా, యగస్త్యముని చెప్పినట్టి యలపంచవటీ
సుగుణాఢ్య చేరితిమి గద, తగి యున్నది కంటె పుష్పితద్రుమ మగుచున్. 220

ఉ. ఈవనమధ్యదేశము సమృద్ధనవాంబుజలాశయాన్వితం
బై వివిధప్రసూనసముదంచితరమ్యవిశాలవృక్షమై
పావనసంయమీంద్రపరిపాల్యతపోవనరాజిరంజితం
బై విలసిల్లుచున్న దనఘా మన కిచ్చట నిల్వఁగాఁ దగున్. 221

క. పొందుగ నీకాననమునఁ, గందువ లరయంగ నీవు కడు నేర్పరి వీ
సందున వేడ్క మనకు ని, ల్వం దగుచో టెద్ది దానిఁ బరికింపు మిఁకన్. 222

ఉ. నాకును నీకు జానకికి నల్వగ నెద్ది మనోజ్ఞ మెద్ది ప
ద్మాకరయుక్త మెద్ది విమలాంబుసమిత్కుశమూల మెద్ది య
స్తోకఫలప్రసూన మయి సొంపుగ శోభిలు నట్టిచోటఁ బు
ణ్యాకర పర్ణశాల చెలువార రచింపుము నేర్పు పెంపునన్. 223

చ. అన విని లక్ష్మణుండు వినయంబున నంజలిఁ జేసి యిట్లనున్
మనుకులవర్య మీకు గరిమం దగ వర్షశతంబు ప్రీతి ని
న్వనిఁ బరపుందు నొండెఁ బరవంతుఁడ నై తిని మీరె చూచి తోఁ
చిన రుచిరస్థలంబున రచింపు మటంచు వచింపుఁ డెంతయున్. 224

తే. అవినఁ దమ్ముని మాటల కలరి రాజ
వర్యుఁ డచ్చట రుచిరనివాస మొకటి
గాంచి కరమున నాతనికరము పట్టి
యెలుఁగు మధుయుక్త మగుచుండ నిట్టు లనియె. 225

క. తమ్ముఁడ యీదేశము రమ్యమ్మై కుసుమితమహీరుహశ్రేణీయు
క్తమ్మై యున్నది యిట రుచి, రమ్ముగ నొకయాశ్రమంబు రచియింపు మిఁకన్.

క. ఘనసురభిగంధిరవినిభ, వనరుహమ్ములచేత మిగుల వ్యాప్తృత యై యీ
యనువున నెల్లెడ నొప్పెడిఁ, గనుఁగొంటివె పద్మినీనికాయం బనఘా. 227

చ. మునిపతి చెప్పినట్లు బహుపుష్పితభూమిరుహప్రకాండ యై
యనుపమచక్రవాకబకహంసమరాళవిరాజమాన యై
ప్రణుతనవాంబుసంభవతరంగకణద్రవగంధవాహ యై
గనఁ దగు చున్న దల్లదిగొ గౌతమి కంటివె యమ్మహానదిన్. 228

ఉ. ప్రాంశువినీలకందరవిభాసిత మై సితరక్తనీలపీ
తాంశుపరీతధాతునిచయావృత మై బహుగండశైల మై
కింశుకపాటలీవకుళకేతకసాలతమాలశింశుపా
వంశకరీరచిత్ర మయి వారక పర్వతసంఘ మొప్పెడున్. 229

సీ. సాలరసాలహింతాలతాలతమాలచందనస్పందనచంపకామ్ర
లుంగమాధవమాతులుంగనారంగలవంగపున్నాగనీవారలికుచ
ఖర్జూరపనసాశ్వకర్ణధవాంకోలతిలకకురంటకతినిశఖదిర
కింశుకశింశుపావంశపాటలనీపకేతకీబిల్వభల్లాతకాది

తే. వివిధతరువల్లికాగుల్మపిహిత మగుచు, నీవనం బొప్పు చున్నది యిచట నిలిచి
యీఖగేంద్రునితోఁ గూడి యెలమి సమయ, వాసరంబులు గడపంగ వలయు మనకు.

క. అని రాముఁ డిభుఁడు పలికిన, విని ముదమున లక్ష్మణుండు విశ్రుతభంగిం
దనరారునట్లు గ్రక్కున, ఘనముగ నొకపర్ణశాలఁ గావించె రహిన్. 231

—శ్రీరాముని యనుజ్ఞ వడసి లక్ష్మణుండు పర్ణశాల నిర్మించుట.—

వ. అది మఱియు రమ్యయు విపులయు భిత్త్యాకారకృతమృత్తికయు శమీశాఖాసమాస్తీర్ణయు సుస్తంభయు సుశోభనయు దీర్ఘవంశకృతగృహోర్ధ్వకాష్ఠయు దృఢపాశావపాశితయుఁ గుశకాశశరపర్ణపరిచ్ఛాదితయు సమీకృతతలయుఁ బ్రేక్షణీయయు నై యొప్పె నంత లక్ష్మణుండు గోదావరీనదికిం జని యందుఁ గృతస్నానుం డై నూతనపద్మంబులు సంగ్రహించుకొని సఫలుం డై రయంబున నం జనుదెంచి వాస్తుపూజఁ గావించి విధ్యుక్తప్రకారంబున శాంతికర్మం బాచరించి స్వకృతం బైనతదాశ్రమపదంబు రామునకుం జూపిన నమ్మహానుభావుండు సీతాసహితుం డై పర్ణశాలారచనావిశేషవిలోకనసంజాతసాంద్రానందపారవశ్యంబునఁ దమ్ముని గాఢంబుగాఁ బరిరంభించి దుందుభిస్వనకల్పం బగుస్వరంబున నతిస్నిగ్ధంబుగాఁ బల్కె నిట్లనియె. 232

తే. అనఘ యద్భుతకర్మ మిట్లాచరించి
తీవు సమ్మోద మొదవె సంభావనార్థ

బున నగముమీఁద నున్నను, వనములు రుచికరము లయ్యెవరుస నిపుడిలన్.
తే. పటుజరాజర్జరీభూతపర్ణశీర్ణ, కర్ణికాకేసరతుషారకణపరీత
నాళశేషంబు లగునలినములచేత, నుర్వి సరసులు శోభింప కున్న విపుడు.

లక్ష్మణుఁడు రామునకు భరతుగుణముల నభివర్ణించి చెప్పుట.

ఉ. మానము రాజ్యభోగములు మాని మహాత్ముఁడు కైకపట్టి సం
తానిత వంశధర్ముఁడయి తాపసవేషముఁ దాల్చి యుత్తరీ
మానక నిన్నె నిత్యమును మానసవీథిఁ దలంచి దుఃఖితుం
డై నెఱి దక్కి శీతమహియందు వసించి తపంబు సల్పెడిన్. 259
తే. అనఘచారిత్ర మనయట్ల యాభరతుఁడు, నిత్య మిక్కాలమందున నిద్ర లేచి
ప్రకృతిపరివృతుఁడై కడుభక్తితోడ, నరుగుచుండు స్నానార్థంబు సరయుకడకు.
క. అతిసుఖసంవృద్ధుఁడు ఘనుఁ, డతిసుకుమారుండు భరతుఁ డత్యంతహిమా
ర్దితుఁ డయి వేఁకువ నేక్రియఁ, గుతుకంబున సరయువందుఁ గ్రుంకు మహాత్మా.
సీ. కంజాతనేత్రుండు కమనీయగాత్రుండు నీరదశ్యాముండు నిరుదరుండు
శ్రీమంతుఁడును ధర్మశేవధి మధురుండు హ్రీనిషేధుండు జితేంద్రియుండు
సత్యప్రతిజ్ఞుండు సత్ప్రియభాషియు ననుపమభోగాస్పదుఁ డార్యసేవి
సకలశాస్త్రార్థవిశారదుండు మృదుండు వర్ణనీయుఁడు గురువత్సలుండు
తే. కైకయీనందనుం డట్టిఘనుఁడు దీర్ఘ, కాలము సమస్తరాజభోగములు విడిచి
నిశ్చలప్రీతి నార్యనినిను భజించి, నందున మహాత్మ కృతకృత్యుఁ డయ్యెఁ గాదె.
వ. దేవా మహాత్ముం డగుభరతుండు తాపసకృత్యంబుఁ గైకొని నీవు వనస్థుండవై
నను నిన్ననుసరించి వివిధభక్తుల సేవించుచున్న కారణంబున నతనిచేత నాకం
బుజయింపంబడియె నదియునుంగాక మనుష్యులు పితృస్వభావం బనువర్తింపక
మాతృస్వభావం బనువర్తింతు రనియెడుప్రసిద్ధం బైనలోకప్రవాదంబు మాతృ
కృతానయపరిహారంబువలన నాతనిచేత నన్యథాకృతంబయ్యె ననిపలికి వెండియు.
తే. అనఘచారిత్ర దశరథునంతవాని, కరయఁ బత్నియై భరతునియంతవాని
కంబయై ఖ్యాతి వడసినయట్టికైక, కెలమి నీక్రూరబుద్ధి నేఁడేల గలిగె. 264
క. అని లక్ష్మణుండు స్నేహం, బునఁ బలికిన నావిదేహపుత్రీవిభుఁ డా
జననీపరివాదము విని, తనమదిని సహింపలేక తమ్ముని కనియెన్. 265
శా. కారుణ్యాదిసమస్తసద్గుణములం గన్పట్టు కైకేయిపై
నేరం బేల వచించె దీవు మృదునిఁ నిర్మత్సరుం దత్సుతుఁ
శ్రీరమ్యుం బ్రణుతింపు మువ్విభుని సౌశీల్యంబె ముఖ్యంబు గా
కారామామణిదాష్ట్య మెన్నఁ దగ దోయజ్ఞాప్తవంశోత్తమా. 266
తే. అనఘచరిత దృఢవ్రతమయ్యు వన వి, హారమందు సునిశ్చితమయ్యు నాదు
మానసము భరతస్నేహమగ్నమగుచుఁ, దరలతవహించుచున్నది మరల నిపుడు.

తే. అమృతకల్పంబులు ప్రియంబు లతిమృదులము
లమితసుఖకరములు మధురార్థయుక్త
ములు మనోజ్ఞంబు లద్భుతోజ్జ్వలము లైన
భరతువచనంబు లెంతయు మఱవఁబడవు. 268

క. పరమార్థవిదుఁడు భరతుఁడు, నరసాత్ముఁడ వైననీవు శత్రుఘ్నుండున్
గురుమతి భజింప సంపద, యిరవందెడునట్టికాల మెన్నఁడు వచ్చున్. 269

వ. అని బహుప్రకారంబుల విలపించుచు రాముండు ప్రియానుజసహితంబుగా గోదావరీనదికిం జని యందుఁ గృతాభిషేకుం డై తదీయపావనజీవనంబుల దేవపితృతర్పణంబులు గావించి పార్వతీవిఘ్నసహితంబుగాఁ గృతాభిషేకుం డైన భగవంతుం డగురుద్రునిచందంబున నందం బగుచు నుదితాదిత్యు నుపాసించి దేవతోపాస్తిఁ గావించి గ్రమ్మఱ నిజాశ్రమంబునకుం జనుదెంచి ప్రాతర్హోమాదికంబుఁ గావించి పర్ణశాలఁ బ్రవేశించి తన్మధ్యదేశంబున సీతాసమేతంబుగా సుఖాసీనుఁ డై చిత్రాసమన్వితుం డైనచంద్రునిభంగి వెలుంగుచు మహర్షిపూజ్యమానుఁ డై లక్ష్మణునితోడఁ బుణ్యకథేతిహాసంబులు వక్కాణించుచున్నసమయంబున. 270

శూర్పణఖ రామునిఁ జూచి మోహించుట.

చ. దశముఖదైత్యరాడ్భగిని దారుణలోచన లంబజిహ్వ దు
ర్దశన దురాగ్రహప్రబలతావికటీకృతచిత్త నీలవ
ర్ణ శిఖరితుల్యగాత్రి యొకరాక్షసి శూర్పణఖాభిధాన యా
దశరథపుత్రునాశ్రమపదంబునకుం జనుదెంచె లీలతోన్. 271

వ. ఇవ్విధంబునం జనుదెంచి. 272

సీ. ఇందీవరశ్యాముఁ గందర్పసమధాము నాజానుబాహు నీలాభ్రదేహుఁ
గమలపత్రనిభాక్షు విమలశోభనవక్షు నతిసుకుమారు విశ్రుతవిహారు
రాజచిహ్నసమేతు రాఘవాన్వయజాతు దరహాసవదను సౌందర్యసదను
రమణీయగుణజాలు విమలవిద్యాశీలుఁ గరుణాలవాలు భాసురకపోలుఁ
తే. దరుణయౌవనకలితు సీతాసమేతు, ఘనజటాధారి వల్కలాజినవిహారి
రామునందందచూచి శూర్పణఖ బహుళ, కామభారావసన్నయై కదియవచ్చి.

సీ. తనదుర్ముఖత్వ మాయనసుముఖత్వంబుఁ గాంచి రెంటికి నీడు గాఁ దలంచి
తనమహోదరమునాయనవృత్తమధ్యంబుఁ గాంచి రెండొకటిగా నెంచికొనుచుఁ
దనవిరూపాక్షు లాయనవిశాలాక్షులుఁ బరికించి సరియకాఁ బ్రస్తుతించి
తనతామ్రకేశ మాయనసుకేశముఁ జూచి తగు నని డెందానఁ దమక మూని
తే. తనదువార్ధక మాయన తరుణతయును
దనవికృతమూర్తి యాయనవినుతమూర్తి

చ. మనుజవరేణ్య యేను బహుమాయలు నేర్చినదానఁ గాన నా
పను బలవత్తరాల నరిభంజనశీలను గాన నన్నుఁ గై
కొని సకలేష్టభోగము లకుంఠితవైఖరి నొందు మక్కటా
కనికని దీనియంతటి వికారపుఁ బొత్తు మనంగ నేటికిన్. 284

ఉ. చక్కనివారిలో మిగులఁ జక్కనివాఁడవు నీవు నన్నుఁ బోల్
చక్కనికాంతఁ గూడి బలుచందములన్ సుఖియించు టంతె కా
కిక్కుటిలాంగితోడి చన వేటికి దీనిఁ బరిత్యజింపు మో
చక్కరవింటిసామి నెకసక్కెము లాడెదు రాజమన్మథా. 285

చ. ఇది వికృతాస్య నీకుఁ దగ దీసతి పై ననురక్తిఁ గూర్ప రా
దదయత నిగ్రహింపు మటులైనను దోసము లేదు గాన నీ
హృదయమునందుఁ గూర్మి నోయి నింత కొడంబడ వేని లక్ష్మణుం
బదపడి దీని నే నిపుడు పట్టి గ్రసించెద నంతఁ దీఱెడిన్. 286

శూర్పణఖను రామలక్ష్మణులు పరిహాసించుట.

క. అని చుప్పనాతి పలికిన, విని రాముఁడు చతురవాక్యవిదుఁ డగుట మనం
బున గర్హించుచు దానిం, గని చిఱునగ వంకురింపఁగా ని ట్లనియెన్. 287

క. నినువంటిరూపవతి నెం,దును గానక తొలుత తగినదో తగనిదో కై
కొనినాఁడ దీని వేఱొక, వనితను మది నింకఁ గోర వచ్చునె నాకున్. 288

ఉ. కన్నుల కింపు సేయు నినుఁ గైకొనఁ జూచితి నేని సంతతం
బన్నిట నీకు నీమగువ కాఱనితీఱనిపోరు గల్గు సౌ
ఖ్యోన్నతి లేదు మేల్పడినయోష నలంచిన దోస మంటివే
నిన్నును గైకొనం దగిన నేర్పరి నాయనుజు న్వరింపుమా. 289

చ. ఇతఁడు సుశీలవంతుఁడు సహీనబలుండు సుదర్శనుండు నా
తతభుజవిక్రముం డకృతదారుఁడు నీ కనురూపుఁ డై నభ
ర్త తనకు భార్యగాఁ దగినదాని నొకర్తెను గోరు చున్నవాఁ
డితని వరించి తేని భజియింపుదు వాఱడి లేనిసౌఖ్యమున్. 290

వ. కావున సూర్యప్రభ మేరువుంబోలె నీలక్ష్మణుని భర్తగా భజింపు మని యిట్లు రాముండు పరమదయాళుత్వంబునఁ దనయందుఁ గామమోహంబులచేత సమాగత యైనయువతిని శీఘ్రంబున ధిక్కరించిన దుఃఖించు నని తలంచి క్రమంబునఁ దిరస్కరించువాఁడై పరిహాసవచనంబుఁ బల్కి లక్ష్మణుం జూపిన. 291

క. మనమున హర్షం బడరఁగ, దనుజాంగన కామబాణదళితహృదయ గా
వున నది యొకనిజ మనిగ్ర, క్కున లక్ష్మణుఁ జూచి పల్కెఁ గోర్కులు నిగుడన్.

ఉ. చక్కనివాఁడ వివు నృపసత్తమ చక్కనిదాన నేను బెం
పెక్కఁగ నన్నుఁ గూడి చరియింపుము కాననభూమియందు నే

నిక్కము నిన్నుఁ గూడి గిరినిర్ఝరకాననకందరంబులం
బెక్కువిధంబులన్ సుఖసమృద్ధి వహించెద సొంపు మీఱఁగన్. 293
వ. అనిన విని వాక్యకోవిదుం డగులక్ష్మణుండు చిఱునగవు నగి యుక్తంబుగా
దాని కిట్లనియె 294
క. దాసుఁడ నగునను గైకొని, దాసివి గా నెట్లు నీవు దలఁచితి వోహో
నీసరస మేమి చెప్పుదు, దాశరథికి నేను గూర్పుదానుఁడఁ గానే. 295
క. ఏపగిది నైన నధికునిఁ, జేపట్టిన వలయుసుఖము చేకూరుం గా
కీపట్ల సేవకుని ననుఁ, జేపట్టిన నేమి సుఖముఁ జెందెదవు బలే. 296
క. కావున రామునిఁ గైకొను, మీవృద్ధఁ గరాళ ననతి నీవిక్రుతాంగిం
గేవలత విడిచి మోదం, బావహిల న్నిన్నె వేగ యవలంబించున్. 297
క. నీచక్కఁదనము పోలం, జూచిన నెవ్వార లైనఁ జొక్కరె యిపు డే
లా చింతించెదు విభుఁ డే, లా చేకొనఁ డమ్మహాత్ముఁ బ్రార్థింపు మిఁకన్. 298
క. నీరూప మిది గనుంగొని, వారక నీతోడిపొందు వర్జించి రయం
బార మనుజాంగనల నె, వ్వారు విచక్షణులు గోర వత్తురు చెపుమా. 299

శూర్పణఖ సీతను మ్రింగెద ననుట

తే. అనుచు లక్ష్మణుఁ డాడినయతని పలుకు, విని దనుజ పరిహాసానభిజ్ఞ యగుటఁ
దథ్య మని నమ్మి నిర్నతోదరి కరాల, కామమోహిత యై పెక్కె రాముఁ జూచి.
తే. ఈవిరూప నీయబల నీవృద్ధ ననతి, నిర్నతోదరి విడువంగ నేర కిట్టు
లమితసత్త్వను స్వచ్ఛంద నైన నన్ను, మించినకృపారసమునఁ గామింపవైతి.
ఉ. ఇప్పుడు నీవు గన్గొనఁగ నీమనుజాంగన మ్రింగి పుచ్చి నే
రొప్పుఁగ నిన్నుఁ గూడి ముదమొప్పఁగ నిందుఁ జరింతు జూడు మం
చప్పుడు చుప్పనాతి రయ మారఁగ రోహిణి నుల్కయట్ల యా
కప్పురగంధినిం బొదువఁగా గనుకించినఁ జూచి యుద్ధతిన్. 302
ఉ. ఆరఘునాయకుండు జనకాత్మజ కట్లభయంబుఁ దెల్పి యా
దారుణరాక్షసిం బదరి తమ్మునిఁ గన్గొని యీనృశంస ని
ట్లూరక చూచు చుండఁ దగ దుర్విసుత న్వెదరించు చున్న ద
య్యారె శితాసిధార రయ మారఁగ దీని విరూపఁ జేయుమా. 303

లక్ష్మణుఁడు శూర్పణఖయొక్క కర్ణనాసములు ఛేదించుట.

చ. అన విని లక్ష్మణుండు భయదాకృతి ఖడ్గము కేలఁ బూని యా
దనుసుతకర్ణనాసిక ముదగ్రతఁ గోసినఁ బ్రాన్పడంబుద
ధ్వనిగతి నేడ్చుచు న్రుధిరధారలు గాఱఁగ ఘోరరూప యై
తనదువిరూపతాగతికిఁ దద్దయుఁ గుందుచు లజ్జ పుట్టఁగన్. 304
ఉ. అక్కడఁ బోసి శీఘ్రగతి సంక్షుభియై గాహాతి భూతధాత్రియున్

గ్రక్కదలంగఁ బాఱి ఘనకాయు దురాత్ము మహోగ్రదర్పను
వ్రక్కసిజేనిఁ గ్రూరతరరాక్షససంఘసమావృతు న్ఖరు
న్గ్రక్కున డాసి తత్పరిసరంబున వ్రాలె మహోల్కకైవడిన్. 305

తే. ఈకరణిఁ గర్ణనాసవిహీన యగుచు, రక్తధారోక్షితాంగి యై వ్రాలి యున్న
భగినిఁ గన్గొని యిట్లని పలికె రాత్రి, చరకులసరోజనిసహస్రకరుఁడు ఖరుఁడు.

ఉ. లెమ్మిటులార్త వై కళవళించెద వేటికి సంభ్రమంబు శో
కమ్మును మోహము న్విడిచి గ్రక్కున నీదురవస్థఁ జెప్పు నా
కిమ్మెయి నీదుముక్కు చెవు లెవ్వఁడు గోసి విరూపఁ జేసె వ్య
క్తమ్ముగ సర్వము న్దెలియఁగా వినిపింపుము చింత యేటికిన్. 307

చ. ఎఱుఁగక దుర్విషంబు మది నెవ్వఁడు గ్రోలఁగఁ జూచె గుండలి
న్గరమునఁ గొట్టె నెవ్వఁ డలకాలుని నెవ్వఁ డెదిర్చె జిచ్చులో
నుఱుకఁ దలంచె నెవ్వఁ డెవఁ డొప్పె గళంబునఁ గాలపాశ మి
ట్లురిగొన నెవ్వఁ డానగొనె నుద్ధతి మృత్యువుతోడి వైరమున్. 308

చ. స్థిరమతి నాకు విప్రియము సేయఁగఁ జాలినవీరు నుర్విలో
నరసినఁ గాన మిప్పుడు నరాసురదైవతపన్నగాలిలో
నిరుపమబాహువీర్యమున ని న్నిటు పట్టి విరూపఁ జేయఁగా
వరుస సమర్థుఁ డైనబలవత్తరుఁ డెవ్వఁడు వానిఁ జెప్పుమా. 309

ఉ. హెచ్చినకోపవేగమున నిప్పుడె దారుణబాణసంహతిం
జెచ్చెర వానిగుండియలు సించెద నెమ్ములు సర్వమర్మముల్
వ్రచ్చెదఁ దచ్ఛరీరరుధిరంబులు కాల్వలు గట్టఁ జేసెద
న్మచ్చర మంకురింపఁ బ్రసభంబునఁ బుచ్చెదఁ గాలుప్రోలికిన్. 310

క. భీకరశరమున నరి నొక, తాఁకునఁ గూలంగ నేసి తత్పిశితముచే
నాఁకలిఁ దీర్చెద గ్రక్కున గాకోలూకోగ్రజంబుకంబుల కాజిన్. 311

తే. రాజహంసంబు వేగ నీరంబులోనఁ, గలసి యున్నక్షీరంబు నాకర్షణంబు
సేయుగతివానిప్రాణముల్ శితశిలీము, ఖముల నాకర్షణ మొనర్తుఁ గాదె నేఁడు.

క. కదనంబున నాచే నటు, పొదువఁ బడిన రిపునిఁ బ్రోవఁ బురుహూతాది
త్రిదశవరు లైన శక్తులె, విదితంబుగ వాని తెఱఁగు వివరింపు తగన్. 313

శూర్పణఖ తనదుఃఖంబును ఖరాసురునితోఁ జెప్పికొనుట.

వ. అని రణాగ్రహోదగ్రవ్యగ్రాయమానమానసుం డై పలికినఖరాసురునివాక్యం
బులు విని శోకబాష్పధారాపూరితముఖి యై శూర్పణఖ యి ట్లనియె. 314

చ. తరుణులు రూపవంతు లతిదాంతులు మూలఫలాశను ల్మును
ల్సరసిజపత్రలోచనులు సౌమ్యులు దాశరథు ల్సద్ధర్మశీ
లురు సుకుమారు లద్భుతబలు ల్ఘనవల్కలు లన్నదమ్ములు

న్నరసులు రామలక్ష్మణులు నాఁ గల రిద్దఱు దండకాటవిన్. 3

క. ఘనరాజచిహ్నకలితులు, సనయులు గంధర్వరాజసము లగువారి
న్గనుఁగొని వేల్పులొ మనుజులొ,యని యే నరయంగఁ జాలనైతి సురారీ. 3

ఉ. వారిలసద్విహారములు వారివచోరచనాచమత్కృతుల్
వారిమనోజ్ఞవేషములు వారిసముగ్రపటుప్రతాపముల్
వారిపరాక్రమక్రమము వారిశరాసననైపుణంబు నె
వ్వారికి లేవు ముజ్జగమువారలలోపల నేమి చెప్పుదున్. 3

తే. దంతియుగమధ్యగతనాగకాంతఁ బోలి, దిననిశాంతరగతసంధ్యయనఁగ వా
నడుమఁ గాంచనమణిభూషణప్రభూషి,తాంగియై యున్న యొకచకోరాక్షిఁ గంఁ

క. వినుమా కాంతనిమిత్తం, బున నోర్వక భయదరూపమున నను వెసలో-
గొని వారు శాతఖడ్గం, బునఁ గోసిరి గినిసి నాదుముక్కుం జెవులున్. 3

క. మాయన్న ఖరుఁడు విన్నను, మీయసురులు నకేరు వచ్చి మీఁదెత్తిఁగి మనుఁ
డీ యన్న వినక హాసము, సేయుచు న న్నంగవికలఁ జేసిరి కడిమిన్. 3

ఉ. ఇమ్మెయి నాదుముక్కు సెవు లెవ్వఁడు గోసి విరూపఁ జేసె వాఁ
డిమ్మహి నీదుబాణముల నెన్నఁడు గూలుఁ దదీయరక్తపూ
రమ్మును దానిశోణితముఁ ద్రావఁగ నెన్నఁడు గల్గు నాకు నీ
యుమ్మలికంబు దీర్పు మసురోత్తమ తోడ జనించినందుకున్. 3

చ. అన విని దుర్మదుండు ఖరుఁ డంతకుఁడై వడిఁ బేర్చి క్రుద్ధుఁడై
విన విన నెట్టి వింత పృథివీస్థలిఁ బుట్టె ఖరాసురానుజ
న్మనుజుఁ డొకండు పట్టుకొని మానము గోల్పడఁ గర్ణనాసముం
దునిమి విరూపఁ జేసె నహ దోర్బల మెంత ఘనంబు వానికిన్. 3

వ. అని పలికి క్రోధమూర్ఛావిశేషంబున మై మఱచి రణలంపటుం డై యన్నిలిఁ
విమతుండు. 3

క. పదివేల మదగజంబుల. కదుపునకుం గలబలంబు గలరాక్షసులం
బదునలుగురఁ గనుఁగొని కన,లొదవఁగ నిట్లనియె ఘనరవోగ్రరవమునన్. 3

—ఖరుఁడు శ్రీరామలక్ష్మణులం జంపఁ జతుర్దశరాక్షసులఁ బంపుట.—

ఉ. ఎవ్వరొ మర్త్యు లిద్ద ఱొకయింతియుఁ గ్రొవ్వున దండకాటవిన్
దవ్వల నున్నవారఁట యుదగ్రబలంబునఁ గిట్టి మీర లా
మువ్వురప్రాణము ల్గొనుఁడ మోఘశరంబులఁ జుప్పనాతి తా
నవ్వలఁ దత్తనూరుధిర మంతయు దాహము దీఱఁ గ్రోలెడిన్. 3

వ. మదీయభగిని యగుశూర్పణఖయభిప్రాయం బి ట్లున్నది గావున నమ్మర్త్యులఁ
దించి మీరు దీని సఫలంబు గావింపుఁ డని దండధరుండునుం బోలె నాజ్ఞాపిం
చిన నన్నిశాచరులు వాతప్రేరితవలాహకంబులుంబోలె శూర్పణఖాదర్శి

మార్గంబున రయంబునం జని పర్ణశాలామధ్యంబున సీతాలక్ష్మణసహితంబుగా సుఖాసీనుం డై యున్నరామునిం జూచి సముదగ్రతేజుం డగుటవలన వనద్విపంబులు దీప్తవహ్నిం బోలె నమ్మహానుభావునిఁ దేఱి చూడం జాలక నివ్వెఱపడి రివ్విధంబున శూర్పణఖాసహితంబుగాఁ జనుదెంచిన క్షుద్రరాక్షసులం జూచి రాముండు దీప్తతేజుం డై లక్ష్మణున కి ట్లనియె. 326

క. మనచేత భంగపడి యీ, దనుజాంగన యీరసమునఁ దనవారిని దో
డ్కొని వచ్చె వీరె మనతో, నని సేయఁగ వచ్చి నార లసురులు కంటే. 327

క. ఒక్క ముహూర్తము జానకి, నిక్కడఁ గాచికొని యుండు మే నిపుడు సుధా
భుక్కులు మెచ్చఁగ వ్రేల్మిడి, రక్కసులం ద్రుంచి వైతుఁ బ్రదరప్రహతిన్.

ఆ. అనిన నట్ల కాకయని లక్ష్మణుఁడు సీయ, కొనియె రాముఁ డంతఁ గనకవలయ
చాప మెక్కువెట్టి చటులమౌర్వీనాద, మెసఁగ వారిఁ జూచి యిట్టు లనియె.

ఉ. మూలఫలోపజీవులము పుణ్యచరిత్రుల మాజి నంతకుం
బోలుదు మన్నదమ్ములము పుత్రుల మాజికి శస్త్రసంపదల్
గ్రాలుచునుండు మాకు మము రాముఁడు లక్ష్మణుఁ డందు రీ వినీ
లాలకతోడఁ గూడి మున మారఁ జరింతుము దండకాటవిన్. 330

క. మునులనియోగంబునఁ ద, న్మునికంటకు లైనమి మ్మమోఘాస్త్రముల
న్దునుమాడుటకై యీ కాంచనభూషితకార్ముకంబు జతనం బయ్యెన్. 331

ఖరప్రేషితు లగురాక్షసులు రామునితో యుద్ధముఁ జేయుట.

ఉ. ఇమ్మెయి మాపయిం దొడర నేటికి వచ్చితి రుగ్రభంగి మీ
కిమ్మహి జీవితేచ్ఛ గల దేని తొలంగి చనుండు గానిచోఁ
గ్రమ్మి మదీయహస్తగతకార్ముకముక్తనిశాతబాణపా
తమ్మున నాజిలోఁ దునిమి తప్పక యిప్పుడె తీర్చి పుచ్చెదన్. 332

చ. అన విని యాచతుర్దశనిశాటులు దారుణశూలపాణు లై
ఘనతరకోపవేగమునఁ గన్నుల నిప్పులు రాల రక్తలో
చనుఁ డయి యున్నరాముని విశాలపరాక్రమసోమునిం గనుం
గొని కఠినోక్తి ని ట్లనిరి కోపహుతాశుఁడు ప్రజ్వలింపఁగన్. 333

చ. దనుజకులోత్తముండు రిపుదర్పహరుండు ఖరుండు పంప ని
న్ఘనసమరంబునం దునుమఁ గాఁ జనుదెంచినవార మిందఱిం
జెనకఁగ నీకు నొక్కనికిఁ జెల్లునె యించుకసేపు నీవు మా
మునుమున నిల్చి పోరుము సమున్నతసత్త్వము తెల్ల మయ్యెడిన్. 334

శా. అస్మద్ఘోరకరప్రముక్తపటుశస్త్రాస్త్రమ్ము లొక్కుమ్మడి
న్విస్మేరోద్ధతభంగిఁ దాఁకి తనువు న్భేదింపఁగా దారుణా
పస్మారంబున బీరము న్విడిచి తద్బాణానలజ్వాలలన్

భస్మీభూతుఁడ వయ్యెదీవు విను మీప్రాగల్భ్య మిం కేటికిన్. 335

చ. అనుచు మిడుంగురుల్ సెదర నందఱు శూలము లొక్కపెట్ట రా
మునిపయి వైవ నమ్మనుజపుంగవుఁ డుగ్రతఁ జాపశింజినీ
ధ్వనులు సెలంగ నన్నిటిని భర్మవిభూషితసాయకంబులన్
దునియలు గాఁగ శూలములఁ ద్రుంచి ధరం బడ నేసె నుగ్రతన్. 336

ఉ. అంతటఁ బోక యద్దనుజు లంతకులుం బలెఁ బేర్చి జానకీ
కాంతునిమీఁద నుగ్రగతి గ్రావము లొక్కట వీచి వైవ న
త్యంతరయంబున న్ఘనశరాహతి నాయుపలప్రకాండ మిం
తింతలు తునకలై వెస మహీస్థలి రాలఁగ నేసి ప్రేల్చెడిన్. 337

శ్రీరాముఁడు ఖరప్రేషితు లైనచతుర్దశరాక్షసులనుం జంపుట.

శా. జ్యావల్లి న్సవరించి దారుణభుజంగాకారనారాచముల్
ప్రావీణ్యంబునఁ గూర్చి శీఘ్రగతిఁ గుంభద్వక్రమారంభుఁడై
దేవేంద్రుం డని శాతవజ్రములరీతి న్యుద్ధలక్ష్యత్వవి
ద్యావైదుష్యము మీఱ నేసె వెస నాదైత్యప్రతానంబు పై. 338

ఉ. ఆరఘునాథుఁ డీపగిది నద్భుతదోర్బల మంత కంతకున్
మీఱఁ జతుర్దశాసురులమీఁదఁ జతుర్దశసాయకంబులన్
దారుణభంగి నేయ నవి తద్ఘనవక్షము లుచ్చి వీఁపులన్
ఘోరరవంబుగా వెడలి శోణితలంబున గ్రాలె నెంతయున్. 339

క. ఇమ్మెయి రఘుపతిశరహతమ్మున నయ్యసురవరులు దారుణగతి మూ
లమ్ములు వోయినఘనవృక్షమ్ములక్రియ ధరణిఁ గూలి చచ్చిరి వరుసన్. 340

శూర్పణఖ మరల ఖరునికడ కేగుట.

ఉ. అప్పుడు చుప్పనాతి వెస నంతకగోచరు లైనదైత్యులం
దప్పక చూచి భీతి మదిఁ దట్టుకొనంగ విఘూర్ణమాన యై
యుప్పరవీది నార్చుచు గదోద్ధతి నేగి ఖరాంతికంబునన్
దెప్పర మైనశోకమున దీనత గ్రాలె విషణ్ణరూప యై. 341

వ. ఇట్లు కించిత్సంశుష్కశోణిత యై నిర్యాసనహిత యైనవల్లకియునుంబోలెఁ దన
మ్రోలం బడినదాని సర్వరాక్షసవినాశంబుకొఱకు సమాగత యైనదాని శూ
ర్పణఖ నవలోకించి ఖరుండు క్రోధంబున ని ట్లనియె. 342

క. నీకుఁ బ్రియంబుగ నిపు డ, స్తోకభుజావిక్రమోద్ధతుల దనుజుల నే
భీకరులఁ బంపితిని నీ, వీకై వడిఁ బరితపించె దేటికి మరలన్. 343

క. భక్తులు నా కనిశం బను, రక్తులు సంగరమునం దరాతులఁ గడప
న్శక్తులు మనపదునలుగురు, న క్తంచరు లేల చుప్పనాతిరొ వగవన్. 344

ఉ. నాకకులద్విపేంద్రమృగనాథుఁ డనం దగు నేను గల్గఁగా

నీ కిటు దుఃఖ మొందఁ దగునే యహికైవడి వేష్టితాంగివై
శోకము మోహము న్విడిచి సుస్థితినిం దగ వైన కార్యము
న్నాకు వినంగఁ జెప్పుము ఘనంబుగ నిప్పుడె దీర్చి పుచ్చెదన్. 315

ఉ. నా విని చుప్పనాతి నయనంబుల నశ్రులు గ్రమ్ముదేర ర
క్షోవిభుఁ జూచి యేమి పురికొల్పెద సంహృతకర్ణనాస నై
యీవిధి సిగ్గుమాలి యొకహీనమనుష్యునిచేత నీకడ
న్లావని చెప్పఁ బాలయితి నాకరిపూత్తమ సారెసారెకున్. 346

చ. తొలుత నమోఘవీర్యులఁ జతుర్దశరాక్షసవీరుల న్నను
జ్జ్వలగతి నీవు పంపఁ జని వారలు రాముని రౌద్రమూర్తులై
చలమునఁ గిట్టి వాఁడి గలశస్త్రపరంపర లొక్కరీతిగాఁ
గులగిరిమీఁద మేఘములు క్రూరతరాశనులట్ల గప్పినన్. 347

చ. అలిగి మహోగ్రకోపమున నక్షియుగంబునఁ దామ్రదీధితు
ల్వెలుఁగఁగ నారఘూత్తముఁ డశేషచతుర్దశదైత్యవర్గము
జ్జ్వలితచతుర్దశాస్త్రములఁ జావఁగ నేసిన వారు పెద్దకొం
డలక్రియ ధాత్రిఁ గూలిరి కడ ల్వడి మ్రోయఁగ నేమి చెప్పుదున్. 348

శూర్పణఖ ఖరునితో రాముని ప్రభావంబుఁ జెప్పి దుఃఖించుట.

క. ఈకరణి నొక్క ప్రేల్మిడి, నాకారులఁ జంపినట్టి నరనాథునియ
స్తోకబలోద్ధతిఁ జూచి వి, తాకున భయ మొంది యున్నదాన జితారీ. 349

క. దానవులనిధనముం గని, యే నాతనిమ్రోల నిలువ కెంతయు భీతి
న్నానక నిను శరణము గొన దీనావన, మరల నేగుదెంచితి నిటకున్. 350

మ. శరసంధానము సేయుచోఁ దివియుచోఁ జాపంబు సారించుచో
నరిమేనం గుఱి వెట్టుచోఁ గడఁగి ప్రత్యాలీఢపాదస్థుఁడై
పరుషోగ్రాస్త్రము లేయుచోఁ బరులదోఃప్రాబల్యము ల్మాన్చుచో
ఖరుఁడా యాతని నేర్పు నెవ్వరియెడం గానం ద్రిలోకంబులన్. 351

క. ఇక్కైవడిఁ బదునలువుర, రక్కసులం జంపి పిదప రాముఁడు నాతో
ముక్కుఁడిరక్కసి తక్కిన, రక్కసులం గొనుచు వేగ రమ్మని పలికెన్. 352

క. ఆమాట చెవికి సోఁకిన, హామిక యోనాడి నేఁటి కసురులసత్త్వం
బీమాడ్కి నవ్వులాయెం గ,దామనుజున కనుచుఁ జిత్తమలమట నొందెన్.

క. నీ కొకని కేల లోకా,నీకంబుల కైన వాని నిరుపమశౌర్యో
ద్రేకం బోకించు కైనను, బ్రాకటధృతియుక్తి సైఁపరా దసురేంద్రా. 354

చ. పలుకులు వేయు నేల రిపుభంజన యిప్పుడె వానిమీఁదికిం
జలమున నెత్తి పోయి పటుసాహసవిక్రమరేఖ దోఁపఁగా
బలువిశిఖంబులం బొదివి ప్రాణముఁ బాపినఁ గాని నీకు ని

శ్చల మగునత్త్వము నృశ మసహ్యపరాక్రమ ముర్వి నిల్చునే. 355

చ. దనుజవరేణ్య నాకుఁ బ్రమదం బొనగూర్పఁ దలంచి నేఁడు నీ
పనుపున నేగి రాక్షసు లపారబలుం డగువానిశక్తిచే
ననిమొనఁ జచ్చి రట్టిరిపు నంతము నొందఁగఁ జేయ వేని వీఁ
డనిశము భృత్యఘాతుకుఁ డటంచు నిశాటులు నిన్ను దూఱరే. 356

చ. చెలియలిముక్కునుం జెవు లసిప్రహతి న్దెగఁ గోసి భృత్యుల
న్బలియురఁ గొందఱం దునిమి బాహుబలోద్ధతిఁ గ్రాలు చున్నయా
తులువను బట్టి బల్గతుల దోర్బలశక్తి వధించు టుండనీ
పిలిచినఁ బోవ కున్న కడుఁ బెం పొడఁ గూడునె శౌర్యశాలికిన్. 357

ఉ. రాక్షసకంటకుం డయినరాముని నాతనితమ్మునిం జకో
రాక్షిని జానకిం దునిమి యన్నరొ నా పగఁ దీర్పు మింతకు
న్దక్షతఁ జాల వేని ఖరదానవశేఖర నీవు చూడఁగా
నీక్షణమందె చత్తు మన నేటికిఁక న్సరివారు నవ్వఁగన్. 358

చ. అమరవిరోధి యేపగిది నైన రణంబునఁ గిట్టి యన్నరా
ఘముని సతీసహోదరయుతంబుగఁ జంపక యుంటి వేని ని
క్కముగ ధరిత్రిలోన మనకర్బురవంశము నెల్ల నేకకా
లమున వధించు నింతకుఁ దలంచినవాఁ డిఁక నంతఁ జేయఁడే. 359

వ. మఱియు రణశిరంబున రాముని నెదిరించి పోరాడునట్టివీరుండు ముల్లోకం బులం దెవ్వండును లేఁడు నీ వల్పవీర్యుండవు నిస్సత్వుండవు మిథ్యారోపితవిక్రముండవు శూరమానివి యని యూహించెద రామునకుం గల తేజంబును శక్తియు నీకుం గలిగె నేని దండకారణ్యవాసి యైనయతని జయింపు మంతకుం జాల వేని బంధుసహితంబుగా జనస్థానంబు విడిచి యెందుకడకుం జను మిచ్చట నుంటి వేని రామతేజోభిభూతుండవై రయంబున నశింపం గలవాఁడ వారాముండు తేజస్సమాయుక్తుండు వానితమ్ముండు మహావీర్యుండు వారిరు వురు వహ్నిమారుతకల్పులై వెలుంగుచున్నవారు. 360

క. అని ఖరునకు మది రోసము, జనియింపఁగ నిట్లు పెక్కుచందంబుల శూ
ర్పణఖ ఫురికొల్పి హస్తం,బున నుదరము మోఁదికొనుచు బోరన నేడ్చెన్.

క. ఈరీతి శూర్పణఖచేఁ, బ్రేరితుఁ డై ఖరుఁడు భయదవేషంబున నా
కారులమధ్యంబున దు,ర్వారోద్ధతి దానిఁ జూచి గ్రమ్మఱఁ బలికెన్. 362

ఖరుఁడు తాను రామాదులఁ జంపెద నని శూర్పణఖ నూరార్చుట.

చ. భవదవమానసంజనితబంధురరోషము నెమ్మనంబునం
దవిలి బహుప్రకారములఁ దాల్పఁగ నాకు నశక్య మయ్యె నా
పవిధరుఁ డైన నా యెదుటఁ బ్రస్తుతి కెక్కఁడు హీనమానవ

స్తవము సహింప నోపుదునె నా కెఱుకుఁ గర్ణగతోరభంగిగన్. 363

ఉ. ఇంత దురంతచింత వడ నేటికి రాముని సానుజంబుగా
నంతకసాదనంబునకు నంపెద నొక్కముహూర్తమాత్ర మీ
చింత దొఱంగి యుండు మటు చేసినపిమ్మట నాజిభూమిలోఁ
బంతము మీఱఁ దద్రుధిరపానము జేసెదు గాక రాక్షసీ. 364

ఖరుఁడు యుద్ధమున కంతయు సన్నద్ధము చేయు మని యాజ్ఞాపించుట.

వ. మఱియు నారాముండు స్వకీయంబు లైనవిరూపకరణాదిదుష్కృతంబులచేత హతుం డై యున్నవాఁ డిప్పుడు మద్విశిఖతాడితుం డై ప్రాణంబులు విడువం గలఁడు శక్రాదిదిగీశులకు హృదయభల్లం బైనయేను మర్త్యమాత్రుం డైనరాముని సరకు గొందునె మత్పౌరుషబలపరాక్రమప్రకారంబు నీవె విలోకించెద వని పలికి రణోత్సాహదుర్ధరుం డగుఖరుండు వైరిభీషణుం డైనదూషణుం డనుసేనాపతిం జూచి మచ్చిత్తానువర్తులును భీమవేగులును సమరానివర్తులును నీలజీమూతవర్ణులును ఘోరదర్శనులును క్రూరకర్ములును లోకహింసావిహారులును సముదగ్రతేజులును శార్దూలదర్పులును గంభీరాట్టహాసులును భీషణఘోషులును తేజోబలసముదీర్ణులును మహాసత్వవంతులును దుర్నివారులు నగుచతుర్దశసహస్రరక్షోవీరుల యుద్ధంబునకు సన్నద్ధులం గావింపుము మఱియు సర్వాయుధపరిష్కృతంబును మేరుశిఖరాకారంబును మణికాంచనభూషితంబు నగు రథంబు జవనాశ్వంబులం బూన్చి కట్టాయితంబు సేయింపుము దీర్ఘంబు లైన చాపంబులును దిగ్మంబు లైనశరంబులును దృఢంబు లైనతూణీరంబులును నచ్ఛిద్రంబు లైనతనుత్రాణంబులును జిత్రంబు లైనఖడ్గంబులును నానావిధశక్తులును సుందరస్యందనోపరిభాగంబునం బెట్టింపుము రాక్షసకంటకుం డైనరాముని వధించుటకు మహాత్ము లగుపౌలస్త్యులలోన నేను ప్రథమపూరుండ నై తల మిగిలి సంగ్రామంబునకుం జనియెద నని పలికిన నతండు తద్వచనప్రకారంబున సర్వంబును సమకట్టి తానును సమరసముత్సాహవిశేషంబునఁ గట్టాయితం బై పొడసూపిన. 365

సీ. శబళాశ్వయుక్తంబు చారువైడూర్యకూబర మసంబాధంబు భర్మశిఖరి
శిఖరసంకాశంబు చిత్రభానునిభంబు చటులహేమరథాంగసంయుతంబు
సంతతచారుకాంచనభూషణయుతంబు సౌవర్ణకింకిణీసంకులంబు
రణితఘంటాసుందరము ధ్వజనిస్త్రింశసంపన్న మగుఘనస్యందనంబు
తే. నెక్కి శౌర్యంబు దిక్కులఁ బిక్కటిల్లఁ, గదనసముచితభేరిభాంకార మడర
సమరదోహలి యై జనస్థానసీమ, గదలెఁ దేజోజితప్రభాకరుఁడు ఖరుఁడు.

ఖరుఁడు సైన్యముతో జనస్థానమునుండి వెడలుట.

సీ. సంగరరంగానుషంగశాత్రవనేత్రభీషణుం డన నొప్పుదూషణుండు

ప్రళయజీమూతగర్జాసముజ్జృంభణభాషణుం డన నొప్పుదూషణుండు
సంగ్రామములయందు శక్రాదిభీకరఘోషణుం డన నొప్పుదూషణుండు
సకలనిశాటవంశప్రదీపకశిరోభూషణుం డన నొప్పుదూషణుండు

ఆ. ఖరుని వెంటఁ జనియె ఖరములఁ బూన్చిన, యరద మెక్కి దిక్కు లదరఁ బ్రళయ
కాలవారిధరముకై వడి నార్చుచు, దితిజసైన్యవదనతిలక మగుచు. 367

వ. మఱియు గదాముసలముద్గరభిండివాలకరవాలతోమరపరశుపట్టిసప్రాస శరశ్వధ చక్రశూలకుంతక్షురికాదినానాసాధనంబులం గైసేసి వెల్లి విరిసిన మహాసముద్రంబుచందంబున నుప్పొంగుచుఁ బరస్పరవీరాలాపంబుల నుత్సహించుచు రోదోంతరాళంబు నిండ నార్చుచుఁ జతుర్దశసహస్రసంఖ్యాతం బగు ఘోరశస్త్రాయుధధ్వజం బైనరాక్షససైన్యంబు సమరోత్సాహంబున దూషణునివెనువెంటం గదలె నప్పుడు తదీయచరణక్షుణ్ణసముద్ధూతమహీపరాగంబు నానావిధనాదంబులతోఁ గూడ గగనంబున కెగసె నివ్విధంబున ఖరుండు సేనామంత్రిదండనాథపురస్సరంబుగా రణంబునకు వెడలి చిత్రితమత్స్యపుష్పద్రుమశైలచంద్రసూర్యకాంచనపక్షిసంఘతారాగణాభిసంవృతం బైనరథం బారోహించి సూతు నాలోకించి రథంబు రయంబునం దోలు మని యాజ్ఞాపించిన నతం డతనిచిత్తంబుకొలఁదిఁ బగ్గంబులు వదలి వాయుజవంబు గలఘోటకంబుల దాఁటించి తనసారథ్యనైపుణ్యంబున రథంబుఁ దోలిన. 368

సీ. కాంచననేమిసంఘట్టనంబునఁ ద్రోఁచఁ బెనుగట్టుశిల లెల్లఁ బిండి గాఁగఁ
గనకధ్వజాగ్రసంఘటితపటప్రభంజనఘాతమున మేఘసమితి పాఱఁ
జటులఘోటకఖురపుటఘట్టనోద్ధూతధరణీపరాగ మంబరము నిండఁ
గనకఘంటాఘణంఘణనినాదంబులు దిక్కరికర్ణము లవ్వ్రక్కలింప

తే. గగనమునఁ జనురవిశతాంగంబుపగిది
లోచనంబుల కతిదుర్విలోక మగుచు
శీఘ్రభరమున శేషుండు శిరము వంప
గాఢరయమునఁ జను చుండె ఖరునిరథము. 369

ఖరుని సైన్యములో దుర్నిమిత్తము లగపడుట.

వ. ఇవ్విధంబునం జనుసమయంబున ఖరాసురున కరిష్టసూచకంబుగా గర్దభధూసరంబు లైనమేఘంబులు రక్తవర్షంబు గురిసె దివాకరమండలంబుచుట్టు రుధిరపర్యంతం బై యలాతచక్రప్రతిమం బై నీలపరివేషంబు దోఁచె రథంబునం బూన్చినహయంబులు మహావేగంబునం బోవుచు నాకస్మికంబుగా ముందఱికి మ్రొగ్గతిలం బడియె సముచ్ఛ్రితహేమదండం బైనధ్వజంబు నాక్రమించి మహాకాయం బగుగృధ్రంబు దారుణప్రకారంబునం గనుపట్టె జనస్థానసమీపంబున మాంసాదంబు లగుఖగమృగంబులు విస్వరంబుగా ఖరస్వనంబులు

సేయు చుండెఁ బ్రభిన్నగిరిసంకాశంబు లై శోణితతోయధరంబు లై భీమంబులై వలాహకంబు లాకాశంబు నిరవకాశంబు గావించె నుత్పాతవశంబువలన జాజ్వల్యమానంబు లై నదిశలయందు ఘోరంబుగాఁ దిమిరంబు గవిసెఁ బ్రాతఃకాలంబునందు గగనంబు సంధ్యాకాలంబునందుం బోలె క్షతజార్ద్రవర్ణాభం బై యుండెఁ గంకగోమాయుగృధ్రంబులు ఖరున కభిముఖంబుగా నఱచు చుండె శివాగణంబులు రణంబునం దపజయంబుఁ దెల్పుచు దుర్నిమిత్తదృష్టాంతభూతంబు లై జ్వాలోద్గారిముఖంబులచేత బలంబున కభిముఖంబుగా రోదనంబు సేయు చుండె సూర్యునిసమీపంబునఁ బరిఘసన్నికాశంబు లైన కబంధంబులు దోఁచె నపర్వకాలంబునందు స్వర్భానుండు భానునిం బరిగ్రహించెఁ బ్రతికూలంబు లై వాతంబులు సుడిసె దివాకరుండు నిష్ప్రభుం డయ్యెఁ బట్టపవలు ఖద్యోతసన్నిభంబు లై చుక్కలు పొడిచె లీనమీనవిహంగమంబు లై కమలాకరంబులు చూపట్టె విగతపుష్పపత్రఫలంబులై పాదపంబులు మోడువడి యుండె వాయువులు లేక జలధరధూసరం బై నరజంబు సుడిసె మేఘంబులు లేక పిడుగులు వడియె శారికలు వీచి కూచి యని యసుఖకరశబ్దంబులు వలికె సాగరపర్వతకాననసహితంబుగా మహీచక్రంబు చలించె నట్లయ్యె రథస్థుం డై నఖరునిసవ్యభుజంబు చలించెఁ గంఠనాదంబు హీనం బయ్యె నేత్రంబుల నశ్రువులు గ్రమ్మె లలాటంబునందు వేదన వొడమె నిట్టి మహోత్పాతంబు లనేకంబులు వొడమినం జూచి ఖరుండు ప్రహసించుచు రాక్షసుల నవలోకించి యి ట్లనియె. 370

ఖరుఁడు దుర్నిమిత్తంబులఁ జూచి ప్రహసించుట.

క. చూచితిరె మన కమంగళ, సూచకములు పెక్కుగతులఁ జూడ్కికి వ్రేఁ గై
తోఁచుచు నున్నవి సర్వత, నీచరవరులార దుర్నిమిత్తము లై నన్. 371

క. కడిమి గలశూరవరునకు, మిడుతశకునము లివి యడ్డమే పగతునిపైఁ
బడి తునుము టంతె కాకిటు, పిడుగున కొక వారశూల పృథివిం గలదే. 372

క. నిక్కముగ నేను గినిసిన, నొక్కముహూర్తంబులోన నురుబాణములం
జుక్కల నిలఁ బడ నేసెదఁ, దక్కక మృత్యువును బట్టి తల ఖండింతున్. 373

క. వీరోత్సిక్తుం డగురఘు,వర్యునిఁ దదనుజునిఁ బట్టి వరబాణములన్
వీర్యమునఁ ద్రుంప కిటకు న,వార్యగతిన్ రిత్త మగిడి వత్తునె పెలుచన్. 374

తే. పార్థివోత్తమసుతులవిపర్యయంబు, కడిమి నెద్దానికొఱకు సంఘటిత మయ్యె
నట్టిభగిని సమాహతు లైనవారి, రుధిరపూరంబు తమి దీఱఁ గ్రోలుఁ గాక.

క. దురమున ము న్నెన్నఁడు నొక, పరాజయ మెఱుంగనట్టి ప్రబలుఁడ నెందుం
గర మేను బలికి నంతయుఁ, దిర మగు ని త్తెఱఁగు మీకుఁ దెల్లము గాదే. 376

క. దారుణకులిశముఁ గైకొని, యైరావణ మెక్కి సురబలాన్వితుఁ డై జం

భీరు యనికిఁ బఱతెంచిన, వారక వధియింతు నెంతవారలు మర్త్యుల్. 377

వ. అని యిట్లు దురాగ్రహంబునం బలికిన నాఖరాసురునివాక్యంబులువిని మృత్యు
పాశావపాశితు లై రాక్షససైన్యయోధులు సంతోషవిశేషంబున నతనిం
బ్రశంసించి రాసమయంబున శ్యేనగామియుఁ బృథుగ్రీవుండును విహంగముం
డును దుర్జయుండును గరవీరాక్షుండును బరుషుండును గాలకార్ముకుండును
మేఘమాలియు మహామాలియు సర్పాస్యుండును రుధిరాశనుండు ననుపన్ని
ద్దఱు మహామాత్యులు ఖరునిం జుట్టు ముట్టి యగ్రభాగంబునం జను చుండిరి
మహాకపాలుండును స్థూలాక్షుండును బ్రమాథియుఁ ద్రిశిరుండు నను నలువురు
సేనానాయకులు దూషణునిపిఱుందదెసం జనుచుండిరి త్తెఱంగునం గూడుకొని
రాక్షసవీర్యసైన్యంబు భీమవేగంబున గ్రహమండలంబు చంద్రసూర్యులంబోలె
రామలక్ష్మణులం గదియ నడిచె నిట్లు దానవశేఖరుం డగుఖరుండు రథారూఢుం
డై మహోగ్రసైన్యసమేతుం డై కోలాహలబహులంబుగా రణార్థంబు చను
దెంచుచుండ నప్పుడు రాక్షసవినాశనార్థంబు సముత్పన్నంబులైన దారుణమహో
త్పాతంబు లన్నియు విలోకించి రాముండు లక్ష్మణున కిట్లనియె. 378

రాముఁడు రాక్షసనాశకరంబు లగునిమిత్తంబుల లక్ష్మణునకుఁ జూపుట.

చ. అసదృశ మై మహాభ్రము మహాధ్వని సేయుచు ఘోరభంగి నా-
కసమున నెత్తురు ల్గురియఁగాఁ దొడఁగెన్ మఱి భూనభంబులం
దు సకలదుర్నిమిత్తములు దోఁచుచు నున్నవి యిన్నియుం గరం
బసురవినాశసూచకము లై కనుపట్టెడిఁ గంటె లక్ష్మణా. 379

మ. కనకాంశుచ్ఛట లీను మచ్ఛితశరౌఘంబుల్ సధూమంబు లై
ఘనకోదండములుం జలించుచును సంగ్రామప్రహర్షంబుతో
ననువై యున్నవి నాదుదక్షిణకరం బానక్తితో సారెకున్
ఘనభంగిన్ స్ఫురణంబుచే మన కసంఖ్యక్షేమముం దెల్పెడిన్. 380

క. వనచరసౌమ్యఖగంబులు, మనమ్రోల ననేకగతుల మన కభయంబుల్
దనుజులకు వినాశంబును, మునుకొని దెల్పుచుఁ గరంబు మ్రోసెడు వింటే.

చ. అని యొనరింపఁ బోవుజనులందు గతాయువు లైనవారి యా
ననముల నిష్ప్రభత్వము గనంబడు నిక్కువ మెన్ని చూచినన్
మన కది లేదు నీముఖము మానుగ సుప్రభ మై ప్రసన్న మై
గన నగుచున్న దట్లగుటఁ గయ్యమున న్విజయంబు గల్గెడిన్. 382

క. మఱియు ననేకవిధంబులఁ, దఱచుగ నచ్చోటఁ గన్న దారుణతరసం
గరపదములు గనుపట్టెడు, వరగుణ మన కిపుడు పో రవశ్యము గలుగున్. 383

క. మనకు శుభనిమిత్తము లివు, డనేకములు దోఁచు చున్న వటు గాన రణం
బునఁ బగతులకుఁ బరాజయ, మనఘాత్మక మనకు విజయ మగు నిక్కముగన్.

క. దానవవీరుల సింహ, ధ్వానంబులు భూరిదండతాడితభేరీ
ధ్వానంబులు శ్రుతిభయసం, ధానములై మ్రోయఁ దొడఁగెఁ దమ్ముఁడ వింటే.

వ. సంగ్రామంబునం దాపద దొలంగం ద్రోచి జయంబుఁ గోరునట్టిపండితునిచేత భావికాలసంభవ్యనిష్టంబునకుఁ బరిహారంబు కర్తవ్యంబు గావున. 386

—రాముఁడు సీతతో గిరిగుహలో నుండు మని లక్ష్మణున కాజ్ఞాపించుట.—

ఆ. ఎంత శూరుఁ డైన నింతితోఁ గూడి సం, గరము సేయ రాదు కడఁగి నీవు
సీతతోడఁ గూడి శిఖరిగహ్వర మాశ్ర, యించి కాచి యుండు మింపుతోడ.

క. కా దని మాఱాడిన మ, త్పాదంబులయాన యచటఁ దడయక త్వరతో
వైదేహితోడ నుండుము, పాదపసంఘాతయుక్తపర్వతగుహలోన్. 388

క. అనఘా నీవును శూరుఁడ, వనుపమబలయుతుఁడ వాజి నరులఁ గడిమిమైఁ
దునుమఁగ దక్షుఁడ వైనను, దనుజుల నే నొకఁడ చంపఁ దలఁచితి బుద్ధిన్.

వ. అని నియమించిన నాలక్ష్మణుండు తత్క్షణంబ శరచాపంబులు గైకొని వైదేహీసహితంబుగా దుర్గమం బైనగిరికందరంబు నాశ్రయించె నంత రాముండు లక్ష్మణునిచేత మిక్కిలి యుక్తకార్యంబు కృతం బయ్యె నని పలికి వహ్నిసంకాశం బైనదివ్యకవచంబు దొడిగి తిమిరంబునందు విగతధూముం డైనవైశ్వానరునిచందంబునం దేజరిల్లుచు మహనీయశరశరాసనంబులు గైకొని దిగంతరాళంబు నిండ గుణప్రణాదంబు సేయుచు యుద్ధసన్నద్ధుం డై రాక్షసుల రాక కెదురు సూచు చుండె నప్పుడు మహర్షి దేవగంధర్వసిద్ధసాధ్యులు దివ్యవిమానాధిరూఢులై సంగ్రామదర్శనకుతూహలంబునం జనుదెంచి యంబరంబున నుండి పరస్పరంబు శుభాలాపంబులు వల్కుచు గోబ్రాహ్మణులకు శుభం బగుం గాక సర్వలోకంబులు భద్రవంతంబు లై యుండుఁ గాక రాముండు విష్ణువు సర్వాసురులం బోలెసర్వరాక్షసులజయించి విజయలక్ష్మి నధిగమించుం గాక యని యీాదృశంబు లైనభద్రవాక్యంబుల నమోఘంబుగా నాశీర్వదించుచుఁ బెక్కండ్రరాక్షసులతోడ నొక్కరాముం డెవ్విధంబున సంగ్రామంబుఁ గావించునో యని జాతకౌతూహలు లై చూచు చుండిరి మఱియు సంగ్రామంబునకు సన్నద్ధుం డైనరామునిరౌద్రాకారంబు విలోకించి సర్వభూతంబులు భయభ్రాంతచిత్తంబు లై యుండె నప్పు డమ్మహానుభావుని యమానుషం బైన రూపంబు క్రుద్ధుం డగువిలయకాలరుద్రునిరూపంబుకై వడి నతిభయంకరం బై యుండె నంత ఘోరవర్మాయుధధ్వజంబును గంభీరనిర్హ్రాదంబు నగురాక్షసానీకంబు కదియ వచ్చె నపుడు. 390

—రాక్షససైన్యంబు రామునిఁ జేర వచ్చుట.—

చ. దనుజులసింహనాదము లుదగ్రచలద్రథనేమిఘట్టన
స్వనములు వీరహుంకృతులు చాపరణద్గుణటంకృతు ల్పట

ధ్వనులును భేరిభాంకృతు లవార్యము లై యొకరీతి నమ్మహా
వనమున నుండి పెల్లెసఁగె వన్యమృగంబులు భీతిఁ బాఱఁగన్. 391

వ. మఱియు నమ్మహాసైన్యంబునందు. 392

చ. పలుమఱు బంటుపంతములఁ బల్కెడువారు నిజప్రతిజ్ఞలం
దెలిపెడువారు శూర్పణఖ దెల్పినకై వడి రాముచందము
ల్గలయఁగఁ జూచువా రసురకంటకు నేనె వధింతు మీరు ని
శ్చలముగఁ జూచు చుండుఁ డని చాటెడువారలు నైరి యందఱున్. 393

వ. ఇట్లు బహుప్రకారంబుల వీరాలాపంబు లాడుచు వెల్లి విరిసినమహాసముద్రం
బుపోలిక ననివార్యం బై ఘూర్ణిల్లుచు సంరంభంబునం గదియ నేతెంచి. 394

క. ఆరక్షస్సైన్యము గం, భీరుని ధృతచాపముఖ్యపృథుసాధనునిఁ
ధీరుని నతిశూరుని రఘు, వీరునిఁ గనుఁగొనియె విమతవీక్షణభయదున్. 395

క. ఆరామవిభుండును దు,ర్వారం బై వనధిమాడ్కి వచ్చెడువిలస
ద్దారుణరక్షస్సైన్యము, నారక్తప్రేక్షణముల నటు చూచి వెసన్. 396

క. ఘోరం బగుకార్ముకమున, సారం బగునారిఁ గూర్చి చటులనినంగ
ద్వారంబువలన శరము ల, పారంబుగఁ దీసి కూర్చి బంధురభంగిన్. 397

క. దనుజవధార్థము క్రోధం, బనువుగ నంగీకరించి యాలకాలహుతా
శనుక్రియ దుష్ప్రేక్షుం డై, పెనుపుగ వనదేవతలకు భీతి నొసఁగుచున్. 398

క. దశముఖహరణసమయ, ప్రేక్షితుఁ డగుశూలపాణిపెంపున రఘుహ
ర్యక్షుఁడు రాక్షసగణవధ, దీక్షితుఁ డై యొప్పెఁ దీవ్రతేజస్స్ఫూర్తిన్. 399

చ. దశరథనందనుం డటు లుదగ్రతరస్ఫుటభీమణాకృతి
న్దశదిశలందుఁ దీవ్ర మగుదారుణతేజము పిక్కటిల్లఁ గ్రూ
రశమనుకై వడి న్రణశిరంబున నుండఁగఁ జూచి సర్వభూ
తసముదయం బపూర్వజనితం బగుసాధ్వస మొందె నత్తఱిన్. 400

తే. కార్ముకధ్వజభూషణకాండచిత్ర, వర్మములచేత నపుడు దుర్వారనిర్జ
రారిసైన్యము సూర్యోదయంబునందు, నీలఘనమండలముభంగిఁ గ్రాలుచుండె.

రాక్షసవీరులు రామునిమీఁద శస్త్రంబులం బ్రయోగించుట.

వ. ఇట్లు మండలీకృతకోదండుం డై నిజతేజోజాలంబుల శాత్రవనేత్రంబులకు మిఱు
మిట్లు గొలుపు చున్నరామునిఁ బరివారసహితుం డై దవ్వులం జూచి ఖరుండు
సముద్యద్వ్యథస్వాం డై గుణప్రణాదంబు సేయుచు రామున కభిముఖంబుగా రథంబుఁ
దోలు మని సూతు నాజ్ఞాపించిన నతండు తద్వచనానురూపంబుగా రయంబునం
దేరు దోలిన నతనిం బరివేష్టించి కాలజీమూతంబులకరణి గర్జించుచు రాక్షసు
లందఱు నేన నేన రాముని జయించెద నని బిరుదులు పలుకు చుండి రిట్లు ఖరుం
డు యాతుధానమధ్యంబున రథస్థుం డై తారాగణమధ్యంబునం బొల్పులోహి

తాంగునిచందంబున నొప్పుచుఁ దీవ్రం బగు బాణసహస్రంబున రణదుర్జయుం
డగు రామునిం బ్రహరించి నింగి ఘూర్ణిల్ల సింహనాదంబుఁ జేసె నంత భీమకర్మ
లగు రక్షోవీరులు నిరుపమాన తేజుం డగు రామునిం జుట్టుముట్టి నిశితంబు లైన
గదా శూల పరిఘ పట్టిస ముసల ముద్గర ప్రాస కరవాల భిండివాల కుంతాది నానావిధ
సాధనంబులం బ్రహరించుచు నీలవలాహకంబుల భంగి మహానాదంబులు గావిం
చిరి మఱియు గజారోహకులు మదపుటేనుంగుల డీకొలిపి నిశాతతోమరంబుల
నంకుశంబులం బొడిచిరి రథికులు నానావిధ సాయకంబులఁ బ్రయోగించిరి సాధులు
హయంబుల దుమికించి నిస్త్రింశంబు లడరించి రిట్లు పెక్కండ్రు రక్కసు లుక్కు
మిగిలి పెక్కు విధంబుల నక్కజంబుగా శస్త్రాస్త్రపరంపరలం గప్పిన నీలజీమూ
తంబులు గురియు కరకాశనివర్షధారలకుం జలింపని పర్వతంబు కైవడి రాముండు
సుస్థిరుండై యాదారుణప్రహరణంబుల చేత భిన్నగాత్రుం డయ్యును బ్రదీప్తాశని
నిపాతంబుల చేత వ్యథితంబుగాని మహాచలంబు కరణి వ్యథితుండుగాక సాగరంబు
నదీసంఘంబులం బోలె రాక్షసప్రయుక్త నానావిధ శస్త్రాస్త్రనిచయంబుల నిజవిశి
ఖంబుల చేతం బ్రతిగ్రహించి తదీయ బాణక్షత సంజాత రక్తధారాస్నపిత దేహుం
డై సంధ్యాభ్రపరివృతుం డైన సహస్రకరుని చందంబునం దేజరిల్లుచుండె నప్పు
డనేక రాక్షసుల చేతఁ బొదువంబడిన రామభద్రు నొక్కని విలోకించి దేవగంధర్వ
సిద్ధసాధ్యపరమర్షులు విషాదంబు నొందిరంత. 402

రాముఁడు రాక్షసులమీఁద నానావిధబాణంబులఁ బ్రయోగించుట.

శా. ఆ రాజాన్వయకుంజరుం డపుడు ప్రత్యాలీఢపాదస్థుఁ డై
ఘోరప్రక్రియ మండలీకృతచలత్కోదండుఁ డై చాపవి
ద్యారూఢత్వము గానుపింపఁగ రణన్యాయైకదక్షత్వ మే
పారం గాంచనపుంఖకాండములఁ బొల్పారంగ నేసె న్వడిన్. 403

ఉ. చాపము శక్రచాపముగఁ జండగుణధ్వని గర్జితంబుగా
దీపితసన్మణీవలయదీధితి చంచలగాఁగఁ గ్రవ్యభు
గ్రూపదవాగ్ని లాఱఁగ రఘుప్రవరాహ్వయకాలమేఘ మా
శాపరిపూర్తిగాఁ గురియ సాగె నిరంతరబాణవర్షమున్. 404

ఉ. దండిమెయి న్రఘూత్తముఁడు దారుణదైత్యుల భండనంబునం
జండభుజావలేపమునఁ జంపఁగలం డిఁక హర్షసంయుతు
ల్గం డనుచు న్దిగీశులకు గ్రక్కునఁ దెల్పఁగఁ బోయినట్లు కో
దండవిముక్తసాయకవితానము లొక్కటఁ బర్వె దిక్కులన్. 405

ఉ. రాముఁడు జన్యరంగమున రాక్షసుల న్వధియించుచున్నవాఁ
డోమునులార యింక భయ మొందకుఁ డంచు నిరంతరంబుగాఁ
బ్రేమ సమస్తభూతములు పెద్దయు మ్రోయుచు నున్నవో యనం

గా మణిఘంటికాధ్వనుల గాఢగుణస్వన మొప్పె నవ్వనిన్. 406

చ. త్రిదశులతోడ మున్ను పటుతీవ్రభుజాబలవైభవంబునం
గదన మొనర్చి చూచితిమి గాదొకొ వారలచేతు లంత బె
ట్టిదములు గావు తచ్ఛరపటిష్ఠత యే మన వచ్చు నంచు వీ
రదనుజు లప్డు మెత్తు రలరామశరంబులు సోఁకువేళలన్. 407

సీ. ప్రలయకాలోదగ్రజలధరంబులనుండి పుడమిపైఁ బడెడు బల్పిడుగులట్ల
సద్యస్తమోనాశచటులఖద్యోతమండలనిర్గతాంశుకాండములరీతి
క్షయకాలరుద్రలోచనజాత సుమహోగ్రసముదగ్రపావకజ్వాలలగతి
జంతుమారణకళాచతురకాలాంతకసముదితకాలదండములపగిది

తే. నతిదురావారదుర్విషహప్రచండ, కంకపత్త్రకరాళవక్త్రంబు లైన
రామశరములు రాక్షసవ్రజముమీఁద, నిగిడెఁ దండోపతండంబు లగుచు నపుడు.

చ. హరనయనాగ్ని వేఁడిమి మహాశనివాఁడిమి కాలదండని
ష్ఠురతయు ప్రోదినీఘనపటుత్వము స్కందునిభూరిశక్తిభీ
కరత ప్రతాపవేగమును గల్గి రఘూద్వహుబాణజాలము
ల్పరువడి వీరరాక్షసబలంబులపైఁ బడియె న్మహోగ్రతన్. 409

చ. ఇనకిరణాలికిం జొరవ యీక సదాగతిరాక కైనఁ బ
ల్చన వడ కర్థి సైకతముఁ జల్లిన రాలఁగ నీక దట్టమై
దనుజవిముక్తకాండములఁ దట్టుచు దిక్కుల రామకాండము
ల్సునిశితభంగి నిండుటయుఁ జూచి సుర ల్వెఱఁ గంది రయ్యెడన్. 410

ఉ. రామునిదివ్యసాయకపరంపర దాఁకునొ యంచు ఘోరసం
గ్రామమునందు దైత్యులు ధరాగతవీక్షణు లై భయంబున
న్మోములు వాంచి చాల హరిముంగలిజంతులభంగి నైరి గా
కేమియు సేయ లే రయిరి యెంతయు నివ్వెఱపాటు గూరఁగన్. 411

చ. పలుదెస లాక్రమించి రఘునాథునిచాపగుణచ్యుతాంబకా
వలులు నిశాటవర్యుల నవార్యగతి స్తనుమాడఁ జొచ్చె ని
ట్టలముగఁ బర్వె వహ్ని ప్రకటంబుగ నాత్మశిఖాపరంపర
న్విలసితతేజుఁ డై కడిమి వే శలభంబుల నేర్చుచాడ్పునన్. 412

ఉ. మించి కకుత్స్థనాయకసమిద్ధధనుర్గుణవిచ్యుతంబు లౌ
కాంచనపుంఖకాండము లఖండరయంబునఁ బోయి ఘోరన
క్తంచరకాయము ల్వెస నగల్చి గళద్రుధిరాప్లుతంబు లై
యంచితభంగి మింట దహనార్చులకై వడి నొప్పె నయ్యెడన్. 413

సీ. రథికసారథికేతురథ్యయుతంబు లౌ మందరాచలనిభస్యందనములు
కాలజీమూతసంఘాతసంకాశంబు లై యొప్పు మత్తమహాగజములు

జవస త్త్వజితమనఃపవమానమాధవవాహనంబులు సమిద్వాహనములు
కాటుకకొండలకరణి మేనుల గ్రాల విఱ్ఱవీఁగుచు నున్నవీరభటులు
తే. మడిసి రొక్కొక్కయెడఁ బెక్కుమలలమాడ్కి
దారుణాకారరామహ స్తప్రశ స్త
చండకోదండనిస్సృతచటులకాల
దండమండితకాండప్రకాండమతిని. 414

ఖరసైన్యంబు రామునిపరాక్రమంబునకు శెలఁగుపడి మరలిపోవుట.

వ. ఇవ్విధంబునఁ బ్రళయసమయజంతుపారణకళాధురీణుం డగుస్థాణునిపోలిక నిజ హేతివ్రాతభస్మీభూతసకలలోకనివహుండై నసంకర్షణాగ్నికై వడిఁ దారకాసుర సంహారసమయసముదీర్ణుం డగుకుమారునిపగిది సంక్రుద్ధుం డై నకాలాంతకుని మాడ్కి రామభద్రుండు రౌద్రరసోల్లాసభాసురమూ ర్తి యై యఖండకోదండ పాండిత్యంబుఁ జూపినఁ దదీయసాయకపరంపర యన్నిశాచరసై న్యంబునందుఁ బరహేతిప్రఘట్టనంబున మండుచుఁ గరులం బడవై చుచు హయంబుల నఱు కుచు రథంబుల నుగ్గునూచంబులు సేయుచుఁ బదాతులం ద్రుంచుచు శిరం బులం బగల్చుచుఁ గంఠంబులఁ ద్రెంచుచు బాహువులఁ దెగవ్రేయుచు వక్షం బుల వ్రక్కలించుచుఁ బ్రక్కలఁ జెక్కుచు నడుములఁ దుండెంబులు సేయుచు నూరువుల విఱుచుచు జానువులు ఖండించుచుఁ బిక్కలు చెక్కలు వాపుచుఁ బాదంబులు విలూనంబులు సేయుచు నెత్తురు లురలించుచుఁ గండలు రాల్చు చు నెమ్ములు విఱుచుచు భూషణంబులు రాల్చుచుఁ దనుత్రాణంబులు సించు చుఁ జాపంబులఁ ద్రుంచుచు గదలు పొడిసేయుచుఁ గరవాలంబులు పఱియలు వాపుచు ముసలంబులు గూల్చుచు ముద్గరంబులు తుమ్ముల్లుసేయుచుఁ గుంతం బులు రూపుమాపుచుఁ గుఠారంబులు చూర్ణంబులు సేయుచు భిండివాలం బులు నఱకుచుఁ దోమరంబులు పుడమి రాల్చుచు నంకుశంబులు పొడి సేయుచు ధ్వజంబుల నడిమికి నఱకుచు ని ట్లనేకప్రకారంబులఁ గీలాభీలంబుఁ జేసిన నమ్మొగ్గరంబు చచ్చియు నొచ్చియు విచ్చియు సుడిఁబడియుఁ గలం గియుఁ దొలంగియుఁ జిక్కువడియును జీకాకువడియును సైన్యంబు దైన్యదశకు వచ్చినం గనుంగొని మహాబలశాలు లగుకొందఱు రక్షోవీరులు సాహసం బునం దలకడిచి వీరావేశంబున రామున కభిముఖు లై శూలనిస్త్రింశపరశ్వ థంబులం బ్రహరించిన నయ్యతిరథవర్యుండు తీక్ష్ణాగ్రంబు లైననాళీకనారాచం బులఁ బ్రబలహాలికుండు మహారణ్యవృక్షంబులంబోలె వారల నందఱఁ బెక్కు తుండెంబులు గావించినం జూచి తక్కినరక్కసులు సింగంబుఁ గన్న లేళ్లచం దంబునఁ బ్రాణభయంబునఁ గనుకనిం బఱచి ఖరునిశరణంబుఁ జొచ్చినంజూచి శత్రుభీషణుం డగుదూషణుం డెలుం గె త్తి గంభీరఘోషణంబునం జేయి వీచి

పురికొల్పిననందఱు నొక్కింతధైర్యంబవలంబించి యంతపట్టుననుంగూడుకొని.

సీ. అనిలునితోఁడ మార్కొనఁ బోవు భూరినీరదములఁ బోలెడు రథచయములు
సర్వముతోడఁ బోరాడఁ బోయెడు పెనుచీకట్లకైవడి సింధురములు
పోరు చాలక పెద్దపులిమీఁది కుఱికెడుకొదమలేళ్లం బోలు ఘోటకములు
నగణితబలుఁ డైనమృగరాజుపై కేగుశుండాలములభంగి సుభటచయము

తే. వెల్లి విరిసినజలనిధివిధము దోఁప, నొక్కుమొగి ఘోరసంగరోద్యోగకాంత.
తనరఁ జెలియలికట్టచందమున నున్న, రామభద్రునిపై కేగె రౌద్రభంగి. 416

ఉ. కొందఱు సాలతాలములు కొందఱు భూరిశిలాప్రకాండము
లొక్కొందఱు శూలకుంతములు కొందఱు ముద్గరభిండివాలము
లొప్పొందుగఁ బూని యంద ఱొక పోరికిఁ గ్రమ్మి కడంగి వ్రేయఁ గా
సంపడికయ్య మయ్యె నృపచంద్రున కాఖరదైత్యసేనకున్. 417

రాముఁడు రాక్షససైన్యంబుపై గాంధర్వాస్త్రంబుఁ బ్రయోగించుట.

ఉ. ఆరఘువీరుఁ డప్పుడు భయానకభంగిఁ గడంగి చుట్టును
న్భూరిశిలాంబకప్రహతిఁ బోరుచు నున్ననిశాటసైన్యము
న్బాఱఁగఁ జూచి దీర్ఘనయనంబుల నెఱ్ఱఁదనంబు దోఁపఁ గా
వారణయూథముం గనినవారణవైరిక్రియం జెలంగుచున్. 418

క. మిడుతపరి గవిసినట్లుగ, నెడ తెగక గడంగి యున్న దీసేన బలే
నుడివడియున్నది యిప్పుడె, మడియింపఁగ వలయు రిత్త మసలఁగ నేలా. 419

మ. అని చింతించి జగద్భయానకరవం బౌనట్లుగా శింజినీ
ధ్వనిఁ గావించుచు లోకపూజ్య మగుగాంధర్వాంబకం బేయఁ జ
య్యన నయ్యస్త్రమహత్త్వ మెట్టిదో యసంఖ్యాతంబులై యస్త్రశ
స్త్రనికాయంబులు పుట్టి దిక్తటము లంతట నిండె గాఢోద్ధతిన్. 420

క. పడుచున్నరాక్షసులచేఁ, బడినమహాదారుణు లగు పలలాదులచేఁ
బడనున్నవారిచేతను, బుడమి పరిస్తీర్ణ యయ్యెఁ బొలుపుగ నంతన్. 421

వ. ఇట్లు తండోపతండంబులై రాముని ప్రచండకాండంబులు లెక్కకు వెక్కసంబులై పుడమి యీనినతెఱంగున నెల్లదిక్కుల నాక్రమించి యాకాశంబు నిరవకాశంబు చేసిన సూర్యకిరణప్రసరణంబు లేమిం జేసి గాఢాంధకారంబు గప్పుకొనియె నందు వెడందవాతియమ్ములతాఁకున శిరంబులు పగిలి గిఱ్ఱునం దిరుగుచు భీషణంబుగా ఘీంకారంబు సేయుచు వజ్రప్రహారంబుల ఱెక్కలు దెగి ధరణిం బడినకులాచలంబులచాడ్పున దంతంబు లూఁతగా ముందఱికి మ్రొగ్గతిలం బడి బాణక్షతవేదన సహింపం జాలక ప్రాణంబులు విడుచు మత్తశుండాలంబులును శుండాలోపరిభాగంబులనుండి తోమరాంకుశంబులఁ బ్రహరింప గమకించునంతలోనఁ గత్తివాతియమ్ములు కంఠనాళంబులఁ ద్రెంచిన

నదియే చందంబున ధరణిపయింబడి కామితంబు సఫలంబు గామికి జీవితం
బులు విడువం జాలక కొఱప్రాణంబులం దన్నుకొనుగజారోహకులును భల్ల
బాణంబుల శిరంబులు దునిసిపడ రయంబు పెంపున నవియె పోఁగాక యని యొ
క్కింతదూరం బరిగి యవ్వలం జన నలవి గాక యచ్చటం బడి పొరలుచు నసు
వులు విడుచుహయంబులును వాఁడిగలగుండలాగ్రంబులు జళిపించుచు వీరా
వేశంబునం దెగవ్రేయ గమకించు నెడ సింహనఖశిలీముఖంబుల నుత్తమాం
గంబులు దెగి క్రిందం బడియున్నహయకళేబరంబులమీఁదం బడి తోఁడన
వేల్పులు గురియించుమందారకుసుమవర్షంబులఁ బ్రాణంబులు వచ్చి వెంటనె
మింటి కెగసి కిన్నరరూపంబులం బ్రశంసించువీరు లగురాహుత్తులును రథిక
సారథులు మడిసిన వాహనంబు లవికలంబు లై తమయిచ్చకొలంది నీడ్చు
కొని పోవ మేదోమాంసమస్తిష్కపంకంబునం జిక్కువడి విశీర్ణంబులై నరథాం
గంబులతో నఱనఱ లైనయరదంబులును వాలుఁ బెఱికికొన సామర్థ్యంబు
లేక యొక్కింతసాహసంబున నానావిధప్రహరణంబులం బొడువ నుంకించు
నంతలోన నెడనెడ వాలికనారసంబులఁ జరణజానుజంఘాజఘనమధ్యోదరఖం
డంబులు తిలప్రమాణశకలంబు లై రాలిన రూపుసెడి పోవుపదాతులుం గలిగి
సంగరాంగణంబు దారుణదర్శనం బయ్యె నందు శిరంబులు కమఠంబులును
గజంబులు మకరంబులును కేశంబులు శైవాలంబులును భూషణరజంబిసుకయు
బాహువులు మీనంబులును గొడుగులు శతపత్రంబులును మేదోమాంస
మస్తిష్కంబులు పంకంబును శోణితంబు జలంబునుగా ననేకరుధిరనదులు ప్రవ
హించె నందుఁ గడుపులకు వెక్కసంబుగా మాంసంబు మెక్కి రక్తంబుఁ గ్రోలి
రుధిరప్రవాహమధ్యంబున నీఁదులాడుచు రామునివిక్రమంబుఁ బ్రస్తుతించుచు
ననేకభంగులం గ్రీడించుభూతప్రేతపిశాచశాకినీగణంబులకోలాహలంబు బహు
ళంబై యుండె నివ్విధంబున నొక్కముహూర్తంబులోనఁ గించిదవశిష్టంబుగా
రాక్షససైన్యంబుహాపుమాపితమంబువిరియందట్టి తేజరిల్లు మధ్యందినమార్తాం
డునకు రెండవమూర్తి యై రామభద్రుం డంతకంతకుఁ బ్రవర్ధమానంబు
లగునుత్సాహబలశౌర్యంబులు గలిగి తక్కినరాక్షసుల నిశ్శేషంబుగా వధి
యింపం గోరుచుండె నప్పుడు హతశేషు లగురాక్షసులు బెబ్బులిం గన్నలేళ్ల
చందంబున నమ్మహావీరుని కట్టెదుట నిలువ నోపక భీతచిత్తు లై కనుకనిం బఱ
చినం జూచి రోషభీషణుం డై దూషణుండు. 422

దూషణుండు మఱలిన రాక్షససైన్యమును బురికొల్పుట.

ఉ. ఏగతి మీకు నేఁ గలుగ నేటికి మర్త్యున కోడి పాఱ దో
ర్వేగము మీఱ నందఱము వీని వధింతము రంపటంపు ర
క్షోగణనాయకుండు పురికొల్పినఁ బంచసహస్రయోధు లం

తాగతకాలకింకరుల యట్ల చెలంగెడువార లుగ్రతన్. 423

చ. అతనిఁ బురస్కరించుకొని యందఱు రాముని జుట్టుముట్టి య
ద్భుతమునఁ లోపల ప్రదరభూరుహపట్టిసశూలవర్షము
న్వితతబలాఢ్యుఁ డై నరఘువీరునిపైఁ గురియింప నమ్మహా
ధృతికిఁ గలంగ కవ్విభుఁడు దారుణబాణహతిం దెరల్చుచున్. 424

క. వడగండ్లు గురియుదట్టపు, జడికిఁ జలింపనినగంబుచందంబున రా
ముఁడు సుస్థిరుఁ డై దైత్యుల, మడియింపఁగఁ బూని రోషమానసుఁడగుచున్.

క. కులిశంబుకంటె బెడిదము, గలవాలికనారసములఁ గడువడి దోషా
టులమీఁదఁ బఱపి బలుదూ,పులు దూషణు మేనఁ జొనిపె భుజబల మలరన్.

ఉ. తోడనె శత్రుదూషణుఁడు దూషణుఁ డంతకుభంగిఁ గ్రుద్ధుఁ డై
వేఁడిమి నివ్వటిల్ల రఘువీరునిఁ దాఁకఁగఁ దేరుఁ దోలి క్రూ
ర్వాఁడిశిలీముఖంబు లనివార్యగతి న్నిగిడించి రాక్షసు
ల్వేడుకతోడఁ జూడఁ దనవిక్రమ మంతయుఁ జూపె నుద్ధతిన్. 427

-రాముఁడు దూషణుని వధియించుట.-

చ. అతనిపరాక్రమంబునకు నల్క వహించి రఘుప్రవీరుఁ డ
ప్రతిహతశౌర్యుఁ డై యొకశరంబునఁ జాపముఁ ద్రుంచి నాల్గిటం
జతురత నశ్వము ల్దునిమి సారథి నొక్కట నర్ధచంద్రసం
హతిఁ దునుమాడి వానియుర మంటఁగ వ్రేసె నిషుత్రయంబునన్. 428

వ. ఇట్లు విరథుండును వికలసాధనుండును వినిహతాశ్వుండును వినిపాతితసారథి
యు నై యన్నిశాచరుండు గినిసి గిరిశిఖరసంకాశంబును రోమహర్షణంబును
గాంచనపట్టవేష్టితంబును దేవసైన్యాభిమర్దనంబును దీక్ష్ణశంకుసమాకీర్ణంబును
గాలాయసమయంబును బరవసోక్షితంబును వజ్రాశనిసమస్పర్శంబును బరగో
పురవిదారణంబును మహోరగసంకాశంబు నగు పరిఘంబుఁ గొని పరమసంక్రు
ద్ధుం డై రామున కభిముఖంబుగా రయంబునం బఱతెంచుసమయంబున నా
రఘువీరుండు రెండుకత్తివాతియమ్ముల సహస్తాభరణంబు లై నవానిభుజంబులు
రెండును ఖండించిన ఛిన్నహస్తుం డై నవానికరంబున నుండి యమ్మహాపరిఘంబు
శక్రధ్వజంబుపోలిక ధరణిపయిం బడియె నిట్లు శరనికృత్తబాహుండై దూష
ణుండు విషాణంబులు వెఱికినమహాగజంబుపోలికఁ బుడమిం గూలి తత్క్షణం
బున సంప్రాప్తమరణుం డయ్యె నతనిపాటుఁ జూచి సర్వభూతంబులు సాధు
వాక్యంబుల రామునిం బ్రశంసించి రంత. 429

ఉ. దూషణుపాటుఁ జూచి మదిఁ దొట్టినకోపము నెత్తికెక్కఁగా
రోషకషాయితాక్షు లయి రోఁజుచు దానవదండనాయకు
ల్భీషణభంగి ముగ్గు రతిభీకరు లొక్కట వీర్యవచ్ఛిరో

భూషణుఁ డై నరాఘవునిఁ బోర నెదిర్చిరి సాహసంబునన్. 430

వ. ఇట్లు మహాకపాలుండును స్థూలాక్షుండును బ్రమాథియు నను వారలు మృత్యుపాశావపాశితు లై తీవ్రవేగంబునం దాఁకి. 431

చ. అలుక మహాకపాలుఁ డొకయాయసశూలము స్థూలనేత్రుఁ డు
జ్జ్వలదురుపట్టిసంబు నొకశాతపరశ్వథముం బ్రమాథి ని
ట్టలముగఁ బూని వ్రేసి వికటంబుగ నార్చిన నారఘూత్తముం
డలయక సాధనత్రయము నస్త్రముల న్వడిఁ ద్రుంచి కెండియున్. 432

—రాముఁడు మహాకపాల స్థూలాక్ష ప్రమాథు లనుమువ్వురరాక్షసులఁ జంపుట—

చ. అనుపమహేమభూషితశరాహతి వేగ మహాకపాలునిం
దునిమి ప్రమాథిని న్వడఁదతూపున గీటణఁగించి స్థూలనే
త్రుని విషదిగ్ధబాణమునఁ ద్రుంచిన నయ్యసురత్రయంబు వ
జ్రనిహతపర్వతత్రయముచాడ్పునఁ గూలె ధరాతలంబునన్. 433

ఉ. అంచితవిక్రముం డగుమహారథవర్యుఁడు రాముఁ డంతటం
బంచసహస్రరాక్షసులఁ బంచసహస్రశిలీముఖంబులం
బంచత నొందఁ జేసి కలభంబులఁ జంపినసింగమట్లు నే
త్రాంచలదీధితు ల్నిగుడ నద్భుతవైఖరిఁ బొల్చి యుండఁగన్. 434

వ. అమ్మహావీరునిపరాక్రమప్రకారంబుఁ జూచి సహింపక మృతుం డైనదూషణుం దలంచుకొని దుఃఖితుం డై ఖరుండు వీరావేశంబున. 435

ఉ. గ్రద్దనఁ గోపవేగమునఁ గన్నుల నగ్నికణంబు లొల్కఁగ బ
న్నిద్దఱ దండనాథుల నహీనబలాఢ్యులఁ జూచి మీర లీ
ప్రొద్దున నేగి మానవునిపొంక మడంచి వధించి రండు వే
సుద్దులఁ జెప్ప నేల మనశూరత లెన్నటి కింకఁ గాల్పనే. 436

వ. అని బరవసంబుఁ జేసి పురికొల్పి తానును రభసాతిశయంబున రామున కభిముఖంబుగా రథంబుఁ దోలించె నంత ఖరాసురప్రేరితు లై శ్యేనగామియుఁ బృథుగ్రీవుండును యజ్ఞశత్రుండును విహంగముండును దుర్జయుండును గరవీరాక్షుండును బరుషుండును గాలకార్ముకుండును మేఘమాలియు మహామాలియు సర్పాస్యుండును రుధిరాశనుండు ననుద్వాదశమహావీరులు హతశేషు లైనసైనికులం గూడుకొని శీఘ్రవేగంబున ఖరునిం దలకడచి శరాసారఘోరంబుగాఁ గవిసి నానావిధహేతివ్రాతంబులఁ బరఁగించుచు రౌద్రప్రకారంబునం జుట్టుముట్టి యట్టహాసంబుఁ జేసిన. 437

—రాముఁడు పన్నిద్దఱు రక్షోవీరులఁ జంపుట.—

శా. ఆపద్వ్యాప్తకులుండు రెండవనిదాఘాదిత్యుఁ డై చాపవి
ద్యాపాండిత్యము దోఁప సాధుముఖపద్మంబు ల్వికాసస్థితి

న్దీపింప ఘనచండకాండకిరణోద్రేకంబునం గ్రవ్యభు
గ్రూపధ్వాంతముల న్హరించె దిశల న్బూర్ణప్రభ ల్గ్రమ్మఁగన్. 438

ఉ. వెండియుఁ జండకాండములు వే పదివేలు నిగిడ్చి యొక్కటన్
గొండలఁ బోలు రాక్షసుల నూఱ్వుర నూఱుశిలీముఖంబుల
న్మెండుగ నొక్కదైత్యవరుని న్వధియించుచుఁ జిత్రభంగి నా
ఖండలుఁ డద్రిశృంగములకైవడి నందఱఁ గూల్చె వ్రేల్మిడిన్. 439

క. పదిరెండునారసంబులఁ, బదపడి రాఘవుఁడు వేగ పన్నిద్దఱ బె
ట్టిదు లగుసేనాధ్యక్షులఁ, గదనంబునఁ దునిమి పనిచెఁ గాలునిపురికిన్. 440

చ. అనిమొన రామచండవిశిఖాహతిఁ గూలినముక్తకేశభృ
ద్దనుజులచేఁ బినద్ధ యయి ధాత్రి కుశాస్తృత యైనవేదిచొ
ప్పునఁ దనరారె నవ్విపినభూస్థలి శోణితమాంసపంక యై
ఘనతరనారకస్థలముకైవడి నొప్పుచు నుండె నత్తఱిన్. 441

చ. కదనమునందు రాఘవుఁ డఖండపరాక్రమదుర్నివారుఁ డై
మదమున నొక్కఁ డయ్యు నరమాత్రకుఁ డయ్యుఁ బదాతి యయ్యు ని
ట్లదయతఁ దచ్చతుర్దశసహస్రనిశాటుల నశ్రమంబునం
జిదురుపలై ధరం దొరఁగఁ జేసె సుర ల్ముద మంది చూడఁగన్. 442

క. ఖరుఁడును ద్రిశిరుం డనువా, రిరువురు రాక్షసులు దక్క నెల్లసురారుల్
ధరణీధరములక్రియ నుర్వరఁ గూలిరి కదనమందు రామునిచేతన్. 443

వ. ఇట్లు మహావాతవేగంబునం గూలుమహీరుహంబులచాడ్పున నిశాచరు లం
దఱు రఘువీరునికాండప్రకాండంబులం దెగి నిశ్శేషంబుగా మడిసినం జూచి
ఖరుండు కోపాటోపంబున రామునియాటోపంబుఁ జూచి సహింపక రథంబుఁ దో
లించుకొని యమ్మహారథున కభిముఖంబుగా నడరిన నతని నివారించి వాహినీ
నాయకుం డగు త్రిశిరుం డిట్లనియె. 444

సీ. అసురేంద్ర యింత సాహస మేల మరలుము రాక్షసాంతకుఁ డైనరాముఁ గదిసి
వాఁడిమి గలనాదువేఁడిమిఁ జూపి దివ్యాస్త్రసంహతి వాని నని వధించి
యనిలోన నింతకు మును వానిచేఁ జచ్చినట్టివారికిఁ బ్రీతి పుట్టఁ జేసి
వచ్చెద నది గాక వాఁడు నాచేఁ జచ్చెనేని క్రమ్మఱ నిజస్థానమునకు
తే. నరుగు మటు గాక యే నమ్మహాత్ముచేత, నిపుడు రణమునఁ జచ్చితినేని మరల
యుద్ధమున కీవు దొడరి నాయున్నలికము, తీర్చి పుచ్చుము పెక్కేల ధీరవర్య.

రాముఁడు త్రిశిరునిఁ జంపుట.

వ. రాక్షసేంద్రా యే నాయుధంబు ముట్టి ప్రతిజ్ఞఁ జేసెద సర్వప్రకారంబుల రాక్ష
సులకు వధ్యుం డైనరాముని వధించెద రామునిచేత నే నైనను నాచేత రాముం
డైనను బంచత్వంబు నొందుట సిద్ధంబు నీవు వెనుకకుం జని రణోత్సాహంబున

నిలువంబడి యొక్కముహూర్తంబు జయాపజయనిర్ణాయకుండ వగు మని బర వనంబుగాఁ బలికిన ఖరుండు వానికి రణంబున కనుజ్ఞ యొసంగి రయంబున రాముని కనభిముఖంబుగా నడిచె నంతఁ ద్రిశిరుండు కృతాభ్యనుజ్ఞుం డై జవనాశ్వసంయుతం బగుకనకరథం బెక్కి త్రిశృంగం బగుపర్వతంబుచందంబున శరీరంబు గ్రాల సలిలధారలు గురియుమేఘంబుకై వడి శరవర్షంబు గురియుచు మూఁడునోళ్ల ముల్లోకంబు లప్పళించుటకుం జాలి జలార్ద్రదుందుభినాదసదృశనాదంబున గర్జించుచు రభసాతిరేకంబుగాఁ గవిసిన నతని యుట్టహాసంబుఁ జూచి రఘువీరుండు బహుప్రకారంబు లగుశరపరంపరల వానిబాణంబులనన్నింటినిం జదియ నడంచుచుఁ బ్రచండభంగి మార్కొనిన నయ్యిద్దఱకు భీషణం బగుసంగ్రామం బయ్యె నివ్విధంబునం దలపడి రాముండును ద్రిశిరుండును సింహమదేభంబులచందంబున వాయువలాహకంబులపగిది వాసవవృత్రుల విధంబున గరుడపన్నగంబులమాడ్కిఁ బరస్పరహుంకారంబుల నితరేతర ధిక్కారంబుల నన్యోన్యతిరస్కారంబులఁ గొండొకసేపు కన్నులపండువుగా ఖండనంబుఁ జేసి రాసమయంబున. 446

తే. కనలి త్రిశిరుండు తీవ్రాంబకత్రయంబు, కౌసలేయునినొసలు దాఁకంగ నేయ
నించుకై నను దలఁకక హీనబలునిఁ, గా నెఱిఁగి వానితోడ నిట్లనుచుఁ బల్కె.

ఉ. ఓరి నిశాట యెవ్వనిమహోగ్రశరంబులు మన్నిటాలనుం
దారయఁ బుష్పసన్నిభము లై మృదువై ఖరిఁ బొల్చె నట్టినీ
శూరత తెల్లమయ్యె నిఁకఁ జూపఁగ నేటికి మచ్ఛిలీముఖా
సారము గ్రమ్మఱం గొనుము చయ్యన నీపని చక్క నయ్యెడిన్. 448

క. అని యుల్లసమాడుచు న, ద్దనుజునివక్షమున ఘోరతరకాలవ్యా
ళనిభశరచతుర్దశకము, సునిశితగతిఁ జొనిపి యంత సొలయక మరలన్. 449

మ. ఒకబాణంబున వానిచేతిధను వత్యుగ్రంబుగాఁ ద్రుంచి వే
ఱొకనారాచచతుష్టయంబునఁ దురంగోత్సేకము న్మాన్చి త
క్కక సూతు న్దృఢసాయకాష్టకమున న్ఖండించి తత్కేతనం
బొకకాండంబున రెండుగాఁ దునియ లై యుర్విం బడం గూల్చినన్. 450

వ. ఇట్లు విరథుం డై రథంబువలన రయంబునఁ బుడమికి దాఁటి పాదవిన్యాసంబున భూమి గ్రక్కదలఁ బఱతెంచు చున్నత్రిశిరునిశిరత్రయంబు బాణత్రయంబున ఖండించిన నవి మహాఘాతపతితంబు లగుతాళఫలంబులచందంబున ధరణిం బడియె వానికళేబరంబు శిఖరరహితం బైనపర్వతంబు పగిది నుర్విం గూలె నిట్లు త్రిశిరునిం దెగటార్చి రఘువీరుండు వృత్రాసురునిం దునిమినపురందరుని కై వడి నొప్పు చుండె నంత హతశేషు లగురాక్షసులు బెబ్బులిం గన్నహరిణంబులకై వడిఁ ద్రస్తచిత్తు లై కనుకనిం బఱచి ఖరునిమఱువు సొచ్చి రతండు

హతులైనదూషణత్రిశిరులనుదక్కినచతుర్దశసహస్రరక్షోవీరులందలంచుకొని శోకరోషంబులు మనంబున ముప్పిరిగొన రాక్షసులపాలిటియంతకుం డై కన్నులకుం దేఱిచూడ రాక వెలుంగుచున్నరాముని విలోకించి మనంబునం దలంకుచు విమానాగ్రభాగంబులనుండి పెక్కువిధంబుల రామునిఁ బ్రశంసించు దేవర్షిమహర్షులయుత్సాహంబుఁ గనుంగొని క్రమ్మఱరోషంబుఁగల్పించుకొని వాసవుం జేరునముచిచందంబున స్కందునిం జేరుతారకునిపోలికసంరంభవిజృంభితుం డై రామునిం గదియ వచ్చి. 451

మ. బలవచ్చాపము నెక్కు వెట్టి గుణశబ్దంబు ల్ప్రచండంబుగాఁ
జెలఁగ న్నిక్షితభంగి ఘోరతరసంస్ఫీతోగ్రనారాచము
ల్చల మొప్ప న్నిగిడించి సర్వదిశలు న్సర్వంసహాకాశము
ల్గలయం జేసి నిమేషమాత్రమున దుర్లక్షంబుగాఁ గప్పినన్. 452

రామఖరాసురద్వంద్వయుద్ధము.

చ. కని రఘువల్లభుండు ఘనకార్ముకము న్సవరించి శింజినీ
ధ్వనులు సెలంగ దుర్విషహదారుణకాండము లొక్కరీతిగా
మునుకొని దీప్తవహ్నికణము ల్చెదర న్నిగిడించి యాకసం
బనుపమలీల నుగ్రగతి నస్త్రమయంబుగఁ జేసె గ్రక్కునన్. 453

క. ఖరరాఘవవిసర్జితభీ, కరతరబాణములచేత గగనంబు నిరం
తర మయ్యె సర్వదిశలును, బరిపూర్ణము లయ్యె ఱెల్లు పఱచినభంగిన్. 454

క. నిరుపమసాయకధారా, పరివృతుఁ డై యినుఁడు గానఁబడ కున్కిఁ బ్రజ
ల్వెఱవేది రేయిఁ బవ లే, ర్పఱుపఁ దరముగాక తెచ్చవడి యుండి రిలన్ 455

వ. మఱియు నిట్లు తలపడి యితరేతరజయకాంక్షులం బోరునప్పుడు. 456

క. ఆలమున ఖరుఁడు రాముని, నాళీకవికర్ణనిశితనారాచముల
న్వాలికతోత్రంబుల శుం, డాలంబును బోలె నలమటం బ్రహరించెన్. 457

క. ఖరుని రథస్థుని రాక్షసవరుని ధనుర్ధరునిఁ బర్యవస్థితు భీతో
త్కర మపుడు పాశధరుఁ డగు, పరేతపతినట్ల చూచి భయ మందె రహిన్. 458

వ. ఇట్లు దుష్ప్రధర్షుం డై ఖరుండు. 459

శా. ధీరుం బౌరుషపర్యవస్థితు సముద్దీప్తప్రతాపు న్మహా
శూరు న్సింహపరాక్రము న్సకలరక్షోభీము రాము న్బలో
దారుం గాంచి హుతాశను న్మిడుత చందాన న్వెస న్డాసి దు
ర్వారాజిశ్రమహీనసత్త్వుఁ డనుచు న్భావించి సంరంభి యై. 460

క. తనచేతిబలువు గన్పడ, ఘనశరమున రాముచేతికార్ముకగుణముం
దునిమి వెస సప్తశరములు, సునిశితగతి నతని మేనఁ జొనిపెం బెలుచన్. 461

క. అట ఖరకార్ముకముక్త, స్ఫుటనారాచములచేత భూమీశునికం

కట మప్పుడు కుబుసముక్రియఁ, బటురయమునసడలి పుడమిఁబడియెంగడిమిన్.

ఉ. అంతట రాక్షసుండు ప్రళయాంతకుఁడై వడిఁ బేర్చి జానకీ
కాంతునిమీఁద సాయకసహస్రము లొక్కట నేసి వేగ రో
దోంతర మెల్ల నిండ వడి నార్చుచు సర్వసుపర్వ లాత్మలో
నెంతయు నుమ్మలింప ఖరుఁ డేపునఁ దోఁచె మహోగ్రమూర్తియై. 463

వ. ఇట్లు ఖరబాణపీడితుం డై శత్రునిబర్హణుం డగు రాముండు విగతధూముం డగు వైశ్వానరునిచందంబునం దేజరిల్లుచు నంతకంత కుత్సాహంబు రెట్టింపఁ దొల్లి తనకుఁ గుంభసంభవుం డిచ్చినగంభీరనిర్ఘోషం బగువైష్ణవచాపంబు లీలం గేల నందుకొని వైరివినాశనార్థంబు సముచితంబుగా సజ్యంబుఁ జేసి గుణప్రణాదంబు సేయుచు. 464

ఉ. కాంచనపుంఖకాండము లఖండగతి న్నిగిడించి వేగ న
క్తంచరుకాంచనధ్వజము నప్పక ద్రుంచిన సర్వదేవత
ల్పంచినఁ బద్మబాంధవుఁడు వ్రాలినకైవడిఁ గూలె నేలఁ ద
త్కాంచనదీధితు ల్నిఖిలకోష్ఠములయందు వెలుంగుచుండఁగన్. 465

ఉ. వెండియుఁ గ్రుద్ధుఁడై ఖరుఁడు వేగమె మర్మవిదుండు గావునం
గాండచతుష్టయప్రహతి గాత్రము నొవ్వఁగ జేసి యార్చె ను
ద్దండరయంబున న్సమదదంతిని దారుణతోమరంబుల
న్దండిగ వ్రేటు పెట్టినవిధంబునఁ గోపరసోగ్రమూర్తియై. 466

క. ఖరకార్ముకనిస్సృతభీ, కరమార్గణవిద్ధుఁ డగుచుఁ గాకుత్స్థకులా
భరణుఁడు రుధిరాప్లుతుఁ డై, కర మురుదుగ రోహణాద్రికైవడి నలరెన్. 467

వ. ఇట్లఖండసంధ్యారాగమండలపరివృతమార్తాండుండుంబోలె దివ్యప్రభాభాసమానుం డై రామభద్రుం డవష్టంభంబున. 468

శా. లోకాలోకగుహాల్ప్రతిధ్వను లిడన్ లోకాధికుం డంత న
స్తోకజ్యానినదంబుఁ జేసి శరము ల్దోడ్తోడ సంధించి వి
ల్లాకర్ణాంతముగా వడిం దిగిచి ప్రత్యాలీఢపాదస్థుఁ డై
పేఁక న్వేఁక నిగిడ్చె బాహువిలసద్వేగంబు దీపింపఁగన్. 469

రాముఁడు ఖరుని విరథునిఁ జేయుట

వ. ఇట్లమోఘశరపాతనంబున ఖరునియాటోపం బడఁగించి వెగడు పఱచి క్రమ్మఱ నాఱుసాయకంబులు నిగిడించి యొక్క వెడందవాతియమ్మున వానిశిరంబును రెండుక్షురప్రంబుల వానిభుజశిఖరంబులును మూఁ డర్ధచంద్రబాణంబుల వానివక్షంబు నొప్పించి వెండియు సూర్యమరీచికల్పంబు లైనపదుమూఁడు నారసంబులు ప్రయోగించి యొక్కవిశిఖంబున యుగంబు నఱికి నాలుగు శిలీముఖంబుల ఘోటకంబుల గీటణఁగించి యాఱవశరంబున సారథిశిరంబు ఖం

డించి మూఁడంబకంబులఁ గూబరంబును రెండమ్ముల నొగలును బండ్రెండవ మార్గణంబున ఖరునిచేతికార్ముకంబును బఱియలువాపి వజ్రసంకాశంబైనపదుమూఁడవపృషత్కంబున ఖరునిశిరంబు దూల నేసిన నాఖరుండు భగ్నచాపుండును విరథుండును హతాశ్వుండును హతసారథియునై కాలదండంబుఁ బోనిగదాదండంబుఁ బుచ్చుకొని ధరణిగతుండై నిలువంబడి యుండె నప్పుడు రామునిపరాక్రమప్రకారం బాలోకించి యంబరంబునం బన్నినమహర్షి దేవతాముఖ్యులు విమానాగ్రభాగంబుల నుండి ప్రాంజలులై పరమానందంబునఁ బ్రశంసించు చుండిరి యిత్తెఱంగున విరథుండై గదాపాణియై యున్నఖరునిం జూచి రాముండు మృదుపూర్వకంబుగాఁ బరుషవాక్యంబున నిట్లనియె. 470

రాముఁడు ఖరుని నానావిధంబుల దూఱుట.

ఉ. స్యందనవారణాశ్వభటసంకులమైనబలంబుతోడ నీ
కందునఁ జేరి నీవు చిరకాలమునుండి సమస్తసాధులం
గొందల మందఁ జేసితివి క్రూరుఁడు పాపవిచారకుండు గ
ర్వాంధుఁడు సర్వలోకవిభుఁడైనను ధాత్రి మనంగ నేర్చునే. 471

క. లోకవిరుద్ధం బగుపనిఁ, గైకొని గావించునట్టికఠినుని విషద
ర్వీకరమునట్ల బలియుఁడు, ప్రాకటముగఁ జంపు ఘనకృపారహితుండై. 472

తే. మఱియు నెవ్వాఁడులోభకామములచేత, దురితమొనరించు నతఁడు తద్దురితఫలము
వెస ననుభవించు బ్రాహ్మణివృష్టిశిలను, మ్రింగి పంచత్వమొందినభంగి నసుర.

క. ఘనదండకావనంబున, మునుకొని వసియించి యున్నపుణ్యచరితుల
న్మునుల వధియించి యేఫల, మనుపమగతి ననుభవింప నాసించితివో. 474

క. జనదూష్యులు క్రూరులు భూ, తనింద్యులు సమర్థులయ్యుఁ దడవుగ నిలపై
మన నేరరు చర్చింపఁగ, దనుజాధమ శీర్ణమూలతరువులమాడ్కిన్. 475

తే. కర్తయగువాఁడు నిజఘోరకలుషకర్మ
ఫల మవశ్యంబు నొందు సుపర్వవైరి
యరయఁ గాలంబు సంప్రాప్తమగుచు నుండ
నగము లార్తవ మగుప్రసూనమును బోలె. 476

ఆ. ఖలుఁడు తనదుఘోరకలుషకర్మఫలంబు, నపుడె తోడుతోడ ననుభవించు
వెలయ భుక్తఘోరవిషమిశ్రితోదన, ఫలమునట్ల దివిజకులవిరోధి. 477

తే. ఘోరపాపంబు సేయుచు మీఱి లోక, మునకు హింసఁ గావించెడుదనుజవరులఁ
బట్టి వధియించుటకు నేను భరతు నాజ్ఞ, దుష్టదైత్యసమాసాదితుండ నైతి.

తే. దానవాధమ వేయేల తడయ కెపుడు, శిష్టులకు విప్రకారంబు సేయునట్టి
నిన్ను రణరంగమునఁ జంపి నేఁడు మొదలు, సకలభువనంబులను మేలు సంఘటింతు.

తే. కడిమి దీపింప నాచేత విడువఁబడిన, హేమభూషితవిశిఖంబు లిపుడె నిన్నుఁ

గలఁచి వల్మీకమును బన్నగములుఁ బోలెఁ, జయ్యన ధరిత్రి భేదించి చనఁగఁ గలవు.
తే. పుణ్యతర మగు దండకారణ్యమందు, శిష్టవిద్వేషి వైన నీచేత మున్ను
పరఁగ భక్షింపఁబడినట్టి పరమమునుల, నిపుడె గలసెదు సైన్యసహితుఁడవగుచు.
క. దనుజాధమ మచ్ఛరముల, ననిలోఁ దెగి నిరయగతికి నరిగెదు నిన్ను
న్మను నీచే బాధితు లగు, ముని లిప్పుడు చూడఁగలరు ముదితాత్మకు లై. 482
ఉ. ఓరి దురాత్మ యేటి కిపు డూరక యుండఁగ నీదు శౌర్య మిం
పారఁగఁ జూపు నీ శిరము నద్భుతతాలఫలంబు క్రై వడి
న్ధారుణిఁ గూల్తు నంచు సముదగ్రత రాఘవుఁ డిట్లు వల్క నా
ఘోరనిశాటుఁ డిట్లనియెఁ గ్రోధము దోఁపఁగ రక్తనేత్రుఁడై 483

ఖరుండు రాముని నధిక్షేపించుట.

ఉ. కొందఱఁ బ్రాకృతాసురులఁ గూల్చితి నం చొకపోటుబంట వై
డెందమునందుఁ బొంగుచు వడి న్నుతియించుకొనంగ నేల గో
త్రం దగ వీర్యవంతులు నరర్షభ లద్భుతసత్త్వయుక్తు లీ
చందమున న్స్వతేజమును సంస్తుతి సేయుదు రే నినుం బలెన్. 484
క. లోకంబున నకృతాత్ములు, ప్రాకృతులును రాజవంశపాంసను లగువా
రే కరణి రజ్జు లాడుదు, రా కరణి నిరర్థకోక్తు లాడఁగఁ దగునే. 485
క. అని మొన ఖరుఁడు తనుఁ దా, వినుతించుకొనంగఁ దగునె వెఱ్ఱితనమున
న్నిను మాత్మస్తుతి నాశ, మ్మొనరించుం గాదె విక్రమోద్ధతి కెల్లన్. 486
వ. మఱియు మృత్యుకాలసంకాశం బైనసమరంబు సంప్రాప్తం బగుచుండ నప్ర
స్తవంబునందుఁ గులీనత్వంబుఁ బ్రకటించుచు నెవ్వం డాత్మప్రశంసఁ గావించు
కొను వహ్నిబుద్ధిచేత నగ్నివర్ణం బైన యుపలంబును సంస్పృశించు పురుషుని
కొఱ కనుపలభ్యమానోష్ణస్పర్శం బైననయ్యుపలంబుచేతఁ దనయనగ్నిత్వం
బెట్లు నిదర్శితం బయ్యె నట్లు నీచేత నిన్ను వీరుం డని తలంచెడు నాకొఱ
కీయాత్మప్రశంసచేత నీయవీరత్వనామకలఘుత్వంబు నిదర్శితం బయ్యె నది
యునుం గాక సువర్ణశోధకాగ్నిచేత సంతప్తం బైనసువర్ణప్రతిరూపాదకూ
టంబుచేఁ గార్ష్ణ్యరూపం బైనలఘుత్వంబు నిదర్శితం బైనచందంబున నీచేత
నీవికత్థనంబున నశూరత్వరూపకం బైనలఘుత్వంబు సర్వప్రకారంబుల నిద
ర్శితం బయ్యె నని పలికి వెండియు నిట్లనియె. 487
క. బహుధాతువిచిత్రిత మగు, మహీధ్రమును బోలె నన్ను మది నచలునిఁగా
రహిఁ బరికింపుము దోర్బల, రహితునిఁగాఁ జూడవల దరాతిప్రవరా 488
తే. తివిరి ముల్లోకములును వధింపఁ బూని, దండము పరిగ్రహించిన దండధరుని
పోల్కి నని నిన్ను వధియింపఁ బూని గదను, జేకొని గడంగినాఁడ వీక్షింపు నన్ను.

ఆ. ప్రొద్దు గ్రుంక వచ్చె సుద్దులు వే యేల, కదనమునకు హాని గలుగ కుండ
నేఁడు నిన్నుఁ జంపి నీచేతఁ జచ్చిన, దితిజనరులవగపు దీర్చి పుత్తు. 490

రాముఁడు ఖరప్రయుక్తగదను ఖండించుట.

వ. అనియివ్విధంబునఁ బెఱుసనక మఱుమాటలాడి ఖరుండు సంరంభవిజృంభితుం
డై కాలదండసదృశం బైనగదాదండంబు జరజరం ద్రిప్పి కనకవలయరోచులు
దిశలం జెదర దీప్తాశనింబోలె రామునిపై వైచిన నది మహావేగంబున వృక్షగు
ల్మంబులు భస్మంబు గావించుచు నంతరిక్షంబునఁ బఱతెంచు చున్నం గనుం
గొని యారఘువీరుండు నిశితాగ్రంబు లైనబహువిధశరంబు లడరించి దాని ఖం
డించిన మృత్యుపాశసంకాశ యగునమ్మహాగద రాముకార్ముకముక్త కాండంబుల
చేత విభిన్న యై మంత్రౌషధబలంబులచేతఁ బుడమిం బడినవ్యాళికరణి ధరణి
తలంబునం బడియె నిట్లు ఖరాసురప్రయుక్తం బైనగదాదండంబు చూర్ణంబు
చేసి ధర్మవత్సలుం డగురాముండు స్మయమానుం డై వెండియు ససంరంభంబు
గా వాని కి ట్లనియె. 491

ఉ. ఓరి నిశాట నీ దగుబలోద్ధతి సర్వముఁ జూపి తిట్లు నీ
శూరతయు న్గభీరతయు సొంపును బెంపును దెల్ల మయ్యె బ
ల్గారుణభంగి నొప్పగద తప్పక మచ్ఛితసాయకాహతి
న్ధారుణిఁ గూలె నీకు ఖరనామము గల్గుట వ్యర్థమే కదా 492

ఆ. నేఁడు నిన్నుఁ జంపి నీచేతఁ జచ్చిన, దితిజనరుల వగపుఁ దీర్చి పుత్తు
ననుచు నీవు కడఁక నాడినవాక్యంబు, వ్యర్థ మయ్యెఁ గద నిశాటవర్య. 493

క. వధ్యుఁడవు నీచుఁడ వస, న్మిథ్యావృత్తుండ వైన నీజీవితముం
వధ్యము హరియింతు సుధ న, సాధ్యుం డగుగూఢచరణశత్రుఁడుఁ బోలెన్

తే. దానవాధమ యిపుడు మద్బాణనిహతి, భిన్నకంఠుండ వై కూలియున్ననీదు
ఫేనబుద్బుదశోభితం బైనరుధిర, మిన్నమహిదేవి గ్రోలు నందమ్ము గాఁగ. 495

తే. స్రస్తపిన్యస్తభుజుఁడవు సాంద్రపాంసు, గూషితుండవై దుర్లభయోష నట్ల
పృథ్విఁ గౌఁగిటఁ జేర్చి నిద్రింపఁ గలవు, యడిచి పడ నేటి కింతలో నమరవైరి.

తే దానవాధమ నీవు మద్బాణహతివి, దారితానయవుండ వై ధాత్రిఁ గూలు
చుండ నేఁ డాదిగా నొప్పుచుండు నీయ,రణ్య మశరణ్యకులకు శరణ్య మగుచు.

క. ఇమ్మున నేఁడు జనస్థా,న మ్మస్మద్బాణపాతనమున హతస్థా
న న్మగు చుండఁగ మునులు వ, నమ్మునఁ జరియించెదరు ఘనమ్ముగ సుఖులై.

క. హతబాంధవ లై బాష్పా, ప్లుతలోచన లై విషణ్ణముఖు లై రక్ష
స్సతు లన్యభయావహముగ, గతి లేక భయార్తి నేడ్వఁ గల రిఁక మీఁదన్

తే. ఏసతుల కిట్టినీవు ప్రాణేశ్వరుండ, వట్టియమహాపరులభార్య లంద ఱాత్మ
హర్షములు దక్కి విధవలై యనుదినంబు, నుచితశోకరసజ్ఞలై యుందు రిఁక.

తే. ఓరి క్రూరాత్మ తుచ్ఛాత్మ యోరి నీచ, ఘోరి బ్రాహ్మణకంటక యోరి ఖలుఁడ
పలుకులింకేల యిపుడు మద్బాణనిహతిఁ, గూల్చిపుచ్చెదశమనునికూటమునకు.

రాముఁడు ఖరాసురునిఁ జంపుట.

వ. అని బహుప్రకారంబుల ధిక్కరించి పలుకుచున్న రామునివచనంబులు విని రోషావేశంబున వికటభ్రుకుటిదుర్నిరీక్షుండై ఖరుండు ఖరతరస్వనంబున నట్టహాసంబు సేయుచు మహాగజంబునకు మదం బెక్కించినచందంబునఁ గ్రూరవాక్యంబుల నాకు రోషోత్పాదనంబుఁ గావించితివి ప్రాణసంశయకరం బగుసమరంబునందును నిర్భయంబున నచలితుండవై మృత్యువశ్యుండవై తినని యెఱుంగక పలుకందగని మాటలాడెదవు కాలపాశపరిక్షిప్తు లగుపురుషులు నిర్గతజ్ఞానేంద్రియాంతఃకరణవ్యాపారులై కార్యాకార్యంబు లెఱుంగక వర్తింతు రిప్పుడు నిన్నుఁ బరిమార్చెదఁ జూడుమని పలికి యచ్చేరువ నున్నయొక్క విశాలసాలంబు నిరీక్షించి ప్రహారార్థంబు కరంబుల దాని నుత్పాటించి తెచ్చి రోదోంతరంబు నిండ వికటధ్వనిఁ గావించుచు సందష్టదశనచ్ఛదుండై దీనం జావు సిద్ధించు నని సంరంభంబున వీచి వైచిన నారాముండు నిశాతసాయకంబు లడరించి యమ్మహీరుహంబు నింతింతలు తునుకలై ధరణిం బడ ఖండించి యరివధార్థంబు తీవ్రం బగురోషం బంగీకరించి చిఱుచెమట మొగంబునం గ్రమ్మ దేఱ రక్తాంతలోచనుండై ప్రచండకాండసహస్రంబున వానిసర్వమర్మంబులు గలంచె నప్పుడు ప్రస్రవణాఖ్యపర్వతంబువలనం దొరఁగుసెలయేళ్లపోలిక వానిశరీరంబుననుండి బహుప్రకారంబుల రక్తధారలు స్రవించుచుండె నిట్లు జర్జరితాంగుండై విహ్వలుండై రుధిరగంధోపలక్షితుండై మత్తుండై ఖరుండు నానావిధాట్టహాసంబులు గర్జించుచుఁ గదిసినం జూచి రఘువల్లభుండు శస్త్రసంధానావకాశార్థంబు త్వరితపాదవిక్షేపుండై తిర్యగ్గమనంబున నొక్కింత వెనుకకుం జని త్వరితవిక్రమాటోపుండై. 502

క. తడవేల యీదురాత్మునిఁ, గడురయమునఁ ద్రుంచి దండకనివాసులకుం
బడయంగ రానిసౌఖ్యము, లొడఁగూర్చెద మునులఁ బ్రోచు టొప్పగుఁ గాదే.

మ. అని చింతించి ఖరు న్వధించుటకు నన్యబ్రహ్మదండం బొకో
యనఁ జెల్వొందుచుఁ దీక్ష్ణమై శుచినిభం బై గోత్రభిద్దత్తమై
ఘనమై యొప్పుప్రచండకాండము సముగ్రక్రోధుఁడై కూర్చి జ్యా
ధ్వనిఁ గావించుచు వేగ దీసి విడిచెన్ సర్వంబు శోభిల్లఁగన్. 504

వ. ఇట్లాకర్ణపూర్ణంబుగాఁ దిగిచి విడిచిన. 505

క. రామధనుర్ముక్తం బగు, భీమాస్త్రం బపుడు వేయిపిడుగులమ్రోఁత
న్వ్యోమమున నేగి గ్రక్కున, తామసుఁ డగుఖరుని యురముఁ దప్పక సొచ్చెన్.

తే. అంబకము వక్షమునఁ దూఱునంతలోనఁ, దత్కృశానునిచే వినిర్దగ్ధుఁ డగుచు

ఖరుఁడు ధరఁ గూలె మును శ్వేతగహనమందు, హరదృగగ్నిదగ్ధాంధకాసురునికరణి.

—వనమున నుండుఋషులు రామునిఁ బ్రస్తుతించుట.—

క. కులిశముచే వృత్రుని క్రియ, జలఫేనముచేత నముచిసరణి నశనిచే
బలునిగతి రామశరమున, బలవంతుఁడు ఖరుఁడు ధరణిఁ బడియె నిహతుఁడై.

వ. ఇట్లు పాపాత్ముండగు ఖరుండు గూలినయనంతరంబ మహర్షి బ్రహ్మర్షి దేవర్షి రాజర్షిగణంబులు పరమానందంబున నచ్చటికిం జనుదెంచి విజయలక్ష్మీవిరాజమానుండై యున్నరఘువీరుని సముచితంబుగా సందర్శించి మృదుమధుర వాక్యంబున నిట్లనిరి. 509

క. అనఘాత్మ యేతదర్థము, పసినడి సురనాథుఁడైన పాకారి రహిన్
ఘన మగుశరభంగాశ్రమ, మునకుం జనుదెంచె మున్న మునులకుఁ జెప్పన్.

క. అనివార్యశౌర్యులగు నీ, దనుజులఁ జంపుటకు నీవు తపసులచేత
న్వినయోపాయంబునఁ జయ్యన నానీతుండవైతి నధిప యిచటికిన్. 511

క. జనవర నీచే నిప్పని, మునుకొని సుద్రక్షణార్థము కృతంబయ్యెన్
ఘనదండకములఁ దాపస, జనములు సుఖధర్మయుక్తిఁ జరియింతురిఁకన్. 512

చ. అని కొనియాడుచున్నసమయంబునఁ జారణసంయుతంబుగా
ననిమిషసిద్ధసాధ్యవరు లచ్చటికిం జనుదెంచి చిత్రము
న్ఘనకుతుకంబు హర్షముఁ బెనంగొన దుందుభినాద మొప్ప న
య్యినకులవర్యుమీఁదఁ గురియించిరి కల్పకపుష్పవర్షముల్. 513

క. ఆడిరి రంభాదులు దగఁ, బాడిరి గంధర్వవరులు పరమమునీంద్రు
ల్వీడిరి భయములఁ గ్రహములు, గూడిరి శుభరాసులందుఁ గ్రూరత దొలఁగన్.

వ. ఇట్లు పరమోత్సవంబుఁ గావించి. 515

సీ. దోషాచరుల ఖరదూషణముఖ్యులఁ గామరూపుల మహాకలుషమతులఁ
గ్రూరుల దారుణాకారుల ఖలజనస్థానవాసులఁ జతుర్దశసహస్ర
గణితుల నర్ధాధికముహూర్తమున రామచంద్రుఁ డొక్కఁడు శాతసాయకముల
ననిలోనఁ దునుమాడె నహహా యే మన వచ్చు నిమ్మహాత్మునివీర్య మితనిదార్ఢ్య

తే. మితనిచాతుర్య మితనియహీనసత్త్వ, మచ్యుతున కట్లగన నయ్యె ననుచు నిట్లు
వేయినోళ్లఁ గీర్తించుచు విబుధవరులు, చనిరి బ్రహ్మఁ దమతమసదనములకు.

ఆ. అంతలోనఁ వీరుఁడగు లక్ష్మణుఁడు సీత, తోడఁ గూడ శైలదుర్గపథము
వలన నిర్గమించి వరుస సుఖంబుతోఁ, బర్ణశాలఁ జేరె భద్రయశుఁడు. 517

తే. అంతజయశీలుఁడగు రాముఁ డచటిమునులచేతఁ బూజితుఁడై సుమిత్రాతనూజు
చేత సంపూజ్యమానుఁడై సీతఁగూడి, పర్ణశాలఁ బ్రవేశించె భాసురముగ.

వ. అప్పుడు. 519

ఉ. ఇంచుకయైన స్రుక్కక యహీననిశాటుల నశ్రమంబునం

ద్రుంచి మహర్షిముఖ్యపరితోషణుఁ డై నరఘుప్రవీరు న
భ్యంచితమూర్తిఁ గన్గొని మహాప్రమదం బిగిరింప సీత నే
త్రాంచలదీధితుల్ నిగుడ నట్టె కవుంగిటఁ జేర్చె నెంతయున్. 520

వ. మఱియు ఖరాసురునిసైన్యంబునందు జితకాశు లగువా రెవ్వ రెవ్వరు గల రట్టిరాక్షసులతోఁ గూడఁ దాత్కాలికస్వేచ్ఛాగృహీతచతుర్దశసహస్రదివ్యమంగళవిగ్రహంబు గలవాఁ డగుటవలన నొక్కొక్కరాక్షసున కొక్కొక్కరాముం డై కనుపట్టి శక్రాదుల కైన నసాధ్యు లగువారి బలశంతులఁ జతుర్దశసహస్రరక్షోవీరుల నొక్కండె ఘటికాత్రయంబులోన సంహరించి మహాత్ము లగుపరమర్షులకు జగన్మోహనదివ్యమంగళస్వమూర్తిసాక్షాత్కారంబునఁ బరమానందంబు సంపాదించుచు విజయలక్ష్మీవిరాజమానుం డై లతాప్రతానోద్గ్రథితజటామండలుం డై పృథబద్ధకక్ష్యత్వంబున స్కంధావలంబితతూణీరుం డై రణావసానని ర్వాపితకోపాగ్ని యగుటవలనఁ బ్రసన్నముఖుం డై సీతాలక్ష్మణమార్గావలోకనుం డై నిర్వర్తితవీరకృత్యుం డై వీరవ్రతుం డై విగళద్రుధిరాప్లుతశరీరుం డై ఘర్మపయఃకణౌఘకలితలలాటుం డై కోదండదండంబు నవలంబించి తనముంగల నున్నరామభద్రునిం గనుంగొని సీత "ఆత్మావై పురుషస్య దారా" యనెడు నియమంబున శ్రీరామునత్తచేత తానును సత్త్వావతి నైతి నని తలంచి "రామజామాతరం ప్రాప్య స్త్రియం పురుషవిగ్రహ" మ్మని యజ్ఞానంబున మున్ను తా నాడినవాక్యాపరాధం బపనయించుకొనుటకును నాయుధవ్రణంబులకుఁ గుచోష్మముచేతఁ బరిహారంబుగావించుటకును గ్రమ్మఱ గాఢంబుగాఁ బరిరంభించి ప్రీతిసంహృష్టసర్వాంగి యై వదనంబు రాకాశశాంకునిచందంబున నందం బై యొప్పు శశాంకునిం గూడినరోహిణికై వడి నలరుచుండె. 521

అకంపనుఁడు జనస్థానమందలి రాక్షసవినాశమును రావణునకుఁ దెల్పుట.

క. అంత నకంపనుఁ డనువాఁ, డెంతయు శీఘ్రమున లంక కేగి నిశాంతా
భ్యంతరమున రావణుఁ గని, స్వాంతంబున నెగులు దోఁపఁ జయ్యనఁ బలికెన్.

క. దనుజేంద్ర జనస్థానం, బున నున్ననిశాటు లెల్లఁ బొలిసిరి త్రిశిరుం
డును ఖరుఁడును దూషణుఁడును, ఘనరణమునఁ జచ్చి రేమిగణుతింతు నిఁకన్.

వ. ఏ నొక్కరుండ నతిప్రయత్నంబునం దప్పించుకొని నీకడకుం జనుదెంచితి. 524

క. నా విని సంక్రుద్ధుం డై, రావణుఁ డటు కన్నుఁగొనల రక్తిమ నిగుడన్
దావాగ్నికరణి మండుచు, మోవి యదర వానితో సముద్ధతి ననియెన్. 525

సీ. దారుణం బగుజనస్థాన మెవ్వానిచే హతమయ్యె నెవ్వాఁడు హాలహలము
కానక ద్రావె లోకంబులలో నాకు విప్రియ మొనరించి వితతసుఖముఁ
బడయ శక్రుని కైనఁ బౌలస్త్యునకునైన శమనుని కైనను శౌరి కైన

నలవిగా దే నలయమునకు యముఁడ హుతాశనుఁ గాల్చుహుతాశనుండ
తే. మృత్యువునుజంపుమృత్యువనత్యమోహ, తేజమునవహ్నిభానులఁదెగడువాఁడ
బలము పెంపున వెనముహాబలునివేగ,మడఁచిభృత్యునిఁగాఁగొనియులరువాఁడ.
క. అని యిటు మోమునఁ జిడిముడి, గనుపడ సంక్రుద్ధుఁ డైనకై కసిపట్టిం
గని భీతి సకంపనుఁ డో, య్యన యభయము వేఁడె దర్శితాంజలి యగుచున్.
క. దానవవిభుఁ డగ్రరావణుఁ, డానరభోజనున కప్పు డభయ మొసఁగిన
న్మానక విస్రబ్ధుం డై, వానికి ని ట్లనియె మరల వాఃశభయోక్తిన్. 528
ఉ. మానితబాహుశౌర్యుఁ డనమానుఁడు వైరికులాంబుముగ్గగ
త్పాత్రిణుఁడు సింహసంహననుఁ డాయతబాహుఁడు వీరుఁ డాజికిన్
సూనుఁడు రామనాముఁ డొకశూరుఁడు శోభిలు వానిచే జన
స్థానము నాశ మొందె ఖరదానవదూషణసంయుతంబుగన్. 529
క. అన విని దశకంఠుఁడు నెమ్మనమునఁ గ్రోధంబు పెరుఁగ మదమున నాగేం
ద్రునిగతి రోఁజుచు వానిం, గనుఁగొని గంభీరభంగిఁ గ్రమ్మఱఁ బలికెన్. 530
క. సురపతి నిర్జరయుతుఁ డై, యురుగతిఁ దోడుపడ వచ్చెనో గా కున్న
న్నరుఁ డొక్కఁ డింతఁ జేసెనె, కరమరుదుగ వాని తెఱఁగుగణుతింపు మిఁకన్.

ఆకంపనుఁడు రావణునికి రామునిపరాక్రమప్రకారము దెల్పుట.

క. నా విని యకంపనుం డా,రావణునితలం పెఱింగి రామునిబలముం
బ్రావీణ్యము శౌర్యము ను, శ్రీవిభవము దెలియ నిట్లు చెప్పఁ దొడంగెన్. 532
సీ. దశకంధర వినుము దశరథరాముండు విలుకాండ్రలో నతివిశ్రుతుండు
నమిత తేజుండు దివ్యాస్త్రసంపన్నుండు నాలంబులో జిష్ణుఁ బోలువీరుఁ
డమ్మేటియనుజన్ముఁ డతిబలవంతుండు రక్తాంతనేత్రుండు రాజముఖుఁడు
దుందుభినాదుఁ డమందవిక్రమశాలి యనురూపకుఁడు లక్ష్మణాఖ్యుఁ డతని
ఆ. తోడఁ గూడి గాడ్పుతోడఁగూడినచిచ్చు, కరణి రిపులమీఁదఁ గనలుచుండు
మేటిరాముచేత గీటణంగిరి జన, స్థానవాసు లైనదైత్యు లెల్ల. 533
క. అనిమిషుల కంత సత్త్వము, వినుతపరాక్రమము శౌర్యవిస్ఫురణము గ
ల్గునె దనుజులతో వైరము, గొనుటకు మది సందియంబుగొనఁ డసురేంద్రా
క. రామధనుర్ముక్తము లగు, హేమమయమహోగ్రశరము లెంతయు హేతి
స్తోమములకరణి నసురుల, భీమపరాక్రములఁ గాల్చె భీమణభంగిన్. 535
క. అనిలోనఁ బ్రాణభయమునఁ, గనికని వడిఁబఱచునట్టి క్రవ్యాదులకున్
వినుమేదిక్కునఁ జూచినఁ, బ్రణుతగుణా దోఁచు రామభద్రుఁడు గడిమిన్.
వ. మఱియు భయకర్శితు లై రాక్షసులు రాక్షసత్వగోపనార్థం బేయేరూపాం
తరంబునఁ జరింతు రాయాపరిగృహీతరూపాంతరంబున మ్రోల నున్నదాశ
రథినే విలోకింతు రదియునుం గాక రణానాధనత్వబుద్ధిచేత నేయేవస్తువు గొనం

జూతు రాయావస్తువు నెల్ల రామాకారంబుగా విలోకింతు రివ్విధంబున. 537

తే. రాక్షసేశ్వర రణమున రాముచేత, నలజనస్థాన మభిహతం బయ్యె ననిన
మానసంబునఁ గోపించి వానితో ద, శాస్యుఁ డిట్లనె నుద్వృత్తి నట్టలేచి. 538

క. ఏమి యకంపన యిప్పుడె, రాముని లక్ష్మణయుతముగ రణమునఁ దునుమం
గామించి పంచవటి కే, నీమెయిఁ జనువాఁడ శౌర్య మింపారంగన్. 539

క. నా విని యకంపనుం డా, రావణువాక్యమున కులికి రక్షోవర యా
భూవరుపౌరుషసత్త్వ, ప్రావీణ్యము వినుమ టంచుఁ బలికెఁ గృపణుఁ డై. 540

సి. అధిపరాముఁడు మహాయశుఁడురువిక్రమంబున నసాధ్యుఁడు శౌర్యధనుఁడు కుపితుఁ
డంబుసంపూర్ణమహాపగావేగంబు నైన మహోద్ధతి నడ్డగించు
సగ్రహతారానక్షత్ర మైననభంబు నిరవకాశము సేయ నేర్పు కలిమి
నుదకమగ్నా వని నుద్ధరింపఁగఁ జాలుఁ గడువడి గాడ్పు వేగము నడంచుఁ

తే. దివిరి జలనిధివేల భేదించి మించి, ముజ్జగంబుల నీటిలో ముంపఁ గలఁడు
కడిమి మై వారినిధి నరికట్ట నేర్చు, ధరణిధరముల మోవంగ దక్షుఁ డతఁడు.

ఆ. సంహరించి సురల సర్వలోకంబులఁ, గడఁగి విక్రమమునఁ గలుగఁ జేయు
సృష్టము లయినట్టి విష్టపంబుల నెల్ల, నడఁప శక్తుఁ డమ్మహాయశుండు. 542

సి. దశకంఠ నాకపదం బపుణ్యులచేతఁ గడిమి మీఱి జయింపఁబడని మాడ్కి
విష్టపత్రయనుతవిక్రమాధికుఁ డైన రాముండు నముచిహిరణ్యకశిపు
శంబరబలివృత్రజంభాదివిఖ్యాతదనుజులచే నైన నని జయింపఁ
బడఁ డట్టిఘనుఁ డెట్లు పరఁగ నీచే జయించుటకు శక్యుం డగు సారిది నతఁడు

తే. వాసవాదులకైన నవధ్యుఁ డనుచు, మదిఁ దలంచెద నమ్మహాద్యుతిని గెలుచు
నట్టిసదుపాయ మెఱిఁగింతు నసురనాథ, మానసం బెందుఁ బోనీక దాని వినుము.

అకంపనుఁడు రామునిం జంపుట కుపాయము రావణునికిఁ దెల్పుట.

వ. అని యిట్లకంపనుండు రాక్షసుం డయ్యు ననేకజన్మాంతరకృతసుకృతపరిపాకం
బునం దత్కాలసముత్పన్నశ్రీరామస్వరూపవిషయజ్ఞానంబు గలవాఁ డై రా
ముం డని పలుకుటవలన రామునికోపంబున కసంహార్యత్వంబును విక్రమంబున
నసాధ్యుఁ డని పలుకుటవలన విక్రమంబు ప్రవృత్తం బగుచుండ నివారించు
ట కశక్యుం డనుతాత్పర్యంబును నుపపదరహితం బైనయసాధ్యశబ్దంబున బ్ర
హ్మేంద్రాద్యసాధ్యత్వంబును గుపితుం డనుశబ్దంబున మర్యాదోల్లంఘనవిష
యనిగ్రహనిష్ఠుం డనునర్థంబును మహాయశుం డనుశబ్దంబున లోకంబునందు
సుప్రసిద్ధవిభవుం డనుభావంబును మహాపగావేగంబు నైన నడ్డగించు నని ప
లుకుటవలన భవిష్యత్కృష్ణావతారవృత్తాంతంబును నభంబు నిరవకాశంబు
సేయు నని పలుకుటవలనఁ ద్రివిక్రమావతారవృత్తాంతంబును నుదకమగ్నావని
నుద్ధరింపఁగ జాలు నని పలుకుటవలన వరాహావతారవృత్తాంతంబును సంసార

సముద్రంబున మునింగినజనంబునకుఁ బరమపురుషార్థరూపమోక్షప్రదుం డని యెడునభిప్రాయంబును ముజ్జగంబుల నీటిలో ముంపఁగలం డని పలుకుటవలన సంహారకారణత్వంబును వారినిధి నరికట్ట నేర్చు నని పలుకుటవలనఁ గరిమ్యమాణసేతుబంధనకార్యంబును గాడ్పువేగము నడంచు నని పలుకుటవలనఁ బంచభూతవిలయపూర్వకప్రళయ కర్తృత్వంబును ధరణీధరముల మోవంగ జాలుఁ డని పలుకుటవలనఁ గూర్మావతారవృత్తాంతంబును సంహరించి సురల నర్వలోకంబుల విక్రమంబునఁ గలుగఁ జేయు నని పలుకుటవలనఁ బూర్వకల్ప సంహారపునస్సృష్టికర్తృత్వంబును వెండియు మహాయశుం డని పలుకుటవలన మహైశ్వర్యసంపన్నత్వంబును శక్తుం డని పలుకుటవలన ననంతశక్తిత్వంబును వృష్టములయినట్టివిష్టపంబుల నణంచు నని పలుకుటవలన వర్తమాన సృష్టిసంహారకర్తృత్వంబును దశకంఠయని సంబోధనంబు సేయుటవలన రావణునిదశవదనత్వంబును నల్పశక్తిత్వంబును రాముని సహస్రశీర్షత్వంబును నపరిమితానంతశక్తివిశిష్టత్వంబును సూచింపం జేసి వెండియు ని ట్లనియె. 544

ఉ. ఆతనిపత్ని నూత్నకమలాయతలోచన మేఘవేణి జై
వాతృకమండలాస్య వరవర్ణిని పల్లవకోమలాంఘ్రి య
బ్జాతసుపాణి యర్ధశశిఫాల మనోహరసుందరాంగియుక్
సీత యనంగఁ జెల్వొనఁగుఁ జేసినపుత్తడిబొమ్మకైవడిన్. 545

ఉ. ఆ యెలనాగచక్కఁదన మాలికుచస్తనిరూపవైభవం
బాయహిరోమరాజిపలు కామదవారణయాన మోవితీ
రాయలివేణి మోముసొబ గామృదుకోకిలవాణి మేనిబా
గేయుగమందు నవ్వరికి నెందును గానము రాక్షసేశ్వరా. 546

తే. సురసతులయందు గంధర్వసుదతులందు,నురగసతులందు దానవయోషలందు
నవ్వెలందికి సరి యైన యతివ లేద,నంగ నరసతులందు జెప్పంగ నేల. 547

తే. ఆ వెలంత రామునకుఁ బ్రాణమట్లు గాన, దానిఁ బంచనఁ గైకొంటివేని యతఁడు
తద్వియోగాగ్నిచేఁ గ్రాఁగి తత్క్షణంబ, చచ్చు నిది దక్క వేఱొక్కజాడ లేదు.

క. అనిన నకంపనువాక్యము, విని దశకంఠుండు చాల వెఱఁగుపడి మనం
బునఁ జింతించి రయంబున, ఘనరవమున వానితోడఁ గ్రమ్మఱఁ బలికెన్. 548

క. అటు లైన నేమి యఘటన, ఘటనాచతురుండ నేను గాల్యంబున న
చ్చటి కేగి సీతఁ జేకొని, యిటు దోడ్కొని వత్తుఁ బలుకు లిం కేటి కిటన్.

రావణుఁడు మారీచునికడ కేగుట.

క. అని ఖరములఁ బూన్చిన కాం, చనమయ మగు నరద మెక్కి సర్వదిశలు ప్ర
క్కున వెలిఁగించుచుఁ జనియెను,దనదుర్మంత్రమున కలరి దైత్యులు మెచ్చన్.

552

వ. అప్పుడు.

క. ఆరాక్షసనాథునిరథ, మారయ సంచార్యమాణ మై యుడువీథిన్
భూరిద్యుతి నేగుచు నొ, ప్పారె వలాహకములోనిహరిణాంకుక్రియన్. 553

వ. ఇట్లు గదలి దశగ్రీవుండు రయంబునఁ దాటకేయుం డగుమారీచునియాశ్ర
మంబునకుం జని యతనిచేత సమానుషంబు లగుభక్ష్యభోజ్యంబులచేత నర్చి
తుం డై సముచితాసనంబున నాసీనుం డయ్యె నప్పుడు మారీచుం డర్థగంభీరం 554
బైనవాక్యంబున ని ట్లనియె.

క. దనుజోత్తమ నీకును నీ, తనయులకును రాజ్యమునకుఁ దరుణులకు సుహృ
జ్జనులకు సేమమె నీవ,చ్చినకార్యం బెద్ది దానిఁ జెప్పుము నాకున్. 555

మారీచుఁడు రావణునకు హితోపదేశముఁ జేయుట.

వ. రాక్షసేంద్రా లోకంబులకు సేమంబు లే దని శంకించెద ఘనప్రయోజనంబు
లేక భవదాగమనంబు దొరకొనదు గదా యని పలికిన నారావణుం డమ్మా 556
రీచున కి ట్లనియె.

క. అనఘా యే మని చెప్పుదు, ననుపమభుజవీర్యయుక్తుఁ డగురామునిచే
వినిహతు లైరి జనస్థా, ననిలయు లగురాక్షసులు ఘనం బగునాజిన్. 557

ఆ. రాక్షసారి యైన రామునిప్రియభార్య, నపహరింప మైత్రి నిపుడు నెఱపు
నానతండు దైత్యనాథునితోడ ని, ట్లనియె హితము నయము వినుతి కెక్క.

ఆ. మిత్రరూపుఁ డైన శత్రుఁ డెవ్వఁడు నీ, కీయనర్థకార్య మిట్లు గఱపె
సామదానకలన సత్కృతుం డైనవాఁ, డిట్టియశుభవాక్య మేల చెప్పు. 559

ఉ. సీతను ముచ్చిలింపు మని చెప్పినదుష్టునిఁ బట్టి కత్తిచే
వే తలఁ గొట్టరాదె యవివేకతఁ గ్రూరతరాహినోటిలోఁ
జేతులు పెట్టఁ జూచెదవు శిష్టుల కీతెఱఁ గొప్ప దయ్యయో
పాతకరూపకర్మమున భవ్యయశంబును లచ్చి వోవదే. 560

క. కడువడి నెవ్వఁడు సుఖసు, ప్తుఁడ వగునీయుత్తమాంగము కరంబునఁ జే
ద్పడఁ బ్రహరించెను రావణ, తడయక యెవ్వఁడు చెఱుపఁదలకొనెఁ గులమున్.

చ. సురవినుతప్రతాపమదశుద్ధకులాభిజనాగ్రహస్తసుం
దరతరదివ్యలక్షణవితానవిభాసితదోర్విషాణ మై
వఱలెడు రాఘవాఖ్యబలవర్ధనగంధగజంబు పోరిలో
నరుదుగఁ దేఱిచూచుటకు నర్హము గాదు నిశాచరేశ్వరా. 562

మ. సమరాంతస్థితిసంధివాలము సమస్తక్రూరరాత్రించరో
గ్రమృగధ్వంసనశీలము న్నిశితఖడ్గస్ఫారదంష్ట్రంబు ను
త్తము బాణావయవప్రపూర్ణ మగుశుంభద్రామహార్యక్షముం
గ్రమము న్గానక మేలుకొల్పఁ దగునే క్రవ్యాదవంశోత్తమా. 563

చ. ఘనభుజవేగపంక మయి గాఢతరప్రదగోర్మిజాల మై
ధనురవహార మై విమతదారుణ మై సుమహాహవౌఘమై
యనుపమ మై యగాధ మయి యద్భుత మై యనిశం బపార మై
తనరెడురాఘవాబ్ధిఁ బడ దానవనాథ తలంపఁ జెల్లునే. 564

రావణుఁడు మారీచు పచనప్రకారంబున మగలి లంక కేగుట.

వ. రాక్షసేంద్రా నీవు మహాత్ముం డగు పులస్త్యబ్రహ్మసంశంబున బుట్టినవాఁడవు భుజవీర్యంబునం బ్రసిద్ధికి నెక్కినవాఁడవు నీకుఁ బరదారాభిమర్శనంబు యుక్తంబు గాదు దానివలనఁ బౌరుషంబునకు హాని సిద్ధించు నావచనంబుఁ బట్టి ప్రసన్నుండవై లంకాపురంబుఁ బ్రవేశించి సర్వాంతఃపురకాంతలంగూడి సుఖంపుము రాముండు దండకారణ్యంబునందు సీతాసహితుం డై యిష్టోపభోగంబు లనుభవించుచు విహరించు చుండుఁ గాక యని పలికిన నద్దశాననుండు మారీచునిచేత నివారితుండై క్రమ్మఱ లంకాపురంబునకుం జనియె నంత నిక్కడ శూర్పణఖ రామునిచేత నిహతు లైనచతుర్దశసహస్రరక్షోవీరులం జూచి ఖర దూషణ త్రిశిరులనిధనంబునకు దుఃఖించుచుఁ దనయంగవికలత్వంబునకు లజ్జించుచు ననన్యసాధారణం బైనరామునిపరాక్రమప్రకారంబునకు భయంబు నొందుచు శోకవిషాదరోషంబులు మనంబున ముప్పిరిగొన నచ్చోట నిలువక మేఘంబుకరణి మహానాదంబు సేయుచు శీఘ్రంబున రావణపాలితం బైనలంకాపురంబుఁ బ్రవేశించి యందుఁ గైలాసశిఖరసంకాశం బైనపుష్పక విమానాగ్రభాగంబున. 565

క. తరణినిభం బగుచామీ, కరవరసింహాసనమునఁ గర్బురనృతుఁ డై
సురపరివృతుఁ డగుశక్రుని, కరణిం గొలు వున్న పంక్తికంఠునిఁ గనియెన్. 566

తే. కాంచనసుయేష్టకాపరికలితయాగ, వేదిమధ్యంబుఁ బ్రాపించి వివిధమంత్ర
వివిధపృషదాజ్యమునఁ జాల వృద్ధిఁ బొంది, నట్టిపావకుచందాననలరువాని.567

క. నరగంధర్వామరకి, న్నరచారణసిద్ధ సాధ్యనాగనభస్వ
ద్వరుల కజయ్యుని శూరునిఁ, బరేతపతిభంగిఁ గ్రాలు భయదాకారున్. 568

శూర్పణఖ రావణునికడ కేతెంచుట.

క. బలభిత్సంగ్రామంబునఁ, గులిశకృతవ్రణుని నభ్రకుంజరదంతా
వలిసంఘృష్టకిణాంకో, జ్జ్వలనూతనరత్నహారసంభృతవక్షున్. 569

క. పదితలలజోడుఁ దగ ని, ర్వదిచేతులమేటి రాజవరలక్ష్మాఢ్యుం
ద్రిదశభయంకరరూపునిఁ, బ్రదీప్తతేజుని సమస్తరాక్షసరాజున్. 570

క. గిరినిభుని మహాస్యునిఁ బొం, డరదశనుని దీర్ఘభుజుని నద్ధకనకభా
సురకుండలు స్నిగ్ధవిభూ, రరత్నసంకాశు దేవరాజప్రతిమున్. 571

క. సరసురసంగ్రామంబుల, హరిచక్రనిపాతనమున నన్యాస్త్రసము

త్కరమునఁ దాడితదేహునిఁ, బరనుభుజావిక్రమమునఁ బరఁగెడువానిన్. 572

క. అక్షోభ్యసమస్తసము, ద్రక్షోభుని శైలదళనరతుని నుగ్ర
ప్రేక్షణుని సురవిదారిని, రక్షోగణవిభుని ధర్మరహితాత్మకునిన్. 573

ఆ. యజ్ఞవిఘ్నకరుని నన్యదారాభిమ, ర్శనుని సర్వదివ్యశస్త్రబాణ
మోక్త సమితసత్త్వయుతుని స్వహస్తార్జి, తప్రవీరశబ్దు దైత్యవిభుని. 574

క. కడుపడి భోగవతీపురి, కడకుం జని సర్పవిభునిఁ గడచి ప్రతాపం
బసరఁగఁ దక్షకుభార్యను, గడిమిం గొని తెచ్చినట్టి ఘనశౌర్యనిధిన్. 575

క. మునువడిఁ గైలాసాచల,మునకుం జని యందు ధనదుఁ బోర గెలిచి త
ద్ఘనకామగపుష్పకముం, గొని తెచ్చినవీరు నసురకులదీపకునిన్. 576

క. అనిమిషపతినందనమును, ధననాథునిచైత్రరథము తక్కిన దేవ
ప్రణుతోద్యానవనంబులు, వినశింప నొనర్చినట్టి విక్రమశాలిన్. 577

క. తపనుని తేజముఁ దారా, ధిపుశైత్యము వహ్నిదేవుతీక్ష్ణత భుజస
త్వపతిష్ఠత్వంబున నే, యపరాజితుఁ డడఁచె నట్టియచలాకారున్. 578

క. పదివేలవర్షములు వన, పదమునఁ దపమాచరించి పసపడి విధికి
న్ముదము జనింపఁగఁ దనతల, లదరక యుపహార మిచ్చినట్టి మహోగ్రున్. 579

క. నరుఁ డొకఁడు తక్కఁ దక్కిన, గరుడామరసిద్ధసాధ్యగణములచే సం
గరమునఁ జావక యుండఁగ, వర మెవ్వఁడు వడసె నట్టి వ్రతసంసిద్ధున్. 580

క. నిరనుక్రోశునిఁ గర్కశు, నరిభంజను లోకములకు నహితకరుని దు
శ్చరితుని భయదాకృతి లో, కరావణుని వికృతముఖునిఁ గాపథవర్తిన్. 581

సీ. గరుడగంధర్వకిన్నరసిద్ధసాధ్యసుందరుల నేవీరుండు చెఱలఁ బట్టెఁ
దనకడ్డమైనశంభుని కొటపట్టగుకైలాస మెవ్వాఁడు గాసి చేసె
నలకూబరునితోడఁ గలయంగఁ జనెడురంభను బట్టి యెవ్వాఁడుబలిమిఁ జెఱిచెఁ
గాంచనమయవిశ్వకర్మనిర్మితలంక కమరనేశూరుండు రమణుఁ డయ్యె
తే. నట్టిశూరుని దానవపట్టభద్రుఁ, దతమణీభూషణప్రభూషితశరీరు
దివ్యమాల్యోపశోభితుదీప్తవదను, మణివిమానాధిరూఢు రావణునిఁ గనియె.

వ. మఱియు నధ్వరంబులందును హవిర్దానంబులందును బ్రాహ్మణులచేతఁ బ్రాతర
నువాకగ్రావస్తోత్రాదిమంత్రంబులచేత నభిష్టుతం బైనసోమంబు నెవ్వఁ డపహ
రించె నట్టిదశగ్రీవునిఁ బావకసంకాశలోచనుని మంత్రిమధ్యంబున విలోకించి
యభీతచారిణి యగుశూర్పణఖ భయమోహమూర్ఛిత యై తనవైరూప్యంబు
దర్శింపఁ జేసి క్రోధోద్రేకంబున బొమలు ముడివెట్టుచు దారుణవాక్యంబున
ని ట్లనియె. 583

శూర్పణఖ రావణుని నానావిధంబుల దూఱుట.

చ. అలయక కామభోగములయందుఁ బ్రమత్తుఁడ వై నిరంకుశో

జ్జ్వలుఁడవు మందశేముషివి స్వైరవిహారుఁడ వట్లు గావునన్
దెలియఁగఁ జాల వివు తల ద్రెంపఁగ వచ్చినవైరి నైన నీ
కిల నొకరుండు సాటి గలఁడే దనుజాధిప బుద్ధిహీనతన్. 584

చ సతతము గ్రామ్యభోగపరిషక్తుఁడు లుబ్ధుఁడు కామవృత్తుఁ డౌ
క్షితిధవునిం బ్రజ ల్విరతిఁ జెంది శ్మశానహుతాశనుం బలెన్
మతిఁ బరికింతు రెవ్వఁ డభిమానము దక్కి మెలంగు నట్టికు
త్సితుఁడు సజీవుఁ డయ్యు గతజీవుఁడు గాఁడె దలంచి చూడఁగన్. 585

క. కాలమునం దెవ్వఁడు తా, నాలస్యముఁ జేసి కార్య మరయం డా భూ
పాలుం డక్కార్యముతో, నాలాయము చెడు నపేతవై భవుఁ డగుచున్. 586

క. జను లస్వాధీనుని దు, ర్జను దుర్దర్శుని నయుక్తచారుని ధాత్రీ
శుని దవ్వుల విడుతు రధీ, శ నిమ్నగాపంకమును గజంబులు వోలెన్ 587

మ. అరయ న్మేదినిలోన నేనృపతు లస్వాధీను లై దేశముల్
బరిపాలింపఁగఁ జాల రట్టినృపతు ల్నానాప్రకారంబులన్
స్థిరసంపన్మహిమప్రభుత్వములచే దీపింపఁగాఁ జాల రా
సురవంశోత్తమ వార్ధిమగ్నపృథులక్షోణీధరప్రాయు లై. 588

ఆ. చపలమతి వయుక్తసంచారుఁడవు జడా, త్మకుఁడ వైననీవు ధైర్యవంతు
లైన దేవదానవాదులతో విగ్ర, హించి రాజ వైతి వెట్టు లకట. 589

క. మతిహీనునిఁ గాముకసం, గతునిఁ దెలియఁ దగినయట్టికార్యము దెలియ
న్ధృతి లేని నిన్ను రాక్షస, పతిఁ జేసినవలువ యెంతఁ బాలిశుఁ డొక్కో. 590

వ మఱియుఁ జారుండును గోశంబును నయంబు నెవ్వారికి స్వాధీనులుగా రట్టిన రేం
ద్రులు మూర్ఖజనులతోడ సమాను లగుదు రదియునుంగాక. 591

క. చారులచే విషయసమా, చారంబుల నెఱిఁగి యుచితసరణి మెలఁగు ధా
త్రీరమణుఁడు దైత్యేశ్వర, యారయఁ గా దీర్ఘదర్శి యనఁ దగు నుర్విన్. 592

తే. ధరణి నెవ్వాఁడు ఘనజనస్థానమందుఁ, జచ్చిన ఖరాదుల నెఱుంగఁజాలఁ డట్టి
నిన్నుఁ బ్రాకృతసచివసంపన్ను నధిక, కామభారావసన్నునిఁగాఁ దలంతు 593

ఆ. భీమకర్ము లగు యామినీచరచతు, ర్దశసహస్రములును ద్రిశిరుఁడును ఖ
రుండు దూషణుండు దండిరాక్షసు లొక్క, రాముచేత మడిసి రేమి గలదు

తే. రాక్షసోత్తమ నృపుఁడై నరాముచేతఁ, దాపసుల కెల్ల నభయంబు దత్తమయ్యె
ధర్షితం బయ్యె నలజనస్థానపదము, దండకంబులు సుకృతభద్రంబు లయ్యె.

క. విను మీవు స్వదేశంబున, జనియించిన భయ మెఱుంగఁ జాల వయితి గా
వున మత్తుండవు లుబ్ధుఁడ, వనవరతము బాలబుద్ధి వనుచుఁ దలఁచెదన్. 596

క. ధర శఠునిఁ బ్రమత్తుని దు, ష్కరు నల్పునిఁ దీక్ష్ణకరుని గర్వితుని మహీ
ధరుని సమస్తజనంబులు, నిరసింతురు వ్యసనమందు నిందితచరితా. 597

క. అతిమానియు నగ్రాహ్యుఁడు, సతతముఁ గ్రోధనుఁడు నాత్మసంభావితుఁ డౌ
క్షితిపతిని స్వజనమైనను, బ్రతతమతి వ్యసనమందు వధియించునిలన్. 598

క. తనవారిసేమ మరయక, తనయిచ్చకొలందిఁ దిరుగుధాత్రీశుఁడు గ్ర
క్కున వారలచేఁ దృణముక్రియ నెన్నఁబడు వ్యసనసమయమందసురేంద్రా.

ఆ. పరఁగ శుష్కకాష్ఠపాంసులోష్టంబుల, వలనఁ గార్య మొకటి గలుగుఁ గాని
దానవేంద్ర వినుము స్థానపరిభ్రష్టులైన నృపులచేత నదియు లేదు 600

తే రాజ్యపదహీనుఁ డైనట్టి రాజు చతురుఁ, డైన నేమి నిరర్థకుఁ డై నశించు
దానవేశ్వర యుపభుక్తమైనపటము, మాడ్కి నామ్లానకుసుమదామంబుకరణి.

తే. నయనముల నిద్రితుం డయ్యు నయవిలోచ
నముల సర్వంబుఁ బరికించు నరవిభుండు
వ్యక్తకోపప్రసాదుఁ డై వఱలువాఁడు
సంతతముఁ బూజ్యుఁ డగు సర్వజనులచేత. 602

వ. మఱియు నెవ్వండు విజితేంద్రియుం డై యప్రమత్తుం డై కృతజ్ఞుం డై ధర్మశీలుం డై స్వరాష్ట్రపరరాష్ట్రవృత్తాంతాభిజ్ఞుం డై ప్రవర్తించుచు నట్టిమహీపతి చిరకాలంబు రాజ్యంబు పరిపాలించు నీవు జనస్థాననివాసు లగురక్షోవరుల వధప్రకారం బెఱుంగనికతంబునఁ బూర్వోక్తసుగుణవర్జితుండ వనియును విషయాసక్తుండ వనియును దేశకాలవిభాగనిర్ణయంబునయం దసమర్థుండ వనియును గుణదోషనిశ్చయంబునం దయుక్తబుద్ధి వనియును జనంబులచేత నెన్నంబడుదువు లోకాపవాదంబువలన నాయుర్భాగ్యంబులు నశించు నని యివ్విధంబున స్వదోషంబు లుగ్గడించి దూఱుచున్నశూర్పణఖవాక్యంబులు విని నిశాచరవల్లభుండును ధనదర్పబలాన్వితుండు నగురావణుండు క్రోధమూర్ఛితుం డై మారీచుండు సమరంబు యుక్తంబు గా దని నిషేధించె నీశూర్పణఖ సమరంబునం దుత్సాహకల్పనంబు సేయుచున్నది యెయ్యది కర్తవ్యం బని కొండొకసేపు విచారించి యమాత్యమధ్యంబునఁ గోపోద్దీపితముఖుఁడై పరుషంబులు పలుకుచున్న శూర్పణఖ కిట్లనియె. 603

సీ. రాముఁ డెవ్వఁడు తత్పరాక్రమం బెచంద మెంతశౌర్యము గలదెట్టిరూప
మేటికి ఘనదండకాటవి కరుదెంచె లా వెంత చల మెంత యావిభునకు
నాయుధం బెద్ది ఘోరాజిలో ఖరదూషణాదినిశాచరు లతిసమర్థు
లెట్లు రామునిచేత నిందఱు హతు లైరి శౌర్యంబు ప్రకటింపఁజాల రైరి

తే. యనుచు రాక్షసవిభుఁడు దశాననుండు, తెలియ నడిగిన విని క్రోధదీప్తవదన
యగుచు ముక్కిడిరక్కసి యన్నతోడ, నమ్మహాత్మునివృత్తాంత మంతఁ జెప్పె.

శూర్పణఖ రావణునికి రామునివృత్తాంత మంతయుఁ దెల్పుట.

ఉ. రాముఁడు బాహువిక్రమపరాజితభార్గవరాముఁ డంబుద

శాస్త్రముఁడు దీర్ఘబాహుఁడు జటాజినచీరధరుండు ధీరుఁడుం
గాముసమానరూపుఁడు జగజ్జనలోచనరంజనుండు సు
త్రామనిభుండు పంక్తిరథరాజకుమారుఁడు రాక్షసేశ్వరా. 605
క. ఘనశక్రచాపనిభ మగు, కనకాంచితదివ్యకార్ముకం బెక్కిడి గ్ర
క్కున నారాచవితానము, పనివడి దొరఁగించు ఘోరఫణితతిని బలెన్. 606
క. విలుసవరించుటయును శరములు గుణమునఁ గూర్చుటయును మునుకొనిసైన్యం
బులపై నేయుటయును నని, దెలియఁగ రా దయ్యె నాదితేయవిరోధీ. 607
క. శరవృష్టిచేతఁ గూలిన, సురారిసైన్యమును బోలఁ జూచితి ననిలో
సురవిభునియశ్మవృష్టిని, సరయాహతి మిర్వీఁ బడినసస్యమును బలెన్. 608
క. పదునాల్గువేలదనుజులు, పదాతి యగునొక్క రామభద్రునిచే దు
ర్మదఖరదూషణయుతముగఁ, గదనావనిఁ బడిరి మూఁడుగడియలలోనన్.
ఆ. మునుల కభయ మొసఁగి మునుకొని ఖరదూష, ణాదిదనుజవరుల నాజిఁ జంపి
విపినపథము నెల్ల సుపథంబుఁ గావించె, నతనిబాహుశౌర్య మరిది పొగడ. 610
తే. వితతరణరంగధీరుఁడై వెలయునట్టి, రామభద్రునిఘోరశరముల చేతఁ
దెగక యే నొక్కఁడాన నతిప్రయత్న, మున విముక్తనై వచ్చితిదనుజవర్య.
చ. అతనికిఁ దమ్ముఁ డుజ్జ్వలుఁ డహస్కరతేజుఁడు బుద్ధిమంతుఁ డ
ప్రతిముఁడు వీర్యవంతుఁ డనురక్తుఁడు భక్తుఁడు తుల్యవీర్యుఁ డా
శ్రితపరిపోషణుండు భయశీలుఁ డసహ్యుఁ యు దుర్జయుండు న
ద్భుతబలుఁ డొప్పు రాత్రిచరపుంగవ లక్ష్మణనామధేయుఁ డై. 612
వ. అమ్మహాత్ముండు రామునకు దక్షిణభుజమాత్రుం డై బహిశ్చరం బగుప్రాణంబు
చందంబున నొప్పుచుండు నదియునుం గాక. 613

-ఇఇ- శూర్పణఖ రావణునికి సీతారూపవైభవంబుఁ బ్రస్తుతించి చెప్పుట. -ఇఇ-

ఉ. ఆతనిపత్ని భీతహరిణాక్షి మనోహరచారుగాత్రి య
బ్జాతనుపాణి యర్ధశశిఫాల సుకేశి సునాస రూపవి
ఖ్యాత యశస్వినీమణి జగజ్జనసన్నుతశీల పూర్ణిమా
శీతకరోపమానముఖి చెల్వగు సీత యనాఁ బ్రసిద్ధ యై. 614
తే. కమలవైరిని బాయనికౌముదిగతిఁ, గాయ మెడఁబాసి యుండని ఛాయపగిది
దనుజవర పువ్వుఁ బాయనితావికరణి, భర్త నెడఁబాయ కుండు నప్పద్మనేత్ర.
ఉ. ఆజనకావనీశసుత కాశతపత్రవిశాలనేత్ర కా
రాజనిభాస్య కాభుజగరాజమనోహరరోమరాజి కా
రాజితరూపవైభవతిరస్కృతనూతనరత్నపుత్రి కం
భోజనివాసినీకుధరపుత్రిక లైనను సాటి వత్తురే. 616
చ. మును ఫణిలోకసుందరుల మోహనరూపవిలాసవిభ్రమం

బనిమిషలోకవాసిహరిణాక్షులశోభనదేహసౌష్ఠవం
బనుపమ ర్త్యకామినులయందునుచందముఁ బోలఁ జూడమే
దనుజవరేణ్య కాన మలదానికి నీడగుదాని నెందునన్. 617

ఉ. ఆమదిరాక్షిచక్కఁదన మాయలికుంతలయాటపొంక మా
శ్యామవచోవిలాసవిధ మాలికుచ స్తనిచూడ్కిచంద మా
రామవిలాస మాయువతిరాజితలక్షణ మాలతాంగిసొం
పే మని చెప్పుదాన నసురేశ్వర చూచినఁ గాని దీరునే. 618

క. ధరలో నెవ్వని కాసతి, యిరు వందఁగ భార్య యయ్యె నెవ్వానిఁ దమిం
బరిరంభించె నతం డా, పురుహూతునకంటె నధికపూజ్యుఁడు గాఁడే 619

శా. ఆనీలాలక యాగజేంద్రగతి యాయంభోజపత్రాక్షి యా
పీనశ్రోణి సురారి నీకుఁ దగు నాపృథ్వీజకు న్నీవు ని
త్యానందంబు నొసంగ నర్హుఁడవు మీ కన్యోన్యముం జి త్తసం
ధానం బైన నభూతపూర్వవిభవౌన్నత్యంబు చేకూడదే. 620

ఉ. దానిమనోజ్ఞవేషమును దానివచోరచనాచమత్కృతుల్
మానుగఁ జూచి నీకుఁ దగుమానిని యంచుఁ దలంచి వేడ్కతో
నేను గడంగి బల్విడి గ్రహింపఁగఁ బోయి సుమిత్రపట్టిచే
దానవనాథ యిట్టు లసిధార విరూపిత నైతి నెంతయున్. 621

క. మదనునియాఅవశర మగు, సుదతీమణిచంద మీవు చూచితివేనిం
ద్రిదశారి యేమిచెప్పుదు, మదనజ్వరతాపవార్ధిమగ్నుఁడు గావే. 622

క. ఆగజయానను భార్యం, గాఁ గైకొనుతలఁపు నీకుఁ గల దేని సము
ద్యోగి వయి యిపుడె చెచ్చెర, నేగుము విజయార్థ మీ వహీనగుణాఢ్యా. 623

క. రాముని రణభీముని సు, స్థేముని వధియించి యతనిచే మున్న సమి
ద్భూమిని జచ్చిన దనుజ, స్తోమమునకుఁ బ్రియ మొనర్పుదోఃపాటవరా. 624

తే. దైత్యకంటకు లైనయాదాశరథుల, నిరువుర వధించి తేని యాధరణిపుత్రి
యొంటి నైఁ జిక్కు నవ్వేలఁ దుంటవిల్తు, మచ్చరించుచు భోగింపవచ్చు నీకు.

క. నావచనం బొనగూర్పఁగ, భావించితి వేని దనుజపాలక యిపుడే
వేవేగ దండకాటవి, కీవెంటం జనుము రాము నెక్కటి గెలువన్. 626

రావణుఁడు సీతాపహరణమునకై బయలుదేఱుట.

వ. అని యిట్లు బహుప్రకారంబులఁ బాపవ్యవసాయంబునందు బుద్ధి తగులువడు నట్లుగా బోధించిన నయ్యసురాంగన వాక్యంబు విని ఖరదూషణులమరణంబునకు దుఃఖించి సచివముఖంబునఁ గార్యంబు తెలిసికొని వారి నందఱ నిండ్లకుఁ బోవం బంచి యద్దశగ్రీవుం డంతఃపురంబునకుం జని యనంతరంబ తన మనంబునఁ దత్కార్యపర్యాలోచనంబుఁ జేసి సునిశ్చితార్థుండై క్రమ్మఱ దా

ర్థ్యంబుగొఱకు నాలోచించి సీతాపహరణకార్యంబు పౌరుషంబునం జేసితినేని గుణం బగుఁ జౌర్యంబునం జేసితి నేని దోషం బగు నైనను ఖరాదియుద్ధంబునందు రాముని యచింత్యబలపౌరుషంబులు వినఁబడుటవలనఁ బౌరుషంబునఁ గావించుటకు శక్యం బై యుండ దుపాయపరికల్పితచౌర్యాశ్రయణంబునందు దాత్కాలికదోషంబులు పరిదృశ్యమానంబులు గావు గావునసీతాపహరణంబు చౌర్యంబునం గావించెదఁగాక యని నిశ్చయించి స్థిరబుద్ధియై రయంబున యానశాలకుం జని పెద్ద లెఱింగిననివారింతురనితలంచిరహస్యంబుగారథంబు సన్నద్ధంబు గావింపు మని సూతు నాజ్ఞాపించిన లఘువిక్రముం డగు నతండు తత్క్షణంబ పిశాచవదనంబు లైనఖరంబులం బూన్చి కాంచనమయంబును రత్నభూషితంబును గామగమనంబు నగురథం బాయితంబు చేసి తెచ్చిన దాని నారోహించి శ్వేతమాల్యవ్యజనుండును శ్వేతచ్ఛత్రుండును స్నిగ్ధవైడూర్యసంకాశుండును దప్తకాంచనకుండలుండును దర్శనీయపరిచ్ఛదుండును దశగ్రీవుండును వింశతిభుజుండును దేవశత్రుండును మునికంటకుండు నగురావణుండుశిఖరదశకసమన్వితం బైనపర్వతంబుచందంబున నందం బై బలాకామాలాసహితంబును విద్యున్మండలవంతంబు నైనమేఘంబుపగిది నంబరంబునం జని చని రమ్యం బగుసాగరానూపంబు విలోకించె నది మఱియును 627

సీ. బహుపుష్పఫలమహీరుహకదంబయుతంబు పద్మశోభితసరోభాసితంబు
వేదిమదాశ్రమవిసరవిశాలంబు నానాపతత్త్రిసునాదితంబు
నజమాషవాలఖిల్యమరీచిపాత్రేయవైఖానసాదిసంవాసితంబు
నాగసుపర్ణగంధర్వకిన్నరసిద్ధసాధ్యవిద్యాధరసంవృతంబు

తే. సాలతాలతమాలహింతాలమాతు, లుంగనారంగలుంగలవంగబిల్వ
వంశకింశుకశింశుపావకుళనీప, మంజరీకుంజపుంజోపరంజితంబు. 628

రావణుఁడు మారీచునికడ కేగుట.

వ. మఱియు నారికేళకదళీవనోపశోభితంబును నత్యంతనియతాహారపరమర్షిశతాకీర్ణంబును దివ్యాభరణభూషితదివ్యరూపక్రీడారతివిధిజ్ఞదివ్యాప్సరోజనసహప్రసంచారితంబును దేవపత్నీసంసేవితంబును నమృతాశిదేవదానవసంఘవిరాజితంబునుహంసక్రౌంచసారసప్రణాదితంబునురమ్యవైడూర్యప్రస్తరంబును బాండరదివ్యమాల్యసంయుత తూర్యగీతాభిజుష్టవిశాలవిమానవిభ్రాజితంబును నగుసముద్రతీరప్రదేశంబుడాయంజనియందు ఘూర్ణితతృప్తికరనిర్యానరసమూలచందనాగరువనోపవనంబులును దక్కోలజాతిన్పుటంబులును సుగంధిఫలంబులును దమాలపుష్పంబులును మరీచిగుల్మంబులును ముక్తాసమూహంబులును శంఖప్రస్తరంబులును బ్రవాళనిచయంబులునుగాంచనరాజితశైలంబులునుమనోజ్ఞ

శిలాఫలకంబులును బ్రసన్నసలిలాశయంబులును ధనధాన్యోపపన్నస్త్రీరత్నశత సంకులగజాశ్వరథసంబాధనగరంబులును విలోకించుచు సాగరతరంగసంభూతశీతవాతపోతంబులు పై సోఁక నలరుచు నీదేశంబు స్వర్గతుల్యం బైయున్నదనికొనియాడుచుం జని యందొక్కచోటఁ దొల్లి గరుడుండు సుధాహరణార్థంబు స్వర్గలోకంబునకుం బోవుచు గజకచ్ఛపంబులఁ దన్నికొని భక్షణార్థంబు శతయోజనాయతం బైనరోహిణీశాఖ నెక్కిన నది భారంబు మోవంజాలక తత్క్షణంబు విఱుగుటయు దాని నవలంబించి తలక్రిందుగాఁ దపంబు సేయుచున్న బ్రహ్మానఖజాతు లైన వైఖానసులను వాలసంభవు లైన వాలఖిల్యులను బూతిమాషగోత్రజాతులను నయోనిజులను మరీచిపు లనుమహర్షుల నవలోకించి వారికి బాధ యగు నని యమ్మహాశాఖను నగ్గజకచ్ఛపసహితంబుగా నొక్కపాదంబునఁ దన్నికొని యంతరిక్షంబున కెగసి యందు గజకచ్ఛపంబుల భక్షించి శాఖాసహితంబుగా నిషాదవిషయంబునకుం జని యచ్చటి నిషాదుల నెల్ల మ్రింగి యవ్వనస్పతిశాఖ నచ్చట విడిచి యభిమతభక్షణనిషాదనాశనమునిజనరక్షణజనితసంతోషవిశేషంబున ద్విగుణీకృతవిక్రముండై యమరావతికిం జని యందుఁ బక్షిరాజప్రవేశపరిహారార్థంబు నిబద్ధంబు లైన యయోమయశృంఖలానిర్మితజాలంబులు భేదించిరత్నగృహంబు విధ్వస్తంబుఁ జేసి యందు నిక్షేపించి యున్నసురేంద్రగుప్తం బైనయమృతంబుఁ దెచ్చె నట్టిమహర్షిగణజుష్టంబును సుపర్ణకృతశాఖాభంగరూపలక్షణంబును సుభద్రనామకంబు నైననన్యగ్రోధవృక్షంబు నిరీక్షించుచుం జని యవ్వల నదీపతి యగు సముద్రతీరంబున నొక్కపుణ్యకాననంబున రహస్యంబుగా నున్నయొక్క రమ్యాశ్రమంబుఁ జూచి యందుఁ గృష్ణాజినజటావల్కలధరుం డై నియతాహారుం డై తపంబు సేయుచున్నమారీచుం డనురాక్షసు నవలోకించి యతనిచేత నమానుషంబు లైన సర్వకామంబుల నర్చితుం డై సంపృష్టకుశలప్రశ్నుం డై వెండియుఁ జనుదెంచుటకుఁ గార్యం బెద్ది యని యడిగిన రావణుం డతనికిట్లనియె. 629

క. దనుజోత్తమ దీనుఁడ నగు, ననుఁ గరుణం గాచుటకు ఘనంబున నీవే
యనుపమగతి వటు గావున, వినిపించెద వినుము నాదువృత్తాంతంబున్. 630

సీ. రాముండు దండకారణ్యదేశమునకుఁ జనుదెంచుటయును లక్ష్మణునిచేత
రూఢి శూర్పణఖ విరూపిత యగుటయుఁ దన్నిమిత్తము జనస్థానవాసు
లగుచతుర్దశసహస్రాసురులను గూడి ఖరుఁడు సంగ్రామార్థ మరిగి యచట
రామునిచేత శరప్రపాతనమున సైన్యంబుతోఁ గూడఁ జచ్చుటయును

తే. బలులు దూషణత్రిశిరులు పొలియుటయును, రామువిక్రమ మాతనిదీపనంబు
సర్వమును దెలియంగ సుపర్వవైరి, కడఁగి నీతోడఁ జెప్పితిఁ గాదె తొల్లి. 631

ఉ. ఇంతటిహారితోడ నొకహీననరుం డతఁ డెంత శూరుఁడో
యెంతయు శంక లేక కలహించిన భీరునిమాడ్కి నేఁడు నా
కెంతయు నూరకుండఁ దగునే యసురోత్తమ యట్టు లైన జం
భాంతకముఖ్యుల న్సమరమందు జయించినవాఁడి వోవదే. 632

ఉ. నాదుభుజాబలోద్ధతి తృణంబునకు న్సరి గాఁగ నెంచి మ
త్సోదరికర్ణనాసికముఁ ద్రుంచి విరూపిణిఁ జేసి యంతఁ బో
కాదటఁ బ్రాణమిత్త్రుల ఖరాదులఁ జంపినరాముని న్మను
ష్యాధమఁ జంప కున్న విను ప్రాణము మానముఁ బోవదే వెసన్. 633

ఉ. రాక్షసరక్షితం బగునరణ్యము సొచ్చి ఖరాదిరాక్షసా
ధ్యక్షులఁ జంపినట్టి మనుజాధిపు గీటణఁగింప కున్నచో
రాక్షసవర్య యిప్పుడె తిరంబుగ లంకకు నేగుదెంచి శి
క్షాక్షముఁ డై సమస్తసురకంటకుల న్వధియింప కుండునే. 634

—రావణుఁడు మారీచునిఁ దనకు సీతాహరణమునందు సహాయునిఁ గమ్మనుట.—

చ. అతఁడు పదాతి యయ్యు నొకఁ డయ్యును మానవుఁ డయ్యు విక్రమో
ద్ధతుల ఖరాదిరాక్షసుల దారుణరూపులఁ జంపె నట్టియ
ద్భుతబలశాలి డాసి పలుపోకల వంచన నైన శత్త్రుసం
హాతి నెదిరించి యైన మన మంకిలి యొక్కటఁ గూల్ప వల్వదే. 635

వ. చిరకాలంబున నుండి పరమమునీంద్రుల బాధించుచు నన్నియోగంబున జనస్థానంబున నివసించి యున్న చతుర్దశసహస్రరక్షోవీరుల నొక్కింత యైనఁ బరుషం బాడక వాక్పారుష్యంబు శరంబులం దనుసంధించి యశ్రమంబునం బరిమార్చి దండకారణ్యంబు సర్వజనశరణ్యంబుఁ గావించె నతండు క్రుద్ధుం డగు తండ్రిచేత నిరస్తుం డై సభార్యుం డై వనంబునకుం జనుదెంచి యాకలంబుమెసవుచు క్షీణజీవితుం డై యున్నవాఁడు విశేషించి దుశ్శీలుండును గర్కశుండును దీక్ష్ణుండును మూర్ఖుండును లుబ్ధుండును నజితేంద్రియుండును క్షత్త్రియపాంసనుండును త్యక్తధర్ముండును నధర్మాత్ముండును భూతంబుల కహితకరుండు నై ధర్మశీలు రగుమనయట్టివీర్యవంతులచేత నిందితుం డై యుండు నెవ్వనిచేత వైరంబు లేక మద్భగిని యగుశూర్పణక కర్ణనాసచ్ఛేదనంబున విరూపితయయ్యె నట్టిదురాగ్రహుం డగురాముని భార్యను సురసుతోపమ యగుసీతను విక్రమించి లంకకుం గొని తెచ్చెద నక్కార్యంబునకు నీవు సాహాయ్యంబుఁ గావింపుము సకలోపాయజ్ఞుండవు శూరుండవు సర్వమాయావిశారదుండవు గావున వీర్యయుద్ధంబులందును నీకుసమానుం డగువాఁడు ముల్లోకంబులందు నెవ్వండును లేఁడు భవత్సాహాయ్యంబునం బడయరానియర్థంబు గలదె నీవు పార్శ్వవర్తి వగుచుండ నిక్కార్యంబు సఫలంబు గావించెద నది యెట్లనిన వినుము,

చ. అరయ సువర్ణచిత్రితమృగాకృతిఁ గైకొని రాము నాశ్రమాం
తరమున సీతసమ్ముఖమునం జరియింపుము నీవు నిన్నుఁ జె
చ్చెరఁ బరికించి యీకనకచిత్రమృగంబును బట్టి తె మ్మటం 637
చఱిముఱి రామలక్ష్మణుల నా వరవర్ణిని పంపు నత్తఱిన్.

చ. పనివడి యంత వారలయపాయమునందు విధుంతుదుండు చం
ద్రునికళ నట్ల యవ్వరవధూటిని బల్మి గ్రహించి రాముఁడుం
గనికని గేహినీహరణకర్శితుఁ డై పలవించుచుండ నె 638
మ్మనమున సంతసించుచు సమస్తసుఖంబులు వేడ్క నొందెదన్.

—మారీచుఁడు రావణునకు హితోపదేశము సేయుట.—

క. అని పలికిన రామునికథ, వినినంతనె తత్ప్రతాపవిదుఁ డగుమారీ
చుని ముఖము వెల్ల నయ్యెను, మనం బధికభయసముద్రమగ్నం బయ్యెన్. 639

వ. మఱియు శుష్కంబు లైన యోష్ఠంబులు నాలుకం దడుపుచు ననిమిషంబు లైన
నేత్రవ్యాపారంబులచేత మృతభూతుం డైనవానియట్ల పరమార్తుం డై
చేష్టలు దక్కి రావణునివదనంబు విలోకించుచుఁ గొండొకసే పూరకుండి
వెండియు నొకింత తెల్వి దాల్చి చేదోయి నిటలంబున సంఘటించి యతనికిం
దనకును హితం బగునట్లుగా వినయవాక్యంబున నిట్లనియె. 640

తే. ఆపదలఁ దెచ్చునట్టిప్రియములఁ బలుకు, కపటచిత్తులు పెక్కండ్రు గలరు గాని
యాపదఁ దొలంగనిడునట్టియప్రియములఁ, బలుకువారలు వినువారు గలుగుటరిది.

సీ. దనుజేంద్ర నీ వయుక్తచరుండవును జపలుండవు గావునఁ జండవీర్యు
వరగుణోన్నతు శక్రవరుణాభు రాముని నసమానబలునిఁగా నరయ వైతి
సకలరాత్రించరులకు స్వస్తి యగుఁ గాక రాముఁ డల్గి జగం బరాక్షసంబు
గావింపకుండుఁ గాక మహీజ నీపాలి కుర్విలో మిత్తి గా కుండుఁ గాక

తే. తన్నిమిత్తంబు వ్యసనంబు దలఁగుఁ గాక, కామరతుఁడవు దుష్కార్యకారి వీవ
రుండ వగు నిన్నుఁ బొంది పేర్గొన్నలంక, నిండువేడుక నశియింపకుండుఁ గాక.

తే. జగతి నెవ్వాఁడు తన్ను రాష్ట్రమును హితులఁ, జుట్టములఁ జంపికొనఁ జూచెనట్టిదుష్ట
తముఁడు నీయట్టిదుర్జాతిదారుణుండు, ధర్మహీనుండు కలుషుండు దక్కఁ గలఁడె.

సీ. రాక్షసేశ్వర విను రాముండు లుబ్ధుఁడు గాఁడు దుశ్శీలుఁడు గాఁ డధర్మ
మార్గనిష్ఠుఁడు గాఁ డమర్యాదుఁ డగువాఁడు గాఁడు భ్రాతద్రోహి గాఁడు పితృని
రస్తుఁడు గాఁడు దుర్మతి గాఁడు తీక్ష్ణుఁడు గాఁ డవిద్వాంసుఁడు గాఁడు కర్క
శుఁడు గాఁడు కులపాంసనుఁడు గాఁడు కైకచే వంచితుఁ డగుసత్యవాదిజనకు

తే. నెఱిఁగి తత్ప్రియకామార్థమెల్ల సిరులు, రాజ్యమును బాసి దండకారణ్యమునకు
వచ్చె నమ్మహాత్ముని ప్రభావంబు దెలియ, కాగ్రహంబున ననృతంబు లాడఁదగునె.

తే. రామభద్రుండు సత్యపరాక్రముండు, ఘనుఁడు ధర్మమూర్తి సకలజననుతుండు

పండితుండును సురల కింద్రుండవోలె, నఖిలలోకంబులకు నాథుం డసురవర్య.

క. అక్షీణతేజమున నభి, రక్షిత యగురామసతిని బ్రసభంబున లో
కాక్షిరుచినట్ల నీ వే, దక్షతచే నపహరింపం దలంచితి బుద్ధిన్. 646

తే. శరశిఖోద్దీర్ణ మప్రధృష్యంబు రుచిర, చాపఖడ్గేంధనంబు ప్రచండదీప్త
మగుచు రాజిల్లురామాగ్నియందుమిడుత,పగిదినుఱుకం దలంప నీకగునెయధిప.

చ. ఘనతరజీవితంబును సుఖంబును రాజ్యము వీటిఁబుచ్చి నీ
వనిశము ఖడ్గపాశధరుఁ డన్యచమూహరణుం డమర్షణుం
డనుపమబాణహేతియుతుఁ డద్భుతకార్ముకదీప్తవక్త్రుఁ డై
యను నగు రాఘవాఖ్యవిలయాంతకునిం జెనకంగ నేటికిన్. 648

తే. అమ్మహాత్మునిఘన తేజ మప్రధృష్య, మట్లు గావునఁ దత్కార్ముకాశ్రయ యగు
భూమిపుత్రిని గాననభూమియందు, సాహసంబున హరియింపఁ జాల వీవు.

చ. అనఘుఁడు సత్యసంధుఁడు మహాత్ముఁడు విక్రమవంతుఁ డైన రా
మునకు మహీజ జీవితముఁ బోలినప్రేయసి వీర్యశుల్క యు
య్యనలుని హేతితో నెనయునాహరిణేక్షణ నాకులాంగనం
బనివడి నీకు వేగతుల బల్మి గ్రహింపఁగ రాదు రావణా. 650

క. ఏటికిఁ దలంచితి విప్పని, మాటికి లోకమున నింద్యమానుఁడ వై దో
పాటకులేశ్వర నిక్కము, చే టొందెద వంతె గాక చేకొన వశమే. 651

క. అక్షీణతేజమున నభి, రక్షిత యై భానురుచికరణిఁ గ్రాలెడు ప
ద్మాక్షిని సీతను నీ వే, దక్షతచే నపహరింపఁ దలంచితి బుద్ధిన్. 652

క. అతులిత మగురాజ్యము జీ, వితంబును సుఖంబు ననుభవింపంగఁ దలం
చితి వేని రామునకు నప, కృతి సేయక యుండు టదియె హిత మసురేంద్రా.

మారీచుఁడు రామునిచేఁ దాను బడినపాటు రావణునకుఁ దెల్పుట.

వ. సుజియు ధర్మిష్ఠు లగువిభీషణపురోగము లైనసచివుల నందఱం గూర్చి వారి తోడ నాలోచించి గుణదోషబలాబలంబులు విచారించి స్వపరబలవిశేషం బెఱింగి హితాహితంబు దలపోసి యవ్వల మే లగునట్టికార్యంబు నిశ్చయింప వలయు నంతఁ నీ హితుండ నైననాబుద్ధి విని రామునియందు విరోధింపక క్షమింపుము భవజ్జీవితంబు రామదర్శనావసానం బని దలంచెదఁ దొల్లి యేను బలవీర్యదర్పంబులచేత ననమానుండ నై మదనాగాయుతబలంబు గలిగి పర్వత సన్నిభం బైనమచ్ఛరీరంబు నీలజీమూతంబుచందంబునం గ్రాలఁ దప్త కాంచనకిరీటకుండలంబులు మేనం దీపింపఁ బరిఘాయుధంబు కేలం దాల్చి లోకంబునకు భయంబుఁ బుట్టించుచు మహియెల్ల సంచరించుచు దండ కారణ్యంబుఁ బ్రవేశించి మునిమాంసంబు భక్షించుచు స్వేచ్ఛాప్రకారం బున విహరించు చుండ మన్నిమిత్తంబున విత్రస్తుం డై విశ్వామిత్రుం డను

బ్రహ్మర్షిశ్రేష్ఠుం డయోధ్యకుం జని దశరథుంగాంచి యన్న రేంద్రున కిట్లనియె.

తే. నృపకులోత్తంస మాకు మారీచువలన, నధికభయము సముత్పన్నమయ్యెఁ గాన
యాగకాలమునందు సమాహితుండ, నైన నన్నుఁ బ్రోచుఁ గాక నీసూనుఁ డిపుడు.

వ. అని రామసాహాయ్యంబు వేఁడిన విని యద్దశరథుండు విశ్వామిత్రున కిట్లనియె.

క. బాలుఁడు ద్వాదశవత్సరుఁ, డాలంబుల తెఱఁ గెఱుంగఁ డకృతాస్త్రుం డీ
శీలము గలరాము ననికి, వాలాయము నాకుఁ బంప వచ్చునె యనఘా. 657

క. ఏ నిప్పుడు నానావిధ, సేనలతోఁ గూడి వచ్చి చెచ్చెర ననిలో
మానుగ నీశత్రువులను, బూనికి వధియింతు లెండు పోద మచటికిన్. 658

వ. అనిన నమ్మునీంద్రుం డమ్మనుజేంద్రున కిట్లనియె. 659

క. ఆరాక్షసు వధియింపఁగ, శ్రీరామునకంటె నొరుఁడు త్రిజగమునందుం
బేరు గలవారిలోపల, నారయఁగా లేఁడు దశరథాధిప వింటే. 660

వ. రాజేంద్రా నీవు సమరంబులయం దాఱితేఱినశూరుండవు దేవతల రక్షించిన
మహానుభావుండవు భవత్కృతం బైనరణకర్మంబు త్రిలోకవిశ్రుతం బై యుండు
నీకుఁ జతురంగసైన్యంబు కొఱంత లేకుండ నధికం బై యున్న దైన నీకా
ర్యంబు రామునకుం దక్కఁ దక్కినవారి కసాధ్యంబు గావున నిమ్మహాత్ముండు
బాలుం డైనఁ గొఱంత లేదు సముదీర్ణం బై ననిజతేజంబున రక్షోనిగ్రహంబు
నందు సమర్థుం డై యుండు నితనిం దోడ్కొని యరిగెద నిమ్మహాత్మునకును
నీకును భద్రంబు గలుగుఁ గాక యని పలికి దశరథు నొడంబఱిచి యమ్మునీం
ద్రుండు రాముని దోడ్కొని పరమహర్షంబున నిజాశ్రమంబునకుం జనుదెంచి
పర్వకాలంబున మఖదీక్షితుం డై యుండె నంతఁ దన్నియోగంబున శ్రీమం
తుండును బద్మపత్రనిభేక్షణుండును మహావీర్యుండును నజాతవ్యంజనుండును నేక
వస్త్రధరుండును బ్రహ్మచర్యస్థితుండును గాకపక్షధరుండును గనకమాలోపలక్షి
తుండు నై రాముండు చిత్రం బగుచాపంబు సారించుచుఁ బ్రదీప్తం బగుస్వతే
జంబున నయ్యరణ్యంబు వెలింగించుచు నుదితుం డగుబాలచంద్రుండుంబోలెఁ
దేజరిల్లుచుండె నంత. 661

క. బలవంతుఁడ నగు నే నపు, డలయక వరదానమహిమ నట కేగి చలం
బలరఁగఁ బరిఘము కరమునఁ, జెలువారఁగ బరవసంబుఁ జేసితిఁ గడిమిన్ 662

క. ననుఁ జూచి రామభద్రుఁడు, ధనువును సజ్యంబుఁ జేసి తలఁకక యచలం
బునుబోలె సుస్థిరుం డై, మునిపతి కభయంబుఁ దెల్పి మొనయుచు నుండెన్.

ఆ. ఇతఁడు బాలుఁ డాజి నెంతని బుద్ధిమో, హమున నేను గడిమి నట్టహాస
మాచరింప నంత నతితీక్ష్ణమగుతూపు, వింటివలన నపుడు వెడలి వచ్చె. 664

వ. ఇట్లమోఘరయంబునం బఱతెంచి యమ్మహాశరంబు నన్నుం దాఁకిన నేను
శత్రునిబర్హణబాణతాడితదేహుండ నై శతయోజనంబుదవ్వులం గలసము

ద్రంబునం బడి మూర్ఛ నొందితి నప్పు డారాముండు దయాళుం డై న
వధియింపక గాచి పుచ్చె నిట్లు రామునిశరవేగంబున నిరస్తుండ నై య
నుండ నై గంభీరం బగుసాగరజలంబునం బడి చిరకాలంబునకుఁ గ్రమ్మఱ
సంజ్ఞుండ నై బ్రతుకు మరలఁ గంటె నని తలంచి యత్తెరువునకుం జనక ల
పురంబుఁ బ్రవేశించితి మత్సహచరు లైనరాక్షసు లందఱు రామునిచేత
తు లై రప్పుడు రాముండు బాలుండును నవభ్యస్తాస్త్రుండు నై యంతఁ
నిప్పుడు యౌవనాధికుం డై యస్త్రవిద్యయం దాఱితేరియున్నవాఁ డ
త్మునితోడ విగ్రహంబుఁ గావించితి వేని ఘోరం బైనయాపద సంభవి
సంశయంబు లే దని పలికి మారీచుండు వెండియు ని ట్లనియె.

తే. అరయఁ గ్రీడారతివిధిజ్ఞు లమితబాహుసత్వులును సమాజోత్సవశాలు లై
దానవులకు ననర్థసంతాప మేల, పొసఁగఁ జేసెద విటు బుద్ధిపూర్వకము

క. నిరుపమమణిచిత్రితమును, దరహర్మ్యవిమానశోభితం బగులంకా
పుర మాసీతకతంబునఁ, గర మభిహత మగుచు నుండఁ గాంచెద వధిపా.

తే. పాపములు సేయ కుండియుఁ బరమశుచులు
రాక్షసోత్తమ పాపసంశ్రయమువలన
నెపుడుఁ బరపాపముల నశియింతు రహిజ
లాశయమునందు మత్స్యంబు లణఁగినట్లు.

క. హరిచందనదిగ్ధాంగులు, వరాభరణభూషితు లగువాసవరిపులం
గరము భవద్దోషంబున, ధరణినిపాతితులఁ గాఁగఁ దలఁపుము బుద్ధిన్

వ. మఱియు రామశరపాతనంబునఁ దమవా రెల్లఁ బొలిసిన హతశేషు లగు
సులు తమకు రక్షకుండు లేక భయంబునఁ గనుకనిం బఱచుచుండ నిరీక్ష
గల వదియునుం గాక బహువిధశరశిఖాపరంపరల భస్మీభూతం బై క
లంకాపురంబు గనుంగొనియెదవు సంశయంబు వలదు పరదారాభిమర్శన
కంటె నధికం బగుపాపంబు వే ఱొక్కటి లేదు నీకుఁ బ్రమదాసహస్రం
భార్యలు గలరు నావచనంబుఁ బట్టి స్వదారనిరతుండ వై కులంబును మ
బును రాష్ట్రంబును నిష్టం బగుజీవితంబును గళత్రంబులును బంధువర్గం
రక్షించుకొను మట్లు సేయ వైతి వేని రామశరవినాశితజీవితుండ వై
బున బంధుసహితంబుగా యమక్షయంబునకుం జనియెద వది యట్లుండ
మత్పురావృత్తాంతంబు వినిపించితిఁ గదా యిప్పుడు వెండియు నాకుం
ల్గిన యాపద నెఱిం గెఱింగించెద నిరుత్తరంబుగా వినుము.

సీ. అనురేశ యేనుమృగాకృతిఁ గైకొని మృగరూప మగుదైత్యయుగముఁ
తీక్ష్ణశృంగంబులు దీప్తజిహ్వయు మహాకాయంబు సత్త్వంబు గ్రాలు చు
ఘన మగుదండకావనముఁ బ్రవేశించి చైత్యవృక్షములందు శైలలందుఁ

దీర్ఘదేశములందుఁ దిరుగుచుఁ దపసులఁ దునిమి తన్మాంసంబుఁ దినుచు వారి
తే. రుధిరములు గ్రోలి వనగోచరులకు భీతి, పుట్టఁ జేయుచు రౌద్రత మిట్టిపడఁగ
వలసినట్లుగ వనమెల్లఁగలయఁరయము,మిక్కుటంబుగఁదిరుగుచు నొక్కనాఁడు.
సీ. ధర్మవిచారుఁ డై తాపసాకృతిఁ బూని సీతయు సౌమిత్రి చేరి కొల్వఁ
దాపసోచితవృత్తిఁ దపముఁ గావించుచు నున్నరామునిఁ గాంచి మున్నునాకుఁ
జేసినయపకృతిఁ జింతించి క్రుద్ధుండ నై డాయ గమకించునంతలోనఁ
దచ్చాపనిర్ముక్తదారుణబాణత్రయంబు మాముప్పిర నతిరయమున
తే. నశనిసంకాశ మై తాఁకె నపుడు తత్ప,రాక్రమవిదుండఁ గావున రాక్షసేంద్ర
యేను బాఱితిఁ దక్కిన యిరువు రుగ్ర, భంగిఁ గూలిరి తద్బాణపాతనమున.
వ. ఏను గొండొకసేపునకు మూర్ఛ దేఱి బ్రతుకు మరలం గాంచి మాతృగర్భం
బుననుండి గ్రమ్మఱం బుట్టినవానిఁగాఁ దలంచుకొనుచు నాఁటంగోలె నాసుర
కృత్యంబు విసర్జించి తాపసుండ నై యివ్వనంబునఁ దపంబు సేయుచున్నవాఁడ 673
నదియునుం గాక.

మారీచుఁడు తనకుం గలరామభయమును రావణునకుఁ దెల్పుట.

చ. భ్రమఁ గొని నాఁటనుండి ప్రతిపాదపమందును రామభద్రునిఁ
సముదితరౌద్రుఁ గాఁగ ధృతచాపునిఁ గాఁగ మహోత్తముఁ గాఁగ సం
యమివరుఁ గాఁగ వల్కలజటాజినధారిని గాఁగ రాక్షసో
త్తమ కను చున్నవాఁడ నిటఁ దప్పక దారుణకాలునిం బలెన్. 674
క. కనులకు రామసహస్రము, లనవరతముఁ దోఁచు చున్న వటు గావున ని
వ్వన మెల్ల రామభూతం, బని తలఁచుచు నున్నవాఁడ ననురేశ మదిన్. 675
తే. అసురకులవర్య స్వప్నమం దైన రాము, భద్రరూపంబు మదికిఁ జూపట్టె నేని
గురుభయంబున మూర్ఛిల్లి కొంతవడికిఁ, దెలిసి కలయని క్రమ్మఱఁ దెలివిఁగాంతు.
వ. మఱియు రామవిత్రస్తుండ నైననాకు రత్నరథాదికంబు లైన రేఫాదినామం
బులు చెవికి సోఁకిన నధికభయంబునం గళవళించుచుండుదు వేయేల రేఫా
ద్యం బైనభవన్నామంబును వినుట కధికభయం బగుచున్నది కావున నమ్మహా
త్మునితోడఁ జివ్వకుం జొర నొల్ల నతండు బలినముచివృత్రాదుల నైన లెక్కిం
పక నొక్కమాత్ర నుక్కున నుక్కడంగించునట్టిజెట్టిజోదు నీకును రాముని
తోడి విరోధంబునకుఁ జొరకుండుట క్షేమం బట్లు గాదంటి వేని తగువారల
సాయంబు గూర్చుకొని నీవె యిప్పనికిఁ గడంగుము న న్నేల రామునియమో
ఘబాణంబులకు సమర్పించెదవు నాకు సేమంబుఁ గోరితి వేని నా మోఁ(?)ల రామ
వృత్తాంతంబుఁ జెప్పకుము లోకంబునందు సాధు లనేకులు నియతచిత్తు లై
ధర్మంబు లనుష్ఠించు చుండియుఁ బరులయపరాధంబున సపరిచ్ఛదంబుగా
నాశంబునొందుదు రట్ల యేనును నీయపరాధంబున నశింపం గలవాఁడ నీతోడి
చుట్టఱికం బింతకుం దెచ్చె మహాతేజుండును మహాసత్వుండును మహాబలుం

డును మహానుభావుండు నగు రాముండు రాక్షసుల పాలిటి కంతకుండై జన్మించినవాఁడు శూర్పణఖ హేతువువలన మహాబలుం డగు ఖరుండు నిమిషమాత్రంబునఁ బొలిసె నతనిపాటునుం దలంపవైతివి నీయట్టి గట్టిమగలు పెక్కండ్రైన నమ్మహాత్మున కొక్కనికి సాటి సేయం దగదు బంధుహితార్థినైన నావచనంబున కనాదరణంబుఁ జేసి రామునితోఁ గలహించితి వేని నిశితంబులైన తదీయశరంబులచేతఁ బీడితుండవై బంధుసహితంబుగా మడిసెద వని యిట్లు బహుప్రకారంబులం బ్రబోధించిన మృత్యుకాముండు దివ్యౌషధంబుం బోలె క్షేమయుక్తంబైన మారీచునివాక్యంబుఁ గైకొనక కాలచోదితుండై రావణుండు పరుషవాక్యంబున నతని కిట్లనియె. 677

రావణుఁడు మారీచుని దూఱుట.

తే. నేరిచినవానిచందాన నీవయుక్త, భంగి నామ్రోల నెయ్యది పలికి తిప్పు
డది విశేషించి నిష్ఫల మయ్యె నూష, రమున నించిన నూత్నబీజముల కరణి.

తే. పాపశీలుండు మనుజుండు బాలిశుండు
చపలుఁ డగు రాఘవుని పౌరుషము ఘన మని
నీవు పలికిన యంతనె నృపునితోడి
కలను విడుతునె యిఁకఁ దాటకాతనూజ. 679

చ. హితులను దల్లిదండ్రుల నహీనసుఖంబును బచ్చిఁ బాసి ప్రా
కృత మగు కాంతమాట విని యెవ్వఁ డరణ్యముఁ జొచ్చె నట్టి దు
ర్మతి యగు రాజనందనుని ప్రాణసమప్రియ యైన జానకిన్
ధృతి చెలఁగంగ నే నపహరించెద నిక్కము నీదుసన్నిధిన్. 680

క. ధృతి పెంపున నీగతి ని, శ్చిత యైతగ నాదుబుద్ధి చెలఁగెడు దానిం
జతురత మరలింప దివ, స్పతిముఖదిక్పాలు రైనఁ జాలరు తలఁపన్. 681

వ. తాటకేయా కార్యాకార్యవినిశ్చయవిషయంబునందు గుణదోషంబులును నుపాయాపాయంబులును విచారించి చెప్పు మని నిన్నడిగిన నిట్లు చెప్పవచ్చు మా కట్టి జిజ్ఞాస లేదు గావున లేని యధికారంబునొంది యిట్లపృష్టోత్తరంబులు పలుకుట యుక్తంబు గా దెవ్వండు తనకు హితంబుఁ గోరు నట్టి విద్వాంసుం డగు సచివుం డసంపృష్టుండై రాజుమ్రోల నిట్లనుచితప్రసంగంబు ప్రతికూలంబుగాఁ గావింపండు కావున. 682

తే. కూర్తు వనుచు నీతోడ నాకోర్కి దెలియఁ
జెప్పినందుకు హితయుక్తిఁ జెప్పకిట్లు
నేర్పు లేర్పడ గుణదోషనిర్ణయంబు
నెఱిఁగినట్లుగఁ బ్రతికూల మెన్నఁ దగునె. 683

క. తగువైఖరి ననుకూలం, బగువాక్యము విభునితోడ నతిమృదుపూర్వం
బగునట్లు చెప్పవలయును, జగతి న్బ్రతికూల మాడఁ జనదు హితులకున్. 684

వ. మఱియు మానార్హుం డగుమహీరమణుండు సమ్మానశూన్యంబును దిరస్కార
సహితం బగువాక్యం బెద్దికలదదిహితం బైనను బ్రతిగ్రహింపఁడదియునుంగాక.

చ. అమితగుణాఢ్యు లై నృపు లగ్నిసురేశమృగాంకవార్థిరా
ట్పునులపంచరూపములు సమ్మతిఁ గైకొని తైక్ష్ణ్యము న్సువి
క్రమమును సౌమ్యముం దగుతెఱంగున దండము సుప్రసన్నతన్
సముచితభంగిఁ దాల్చి జనసమ్మతు లై చరియింతు రెల్లెడన్. 686

క. కావునఁ బృథివీశులు స, ర్వావస్థలయందుఁ బూజ్యు లధికులు మాన్యు
ల్నీ వది యెఱుఁగక యజ్ఞుని, కైవడిఁ బరుషోక్తు లాడఁగాఁ దగ వగునే. 687

వ. ఏ నిప్పుడు గుణదోషంబులును గార్యాకార్యంబులందు యుక్తాయుక్తభావం
బులును నిన్నడుగలే దేనొక్కకార్యంబు నుద్దేశించి వచ్చితి నక్కార్యవిషయం
బునందు నీవు సాహాయ్యంబుఁ గావింప వలయు నది యెట్లనిన వినుము. 688

—రావణుఁడు మారీచున కతఁడు చేయవలసినకార్యముఁ జెప్పుట.—

చ. అరయ సువర్ణచిత్రితమృగాకృతిఁ గైకొని రామునాశ్రమాం
తరమున సీతసమ్ముఖమునం జరియించుచు బెళ్కుచూపులన్
వరతనుకాంతులం జికిలివన్నెలఁ జిన్నెల నాత్రిలోకమున్
దరి కతివిస్మయంబును ముదంబును మోహముఁ బుట్టఁ జేయుమీ. 689

—రావణుఁడు మారీచుని బెదరించుట—

వ. ఇట్లు కాంచనమయమాయామృగస్వరూపుండ వై నన్నిను విలోకించి యమ్మ
హీపుత్త్రి జాతవిస్మయ యై శీఘ్రంబున దీనిం బట్టి తెచ్చి యిమ్మని రాముని
బ్రార్థించు నతండు ప్రియురాలికిఁ బ్రియం బొనగూర్చువాఁ డై నిన్నుం బట్ట
వచ్చు నప్పుడు నీ వతనికిం జిక్కక నానాప్రకారంబులం జిక్కులు వెట్టుచు
నుపాయబలంబున దూరంబునకుం బాపి కొని చని రామవాక్యానురూప
కంబుగా సీతాలక్ష్మణులం బేర్కొని యెలుం గెత్తి దీనస్వరంబున విల
పింపు మవ్వాక్యంబు విని సీతాప్రచోదితుం డై లక్ష్మణుండు సౌహృదంబున
రామమార్గానుసారి యై యరుగు నంత నేను రామలక్ష్మణరహితం బైనయాశ్ర
మంబునకుం జనుదెంచి సహస్రాక్షుండు పులోమజంబోలె నొంటి యై వెలుంగు
చున్న వైదేహిం జేకొని లంకకుం జనియెద నిక్కార్యంబు సఫలంబుఁ గావిం
చితి వేని నా రాజ్యంబులోన నర్ధరాజ్యంబు నీ కొసంగెద మద్వచనంబు నమ్మి
మనోహరం బైనమృగరూపం బంగీకరించి చను మేనును రథారూఢుండ నై
నీ పిఱుంద దండకారణ్యంబునకుం జనుదెంచెద యుద్ధంబు గాకుండ రాముని
వంచించి జానకి నపహరించి కృతకృత్యుండ నై భవత్సమేతంబుగా లంకాపు

రంబుఁ బ్రవేశించెద నిట్లు సేయ వైతి వేని నిశాతం బగుకృపాణంబున భ
రంబు దెగవ్రేసెదఁ బ్రాణభయంబువలన బలాత్కారంబుగా నీవె యి
ర్యంబుఁ గావించెదవు రాజున కనుకూలుండు గానివాఁడు సుఖం బనుభ
జాలం డనియెడులోకప్రవాదం బెఱుఁగుదువె కదా యిప్పుడు మృగర
బున రాముని డాసితి వేని నీకు జీవితహానిలాభంబులు సందిగ్ధంబు లై య
నాతోడ విరోధించితి వేని నిక్కంబుగా జీవితహాని యగు దీని నెఱింగి యెం
యుక్తంబు దానిఁ గావింపు మని పలికిన నమ్మారీచుండు రాజార్హవాక్యం
నాజ్ఞప్తుం డై పరుషం బైనప్రతికూలవాక్యంబున రావణున కిట్లనియె

మారీచుఁడు రావణునిఁ బరుషముగా దూఱుట.

సీ. దశకంఠ పుత్రమిత్రకళత్రసహితుండ వై ననీ కేకలుపాత్ముచేత
నుపదిష్ట మయ్యె నీవిపరీతదుష్కర్మ మెవ్వాఁడు నినుఁ జంప నిచ్ఛగించె
సుఖి వై ననినుఁ జూచి సొరిది నేపాపాత్ముఁ డభినందితుండు గాఁ డయ్యె న
దొడరి యెవ్వాఁడుమృత్యుద్వారమున కేగుమనిపంచెఁ గరముపాయమునఁ

ఆ. యధిప పీనసీసుఖ లై ననీరిపులు నీకంటె నధికుఁ డై నకౌనలేయు
చేత నాఁగఁబడి నశించెదునినుఁజూడఁ, దలఁచి రిది మహాద్భుతంబు సువ్వె

తే. పాకశాసనవైరి యేపగతు లాత్మ, నిర్మితోపాయమున నీవు నిధన మొంది
చనుచు నుండ విలోకించి సమ్మదంబు, సెలఁగ నపహాసమొనరింపఁదలఁచిరి

తే. అధిప శాస్త్రవిరుద్ధమార్గానుసారి, వై ననిన్ను నివారింప నట్టిసఖులు
వసుధ నెవ్వారు గల రట్టివారి నెల్లఁ, బట్టి నిశితాసిచేఁ దలగొట్ట వలదె.

తే. కాపథరతుండు కలుషుండు కామవృత్తుఁ, డగుమహీపతి నయవినీతాత్ము
మంత్రసిద్ధులచేత సమంచితముగ, నిగ్రహింపంగఁ బడు నిది నిక్కువంబు.

వ. నివర్తనీయుండ వై ననీ వేల నివర్తింపం బడ వైతి వదియునుం గాక.

తే. విమలధర్మార్థకామయశములు సచివ, వరులు స్వామిప్రసాదంబువలన మిగ
నొందుదురు తద్విపర్యయ మందునవియు, సర్వము నిరర్థకంబులై చను సు

వ. మఱియు స్వామివైగుణ్యంబునఁ గేవలామాత్యులే వ్యసనంబు నొందుట
సర్వజనంబును వ్యసనంబు నొందు ధర్మంబును జయంబును రాజమూల
గావున సర్వావస్థలయందును రాజులు రక్షితవ్యు లై యుందురు.

క. క్షితి నవినీతుఁడు తీక్ష్ణుఁడు, ప్రతికూలుం డై నభూమిపాలునిచేతం
జతురంతమహీరాజ్యం, బతులితముగఁ బ్రోవ శక్య మై యుండ దొగిన్.

ఆ. జగతిఁ గ్రూరమంత్రు లగుమంత్రు లెవ్వారు, పతి భజింతు రట్టివారు విష
మార్దు వానితోడ మందసూతము లైన, హయములట్ల చెడుదు రధిప విం

క. ప్రతికూలుఁడు తీక్ష్ణుఁడు దుర్మతి యగుభూవిభునిచేత మనుజులు నిత్యో
న్నతి వృద్ధి నొంద నేరరు, క్షితి మేషము జంబుకంబుచేతం బోలెన్.

క. నిరనుగ్రహుఁడవు క్రూరుఁడ, వరయఁగ నజితేంద్రియుండ వగు నీ విల నె
వ్వరికిం బతి వట్టిరజనీ, చరు లంకయు నీకతమున నమసెద రింకన్. 701

వ. రాక్షసేంద్రా యే నొకరుండ యాదృచ్ఛికం బైనపాపంబున నశించెదఁ గావున శోచనీయుండఁ గాను నీవు బుద్ధిపూర్వకంబుగాఁ బాపంబుఁ జేసి బంధుసహితంబుగా నశింప నున్నవాఁడవు గావున నీవే శోచనీయుండవు 702

క. ననుఁ జంపి పిదప నిన్నును, ఘనరణమునఁ జంపు శీఘ్రకాలంబున రా
మునిచేతఁ జచ్చి యిప్పుడె, యనిమిషకులవైరి నేఁ గృతార్థుఁడ నగుదున్.

వ. మఱియు రామసందర్శనమాత్రంబున నేను గెడసెదఁ బదంపడి సీత నపహరించి బంధుసహితంబుగా నీవు పొలిసెదవు సందియంబు లేదు సీత నపహరించికొని తెచ్చితి వేని నీవును నేనును లంకయు రాక్షసులును నశింతు రింతయు నిక్కంబు రాక్షసేంద్రా హితకాముండ నైననాచేత నివార్యమాణుండ వయ్యును మద్వాక్యంబుఁ గైకొన వైతివి క్షీణాయువు లగునరు లాసన్నమరణులై సుహృత్సమీరితం బైనహితంబు విన నొల్లరని యిట్లు బహుప్రకారంబుల రావణునిదౌరాత్మ్యంబునకు గర్హించి పదంపడి రావణభయంబున దీనుం డై యి ట్లనియె. 704

ఉ. అంతకవిక్రముం డయిన యా రఘువీరుని డాసి క్రన్నఱం
బంతె మెఱర్ప నా కిచటఁ బ్రాణయుతంబుగ నుండరాదు కా
లాంతకదండతాడితుఁడ వైన నిను న్మరలింపఁ జాల నిం
కెంత యని చెప్పువాఁడ నిపు డేగెద రావణ నీకుఁ బ్రీతిగన్ 705

రావణుఁడు మారీచసహితుండై రామాశ్రమమునకుఁ బోవుట.

వ. నీకు స్వస్తి యగుఁ గాక యని పలికిన యమ్మారీచునివాక్యంబున కలరి రావణుండు వానిం గౌఁగిలించుకొని రాక్షసోత్తమా నీచేత మదభిప్రాయానుసారంబుగా నీదృశం బైనపౌరుషవాక్యంబు సముదీరితం బయ్యె నిప్పు డెప్పటి మారీచుండ వైతి వింతకు మున్నధైర్యావలంబనంబున వేఱొక్కరాక్షసుండ వైతివని బహూకరించి వెండియు ని ట్లనియె. 706

చ. అఱమఱ లేక జీవితసఖా నిను నమ్మినవాని కెంతయు
న్గొఱఁతలు గల్గునే యతిమనోహరనూతనహేమభూషిత
స్ఫురదురురాసభంబులను బూన్చినచారుమణీశతాంగముం
బరువడి నెక్కు మిప్పుడు సమంచితవైఖరిఁ గార్యసిద్ధికిన్. 707

వ. అని ప్రియంబుఁ బలికి దశగ్రీవుండు మారీచసహితంబుగా విమానంబుం బోని కాంచనరథం బెక్కి శీఘ్రంబున నయ్యాశ్రమంబు నిర్గమించి యంత నంతఁ బురంబులు జనపదంబులు నానావిధవనంబులును బత్తనంబులును సరిద్గిరిసమూహంబులును విలోకించుచుం జనిచని దండకారణ్యంబుఁ బ్రవేశించి యందు

దవ్వుల రామాశ్రమంబుఁ జూచి యచ్చట నరదంబు డిగ్గి తనకరంబున నమ్మారీచునికరంబుఁ బట్టుకొని యిట్లనియె. 708

మారీచుఁడు సువర్ణచిత్రమృగరూపమును గైకొనుట.

క. కదళీవనశోభిత మై, యదిగో రాఘవునిపావనాశ్రమపద మొ
ప్పిద మై యున్నది నీ విఁక, మదిఁ దలఁచినపనికిఁ జొరు మమర్త్యవిరోధీ.

క. నావుడు మారీచుం డా, రావణువాక్యంబు విని తిరంబుగ నాశ్చ
ర్యావహముగఁ గైకొనియెను, సౌవర్ణమృగత్వ మపుడు చతురత మెఱయన్.

వ. ఇంద్రనీలరత్నాకారశృంగాగ్రంబును సితాసితముఖంబును రక్తపద్మోత్పలముఖపుటంబును నింద్రనీలోత్పలశ్రవణంబును మధూకపుష్పసదృశపార్శ్వద్వయంబును గించిదభ్యున్నతగ్రీవంబును గుందేందువజ్రసంకాశపరమభాస్వరతలోదరంబును బద్మకింజల్కసన్నిభంబును వైడూర్యసంకాశఖురంబును దనుజంఘంబును శ్లిష్టసంధిబంధంబును నింద్రాయుధసవర్ణపుచ్ఛంబును మనోహరస్నిగ్ధవర్ణంబును నానారత్నసమావృతంబును మనోహరంబును దర్శనీయంబును నానాధాతువిచిత్రంబును రౌప్యబిందుశతచిత్రంబును బ్రియదర్శనంబును రాజీవచిత్రపృష్ఠంబును బరమశోభనంబు నగుమృగరూపం బంగీకరించి నిజదేహప్రభాజాలంబుల నక్కాననంబు వెలిఁగించుచు వనం బెల్లఁ గలయం దిరుగుచు శాద్వలంబులం గ్రీడించుచు విటపికిసలయంబులు మెసవుచు మనోజ్ఞగంధపుష్పంబులు మూర్కొనుచు గుంజగృహంబులఁ దూఱుచు సీతాసందర్శనంబు కాంక్షించి కదళీషండంబు సొచ్చి మందగమనంబునఁ గర్ణికారంబుల నాశ్రయించుచు మెల్లన రామాశ్రమంబు డగ్గఱె. 711

సీ. ఒకమాటు వనమృగయూథంబుతోఁ గూడి క్రీడించు నొకమాటు క్రేళ్లుదాఁటు
నొకమాటు తృణఖాదనోద్యోగ మొనరించు వడలక యొకమాటు బెదరిచూచు
నొకమాటు మెఱయు విద్యుద్వల్లికై వడిఁ జరియించు నొకమాటు శాద్వలముల
నొకమాటు లఘుగతి నుద్వేగి మై పాఱు బిరబిర నొకమాటు తిరిగి వచ్చు

ఆ. వింత చెవులు దాల్చి విహరించు నొకమాటు, గంతు లిడుచుఁ బెక్కుగతుల నిట్లు
కఠినరాక్షసుండు కపటమృగాకృతి, నలరె రాఘవాశ్రమాంతికమున. 712

ఉ. దానిమనోజ్ఞరూపము ముదంబునఁ గన్గొని వన్యసత్త్వముల్
మానుగ వెంట నంటి పలుమాఱు చరించుచు నాదెనా రెకుం
బూనిక నెయ్య మేర్పడఁగ మూఁపటు మూర్కొని వింతజాతి యీ
కానమెకం బటంచు బెఱుకంపమునం బసిగెత్తు నత్తఱిన్. 713

ఉ. ఏడది యీమృగంబు మృగహింస యొనర్చెడు నంచుఁ గ్రుద్ధుఁడై
వాఁడిశరంబునం దునిమి వైచును రాఘవుఁ డంచు భీతిచే
తోడిమెకంబులం జనవు దోఁపఁగ మూర్కొని వీడుఁ గాని తా

కాంక్షి వధింపఁ డయ్యె మృగరూపధరుం డగుదైత్యుఁ డయ్యెడన్. 714

సీత మాయామృగమును జూచి యచ్చెరు వందుట.

వ. ఇట్లనేకప్రకారంబుల సీతాప్రలోభనార్థంబు విచిత్రమండలంబులు సేయుచు రామాశ్రమపదాభ్యాశంబున నతిరమణీయంబుగా విహరించుచున్నసమయంబున. 715

సీ. శుభనేత్ర యగుసీత సుమసంగ్రహవ్యగ్రయై శాలముంగలి కరుగుదెంచి
కర్ణికారాశోకకాంచనచూతప్రసూనము ల్గోయుచు సొంపు మీఱ
ముక్తావిచిత్రాంగమును హైమరాజతవర్ణపార్శ్వంబులు స్వర్ణకాంతి
రుచిరవాలంబును రూప్యధాతుతనూరుహంబులు గలిగి నిజాగ్రభాగ

ఆ. మున దృష్టపూర్వమై యొప్పుచున్నమా, యామృగంబుఁ జూచి యధికవిస్మ
యంబు నొందను దానియతిరమణీయాంగ,శోభ కలరి మఱియుఁ జూచునపుడు.

క. ఆకపటమృగము చిత్రతఁ, గైకొని వైదేహిఁ జూచి క్రమ్మఱ వన మ
స్తోకగతి న్వెలిఁగించుచుఁ, బ్రాకటముగ సంచరించె భ్రమ జనియింపన్. 717

ఉ. దానిమనోహరాకృతియు దానియపూర్వవిచిత్రకాంతియున్
దానిగతిప్రమాణమును దానిసమగ్రవిహారదాక్ష్యము
న్దానివిలోచనద్యుతి ఘనంబుగఁ జూచినయంత సీతకుం
బూనికఁ దత్పరిగ్రహణబుద్ధి జనించెను దైవికంబుగన్. 718

వ. ఇట్లు క్రీడార్థంబు మాయామృగగ్రహణకుతూహలినియై మృష్టకాంచనవర్ణాంగి యగుజానకి రామలక్ష్మణులం జీరిన వా రచ్చోటికిం జనుదెంచి పరమదర్శనీయంబై యున్న యప్పైఁడిమెకం బవలోకించి రప్పుడు లక్ష్మణుండు దాని విచిత్రరూపంబునకు శంకించి రామున కిట్లనియె. 719

లక్ష్మణుఁడు స్వర్ణమృగము రాక్షసమాయ యని రామునికిఁ జెప్పుట.

ఉ. అచ్చుగఁ దాటకేయుఁడు మృగాకృతిఁ గైకొని కృత్రిమంబుగా
నిచ్చటఁ బూర్వవైరమున నెగ్గొనరింపఁగఁ బూని యొంటిమై
వచ్చినవాఁడు గావలయు వాసవసన్నిభ యట్లు గానిచో
నెచ్చట నైనఁ జూచితిమె యిట్టివిచిత్రమృగంబు నుర్వరన్. 720

క. ఆయధముఁ డిట్లు కపటో, పాయంబున వేఁటవెంట వచ్చిననృపులం
బాయక వధించి మెసవుచు, నాయిల్వలుఁబోలి యుండు ననఘాత్మ యిటన్.

క. మది సందేహముఁ గొన వల, దిది మాయామృగము గాని యినకులకలశాం
బుధిసోమ రామ నిక్కము, సదమలవనమృగము గాదు చర్చింపంగన్. 722

వ. దేవా యిట్టిరత్నవిచిత్రంబైనమృగంబు జగంబుల నెందునుం గానము మాయావి యగుమారీచునిచేతఁ గాంతిసంపన్నంబుగా గంధర్వనగరసన్నిభంబుగాఁ గల్పింపంబడిన మాయామృగరూపం బిది యని పలికిన నప్పుడు శుచిస్మిత

యగుసీత లక్ష్మణుని వారించి చర్మవ్యాప్తచేతన యై నిజభర్తకి ట్లనియె. 723

సీత మాయామృగమును బట్టి తన కిమ్మని రామునిఁ బ్రార్థించుట.

ఉ. జీవితనాథ యీకనకచిత్రమృగంబు మనోజ్ఞకాంతి నిం
పావహిలంగ నాదుహృదయంబు హరించుచు నున్న దెంతయుఁ
ధీవర దీనిఁ బట్టి కొని తెమ్ము రయంబునఁ గేళికార్థ మి
చ్ఛావిధి దీనిఁ గూడి సరసంబుగ నిత్యముఁ బ్రొద్దుఁ బుచ్చెదన్. 724

వ. మఱియు నీయాశ్రమపవనంబునందు రూపశ్రేష్ఠంబు లైనసృమరచమరభల్లూకపృషతవానరకిన్నరప్రముఖనానావిధమృగంబులు మనోహరంబు లై పుణ్యదర్శనంబు లై గుంపులుగట్టి నిత్యంబును విహరించుచుండు నింతకు మున్నిట్టివిచిత్రమృగంబు నాచేత దృష్టపూర్వంబుగా దిది నానావర్ణవిచిత్రాంగం బై రత్నబిందుసమాచితం బై చంద్రుం డుడుమండలంబుతోడ నిరీక్షణంబును బ్రకాశింపం జేయుచున్నది దీని రమణీయరూపంబును విచిత్రకాంతియు స్వరసంపన్నతయు విలోకించినంత మచ్చిత్తంబు సమ్మదాయత్తం బై యున్నది గావున. 725

సీ. ప్రాణేశ యీసువర్ణమృగంబు నిప్పుడు ప్రాణంబుతోఁ గూడఁ బట్టి తెండు
గారవంబునఁ బెంచి గరువంపుమాటలు మచ్చికఁ గావించి మరులు గొల్పి
సంతతంబును గ్రీడ సల్పెద నది గాక విపినవాసముఁ దీర్చి వీటి కరిగి
నప్పుడు మనకు నంతఃపురభూషార్థ మయ్యెడి భరతున కత్తలకును
తే. వింతఁ బుట్టించునట్లు గావింపు మీకు, నలవి గా దేని శరహతి నడఁచి దాని
చర్మ మైనను గొని తెండు సరస నాకు, వరమృగాజిన మయ్యెడిఁ బరమపురుష.

వ. మఱియు జాంబూనదమయం బైనదీనిరుచిరచర్మంబు బాలతృణకల్పితతాపసాసనంబునందుఁ బ్రసారితం బగుచుండఁ దత్సమీపంబున భవత్సహితంబుగాఁ గూర్చుండఁ గోరెద స్వప్రయోజనార్థంబు భర్తను బలాత్కారంబున నియోగించు టది క్రూరంబు యువతుల కసదృశం బని యెఱింగి యున్నదాన నైనను దీనిశరీరశోభాసౌష్ఠవంబుచేత మనంబునకు విస్మయంబు సంజాతం బయ్యెఁ బ్రియురాల నగుననున్ దయార్ద్రదృష్టి నవలోకించి మీకును బ్రియంబు గలదేని యెల్లభంగుల దీనిం బట్టి తెం డని ప్రార్థించిన సీతావచనంబుల కలరి రాముండు కాంచనరోమంబులునుమణిప్రవరశృంగంబులును దరుణాదిత్యవర్ణంబును నక్షత్రసదృశకాంతిరోమం గలిగి యద్భుతదర్శనం బై యొప్పుచున్నయప్పసిండిమెకంబు నవలోకించి దానియదృష్టపూర్వరామణీయకంబున కిచ్చ మెచ్చుచు జానకీప్రచోదితుండై లక్ష్మణున కిట్లనియె.

రాముండు లక్ష్మణునకు మాయామృగము నభివర్ణించి చెప్పుట

ఉ. తమ్ముఁడ కంటె యీమృగము తద్దయుఁ దప్తసువర్ణకాంతి నం
దమ్మగుచున్న దెంతయును నందనచైత్రరథంబులందు యు

క్తమ్ముగ సంచరించెడుమృగంబులలోపల నిట్టిచిత్రస
త్వ మ్మది లే దనంగ నిఁక ధారుణి నున్న దనంగ వచ్చునే. 729

వ. మఱియు నిది రూపశ్రేష్ఠత్వంబున సామాన్యమృగంబు గా దని తలంచెద.

ఆ. జాతరూపబిందుశతసమాకీర్ణ మై, చుట్టుఁ దిరిగి పరమసుందరముగఁ
దీర్చి కూర్చినట్లు దీపించు చున్నది, రాజపుత్ర రోమరాజి కంటె. 730

క. అనలునిశిఖితో నెన యై, ఘనమువలన నిర్గమించి క్రాలెడుసౌదా
మినినిభంగి దీనినాలుక, గన నయ్యెడిఁ గంటివే ముఖవినిర్గత యై. 731

క. మఱియు మసారవినిర్మిత, సురుచిర గల్లర్క రూపసుందరముఖ మై
వరశంఖమౌక్తికనిభో, దర మై యొప్పెడు మృగంబు తమ్ముఁడ కంటే. 732

తే. పద్మకింజల్కవర్ణంబు పరమభాస్వ, రంబు శక్రాయుధాభపుచ్ఛంబు గలిగి
వఱలు నీమృగ రాజ మెవ్వానిమనము, నుష్ణఖరసంశహారి యింపకుండఁ జెపుమ.

క. నవరత్నమయము రమ్యము, సువర్ణసంకాశ మధికసుందర మగునీ
దవమృగముఁ గాంచి మనమున, భువి నెవ్వఁడు విస్మయంబుఁ బొందక యుండున్.

తే. కాంచనవిచిత్రమైనయీఘనమృగంబు, విపులపురుషమానసమైన నపహరించు
నబల కాంతయు ముగ్ధయు నైనసీత, చిత్త మపహరించె ననుటఁ జెప్ప నేల. 735

క. వేఁటలకుఁ బోయి నృపతులు, మాటికి సంక్రీడకొఱకు మాంసముకొఱకుం
బాటించి వనమృగంబుల, వాఁటించి వధించి రధికధర్మం బగుటన్. 736

వ. వత్సా యిట్టివిచిత్రవస్తులాభంబుకొఱకు వేఁట కరుగుట కేమి యరిది కేవల
మృగహననమాత్రంబె కాదు మఱియు వజ్రాదిమణిసువర్ణరజతాద్యాకార
ధాత్వాధారపర్వతప్రదేశంబులును హస్తిమస్తకముక్తాప్రభృతిధనంబులును
మహావనంబునందు మృగయోద్యోగంబున రాజులచేత నన్వేషింపఁబడుఁ
గావున శాస్త్రావిరోధోపాయంబున నుపార్జితం బైనధనంబు మనుష్యమన
స్సంకల్పితధనం బంతయు శుక్రునికోశగృహంబు పూరింపం జేసినకై నడి
మహీపతులకోశగృహంబు పూరింపఁ జేయు నపూర్వవస్తుకాముం డై నపురు
షుండు విచారింపక సౌందర్యగుణలోభంబున నేవస్తువు సంపాదింపం బ్రవ
ర్తించు నదియె యర్థం బని యర్థసాధనచతురు లగునీతిశాస్త్రజ్ఞులు పలుకుదు
రీమృగం బట్టిదే యని పలికి వెండియు నిట్లనియె. 737

క. ఈమృగరత్నపరార్థ్య, శ్రీమహితసువర్ణమయవిచిత్రాజినమం
దీమగువ మత్సమేతము, గా ముదమున నధివసింపఁ గాంక్షించె మదిన్. 738

తే. పార్థివాత్మజ విను మృదుస్పర్శనమున
నావికియుఁ గాదళియును బ్రియకీయు మఱి ప్ర
వేణియును నీమెకమునకు వేయిగతుల
నీడు సేయంగ రా దని యేఁ దలంతు. 739

తే. ఇనకులోత్తమ విను మీమహీమృగంబు
రమణ నభమున నొప్పుతారామృగంబు
మొనసి యీరెండుమృగములుఁ భూరిశోభ
నరయ దేవతాయోగ్యంబు లని తలంతు. 7

ఉ. తమ్ముఁడ నీవు చెప్పినవిధంబున నీమెక యుగ్రదైత్యకృ
త్యమ్మగు నేని నాకు నటులైనను మిక్కిలి లెస్స యట్లు కా
నిమ్ము మునీంద్రకోటికి మహిం బెనుబాధలు సేయుచోట వ
ధ్యమ్మగుఁ గాదె చూడ హృదయంబున నింతవిచార మేటికిన్. 74

శా. ప్రాచుర్యంబున నిమ్మహాటవి మహాపాపాత్ముఁడై చేరి మా
రీచుం డుక్కునఁ బెక్కుసంయముల ధాత్రీనాథుల న్భూరిమా
యాచాతుర్యము మీఱఁ జంపె వడి నయ్యాదిత్యశత్రు న్నవం
నీచుం గీటడఁగించి యీవిపినము న్నిర్దోషముం జేసెదన్. 74

సీ. అనఘాత్మ యీవనంబున మున్ను వాతాపి
యనఁ దైత్యుఁ డొకఁడు మాయావిదుండు
తోడరి మేషాకృతితో నుదరస్థుఁడై
తగ స్వగర్భం బవ్వతరిని బోలె
మునుల వధించుచు మునుకొని పెద్దకా
లంబున నొకనాఁడు లావు మెఱసి
చతురాస్యనిభు నగస్త్యమహామునీంద్రుని
పాలికిఁ జని యత్తపస్వివరున

తే. కరయ భక్ష్యమై శ్రాద్ధాంతమందుఁ బూర్వ, రీతి నిజరూప మంగీకరింపఁ దలఁచు
నతని వీక్షించి నగి యమ్మహానుభావుఁ, డినసమద్యుతి వానికి నిట్టు లనియె. 74

తే. భానుతేజులఁ బెక్కండ్రఁ బరమమునుల, నఘవిదూరుల భక్షించినట్టిఖలుఁడ
వస్మదీయమహాజఠరాగ్నిదగ్ధ, తనుఁడవై పోయి తేడ వాతాపి యింక. 744

రాముఁడు మాయామృగమును బట్టుటకుఁగా దాని వెంబడించుట.

వ. అని పలికెఁ గావున నిద్దురాత్ముం డగుమారీచుండు వాతాపిపగిదిఁ బంచత్వంబు నొందవలయు ధర్మనిత్యుండను జితేంద్రియుండనై నన న్నతిక్రమింపఁ జూచు నీరాక్షసుండు వాతాపివలె నశించుఁ గుంభసంభవుండు వాతాపిఁ జంపినచందంబున నే నిమ్మారీచుని వధించెద నిది నిక్కంబుగా మృగం బేనినై దేహికిం బ్రియం బగునట్లుగాఁ బట్టి తెచ్చెద నట్లు గాక కపటమృగం బేని తపోధనులకుఁ బ్రియంబుగా వధించెద నికార్యంబు రెంట నధికోదయంబై యుండు మనఃయుత్నం బంతయు నీవై దేహీసంరక్షణార్థంబె కావున నావచ్చునందాఁక నీవు ధనుఃకవచాదిసన్నాహయుక్తుండవై సమర్థుండును మహాబలుండును బుద్ధి

మంతుండు నగుజటాయువుతోడం గూడి ప్రతిక్షణంబు సర్వదిగ్వర్తిరాక్షసుల వలన శంకితుండవై యప్రమత్తుండవై వైదేహి రక్షించుచుండుము పరార్థ్యరత్నోపలక్షితం బైనయిది రాక్షసమాయాకల్పితమృగంబు గాని నిక్కంబుగా వనమృగంబుగా దైనను మృగచర్మగతస్పృహ యైనసీత నవలోకించి తన్మనఃప్రియార్థం బేను మహాధనుర్ధరుండనై మృగంబువెంట నరిగి యుపాయంబున వంచించి పట్టి తెచ్చెదం గాదేని శితవిశిఖంబున దీనిం దెగటార్చి విచిత్రం బైన దీనిచర్మంబుం గొని రయంబునం బఱతెంచెద నని సౌమిత్రి నొడంబఱిచి రాముండు తత్క్షణంబ జాంబూనదమయత్సరుయుక్తం బైనఖడ్గంబును ద్ర్యవనతం బైనచాపంబును వజ్రమయం బైనకంకటంబును నక్షయబాణతూణీరంబులును సముచితంబుగా ధరించి వైదేహికిం బ్రియంబు సంపాదించుటకు నమితవిక్రమంబున నరిగె నిట్లు తన్నుం బట్ట వచ్చురామునిం జూచి యప్పైఁడిమెకంబు. 745

ఉ. గంతులు వేయుచుం జెఱుతకాల్వలు చెంగునఁ జౌకళించుచు
న్వంతులు సేయుచుం దరులఁ బ్రాఁకుచుఁ గుంజములందుఁ దూఱుచుం
బంతము మీఱఁ గన్మొఱఁగి పల్లముల న్వెస డాఁగుచు న్వనా
భ్యంతరసీమ నిట్లినకులాగ్రణిఁ జిక్కులఁ బెట్టె నెంతయున్. 746

సీ. ఒకమాటువనమృగయూథంబుతోఁ గూడి గుఱుతుగన్పడకుండుఁ గొంతసేపు
ఒకమాటు విడివడి యొక్కటఁ జూడ్కికి గోచరింపక యేగుఁ గొంతసేపు
ఒకమాటు లఘుగతి వ్యోమమార్గము నంటి వింతగాఁ జూపట్టు గొంతసేపు
ఒకమాటు మృదుశాద్వలోపరిస్థలములఁ గ్రొత్తగడ్డియు మేయుఁ గొంతసేపు
తే. గొప్పతిప్పలపై కేగుఁ గొంతసేపు
కుఱుచవాఁకలలోఁ బాఱుఁ గొంతసేపు
గహనమున నిట్లు మాయామృగంబు నేర్పు
మీఱ దూరంబు గొని యేగె మిహిరకులుని. 747

సీ. కడుదూర మేగె నెక్కడఁ బట్ట రా దని మానినచో మ్రోలఁ గానవచ్చు
మిగుల డగ్గఱియెఁ బట్టఁగవచ్చు ననిడాయ జవమున దూరదేశమునఁ దోఁచుఁ
బొదలమాటున బొంచిపొంచి పట్టఁగఁబోవ నటుచూపియిటుచూపియవలి కేగు
వలపలిదెసఁ దోఁచు నెలమిఁ బట్టఁగఁ బోవునంతలో డాపలిచెంత నుండు
తే. నిట్లు చిక్కక కృత్రిమమృగము పెక్కు,గతులనలయింప విసివి రాఘవుఁడుకోప
మడర మాయామృగంబనియపుడు తెలిసి, తెంపుసొంపార దానివధింపఁ దలఁచి.

చ. అనుపమశక్రచాపనిభ మైనమహోగ్రశరాసనంబునన్
సునిశిత మై రవిద్యుతికి జోడయి వహ్నిశిఖాసమాన మై
ఘనతరదీప్త మై నళినగర్భవినిర్మిత మైనబాణముం

బనివడి గూర్చి యమ్మొకము పై నిగిడించె నమోఘవై ఖరిన్. 749

వ. ఇట్లనన్యసాధనం బైనయద్దివ్యసాధనంబు రాముని వింటివలన నిర్గమించి భర్గునేత్రాగ్నియుం బోలె మండుచుఁ దత్క్షణంబ పఱతెంచి మృగరూపధరుం డైన మారీచునిశరీరంబు భేదించిన శరార్తుం డై యన్నీచుండు తాలప్రమాణంబు మింటికెగసి నిబిడంబుగా భైరవారావంబు సేయుచు నల్పజీవితుం డై ధరణిం బడి యమ్మాయారూపంబు విడిచి నిజరూపం బంగీకరించి రావణునివాక్యంబుఁ దలంచి వైదేహి లక్ష్మణు నేయుపాయంబున నిచ్చటికిం బంపు జానకి నేయుపాయంబున రావణుం డపహరించు నని చింతించి రామస్వరానురూపం బగునెలుంగున. 750

మారీచుఁడు రామస్వరానురూపముగా నఱచుట.

శా. ప్రాంచద్దై న్యఖర దైన్యనాద మడర హా సీత హా లక్ష్మణా
యంచుం బేర్కొని యంత శాతశరబాధాపీడితప్రాణుఁ డై
సంచారంబులు మాని మేన నసువు ల్బంధింపఁగా లేక వే
పంచత్వంబును బొందె నప్పుడె నిలింపద్వేషి వీతస్పృహన్. 751

వ. ఇట్లు మారీచుండు గూలిన యనంతరంబ. 752

మ. అనిమేషారి మదీయకస్వరముతో హా సీత హా లక్ష్మణా
యని వాపోవుచుఁ బ్రాణము ల్విడిచె నయ్యార్తధ్వని న్విన్న చో
జనకక్ష్మాపతిపుత్త్రి యెం తడలునో సౌమిత్త్రి తా నిప్పు డే
సని చింతించునొ యంచు రాఘవుఁడు త్రాసాయత్తచేతస్కుఁ డై. 753

వ. లక్ష్మణుం డాడినతెఱం గంతయు నిజం బయ్యె నని తలంచి యచ్చట నిలువ నొల్లక తత్క్షణంబ వేఱొక్కమృగంబును జంపి దానిమాంసంబు గొని శీఘ్రంబున జనస్థానమధ్యవర్తినిజాశ్రమంబున కభిముఖుం డై వచ్చుచుండె నంత నిక్కడ వైదేహి రామస్వరానురూపం బైనదీనస్వరంబువిని లక్ష్మణునకిట్లనియె.

మ. వినదం బొక్కటి పిక్కటిల్లె దిశల న్దీనస్వరోపేత మై
వినఁగా నయ్యెడు వింటె కాన మొకమ్మఱి విధ్వస్తముం జేయఁగాఁ
జనియె న్దారము కాననాంతరమునన్ సౌమిత్త్రి మీయన్న య
య్యనఘుం గావఁగ నేగు మీ విపుడె సౌహార్దంబు సంధిల్లఁగన్. 755

సీత లక్ష్మణునితో రాముని రక్షింపఁ బొమ్మని చెప్పుట.

మ. హరిమధ్యంబున నున్న గోవృషముచాయ న్రాఘవుం డాత్మలో
నరయం గ్రూరనిశాచరాంతరగతుం డై చిక్కెఁ గాఁబోలు సాం
పఱ నాచిత్తము భూరిసాధ్వసయుతం బై యున్న దీ వేగి చ
చ్చెర నన్నుం గరుణించి రామవిభునిం జేపట్టి రక్షింపుమా. 756

చ. అన విని లక్ష్మణుండు హృదయంబున రామునియుగ్రశాసన

బును దలపోసి యచ్చటికిఁ బోవక యుండినఁ జూచి నెమ్మనం
బున జనియించినట్టివగ మోమునఁ గన్పడ భూరిదారుణా
శనిసదృశో క్తి నిట్లనియె జానకి దైవనియుక్తబుద్ధి యై. 757

క. మిత్రాకృతిచే నన్నుకు, శత్రుఁడ వై తీవు దుఃఖసమయంబున సౌ
భ్రాత్రము నెఱపనికతన ను, మిత్రానుత యిట్టిసేఁత మే లగు నయ్యా. 758

వ. మఱియు నీవు మత్కృతంబునందు లోభంబునలన భ్రాతృరక్షణాయత్తచిత్తుం డవు గాకుండుటం జేసి తన్నాశంబుఁ గోరుచున్నవాఁడ వని యూహించెద నీకు నిక్కంబుగా రామునియందు సౌహార్దంబు లేదు తద్వ్యసనంబు నీకుఁ బ్రియం బై యున్న దక్కారణంబున మహాద్యుతి యగునమ్మహాత్ముని విలోకింపక విస్రబ్ధుండ వై యున్నవాఁడ వెవ్వండు నీకుఁ బ్రధానం బయ్యె నట్టిరాముండు ప్రాణసంశయంబు నొందు చుండ నిచ్చట మద్రక్షణంబునందుఁ బ్రయోజనంబు లేదు రామరహితనై యే నొక్కనిమిషమాత్రంబైన జీవింపఁజాల నని కన్నీరు నించుచు మృగాంగనచందంబునఁ ద్రస్తచిత్త యై పలుకుచున్న వైదేహి వాక్యంబులకుఁ గటకటంబడి లక్ష్మణుం డి ట్లనియె. 759

క. ఉల్లమున నేల వగచెదు, తల్లీ నీవిభుఁడు దేవదానవరక్షో
వల్లభులచేత నైనను, దెల్లముగాఁ జిక్కువడఁడు ధీరుం డెందున్. 760

సీ. గరుడగంధర్వకింపురుషకిన్నరసిద్ధచారణయక్షరాక్షసులయందు
రామునిఁ దొడరువిక్రమశాలి లేఁడు త్రిలోకపూజ్యుఁడు శూరలోకనుతుఁడు
సురరణంబుల నవధ్యుఁడు మహాబలవీర్యుఁ డమ్మహాత్మున కొకహాని గలదె
యడల నేటికిఁ జింత విడువుము మృగమును వధియించి యిప్పుడెవచ్చు రామ

ఆ. విభుఁడు లేనిచోట విపినమధ్యంబున, నొంటి నిన్ను విడిచి యోజ లేక
పోవ నగునె నాకుఁ బుణ్యాంగనామణి, మనుజవిభుఁడు గన్న మాటరాదె

సీత లక్ష్మణుని నానావిధంబుల దూఱుట

వ. మఱియు నది గంధర్వనగరసదృశం బైనరాక్షసునిమాయ గాని రామునికంఠస్వరంబు గాదు మహాత్ముం డగురాముండు భవద్రక్షణంబునందు నన్ను నియోగించి చనియెఁ గావున నాకు నిన్నిచట నొంటి విడిచి పోవుట యుక్తంబు గాదదియునుం గాక ఖరాసురు వధించిననాఁటనుండి జనస్థానపదంబు నుద్దేశించి మాయావు లగురాక్షసులు మనయందు విరోధించి హింసావిహారులై యిమ్మహావనంబునఁ బరవ్యామోహజనకంబు లైనవాక్యంబు లుచ్చరించు చున్నవారు నీవు సందియంబు వదలి రామునియనివార్యశౌర్యం బెఱింగి నెమ్మది నుండుమని యివ్విధంబున రాక్షసబాధలు తలంచి మహీపుత్త్రి నొంటి విడిచి పోవం జాలక కృతాంజలిపుటుం డై సత్యవాక్యంబులం బ్రార్థించు చున్నలక్ష్మణునివచనంబులు విని యద్దేవి కోపసంరక్తలోచన యై పరుషవాక్యంబుల ని ట్లనియె.

క. కులపాంసన వినయరహిత, కలుషాత్మక శఠ యకార్యకరణోద్యుక్తా
యలరామునివ్యసనము నీ, కెలమిం గడుఁబ్రియ మటంచు నెంచెద బుద్ధిన్.

క. రామునివ్యసనము ప్రియ మగు, టేమియుఁ జిత్రంబు గాదు హితశత్రుత్వం
బీమాడ్కిఁ దగ సపత్నుల, కీమహిఁ గల్గుట విసర్గమే గద తలఁపన్. 764

తే. జగతి నీయట్టిప్రచ్ఛన్నచారు లతినృశంసు లెవ్వారు గల రట్టిశఠులయందుఁ
గూర్పఁ దగదు విశ్వాసంబుగూర్చెనేని, వాని కెంతయుఁ గీడు వేవచ్చు నిజము.

ఉ దోస మటంచు నించుకయుఁ దోఁపక రాఘవుఁ డొంటి నేగి దు
ష్టాసురకోటిచేత విపినాంతరసీమను జిక్కి దీనత
న్బాసట గాఁగ నిన్ను పలుమా ఱటు చీరినఁ బోవ వయ్యయో
నీసరి గూఢశత్రుఁ డవనిం గలఁడే నృపవంశపాంసనా. 766

చ. అనయముఁ బూని భ్రాత కెటులైన నపాయముఁ గల్గఁ జేసి త
ద్ఘనతరరాజ్యము న్ధనముఁ గైకొని నన్నుఁ బరిగ్రహింపఁగా
మనమున నిశ్చయించితివి మానవిహీన దురంతపాతకం
బునఁ బడు టంతె గాక యిది పోలునె చేకుఱునే ఖలాధమా. 767

మ. ఇనవంశోత్తము నంబుజాక్షుని వినూత్నేందీవరశ్యాము న
త్యనఘు న్రాముని బాసి కోరుదునె దుష్టాచారు వేఱొక్కని
న్ఘనుఁ డారాముఁడు లేనిచో నిమిష మైన న్ధాత్రి జీవింప నే
ర్తునె నీ విప్పుడు చూచు చుండఁగఁ ద్యజింతు న్వేగ ప్రాణంబులన్ 768

వ. అని యిట్లు కర్ణకఠోరంబుగాఁ బలికిన సీతం జూచి జితేంద్రియుం డగులక్ష్మ
ణుండు కృతాంజలిపుటుం డై యి ట్లనియె 769

లక్ష్మణుఁడు సీత మాటలకుఁ గటకటఁ బడుట.

ఉ. తల్లిరో బిడ్డవంటినను దారుణభంగి దురుక్తు లాడఁగాఁ
జెల్లునె నీచునిం బలెఁ బ్రసిద్ధనయప్రతిబద్ధ మైననా
యుల్లము రాముఁడే యెఱుఁగు నుగ్రవనంబున నొంటి నుంచి పో
నొల్లక యుంటిఁ గాని మది నొండు తెఱంగుఁ దలంచువాఁడనే. 770

ఉ. ఈగతిఁ బాపము ల్పలుక నేమని యుత్తర మిచ్చువాఁడ నా
కీగుణము ల్ధరిత్రి విపరీతము లౌట యథార్థ మయ్యె నిం
తేగద నాదుచిత్తవిధ మెల్లను దైవ మెఱుంగు నిప్పు డే
నేగితి నేని నిక్కము మహీసుత యాపద వచ్చు నీ కిటన్. 771

ఉ. సత్యము సర్వదేవతలు సాక్షిగఁ బాపము లేదు నాయెడ
న్నిత్యయశు న్రఘూత్తముని నిక్కము తండ్రిని నిన్నుఁ దల్లిఁగాఁ
బ్రత్యహము న్దలంచుచుఁ దిరంబుగ భక్తి యొనర్చు చున్నచోఁ
భృత్యుఁ డటంచుఁ జూడక మహీసుత పాపము లాడఁ జెల్లునే. 772

వ. దేవీ యనర్హవాక్యంబులు పలుకుటయు సతులకుఁ జిత్రంబుగాదు స్వభావంబై యుండుఁ జాపల్యంబును గ్రౌర్యంబును ధర్మహైన్యంబును బరస్పరస్నేహకార్యవిచ్ఛేదకరణంబును వారల గుణంబు లట్లగుటం జేసి నీవలన నిట్టిక్రూరవాక్యంబు పుట్టె నిది వినం జాల నివ్వాక్యంబులు శ్రవణంబులకు దీప్తనారాచసన్నిభంబులై యున్నవి సత్యవాదినైన నన్ను నీవు పరుసంబు లాడిన తెఱంగంతయు నిచ్చటి వనదేవత లందఱు సాక్షిభూతలై విను చున్నవారు గురువాక్యవ్యవస్థితుండనైన నన్ను విచారింపక యిట్టి నిష్ఠురోక్తులు శంకించి పలికితి గావున స్త్రీత్వంబు స్వభావంబున దృష్టం బయ్యె నిన్నేమని గర్హించినం దీఱు నిప్పుడ నశింపు మని కోపంబు పెంపునం బలికి వెండియు రాముని సంస్మరించి యద్దేవికి మంగళం బొసంగువాఁడై యిట్లనియె. 773

ఉ. పోవక యున్నచో శఠునిఁ బోలె నను న్నిరసించె దార్తవై
పోవఁగఁ జూచిన న్రఘువిభుం డలుకం గృప దప్పు రెంట నా
కావహిలుం దిరస్కరణ మైనను నీవచనం బమోఘ మౌఁ
గావున నీకు స్వస్తి యగుఁ గాక రయంబునఁ బోయివచ్చెదన్. 774

వ. దేవీ నిన్ను వనదేవతలు బహుప్రయత్నంబుల నేమఱక రక్షింపుదురు గాక ఘోరంబు లగునిమిత్తంబులు దోఁచుచున్నవి గావున నేను రామసహితంబుగాఁ జనుదెంచి క్రమ్మఱ నిన్ను విలోకింతునో విలోకింపనో యెఱుంగఁ బరిశుద్ధం బగుమనంబున మారాక ప్రతీక్షించుచు నుండు మని పలికిన లక్ష్మణుని వచనంబులు విని యమ్మహీపుత్రి శోకబాష్పపరిప్లుత యై తీవ్రం బగు వాక్యంబున నిట్లనియె. 775

సీ. భావజసన్నిభుఁ బరమదయానిధిఁ గౌసలేయుని రాముఁ గానకున్న
మానక గోదావరీనదిఁ బడి యైన క్షోణీధ్రముననుండిఁ గూలి యైన
నుడుగక పెనుఁద్రాట నురిగొని యైనను వాలాయము విషంబు గ్రోలి యైన
గరసుష్ఠిఁ జిచ్చులోనుఱికి యైనను మేను విడుతుఁ గాక మహాత్ము విభునిఁ బాసి
తే. యన్యపురుషునిఁ బదమున నైన సంస్పృశింప నేర్తునే నహానీయశీలు నజితు
నమలుఁ ద్రిభువనసన్నుతుం డైన రఘుకులోత్తమునిఁ బాసి జీవించియుండ నోల్ల.

లక్ష్మణుఁడు రామునిసద్దకుఁ బోవుట

వ. అని బహుప్రకారంబుల నాక్రోశించుచు నంత కంత కగ్గలంబై నశోకంబున నుదరతాడనంబుఁ గావించుకొనుచుఁ గన్నీరు మున్నీరుగా రోదనంబు సేయుచు శోకరసాధిదేవతయుం బోలెఁ జూపట్టుచున్న జానకిం జూచి లక్ష్మణుండు తత్కాలసదృశం బగువాక్యంబున ననూనయించిన నద్దేవి లక్ష్మణునితోడ నేమియుం బలుకక యూరకుండె నంత నాసౌమిత్రి ప్రదక్షిణంబును బ్రణామంబును గావించి యనుజ్ఞఁ గొని కుపితచేతస్కుండై జానకి నొంటి విడిచి

పోవం జాలక తిరిగి చూచుచు రామునిసమీపంబునకుం జనియె నంత దశగ్రీవుండు నెడగని శ్లక్ష్ణకాషాయసంవీతుండును వామాంసన్యస్తయష్టికమండలుండును శిఖియు ధృతాతపత్రుండును సపాదుకుండును నై సీతావిశ్వాసార్థంబు కపటపరివ్రాజకరూపం బంగీకరించి వేదఘోషంబు సేయుచుఁ బర్ణశాల కడకుం జనుదెంచుసమయంబున. 777

ఆ. భీమకర్ముఁ డైన యామినీచరుఁ జూచి, గాలి వీవ కుండెఁ గడుభయమునఁ
గదలకుండెఁ దరులు గౌతమివేగంబు, మాఱి మందసరణిఁ బాఱుచుండె. 778

రావణుఁడు యతిరూపధరుండై సీతకడకు వచ్చుట.

వ. ఇట్లు భయదర్శనుం డగురావణుం డభవ్యరూపుం డయ్యును భవ్యరూపుం డై పర్ణశాల సేరం జని యందుఁ బద్మహీన యైనపద్మచందంబున నొప్పుదాని నపాంసులాశిరోమణి యగుదాని ననన్యసామాన్యలావణ్య యగుదాని రామార్తస్వరశ్రవణసంజాతశోక యై కన్నీరు నించుచుఁ బర్ణశాలామధ్యంబున నాసీన యై యున్నదాని శుభస్వరూపిణి యగుదాని రుచిరదంతోష్ఠి యగుదానిఁ బూర్ణచంద్రనిభానన యగుదానిఁ బద్మపలాశలోచన యగుదానిఁ బీతకౌశేయవాసిని యగుదాని సీత నవలోకించి శశిహీన యైనరోహిణి డాయు దారుణగ్రహంబుపోలికఁ జిత్రానక్షత్రంబు నాక్రమించు శనైశ్చరునికరణిఁ జంద్రసూర్యవిహీన యైనసంధ్య నావరించు మహాతమంబుకై వడి రామలక్ష్మణరహిత యై యొంటి నున్నయద్దేవి డాయం జని తదీయసుషమావిశేషంబున కచ్చెరు వందుచు మన్మథశరావిష్టుం డై ప్రశ్రితం బగువాక్యంబున నిట్లనియె. 779

క. సలలిత మగునవపద్మిని, జలరుహమాలికను బోలె స్వర్ణద్యుతి శో
భిలునలువఁ దాల్చి యలరెదు, కలికీ యెవ్వతవు నీవు గహనమునందున్. 780

క. రతివో హరిణాంకునిమద,వతివో వైకుంఠవిభునివరసతివో భా
రతివో యచ్చరమిన్నవో, యతివా నీచంద మతిదయానుతిఁ జెపుమా. 781

క. ఊరులు కరికరతుల్యము, లారయ జఘనము విశాల మత్తు లసితరు
క్తారకములు రక్తాంతము, లీరీతిం దనరుచున్న వెంతయు నీకున్. 782

చ. ధరశిఖరోపమం బుపచితంబు సువృత్తము సంప్రవల్గితం
బరయ మణిప్రవేకరుచిరాభరణంబును స్నిగ్ధమున్ మనో
హర మతిపీనవృత్తము సమంచితతాళఫలోపమాన మై
వఱలెడు నీకుచద్వయము వారిజపత్త్రవిశాలలోచనా. 783

సీ. కలకంఠి నీమోము కలువరాయనికాంతి లోఁగొన్నకై వడి బాగు మెఱసె
గోల నీపలుతీరు కుందకుట్మలములపసఁ జూచి నవ్వినపగిది నొప్పెఁ
గలికి నీకంఠంబు వలముఱి చెలువంబు చూఱకొన్నవితానఁ జూడ నయ్యెఁ

దరుణి నీనిడుదపెన్నెఱిగుంపు ఘనకాంతి రమణ గైకొన్న చందమున నలరె

తే. నళిచికుర నీదుసౌందర్య మంతఁజూచి, నంత నాచిత్త మంతంత కద్భుతముగఁ
గరఁగు చున్నది నూత్నోదకంబుచేతఁ, గడఁగి నిమ్నగాతీరంబు గరఁగినట్లు.

తే. చారునేత్ర విలాసిని చారువేణి, చారునాసిక చారువిశాలజఘన
యెట్టితపములు గావించి యిట్టిచెలువ, మిట్టితనుకాంతి వడసితి విందువదన. 785

క. పిడికిటఁ బట్టఁగ నగు నీ, నడుము తిలసుమంబుఁ దెగడు నాసిక బొమలు
న్నెడవింటివానివిలునై, వడిఁ జూడఁగ నయ్యె నహహ వారిజనేత్రా. 786

ఉ. పన్నగకాంతల న్గరుడభామలఁ జారణచంచలాక్షులం
గిన్నరకామినీమణుల ఖేచరతన్వుల సాధ్యకన్యలం
బన్నుగ మర్త్యభామినులఁ బల్మఱుఁ జూచితిఁ గాని నీకు జో
డెన్నఁగ మూఁడు లోకముల నెవ్వరిఁ గానము సుందరీమణీ. 787

క. వెలయఁగ ముల్లోకంబులఁ, గలకాంతలలోన రూపకౌశలసుమహో
జ్జ్వలసౌకుమార్యములచే, నళిచికురా యగ్రగణ్యవై తివి గాదే. 788

చ. అతులితపుష్పపల్లవఫలాసవగుచ్ఛసుగంధిభూజసం
యుత మయి యొప్పురమ్యనగరోపవనంబుల నున్కి మాని ఘో
రతరమృగాసురస్ఫురదరణ్యమునందుఁ జరించు చున్నని
న్నతిసుకుమారిఁ జూచి హృదయంబునఁ జాల విషాద మొందెదన్. 789

ఉ. మంచిపదార్థము ల్గుడిచి మంజులచేలముఁ గట్టి కాంచనా
భ్యంచితహారము ల్దొడిగి హాటకసౌధములందు సెజ్జపై
నంచివిలాసితోఁ గలిసి మచ్చికతోడ సుఖింప కొంటి రా
త్రించరజుష్టఘోరవనదేశమునం జరియింప నేటికిన్. 790

తే. నీవు గుడిచినయన్నంబు నీవు దాల్చి, నట్టిసొమ్ములు నీమోలఁ గట్టినట్టి
పుట్టమును నీవు వరియించినట్టిపురుషుఁ, డఖిలలోకోత్తరతఁ జాల నలరుఁ దన్వి.

క. తరుణీ విద్యాధరివో, సరసిజముఖి యక్షసతివొ చంద్రానన కి
న్నరివో సిద్ధాంగనవో, వరవర్ణిని లేక యిచటివనదేవతవో. 792

క. నరగంధర్వామరకి, న్నరచారణసిద్ధసాధ్య నాగనభస్వ
ద్వరు లివ్వనిఁ జొర వెఱతురు, వరవర్ణిని యెట్లు నీవు వచ్చితి చెపుమా. 793

క. వానరవాహనరిపుసం, చాననశార్దూలభల్లుకాదిమృగంబు
లూని భయపెట్ట కున్నవె, కాననమున నొంటి నుండఁ గాతరనేత్రా. 794

క. ఘనతరమదాన్వితము లగు, వనశుండాలముల కాలవాలం బిది యి
వ్వనమునకు నొంటి నేక్రియఁ, జనుదెంచితి వబ్జనేత్ర సాహసబుద్ధిన్. 795

ఉ. ఎచ్చట నుండి యెచ్చటికి నేగుచు నిచ్చటి కద్భుతంబుగా
వచ్చితి వుగ్రదైత్యపరివారనిషేవిత మైనకాననలో

నిచ్చకు వచ్చినట్లు యిపు డేల చరించెద వాంటిఁ జిక్కి నీ
సచ్చరితంబు నెల్ల వరుస న్వినిపింపఁ గదే తలోదరీ. 796

వ. అని యివ్విధంబున దురాత్ముం డగురావణుం డడిగిన వానిఁ గపటరూపునిం గా నెఱుంగక నిక్కంబుగా బ్రాహ్మణుం డని నానావిధపూజల నతిథిసత్కారంబు గావించినం బ్రతిగ్రహించి. 797

క. అసదృశ మగుతత్కోమల, విశాలలావణ్యగరిమ వీక్షించి తగ
న్దశముఖుఁ డాత్మవధార్థము, శశిముఖి హరణంబునందు స్వాంతము సేర్చెన్.

వ. ఇట్లు జనకపుత్త్రి ద్విజాతివేషంబునఁ బాత్రకుసుంభధారి యై తనకడకు వచ్చిన వాని నపహరణబుద్ధి యైనరావణుల జూచి యతిథిత్వంబున ద్వేషంబు సేయుట కనర్హం డై నబ్రాహ్మణాతిథినింబలె నతని సత్కరించి. 799

సీత యతివేషధారి యైన రావణున కర్ఘ్యపాద్యాదు లొసంగుట.

క. ఇది యాసన మిది యర్ఘ్యం, బిది పాద్యం బిది ప్రసూన మిది వన్యఫలం
బిది మధుపర్క మొసంగితి, సదయతఁ జేకొనుము నీవు సంయమివర్యా 800

వ. అని పలికిన నారావణుండు ప్రతిపూర్ణభాషిణి యగుజానకిచేత నిమంత్ర్యమాణుం డై తత్ప్రతిగ్రహణంబునందుఁ జిత్తంబుఁ జేర్చి తద్రూపసౌందర్యరేఖా విశేషంబు విలోకించుచుండె నంత నవ్వైదేహి వానిలక్షణం బంతయు నుపలక్షించి మృగయార్థం బరిగినశోభనాకారుం డగురాముని యాగమనంబుఁ బ్రతీక్షించుచు నారెనారెకు సముద్వీప యై శ్యామం బైనయవ్వనంబు విలోకించుచు రామలక్ష్మణులజాడఁ గానక పరివ్రాజకచిహ్నుండును నపహరణబుద్ధి యుక్తుండును దురాత్ముండు నైనరావణునిచేత నిట్లు సంపృష్ట యై యితండు బ్రాహ్మణుండును నతిథియుఁ గావున మద్వృత్తాంతం బెఱింగింప కున్న శపించునో యని యొక్కముహూర్తంబు చింతించి తనవృత్తాంతం బెఱుకపడ నిట్లనియె. 801

సీతాదేవి తనవృత్తాంతమంతయు రావణునికిఁ జెప్పుట.

క. అనుపమ తేజోనిధి యగు, జనకునిపుత్త్రికను రామచంద్రునిభార్య
స్తను లెల్ల నన్ను జానకి, యని సీత యటంచుఁ బిలుతు రనఘవిచారా. 802

క. పదిరెండువత్సరంబులు, ముద మలరఁగ నత్తయింట మునుకొని భోగా
స్పదము లగుదివ్యసుఖములు, విదితంబుగఁ జాల ననుభవించితి విప్రా. 803

ఉ. అంతఁ ద్రయోదశాబ్దమున నస్మహీకాంతుఁడు రాముని న్ధరా
కాంతునిఁ జేయఁ బూని కుతుకంబున మంత్రులఁ గూడి నన్మద
స్వాంతములోడఁ జక్కఁగ విచారముఁ జేసి సునిశ్చితార్థుఁ డై
చింత దొలంగి యున్నయెడఁ జెచ్చెరఁ గైకయి దుష్టచిత్త యై. 804

సీ. తనప్రాణవిభుఁ డై నదశరథనృపుని సుకృతముచేఁ దగ వశీకృతునిఁ జేసి

కఠినవరంబులు కరమర్థిఁ గాంక్షించి యొకటికి మన్నాథునకు వివాస
మొకటికి భరతున కుర్వీశ్వరత్వంబుఁ గోరి యిప్పుని సమకూర్చునంత
కాహారనిద్రావిహారాదికము నొల్ల నట్లు సేయఁగ నోప వైతి వేని
తే. రాము నభిషేకకాలంబె గ్రాలు నాదు
జీవితాంతకాలం బని భావమందుఁ
దెలియు మని యిట్లు దారుణోక్తుల నలంచి
విభునిచిత్తంబు వేఱొక్కవిధముఁ జేసె. 805

వ. ఇట్లు ధర్మంబున నిర్బంధించి పలికిన సత్యప్రతిజ్ఞుం డగునద్దశరథుండు వరద్వయ
ప్రతినిధిత్వంబున నుపభోగక్షమంబు లైనసువర్ణరత్నాదికంబులు గొను మని
ప్రార్థించిన నద్దేవి యంగీకరింప దయ్యె. 806

తే. రూపవంతుండు సుగుణుం డపాపసమ్మ
తుండు భూతహితుండు శాంతుండు లోక
కాంతుఁ డగునాదుభర్త యక్కాలమునకు
నిరువదేనేండ్ల వయసువాఁ డెన్నిచూడ. 807

క. ధరణీసుర యేనాఁటికి, బరువడిఁ బ్రాయంబుచేతఁ బదునెనిమిదివ
త్సరములదానను విను మే, మిరువుర మివ్వయసుచేత నెనయుచు నుండన్.

క. కామార్తుం డగుదశరథ, భూమివిభుఁడు సతికిఁ బ్రీతిఁ బుట్టించుటకై
రామాభిషేచనవ్యా, యామంబునఁ జింత విడిచె నవహితమతి యై. 809

క. మునుకొని యభిషేకార్థము, జనకునియభ్యాశమునకుఁ జనుదెంచినరా
మునిఁ గన్గొని కైకయి యి, ట్లనియె న్సిరి కాసపడి నిజార్థస్పృహ యై. 810

సీ. అనఘ భవజ్జనకునిచే సమాజ్ఞప్త మైనయీనాదువాక్యంబు వినుము
పదునాల్గువర్షముల్ భరతుఁ డయోధ్యకు నాథుఁ డంబోఁకఁ గాననమునందు
మునివృత్తిఁ బూని రాముఁడు వివాస మొనర్పఁగలఁడంచు విభజించెఁ గాననీవు
రయమున దండకారణ్యమునకుఁ బోయి తండ్రిని బ్రోవు సత్యమున ననిన
ఆ. నట్ల కాక యనుచు సంబకుఁ బ్రియముగా, వ్రతముఁబూని యీయరణ్యమునకు
నరుగుదెంచె మత్సమన్వితముగ నమ్మ, హాత్ముచరిత మిది ద్విజాగ్రగణ్య. 811

తే. ఒరుల కిచ్చుఁ బె గాని తా నొరులచేతఁ
గొనఁడు సత్య మాడుఁ బె కాక మనమునందు
భ్రమసి యైన నసత్యంబుఁ బలుకఁ డెప్పుడుఁ
బృథివిలోపల మత్పతి కిది వ్రతంబు. 812

వ. మఱియు నమ్మహాత్మునియనుజుండు లక్ష్మణుండు భ్రాతృస్నేహంబున ధనుష్పా
ణియై రామసహాయార్థం బరుగుదెంచె నతండు శౌర్యాదిగుణంబుల సుప్రసిద్ధుం
డు సమరంబునందు సహాయుండు రాఘవుం డిత్తెఱంగునఁ దండ్రిచేత సమా

జ్ఞప్తుండై యాచకులకు యథేష్టంబుగా ధనం బొసంగి రాజ్యాదికంబుఁబరిత్య
జించి జటావల్కలంబుల ధరించి లక్ష్మణసహాయుండై పత్నీసమేతంబుగా దండ
కారణ్యంబునకుం జనుదెంచెఁ గైకేయీనిమిత్తం బేము మువ్వురము రాజ్య
ప్రచ్యుతులమై గంభీర తేజంబున నివ్వనంబునం జరియించుచున్నవార మొక్క
ముహూర్తం బిచ్చట నివసించితి వేని రురుగోధావరాహంబుల వధించి తన్మాం
సంబును వన్యఫలంబులును బుష్కలంబుగా సంగ్రహించుకొని మద్విభుండు
చనుదెంచు నయ్యధిపునిచేత నాతిథ్యంబుఁ గొని యవ్వల యథేచ్ఛం జన
వచ్చు నని కపటవిప్రవేషధరుండైన రావణునితోఁ దనవృత్తాంతం బంతయు
నుడివి వెండియు నిట్లనియె. 813

క. ధరణీసుర యొంటిని దు, శ్చర మగునీగహనమందు సాహసభంగిం
జరియించె దేల యేర్పడఁ, దిరముగ నీచంద మెల్లఁ దెల్పుము నాకున్. 814

రావణుండు సీతాదేవికిఁ దన నిజస్వరూపం బెఱింగించుట.

ఉ. నా విని యానిశాటకులనాథుఁడు రావణుఁ డిట్లు పల్కు నో
క్ష్మావరపుత్రికామణి జగత్త్రయ మెవ్వనిదుష్ప్రధర్ష బా
హావిభవంబుచేఁ జకిత మై శరణంబును గాన దట్టి నే
రావణనామధేయుఁడ ధరాధరధీరుఁడ దైత్యనాథుఁడన్. 815

చ. జనకతనూజ కుందనపుఁజాయల నీనెడునీదురూపముం
గని నిజకాంతలందు రతికాంక్షఁ దొఱంగితిఁ దొల్లి బల్మిచే
ననుపమలీలఁ జేకొనినయచ్చరమిన్నలలోన నీవు నా
కనిశము నగ్రభార్య వగు మద్భుతసౌఖ్యము నీకుఁ గల్గెడిన్. 816

చ. లవణపయోధిమధ్యమున లంక యనాఁ జెలువొందు మత్పురం
బవిరళభోగభాగ్యముల కాస్పద మై గిరిమూర్ధ మందు నుం
డు వలసినట్లు సంతతమునుం గడువేడుక నన్నుఁ గూడి ర
మ్యోపవనములం జరింపు మబలా యిటు లూరక డయ్య నేటికిన్. 817

చ. అలికులవేణి నాకు ముద మారఁగ గేహిని వైతి వేని యి
మ్ముల మణిహేమభూషణవిభూషితపంచసహస్రసుందరుల్
చెలువుగ నీకు దాస్యములఁ జేయుచు నుండఁగ రాజసంబునన్
విలసదమేయసౌఖ్యముల వీగుదు విట్లు కృశింప నేటికిన్. 818

సీతాదేవి రావణునిఁ దృణీకరించి పలుకుట.

తే. అన విని సతీశిరోమణి యైనసీత, తీవ్రకోపంబుచే వానిఁ దృణము గాఁగ
నెంచిమదినాదరింపక యిట్టులనియెఁ, జూపులనె వానియాయువుచూఱఁగొనుచు.

సీ. గిరిపోలె నచలుఁ డుర్వరపోలెఁ దాలిమి గలవాఁడు హరిపోలెఁ గ్రమ్ర తేజుఁ
డంబుధిపోలెఁ దా నక్షోభ్యుఁ డాపూర్ణశశివదనుండు ప్రసన్నయశుఁడు

సింహసంహననుండుసింహవిక్రాంతగామియు నృసింహుఁడుమహామేచకాంగుఁ
డాజానుబాహుఁ డనర్గళాయుధదీప్తుఁ డతిశూరుఁ డతిధీరుఁ డతిగభీరుఁ
తే. డధికసుకుమారుఁ డభిరాముఁ డరివిరాముఁ
డమితగుణధాముఁ డగురాముఁ డనవరతము
గతియు నా కమ్మహాత్ముని వితతబుద్ధిఁ
బాయ కెప్పుడు సేవింతు ఛాయపగిది. 820

తే. సర్వలక్షణయుక్తుండు సత్యసంగ, రుండు న్యగ్రోధపరిమండలుండు గుణని
ధానము జితేంద్రియుఁడు నైనప్రాణవిభుని,మాన కెప్పుడు సేవించుదాననసుర.

చ. రభసముచేత జంబుకము రావణ సింహిని బోలె నీవు దు
ర్లభ నగునన్నుఁ గైకొనఁ దలంచితి వక్కట చండభానుస
త్ప్రభగతి నేను నీకును గరంబునఁ దాఁక నశక్య నింద్రస
న్నిభుఁ డగురాముపత్ని యొకనీచున కబ్బునె రాక్షసాధమా. 822

తే. అర్కకులునకుఁ బ్రియపత్నినైన నన్నుఁ,గర మపహరింపఁదలఁచిన కారణమునఁ
గుటిలరాక్షస క్షీణభోగుండ వగుచుఁ, గనకతరువుల నిప్పుడ కాంచె దీవు.

సీ. ఆఁకలి గొన్నగజారికోఱలు దీయఁ దలకొన్నవాని మందరనగంబు
నరచేతఁ బ్రహరింప నాన చేసినవానిఁ గాలకూటవిషంబుఁ గ్రోలఁ జూచు
వాని మంగలకత్తిచే నాలుకను ద్రుంచుకొనఁ జూచువానిఁ బెన్నుండు మెడను
దవిలించుకొని వార్ధి దాఁటఁ గోరెడువాని సూదిచేఁ గనుగ్రుమ్మఁ జూచువాని

తే. రాజకులభూషణుం డైనరాఘవునకుఁ
గూర్చుప్రియురాలి నగునన్ను ఘోరభంగి
నపహరింపఁ దలంచినయట్టినిన్ను
దానవాధమ సరిగాఁగఁ దలఁప వలదె. 824

సీ. రాక్షసాధమ నీవు రాముని ప్రియభార్య నైననన్ను హరింప నాత్మఁ దలఁచి
తది యెంత యవివేక మాదిత్యసోములఁ గరములఁ బ్రహరింపఁ గాంక్ష యిడిన
యట్లు నిర్ముక్తఘోరాహిముఖంబున కోఱలఁ బెఱుకంగఁ గోరినట్లు
వారక మండెడువహ్నిని జెఱఁగున ముడువంగ మదిలోనఁ బూనినట్లు

తే. మొనసి ఘోరకాలాయసముఖము లైన
శాతశూలాగ్రములమీఁద సంచరింపఁ
గాంక్షఁ జేసినయట్లగుఁ గాదె రాము
కూర్మిపత్నిని నను మదిఁ గోరు టెల్ల. 825

ఉ. అంబుధిపల్వలంబులకు హంసబకంబులకుం ఖగేంద్రకా
కంబులకుం మృగేంద్రశశకంబులకు న్మదహస్తిరాడ్బిడా
లంబుల కెంత యంతర మిలాస్థలిఁ గన్పడు నంత తారత

మ్యం బగునాదుభర్తకు నిశాటకులాధమ నీకుఁ జూడఁగన్. 826

వ. మఱియు నమృతారనాళంబులకు మద్గుమయూరంబులకుఁ గాంచనసీసంబులకుఁ జందనవారిపంకంబులకు సారసగృధ్రంబుల కెంత తారతమ్యంబు గల దంత తారతమ్యంబు రామునకు నీకునుం గల దదియునుంగాక. 827

ఉ. వాసవసన్నిభుండు రఘువర్యుఁడు కార్ముకబాణపాణి యై
భాసురలీల ఘోరరణభాగమునం దగ నిల్చి యుండ నీ
చే సముదగ్రదోర్బలముచే హృత నయ్యెను నన్ను లోకసం
త్రాసన మక్షికాన్వితఘృతంబుగతిన్ గొనలేవు దక్కఁగన్. 828

మ. అని యిబ్భంగి నదుష్టభాష యగునయ్యంభోజపత్త్రాక్షి దు
ష్టనిశాటుం డగుపంక్తికంధరునితో సక్రోధ యై పల్కఁ గ్ర
క్కున వాతోద్ధత యైనరంభగతి సంక్షోభించి కంపించెఁ ద
త్తనుసందర్శనజాతసాధ్వసమునన్ దైన్యంబు వాటిల్లఁగన్. 829

వ. ఇవ్విధంబున దలంకుచున్నవైదేహి నవలోకించి మృత్యుసమప్రభావుం డగు రావణుండు వికటభ్రుకుటిదుర్నిరీక్షుం డై తనకులంబును బలంబును గర్వంబును నామంబును సర్వంబునుం దేటపడ నెఱింగించి యద్దేవికి భయంబుఁ బుట్టింతుఁ గాక యని తలంచి సంరబ్ధపరుషం బగువాక్యంబున ని ట్లనియె 830

రావణుండు సీతాదేవికిఁ దనపరాక్రమాతిశయముఁ దెల్పుట.

ఉ. మానిని మృత్యుదేవతకు మర్త్యుల పోలె సురాసురాదు లె
వ్వానికి సంతతంబుఁ బెనువంతఁ దలంకుదు రట్టి యేను దీ
ప్తానలతుల్యతేజుఁడ ధనాధిపుతమ్ముఁడఁ బంక్తికంఠుఁడ
న్మానితబాహుశౌర్యుఁడ సమస్తనిశాటకులాధినాథుఁడన్. 831

చ. రణమున గుహ్యకేశ్వరుఁ బరాజితుఁ జేసి యతండు భీతిఁ బ
ట్టణముఁ దొలంగి వెండిమల తావుగఁ జేసి వసించి యుండఁ దన్
మణిమయదేవనిర్మితసముంచితకామగపుష్పకంబుఁ గై
కొని భువనత్రయంబున నకుంఠితశక్తిఁ జరింతు నిచ్చలున్. 832

క. మృగనేత్ర జాతరోషుఁడ, నగునాదుమొగంబుఁ జూచినంతనె సురయ
క్షగరుడగంధర్వాదులు, మిగులఁ బరిత్రస్తు లగుచు మెలఁగుదు రెందున్. 833

చ. కువలయగంధి యే నెచటఁ గోరి వసింతుఁ జరింతు నచ్చటం
బవనుఁడు వీవ నోడు సితభానుఁడు వెన్నెల గాయ నోడు నా
రవియుఁ దపింప నోడును ధరాజములుం గదలంగ నోడు వ
హ్ని వెలుఁగ నోడు ధాత్రిఁ బ్రవహింపఁగ నోడు నదు ల్పయోద్ధతిన్. 834

చ. లవణపయోధిమధ్యమున లంక యనంగఁ జెలంగు మత్పురం
బవిరళభోగభాగ్యముల కాస్పద మై మణిసాలసౌధ మై

ప్రవిమలపద్మకైరవవిరాజితనవ్యసరోభిరామ మై
దివి బలభిత్పురంబుపగిదిన్ క్షితిభృచ్ఛిఖరాగ్రమండలిన్. 835

వ. అది మఱియు రమ్యప్రాసాదసంబాధంబును మణిచత్వరసభాభవనంబులు నై దూ
ర్యద్వారతోరణంబును హస్త్యశ్వరథసంకులంబును విచిత్రశిల్పనిర్మితహేమ
కక్ష్యంబును సర్వకామఫలప్రదనానావిధసురతరుఫలకిసలయకుసుమరసాస్వాదో
న్మత్తకీరశారికాకలకంఠమధుకరమధురశబ్దాయమాన మహోద్యానశోభితంబు
ను నై యొప్పు నప్పురంబునందు. 836

క. ననుఁ గూడి సంతతంబును, మన మలర వసించి తేని మానిని వనుజాం
గనలస్థితియపుడు తోఁచెడు, మనమునకుం జూడఁ దృణసమానం బగుచున్.

వ. మఱియు నాలంకాపురంబున మత్సమర్పితదివ్యభోగంబు లనుభవించునప్పుడు
మానుషుండును గతాయుష్యుండు నగురామునిఁ గల నైనఁ దలంచుకొన వది
యునుం గాక. 838

చ. అనుపమగాత్రి పంక్తిరథుఁ డగ్రసుతుం డనుకూర్మి మాని రా
ముని లఘువీర్యుఁ డంచు వనభూమికిఁ ద్రోచి ప్రియార్థుఁ డౌకని
ష్ఠుని నరనాథుఁ జేసె నది చూచియు నీ విపు డట్టిహీనవ
ర్తనుఁడు జడుండు మర్త్యుఁ డగురామునిపైఁ దమిఁ గూర్ప నేటికిన్. 839

తే. తాపసుండును విగతచేతనుఁడు మఱియు
భ్రష్టసామ్రాజ్యుఁ డైనయారాముచేత
నేమికార్యంబు మానవుఁ డెంతవాఁడు
విడువు మాతనిపైఁ బ్రేమ వినుతగాత్రి. 840

ఉ. ఇంతిరొ నిన్నుఁ జూచి మదిఁ దేఁపఁగ నిచ్చటి కార్తిఁ దూలి నా
యంతన వేఁడ వచ్చితి సురారికులాగ్రణి నైన నన్ను బ
ల్వంతలఁ బెట్టి తేని యబలా పరితాపము నొందె దవ్వలం
బంతముతోఁ బురూరవునిఁ బాసినయూర్వశిభంగి నంగనా. 841

వ. మఱియు మానుషుం డగురాముండు సంగ్రామంబున నాయంగుళికో నైన
సాటి సేయం దగఁడు. 842

చ. తరుణిరొ నీదుభాగ్యమునఁ దప్పక నిచ్చట నొంటి నీకు నే
దొరకితిఁ ద్రోచి పుచ్చకిఁకఁ దోరపువేడ్క భజింపు నన్ను దు
ర్ధరతరబాహుశౌర్యమున వ్రాలినవాఁడిమగండ రాముఁడుం
గర మనిలోన నన్నుఁ జెనకంగ సమర్థుఁడు గాఁడు చూడఁగన్. 843

ఉ. నా విని భూమిపుత్త్రి నయనంబుల నెఱ్ఱఁదనంబు దోఁపఁ గో
పావిలచిత్త యై వికసితానన యొప్పరఘుప్రవీరుని
న్భావమునం దలంచుకొని మాటికి దుర్వచనంబు లాడు నా

రావణుఁ జూచి దారుణశరప్రతిమోక్తులఁ బల్కె నుగ్రతన్. 844

తే. అఖిలభూతనమస్కృతు నమితతేజు
నగ్రజుని గుహ్యకేశ్వరు నాదిదేవ
సఖుని దురమునఁ గదిసి దుస్సహమహోగ్ర
కలుష మొనరింప నెబ్భంగిఁ దలఁచి తొఁకె. 845

తే. పుడమి నెవ్వారి కిట్టిదుర్బుద్ధి పుట్టె, కర్కశుఁడ వెట్టిజడుఁడవు కలుషరతుఁడ
వైన నీ వధినాథుఁడ వైతి వట్టి, ఖలులు దైత్యులు నశియింపఁగలరు నీచ. 846

క. సురపతిసతి యగుశచి నప, హరించి బ్రతుకంగ వచ్చు నాదిత్యకులే
శ్వరునిసతి నైనన న్నప, హరించి బ్రతుకంగఁ గూడ దమరవిరోధీ. 847

వ. మఱియు రామభుజప్రాకారరక్షిత నైనన న్నపహరించి నీ వమృతంబుఁ ద్రావి
నైన బ్రతుకం జాల వని యిట్లు నిరసించి పలికిన సీతవాక్యంబులు విని రావ
ణుండు హస్తతాడనంబుఁ జేసి ప్రావృట్కాలమేఘంబుకరణి మేనుఁ బెంచి
వైదేహిం జూచి వెండియు నిట్లనియె. 848

ఉ. మానిని మత్తవోట విను మామకవీర్యపరాక్రమంబు లిం
తైన నెఱుంగ వైతి నిఖిలాబ్ధులు రొంపి యొనర్తు మృత్యువుం
బూని వధింతు బాణముల భూమిని బ్రద్దలు వాపుదుం గరం
బానలినాప్తచంద్రుల శయంబులఁ దాళగతి న్ధరించెదన్. 849

క. భూమీశతనయ రాముని, పై మమతఁ బరిత్యజించి భావమున ననుం
గామించి వల్లభునిఁ గాఁ, గానుదుఁ గాఁ గామచరునిఁ గాఁ దలఁపు మిఁకన్.

తే. అని పలికె నప్డు సంక్రుద్ధుఁ డైనవాని, నేత్రములు భానుమండలనిభము లై కృ
శానుకల్పంబు లై క్షతజప్రభంబు, లగుచుఁ బింగళోపాంతంబు లై తనర్చె.

వ. అప్పుడు రావణుండు సౌమ్యం బైనభిక్షురూపంబుఁ బరిత్యజించి సకలభయంక
రం బైననిజరూపం బంగీకరించి మహాకాయుండును సంరక్తనయనుండును
దప్తకాంచనకుండలుండును నీలజీమూతసన్నిభుండును దశాస్యుండును వింశతి
భుజుండును గార్ముకబాణతూణీరధరుండును రక్తాంబరుండును గ్రోధావిష్ట
చిత్తుండు నై వసనాభరణోపేత యై సూర్యమరీచిభంగి నొప్పుచున్నస్త్రీరత్నం
బైనజానకి నవలోకించి యిట్లనియె. 852

మ. వినుతాంగీ కులశీలవంతుఁ ద్రిజగద్విఖ్యాతచారిత్రు భ
ర్తను గాఁ గోరితి వేని సమ్మద మెలర్ప న్నన్నుఁ గైకొమ్ము నీ
కనురూపప్రియవల్లభుండ భువనాధ్యక్షుండ నబ్భంగిఁ గై
కొన వేనిం బెనుఁగిన్కఁ బూని హృదయక్షోభంబుఁ గావించెదన్. 853

క. మానుషభావము విడువుము, పూనిక నిఖిలాసురోత్తముఁడ నగు నాపై
మానిని భావము సేయుము, మానసమున నితరచింత మానుము తన్వీ. 854

తరల. పడఁతిమాటకు రాజ్యసంపదఁ బ్రాభవం బెడఁబాసి యె
వ్వఁడు భయంకరకాననోర్వికి వచ్చె నట్టిగతాయువుర్
జడుఁడు రాజ్యవిహీనుఁడుం బరసంభృతుం డగురాముపై
విడువ కీ విపు డేగుణంబుల వేడ్కఁ గూర్చితి చెప్పుమా. 855

రావణుఁడు సీతాదేవి నెత్తికొని పోవుట.

వ. మఱియు దుర్మతియు నసిద్ధార్థుండు నగురామునిమీఁద మోహంబు విడిచి భర్తను గా నన్ను వరింపు మని యివ్విధంబున విప్రలాపంబులు పలుకుచు దుష్టాత్ముం డగురావణుండు కామమోహితుం డై వైదేహి డగ్గఱి యంతరిక్షంబునందు బుధుండు రోహిణింబోలె బలాత్కారంబున నొక్కకరంబున శిరోజంబులును వేఱొక్కకరంబున నూరువులునుం బట్టి యెత్తి యంతలోన సన్నిహితం బైనమాయామయహేమాంగఖరయుక్తదివ్యరథం బారోహించి యద్దేవి నంకభాగంబున నిడుకొని పరుషవాక్యంబులం దర్జించుచు రయంబున రథంబుతోఁ గూడ గగనంబున కెగసె నప్పుడు తీక్ష్ణదంష్ట్రుండును మహాభుజుండును మృత్యుసంకాశుండును గిరిసన్నిభకాయుండు నగురావణుం జూచి భయార్త లై వనదేవత లాక్రోశించు చుండిరి యివ్విధంబున నకామ యగుదాని భయార్త యై దూరగతుం డగురామునిం జీరుదాని సురనాగాంగనభంగి వివేష్టమాన యగుదాని యశస్విని యగుజానకి బలాత్కారంబునం గైకొని దురాత్ముం డగుదశగ్రీవుం డంబరంబునం జనుసమయంబున. 856

సీతాదేవి రావణహృత యై రామలక్ష్మణులం దలంచి విలపించుట.

తే. రావణునిచే గృహీత యై రామపత్ని, తనదుదురవస్థ కెంతయుఁ దలఁకి చాల
వగలఁబొగులుచు నున్మత్తపగిది భ్రాంత,హృదయగతి విలపించుచు నిట్టులనియె.
ఆ. కామరూపుఁ డై నఖలరాక్షసునిచే గృ, హీత నై ననన్ను నెఱుఁగ వైతి
హా కృపావిధేయ హా సుమిత్రాసుత, హా గురుప్రసాద హా మహాత్మ. 858
తే. ధర్మహేతువువలన నర్థమును జీవి,తమును సుఖమును దృణముగాఁ దలఁచితీవ
ధర్మమున ద్రియమాణ నై తలఁకునన్ను,నృపకులోత్తమ గనుఁగొన నేరవుగద.
క. అనఘా నీ వవినీతుల, కనవరతము శిక్షకుండ వైతివి నేఁ డీ
యనువునఁ బాపముఁ జేసిన, దనుజుని శాసింప వేల దయ దప్పె నొకో. 860
తే. పరఁగ నవినీతజనకృతపాపమునకు, జగతి సద్యఃఫలప్రదర్శనము లేదు
కాల మందుకు సహకారికారణ మగు, సస్యపాకంబునకుఁ బోలె సంతతంబు.
వ. అని పలికి రావణు నుద్దేశించి నీవు కాలోపహతచేతనుండ వై యీకర్మంబుఁ గావించితి వింక రామునివలన ఘోరంబును జీవితాంతకరం బైనవ్యసనంబు నొందఁ గల వని పలికి వెండియు. 862
క. ఆకస్మికముగ దానవుఁ, డీకరణిం గొనుచు బలిమి నేగెడు నన్నుం

ప్రాకృతకర్మఫలంబులు, చేకూడెం గాక యేల చింతింపంగన్. 863

తే. కాలచోదితుం డై వీఁడు కాంక్షచేత, నన్ను ముచ్చిలి గొనిపోవుచున్నవాఁడు
వీరశేఖరుం డైన నావిభునిచేత, సందియము లేదు పంచత్వ మొందఁ గలఁడు.

క. ఈపాపాత్మునిచే నే, నీపట్టునఁ జిక్కు చుండ నిఁకఁ గైకయి దా
నేపార బంధుయుతముగ, దీపించుచు నుండుఁ గాదె తీఱనికోర్కెన్. 865

ఉ. కాననసీమయందు దశకంఠుఁడు ముచ్చిలి దుర్వినీతుఁ డై
పూనిక భూమిపుత్త్రిఁ గొనిపోయెడు వేగమె నీవు ప్రోవ రా
వే నృప ధర్మశీల రఘువీర యటంచుఁ గృపారతి న్జన
స్థాననగంబులార యలసారకులాగ్రణితోడఁ జెప్పరే. 866

క. రావణుఁడు జానకిం గొని, పోవుచు నున్నాఁడు వేగ ప్రోవు మటంచు
న్నావిభునితోడఁ జెప్పుము, వావిరిఁ గృపతోడ మాల్యవద్గిరినాథా. 867

క. నిరుపమతరంగమాలా, పరికలితమరాళచక్రబకనాదనవి
స్ఫురితఘనగౌతమీనది, నరనాథునితోడఁ జెప్పు నా తెఱఁ గెల్లన్. 868

చ. తిరముగ నింద యున్నవనదేవతలార మృగంబులార ఖే
చరవరులార సిద్ధమునిసంతతులార దశాననుండు బం
ధురగతి సీత నెత్తికొని దొంగిలి పోయెడు నంచు మీరు మ
ద్వరునకుఁ జెప్పుఁ డార్తి సతతంబు మిముఁ శరణంబు వేఁడెదన్. 869

చ. యమునకుఁ జిక్కినట్టిసతి నైన వెసన్ విడిపింపఁ జాలునం
తమహిమ గల్గువాఁడు రఘునాయకుఁ డీపని విన్నయంత వి
క్రమమున వీనిఁ దాఁకి పటుకాండహతి న్వధియించి మించి య
శ్రమమున నీక్షణంబె సుకరంబుగ న న్విడిపింప కుండునే. 870

వ. అని బహుప్రకారంబుల విలపించుచు నమ్మహీపుత్త్రి పురోభాగంబున వనస్పతిగతుం డైనగృధ్రనాథుం డగుజటాయువునుం జూచి భయకంపితాంగి యై డగ్గుత్తికతో నిట్లనియె. 87

చ. రాముఁడు లేనిచో నను నరణ్యమునం గొనిపోవు చున్నవాఁ
డీమనుజాశనుండు పతగేశ్వర వీఁ డతిశూరుఁ డౌట సం
గ్రామతలంబునం దగ భరం బగునీకు జయింపఁ గాన సు
త్రామసమానుఁ డైనరఘురామున కింత యెఱుంగఁ జెప్పవే. 872

జటాయువు రావణునికి హితోపదేశముఁ జేయుట.

ఉ. నా విని యజ్జటాయువు వనస్పతిపై నిదురం దలంగి యా
రావణు వానియంకమున రామునిఁ జీరుచు నేడ్చుజానకీ
దేవిని జూచి ఱెక్కలు విదిర్చి శితాయతతుండుఁ డై మహా
గ్రావముఖంగి గాత్ర మలరం బరుషోక్తుల వాని కిట్లనున్. 873

ఉ. ఓరి దశాస్య యేను విహగోత్తముఁడ న్భుజవీర్యవిక్రమో
ద్దారుఁడ సత్యసంశ్రయుఁడ ధర్మవిదుండ జటాయు వంద్రు నా
పే రటు పెక్కుకయ్యములఁ బెద్దయు విశ్రుతిఁ గన్నవాఁడ సొం
పార వసించి యుండుదుఁ గదా బహుకాలమునుండి యిచ్చటన్. 874

తే. సర్వలోకంబునకు రాజు సత్యసంధుఁ, డింద్రవరుణోపముం డతిహితుఁడు లోక
ములకుఁ శూరుండు దశరథపుత్త్రుఁ డలరు, రాముఁ డన సర్వసుగుణాభిరాముఁ డగుచు.

ఉ. ఏసతి బల్మి నెత్తికొని యేగఁగ నీవు దలంచి తాసతిఁ
భూనుతఁ గా నమేయగుణపుణ్యచరిత్రను గాఁ బతివ్రతో
ల్లాసినిగాఁ గనద్గుణవిలాసిని గా నలరాముపత్నిఁ గా
శ్రీసముఁ గాఁ బవిత్రకులశీలను సీతను గా నెఱుంగుమీ. 876

ఉ. రాముఁడు సూర్యవంశ్యుఁ డభిరాముఁడు భూరిభుజాపరాక్రమో
ద్దాముఁడు కీర్తనీయగుణధాముఁడు ఘోరబలాధికాసుర
స్తోమవిరాముఁడు గ్రరణసోముఁడు వీర్యజితైకపింగను
త్రాముఁడు భూరిదోర్విజితరాముఁడు సుమ్ము నిశాచరాధమా. 877

ఉ. రావణ ధర్మశీలుఁ డగురాజు పరాంగన నెట్లు గోరు నా
హా వినుమందు రాజసతి యంబయుఁ బోలె సురక్షణీయ యౌఁ
గావున నీ తెఱంగు గొఱగా దిఁక నీచమనీష మాను ము
ర్వీవరుఁ డైనరాముని కరిష్టముఁ జేసి మనంగ వచ్చునే. 878

తే. ధీరుఁ డగువాఁడు పరులునిందించునట్టి, పని యొనర్పఁడు తనపత్ని తనకు నెట్లు
రక్ష్యయౌ నట్లు పరవిమర్శనమువలనఁ, బరసతులు రక్షణీయలు పరుల కెందు.

వ. రాక్షసేంద్రా శాస్త్రపర్యాలోచనంబునం దతిసూక్ష్మదృష్టిగలవారి కైనఁ బరమ
దుర్బోధంబు లైనధర్మార్థకామంబులు రాజుకంటె నితరు లగువారు రాజు
ననుసరించి కావింతురు కావున ధర్మోపదేశపరుం డగురాజున కధర్మప్రవృత్తి
యనుచితం బై యుండు సర్వావస్థలయందును ధర్మంబె యాచరింపవలయు
సద్వృత్తు లగురాజులు శాస్త్రవిరుద్ధం బైనకామాదికంబు నిచ్ఛగింపరు. 880

తే. యామినీచరధర్మార్థకామములకు, రాజు స్థానంబు గావున రమణతోడఁ
బుణ్యపాపంబులును యశంబును శుభంబు, రాజమూలంబు లై చెల్లు రాక్షసేంద్ర.

తే. ధరణిఁ బాపాత్ముఁ డగువాఁడు తనకయోగ్య, మైనదివ్యవిమానంబు నధిగమించి
నట్లు చపలుండ వగునీ వనర్హ మైన, విభుత నెబ్భంగి నొందితి విబుధవైరి.

తే. పరఁగ నెవ్వాని కెద్ది స్వభావ మదియుఁ, జాల దురతిక్రమం బగుఁ జపలచిత్తు
లైనవారిగృహంబుల నధివసింపఁ, జాల దిలఁ బెద్దకాల మైశ్వర్య మసుర.

ఉ. రాముఁడు నీకుఁ దొల్లి యపరాధముఁ జేసి యెఱుంగఁ డిట్టిబా
హామహిమాభిరాముని కహస్కర తేజున కెగ్గు సేయఁగా

నీమది నెట్లు చూచితివి నిక్కము దీనఁ బోనంగుఁ జేటు సం
గ్రామమునం దదీయపటుకాలకటాక్షనిభాస్త్రసంహతిన్.

ఉ. ఏమనుజేంద్రపత్ని నిపు డేపున ముచ్చిలి పోయె దారఘు
స్వామిపరాక్రమంబు భుజశక్తియు నోర్వఁగ నోపు నేఘనుం
డీమహిఁ జుప్పనాతికయి యింతకు మున్న ఖరాసురుండు త
ద్భీమకృతాంతదండనిభదీప్తశరాహతి నుర్విఁ గూలఁడే.

చ. కడువడిఁ గంఠలగ్న మగుకాలుని పాశముగాఁ దెఱంగున
స్ఫుడిచినవిస్ఫులింగముగ బుక్కిటఁ బట్టినదుర్విషంబుగాఁ
గడఁక నెఱింగి సీత నిట గ్రక్కున డించి తొలంగు మట్లు గా
నొడఁబడ వేనిఁ గూలెదు తదుగ్రశరార్చులఁ గాలి వ్రేల్మిడిన్.

క. హరివజ్రము నిజహేతులఁ, గర మరుదుగ వృత్రదైత్యుఁ గాల్చినభంగి
న్నరపతి నయనోత్థితభీ, కరదహనార్చులను నిన్నుఁ గాల్పక యున్నే.

వ. రావణా యేభారద్రవ్యంబు నరుఁ బీడింప దట్టిదాని మోవం దగు
న్నంబు రోగంబు నుత్పాదింపక జీర్ణించు నట్టియన్నంబు భుజింపం దగు
ర్మంబుఁ జేసిన గీర్తియశోధర్మంబులు నశించు. నట్టికర్మం బెవ్వం డాచరిం
ప్రమాదంబునం గావించె నేని దాన శరీరఖేదంబు గలుగు నంతియె కాని
బేమియు లేదు నా కఱువదివేలవత్సరంబు లతీతంబు లయ్యె నాఁట నుండి
పైతామహం బైనఖగరాజ్యంబుఁ బరిపాలించు చున్నవాఁడ.

చ. స్థిరచిరకాలము న్మనుటచేఁ గడు వృద్ధుఁడ నైతి నేను నీ
వరయఁగఁ బ్రౌఢమూర్తివి శతాంగివి ధన్వివి ఖడ్గి వస్త్రి వై
వఱలుదు వైన నేమి యనివారణచాతురి నన్ను మీఱి యి
ప్పురుసున నీకు రాఘవునిపత్నిని జేకొని పోవ వచ్చునే.

వ. మఱియు ద్రవద్రవ్యం బగుటవలన క్షీరంబుమాడ్కి సుర పేయం బనియె
నది మొదలుగాఁ గలతర్కసంయుక్తయుక్తులచేత సుర పేయంబుగా దని
ధించునట్టి నిత్యం బైనదాని నిరపేక్షణం బైనవేదశ్రుతిని బురుషుం డెట్లు
రింపశక్తుండు గాఁ డట్లు నీవు సీత నామొఱల బలాత్కారంబున నపహరిం
టకు శక్తుండవు గావు మహాత్ములగు రామలక్ష్మణులు దూరగతు లగు చు
చౌర్యంబున వైదేహిం గొని భయంబునం బఱపెత్తుచున్నవాఁడవు నీవు శూ
డ వేని నాతో ద్వంద్వయుద్ధంబు సేయుము కాదేని యొక్కముహూర్త
నిలువుము పెక్కుమాఱు లెవ్వానిచేత సంగ్రామంబున దైత్యదానవుల
క్కండ్రు నిహతు లై రట్టిజటావల్కలధరుం డైనరాముండు చనుదెంచి
స్థానగతుం డైనఖరునిం బోలె నిశాతసాయకంబుల నిన్నుం బడవైచి
పత్నిం గొనిపోవు నే నారామునకు సచివుండ నాయెడలఁ బ్రాణంబు ల

నీవు వైదేహి నెత్తికొని పోవం జాలవు ప్రాణంబు లర్పించి యైన రామునకు దశరథునకు హితంబుఁ గావింపం దగినవాఁడ నోపినకొలంది నీకు యుద్ధాతిథ్యం బొసంగెద నీకుఁ బ్రాణంబుల పైన నాస గల దేని వైదేహిం బరిత్యజించి తొలంగి చను మట్లు సేయ వేని వృంతంబువలన ఫలంబుంబోలె రథంబువలన నిన్నుం ద్రెళ్లవైచెద చూడు మని పలికి యాజ్జటాయువు రోషావేశంబున నిలు నిలు మని యదల్చి తాఁకిన నద్దశగ్రీవుండు సక్రోధుండై వింశతిలోచనంబుల నగ్నికణంబు లొలుకఁ గాంచనకుండలరోచులు గండభాగంబుల నిండ కొన మండలీకృతకోదండుం డై ప్రచండంబుగా నయ్యండజమండలాఖండలుం దలపడియె నివ్విధంబున మార్గాని పక్షవంతంబు లైన మేఘంబులపగిది నితరేతరసంఘర్షణంబుల నన్యోన్యప్రహారణంబులఁ బరస్పరధిక్కారంబుల నక్కజంబుగాఁ బోరుసమయంబున. 890

జటాయువు రావణునితో యుద్ధము చేయుట.

శా. ప్రాచుర్యంబుగ రావణుండు నిశితోగ్రక్రూరనాళీకనా
రాచంబు ల్నిగిడింప గృధ్రవిభుఁ డుగ్రక్రోధుఁ డై జన్యవి
ద్యాచాతుర్యము మీఱఁ దచ్ఛరములన్ దాఁటించి పెన్గోళ్ల న
న్నీచాంగంబు వ్రణంబుఁ జేసె రుధిరోన్మేషంబు వాటిల్లఁగన్. 891

ఉ. అంత దురంతకోపమున నద్దశకంధరుఁ డుగ్రవృత్తిఁ గా
లాంతకకాలదండసదృశాంబకము ల్పది యెక్కుపెట్టి య
త్యంతరయంబునం బఱపి యద్భుతభంగి గుణస్వనంబు రో
దోంతర మెల్ల నిండఁ బతగాధిపుగాత్రము నొవ్వఁ జేసినన్. 892

ఉ. దానికి నించు కైన మదిఁ దత్తఱ మందక పక్షినాథుఁ డా
దానవు తేరిపై బహువిధంబుల నార్తిఁ గృశించుచున్న యా
జానకిఁ జూచి రోషమతి సాహసికత్వము చెంగలింపఁ గా
లానలుభంగి మోము చెలువారఁ బరాక్రమదుర్నివారుఁ డై. 893

చ. అలయక వానివిల్లు చరణాహతిఁ ద్రుంచిన వెండి కోప మ
గ్గలముగ నొండు విల్లు గొని కాండము లొక్కట నూఱు వేయు ల
క్షలు నిగిడింపఁ దచ్ఛరనికాయముచేతఁ బరీతుఁ డై మహా
బలుఁడు కులాయమధ్యగతపక్షివిధంబునఁ జూడ నొప్పుచున్. 894

తే. మేదురపతత్రజాతసమీరణమున, రావణశరంబు లన్నియుఁ బోవఁ దట్టి
కఠినవజ్రాభచరణనఖప్రహతుల, మరల దశకంధరునివిల్లు విఱిచి వైచె 895

జటాయువుచేత రావణుఁడు విరథుఁ డగుట

చ అంతటఁ బోక పక్షివరుఁ డంఘ్రుల వానిధ్వజంబు ద్రుంచి యిం
తింతలు తున్కలై వెస మహీస్థలి వ్రాలఁ బతాకఁ దన్ని ప

ఘాంతముల న్హయంబుల రయంబునఁ జంపి తదీయకంకటం
బంతియుఁ జించి సూతుఁ దెగటార్చి నఖంబులఁ జించె ఛత్రమున్. 896

వ. మఱియుఁ ద్రివేణుసంపన్నంబును పావకసన్నికాశంబును గామసంచారక్షమంబును మణిహేమవిచిత్రాంగంబు నగురథంబుఁ బఱియలు వాపి గ్రాహకసహితంబుగాఁ జామరంబులు భంజించి పక్షీంద్రుం డక్షీణభుజావిక్షేపంబుఁ జూపిన నద్దశగ్రీవుండు విరథుండును హతాశ్వుండును హతసారథియు నై నిజాంకభాగంబున వైదేహి నిడుకొని శీఘ్రజవంబున ధరణిపయిం బడుటయు నతనిపరాభవంబుఁ జూచి సకలభూతంబులు సాధువాక్యంబులఁ బక్షీంద్రునిం బ్రశంసించి రంత రావణుండు భూతలపతితుం డయ్యును జరాభారంబునఁ బరిశ్రాంతుం డై యున్నజటాయువుంజూచి సంహృష్టచిత్తుం డై క్రమ్మఱ నమ్మహీపుత్రితోడ గగనంబున కెగసి యతిత్వరితగమనంబునం బోవుచుండ నయ్యండజశ్రేష్ఠుండు తోడనె యెగసి నిలునిలు మని యదల్చి పక్షవిక్షేపణసంజాతవాతవేగంబున నతని సుడి వెట్టుచు నొడ్డారంబుగా నడ్డంబు నిల్చి పరుషవాక్యంబున ని ట్లనియె. 897

చ. అశనిసమానబాణుఁడు మహాత్ముఁడు రామవిభుండు తత్సతిం
బశుమతిఁ జేసి బల్మిఁ గొని పాఱెద వాత్మవధార్థ మీ వయో
దశముఖ చేటెఱుంగక మదంబున మీనము మాంసబుద్ధి వె
క్కసముగ మాంసయుక్త మగుగాలము మ్రింగినచంద మేర్పడన్. 898

క. దితిజాధిపబాంధవబల, హితభృత్యామాత్యసుతసహితముగ నుపిపా
సితుఁ డుదకముఁ గ్రోలినక్రియ,హిత మెఱుఁగకవిషముఁద్రావితేటికిఁ జెపుమా.

క. అవిచక్షణు లగుపురుషులు, భువిలో నాత్మీయదోషమున నష్టప్రా
భవు లై నీవిధమున వా, నవవైరి నశింతు రింత సత్యం బరయన్. 900

ఉ. ఒంటిగ నున్నచో రఘుకులోత్తము దేవిని మ్రుచ్చిలించుటే
బంటుతనంబు నీకుఁ గులపాంసన యమ్మహనీయకార్ముకుం
డంటినఁ గిన్కఁ దిగ్మవిశిఖాహతి నిన్ను వధించి సీత ని
ష్కంటకవృత్తి వెండి కొనుఁగా కిఁక నిన్ను మనంగ నిచ్చునే. 901

క. అచ్చుపడఁగ నీ విగతి, వచ్చుటయును సీత నిట్లు వంచించి రహిం
దెచ్చుటయు విని సహింతురె, సచ్చరితులు రాజసుతులు సంగరధీరుల్. 902

చ. కదువడిఁ గాలపాశ మురిగాఁగ మెడం దవిలించికొంటి వె
క్కడఁ జన వచ్చు నీకు దశకంధర పుత్రబలాన్వితంబుగాఁ
దడయక రాఘవుండు నిశితప్రదరానలహేతుల న్రయం
బడరఁగ నిన్నుఁ గాల్చు భయదాజిమహీ న్ఖరదైత్యునిం బలెన్. 903

క. ధర నెంతటివాఁ డైనను, దర మెఱుఁగక నీచబుద్ధిఁ దాఁ జేసినదు

ర్భరదుష్కర్మముఫలమును, గుఱుతుగఁ దోడ్తోడఁ గట్టి కుడువక చనునే. 904

క. ధీరుఁడ వగునీచే నిటు, లారయఁ గడు నింద్యకర్మ మది కృత మయ్యెం
జోరాచరితపథం బిది, వీరాచరితంబు గాదు విబుధవిరోధీ. 905

క. లోకవిగర్హిత మగుపనిఁ, గైకొని కావించునట్టి కలుషాత్ముం డా
లోకేశుఁ డైన మేదినిఁ, బ్రాకటముగ సిరియుఁ దక్కి బ్రతుకంగలఁడే. 906

వ. దురాత్మా మృత్యుకాలంబునందుఁ బురుషుం డాత్మవినాశంబుకొఱకు నెట్టి కర్మంబు నొందు నట్టిసీతాహరణరూపకర్మంబు నొందితివి దీన నీకు మృత్యువు సిద్ధించు నేకర్మంబునకుఁ బాపానుబంధంబు గలుగు నట్టికర్మంబు భగవంతుం డగు లోకేశ్వరుం డైనను గావింపం డని బహుప్రకారంబుల నుపక్రోశించుచు నంతకంతకుఁ గోపం బగ్గలం బగుటయు నప్పతంగకులపుంగవుండు శీఘ్రంబు నం బఱతెంచి రావణునివీఁపున వ్రాలి గజారోహకుండు మదవారణం బధిరోహించి యేాదృశవ్యాపారవంతుం డగు నత్తెఱంగున వాని నాక్రమించి దీక్ష్ణనఖంబుల విదారించుచు నిశాతతుండంబున వ్రణంబు సేయుచుఁ గేశంబు లుత్పాటించుచు నఖపక్షముఖాయుధుం డై వెండియు బహుప్రకారంబుల నొప్పించిన నతండు బెండుపడక రోషవిశేషంబున నమర్షస్ఫురితోష్ఠుం డై కంపించుచు వై దేహిని వామాంకంబునం గ్రుచ్చి పట్టి కరతలంబున జటాయువు వ్రేసిన నతండు కడు నలిగి యన్నిశాచరు నాక్రమించి నిశితం బైనతుండాగ్రంబున వానివామబాహుదశకంబు ఖండించిన నవి క్రమ్మఱం బొడమి రక్తధారాన్వితంబు లై విషజ్వాలావళీయుక్తంబు లైనపన్నగంబులకరణి నొప్పుచుండె నిత్తెఱంగున రావణుండుజటాయువుచేత వ్రేటుపడి తానుబ్రాఘుం డయ్యును వృద్ధుం డగుజటాయువుఁ గడవంజాలక చిక్కువడి యేాడుఁ గఱచి శీఘ్రంబున వైదేహి డించి యతనితోడ బాహుయుద్ధంబునకుం దలపడి ముష్టిప్రహారంబులఁ జరణతాడనంబుల బడలుపడం జేసిన నవ్విహంగమపుంగవుండు వెనుదీయక రామార్థంబు శరీరాయాసజనకం బైనరణంబు సేయుచుమూర్కొనిన ననమానపరాక్రము లైనయాతుధానాథపక్షినాథులకుఁ గొండొకసేపు దారుణం బగుసంగ్రామంబు చెల్లె నంత నద్దశగ్రీవుండు. 907

—రావణుఁడు జటాయువుయొక్క పక్షపాదంబుల ఖండించుట.—

క. కడిమి మెఱయ ఖడ్గము గొని, కడువడి సమరమున రామకార్యార్థము పో
రెడుఖగపతిపక్షంబులు, కడఁకం బాదములు రెండు ఖండించె వెసన్. 908

వ. అంత. 909

క. పక్షివిభుఁ డిట్లు ఖండిత, పక్షుం డై యసివిలూనపాదుం డై ర
క్తోక్షితతనుఁ డై పొలుపఱి, యాక్షణమ విసంజ్ఞుఁ డగుచు నచలం బడియెన్.

తే. ఇత్తెఱంగున దుష్టదైత్యేశఖడ్గ, ఖండితపతత్రపాదుఁ డై కడిమి దక్కి

పుడమిఁ బడి యున్నఖగపతిఁబోలఁజూచి, జనకసుత శోక మడరంగఁ జాలవగచె.

వ. మఱియు రావణభుజావేగమర్దితుం డై శాంతం బైనదావానలంబుపగిది నిస్తే
జుం డై పుడమిం బడి యున్నవాని నీలజీమూతప్రకాశకల్పుం డగువానిఁ
బాండురపక్షుం డగువాని మహావీర్యుం డగువాని గృధ్రపతి నవలోకించి
దుఃఖార్త యై కరంబుల సంస్పృశించి శశినిభానన యగుజానకి భర్త నుద్దే
శించి యిట్లని విలపించె. 912

సీతాదేవి జటాయువును జూచి విలపించుట.

సీ. పరఁగఁ బింగళ్యాదిపక్షిస్వరజ్ఞాన మక్షిపరిస్పందనాదిజన్య
లక్షణజ్ఞాన మిలాస్థలి నరులకు గణుతింప సుఖదుఃఖకారణంబు
లండ్రు నేఁ డిట్లు న న్నసురుం డపహరించు టెంతయు నిచ్చటి మృగఖగములు
సూచింపఁ జేయుచు సొరిది గుంపులు గట్టి చరియించు చున్నవిసంభ్రమమునఁ

ఆ. ప్రాణనాథ నాకుఁ బాటిల్లినట్టియీ, వ్యసన మీవెఱుంగ వైతి వేల
నరవరేణ్య నేఁడు నాయభాగ్యంబునఁ, జేసి నీదుబుద్ధి చిక్కె నొక్కొ. 913

క. నను గావ వచ్చి పాపపు, దనుజునిచే నిహతుఁ డగుచు ధరణిం బడె నీ
యనఘుఁడు పక్షీంద్రుం డీ, తనిఋణ మేపగిదిఁ దీర్పఁ దగు నీ కధిపా. 914

శా. హా రాజోత్తమ హా కృపాజలనిధీ హా రామ హా లక్ష్మణా
ఘోరారణ్యమునందు రాక్షసుఁడు నన్ గొంపోవు చున్నాఁడు దో
స్సారోదారుని వీనిఁ జంపి నను జంచత్ప్రీతి రక్షింపరే
రా రే వేగమె వీని కడ్డపడరే రమ్యాకృతు ల్చూపరే. 915

ము. అని యిబ్భంగిఁ గృశించుచు న్విభుని సువ్యక్తంబుగాఁ జీరుచున్
ఘనవృక్షంబులఁ గౌఁగిలించుకొనుచుం గంపించుచు న్బాష్పము
ల్చినుక న్బొరుస నేడ్చుజానకిని యోషిద్వర్గచూడామణి
న్గని దైత్యాధముఁ డుగ్రుఁ డై పరుషవాక్యప్రౌఢిఁ దర్జించుచున్. 916

మ. కడిమిం గ్రమ్మఱఁ గైకొనం దలఁచునక్కాలంబున న్సాధ్వినం
బడర న్దిక్కులఁ జీఁకటు ల్గవిసెఁ బద్మాప్తుండు నిస్తేజుఁ డై
జడతం జెందె సమీరణుండు వగ హెచ్చ న్వీవకుండె న్మను
ల్కడు శోకంబున సీతపాటుఁ గని కిన్కం దూఱి రెంతే విధిన్. 917

వ. మఱియు సచరాచరం బగుజగం బంతయు నతిక్రాంతనైసర్గికావస్థానంబ య్యెఁ
బితామహుండు దివ్యజ్ఞానదృష్టి నాలోచించి దేవతాకార్యంబు కృతం బయ్యె
నని పలికె దండకారణ్యనివాసు లగుమహర్షులు సీతానిమిత్తంబున రావణున
కు వినాశంబు వాటిల్లు నింక సకలలోకంబులకుఁ బరమకల్యాణంబు గలుగునని
గుసగుసవోవుచు నప్పటివైదేహీదురవస్థ విలోకించి దుఃఖించు చుండిరి యి
వ్విధంబున రావణుండు రామలక్ష్మణులం బేర్కొని విలపించు చున్నజానకిని

బలాత్కారమున నెత్తికొని శీఘ్రంబున నాకాశంబున కెగసె నప్పు డద్దేవి వస్త్రాభరణసువర్ణాంగియుఁ బీతకౌశేయవాసినియు నై సుదామాఖ్యపర్వతంబునం బుట్టినమెఱుంగు చందంబున నొప్పెఁ మఱియును. 918

క. కమనీయం బగుసీతా, కమలేక్షణ మంజుపీతకౌశేయముచే
నమరారి యొప్పె నప్పుడు, సమీరసఖుచేత నీలశైలముమాడ్కిన్. 919

తే. మఱియు నయ్యింతిలోహితసురభిపద్మ
పత్రములు రావణునిమీఁదఁ బడియె నపుడు
బీతకౌశేయపట మొప్పె నాతపమున
నినమరీచులచేఁ దామ్రఘనముపగిది. 920

సీ. చారుతామ్రోష్ఠంబు చాంపేయకుసుమ మోహపమాననునాసానమన్వితంబు
పద్మగర్భాభంబు పాండరదశనాభిరంజితం బలకాభిరాజితంబు
శుభదర్శనంబు మంజులకపోలతలంబు దీర్ఘలోచనసముద్దీపితంబు
కనకప్రభంబు శృంగారలలాటంబు నలలితతారకావిలసితంబు
తే. నగుమహీపుత్రివదన మొప్పారె నపుడు, శోకభరముననొక్కింతసొబగు దప్పి
పవలు గనుపట్టు రోహిణీపతివిధమున, రాత్రిఁ గనుపట్టు నవతామరసముపగిది.

తే. మఱియు నీలాంగుఁ డగుదైత్యనరునియంక
మున సువర్ణాంగి యగుమహీపుత్రి యొప్పె
విమలకాంతి శోభిల్లునీలమణి నాశ్ర
యించినవినూత్నకాంచనకాంచిపగిది. 922

తే. వెండియు వెడందకాటుకకొండపగిదిఁ, గ్రాలు దేవారియంకభాగమున దీప్త
హేమభూషణ యగునమ్మహీజ యొప్పె, మేచకాభ్రంబుచెంగటమించుఁబోలె.

సీతాదేవి ధరించి యున్న పుష్పాభరణాదులు భూపతిం బడుట.

క. దోషాచరుఁ డాజానకి, భూషణఘోషమున నలరెఁ బుష్కరవీథి
న్భీషణముగ శంపాని,ర్ఘోషాయతఘనముక్రియ నకుంఠితలీలన్. 924

చ. గుఱుతుగ నమ్మహీతనయకొప్పునఁ జుట్టిన మంజుపుష్పముల్
సురకుధరంబుపైఁ బడెడుచుక్కలకైవడిఁ గొన్ని యన్నిశా
చరుపయి వ్రాలె వ్రాలె వసుధ న్మఱి కొన్ని మహీతలంబుపైఁ
గర మవివేకి యైనదశకంఠుయశఃకుసుమంబులో యనన్. 925

తే. మఱియు నద్దేవికాంచనమణివిచిత్ర, నూపురము మింట నుండి మనోజ్ఞఘణితి
మధురముగమ్రోయుచునుదటిన్మండలంబు,పగిదిరయమునధరణిపైఁబడియెనపు [డు.

క. తరుపల్లవశోభిత యగు, ధరణీనందని వినీలతనుఁ డగురాత్రిం
చరుని వెలయించె నప్పుడు, కర మరుదుగ హేమకక్ష్యగజమునుబోలెన్. 927

క. త్వరితగతి నేగుతఱి న, వ్వరవర్ణినిదీప్తవహ్నివర్ణవిచిత్రా

భరణము లిల వ్రాలె నభోం, తరమున సంక్షీణ లైనతారలమాడ్కిన్.

తే. చంద్రుచంద్రిక గతి నొప్పు జనకపుత్రి
హారధార తదీయ స్తనాంతర ప్ర
గళిత యై యుర్విఁ బడియె నక్కజముగాఁగ
గగనమున నుండి పడియెడుగంగఁ బోలి.

వ. మఱియు నానాద్విజగణయుతంబు లగుపాదపంబు లుత్పాతవాతాభిష
బులై విధూతాగ్రంబులచేత వై దేహి కభయంబుఁ దెల్పిన ట్లొప్పుచుండెఁ
లాకరంబులు విధ్వస్తకమలంబు లై విత్రస్తమీనవిహంగమంబు లై మూ
యైనసఖంబోలె వై దేహి నుద్దేశించి తదీయదుర్దశాదర్శనంబువలన సం
నిశ్వాసంబు లై దుఃఖించిన ట్లుండె సింహవ్యాఘ్రమృగద్విపంబులురావ
దారాత్మ్యంబునకు నాక్రోశించుచు నిలిచినచోట నిలువక రావణవి
రోషంబున ఛాయానుగతంబు లై పరువెత్తుచుండెఁ బర్వతంబులు జల
తాశ్రుముఖంబు లై శృంగంబు లనుసముచ్ఛ్రితభుజంబులు గలిగి గుహామ
బుల మొఱ పెట్టిన ట్లుండె దివాకరుండు దీనుండై నిష్ప్రభుండై పాండుర
డలుం డయ్యె నపాంసులాశిరోమణి యగువై దేహిని రావణుండు మ్రు
కొనిపోవుచున్నవాఁడు లోకంబుల నింకనార్జవంబును నానృశంస్యంబునున
బును ధర్మంబును లే దని సకలభూతంబులు గుంపులు గట్టి పెక్కుచంద
విలపించు చుండె మృగపోతంబులు దీనముఖంబు లై బాష్పపాతావిలేక్షణ
లైననయనంబుల పారెసారెకు సీత నవలోకించి రోదనంబు సేయుచుండె
లక్ష్మణాగమనకాంక్షచేతధరణీతలంబు నవలోకించుచు బహుప్రకారంబుల
పించుచు రావణాంకగతయై గగనంబునంజనుచున్నజానకినవలోకించి వన
లాకంపితగాత్రలై రి రావణుండు సీతనపహరించుచుండఁ జరాచరం బగులో
బంతయు మానసంక్షోభచలితం బైనకమలాకరంబుచందంబునం జూపట్టె
త్తెఱంగున దురాత్ముం డగురావణుండు సమాకులకేశాంతయు విప్రమృష్ట
యు నగువై దేహి నపహరించి యాత్మవినాశంబుకొఱకుఁ దనపాలిమృత్యు
గొనిపోవుకై వడి నతిత్వరితగమనంబున నాకాశంబునంబోవ నప్పుడు శరీర
వడంక మొగంబునం జిఱుచెమట గ్రమ్ము దేర దీవచందంబున నషల
నుచ్చైర్నాదంబున రోదనంబు సేయుచు రామలక్ష్మణులం జీరుచు ది
లాలోకించుచు వనదేవతలం బేర్కొనుచుఁ దనదురవస్థకు దైవంబుదూఱ
రోషరోదనతామ్రాక్షియై యలుకవొడమినచిత్తంబున నమ్మహీపుత్రి రా
నుద్దేశించి యశనిపాతకల్పం బైనదారుణవాక్యంబుల ని ట్లనియె.

సీతాదేవి తన్ను బలాత్కారముగా నెత్తికొనిపోవురావణుని దూఱుట.

క. ఓరి దురాత్మక మత్పతి, దూరంబున కేఁగి యుండ దొంగిలి నను దు

ర్వారోద్ధతిఁ గొని యీగతిఁ, బాఱుట కరయ సిగ్గుగాదె పరికింపంగన్. 931

సీ. కాంచనచిత్రమృగంబు వచ్చుటయును రహిమీఱఁ దత్ప్రతిగ్రహణబుద్ధి
నాకుఁ బుట్టుటయును నరనాయకుఁడు దాని పొలుపారఁ బట్టి తేఁబోవుటయును
వికృతనినాదంబు వినవచ్చుటయును దోషనె లక్ష్మణుఁడు పోవుటయును దలఁప
నిపుడు నీమాయగా నెఱిఁగితిఁ గాకున్న భిక్షుఁడ వై వచ్చి విదప నింత

తే. పనికిఁ జొత్తువె నీచాత్మ పక్షినాథు, నధికవృద్ధునిఁ జిరజీవి నాహవమునఁ
గడిమి నిటు మన్నిమిత్తంబుగా వధించి, తరయ నిదిబంటుతనముగా దసురనీకు.

చ. పతి కడలేనిచోటఁ బరభామను బల్మి గ్రహించి పోవు టే
చతురత నీపరాక్రమము సత్త్వము సర్వముఁ దెల్ల మయ్యె గ
ర్హిత మగునీచకృత్య మొనరించుట కెంతయు సిగ్గుగాదె కు
త్సితున కిహంబునుం బరము చేకుఱు నే రజనీచరాధమా 933

తే. కడిమి రామలక్ష్మణుల సంగ్రామమందు
మెచ్చుగ జయించి ననుఁ గొని తెచ్చితేని
యపుడు నీశౌర్య మది గొనియాడ వచ్చుఁ
జౌర్యమునఁ గొని తెచ్చుట శౌర్య మగునె. 934

ఉ. ఎక్కడిసత్త్వ మేటిచల మెక్కడిశౌర్యము బుద్ధిహీన నీ
వక్కట మేటిరక్కసుల కందఱ కేక్రియ రాజవైతి ని
న్నెక్కుఁడుగాఁగ శూరవరు లేక్రియఁ జూచిరి యిన్నినాళ్లు నీ
వెక్కడ నన్ను బల్మిఁ గొని యేగుట యెక్కడ రాక్షసాధమా. 935

వ. దురాత్మా కులనిందాకరం బైనయీదుష్కృతకర్మం బాచరించి రామభయంబునం బాఱెద వేను యువతి నగుటవలన నివారించుటకు శక్యంబు గాకున్నది శూరుండ వేని యొక్కముహూర్తంబు నిలువు మస్థైన భవదీయవిక్రమం బెల్ల వారికిఁ దెల్లం బగు నన్మహాత్ములచక్షుష్పథంబునం బడి బ్రతికి పోవంజాలవు విహంగమంబులు దీప్తవహ్నిస్పర్శనంబునుంబోలె నద్దివ్యపురుషులశరస్పర్శనంబుసహించుటకు యమాదులైన సమర్థులు గారు నీవు బుద్ధిమంతుండవై జీవితంబులకు హితం బపేక్షించి నన్ను విడువు మట్లు సేయ వేని మత్ప్రధర్షణరుష్టుండై రాముండు నిన్ను నాశంబు నొందించు దానంజేసి నీవ్యవసాయం బంతయు నిరర్థకం బై చను విబుధసమ్మతుం డగురామునిఁ బాసి యొక్కనిమిషం బైన జీవింపనేర్తునె నిర్ఘృణుండ వగునీకుఁ జిరకాలంబు లంకావాసంబునుశుభంబును గలుగనేరదు ముమూర్షు లగువారికిఁ బథ్యవాక్యం బసహ్యం బై యుండు నాసన్నమరణు లగువారు మృత్యుగ్రస్తు లై విపరీతకర్మంబు లాచరింతురు మత్కారణంబున నీవు దుర్నివారం బైనకాలపాశంబునం గట్టువడితి వింక నెక్క

డికిఁ బోయెదవు శీఘ్రంబున హిరణ్మయవృక్షంబులను రుధిరవాహిని యగు వై
తరణీనదిని భీమంబైన యసిపత్త్రవనంబును దప్తకాంచనపుష్పంబై వైడూర్య
ప్రవరచ్ఛదంబై కాలాయసకంటకచితంబై యొప్పు శాల్మలీపాదపంబును విలో
కించెద వదియునుం గాక. 936

క. రోగార్తుఁడు మోహంబున, బాగుగ విష మానినట్లు భర్తకు నీ వీ
లాగున నహితముఁ జేసితి, వేగతి భువిలోఁ జరించె దింకఁ గుశలివై. 937

చ. ఒకనిమిషంబులోఁ గలన నొక్కఁడె యెవ్వఁడు వజ్రకల్పసా
యకములచేఁ జతుర్దశసహస్రనిశాటులఁ ద్రుంచె నట్టియ
స్త్రకుశలుఁ డుగ్రవీర్యుఁ డగురాఘవుఁ డిప్డుసతి న్హరించి త
క్కక చనినట్టినిన్నుఁ బటుకాండములన్ వధియింప కుండునే. 938

వ. అని యేతాదృశంబు లగుదారుణవాక్యంబుల గర్హించుచు నమ్మహీపుత్త్రి భయ
శోకరోషంబులు మనంబున ముప్పిరిగొన నానాప్రకారంబుల విలపించుచు రా
వణాంకగతయై వడంకుచు నంబరంబునం బోవుచు నొక్కయెడ. 939

సీతాదేవి యాభరణంబులు మూటఁగాఁ గట్టి వానరులయొద్ద వైచుట.

చ. ఒకధరణీధరాగ్రమున నొప్పెడువానరపంచకంబు త
ప్పక పరికించి దివ్యమణిభర్మమయాభరణంబు లుత్తరీ
యకమునఁ గట్టి నాదువిధ మంతయు రామునితో వచింత్రు గా
క కరుణ నంచు నెంచి గుఱిగాఁ బడవైచెఁ దదంతరంబునన్. 940

ఉ. ఆవిధ మించుకైనను దశాస్యుఁ డెఱుంగక సంభ్రమంబునం
బోవుచు నుండె నంతఁ దమముంగలఁ బడ్డసువర్ణభూషణ
శ్రీవిలసన్నవీనమృదుచేలముఁ గన్గొని యఱ్ఱు లెత్తి యొం
తే వడి మింట నేగుధరణీసుతఁ గన్గొని రావలీముఖుల్. 941

సీ. రాక్షసేశ్వరుఁ డీత్రెఱంగునఁ దనపాలిమృత్యువునట్ల మహీకుమారి
వడి నెత్తికొని ముదం బడరఁ బంపను దాఁటి నదులు వనంబులు నగము లంత
నంతఁ జూచుచు విశిఖాసనచ్యుత మైనకాండంబుకైవడి గగనవీథి
లంకాభిముఖముగా లక్షించి చనిచని తిమినక్రకనుతవిస్తీర్ణ మైన
తే. వనధిఁ గన్గొని దశకంధరునకు దీనఁ, జేటువాటిల్లు నని యెడ్డసిద్ధవరుల
పలుకు లతిఘోరభంగి వీనులకుఁ బొలయ, నురుజవంబున నయ్యబ్ధి నుత్తరించె.

రావణుఁడు సీత నెత్తికొని తనయంతఃపురమున కరుగుట.

వ అప్పు డవ్వరుణాలయంబు సంభ్రమంబునఁ బరివృత్తతరంగంబును రుద్ధమీన
మహోరగంబు నై యుండె రావణుండు పయోదధి నుత్తరించి భుజంగిభంగి
వివేష్టమానాంగి యైనజానకిం గొని విభక్తమహాపథంబై నలంకాపురంబుఁ
బ్రవేశించి సంబాధద్వారబహుళంబై నయంతఃపురంబులోనికిం జని మయుం

డాసురి యగుమాయయుం బోలె శోకమోహపరాయణ యగువైదేహి నచ్చట
డించి రాక్షసస్త్రీల నవలోకించి యిట్లనియె. 943

శా. నాపుణ్యాతిశయంబునన్ దొరకె నీనారీలలామంబు మీ
రేపార న్విపయోక్తి నేమఱక నెంతే ప్రీతి మన్నించుచు
న్రేపు న్మాపును దివ్యభూషణమణిశ్రీగంధమాల్యాంబర
వ్యాపారంబుల నాదరించుచు ముదం బారంగ రక్షింపుఁడీ. 944

వ. మఱియు నెవ్వరేని జ్ఞానంబునం గాని యజ్ఞానంబునం గాని యప్రియవచనంబున
నిద్దేవికి మనఃఖేదంబు సంపాదింపుదురట్టివారు ప్రాణాంతంబైనమదీయదండంబు
నకుఁ బాత్రు లగుదు రిక్కాంతను బురుషుండు గాని యువతి గాని నాయాజ్ఞ
లేక విలోకింపం గూడ దట్లు జాగరూకులై రక్షింపుండు. 945

చ. అని నియమించి వెండియు సురారి హజారముఁ జేరి యింక నే
పని యొనరించువాఁడ నని భావమునం దలపోసి మాంసభో
జనులఁ బరాక్రమాధికుల శైలనిభాంగుల భూరిసత్త్వలన్
దనుజులఁ గొందఱం గని మదంబున నిట్లని పల్కె ధీరతన్. 946

ఉ. మానితబాహుశౌర్యు లసమానబలుల్ ఖరదూషణుల్ బల
శ్రీనిధు లొక్కమానవునిచే హతులైరి బలాన్వితంబుగా
మానుగ వాసవాదిసురమండలికిం జొరరానియాజన
స్థానము సర్వరాక్షసవిశాల మరాక్షస మయ్యె వింటిరే. 947

రావణుం డెనమండ్ర రాక్షసుల జనస్థానంబునకుఁ బంపుట.

చ. అనుజునిపాటు నేను విినప్పటినుండి యహర్నిశంబు రా
మునిపయి నాత్మలోఁ గినుకఁ బూనితి నేక్రియ నైన వైరినా
శన మొనరింప కున్న నిఁక నమ్మతిఁ గంటికి నిద్రవచ్చునే
యనుపమసౌఖ్య మబ్బునె మహాసురరాజ్యపదంబు నిల్చునే. 948

చ. అరివిజయార్థ మే నిపుడు యత్నముఁ బూనితి భీతి దక్కి సు
స్థిర మగుపౌరుషంబును విశేషబలంబును సంశ్రయించి భీ
కరముగ నెల్లవారు బలుకైదువుల న్గయిసేసి మీరు సం
గరమున కింక నాయితము గండు పరాక్రమదుర్నివారతన్. 949

వ. సంగ్రామంబున రిపుం డగురాముని వధించి ధనంబు నధిగమించిననిర్ధనునిపగిది
నేను సుఖంబు నొందెద నిది మదీయనిశ్చయంబు మీరు సురసంగ్రామంబు
లందు బహుప్రకారంబుల నాఱితేఱియున్నవారు ముల్లోకంబులందు మీకసా
ధ్యం బెద్దియు లేదు మీ తెఱం గంతయు నెఱింగి కాదె యిక్కార్యంబునకు ని
యోగించుచున్నవాఁడ నస్మదీయశాసనంబున మీరు కొందఱు తగుసాయం
బుఁ గూర్చికొని రాక్షసశూన్యం బైనజనస్థానంబునకుం జని యప్రమాదులై

రామలక్ష్మణులవృత్తాంతం బరయుచు నజస్రంబును దద్వధంబునందుఁ గృత
ప్రయత్నులరు గండని పలికి బలవంతు లగువారి నెనమండ్రు రక్కసులం బంచిన
వారు దశగ్రీవునిశాసనంబునఁ బ్రచ్ఛన్నవేషు లై శీఘ్రంబున జనస్థానంబున
కుం జని రంత రావణుండు వైదేహిఁ దనకుం దక్కినదానిఁ గాఁ దలంచి రాము
నితో వైరంబు సంపాదించి బుద్ధివైపరీత్యంబునఁ దన్నుం గృతకృత్యునిం గాఁ
దలంచుకొనుచుఁ గామబాణపరవశుం డై యచ్చట నిలువనొల్లక రయంబున
రమ్యం బైనయభ్యంతరమందిరంబునకుం జని యందు. 950

చ. కనుఁగవ నశ్రుబిందువులు గాఱఁగ నేడ్చెడుదాని రాముఁ బే
ర్కొని విలపించుదాని వగ గూరినచిత్తముదాని దైన్య మా
ననమునఁ దోఁచుదాని హరిణంబులఁ బాసినలేడిపోలె భీ
తి నడలుదాని రాఘవునిదేవిని జానకిఁ గాంచెఁ జెచ్చెరన్. 951

వ. మఱియును. 952

చ. గురుతరవస్తుభారపరికుంఠిత మై ఘనమారుతాహతి
న్విరిగి మహార్ణవంబున మునింగిన నావయుఁ బోలె శోకసా
గరపరిమగ్న యై మిగుల గాసిలి యాస్యము వాంచి శ్వాపదాం
తరగతశంబరాంగనవిధంబున భీతిలుదాని నెంతయున్. 953

వ. సీత నవలోకించి పాపాత్ముం డగురావణుండు మదనబాణమోహితుం డై మెల్లన
నుపసర్పించి బలాత్కారంబున నద్దేవిం దోడ్కొని కాంచనవిచిత్రసోపానం
బారోహించి తచ్చిత్తంబు వడయుతలంపున నిట్లనియె. 954

—రావణుఁడు జానకికిఁ దనభాగ్యముఁ జూపుట.—

సీ. రమణీయహేమతోరణము విచిత్రసోపానంబు నవరత్నభాసితంబు
నానాపతత్త్రిసన్నాదితంబు నవేందుకాంతకుట్టిమదేశకల్పితంబు
నారీసహస్రసంచారంబును మనోజ్ఞసురదుందుభిధ్వానశోభితంబు
హాటకమణిసౌధహర్మ్యసంబాధంబు శక్రపాళినిశాంతసన్నిభంబు
తే. దాంతరాజితస్ఫాటికతాపనీయ, నీలపురుషాపలస్తంభనిర్మితంబు
నగుచు నవరత్నఖచిత మై యలరుచున్న, దంబుజాక్షి మదంతఃపురంబు కంటె.

తే. తరుణి యిచ్చటి దాంతికతాపనీయ, హారివిద్రుమరచితగవాక్షములును
హేమజాలకపరివృతహీరఖచిత, సురుచిరమనోజ్ఞభిత్తులు చూడు మబల. 956

తే. కాంచనవిచిత్రభూమిభాగములు రుచిర, మౌక్తికవితానములు రత్నమండపములు
దీర్ఘికలు పద్మినులు మణిదీప్తదివ్య, భవనములు శయ్యలును జూడు పద్మనేత్ర.

ఉ. ముప్పును బాల్యముం రుజయు మూఢత లేనిపరాక్రమోన్నతు
ల్ముప్పదిరెండుకోట్లబలముఖ్యులు దైత్యులు యావనాధికు
ల్దఘుశ నన్భజింతురు ప్రతాప మెలర్పఁగ వారిలోన నే

నొప్పఁగ నొక్కరొక్కరికి నొక్కొక వేవుర నిల్పి యుండుదున్. 958

ఉ. నాదుబలంబు రాజ్యము ధనంబును నీయది గాఁ దలంచుచు
న్నాదన కీవు ప్రాణములకంటె గరీయసి వౌదు గాన నా
కాదర మొప్ప భార్య వగు మంబుజలోచన దేవదైత్యవి
ద్యాధరసుందరీమణుల కందఱ కీశ్వరి వయ్యె దెంతయున్. 959

క. నావచనము విని బుద్ధి, ప్రావీణ్యము మీఱ నన్ను భావజసుమబా
ణావిద్ధునిఁ గాకుండఁగఁ, గావు మనుగ్రహముఁ జేసి కాతరనేత్రా. 960

తే. ఉదధిముద్రితమై శతయోజనంబు, లాయతము గల్గి వరుణశక్రాదులకు న
గమ్యమై లంక యనుపేరఁ గ్రాలు నిది మ, దీయపట్టణ మబ్జాక్షి దీనిఁ గంటె.

క. నరసురవిద్యాధరఖే, చరకిన్నరయక్షసిద్ధసాధ్యాదులలోఁ
బరికింప నాకు జోడౌ, క్కరుఁ డైనను లేఁడు ముజ్జగంబులయందున్. 962

ఉ. మానవుఁ డల్పతేజుఁ డవమాని తపస్వియు రాజ్యహీనుఁడు
న్దీనుఁడు దుర్విభావుఁ డవినీతుఁడు నీమగఁ డట్టివానిపై
మానిని మోహ మేటికి సమానుఁడ నన్ను భజింపు మస్థిరం
బౌనకదా వసంతులకు యౌవన మంతయు నాఁటినాఁటికిన్. 963

ఉ. రామునిఁ జూడఁ గోరకుము రాజముఖీ యిఁక నెట్లు రాఁగలం
డామనుజాధముం డిచటి కాశుగ మెట్టులు కట్టనోపు ను
ద్దామగతిం బ్రదీప్తశిఖిదారుణహేతిని బోలె నాకడ
న్నేనుము నొందియున్ననినుఁ జేకొన నేక్రియ వచ్చు వానికిన్. 964

క. సురలైన నిమ్మహాపురిఁ, జొర వెఱతురు రాముఁ డెట్లు చొరఁగలఁ డిఁక నీ
వెఱవేల నాదురాజ్యము, గఱితా నీసొమ్ముగాఁగఁ గైకొనుము రహిన్. 965

తే. భువనములయందుఁ గల మముబోఁటి సత్త్వ
వంతు లగువారు దాసులై వలయు పనులు
సేయుచుండఁగ రాజ్యాభిషిక్త వగుచు
వనిత ననుఁ గూడి సుఖయింపు మనుదినంబు. 966

తే. వెలఁది నీవు చేసిన పూర్వవృజిన మెద్ది,గలదది యరణ్యవాసంబువలన సమసెఁ
బొలఁతిరో యింక నీపూర్వపుణ్యకర్మ,ఫల మనుభవింపుమిచ్చటఁ బంకజాక్షి.

క. ఇన్నాళ్లు కాననంబునఁ, బన్నుగఁ దప మాచరించి బడలుటకుఁ దుది
స్నన్ను వరియించి సుఖసం, పన్నత నొప్పుటయు నీకు ఫలమగుఁ గాదే. 968

తే. అంబుజేక్షణ తొల్లిమాయన్నయైన, ధనవిభుని ఘోరసంగరంబున జయించి
తెచ్చినట్టి పుష్పకనామదేవయాన,మిదియె చూడుము కామగం బిదిలతాంగి.

తే. చందన మలంది తాంబూలమందిదివ్య, భూషణంబులఁదాల్చియీపుష్పకంబు
నందు ననుఁ గూడి వలసినయట్లు నీవు, సంతతంబును విహరింపు చంద్రవదన.

క. విమలాంబుజంబుకై వడి, రమణీయం బగుచుఁ జాల రాజిలు నీయా
స్యము మురువు దక్కి యున్నది, కమలేక్షణ వగపుచేతఁ గందినకతనన్. 971
క. అన విని జానకి దశకం,ఠునిదుర్వచనముల కడలి ఠోరపుశోకం
బున నేడ్చెఁ గనులనశ్రులు, చినుకఁ బటాంతమున మోముఁజేర్చి రయమునన్.
క. ఇమ్మెయి ఘనశోకావే,శమ్మున విలపించు చున్న జనకకుమారిం
గ్రమ్మఱఁ గనుఁగొని కామవ,శమ్మున నిట్లనియె రాత్రిచరుఁ డాతురుఁ డై 973
ఉ. సన్నతగాత్రి యింక గడుసంభ్రమ మేల విధాత యీగతి
న్నిన్ను సృజించె నాకొఱకు నేరుపు లేటికిఁ దప్పు దింక నీ
యున్నతపాదపద్మముల కుత్తమభక్తి నమస్కరించెదం
బన్నుగ నన్నుఁ బ్రోవు మిఁక వశ్యుఁడ దాసుఁడ నైతి నెంతయున్. 974
చ. స్మరశరపీడితుండనయి సారెకు నే నిపు డన్నమాట లో
కరివరయాన నీచములుగా మది నెంచకుమా త్రిలోకసుం
దరి వగునీకు వందన మొనర్చెను గాని దశాననక్షపా
చరవిభుఁ డెన్నఁ డేని యొకచానపదంబులు వ్రేల ముట్టునే. 975
ఆ. పరఁగ ధర్మలోపభయమును సిగ్గును, విడిచి యింక గారవింపు నన్ను
నెలఁత మనకు దైవనిష్పంద మీబంధ,మూర్ష మగుటఁ దప్పు దడలవలదు. 976
చ. శతమఖముఖ్యు లెవ్వనిప్రసాదముఁ గోరి సమగ్రభక్తి సం
తతము భజింతు రట్టిఘనదైత్యశిఖామణి నైనరావణుం
డతిశయభంగి వేఁడ విన దయ్యయొ యెంత వివేకహీన యీ
సతి యని విన్నవారు నెలిఁ జూటరె వేళాకరికిఁ బల్కినన్. 977
వ. అని బహుప్రకారంబులఁ గందర్పదర్పగోచరుండు గావున మైమఱచి కృతాంత
వశగతుం డై దేహిం దనసొమ్ముగాఁ దలంచుచు దురాలాపంబు లాడు చున్న
రావణుం జూచి యద్దేవి భయంబువిడిచి వానిఁ దృణంబునకు సరిగా భావిం
చినతెఱం గెఱింగించుకరణి నొక్కతృణఖండంబుఁ జేతం బట్టుకొని శోకావే
శంబున నిట్లనియె. 978

సీతాదేవి రావణుని నిరసించుట.

క. దారుణచాపచ్యుతవి, స్ఫారశరానలవిదగ్ధశాత్రవకులకాం
తారుఁడు దశరథుఁ డనఁగా, ధారుణివరుఁ డొప్పు సత్యధర్మోజ్జ్వలుఁ డై. 979
ఉ. ఆనరలోకపాలకున కగ్రసుతుండు మహాభుజుండు స
న్మానితబాహుశౌర్యుఁ డసమానబలుండు జగత్ప్రసిద్ధుఁ డ
జ్ఞానసుఁ డబ్జలోచనుఁ డహస్కరతేజుఁడు సత్యవాది పం
చాననవిక్రముండు గలఁ డార్యుఁడు రాముఁ డనాఁ బ్రసిద్ధుఁడై. 980
క. హరునకు నుమ కైటభసం, హరునకు రమ పోలె నమ్మహారాజకులా

భరణ మగు రాఘవున కే, నరయంగా ధర్మపత్ని నగుదు సురారీ. 981

ఉ. దోస మటంచుఁ జూడ కిటు దొంగిలి సన్గొని తెచ్చి తీవు దు
ష్టాసుర యింక మద్విభుఁ డహర్పతి తేజుఁ డమోఘవీర్యుఁ డా
యాసము దోఁప కుండఁగ ఖరాసురునిం బలె నిన్ను లోకము
ల్బాసట యై కడంగినను బాణహతి న్ధరఁ గూల్ప కుండునే. 982

ఉ. రాముని సాయకంబులు తరంగము లాపగ గట్టునుం బలె
న్భీమము గాఁగ నీతనువుఁ బెద్దయు బ్రద్దలు వాపు చుండ సు
త్రామవిరోధి తీవ్రుఁ డగు తార్క్ష్యుని చే భుజగంబుఁ బోలె నా
రాముని చేతఁ గూలెదవు రావణ సత్త్వము వీటఁ బోవఁగన్. 983

క. దనుజాధమ నీ చెప్పిన, యనిమిషరిపు లంద ఱాజనాధిపు మ్రోలం
బని చెడి నిర్విషు లగుదురు, వినతాసుతు మ్రోల నున్నవిషఫణుల గతిన్. 984

మ. మును నీ చేవని నోడి పాఱినసురు న్మఖ్యామరశ్రేణితో
నెనఁగా జూచితొ రాఘవప్రవరు నయ్యిక్ష్వాకువంశేంద్రుఁ డా
ర్యనుతుం డుర్వి భవద్వినాశనకరుం డై పుట్టె సి న్నాజిలోఁ
దునుము న్నిక్కము యూపబద్ధపశువుం దున్మాడు చందంబునన్. 985

క. ఆరఘునాథుఁడు ఘనరో,షారుణితాక్షులను జూచినంతనె నీ వి
ద్ధారుణి నీల్గి కూలెద, వారయఁ ద్రిపురారిచే ననంగుఁడుఁ బోలెన్. 986

క. అటుగాక యమ్మహాత్ముని, పటు బాణపథంబు నొంది బలవీర్యసము
త్కటతను బ్రతికితి వేనియుఁ, గటకటఁబడి యోడి పాఱఁగలవు నృశంసా. 987

క. ఇనవిధులు గతులు దప్పిన, వననిధు లింకినను హవ్యవహుఁ డాఱిన మే
రునగము విఱిగిన రాముఁడు, నినుఁ బొరిగొన కేల విడుచు నీచచరిత్రా 988

తే. చెలఁగి యెవ్వాఁడు జలధి శోషింపఁ జేయుఁ
జంద్రు నెవ్వాఁడు పడఁ గూల్పఁ జాలు ధరణి
నట్టివాఁడు సీతను విడు వనెడు మాటఁ
జెప్ప విన నిది మిగుల నచ్చెరువు గాదె. 989

క. దనుజాధమ ననుఁ గొని తెచ్చిన యప్పుడె నీదు సిరియు జీవితకాలం
బు నశించె యశము చెడె లంక నిజంబుగ విను మనాథ గాఁ గల దింకన్.

చ. అనఘుఁడు మద్విభుండు చరితార్థుఁడు రాముఁడు దండకంబులం
దనుజసహాయుఁ డై నిజభుజాంచితవీర్యము నాశ్రయించి నె
మ్మనమున భీతి దక్కి బహుభంగులఁ ద్రిమ్మరుచున్నవాఁడు త
ద్ఘనశరవృష్టి నీబలము గర్వము వీర్య మడంగి పోవదే. 991

తే. నాథు నెడఁ బాసి యున్నచో నన్ను నీవు, మచ్చరంబున మ్ముచ్చిలి తెచ్చి తిట్లు
దానవాధమ యిది శుభోదర్క మగునె, కడఁగి నీవంశమును నిన్నుఁ గాల్పఁ గాక.

తే. కాలనిర్మిత మైన భూతజాలములకు, హాని యెప్పుడు సమకొను నపుడు కార్య
మందుఁ గాలవశంగతులై మనుజులు, కీడు మే లని యించుక చూడ లేరు. 993

తే. అట్టికాలంబు నీకు సంప్రాప్త మయ్యె, దనుజపాంసన నాకతంబున సమస్త
రాక్షసక్షయ మయ్యెడి రాముచేత, నమ్ము నావచనమ్ము నిక్కమ్ముగాఁగ. 994

క. రామునిసతి నగు నే నీ, చే ముట్ట నశక్య నైతి క్షితి నుగ్గ్రాండా
ద్యామండిత మగు నన్మఖ, భూమియుఁ జండాలుచేతఁ బోలె దురాత్మా. 995

తే. రాజహంసను గూడి యశ్రాంత మబ్జ
షండములయందు సంక్రీడ సలుపు హంసి
మఱియుఁ దృణషండగత మైన మద్గురంబుఁ
గాంచి యెభ్భంగి మమతఁ గావించు నీచ. 996

క. రాముని వైభవజితను, త్రాముని ధర్మవ్రతాభిరాముని సుగుణ
స్తోమునిఁ బాసి నయవిదూ, రా మహిఁ శోకనిమిష మైన బ్రతుకంగల నే. 997

క. పొసఁగ నుపక్రోశమలీ, మస నై బ్రతుకంగవలెనె మనుజాశన న
న్నసమునఁ గట్టినఁ గట్టుము, వెస మ్రింగిన మ్రింగు మేను విన నీమాటల్. 998

క. అని యాఁగతిఁ గ్రోధంబున, దనుజకులాధమునిఁ జాల దారుణవాక్యం
బున దూఱ నాడి యశ్రులు, చనుదేరఁగ నూరకుండె జానకి యంతన్. 999

రావణుండు సంవత్సరములోపలఁ దనమాట కొడఁబడకున్నఁ జంపింతునని సీతను బెదరించుట.

క. సురకంటకుం డు మైథిలి, పరుషోక్తుల కలిగి మరల బంధురకోప
స్ఫురితారుణాక్షుఁడై భీ, కరరవమున నిట్టు లనియెఁ గటము లదరఁగన్. 1000

క. పదిరెండు నెలలు నోర్చెద, ముదితా యక్కాలమునకు మొనయక యున్నం
బిదప నిటఁ బాచకులు ఖడ్గధారఁ గోయుదు రనేకఖండంబులుగాన్. 1001

క. అని పలికి మఱియు రావణుఁ, డనుపమకోపమున రాక్షసాంగనలఁ గనుం
గొని యెట్టులైన మీ రీ, వనితామణి దర్ప మణఁపవలయుం జుండీ. 1002

ఆ. అనిన నట్ల కాక యని రాక్షసాంగన, లతిభయంకరాస్య లగుచు మోడ్పుఁ
గేలుదోయితోడఁ జాలఁ బంటవలంతి, కూఁతు చుట్టుముట్టుకొనిరి యపుడు.

ఉ. క్రమ్మఱ రావణుం డసురకాంతలఁ గన్గొని మీర లీబిడ
న్నమ్మతితో నశోకవిపినంబున నుంచి సమగ్రభక్తి ని
త్యమ్మును బ్రోచుచు న్బహువిధప్రియభాషల నాదరించి నా
సొమ్ముగఁ జేసి సమ్మదము చొప్పడఁ దెండు గజాంగనం బలెన్. 1004

వ. అని యిట్లు చరణఘాతంబునం బుడమి బ్రద్దలువాఱ నిట్టట్టు చలించుచు నాజ్ఞా
పించిన నయ్యసురస్త్రీలు వైదేహి నచ్చటం బాపికొని సర్వపుష్పఫలోపేతంబు
ను సర్వాభిలషితపదార్థఫలవృక్ష విరాజితంబును సర్వకాలమదమృగపక్షినిషే

వితంబు నగునశోకవనంబునకుం దోడ్కొనిచనిరి యిత్తెఱంగున నమ్మహీపుత్త్రి
రాక్షసీవశంగతయై వ్యాఘ్రిమధ్యంబునం జిక్కిన హరిణిచందంబున నడలుచు
భయశోకంబులు మనంబునం బెనంగొన రామచంద్రుని దైవతంబుగాఁ దలం
చుచు ననన్యపరాయణ యై యుండె నిక్కడ దండకారణ్యంబునందు. 1005

రామునికి దుర్నిమిత్తము లగపడుట

చ. కపటమృగస్వరూపుఁ డగుకల్మషచిత్తునిఁ దాటకేయునిన్
విపులశరంబునం దునిమి వెండియు రాముఁడు పర్ణశాలకున్
విపినపథంబుఁ బట్టి కడువేగమె వచ్చుచు నుండ వెంటనే
యపుడు వినంగ నయ్యె నశుభావహజంబుకనాద ముగ్రమై. 1006

క. దారుణ మగుతన్నినదము, నారూఢిగ నాలకించి యడలుచు గాత్రం
బారటపడఁ జిత్తంబునఁ, గూరిన పెనుశంక నిండుకొన ని ట్లనియెన్. 1007

తే. దారుణం బగుజంబుకధ్వాన మరయఁ, దగ నమంగళసూచకంబగుచుఁ దోఁచె
సీత ఘోరాసురులచేతఁ జిక్కకుండ, దండకమునఁ గుశలినియై యుండుఁగాక.

సీ. అక్కడ మృగరూపుఁ డగుతాటకాసుతుం డస్మచ్ఛరాహతి నవనిఁ గూలు
నపుడు మదీయస్వరానుకారంబుగా నాక్రందనముఁ జేసె నయ్యెలుంగు
విని మహీసుత నొంటి విడిచి తదాజ్ఞచే ననుజుండు నాచంద మరయ వచ్చెఁ
గాఁబోలు ఘోరరాక్షసగణోపేతుఁడై మారీచుఁ డిభ్భంగి మాయఁ బన్ని
తే. సీతనువధించుతలఁపునఁ జెలఁగినన్ను, దవ్వులకుఁ బాపికొనియెఁ గెఁదలఁపనిదియ
థార్థమగుఁగానిచో హాహాతోస్మిలక్ష్మ,ణాయనుచునాదుపలుకుగానఱచు టెట్లు.

క. తలఁపఁగ నిష్కారణముగఁ, బలువుర రక్కసులతోడఁ బగఁ గొంటి సతీ
తిలకమున కనుజునకు మం,గళము గలుగుఁ గాక ఘోరకాననమందున్. 1010

క. ఘోరనిమిత్తము లెంతయుఁ, దోరంబుగ నాకు నిపుడు తోఁచెడి నకటా
సారసముఖి యె ట్లున్నదొ, వీరుఁడు నాతమ్ముఁ డెట్లు విహరించెడినో. 1011

వ. అని బహుప్రకారంబులఁ జింతించుచు రాక్షసుఁడు మాయామృగస్వరూపం
బునఁ దన్ను దూరంబునకుం గొనిపోవుటయును బదంపడి స్వప్రయుక్తవిశి
ఖాభిహతుం డై మారీచుండు మృగరూపంబు విడిచి రాక్షసరూపం బంగీక
రించి తనమాటగా సీతాలక్ష్మణులం బేర్కొని ప్రాణంబులు విడుచుటయును
ఘోరం బగుజంబుకనాదంబు వినంబడుటయును దీనముఖంబులై ఖగమృగంబు
లప్రదక్షిణంబుగాఁ దిరిగి భయంకరనిస్వనంబులు సలుపుటయును మఱియు
ననేకదుర్నిమిత్తంబులు దోఁచుటయు నివి యన్నియుం దలపోసి రాముండు
పరిశంకితుం డై తలంకుచు సీతాదర్శనలాలసుం డై శీఘ్రంబున నిజాశ్రమం
బునకు వచ్చుచు ముందఱ. 1012

రాముఁడు తనకడ కేతెంచులక్ష్మణుఁ జూచి దుఃఖితుం డై సీతాక్షేమం బడుగుట.

క. గతతేజుండై తనకడ, కతిరయమున వచ్చుచున్నయనుజన్ముని సు
వ్రతునిం గని మోమున దీ, నత గన్పడఁ గనుల జలకణంబులు దొరుఁగన్.

చ. దనుజనిషేవితం బయినదారుణకాననసీమ నేలకో
జనకజఁ బాసి లక్ష్మణుఁడు సంభ్రమియై చనుదెంచు చున్నవాఁ
డని ధృతి దూలి డగ్గఱి రయంబున నాతనిచేయిఁ బట్టి నె
మ్మనమున శోకముం గదుర మాటలు తొట్రుపడంగ ని ట్లనున్. 1014

ఉ. తమ్ముఁడ మేదినీసుతను దారుణకాననమందుఁ బాసి నీ
కిమ్మెయి నొంటి రాక తగునే వెఱఁ గయ్యెడు నామృగాక్షి ని
క్కమ్ముగ ఘోరరాక్షసమృగంబులచేఁ బడకుండ నేఁడు నే
మమ్మున నున్నదే దనుజమాయఁ దలంచిన శంక దోఁచెడిన్. 1015

ఉ. అక్కట యెందుఁ జూచిన భయంకరవైఖరి దుర్నిమిత్తముల్
పెక్కులు దోఁచు చున్నయవి భీషణజంబుకకాకఘూకముల్
దక్కక నొక్కరీతి భయదధ్వని మ్రోయఁ దొడంగె రక్కసుల్
నిక్కము నేఁడు మాయ నవనీజ హరించి రటంచుఁ దోఁచెడిన్. 1016

చ. అలయక సంతతంబు దనుజాధము లిందుఁ జరింతు రీవు మై
థిలి నెడఁబాసి వచ్చితివి తెంపున దైత్యులచేతఁ జిక్కెనో
పులులు వరాహము ల్శరభము ల్హరు లొక్కట హింసఁ జేసెనో
కలఁగెడి నెమ్మనం బెడమకన్ను చలించెడి శోక మయ్యెడిన్. 1017

ఉ. ఏరమణీమణి న్విడిచి యిచ్చటి కీ వరుదెంచి తిప్పు డే
నీరదవేణి మోదమున నిత్యము నాకెదు రేగుదెంచు నే
కైరవగంధి ప్రాణములకంటె గరీయసి యై తనర్చు నా
సారసనేత్ర చంద్రముఖి జానకి యెక్కడఁ జెప్పు లక్ష్మణా. 1018

తే. సిరియు రాజ్యంబు గోల్పడి చిన్నవోయి, కాననంబునమునివృత్తిఁ బూనితిరుగు
నట్టినా కెంత దుఃఖసహాయ యైన, భూమిపుత్త్రిక యేజాడఁ బోయెఁ జెపుమ.

తే. ఏవెలందిని బాసి యొక్కింత కాల, మైన జీవింపఁగా నోప నట్టి పంక
జాక్షి నిత్యానపాయిని యైన సీత, యనఘచారిత్ర యేచందమయ్యెఁ జెపుమ.

ఆ. శక్రరాజ్య మైన జానకి లేనిచో, నాత్మ కిం పొనర్ప దయ్య నాకు
నవ్వెలంది కొక్కహాని గల్గిన మన, మెత్తివచ్చు టెల్ల రిత్త కాదె. 1021

క. సీతానిమిత్త మిచ్చట, నోతమ్ముఁడ యేను నిధన మొందుచు నుండ\
జాతకుతూహల యై వి,ఖ్యాతిగ సుఖియించుఁ గాదె కైకయి యింటన్. 1022

క. మృతసుత యై కౌసల్యా, సతి సుతసామ్రాజ్యవిభవసంజాతసుఖో
న్నతి వీఁగు కైక కిఁక నే, గతి దాస్యముఁ జేసి బ్రదుకఁ గలదు కుమారా. 1023

తే. ఉర్వీనందని కుశలినియై యుండె నేని, యచ్చుపట నాశ్రమమునకు వచ్చువాఁడ
నట్లు గాక వేఱొకభంగి యయ్యె నేని, తడవుగాకుండఁ బ్రాణముల్విడుచువాఁడ.

ఉ. జీవితతుల్య యైన తనరుసీతను గన్నులకఱ్ఱ దీఱ హ
ర్షావహభంగి నాశ్రమమునందుఁ గనుంగొనకున్న యప్పుడే
భూవరనందనా వినుము భూరిగభీరవిపత్పయోధిలో
సావయవంబుగా మునిఁగి చచ్చెదఁ గాక మనంగ నేర్తునే. 1025

క. అమ్మహిపుత్రిక ప్రాణయు,తమ్ముగ నున్నదియొ లేక దైత్యులచేఁ దా
వమ్మున భక్షిత యయ్యెనొ, తమ్ముఁడ కలరూపు నాకుఁ దడయక చెపుమా.

తే. హాతుఁడ నైతిని లక్ష్మణా యనుచు దుష్టదైత్యుఁ డాడినమాటకుఁ దలఁకి సీత
నిన్నుఁ బుత్తెంచెఁ గాఁబోలు నెలఁత విడిచి,నీవు రాఁబోలు నింతయునిక్కువంబు.

ఆ. చాల బాల ముగ్ధురాలు మహాసుకుమారి యామహీకుమారి దనుజ
మధ్యమందుఁ జిక్కి మద్వియోగంబున, నెంత చింతపడెనొ క్లాంత యగుచు.

మ. ఖరునిం జంపిననాఁటఁగోలె దనుజుల్ కాంతారభాగంబునం
బరమక్రోధపరీతచిత్తు లగుచు న్మాయావులై యున్నవా
రరయ న్నీ విటు రాఁగఁ జూచి జనకక్ష్మాధీశసత్పుత్రిఁ జె
చ్చెర భక్షింపఁగఁ బోలు నిక్క మిది నిక్షేపంబు గోల్పోయితిన్. 1029

తే. ఇంక నే మని చింతింతు నెందుఁ జొత్తు, నెత్తెఱంగునఁ దాళుదు నెద్ది విధము
ఘోరశోకాంబురాశిమగ్నుండ నైతిఁ, గాంతఁ గన్నులఁ జూడంగఁ గలదె నాకు.

వ. నత్యాఘత్కృతాపకారంబునకుఁ బ్రతీకారంబుఁ గావించుటకు రాక్షసుల
కవకాశంబు నీచేత దత్తంబయ్యె నెల్లభంగులఁ గష్టంబుఁ గావించితి వని
బహుప్రకారంబుల వైదేహిం దలంచి దుఃఖించుచు లక్ష్మణునిరాకకు గర్హిం
చుచు క్షుత్పిపాసాభరంబున సోలుచు దీర్ఘంబుగా నిట్టూర్పులు నిగిడించుచు
వదనంబున వైవర్ణ్యంబు దోఁప నేత్రంబుల నశ్రుకణంబులు దొరఁగ సంతాప
విశేషంబునఁ జిఱుచెమ్మట గ్రమ్ముదేర రయంబున జనస్థానంబునకుం జని
యంత నంతఁ గొన్ని విహారదేశంబు లవలోకించుచు శూన్యంబైననిజాశ్ర
మంబు డగ్గఱి శోకగద్గదకంఠుండై సౌమిత్రి కిట్లనియె. 1031

క. ననుఁ బాసి యున్నచో సీతను వనమున నొంటి విడిచి తలఁగి రయమునం
జనుదెంచితేల యీగతి, వనమున నిను నమ్మి విడిచి వచ్చితి ననఘా. 1032

క. వన మనియు దైత్యసేవిత, మనియు నెఱుఁగి సీత విడిచి యరుదెంచినని
న్గనినప్పటినుండి జగ, జ్జనవినుతా నామనంబు శంకిత మయ్యెన్. 1033

క. ఇది యేమి హేతువో ని, న్నదటునఁ గనినంతనుండి యనఘాత్మక నా
హృదయం బగలెడి శోకము, వొదలెడి వామాంకనేత్రభుజము లదరెడిన్.

లక్ష్మణుఁడు రామునికిఁ దాను సీతను విడిచి వచ్చుటకుఁ గారణంబుఁ దెల్పుట.

క. నా విని లక్ష్మణుఁ డతిశో,కావిలచేతస్కుఁ డగుచు ననుపమఘనదుః
ఖావేశంబున వడలుచు, భావంబునఁ గుందు రామభద్రున కనియెన్. 1035

ఉ. ఇంతన నేల దేవ మిథిలేశ్వరపుత్త్రిక నొంటి డించి నా
యంతనె యేను దుష్టమతి నై చనుదెంచినవాఁడఁ గాను మీ
చెంతకుఁ బోయి రమ్మనుచుఁ జెచ్చెర నయ్యమ తూల నాడ నో
క్కింత సహింపఁ జాల కిపు డీగతి వచ్చినవాఁడ నెంతయున్. 1036

మ. అనఘా నీవు మృగంబువెంట మృగయావ్యాసక్తచిత్తుండ వై
చనినం బిమ్మటఁ గొంత సేపునకు యుష్మత్కంఠనాదంబురీ
తి ననుం గావఁగ రారె హాజనకపుత్త్రీ హాసుమిత్త్రాసుతా
యనుమాట ల్విన నయ్యె దూరమున దైన్యధ్వానయుక్తంబుగన్. 1037

ఉ. ఆనినదంబు కర్ణపుట మంటినయంతనె శంకితాత్మయై
జానకి నన్ను నీకడకుఁ జయ్యనఁ బొమ్మటు లంచుఁ బల్కినం
గాననమందుఁ బాయుటది కర్జము గా దటు లైన సీతకు
న్హాని ఘటిల్లు నంచు వినయంబున నంజలిఁ జేసి నమ్రతన్. 1038

వ. దేవీ భవద్వల్లభుం డగురాముండు త్రిలోకఖ్యాతపౌరుషుండు విక్రమవంతుం డమ్మహానుభావున కెందును గొఱంత లేదు నీవు తప్పు దలంచితివి నాచెప్పిన ట్లా పైఁడిమెకంబు రాక్షసమాయ యగుటం జేసి రామధనుర్ముక్తసాయకాభిహతం బై మృగరూపంబు విడిచి దైత్యరూపంబునఁ బ్రాణంబులు విడుచుచు మనమనంబునకు విషాదంబుఁ గల్పించుకొఱకు రామవాక్యానురూపం బగు వాక్యంబున నిట్లాడె నంతియ కాక సురాసురాదు లొక్కటియై యెత్తివచ్చిన నసహాయశౌర్యంబున వధించుం గాని రఘువల్లభుండు పౌరుషంబు విడిచి రక్షింపు మని యెడినీచవాక్యంబుఁ బల్కనే యమ్మహాత్ముండు దేవత లైన రక్షింప సమర్థుం డిది యేటిచింత రాముండు ముల్లోకంబులయం దజయ్యుం డప్పరాక్రమధుర్యునిం దొడరి పోరునట్టిజెట్టిజోదు త్రిలోకంబులయం దింతకు మున్ను పుట్టినవారిలోన నింకఁ బుట్టెడువారిలో నైనను లేఁడు గావునఁ గునారీజనసేవితం బైనయీయవిచారంబు విడిచి స్వస్థచిత్తవు గ మ్మని బహుప్రకారంబుల నే నమ్మహాదేవిని బ్రార్థించుచు ధైర్యంబుఁ దెల్పినఁ గటకటం బడి కన్నీరు నించుచుఁ గోపంబు గదిరినమనంబుతో దారుణవాక్యంబున నా కిట్లనియె. 1039

సీ. దురితాత్మ నామీఁద దుష్టభావము సేర్చి యున్నాఁడ విది నీకు యుక్త మగునె
రాముఁడు మృతుఁడైన రమణతో నన్నుఁ జేకొనఁగ నీకు వశం బె మొనసి మున్ను
దుర్విచారత భరతుండు వరం బను నెపమున సామ్రాజ్య మపహరించె

నన్నకు నెటు లైన హానిఁ బుట్టఁగఁజేసి నన్నుఁ జేకొనఁ గానసమున కీవు
తే.వచ్చితివి మీాకు నిసువుర కచ్చుపడఁగ, నిదియు సంకేత మగునని యిచ్చఁదలఁతు
నట్లుగాకున్న విభుఁడు నిన్నార్తిఁబిలువఁ,దోడుపడుటకుఁజనకుందె వేడుకమెయి.
తే. అకట ప్రచ్ఛన్నచారి వైనట్టిరిపుఁడ, వైతి వీవు రంధ్రాన్వేషివగుచు ననుఁ బ్ర
తిగ్రహించుట కిట్లరుదెంచినాఁడ, వేల చేకూరు నీ కది హీనచరిత. 1041

రాముఁడు లక్ష్మణుని దూఱుట.

క. అని యాడరానిమాటల, నను దూఱిన ఏగల నెమ్మనంబుం బొగుల
న్ఘనరోషకషాయితలో,చనుఁడ నగుచు నిట్లు విడిచి చనుదే వలసెన్. 1042
చ. అనవుడు రాముఁ డిట్లనియె నక్కట లక్ష్మణ మత్ప్రభావము
న్ఘనతరవిక్రమంబు బలగర్వ మెఱింగియు నింతిమాటకై
వనమున నొంటిఁ బాసి యిటు వచ్చుట నీ కగు నయ్య మాటి కే
మనఁ గల దింక రోషమున నాపదఁ దెచ్చితి వేమి సేయుదున్. 1043
ఆ. బాల యగుట సీత భర్తృమోహంబున, నాడరానిమాట లాడెఁ గాక
తాల్మి విడిచి నీవు తామసంబున నొంటి, విడిచి వచ్చి తిది వివేక మగునె. 1044
ఉ. నీ విటు రాఁగఁజూచి రజనీచరు లొక్కటఁ బట్టి మ్రింగిరో
పావనశీల నెత్తికొని పాఱిరో కాననమందు డాఁచిరో
దావమృగవ్రజంబు వనితం గబళించెనొ యేమిఁ జేసెనో
యేవిధ మయ్యెనో యడవి నెట్లు వసించెనొ యెంత గుందెనో. 1045
వ. సీతాప్రచోదితుండవై క్రోధవశంబున మచ్ఛాసనంబు నుల్లంఘించి వచ్చుటం
జేసి సర్వప్రకారంబుల నవినయంబు నీచేతఁ గృతం బయ్యె నాయందు రాక్షస
సంహారసామర్థ్యాభావంబు శంకించి వచ్చితి నంటివేని మదీయభుజావిక్రమవిశే
షం బనివార్యం బని యెఱింగి యున్న నీ కిట్లనుట కవకాశంబు లేదు సీతా
పరుషవాక్యంబుల లోకనింద యగు నని తలంచి వచ్చితి నంటివేని యజ్ఞానంబు
నం బలికిన మైథిలిక్రోధవాక్యంబుల గర్హణంబు గలుగనేరదు పరుషవాక్యశ్రవ
ణమాత్రంబున సమాగతుండ నైతి నని యంటివేని సంక్రుద్ధ లగు యువతు
లేమేమి పలుక రమ్మాట కలిగి యట్టివారి విడిచి వచ్చుట యుక్తంబు గా దెల్ల
భంగుల నయుక్తకార్యంబుఁ గావించితి వని పలికి వెండియు నిట్లనియె. 1046
చ. పసిఁడిమెకంబు వెంట బహుభంగులఁ ద్రిమ్మరి పట్ట లేక నే
విసివి శితాస్త్ర మేయ నది వేగ మృగత్వముఁ బాసి ఘోరరా
క్షసుఁ డయి మామకస్వరముగా నిను సీతను బేరుకొంచు ఘో
రశిఖరిమాడ్కి ధాత్రిఁ బడెఁ బ్రాణము లంగముఁ బాసి పోవఁగన్. 1047
తే. మాయరక్కసుఁ డిభ్భంగిమాయ మైన,యంత నుండియుఁ దన్నాద మాలకించి
భ్రమసి మీా రెంతవంతలఁబడుచునున్న, వారొకో యని చిత్తంబు వగలఁ బొగిలె.

క. ఏ మనఁగ వచ్చు నీ విపు, డామానినిఁ బాసి యిచటి కరుదెంచుటచే
నామదికిఁ దోఁచినంతయు, సౌమిత్రీ యిప్పు డిచట సత్యం బయ్యెన్. 1049

—రాముఁడు నిజాశ్రమమునందు జానకిం గానక పరితపించుట.—

వ. అని పెక్కుతెఱంగులం బలవించుచుం బోవుచుండ నమ్మహానుభావునకు వామలోచనాధరపక్షంబు చలించె శరీరంబు కంపించె మఱియు నశుభసూచకంబు లగు పెక్కుదుర్నిమిత్తంబులు దోఁచినఁ గలంకవడి వైదేహికి సేమంబు లే దని పలుకుచు సీతాదర్శనలాలసుం డై రయంబునం జని శూన్యం బైననిజాశ్రమంబుఁ గని మనస్తాపం బంతకంత కగ్గలం బగుచుండ వేగంబున నుద్భ్రాంతుం డై నవానిపగిది హస్తాద్యవయవంబులు విదుర్చుచుఁ గొండొకసే పయ్యాశ్రమం బంతయుఁ గలయం దిరిగి యొక్కచోట శోభావిరహిత యై సొబగు దప్పి యున్నపర్ణశాల నవలోకించి యందు జానకిం గానక శోకసంతాపదళితహృదయుం డై వెండియు నామ్లానపుష్పమృగద్విజంబును శోభావిహీనంబును విధ్వస్తంబును సంత్యక్తవనదైవతంబును విప్రకీర్ణాజినకుశంబును విప్రవిద్ధబ్రుసీకటంబును శూన్యంబునై వృక్షంబులతోఁ గూడ రోదనంబు సేయుచున్నదానిపగిదిం జూపట్టుచున్ననిజస్థానంబుఁ జూచి జానకి నెందునుం గానక విలపించుచు. 1050

చ. అసురులు సీతఁ జేకొని రయంబున నేగిరొ లేక చంపిరో
మెసవిరొ గౌతమీనది కమేయగతి స్సలిలార్థ మేగెనో
కుసుమఫలప్రవాళమునఁ గోయుటకు న్వనవీథి కేగెనో
వినువక పువ్వుటీరములవెంబడిఁ డాఁగెనొ యెందుఁ బోయెనో. 1051

వ. అని తలపోసి నానాప్రకారంబుల జానకి నన్వేషించి యెందునుంగానక శోకార్ణవపరిప్లుతుం డై నవానిపోలిక నున్మత్తునిచందంబునం జూపట్టుచు. 1052

మ. ఘనుఁ డా రాముఁడు చెట్టుచెట్టు గలయంగాఁ జూచుచు న్శైలము
ల్వనము ల్పల్వలము ల్నదీనదము లావాసంబు వీక్షించుచు
న్వనితం గానక వెఱ్ఱిపట్టినగతి న్వర్తించుచు న్శోకతా
మ్రనితాంతేక్షణుఁడై వని న్వెదక నారంభించె నుద్వేగియై. 1053

—రాముఁడు వనవృక్షాదులను జానకి పోయినతెరు వడుగుట.—

భుజంగప్రయాతము. లతాంగి న్ధృతాగణ్యలావణ్య నబ్జా
యతాక్షిం గదంబప్రియ న్మత్ప్రియ న్స
న్నితంబం గకంబావనీజాతమా చూ
చితే చెప్పుమా యింతిసేమంబు నాకున్. 1054

చామరవృత్తము. లోలనేత్రఁ గానవా విలోలనారికేళమా
నాలమా రసాలమా విశాలకందరాళమా

తాలమా తమాలమా మదస్రవత్ప్రకాండహిం
తాలమా ప్రవాళమా ఘనస్ఫురచ్ఛదప్రజాలమా. 1055

మత్తకోకిల. సారసాయతనేత్ర పోయినజాడఁ దెల్పవె నాకు మం
దారమా సహకారమా సముదగ్రరుక్కురవీరమా
సారభూతశమీరమా ఘనసారమా యటవీరమా
భూరికాంతిమయూరమా ఫలపూరమా సుకరీరమా. 1056

మత్తకోకిల. మందయానను గానవా పిచుమందమా వటబృందమా
కుందమా యరవిందమా ఘనకోమలాంబరచుంబిమా
కందమా నవకందమా ననుఁ గాంచి పుణ్యము నొందుమా
చందనావనిజాతమా వనజాతమా గిరిజాతమా. 1057

తోటకవృత్తము. ఘనపల్లవకోమలగాత్రిని గాం, చనవర్ణశరీరిణిఁ జారుముఖిన్
ఘనకేశిని సీతను గంటివె కాం, చనవృక్షము చెప్పు ప్రసన్నమతిన్. 1058

తరువోజ. దనుజులు కాననాంతరమున నొకటఁ దరళాక్షి జానకి దాఁచిరో లేక
గొని పోయిరో లేక క్రూరతఁబట్టి కొని మ్రింగిరో వన్యఘోరసత్వములు
మొనసి హింసించెనో మోహనపాణి ముదిత కల్యాణి భూపుత్త్రి మత్పత్ని
జనకనందని పుణ్యసాధ్వి యేజాడఁ జనియెనో చెప్పు మశ్వత్థపాదపము. 1059

పృథ్వీవృత్తము. సరోజముఖి నర్జునప్రియను జారుబింబాధర
న్నరేంద్రవరకన్యక న్ఘనరణన్మణీనూపుర
న్వరాభరణభూషితాంగి నరవర్ణిని న్సీత నీ
యరణ్యమునఁ గానవా వికసితార్జునక్ష్మాజమా. 1060

చామరవృత్తము. పరాకు మాని సైఁప రానిబాళి మీఱ వేఁడునా
మొ ఱాలకించి యెందుఁ బోయె మోహనాంగి సీత నీ
వెఱింగి తేని వేడ్క నమ్మహీజజాడఁ జెప్పి నా
విరాళి మాన్చి ప్రోవవే ప్రవృద్ధబిల్వవృక్షమా. 1061

తరల. మదమరాళము గానవా యలమందయానను జానకి
న్ముదితచక్రము గానవా నృపపుత్త్రిఁ జక్రపయోధర
న్నదసులాంబుజపాణిఁ గానవె సంభృతాంబుజషండమా
కొదమతుమ్మెద గానవా నవకోమలభ్రమరీకచన్. 1062

వసంతతిలకావృత్తము. రంభావనీరుహము రాజితపత్త్రమా యా
రంభోరు వేగిన తెఱం గెఱిఁగింపు ప్రీతిం
గుంభీంద్రకుంభకుచఁ గోమలగాత్త్రిఁ గంటే
కుంభీంద్రమా తెలుపు కోర్కులు మీఱ నాకున్. 1063

ద్రుతవిలంబితవృత్తము. మదవతీజనమానససంభ్రమ,ప్రదవచోరమబంధురకీరమా

**మధురభాషిణిమత్ప్రియపత్నియా, సుదతి పోయినచోట్లు తెలియింపుమా.** 1064

**వనమయూరవృత్తము.** చంద్రకిరణప్రతిమచారుదరహాసం
జంద్రముకురాబ్జవిలసన్ముఖవిలాసం
జంద్రనిభవర్ణ నలచంపకసునాసం
జంద్రకిసమూహమ రసాతనయఁ గంటే. 1065

**స్వాగతావృత్తము.** పద్మకేసరవిభాసితగాత్రిం, బద్మకుట్మలనిభస్తనయుగ్మం
బద్మగంధినరపాలకపుత్రిం, బద్మినీకమల భామినిఁ గంటే. 1066

**మందాక్రాంతావృత్తము** కాంతారోర్వి న్నను విడిచి భూకన్య దా నొంటి నేగెం
జింతాశోకంబులు వొడమె నుచ్చిత్తముం గాసిలె న్నీ
చెంత న్నేఁ డల్లరుగదు గదా చెప్పి వంశంబ నాహృ
త్సంతాపంబుం దొలఁగ నిడుమా చాలఁ బుణ్యంబు గల్గున్. 1067

**మాలినీవృత్తము** నిరుపమగుణరాశి న్నీలజీమూతకేశి
న్నరవరనరపుత్రి న్నవ్యహేమాభగాత్రి
న్సరసిజదళనేత్ర న్జానకిం జూప రమ్మా
సరళపనసజంబుత్సాజరాజంబులారా. 1068

**మహాస్రగ్ధర.** తరలాక్షిం జెప్పఁ డత్యాదరముసఁ గునుమోత్తంసమాతంబులారా
హరిమధ్యం గానరే మీ రతిదయఁ జెపుఁ డింపార సింహంబులారా
తెలఁ గొప్ప న్సీత తా నేతెరువునఁ జనెనో తెల్పుఁ డీరంబులారా
పరిపుష్టశ్రేణులారా పలుకుఁ డిపుడు మత్పత్ని సేమంబు నర్థిన్. 1069

**ఇంద్రవజ్ర.** బాలామణిం జూపుముపారిజాతా, హేలావతిం గానవె యింద్రభూజా
లోలేక్షణం జూపవె లుంగమా హా, రాలంకృతాంగిం జెపుమా లవంగా.

**ఉపేంద్రవజ్ర.** వినీలమేఘోపమవేణి లజ్జా, వినమ్రవక్త్రాబ్జను వీర్యశుల్క
న్మనోజ్ఞరూప న్గుణమండన న్నా, జనంపనిం జూపుము సారసంబా. 1071

**ఉపజాతి.** సౌదామినీసన్నిభచారుగాత్రి, న్వైదేహరాజాత్మజ విద్రుమోష్ఠిం
గాదంబినీ సీతను గానవా స, న్మనంబునం జెప్పుము మాకుఁ బ్రీతిన్. 1072

**వంశస్థ.** ధరాసుతం గంటె కదంబగుచ్ఛమా, వరాననం జూపు లవంగమంజరీ
గురుస్తనిం జూపవె కుందబృందమా, కరీంద్రహస్తోరువుఁ గంటె శారికా. 1073

**స్రగ్విణి.** భామినింగంటివేబంధుబంధూకమా, భూమిజంగంటివేపుష్పితాశోకమా
కామినిం గంటివే కమ్రకల్హారమా, రాము వీక్షించితే రమ్యమాయూరమా.

**శా.** మల్లీ కేతకి మాధవీ కురవమా మందారమా మాలతీ
వల్లీమంజునికుంజమా కుటజమా వామాక్షి వైదేహి నా
యుల్లం బారటపెట్టి నేఁడు చనె నీయుగ్రాటవీవీథిలో
ఫుల్లాబ్జాక్షి నెఱింగ తేని చెపుమా పుణ్యంబు నీ కయ్యెడిన్. 1075

వ. అని యనేకప్రకారంబుల నయ్యాశ్రమంబునం గలతరులతల ఖగమృగంబుల
వైదేహి నడుగుచు నెందునుం గానక. 1076

తే. తోయజేక్షణ నీ వేల దూరమునకుఁ బరువు లెత్తెదు నాకుఁ గన్పడితి వీవు
వంతమున భూరుహంబులచెంత డాఁగి, యిపుడునాతోడ భాషింప వేల చెపుమ.

తే. కమలముఖి హాస్యశీలవు గావు నీవు, మించి యీలాగు నన్నుపేక్షించె దేల
కాంత నామీఁదఁ దొల్లింటికరుణ లేదె, నిలునిలుము పోయె దేటికి నీరజాక్షి.

తే. చారుపీతకౌశేయవస్త్రంబుచేతఁ
బద్మలోచన సూచింపఁ బడితి విప్పు
డొంటిఁ జనునిన్ను వీక్షించుచున్నవాఁడ
నెనరు నామీఁదఁ గల దేని నిలువు మింక. 1079

ఉ. ఎచ్చటి కేగితే కువలయేక్షణ పల్కవ దేల కోమలీ
ముచ్చటలాడ రావలదె మోహనరూపిణి యల్కఁ బూని న
న్నిచ్చటఁ బాసి పోవఁ దగవే మధురాధర యీవనంబులో
నెచ్చట నున్నదానవొ మహీసుత వేగమె మోముఁ జూపవే. 1080

క. అని పెక్కుగతులఁ జీరుచు, వనితాంగి మృదూక్తి చెవుల వినఁబడ కునికి
న్మనమున నాందోళించుచుఁ, గనుంగొనల నశ్రులొలుకఁ గా నిట్లనియెన్.

చ. పిలిచినఁ బల్క దెంతయును భీతమృగేక్షణ యివ్వనంబులోఁ
గల దనుమాట సందియము గావున దారుణరాక్షసాధము
ల్బలిమి గ్రసించుటో మొఱఁగి పట్టుటయో మఱి చంపుటో రహ
స్స్థలమున దాఁచుటో యొకటి తథ్యము గా కిఁక వేఱె యున్నదే. 1082

మ. అని నో రెండఁగఁ బాదము ల్వడఁక మే నాకంపముం జెంద లో
చనయుగ్మం బతిశోకరోదనముచే సంధ్యారుణచ్ఛాయతో
నెన యై యొప్పఁగ మాట తొట్రుపడ నెంతే చిత్తమోహాంబు పై
కొన ఫాలంబునఁ జెమ్మట ల్పొడమ సంక్షోభీకృతస్వాంతుఁ డై. 1083

చ. కనుఁగవ మోడ్చు నుస్సు రనుఁ గంపము నొందుఁ గడుం దలంకు హా
జనకకుమారి యంచుఁ బలుచందముల న్విలపించు లక్ష్మణా
వనజసుగంధి జాడఁ గనవా యను మాటికిఁ జీరు దైవమా
యను వనితావియోగజనితార్తిఁ దపించుచు రాముఁ డయ్యెడన్. 1084

క. సోలుచుఁ జింతాభరమున, వ్రాలుచుఁ గ్రిందంద యిడునవరజునిమేనం
దూలుచు శోకాంబునిధిం, దేలుచు మూర్ఛిలుచు సురలఁ దెలియుచు మఱియున్.

ఉ. ఎక్కడ నల్కు డైనఁ బరకేక్షణ వచ్చు నటంచుఁ జూచు నే
యిక్కువఁ జప్పు డైనను మహీసుతపల్కని యాలకించు నే
దిక్కు తళుక్కు మన్న సుదతీమణి మైజిగి గాఁ దలంచు లో

నక్కజ మైన మోహమున నారఘునాథుఁడు భ్రాంతచిత్తుఁ డై. 1086

వ. ఇట్లు దురంతచింతాభరంబున నమ్మేదినీకాంతుండు కాంతాన్వేషణతత్పరుం
డై కొండొకసే పయ్యాశ్రమసమీపంబునం గలశైలంబులును గిరిప్రస్రవ
ణంబులును నదీనదంబులును బుష్పపల్లవోపేతంబు లై సంచారయోగ్యంబు
లైనవనంబులును విషమంబు లైనకాననంబులును విలోకించి యెందునుం
గానక శోకసంతప్తచిత్తుం డై రాక్షసభక్షణంబుకొఱకు నాచేత విడువం
బడియెఁ గావున నమ్మహీపుత్త్రి పథికసంఘంబుచేతఁ బరిత్యక్త యై బహుబాం
ధవ యగుయువతిపగిది రాక్షసులచేత నిక్కంబుగా భక్షిత యయ్యె నని
తలంచి వలయకంకణాంగదభూషితంబులును జారుపల్లవకోమలంబులును వేప
మానాగ్రంబులు నైనతదీయబాహువులును జంపకవర్ణాభంబును గ్రైవేయ
శోభితంబును గోమలంబు నైనతదీయకంఠరంబును బద్మపత్త్రనిభేక్షణంబును
సంపూర్ణచంద్రప్రతిమంబును శుభదంతోష్ఠంబును రుచిరనాసంబును జారుకుం
డలంబు నైనతదీయవదనంబును మనంబున సంస్మరించి యివి యన్నియు రాక్ష
సులచేత భక్షితంబు లయ్యె నొకో యని తలంచి నానాప్రకారంబుల విలపిం
చుచు శూన్యం బైనయాశ్రమపదంబును సీతావిరహిత యైనపర్ణశాలయును
విధ్వస్తంబు లైనయాసనంబులును విలోకించి యస్వస్థహృదయుండును నవిష్ప
న్నమనోరథుండు నై భుజంబు లెత్తి మాటిమాటికి నుచ్చైస్స్వరమున సీతం
జీరుచు లక్ష్మణున కిట్లనియె. 1087

ము. అనఘా యెక్కడ సీత యేవిషయమునం దాసక్తితో నున్న దె
వ్వనిచే భక్షిత యయ్యె నెవ్వఁడు వడిన్ వామాక్షిఁ గొంపోయె శో
భనచారిత్రను నన్నుఁ బ్రీతి భజియింప న్వచ్చునే యింక నా
మన మానందరసప్రవాలహరీమగ్నంబు నై యొప్పునే. 1088

వ. అని పలికి సీత నుద్దేశించి. 1089

క. నాచిత్తము దెలియుట కిపు, డీచాయలఁ దరులపొంత నెక్కడ నున్నా
వో చాలును బరిహాసము, నీచక్కఁదనంబుఁ జూపి నెఱిఁ బ్రోవు మిఁకన్.

తే. చారులోచన నినుఁ గూడి సంతతంబుఁ
గరము క్రీడించు మృగశాబకములు నేఁడు
నిన్నుఁ గానక కన్నుల నీరు గ్రమ్మ
ధ్యాన మొనరించు చున్నవి యాశ్రమమున. 1091

వ. అని పలికి వెండియు లక్ష్మణు నుద్దేశించి 1092

ఆ. సీత లేనినాకు సిరి యేల బ్రతు కేల, ప్రాణ మేల పూజ్యరాజ్య మేల
తద్వియోగజనితతాపాగ్నిచేఁ గ్రాఁగి, మేనుఁ బాయు టిదియ మేలు గాదె.

ఆ. జానకీవియోగజనితార్తిచే డస్సి, మృతుఁడ నైన నన్నుఁ ద్రిదశలోక

మందు రాజవర్యుఁ డైన సుజ్జనకుండు, నేఁడు చూడఁ గలఁడు నిక్కువముగ.

వ. మఱియుఁ బరలోకగతుండ నైననన్ను విలోకించి సుజ్జనకుం డగుదశరథుండు చతుర్దశవత్సరంబు లరణ్యంబున నుండు మని నాచేత నియోజితుండ వైతి వక్కాలంబు పరిపూర్ణంబు గాకమున్నె మత్సకాశంబునకుం జనుదెంచితివి కామవృత్తుండ వనార్యుండవు మృషావాది వైతి వని ధిక్కరించుం గాదె యని పలికి యంతకంత కగ్గలం బగుశోకావేశంబున. 1094

ఉ. మానిని దుష్టచిత్తుఁ డగుదుష్టుని శాశ్వతకీర్తిఁ బోలె నన్
దీనుని భగ్నకాముని నతివ్యథితాత్ముని శోకపీడితున్
గాననమందుఁ బాసి లలనామణి యెక్కడి కేగెనో నినుం
గానక యున్న నాకు బ్రతుక న్వశమే వెసఁ బ్రోవ రాఁ గదే. 1095

వ. అని యిట్లు పెక్కుచందంబుల సీతాదర్శనలాలసుం డై పంకనిమగ్నుం డైనకుం జరంబుచందంబున నిశ్చేష్టితుం డై విలపించు చున్నరఘుపుంగవుం జూచి తదీయచిత్తానువర్తి యగులక్ష్మణుండు తత్కాలసదృశం బగువాక్యంబున ని ట్లనియె. 1096

చ. ఇది బహుకందరోపలమహీరుహ మైనవనంబు గౌతమీ
నదికి జలార్థ మేగెనొ వనంబునకుం గుసుమార్థ మేగెనో
మది దెలియంగఁ బూఁబొదలమాటున నెచ్చట డాఁగి యున్నదో
వెదకుము నన్నుఁ గూడి రఘువీర విషాదము నొంద నేటికిన్. 1097

క. ప్రియవనసంచారయుఁ ద,ద్దయు వనసంచారకోవిదయు వనవాస
ప్రియయును గావున జనకత,నయ యెచ్చట నున్నదో వనంబున నిపుడున్.

తే. కమలములఁ గోసి తెచ్చుట కమలపంక, జాకరంబులచెంగటి కర్థిఁ జనెనో
స్నాన మొనరించుటకుఁ బ్రీతి నదికిఁ జనెనొ, వెదకుదముగాక శోకింప వెఱ్ఱితనమె.

తే. అనుచు సౌహార్దమునఁ దమ్ముఁ డాడినట్టి, మాటకొక్కింతధృతిఁ బూని మనుజనాథుఁ
డతఁడు తానును నవ్విపినాంతరమున, మరల వెదుకంగఁ దొడఁగె సమ్మాననతిని.

ఉ. ఆరఘువర్యు లీకరణి నవ్విపినంబున నానగాళిలో
ఘోరమహీధ్రకందరనికుంజసరిత్సరసీవనాళిలో
నారసి సీతఁ గానక కపు డార్తిఁ దపించుచు నుండి రంత నా
ధీరుఁడు లక్ష్మణుండు వగ దేర్చుచు రామునితోడ ని ట్లనున్. 1101

ఆ. ఓమహానుభావ యీమాడ్కి శోకింప, నేల బలిని గట్టి నేలఁ గొన్న
చక్రపాణిపగిది జానకిఁ బడసెదు, ధైర్య ముడుగు టిదియుఁ గార్య మగునె.

చ. అన విని రాముఁ డాస్యమున నంటినవిన్నఁదనంబుతోడ నె
మ్మనమున శోకముం గదుర మాటలు తొట్రుపడంగ లక్ష్మణుం
గని వనశైలకందరనికాయముఁ జూచితి నిందు నెచ్చటం

గనుఁగొన నైతిఁ బ్రాణములకంటె గరీయసి యైనజానకిన్. 1103

వ. అని యిట్లు బహుప్రకారంబుల విలపించుచు సీతాహరణకర్శితుండును దీనుండును శోకసమావిష్టుండు నగుచు నొక్కముహూర్తంబు విహ్వలుం డై ధైర్యంబు వదలి గాంభీర్యంబు విడిచి గౌరవంబు దొలంగం బెట్టి చేష్టలు మాని యెఱుక మఱచి యపసన్నాంగుం డై తత్తఱంబున సారెసారెకు దీర్ఘంబుగా వేఁడినిట్టూర్పులు పుచ్చుచు జానకిం బేర్కొని యుచ్చైర్నాదంబున రోదనంబు సేయుచు సంయతాంజలి యై లక్ష్మణుండు శోకాపనోదకారణంబు లైన యుపశమనవాక్యంబుల నెంత యనూనయించిన నూఱడిలక సీతావియోగజనిత వ్యామోహోపహతచేతనుం డై మాటిమాటికి రోదనంబు సేయుచు దురంత చింతాభరంబునం దూలుచు మదనపరవశుం డై జానకిం గట్టెదుట నున్నదానిఁగాఁ దలంచి యద్దేవి సంబోధించి శోకగద్గదకంఠుం డై యిట్లని విలపించె.

చ వనకుసుమప్రియత్వమునఁ వారిజలోచన నీవు ముంగలం
బనివడి యీయశోకవిటపంబులమాటున మే నొకింతయుం
గనఁబడ కుండ నిట్లు జనకక్షితినాథతనూజ యుండఁగాఁ
జనునె మనంబులోఁ గడువిషాదము పుట్టెడు రమ్ము చెచ్చెరన్. 1105

క. కదళీనిభోరుకాండము, లదటునఁ గదళీమహీరుహంబులచెంతన్
వదలక కనఁబడుచున్నవి, సుదతీ వెస రమ్ము నాకుఁ జూడ స్వశమే. 1106

సీ. వనిత నీకుచముల కెన యని డాఁగితో సదమలపుష్పమంజరులచెంత
సుదతి బాహువులకు జో డని చేరితో వికసితనూత్నవల్లికలచెంత
నింతి నీమోవికి నీడని డాసితో రమణీయనవపల్లవములచెంతఁ
దరుణి పాదములకు సరి యని చేరితో కర మొప్పుమెట్టదామరలచెంత

తే.యువతి పరిహాసమునకు నన్నొంటివిడిచి, విపినమునడాఁగుటిదియువివేకమగునె
మగువ యీపరిహాసంబు మాకు బాధ, సేయుచున్నది చయ్యనఁ జేరరావె. 1107

తే.అంబుజేక్షణ శ్రాంతుండ నైననాకుఁ, గరము పరిహాసమున నేమికార్య మిప్పు
డెలమి నినుఁగూడియున్నచో నిచ్చఁ బ్రీతి,నొసఁగు నేనాకునినుఁగానకున్నఁ బోటి.

క. పరిహాసప్రియ మగుటయు, నిర వొందఁగ నీదుశీల మెఱుఁగుదు నైనం
దరుణీ యాశ్రమపథమునఁ, బరిహాసము దగదు వీటఁ బరువడిఁ జెల్లున్. 1109

ఉ. అక్కట నన్ను నేఁడు పరియాచక మాడుట కేనగాళిలో
నెచ్చట నున్నదానవొ మృగేక్షణ నీ విట లేమిఁ జేసి నల్
దిక్కులు నిష్ప్రభత్వమున దిక్కఱి యున్నవి పర్ణశాలకుఁ
గ్రక్కున వచ్చి మెచ్చి ననుఁ గౌఁగిటఁ జేర్చి ముదం బొసంగవే. 1110

చ. అని పలుమాఱుఁ జీరి విభుఁ డవ్వల లక్ష్మణుఁ జూచి తమ్ముఁడా
యనయము సీత నిక్కము నిశాటులచే హృత యయ్యెఁ గాక యుం

డినఁ దనుఁ జీరఁ బల్కదె వనిన్ మృగయూథము శోకబాష్పముల్
కనుఁగవ నించుచున్ జనకకన్యక పోయినజాడఁ దెల్పెడిన్. 1111
వ. అని వెండియు సీత నుద్దేశించి. 1112
ఉ. అక్కట నన్ను ఘోరవిపినావని నొంటిగ డించి నేఁడు నీ
వెక్కడ కేగితే కువలయేక్షణ నీ విట రాక్షసాలిచేఁ
జిక్కుచు నుండఁ గైకయి వశీకృతసద్విషయస్థలోక యై
చొక్కుచు నుండుఁ గాదె తనసూనుఁడు రాజ్యము నేలు చుండఁగన్. 1113
తే. నీవు పోయినతెరువునఁ బోవు టంతె, గాక క్రమ్మఱఁ బురి కెట్లు నాకుఁ బోవు
టొప్పు నటులైనఁ గడు నిర్దయుండు వీర్య,హీనుఁడని లోకమెల్లన న్నెన్నికొనదె.
ఆ. వారిజాక్షి మును భవత్సమన్వితముగ, రమణ వచ్చితిని బురంబు విడిచి
నిన్ను విడిచి యకట నేఁ డెత్తెఱంగునఁ, బురికి నేను మరలఁ బోవువాఁడ.
క. వనవాసము సలిపి పురం, బునకు మరలఁ బోయి యచటఁ బుత్త్రస్నేహం
బునఁ గుశల మడుగు జనకునిఁ, గనుఁగొన నేపగిది నోపఁగాఁగల నకటా 1116
వ మఱియు నవ్విదేహావల్లభుండు సీతావిరహితుండ నైన నన్ను విలోకించి పుత్త్రి
కాస్నేహసంతప్తుండై నిక్కంబుగా మోహావశంబునొందునని వగచి పదంపడి
లక్ష్మణు నాలోకించి 1117
ఆ. నీరజాక్షి లేనినెలవు నాకం బైన, శూన్య మగుచు నాకుఁ జూడ నొప్పఁ
గాన వీటి కింక నేను బోవఁగఁ జాల, దేవి యట్ల యిచటఁ బోవువాఁడ. 1118
క. జానకిని బాసి నిమిషం, బైనను జీవింపఁ జాల నటు గావున నన్
గాననమున విడిచి యయో, ధ్యానగరికిఁ బొమ్ము నీవు తల్లులకడకున్. 1119
క. సీతాపతిచేత ననుజ్ఞాతుఁడ వైతి విఁకఁ బుడమిఁ గావు మనుచు వి
ఖ్యాతిగ భరతునితోఁ జెపు, మాతతమతిఁ గౌఁగిలించి యస్మదనుమతిన్. 1120
క. జనని సుమిత్రయుఁ గైకయు, ననఘా కౌసల్యయును నయంబున నభివం
దనపూర్వకముగ నీచే, ననిశము రక్షింపఁ దగుదు రనఘవిచారా. 1121
క. కావున నావార్తయు సీ,తావృత్తాంతమును జెప్పి తగ మజ్జనని
న్నావిరిఁ బ్రోచుచు నుండుము, పావనగుణ దుఃఖమునకు బాల్పడ కుండన్.
క. అని రఘుపతి దీనుం డై, జనకజ నెడఁబాసి శోకసంతాపభరం
బున విలపించుచు నుండం, గని లక్ష్మణుఁ డధికశోకకర్శితుఁ డయ్యెన్. 1123
ఉ. ఘోరవిషాదచిత్తుఁ డగుసూరిమితమ్మునిఁ జూచి రాముఁడున్
దారుణశోకతప్తుఁ డయి దైన్యము దోఁపఁగ శోకబాష్పముల్
గాఱఁగ వేఁడియూర్పు సెలఁగ న్వ్యసనోచితభంగి నిట్లనెం
గూరినమోహతాపమునఁ గుందుచు రోదనపూర్వకంబుగన్. 1124
ఉ. ఆతతవైభవోచితుఁడ నయ్యును శోకముమీఁద శోక మీ

రీతిఁ దపింపఁ జేయ నశరీరుఁడ నైతి మని యుంటిఁ గావునం
బూతచరిత్ర చూడ ననుఁ బోలినదుష్కృతకర్మకారి క్షో
ణీతలమందు వేఱొకఁడు నిక్కము లేఁడు క్షితీశనందనా. 1125

ఉ. తొల్లిఁటిపాపకర్మ మిటు తోడుతఁ జేకుఱె నాకుఁ గానిచోఁ
దల్లిని జుట్టల న్విడిచి తండ్రిని రాజ్యముఁ గోలుపోయి సాం
పెల్లఁ దొఱంగి శోకమున నిచ్చట గాసిలు చుండ మీఁదఁ బా
టిల్లునె యిట్లరణ్యమున డెప్పర మైనసతీవియోగమున్. 1126

తే. కడఁగి సీతావియోగదుఃఖంబువలనఁ, గెరలి తొల్లిటిబహువిధక్లేశ మంగ
మేర్చుచున్నది లక్ష్మణా యింధనముల, చేత నుద్దీప్తఁ డగుతీవ్రశిఖియుఁ బోలె

తే. రక్కసులచేతిలోఁ బడి రాజపుత్త్రి, తనదుసుస్వరభాషణత్వంబు విడిచి
సాధ్వసంబున నేఁ డపస్వరముతోడ, నుగ్రవనమున విలపించుచుండుఁ గాదె

ఆ. అకట లోహితాఖ్య హరిచందనంబున, కనుదినోచితంబు లైనయువతి
వృత్తపీనకుచము లెంతయు రుధిరసి, క్తంబు లగుచు సొబగు దప్పి యుండు.

చ. కమలపలాశలోచనము కౌముదికానిభచారుహాసయు
క్తము మణికుండలోజ్జ్వలితగండము కుంచితనీలకేశపా
శము మృదుభాషణంబు నగుజానకిమోము పరక్తచంద్రబిం
బముక్రియ నుండు నేఁ డసురపాలివశంగత యాట నెంతయున్. 1130

చ. ఘనతరహారశోభితము కాంతపయోధరయుగ్మరంజితం
బనుపను హేమకంచుకసమన్విత మై యలరారు మేదినీ
తనయయురంబు సించి భయదక్రియఁ దద్రుధిరంబు శోణితా
శను లగురాక్షసాధములు చయ్యనఁ గ్రోలుదు రేమి సేయుదున్. 1131

ఉ. ఆయతకాంతనేత్ర యగునాగజగామిని మద్విహీన యై
పాయక నిర్జనం బయినబంధురకాననమందు నొంటి దై
తేయులచేతఁ జిక్కి యతిదీనతఁ దత్పరికృష్యమాణ యై
రాయిడి కోర్వఁజాల కల క్రౌంచిగతి న్విలపించునే కదా. 1132

చ. ఇరవుగ నన్నుఁ గూడి తగ నీరమణీయశిలాతలంబునం
దరము సుఖోపవిష్ట యయి కమ్రశుచిస్మిత యై సుహాస యై
పరఁగ నుదారశీల యగుభామిని నిన్నటు చూచి మున్ను భా
సురబహువాక్యజాతమును సొంపు దలిర్ప వచించునే కదా 1133

సీ. రాజకుమార యీరాజాస్య సలిలార్థ మలగౌతమీనది కరిగె నొక్కొ
జలజాక్షి పంకజంబులు దెచ్చుటకుఁ బ్రీతి సరసిచెంతకు వేడ్కఁ జనియె నొక్కొ
చారుపుష్పితవృక్షషండమండిత మైన యీవిపినంబున కేగె నొక్కొ
కమనీయతరపుష్పగంధబంధుర మైన పూఁబొదరిండ్లకుఁ బోయె నొక్కొ

ఆ. అతివ చాల భీరు వగుట మున్నెన్నఁడు, నన్ను విడిచి యొంటి నదికి నరసి
కటవి కీరములకు నరుగదు నేఁ డెట్లు, చనియె నాతలంపు సత్య మగునె. 1134

ఉ. లోకకృతాకృతజ్ఞుఁడవు లోకబుతానృతకర్మసాక్షి వ
స్తోకవిభావసుండ వజితుండవు వేనుయుండ వీవు పు
ణ్యాకర మిత్ర సీత హృత యయ్యెనొ తే కిపు డెందుఁ బోయెనో
శోకవశుండ నై మిగుల స్రుక్కెడు నా కెఱిఁగింపు సత్కృపన్. 1135

చ. అవిరతభక్తి వేఁడెద నరాహిసుపర్వజగంబులందు నీ
కవిదిత మైనయర్థ మరయంగ నొకించుక లేదు దానవు
ల్యువతి హరించిరో గెడపిరో వనవీథిఁ జరించు చున్నదో
పవన రయాహతో పవన భామిని పోయినజాడఁ జెప్పుమా. 1136

వ. అని బహుప్రకారంబుల శోకాధీనదేహుం డై విసంజ్ఞుండుం బోలె విలపించు
చున్నయన్నం జూచి యదీనసత్త్వుం డగులక్ష్మణుండు న్యాయసంస్థితుం డై కా
లోచితం బగువాక్యంబున ని ట్లనియె. 1137

తే. అధిప శోకంబు విడిచి ధైర్యంబుఁ బూని, యుర్వినందని వెదుకంగ నుత్సహింపు
మరయ నుత్సాహవంతులు ధరణి నెట్టి, దుష్కరపుఁబనులందైనఁ దొట్రువడరు

క. అని లక్ష్మణుండు పలికిన, విని విభుఁ డచలుండు గాక విరహజ్వరసం
జనితార్తిఁ జాలఁ దూలుచు, ననుజన్మునితోడ మరల ననియెఁ గృపణుఁ డై.

మ. సుదతీరత్నము పద్మముల్ గొనుట కై సొం పొందఁగా గౌతమీ
నదికిం బోయెనొ తత్సరిత్పులినసంతానంబులం జూచి న
చ్చెదవా యన్న నతండు పోయి మదిరాక్షిం గాన కేతెంచి గ
ద్గదకంఠుం డయి యన్న కిట్లనియె సంతాపంబు వాటిల్లఁగన్. 1140

రాముఁడు సీతావృత్తాంతమును గోదావరి నడుగుట.

వ. దేవా తీర్థవతి యైనగోదావరికిం బోయి తత్తీర్థంబులయందు వెదకి యెందు
నుం గాన నైతి నెంత చీరినఁ దద్వాక్యంబు విని రా దయ్యె మీరు నని వెదుక
వలయును. 1141

క. నావిని రఘునాథుఁడు గో,దావరికిం బోయి చాల ధరణీసుత న
చ్చో వెదకి కాన కతిశో,కావిలచేతస్కుఁ డగుచు నన్నది నడిగెన్. 1142

చ. అడిగిన నెట్లు భూతచయ మయ్యమ పోయినచో ప్పెఱింగియుం
గడువడిఁ జెప్ప దయ్యె నటు గౌతమియుం గలుషాత్ముఁ డాదశా
స్యుఁడు సుడి వెట్టునో యనుభయోద్గతితో వివరింప దయ్యె న
ట్లుడుగి కుచెప్పు మీవని సముద్గతి భూతము లెంత చెప్పినన్. 1143

వ. ఇట్లు నిరుత్తరుం డై రాముండు లక్ష్మణు నవలోకించి. 1144

చ. జనకజవార్త నించుకయు సన్మతి నీవది సెప్ప దయ్యె నే
జనకున కేమి చెప్పుదుఁ బ్రసన్నతఁ దల్లికి నేమి చెప్పుదుం
గని కని దైవ మెంత యపకారము నా కొనరించె నేగతి
న్జని యెద నెందుఁ జొత్తును వనంబున నెట్లు వసింతుఁ దమ్ముఁడా. 1145

చ. హితులను బాసి రాజ్యము నహీనబలంబును గోలుపోయి యీ
గతి గహనంబులోఁ దపసికైవడి నాకలము న్భుజించుచున్
ధృతిఁ గని సంచరించుచుఁ దుది న్సతి గోల్పడి నిద్ర లేక దు
ర్మతి విలపించు నా కిచట రాత్రులు దీర్ఘము లై చనుం గదా. 1146

క. జానకి గనఁబడెనేనియు, మానుగ నీకుజములందు మందాకినియం
దీనగములయందు జన, స్థానములం దిచ్చకొలఁదిఁ జరియింతుఁ గదా. 1147

తే. ఈ మృగంబులు సారెకు నామొగంబుఁ
జూచెడు మహీజ పోయినచొప్పు చెప్ప
నిచ్చగించినక్రియఁ దదీయేంగితములు
దోఁచుచున్నవి దుర్జనదూర కంటె. 1148

క. అని పలికి విభుఁడు సతి పో,యినచందముఁ జెప్పుఁ డనిన మృగములు నభముం
గనుఁగొనుచు వేగదక్షిణ,మునకుం జనియె న్రఘూత్తమునిఁ గనుఁగొనుచున్.

లక్ష్మణుఁడు రామునికి మృగంబులు సీతజాడఁ దెల్పుటను జెప్పుట.

వ. మఱియు నవ్వనమృగంబులు శీఘ్రంబున లేచి దక్షిణాభిముఖంబు లై నభస్స్థలంబు విలోకించుచు రావణుఁడు వైదేహి నెత్తికొని చనినమార్గంబుఁ బట్టి రామభద్రు నవలోకించుచు దక్షిణాభిముఖంబుగా నరిగె నేకారణంబున నమ్మృగంబులు దక్షిణదిశను దక్షిణదిగ్భూమిని విలోకించుచు దక్షిణదిశకుఁ బరువు లెత్తె నక్కారణంబున నామృగంబులు లక్ష్మణునిచేత గృహీతచేష్టార్థంబు లయ్యె నప్పు డాలక్ష్మణుండు మృగంబులచేష్టాభిప్రాయంబు వచనసారంబుగా విలోకించి యన్న కిట్లనియె. 1150

రామలక్ష్మణులు మృగసూచితమార్గమున సీతను వెదకుట.

సీ. కాకుత్స్థవర యీమృగంబులు మీచేత నవనిజావృత్తాంత మడుగఁ బడిన
వగుచు దక్షిణభూమి సందంద చూపుచు యామ్యదిశాభిముఖ్యంబుగాఁగఁ
బోవుచు నున్నవి భూపుత్రి పోయిన జాడ గానలయు విచార ముడిగి
వెదకుద మాయన్న విని రాముఁ డగుఁ గాక యని వేగ యనుజసహాయుఁ డగుచు
తే. దక్షిణాభిముఖంబుగా దావమెల్లఁ, గలయఁ జూచుచుఁ బోయి మార్గమున నొక్క
జాడ రాలిన క్రొవ్విరిసరులు చూచి, మనుజవిభుఁ డిట్టులనియె లక్ష్మణునితోడ.
క. మానుగ నీకుసుమంబులు, జానకి ధమ్మిల్లమందు సవరించిన వి
శ్వాసల నాచే దత్తము, లై నవి గుఱుతెఱిఁగికొంటి ననఘవిచారా. 1152

వ. మఱియు నిక్కుసుమంబులనమ్లానతచేత సూర్యుండు ననపనయంబుచేత సమీరుండును ధారణంబుచేత ధరిత్రియు నీమువ్వురు నాకుఁ బ్రియంబు సేయుటకు నావచ్చునందాఁక రక్షించుచున్నవా రని తలంచెద. 1153

తే. అనుచుఁ దమ్మునితోనాడి యధిపుఁ డొక్కశైలమునుగాంచి గిరినాథ జనకకన్య
నేమ మెఱిఁగింపు మని పల్కి చెప్ప కున్న, నట్టె కోపించి దానికి నిట్టు లనియె.

చ. గిరివర సీతచంద మెఱిఁగింపుము నీ వటు దెల్ప వేని దు
ర్ధరశరవహ్నిచేత నిను భస్మముఁ జేసెద నిర్ఝరంబులుం
గరము నవాంబుహీనములు గా భవదున్నతమేదినీరుహో
త్కరములు పర్ణహీనములు గా నొనరించెదఁ జూడు ప్రేల్మిడిన్. 1155

క. పరువడి నీసానువు లజి, ముఱిఁ ద్రుటితాశ్మములు గాక మున్నె సువర్ణాం
బరధారిణి హేమాభను, సురుచిరగాత్రిని మహీజఁ జూపుము నాకున్. 1156

ఆ. చూప వేని యిపుడె సునిశితశరవహ్ని, భూరితరులు శిలలు నీఱు చేసి
చెలఁగి నిన్ను నేఁ డసేవ్యంబుఁ జేసెద, గౌతమీరయంబుఁ గట్టి వైతు. 1157

క. అని పలికి విభుఁడు కన్నులు, ఘనతరరక్తాంబుజముల కై వడి నలరం
గనుఁగొనియె మ్రోల నిడువై, తనరుదశాననునిపదము ధారుణియందున్.

తే. కాంచి యంతట వెండియుఁ గలయ వెదకి, రాముకాంక్షిణియును దైత్యరాజకృష్ట
యును బ్రధావితయును బ్రీతియుతయు నైన, జనకనందనిపదములజాడఁ గనియె.

వ ఇట్లు రాముండు ప్రవృత్తనిక్షేపంబు లైనవై దేహీరావణులచరణన్యాసస్థానంబులు విలోకించి తత్సమీపంబున భగ్నం బై పడి యున్నచాపంబును దూణీరంబును బహుప్రకారంబుల విశీర్ణం బైనరథంబును విలోకించి సంభ్రాంతచిత్తుం డై ప్రియవాది యగులక్ష్మణున కిట్లనియె. 1160

చ. అనఘ మహీశపుత్రి వివిధాభరణంబులు హేమబిందువుల్
మునుకొని గంధపుష్పసరము ల్ధర నంతటఁ జూడ నొప్పెడిఁ
ఘనముగ రక్తబిందువులు గానఁగ నయ్యెడి దైత్యపాళిచే
జనకజ కాననంబున నిజంబుగ భక్షిత యయ్యెఁ జూడఁగన్. 1161

### రాముఁడు జటాయువుచేత భగ్నం బైనరావణరథంబుఁ గని వితర్కించుట.

చ. గుఱుతుగ భూమిపుత్రికొఱకుం గలహించి నిశాటు లిద్దఱుం
బోరిఁబోరి బాహుగర్వమునఁ బోరినచందము దోఁచెఁ గానిచో
నురుతరహేమభూషితసముజ్జ్వలచాపము భగ్నదండ మై
నిరుపమఘోరభంగి నవనిం బడియుండఁగ నేల చెప్పుమా. 1162

క. తరుణాదిత్యనిభంబును, గురుతరవైడూర్యరత్నగుళికాచితము
న్నిరుపమసువర్ణకవచము, ధరణిం బడి యున్న దిచటఁ దమ్ముఁడ కంటే. 1163

తే. సురుచిరము దివ్యమాల్యోపశోభితంబు, శతశలాకంబు నగుసితచ్ఛత్ర మొకటి
భగ్నమణిదండమై ధరఁబడి వెలుంగు, చున్నదిచ్చటఁ గంటివె యురుగుణాఢ్య.

వ. మఱియుఁ గాంచనమయతనుత్రాణంబులును భిశాచవదనంబులును మహాకాయంబులును భీమరూపంబులు నగుఖరంబులు గతప్రాణంబు లై పుడమిం బడి యున్నయవి దీప్తపావకసంకాశంబును ద్యుతిమంతంబును సమరధ్వజోపేతంబు నగుసాంగ్రామికరథంబు భగ్నం బై నేలం బడి యున్నది చతుశ్శతాంగుళపరిమితంబులును దపనీయవిభూషితంబులు నగుబాణంబులు ఖండితాగ్రంబు లై యభిహతంబు లై విప్రకీర్ణంబు లై రాలి యున్నయవి శరపూర్ణంబు లగుతూణీరంబులు విధ్వస్తంబు లై పడి యున్నయవి పగ్గంబులును దోత్త్రంబును నేలం గీలించి సూతుండు మృతుం డై పడి యున్నవాఁడు మణిరత్నమయంబు లైనదివ్యభూషణంబులరజంబు పుడమిం గప్పి యున్నది సోష్ణీషమణికుండలు లగుపురుషు లిరువురు విగతప్రాణు లై చామరహస్తు లై ధరణిం గూలి యున్నవా రివి యన్నియు సురాసురోచితసాధనంబులు గాని సర్వసామాన్యంబులు గావు కావున. 1165

క. క్రూరాత్ము లైనదనుజులు, ఘోరంబుగ సీత నెత్తికొని పోవుటో లే
కారయఁ జంపుటొ మ్రింగుటొ, కాఱియపెట్టుటొ నిజం బొకటి తలపోయన్.

క. కావున లక్ష్మణ యసురుల, తో వైరము మిక్కుటముగ దొరకొనె నాకు
న్భావింపఁగ మచ్ఛరముల, త్త్రైలోక్య మహాకసంబుగాఁ గలదింకన్. 1167

తే. పరఁగ ధర్మంబు రాక్షసాపహృత యైన, యుర్వినందని రక్షింపకునికి ధర్మ
మాపదలయందు రక్షకం బనెడున్యాయ,మది విచారింప నేఁడు నిరర్థమయ్యె.

క. అలయక యనారతము వే, ల్పుల నారాధించు చుందు మొనసినభక్తిం
బలలాశనహృత యగుమై, థిలిఁ గావఁ దలంపఁ డొక్కదేవుం డైనన్. 1169

వ. వత్స కారుణ్యపరుం డగువాఁడు సర్వలోకేశ్వరుం డైనను మహాశూరుం డైనను వానిం జూచి సర్వభూతంబులు తత్స్వభావాపరిజ్ఞానంబువలన నశక్తుం డని తలంచున ట్లగుటం జేసి మార్దవాదిధర్మయుక్తుండును దాంతుండును లోకహిత యుక్తుండును గారుణ్యపరుండ నైననన్నుఁ ద్రిదశేశ్వరు లందఱు నిర్వీర్యుం డని తలంచు చున్నవారు గావున నన్నధిగమించి మార్దవాదికంబు గుణం బైన ననిష్టసాధనత్వంబున దోషం బై ప్రవర్తిల్లె నిప్పుడు చంద్రచంద్రికల మాపి సముదితుం డై నసూర్యుండు దేజరిల్లినచందంబున సర్వగుణంబుల నడుగునం ద్రొక్కి మత్ప్రతాపంబు సకలరక్షోభూతగణనాశంబుకొఱకుఁ బ్రకాశించుచున్నది గావున. 1170

క. సురగరుడోరగవిద్యా, ధరచారణసాధ్యదైత్యదానవయక్షో
సురసిద్ధతుషితు లందొ, క్రూరుఁ డై నను సుఖము వడయఁగాఁ జాలఁ డీఁకన్.

రాముఁడు క్రోధం బవలంబించి త్రైలోక్యసంహారంబుఁ జేసెదననుట.

తే. శాతశరములఁ ద్రైలోక్యచరుల గమన
ముడిపెద నభంబు సస్త్రసముత్కరమున
నిరవకాశంబుఁ జేసెద నీరనిధుల
నెల్ల శోషింపఁ జేసెద నీక్షణమున. 1172

సీ. సౌమిత్రి విను నేఁడు సన్నిరుద్ధగ్రహ మావారితోడునిశాకరంబు
విప్రనష్టానలవిధుసురుద్భాస్కరచ్ఛవియు సంతమసాభిసంవృతంబు
విధ్వస్తతరులతావిసరగుల్మంబును శోణితార్ణవమును శుష్యమాణ
సరిదాశయంబును శకలీకృతకులాచలాగంబు నై విలయంబు నొందు

ఆ. విష్టపత్రయంబు విబుధులు సీతను, నాకొసంగ రేని యాక్షణమునఁ
జెలఁగి తిరుగ లేక చేష్టలు దక్కి వీక్షింపఁ గలరు మద్విశేషశక్తి. 1173

మ. అలుకన్ మత్కరమండితాత్తధనుర్జ్యాముక్తనారాచసం
తతులచే మర్దితమై నిరంతరము నై తోడ్తో నమర్యాద మై
కలితధ్వస్తమృగాండజాతగణ మై కాలోద్ధృతం బై సమా
కుల మై యీజగ మంతయు న్మిగుల సంక్షోభించెడుం జూడుమా. 1174

క. ఆకర్ణపూర్ణదుస్సహ, కాకోదరకల్పశరనికాయంబుల నీ
లోకం బరాక్షసంబుగఁ, జేకొని గావింతు నింక సిద్ధము వత్సా. 1175

తే. సముదితమదీయభూరిరోషప్రయుక్త, కార్ముకవిముక్తదూరాతిగామినిశిత
సాయకబలంబుఁ జూచి నిర్జరులు నేఁడు, చాల విత్రస్తు లగుదురు సంభ్రమమున.

క. గురుతరమత్క్రోధంబునఁ, బరువడి లోకంబు లెల్ల భస్మంబు లగు
న్నరయక్షాసురకిన్నర, సురులును బొలిసెదరు నేఁడు చూడు కుమారా. 1177

తే. వినుము జరయును మృత్యువు విధియుఁ గాల, మనవరత మప్రతిహతంబు లైనరీతి
మహితరోషరసోద్దీప్తమానసుండ, నైన యే ననివార్యుండ నైతి నిపుడు. 1178

వ. అని పలికి మార్తాండవంశమండనుం డగు రాముండు సక్రోధుం డై నేత్రం
బులం దామ్రదీధితులు నిగుడ నధరోష్ఠంబు చలింప యుగాంతకాలంబున నొ
ప్పుసంవర్తాగ్నిచందంబున నతిదుర్నిరీక్షుం డై జటాభారంబు సవరించి వల్క
లాజినంబులు బిగించి లక్ష్మణునిచేత నున్నప్రచండకోదండంబుఁ గేల నందు
కొని సజ్యంబుఁ జేసి కాలకూటసన్నికాశంబు లైననారాచంబులు సంధించి
లోకక్షోభంబుగా గుణప్రణాదంబు సేయుచుఁ బ్రత్యాలీఢపాదుం డై నిలువం
బడిన నమ్మహనీయమూర్తిమూర్తివిశేషంబు త్రిపురదహనదీక్షాదుర్నిరీక్షుం
డై నయష్టమూర్తిమూర్తిచందంబునం దేజరిల్లుచుండె నిట్లుసీతావియోగసంజ
నితశోకాతిశయంబునం బుట్టినక్రోధంబున లోకంబుల నన్నింటి నొక్కపెట్ట
భస్మంబు సేయ సమకట్టి నిట్టూర్పులు నిగిడించుచు నదృష్టపూర్వతేజోదుస్స

హుండై యున్నయన్నం జూచి లక్ష్మణుండు వెలవెలంబోయి చేతులు మోడ్చి
వినయంబున ని ట్లనియె. 1179

—లక్ష్మణుఁడు రాముని మృదూక్తుల ననూనయించుట.—

సీ. అనఘాత్మ నీవు మున్నతిదయాశాలివి మృదుఁడ వఖిలభూతహితరతుండ [యు
వతిదాంతుఁడవు చంద్రునందులక్ష్మియు సూర్యునందుఁ దేజము వాయువందుగతి
ధరయందుఁ దాలిమి దగి యుండు నీయందు నవి యన్నికీర్తియు నమరియుండు
నట్టిమహాత్ముండ వైననీ వొక్కనియపరాధమున నిప్పు డలుకఁ బూని
తే. భువనములఁగాల్పఁ దగునె యీభూరిరథము,నీపరికరంబుగలవాని నెఱుఁగమిచట
వీరు లిరువురు కలహించువెరవుఁ గాన, మొక్కరథ మిందుఁ జూపట్టుచున్న కతన.
వ. మహాత్మా యీదేశంబు ఖురనేమిక్షతం బై రుధిరబిందుసిక్తం బై నివృత్తసం
గ్రామం బై యున్న దైనను సైన్యస్థానంబు చూపట్టనికతంబున మన కప
రాధి యగువాఁ డొక్కండే యని తోఁచుచున్నది యొక్కనికిఁగాఁ బెక్కండ్ర
వధింపఁ గూడుట ధర్మంబు గాదు మహీపతులు శాంతి వహించి మార్దవంబున
యుక్తదండు లై చరింప వలయు. 1181
ఆ. జనవరేణ్య నీవు సర్వభూతములకుఁ, బరమగతివి సాధుపాలకుఁడవు
నిత్యకాముఁడవు నీపత్ని నెవ్వాఁడు, తెంపుఁజేసి యపహరింపఁ దలఁచు.
చ. అరయఁగ యాగదీక్షితున కర్థి మహామతు లైనఋత్విజుల్
గర మపచార మించుకయుఁ గైకొని చేయఁగ లేనిమాడ్కి భా
స్కరసురయక్షరాక్షసులు శైలము లంబుధు లుర్వి నీకు సు
స్థిరతరశక్తి విప్రియము సేయఁగ నోప వొకించు కేనియున్. 1183
క. భూపాలవర్య యిచ్చటి, తాపసులను నన్నుఁ గూడి తడయక యిచటన్
భూపుత్రి నపహరించిన, పాపాత్ముని వెదకి కాంచి పడఁ గూల్పు మిలన్. 1184
తే. అనఘచారిత్ర జానకి నపహరించి, నట్టిదుష్టుఁడు గనుపట్టునంతదాఁక
గిరివనాబ్ధిసరిత్సరోవరనరాహి, సురజగంబులు శోధింత ముకుజవమున. 1185
క. నదమలమతి సామంబునఁ, ద్రిదశులు నతి నొసఁగ రేని తెంపున నవల
న్వదలక యుత్థితకోపం, బదయత నార్థకము సేయు మన్మనమునతిన్. 1186
వ. మహాత్మా వినయంబున నయంబున సామంబున శీలంబున మహీపుత్రి వడయం
జాల వేని యవ్వేల సురేంద్రవజ్రప్రతిమంబు లైనసువర్ణపుంఖసాయకంబు
లడరించి జగంబులు నిర్మూలంబులు గావింపుదువు గాక యని పలికి లక్ష్మణుండు
తనమాటలఁ దెలివి నొందక శోకసంతప్తుం డై దురంతమోహంబున నష్టవి
హృదయుండై పరిమ్లానవదనుండై యనాథునిభంగి విలపించుచున్న రాముని
జూచి తదీయచరణంబులఁ బట్టుకొని కొండొకసేపు సాంత్వవాక్యంబుల ననూ
నయించి వెండియు ని ట్లనియె. 1187

చ. అనిమిషుఁ డాసుధం బడసి నట్లుగఁ బంక్తిరథుండు బల్తపం
బున ఘనయాగకర్మమునఁ బుత్త్రునిఁ గా నినుఁ గాంచి నీమహా
వనగుణము ల్దలంచుచు భవద్విరహవ్యసనంబుచేఁ దుదిన్
మనభరతుండు చెప్పినక్రమంబున నేగె సురేంద్రువీటికిన్. 1158

క. త్వాదృశు లైనమహాత్ములె, యీదృగ్విధదుఃఖ మిటు సహింపక యున్న
న్మాదృశులు స్వల్పమతు లే, తాదృశదుఃఖమున కెట్లు తాళుదు రధిపా.

ఆ. తొడరి నీవు దుఃఖితుండ వై జగము లహీనతేజమున దహించి తేని
యనఘచరిత యార్తు లై భూతములు పద్మదళజలంబుభంగిఁ దల్లడిల్లు.

సీ. అలనహుషాత్మజుం డగుయయాతిసురేంద్రపదమునొందియుదుఃఖపరుఁడుగాఁడె
కొడుకుల నూర్వుర గోల్పడి బ్రహ్మర్షి యైనవసిష్ఠుఁ డాయాసపడఁడె
యఖిలభూతంబుల కాధార మైనయాధరణి యొక్కొకమాటు తల్లడిలదె
జగతీప్రవర్తకు లగుచంద్రరవులకుఁ గలుగదె యొకమాటు గ్రహణభయము
తే. శక్రముఖదేవతలుకడుఁ జతురులయ్యు, మున్ను పెక్కువిధముల విపన్ను లగుచు
శోక మొందరె యాత్మీయసుఖము విడిచి, యిదియు లోకస్వభావ మై యొసఁగు నధిప.

వ. దేవా సమస్తభూతంబులు సర్వభూతాదిదేహి యగుసర్వేశ్వరునివశంబు నతిక్రమింపం జాలవు నీవు ప్రాకృతుండుంబోలె నై దేహినిం గూర్చి శోకింప నర్హుండవు గావు సమదర్శనులును విషాదరహితులు నగునీయట్టిమహానుభావు లెట్టికృచ్ఛ్రంబులం దైన శోకింపరు మహాప్రాజ్ఞు లగుపురుషులు సూక్ష్మబుద్ధియుక్తు లై శుభాశుభంబు లెఱుంగుదురు గావున నీవును బుద్ధిచేత నీదుఃఖంబునాచేత నెట్లు సంప్రాప్తం బయ్యె నని యథార్థజ్ఞానంబున విచారింపుము శాస్త్రైకసమధిగమ్యంబు లగుటవలనఁ గర్మంబులగుణదోషములు ప్రత్యక్షంబుగా విలోకించుట కశక్యంబులు గావునఁ దత్ఫలం బిట్టిదని నిశ్చయింప నలవిగాదట్టికర్మంబు లనుష్ఠింపకున్న సుఖదుఃఖంబులు గలుగనేరవు మున్నేను బుద్ధిమోహంబున దైన్యంబు నొందినప్పుడెల్ల బహుప్రకారంబుల ధర్మోపదేశంబునం దేర్చునట్టి నీవె వైక్లబ్యంబు నొందిన సాక్షాద్బృహస్పతి యైన నిన్నుం దేర్చుటకు సమర్థుండు గాఁడు మముబోంట్లఁ జెప్పనేల మహాప్రాజ్ఞుండ వై ననీబుద్ధి దేవతలకైన దుర్లభంబు శోకంబుచేత నంతర్హితం బైనభవదీయజ్ఞానంబుఁ బ్రబోధించెద వధార్హం బైనసాత్త్వికదేవగంధర్వాదిదివ్యప్రాణివర్గంబును బ్రాహ్మణాదిమనుష్యవర్గంబును సర్వలోకసంహారసమర్థం బైననిజపరాక్రమంబు నాలోచించి వధార్హు లగువారివధంబుకొఱకు సన్నద్ధుండవు గమ్ము సర్వజగత్సంహారంబునందు మన కయ్యెడి లాభం బెద్ది సీత నపహరించిన పాపాత్ముని నెఱింగి వానివధింపుమని బోధించిన నారఘువల్లభుండు సారగ్రాహి యగుటం జేసి మహాసారం

యైనలక్ష్మణునివాక్యం బంగీకరించి ప్రవృద్ధం బైనకోపం బుజ్జగించి చిత్రం బైనకోదండం బెక్కు డించి వెండియు లక్ష్మణున కిట్లనియె. 1192

ఆ. ఎందుఁ జోద మతివ నెచ్చట వెదకుద, మెట్లు పోవు వార మెద్ది తెఱఁగు
చెప్పు మనిన నతఁడు చేతులు మోడిచి, యిట్టు లనియె వినయ మెసక మెసఁగ.

ఉ. ఓ నరనాథవర్య యిటు లూరక చింతిల నేల యీజన
స్థానము ఘోరరాక్షసవితానము గావున నిందుఁ గల్గునా
నానగదుర్గకందరవనంబులఁ గిన్నరమందిరంబులన్
మానుగ నంతట న్వెదకి మానినిఁ గాంతము రాఘవోత్తమా. 1194

తే. అన్న మీఁబోటి బుద్ధిసంపన్ను లగుమహానుభావులు నాపదలందు మిగులఁ
గంప మొందరు వాయువేగంబుచేత, శైలములుఁబోలె ధృతధైర్యసారు లగుచు.

రాముఁడు ఖండితపక్షపాదుఁడై పడియున్న జటాయువుం గనుట.

వ. అని బుద్ధిమంతుం డగు లక్ష్మణుండు పలికిన నా రఘువల్లభుం డతనిం గూడి యధిజ్యధన్వుం డై క్షురాకారముఖం బైన శరంబు సంధించి యవ్వనంబున నెమకుచు నొక్కచోట రక్తసిక్తాంగుం డై పర్వతకూటంబుకరణి నేలం బడియున్న గృధ్రనాథుం డగు జటాయువుం జూచి యిద్ధరాత్ముండు నిక్కంబుగా నక్కమలగంధిం బట్టుకొని మెక్కి నరక్కసుండు తనమాయవలనఁ బక్షిరూపంబుఁ గైకొని యున్నవాఁడు నిశితంబు లైన ఘోరశరంబుల వీనిం దెగటార్చెద నని యలుక వొడమిన చిత్తంబునఁ దత్తఱించుచు నొక్క కత్తివాతియమ్ము చాపంబున సంధించి పుడమి నడంకునట్లుగా నారి మ్రోయించిన నన్నరశార్దూలుం జూచి పక్షీంద్రుండు భయంబు గొని సఫేనం బగు రుధిరంబు గ్రక్కుచు దీనవాక్యంబున నిట్లనియె 1196

తే. అధిప యోషధినట్ల నీ వడవిలోన
వరుస నెద్దాని వెదకుచు వచ్చి తట్టి
పరమసాధ్వి మహీజయుఁ బరఁగ నాదు
ప్రాణ ముభయంబు హృతమయ్యెఁ బరునిచేత. 1197

సీ. అవనీశ యేను జటాయువ గృధ్రనాథుండ నీవును లక్ష్మణుండు లేని
యెడ భవద్దేవిని గడువడి రావణుం డను నిశాచరుఁ డొక్కఁ డపహరించి
కొనిపోవుచుండ నేఁ గనుఁగొని యడ్డంబు వచ్చి యాకసమున వాఁడి మెఱసి
యుద్ధంబుఁ జేసి సముద్ధతి నఖతుండహతుల వానిశరీర మంత వ్రచ్చి

తే. రథముఁ బడఁ దన్ని రథ్యసారథులఁ జంపి
విలు దునిమి ఛత్రచామరంబులును జించి
యలసి తుది నిట్లు తన్నిశాతాసిలూన
పక్షపాదుఁడ నై నేలఁ బడినవాఁడ. 1198

వ. మహాత్మా మదీయనఖచంచుపుటపక్షంబులం దెగిపడినతదీయరథరథ్యసారథి
చ్ఛత్రచామరపతాకాధ్వజచాపప్రముఖపరికరంబుల నన్నింటి నవలోకింపు మి
త్తెఱంగున శత్రునిం దొడరి పోరి పోరి పరిశ్రాంతుండ నై ఱెక్కలు దెగి నేలం
గూలి యున్ననన్ను నీవును బడంపడి వధింపం బూనుట తగవే యని పలికిన
నారఘుసత్తముండు వాని జటాయువుఁగా నెఱింగి సీతావృత్తాంతశ్రవణంబున
ద్విగుణీకృతశోకతాపుం డై మహోపకారి యగుగృధ్రపతి డాయం బోయి
చాపంబుఁ బరిత్యజించి యతనిం గౌఁగిలించుకొని కొండొకసేపు కన్నీరు
మున్నీరుగా రోదనంబుఁ జేసి సంతాపవిశేషంబున నవశుం డై పుడమిం ద్రెళ్లి
యొక్కింతసేపునకుఁ గ్రమ్మఱ లబ్ధసంజ్ఞుం డై లతాకంటకసంకీర్ణం బగుటం జేసి
యెవ్వరికిం బ్రవేశింపరానియరణ్యప్రదేశంబున పరమదుఃఖితుం డై యసహా
యుం డై యతిప్రయత్నంబున నూర్పులు పుచ్చుచున్న జటాయువుం గని లక్ష్మణు
నవలోకించి యి ట్లనియె. 1199

రాముఁడు జటాయువుపా టెఱింగి దుఃఖించుట

సీ. మానదపూజ్యసామ్రాజ్యంబు పోవుట యటవీనివాస మి ట్లావహిలుట
పత్నీవియోగంబు ప్రాప్తించుటయుఁ బితృసఖుఁడు జటాయువు చచ్చుటయును
లోకంబులో నిట్టిశోకంబు లెవ్వాని కై నను గలవె లో నరసి చూడ
నాయభాగ్యం బే మనంగ వచ్చు సమస్తవస్తుదాహకుఁ డగువహ్ని నైన
తే. నీఱు గాపింప నోపు పత్నీవియోగ, జనితతాపంబు వాయ నేసలిలరాశిఁ
బడుదు నన్న మదీయదౌర్భాగ్యమహిమఁ, జేసి యదియునుజాల శోషించిపోవు.
తే. జనవరకుమార నాచే ససహ్యమైన, వ్యసన మిబ్భంగి సంప్రాప్త మగుటవలనఁ
బరఁగ నాకంటె నన్యుఁ డభాగ్యతరుఁడు, వసుధలోఁ జూడ నింక నెవ్వాఁడు లేఁడు.
క. ప్రియుఁడు పితృసఖుఁడు వృద్ధుఁడు, నయజ్ఞుఁ డీగృధ్రవిభుఁడు నాభాగ్య విప
ర్యయమున విలూనపక్షద్వయుఁ డై ధరఁ గూలి యున్నవాఁడు కుమారా.
క. అని పలికి విభుఁడు శోకము, మనమున సైరించుటకు సమర్థత లేమిన్
జనకజ యెక్కడఁ జెపుమా, యని ధరణిం బడియెఁ జిత్తమువశత నొందన్.
వ. ఇట్లు శోకమూర్ఛాపరవశుం డై కొండొకసేపునకుఁ దెలి వొంది వెండియు సౌ
మిత్త్రి కి ట్లనియె. 1204
ఉ. ఈపతగోత్తముండు మన కెంతయుఁ బ్రీతి యొనర్పఁ బూని తా
నేపునఁ బోరి పోరి తుది నిట్లు విలూనపతత్రపాదుఁ డై
యాపృథివీతనూజవిధ మర్మిలిఁ జెప్పఁగఁ బ్రాణసంయుతుం
డై పడి యున్నవాఁ డిట మదాస్యనిరీక్షణకౌతుకంబునన్. 205
వ. అని పలికి జటాయువు నవలోకించి. 1206
సీ. అండజోత్తము రావణుండు జానకి నెట్లు వంచించి గొనిపోయె వాని కేమి

వి ప్రకారంబుఁ గావించితి నేఁగూపువాఁ డెంత శౌర్యంబువాఁడు వాని
పట్టణం బెక్కడ బల మెంత చల మెంత కుల మెంత దోశ్శక్తి కొలఁది యెంత
గలవాఁడు నిన్ను సంగ్రామతలంబున నేరీతి నిర్జించె నెచటి కేగెఁ

ఆ. జెప్ప నలవి యేని చెప్పుము జానకీ, వసితవార్త నీదువధవిధంబు
నావుడుం బతత్త్రినాథుండు సన్నవు, టెలుఁగుతోడ విభున కిట్టు లనియె. 1207

—జటాయువు, రామునకు రావణుండు సీత నెత్తికొని పోయినతెఱం గెఱింగించుట.—

చ. జనవర రావణుం డనునిశాచరనాథుఁడు బల్మి జానకిం
గొని గగనంబునం జనుచు ఘోరతరంబుగఁ దాఁకి యడ్డమై
యని యొనరించి బిట్టలసి నట్టిచుదీయపతత్త్రముఁ ద్రయం
బున నసిధారచే నఱికి పోయె నగస్త్యదిగున్ముఖంబుగన్. 1208

తే. అనఘచారిత్ర యేను జరాన్వితుండ, నగుటవలన రణోర్వి బిట్టలసియుండ
వాతదుర్దినసంకులావార్యమాయ, నలమి నన్నిట్లు చేసి దశాస్యుఁ డరిగె.

వ దేవా ప్రాణంబులు పరిక్షీణంబు లయ్యె దృష్టి చలించుచున్నది యలంకృతాగ్రంబులైన సువర్ణవృక్షంబులు విలోకించుచున్నవాఁడ రావణుం డేముహూర్తంబున జానకి నపహరించి గొని చనియె నమ్ముహూర్తంబు విజయనామకంబగు ముహూర్తంబునందు నష్టంబైనద్ధనంబు విభునిచేతఁ గ్రమ్మఱ లబ్ధంబగు నని శాస్త్రప్రమాణంబు గలదు రావణుండు సీతామోహితుం డగుట నది యెఱుంగఁడు 1210

తే. పూని బడిశంబు మ్రింగినమీనముగతి, ననఘ జానకి నపహరించినఖలుండు
శీఘ్రమునఁ జచ్చు నీకింతచింత యేల, పగతుఁ జంపి సుఖించెదు పడఁతిఁ గూడి.

—జటాయువు మృతుం డగుట.—

వ. మహాత్మా నీకుం జెప్పఁ గలయంత చెప్పితి నింక నీతోడ సంభాషింపం జాల రావణుని విశ్రవునకుఁ దనయునిఁగాఁ గుబేరునికిఁ దమ్మునిఁగా నెఱుంగు మని యిట్లు భ్రాంతిహీనుండై యుత్తరం బిచ్చుచుండ నప్పుడు సామిషం బగు రుధిరంబు జటాయువువదనంబున నుండి నిర్గమించెఁ బదంపడి గృధ్రపతి శరీరంబు విడిచి ప్రాణంబులు గగనంబున కుద్గమించె నిట్లు దుర్లభంబులైన ప్రాణంబులు విడిచి శిరంబు ధరణిం బడ వైచి తత్క్షణంబ సంప్రాప్తమరణుం డయ్యె నిట్లు పంచత్వంబు నొందినగృధ్రపతిం జూచి పరమదుఃఖాక్రాంతచిత్తుండై రాముండు లక్ష్మణున కిట్లనియె. 1212

మ. చిరకాలంబుననుండి యీవనములో జీవించుచు న్బల్మిచే
నరుదార న్విహరించునీపతగవంశశ్రేష్ఠుఁడు న్నేఁడు నా
కొఱకుం గ్రూరనిశాచరాధమునిచే ఘోరాజిలోఁ జచ్చె ని
ద్ధరలో నిట్టిపరోపకారమృతి యుక్తంబే కదా యేరికిన్. 1213

ఉ. ఎక్కడఁ బట్టణంబు మన కెక్కడఁ బూని యరణ్యసీమకుం
దక్కక వచ్చు టెక్కడఁ బదంపడి సీత నిశాటు చేతిలోఁ
జిక్కుట యెక్కడన్ విహగశేఖరుఁ డీగతి నాజి వానిచే
నిక్కడఁ జచ్చు టెక్కడ హ యేమన వచ్చును దైవతంత్రమున్. 1214

తే. పెద్దకాలంబు జీవించి పిదప నిట్లు, నాకొఱకు నీవిహంగమనాయకునకు
నీవనంబున ననుజూచేఁ జావవలసెఁ, గాలము దురత్యయం బెంతఘనునకైన.

రాముఁడు జటాయువునకు దహనాది సంస్కారంబులఁ గావించుట.

వ. మఱియుఁ బితృపైతామహం బైనగృధ్రరాజ్యంబుఁ బరిత్యజించి మత్కృతంబునం బ్రాణంబులు విడిచెఁ దిర్యగ్యోనిగతులయం దైనను సాధువులును శూరులును ధర్మాత్ములును శరణ్యులు నగువార లిత్తెఱంగునం జూపట్టు చుందురు సీతావియోగదుఃఖంబునకంటె జటాయుర్మరణదుఃఖం బధికం బై యున్నది యమ్మహాయశుండు దశరథుండునుంబోలె మనకుఁ బూజనీయుండు గావున నితని సంస్కరించుటకుఁ గాష్ఠంబులఁ దెమ్మనిన నతం డట్లు కావింప నారఘువల్లభుండు పావకునిం బ్రణయించి యప్పతంగపుంగవునికళేబరంబు చితామధ్యంబునం బెట్టి యజ్ఞశీలురును నాహితాగ్నులును భూదానపరులును మొదలుగాఁగల పుణ్యాత్ములలోకంబు లన్నియుఁ గ్రమంబున నతిక్రమించి నాచేత సంస్కృతుండవై యనుజ్ఞవడసి పునరావృత్తిరహితు లైననిత్యముక్తులకుఁ బరమప్రాప్యం బైన వైకుంఠాఖ్యలోకంబునకుం జని యందు నిత్యనిరతిశయానందం బనుభవించుచుండు మని పలికి స్వబంధువునకుంబోలె దుఃఖించుచు జటాయువునకు మంత్రపూర్వకంబుగా నగ్నిసంస్కారంబుఁ గావించి యనంతరంబ వనంబునం జని యందు మహామృగంబుల వధించి దర్భాస్తరంబునం దిడి తన్మాంసంబులు పిండంబులుగాఁ గావించి హరితశాద్వలంబునందు జటాయువుకొఱకుఁ బిండప్రదానంబుఁ గావించి మృతుం డైనమనుజునకే మంత్రజాతంబు స్వర్గప్రాపకం బని బ్రాహ్మణులు నొడివి రట్టినారాయణసూక్త యామ్యసూక్తాదికంబు జపించి గోదావరికిం జని యందు లక్ష్మణసహితంబుగా సుస్నాతుం డై శాస్త్రదృష్టం బైనవిధిచేత జటాయువునకు సలిలక్రియలు గావించె నిట్లుమహర్షికల్పుం డైన రామునిచేత సంస్కృతుం డై యప్పతంగకులపుంగవుండు నిత్యం బైనపరమ గతికిం జనియె నిత్తెఱంగున నారఘుసత్తములు జటాయువునకుం బుణ్యలోకంబులు కల్పించి యనంతరంబ సీతాన్వేషణతత్పరు లై యచ్చోటు వాసి విష్ణువాసవులపగిది మహావనంబుఁ బ్రవేశించి యొక్కింత దూరంబు వరుణదిశాభిముఖంబుగా నరిగి క్రమ్మఱ దక్షిణంబునకుం దిరిగి పోవుచు. 1216

సీ. చండదంతావళతుండాగ్రవిదళితచటులతాలతమాలసాలచయము
కరికుంభమాంసభక్షణమత్తమృగరాజఘోషణఘూర్ణితకుంజపుంజ

మతులితభూరినిద్రాసక్తశార్దూలబృందసందీపితకందరంబు
గహనగోచరచరదస్మహిమనూకరయూథకర్దమీకృతనిమ్నగాచయంబు
తే. శల్యభల్లూకసారంగచమరసృమర, గోధికాసరఖడ్గస్రఘూర్ణితంబు
నగుమహారణ్యపదమున నర్కవంశవర్యు లరిగిరి కోదండపాణు లగుచు. 1217

వ. ఇత్తెఱంగునఁ గ్రోశత్రయమాత్రదూరం బతిక్రమించి యవ్వల. 1218

క. నానాఖగమృగయుక్తము, నానావ్యాధాన్వితము ఘనప్రఖ్యము స
న్మానిత మగుక్రౌంచం బను, కాననమునఁ జనిరి భూరికార్ముకధరులై. 1219

వ. ఇట్లమ్మహారణ్యంబున నర్ధయోజనదూరం బరిగి యంతనంత వైదేహి నన్వేషించుచు నక్కాననంబు గడిచి యవ్వల మతంగాశ్రమసమీపంబునం బొల్చు ఘోరారణ్యంబుఁ బ్రవేశించి యపరిక్షుణ్ణమార్గంబునఁ బోవుచుఁ దన్మధ్యదేశంబున. 1220

తే. కటికచీఁకటికతమునఁ గానరాక, మహీతపాతాళలోకసమాన మగుచుఁ
గ్రాలుగంభీర మగునొక్కగహ్వరంబు, పోలఁ జూచి తదంతికభూమియందు.

లక్ష్మణుండు తన్ను మోహించిన రాక్షసి కర్ణనాసికాస్తనముల ఖండించుట.

చ. వికటను ఘోరరూపిణి వివేకవిహీనను ముక్తమూర్ధజన్
వికృతముఖిం గరాళను బ్రవృత్తహరిద్విపమాంసభక్షణం
గ్రకచసమానదంష్ట్ర నురుకాయను దుస్త్వచ నుగ్రనేత్ర నం
దొకబలురక్కసిం గని తదున్నతి కచ్చెరు వొందు చుండఁగన్. 1222

తే. అది రయంబునఁ జనుదెంచి యన్నమోల, నున్నలక్ష్మణుఁ గౌఁగిట నొత్తిపట్టి
యాలిఁగా నన్ను వరియించి యచలకూట, సానువులయందు సంక్రీడసలుపుమిచట.

చ. అన విని లక్ష్మణుండు కుపితాత్మకుఁడై వెస శాతఖడ్గముం
గొని కుచకర్ణనాసికముఁ గోసిన మేఘముభంగి నార్చుచున్
దనుజ భయంబు మైఁ బఱచె దారుణవైఖరి నంతరాజనం
దను లతిదుర్గకాననపదంబునఁ బోవుచు నుండ నంతటన్. 1224

ఉ. అన్నను జూచి లక్ష్మణుఁడు ప్రాంజలియై సుమృదూక్తిఁ బల్కు నో
సన్నుతశీల మద్విపులసవ్యభుజంబు చలించెఁ జిత్త మా
పన్నత నొందెడు న్మఱియు భవ్యనిమిత్తము లెల్లఁ దోఁచెడుం
బన్నుగ వంజుళాఖ్య మగుపక్షి జయావహభంగిఁ గూసెడిన్. 1225

వ. కావున మనకు ముందఱ నొక్కయసహ్యంబైనభయంబు గలుగుఁ బదంపడి మిఱి వెట్టరానిశుభంబు దొరకొను దానిం బరామర్శింపవలయు నని పలికిన నతనిపలుకు విని రఘువల్లభుం డది యెట్లొకో యని విచారించుచుం బోవునెడ. 1226

తే. అడవిఁగలభూరుహము లెల్లఁ బుడమిఁజూప, కట్లువడఁగదుమారంపుగాలివిసరెఁ
గోటిపిడుగులమోఁతకు సాటియగుచు, విపులశబ్దంబుఘోరమై వినఁగఁబడియె.

వ. మఱియును. 1228

రామలక్ష్మణులు కబంధుని బాహుపాశమునఁ జిక్కుపడుట.

సీ. పొడవు దేహమువాఁడు వెడఁదవక్షమువాఁడు వ్యపగతగళశీర్షుఁ డైనవాఁడు
నిశితంబు లగురోమనిచయంబు గలవాఁడు కడుపున బలుమోముగలుగువాఁడు
నురునగేంద్రమువోడ్కి నున్నతుండగువాఁడు కాలమేఘముభంగిఁ గ్రాలువాఁడు
నీలజీమూతంబు లీల గర్జిలువాఁడు భయదాట్టహాససంభ్రమమువాఁడు
తే. పింగపక్షంబువృత్తంబు భీషణాగ్ని, కణచయోన్మేష మగునొక్క కన్నురమునఁ
బరఁగ నొప్పెడువాఁడు కబంధుఁ డనెడు, కఠినరాక్షసుఁ డొక్కఁడు గానఁబడియె.

వ. మఱియు నారాక్షసుండు యోజనప్రమాణాయామంబు గలతనబాహువులు సాఁచి లోఁబడినసింహవ్యాఘ్రతరక్షుభల్లూకవరాహాదివనమృగంబుల భక్షించుచు మత్తుం డై నిలిచియుండ వానిబాహువులనడుమఁ జిక్కి వెడల నుపాయంబులేక క్రోశమాత్రం బరిగి సమీపస్థు లగుటయు వాఁడు బలాత్కారంబున బాహుపాశంబుల నమ్మహాత్ముల నాకర్షించిన వారు కబంధబాహుపీడితులై వివశత్వంబు నొంది రందు రాముండు శూరాగ్రేసరుండు గావున నొకింత ధైర్యం బవలంబించి వ్యథితుండు గాక యుండె నప్పుడు లక్ష్మణుండు విషణ్ణుం డై యన్న కిట్లనియె. 1230

సీ. మనుజనాయక యేను దనుజునిచేఁ జిక్కి వివశుండ నైతి నన్నీవి కింక
బలిగా సమర్పించి ప్రాణము ల్దక్కించుకొని నీవు తొలఁగి పొమ్మనఘచరిత
యటు లైన వైదేహి నల్పకాలంబునఁ బొంది పిత్ర్యం బైనపూజ్యరాజ్య
మేలెద వప్పుడు నన్నెలమి మనంబునఁ గడు సంస్మరింపుము కరుణఁజేసి
తే. యనఁగ నారాముఁ డింతభయంబు దగునె
యనుచుఁ దమ్ముని బోధించె నంతలోనఁ
గ్రూరుఁ డగురాక్షసుఁడు ఘనఘోషణమున
నమ్మహాత్ములతోడ ని ట్లనుచుఁ బలికె. 1231

ఉ. ఎవ్వరు మీర లీవనికి నేటికి వచ్చితి రిస్సహావనం
బెవ్వరు చూడఁగా వెఱతు రింతకు దైవము దెచ్చె మిమ్ము మీ
క్రొవ్వడఁగంగఁ బట్టుకొని గొబ్బున మ్రింగెద జీవితంబుతో
నెవ్విధి మీకు నొండుకడ కేగఁగ వచ్చు నిఁక న్రయోద్ధతిన్. 1232

రాముఁడు కబంధుబాహువులఁ జిక్కుపడుటకు దుఃఖించుట.

ఉ. నా విని రాఘవుండు వదనంబున దైన్యము దోఁపఁగా సుమి
త్రావరపుత్రుతో ననియెఁ దమ్ముఁడ దుఃఖముమీఁద దుఃఖ మి
క్కైవడి నుత్తరోత్తరము గాఢతరంబుగఁ గాననంబులో
జీవితహాని గల్గునటు చేకుఱుచున్నది యేమి సేయుదున్. 1233

తే. కాల మెంతటిఘను లైనఁ గడవఁ జాల, రనఘ పౌరుష మెల్ల నిరర్థకంబు
గాన నిన్నును నన్ను నిక్కాలమందు, దైవ మాపన్నులఁగఁ జేసెఁ దలఁపు లేల.

వ. వత్సా సర్వభూతంబులలోనఁ గాలంబునకే మహావీర్యంబు గల దక్కాలంబునకు సర్వభూతసంహారంబు ప్రయాససాధ్యంబు గాదు సులభసాధ్యం బై యుండు. 1235

తే. ఎంత బలవంతు లైనఁ దా రెంత శూరు, లైన నెంతకృతాస్త్రకు లైనమనుజు
లవని వాలుకసేతువు లట్ల వెస న,శింపుదురు కాలవశమునఁ జేసి వత్స. 1236

వ. అని యిట్లు పెక్కుచందంబులఁ దనదురవస్థకుం బొక్కుచు దృఢసత్యవిక్రముండును మహాయశుండును బ్రతాపవంతుండు నగులాముండు సముదగ్రపౌరుషుం డగుసౌమిత్రి నవలోకించి తనచిత్తంబు స్థైర్యయుక్తంబుఁ గావించుకొని యుండె నప్పుడా కబంధుండు నిజబాహుపాశపరిక్షిప్తు లయిన దాశరథులం జూచి దైవవశంబునం జేసి మీరు క్షుధార్తుండ నైన నా బాహువులం జిక్కితిరిం కేఁ దడ వేల నాకు నాహారంబు గం డనవుడు సుమిత్రానందనుండు పరమార్తుం డయ్యును ధైర్యంబుకలిమి విక్రమంబునందుఁ గృతనిశ్చయుం డై రామున కిట్లనియె. 1237

లక్ష్మణుఁడు రామునితోఁ గబంధుబాహువుల ఖండింపవలయు ననుట

మ. అనఘా వీఁడు దురాత్మకుండు గురుబాహాసత్త్వయుక్తుండు లో
కని కాయంబుల నొక్కటం గడఁగి మ్రింగం జాలువాఁ డింక నొ
క్కనిమేషం బెడఁ జేసి తేని మనల న్గర్వోద్ధతి న్మ్రింగు న
ప్పనికిం బూనక మున్నె వీనిభుజముల్ భద్రాసి ఖండింపుమా. 1238

వ. దేవా యాగబాహ్యంబు లైనపశువుల వధించినవారికిం బోలె నకృతపరాక్రము లైనవారి వధించినవారికిఁ బాపంబు గలుగుం గాని యిట్టిదురాత్మునిం జంపినవారికిఁ బాపంబు లేదు గావున నాలస్యంబు సేయక వీనికరంబులు ఖండింపుము. 1239

తే. అనుచు లక్ష్మణుఁ డన్నతో నాడుమాట
విని కబంధుఁడు కోపప్రవిష్టుఁ డగుచు
ఘోరపాతాళనిభ మైన నోరు దెఱచి
యనముతో మ్రింగ గమకించునంతలోన. 1240

వ. దేశకాలజ్ఞు లగునమ్మహాపురుషులు నిశితంబు లైనకృపాణంబు లంకించి. 1241

తే. దనుజుదక్షిణబాహువుఁ దునిమె రాముఁ, డంతఁ దోడ్తోడ సౌమిత్రి యనురుసవ్య
కరముదునియంగ నేసె నీగతి నికృత్త, బాహుఁడై వాఁడు రోఁజుచుఁ బడియె నపుడు.

వ. ఇట్లు కబంధుండు విలూనబాహుండై నెత్తుటం దోఁగి జలదంబు మాడ్కిఁ బుడ

మఱియు గగనంబు దిక్కులుం బగుల నార్చుచు మహీతలంబునం ద్రెళ్లి దీనుం డై
మీ రెవ్వ రని యడిగిన నద్దానవునకు లక్ష్మణుం డి ట్లనియె. 1243

ఆ. ఇమ్మహానుభావుఁ డిక్ష్వాకుదాయాదుఁ, డనఘమూర్తి రాముఁ డనఁగ నొప్పు
నేను లక్ష్మణుండ నితనికిఁ దమ్ముఁడ, నెపుడు భ్రాతృభక్తి నెసఁగువాఁడ. 1244

ఆ. అంబచేత రాజ్య మపహృత మగుచుండఁ, బత్నితోడఁ గూడి భానుకులుఁడు
మత్సమేతుఁ డగుచు మహితాటవికి వచ్చి, యొక్కచో వసించి యుండు నంత.

క. మ్రుచ్చిలి రక్కసుఁ డొక్కఁడు, సచ్చరితుని రామవిభునిసతిఁ గొని పోయెం
జెచ్చెర నద్దేవిని మే, మిచ్చట శోధించువార మెంతయుఁ గడఁకన్. 1246

—— కబంధుఁడు రామలక్ష్మణులకుఁ దనచరిత్రం బెఱింగించుట. ——

వ. మా కెఱుం గిట్టిది నీ వెవ్వండ వేమికారణంబున భగ్నజంఘుండ వై యురం
బున ముఖంబు గలిగి కబంధసదృశుండ వై యివ్వనంబునం జరియించెద వని
యడిగిన నారక్కసుండు పరమప్రీతుం డై యింద్రవచనంబుఁ దలంచి లక్ష్మణున
కి ట్లనియె. 1247

సీ. అనఘాత్మ నాభాగ్యమున మిమ్ముఁ బొడఁగంటిఁ బరమకోపమునఁ గృపాణధారఁ
గరములఁ ద్రుంచినకారణంబున నాదువెత లెల్లఁ బాసె నీవికృతరూప
మేను బూనుట కైన హేతువుఁ జెప్పెద విను తొల్లి యసమానవిక్రమమున
సూర్యపురందరసోములచందాన దివ్యరూపముఁ దాల్చి త్రిభువనమున

తే. సంచరించుచు బలగర్వసంభ్రమమున, లోకభీకర మీరూపు వీఁకతోడఁ
దాల్చి వనవాసరతులగు తాపసులకు, నురుభయముపుట్టఁదిరుగుచు నొక్కనాఁడు.

వ. స్థూలశిరుం డనుమునిపతి వెఱపింపం బోయిన ఘోరశాపభాషణశీలుం డై యమ్మ
హాత్ముండు కోపించి లోకవిగర్హితంబును ఘాతుకంబును నైనయిట్టివికృతరూపంబున
నన్నుఁదిరస్కరింపవచ్చితివి గావున నీరూపంబున నయుండుమని ఘోరంబగు శాపం
బిచ్చిన నేను భయంబుఁ గొని కరంబులు మోడ్చి శాపమోక్షణం బనుగ్రహింపు
మని ప్రార్థించిన నత్తాపసోత్తముండు దయాళుం డై యిక్ష్వాకునాథుం డగు రాముం
డెప్పుడు విజనం బైనవనంబున నీభుజంబులు ఖండించి నీశరీరంబు దహించు
నప్పు డీవికృతరూపంబు విడిచి శుభం బైనపూర్వరూపంబుఁ గైకొనియెద వని
యానతిచ్చె నన్ను దనుపుత్త్రునిఁ గా నెఱుంగు మదియునుం గాక యీవికృతా
కారంబు గలుగుట కింద్రకోపంబుం గారణం బై యుండు నదియునుం గొంత
యెఱింగించెద వినుము. 1249

క. ఏ నుగ్రతపంబునఁ జతు, రాననుముదితాత్ముఁ జేసి యవ్విభుచేత
న్నానుగ దీర్ఘాయువు స, న్మానంబునఁ బడసి దురభిమానము పేర్మిన్. 1250

వ. పురందరుండు న న్నేమి సేయం గలఁ డని తిరస్కరించి యతనితో రణంబుఁ
గావించిన నద్దేవతావల్లభుం డలిగి శతపర్వం బైనవజ్రంబుఁ బ్రయోగించిన నయ్య

మోఘాయుధప్రభావంబున మదీయకంఠంబును నూరువులును శరీరంబు సొచ్చె శక్రుండు నాచేతఁ బ్రార్థితుం డై విరించివచనంబుఁ దలంచి నాకు మృతి లేకుండఁ బ్రసాదించె నంత నేను భగ్నస్కంధశిరోముఖుండ నై యాహారంబు లేక బహుకాలం బెట్లు జీవింతు ననిన నయ్యింద్రుండు యోజనాయతంబు లైన బాహువు లొసంగి తీక్ష్ణదంష్ట్రాకరాళయుక్తం బైనముఖంబు కుక్షియందుఁ గలుగునట్లుగా సంఘటించి నీవు కాంతారంబుఁ బ్రవేశించి సింహద్వీపవరాహవ్యాఘ్రంబుల నాకర్షించి భక్షించు చుండుము కొంతకాలంబునకు రాముండు లక్ష్మణయుతుం డై వచ్చి నిశితకృపాణంబుల నీబాహువులు ఖండించు నప్పుడే వికృతరూపంబుఁ బాసి నాకంబునకుం జనుదెంచెద వని యాదేశించె నాఁటం గోలె నేను వికృతదేహత్వాగకృతోద్యోగుండనై భవదాగమనంబుఁ గోరుచు నివ్వనంబుఁ బ్రవేశించి యిది భక్ష్యంబిది యభక్ష్యంబని విచారింపక బాహువులకుం జిక్కినసత్వంబుల నెల్ల నాకర్షించి భక్షించుచుం జరియించుచున్నవాఁడ మునిశక్రులచేతఁ బలుకంబడినచందంబున నారామభద్రుండ వీవె యనియెఱింగితి నీవు దక్క నన్యుండు నన్ను జయించుటకు శక్తుండు గాఁడు మీరు మహానుభావుల రగుటంజేసి నన్నుం గృతార్థునిం జేయుటకు నిచ్చటికిం జనుదెంచి మదీయభుజంబులు తునియ నేసితి రేను మీతోడ సాచివ్యంబుఁ జేసి కార్యసిద్ధి వడయుటకుఁ దగినమిత్రుని నెఱింగించెద ననిన నతనివచనంబులు విని రాముండు లక్ష్మణుండు విను చుండ వాని కిట్లనియె. 1251

ఉ. తమ్ముఁడు నేనుఁ గాననపదంబున దూరము పోయి యుండఁ జా
ర్వమ్మున జానకి న్బలిమి రావణుఁ డాఁచికొనెం దదీయనా
మమ్మును దక్క జూపమహిమంబులు వాస మెఱుంగఁ దత్ప్రకా
ర మ్మెఱిఁగించి మమ్ము సుకరమ్ముగ క్షేమము నొందఁ జేయుమా. 1252

క. శోకార్తుల మై దిక్కఱి, తేఁకువ సెడి యివ్విధమునఁ ద్రిమ్మరుమమ్ముం
జేకొని కారుణ్యముతో, భూకన్యకవార్తఁ దెలిపి ప్రోవుము దనుజా. 1253

తే. సత్వంబుగ శుష్కకాష్ఠములచేత, నిను దహించెద మట్లైన ననిమిషత్వ
మొందెదవు మది సందియ ముంద వలవ, దెఱిఁగి తేనియు జానకి తెఱఁగుఁ జెపుము.

వ. అనినఁ గబంధుండు రామున కిట్లనియె. 1255

శా. అజ్ఞానాకృతి నుంటఁ జేసి రఘునన్యా శాపదోషంబున
న్విజ్ఞానం బది లేదు గావున సతీవృత్తాంతముం జెప్పఁగాఁ
బ్రజ్ఞాధిక్యము లేదు యీతనువుఁ గాల్పం బిమ్మట న్భూరిది
వ్యజ్ఞానంబునఁ జూచి చెప్పెద మహాత్మా యట్లు గావింపవే. 1256

రామలక్ష్మణులు కబంధునికళేబరంబు దహించుట.

వ. మఱియు సూర్యుండు చరమశిఖరిశిఖరాంతర్గతుండు గాక మున్నె మదీయశరీరం బవటంబున నిక్షేపించి విధిప్రకారంబున దహింపు మట్లైన సీతావృత్తాంతంబును రాక్షసునిచందంబును వానిం బరిమార్చుటకు సఖ్యంబు సేయం దగిన వీరోత్తము నెఱింగించెద నాచేత బేర్కొనంబడినవానితోడ నీవు న్యాయవృత్తంబున సఖ్యంబుఁ గావింపు మతండు నీకు సాహాయ్యం బాచరించు ముల్లోకంబులయందు నతనికి విదితంబు గాని యర్థం బొక్కింతైన లే దతండు మున్నొక్కకారణంబున ముజ్జగంబులం జరించి యున్నవాఁ డని పలికిన నట్లకాక యని రఘువల్లభుండు లక్ష్మణుం జూచి యీరాక్షసునికళేబరంబు దహింపు మనిన నతండు సమీపంబునఁ గుంజరంబుచేత భగ్నంబులైన శుష్కకాష్ఠంబులొక్కబిలంబులోనఁ గొండపాడువునం గుట్టవైచి దానిమీఁద ఘృతపిండోపమం బైన కబంధునికళేబరంబుఁ బెట్టి యనలు దరికొల్పిన నయ్యగ్నిదేవుండు మేదఃపూర్ణం బగుటవలన వానిమహాకళేబరంబు మందంబుగాఁ గొండొకసేపునకు నిశ్శేషంబుగా దహించె నంతఁ గబంధుం డవికృతరూపంబు విడిచి దివ్యరూపధరుం డై యచ్చితామధ్యంబుననుండి గగనంబున కెగసి దివ్యమాల్యోపశోభితుండును దివ్యగంధాధివాసితుండును విరజోంబరధరుండును సర్వప్రత్యంగభూషణుండు నై సూర్యనిభంగి వెలుంగు చున్నహంసయుక్తం బగు దేవయానంబునం గూర్చుండి నిజతేజోజాలంబున దశదిశలు వెలుంగం జేయుచు నంతరిక్షంబున నుండి రామున కిట్లనియె 1257

కబంధుఁడు దివ్యరూపముఁ దాల్చి రామునితో సుగ్రీవసఖ్యము సేయుమని బోధించుట

సీ. భూమీశ యేగుణంబులచేత నీసర్వవస్తుజాతం బనవరత మ్ముర్వి
నతివిచారిత మగు నట్టిసంధియు విగ్రహంబు యానం బాసనంబు నాశ్ర
యంబు ద్వైధీభావ మనుగుణంబులు గల వఱియంగ దురవస్థ నధిగమించి
నట్టిమర్త్యుఁడు తనయట్టులే దురవస్థ నొందినవానిచే నుత్సుకముగ

తే. సేవ్యుఁ డగు దారధర్షణజవ్యసనము, నధిగమించుటకతన మహానుభావ
యనుజయుతముగ నీవు హైన్యంబునొంది, యధికదుర్దశాపన్నుండ వైతి విపుడు.

వ. కావున నవశ్యంబు సమానావస్థాపన్నుం డైనవానితో మైత్రి సేయుట యుక్తం బట్లు సేయనినాఁడు కార్యసిద్ధి దొరకొన దట్టివాని నెఱింగించెద వినుము.

సీ. అనిమిషపతిపుత్త్రుఁ డగువాలి క్రుద్ధుఁడై దయమాలి తనుఁ బ్రోలు దాఁట ననుప
నతనితమ్ముఁడు మహాచతురుండు సుగ్రీవుఁ డనువానరశ్రేష్ఠుఁ డధికభీతిఁ
బంపాసరోవరపర్యంతశోభితం బగు ఋష్యమూకాచలాగ్రమందు
సచివచతుష్టయసహితుఁ డై వసియించి యున్నవాఁ డతఁడు శూరోత్తముండు

తే. సత్యసంధుండు విక్రమశాలి సకల, కార్యవిదుఁడు కృతజ్ఞుం డకల్మషుండు
వానితో నెయ్య మొనరించి తేని నీదు, కార్య మంతయు సాధింపఁగలఁ డధీశ.

వ. మఱియు నతండు ప్రతాపవంతుండును నమితప్రభుండును ద్యుతిమంతుండును వినీతుండును మతిమంతుండును మహాబలపరాక్రముండును బ్రగల్భుండును సమర్థుండు నై యుండు. 1261

ఆ. మానవంతు లైనసముబోఁటి యధికులు, హీనజాతిమైత్రి నెసఁగుబెట్టు
లనఁగ వలదు కారణాంతర మదియు దు,ష్కరము గాదె జగతిఁ గాలసరణి.

చ. అతిబలవంతుఁ డైనప్లవగాధిపునిం గన నేగి వానితో
నతిహితబుద్ధి మైత్రి వినయంబునఁ జేయుము వేగ పొమ్ము నీ
వతఁడు కృతజ్ఞుఁ డాప్తుఁడు బలాఢ్యుఁడు దక్షుఁడు నీదుకార్య మం
చితగతిఁ జక్కఁ జేయు నృపశేఖర నెవ్వగ దక్కు నెమ్మదిన్. 1263

చ. మఱియు నతండు వైరికులమర్దనదక్షుఁడు కామరూపి వా
నరవరుఁడు స్నహాయము మనంబునఁ గోరెడువాఁడు గావునం
గర మనురక్తి మీకు నుపకారము సేయఁ గలండు మీరునుం
బరమకృపాప్తి వానివెతఁ బాయఁగఁ జేయుఁడు సత్య మేర్పడన్. 1264

క. సిరి పోవుట కాననమునఁ, జరియించుట మొదలు గాఁగ సర్వావస్థ
ల్నరవర యతనికి నీకును, సరి యై యున్నయవి చూడ జతనము లగుచున్.

క. కావున మీ రన్యోన్యము, పావకసన్నిధిని మైత్రిఁ బ్రకటించి సుసం
భావితు లై ప్రావుగ నయ, కోవిద కార్యములు దీర్చుకొనుఁ డుచితగతిన్.

వ. దేవా యుత్తమచరశ్రేష్ఠుండు క్షీణదశాయుక్తుం డైనను హితాన్వేషణంబునందు శక్తుం డై యుండు నతండు కృతార్థుం డైనఁ గాకున్న భవచ్చికీర్షితకార్యం బవశ్యంబు గావించు నతండు సూర్యునకౌరసుండు ఋక్షజునకు క్షేత్రజుండు వాలిచేతఁ గృతకిల్బిషుం డగుటవలన శంకితుం డై పంపాతీరంబునం జరించు చుండు నాయుధంబు వహ్నిసమీపంబునం బెట్టి సత్యంబున నతని వయస్యునిం గాఁ బరిగ్రహింపు మతండు లోకంబునందు రాక్షసస్థానంబు లెన్ని గల వన్నియు నైపుణ్యంబున శోధింపం గలండు గావున. 1267

సీ. నరనాథ భాస్కరకిరణసంచారంబు గలయంతధరణిలోఁ గపికులేంద్రుఁ
డెఱుఁగని దేశ మొకిం తైన లేదట్లు చూపింపఁగాఁ గామరూపు లైన
కపుల నద్దెసలకు కడఁకతోఁ బనిచి నదీశైలదుర్గప్రదేశములును
వెదకించి రావణు వీటిలోపల నుప్పఁగనకాచలాగ్రభాగమున నున్న

తే. వేచి పాతాళతలమున దాఁచి యున్న, రాక్షసులనెల్లఁ దెగటార్చి రమణితోడ
జానకిని దోడి తెచ్చి ప్రసన్నభక్తి, నీకు నర్పించు మనమున నెగులు వలదు.

వ. అని సీతాప్రాపణంబునందు రామునకుఁ దగినయుపాయం బెఱింగించి యర్థజ్ఞుం
డగు కబంధుండు వెండియు నిట్లనియె. 1269

కబంధుఁడు రామలక్ష్మణులకు సుగ్రీవునికడ కేగుటకు మార్గముఁ జూపుట.

క. ఇదిగో మార్గము క్షేమా, స్పదమై పశ్చిమము మిగిలి సకలద్రుమసం
పదలం బొలుపొందుచు నున్నది కంటకశిలలచేత నరవర కంటే. 1270

వ. మఱియును. 1271

సీ. పనసభూరుహములు ప్లక్షవృక్షంబులు కరవీరతరువులు కర్ణికార
కుజముల పటువటకుటజనీలాశోకతిందుకపాటలీచందనామ్ర
మందారవల్లీమాతంగపున్నాగపారిభద్రద్రుజంబీరజంబు
తిలకాగ్నిముఖ్యాదిఫలితపుష్పితపల్లవితమహాద్రుమము లద్భుతము గాఁగ

ఆ. నలరుచుండు నందు నమృతకల్పము లగు, ఫలము లవని రాల్చి సలలితముగఁ
గాంక్షఁ దీఱ మెసవి ఘనసత్త్వయుక్తులై, యధికసత్వరముగ నపలఁ జనుఁడు.

వ. ఇత్తెఱంగున నమ్మహారణ్యం బతిక్రమించి యవ్వల. 1273

క. నందనచైత్రరథంబుల, చందంబున రమ్య మగుచు సర్వస్వాంతా
నందకరంబై జనులకు, నందంబై యొక్కవిపిన మలరారు రహిన్. 1274

వ. అమ్మహావనం బుత్తరకురుదేశంబులచందంబున మనోహరంబై యలరు నందు
మేఘపర్వతసన్నిభంబులును ఫలభారవంతంబులును మహావిటపసంకులంబులును
సర్వర్తుసేవితంబులును సర్వకామఫలంబులు నగుపాదపంబులు తేనియలు
గురియు చుండు నన్నగంబు లెక్కి యమృతకల్పంబు లగుఫలంబులుకోసి తెచ్చి
లక్ష్మణుండు సమర్పించు నవి యుపయోగించి యవ్వనంబు దాఁటి యవ్వల
నదృష్టపూర్వంబు లగు దేశంబులును వనంబులును శైలంబులు నంత నంత
నవలోకించుచుఁ బోనం బోవఁ బంప యనుపేరు గలయొక్కపుష్కరిణి గానం
బడు నది మఱియును. 1275

క. కమలోత్పలసేవితయును, సమతీర్థయు నిర్మలయు నశైవలయు నవి
భ్రమయు నశర్కరయు నక,ర్దమయు సువాలుకయు నగుచుఁ దనరారు రహిన్.

క. క్రౌంచంబులు కురరంబులు, నంచలు కారండవంబు లంభోజదళ
ప్రాంచన్మధుపము లనిశం, బంచితముగ మ్రోయు చుండు నతిమధురముగన్.

వ. మఱియు నచ్చటిఖగంబులు జలచరంబులు నెన్నఁడు నొక్కింత భయం బెఱుం
గని వగుటవలన నరులం జూచి భయంబుఁ గొన వచ్చుట నున్న ఘృతపిండో
పమంబు లగు స్థూలవిహంగమంబుల నకృశరోహితవక్రతుండనడమీనప్ర
భృతి మహామత్స్యంబులను లక్ష్మణుండు వధించి తెచ్చి శూలప్రోతదగ్ధంబులును
నిష్కంటకంబులునుంగాఁ జేసి ప్రియపూర్వకంబుగా నీకు సమర్పించు భక్షణా
నంతరంబునఁ బద్మగంధబంధురంబును ననామయంబును నక్లిష్టంబును సుఖ

శీతంబును శుభంబును రూప్యస్ఫటికసన్నిభంబు నగుసలిలంబుఁ బుష్కర
పత్త్రపుటంబునం బట్టి తెచ్చి పానార్థం బొసంగు మఱియు జలావగాహనార్థంబు
గిరిగుహాశయంబులును రూపాన్వితంబులు నగువరాహంబు లచ్చటికిం జను
దెంచి వృషభంబులభంగి గర్జించుచు నిత్యంబును సంచరించుచుండు నచ్చటి
వృక్షంబులు మాల్యాలంకృతంబు లై యుండు నీవు సాయాహ్నసమయంబున
నమ్మహాపుష్కరిణీతీరంబున సంచరించుచుఁ దదీయశీతోదకంబును దత్తీరసం
భూతపుష్పితకాననంబును సంఫుల్లకమలోత్పలంబులును బూర్వోక్తవస్తుజా
తంబును సర్వంబును విలోకించి విగతశోకుండ వయ్యెద వదియునుం గాక. 1278

సీ. ధరణీశ మున్ను మతంగశిష్యులు మునిశ్రేష్ఠు లాఘనసరసీతటమున
వసియించి యుందురు వారు గుర్వర్థంబు వన్యంబుఁ దెచ్చుచు వన్యభార
పీడితు లగుటయుఁ బృథుపరిశ్రమమునఁ దత్కాయములనుండి జాఱుచుగాఁగ
ఘర్మజలంబులు గంధవాహప్రేరితంబు లై వెస వ్రాలెఁ దరువులందు
తే. నందుఁ బూచినకుసుమంబు లనవరతము, వాడవు నశింప వమ్మునీశ్వరుల భూరి
తరతపోమహిమంబునఁ దాల్ప రెవ్వ, రేమి చెప్పుదు నాచిత్ర మిఁకను లేశ.

క. చిరజీవిని శ్రమణియుఁ ద, త్పరిచారిణియును దపఃప్రభావాన్వితయుం
గురుమతియు శబరి యన నొక, పరమతపస్విని వసించు బాగుగ నచటన్.

తే. దేవసముఁడవు మానిసంభావితుఁడవు, మానధనుఁడవు భూతసంస్కృతుండ
వై ననినుఁబోలఁ జూచి కృతార్థయగుచు, శబరి స్వర్గలోకమునకుఁ జను మహాత్మ.

వ. మఱియు నాపుష్కరిణీపశ్చిమతీరంబున గుహ్యం బగు నొక్కమహనీయాశ్ర
మంబు గల దదియె శబర్యాశ్రమం బయ్యరణ్యదేశం బంతయు బహువిధగజో
పేతం బయ్యు నందేకదేశస్థితం బైనశబర్యాశ్రమంబు తదీయతపఃప్రభావం
బున గజరహితం బై యుండు నవ్వనంబు మతంగమునినిర్మితం బగుటం జేసి
మతంగవనం బన విశ్రుతిం గన్నయది నందనచైత్రరథసంకాశం బైనయమ్మహా
వనంబున నిర్వృతుండ వై విహరింపు మదియునుం గాక. 1282

సీ. పంపాసరోవరప్రాగ్దేశమున ఋశ్యమూకనామకమహాభూధరంబు
గల దది బాలనాగములచే రక్షిత మగుట దురారోహ మై తనర్చుఁ
గడువేడ్కతో సృష్టికాలంబునందు విరించి సొంపార నిర్మించె దాని
నెఱిఁ దచ్ఛిరంబుపై నిద్రించి నరుఁడు స్వప్నమున నేవిత్తంబు వడయు నట్టి
తే. దాని మేల్కొని వడయును దాన నదియు, దారనునవిశ్రుతి వహించె ధరణినాథ
పరఁగ నది విషమాచారపరులకిల న, సౌమ్యులకుఁ బాపరతుల కగమ్య మరయ.

వ. నరేంద్రా విషమాచారులు పాపకర్ములు నగువా రప్పర్వతం బెక్కి నిద్రించిన
రాక్షసులు వారిం బట్టుకొని ప్రహరింతురు బాలగజంబులనిస్వనంబు ని
రంతరంబుగా వినంబడుచుండు మఱియు మేఘవర్ణంబు లగుమహాద్విపంబులు

పరస్పరాభిహతంబు లగుటవలన రుధిరావసిక్తంబులై పృథక్కీర్ణంబులై సంచరించు నొక్కొక్కవేళ జలపానార్థంబు పంపాపుష్కరిణికిం జనుదెంచి శీతోదకంబుఁ గ్రోలి కొండొకసేపు జలంబులం గ్రీడించి యథేచ్ఛం జను మందు నచ్చటివిశేషంబు లన్నియు విలోకించి శోకంబుఁ బరిత్యజించెదవు. 1284

చ. జనవర యన్నగాగ్రమున సంభృతభూరిశిలాపిధానమై
ఘనతరదుష్ప్రవేశ మయి గహ్వర మొక్కటి యొప్పు దానితూ
ర్పున బహుసత్త్వమై రుచిరమూలఫలాన్వితమై సురమ్యమై
యనుపమశీతవారియుతమై హ్రద మొక్కటి పొల్చు నయ్యెడన్. 1285

తే. కపిచతుష్టయయుక్తుఁడై తపనపుత్త్రుఁ, డైన సుగ్రీవుఁ డాగుహ నధివసించి
యుండు నెపుడైన నొకవేళ నున్నతాద్రి,శిఖరతలమున విహరించు క్షితివరేణ్య.

రామలక్ష్మణులు శబరిం జూచుట.

వ. అని యిట్లు సర్వంబునుం దెలియఁ బలికి కబంధుండు కార్యసిద్ధి యయ్యెడు మని దీవించి దివ్యదేహప్రభాభాసితుం డై వారలచేత ననుజ్ఞఁ గొని యంతరిక్షంబున యథేచ్ఛం జనియె నంత రామలక్ష్మణులు మహారణ్యంబు సొచ్చి పశ్చిమదిశాభిముఖులై కబంధోపదిష్టమార్గంబుఁ బట్టి గిరికందరజాతంబు లగుక్షౌద్రకల్పఫలద్రుమంబు లందందు నిరీక్షించుచు సుగ్రీవదర్శనకాంక్షులై చని చని పంపాపుష్కరిణీపశ్చిమతీరంబుఁ బ్రవేశించి యందు బహుద్రుమశోభితం బైనశబరిరమ్యాశ్రమంబుఁ జూచి యత్తపస్వినికడకుం జనుటయు నది లేచి సంభ్రమంబున నెదుర్కొని రామలక్ష్మణులచరణంబుల కభివందనంబుఁ గావించి యర్ఘ్యపాద్యాదికంబు సమర్పించి కృతాంజలియై కొలిచి యున్న దాని నవలోకించి రాముం డిట్లనియె. 1287

తే. తపము సెల్లునె విఘ్నముల్ దలఁగ చనునె, మృగభయంబులు దప్పునె ప్రీతిగలదె
గురువులకుఁ బూజ సేయుదె పరమభక్తి, గలదె నిత్యసుఖస్థితి గలదె నియతి.

ఉ. నా విని యత్తపస్విని మనంబున సంతస మంది యిట్లనున్
దేవసమాన నిన్నుఁ దమి దీఱఁగఁ జూచుటఁ జేసి నాకు ను
శ్రీవిభవంబు గల్గె సుఖసిద్ధి చెలంగెఁ దపంబు పండె హా
ర్షావహ మయ్యె నాదుమనమున్నియు నేఁడు ఫలించె నీయెడన్. 1289

ఆ. దేవసముఁడవైన నీవు నాచేత సంపూజితుండ వగుచుఁ బొల్చి యుండ
సకలసిద్ధు లబ్బె జన్మంబు సాఫల్య, మొందె నెలవు దివికి నుద్ది యయ్యె. 1290

వ. భవదీయకరుణాకలితశీతలకటాక్షప్రసరణంబు గలవారికిఁ గొఱంత యేమి భవత్ప్రసాదంబున నింక నక్షయంబు లగుపుణ్యలోకంబులకుం జనియెద నీవు చిత్రకూటంబునకుం జనుదెంచినప్పుడు మద్గురువులు సూర్యసంకాశంబు లైన విమానంబు లెక్కి దివంబునకుం జనుచుఁ బుణ్యం బైనయీయాశ్రమంబు

నకు సౌమిత్రిసహితంబుగా రాముండు ప్రియాతిథి యై చనుదేరఁ గలం డమ్మ
హాత్ముని సందర్శించి యాతిథ్యం బొసంగి యనుజ్ఞఁ గొని యక్షయంబు లగు
పుణ్యలోకంబులకుం జనుదె మ్మందాఁక నిచ్చట నిలిచి ర మ్మని నాతో నొడివి
చని రేను నాఁటంగోలె పంపాతీరసంభూతంబు లగువివిధవన్యఫలంబులు నీ
కుపాయనంబు సమర్పించుట కుపార్జించి యున్నదాన నని పలికిన విని రాముం
డు నిత్యంబును విజ్ఞానంబునం దబహిష్కృత యైనశబరి నవలోకించి యి
ట్లనియె. 1291

శబరి రామునకు మతంగమహర్షి మాహాత్మ్యం బెఱింగించుట.

చ. దనుఁ డెఱిఁగింప నీగురుని ధర్మమహత్త్వము వింటిఁ గ్రమ్మఱం
గనుఁగొన నిశ్చయించితి ఘనంబుగఁ దెల్పు మటన్న నట్ల కా
కని కడువేడ్కతో శబరి యారఘునాథున కమ్మహావనం
బనుపమభంగిఁ జూపి వినయంబున నిట్లని పల్కె నెంతయున్. 1292
క. చూచితె సకలఫలతరు, ప్రాచుర్యం బై పయోధరప్రఖ్యం బై
వాచాలపక్షియుత మై, తోఁచెడు నివ్వనపదంబు దూషణవైరీ. 1293
వ. ఇది మతంగవనం బనం బ్రసిద్ధి వహించి యుండు. 1294
తే. ధూతకల్మషు లైనమద్గురువు లిచట, నిమ్మహీధరగుహాయందు నమ్మదమునఁ
బూని మంత్రసంపూజిత మైనయాగ, మర్థిఁ జేసిరి ఋత్విక్సమన్వితముగ. 1295
వ. మహాత్మా నాచేత సత్కృతు లైనమద్గురువు లుపవాసపరిశ్రమంబువలన నుద్వే
పితంబు లైనకరంబులచేత నెద్దానియందుఁ బుష్పోపహారంబులు గావించి రట్టి
యీవేది ప్రత్యక్షనలి యై యొప్పు చున్నది విలోకింపుము. 1296
తే. విమలచారిత్ర యీయాగవేదు లమ్మ, హాత్ములతపోజనిత మహిమాతిశయము
వలన నమలప్రభంబు లై యలరు చున్న, విప్పటికిఁ జూడు మిచ్చట నినకులేశ.

శబరి శ్రీరామానుజ్ఞం బొంది దివంబున కేగుట

వ. మఱియు నుపవాసపరిశ్రమాలసు లగుటం జేసి పోవుట కశక్తు లైనమద్గురువు
లచేతఁ జింతితంబు లై సమాగతంబు లైనసప్తసాగరంబులును జూడుము కృతాభి
షేకు లైనవారిచేతఁ బాదపంబులయందు విన్యస్తంబు లైనయార్ద్రవల్కలం
బులును దేవకార్యంబులు సేయువారిచేత విరచితంబు లైనకుసుమకిసలయమా
ల్యంబులును నేటికి శుష్కింపకున్నవి వీక్షింపు మివ్వనంబునం గలవిశేషంబు
లన్నియు నెఱింగించితి నింక నీచేత ననుజ్ఞాత నై యీకళేబరంబు విడిచి మద్గు
రువులకడకుం బోయెద ననిన విని రఘువల్లభుండు హర్షవిస్మయాంకులితచిత్తుం
డై సంశ్రితవ్రత యైనశబరిం జూచి నీచేత నర్చితుండ నైతి నింక యథాసుఖం
బుగా నరుగు మనిన నది చీరకృష్ణాజినావృతంబును జీర్ణంబు నైనశరీరంబు
విడువఁ గోరినదై దాని హుతాశనశిఖలదగ్ధంబుఁ గావించి దివ్యదేహంబు

దాల్చి జ్వలత్పావకసంకాశయు దివ్యాభరణభూషితయు దివ్యమాల్యానులేపన
యు దివ్యాంబరావృతయు నై మెఱుంగుచందంబున నద్దేశంబు వెలుంగం
జేయుచు రామునిచరణంబులు శిరంబు సోఁకం బ్రణమిల్లి యనుజ్ఞఁ గొని
సుకృతాత్ము లగుసమ్మహర్షు లెచ్చట విహరింతు రట్టిపుణ్యస్థానంబునకు సమాధి
యోగబలంబునం జనియె నిట్లు శబరి దివంబునకుం జనిన యనంతరంబ రా
ముండు కొండొకసేపు తత్ప్రభావంబు వక్కాణించుచు హితకారి యగు
లక్ష్మణున కిట్లనియె. 1298

సీ. వివిధవిహంగసేవితము విశ్వస్తమృగవ్యాఘ్ర మద్భుతకరము నైన
మునిపుంగవుతపోవనముఁ జూచితి మిందు సప్తాంబునిధుల నుజ్జన మొనర్చి
పితృతర్పణంబు సంప్రీతిఁ గావించితి మశుభంబు తలఁగెఁ గల్యాణ మొదవెఁ
జిత్తంబునకు వేడ్క క్రొత్తయై విలసిల్లె నింక నాసుగ్రీవు నినకుమారుఁ
ఆ. గానఁ బోద మతఁడు గాఁడె సతీపరి,మార్గణంబునందు మహి సమర్థుఁ
డనిన లక్ష్మణుండు జనపతితోఁ జాగు, సేయ నేటి కట్ల సేయు మనుడు. 1299

తే. అనఘచరితుఁడు రాముఁ డయ్యాశ్రమంబు
విడిచి పుష్పాఢ్య మగుమహావిపినపథము
వివిధతరువులు సరసులు వేడ్క నంత
నంతఁ జూచుచుఁ బంప డాయంగఁ జనియె. 1300

చ. కుసుమితవృక్షము ల్లతలు కోకిలకీరమయూరశారికా
దిసకలపత్త్రిసంఘము లతిప్రబలద్విపఖడ్గపోత్త్రిసిం
హసృమరభల్లుకాదిక సమస్తమృగంబులు గల్గి రమ్య మై
యసదృశకాంతిచే నలరు నవ్వనముం గలయంగఁ జూచుచున్. 1301

చ. సలలితశీతలోదకము చక్రమరాళబకాళిసంఘముల్
దళితమనోజ్ఞపద్మకుముదంబులు నూతనకైరవోత్పలం
బులు ఘనమత్స్యము ల్కమఠము ల్తటరూఢమహాద్రుమంబులుం
గలిగి గభీర మై పొలుచు కమ్రసరోవరపంక్తిఁ జూచుచున్. 1302

క. జనపతి మతంగసరసం, బనుప్రాద మటు సేరఁ బోయి యందు సుమిత్రా
తనయాన్వితముగ వెన మజ్జనముం గావించి యవలఁ జనియె రయమునన్

రామలక్ష్మణులు పంపాసరోవరంబుఁ జేరుట.

తే. అధిపుఁ డీచందమున నేగి యచటికలిక,లచటి పూగుత్తు లలరులు నచటితావు
లచటి క్రొవ్విరు లపుడు తన్నంగజాభి, తప్పుఁ జేయంగ జానకిఁ దలఁచికొనుచు.

వ. శోకసమావిష్టుం డై యరిగి. 1305

సీ. పూగనారంగపున్నాగశోభితయును గమలసంపీడితవిమలజలయు
మత్స్యకర్కటకూర్మమకరశోభితయును రమ్యోపవనరాజిరాజితయును

స్ఫటికాచ్ఛసలిలయు శ్లక్ష్ణవాలుకయును బ్రసవితలతికాభిరంజితయును
గరుడగంధర్వకింపురుషసేవితయును బల్లవితాశోకభాసితయును

తే. కమలతామ్రయుఁ గుముదశుక్లయు వినూత్న,నోత్పలవినీలయును దటజోరుకుంద
మాలతీస ప్తపర్ణతమాలయుతియు, నైనపంపను గాంచె నయ్యవనివిభుఁడు.

వ. మఱియు సఖులచేతంబోలె నేలాలతలచేతఁ బరివృత యగుదానిఁ గుథయుం
బోలె బహువర్ణ యగుదానిఁ బుష్పితామ్రసణోపేత యగుదాని బర్హిణోద్ఘుష్ట
నాదిత యగుదాని మాలతీకుందగుల్మావృత యగుదానిఁ బఁసుళోపేతశీతవారి
నిషేవిత యగుదానిఁ దిలకబీజపూరకకరవీరభాండీరనిచుళ కేతకీప్రముఖనిఖిల
తరువ్రాతోపేత యగుదాని శైవాలశిరోజయుఁ బద్మముఖయు నీలోత్పలనే
త్రయు శంఖకంధరయు మృణాళదోర్యుతయుఁ జక్రవాకస్తనియుఁ బరిభ్రమ
నాభియుఁ బుళిననితంబయు మకరజంఘికయుఁ గూర్మచరణయు నై విలాసవతి
చందంబున నందం బగుదానిఁ బంపాపుష్కరిణి డాయంజని తత్తీరంబున
నానాధాతుమండితంబును జిత్రపుష్పితకాననంబు నగుపూర్వోక్తఋశ్యమూ
కంబుఁ గనుంగొని రాముండు లక్ష్మణున కిట్లనియె. 1307

తే. అనఘ యీశైలమందు మహాత్ముఁ డైన, ఋక్షరజునినుతుండు సుగ్రీవుఁడుండు
శీఘ్రమున నవ్వాలిముఖ్యశ్రేష్ఠుఁ జేర, నేగు మని పల్కి క్రమ్మఱ నిట్టు లనియె.

క. దీనుఁడ రాజ్యభ్రష్టుఁడ, మానధనుఁడఁ దత్ప్రియాసక్తమాననుఁడఁ గరం
బే నెట్లు మనఁగఁ జాలుదు, జానకి నెడఁ బాసి నాథుజనవిపరీతాత్మా. 1309

వ. అని బహుప్రకారంబుల రాముండు సీతం దలంచుకొని కామార్తుం డై శోక
విషాదయంత్రితుం డై లక్ష్మణునితోడ సంభాషించుచుఁ గ్రమంబున నవ్వనం
బునం గలవిశేషంబులఁ గలయ విలోకించుచుఁ బంపాతీరంబుఁ బ్రవేశించి
యమ్మహాపుష్కరిణీసంజాతప్రభావిశేషనిరీక్షణంబునం గొంత శోకంబు మాఱిచి
యుండె నని యారణ్యకాండకథాప్రపంచం బంతయు సవిస్తరంబుగా వినిపిం
చిన విని యటమీఁదివృత్తాంతంబు వినిపింపుఁ డని యడుగుటయును. 1310

వృత్తకందగర్భితచంపకము. సురవరసూరిలోకనుత సుందరమూర్తి సమజ్జనావనా
వరవిభవా రణప్రియ నివారితవైరిసమస్తభద్రమం
దిర ధరధీర విష్టపపతీ నిరవద్య సురక్ష్యమాణ ని
ష్టరికుల జారచోరమణి చంద్రకులేంద్ర రమాసునోహరా. 1811

క. నిగమాంతవేద్య శుకవా, గ్నిగదితమహిమాతిరేక నిత్యానందా
జగదేకనాథ సర్వో, పగ భగవచ్ఛబ్దవాచ్య భద్రాత్మ హరీ. 1312

పంచచామరము. పయోజపత్త్రనేత్ర యోగిపాల భార్గవీమనః
ప్రియా దయాపయోనిధీ విరించివందితా జగ
త్త్రయావనా నయానయజ్ఞ తార్క్ష్యవాహనా శ్రితా
భయప్రదాయకా మహానుభావ లోకనాయకా 1313

గద్యము. ఇది శ్రీరామచంద్రచరణారవిందమకరందరసాస్వాదనతుందిలేందిందిరాయమాణమానసకులపవిత్ర కౌండిన్యసగోత్ర పద్మనాభసూరిపుత్త్ర విద్యాసాంద్ర వేంకటకవీంద్రప్రణీతం బైన శ్రీమద్రామాయణం బనునాదికావ్యంబునం దన సూయాత్రిసందర్శనంబును సంగరాగార్పణంబును దండకారణ్యప్రవేశంబును విరాధవధంబును శరభంగదర్శనంబును సుతీక్ష్ణసమాగంబును సీతానీతిప్రబోధంబును సుదర్శనదర్శనంబును నగస్త్యదర్శనంబును జటాయుస్సమాగమంబును బంచవటీప్రవేశంబును హిమవత్కాలవర్ణనంబును శూర్పణఖాసమాగమంబును వైరూప్యకరణంబును ఖరాదివధంబును జానకీహరణోద్యోగంబును మారీచవధంబును వైదేహీహరణంబును రామునివిలాపంబును జటాయువునకు సలిలదానంబును గ్రౌంచారణ్యప్రవేశంబును గబంధవధంబును బంపావనప్రవేశంబును మతంగశిష్యమహిమానువర్ణనంబు ననుకథలుం గలయారణ్యకాండము సంపూర్ణము.

శా. ఈకావ్యప్రతిపాదితుం డయినసీతేశుండు రామప్రభుం
డీకల్యాణకృతీశ్వరుం డయిన శ్రీకృష్ణుండు సంప్రీతితో
సాకల్యంబుగ నిష్టసిద్ధికరులై చంచత్కృపాపూర్ణతన్
లోకస్తుత్యకుమారయాచధరణీంద్రుం బ్రోతు రెల్లప్పుడున్.